శ్రీ ర స్తు.



# తెలుఁగు బ్రహ్మపురాణము

కడప మునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు
కావ్యస్మృతితీర్థ
జనమంచి శేషాద్రిశర్మకృతము.



చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల ముద్రణాలయమున ముద్రితము.
1930.



V. Ramaswamy Sastrulu & Sons, Madras.

శ్రీః

శ్రీ పరస్మై జ్యోతిషే నమః.

# వి జ్ఞ ప్తి.

ఉ. ఏది యిదే యటంచు వచియింపఁగ శక్యముగాక వేదశా
 స్త్రాదృతి నెట్టిభావన సమంచితరీతిని జేయఁ గాంచునో
 శ్రీదము జ్ఞానదంబు నయి చిత్రగతిం దనయంత దాన యై
 యేది యొసంగునో యలమహేశ్వరతత్త్వము నాశ్రయించెదన్.

భక్తాగ్రేసరులారా! భాషాపరిపోషకులారా!

పరమపురుషుని దగునిచ్ఛాశక్తి కల్పన లనల్పములు. ఆజగదంబసృష్టి నిట్టిదని విస్పష్టముగ వచియింప హరిహరసరసిజాసనులకే నశక్యమనఁ దదితరులకు శక్యమనుట పరిహాసాస్పదముకద. శక్త్యతీతము పరంజ్యోతి యనఁబడుచుఁ బ్రణవరూపుఁ డన నుతిఁగాంచు నిరంజనుం డొక్కఁడే యగును.

శ్లో. బిందుశ్శివాత్మక స్తత్ర బీజం శక్త్యాత్మకం స్మృతం,
 తయోర్యోగే భవేన్నాద స్తేభ్యో జాతా స్త్రిశక్తయః.

అనిక్రియాసారము.

ఇచ్ఛా క్రియా తథా జ్ఞానం గౌరీ బ్రాహ్మీ తు వైష్ణవీ,
త్రిధా శక్తిస్త్రిధా యత్ర తత్పరం జ్యోతి రోమితి.

(గోరక్షసంహిత.)

ఏషా త్రిశక్తిరుద్దిష్టా నయసిద్ధాంతగామినీ,
ఏషా శ్వేతా పరా సృష్టిః సాత్వికీబ్రహ్మసంస్థితా.
ఏషైవ రక్తా రజసి వైష్ణవీ పరికీర్తితా,
ఏషైవ కృష్ణా తమసి రౌద్రీ దేవీ ప్రకీర్తితా.
పరమాత్మా యథా దేవో ఏకఏవ త్రిధా స్థితః,
ప్రయోజనవశాచ్ఛక్తిరేకైవ త్రివిధాభవత్.

(వారాహమునందు శక్తిమాహాత్మ్యాధ్యాయము.)

గచ్ఛ దేవి వ్రజం భద్రే గోపగోభిరలంకృతమ్,
రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నందగోకులే,
అన్యాశ్చ కంససంవిగ్నా వివరేషు వసంతి హి. 2

దేవక్యా జఠరే గర్భే శేషాఖ్యం ధామ మామకం,
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ. ౮
అథాహమంశభాగేన దేవక్యాః పుత్రతాం శుభే,
ప్రాప్స్యామి త్వం యశోదాయాం నందపత్న్యాం భవిష్యసి. ౯
అర్చిష్యంతి మనుష్యాస్త్వాం సర్వకామవరేశ్వరీం,
ధూపోపహారబలిభిః సర్వకామవరప్రదాం. ౧౦
నామధేయాని కుర్వంతి స్థానాని చ నరా భువి,
దుర్గేతి భద్రకాళీతి విజయా వైష్ణవీతి చ. ౧౧
కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతి చ,
మాయా నారాయణీశానీ శారదేత్యంబికేతి చ. ౧౨

(శ్రీభాగవతము ౧౦ స్కం. ౨ అధ్యా.)

మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦
సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮

(భగవద్గీతా. ౯ అధ్యా.)

అని యిట్టు లనేకప్రమాణములు ప్రకృతిమహిమమును దెలుపుచుఁ బ్రకృతియే త్రిగుణాత్మికయై బ్రహ్మ విష్ణు శివరూపముల వెలయుచు సృష్ట్యాది కార్యముల నిరంతరము చేయుచుండుననియు నాప్రకృతి కతీతుఁ డొక్కపరమాత్మయే యనియుఁ దెలుపుచున్నవి. సర్వము ప్రకృతికృత్యమే యని నొక్కి వక్కాణించుచున్నవి. పరాత్పరుఁడు సాక్షిమాత్రుఁడై యుండుననియే సిద్ధాంతీకరించుచున్నవి.

ప్రకృతివిలాసములు సకలబ్రహ్మాండములనుట నిర్వివాదాంశము. అం దనేకభూతవ్రాతములు వెలయుచుండును. వానిప్రవృత్తియంతయుఁ దత్కర్మముపై నాధారపడియుండును. భగవతిగాని భగవంతుఁడుగాని భూతవ్రాతములకుం గలసుఖదుఃఖములకుఁ గారణభూతులు గారు. కావుననే కర్మ మనాది యనునది సిద్ధాంతీకరింపఁబడినది. స్వస్వకర్మానురూప సుఖదుఃఖమయఫలముల ననవరత మనుభవించుచు నవి స్వకర్మాయత్తములే యనికాని వాని ననుభవింపక తొలఁగ శక్యముకాదనికాని భూతవితతి యూహింపఁ బ్రయత్నింపదు సుఖరూపమైన స్వప్రయత్నలబ్ధమనియు దుఃఖరూపమైన దైవోపలబ్ధమనియు భావించును. దీనికే

యజ్ఞాన మని వేరు. ఈ యజ్ఞానము సర్వజంతుసాధారణమని కొందఱందురు. అట్లు గాదు మానవులకే యని కొంద ఱందురు. ఎట్లో యగుఁగాక. మానవసాధారణ మనుట సర్వసమ్మతముకద. అంతియ చాలు. పదివేలువచ్చిన ట్లానందింతము.

భూతవ్రాతమునందు మానవులు వివేకసంపన్ను లనుట సర్వసమ్మతము. వీరి నుద్ధరించుటకే యెన్నియో వేదములు శాస్త్రములు పురాణము లితిహాసము లింక నెన్నియో పేరులుగల విధు లుప్పతిల్లినవి. తక్కుంగలభూతవితతి వీరిసంగతి మేలు కాంచవలయునని విధిజాలము వేనోళ్లం దెలిపెడిని. ఆమానవులు పెక్కువిధ ములంగనఁబడుదురు. ఏల? కర్మము లసంఖ్యాకములు. సత్త్వరజస్తమఃప్రధానము లని తొలుతఁ గర్మములు త్రివిధములని తెలిపిరిగాని వానికిం బరస్పరసంగతిం బట్టి యూహించి ప్రస్తరింపఁగా లెక్కకు మిక్కిలి యయ్యె ననియుఁ దెలిపిరి. కావు ననే కాఁబోలు శ్రీకృష్ణపరమాత్మ "గహనాకర్మణోగతిః" అని గీతోపనిషత్తునం దెలిపెను. ఔరా! ఒక్కకర్మగతియే గహనమనుచో నిఁక భగవంతునిగతి యెట్టిదో యెఱుంగ నేరికిఁ దరంబగును? మే మెఱింగితి మనువారు జ్ఞానులా. యజ్ఞానులా. యనివిచారింప వలసియుండును. మన మేమో యందుఃబ్రథములము కామని యిప్ప టికి నొప్పుకొందము. పిదపఁజూతము. తమ రనుభవించు ఫలముల ననుసరించి ప్రాగ్జన్మమునఁ జేసినకర్మము సుకృతమో దుష్కృతమో యని యనుమానించు వారు కొందఱు కలరు. వారు సామాన్యమానవులలో నుత్తము లనఁదగుదురు. ఈకర్మము చేసితిమి. ముందీఫలముల ననుభవింపవలసియుండును. అనుభవింపక తప్పించుకొనుమార్గము లివి. అనియే మానవులకుం దెలిసియుండినచో వారిని బట్టుకొని కట్టఁ బగ్గములుండునా. భగవంతునకుంగూడఁ గష్టమగు నేమో యని యూహింపవచ్చును.

అట్టు లప్రతిహతగతిం బ్రవర్తించు కర్మములు మానవుల బంధించియుం చును. వానికి లోఁబడనివా రీరేడుజగముల నేఁడును లేఁ డనికూడఁ బలుక ననువుపడును. అట్టికర్మముల పోకడ లివి యని తెలుపునవి శ్రుతులు స్మృతులు పురాణము లితిహాసములు లోనగునవి. అందు శ్రుతిస్మృతులు విధించునవి. వానిని మించినప్రమాణవాక్సంచయ మీప్రపంచమున లేదని యార్యుల మతము. అందు శ్రుతులు సనాతనములని ప్రాచీనుల విశ్వాసము. తదర్థమును బ్రతిపాదించుచు నతీంద్రియజ్ఞులగు మునులు దేశకాలపాత్రముల నెఱింగి తదుద్ధరణక్రియాదక్షము లగు ధర్మములఁ గొన్నింటిం జేర్చి స్మృతులను వ్రాసిరి. ఆచేర్చినధర్మములు కూడ శ్రుత్యర్థము నాధారముగఁ జేసికొనినవే. శ్రుతులయం దెందో గూఢముగ నున్న దానిని విశదీకరించిరని మన మెఱుంగుట తెఱంగు. ఆయర్థము మనకేల కనఁబడ దని ప్రశ్నింపరాదు. అతీంద్రియజ్ఞత లేమి యనునదియే యాప్రశ్నమునకు సదుత్త

రము. స్మృతులు యుగానుసారను ధర్మముల మార్చుటయు శ్రుతులు యథా పూర్వముగనే యుండుటయు నను నీకారణములే శ్రుతులు సనాతనము లని దృఢ పఱచున వని యెంచుట సమంచితమార్గము.

శ్రుతుల నాధారముచేసికొని మూఁడుమతములు నిర్మింపఁబడినవి. ఆమూఁడును శ్రుత్యర్థములనే తాఱుమాఱుచేసి తెల్పినవి. అందేదిగాని శ్రుతివిరుద్ధ మన ననువుపడదు. దీనినిబట్టి యాలోచించినచో శ్రుతుల గొప్పఁదనము వెల్లడియగును అవి మహాసాగరములు. అం దేశీకరమునుగైకొనిన నొక్కొకమతము వెడలును. వాని పారమునుగన్నవా రెన్నలేరు. కావున మహానుభావులగు వ్యాసమునీంద్రులు వానిని విభజించి మానవులకుఁ బఠింప ననుకూలములుగా నొనరించిరి. మనుష్యాయుర్దాయ మల్పముగావున నన్ని వేదములఁ బఠింప నవకాశము చాలదని యిట్లు చేసిరఁట. వారికృప యింతయని నిర్ణయింప వర్ణింపఁ దరంబగునే. ఆమహాకార్యము నిర్వహించుటంజేసి వేదవ్యాసులను నామధేయ మాయపర నారాయణమూర్తులకుం గలిగెను. వారియనుగ్రహపాత్రులై మానవులలో వానిం బఠింపఁ దగువారు పఠించి కృతార్థులైరి. ఇపుడు నత్యల్పసంఖ్యాకులు వేదపాఠమున బద్ధాదరులగువారును గలరు. కాని వారిసంఖ్య నానాఁటికిఁ దీసిపోవుచున్న వార్త తెలుపవలసి వచ్చినది.

వేదములయర్థమునే స్మృతులును, పురాణములు నితిహాసములును దెలుపునని కొందఱి మతము. స్మృతులమాట మున్నే తెలిపితిని. ఇఁకఁ బురాణముల విషయము తెలుపుదును. పురాతనగాథలను ధర్మములు లోనగువానిం దెలుపుటంబట్టి పురాణమనుపేరు గలిగెనని కొంద ఱుద్ఘోషింతురు. *పూర్వమునుండి యున్నదిగానఁ బురాణమను నామము వచ్చెనని మఱికొందఱు వక్కాణింతురు.

వ్యాసాదిముని ప్రణీత వేదార్థవర్ణిత పంచల
క్షణాన్వితశాస్త్రం తత్పర్యాయః.

వ్యాసాదిమునులు వచించిన వేదార్థముచే వర్ణింపఁబడినదియుఁ బంచలక్షణములు గలదియు నగుశాస్త్రము పురాణమనియు మఱికొందఱు వాదింతురు.

వేదవేదాంగశాస్త్రాణాం సారభూతం మునీశ్వరాః,
జగద్ధితార్థం తత్సర్వం పురాణే ష్వుక్తవా న్మునిః. ౨౧

అని నారదపురాణమున నాదిభాగముననే చెప్పఁబడినది.

యత్పృష్టంసుమహత్పుణ్యం పురాణం వేదవిశ్రుతం. ౧
తదహం సంప్రవక్ష్యామి సర్వశ్రుత్యర్థసమ్మతం,
రహస్యం సర్వశాస్త్రాణా మాగమానా మనుత్తమం. ౨

(దేవీభాగవతము. ౨ అధ్యా)

---

* శబ్దకల్పద్రుమమున నిది చెప్పఁబడినదని యెఱుంగనగు.

పురాణం వైష్ణవంచైత త్సర్వ కిల్బిషనాశనమ్,
విశిష్టం సర్వశాస్త్రేభ్యః పురుషార్థోపపాదకమ్. 3

(విష్ణు. షష్ఠాంశము ౮ అధ్యా.)

ఇట్లు పురాణముల మహత్త్వము తెలుపఁబడినది. వీనింబట్టి చక్కఁగాఁ బరికింపఁగా వేదార్థమును ప్రధానముగాఁ జేసికొని పురాణములు ధర్మాదులఁ దెలుపునవియని తేలినది.

అంగానివేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతా శ్చతుర్దశ.

(విష్ణు 3 అం. ౬ అధ్యా.)

పురాణానాం వేదోపబృంహకత్వేన ధర్మస్య వేదసహితత్వా ద్ధర్మవిద్యాస్థానే ష్వంతర్భావం దర్శయతి అని శ్రీధరస్వామివ్యాఖ్య దీనిచేతను నైయర్థమే స్పష్టముగాఁ దెలుపఁబడినది.

పురాణములు సుహృత్సమ్మితములుగాఁ బరిగణింపఁబడినవి. హిత ముపదేశించునవి అని దానిభావము. వేదములు ప్రభుసమ్మితములు. ఆజ్ఞాపించునవని సారము. స్మృతులు నట్టివే. కావ్యములు కాంతాసమ్మితములు. ప్రియోక్తులచే హితము గఱపునవని భావము. ఇతిహాసములు పురాణములవంటివే. అనఁగా సుహృత్సమ్మితములని తాత్పర్యము. పురాణములు బహుగ్రంథసమ్మతముంబట్టి యాలోచింపఁగాఁ బంచలక్షణములు గలవనియేర్పడును. దశలక్షణోపేతములు మహాపురాణము లనఁబడునని కొందఱ మతము. ఆచర్చ నాకిప్పు డనవసరము.

పురాణములు సాత్త్వికరాజసతామసభేదములచే మూఁడు విధములని శబ్దకల్పద్రుమమునఁ బాద్మోక్తిగా నుదాహరింపఁబడినది.

సాత్త్వికపురాణములు.

"వైష్ణవం నారదీయంచ తథా భాగవతం శుభమ్,
గారుడంచ తథాపాద్మం వారాహం శుభదర్శనే,
సాత్త్వికాని పురాణాని విజ్ఞేయాని శుభానివై."

రాజసపురాణములు.

బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం మార్కండేయం తథైవచ,
భవిష్యం వామనం బ్రాహ్మం రాజసాని నిబోధమే.

తామసపురాణములు.

మాత్స్యం కౌర్మం తథాలైంగం శైవం స్కాందం తథైవచ,
ఆగ్నేయంచ షడేతాని తామసాని నిబోధత.

వీనిఫలములు.

సాత్త్వికా మోక్షదా జ్ఞేయా రాజసా స్స్వర్గదా శ్శుభాః,
తథైవ తామసా దేవి నిరయప్రాప్తి హేతవః.

అని. ఈవరుసలో వాయుపురాణము కానరాదు. దానికి బదులుగా శివపురాణము చేర్పఁబడినది.

ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రహ్మ ముచ్యతే. ౧౯
అష్టాదశపురాణాని పురాణజ్ఞాః ప్రచక్షతే,
బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతం తథా. ౨౦
తథాన్యం నారదీయంచ మార్కండేయంచ సప్తమం,
ఆగ్నేయ మష్టమంచైవ భవిష్యం నవమం స్మృతం. ౨౧
దశమం బ్రహ్మవైవర్తం లైంగ మేకాదశం స్మృతం,
వారాహం ద్వాదశంచైవస్కాందం చాత్రత్రయోదశమ్. ౨౨
చతుర్దశం వామనంచ కౌర్మం పంచదశం తథా,
మాత్స్యంచ గారుడం చైవ బ్రహ్మాండంచ తతఃపరమ్. ౨౩
మహాపురాణా న్యేతాని హ్యష్టాదశ మహామునే,

అని విష్ణుపురాణమున మూఁడవయంశమున నాఱవయధ్యాయమునఁ గలదు. వాయుపురాణమందును గానరాదు. ఉపపురాణమున నుండవచ్చును. విష్ణుపురాణముంగూర్చి వ్యాఖ్యానమునం దిట్లు వివరింపఁబడినది.

"శైవమాత్స్యయోస్తు వైష్ణవం చాష్టసాహస్రమితి. క్వచిద్దేశే నవసహస్రం దృశ్యతే, క్వచి చ్చతుర్వింశతిసహస్రం క్వచిద్ద్వావింశతిసహస్రం, ఇదంతు షట్సహస్ర మస్మాభి ర్వ్యాఖ్యాయమానమ్"

ఇట్లగుటకుం గారణ మేమని యూహించుటవసరమే కాని యిపుడు నాకనవసరము.

శ్రీమద్భాగవతమునందు ద్వాదశస్కంధమునందుఁ ద్రయోదశాధ్యాయమున నిట్లున్నది.

బ్రాహ్మం దశసహస్రాణి పాద్మం పంచోనషష్టిచ,
శ్రీవైష్ణవం త్రయోవింశ చ్చతుర్వింశతి శైవకమ్. ౪

దశాష్టౌ శ్రీభాగవతం నారదంపంచవింశతిః,
మార్కండం నవ వాహ్నంతు దశపంచ చతుశ్శతమ్. ౫

చతుర్దశ భవిష్యంస్యా త్తథా పంచశతానిచ,
దశాష్టౌ బ్రహ్మవైవర్తం లింగమేకదశైవ తు. ౬

చతుర్వింశతి వారాహ మేకాశీతిసహస్రకం,
స్కాందం శతంతథాచైకం వామనం దశకీర్తితం ౭

కౌర్మం సప్తదశాఖ్యాతం మాత్స్యం తత్తుచతుర్దశ,
ఏకోనవింశత్సౌపర్ణం బ్రహ్మాండం ద్వాదశైవ తు. ౮

ఏవం పురాణసందోహ శ్చతుర్లక్ష ఉదాహృతః,
తత్రాష్టాదశసాహస్రం శ్రీభాగవత మిష్యతే. ౯

ఇందును వాయుపురాణ మష్టాదశపురాణములయందుఁ బరిగణింపఁబడలేదు. విష్ణుపురాణము సంఖ్య యిరువదిమూఁడువేల గ్రంథముగ నిందుఁ జేర్కొనఁబడినది. విష్ణుపురాణ మాఱువేల గ్రంథముగనే యున్నది. ముప్పదిరెండక్షరములకు గ్రంథమని ప్రాచీనమతము, శ్రీభాగవతమునకును విష్ణుపురాణమునకు నీవిషయమున వివాదము పొసఁగినది సమాధాన మిది యని నే నభిప్రాయము నిచ్చుచున్నాఁడను. ఇదియెల్లర యంగీకారమును బడయవచ్చును. సర్వాంగీకారమును బడయక పోవచ్చును.

పూర్వకాలమున నిప్పటి సౌకర్యములు లేవు. తాటియాకులపై వ్రాయవలయునుగదా. వలసినవిషయముల వ్రాసి తక్కినవానిని గాలాంతరమున వ్రాయనెంచి యుండవచ్చును. దానినిజూచి యెందఱో వ్రాసికొని యుండవచ్చును. ఆపరంపరలో నాఱువేలగ్రంథసంఖ్యయే యుండవచ్చును. ఇట్లే వ్రాసికొనువారిలోపములఁబట్టి గ్రంథసంఖ్య తాఱుమాఱయి యుండవచ్చును. అంతియకాని నడుమనెవ్వరో కల్పించి యిందుఁజేర్చిరని కల్పించి కొంత ప్రమాణమని కొంతకాదని నిర్ణయించుట పొరపాటేమో అని నాయూహ. ప్రతిపురాణము భగవత్తత్త్వమునే తెల్పును. కాన దేనిని ద్రోసివేయరాదు.

సాత్త్వికాదిభేదములంబట్టి కొందఱు కొన్నిపురాణములు ప్రమాణములుకా వందురు. ఆకల్పనముకూడ భాగవతాదిబహుపురాణములయందుఁ గానరాదు దానిని బ్రధానముచేసికొని కొందఱు దేవానాంప్రియులు పురాణములను దత్ప్రతిపాదితదేవతలను దిరస్కరింతురు. తామసపురాణములనుండి భాష్యకర్తలు వలసినతావులఁ బ్రమాణముల నుదాహరించుకొనిరి. ఏలాకో తెలియ రాకున్నది. పురాణములను దదుక్తదేవతలను మాత్రము దూషింపవచ్చునుగాఁబోలు,

ప్రమాణశ్లోకముల నుదాహరించుకొని తమ మతమును దృఢపఱచుకొన వచ్చును గాఁబోలు. ఇది యసమర్థతను బోధించునే కాని సమర్థతను దెలుపఁజాలదు. సాత్త్వికాదిభేదములకుఁ గారణ మేమనఁగా, సాత్త్వికప్రకృతులు తరించుధర్మములాపురాణములయందుఁ బ్రధానములుగాఁ జెప్పఁబడియుండును. రాజసప్రకృతులు తరించుధర్మములు రాజసపురాణములయందు ముఖ్యముగాఁ జెప్పఁబడియుండును. తామసప్రకృతులు తరించుధర్మము లాపురాణములందు నొక్కి వక్కాణింపఁబడియుండును. అన్నియు నెల్లరను భగవంతునికడకుఁ జేర్ప నుద్దేశించినవియే కర్మములననుసరించి ధర్మములు భక్తిమార్గములు వేఱువేఱుగానుండును. అన్నింటికి గమ్యస్థాన మొక్కఁడేయని యెఱుంగవలయును. ఈనియమము మదినుండునేని సర్వపురాణములు చక్కఁగా నొక్కరీతినే యన్వయించును. భేదమే యగపడదు. సర్వదేవతామయుఁ డొక్కఁడే భగవంతుఁడైనపుడు భేదమున కవకాశ మేది? దుష్కర్మమే యవకాశమును గల్గించు ననక మఱొకమాటపలుక నవకాశము లేదు. ఈ విషయము నింకను జర్చించుటమాని ప్రకృతవిషయమును గుఱించి వ్రాసెదను.

## —బ్రహ్మపురాణము.—

బ్రహ్మపురాణము పదునెనిమిది పురాణములలోఁ బ్రథమమనుట నిర్వివాద విషయము. పదివేలగ్రంథము కలది. సర్వపురాణవర్యమని పేరుగాంచినది. రాజస పురాణములందు దీనిపేరు గలదు. దీనిమహత్త్వము కథాసారము బృహన్నారద పురాణమున నిట్లు వర్ణింపఁబడినది.

బ్రాహ్మం పురాణం తత్రాదౌ సర్వలోకహితాయవై,
వ్యాసేన వేదవిదుషా సమాఖ్యాతం మహాత్మనా. 3౦

తదైవ సర్వపురాణాగ్ర్యం ధర్మకామార్థమోక్షదం,
నానాఖ్యానేతి హాసాఢ్యం దశసాహస్ర ముచ్యతే. 3౧

వేదానాంచ సురాణాంచ యత్రోత్పత్తిః ప్రకీర్తితా,
ప్రజాపతీనాంచ తథా దక్షాదీనాం మునీశ్వర. 3౨

తతోలోకేశ్వర స్యాత్ర సూర్యస్య పరమాత్మనః,
వంశానుకీర్తనం పుణ్యం మహాపాతకనాశనమ్. 33

యత్రావతారః కధితః పరమానందరూపిణః,
శ్రీమతో రామచంద్రస్య చతుర్వ్యూహావతారిణః 3౪

తతశ్చ సోమవంశస్య కీర్తనం యత్ర వర్ణితం,
కృష్ణస్య జగదీశస్య చరితం కల్మషాపహం. 3౫

ద్వీపానాంచైవ సర్వేషాం వర్షాణాం చాప్యశేషతః,
వర్ణనం యత్ర పాతాళస్వర్గాణాంచ ప్రదృశ్యతే. ౩౬
అత్రోత్తరే విభాగేతు పురుషోత్తమవర్ణనమ్,
విస్తరేణ సమాఖ్యాతం తీర్థయాత్రావిధానతః. ౩౭
అత్రైవ కృష్ణచరితం విస్తరాత్సముదీరితం,

... ... ... ...

యోగానాంచ సమాఖ్యానం సాంఖ్యానాంచాపి వర్ణనమ్,
బ్రహ్మవాదసముద్దేశః పురాణస్య ప్రశంసనమ్. ౪౨
ఏతద్బ్రహ్మపురాణంతు భాగద్వయ సమన్వితం,
వర్ణితం సర్వపాపఘ్నం సర్వసౌఖ్యప్రదాయకం. ౪౩
సూతశౌనకసంవాదం భుక్తిముక్తిప్రదాయకం,
ఇతరపురాణములయందును బెక్కుతావుల దీని మహత్త్వముకలదు.

## ప్రధానకథలు.

ఇందు సూర్యమహత్త్వము కలదు. సూర్యారాధనపద్ధతియుఁ గాలభేదమున నారాధనభేదము లోనగుపద్ధతులు కలవు. శంకరుమహిమము చక్కఁగా నిందువర్ణింపఁ బడినది. గౌరీకల్యాణము విచిత్రముగ నిందువర్ణితము. దక్షయజ్ఞ ధ్వంసనము శివుని సహస్రనామములచే దక్షుఁడు వర్ణించుటయు నిందుఁ జదువఁ దగినవి. పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యము (జగన్నాథక్షేత్రమహిమము) ఇంద్రద్యుమ్నుని చరిత్రము క్షేత్రయాత్రాపద్ధతియు నిందు విశేషముగాఁ జెప్పఁబడినది. శ్రీకృష్ణచరిత్రము సంపూర్ణముగ నిందుఁ గలదు. ఈవిషయమున భాగవతమునకు నీపురాణమునకుఁ బెక్కుతావుల భేదమే కనుపట్టును.

దశావతారములుసంగ్రహముగ నొకయధ్యాయమునఁజెప్పఁబడినవి. పాపాత్ములకు యమలోకమునఁ గలుగు దుష్ఫలములు విశేషించి యిందుఁ జెప్పఁబడినవి. దానములు విశేషదానములు శ్రాద్ధవిషయము వర్ణాశ్రమధర్మములు, దురాచారఫలములు, సదాచారఫలములు, వాసుదేవమాహాత్మ్యము, ఏకాదశీవ్రతమహత్త్వము, మహాప్రళయాదివిషయములు నిందు వివరింపఁబడినవి యోగసాంఖ్యవిషయము లిందు విస్తరించి తెలుపఁబడినవి. క్షరాక్షరనిరూపణము విద్యావిద్యాస్వరూపము నిందు వివృతములు.

ఈపురాణమునఁ గల కథలలో ముఖ్యములు పురుషోత్తక్షేత్ర మహత్త్వము శ్రీకృష్ణచరిత్రము ననవచ్చును. సగము గ్రంథము నీరెండు విషయములతో నిండియుండును. యోగశాస్త్రము సంపూర్ణముగసారభూతముగ నిందుఁగలదనవచ్చును. సాంఖ్యశాస్త్రము కూడ నట్లే యనవలయును. కావున నీమహాపురాణము పాఠకులకు భక్తిజ్ఞానదానదక్ష మనుట విశేషస్తుతి కాదని నేనూహించుచున్నాఁడను.

మానవమాత్రుఁడు దీనింబఠించినయెడల యోగము నభ్యసింపఁ గుతూహలము గలవాఁడగును. భగవద్భక్తి గుదురనిచో జన్మము వ్యర్థమే యగు ననుభావము కలవాఁడగును. సామాన్యముగా మానవప్రవృత్తికి నితరగ్రంథముల నవేక్షింపక యుండ నిది పాఠకులకు సాయపడఁగలదని నాదృఢవిశ్వాసము. భగవంతు నారాధించుమార్గము లనేకములు గలవనియు, నవియన్నియు నొక్కస్థానమునకే భక్తుఁగొనిపోవుననియు నీపురాణరత్నము స్పష్టము చేయఁ జాలు ననుట యతిశయో[క్తి] కాదు. ఇఁక నీవిషయమును వదలి భాషాంతరీకరణపద్ధతింగూర్చి యించుక వ్రాసెదను.

## పరివర్తనము.

ఈపురాణమును బరివర్తనము చేయునపుడు ప్రాచీనుల యాశయమునే యనుసరించితిని రామాయణపరివర్తనమున నెట్టిపద్ధతి నవలంబించితినో యట్లు కాదని విన్నవించు వాఁడను. శ్లోకాభిప్రాయమును గ్రహించి దానిని విస్తరించి తెలుపఁదగు తావుల విస్తరించితి. సంగ్రహింప వలసినతావుల సంగ్రహముగనే వ్రాసితిని. ఇదియే ప్రాచీనాంధ్రసత్కవులమతము. పురాణముల నిట్లువ్రాయుటమంచి దన్నయూహ నాకుఁ గలదు. ఇట్టివిషయములందుఁ గవి కధికారమును బూర్వులే ప్రసాదించిరి కావుననే,

ఉ. "నన్నయ తిక్కనాది కవినాథులు చూపిన సాధుమార్గమే
యెన్నఁగ నాశ్రయింపఁదగి యెల్లవిధంబుల నొప్పియుండు నా
కన్నిఁట శ్రేయ మీయఁదగు నంచు మనంబున నిశ్చయించి వి
ద్వన్నుతమౌ తదుక్తపద వారమటంచుఁ దలంచి పూనికన్.

ఉ. వారల సత్ప్రయోగముల వైఖరి నాదట సంగ్రహించి యే
వారికినేని మెచ్చఁదగు బ్రహ్మపురాణము తెన్గుచేయఁగాఁ
గోరితి వేంకటాద్రిపతిఁ గొల్చెలపంటఁ గృతీశుఁ జేసి త
త్సారసయుగ్మసేవయె యజస్రము నా కిడు మంచుఁ గోరుచున్."

అని వ్రాసితిని.

భాషాంతరీకరణమునందు మూలార్థము చెడుపఁబడరాదు. జనసామాన్యమునకుఁ దెలుపఁదగిన నీతిగలతావుల సంగ్రహించి కవివ్రాయరాదు. వర్ణనాంశములఁ గవి స్వేచ్ఛమైఁ బ్రవర్తింపఁ జను, కాని శాఖాచంక్రమణన్యాయము ననుసరించి మాత్రము ప్రవర్తింపరాదు. ఏవగలిగించు వర్ణనముల వ్రాయఁజనదు. మూలాభిప్రాయమును వెల్లడించువిషయమునందును బదములకూర్పు శ్రుతిహితముగ నుండఁజను. ప్రాసముల కొఱకుఁ బాండిత్యమును గనఁబఱచి యెందో గలవానిని జేర్పఁబూనరాదు. నిఘంటువులఁ జెంత నునుచుకొని క్రొత్తపదముల నెమకి నెమకి వానింజేర్చి పాఠకుల శ్రమంపఁజేయరాదు. దానఁ గృతికర్తకుఁ గీర్తి

రాఁబోదు. సంస్కృతమున నించుక యేవగల్గించు పదము లుండిన నవి తెనుఁగున వ్రాయునపుడు కడు జాగరూకతతోఁ గవి మెలఁగి శ్రుతిహితముగ నుండుపలుకులఁ జేర్పవలయును. "వరారోహా, రంభోరూ" అను మొదలగుపదములు మూలమున నున్నపుడు వానినివదలి విషయమును బోధించుపదముల వాడవలయును. లేక ఆపదములనే యుపయోగింపం జను. అంతియకాక వరారోహాయను చోటఁ గలయర్థమును దేటగ వ్రాసి తనదుష్పాండిత్యమును గనఁబఱుప రాదు. దాన రస మొదవఁబోదు. అప్సరసలు అని మూలముననుండఁగాఁ దెనుఁగున దేవతల యుంపుడుకత్తియలని కాని, అట్టిదే సామాన్యజను లుంపుడుకత్తియయనుదానిని వాఁడుమాటలఁ గాని తెనుఁగున నుపయోగింపరాదు. మక్కికిమక్కియన్నట్లు పరివర్తనము చేయరాదు "వృశ్చికేణదష్టః" అన్నచోట, తేలుచేఁ గుట్టఁబడియె నని వ్రాయకయాంధ్రమున దానినెట్లు వాడుదురో యట్లు వ్రాయవలయును. నియమముల నెందే నుల్లంఘించినచో నది "ప్రమాదోధీమతామపి" అన్నన్యాయమున క్షమింపఁదగినదే. వలయునని యట్లే వ్రాసిననే దోషమగును. కాళిదాసాదిమహాకవులకే యట్టిప్రమాదములు కలిగినపుడు సామాన్యుల కవి యుండక పోవునా. ఇట్టినియమముల నాశక్తికొలఁది నవలంబించితిని. వదలినచో నది నాశక్తిలోపమే యని భావింపవలయును. ఇఁక నొకటిరెండుస్థలములలోని మూలములనువ్రాసి పద్యములును దెలిపి నానియమ మింతమాత్రమని పాఠకమహోదారులకు విన్నవించుకొనియెదను.

శ్లో. దేవదానవసిద్ధానాం సర్వలోకనివాసినామ్,
వృణుయాత్తం మహాదేవం సమక్షం యది మేసుతా. ౪
తదేవ సుకృతం శ్లాఘ్యం మమాభ్యుదయ సమ్మతమ్,
ఇతి సంచింత్య శైలేంద్రః కృత్వా హృది మహేశ్వరమ్. ౫

(౩౪ అధ్యాయము.)

ఉ. దేవతలాశరుల్ సకలదిక్పరిపాలకు లెల్ల సిద్ధులున్
జేవ గలట్టిభూవరులు శ్రీయుతులై తగు లోకవాసు లో
హో వరియించె శంకరు మహోత్తమదేవు నటంచు నెన్నఁగా
నావరపుత్త్రి యెల్లరు గనంగ వరించెడుఁ గాక శ్రీశివున్. ౪

తే. ఇట్టు లొనరించుటే శ్లాఘ్య మిదియె సుకృత
మిదె మదభ్యుదయమునకు హితము ననుచు
మంతన మొనర్చి శంకరు మదిని నిల్పి
చాటఁ బంచె స్వయంవరోత్సవము నపుడు. ౫

(౨ ఆశ్వాసము.)

శ్లో. గత్వా తత్ర మహీపాలః క్షేత్రే త్రైలోక్యవిశ్రుతే,

దదర్శ రమణీయాని స్థానాని సరిత స్తథా.

(౪౪ అధ్యాయము.)

శా. భూపాలుం డల క్షేత్రవర్యమును సంపూజ్యంబు లోకత్రయీ
పాపారణ్యదవానలంబుఁ గని యాపాథోధితీరంబునన్
జూపట్టం దగు సాధుభాగముల సంశోభిల్లు పుణ్యాపగా
శ్రీ పద్మాకర సంతతిం గనుచు సంప్రీతిం గనెం జాలఁగన్. ౫౭౭

నసరై ర్గోధనై ర్వాపి తృషా ర్తై రుపభుజ్యతే. ౭
తదస్యనాగరాజస్య క ర్తవ్యో నిగ్రహోమయా,
నిత్య త్రస్తా స్సుఖం యేన చరేయుర్వ్రజవాసినః. ౮
ఏతదర్థం నృలోకేఽస్మిన్ నవతారో మయాకృతః,
యదేషా ముత్పథస్థానాం కార్యా శాస్తి ర్దురాత్మనాం. ౯

(౭౭ అధ్యాయము.)

చ. కనుకనె యిందుమానవులు గాని మహోత్తమగోవ్రజంబు గా
ని నియతిమైఁ జొరంగ నెటునేరుచు? దప్పి యడెంత యేఁచుచుం
డినను మహోగ్రపావక కడిందిరుచుల్ గలదుర్విషంబు తాఁ
కిన నపవిత్రమౌ జలముఁ గ్రోలఁగఁ బూనవు ప్రాణిసంతతుల్. ౪౫౪

చ. అటు లగుటన్ మహోగ్రభుజగాధిపు నీహ్రదసీమనుండి సం
కటములు వాపఁగోరియొ యికన్ వెడలించుట నాకుఁ గృత్యమౌఁ
జటులవిషాగ్నిసాధ్వసము చక్కఁగఁ బోవఁగ గోపబృందముల్
పటుతరసాహసం బలర భద్రజలంబులఁ గ్రోలుచుం గడున్. ౪౫౫

క. వనముల నిటఁ జరియింపం, గను జాలెడు గోగణములు కమ్రజలంబుల్
తనివారఁ గ్రోలుఁ గనుకనె, పనియిది చేయంగఁదగు నుపాయము పేర్మిన్. ౪౫౬

మ. నరలోకంబున నేనుబుట్టుట ప్రయత్నం బొప్పఁగా నిట్టిదు
స్తరకృత్యంబులఁ జేయుపొంటెఁ గనుకన్ దర్పంబునం బొల్చునీ
యురగేశాదిదురాత్మకవ్రజము నోహోయంచు దేవావళుల్
పరికీర్తింపఁగ శాస్తిచేయుటయె యాభద్రంబు లోకాళికిన్. ౪౫౭

శ్లో. నవయంకృషికర్తారో వాణిజ్యా జీవినో నచ,
గావోఽస్మద్దైవతం తాత వయం వనచరాయతః. ౧౨

ఆన్వీక్షకీ త్రయీవార్తా దండనీతి స్తథాపరా,
విద్యాచతుష్టయం త్వేత ద్వార్తా మత్రశృణుష్వమే, ౧౩
కృషిర్వణిజ్యాతద్వచ్ఛతృతీయం పశుపాలనం,
విద్యాహ్యేషా మహాభాగా వార్తా వృత్తిత్రయాశ్రయా. ౧౪

కర్షకాణాం కృషి ర్వృత్తిః పణ్యం పణ్యాయజీవినాం,
అస్మాకం గాః పరావృత్తి ర్వార్తాభేదై రియం త్రిభిః. ౧౫
విద్యయా యో యయా యుక్త స్తస్య సా దైవతం మహత్,
సైవ పూజ్యార్చనీయా చ సైవ తస్యోపకారికా. ౧౬

(౨౮ అధ్యాయము.)

చ. అని తనతండ్రిపల్కు విని య య్యమరేశుని పూజ నాపి యా
తనికి మహాగ్రహం బడరఁ దా నొనరింపఁగఁ బూని కృష్ణుఁ డి
ట్లనియెను; గర్షకావళులయందును జేర్పఁగ రాదు యాదవా
లిని యదువంశసంభవులు లీలఁగ గోవుల మేపుచుఁ వనిఁ. ౫౨౪

క. తిరుగుచునుందురు వైశ్యుల, యురుధర్మంబుగను తితిని నొప్పుచు విత్తో
త్కరమును గూర్పఁగఁ జాలిన, వరవాణిజ్యంబు మనకు వలనుపడదుసూ ౫౨౫

తే. మనకు గోవులు పరమవృత్తి నియతమిది
వనచరులమాట శాస్త్రోక్త మనఁగ వలయు
వరుస నాన్వీక్షకియుఁ ద్రయీ వార్త లవల
దండనీతియు నివియె విద్యలగు నాల్గు. ౫౨౬

సీ. ఇందు వార్తను గూర్చి యేను జెప్పెదు దానివినఁదగు నాయనా! యనఘ! కృషియు
వాణిజ్యమును బశుపాలనమ్మును నాఁగ వార్త వృత్తిత్రయభాసురాశ్ర
యయగు; మహాభాగ! యందుఁ గర్షకులకు వృత్తియగుఁ గృషియను విద్య పణ్య
జీవులకుం బణ్యమే విద్యయగు మన కనఁగ గోవులు శ్రేష్ఠమైనవృత్తి

తే. వార్తయందలి మూఁడగు పక్షములను
దెలియఁజెప్పితి నెవ్వఁ డేతీరునఁ దన
బ్రదుకుఁ జూచుకొనం బూను వాఁడు దాని
నాశ్రయింపఁగఁదగ మానవయితి గాదు ౫౨౭

క. ఏవిద్యచేత నెవ్వఁడు, జీవింపఁగఁగోరుచుండు సిద్ధ మదియె యా
దైవత మతనికిఁ దండ్రీ, యావిద్యయె పూజ్య యగును హర్షము నొసఁగుఁ.

తే అతని కుపకారిక యనఁగ నదియె సుమ్ము
మనుజుఁ డెవ్వఁ డే విద్యచేఁ గనుచు ఫలము
మఱొక విద్యను బూజించు మానసమున
నిహపరములందు శుభ మొందఁ డెన్నఁతఁడు. ౫౨౮

శ్లో. తామాహ లలితం కృష్ణః కస్యేద మనులేపనం,
భవత్యా నీయతే సత్యం వ దేందీవరలోచనే. ౨
సకామేనైవ సాప్రోక్తా సానురాగా హరిం ప్రతి,
ప్రాహ సాలలితం కుబ్జా దదర్శచ బలాత్తతః. 3

కాంత కస్మాన్న జానాసికం సేనాపి నియోజితాం,
నైకవక్రేతి విఖ్యాతా మనులేపనకర్మణి. ౪
నాన్యదిష్టం హి కంసస్య ప్రీతయే హ్యానులేపనం,
భవ త్యహో మతీ వాస్య ప్రసాదధనభాజనమ్. ౫

క. అనులేపన మెవ్వరికో, వనితా సత్యంబు పల్కు-వలయుం జూమ్మా
వనరుహనేత్రవు నీవన, నను రాగమునన్ సకామయై కుబ్జ హరిన్. ౮౮౭

క. కని పలికె లలితవాక్కులు, మనమున కింపొసఁగుచుండు మాడ్కిం జెలఁగన్
వనరుహనేత్రుని రూపం,బును బల్మిలు చూచుచుం బ్రమోదముపొంగన్.

సీ. కాంత! కంసుండను క్ష్మాపతివర్యుని యనులేపనాఖ్యకృత్యమున నేను
జరియించు దాన నంచరయ వేలొకొ త్రివక్రయనుచు విఖ్యాతిఁ గాంచుదానఁ
గంసున కేలాటికమ్రానులేపన మిష్టంబుగాక నేనే యొసంగు
ననులేపనంబుల నాదృతిఁ దగియుండుఁ గావున నన్నెప్డు గారవమునఁ
జూచి సన్మానించుఁ జుమ్ము; నావిని హరియోరుచిరాననా! యుర్విపతికి...౮౮౯

శ్లో. తతః పటే సురాన్ దైత్యాన్ గంధర్వాంశ్చ ప్రధానతః,
మనుష్యాం శ్చాభిలేఖ్యాసౌ చిత్రలేఖా హ్యదర్శయత్. ౧౯
అపాస్య సాతు గంధర్వాం స్తథోరగసురాసురాన్,
మనుష్యేషు దదౌ దృష్టిం తేష్వ ప్యంధకవృష్ణిషు. ౨౦
కృష్ణరామౌ విలోక్యాసీ త్సుభ్రూర్లజ్జావతీతదా,
ప్రద్యుమ్నదర్శనే వ్రీడాదృష్టిం నిన్యే తతో ద్విజాః. ౨౧
దృష్టమాత్రే తతఃకాంతే ప్రద్యుమ్నతనయే తదా,
సోఽయం సోఽయం మమేత్యుక్తే తయాసా యోగగామినీ. ౨౨

(౯౬. అధ్యా)

చ. వలిపెపుఁజీరయందు సురవర్యుల దైత్యుల దేవయోనులై
చెలఁగు మనోహరాంగులను సిద్ధుల మానవులన్ క్షణంబులో
పల లిఖియించి యచ్చెరువుపర్వెడు నట్లుగఁ జూపె నాయుషో
త్పలదళనేత్ర; కాసుదతి తత్పరయై గనె దాని వేడుకన్. ౧౫౯

సీ. తొలుత గంధర్వవీరులఁ జూచి తలఁద్రిప్పె నురగులఁ గనుచు నధరము విఱిచె
సురలఁ గనుంగొని శుభదృష్టులనుమానె నాసురులంగని యీసడించె
మనుజులఁ గొందఱఁ గని మదిఁ ద్రిప్పెను నంధకవృష్ణుల నరయమానె
బలరాముఁ గృష్ణునిఁ జెలఁగి కనుంగొని మందాక్షవతియయి మాటయుడిగె
తే. నవలఁ బ్రద్యుమ్నుఁగని వ్రీడ యులముకొనఁగ
దృష్టి మరలించెఁ దత్సుతు నిష్టఫలదుఁ

గాంచినంతనె స్వేదాంబుకణము లొలయ
నతఁడె యతఁడే యతండెయౌ ననియెఁ దమిని.

శ్లో. తస్మా త్సర్వాత్మనా కార్యారక్షా యోగవిదా సదా,
ధర్మార్థకామమోక్షాణాం శరీరం సాధనంయతః ౧౨ (౧౨౭ అధ్యా.)

చ. అనువుగ నింద్రియంబుల మహాత్తరనిష్ఠ జయించి యొప్పునా
సనమునఁ బ్రాఙ్ముఖుం డగుచు సాధకుఁ డెంతయుఁ బూన్కిమీఱఁగా
ననుదిన మొక్కరీతిగనె యభ్యసనంబు నొనర్పఁగాఁ దగున్
మనసునకున్ సుఖం బొసఁగుమాడ్కిని నాసన మొప్పఁగాఁదగున్. ౩౯౯

స్థాలీపులాకన్యాయము ననుసరించి యందందుఁ గలపద్యములను వ్రాసితిని. మూలమునకుఁ బద్యముల కెట్టిసంబంధముకలదో యెఱుంగఁదగు. ప్రాచీనులపద్ధతినే యీయాంధ్రీకరణమున నంగీకరించితిని ఈయుదాహరణములందుఁగొన్ని తావులఁ బెంచి నట్లగపడును. కొన్ని తావుల సంగ్రహించినట్లు కనంబడును. అందందు మూలమున కనుగుణముగా నుండుననియు గ్రంథపఠనమునందు స్పష్టము కాఁగలదు.

## గ్రంథవిమర్శనము

దీనింగూర్చినాలుగుమాటలువ్రాసెదను. విమర్శకులుగ్రంథకర్తల కత్యంతోపకారకులు. వారలమూలముననే కవి ప్రఖ్యాతింగాంచును. కాని విమర్శకులు దోషజ్ఞులు కావలయును. దోషైకదృక్కులు కారాదు వారాత్మద్రోహు లగుదురు. అసూయ వారియందు నిండి తాండవ మాడుచుండును. అది వారికే ద్రోహము చేయును. వారివ్రాఁతలనుగాంచి గ్రంథకర్తలు భీతిల్లరాదు. జలలిపులవలె వారి విమర్శనము లంతరించును. వారివ్రాఁతలంగాంచి విద్వద్వర్యులుసంతోషింపరు. గుణదోషములం బరిగణించుచు విమర్శించువా రీకాలమున నరుదుగ నున్నవారు. ఇప్పటి విమర్శకులను ముత్తెఱంగులుగ గణింపవలయు. దోషజ్ఞులు, దోషైకదృక్కులు, ప్రోత్సాహకులని వానిపేరులు. దోషజ్ఞు లరుదని మున్నే విన్నవించితిని. దోషైకదృక్కులును విరివిగా లేరని నాభావము. ప్రోత్సాహకులనఁగా గ్రంథకర్త తమ్ముం బురికొలుప నతనిపైఁగల యనురాగమునఁ దద్గ్రంథముం బొగడుచు లేనిగుణముల నారోపించుచు దోషములం గప్పిపుచ్చుచు నిస్సారములగు పద్యములనో గద్యములనో పేర్కొని హేతువులం దెలుపకయే యెంత బాగున్నవో చూడుఁడని పాఠకుల హెచ్చరించుచుఁ దన్మూలమున నపూర్వవిఖ్యాతిని గాంచ నెంచుచుఁ దమ్ముం గాంచి గ్రంథకర్తలు బెదఱుదురని తలంచుచు వర్ధిల్లువారలని యెఱుంగందగు. తఱచుగా నట్టివారు గుణములెట్టివో దోషములెట్టివో యెఱుంగరు. కాని సర్వజ్ఞులవలె విఱ్ఱవీఁగుచుందురు. తమకృషి నిరర్థకమగుట యేగాక యనర్థదాయకము తమకే యగుననియు వారెఱుంగరు. వానిని మెచ్చుకొనువారుకొందఱు గలరు. కావున నిట్టిదేవానాంప్రియులం గాంచి గ్రంథకర్తలు

సంశయింపరాదు. వారిప్రాంతలం గాంచరాదు. వా రొకప్పుడు ముఖస్తుతు లొన రించినం బాటింపరాదు

నిందతునందతు వాసన్న 'సూయురసపూయురత్రకిం తేన అన్న ప్రాచీనసూక్తినే ప్రమాణముగా నమ్మి భాషాసేవ చేయవలయును. పెద్దలు సుహృదయులు గాన్ ప్రీతిమైఁ దెల్పిన దోషములను శిరసావహించి వానిని దొలఁగించుకొనవలయును. అట్టిగ్రంథకర్తలువిఖ్యాతిం గాంతురు అట్టివిమర్శకులు గ్రంథకర్తలకు మిత్రు లనం బడుదురు. ప్రోత్సాహకు లనఁబడువారి యాక్షేపణములుగాని మిథ్యాస్తుతులు గాని పాటింపఁ దగినవి కావు.

దోషమిదియని తెలిపినపుడు దానినంగీకరించుట న్యాయము. దోషస్వరూపము నెఱింగిన పెద్దలే వానిం దెల్పఁ దగుదురు ప్రాచీనులు దోషములని పరిగణించినవానినెల్ల వదలి కవిత్వము చెప్పుట దుర్ఘటము. ఇప్పటి తెలుఁగుపాత్తములలో నేదియు నిలువఁజాలదు. కాళిదాసునివంటి కవిచంద్రునిగూర్చి వ్రాయుచు నౌచిత్య విచారచర్చయందు క్షేమేంద్రపండితేంద్రుఁడు

కుర్వన్సర్వాశయే వ్యాప్తి నౌచిత్యరుచిరోరసః,
మధుమాసఇవాశోకం కరోత్యంకురితం మనః

అని రసౌచిత్యమునకు లక్షణమువ్రాసి కాళిదాసకవికృతశ్లోకమును

వర్ణప్రకర్షేసతికర్ణికారం దునోతి నిర్గంధతయాస్మ చేతః,
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః.

అని యుదాహరించి "అత్ర కేవలకర్ణికార కుసుమవర్ణనమాత్రేణ విధాతృ వాచ్యతాగర్భేణైవ ప్రస్తుతశృంగారానుపయోగినా తదుద్దేశనవిధా వౌచితం నకించి దభిహితమ్" అనివ్రాసెను. ఇట్లే వెదకివెదకి విమర్శింపఁబూనినచో నాంధ్ర భాషామయగ్రంథములయం దొక్కదోషమే నొదవకుండ విరాజిల్లునదొక్కండుం జిక్క దనుటసత్యము.

లక్షణగ్రంథకర్త లట్లుశాసింప వలసినదే. కవులందుఁ గొంత యే నంగీకరించి యథాశక్తి వ్రాయుచుండవలసినదే. దోషప్రకరణమునఁగల దోషములకు నుదాహరణములు దొరకకయుండ, గుణప్రకరణమునకు వలసినన్ని యుదాహరణములు దొరకునట్లు గ్రంథరాజముల నలవరింపఁగలవా రుందురా యని పరిశీలింప వలసినదే. దోషములఁ బాటింపరాదని నాభావము కాదు. తుదముట్ట వానిం గలియకయుండఁ దెలుఁగుబాసగ్రంథములవ్రాయ వలనుపడదని నాయాశయ మని విన్నవించువాఁడను.

శ్లో. కావ్యస్యాలమలంకారైః కింమిథ్యాగణితైర్గుణైః,
యస్యజీవితమౌచిత్యం విచింత్యాపినదృశ్యతే. ౪

అలంకారా స్త్వలంకారా గుణావేవ గుణా స్సదా,
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్. ౫
ఉచితస్థానవిన్యాసా దలంకృతి రలంకృతిః,
ఔచిత్యా దచ్యుతా నిత్యం భవంత్యేవ గుణాగుణాః. ౬
ఉచితస్థానవిన్యాసా దలంకృతి రలంకృతిః,
ఔచిత్యా దభ్యుతా నిత్యం భవంత్యేవ గుణాగుణాః. ౭

అలంకృతిరుచితస్థానవిన్యాసా దలంకర్తుంక్షమా భవతి, అన్యథాత్వలంకృతి వ్యపదేశమేవ నలభతే, తద్వ దౌచిత్యా దపరిచ్యుతా గుణా గుణతా మాసాదయంతి, అన్యథా పునరగుణా ఏవ. అని క్షేమేంద్రపండితేంద్రుఁ డౌచిత్యమే ప్రధాన మని వ్రాసెను.

నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్,
రసాన్వితం కవిః కుర్వ న్కీర్తిం ప్రీతించ విందతి

అని సరస్వతీకంఠాభరణమునందు భోజరాజు స్వాభిప్రాయమును దెలిపెను.

సాధుశబ్దార్థసందర్భం గుణాలంకారభూషితం,
స్ఫుటరీతి రసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే.

అని వాగ్భటాచార్యుఁడు వ్రాసెను.

కావ్యంస్యాదుష్టౌ సగుణౌ శబ్దార్థౌ సదలంకృతీ,

అని కావ్యదర్పణమున రాజచూడామణిదీక్షితుఁడు హెచ్చరించెను. ఇట్లేయొక్కొక్క రొక్కొక్కవిషయమును బ్రధానముగాఁగొని వ్రాసిరి. ధ్వన్యాలోకమునందు ధ్వనియే ప్రధానమని యున్నది. ఇన్నింటిని ద్రోసివేయరాదు. అన్నింటియందుఁ గలసారమును గవి సంగ్రహించి తేనెటీఁగవలె రసమునుగూర్చి గ్రంథమువ్రాయవలయుననుట యంద ఱంగీకరింపఁ దగినవిషయము. ఏదోష మొదవకయుండ వ్రాయఁగలుగు టరిదియనియు నాయాశయము.

ఇట్టులుండ మఱికొందఱు కవి విశృంఖలవృత్తిగలవాఁడు కావలయు నందురు. ఛందోవ్యాకరణాలంకారప్రముఖనియమశృంఖలములు నలుప్రక్కల నీకవిదంతావళమును బంధించి కదలనీయకయుండ నుచ్ఛృంఖలవృత్తి యెట్టిదో దేవుఁడెఱుంగును. ఆభావనముమాత్ర ముండినఁ జాలునేమో. ఏవిషయమున విశృంఖలవృత్తి కలదో తెలిసికొనఁజాలకున్నాఁడను న్యగ్రోధపత్రాక్షీ! మత్స్యయానులవంటి కన్నులుగలదానా! అని కవిసంబోధించినచో

కవిభిర్న ప్రయుక్తం యదప్రయుక్తం తదుచ్యతే

అనుదోషమున కిది లక్ష్యమందురు. వటఫలాధరా! అని సంబోధించినయెడలఁ బైదోషము కలదని కాని లేక

అప్రయోజకమిత్యాహు రవిశేషవిధాయకమ్

అనుదోషమున కుదాహరణమనికాని యందురు. మఱియుఁ గవిసమయవిరుద్ధ మనియు నందురు. శంబరపానముచేయుచూ. అనిపలికినవెంటనే నిహతార్థతకు మంచి యుదాహరణమే యగు నని యీసడింతురు.

"నిహతార్థత్వమ్ నామ ఉభయార్థస్య శబ్దస్యాప్రసిద్ధేఽర్థే ప్రయోగః"

రెండర్థము లొకశబ్దమునకు నుండఁగా నందు నప్రసిద్ధమగునర్థమునందే యాశబ్దమును బ్రయోగించుట యని దానియర్థము. ఇట్లే యెన్నియో యుదాహరణములను జూపవచ్చును. ఇట్లుండఁగా నుచ్ఛృంఖలవృత్తి కవి కెట్లుగలదో తెలియరాదు. లక్షణగ్రంథములను వదలుకొంటిమి, భాషానియమములంగూడఁ బాటింప మానితిమి. మాయీయుద్యమము లోకోపకారకము, ఎల్లరు మాయీ మహాసంకల్పమునకుఁ దోడ్పడుదురుగాక. అని ప్రణాళిక నిర్ణయించుకొనిన నెవరి యాక్షేపము లుండవు. విషయ మెట్టిదైనను భాషయెట్లుండినను జదువువారు కొంద ఱుండకపోరు. కావున ఆగ్రంథములు విస్తరిల్లక మానవు.

## పురాణపఠనము.

ఇఁకఁ బ్రకృతపురాణము నాధారముచేసికొని పురాణపఠనమున ఫలము గలదా యనువిషయము నించుకవ్రాసెదను. పురాణములు కేవలకల్పితము లను వారు కొందఱు గలరు. బాలురుగూడ నమ్మఁదగనివిషయము లందుండునని కొంద ఱందురు. ఇట్లే యెన్నియో రీతులఁ బురాణములఁ దెగడువారున్నవారు. ద్వీపాంతరములం దిపు డిపుడు పురాణములతత్త్వము పరిశీలించువారు గలరు ఇవిమహార్థములు గలవనియు, నింతకంటె నుపకార మొనరించుగ్రంథములు లేవనియు నంగీకరించుచున్నారు. పురాణములు లోకతత్త్వమును విస్తరించి తెలుపుననియు నొదలధరించుచున్న వారు. పురాణపఠనమునచే సకలవిధములగు జ్ఞానములు కలుగు ననియు వేదాంతరహస్యములు తెలియుననియు నొప్పుకొను చున్నారు. పూర్వచరిత్రమును బురాణములే స్పష్టపఱచుచున్నవనియు నందుఁగలకొన్నివిషయములు గూఢముగ నున్నవనియు వానినెఱుంగక యవి తప్పులనుట న్యాయముకాదనియు వాకొనుచున్న వారు.ఈవిషయమునే వ్రాయుచు శ్రీమతి బ్లావేడ్స్కీదొరసానిగారు పర్వతాదులవిస్తీర్ణము మొదలగువానిం దెలుపునపుడు సంకేతముగాఁ గొలఁతలు చెప్పఁబడినవేకాని యసత్యములు కావని యామెగారు వ్యక్తపఱచిరి

పర్వతములు, అందును వర్షపర్వతములు, ద్వీపములు, అందుఁగలప్రాణికోటి స్వభావాదులు, నదులు, కాననములు, క్షేత్రములు, తీర్థములు మొదలగునవి యన్నియుఁ బురాణములయందు సత్యముగను స్పష్టముగను దెలుపఁబఢినవని

పెక్కండ్రు పరిశోధకు లంగీకరించుచున్నవారు. ప్రాచీనకాలమందు వ్రాఁతయే లేదనియు నిటీవలనే కలిగెననియు సర్వజ్ఞులవలెఁ గొందఱు పలుకుచుఁ దమపరిశీలనమును గుఱించి యుపన్యసించుచుందురు. వీరిట్లు సిద్ధాంతము నెల్లరు నమ్మునట్లు తెలుపుచుండఁగా, ఈజిప్టుకడ భూమిని బరిశీలింపఁ ద్రవ్వుచుండఁగా విచిత్రముగా నొకపట్టణముక్రింద నొకపట్టణముగాఁ గొన్నికనఁబడెననియు నందును గ్రిందనున్న పట్టణమున నొకగృహము కనఁబడెననియు దానిద్వారము తెఱవఁబడఁగా నందొకసమాధియుండెననియు, వెలుతు రాయింటిలోపలఁ బ్రవేశింపఁగనే యా సమాధియందున్నశవము పరాగరూపమున నెగసెననియు దానిం బరిశోధకు లూహించి కొన్నివేలయేండ్లక్రింద నది యమర్పఁబడియుండునని సిద్ధాంతముచేసిరనియుఁ దెలియవచ్చుచున్నది. అంతియగాక యాశవముకడ నలుప్రక్కలమట్టిపలకలుండెననియు నవి కాల్పఁబడియుండెననియు వానియందు నక్షరములు గనఁబడెననియు నెట్లో శ్రమించి వానిని జదువఁగా నిప్పటియక్షరములు తద్దేశభాషలో నెట్లున్నవో వానికి జనకప్రాయములుగానుండెననియు నాభాషయు నట్టిదే యనియు వానింజదువఁగా మానవుఁడు శరీరము వదలినతర్వాత నెట్టిస్థితి నొందునో యా విషయమే యందు స్పష్టముగా వ్రాయఁబడియుండెననియు డాక్టరు అనిబెసెంటు దొరసానిగారు వ్రాసిరి. ఒక్కపట్టణముక్రింద నొకటిగా నేడుపట్టణములు గట్టుటయు నొక్కొక్కటిభూగంపాదిబాధల నడఁగి పోవ దానిపై భూభాగము గట్టిపడి మరల నగరము కట్ట ననువుపడుట కెంతకాలముపట్టునో యిట్లే యేడుపట్టణములు కట్టుట కెంతకాలముపట్టునో యాపట్టణముకూడ భూగర్భముననుండి యెంతకాలమయ్యెనో యాలోచింపఁగాఁ దక్కువపక్ష మేఁబదివేలసంవత్సరములగునని యిప్పటిపరిశోధకాగ్రేసరులు లెక్కించిరఁట. నిర్ధారణమొనర్చిరఁట. ఏఁబదివేలసంవత్సరములకు ముందే యక్షరములు మట్టిపలకలపై వ్రాయఁబడి యవి చెడకయుండుటకుఁ గాఁ గాల్పఁబడియుండఁగా నక్షరములు నిన్నమొన్న నేర్పడినవేకాని యంతకుఁ బూర్వము లేవనువాద మెంతనిస్సారమైనదో నేఁజెప్పవలయునా. ఇట్లే యిప్పటి క్రొత్తక్రొత్తసిద్ధాంతము లన్నియు నిస్సారములయియేయుండు ననవలసివచ్చినది. ఇట్టులుండఁ బురాణములఁగలవిషయముల నిప్పటివారు సర్వజ్ఞులవలె నాక్షేపింప నేలొకో తెలియరాకయున్నది.

పురాణములు కాలస్వరూపమును, దద్గతవిషయముల నానుపూర్వకముగాఁ దెలుపును. పర్వతములను వానినుండికలుగునదులను వానివలనిలాభములను దెలుపును. మానవుల యాచారములు. కాలానుగుణముగ నెట్లుమార్పునొందెనో తెలియఁజేయును. రాజులపరిపాలనములను, వారినిర్ణయములజను లెట్లు పాటించిరో

తెలుపును. భగవంతుఁడు దుష్పరిపాలకుల నేయేవిధముల నడంచెనో బోధించును. మానవు లెట్లుప్రవర్తించి యెట్టివిఖ్యాతిని గాంచిరో యెట్లువర్తించి యపకీర్తిం గాంచిరో బోధించును. అవియివి యననేల? మానవులకు వలయు సర్వవిషయముల నిహపరసుఖములకువలయు వానిం దెలుపును. రాఁబోవుకాలగతులం దెలుపును. ఇప్పటిమానవుల ప్రవర్తనములు వానిమార్పులును బురాణములు చదివినవారికిఁ దెలిసియేయుండును. ప్రతివత్సరముమాఱుచున్న విధము తెలియఁదగియుండును. కావునఁ బురాణములఁ బఠించుట ప్రతిమానవునకుఁ గర్తవ్యములలోఁ బ్రధాన మనఁదగి యుండును. ధర్మశాస్త్రము లన్నియుఁ బురాణవాక్యముల నుదాహరించి విషయము నిర్ధారణ మొనర్చుట ప్రత్యక్షముకదా. వేదాంత సాంఖ్యాదిదర్శనరహస్యములు పురాణములయందు సారభూతములుగఁ జెప్పఁబడియేయున్నవి. ఇట్టిమహోపకారకములగు పురాణముల దూషించుట మంచి పనిగా భావించు టెట్టిదో పాఠకమహాశయులే నిర్ణయించుకొనుదురుగాక కొందఱు దూషించుచున్నను వాని నాదరించువారు పెక్కండ్రు లేకపోలేదు.

"కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ"

అని యెట్లో తృప్తిపడునంత దుష్టకాల మింకను రాలేదు. మహాశయు లెందఱో పురాణములఁ బఠించుచున్నవారు. వానిని వేదతుల్యములుగా భావించుచున్నారు. వానియుపకారమును స్మరించిస్మరించి మహానందాంబుధిఁ నోలలాడుచున్నవారు. పురాణముల నన్నింటిని బరివర్తనముచేయింపవలయునన్నయూహల వెలఁబుచ్చుచున్నవారు. ప్రాచీనులయున్నతి వేనోళ్లఁ గొనియాడుచున్నవారు. వారియాచారములే మంచి వనుచున్నవారు. ఒక్కమూల దూషణవాక్కులు వినఁబడుచుండ నూఱుభాగములనుండి స్తుతివాక్యములు వినవచ్చుచున్నవి. ఇట్టిసజ్జనస్తుతుల నాలకించుచుఁ బెక్కండ్రు సంతోషించుచున్నవారు.

### స్వవిషయము.

ఆంధ్రశ్రీమద్రామాయణమును రచించి బ్రహ్మపురాణమును శ్రీకృష్ణ చరిత్రములవిశేషించి తెలుపునదియని యాలకించి దానిం దెప్పించి పఠించి తెనిఁగింపఁ బ్రయత్నించితిని. కృతినాయకుని నిర్ణయింపుఁడని యెవరినే నభ్యర్థించుట నాయలవాటులలో నొకటి. పలుసారు లీవిషయమును స్మరించుచున్న నొక్కనాఁడైనను స్వప్నమునఁ బరమపురుషుఁడు తోఁచి వత్సా! నాకీకృతి నంకితమిమ్మా యని యడుగలేదు. కావుననే యొక్కదినమున మ. రా. శ్రీః నాగపూడి కుప్పుస్వామయ్యగారు నే నొకచోట నుండుట తటస్థించెను. వారితోఁ బ్రస్తావించితిని. వారు సంస్కృతాంధ్రభాషాకోవిదులని, బహుగ్రంథద్రష్టలని, సత్కవు

లని, వ్యాఖ్యాతలని నేనెఱుంగుదును గాన వారునిర్ణయించిన మేలనియే ప్రార్థించితిని. వారికృతికన్యకామణికి శ్రీమద్వేంకటాచలనాథుఁడే తగినవరుఁడని నిర్ణయించిరి. శిరసావహించితిని. ఆపరమేశ్వరునకే యంకితముచేసి కృతార్థుఁడనుగా నిశ్చయించితిని. ఈవిషయము గ్రంథమందే కనఁబడును. అయిన నిందు నించుకవ్రాసితిని.

## ప్రార్థనము.

విద్వత్కవులను, బండితాఖండలులను నేను విశేషించి ప్రార్థింప నక్కఱయే యుండదు. "కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావిక స్సద్గుణః" అన్న సూక్తి వ్యర్థముకాదు కదా. వాగనుశాసనుఁడే భారతమున ధారుణియని ప్రయోగించెను. కవిబ్రహ్మయే సభికులని సభ్యపర్యాయముఁ బ్రయోగించెను. తత్తుల్యు లెందఱో యందందు నిట్టి పదములఁ బ్రయోగించిరి. అట్టిమహాత్ములకే ప్రమాదములుగలిగె నన నిఁక వారిపాదధూళికే నీడుగాని నాయట్టివానివ్రాఁతయం దట్టివుండకపోవు. వాని నాదృతిమై నాకుం దెలిపి నాచేతనే దిద్దించి కాపాడుదురని వేఁడెదను. రేఫశకటరేఫములకుఁ బృథక్త్వం క్తినిర్దేశించుటయే నాసమ్మతము. ఒక్కతావున నెందేని స్వోక్తివ్యాఘాతముగా నట్టిప్రయోగముకనఁబడినమన్నింతురుగాక. క్త్వార్థకేకారసంధులు లోనగునవియు, దొరకిన నాకుఁ దెలిపి తమసహజగుణమును వెల్లడింతురుగాక. ఛందస్సునందు నెన్నియోవృత్తము లుండ నుత్పలమాలికాదులునాలుగే విశేషించిచెప్పుటయు విచిత్రవృత్తములు చెప్పకపోవుటయు నొకదోషముగాఁ గొందఱు పెద్దలునావిషయమైవ్రాసి నన్నాశీర్వదించిరి. పద్యంపద్యస్యలక్షణమ్మన్నట్లు పెద్దలగ్రంథములం జెంతనునుచుకొని యొక్కొక్కవృత్తమును జెప్పలేకపోను. కాని సాధారణముగా నవిచదువుట కింపుగావని మానితి ననియు, నదొక మహాపరాధముకాదనియు నుత్తము లెఱుంగుదురు. అదియొకలోపమని మహాశయులు భావించినను నాయందుఁ గన్పట్టులోపములలో నదియునొకట్టియగును. కాని యిట్టివానిం బ్రధానముచేసికొని యాక్షేపించుట పండితస్వభావముగాదని విన్నవించువాఁడను. ఇతరులు పురికొలుప నాయందాగ్రహము లేకున్నను వ్రాయుదురేని నేను బదులువ్రాసి వారి నలయించువాఁడనుగాను. నాగ్రంథమునఁగల లోపముల నెఱింగించినచో వానినిశిరసావహింతును. ఊరకయాక్షేపించిన నూరకయుందును. అంతియకాని బదులువ్రాసి ప్రఖ్యాతి వహింపనెంచువాఁడనుగాను. ఈరూపమున వాగ్దేవినారాధించువాఁడను. పురాణములను దెనిఁగించిన నదియొకలోకోపకృతి కాదన్నను సత్కాలక్షేపమనియైన నంగీకరింతురని నాభావము. ఆక్షేపింతురని భయంపడి నాపనిని మానను. ఎవ్వారికవిత్వమైనను సర్వజనసమాదృతింగాంచదు. ఎవ్వరో కొందఱాక్షేపించుచునేయుందురు. కాని కవి యట్టియాక్షేపములకు వెనుకంజవేయక తాఁజేయఁబూనుకొన్న పనిని భగవంతుని నమ్మి సాగింపవలయును.

యత్సన్నాసగమనార్థై వేదం మనుతు పాథేయమ్.

అని మహాత్ములు నిర్దేశించియేయున్నారుకదా. వలయునని భాషాదేవి కప కారము చేయరాదు. ప్రమాదమున నియమముల నుల్లంఘించిన వానిని బండితులు తెలిపినచో దిద్దుకొనుట కవిలక్షణము. తాఁబట్టినకుందేటికి మూఁడే కాళ్లనియెట్లో సాధింపఁబూనరాదు. అదియే భాషాదేవికిఁ జేయునపకారమని నే భావించు వాఁడను. పండితులును సత్కవులును నాయీయాశయము నవధరించి యిందుఁ గలలోపముల మన్నింతురని మరల మరల వేఁడువాఁడను.

## ఉపకారస్మృతి.

ఈపురాణము ముద్రించుటకుఁదోడ్పడినమహాశయుల నామములు వేఁటో కచోఁ గాన నగును. ఇందుఁబేర్కొనఁబడువారొక్కరే. వారు మ. రా. శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు. వారు భాషోద్ధారకులని పేరు గాంచినవారు. చూచుభాగ్యము లేకపోయెనేయని పరితపించుభాషాభిమానులకు మాఱుమూలల నున్న గ్రంథరత్నముల సేకరించి ముచ్చటగ ముద్రించి దానికగు ధనవ్యయమును లెక్కింపక సమర్పించియు సమర్పించుచు సమర్పింపఁదలంచుచు నున్నవారు. వీరి మూలమునఁ గలుగునుపకారము వర్ణనాతీతము. ఈ పురాణమును ముద్రింపఁ బూనిన నాకుఁ దొలుత వీరిసాయమే కలిగెను. ముద్రణముపూర్తియైనను నేనీయ వలసిన ధనమునుగుఱించి యొక్కసారియైన నడుగలేదుసరికదా వ్రాయను లేదు. కావున నాకుపకారము చేసినవారిలోఁ బ్రథమగణ్యులగు వేంకటేశ్వరశాస్త్రులవారి కేతన్ముఖమున నాకృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను. భగవంతుఁడు వారికాయు రారోగ్యములు ప్రసాదించుఁగాక. గోదావరీమండలవాసు లొక్కరు తొలుత గోడి యనుగ్రామమందును, ఇపుడు దొమ్మేరనుగ్రామమునందు నున్నవారు. వారు నన్నెఱుంగరు. శ్రీకృష్ణావతారతత్త్వమునకుఁ జందాదారులు. వారితరులఁబ్రోత్స హించి చందాదారులనుగాఁజేర్చిరి. నా రామాయణమునకుఁబ్రచారమును గల్గిం చిరి. అంతియగాక ఆరవిల్లియనుగ్రామమున నివసించి వైశ్యకులరత్నములై సజ్జన పక్షపాతులై విద్యాభిమానముగలిగి మహాదాతలయివెలయు మ. రా. శ్రీ, మడి పల్లి సూర్యనారాయణమూర్తిగారిని బ్రోత్సహించి యీపురాణమునకు నేఁబది యెనిమిదిరూప్యముల నంచెదారిని నా కందించిరి. వీరుకూడ నన్నెఱుంగరు. అట్టి మ. రా. శ్రీ, ఏ. టి. వి. ఆర్. నరసింహస్వామిగారికిని, సూర్యనారాయణమూర్తి గారికి నేతన్ముఖమున నాకృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను. నిశ్చయముగుసత్కా ర్యాదరణ మిదియేకదా. వీరిని సర్వేశ్వరుఁడుకరుణారత్నాకరుఁడు శ్రీనివాసుఁడు సర్వదా కాపాడుఁగాక యని వాంఛించుచున్నాఁడను.

మార్గవశమునఁ దమగ్రామమునకు వచ్చిన నన్నాదరించుటయేకాక యా గ్రామవాసులును, దత్పరిసరగ్రామవాసులు నగుధనవంతులఁ బ్రోత్సహించి మూఁడు వందలడెబ్బదియైదు రూప్యముల సమకూర్చియిచ్చిన చిరంజీవి కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ కేతన్ముఖమున నాయాశీస్సహస్రముల నందించుచున్నాఁడను. ఈచిరంజీవినివాసము తాటిపత్రికిఁ జెంతనున్న గాండ్లపాడను గ్రామము. నేనుండు పాఠశాలయందు సహాయాంధ్రపండితుఁడు. దశావతారాది గద్యపద్యగ్రంథముల రచియించినకవి. పెద్దలయాశీర్వచనములకుం బాత్రుఁడు. వినయసంపన్నుఁడు. వర్ధిష్ణువు. ధనమిచ్చినవారెవ్వరు నన్నెఱుఁగరు. వారినామములన్నియుఁ బోషకులపట్టికయందుఁ గన నగును ఇఁక విశేషించివ్రాయఁ దగువిషయములు లేవు. నాయపరాధముల నన్నింటిని మన్నింప సద్గుణసంపన్నులగు మహాశయులఁ బ్రార్థించుచు నీవిషయమును ముగించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు విద్వత్కృ విభక్తుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః

శ్రీమాత్రే నమః.

# కృతిసమర్పణోత్సవము.

"కల్యాణాద్భుతగాత్రాయ కామితార్థప్రదాయినే,
శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్."

మహామతులారా!

బ్రహ్మపురాణము పూర్తిచేసి రెండుసంవత్సరములు వేచియుండి ముద్రింప నారంభించితిని. అదియుఁ బూర్తిచేయు భాగ్య మబ్బినట్టులయ్యెను. కృతిసమర్పణోత్సవముచేయు వేడుక పొడసూపెను. మానుషానంద మొక్కొక్కరి కొక్కొక్కరీతిఁ గనఁబడుట సాజముకాదే. కడపనగరముచేరినది మొద లింతదనుక నించుకంతయుఁ గొఱఁతవడని దయచే నన్ను గారవించువారు, నాయభివృద్ధిం గోరువారును, నామేలే తమకుంగలిగినదానినిగా సంభావించువారునగు మ-రా-శ్రీ, కౌకూరు శ్రీనివాసరావు, బి. ఏ. బి. యల్. గారు, విరూరు పిచ్చయ్య బి. ఏ గారు, కురుడి గుండురావు బీ. ఏ. బి. యల్ గారు బి. పి. దేవరాజులునాయఁడు బి.ఏ. బి యల్. గారునని నేఁ దెలుపకమున్నే యెల్లరెఱుంగుదురు. వారిలో నొక్కరితోఁ బ్రస్తావించితిని. తక్కినవారి కెట్లు తెలిసెనో కాని మఱుదినమే వారే నన్నడిగిరి. సహజవాత్సల్యమున కుదాహరణ మిదిగాక మ తేమున్నది? మాతోఁ జెప్పకపోవుట కేమి కారణమని యాలోచింపకుండుటయే నాయందుఁగల యకృత్రిమానురాగ మని విన్నవించువాఁడను. ఎప్పుడు చేయవలయు నని నన్నే యడిగిరి. శ్రీకృష్ణాష్టమి యందులకుఁదగినదని విన్నవించితిని శ్రీకృష్ణావతారతత్త్వమునకు నుత్సవ మిప్పుడే సాగవలయుననియుం దెల్పితిని. అట్లే కావచ్చుననిరి. శ్రీకృష్ణావతారతత్త్వమునకు నుత్సవము బల్లారినగరమున జరగవలయుననియు నది కార్తికమాసముననియు నొకవార్త నాచెవిం బడియుండెను. కాలగతుల నాలోచించి 'శుభస్యశీఘ్రు' మ్మను న్యాయమును స్మరించి యీరెండింటి కొక్కపర్యాయమే కృతిసమర్పణోత్సవము సాగిన మేలని యూహించితిని. పెద్దలు నంగీకరించిరి.

పిదపఁ గొలఁదిదినములకే యొకసభఁగూర్చి న్యాయవాదులకును, వైశ్యశ్రేష్ఠులకు నీవార్తం దెలిపి వారియామోదమును గ్రహించి యాకల్యాణవార్తను నాకును దెలిపిరి. సభాధ్యక్షనిర్ణయమును వారే యొనరించి యొఱిఁగించిరి. పరమా

నందసంభరితాంతఃకరణుండ నైతిని. కవిసార్వభౌములు శ్రీకృష్ణభారతాధిశతాధిక గ్రంథకర్తలు స్వర్ణాభిషేకమునందిన మహనీయులునగు బ్రహ్మశ్రీ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారగుట ప్రశంసార్హ మెవ్వరికిఁ గాకుండును? నేనువారినిగురువులనుగా భావించువాఁడను. వారి నొక్కరినే కాదు. అట్టివారలనెల్లర నని మనవి చేయువాఁడను. వారు తొలుతఁ గార్యాంతరనిమగ్నులమౌట రాఁజాలకపోదుమేమో యని తెలిపిరికాని రానిచ్ఛగింపమని తెలుపరైరి. మరల వ్రాయఁగా నెన్నిపనులున్న మాని వత్తుమని వ్రాయించిరి. అదియకదా సాధువుల నైజము. పలువురు పండితులకు విద్వత్కవులకు నాహ్వానములనుబంపిరి.

శ్రావణకృష్ణాష్టమీ భానువారమున బ్రహ్మపురాణసభయు మఱునినమున శ్రీజయంతి యగుట నాఁడు శ్రీకృష్ణావతారతత్త్వసభయు జరపవలయునని తీర్మానింపఁబడియెను. కావున స్థిరవారము మధ్యాహ్నమునకు రాజమహేంద్రవరమునుండి బ్రహ్మశ్రీ,శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారును వేంకటగిరినుండి యున్నతపాఠశాలాధ్యక్షులై యష్టావధానులునగు మ-రా-శ్రీ, అల్లాడి జగన్నాథశాస్త్రులు బి. ఏ. ఎల్. టి గారును, తిరుపతినుండి మ-రా-శ్రీ, నాగపూడి కుప్పుస్వామయ్య బి. ఏ. గారును దయచేసిరి. ఈసభకు విజయంచేసినపండితులు:—

బ్రహ్మశ్రీ, అవధానము శంకరశాస్త్రులుగారు, వేంకటగిరి హైస్కూలుపండితులు వేంకటగిరి.

" విద్వాన్ పాతాళభేది సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు, తిరుపతి.

మ-రా-శ్రీ, ఆంధ్రవిద్యావాచస్పతి సాహిత్యసరస్వతి విద్యావినోద కవిభూషణబిరుదాంచితులై శతావధానులై ఆంధ్రపరిశోధకవిశ్వవిద్యాలయసభ్యులునగు దోమా వేంకటస్వామిగుప్తగారు, క్రిస్టియన్ కాలేజిపండితులు చెన్నపురి.

బ్రహ్మశ్రీ, కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు, మ్యునిసిపల్ హైస్కూలు తెలుఁగుపండితులు. బళ్లారి.

" వేదాంతశిరోమణి కొరటమద్ది వేంకటరామశాస్త్రులుగారు, హైస్కూలు సంస్కృతపండితులు, బళ్లారి.

" ఉభయభాషాప్రవీణ కావ్యతీర్థ మద్దులపల్లె వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులు గారు,మ్యునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రపండితులు,నంద్యాల.

" వామనపురాణకర్తలు రామావఝుల కొండయ్యశాస్త్రులుగారు, నెల్లూరుమండలము.

" సరసకవులు కరణము కృష్ణరావుగారు, హిందూపురమునుండియు శనివారము దయచేసిరి. కడపమండలమునుండి మహాశయులు పెక్కండ్రరుదెంచిరి.

పిఠాపురమునుండి మ-రా-శ్రీ, రెడ్డిపల్లె అప్పారావుగారును, బళ్లారినుండి మ-రా-శ్రీ, కే. సుబ్బాశాస్త్రులుగారును దయచేసిరి. వీరికెల్ల నివాసాదులు చక్కఁగా సమర్పింపఁబడియెను.

భానువార ముదయము బాష్పశకటముల మూలమున దేవునికడపకు శ్రీ వేంకటేశ్వరస్వామిసన్నిధికిఁ గదలి పౌరముఖ్యులు సకాలమునఁ జేరఁగల్గిరి. భగవంతున కటఁ బూజాదులు జరగించి యర్చకు లాస్థానమండపమున నుత్సవవిగ్రహములఁ బీఠవర్యమున నునిచియుండిరి. తత్సన్నిధిని బ్రహ్మపురాణమును షష్ఠ్యంతములదనుక బ్రహ్మశ్రీ, సి. జయరామాచార్యులు బి ఏ.,ఎల్. టి., గారు,(హైస్కూలున ద్వితీయోపాధ్యాయులు) చదివిరి. పెద్దలయాశీర్వాదములతో నాకృతిసమర్పణము మంగళవాద్యపురస్సరముగా సాగెను ప్రసాదస్వీకారము భక్తియుక్తముగ జరగెను. మధ్యాహ్నమునకుఁ గడపచేరుటయు నాహ్వానసంఘసభ్యులు నిర్ణయించిన స్థలమున భోజనము చక్కఁగానడచెను.

కార్యక్రమము ననుసరించి మూఁడుగంటలకు నుపహారానంతరము పురమందిరమున మహాసభ యారంభమయ్యెను. సభాధ్యక్షులు పండితమండలముతోడనడువ మంగళవాద్యములు బోరుకలంగ మహాసభామందిరమున కరుదెంచిరి. పౌరముఖ్యులు నగరాంతరాగతమహాశయులు నాయోలగమున నిండియుండిరి. లోకాచారము ననుసరించి యాయాయుపీఠముల నాయాసభ్యులు కూరుచుండిరి. తొలుత మ రా-శ్రీ, సి. జయరామాచార్యులు బి. ఏ. ఎల్. టి., గారు భగవత్సంప్రార్థన మొనరించిరి. సభ్యుల నానందరసమున మునుంగఁజేసిరి. సభాధ్యక్షునిర్ణయము వాడుక ననుసరించి కావింపఁబడియెను. మ-రా-శ్రీ, కే. కోటిరెడ్డి బారిష్టరు, యం. యల్. సి., గారు శ్రీశాస్త్రులుగారి సుగుణసంపదను గవిత్వచమత్కృతిని దెలిపి యామోదమును వెలిఁబుచ్చిరి. సభాధ్యక్షులు సర్వసభ్యామోదక జయజయశబ్దపురస్సరముగ స్వస్థానమున నాసీనులైరి. మ-రా-శ్రీ, కురుడి గుండురావు బి. ఏ. బి. యల్., గారు స్వాగతోపన్యాసముం బఠించిరి.

ఈమహాసభకు రాఁజాలమికిఁ దమవిచారమును దెలుపుచు జయప్రదముగా సభాకార్యము సాగవలయునని పత్రికామూలమునఁ దెలిపిన మహాశయుల భావము తెలుపఁబడియెను. వారు,

మ-రా-శ్రీ, కవిరాజు పుల్లాది వేంకటవిశ్వనాథశర్మగారు, మహారాజకళాశాలపండితులు, విజయనగరము.

,, శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు, విశాఖపట్టణము.

,, బులుసు పాపయ్యశాస్త్రులుగారు, అనకాపల్లి.

మ-రా-శ్రీ, విద్వాన్ గరిమళ్ల సోమన్నపంతులుగారు, ఎమ్. ఎల్. టి., గారు పిఠాపురము.

,, వడ్డాది సుబ్బరాయఁడుగారు, రాణ్మహేంద్రవరము.

,, అవధానశిరోమణి కాశీకృష్ణాచార్యులుగారు, గుంటూరు.

,, పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు, అల్లూరు.

,, ముంగమూరు వేంకటసుబ్బరావు, బీ. ఏ., బి. యల్. గారు, నెల్లూరు.

,, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిలుగారు, మదరాసు.

,, యన్. చంద్రశేఖరయ్యర్, బి. ఏ. బి. యల్., డిస్ట్రిక్టుజడ్జిగారు, తిరునెల్వేలి.

,, ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావుగారు, ఒంటిమెట్ట.

,, ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారు,అనంతపురకళాశాలాంధ్రపండితులు

,, దేశిభట్ల లక్ష్మీనరసింహముపంతులు, కళాశాలోపాధ్యాయులు ఎమ్. ఏ. ఎల్. టి. గారు.

,, జి. రామేశ్వరరావు, బీ. ఏ బి. యల్. గారు, అనంతపురము.

,, విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రిలుగారు, ఆదవాని.

శ్రీమతి దేశిరాజు లక్ష్మీనరసమ్మగారు, గుంటూరు.

,, కట్టా సుబ్బలక్ష్మమ్మగారు, చంద్రగిరి.

అంతట సభ్యతులు తమయుపన్యాస మారంభింపలేవఁగా సభ్యులయామోదమును దెలుపు కరతాళధ్వనులు మండపమును బ్రతిధ్వనింపఁజేసెను. శ్రీకృష్ణమూర్తిశాస్త్రులుగారు శాంతముగాఁ గవిత్వమునుగూర్చియుఁ బురాణాంధ్రీకరణమునుగుఱించియు, నిఘంటువుసమర్శనముల నుద్దేశించియు గ్రామ్యభాషం బునరుద్ధరణముచేయువారి ప్రయత్నములఁగూర్చియు నొకగంట గంభీరోపన్యాసమును గావించిరి. ప్రాచీనులగు మహాకవులభాషాభిమానమును దెలిపిరి. కువిమర్శకులం గూర్చి జంక నక్కఱ లేదనియు హెచ్చరించిరి.సభ్యులయామోద మపారమయ్యెను.

తరువాత నాంగ్లమతప్రవర్తకులు వచ్చియున్నందున వారికి సుబోధమగునట్లు మ. రా. శ్రీ, నాగపూడి కుప్పుస్వామయ్య బీ. ఏ. గా రాంగ్లభాషలో బ్రహ్మపురాణమునుగూర్చి యాంగ్లేయప్రముఖులు చేసియున్నచర్చను,ఇతరపురాణముల గుఱించినచర్చను స్పష్టముగాఁ దెలిపిరి. మ. రా. శ్రీ, అల్లాడి జగన్నాథశాస్త్రులు బీ. ఏ. ఎల్. టి గారు మాటలాడుచుఁ బురాణములనుగుఱించి యితరదేశీయులు చేసినచర్చలయం దంతగా సారములేదనియు నెవరికిఁ దోఁచినట్లు వారు వ్రాయుదురనియు వాని నే పాటింపక పురాణములఁ బఠించి తత్సారమును గ్రహించుటయే

ప్రధానమని తెలిపిరి. ఆనాఁటిసభ యంతట ముగింపఁబడియెను. ఈసభాకార్యక్రమ శేషము మఱుదిన ముదయమున సాగునట్లు తెలుపఁబడియె.

శ్రీజయంతి సోమవార ముదయమే సభాభవనము మహాశయులచే నిండి యుండెను. బ్రహ్మశ్రీ, వేదాంతశిరోమణి కొరటిమద్ది వేంకటరామశాస్త్రులుగారు పురాణాంధ్రీకరణములనుగుఱించి యుపన్యసించిరి. బ్రహ్మశ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు బ్రహ్మపురాణాంధ్రీకరణమునుగూర్చి చర్చించిరి. బ్రహ్మశ్రీ, విద్వాన్ వెల్లలూరు వేంకటాద్రిశర్మగారు నందంపుమూలమునకుఁ దెనుఁగునకుఁ గలసంబంధమును, సంగ్రహించినచోట్లను, విస్తరించినస్థలములను దెలిపిరి పిదప సభాధ్యక్షులు తమయసాధారణవాగ్ధోరణి సభ్యులనానందరసమగ్నులం జేయుచుఁ దమయుపదేశవాక్యములం దెలిపిరి. ఆసభ ముగింపఁబడియెను.

శ్రీకృష్ణావతారతత్త్వసభ యారంభింపఁబడియెను. సభ్యులప్రార్థనమున మ-రా-శ్రీ, నాగపూడి కుప్పుస్వామయ్య, బి. ఏ. గా రగ్రస్థానము నలంకరించిరి. మ-రా-శ్రీ, విరూరు పిచ్చయ్య, బీ. ఏ. గారు స్వాగతోపన్యాసమును జదివిరి. సభాధ్యక్షు లుపన్యాసము నారంభించి శ్రీకృష్ణచరిత్రము పరమపావనమనియు దానింగుఱించిన దూషణములు పాటింపఁ దగనివనియుఁ బ్రకృతగ్రంథమునఁ దెలుపఁబడిన విషయములు సర్వజనసుబోధములనియుఁ బ్రమాణము నతిక్రమించి యిందు నేవిషయము వ్రాయఁబడ లేదనియుఁ దెలిపిరి. విద్వత్కవులు కొందఱు మాటలాడిరి. గ్రంథద్వయమునుగుఱించిన యాశీర్వచన పద్యములను జదివిరి. అందు నేతన్మండలమునఁ గల కోడూరునుండివచ్చిన యొకచిరంజీవి రజకబాలుఁడు పద్యములను రచియించి చదివెను. ఆచిరంజీవినామము వేంకటనరుసు అని పాఠకు లెఱుంగుదురుగాక. ఆపద్యములు చదువుతఱిఁ గరతాళధ్వనులు చెలరేఁగెను. గాండ్లవంశమునజనించిన చిరంజీవి నారు నాగనార్యుఁడు, పద్యములు చదివెను వీరిది కోడూరు. అవియుఁ గడుహృద్యములని కరతాళధ్వనుల మూలమున సభ్యులు వెల్లడించిరి. ఆపద్యములన్నియు గ్రంథమున ముద్రింపఁబడఁదగునని సభాధ్యక్షు లిరువురును నాజ్ఞాపించిరి.

విజయనగరమునఁ గల కళాశాలపండితులు కవిరాజు మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారు పత్రికాముఖమున నాంధ్రవ్యాసబిరుదము గ్రంథకర్త కీయఁదగునని వ్రాసిరి. ఆవిషయము బ్రహ్మశ్రీ, ఉభయభాషాప్రవీణ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులుగారును, బ్రహ్మశ్రీ, కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు నుపపాదించిరి సభాధ్యక్షు లిరువురును సభ్యులు నేకగ్రీవముగా నంగీకరించిరి.

నేనందుల కనర్హుఁడననియు బలహీనుఁడనగుట బిరుదముల మోయఁజాలననియు న న్నీబిరుదములచే నలయింపక యాశీర్వదింపుఁడనియు వేఁడుకొంటిని.

ఆంధ్రశ్రీమద్రామాయణ కృతిసమర్పణోత్సవ కాలమున నొసంగిన "అభినవాంధ్ర వాల్మీకి యనుబిరుదమును, ఆకాలమునఁ బురపాలక సంఘాధిపతులుగానుండి నాయందు మిగుల వాత్సల్యముగల మ-రా-శ్రీ,పాళెము ముద్దుకృష్ణయ్యనాయఁడు బారెష్టరుగారు నిర్బంధించినందున రామాయణమున ముద్రింపవలసివచ్చెననియు నిపుడట్లే నిర్బంధింపకయుండఁ బ్రార్థింతుననియు బహుభంగులం బ్రార్థించితిని. సభ్యులందులకు సమ్మతించినజాడ కానరాదయ్యెను.

తరువాత నాహ్వానసంఘ మహాశయులు నూటపదారులు రజతముద్రికలచే నన్నాశీర్వదించిరి. మ-రా-శ్రీ, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు కౌశేయాంబరముల నిచ్చి నన్ను గౌరవించిరి. నెల్లూరుమండలమునుండి వచ్చినవారును, నాగ్రంథములకు నన్నింటికి ముద్రణమునకు వలయుధన మిప్పించినవారును మహోదారులునగు మ-రా-శ్రీ,అల్లంపాటి పోలిరెడ్డిగారు ముప్పదిరజతముద్రికల నిప్పించిరి.మ-రా-శ్రీ, అల్లాడి జగన్నాథశాస్త్రులు, బీ ఏ.ఎల్. టి. గారు రెండుసువర్ణముద్రిక లిప్పించిరి. సిద్ధవటమునుండి వచ్చిన మ-రా-శ్రీ, అనుముల వేంకటరమణయ్యగారు పదునైదురజతముద్రికల నిప్పించిరి. మాపాఠశాలయందు సహోపాధ్యాయులగు మ-రా-శ్రీ, జంగా లక్ష్మీనరసింహశాస్త్రులుగారు సువర్ణముద్రికను గుప్తపద్ధతి నిప్పించిరి. సహోపాధ్యాయులలో నొకరగు మ-రా-శ్రీ, వఝల చిదంబర రావుగా రొరులకుఁ దెలుపవలదని కొన్ని రజతముద్రికల నిప్పించిరి. ఇట్టు లీకార్యమున నాయీపురాణ ముద్రణమునకు మహాశయులు తోడ్పడిరి. సభ్యులయనుమతి నావిషయము నించుక విన్నవించితిని. రెండుయామము లయ్యెను కాని కార్య గౌరవమున నెల్లరునుండిరి. సభాధిపతులు హితమితవాక్కులఁ దమయాశయమును దెలిపి సభను బూర్తిగావించిరి.

ఆహ్వానసంఘమహాశయులు దూరమునుండివచ్చియున్న పండితకవులకు రాకపోకల కగుద్రవ్యమిచ్చి సత్కరించిరి. దీనాంధబధిరకుబ్జులకు దరిద్రులకుఁ నన్నదానముచేయుపని నాకే యనుగ్రహింపుఁడని యాహ్వానసంఘ మహాశయులఁ బ్రార్థింప నెట్లో వారు సమ్మతించియుండిరి.కాన నాసత్కార్యమునకు శ్రీయుత పోలిరెడ్డిగారు లోనగు పెద్ద లనుగ్రహించినధనము వ్యయించితిని. ఆహ్వానసంఘమువారిప్పించిననూటపదారులు పురాణముద్రణమునకు వ్యయించితిని.

## కృతజ్ఞత.

ఇట్టు లీమహాకార్యమును జక్కఁగా సాగించి కడపనగరవాసులు తమ యౌదార్యమును దెలిపిరి.నాశ్రేయస్సునకుఁ గారణభూతులగు నీమహాశయుల నెల్ల కాలము స్మరించుచు నాకృతజ్ఞతను దెలుపుచుండుటయే నావిధి. వేఱొకవిధమున

నీఋణమును దీర్చుకొనఁజాలను. న్యాయవాదులయ్యుఁ దమకృత్యములఁ బాటింపక యీకార్యమును నెఱవేర్పఁ బట్టుదలఁజూపి యితరులకుం దెలిపి యిక్కార్యము లిన్ని పర్యాయములా యని విసుగునొందక యింక నిట్టిగ్రంథముల నొనరింపుమని నన్నుఁబ్రోత్సహించుచు నాయందవ్యాజానురాగమును మాటలచేతను క్రియా రూపమునను గనఁబఱచిన నేతదాహ్వాన సంఘసభ్యులకు, వారలకుందోడ్పడిన కడప నగరవాసులగు మహాశయులకుఁ గృతజ్ఞతను దెలుపుచున్నవాఁడను. మాయిచ్చిన బిరుదమును వలదనఁదగునా యని నాయందాగ్రహముఁ బూనకుఁడని పండితకవి చంద్రులఁ బ్రార్థించువాఁడను. ఆబిరుదమునకు నేనర్హుఁడనుగానను విశ్వాసము నాకుఁగలదని వారిపాదములకడఁ దలయొగ్గి విన్నవించువాఁడను. పండితకవుల యందు నాకత్యంత భక్తికలదనియు వారొసంగిన యాశీర్వాద రూపకమగు బిరుదమును దిరస్కరించువాఁడను గాననియు దానిని ధరించునంత యోగ్యతమాత్రము లేదనియుఁ బెక్కుసారులు విన్నవించుచున్నాఁడను. మఱికొన్ని గ్రంథముల వ్రాయ నన్నుఁ బురికొలిపి యవి నెఱవేఱుఁగాక యని యాశీర్వదించినందుల కెంతయుఁ గృతజ్ఞుఁడనై యున్నవాఁడను. ఈమహాకార్యమును జక్కఁగా నెఱవేర్చి నాయసమర్థత నేవిషయమునను బాటింపని సభాధ్యక్షులకిరువురకును బండితకవిచంద్రులకును గడపనగరవాసులయి మహాశయులునగు నాహ్వానసంఘసభ్యులకును దత్సహాయులగు సుదారహృదయులకును మఱొక్కపర్యాయము నాకృతజ్ఞతను విన్నవించుచున్నాఁడను. నావ్రాయుచున్న చిన్నిగ్రంథములు రెండును ద్వరగ వెలువడు భాగ్యము గలుగునట్లాశీర్వదింపుఁడని పెద్దలఁ బ్రార్థించుచు నీవిషయమునుండి లేఖిని మరలించుచున్నాఁడను.

ఇట్లు భక్తజనవిధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ

# పండితులుచెప్పిన పద్యములు.

కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు, ప్రధానాంధ్రపండితులు,
మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

తే. అణువుకంటెను నణుతర మైనదయ్యుఁ
బర్వతాధికపరిమాణ వంత మ్మైద్ది
పరమనిగమాంతవేద్యమౌ బ్రహ్మ మెపుడు
కాచుఁ గాత నిన్ శేషాద్రి కవికులేంద్ర. ౧

చ. అమితసువైదుషీవిలసితామలశేముషి నాదిశేషునిన్
సమధికవిస్మయస్తిమిత శైలసమానునిఁ జేయుటం జుమీ
విమలయశోంబుపూర పరివేష్టిత దిక్తట నీకు సార్థమై
యమరెను శేషపూర్వమగు నద్రిసమాహ్వయ మిద్ధరిత్రిలోన్. ౨

తే. అతివ లీభువి నమడల నరుదుగాను, గనెద రదియేమిచిత్ర? మో కవివరేణ్య!
పూరుషోత్తమవిఖ్యాతిఁ బూని యౌర!, కావ్యకన్యల నేఁటేఁటఁ గనెదు జతగ.

శా. సేవాక్లేశము సద్దసేయక మదిన్ జేకూర్చి సుస్థైర్యమున్
హే వాకన్ దగుపాండితీమహిమచే హృద్యంబుగా సత్కృతుల్
వేవేచేసి తెనుంగుదేశము భువిన్ విఖ్యాతినొందంగ నీ
గావింపన్ సమకట్టుకార్యము కడున్ గ్రాలున్ బళీ! స్తుత్యమై. ౪

సీ. చూచినమాత్రాన సూరి యీతం డని ముదమారఁ దెలిపెడు మోముసౌరు
పరునిచిత్తమునైన వశము సేయఁగఁజాలి వఱలుచుండెడు మృదువచనరచన
నాస్తికవరునేని యాస్తికాగ్రణిగాఁగ సలుపఁజాలెడు సదాచారమహిమ
సోమరితనమును సురిఁగిపోవఁగఁజేసి సతముగా వెలయు నుత్సాహగరిమ

తే. ఔర! నీకు భూషణములై యమరుకతన, నన్యభూషలు వ్యర్థంబు లని తలంచి
భక్తి నొసఁగెద నీపద్యపంచకంబు, వేడ్క లిగురొత్తఁ గైకొమ్ము వినుతచరిత.

శ్రీమాన్ కవితార్కికసింహ శ్రీ వేంకటవరదాచార్యులుగారు,
తెలుఁగుపండితులు, మిషనుహైస్కూలు, కాంచీపురము.

శ్లో. వేంకటశిఖరిశేఖరకల్పకవృక్షస్సనాతనోలసతి,
యత్ఫలమవనతజనతాలభ్యం చాత్యున్నతైరలభ్యంచ. ౧

తారతత్త్వముల్ మున్ను గాఁదనసుకృతుల, కర్త యభినవ వాల్మీకి గాంచు జయము

ఉ. రాజులపేర్మి లేని కవిరాజితకాలమునందు వాహినీ
రాజసమాజవంజవతరంగములం దలమున్కలొంది యీ
యోజ ననర్ఘరత్నముల యొప్పున నొప్పుకృతుల్ ధరిత్రి నీ
శ్రీ జనమంచి శేషశిఖరి క్షితిదేవుఁ డొనర్చె మించఁగన్. ౪

సీ. కావ్యతీర్థుఁడు స్మృతిగణతీర్థుఁ డభినవ వాల్మీకి బిరుదవిభ్రాజితుండు
ఆంధ్రగీర్వాణ నీరంధ్రసాహిత్య సౌహిత్య విజ్ఞానసన్నుత్యయశుఁడు
శబ్దశాస్త్రాదిశాస్త్రమహాబ్ధిపారంగతుండు శాంతిముఖసద్గుణయుతుండు
అంతేవసజ్జనానంత కారుణ్యనారాయణుం డనఁగ జెన్నాలు మేటి
తే తగిన యింటిపేరికొలానఁ దగఁబొడమిన, యనఘుఁడగు జనమంచి శేషాద్రిశర్మ
పరఁగ బ్రహ్మపురాణంబు పంకజేక్షణావతారతత్త్వ మను గ్రంథాఖ్యసుతలఁ
గాంచె నెల్ల రానందంబు గరము నొంద. ౫

చ. బహువిధ వాగ్విశారదలభంగురమంగళరూపవైన యీ
దుహితల నీధరిత్రినృపతుల్ మతిఁ జాల నలంతు లౌట నే
లు హాయవునొందఁ బో; రఖిలలోకవిభుండు శ్రితావనుండు నై
నహరికి వీరిఁ గూర్చినఁ గనత్కలిదోషము లీఁగి యెంతయే
నిహమునను౦ బరంబున రహిం గడియింప నెసంగవచ్చు నం
చు హరిగురూపమానమతి శోభితుఁడౌ మనశర్మగారు మే
లహహ యనంగఁ జల్పినయుపాయము ధీయుత మెంచిచూడ నీ
మహిఁగలపండితావళికి మాన్యతమంబయి పర్వె నెంతయున్. ౬

శా. శ్రీమద్వేంకటశైలనాథుఁడు కలిం జెన్నాలు సర్వేశ్వరుం
డామాన్యప్రభుపాదపద్మముల కీరర్పింపఁగా నిప్డు డీ
సామాన్యేతరసత్కవిత్వసముదంచద్గ్రంథము ల్సల్పుటన్
శ్రీమించున్ భవదీయభాగ్య మలమిన్ శేషాద్రివిద్వన్మణీ. ౭

ఉ రంగదభంగమంగళతరంగమృదంగవినిస్వనోల్లస
ద్గాంగఝురానుకారి కవితావనితా ఘనతానితాంతభం
గంగమభారతాదికృతివర్గము వందను మించునట్లు స
ల్పెం గవిసార్వభౌముఁ డలవిజ్ఞుఁడు శ్రీపదకృష్ణమూర్తిశా
స్త్రిం గర మిందుఁ బెద్ద నొనరింప నిలింపుల కింపునింపఁగా
రంగు చెలంగు మేలగుహారంగగునాంధ్రకవిత్వవాణికిన్
బంగరు మేల్మిసొమ్ములను బాగుగఁ బ్రీతినలంకరింప నే
యంగునఁ బొంగునక్కరణి నాశలఁ గీర్తి చెలంగె నెంతయున్.

శ్లో. కలశపయోనిధిబాలా, లీలాలోలః కరోతు కల్యాణమ్

దేవః కృపాలవాల, శ్శుభకరశీల స్తమాలదళలసీలః. ౯

మ. వరసాయంసమయానటద్గిరిసుతాప్రాణేశకేశాటవీ
చరదాకాశఝునీఘుమంఘుమరవాంచద్భంగభంగీవిభా
సురమై యీనవవామలూరుభవుఁ డీశుద్ధాత్ముఁ డీశేషభూ
ధరశర్మాభిదుసత్కవిత్వపటుతత్త్వం బొప్పెడి న్నిత్యమై. ౧౦

తే. నాగపూడి కుప్పుస్వామినామబుధుఁడు, న్యాయవాదాగమజ్ఞుండు నాంగ్లదైవ
తాంధ్రవాగ్వేదినై కకృత్యమలకృతికరంబు నిట నేతయాట నిక్కంబు శుభము.

తే. తెలుఁగుఁదెన్నులయందునఁ దెలియనట్టి, వారు లేరు కుప్పుస్వామి భవ్య సతని
చిన్నిభారతమే మాకుఁ జిన్ననాఁటి, చదువు పరిమళోల్లాసంబు చదువు నేఁడు.

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేనమార్గేణ మహీంమహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు. ౧౩

శ్రీమతి కట్టా సుబ్బలక్ష్మమ్మగారు, చంద్రగిరి.

క. సారజ్ఞమనోజ్ఞంబగు, సారకవిత్వరచనావిచక్షణపుణ్యా
త్మా రాజమాన్య మీపద, సారసముల కాచరింతు శతకోటి నతుల్. ౧

తే. సరసకృతి సమర్పణమహోత్సవముఁ జూడ, వచ్చుటకు వీలులేమి సర్వజ్ఞమూర్తి
పావనములగు మీపాదపంకజముల, భక్తి నర్చింతుఁ బద్యదామములచేత. ౨

క. నేరుపున శీతశైలజ, భూరికృపాజలధిఁ దేలి పోలఁ పారంగా
ధారిణి సత్కావ్యంబులు, కోరినటులఁ గూర్చినట్టి గురుకవితిలకా. 3

ఉ. సంతసమొప్ప శంభువరసారసయుగ్మములం భజించి వే
దాంతవినోదులై సకలధర్మము లారసి దాంతులై రమా
కాంతునకుం బ్రియంబుగ సుకావ్యము లెన్నొ రచించినట్టి ధీ
మంతులు శాంతులుఁ విబుధమాన్యులు మిమ్ము నుతింపనేర్తునే. ४

చ. సులలితపద్యరత్నముల సొంపుగఁ గావ్యసువర్ణమందు రా
జిలఁ దగఁగూర్చి భక్తిమెయిఁ జిప్పిలుతావిని సంఘటించి భా
సిలునవమాలికోత్తమము శ్రీకరమొప్పు కథార్థపంక్తితో
నలలలితాపదాబ్జముల కర్పణచేసిన ధన్యమానసా. ౫

క. అలరుఁ గృతుల మీపలుకులు, పలుకుల చెలిలలితపాదపద్మంబుల మం
జులమంజీరరవంబులు, వలిమలసుతచేతిచిలుక పలపుల పలుకుల్. ౬

క. లలితభణితి నలరెడు నా, లలితోపాఖ్యానమునఁ గలకలమధురమా
పలుకులు పలుకు చెలి కరక, మలవీణాకలకలములు మహనీయగుణా. ౭

సీ. మాసమేతున కొక్కమణిహారముఁనుబోలె రామాయణము భక్తి వ్రాసినారు
గిరిజాపతికి హేమవరకిరీటంబన నొప్పుహాలాస్యంబుఁ జెప్పినారు

వాణీధవునికర్ణవజ్రకుండలముగా బ్రహ్మపురాణంబుఁ బలికినారు
సర్వజనామోదసద్గ్రంథములఁ బెక్కునీతికథార్థముల్ నెఱపినారు
తే. తనరు కృష్ణావతారతత్త్వంబు వ్రాసి, తత్త్వమార్గప్రదర్శనోత్సవముచేత
బుధుల నానందవార్ధిలో ముంచినారు, దిశల వెదఁజల్లినారలు విశదకీర్తి.
క. విద్వన్నుతులు కవీంద్రులు, సద్వైతవిచారలోలు రనఘులు శాంతుల్
సద్విజశేఖరులైన భ,వద్విద్యాకౌశలంబు వశమే పొగడన్. ౯
క. ఇవియె నమస్కారంబులు, కవివర మీవిమలపాదకంజములకు నా
కవనంబునఁ గలతప్పులు, సవరింపుచుఁ జదువుకొనుఁడు సౌజన్యనిధీ. ౧౦

రజకకులావతంసుఁడు వేంకటనరుసుగారు.

శా. శేషాద్రీశుని గేహాళీస్థలమునన్ శ్రీసూక్తము ల్వ్రాడి మా
భాషాయోషకుఁ గ్రొత్తసొమ్ము సవరింప న్మెచ్చి బ్రహ్మోయువీ
శేషాద్రిస్ఫుటనామసత్కవికి లక్ష్మీకాంత యిప్పించుతన్
భాషానాథునిచేఁ దదీయపితృభాస్వన్నాభిపద్మాప్తమై. ౧
మ. కవితాసారమదేభయూథములఁ బ్రఖ్యాతంబుగా సాకి యీ
భువిలో శాశ్వతకీర్తివాసనలపొల్పు న్నిల్పెనేకృష్ణభూ
పవరేణ్యుం డతఁ డేల నిట్టిదగు నీప్రాముఖ్యరాజ్యంబులోఁ
గవియే యల్లునికట్నమిచ్చి హరికిం గావ్యాత్మజం గూర్చెఁగాన్. ౨
శా. లేరా యిందఱు రెడ్డిరాజులను గీర్తిం గోర నిష్కాములై
నారా పౌరుష మేదిరా తమకు విన్నాణంబు లేకుండెనా
యారారాయలసీమభాగ్య మది శేషాద్రీశుఁడే యల్లుఁడై
గారంబారఁగ శేషశైలకవికిం గావ్యార్థము ల్గూర్చెడున్. 3

శ్రీయుతులగు నారు నాగనార్యుఁడుగారు, కోడూరు.

క. శ్రీమజ్జనమంచికులా,బ్ధిమిహిరమయూఖబ్రహ్మాధీశుభరేఖా
శ్రీమహితప్రశిష్యుండను, చేమోడ్పుం గాన్కగొనుమ శేషాద్రికవీ! ౧
సీ. గ్రంథమాజగదుపకారధౌరేయమౌ బ్రహ్మపురాణమై పరఁగుచుండఁ
గర్తయాయాంధ్రలోకము వేరువ్రాగినతాండవకృష్ణుఁడై తనరుచుండ
అధ్యక్షవరుఁడా శతాధికకృతికర్త కవిసార్వభౌమ విఖ్యాతుఁడుండ
భాషయా నవరసపరిధియై దేశభాషల లెస్స యగుతెల్గు పొలుచుచుండ
తే. పరిషదంతరమా రసభరితకవిత
జొబ్బుకొని గబ్బుమని త్రేపి చూచుచుండఁ

గాలమా! తెల్గుచెలువకుఁ గలికిచిన్నె
వన్నె లొడఁగూర్చ నింకేమి వలయు మనకు. ౨

మ. అనిదంపూర్వము బ్రహ్మనామకపురాణాగ్రేసరం బంధ్రభా
షను క్రొంగ్రొత్తమెఱుంగుపోకడలఁ జోత్స్న్యప్రస్ఫుటానంతభా
వనిబద్ధక్రియవమాధురింగవితఋూర్పంజాలి విద్వాంసులం
దనుపం జేసితి శేషనామకసుధీంద్రా, సాంద్ర తేజోనిధీ ౩

క. ఆద్యంతపురాణంబులు, నాద్యంతవిరహితుకరుణ నాంధ్రీకరణం
బుద్యతి నొనరించిన యన, వద్యచరిత్రులరు మిమ్ము వశమే పొగడన్. ౪

సీ. వామలూరుభవుండు వ్రాయకయుండిన రామచరిత్ర స్వరాజ్యభిక్షు
వ్యాసుండు ధర్మజిజ్ఞాసఁ బూనకయున్న పౌరాణములు స్వస్తివాచనములు
కాళిదాసమనీషికలుగకయున్న చో ధారాధిపుసమజ్ఞతలుపుమూఁత
అలసాని పెద్దన యవతరింపకయున్న కృష్ణభూపాలునికీర్తిసున్న

తే. అట్లె తాండవకృష్ణసమాహ్వయుండు, నాటుకొనకున్న యీకడ్ప చోటినేల
యిట్టి భావజ్ఞు కవితచేపట్టు కడప, భాగ్య మేమనికొనియాడవచ్చు నహహా. ౫

శ్రీయుతులగు ఎల్. వేంకటరమణయ్యకవిగారు, పులివెందుల.

ఉ. శ్రీసతికాంతుఁడై విమలశేషనగాగ్రవిరమ్యవాసుఁడై
వాసవపూజ్యుఁడై గురుకృపాపరుఁడై నిగమార్థవేద్యుఁడై
భాసురకీర్తియై గరుడవాహనుఁడై రుచిరావతారుఁడౌ
నాసుగుణైకశోభితుఁడు నాదటఁ బ్రోచుత శేషశర్మనున్. ౧

సీ. రామాయణంబును రమణీయశైలిలోఁ రచియించె నెవ్వాఁడు రమ్యభణితి
ధన్యమౌ కృష్ణావతారతత్త్వ మెవండు తతమృదుశైలితోఁ దనరఁజేసె
మనములవికసింప మహిని బ్రహ్మాండపురాణంబు నెవ్వాఁడు రచనఁజేసె
హరచరిత్రముఁ దెల్పు హాలాస్యమాహాత్మ్య మెవ్వాఁడు సజ్జను లెన్నఁజేసె

తే. నాటకాదుల రచియించె నవ్యధాటి, సూరిజను లెల్లఁ బొగడంగ సుగుణుఁ డెవఁడు
కవులలోపల నుత్తమకవి యెవండు, నట్టి శేషాద్రిసుకవి నే నభినుతింతు. ౨

క. సలలితబ్రహ్మపురాణం, బలసట యొక్కింతలేక యద్భుతలీలన్
ఇలమృదుశైలి రచించిన, లలితకళానిపుణ! సరస లాక్షణికాగ్రా! ౩

సీ. తివిరి కావ్యస్మృతి తీర్థాదిబిరుదంబు గలిగియున్నను గాని గర్వపడవు
వివిధవిద్యాప్రౌఢి వెలయుచున్నను గాని యొక్కింత పొంగవు నిక్కమరయ
నధికార మెంతేని యమరియున్నను గాని లేశము రుషయైన లేదు నీకు
శేముషీధరుఁడైన శేషాద్రికవి యనఁ బ్రేల వొక్కింతయుఁ బెంపుతోడ

తే. నీదు శాంతియు దాంతియు నీదు సుగుణ,గణములం బొగడఁగ నౌనె కల్లగాదు

వేంకటేశ్వరుఁ డనిశంబు వివిధగతుల, మహిని మీకిపు డొసఁగుత మంగళంబు.

మ_త్త. సంతసంబగు నీదుమైత్రిని సర్వకాలము గోరుచున్
మంతనంబున వేఁడుచుందుము మాధవుం గడుభ_క్తితో
నెంతకాలము సూర్యచంద్రులు నేర్పడంగఁ జరింతురో
యంతకాలము మీకు శ్రేయము లంతమొందక చేకురున్. ౫

వామనపురాణాదిగ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ రామావఝుల కొండయ శాస్త్రిగారు, చాపురాళ్లపల్లె, ఆత్మకూరుతాలూకా, నెల్లూరుజిల్లా.

ఉ. శ్రీరఘువంశదీకుఁ డశేషజగద్విభుఁ డక్షరుండు భూ
భారకరాసురాంతఁకుడు భాస్కరకోటి సహస్రతేజుఁడున్
సారసనేత్రుఁడున్ సకల సాధుజనావనుఁ డైనరాముఁడీ
ధారణిశేషశైలకవి తల్లజునేలు దయార్ద్రదృష్టితోన్. ౧

తే. కడపపురమందుఁ గవిగురుగణ్యవిబుధ, సహితమైన సుధీవర సభ విభూతి
నింద్రసభమాడ్కి విలసిల్లె నిప్పుడౌర, కనెడివారికి సంతోషకరము నగుచు. ౨

ఉ. శ్రీజనమంచి వంశఘనసింధుసుధాకరసత్యవాక్యతే
జోజయబంధురా సతతశాంతగుణాకర సర్వభూమిభృ
ద్రాజసభాస్ఫురద్విపుల రమ్యయశోభర భావదూర
విభ్రాజితశేషగోత్రకవిరాజజయింపుము దీ_ప్తిదిక్కులన్. 3

సీ. శ్రీసతికరుణతోఁ జెన్నుమీ రెనటన్న వరయోగనిష్ఠచే వాసిఁజెందె
విద్యాభిరాముఁడై విఖ్యాతిఁగెనటన్నఁ బుణ్యకార్యాస_క్తిఁ బొలుపుగాంచె
సత్కర్మపాలనాస_క్తియు క్తుఁడటన్న నిత్యదయాత్మతో నెగడసాగెఁ
బరహితవృ_త్తితోఁ బ్రజ్వరిల్లెనటన్న సాధుసంగతితోడఁ జాల నలరెఁ

తే. గావ్యతీర్థాదిబిరుదసంఘటితుఁ డార్య, సంస్తుతుండును జ్యోతిషశబ్దమంత్ర
శాస్త్రపారగుఁడయ్యె నీసాధువిప్రుఁ, డౌర నీఘనువర్ణింప నలవియగునె.

సీ. మాన్యులెన్నఁగను బ్రహ్మాండపురాణంబు లలితేతిహాసంబు లలితవచన
సహితవాల్మీకిరామాయణంబును మతిహాలాస్యభవ్యమాహాత్మ్యమును స
రసశబ్దకలితవిగ్రహపదాలంకారముల నొప్ప దెనిఁగించి భూపులెన్నఁ
గడపపురంబందు గమనీయ తపనీయ కరకంకణంబుల గణ్యవస్త్ర

తే. బహుమతులఁజెంది యి_త్తఱి బ్రహ్మసత్పు
రాణమును దెనుఁగుబాసలో రమ్యకృతినిఁ
జేసి చిరకీర్తిఁగంటివి శేషశిఖరి
భవ్యకవిరాజ నిరుపమభద్రతేజ.

క. రామావఝులకొండయ, నాముఁడ నేనొసఁగు పద్యనవ్యసుమంబుల బల్
ప్రేమఁగొను మింకఁ గృతులన్, భూమిం గావించి సుకృతమును గను మనఘా.

# బ్రహ్మపురాణముద్రణమునకుధనమిచ్చినపుణ్యపురుషులు.

---

ఉద్ధారకులు.

మ-రా-శ్రీ, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లి, నెల్లూరుజిల్లా.
,, అల్లంపాటి బ్రహ్మారెడ్డిగారు, ,,
,, అల్లంపాటి పెంచెలరెడ్డిగారు, ,,
,, మడిపల్లి సూర్యనారాయణమూర్తిగారు.

నిర్వాహకులు.

మ-రా-శ్రీ, బుట్టి వేంకటరామరెడ్డిగారు, కామిరెడ్డిపాడు.
,, బుట్టి బ్రహ్మారెడ్డిగారు, ,,
,, అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు, బళ్లారిజిల్లా.
,, వావిలాల వేంకటశివావధానులుగారు,బి.ఏ., రిటైర్డుసబ్ జడ్జి, బందరు.
,, కొండూరు వేంకటసుబ్బరాజుగారు, ముస్తాపురము.
,, చెవుటిపల్లి తిరుమలరెడ్డిగారు, పోతిరెడ్డిపల్లె, అనంతపురంజిల్లా.
,, వలిపిరెడ్డి చిన్ననారాయణరెడ్డిగారు, చీమలవాగుపల్లె.
,, చిలమకూరు నారాయణగారు, కొట్టాలపల్లె.

పోషకులు,

మ-రా-శ్రీ, రాళ్లపల్లె మృత్యుంజయులుగారు, రివిన్యూఇన్స్పెక్టరు, నెల్లూరుజిల్లా.
,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, నెల్లూరు.
,, చిట్లూరు రాచయ్యశ్రేష్ఠిగారు, మంగుపల్లి.
,, చిట్లూరు రాచయ్యకుమారుఁడు పుల్లయ్యశ్రేష్ఠిగారు. ,,
,, అల్లంపాటి సుబ్బారెడ్డిగారు ,,
,, గోపిరెడ్డి నారపురెడ్డిగారు ,,
,, ఊరుపిండి రాఘవరెడ్డిగారు, కామిరెడ్డిపాడు
,, మునగపాటి వేంకటసుబ్బరాజుగారు, చిలకలమర్రి
,, మునగపాటి నల్లపురాజుగారు ,,
,, నందిమండలము చెన్నరాజుగారి వేంకటరాజుగారు ,,
,, పెసల నాగిశ్రేష్ఠిగారు ,,
,, అమరా చెంచురామయ్యశ్రేష్ఠిగారు ,,

| | |
|---|---|
| మ-రా-శ్రీ, అమరా పోలిశ్రేష్టిగారు, | చిలకలమఱ్ఱి |
| ,, అమరా ఆదిలక్ష్మమ్మగారు, | ,, |
| ,, పల్లకొండ వేంకటనరసారెడ్డిగారు | పాతళ్లపల్లి. |
| ,, ఊరుపిండి సుబ్బారెడ్డిగారు | ,, |
| ,, సన్నపురెడ్డి గోసిరెడ్డిగారు | ,, |
| ,, అల్లంపాటి పెంచెలురెడ్డిగారు | ,, |
| ,, చల్లా వేంకటరెడ్డిగారు | ,, |
| ,, గంగవరము రామనాయడుగారు | గవరవరము. |
| ,, గంగవరము వేంకటస్వామినాయడుగారు | ,, |
| ,, పొందలూరు వేంకటశేషయ్యగారు | అనంతసాగరము. |
| ,, వల్లూరు వేంకటరెడ్డిగారు | ,, |
| ,, సడ్డా యెల్లారెడ్డిగారు | ,, |
| ,, రాటకొండ పిచ్చినాయడుగారు | బెడుసుపల్లె. |
| ,, చంద్రా చెంచయ్యనాయడుగారు | ,, |
| ,, రాపూరు వేంకటసుబ్బారెడ్డిగారు | వరికుంట్లపాడు. |
| ,, పాతపాటి నరసారెడ్డిగారు | ,, |
| ,, అల్లంపాటి చెంచిరెడ్డిగారు | ,, |
| ,, పాతపాటి పెంచెలురెడ్డిగారు | ,, |
| ,, అల్లంపాటి సుబ్బారెడ్డిగారు | ,, |
| ,, పాతపాటి లక్ష్మీనరసారెడ్డిగారు | ,, |
| ,, చల్లా శేషిరెడ్డిగారు | మంచేలపల్లె. |
| ,, రూపిరెడ్డి కొండారెడ్డిగారు | ,, |
| ,, సడ్డా వేములరెడ్డిగారు | ,, |
| ,, వేమనచిన్నయ్యసెట్టిగారు | చుంచులూరు. |
| ,, సుద్దపల్లె గిడ్డయ్యసెట్టిగారు | ,, |
| ,, కంబె చెంచయ్యగారు | ,, |
| ,, గ్రంధె చెన్నయ్యశ్రేష్ఠిగారు | నాయనిపల్లె |
| ,, మన్నె కొండారెడ్డిగారు | ,, |
| ,, మన్నె చెంచిరెడ్డిగారి కొండారెడ్డిగారు | ,, |
| ,, ఎల్లమరాజు కొండ్రాజుగారు | రాచపాళెము. |
| ,, ముద్దులూరు రామరాజుగారు | ,, |
| ,, మానుగుంట చెంచయ్యగారు | క్రొత్తపల్లె. |
| ,, పున్నపు కేశవయ్యగారు | ,, |
| ,, మురుకూటి కొండారెడ్డిగారు | చాపురాళ్లపల్లె. |

మ-రా-శ్రీ. పత్తిగురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు, నెల్లూరుజిల్లా.
,, దుబ్బా చెన్నారెడ్డిగారు, గాండ్లపాడు, అనంతపురముజిల్లా.
,, మొలకతాళ్ల రామయ్యగారు ,,
,, ఏమిరెడ్డి నాగిరెడ్డిగారు ,,
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు ,,
,, ఈదులపల్లె చిట్టియ్యగారు ,,
,, బోదనపాటి సుబ్బయ్యగారు ,,
,, మొలకతాళ్ల పెద్దరామయ్యగారి గిరియప్పగారు
,, మొలకతాళ్ల పెద్దప్పగారు ,,
,, మొలకతాళ్ల తిప్పయ్యగారు ,,
,, అమ్మినేని వేంకటసుబ్బయ్యగారు ,,
,, మొలకతాళ్ల నారప్పగారు ,,
,, మొలకతాళ్ల నాగన్నగారి నారప్పగారు ,,
,, మొలకతాళ్ల పుల్లయ్యగారి గిరియప్పగారు ,,
,, ఎట్టిబోలు వేంకటరెడ్డిగారు ,,
,, నల్లయ్యగారి పెద్దిరెడ్డిగారు, తాడిపర్తి.
,, గొర్తి పెద్దవేంకటప్పగారు, చల్లావారిపల్లె
,, చెవుటిపల్లె సుబ్బిరెడ్డిగారు, పోతిరెడ్డిపల్లె.
,, పార్లపల్లె నరసప్పగారు ,,
,, పార్లపల్లె చిన్నరంగప్పగారు ,,
,, చెవుటిపల్లె రామసుబ్బారెడ్డిగారు ,,
,, కంచెం ఆదెప్పగారు, తిమ్మాపురము.
,, మద్దిపట్ల పుల్లయ్యగారు ,,
,, మాదినేని పెద్దరంగప్పగారు, వెంగమనాయనిపల్లె.
,, మాదినేని రామప్పగారు ,,
,, నాయనిగారి తమ్మినేనివేంకటప్పగారు, జంబులపాడు.
,, బత్తిన కృష్ణారెడ్డిగారు, చీమలవాగుపల్లె.
,, బత్తిన బాలరంగారెడ్డిగారు ,,
,, పోచంరెడ్డి చిన్ననారాయణరెడ్డిగారు ,,
,, పొత్తూరు వేంకటకొండప్పగారు, కొట్టాలపల్లె,
,, పల్లా అప్పన్నగారు, పోతిరెడ్డిపల్లె.
శ్రీమతి. వలిపిరెడ్డి ఆదెమ్మగారు, చీమలవాగుపల్లె.

---

## కృ త జ్ఞ త.

# బ్రహ్మపురాణమునకు సాయముచేసినపుణ్యాత్ములు.

---

### ఉ ద్ధా ర కు లు.

మ-రా-శ్రీ, అల్లంపాటి పోలిరెడ్డిగారు.

సీ. సత్కార్యములనె యొసంగు వేడుకఁ జేయ సాహసించెడునట్టి సాధుశీలుఁ
డాశ్రితాదరణంబె యనవరతముఁ బూన నగునని తలఁచెడు నమలగుణుఁడు
భూతాళిపై దయఁ బూనుటే భగవదారాధనం బని యెన్ను రమ్యహృదయుఁ
డనుపమశాంతమే యభ్యసింపం దగునన్న యూహల మించునట్టి ఘనుఁడు
ఆ. విమలయశము మిగుల వెలయు నల్లంపాటి, వంశమౌక్తికంబు భారతాది
సకలనీతిసారసద్గ్రంథవేత్తయౌ, పోలిరెడ్డిఁ జక్రి ప్రోచుఁగాక.
చ. కనుఁగొనినంతనే నను నికామముదంబున జేమవార్తలన్
మనమలరారఁగా నడుగుమన్ననలం దనియంగఁజేయు నే
పని యొనరింపనౌ ననుచుఁ బ్రశ్న మొనర్చు ఫలింపఁజేయు నా
పనిఁ దనదే యటంచు నలప్రాజ్ఞుని శంకరుఁ డోముతందమిన్.
క. పంచశతరూప్యముల న్విప్పించెను గద పోలిరెడ్డి ప్రియమారఁగ నా
యంచితగుణుఁ గాపాడుతఁ, గాంచనచేలుండు సర్వకాంక్షలొసఁగుచున్.

మ-రా-శ్రీ, అల్లంపాటి బ్రహ్మరెడ్డిగారు.

తే. తదనుజుండు బ్రహ్మరెడ్డి దైవభక్తుఁ, డమలగుణశాలి సాధుమార్గావలంబ
నాదరుఁడు పరహితచర్యలందు సతతము, ప్రీతిగల మేటి సత్కృపాతి ఘనుఁడు.
క. మితభాషణుండు సూనృత,రతిగను చిత్తంబు మిత్రరంజనమున నా
దృతిగను నైజముగలిగిన మతిమంతునిఁ బ్రోచుఁగాక మాధవుఁ డెపుడున్.

మ-రా-శ్రీ, అల్లంపాటి పెంచెలురెడ్డిగారు.

చ. అరుదుగ నాశ్రితావనసమాదృతి భూషణమై తగంగ ను
ర్వరసుగుణోత్తరుం డితఁడె భవ్యమనస్కుఁ డితండె యంచు శ్రీ
హరిపదభక్తుఁ డీతఁ డని యన్వహముం దనుఁ బెద్ద లెన్నఁగా
సురుచిరకీర్తి పెంపునను శోభిలు పెంచెలురెడ్డివంశముం
బరమకృపాబ్ధి కృష్ణుఁడు ధ్రువంబుగ నిల్పుత మెల్లకాలమున్.

మ-రా-శ్రీ, మడిపల్లె సూర్యనారాయణమూర్తిగారు.

సీ. మడిపల్లి సద్వంశమౌక్తికంబయి సర్వసద్గుణాకరుఁడయి శాంతభూష
ణము చెల్వుమీఱంగ నమలయశఃకీర్తు లలరుచుండఁగ విద్యయందుఁ బటు
పాతము వెలయఁగాఁ బరహితకృత్యమే జన్మఫలంబను స్వాంత మొలయ
వైశ్యరత్నమునయి వఱలెడుసూర్యనారాయణమూర్తి నెయ్యమున నిట్టి
తే. భవ్యకృతి ముద్రణము సాగవలయు ననుచు
నంపె నేఁబదెన్మిదియు రూప్యములు నన్ను
నెఱుఁగకుండియు నవ్యాజవృత్తినట్టి
పరమసాధువును హరి గాపాడుఁగాక.

చ. అడిగినఁగాని యీయ రిల నర్థము దాతలు సాజ మిద్ది యే
ర్పడఁ బరదేశమందు నొకపార్శ్వమునన్ వసియించునన్ను నె
వ్వడువున విశ్వసించెనొ కృపాపరతంత్రత నంచెదారి ని
క్కడ నిడఁ జేసె నర్థశతకంబుపయిన్ వసుసంఖ్యరూప్యముల్.
క. గణుతింపరానిసుఖముల, నణుమాత్రము కొఱఁతనొంది కలరెడుసంప
ద్గణములను సూర్యనారాయణమూర్తికిఁ గృష్ణమూర్తి యాదృతినిడుతన్.

నిర్వాహకులు.

మ-రా-శ్రీ, బుట్టి వేంకటరామిరెడ్డిగారు, బ్రహ్మారెడ్డిగారు.

సీ. బుట్టి వంశము ఖ్యాతిఁబొందఁగా జనియించి సజ్జనులకును విస్తారకరుణ
వెలయఁగా సుపకృతి సులలితగతిఁ జేసి గర్వ మూనక చాల ఖ్యాతి మించి
యన్నదానంబున నతిథుల నలరించు ధర్మపత్నులు సాధునిర్మలమతు
లొప్పఁగా దీనుల కొఁగిమేలుఁ గూర్చు వేంకటరామిరెడ్డిని గమ్రయశముఁ
తే. గాంచినట్టి బ్రహ్మారెడ్డిఁ గాంచనాంబరుఁడు మహాత్ముఁడు కరుణాబ్ధి పుడమి సకల
వైభవంబులఁ దగునట్లు వరుసఁ బ్రోచుఁగాక యెందును గొఱఁతయే కల్గకుండ.

మ-రా-శ్రీ, అయ్యగారి బుస్సెట్టిగారు.

సీ. వైశ్యకులంబును వాసిగాంచఁగఁ జేయ వర్తించి దేవతాభక్తి మించి
సాధుగోష్ఠిని గాంచి సతతంబు నర్థులఁ దనియించుసత్కార్యమున రహించి
ధ్యానయోగంబున మానస మలరంగ నియమించి యశమున నియతిఁ బెంచి
శాంతమువహియించి చక్కనిమార్గమే గతిఁ గన నగునని కడుఁదలంచి
తే. బ్రహ్మచర్యవ్రతంబును బరమనిష్ఠ, యమర గ్రహియించి వెలసెడు నమలధిషణు
నయ్యగారి బుస్సెట్టిని హరి కరుణను, సోదరాన్వితుఁ గాపాడుచుండుఁగాక.

మ-రా-శ్రీ, వావిలాల వేంకటశివావధానులు, బీ. ఏ. గారు.

సీ. వావిలాలాన్వయవారిధిశీతాంశుఁ డమలమనీషుఁ డార్యమతవేత్త
వేదాంతశాస్త్రికవిద్వర్యుఁ డాంగ్లేయభాషావిశారదుఁ డీషణత్ర
యము జయించినమేటి యమర భాషాకోవిదుఁడు మహాభాగవతులను దొలుత
గణియింపఁదగువాఁడు కరుణదీనులఁగావ మది నెప్పు డెంచెడుమాన్యతముఁడు
ఆ. సాధుభూషణుండు సమ్మతాచారుండు, వినయధనుఁడు పరుల వెదకి జ్ఞాన
మొప్పఁ జెప్ప వేడ్క నొందెడునట్టి వేం,కటశివావధానిఁ గాచు శివుఁడు.
చ. ఇరువదియైదురూప్యముల నెంతయుఁ బ్రీతిని నంచెదారి నా
దరమునఁ బంపి యీకృతినితాంతము వృద్ధిని గాంచుఁగాత మం
చురుకృపనాశిషంబు లిడె నొక్కపు డిప్పటివృత్తి నాకు సు
స్థిరముగ నుండ సాయమును జేసెఁ బరాత్పరుఁ డోము నాఘనుల్.

మ-రా-శ్రీ, కొండూరు వేంకటసుబ్బరాజుగారు.

క. కొండూరు నామసంతతి, మండనుఁడై సాధుజనుల మన్ననలకుఁ బా
త్రుండై వేంకటసుబ్బా,ఖ్యుం డగురాజును మహేశుఁ డోముత సతముల్.

మ-రా-శ్రీ, చెవుటిపల్లె తిరుమలరెడ్డిగారు.

తే. చెవుటిపల్లెవంశం బనుసింధువునకు, శీతరశ్మివిధంబునఁ జెలఁగి కీర్తి
వృద్ధి నొందంగ నెంతయు వెలయఁజేయు, నట్టితిరుమలరెడ్డి శ్రీహరుఁడు ప్రోచు.
క. నిరతము యాచకులను ద,త్పరతం దన్పుచును దైవభక్తియె భూషో
త్కరమయి వెలయఁగ నొప్పెడు, తిరుమలరెడ్డికిని సాటిధీరుఁడు గలఁడే.

మ-రా-శ్రీ, వలిపిరెడ్డి చిన్ననారాయణరెడ్డిగారు.

సీ. వలిపిరెడ్డి యనంగ వఱలువంశాబ్ధిని జిన్నరంగయ్య యన్ శీతరశ్మి
జనియించె నాధార్మికునకును జిన్ననారాయణరెడ్డి విఖ్యాతిమించి
తనయుఁడై సత్కీర్తిఁ దగినట్లు గడియించి సాధుసంతతిఁ దన్పఁజాలి యుచిత
దానమ్ముచేయుచు ధర్మగుణంబునఁ దనవారిలోన నుత్తముఁ డనంగఁ
తే. బేరుగాంచెఁ దద్ఘనునకు శ్రీరమణుఁడు, సర్వరక్షకుఁ డతికృపాశాలి సతము
భోగభాగ్యంబు లిడి మంచిబుద్ధి యొసఁగి, కాంచుఁ గావుతఁ బ్రహ్లాదుఁ గాంచినట్లు.

మ-రా-శ్రీ, చిలమకూరు నారాయణగారు.

తే. చిలమకూ రనువిఖ్యాతికులము ధాత్రి, మించఁగాఁ జేయ జన్మించి మేటి యనుచు
నమలగుణరాశి యగుచు నారాయణాఖ్యుఁ, డలరు నేపాటి యేలోపమందకుండ.

ఉ. మంచిగుణంబులే వెలయుమాడ్కిఁ జరించుచు దాత యౌచు స
భ్యంచితనీతివేత్త యనుఖ్యాతిని మించుచు సాధుసన్నుతిం
గాంచినయట్టి యీఘనునిగ్రామవచోవిభవుం గృపాత్ము నా
కాంచనచేలుఁ డన్వహము గాంచుత మాదృతి మించునట్లుగన్.

## పోషకులు.

మ-రా-శ్రీ, రాళ్లపల్లె మృత్యుంజయులుగారు.

క. ఘనురాళ్లపల్లె సత్కుల,జుని మృత్యుంజయుని బూజ్యశుభశీలుని స
ద్వినుతుని శంకరుఁ డోముత, ననయము దీర్ఘాయు వొసఁగి యాదృతిమీఱన్.

మ-రా-శ్రీ, గట్టుపల్లి రామబ్రహ్మముగారు.

తే. పరమగుణభూషణుని గట్టుపల్లెవంశ, మౌక్తికంబు సదాచారమహితు ననఘు
ఘనమనీషు రామబ్రహ్మమును సతంబు, బ్రోచుఁ గావుత శ్రీరామమూర్తికరుణ.

మ-రా-శ్రీ, చిట్లూరు రాచయ్యశ్రేష్ఠిగారు.

క. పరమేశ్వరుండు వైశ్యో,త్కరమున శ్రేష్ఠుండు సుగుణకాంతుఁడు నగుచున్
బరఁగుచుఁ జిట్లూరుకులా,భరణుం డనుసద్యశమున భాసిల్లి క్షితిన్.

క. మనసునఁ బరోపకారం,బును జేయఁగ సతము కోరు బుధనుతశీలున్
ఘనునిన్ రాచయ్య యనం,గను ఖ్యాతిం గన్న శ్రేష్ఠిఁ గాచుత హరియున్.

మ-రా-శ్రీ, చిట్లూరు రాచయ్యకుమారుఁడు పుల్లయ్యశ్రేష్ఠిగారు.

తే. పెద్దలం గన్నవినయంబు పెంపు నొంద,వఱలు చిట్లూరు రాచయ్య వరతనూజు
వైశ్యరత్నముఁ బుల్లయ్య వాసుదేవుఁ, డఖిలసంపద లిచ్చినెయ్యమునఁ బ్రోచు.

మ-రా-శ్రీ, అల్లంపాటి సుబ్బారెడ్డిగారు, గోపిరెడ్డి నారపురెడ్డిగారు, ఊరుపిండి రాఘవరెడ్డిగారు.

సీ. హరియందు భక్తిచే నలరు నల్లంపాటి వంశ్యు సుబ్బారెడ్డి వాసుదేవుఁ
డలగోపిరెడ్డి సత్కులమునఁ బొడమిన నారపురెడ్డిని భూరిసిరుల
సతము రక్షించుఁ గావుతఁ; గామిరెడ్డి పాదసఁగమించిన గ్రామమున వసించి
తగు నూరుపిండి సంతతిని జన్మించి విఖ్యాతిఁ గాంచిన యట్టి యమలమతిని
తే. ఘనుని రాఘవరెడ్డిని గాంచనాంబ
రుండు సకలప్రపంచనాథుండు సతము
సకలవిధభాగ్యముల నిచ్చి సాధుకీర్తి
గలిగి వెలయంగఁ గాపాడుఁ గాత మెలమి.

మ-రా-శ్రీ, మునగపాటి వేంకటసుబ్బరాజుగారు.

ఆ. మునగపాటివంశమునకు మౌక్తికమన, నలరి స్వోపకృతి రవంతయేని
తలఁప కొరులపనికె తాఁబూను వేంకట, సుబ్బరాజుఁ బ్రోచు శుభదుఁడు హరి.

ఉ. ఏపనియైనమాని సుగుణోత్కరుఁడై తనరారుచుంటఁ దా
నోపికమీఱఁగాఁ బరుల కున్నతిఁ గూర్చెడు కార్యజాలమే
యేపగిదిన్ ఫలించునొ యదెన్నివిధంబులఁ జేయనౌనొ య
ట్లే పరమాదృతిం గనుచు నెంతయుఁ బూనికఁ జేయు సద్దిరా.

చ కనఁడు పరస్వమున్ మమతఁ గన్నులనైనఁ బరోపకారముం
బొనరుప సుంతయే విసుగుఁబూనఁడు దైవము భక్తిఁగొల్చు న
ప్పని విడనాడఁ డెవ్వరికి బాధలుగల్గఁగఁ జేయఁగోరఁ డీ
ఘనుని సతంబు గావుత నికామకృపం బరమేశుఁ డెంతయున్.

మ-రా-శ్రీ, మునగపాటి నల్లపురాజు లోనగుపుణ్యపురుషులు.

సీసమాలిక.—

చిలకలమఱ్ఱి వసించి పెద్దలఁ గొల్చి మునగపాటి కులంబు మోదమందఁ
జేయు నల్లపురాజు శ్రీయుతుఁ జేయుత మాధవుం డొగి; నంది మండలమను
రమ్యాన్వయుఁడు చెన్నరాజుసకుం బ్రీతివెలయించునట్టి యావేంకటాఖ్య
రాజును బ్రోవుత మాజగదీశుఁ డాపీతాంబరుఁడు; మఱి పెసలనాగి
శేషిసతంబును శ్రీసమృద్ధులుగల్గఁ బరమేశ్వరుండు కాపాడుఁగాక;
యమరాన్వయంబున నలరెడు చెంచురామాహ్వయు నతని దాయాదుఁబోలి
శేషిని విఖ్యాతిఁ జెందిన యాదిలక్ష్మ్యంబికఁ బ్రోచుత హరిసతంబు;
పల్లగొండకులంబు నుల్లసిల్లంజేయు వరగుణు వేంకటనరసరెడ్డి
నూరుమిండి యనంగ నొప్పువంశ్యుం డగునట్టి సుబ్బారెడ్డి నరసిప్రోచుఁ
గావుత శ్రీహరికరుణ; సన్నపురెడ్డి రోసిరెడ్డిని బ్రీతిఁజేసి కీర్తి
వెలయు నల్లంపాటి పెంచెలరెడ్డిని బరమేశ్వరుండు కాపాడుఁగాక
చల్లాన్వవాయుని సాధువేంకటరెడ్డిఁ బరశివుం డోముత సిరులఁ గూర్చి;
గంగవరం బనుఖ్యాతవంశంబున రమ్యకీర్తిం గన్న రామనాయ
నిని; గంగవరకులమున నుద్భవం బంది విద్యాధికుండయి వెలసి సుగుణ
సాంద్రుఁడౌ వేంకటస్వామినాయని వృద్ధిఁగాంచఁ జేయుత రమాకాంతుఁ డెలమిఁ;
బొందలూరు కులాబ్ధిపూర్ణసోముం డగు వేంకటశేషార్య వేంకటేశుఁ
డుల్లసిల్లజేయుఁ; వల్లూరు వేంకటరెడ్డిని సుగుణాఢ్యుఁ బ్రీతినేలు
హరిసతంబును; సడ్డ యనఁబడుకులమున నెసఁగు నెల్లారెడ్డి నీశుఁడరసి
కాపాడుచుండును గావుత; రాటకొండాన్వయుఁ బిచ్చి నాయనిగుణాఢ్యుఁ

చంద్రకులంబున జనియించి మించిన చెంచయ్యనాయని శ్రీశుఁ డేలు;
రాపూరుకులజుని రమ్యగుణాఢ్యు వేంకటసుబ్బరెడ్డిని గరుణవిష్ణు
వలరఁ గాపాడుత మనవరతము; పాతపాటికొలంబునఁ బరఁగునట్టి
నరసరెడ్డిని హరి సిరు లొసంగుచు నేలుఁగాక; యల్లంపాటి కమ్రవంశ్యుఁ
డగు చెంచిరెడ్డిని హరుఁ డేలుఁ గావుతఁ; బాతపాట్యన్వయ. భవునిసతము
పెంచెలరెడ్డి నాకాంచశాంబరుఁ డోముఁగాక; యల్లంపాటి. ఖ్యాతకులుని
ఘనుని సుబ్బారెడ్డి ననయ మేలుతహరి; పాతపాటి యనంగఁ బరఁగువంశ
మందు నొప్పుచుఁ గీర్తి నలరుచుఁ దగులక్ష్మి నరసరెడ్డిని జగన్నాథుఁ డేలు;
నములుని జల్లాన్వయమున జనించిన శేషిరెడ్డిని గృపశేషశాయి
పరమాదరమునఁ గాపాడుఁ గావుత; మఱి రూపిరెడ్డికులంబు రూఢికెక్క
వఱలు కొండారెడ్డి వాసుదేవుఁడు ప్రోచు; సద్గాఖ్యకులజుని సాధుమతిని
వేములరెడ్డిని విశ్వేశుఁ డోముత; సతతంబు కరుణవాంఛల నొసఁగుచు;
వేమనవంశ్యుని విపులవిఖ్యాతుని జిన్నయ్యసెట్టిని శ్రీశుఁ డేలు;
సుద్దపల్లె యనెడు శుభవంశసంభవు గిడ్డయ్యసెట్టిని గీర్తిఘనుని
గంటె చెంచయ్యను గనకాంబరుఁడు ప్రోచుఁ గావుతఁ బ్రీతిమైఁ గలుములనిడి;
గ్రంథకులాంభోధి కమలారియై మించు చెన్నయ్యశ్రేష్ఠిని శ్రీశుఁ డోముఁ
గాక; మన్నెకులంబు కడువృద్ధి నొనరించునట్టి కొండారెడ్డి నామహేశుఁ
డనవరతమ్మేలు; నామన్ని చెంచిరెడ్డికిఁ జేరు కొండరెడ్డిని ఘనునిని;
డెల్లమరాజు నానిద్ధరఁ దగువంశమందు జనించి సద్యశముఁ గన్న
యట్టి కొండ్రాజును హరుఁడు కాపాడుత; ముద్దులూరన్వయమున జనిఁగను
రామరాజును బ్రీతి రాముండు కాచుత; మానుగుంటకులంబు మహితమైన
యట్టు లొనర్చు చెంచయ్యను బున్నమకేశవయ్యను హృషీకేశుఁ డేలుఁ
గావుత; వీరు నిక్కముగ సద్గుణగణ్యులు దయాన్వితచిత్తు లొగిఁ బరోప
కారధురీణులు కడు మెచ్చఁదగువారు బ్రహ్మపురాణముద్రణముగూర్ప
నవతారరూప్యంబు లాదృతిమై నిచ్చి సాయము చేసినసాధుశీలు
తే. రగుట వీరికిఁ గలకాల మాపరాత్పరుఁడు కృపానీరరాశినా రూఢికెక్క
వనజనాభుఁడు శంకరుఁడును ధ్రువంబుతోడు నీడగనుండి కాపాడుచుండ్రు

మ. రా. శ్రీ. పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు

తే. పత్తి గురుమూర్తిశ్రేష్ఠికి భవ్యసుగుణ,మండితునకు శాంతాత్మున కండజేంద్ర
వాహనామలపాదాంబు భవసమర్చ,నాదరునకు శుభంబు లాహరి యొసఁగుత.
ఉ. ఒక్కపుడేఁ బ్రమాదమున. నుద్ధతిఁ బల్కుఁడు పెద్దలన్న చో
నిక్కపు భక్తిఁ జూపు మది నీరజనాభునియందుఁ జేర్చి తా

నొక్కఁ డెవండొయన్నగతి నుండుధనంబున విజ్ఞవీఁగఁ డా
చక్కనివైశ్యరత్నమును జక్రధరుం డొగి ధన్యుఁ జేయుతన్.

మ-రా-శ్రీ, మురుకూటి కొండారెడ్డిగారు.

క. మురుకూటివంశసంభవు, గురుభక్తుని సాధుజనులకోరిక లిడుచుం
బరఁగెడుకొండారెడ్డిని, బరమేశ్వరుఁ డోముఁగాక పరమప్రీతిన్.

మ-రా-శ్రీ, దుబ్బా చెన్నారెడ్డిగారు.

క. ధర "దుబ్బా" నామక మగు, వరవంశభవుండు విబుధవర్యులసేవం
బరఁగెడు చెన్నారెడ్డిని, హరికోరిక లొసఁగి బ్రోచు ననవరతంబున్.

మ-రా-శ్రీ, మొలకతాళ్ల రామయ్యగారు.

క. ఘన మొలకతాళ్ళకులజుం, డనఘుఁడు శాంతుండు భూసురామరభక్తిం
దవరెడురామయ్యను శ్రీ, వనజాక్షుఁ డపారకరుణఁ బరిపాలించున్.

మ-రా-శ్రీ, ఏమిరెడ్డి నాగిరెడ్డిగారు.

ఆ. ఏమిరెడ్డికులజుఁ డెలమిని సత్కార్య, కరణదక్షుఁ డార్యవరవినుతుఁడు
నాగిరెడ్డి కీలునారాయణుం డీశుఁ, డభిమతంబు లొసఁగి యనవరతము.

మ-రా-శ్రీ, ఈదులపల్లె చిట్టియ్యగారు.

తే.గీ వసుధఁ బెంపొందు నీదులపల్లెవంశ, మండనుండయి కీర్తిచే వఱలు నతఁడు
వరసుగుణఖని యని పేరువడసినట్టి, చిట్టియాఖ్యుని రక్షించు శ్రీశుఁ డెపుడు.

మ-రా-శ్రీ, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు.

చ. నిరశనవృత్తిమై హరిని నిత్యముఁ గొల్చుచు సత్యశీలుఁడై
వరగుణమండితుం డనఁగ వాసినిఁ గాంచిన "కాపు" సత్కులా
భరణుఁడు నీతిశాలి నుతిపాత్రుఁడు నౌ చినపుల్లయాఖ్య శ్రీ
వరుఁడు దయార్ద్రదృష్టిఁ గని పాలనచేయుత మెల్లకాలమున్.

మ-రా-శ్రీ, బోదనపాటి సుబ్బయ్యగారు.

సీ. పరఁగ బోదనపాటి వంశపారావార
పూర్ణశశాంకుఁడై పొలుపుమీఱు
సుగుణాలవాలుఁడౌ సుబ్బయాఖ్యుని శౌరి ప్రోచుఁ గావుతఁ గృపాపూర్ణమతిని

మ-రా-శ్రీ, మొలకతాళ్ళ గిరియప్పగారు.

పూతమై వెలసిన మొలకతాళ్ళకులుండు శ్రీకరచరితుండు శిష్టుఁడయిన
గిరియప్ప నోము మందరగిరివరధరుం డత్యంతకరుణచే ననవరతము.

మ-రా-శ్రీ, మొలకతాళ్ళ పెద్దప్పగారు.

ఆ. వసుధ మొలకతాళ్ళవంశోద్భవుండయి, వాసిఁగాంచినట్టి పరమఘనుఁడు
విమలయశుఁడునయిన పెద్దప్ప నెప్పుడుఁ, గరుణనేలుఁగాతఁ గరివరదుఁడు.

మ-రా-శ్రీ, అమ్మినేని వేంకటసుబ్బయ్యగారు.

క. ఇలఁగమ్మకులవిభూషణుఁ, డలఘుమతియు "నమ్మినేని" యనుసదనాఖ్యం
జెలఁగెడు వేంకటసుబ్బయ, జలజోదరుఁ డోముఁగాత! సంపూర్ణదయన్.

మ-రా-శ్రీ, మొలకతాళ్ళ తిప్పయ్యగారు.

క. సామజరక్షకుఁడు రమాధాముం, డిల వెలయు మొలకతాళ్ళకులుండౌ
శ్రీమహితుఁ దిప్పయాఖ్యుని, నేమఱ కెప్పుడును సుఖఁగ నేలుం గాతన్.

మ-రా-శ్రీ, మొలకతాళ్ల ఎఱ్ఱప్పకొమారుఁడు నారప్పగారు.

క. శ్రీరమణీవరభక్తుఁడు, దారుఁడు విమలుండు మొలకతాళ్లాఖ్యకులో
ద్ధారుం డెఱ్ఱనకొమరుఁడు, నారప్పను బ్రోచు నందనందనుఁ డెలమిన్.

మ. రా. శ్రీ, మొలకతాళ్ల నాగన్నకుమారుఁడు నారప్పగారు.

క. ఘనుఁడు యశోవంతుండును, జనసుత మగుమొలకతాళ్ళ శరధిశశాంకుం
డనఘుఁ నాగన సుతున, వ్వనజాక్షుఁడు నారపాఖ్యుఁ బరిపాలించున్.

సీసమాలిక.—

మొలకతాళ్లకులంబు పొలుపొందుయశమునవెలయంగఁ జేయంగ లలితగుణము
లలరంగజనియించి సులలితవాక్కులమించెడు గిరియప్పఁ గాంచనాంబ
రుండు రక్షించుత; రూఢికెక్కిన యెఱ్ఱబోలువంశాంబుధిఁ గ్రాలుచున్న
వేంకటరెడ్డిని విశ్వనాథుఁడు ప్రోచు; నల్లయ్యగారన నుల్లసిల్లు
వంశసంజాతుని వరగుణునిం బెద్దిరెడ్డిని బ్రోచుత శ్రీహరి దయ;
గొర్తికులాంభోధి కువలయాప్తుండయిక్రాలుచు సద్గుణగణములఁదగు
పెదవేంకటప్పను బ్రీతి రక్షించుత శ్రీనివాసుఁడు కృప చెలఁగుచుండఁ;
జెవుటపల్లెకులాబ్ధిశీతాంశుఁ డగుసుబ్బిరెడ్డిని నృహరి పరీక్షమీాఱఁ

బ్ర—G

గాపాడుఁ గావుత; గడుఁగీర్తిఁ గన్నట్టిపార్లపల్లె సువంశభవుని సుగుణు
నరసప్పనాయుని నారాయణుం డేలుఁ; బార్లపల్లె యనంగఁ బరఁగి కీర్తి
యెల్లెడ వ్యాపింప నెసఁగునన్వయమున నలరెడుచిన్నరంగప్ప నృహరి
పరిరక్ష చేయుత; నిరుపమగుణగణ్యుఁ జెవుటిపల్ల్యన్వయు శ్రీసమృద్ధు
రామసుబ్బారెడ్డి రామచంద్రుఁడు కృపఁ గాపాడుచుండుతఁ; గంచె మనఁగ
నలరువంశంబును హర్షొందఁగాఁజేయు నాదెప్ప రక్షించు హరి సతంబు;
మద్దిపట్ల సువంశమౌక్తికం బనఁదగు పుల్లయ్య నోముతఁ బుండరీక
నేత్రుండు; మాదినేనికులంబు యశమున వెలయంగఁజేయుచుఁ జెలఁగునట్టి
పెద్దరంగప్పను దద్దయు దయమీఱఁ గాపాడుఁ గావుతఁ గంజనయనుఁ;
డలమాదినేని సత్కులభవుభక్తుని రామప్ప సతతంబు నోము నృహరి;
నాయనగారనునామంబుగల తమ్మినేని వంశ్యుని శ్రీశు నిత్యభక్తు
వేంకటప్పను బ్రోచు వేంకటేశ్వరుఁ డెప్డు బత్తినవంశమహా పాలసంద్ర
మును జంద్రుపోలిక ఘనత నొందించెడునట్టి కృష్ణారెడ్డి నఖిలసంప
దల నిచ్చి శ్రీకృష్ణుఁ డెలమిఁ బ్రోవుత; మఱిబత్తినవంశసంభవుని ఘనుని
బాలరంగారెడ్డిఁ బరమేశుఁ డెప్పుడు రక్షించుఁగాక శ్రీరంజిలంగ
మహినిబోచంరెడ్డి మానితవంశ్యుని నమలాత్ముఁ జిన్ననారాయణాఖ్య
రెడ్డిని బ్రోచుత శ్రీపరమేశుండు పొత్తూరు సద్వంశమును జెలంగ
నొనరించుచును గీర్తి ఘనుఁడైన వేంకటకొండప్ప నేలుతఁ గూర్మి శ్రీశుఁ
డమలమాపల్లాన్వయంబు నుప్పొంగఁగఁజేయు నప్పన్నను శ్రీశుఁడోముఁ;
దశసంఖ్యలగురజతమయముద్రిక లిచ్చి సాయంబుచేసి రీసాధుమణుల

తే. వంశమును వీరిఁబుత్రులఁ బౌత్రులను స
తంబు పరమేశ్వరుఁడు కృపాధాముఁ డఖిల
భక్తవాంఛాప్రదుండు శ్రీవరుఁడు వేంక
టాచలేశ్వరుఁ డోముత మాదరమున

ధర్మమతి వలిపిరెడ్డి ఆదెమ్మగారు.

క. ఇల వలిపిరెడ్డి యనఁదగు, కులమును వెలయింపఁబుట్టి కోరికదీనా
వళులను బ్రోచుచుఁ గీర్తిన్, విలసిలు నాదెమ్మఁ బ్రోచు విశ్వేశుఁ డొగిన్.

క. లేదనక దాన మిచ్చును, గాదన కార్తులను బ్రీతిఁ గాపాడును స
మ్మోదమున శ్రీశుఁ గొల్చును, నాదెమ్మకు సాటిగలరె యవని నదెవరేన్.

మ-రా-శ్రీ, కొత్తకోట నరహరిశాస్త్రులుగారు.

చ. గురుని గవిన్ హసింపఁగలకోవిదుఁ డెవ్వని పెద్దతండ్రి యా
సరసిజసూతి యెంతయును జాణ యదెవ్వనితండ్రి వారికి

ర్వరకును సాటి యీతఁడనఁ బ్రోఢతనంబున నొప్పునట్టి యా
నరహరిశాస్త్రి నేలు హరి నవ్యశుభంబులు గూర్చి నిచ్చలున్.

మ-రా-శ్రీ, సోరెడ్డి తిమ్మయ్యగారు.

శా. గారాబంబున బీదలన్ మనుచుచున్ గార్పణ్యమున్ గేరుచున్
సారాచారము వీడ కెల్లపుడు సత్సాంగత్యముం గోరు నా
సోరెడ్డ్యన్వయవారిరాశివిలసచ్ఛుభ్రాంశుఁ దిమ్మాహ్వయున్
శ్రీరాంభోనిధిమందిరుండు మనుచున్ శ్రేయంబులం గూర్చుచున్.

మ-రా-శ్రీ, ఇ. హెచ్. సంజీవదాసుగారు.

చ. చరణప్రోద్భవవంశమౌక్తికమణిన్ సంగీతసాహిత్యవి
స్తరవిద్యారతచిత్తు ధీరు సకలస్వాంతున్ మహోదారు నీ
శ్వర కారుణ్యకటాక్షపాత్రు ననఘున్ సంజీవదాసున్ రమా
వరుఁ డత్యంతకృపార్ద్రదృష్టి మనుచున్ భద్రంబుఁ జేకూర్చుచున్.

మ. రా-శ్రీ, చిందలూరు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.

మ. కులశీలంబులఁ గార్యదక్షతసుధీగోష్ఠీసమాలబ్ధిఁ బె
ద్దలయందున్ దగుభక్తి ధర్మనిరతిం దాతృత్వమర్యాదలం
దుల లే కెందును జిందలూరు కులపాథోరాశిసోముండు నా
వెలయున్ సుబ్బయశ్రేష్ఠి యాఘనమతిన్ విష్ణుండు కాపాడుతన్.

# సవరణలు.



1. 653 వ పుటలో 125 అధ్యాయమని 326 వ పద్యము మొదట నుండవలయును. 656 వ పుటలో ఆధ్యాత్మికతాపస్వరూపము 126 వ అధ్యాయముగా నుండవలయు. అదిమొదలుకొని యధ్యాయ సంఖ్యను క్రమము నొకటి హెచ్చుగా భావింపవలయును. 138 అధ్యాయములు పురాణ సమాప్తియని గ్రహింపవలయు.

2. 663 వ పుటలో 400 సీసపద్యము నాలవపాదము ముద్రింపఁబడలేదు. అందు దీనిని జేర్చి చదువఁదగు "యలరార నతిశాంత, మమర మానముఁదాల్చి చిత్తచాంచల్యముఁజెందు పటిమ."

| పుట | పద్యము | ఇపుడుండునది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 9 | 84 | జందురుదా | జందురుఁడా |
| 10 | 1 | గనఁగా | ఁడనఁగా |
| 244 | 512 | పాదుపైన | పప్రభృతులా |
| 250 | 569 | భ | భక్తి |
| 251 | 577 | పుణ్యాపగ | పుణ్యాపగా |
| 262 | 70 | ఎందఱినో | ఎందఱినో |
| 263 | 701 | ఎందఱినో | ఎందఱినో |
| 268 | 752 | సరయుఁగ | నరయుఁగ |
| 270 | 782 | పప్మపత్రము | పద్మపత్రము |
| 286 | 937 | ఛమర | నమర |
| 306 | 1119 | యీస్థసంబున | యీస్థలంబున |
| 314 | 1164 | రుపమని | నిరుపమ |
| 332 | 1287 | నమధిక | సమధిక |
| 338 | 30 | బలు | బలుకు |
| 409 | 671 | గోపికాబ్జాక్షులతో | గోపికాబ్జాక్షులతో |
| 430 | 888 | తనవారు | తనివారు |
| 438 | 968 | నిషురగతి | నిష్ఠురగతి |
| 466 | 44 | కా | కాక |
| | ,, | చిత్తంబులుర | చిత్తంబులుక |
| 479 | 159 | నోయుపా | నాయుపో |
| ,, | 161 | నందక | నంధక |
| 511 | 467 | నెఁటికి | నేఁటికి |
| 663 | 399 | తనవగు | అనువుగ |
| 671 | 455 | వేదార్థ | వేదార్థ |
| 683 | 456 | ప్రందుట్లు | ప్రందునట్లు. |

ఇప్పటికిఁ దోఁచిన సవరణలివి.

# విషయసూచిక.


| అధ్యాయము. | | | పుట. |
|---|---|---|---|
| దేవతాస్తుతి | ... | ... | 1 |
| గురుస్తుతి | ... | ... | 2 |
| కవివంశక్రమము | ... | ... | 6 |
| 1. కథారంభము. | | | 10 |
| సూతుండు శౌనకాదులకుఁ బురాణముఁ జెప్పనారంభించుట | ... | ... | 12 |
| దక్షజననము | ... | ... | 17 |
| 2. అంగపుత్త్రుఁడగు వేనుని మునులు శపించుట | ... | ... | 26 |
| 3. మన్వంతరచరిత్రము | ... | ... | 35 |
| 4. సూర్యవంశకీర్తనము | ... | ... | 39 |
| 5. ఇలునిజననము | ... | ... | 43 |
| కువలాశ్వుఁడు ధుంధుదానవుం జంపుట | ... | ... | 47 |
| 6. సత్యవ్రతుండు త్రిశంకునామమునొందుట | ... | ... | 51 |
| 7. అత్రినేత్రమునుండి చంద్రుఁడుదయించుట | ... | ... | 58 |
| చంద్రుఁడు తారను గ్రహించుట | ... | ... | 59 |
| పురూరవసుజననము | ... | ... | 60 |
| హరిశ్చంద్రునియజ్ఞంబునందు శునశ్శేఫుండు పశువుగా గ్రహింపఁబడుట | | ... | 65 |
| 9. ఆయుంనృపతిసంతతి | ... | ... | 65 |
| 10. యయాతిచరిత్రము | ... | ... | 69 |
| 11. దుష్యంతచరిత్రము | ... | ... | 73 |
| కార్తవీర్యునిచరిత్రము | ... | ... | 84 |
| 12. వసుదేవునిచరిత్రము | ... | ... | 88 |
| 13. జ్యామఘనృపాలచరిత్రము | ... | ... | 91 |
| 14. స్యమంతకమణిచరిత్రము | ... | ... | 95 |
| 15. సత్రాజిత్తు స్యమంతకనిమిత్తము చంపఁబడుట. | ... | ... | 99 |
| 16. భూగోళప్రశంస | ... | ... | 103 |
| 17. భారతవర్షప్రమాణము | ... | ... | 107 |
| 18. ప్లక్షాదిసకలద్వీపవర్ణనము | ... | ... | 109 |
| క్రౌంచద్వీపము | ... | ... | 111 |
| శాకద్వీపము | ... | ... | 113 |
| పుష్కరద్వీపము | ... | ... | 114 |

అధ్యాయము. ... ... పుట.
19. అతలాది సప్తపాతాళవర్ణనము ... ... 116
20. రౌరవాది నరకనిరూపణము ... ... 118
21. భూమ్యాకాశాది పరిమాణములు ... ... 122
22. శింశుమార చక్రనిరూపణము ... ... 125
23. తీర్థమహిమము ... ... 127
24. మోక్షప్రదతీర్థప్రదవర్ణనము ... ... 130
25. భారతఖండవర్ణనము ... ... 132
26. ఓండదేశద్విజవర్ణనము ... ... 138
27. సూర్యపూజాప్రకారము ... ... 143
28. ద్వాదశవిధసూర్యమూర్తిచరిత్రము ... ... 147
సూర్యద్వాదశమూర్తిస్థానములు ... ... 149
29. వసంతాదులయందు సూర్యవర్ణభేదములు ... ... 154
30 సూర్యుఁ డదితికిం బుత్త్రుఁడై జనించుట ... ... 156
అదితి సూర్యుస్తుతించుట ... ... 158
దేవదానవయుద్ధము ... ... 165
31. బ్రహ్మాదులు సూర్యుని వినుతించుట ... ... 164
32. రుద్రమాహాత్మ్యము ... ... 168
33. శివుఁడు గౌరీహృదయము నెఱుంగఁ గపటవేషమును బూనివచ్చుట శివపార్వతుల సంవాదము 178

## ద్వితీయాశ్వాసము

34. పార్వతీస్వయంవరము ... ... 185
వర్షర్తువర్ణనము ... ... 192
శరదృతువర్ణనము ... ... 193
హేమంతశిశిరర్తువర్ణనము ... ... 194
పార్వతీపరమేశ్వరవివాహము ... ... 197
35. ఈశ్వరుని దేవతలు వినుతించుట ... ... 198
36. శివనేత్రవహ్నిచే మన్మథుఁడు దహింపఁబడుట ... ... 200
37. గంగాద్వారమున దక్షుఁ డశ్వమేధమును జేయుట ... ... 204
38. దక్షుండష్టోత్తరసహస్రనామముల శంకరు వినుతించుట ... ... 210
39. ఏకామ్రక్షేత్రమాహాత్మ్యము ... ... 222
40. విరజాద్యష్టతీర్థవర్ణనము ... ... 229
41. అవంతీపురమాహాత్మ్యము ... ... 232
42 ఇంద్రద్యుమ్నుఁడు దక్షిణసముద్రముదరికిఁబోవుట ... ... 239
43. పురుషోత్తమక్షేత్రవర్ణనము ... ... 244

| అధ్యాయము. | | | పుట. |
|---|---|---|---|
| 44. ఇంద్రద్యుమ్నుఁడు పురుషోత్తమక్షేత్రమున నివసింపఁగోరుట ... | ... | | 251 |
| 45. ఇంద్రద్యుమ్నుఁడు ప్రాసాదము నిర్మించుట | ... | ... | 254 |
| 46. ,, | ... | ... | 260 |
| 47. ఇంద్రద్యుమ్నునకు స్వప్నమున భగవంతుఁడు దర్శనమొసంగుట | | ... | 266 |
| 48. ఇంద్రద్యుమ్నుఁడు పురుషోత్తమప్రతిమల స్థాపించుట | ... | ... | 271 |
| 49. మార్కండేయముని మహావటవృక్షమును దర్శించుట | ... | ... | 276 |
| 50. మార్కండేయునకు భగవంతుఁడు సాక్షాత్కరించుట | ... | ... | 277 |
| 51. మార్కండేయుఁడు విష్ణూదరమున వెడలివచ్చుట | ... | ... | 281 |
| 52. మార్కండేయముని భగవంతునుతించుట | ... | ... | 282 |
| 53. విష్ణుమార్కండేయసంవాదము | ... | ... | 285 |
| 54. పురుషోత్తమక్షేత్రయాత్రావిధి | ... | ... | 290 |
| 55. నరసింహపూజావిధానము | ... | ... | 295 |
| 56. శ్వేతనృపతి కపాలగౌతముని మృతపుత్త్రుని బ్రదికించుట | ... | ... | 301 |
| 57. అష్టాక్షరమంత్రకవచవివరణము | ... | ... | 307 |
| 58. భగవత్పూజావిధినిరూపణము | ... | ... | 312 |
| 59. సుభద్రారామసహిత శ్రీకృష్ణమహిమము | ... | ... | 316 |
| 60. పంచతీర్థమాహాత్మ్యము | ... | ... | 318 |
| 61. మహాజ్యేష్ఠమహిమము | ... | ... | 319 |
| 62. శ్రీకృష్ణస్నానాదివిధానము | ... | ... | 320 |
| 63. గుండికాయాత్రావర్ణనము | ... | ... | 326 |
| 64. పురుషోత్తమయాత్రాదివర్ణనము | ... | ... | 328 |


## తృతీయాశ్వాసము


| | | | |
|---|---|---|---|
| 65. విష్ణులోకమాహాత్మ్యము | ... | ... | 331 |
| 66. పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యనిరూపణము | ... | ... | 339 |
| 67. అనంతవాసుదేవమాహాత్మ్యవర్ణనము | ... | ... | 341 |
| 68. పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యము | ... | ... | 346 |
| 69. కండుమహర్షిచరిత్రము | ... | ... | 348 |
| కండుముని విష్ణుని వినుతించుట | ... | ... | 358 |
| 70. శ్రీకృష్ణావతారకారణప్రశ్నము | ... | ... | 362 |
| 71. వ్యాసులు మునులకు భగవదవతారములఁ దెల్పుట | ... | ... | 367 |
| 72. భూదేవి బ్రహ్మకడకుంబోయి తనకష్టములను జెప్పుకొనుట | ... | ... | 369 |
| 73. మాయాదేవి దేవకీసప్తమగర్భమును రోహిణియందుఁ జేర్చుట ... | | ... | 374 |
| శ్రీకృష్ణావతారఘట్టము | ... | ... | 375 |

| అధ్యాయము. | | | పుట. |
|---|---|---|---|
| 74. కంసుఁడు బాలవధమునకై ప్రలంబాదుల నియమించుట | ... | ... | 378 |
| 75. మథురనుండి నందాదులు వసుదేవుననుమతిగోకులమున కేగుట | ... | ... | 380 |
| కంసునిపంపుగొని పూతనసంచరించుట | ... | ... | 381 |
| శకటాసురభంజనము | ... | ... | 383 |
| 76. గర్గమహర్షి శ్రీకృష్ణబలరాములకు నామకరణము చేయుట. | ... | ... | 384 |
| బృందావనగమనము | ... | ... | 386 |
| 77. కాళీయమర్దనము | ... | ... | 387 |
| నాగపత్నులు హరిని వినుతించుట | ... | ... | 393 |
| 78. తాళవనవిహారము | ... | ... | 394 |
| ప్రలంబాసురవధము | ... | ... | 397 |
| 79. ఇంద్రయాగముఁ జేయఁబూన శ్రీకృష్ణుఁడు నివారించుట | ... | ... | 399 |
| నందాదులు గోవర్ధనమును బూజించుట | ... | ... | 401 |
| 80. ఇంద్రుఁ డాగ్రహించి గోపకులపై వర్షముగురిపించుట | ... | ... | 402 |
| గోవర్ధనోద్ధరణము | ... | ... | 404 |
| 81. శరద్వేణుగానవర్ణనము | ... | ... | 407 |
| అరిష్టాసురుని శ్రీహరి వధించుట | ... | ... | 412 |
| 82. కంసుఁడు ధనుర్యాగము చేయంబూ[illegible] | | | 413 |
| కేశిదైత్య[illegible]ుట | ... | ... | 415 |
| [illegible]గోర్తికస్యుఁడు బృందావనమున కరుగుట. | ... | ... | 417 |
| ౮౩. అక్రూరుఁడు గోకులమున శ్రీకృష్ణదర్శించుట | ... | ... | |
| | | | 421 |
| 84. అక్రూరుఁడు శ్రీకృష్ణాదులతో సంభాషించుట | ... | ... | 425 |
| రథయమునాజలంబుల రామకృష్ణులంగాంచి యక్రూరుండు వినుతించుట | | ... | |
| | | | 427 |
| శ్రీకృష్ణుండక్రూరు ననునయించుట | ... | ... | |
| | | | 428 |
| రామకృష్ణులు రాజమార్గమున మథురంబ్రవేశించి రజకుఁజంపుట | | ... | |
| | | | 430 |
| 85. కుబ్జను శ్రీకృష్ణుఁడు చందనాదులయాచించుట | ... | ... | |
| | | | 431 |
| ధనుర్భంగము - కువలయాపీడగజవధము కృష్ణుఁడొనర్చుట | ... | ... | |
| | | | 435 |
| రామకృష్ణులు ముష్టికచాణూరుల వధించుట | ... | ... | |
| | | | 437 |
| కంసవధము | ... | ... | |
| | | | 439 |
| 86. శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవులతో సంభాషించుట | ... | ... | |
| | | | 441 |
| రామకృష్ణులు సాందీపనియొద్ద విద్యనభ్యసించుట | ... | ... | |
| | | | 443 |
| 87. జరాసంధుఁడు రామకృష్ణులతోఁ బోరియోడుట | ... | ... | |
| | | | 414 |
| 88. కాలయవనోత్పత్తిప్రకారము | ... | ... | |
| | | | 449 |
| 89. హరివలనవరములొంది ముచుకుందుఁడు తపంబునకరుగుట | ... | ... | |
| | | | 450 |
| బలరాముఁడు గోకులమునకరుగుట | ... | ... | |
| | | | 451 |
| 90 బలరాముఁడు వనమునవిహరించుట | ... | ... | |
| | | | 453 |
| 91. రుక్మిణీకల్యాణఘట్టము | ... | ... | |

అధ్యాయము. | పుట


| అధ్యాయము. | | పుట |
| --- | --- | --- |
| | ప్రద్యుమ్నచరిత్రము | 455 |
| 92. | రుక్మిణీపుత్త్రిచరిత్రము | 459 |
| | అనిరుద్ధజననము | 460 |


## చతుర్థాశ్వాసము.


| | | |
| --- | --- | --- |
| 93. | నరకాసురవధము | 462 |
| 94. | అదితి హరిని నుతించుట | 466 |
| | పారిజాతాపహరణము | 468 |
| 95. | పారిజాతముంగొని శ్రీహరిద్వారకానగరమున కేతెంచుట | 474 |
| | శ్రీహరి పదాఱువేవురుకన్యల వివాహమగుట | 475 |
| 96. | అనిరుద్ధచరిత్రము. | 476 |
| 97. | అనిరుద్ధుని బాణాసురుండు నిర్బంధించుట | 479 |
| | యాదవులు బాణునిపై దండెత్తిపోవుట | 481 |
| 98. | శ్రీహరి పౌండ్రకవాసుదేవుంజంపుట | 485 |
| 99. | దుర్యోధనుపుత్త్రికను సాంబుఁడపహరించుట | 489 |
| 100. | బలరాముఁడు ద్వివిదుఁడనువానరుంబొలియించుట | 493 |
| 101. | శాపమున సాంబుఁడు స్త్రీయయి లోహముసలమును గనుట | 495 |
| 102. | శ్రీకృష్ణుఁడు వైకుంఠమునకుంబోవుట | 501 |
| 103. | ఎనమండ్రు కృష్ణభార్య లగ్నిప్రవేశ మొనర్చుట | 502 |
| 104. | భగవదవతారదశకసంక్షేపవర్ణనము | 511 |
| | శ్రీకృష్ణచరిత్రసంగ్రహము | 522 |
| 105. | నరకానుభవప్రకారము | 523 |
| 106. | నానావిధపాతకవర్ణనము | 532 |
| 107. | నరకదుఃఖనివారణోపాయము | 542 |
| 108. | ధర్మము సర్వోత్కృష్టము | 548 |
| 109. | శుభప్రాప్తిప్రశ్నము | 554 |
| 110. | శ్రాద్ధవిధినిరూపణము | 557 |
| 111. | శ్రాద్ధఫలనిరూపణము | 563 |
| 112. | సపిండీకరణనిర్ణయము | 567 |
| | శ్రాద్ధార్హబ్రాహ్మణులు | 569 |
| | శ్రాద్ధానర్హబ్రాహ్మణులు | 571 |
| 113. | సదాచారప్రశంస | 576 |
| 114. | వర్ణాశ్రమధర్మములు | 590 |
| 115. | అనాచారస్వరూపఫలములు | 595 |

| అధ్యాయము. | | | | పుట. |
|---|---|---|---|---|
| | శూద్రజాతిధర్మవిశేషములు. | ... | ... | 597 |
| 116. | సదాచారప్రశంస | ... | ... | 599 |
| 117. | స్వర్గప్రాప్తినరకప్రాప్తికారణములు | ... | ... | 604 |
| | దుఃఖకారణము | ... | ... | 607 |
| 118. | వాసుదేవమాహాత్మ్యము | ... | ... | 609 |
| 119. | శ్రీకృష్ణపూజాఫలము | ... | ... | 613 |


## పంచమాశ్వాసము.


| | | | | |
|---|---|---|---|---|
| 120. | ఏకాదశీమాహాత్మ్యము | ... | ... | 616 |
| 121. | భాస్కరాదిదేవతారాధనక్రమము | ... | ... | 627 |
| | ఆగ్నీధ్రరాజవృత్తాంతము | ... | ... | 629 |
| 122. | మహాప్రళయవర్ణనము | ... | .. | 635 |
| | కలిస్వరూపవివరణము | ... | ... | 636 |
| 123. | యుగాంతస్వరూపనిరూపణము | ... | ... | 642 |
| 124. | ప్రాకృతప్రతిసంచరకథనము | ... | ... | 650 |
| 125. | ,, | ... | ... | 653 |
| 126. | ఆధ్యాత్మికతాపస్వరూపము | ... | ... | 656 |
| | నరకదుఃఖములు | ... | ... | 659 |
| 127. | యోగమాహాత్మ్యము | ... | ... | 661 |
| 128. | సాంఖ్యయోగనిరూపణము | ... | ... | 664 |
| 129. | మోక్షప్రాప్తిమార్గము. | ... | ... | 670 |
| 130. | విశిష్టధర్మనము | ... | ... | 677 |
| | మోక్షోపాయము | ... | ... | 680 |
| 131. | యోగసాంఖ్యమతజ్ఞానులకాచరింపఁదగినధర్మములు | ... | ... | 682 |
| 132. | మోక్షము దుర్లభంబని వ్యాసుఁడుచెప్పుట | ... | ... | 684 |
| | దేహాస్థితపంచదోషవివరణము | ... | ... | 686 |
| 133. | వసిష్ఠకరాళజనకసంవాదము | ... | ... | 699 |
| 134. | నానావిధసంసారప్రాప్తిప్రకారణము. | ... | ... | 694 |
| 135. | అర్థజ్ఞానశూన్యులకు వైయర్థ్యము | ... | ... | 707 |
| | యోగప్రకారము | ... | ... | 701 |
| 136. | విద్యావిద్యాస్వరూపకథనము | ... | ... | 703 |
| | సాంఖ్యయోగాభేదతత్త్వము | ... | ... | 709 |
| 137. | అజునకునానాత్వకథనము | ... | ... | 711 |
| 133. | బ్రహ్మపురాణశ్రవణఫలము | ... | ... | 717 |


---



శ్రీరస్తు.

శ్రీపరమేశ్వరాయ నమః.

# తెలుఁగు బ్రహ్మపురాణము.

## దేవతాదిస్తుతి.



రామాకృతి యంచు శంభుఁ డనుచున్ శ్రీదేవి నా నొప్పు లో
కారాధ్యాంఘ్రిసరోజ యౌ లలితయే యంచున్ గుమారుం డనం
గా రాజిల్లెడుషణ్ముఖుం డనుచు భక్తవ్రాతము ల్గొల్వఁ దే
జోరూపంబున మించు వేంకటగిరీశుం గృష్ణుఁ గీర్తించెదన్. 1

చ. వరణ ముహాటకాత్మకము భాసిలఁగాఁ గరుణాతరంగభా
స్వరహృదయాంబుజం బలర భవ్యమహాద్భుతతేజ మొప్పఁగా
సరసిజపీఠసద్మ యగు సారసవర్ణమనోహరాంగి యై
నిరుపమశక్తివెల్గు జననిన్ వరలక్ష్మిని గొల్తు భక్తితోన్. 2

మ. తనమాహాత్మ్యము వేదరాసులు తదంతంబుల్ వచింపంగ లే
క నమస్కారముచేయ బ్రహ్మముఖలేఖశ్రేష్ఠు లో దివ్యరూ
ప నతార్తిప్రశమైకదీక్ష కరుణాపాథోధి యంచున్ నుతిం
ప నిజాత్మం దిలకించుశంకరుఁ డొగిన్ భద్రంబులం గూర్చుతన్. 3

చ. మనసున సాధుకామమయ మంజులరూపముఁ దాల్చి వాక్కునన్
వినుతతమైకసత్యమయ విగ్రహ మొంది చరించుచున్ సనా
తనపద మీయఁ జాలి సుర తల్లజవందితపాదపద్మ యై
యనుపమదివ్యతేజమునఁ నంతట గన్పడునంబఁ గొల్చెదన్. 4

మ. కరపద్మంబున దివ్యనాదమయ మై కన్పట్టు మాణిక్యవీ
ణ రమాధీశముఖామరప్రతతి నానందాంబుధిన్ ముంప శ్రీ
పురనీపక్షితిరుట్సమావృతమహా మోదప్రదాస్థానసు
స్థిరసింహాసనసంస్థితిన్ వెలయు మంత్రిణ్యంబ ధ్యానించెదన్. 5

ఉ. కోరిక మీఱ నామదిని గొల్చెద సాంగము లైనవేదముల్
సారతరార్థ మౌనుపనిషత్సముదాయము తెల్పలేని గం
భీరమహత్త్వ మొప్ప మునిబృందము గొల్వ విరించిముఖ్యబృం
దారకనాథు లెన్నఁదగుతల్లిని శ్రీశివకామసుందరిన్. 6

మ. శ్రుతులాస్యంబులనుండి వెల్వడుచు సృష్టుల్ పూర్వ మిట్లయ్యె నం
చితమార్గం బిదె యంచుఁ దెల్ప విని తత్సిద్ధాంతరీతిన్ మనో
జ్ఞతమంబౌ కరణిన్ సృజించి మునులన్ సత్యంబుఁ గాపాడు న
ప్రతిమానాత్మబలంబునన్ వెలయు నాపద్మోద్భవుం గొల్చెదన్. 7

చ. అరుదుగ వాగ్భవస్మరపరాహ్వయబీజమనోజ్ఞమూర్తి యై
గురుకరుణాబ్ధి యై కవులకున్ నిధిరూపిణి యై యుపాసకో
త్కరమున కాదిశక్తియయి కంజజువాక్కున నిల్చి పొల్చు సుం
దరి మది నిల్పి కొల్తుఁ బ్రమదంబు చెలంగఁగ వాగ్విశుద్ధికై. 8

మ. పరిశుద్ధస్ఫటికాభ మై విమలశోభాస్ఫూర్తివర్ధిల్లి సుం
దరమౌ విగ్రహ మొప్పఁగా సమయతంత్రజ్ఞానసంపత్సుధీ
వరహృత్పద్మనివాసతన్ వెలసి భాస్వత్కీర్తిదం బై తగన్
సురసంపూజిత యైనవాగ్వనని నిల్చుం గాక నావాక్కునన్. 9

మ. సురకార్యార్థము విఘ్నయంత్రము మహాశూరత్వ మేపారఁ ద్రుం
చు రతిన్ గుంజరవక్త్ర మూని యసురేశుల్ చూచి యాశ్చర్య మొం
ద రయం బొప్పఁగ దానిఁ జెండి లలితానవ్యప్రమోదాప్తుఁ డౌ
కరుణాంభోనిధి విఘ్ననాథుఁ డొసఁగుం గళ్యాణసంపత్తులన్. 10

మ. సతతం బారఘునాథపాదకమలాంచచ్చిత్తరోలంబుఁ డా
శ్రితరక్షాపరతంత్రుఁ డుత్తమబలాక్షీణప్రతాపుండు స
న్మతి దీనావనసంతతాదరుఁడు జ్ఞానక్షీరవారాశి యి
చ్చుత దీర్ఘాయువు సత్కవిత్వము మరుత్సూనుండు నాకాదృతిన్. 11

## గురుస్తుతి.

క. శ్రుతిహితుఁడు సర్వతంత్ర,స్వతంత్రుఁ డంబాపదాంబుజద్వయవిలస
న్మతి భృంగుఁడు రాజ్ఞీసం,తతిభవనరసింహయజ్వ ధ్యానింతు గురున్. 12

క. శ్రుతిచతుగపారంగతు, నతులితధీమహిము సన్మహము శిష్యులనా
దృతిఁ బ్రోచు చతురుఁ గొల్చెద, మతి వేంకటరామనామ మహార్తమణిన్.

చ. అని యిటు లిష్టదేవతల నార్యులదేశికులం దలంచి రా
మునిచరితంబుఁ గావ్యముగ భూమి నెసంగఁగఁ జేసినట్టి స
న్ముని మొదలైనసత్కవిసమూహము భక్తిని సంస్మరించుచున్
దెనుఁగున భారతాదిసుకృతిప్రజనిర్మితి మించుధీరులన్. 14

క. కాలత్రయమందును శిర, మోలిఁ దదంఘ్ర్యంబుజములయొద్ద నలరు న
ట్లాలోచించుచుఁ దలఁచెదఁ, జాలన్ నిర్మలకవిత్వసరణి లభింపన్. 15

క. పాకము రీతియుఁ దగున, ట్లే కమ్రకవిత్వశక్తి యేమార్గమునన్
జేకూఱదు తత్స్మరణం, బేకాగ్రమనంబునందు నెసఁగక యున్నన్. 16

ఉ. కానఁ ద్రిలింగదేశమునఁ గల్గినభాషను సత్కృతుల్ సుధీ
మానసరంజనంబులుగ క్ష్మాస్థలిపై సతతంబు నిల్పి పెం
పూన నొనర్పఁ బూనిన మహోత్తమపూర్వకవీంద్రసన్నుతిం
దా నొనరింపఁగావలయుఁ దప్పక శ్రేయము గల్గు దాననే. 17

క. నూతనపద్ధతు లివిగో, చేతోముద మొందునట్లు చేయుననుచు వి
ఖ్యాతి గణింపంగోరిన, వీతజ్ఞానులు వచింత్రు వేయివిధములన్. 18

క. యతు లేల ప్రాసముల సం, గతి నేమిఫలంబు రసము కాఱఁగఁ బూన్కిన్
గృతు లల్లఁజాలదే యని, మతిహీనులు పల్కుచుంద్రు మానక సభలన్. 19

తే. అట్టి కొఱగాము లార్వంగ నదరిపడక
మ్రుక్కడులయూహ లివి యని చక్కఁదలఁచి
యించు కంతయు నవ్వాని నెంచ కెలమిఁ
గృతుల సత్పథమునె యూని యింపుగులుక. 20

క. ఒనరింపఁదగున దెవరే, మనుకొనినం గొదువయేమి యార్యులు లేరే
మనమలర మెచ్చుకొన నూ, తనమార్గాశ్రయులు బుద్ధ్యదప్రతిమానుల్. 21

చ. ఒకఁ డొకదారిచూపఁగ మఱొక్కఁడు వేఱొకదారిఁ ద్రొక్కు దా
నికి నొకఁ డీర్ష్యఁబూని దననేర్పు బయల్పడఁజేయు వానిపై
నొకరుఁడు ప్రక్కబల్లెముగ నొప్పెఱుఁగండితఁ డింతయేని దాం
భికుఁ డనువాదవజ్రము గుబేలున వ్రాలఁగఁజేసి యార్చెడున్. 22

చ. ఎవరికి నేది తోఁచునొ యదే జగమెల్లను నావరింపఁజే
యవలయు నన్నభావములె యంతట నెప్పుడు కల్గుచుండఁగా
నెవరికి వారె పెద్దలుగ నేర్పడు టబ్రమె వారియాశయం
బవని ఫలించు టెట్టులొకొ యాజగదీశ్వరుఁడే యెఱింగెడున్. 23

క. తల కొకవ్యాకరణంబుగ, నిలఁబర్విన భాష యెట్లు హితగతి నిల్వం
గలదో యెఱుంగంజాలను, దలమే యాభాష నెన్న ధాతకు నైనన్. 24

క. జ్ఞానప్రదాత్రి భాషయె, కానన్ జనయిత్రికంటె గౌరవపదమం
దానిర్మలాంగి నుంచుట, సూనులకున్ ధర్మ మదియె శుభము లొసఁగెడున్.

చ. జనని మనోజ్ఞశబ్దముల సంస్తవముల్ పచరించి సాధుపు
ష్పనికరవస్త్రరత్నమయచారువిభూషణభూషితాంగిఁగా
నొనరిచి భక్తిభావమున నుద్ధతి మాని భజించు టెన్న నొ
ప్పినపని దాన నాజనని ప్రీతిని గాంచును బెంచు సూనులన్. 26

చ. విరహితశాస్త్రపద్ధతిని వేమఱు తోఁచినయట్లు శబ్దముల్
సరసమతుల్ సెబా సనఁగఁజాలక మోములు వంచి దీనులై
పరిపరిచింతఁగుంద బహుభంగులఁ గూర్చుచు మాతృసేవ యే
పురుషుఁడు చేయఁబూను నిలఁబొందఁడు వాఁడు యశంబు శర్మమున్. 27

ఉ. భావము తెల్పుటే యగును భాషకు సత్ఫలమండ్రు కొంద ఱా
భావమె తెల్పుమార్గములు భవ్యములై రసికాదృతిం గనం
గావలయున్ దురుక్తులకుఁ గన్నదియే మది నేవగించెడుం
గావునఁ దోఁచినట్లు పదకల్పన యొప్పని యెంచరా దిలన్. 28

క. మనమాటకుఁ గొందఱు సరి, యనువారలు గలరటంచు నాత్మఁ దలంపం
జనునే సరసుం డొకఁడై,నను మెచ్చిన యదియె పల్కనం జనుఁగాదే. 29

ఉ. కాల మపారమం దొకఁడు కల్గఁడె చక్కనిభాష నొప్పుగ్రం
థాళిఁ బఠింపఁగాఁ దలఁచు నార్యుఁడు సాధుసమాదృతిం గనం
జాలునయేని యయ్యదియె సత్ఫల మాకృతి కంచుఁ గర్తయే
వేళఁ దలంప నోఁ గుమతిబృందము మెచ్చక యున్న నేమి యూ. 30

చ. అని తలపోసి దేవతలయాదృతిపాత్రులు సత్యవాగ్రతిం
గనినమహానుభావులు వికత్థనము ల్పలుకంగనోడు స
జ్జనులు సుమార్గమే యెపుడు సంశ్రయణార్హ మటంచు నెంచుపా
వనమతు లేవిధంబుగను వర్తిలిరో యటు లుండ నెంచితిన్. 31

ఉ. నన్నయ తిక్కనాదికవినాథులు చూపినసాధుమార్గమే
యెన్నఁగ నాశ్రయింపఁదగి యెల్లవిధంబుల నొప్పియుండు నా
కన్నిఁటశ్రేయ మీయఁదగు నంచు మనంబున నిశ్చయించి వి
ద్వన్నుతమాఁ దదుక్తపదవార మటంచుఁ దలంచి పూనికన్. 32

ఉ. వారలసత్ప్రయోగములవైఖరి నాదట సంగ్రహించి యే
వారికినేని మెచ్చఁదగు బ్రహ్మపురాణము తెన్గుచేయఁగాఁ
గోరితి వేంకటాద్రిపతిఁ గోర్కెలపంటఁ గృతీశుఁజేసి ప
త్సారసయుగ్మసేవయె యజస్రము నా కిడు మంచుఁ గోరుచున్. 33

క. తెనిఁగింపఁ బూనినాఁడను, మనమున నేశంక లేక మాధవమహిమా
ర్థనిచయగుంభితమీయది, యనుపమ ముక్తిప్రదంబు ననునమ్మికచేన్. 34

ఉ. భారతముఖ్యసాధుకృతివారముఁ జక్కఁబఠించి యందుఁ జె
ల్వారెడుసత్ప్రయోగముల నారసి పాండితిఁ గాంచి మించు న
వ్వారలు దీనఁ గల్గుగుణవారము దోషగణంబు నెన్నఁగా
నేరుతు రట్టికోవిదుల నేఁ గొనియాడెద నెల్లవేళలన్. 35

చ. ఇతరులు తప్పు లివ్వి గుణ మిందొకఁడైనను లే దటంచు ను
ద్ధతిఁ బలుకంగ నేకొదువ దానఁ బొసంగదు తజ్ఞులార! స
మ్మతిఁ గయిమోడ్చి వేఁడెదను మామకదుష్టపదప్రయోగముల్
హితమతి దిద్ది కావఁదగు నేల యుదారుల నింత వేఁడఁగన్. 36

క. భారతకర్తలకే కల, వారయఁగఁ బ్రమాదను లిఁక నల్పజ్ఞుఁడనై
యీరీతి గవితనల్లున, సారజ్ఞున కవ్వి యునికి సహజముకాదే. 37

ఉ. తప్పులుపట్టువారికృతిఁ దప్పులె పెక్కులు కానవచ్చు న
ట్లొప్పులు చూపువారికృతి నొప్పులె కన్పడుచుండుఁ గాన నే
రొప్పుగుణంబులే వెదుక నూహ యొనర్చుట మేలుమే లటం
చొప్పుగఁ బల్కుసాధుకవు లుర్విఁ జెలంగుదు రొక్క కొందఱే. 38

క. వారలపదపద్మరజం, బారూఢిగఁ దలను దాల్చి యాంతరరజముల్
దూరమగు నన్నమ్మిక, నీరమ్యపురాణరత్న మిట్లు తెనుఁగునన్. 39

ఆ. పూర్వకవులవయిన పోలికల్ వదలక, కథను వదలకుండఁగా రచించి
నాఁడ వేంకటాద్రినాథున కతిభక్తిఁ, గాన్క పెట్టుతలఁపుఁ గాంచినాఁడ. 40

సీ. దేవతాభాషను దెలుఁగున నాంగ్లంబునందును బాండిత్య మంది మిగుల
రెండుబాసల సుధీమండలమౌననఁ గవితచెప్పెడు నేర్పుగలిగి భక్తి
రసము చిప్పిలుచుండ గ్రంథముల్ రచియించి పరిమళోల్లాసమన్ ప్రథితనామ
మలరంగఁ బారిజాతాపహారణ మను తెలుఁగుకబ్బమునకు లలితరీతి
తే. వ్యాఖ్య యొనరించి శాస్త్రోక్తవర్తనమున
మెలఁగు శ్రీనాగపూఁడి సత్కులజనితుఁడు
రామకృష్ణశర్మ యనంగ రహిఁ దనర్చి
పరమశివభక్తుఁడై యశస్స్ఫురణ మొప్ప. 41

క. నేమమున నలరి కుప్పు,స్వామయ్య యనంగఁ బిల్వఁబడుచు వెలయు నా
భూమీసురనేత కృతి,స్వామిని నిర్ణయముసేయ సమ్మతిఁ గనుచున్. 42

క. కరుణావారాశిపరమ, పురుషార్థప్రదుఁడు మౌనిపూజితుఁడు రమా
వరుఁ డీద్యుఁడు శేషాద్రీ,శ్వరుఁ డీకృతి కన్యకుఁ దగుస్వామి యటంచున్. 43

క. మనమునఁ దలంచి స్వప్నం,బునఁ బ్రత్యక్షమున వేఁడఁ బూననిలక్ష్మీ
శుని బ్రహ్మాండేశ్వరుఁ గృతి, కనకాంగికిఁ బతిని జేయుకాంక్ష మెఱయఁగన్ 44

సీ. అద్భుతశృంగారహాస్యాదినవరసంబుల నుగ్గుఁబాలతోఁ గలిపిపోసి
సదమలాలంకారసంగతిఁ గైచేసి పాకపద్ధతి నేర్పి ప్రౌఢఁజేసి
శయ్యాలరీతులఁ జక్కఁగా సవరించి సుగుణరత్నాళిచే సొంపు గూర్చి
భావగాంభీర్యంబుఁ బట్టుత నొందఁగఁ బెంచి గతివిశేషంబులఁ గ్రాలఁజేసి

ఆ. కృతికుమారిఁ బ్రీతి నతిభక్తి శ్రీవేంక,టాద్రిపతికి దేవతాధిపతికి
సత్కృపాజలధికి సర్వలోకావనా, దృతికి నిచ్చినాఁడ నిది తగునని. 45
తే. వర్ణసంశుద్ధి మిక్కిలి వఱలి చారు, సుగుణమణిభూషణంబుల సొంపుఁ గాంచి
వాసనాతిశయంబున భాసురయయి, వెలయు నీకన్యఁ గొనుమీశ వేంకటేశ.
క. దీనికిఁ బ్రతిఫలముగ నో, మౌనీంద్రసుతాంఘ్రిజలజ మామకచిత్తం
బెనెలవున నీదాస్యము,నే నిండినభక్తిఁ గోర నిమ్ము వరమ్మున్. 47
తే. ఇట్టి నీపదదాసుఁడ నేతపంబుఁ, జేయుజాడ లెఱుంగను జిత్తశుద్ధి
లేనివాఁడను దయ నేలుమా నిరంత,ర మ్మికన్ విను నాదువంశమ్ము సుంత.48

## కవివంశక్రమము.

సీ. ఆంధ్రదేశమునకు యామ్యభాగంబున శ్రీశైల ముత్తరసీమగాఁగఁ
గాంచీపవిత్రనగరము దక్షిణభాగమున నుండఁగాఁ దెలుంగనెడు పేరఁ
బరఁగుదేశం బొండు భాసిల్లు నిదియె త్రైలింగాఖ్యదేశం బనంగ వెలయు
నందుఁ బినాకిని యనుమహానది యొప్పు దానికిఁ జెంతనె దక్షిణమునఁ
తే. దనరుఁ గలువాయ యనుపురతల్లజంబు, నాదుజన్మస్థలంబయి నలువుమీఱు
దానికిం బశ్చిమాశను దగును గడప, యనెడునగరంబు పంచయోజనములందు.
క. ఆమండలమున వేంకట,రామపురం బనెడు నొక్కగ్రామము తగు సు
త్రామోత్తరదిక్సంధిని, ధీమన్నివహాఢ్య మగుచు దివిజపురమునాన్. 50
సీ. కలువాయఁ బాసి యేకారణంబుననొ నాపూర్వులాగ్రామంబు పొందు గోరి
వచ్చి వసించిరి వాసార్హమై యది యగ్రహారం బౌట నవని దివిజ
వంశపూర్ణం బయి భాసిల్లు జనమంచివారన మాయింటిపేరువారు
తనరుచుందురు, వేదతత్త్వ మెఱింగిన సూర్యనారాయణసోమయాజి
తే. యలరు నాప్రపితామహుఁ డతనిపత్ని
యచ్చమాంబిక వారికి నిచ్చమీఱ
సంతతియె లేకయుండి యీశ్వరకటాక్ష
మున జనించెఁ గుమారుండు వినయధనుఁడు. 51
క. కృష్ణయజుర్వేదంబున, నిష్ణాతుం డగుచు ధర్మనియతిని స్వాంతం
బుష్ణకిరణపాదార్చన, విష్ణుధ్యానాభిరక్తి వెలయఁగ నలరెన్. 52
ఆ. వివిధనియమములను విలసిల్లి వేంకటే,శావధాని యనఁగ నాతఁ డొప్పెఁ
దత్కళత్ర మవని ధర్మమతిన్ సాధ్వి, యగుచు నెసఁగెఁ జేరమాంబ యనఁగ.
క. ఆయిరువురకున్ ధిషణ, ప్రాయులు పుత్త్రికలు మువురు ప్రభవిల్లి రొగిన్
న్యాయవిదుత్తము లై హిత, ధీయుతు లై సాధుజననుతిన్ మించి రిలన్. 54
క. అం దగ్రజుండు శంకర,సుందరపాదారవిందశుంభచ్చిత్తం
డిందిరుఁడు వేదశస్త్రా,నందుఁడు శాంతాదిసద్గుణగణధనుండున్. 55

సీ. కాశ్యాదిసత్క్షేత్రగణదర్శనాదరుఁ డగుచు సుబ్రహ్మణ్యుఁ డనెడుపేరఁ
బిలువంగఁబడును దత్ప్రియసోదరుఁడు శేషయాఖ్యుఁడు ధర్మశాస్త్రాళి నెఱిఁగి
యామ్నాయముఁబఠించియలరుఁదత్సోదరుండగుసుబ్బయాహ్వయుండాత్రయం
నందు ద్వైతీయీకుఁ డగుశేషయార్యుండు సంతానహీనుఁడౌ జ్ఞాతికీయఁ [బు
తే. బడఁగఁ గలువాయయందె నివాస మమరె
నతని కొక్కతనూభవుఁ డార్యభక్తుఁ
డుదయమందె; శేషాఖ్యసహోదరుండు
సుబ్బయార్యుఁడు వటు వయి చొచ్చె దివిని 56
క. నాతండ్రి సాధునియతిన్, ఖ్యాతిం గని భర్తృపాదకమలయుగళసే
వాతతభక్తిం గని తగు, నాతిం గామాక్షి యనెడు నయగుణనిలయన్. 57
తే. పెండ్లియాడె నాదంపతుల్ ప్రియము మీఱఁ
బుత్త్రికల నిర్వురను మఱిపుత్త్రులను ము
వ్వురను గాంచిరి; తొలిపుత్త్రి నిరుపమసుగు
ణాభిమండితయయి శీల మమర వెలసి. 58
సీ. సుబ్బమాంబిక యనుశుభనామమును గాంచె నన్నపూర్ణమ్మనా నామె యనుజ
యలరె నవ్వలివార లగుసుతు లిద్దఱు నవషడబ్దవయస్సు నవ్యభవ్య
సుందరరూపముల్ శోభిల్ల నుండంగ నమ్మవారనుపేర నవనిఁ బరఁగు
వ్యాధి యొక్కఁడు సోఁకి వారల నిద్దఱ రేపట మాపట రూపడంగ
తే. జేసె; నప్పటికే నవమాసపరిమి,తముగు బాల్యంబుగలవాఁడఁ దల్లి సుంత [య.
యూఱటం బొంద నా వ్యాధి నొందియును బ్ర,దికితిమాతులగృహమునదేవునిద
చ. తనయల నన్ను నీముగురఁ దాఁ గని నాజనయిత్రి ప్రాణముల్
తనువున నిల్పఁజాలెనఁట తప్పవుగా విధిచేష్ట లంచు నె
మ్మనమునఁ దోఁప మే మచట మాతులగేహమునందె యెంతయున్
వనటఁ గృశించుమాతయును వాసముచేసితిమంట యెట్టులో. 60
చ. జనకుఁడు జ్ఞానియౌట విధిసమ్మతకార్యము తప్ప దింతయున్
దనయలు నిర్వురీసుతుఁడుఁ దక్కిరి చాలునటన్న యూఱటన్
గని యలయగ్రహారమునఁ గాపుర ముండెను గొన్నివర్షముల్
జనకునియింటనుండి నిజసద్మముఁ జేరెను దల్లి యంతటన్. 61
చ. కొలఁదిదినంబు లేగ ననుఁ గూరిమిఁ బెంచెడుతల్లినెమ్మదిం
గలిగెఁ దలంపు నన్ వటువుగా నొనరింపఁగఁ దండ్రి యిప్పు డీ
తలఁపు గొనంగ నేల? యని దానికి సమ్మతిఁ జూపఁడయ్యె నం
దుల కిసుమంతచింత మదిఁ దోఁచెను దల్లి కదెట్లొ దుర్విధిన్. 62
చ. బ్రదుకుట దుర్లభం బగుట బాలుని వేఱొక మాటపల్కు కీ
యదనున విప్రతన్ వెలయునట్లొనరింపుఁడు నాఁగఁ దండ్రియున్

బదియుఁ బదాఱునాళ్లకె యభంగగతిన్ జతనంబుచేసి మా
తదయినకోర్కెఁ దీర్చె మదిఁ దల్లడపాటొదవంగ నెట్టులో. 63
ఉ. ఆఱవయేఁడు నాజనన మాదిగ నప్పు డెసంగె నంత యే
యూఱటలేక నాజనకుఁ డుండఁగఁ గార్తికి కాఖ్యమాసమే
కాఱియఁ బెట్టఁ బూని యొడికంబున వచ్చెను; నన్నుఁ బెంప నే
మాఱనితల్లి జ్యేష్ఠసుతమాటను దాఁటక పంపె నానెలన్. 64
సీ. కార్తికంబు శుక్లం బనుపక్షంబునందును బదియవ దగుదినంబు
రానున్నతఱి జ్వరార్తయెయగు నామాత పిలువనంపఁగ నేను బితనుగూడి
యింటికిఁ బోవఁగ నించుకయేఁ బల్కఁజాలనిస్థితి నుండె జనని నాఁడె
మత్కరతలమున మస్తకం బిడి నాదుమోముఁ జూచుచుఁ బ్రాణములను వదలె
తే. నంత నాతండ్రి తద్విరహార్తుఁ డగుచుఁ, గాశికింబోయె నన్నప్డు కనికరమునఁ
జిన్నితోఁబుట్టువయి యున్నయన్నపూర్ణ, చేరఁదీసి యాదృతిని బోషించెమిగుల.
క. నను సోదరికంటెను ప్రీతిని బ్రోచెను బావ యగుచు దీవ్యత్ఖ్యాతిం
గన మించెడు రామార్యుం, డనుకంపాంబుధి యనంగ నర్హుం డతఁడౌ. 66
క. చిరకాలము శ్రీకాశీ,పురమున నివసించి యందుఁ బొదలుబుధులయా
దరమునకుం బాత్రుండై, యరుదెంచెను నాదుజనకుఁ డాత్మజులఁ గనన్. 67
చ. కొలఁదిదినంబు లుండి నను గోమునఁ బెంచెడుతండ్రి యొన్నొ వి
ద్యలఁ జదివించువాంఛఁగొని యప్పుడ తోడ్కొని సాధుపండితా
వళుల నెసంగు నీకడప వైళము చేరిచి తీర్థయాత్రపైఁ
జెలఁగెడు వేడ్కఁబోయెఁ బురిఁజేరిననేఁ జదువంగఁ బూనితిన్. 68
సీ. పదునొకొండవయేఁటఁ బరదేశవాసంబు గలిగిననాటలఁ గాలమేగ
కుండఁ బఠించుచు నుండఁ గాశికిఁ బోవు వాంఛ గల్గెను దానఁ బయనమైతి
బైరాగులే తోడుపాటు చూపఁగఁ గాలినడకచే వర్షముల్ నాల్గుత్రోవ
యందె చెల్లెను గాశియందును గొన్నివత్సరములుచదివి విజయనగరము
ఆ. నందుఁ గసిమికోటయందును శ్రుతినేత్ర,మును బఠించి సాధుజనులకృపకుఁ
బాత్రుఁడనయి దైవభక్తి గల్గెడుమార్గ,ములను తెలిసి యోగముల గ్రహించి.
క. జనులను యాచించి ధనార్జన మొనరుపఁ జాలకెట్లొ సంస్కృతి సాగిం
పను నాంగ్లపాఠశాలను, దెనుంగుపండితుఁడనై విధిం జక్కంగన్. 70
క. ఒనరించుచు హాలాస్యం,బనునామమునం జెలంగునట్టి మధురదా
ఘునమహిమముఁ దెల్పుకృతిం,బొనరించితి స్కాందమునను బొల్చెడునదియున్.
క. లలితోపాఖ్యానంబును, లలితాంబాదివ్యకృప చెలంగు ననెడికో
ర్కులఁ దెన్గుచేసినాఁడను, బలుకుల నదె యొనరఁజేయుఁ బావనములుగన్. 72
సీ. బ్రహ్మాండ మనెడుపురాణంబుఁ దెనిఁగించి వేంకటాచలపతి విభునిఁజేసి
రామాయణంబు సర్వంబు వ్యాఖ్యానార్థములతోడ వచనంబు కలియకుండఁ

తెనిఁగించి రామచంద్రుని గృతీశుని జేసి వివిధపురాణముల్ వెదకి వెదకి
శ్రీకృష్ణు నవతారసిద్ధతత్త్వంబెల్ల వచనరూపంబున వ్రాసి కృష్ణు
తే. నధిపతిగఁ జేసినాఁడ నయ్యాదియుఁ బేరఁ, దనరుఁ గృష్ణావతారతత్త్వం బనంగ
నపుడె తెనిఁగింపఁ బూనితి నమలకథల, నలరు బ్రహ్మపురాణమ్ము నాదిమమని. 73
క. ఈనడుమ నేనొనర్చిన, నానావిధకృతులఁ బేర్కొనఁగ నేల మరు
త్సూనువిజయాదికములని, వానిం దలపోయఁ దగును భవ్యమనీషుల్. 74
తే ఢిల్లికిని ఢిల్లియే సాటి పల్లి కల్ల, పల్లియే సాటి యనునుడి పరఁగియుండు
సత్కవుల గ్రంథముల కిద్ది సాటి యగునె, శక్తికొలఁదిని వ్రాసితి సాధులార! 75
క. నను దాండవకృష్ణుం డని, యును మఱి శేషాద్రి యనియు నొగిఁ బిల్చిరి శ్రీ
తిని జనకాదులు తొలిదా, నిని గ్రంథమె తెల్పుచుండు నియతి మెఱయఁగన్.
క. రెండవదౌ నామము భూ, మండలమున నెగడు నిట్లు మామకచరితం
బుండును దెల్పితిని గృతీ, శుండగు శ్రీవేంకటేశు శుభసన్నిధినిన్. 77
తే. ఇట్టి శేషాద్రిశర్మ నానిలను బిలువఁ, బడెడు నే నీపురాణంబు బ్రహ్మనామ
కమును దెనిఁగించి శ్రీశివకామసుంద, రిని బరాంబను గొలిచి విరించి సతిని. 78
క. మనమున నిడుకొని యెటొ తోఁ, చినమాడ్కిని వ్రాసినాఁడ శిష్యుం డని న
న్నును మన్నింపంగాఁ దగు, ఘనకరుణావార్ధు లగుసుకవు లెల్లెడలన్. 79
క. కరిముఖషణ్ముఖపద్మజ, హరిహరవాణీరమాంబి కాదిత్యుల సు
స్థిరభక్తిని మదిలో నన, వరతము భజియింతు నిష్టవరము లొసంగన్. 80
క. కమలభవకమలలోచన, కమలారివతంసరూప కరుణాంబునిధీ
విమలతపోయుతమానిహృ, దమలకమలవాస వేంకటాద్రినివాసా. 81
క. శక్తిధర శక్తిసోదర, శక్తికలిత దివ్యరూప శశ్వన్మూర్తీ
భక్తజనార్తినిరసనా, సక్తహృదబ్జాత శేషశైలనివాసా. 32
క. ఆర్తత్రాణపరాయణ, కీర్తి రమానిలయ శేషగిరివాసరతా
మూర్తిత్రయాత్మకతను, స్ఫూర్తి విభవరత్నహార సుందరమూర్తీ. 83
క. ఇలలోఁ గొలువంబడు వే, ల్పులలో మిన్నయగు వేలుపుం జందురు దా
పలు దెఱఁగుమణులతొడవుల, విలసిలు నెమ్మేనివేల్ప వేంకటరమణా. 84
క. వేంకటరమణా నతజన, సంకటహరణా వృషాఖ్యశైలవిహరణా
పంకహరణాతినిపుణా, పంకజలావణ్యహరణ భాస్వచ్చరణా. 85
క. సర్వమతస్థులనరు లం, తర్వాణులు మూఢు లవనినాథు లనాథుల్
సర్వులు గొలిచెడు దేవసు, పర్వవినుత వేంకటేశ పావననామా. 86
క. అనుచుం బ్రార్థించి రమే, శునిమామకహృద్బిసప్రసూనమయమహా
సనమున నాసీనుం జేసి నియతి నీసాధుకృతిని జెందినభక్తిన్. 82
క. సురగరుడోరగనరకి, న్నరనికరస్తుత్యచరణనళినయుగునకున్

సరసీరుహదళనేత్రున, కురునానారత్నహారయుతగాత్రునకున్. 88
వ. అంకితంబుగా నారచియింపఁబూనిన తెలుఁగుబ్రహ్మపురాణరత్నంబునకుఁ గథా
ప్రారంభం బెట్టి దనిన 85

## మొదటి అధ్యాయము.

### కథారంభము.

క. శ్రీమన్నారాయణునకుఁ, దామరసాత్మునకు మనుజతల్లజుఁ గనగా
సీమహిఁ దగునరమునికిఁ బి,తామహావల్లభకు శారదాదేవికినిన్. 1
చ. వరుస నమస్కరించి తరువాత జయంబును గోరఁగాఁ దగున్
నిరుపమసత్ప్రకాశుఁ డయి నిశ్చలుఁడై తగు నే మహాత్మునుం
డి రహిఁ దనర్చి మాయ యని నిశ్చయరీతిని జెప్ప నౌ జగం
బరయ సమస్త మీయది యహా యనఁ బుట్టి వెలుంగుచున్నదో. 2
క. ఎవ్వనియందుఁ జెలంగెడు, నెవ్వనియందున్ విలీనమే యగులయమం
దెవ్వనిమహిమమున మరల, నివ్విధిఁ గల్పాదులందు నెసఁగింపఁబడున్. 3
తే. మునుల దెవ్వని ధ్యానించి మోక్షపదము
విరహితజగద్భ్వజంబును స్థిరముఁ బొందు
వారొ పురుషోత్తముని నిర్వికారు నమలు
నతని నిత్యుని విభుఁ గొల్తు నాత్మ సతము. 4
చ. మునులు సమాధియోగమున ముక్తిదు నంబరసన్నిభున్ గృపా
వననిధి సుప్రసన్ను భవబంధవిమోచనకారణున్ శుచిన్
ఘనమగుధ్యానయోగమునఁ గన్గొనఁజాలినవాని నిర్గుణున్
వినుతగుణున్ బ్రపంచవిభు వీతజగద్భ్వజు నాద్యు నచ్యుతున్. 5
ఆ. వ్యక్తరూపమునకు నవ్యక్తమునకును, వెలిఁ జెలంగువాని వేదవేద్యు
దలఁచువారొ యజరుఁ దత్త్వరూపుని నట్టి, హరిని దలఁతు నతుల నాచరించి.
సీ. పరమపవిత్రమై భవ్యమై పుణ్యదంబయి బహుమునిజనవ్యాప్త మగుచు
విమలపుష్పోపశోభితమయి సాలములు కర్ణికారంబులు ఖదిరపనస
ధవచూతములు దేవదారుకపిత్థముల్ పారిజాతాశ్వత్థ పాటలములు
నగురుచందనములు న్యగ్రోధవకుళపున్నాగసప్తచ్ఛదనాగకేస
తే. రములు తాలతమాలసాలములు మద్దు
లశ్లె నేరేళ్లు నారికేళాది తరువు

లమలచంపకముఖములౌ నన్యవృక్ష
సముదయమ్ములు వెలయంగ సాంద్రమగుచు. 7

క. నానాపతత్త్రిగణముల, చేనానామృగగణములచే విమలము లౌ
నానాజలాశయంబుల,చే నిర్మలదీర్ఘికలను జెలఁగుచు మఱియున్. 8

సీ. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులచేత నితరజాతులచేత నిండు గనుచు
వటుతతిని గృహస్థవారవానప్రస్థయతులచే నెంతయు నలరుచు మఱి
సంపన్నగోకులసమలంకృతంబయి చణకముల్ యవలు మాషములు ముద్గ
ములును గోధుమలును దిలలును వడ్లును బెల్లము మఱియును బ్రీతి నిండు
తే. చున్న బహువిధనామసంపన్నసస్య
ములును వెలయంగ సంతతమును బొలుచుచు
రమ్యతరమగు నైమిశారణ్యమొండు
పుణ్యధామంబుగా నెప్డు భూమి వెలయు. 9

ఉ. అందు మహామఖంబు నియమాదృతి ద్వాదశవార్షికంబు సా
నందముగాఁ దగన్ వెలయ నైజతపోవిభవుల్ మహర్షులే
సందియ మొందకుండఁ గొనసాగ నొనర్చుచు నగ్నిహోత్రు రా
త్రిందివముల్ హవిర్వితతి. దీప్తశిఖాయుతుఁ జేయుచుఁ విధిన్. 10

తే. తృప్తిపఱచుచు నుండుటఁ దెలిసి యచటి
కరుగుదెంచిరి ద్విజులు బ్రహ్మమునులెల్ల
వారి నర్చించి రచ్చట వఱలు మునులు
తగినరీతి సపర్యలఁ దన్మునులను. 11

క. ఉచితాసనముల ఋత్విజ్నిచయముతోఁ గూరుచుండి నెమ్మి వెలయున
ట్లుచితోక్తులఁ బల్కెడుతఱి, నచటికి నేతెంచె రోమహర్షణుఁ డెలమిన్. 12

మ. మతిమంతుం డగుసూతునాగమన మామౌనీశ్వరుల్ గాంచి ప్రీ
తి తగఁ బూజల నామహావిదునిఁ దృప్తిం బొందఁగాఁజేయ న
ర్చితుఁ డౌ నాతఁడు నమ్మహామునుల నర్చించెఁ యథార్థంబుగా
క్షితిపై నర్హతరాసనోపవసతిం జెందెఁ దదాజ్ఞం ద్వరన్. 13

చ. మునులు పరస్పరంబు గురుమూర్తిని సూతునిగూడి మోదముం
దనుకఁగ సత్కథల్ జరపి. తన్మఖదీక్షితు లైనఋత్విజుల్
ఘనతరపాండితిన్ జెలగు త్ర్యాసురులుఁ దముఁగూడియుండ వ్యా
సునిప్రియశిష్యసర్వవిదుసూతుని సంశయముక్తికై తమిన్. 14

తే. ప్రశ్న మొనరించి రిట్టు పురాణములను, నాగమంబుల శాస్త్రేతిహాసములను
జక్క నెఱిఁగినప్రోడవు సకలదేవ, దైత్యచరితంబు జన్మము తత్ప్రవృత్తి. 15

ఊ. భారతవేదశాస్త్రసమవాయమునందును మోక్షశాస్త్రమం
దారయఁగాఁ బురాణములయందును నీ కెఱుఁగంగ రానిదీ

రును నారాయణరూపులు, వనజాసనమానసైకభవులును బూజ్యుల్. 39
క. తరువాత రోషగుణమున, సరసిజ జని రుద్రదేవుశక్తి మహితు నీ
శ్వరుఁ బుట్టఁజేసెఁ బూర్వుల, నరయం బూర్వుని మునీంద్రు నద్భుతతేజున్. 40
క. ఒనరిచె సనత్కుమారుని, వినుఁ డాసప్తర్షిభవులె విశ్వమున జనుల్
ఘనరుద్రులు నని తెలియుఁడు, మునులార! సనత్కుమార ముని స్కందుండున్.
క. తమతేజమ్ములు సంకో,చములుగ నొనరించి రంత సప్తర్షులవం
శము లేదు త్రిదశనివహాయు, తములై దివ్యంబులగుచు ధన్యము లగుచున్.
క. సంతానయుతములు క్రియా, వంతమ్ములు నగుచు మాని వరసముదాయా
త్యంతవిభూషితములు నై, వింతగ రాజిల్లె నంత విద్యుదశనులన్. 43
క. ఘనముల రోహిత శతమఖ, ధనువులఁ బర్జన్యుఁ బక్షితతులఁ నిర్మిం
చెను వొల్త ఋగ్యజుస్సుల, ననువొందఁగ సామములను యజ్ఞక్రియకై. 44
క. వెలయించె సాధ్యులను ద్విద, శుల నితరామర్త్యుల నని శ్రుతివిషయం బై
చెలఁగును నీ నుడి; వినుఁ డా, జలజాసను నవయవముల సంతతివలనన్. 45
ఆ. భూరివిధము లైన భూతబృందంబులు, పుట్టె నిట్లు సృష్టి భూరితరము
గాఁ జెలంగె వినుఁడు కమలాసనేచ్ఛచేఁ,జెలఁగు చున్నయట్టి సృష్టి యిద్ది. 46
క. పరివృద్ధి నొందకుండుటఁ, బరికించి విధాత యంతఁ బటుశక్తిమనో
హార మగుతనదేహము స, త్వరముగ రెండుగ నొనర్చె వాంఛ యలరఁగన్. 47
క. ఒనరిచి యం దొకభాగం, బునఁ బురుషుం డొక్కభాగమున వనితయు నై
మనుజులను ద్విప్రకారుల, ఘనమతి సృజియించెఁ దత్ప్రకారను వినుఁడీ. 48
సీ. దివమును వితతపృథ్వి ని స్వీయశక్తిచే వ్యాపించి యేవిష్ణు వావిరాట్టు
సృజియించెనో యతఁడే వెలయించెను బురుషుని; మనువనఁ బొలిచె నతఁడు
మన్వంతరం బన మహివిస్తృతం బగునది తదంతర మవ్వలిదియె యెన్న
నీమానసతనూజుఁ డెసఁగినకాలమే మన్వంతరం బని మానులార!
ఆ. చెప్పఁబడును; భూతసృష్టిని వై రాజుఁ, డాప్రభుండు పురుషుఁ డవల సృష్టిఁ
గోరిచేసె నట్టి నారాయణవిసర్గ,భవు లయోనిజులుగఁ బరఁగి రంత. 49
వ. ఇది మొదటిసృష్టిప్రకారంబు దీని వినిన నాయుఃకీర్తులు గలుగు. ధన్యుండును సంతానవంతుఁడును నగు. అంతంబున యథాకాంక్షితంబుగ సద్గతి కలుగు. ఈ ప్రజానేత సృష్టిచేయుకోరిక నయోనిజ యగుశతరూపను బత్నిగా గ్రహించె. అత్తఱి నాప్రజాధినాథుం డాపవుం డనంబరఁగు. అయ్యాపవుండు మహిమముచే దివ మావరించి యుండ ధర్మంబునుండియే శతరూప జనించె. 50
క. ఆమెయు నయుతాబ్దంబులు, భీమము నద్భుతము నగుచు వెలయు తపమ్ము
ద్దామగతిం దగ నొనరిచి, కామదు నుద్దీప్తతపసుఁ గాంతుని బొందెన్. 51
క. మను వన నాపురుషుండే, మునులార! తదీయకాలము పరిగణిత మ

య్యెను డెబ్బ దొక్కయుగములు, గను; నా వైరాజువలనఁ గాంత సుతుఁగనెన్.
సీ. అతఁడు వీరుం డయ్యె నంతఁ బ్రియవ్రతోత్తానపాదులు నాఁగఁ దనయు లిర్వు
రతనికి వైరి కామ్యాహ్వయకన్యయుఁ గలిగె; నాకన్యయే కర్దమప్ర
జాపతిపత్ని; యాచానకుఁ బుత్రులు ప్రభువుఁ గుక్షియును సమ్రాడ్విరాట్టు
లనఁబడు నల్వురై రత్త్రియు నుత్తానపాదునిఁ దనయుఁగాఁ బరమమోద
తే. మలరుచుండ గ్రహించె, నా యనఘుపత్ని
సూనృతాహ్వాయ నల్వుర సుతులఁ బడసె
ధర్మకన్యక యా సూనృతయును జారు
తనువిలాసిని వాజిమేధమునఁ బుట్టె. 53
వ. అతరుణీమణి ధ్రువుఁడు కీర్తిమంతుఁ డాయుష్మంతుఁడు వసువు నను నల్వురు కొ
డుకులం బడసె. ఉత్తానపాదుం డిట్లు ధ్రువుం డను జ్యేష్ఠకుమారునివలన ధన్యుం
డయ్యె. అధ్రువుండు. 54
క. మునులార! భూరితరయశ,మును బొందఁగఁ గోరి దివ్యములు లెక్కింపం
గను మూఁడువేలవర్షము, లనూనతప మాచరించె నంతట విధియున్. 55
చ. అతిశయమోద మంది దివి నాత్మసమం బగుస్థాన మిచ్చె; న
చ్యుతమది సప్తమౌనులకు నూర్ధ్వముగాఁ దగియుండె; నంత న
ప్రతిముని బుద్ధివైభవము భక్తియును౯ సుజనాభిమానము౯
సతతము చూచి భార్గవుఁడు సర్వసురాసురదేశికుం డెదన్.
క. ఔరా! తప మిది విమలం,బౌరా! వీర్యంబు శుభ్రితమి దౌరా! కననీ
ధారణి నద్భుత మిది కన, నౌరా! సప్తర్షు లీతఁ డగ్రస్థలినిన్. 57
క. చెలువార నున్న వారితఁ,డలఘుతపశ్శాలి యనుట కనుమాన మిలం
గలదా యని శ్లోకం బి,మ్ములజెప్పెను; బిదప ధ్రువుఁడు ముక్కంటికృపన్. 58
ఆ. శ్లిష్టభవ్యు లనఁగఁ జెలఁగుతనూజులఁ, గనియె; శ్లిష్టుఁ డనెడు తనయుఁ డంత
సొగసులాఁడి యైనసుచ్ఛాయఁ బెండ్లి యై,పాపరహితతనయపంచకంబు. 59
తే. కనియె; వారలు రిపువు, వృకల, పురంజ
యు, వృకతేజసలును, బుత్త్రుఁ డనఁగ వెలసి;
రందు రిపు వనువాఁడు బృహతియనంగఁ
బుష్కరిణివై రిణియునాఁగఁ బొలుచు కన్య. 60
క. తనయ; నరణ్యుం డనుమహి,తున కామెను బెండ్లి యై సుతుని జాక్షుషుని౯
గనియె౯ మనువును వినుఁ డో,మునులార! యనంతరకథ ముద మొనఁగూర్చున్.
క. వైరాజుని యాత్మజక, న్యారత్నము నైననడ్వలాఖ్యను బ్రీతి౯
దారగ గ్రహించి యమ్మను, వారాజీవాక్షివలన నాత్మజులఁగనెన్. 62
వ. వారు కుత్స, పురు, శతద్యుమ్న, తపస్వి, సత్యవాక్కువు, లనియు, నగ్నిష్టో
వుండు, నతిరాత్రి. సుద్యుమ్ను లనియు, నభిమన్యు వనియు నామధశకంబున

జెలువారి మహాజను లై వర్తిల్లిరి. అందుఁ బురుని బెండ్లియాడి యాగ్నేయి
యనునింతి యంగ, సుమనసులు, ఖ్యాతి, క్రతు, గయాంగిరసు లనునార్వురు
పుత్త్రులం బడసె. అందు జ్యేష్ఠుం డగునంగాహ్వయుని బెండ్లియాడ సునీథయ
నునంగన వేనుం డనునొక్కకుమారుం గనియె. 63

క. వేనుని యపచారంబున, మానవులకుఁ బీడగలుగు మహనీయతప
శ్శ్రీనిలయులు మౌనులు క్రుధ, నూని మహారాజు నతని నుద్ధతుని వేసన్. 64

క. బిగఁబట్టి దక్షిణకరం, బు గడుఁగ మథియించి; రంత భూపతివర్యుం
డగణితసుగుణోపేతుం, డు గలిగెఁ దత్పాణిఁ దనయుఁడు మునిసుతుండై. 65

ఉ. ఆతనిఁ గాంచి మౌనివరు లందఱు నిట్లనిపల్కి రీనృపుం
డాతతశక్తిచేఁ బ్రజల నందఱ సంతసమందఁజేయు వి
ఖ్యాతయశుండు తేజమున నత్యధికుండును నౌ నటంచు; నా
భూతలనాయకుండు జనిఁ బొందినయప్పుడె చాపహస్తుఁ డై. 66

ఆ. కవచమును ధరించి కడుమండు నగ్నినాఁ, దగిన తేజ మొప్పఁ దాఁ జెలంగెఁ;
నతఁడె పృథు వనంగ నలరె నాయనఘుఁడే, రాజులందుఁ బూర్వరా జనంగ. 67

క. స్థిరకీర్తిఁ గాంచి గురుతర, ధరణిం బాలించె, రాజతతులం దతఁడే
పరిగణితుం డాద్యుం డని, స్థిరయశుఁడౌ రాజసూయదీక్షితు లందున్. 68

క. తొలుతటివాఁ డతఁడే యగు; సులలితతద్గుణమునెల్ల సొరిది నుతింపం
గలిగిరి మాగధసూతులు, పలుకులనేర్పఱితనంబు భాసిల్లంగన్. 69

చ. నరపతి యాతఁడే పృథుగుణంబున వృత్తిని దత్ప్రజాళికిన్
ధరణిని బుట్టఁజేయఁగ నుదారత నెంచి ధరిత్రి గోవుగా
నిరుపమశక్తి నేర్పఱచి నిర్మలసస్యపయస్సుఁ బిండె; ని
ర్జరులును మౌనిసంఘములు జానుగఁ బిండిరి వాంఛితార్థముల్. 70

క పితరులు గంధర్వులు నా, దితిజులు నచ్చరలు మఱియు ద్విరసనులు మహో
ద్ధతరాక్షసులును లతలును, క్షితిధరములుపిండె భూమిఁ జిత్తము లలరన్. 71

క. ఆయాయిపాత్రములలో, నాయతవాంఛాతురమున నవనిం బిండఁగ
బాయక యీప్సితపయసులె, యాయారీతిఁగ లభించె, నాపయసులచేన్. 72

క. ధరియించిరి ప్రాణంబుల, ధరణీశవరుండు పృథువు తనయవరుల ని
ర్వురఁ గాంచె నశ్వమేధా, ధ్వరము తుదఁగ వారు కీర్తిధన్యులు జగతిన్. 73

వ. ధర్మజ్ఞు లగునాయిర్వు రంతర్ధి యనియుఁ; బాతి యనియు నామముల ధరించి
ప్రఖ్యాతు లైరి. శిఖండిని యనునారీమణి యంతర్ధానునకుం బత్ని యై హావిర్ధా
నుం బడసె. ఆగ్నేయి యగుధిషణయు హావిర్ధానుభార్య యై ప్రాచీనబర్హి,
శ్శుక్ర, గయ, కృష్ణ, వ్రజాజిను లనునార్వురు కొడుకులం గనియె. ప్రాచీన
బర్హిషుం డందుఁ బ్రజాపతి యయ్యె. ఆతండు సకలభూతలవాసి ప్రాణికోట్లం
దండ్రి యట్లు పాలించి ప్రఖ్యాతుం డయ్యె మఱియు. 74

క. చిరకాలతపం బొనరిచి, స్థిరమతి యై యంత నృపతి సింధుతనయనా
ధరనుతిఁ గన్నసువర్ణను, బరిగ్రహించెను వివాహపద్ధతిఁ దమిచేన్. 75
క. తనయుల నాసాముద్రియు, మనుజేంద్రునివలనఁ బడసె మహనీయుల వా
రును దశసంఖ్యఁ జెలంగిరి, ధనుశ్శ్రుతిన్ నేర్పు మిగులఁ దగ నాతనయుల్. 76
క. పేరునఁ బ్రచేతసులు నా, ధారుణిఁ జెలువారి యేకధర్మరతులు నై
ఘోరతపం బొనరించిరి, పారావారంబు నీట వాసముఁ గనుచున్. 77
క. పదివేలవత్సరంబులు, మదులం దగుపట్టుదల సమంజసనియమం
బుదగం దప మొనరింపం, గఁదగిన రక్షణము లేమి క్ష్మారుహవితతుల్. 78
క. ఇల వెలయక క్షీణింపఁ బ్ర, జలును లయం బొందె; రఘు శ్వసనుఁడు వీవం
గలశక్తి లేమివృక్షం, బులయందె వసించె వర్షముల నయుతములన్. 79
క. జను లిటునటు చలియింపం, గనుజాలక యుండి; రట్లు గాలియు లోకం
బున కుపకృతిఁ జేయమి నా, ఘను లంద ఱుఱంగి క్రోధకలితాత్మకు లై. 80
తే. తమతపశ్శక్తిచేఁ బూన్కి తగ ధనంజ, యునిని వాయువు ముఖములనుండి పుట్టఁ
జేసి రాదట వాయువాక్షితిరుహముల, శోషిలఁగఁ జేయ నాశ్రయాశుండు గాల్చె.
క. తరుసంక్షయ మీవిధమున, జరగెన్ శిష్టంబు నైన క్ష్మారుహతతినా
దురమునఁ గని సోముం డపు, డరుదెంచి ప్రజాధిపతుల నందఱఁ గనియెన్. 82

## దక్షజననము.

క. కని వారితోడ నిట్లను, జనపతి ప్రాచీనబర్హి చంచత్కీర్తిం
గనినాఁ డాతనితనయులు, గనుకం గ్రోధంబు వదలఁ గాఁదగు మీకున్. 83
చ. క్షితియు, గతద్రుమావళిగఁ జేయఁబడెం గద యేతదగ్ని మా
రుతములచేత నింకయిన రోషము మానుచు వీనిమాన్పుఁ డీ
క్షితిపతి సూనులార! యిదె చెన్నువహించిన కన్య యీతరు
ప్రతతికిఁ బుత్రి రత్నతతిరాజితసద్గుణభూషితాంగియున్. 84
తే. కన్యకను దీనినిన్ భావికాలగతుల, నరసి నాగర్భమందు నెయ్యమునఁ దాల్చి
నాఁడ వృక్షంబులకుఁగాఁగ నలువస్సృష్టిఁ, జేసె మారిషయన నీమె చెలఁగుచుండు.
క. సోమాన్వయ సంవర్ధిని, యీమెమహాభాగులార! హితమతి మీకున్
భామిని యై శుశ్రూషల, మీమానసములను బ్రీతి మించం జేయన్. 86
క. మీ తేజస్సుల నర్ధము, నా తేజస్సున సగమ్ము నయరీతిగ నీ
నాతి గ్రహియింపఁగాఁదగు, నీతరుణికిఁ బట్టు సుతుఁడు హితమతియుతుఁడౌ. 87
క. దక్షుం డనఁగా నాతం, డీక్షితివిలసిల్లు విధికి హితుఁ డై సర్గం
బక్షయముగ నొనరించుఁ బ్ర, జాక్షయ మిటు లయ్యెఁ గాదె క్షమ నెల్లెడలన్.
సీ. మీతపశ్శక్తిచే మించఁ జేయఁగఁబడినట్టి యీయగ్నికి నతఁడు సముఁడు
తా నయి మరల నీధాత్రిపైఁ బ్రజలను వృద్ధినొందఁగఁ జేయుబుద్ధి విభవ

మలరఁగా నని సోముఁ డాడినవచనంబు నాతపోధను లెల్ల నవధరించి
క్రోధంబు విడిచి యాకుజములనుండి తత్కన్యను భార్యగాఁగ గ్రహియించి
తే. ధర్మమతిఁ బెండ్లియాడి రాదశధరణిప, తులతపశ్శక్తిచేఁ బుట్టె విలసితగుణ
జాలుఁ డగుదక్షుఁ డత్తఱిఁ జంద్రునంశ,యుక్తి మై లోకవిఖ్యాతి నొందిమిగుల.
క. చరముల నచరంబుల న, ట్లరుదుగ ద్విచతుష్పదముల నాత్మవిభూతిన్.
బరికించి సృష్టిఁ జేయుచుఁ, దరువాతఁ సృష్టిఁజేసెఁ దరుణీమణులన్. 90
క. పదుగురను ధర్మునకు నటు, పదుమువ్వురఁ గశ్యపునకుఁ బత్నులుగా ని
చ్చిదమిఁ శేషించిన యిరు, వదియేడ్వుర నొసఁగె రాత్రిపతి కతఁ డంతన్. 91
సీ. వారలయందు దేవతలు దానవదైత్యగంధర్వు లప్సరఃకాంతలు మఱి
ఖగములు నాగముల్ పొగడొందుగోవులు తక్కినభూతసంతతులు వెలసె
నది మొదలుగ జగమందు మైథునసృష్టికలిగెఁ బూర్వంబు సంకల్పమునను
దర్శనంబునను సంస్పర్శనంబున సృష్టి యలరుచుండె ననంగ నమ్మహర్షు
తే. లో మహాత్మక దక్షునినుండి త్రిదశ, దనుజరాక్షసగంధర్వతతులు ఫణులు
గలిగె నని వింటిమిప్పుడు జలజసూతి, బొటనవ్రేలున దక్షుండు పూతయశుఁడు.
క. జనిఁ గనె వామాంగుష్ఠం, బున నాతనిపత్ని, పుణ్యమూర్తి కలిగె నం
చని వింటి మిట్టిదక్షుఁడు, ఘనతపుఁడు ప్రచేతసులకుఁ గమ్రయశులకున్. 93
క. తనయుం డెవ్విధి నయ్యెను, జనియించె దృఢంబుగాఁగ సంశయ మిది మా
మనముల దానిని దీర్పం, జను నీకుఁ విస్తరించి చక్కఁగఁ జెపుమా. 64
క. మనుమఁడు గద చంద్రున కా, తని కెవ్విధి మామ యయ్యెఁ దగునే యిది యం
చన రోమహర్షణుం డ,మ్ముని వరులం గాంచి పలికె మోదం బెసఁగన్. 65
వ. భూతంబులకు నిత్యంబు లగునుత్పత్తినిరోధంబులకు విద్యావంతు లగుమునులు సంశయంబు నొందరు. ప్రతియుగంబునం దీదక్షాదినృపు లుదయించుచుందురు. మరల నంత మొందుచుందురు. కావున నీసృష్టివిషయంబున భ్రాంతి నొందఁ బని లేదు. వీరియందు జ్యేష్ఠత్వకనిష్ఠత్వంబులు పాటింప నక్కఱ లేదు. తపఃప్రభావంబులు ప్రధానకారణంబులు. పరమపవిత్రం బగునీచరాచరాత్మకదక్షసృష్టి నెవండు విను నాతండు సంతానవంతుఁడై పూర్ణాయుస్సుకలవాఁడగు. స్వర్గవాసియు నగుననిన మును లి ట్లనిరి. 96
క. సురదానవగంధర్వా, సురరాక్షసఫణులసృష్టి సూతమునీ! వి
స్తరరీతిఁ గా వచింపుము, పరమప్రమదమున నాఁగఁ బలికె నతండున్. 97
చ. వనజభవుండు దక్షుఁ గని ప్రాణులసృష్టి యొనర్పు మంచు ము
న్ననియెను దాన నాతఁడు ప్రజావళి సృష్టి యొనర్చెఁ దద్విధం
బును వినుఁ డాప్రజాపతియుఁ బూర్వము మానససృష్టిఁ జేసె దే
వనికరయక్షరాక్షసుల బ్రహ్మమునీంద్రుల వేడ్కమీఱఁగన్. 98

సీ. ఈమానసీసృష్టి యెంతకాలమునకు నభివృద్ధి నొందమి నాత్మ నెంచి
ధర్మమతిఁ సృష్టి తత్త్వంబు యోజించి మైథునప్రక్రియ మహితరీతిఁ
బ్రజల నిర్మింపంగ వచ్చునంచూహించి వీరణు నాత్మజఁ జారుగాత్రి
సత్తపోనియతను జాయగా గ్రహియించెఁదా నసిక్నిని లోకధారిణిఁ దమి;
ఆ. నంత నామెవలన నైదువేలతనూజు, లను సువీర్యయుతులఁ గనియె దక్షుఁ
డవల లోకవృద్ధి నందఁజేయుఁ దటంచు, వారిశక్తియుతుల భూరిబలుల. 99

చ. కనుఁగొని దేవమౌనిపుఁ డఖండతపోబలుఁ డైననారదుం
డనునయ మొప్పుచుండ నిటు లల్లన వారికి నాశనంబుగ
ల్గను ఘనశాప మాత్మకును గల్గను గోరినరీతిగాఁగ ని
ట్లనియెను; మౌనులార! వినుఁ డాదృతి నారదుజన్మపద్ధతిన్. 100

వ. కశ్యపముని పరమేష్ఠ్యంశంబు గలపుత్త్రుని దక్షశాపభయంబునఁ దక్షుం డను
వాని దుహితయందుఁ గాంచె. ఆతండె నారదుం డనం బరఁగు. ఆనారదుండు
పరమేష్ఠివలన ముందు జన్మించి యుండె. అసిక్నియందు మరల నుద్భవంబుఁ
గాంచె. ఆతనిం దండ్రి యగుబ్రహ్మవలె ముని మరల నుద్భవిల్లంజేసె. దాస
హర్యశ్వులు దక్షపుత్త్రు లతి ప్రసిద్ధిం గాంచిరి. వా రెల్లవిధిచే నశింపఁజేయఁ
బడిరి. ఆవిధం బెఱింగి యమితవిక్రముఁ డగుదక్షుండు బ్రహ్మర్షుల ముందిడు
కొని పరమేష్ఠికడకుం బోయి యాచించె. బ్రహ్మయు నీకన్యయందు నారదుండు
నాకొఱకు నీకు సుతుండు కాఁగలండని యభిసంధి గావించె. అంత దక్షుండు
తనపుత్త్రిని బ్రహ్మకొసంగె. ఆమెయందు నారదుండు శాపభయంబువలనఁ బ్రభ
విల్లె ననుటయు మును లి ట్లనిరి 101

క. నారదుఁ డేక్రియ దక్షుకు, మారుల నందఱను బూన్కి మ్రందఁగఁ జేసెఁ
గారణ మద్దానిని వినఁ, గోరిక జనియించె ననినఁ గుతుకం బలరన్. 102

క. పలికెను సూతుం డి ట్లని, యలదక్షకుమారు లైన హర్యశ్వులు ప్రా
ణుల నభివృద్ధిని జేసెదు, తలఁపున నుండంగ నారదమునియు వారిన్. 103

చ. కనుఁగొని పల్కె నిట్టు లని క్ష్మాస్థల మింత ప్రమాణ మంచు మీ
కు నెఱుఁగ శక్యమే ప్రజలఁగోరికఁ బుట్టఁగఁ జేయఁబూని నా
రనునయ మింతలేక మది నారయఁ బాలిశు లౌట నిట్టు లీ
పని యొనరింపఁ బూని నటు బాగుగఁ దోఁచెడు నేమి చెప్పుదున్. 104

తే. అంతరంబునఁ బైఁగ్రింద నరసి ప్రజల, నెట్లు నిర్మింపఁజాలుదు రిప్పు డనిన
నా ప్రచేతసునితనయు లానుడిఁ గొని, పలుదెసల కేగి రిది యేటిపని యటంచు.

క. ఏతావత్పర్యంతం, బౌతనయులు సాగరంబునందుఁ గలియు నా
స్రోతస్వినులటు మరలరు, చేతస్సునఁ బుత్త్రు లిట్లు చెడుటఁ దెలియఁగన్. 105

సీ. దక్షుండు వైరిణి నాక్షణంబునఁ గాంచి కామించి పుత్త్రిల నీమహితులఁ
గాంచె సహస్రసంఖ్యాకుల వారెల్ల శబలాశ్వు లనఁగఁ బ్రజాసమృద్ధిఁ
జేయఁ బూనిరి; వారిఁ జేరి నారదుఁడు పూర్వప్రకారంబుగఁ బలికె నంత
శబలాశ్వు లెల్లరు చక్కఁగ నరయుచు మంచిమాట వచించె మౌనివరుఁడు
తే. చాలు నీసృష్టి యింక జ్యేష్ఠసహజన్ము, లరిగి రెయ్యడకో వారి నరసి పుడమి
మాన మింతని తెలిసి నిర్మాణశక్తి, నవల సృజియింత మనుచు నయ్యనఘులెల్ల.
క. దెసలకుఁ బరగెత్తిరి జ్యేష్ఠసరణియే మంచి దనుచు; సాగరమునఁ జే
రు సకలనదులం బోలుచుఁ, బ్రసరింపరు భూమి నెందుఁ బరికించి ననున్. 108
తే. అదియె మొదలుగ నన్నను వెదుకఁ జనిన, వారు నశియింతు రనునీతి వఱలెఁ గాన
బుద్ధిమంతుఁడు పూర్వుని పూన్కి దాను, బూన రాదాత్మ నెంచియే పూనవలయు.
చ. తనయులు వారు నిట్లుగ నతంత్రులుగాఁ బరగెత్తిపోవుటల్
మనమున నెంచి దక్షుఁడు సమస్తవిదుండవు డాయసిక్నియం
దనుపమసద్గుణాఢ్య లగునట్టితనూజలషష్టిసంఖ్యలన్
గనియెను వైరిణీతరుణి క్రమ్మఱ మోదము నొందునట్లుగన్. 110
క. వారలఁ గశ్యపధర్ములు, వారిజవైరియును దక్ష బ్రహ్మమునీంద్రుల్
దారలుగా గ్రహియించిరి, వారల నెఱిఁగింతు వినుఁడు వరుసఁగ మీకున్. 111
తే. ధర్మునకుఁ బదుగుండ్రను, నిర్మలుఁ డగు, కశ్యపునకుఁ ద్రయోదశకన్యకలను
నిరువదేడ్వురఁ జంద్రున కెలమి నిచ్చె, దక్షుఁ డాబహుపుత్త్రుఁడక్ష తపసి కోర.
క. ఇరువుర నొసంగె నంతట, నరిష్టనేమికిని బ్రీతి నలరి యొసఁగె న
ల్వుర నట్లంగిరసున కిర్వురను గృశాశ్వునకు మౌనిరుద్రున కంతన్. 113
క. ఇరువుర నొసంగె వారల, సురుచిరనామములు వినిన శుభమగుఁ దొలుతన్
వరమతి దక్షుఁడు ధర్మున, కురుముదమున నిచ్చినట్టి యువిదల వినుఁడీ. 114
వ. అరుంధతియు, వసునామ్నియు, యామియు, లంబయు, బాలయు, మరుత్వతియు, సంకల్పయు, ముహూర్తయు, సాధ్యయు, విశ్వయు నను నీపదుగురు ధర్మపత్ను లగుదక్షునికుమారికలు. విశ్వాపుత్త్రులు విశ్వేదేవతలనియు, సాధ్యాతనయులు సాధ్యులనియు, మరుత్వతీసూనులు మరుత్వంతులనియు, వసునామ్నీనసంజాతులు వసువులనియు, బాల యనునామాంతరంబునం బరఁగు భానునామముగల తరుణికొడుకులు భానువులనియు, ముహూర్తగర్భజనితులు ముహూర్తజులనియుఁ బ్రఖ్యాతులైరి. లంబకు ఘోషుండు కలిగె యామినీపుత్త్రిక నాగవీథిక యనం బ్రసిద్ధివహించె. అరుంధతియందుఁ బృథ్వీసర్వవిషయవేత్త లగుతనయులు గలిగిరి. సంకల్పయందు సర్వాత్మయగుసంకల్పుం డుదయించె. యామినీపుత్త్రిక యగునాగవీథియందు వృషలుం డుదయించె. ప్రాచేతసుం డగుదక్షుండు నక్షత్రాఖ్య లగుపుత్త్రికల సోమున కొసంగె వారిరువదేడుగురు నక్ష

త్రినామధారిణు లై జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధ లైరి. ఖ్యాతిమంతు లై జ్యోతిఃపు
రోగము లగుదేవత లెవరు విఖ్యాతినొందిరో వా రష్టవసువు లైరి అయ్యం
డును, ధ్రువ, సోమ, ధ, వాని, లానల, ప్రత్యూష, ప్రభాసు లనునామం
బులం బ్రసిద్ధిం గాంచిరి. అందయుండనువసుపుత్రులు వైతండ, శ్రమ ,శ్రాంత
మును లనునల్వు రైరి. ధ్రువునితనయుండు లోకప్రకాలనుం డగుకాలుండు.
సోమునకు మహాత్ముం డగువర్చసుండు కలిగె అతనివలన వర్చస్వి కలిగె.
ధవునకు మనోహర యనుపత్నియందు ద్రవిణ, హుత. హవ్యవహులును,
శిశిర, ప్రాణ, రమణులు ననుకొడుకులు గలిగిరి. అనిలునకు శివ యనునాతి
పత్ని యయ్యె. ఆమె మనోజ, హావిజ్ఞాతగతినామకపుత్త్రద్వయంబుం గనియె.
అనలునకు శరస్తంబుం డనుకుమారుండు శ్రీమంతుం డుద్భవించె. అతనికి శాఖ,
విశాఖ, నైగమేయు లనుకుమారు లుదయించిరి. కృత్తికలయందుఁ గార్తికే
యుండు గలిగె. ప్రత్యూషుం డనునష్టమవసుపుత్త్రుండు దేవలుం డనుముని
యని యెఱుంగుఁడు. ఆదేవలునకు క్షమావంతులును మనీషులు నగునిరువురు
పుత్త్రు లుద్భవిల్లిరి. బృహస్పతి భగిని యగుయోగసిద్ధ యనురమణి బ్రహ్మ
వాదిని యై యసక్త యై జగత్సంచారంబుచేసె. ఆతరుణి యష్టమవసువగు
ప్రభాసునకు భార్య యై దేవతాశిల్పి యై యనల్ప నిర్మాణకుశలుం డై తనరు
విశ్వకర్మను గనియె. ఆతండె సకలత్రిదశభూషణ నిర్మాతయు, శిల్పివర్యుండు
నయ్యె దేవతల కనుపమానవిమానంబుల నొనరించినవాఁ డాతండెకదా. ఆతని
శిల్పంబు నెఱింగి మానవులు జీవింతురు. సురభియనునంగన తపోబలంబున నీశ్వ
రుం బ్రీతుంజేసి కశ్యపుం డనుమునివలన నేకాదశ రుద్రులం గనియె. అజైక
పాదుండు, నహిర్బుధ్న్యుండు, త్వష్టయు, హర, త్ర్యంబ, కాపరాజిత వృషా
కపి, కపర్ది, రైవత, మృగవ్యాధ, శర్వనామంబుల నారుద్రులు విలసిల్లి త్రిభు
వనేశ్వరు లైరి. అమితౌజసు లగునీరుద్రులసంఖ్య శతసంఖ్యగాఁ బురాణంబుల
యందుఁ జెప్పంబడు. వారిచే జగంబంతయు వ్యాప్తం బయ్యె. ఇఁకఁ గశ్యప
మునిపత్నుల నెఱింగించెద. 115

ఆ. అదితి దితిదనువులు నట్లరిష్టయు సుర,సయును దామ్రయు,వినతయును, ఖసయు
సురభి,క్రోధవశయు, నిరయుఁ గద్రువయును,మునియు ననెడుసతులుఘనతఁగనిరి.

క. వారికిఁ గల్గినయట్టిసు, మారుల నెఱిఁగింతుఁ బూర్వ మన్వంతరమం
దారమ్యయశులు తుషితులు, ధీయులు పంద్రెండుగు రగుత్రిదశశ్రేష్ఠుల్. 117

క. పరితోషంబునఁ జెలఁగుచుఁ, బరస్పరం బిట్టు లనిరి వైవస్వతునం
తర మింక రాఁబోయెడు ని, త్తరుణంబునఁ జాక్షుషుండు తా మను వగుచున్.

క. పరిపాలించెడు లోకో, త్కరమును ధర్మాధిపతితఁ గ్రాలెడుఁ గానన్
నిరతంబు గలసియుండుద, మరయుచు ధర్మాళి నంచు నాదృతితోఁపన్. 119

ఆ. అదితియందుఁ బుట్టి యమరవర్యుల మయి, యుంద మనుచు నెంచి యూహ చెలఁ
నదితియందుఁ జేరి యాత్మజులై పుట్టి, రఖిలధర్మమూర్తు లమలయశులు. 12

సీ. చాక్షుషం డనుమనుసమయంబునఁ దా వార లెల్ల మారీచుఁడై యుద్ధతేజుఁ
డైనకశ్యపునకు నాత్మజులైరి. శక్రుండు విష్ణువుఁగూడఁ గొడుకులైరి
కశ్యపుపత్నికిఁ గమలమిత్రులు ద్వాదశఖ్యాతకీర్తులు సత్త్వఘనులు
తనయులై రా మెకే తన్నామముల వినుఁ డర్యమాఖ్యుఁడు ధాత యవలఁ ద్వష్ట

తే. పూషయును మిత్రవరుణులు భూరితేజు
లగువివస్వత్సవితలును నంశభగులు
హేళిసూర్యులు నను పేరు లిలఁ బ్రసిద్ధిఁ
గాంచెఁ జాక్షుషాంతరమున మించు వేడ్క. 121

వ. తుషితు లనంబడు ద్వాదశసంఖ్యాకులే వైవస్వతునంతరంబున ద్వాదశాదిత్యు
లై పుట్టిరని తెలియవలయు. సప్తవింశతిసంఖ్య నలరు సోమపత్నులు మహా
వ్రతలు. వారి కతులతేజోవిరాజితంబు లగుజ్యోతిస్సు లపత్యంబు లయ్యె. అరి
ష్టనేమి భార్యలయందు షోడశసంఖ్యాకసంతానంబు లుదయించె. విద్వాసుం
డగుబహుపుత్త్రునకు విద్యుచ్చతుష్కం బపత్యంబయ్యె. పూర్వచాక్షుషమన్వం
తరంబున ఋక్కులు మహర్షులచేఁ బూజింపఁబడు నవ్వియే కృశాశ్వుం డను
దేవర్షివలన దేవప్రహరణంబులై యుదయించె. ఇవి యుగసహస్రాంతంబున
మరల జనియించు. కామజులై ముప్పదిమూఁడుసంఖ్యలుగలిగిన దేవగణంబుల
కీమన్వంతరంబున నిరోధోత్పత్తి చెప్పంబడియె 122

క. తరణికి నుదయాస్తమయము, లురుతరగగనంబునం దోఁగిం దోఁచుగతిన్
సురగణముల కుత్పత్తియు, జరగెడుఁ బ్రతియుగమునందు సహజం బగుచున్.

క. దితియను కశ్యపుపత్నియు, సుతయుగ్మముఁ గనియె ననుచు శ్రుతిగోచరమా
క్షితిసురులారా! సహజ, ద్వితయము పేరులను మీకుఁ దెలిపెద వినుఁడీ 124

క. తొలుతన్ హిరణ్యకశిపుఁ డ, వలను హిరణ్యాక్షుఁ డనెడువాఁడును దేజం
బలరఁగఁ గల్గిరి; సింహిక, లలనాతిలకంబు గలిగె లలితసుగుణయై. 125

క. తనరారి విప్రచిత్తికి, వనితామణి యయ్యె; హానివలన బలాఢ్యుల్
జనిఁ గనిరి సైంహికేయులు, వినుఁ డింక హిరణ్యకశిపు వృత్తాంతంబున్. 126

క. హ్రాదుఁ డనుహ్రాదుఁడుఁ బ్ర, హ్లాదుఁడు సంహ్రాదుఁ డనెడునాత్మభవులు స
మ్మోదప్రదులును వీర్య, శ్రీదయితులు నల్వురైరి చిరకీర్తి తగన్. 127

సీ. హ్రాదునకుం బుత్త్రుఁ డయ్యె హ్రదుం డనుదనుజుఁడు వానికిఁ దనయుఁ డొకఁడు
మాయావి శివుఁ డన మహి విస్తృతిం గాంచె నతనితమ్ముఁడు కాలుఁ డనఁగఁ బుట్టె
బ్రహ్లాదునకు ముద్దుపట్టి విరోచనుం డతనికి బలి యను నతఁడు కలిగె
బలికి నూర్వురుతనూజులుపుట్టి రందు బాణుం డనువాఁడు జ్యేష్ఠుండు వాని

ఆ. వర్యులార! యతనిభ్రాతలు ధృతరాష్ట్ర, చంద్రతాపసులును జంద్రముండు
కుంభనాభ సూర్యకుక్షులు గర్దభా, క్షాదు లైరి నూర్వు రధికబలులు. 128

క. వారలలోఁ జ్యేష్ఠుండే, వీరుం డై శంకరునకుఁ బ్రియభక్తుం డై
భూరితపంబున నాత్రిపు, రారిన్ మెప్పించి వరములంది ఘనుం డై. 129

క. వరబలమునఁ దత్పార్శ్వము, నరహిన్ విహరించె; మౌనినాయకులారా!
సురవైరిహిరణ్యాక్షుఁడు, గురుబలవిద్యాధికులను గొడుకులఁ గనియెన్. 130

ఆ. బర్బరుండు శకుని బలశాలియగుమహా, నాభుఁ డవలఁ గాలనాభుఁ డతుల
భూరి వీర్య మలరుభూతసంతాపను, డనఁగ గురుయశంబు నంది రవని. 131

క. దనుపుత్త్రులు నూర్వురు భూ, మిని వెలసిరి వీర్యమునను మించుతపమునన్
ఘనులగువారలలోనన్, మునులార! వచింతు మీకు ముఖ్యుల వినుఁడీ. 132

వ. ద్విమూర్ధుండు శంకుకర్ణ హయశిరసులు, నయోముఖ, శంబర, కపిల, వామన, మారీచి, మధువంశులు, నిల్వల, సృమణ, విక్షోభణ, కేతు, కేతువీర్య, శతహ్రదులు, నింద్రజి, త్సర్వజి, ద్వజ్రనా, భైకచక్ర, మహాబాహు, తారకాక్ష, వైశ్వానరపులోమ, విద్రావణ, మహాశిరసులును, స్వర్భాను, వృషపర్వ విప్రచిత్తులనువారు దనుపుత్త్రప్రధానులు. వీరెల్ల మహాబలపరాక్రమసంపన్నులై కశ్యపునను గ్రహంబున దనువనుసుదతికిం దనయు లైరి. వీరియందు విప్రచిత్తి ప్రధానుఁడై యశంబుఁ గాంచె. వీరిసంతానంబు వర్ణింప నశక్యంబు. లెక్కింప సులభంబు గాదు. బహుసంఖ్యాకులై తత్పుత్త్రకులు వారితనయులు ప్రపంచంబునెల్ల నావరించిరి. 133

తే. ప్రభ యనెడునింతి యయ్యె స్వర్భానుతనయ, శచి పులోమునిపుత్త్రిక శక్రపత్ని
యామె యేయుపదానవి హయశిరసుని, తనయ శర్మిష్ఠ వృషపర్వుతనయయయ్యె.

సీ. వైశ్వానరునకుఁ బ్రభావసమగ్రలౌ తనయ లిద్దఱు కల్గి ధాత్రి వెలసి
రందుఁ బులోమయె యగ్రతనూజ యాఁ గాలక యనునట్టికన్య యనుజ
యీయిర్వురును బలమెసఁగ నొప్పుచు బహుసంతతి యలర నిశ్చింత నుండి
రీయిద్దఱు మరీచి నెలమి భర్తగ నొంది యఱువదియొక వేలు నల్గె నాల్గు

ఆ. శతము లనెడుసంఖ్య సరిపడుతనయులఁ, గనిరి వారలెల్లఁ గడుబలాఢ్యు
లయి హిరణ్యనగర మందు వసించిరి, తండ్రితపముబలిమిఁ దనరి రెలమి. 235

క. పౌలోమకాలకేయులు, చాల బలాఢ్యులు ననంగ క్షమ వెలసిరి; ధీ
శాలురు వారలు సింహిక, శ్రీలలితుం డైనవిప్రచిత్తి వరించెన్. 136

క. తనయులఁ గాంచెను బలువుర, ఘనబలులై దైత్యదనుజగణసంయోగం
బునఁ బుట్టుట గురువిక్రమ, మునఁ దగ దుర్వారగర్వమునఁ బొల్చిరిలన్. 137

వ. సైంహికేయులు మహాబలులు త్రయోదశసంఖ్యాకులు వంశ్య, శల్య, నల, బల, వాతాపి, నముచినామకులు, నిల్వల సృమ, ఖాంజిక, నరక, కాలనాభ, సరమాన

స్వరకల్పనామకు లైరి హ్రాదునకు మూషకహంతులను నిరువురుకొడుకులు గల్గిరి
మారీచుండు సుందువలనఁ దాటకయం దుద్భవించె. వీరు దానవశ్రేష్ఠులు. దను
వంశవివర్ధనులు. వీరిపుత్త్రపౌత్త్రాదులు సహస్రసంఖ్యాకులు. 138

క. వినుఁ డవ్వల సంహ్రాదుం, డనుదైత్యున కాత్మజన్ము లైరి బలయుతిం
గనిననివాతకవచుఁ లనఁ, గ నుర్విఁ బ్రఖ్యాతు లైరి గాఢతపములన్. 139

ఆ. తామ్ర యనెడునాతితనయులు వైద్యుతుల్, మూఁడుకోట్లుసుతుల భూరిబలుల
గనిరి వార లెల్లఁ గడఁగి మణిపురిని, గాఁపురంబుచేసి రేపుమీఱ. 140

క సురలకుఁ గూడ నవధ్యులు, దురమున నర్జునునిచేతఁ ద్రుంగిరి వీరల్
పరికింపుఁ డింక సృష్టిని, వరమునులారా! వచించువాఁడఁ గ మీకున్. 141

వ. శ్యేనియుఁ, గ్రౌంచియు, భాసియు, సుగ్రీవియు, శుచి, గృధ్రియు ననుకన్యకలు
సంతానంబు వెలయించిరి అందు నులూక ప్రత్యులూకకంబులం గ్రౌంచి కనియె.
శ్యేని యనునంగన శ్యేనంబులను, భాసి భాసనామకపక్షి విశేషంబులను, గృ
ధ్రిక గృధ్రంబులను, శుచి యనుతరుణి యుదకంబులం దిరుగాడుపక్షులను,
సుగ్రీవి యనునామె సత్త్వకులను గనిరి. అశ్వోష్ట్రగర్దభంబులు తామ్రాదేవి
వంశంబునఁ బుట్టినవిగాఁ బరిగణింపంబడు.

క. అరుణుఁడు గరుడుఁడు వినతకు, నిరువురు సుతులందు గరుడుఁ డెల్లనగౌకో
వరుఁ డై తనకృత్యంబునఁ, గరము భయంకరుఁ డనంగ ఖ్యాతిం గాంచెన్. 143

చ. సురసకుఁ దీవ్రవిక్రమము శోభిలురూపము వ్యోమమార్గసం
చరణ మనేకశీర్షము లెసంగుట లోనగుశక్తు లొప్పఁగా
నురగము లొక్కవేయి కడునుగ్రముగా జనియించె; నెన్నియో
శిరములు గల్గునాగములు చిత్రబలంబుల విక్రమంబులన్. 144

తే. వఱలి కద్రువుకడుపునఁ బ్రభవ మందె, వానిసంఖ్య సహస్రంబు వైనతేయు
వశమునం దెను విధిగతి వానియందు, బ్రముఖతం దగునాగాళిఁ బ్రస్తుతింతు.

వ. శేష, వాసుకి, తక్ష, కైరావత, మహాపద్మ, కంబ, లాశ్వతరనామకంబులు, నేలా
పుత్త్ర, శంఖ, కర్కోటక ధనంజయ మహానీల మహాకర్ణ ధృతరాష్ట్ర వలాహక,
కుహార పుష్పదంష్ట్ర దుర్ముఖ, శంఖ, శంఖపాలకపిల వామన నహుష శంఖరోమ
మణిప్రభృతినాగంబులుత్తమంబులు తత్పుత్త్రనాగంబులు శతసహస్రసంఖ్యాకం
బులు. వానియందు జతుర్దశసహస్రంబులు క్రూరంబు లై క్రోధాంతరంగంబు లై
దంష్ట్రాకరాళంబు లై యుండు స్థలపక్షివిశేషంబులు ధరాప్రసరంబు లని తెలి
యంబడు సురభియు గోమహిషంబులం గనియె. ఇర యనునింతి వృక్షలతలను
దృణజాతులను బుట్టింపఁజేసె. ఖశ యనునది యక్షరక్షస్సులం గాంచె ముని
యను లేను యచ్చరలం గనియె అరిష్టయను నంగన మహాసత్త్వ లగుగంధర్వు
లకుఁ దల్లియయ్యె ఇదియెల్లఁ గశ్యపదాయాదసంజ్ఞకంబులు. స్థాణుజంగమం

బులు నగు. వీనిపుత్రపౌత్త్రజాతంబు శతసహస్రసంఖ్యాకంబు. ఇది స్వారోచిష
మన్వంతరసృష్టిప్రకారంబు. వైవస్వతమన్వంతరంబున వారుణంబగు క్రతువు
నందు హోమంబుచేయు బ్రహ్మసృష్టిప్రకారంబు చెప్పంబడు. 146

చ. మును తనమానసోద్భవుల భూసురమౌనుల నేడ్వురన్ దనం
తన వనజాసనుండు సుతతన్ వెలయించెను; వారు సంతతిం
గనిరి; సురాసురుల్ కలహకాంక్షులు గాఁదగి పోరఁ జొచ్చి రా
దనుజులు వ్రందిరేచి తముఁ దార్కొని దేవత లార్తిముంపఁగన్. 147

చ. దితియు వినష్టపుత్త్రియయి దీనతఁ గశ్యపుఁ జేరి కష్టమీ
గతి జనియించె నాకనుచు గాఢతరంబగుభక్తిఁ బూని సం
తతపరిచర్యలం దనిపె దాన నతండును దృప్తుఁ డౌచు నా
యతివను గోరు మొక్కవర మంచని యాదృతిఁ బల్కె నామెయున్. 148

చ. తనయు నొసంగుమా యల శతక్రతుఁ జంపఁగఁ జాలుతేజముం
గని యలరారఁగావలయు గాదిలిపుత్త్రుఁడు వాఁ డటంచు వేఁ
డిన నిజదారవాంఛయు గడిందియె యైన నొసంగె సత్తపో
ఘనుఁ డగుకశ్యపుండు సురకాండము భీతిలుచుండ నయ్యెడన్. 149

చ. వరము నొసంగువేళ నొకవాక్యముఁ బల్కె నితంబినీమణీ
వరమిది దుర్లభంబగుట వజ్రినిజంపెడుపుత్త్రుఁ గాంచఁగా
నిరుపమరీతి గర్భమును నీవు శతాబ్దము లొక్కరీతి నా
చరితశుచిత్వయోగమునఁ జక్కఁగ దాల్పుమ యట్టు లయ్యెడున్. 150

చ. కలుగుసుతుండు సుంతయును గానిపనిన్ మదిఁ బూనరాదు నాఁ
గలికియు నట్ల యంచుఁ బతిగాఢకృపన్ ధరియించె గర్భ మం
త లలితసద్వ్రతాచరణతత్పర యయ్యెను బూన్కి మానిరా
ట్కులపతి యైనకశ్యపుఁడు కోమలికోరికఁ దీర్చి యంతటన్. 151

క. అమితౌజసు లయి మించెడు, నమర్త్యులకునెల్ల నీశుఁ డై నెగడెడుపు
త్త్రు మహితుఁ గనఁ జేసి దితిన్, సమగ్రవాంఛితగఁ జేయుస్వాంతముతోడన్.

క. సురలకుఁ గూడ నవధ్యము, పరసూదనదక్షము నగు భవ్యసుతేజం
బరుదుగ నాగర్భంబున, గురుతరమగుశక్తిఁ జేర్చి కూర్చె నియతుఁడై. 153

తే. ఇట్టు లద్భుతతేజ మాయింతిగర్భ,మందుఁ జేరిచి తపము చేయంగఁగోరి
పుణ్యపర్వతమున కేగె భూరినియతి, నంత నింద్రుండు నాగర్భ మపహరింప. 154

క. తలపోయుచుండె వత్సర,ములు నూఱును నిండుతఱిని బోలఁతియొడల ని
మ్ముల నంతర మొక్కఁడు గనఁ,గలిగెం దనకోర్కిఫలము గాంచువిధమునన్. 155

క. చరణములం గడుగకయే, తరుణీమణి దితియుఁ దనదుతల్పమ్మున ని
ర్భరనిద్ర నొందె నింద్రుఁడు, తరుణంబిదె యుత్తమమని తలపోసి త్వరన్. 156

సీ. దితికుక్షిఁ జొచ్చెను శతకోటి కరమునఁ గ్రాలఁగా; నద్భుతగర్భ మంత
సప్తభాగములుగఁ జయ్యన ఖండించె వజ్రభేదితమగు వారిజాక్షి
గర్భ మయ్యెడ నేడ్చెఁ గట్టిగా నంతట నేడ్వకు మనుచు నాయింద్రుఁ డలుక
నొక్కొక్కభాగంబు నుగ్రుఁడై యేడుగా ఖండించెఁ బవిచేత ఖండము లవి
తే. పరఁగెను మరుత్తు లనఁగ నో బ్రహ్మమాను
లార! యేడ్చెడు తఱి వజ్రి యారసి యిటు
పలికె మీరు మరుత్తులై ప్రబలుదురని
యట్లె వారెల్ల లోకవిఖ్యాతిఁ గనిరి. 157

వ. వారెల్ల నింద్రునకు సహాయులై నలువదితొమ్మిదిసంఖ్యమరుత్తులై వెలసిరి. ఆగణంబులకు వేర్వేఱ నొక్కొకండు గణవర్యుండై యుండు అట్లుండువారికి సృష్టికర్తృత్వంబు హరి యొసంగె. వారెల్ల రాజ్యాధిపతులై వీర, కృష్ణ, విష్ణు, ప్రజాపతి, పర్జన్య, తప, నానంతు లనం బ్రఖ్యాతులైరి. 158

తే. జగమునం దంతటన్ వారెసంగి రిద్ధి
భూతసర్గ మిద్దానిని బూర్ణభంగి
నెఱుఁగువారికిఁ గలుగ దావృత్తి మరల
నింకఁ బరలోకసాధ్వస మెట్లు కలుగు. 159

అంగపుత్త్రుఁడగువేనుని మునులు శపించుట.

చ. నరపతిచంద్రుఁడైన పృథునాముని వేదనృపాలుపుత్త్రు నీ
ధరణికి రాజుఁ జేయుచుఁ బితామహుఁ డెల్లర కట్లె రాజ్యముల్
వరుస విభాగపద్ధతిని బాగుగ నీయఁ దలంచె నెట్లనన్
నిరుపమఖేటభంబులకు నిర్మలయజ్ఞతపోలతాళికిన్. 160

క. ధరఁగలద్విజులకు సోమునిఁ, బరిపాలకుఁ జేసి రాజ్యపట్టము నొసఁగెన్
వరుణుని జలములకున్ రా,ద్వరులకు వైశ్రవణుఁ జేసెఁ బరిపాలకుగన్. 161

సీ. ఆదిత్యులకు విష్ణు వధిపతి యని పల్కె వసువులకెల్లను బావకునిని
బ్రభువుగా నియమించె వాసవునిన్ మరుత్తతికి దక్షునిఁ బ్రజాపతులకు మఱి
దైత్యదానవుల కుద్దామతేజుండగు ప్రహ్లాదుఁ బితృసమవాయమునకు
వైవస్వతుం డనఁబరఁగు నాయమునిని యక్షపార్థివులను రాక్షసులకు
తే. భూతములకుఁ బిశాచసమూహములకు, శూలపాణిని శంకరు; శైలములకుఁ
దుహినధాముని జలధి నదులకు నాథు,లనుగ నొనరించె బ్రహ్మ విలాస మలర.

క. పతిగంధర్వులకెల్లను, హితమతియగుచిత్రరథు నహీనబలుని నా
గతతికి వాసుకి సర్ప,ప్రతతికిఁ దక్షకుని జేసెఁ బ్రభువులు గాఁగన్. 163

క. వారణసముదాయమునకు, నైరావతమును దురంగమావళికెల్లన్
గోరిక నుచ్చైశ్శ్రవమును, వారిజగర్భుండు పతుల వరుసం జేసెన్. 164

క. గరుడుని బక్షులకు భయం,కరశార్దూలంబు మృగనికాయంబునకున్
వరవృషభము గోవులకున్, దరువులకున్ బ్లక్షుఁ బతులఁ దగ నొనరించెన్. 165

ఉ. వారిజసూతి రాజ్యములఁ బద్ధతిగా విభజించి రాజులన్
గోరిక నిల్పియించుచుఁ గకుప్పులఁ గాచెడుశక్తి గల్గున
వ్వారల నిల్పియించె నిటు బాహుబలంబునఁ బెంపుఁగాంచుచున్
దూరుపుదిక్కు నేలఁదగుఁ దోడనె సాధుసుధన్వుఁ డాదృతిన్. 166

క. వైరాజుఁ డను ప్రజాపతి,కూరిమిపుత్త్రుం డతండు కొదువపడని ధ
ర్మారంభుఁ డౌటఁ బూనుత, మీరాజ్యము నేల ననుచు హితమతి మఱియున్.

తే. కర్దమాఖ్యప్రజాపతి కన్న శంఖ,పదుఁడు దక్షిణదిక్కును భవ్యరీతి
నేలఁగాఁ దగుఁ బశ్చిమ మేలుఁగాక,యచ్యుతుండయి రజసునియాత్మజుఁడయి.

క. ధరఁ గేతుమంతుఁ డనఁగాఁ, బరఁగినఘనుఁ డుత్తరమును బర్జన్యుఁడనన్
నిరుపమయశ మొంది ప్రజా,వరు నాత్మభవుండు బాహుబలశాలి యుఁకన్. 169

వ. హిరణ్యరోముం డనఁ బ్రసిద్ధినొందినవాఁడు పాలింపవలయు. అని పలికి వారి
నభిషేకించె. వారిచే సప్తద్వీపయు సప్తనయు నగునీయుర్వి ధర్మంబునఁ
బాలింపఁబడుచున్నయది. 170

తే. రాజసూయాభిషిక్తుఁ డై రాజ్యమందు
నియతి మీఱఁగఁ బృథుభూమినేత దిక్ప
తులు సమాదృతిఁ బొగడ నిర్ధూతపాపుఁ
డగుచు రాజ్యంబు నేలె ధర్మాభినిరతి. 171

క. మునులారా! చాక్షుషుఁ డను, మనుకాలము గడువ ధర్మమార్గముఁ బ్రోవం
గను వైవస్వతమను విలఁ, దనయధికారంబుఁ జూపెఁ దగువిధ మలరన్. 172

క. ఈమనుకాలపుఁగృత్యం, బోమౌనివరేణ్యులార! యొగిఁ దెల్పెద మీ
కీమహితుచరిత మెంతయు, నామోదము నిచ్చు వినఁగ నాదృతి యున్నన్. 173

క. చరితం బిద్ది పురాణాం,తరముల నతివిస్తరతను దాల్చెనన భూ
సురమౌను లిట్లు ప్రశ్నిం,చిరి సూతా! పృథుభవంబుఁ జెప్పుము సరిగన్. 174

క. అతఁ డెట్లు పిదికెనో యీ, క్షితి నంతన్ దేవమౌని జిష్ణులు పితరుల్
దితిజులు నాలుగు యక్ష,ప్రతతులు తరువులు పిశాచపర్వతవరముల్. 175

క. ధరణిసురులు గంధర్వులు, గురుతర రాక్షసులు మీఱుకోర్కులచే నీ
ధరఁ బిదికిరో యేపాత్రము,ల రహిన్ గైకొనిరో చెప్పుము లలితభణితులన్.

క. క్షీరవిశేషము వత్సము, లారయ నెట్టెట్టి వగునో యావిధము నదే
కారణమున వేనుండను, భూరమణుని కరము మౌనిపుంగవు లెల్లన్. 177

క. వలదిఁక మొఱ్ఱో యనఁగా, బల మలర మథించినారొ వారని క్రోధం
బుల మౌను లేల పూనిరో, తెలుపుమ యోసూత! మాకుఁ దెల్లముగాఁగన్.

చ. అన విని సూతుఁ డిట్లనియె హర్షము పైఁబయిఁ బొంగుచుండఁగా
మునివరులార! వేనపృథుభూపులదౌచరితంబుఁ జెప్పెదన్
వినుఁ డిఁక నానుపూర్విగను విస్తృతిగాఁ గడుశ్రద్ధఁ బూని యీ
వినుతకథన్ గుచిత్తునకు వేదహితవ్రతదూరవర్తికిన్. 179

క. కృతమెఱుఁగనినరునకు మఱి,హితున కశిష్యునకుఁ దెల్ప నెవ్విధిఁ జెల్లున్
శ్రుతిహితమిది కీర్తికరం, బతులస్వర్గ్యంబు ధన్యమాయుఃప్రదమున్. 180

తే. అతిరహస్యంబు నగుదీని ననువదింతు
ననుదినం బేనరుఁడు దీని నలరి చదువు
విను ద్విజర్షులనుండి యావిమలచిత్తుఁ
డఖిలదుఃఖవిదూరుఁ డౌ ననఘులార! 181

చ. కలఁ డొకభూపుఁ డత్రిమునికల్పుఁడు ధర్మరతుండు నత్రివం
శలలితజన్మమంది క్షితిఁ జక్కఁగ నేలెడువాఁడు కీర్తిచే
విలసిలువాఁడు నంగుఁడను విస్తృతతేజుఁడు మున్ను వానికిం
గలిగెను వేనుఁడన్ సుతుఁడు ఖండితధర్ముఁడు దుష్టశీలుఁడున్. 182

తే. మృత్యుసుతయాసునీథ కీమేదినీశుఁ
డాత్మజుఁడు తల్లిదండ్రులయఘమువలన
స్వీయధర్మంబు నవ్వలఁ జెర్చి స్వేచ్ఛఁ
గామలోభావృతుండయి కడఁగి తిరిగె. 183

క. ధరణీశుఁ డతఁడు చక్కని, నిరుపమధర్మాశ్రయమయి నెగడి తనదియా
మరియాద వదలి శ్రుతిధ,ర్మరతిన్ విడనాడి పాపరతుఁ డయ్యెఁ గడున్. 184

చ. అరుదుగ నిట్లధర్మరతి నందిన వేనునిరాజ్యమందు నే
నరుఁడును వేదరాశిపఠనంబున నాదృతిఁ బొందఁ డయ్యె న
ధ్వరములు సాగవయ్యె నరపాలకురీతినె స్వేచ్ఛమీఱఁగాఁ
దిరిగిరి మర్త్యు లెట్టిక్రతుదీక్షను బూనఁ డదెవ్వఁ డేనియున్. 185

చ. హుతమగుయజ్ఞభాగముల నుల్లము లెంతయు మోదమంద నా
శతమఖముఖ్యులున్ గొనఁగఁ జాలకపోయిరి హోమకృత్య మీ
క్షితి నిఁకఁ జేయరాదు మఖసిద్ధికి యత్నము చేయరాదటం
చతఁడు ప్రజాళి కాజ్ఞనిడె నంతను చెంతకు నేగుదెంచుటన్. 186

తే. ఇట్లు క్రూరప్రతిజ్ఞ నయ్యల నెసంగఁ, జేసి యంతట మానక రోసమూని
పూజ్యుఁ డన నేనె యష్ట నాఁ బొగడఁ దగిన, వాఁడ నేనే మఖంబేన వరుఁడ నేనె

క. క్రతురక్షకుఁడను నేనే, క్షితి నిఁక యజ్ఞంబు మీరు చేయుఁడు ననుఁగూ
ర్చి తగన్ హోమము నగ్లే, జతనంబుగఁ జేయుఁ డనుచు శాసించెఁ గటా. 188

క. మరియాదమీఱి స్వేచ్ఛగఁ,గరమున్ గ్రహియించు వేనుఁ గని ధర్మరతిం

బరఁగు మరీచిప్రముఖులు, ధరణీశుని వానిఁ గాంచి తగువినయమునన్. 189

క. పరమేశప్రీతిగ నధ్వరదీక్షను మేము పెక్కువత్సరములు పూ
నురతిం దాల్చితి మోభూ,వర! నీవు నధర్మరక్ష వలదిఁకఁ బూనన్. 190

క. మనుజేంద్ర! సనాతన మై, తనరారెడు ధర్మ మిద్ది దాని నడంపం
జను నే; యత్రిమునికులం,బునఁ బుట్టితి నీవు మర్త్యముఖ్యుఁడవు కదా. 191

ఉ. మానవులన్ దయామతి సమస్తవిధంబులఁ బ్రోతునంచు మున్
బూనితివీవు దీక్షలను బోలఁ దలంపుము దాని నంచు న
మ్మౌనులు పల్క నవ్వుచు క్షమాపతి వేనుఁ డధర్మవేత్తయే
గానఁ గుబుద్ధి నూని పలుకం దొడఁగెన్ మదమత్తుఁ డై తగన్. 192

సీ. ధర్మంబు సృజియింపఁ దగినవాఁ డెవ్వఁడు నేఁ గాక యెవనిచే నేను ధర్మ
పద్ధతి వినఁదగు బలతపశ్శ్రుతసత్యములను నాకెవ్వఁ డీభూతలమున
సముఁడు కలఁడు భూతసంతతికిన్ స్రష్టగా ధర్మజనకునిఁ గాఁగ నన్నుఁ
దలఁపుఁడీ మతి సంపదలు పోవ మీరెల్ల నన్నెఱుంగరు నిజమెన్న నిద్ది

తే. యేఁ దలంచినఁ బృథ్వి దహింతునొండె
జలములన్ ముంతునొండె యీక్షమను దివిని
నడ్డగించెదనొండె సత్యంబు దీన
సంశయము లేదు నా విని సకలమునులు. 193

క. గరువము మోహము నాభూ,వరునకు లేకుండఁ జేయ వాంఛించియు శ
క్తిరహితు లై క్రోధంబున, వరధర్మముఁ జెఱుపఁబూనువాఁ డని మిగులన్. 194

ఆ. అతని బిగియఁ బట్టి యార్చుచు బలశాలి
యైనయతనియూరు వట్టె పూని
మౌను లెల్లఁ గూడి మథియింప నందుండి
హ్రస్వతరశరీరుఁ డగుపురుషుఁడు. 195

క. అతిశయకృష్ణద్యుతి యై, క్షితిపైఁ బడి భీతుఁ డగుచుఁ జేతులు ముకుళిం
చి తగన్ నిల్వఁగ నత్రియు, నతివిహ్వలునిన్ నిషాదుఁ డనియెను వానిన్. 196

క. మునులార! నిషాదాన్వయ,మున కధిపతి యాతఁ డయ్యెఁ బూన్కి నతండే
జనియింపఁ జేసె ధీవరు, లను వారిన్ వేనకల్మషాత్మజుల నిలన్. 197

తే. వింధ్యపర్వతవాసు లై వెలయు తుందు,రులు తుషారు లధర్మమతులు తలంప
వేనకల్మషజనితులే మౌనులార, యంతట మహాత్ములగుమౌను లరసి యరసి.

క. జనపతి దక్షిణహస్తం,బు నరణికరణిన్ మథింపఁ బూనిరి క్రోధం
బున దానినుండి పృథువను, జనపతి యుదయించె నగ్నిసమతేజుం డై. 199

చ. తనదగుదివ్యదేహరుచిఁ దద్దయుఁ దోఁచెడు నగ్నిహోత్రుఁడో
యనునటు ప్రజ్వరిల్ల వెస నాతఁడు వెల్వడి భూరిరావ మై

వనటను గూర్చు నయ్యాజగవం బనుచాపము దాల్చి కత్తళం
బును రుచిమించుదాని శరముల్ భయదంబులు నొప్పునట్లుగన్. 200

క. ధరియించి మించె నాతని, వరజన్మముఁ గాంచి భూతవారము మోద
స్ఫురణంబునఁ బొల్చెను మునివరులున్ హర్షించి రంత, వనటం గనుచున్. 201

క. వేనుఁడు స్వర్గంబునకున్, దా నరిగెను మహిమమును తగుతనయుఁడు పుట్టం
గా నాతఁడు పున్నామక, మౌనరకము నొంద కరిగె నమరవసతికిన్. 202

శా. భూనాథుం డితఁ డైన మే లనుచు నబ్ధుల్ ప్రోదినుల్ రత్నతో
యానూనప్రియవస్తువుల్ గొనుచు నత్యంతప్రమోదంబునం
గానన్ వచ్చె మహాభిషేకమహముం గల్పింపఁగా బ్రహ్మయున్
మౌనుల్ నిర్జరసంఘముల్ గొలువ సమ్మానంబు దీపింపఁగన్. 203

క. అరుదెంచె స్థావరంబులు, చరములు నగుభూతతతులు చనుదెంచి మహీ
వరుగా నభిషేకించెను, బరమేష్ఠియు సమ్మతింపఁ బార్థివుఁ డంతన్. 204

తే. రాజరాజను పేర విరాజమానుఁ, డగుచుఁ బ్రజలను రక్షించె నతని నిట్లు
శాస్త్రయుక్తపథంబున సర్వరాజ,విభునిగా నభిషేకించి విప్రముఖులు. 205

క. రాజేంద్రుండవు కమ్మని, యోజం బల్కఁ బ్రతాప ముట్టిపడంగా
నాజగదీశుఁడు వైన్యుఁడు, రాజత్తేజుండు నగుచుఁ బ్రజలం బ్రోచెన్. 206

క. జనకునిచే నపరంజిత,జనులెల్లం బ్రీతి నొందఁ జక్కని మనిచె న
త్యనురాగంబును జనులుం, గనుటన్ రా జనెడుపేరు కడు సిద్ధించెన్. 207

చ. జలనిధిఁ జేరఁబోవు జలసంతతి పోవక నిల్చెఁ బర్వతం
బులు చనఁ ద్రోవ నిచ్చె ధ్వజముల్ గన వించుక భంగ మంత నీ
యిలయు నకృష్టపచ్యయయి యెల్లరకుం దమిఁ దీఱ సస్యరా
సుల నొసఁగెన్ దలంపుననె శుభ్రతరాన్నము గల్గె నత్తఱిన్. 208

ఉ. ధేనువు లెల్ల కామములఁ దృప్తిగఁ బిండెను వృక్షసంతతిన్
గానఁగ నయ్యె నెల్లపుటకంబులయందు మధుస్రవంతి యి
ట్లానరనాథుకాలమున నద్భుతరీతి సుఖంబు గల్గె న
మ్మానవరాజి కంత బహుమానము మీఱఁగ బ్రహ్మ యాదృతిన్. 209

చ. క్రతు వొనరించుచుండఁ గడఁకన్ జనియించెను సూతినుండి య
ద్భుతముగ మర్త్యుఁ డొక్కరుఁడు భూరియశుం డయి బుద్ధివైభవం
బతులిత మై యెసంగ నతఁ డంతట సూతసమాఖ్య నొంది సు
స్థితి గనె మాగధుం డనఁగఁ జిత్రతరాకృతి యొక్కఁ డయ్యెడన్. 210

క. జనియించెఁ బృథుని నుతియిం,పను మౌనులు చక్కఁదలఁచి భక్తి మెఱయునా
జనులను ప్రేమను బిల్చి పృథునినుతులం బ్రీతుఁ జేయుదురుగాక యంచున్. 211

క. ఇది మీ కర్మమునకున్, ముద మొసఁగం దగినదగును భూపతియు నితం
డు దగం బాత్రుఁడు నా విని, సదయాత్ములు మౌనివరులు చక్కఁగఁ బలుకన్.
క. విని సూతమాగధులు మే, మనిశము సురమౌనివరుల సర్వానుతులచే
తను ముద మొందఁగఁజేయుదు,ము నరేంద్రునికృత్యశౌర్యముల లక్షణమున్.
తే. యశము నెఱుఁగమి నేమని యభినుతింతు
మితఁడు తేజస్వియే యగు నితనిగుణము
లనువదింపుఁడు నా విని మునులు పలికి
రితని భావికృత్యంబుల నెల్ల మీరు. 214
క. అనువాదముచేయుచుఁ జక్కనిరీతిం బొగడుఁ డింకఁ గార్యములను వే
నిని జేయునో మహీశుం, డనుదినము నెఱింగి పొగడుఁ డవనీపతినిన్. 215
సీ. అది మొదలుగ లోకమం దెల్లమౌనులు స్తవముల నాశీర్వచనము లిముడు
న ట్లొనరించుట యాచార మయ్యెను సూతమాగధవందు లాతతముగఁ
బొగడ నాపృథుభూపపుంగవుఁ డెంతయు నానందపరవశుం డగుచు సూతు
నకు జలప్రాయమైనజనపదం బిచ్చె మగధదేశం బిచ్చె మాగధునకు
తే. నమ్మహారాజుఁ గాంచి ప్రహర్ష మలర
నీమహాత్ముఁడు వీరికి వృత్తు లొసఁగె
దాత యీతఁడె భూవరతల్లజుఁ డని
పొగడి జను లెల్లఁ బోయి రాభూపుకడకు. 216
క. తను వృత్తుల వేఁడను వచ్చినవారలఁ గాంచి మౌనిజిష్ణులు భూపా
జనులను గావుమటం చని, వినయమునం బల్క వారి వీక్షించి తమిన్. 217
క. మే లొనరింపం గోరుచు, భూలలనాధీశుఁ డేమిపోలునొ చేయం
గా లలితరీతి ననుచున్, బోలన్ యోజించి చాపముం గొని కడఁకన్.
చ. శరములఁ గూర్చి దోర్బలము చక్కఁగఁ గన్పడ భూమిఁ జీల్పఁగాఁ
బరుగిడె వైన్యభూమిపరిపాలకభీతిని గుంది ధేనువై
ధరణియుఁ బర్విడెన్ బృథువు దానిని వెన్కొని చాపవర్యభీ
కరరవ మొప్పఁ బోయెఁ ద్రిజగంబులు చుట్టియు నిల్వ రామిచేన్. 219
క. కనుఁగొనియెఁ జాపహస్తునిఁ, దనముందఱ నున్నభూమిధవు ధరణియుఁ దాఁ
జనుచుండి మరలునప్పుడు, తనుఁ జంపం దీక్ష్ణబాణదహనార్చులచేన్. 220
క. వెలుఁగొందువాని నచ్యుతుఁ, గలితమహాయోగు దేవగణదుస్సాధ్యున్
బలశాలి శరణు చొచ్చెను, నిల వేఱొకరక్షకుం డహీనుఁడు లేమిన్. 221
చ. కరముల దోయిలించి త్రిజగంబులఁ బూజను గాంచినట్టి యా
ధరణియు నిట్లు పల్కె నృపతల్లజ స్త్రీవధ మెన్నఁ బాపభూ

ధరములఁ బెద్దదా నని యెదం దలపోయవు నన్నుఁ జంపి యె
క్కరణిఁ బ్రజాళిఁ దాల్చెదవొ గాని యెఱుంగ జగంబు లన్నియున్. 222

క. నాయందె నిల్చియున్నవి, పో యీ ప్రజనెల్లఁ దాల్తు బుధులు పొగడ న
న్నీయెడఁ జంపినఁ జచ్చెదు, నీయఖిలప్రాణికోటి యింత యెఱుఁగుమీ. 223

క. జనులకు మేలుం జేయఁగ, మనమునఁ గోరుదువయేని మానిని నన్నున్
జనితక్రుధఁ జంపందగ, దని మఱియుం బల్కె వేనునాత్మజుతోడన్. 224

క. వినవయ్యా! హిత మొక్కఁడు, వినిపింతు నుపాయ మూని విస్తృతకృత్యా
ళిని బూనన్ సిద్ధించును, జనపాలక! త్వరయుఁ గార్యసంఘముఁ జెఱచున్. 225

తే. ఏయుపాయంబు చేత నీ వీప్రజాళిఁ, జక్క ధరియింపఁ జాలుదో నిక్క మట్టి
దగునుపాయంబుఁ జెప్పెద నవధరింపు, నన్నుఁ జంపిన జనరక్షణమ్ము నీవు. 226

క. ఒనరింపఁజాల వందున, జనవర! యనుకూల నగుదుఁ జయ్యనఁ గ్రోధం
బును వదలుము సిద్ధించును, బని యీయది మఱొకపల్కు పాటింపు మదిన్.

క. విను తిర్యగ్యోనులయం,దును జంపందగదు సుమ్ము తొయ్యలి నను ప్రా
జ్ఞవాక్యముఁ గొని ధర్మము, మనమలరం బ్రోవవయ్య మహితమనీషా 228

చ. అని యిటు పెక్కుభంగుల మహత్తరధర్మము నెన్ని పల్కు మే
దిని గని సాధుబుద్ధియయి దెప్పునఁ గోపము మాని ధర్మ మె
య్యనఁ బరిరక్షచేయఁదగు నంచుఁ దలంచి వచించె భూమితో
జనుఁ డెవఁడైన నారయక స్వప్రియ మొక్కఁడు గోరి దానికై. 229

తే. పెక్కుప్రాణులఁ జంపునో నిక్క మొరుని
కార్యమునకయి యివ్విధిఁ గడఁగి చేయు
నో యఘం బొందు నాజనుఁ డొక్కప్రాణి
తెగిన బహుజీవరాసులు తృప్తిగనిన. 230

క. పని యది చేయుట పాపం, బనఁ జెల్లునె లేదు పాప మట్లుపపాపం
బనునదియుఁ గానఁ బ్రజలం, గొనకొని ప్రోవంగ నిన్నుఁ గూల్చెద నేనున్.

సీ. నామాట విని నీవు ప్రేమ జగద్ధితంబును జేయకున్న నిన్నును వధింతు
మచ్ఛాసనము మీఱు తుచ్ఛవు గావున నట్లొనరించి ప్రఖ్యాతిఁ బడసి
ప్రజల నేనే తమిఁ బాలించువాఁడను నీవు నాశాసనమే విహితము
చేయఁగాఁ దగునంచుఁ జింతించి ధర్మజ్ఞులం దగ్రగణ్యవై యలరుదాన

తే. వాట నీప్రాణికోటుల నాదరమున, బ్రదుకున ట్లొనరింపు మిప్పనికిఁ జాలు
దాన వీవెకదా సుతాత్వమ్ము నీవు, కనుము నాయందు నీశరంబును ద్యజింతు.

క. భీకరదర్శనమై తగు, నీకాండము నిన్నుఁ జంప నెత్తినదానిన్
బోకార్చక వదలెద నని,యీకరణిం బల్కె భూమి యిట్లను నృపుతోన్. 233

క. ఒనరింతు నీవు చెప్పిన, పనులన్నియు సంశయింపఁ బనిలే దిఁక నా
కనువగువత్సముఁ గూర్పుము, తనివోంద స్రవించు పాలు తద్వత్సలతన్. 234

క. ఎల్లెడలన్ సమముగ నే, యుల్లసిలం జేయవయ్య యోధర్మాత్మా!
వెల్లివిరియు పాలను నే, నుల్లము రంజిల్లఁ గురియ నొక్కవిధమునన్. 235

క. ప్రవహింపవలయు నంతట, నవిహిత మొక్కింత లేనియటుల ననియెఁ; మహా
నివరేణ్యులార! వినుఁ డీ, యవలం గొనసాగుకథను హర్ష మెసంగన్. 236

చ. ధరణి వచించినట్టి విహితం బగువాక్యము దానివేడ్క భూ
వరమణి యాలకించుచు సెబా సని బాహుబలంబు పొంగ భూ
ధరముల నందు నిందు వివిధస్థలభాక్కులఁ జాప కోటి స
త్వరముగఁ జిమ్మె దాన నభివర్ధితరూపము లయ్యె శైలముల్. 237

చ. మునుపటిసృష్టియం దలరు భూమి సమంబుగ లేకయుండెఁ బ
త్తనములు గ్రామముల్ బహువిధంబుగఁ జిందఱవందరైన రీ
తిని దగియుండె; సస్యములు ధేనుసమూహసురక్షణంబు లే
క నిఖలధాత్రిశోభ గనఁగాఁ దగకుండె నిఁకేమి చెప్పుదున్. 238

తే. కృషియు వాణిజ్యమును లేక కేవలఫల
మూలములు చెన్నుమీఱెఁ బ్రభూతలోభ
మత్సరంబులు లేకుండె మఱియనృతము
వృద్ధిఁబొందక యుండె నుర్విని సతతము. 239

క. వైవస్వతు నంతరమిల, నీవిధి గా మానులార యివియన్నియు నీ
భూవరుఁడౌ పృథునాముం, డావహిలం జేయ వఱలె నతివిభవమునన్. 240

సీ. ఎందెందు నీభూమి యొసఁగె సమంబుగ నందందు నివసించి రఖిలజనులు
ఫలమూలములు ప్రజాపటలి కాహారమౌ నతికష్టముగ వృత్తి నంది రనుచు
వినఁబడియెడు; నంతఁ బృథునరేంద్రుండు స్వాయంభువు వత్సమై యలరునట్టి
లొనరించి భూగోవు నొప్పుగఁ దనచేతఁ బిదికె బహురూపవివిధసస్య

తే. ములను శౌర్యంబు దిక్కుల వెలయనట్టి, సస్యచయముల చేతనె సర్వమనుజు
లిలఁ బ్రవృద్ధిని బొందిరి క్లేశుమీఱ, నాతఁ డొనరించె వృత్తుల నందఱకును. 241

ఆ. మునులు సురలు పితరులును ఫణి గంధర్వ, యక్షపుణ్యజనులు నట్లె దైత్య
శైలభూరుహములు క్ష్మాధేనువునుబట్టి, తఱచి రనుచు వింటిఁ దపసులార. 222

క. వినుఁ డవ్వారికి వత్సం,బును క్షీరము దోగ్ధపాత్రమును వేర్వేఱై
తనరును వరుసగ వానిన్, వినిపించెద మునులు చాల వేడుకమీఱన్. 243

ఆ. వత్సముగను సోమువరశక్తి నొనరించి, పిదుకువాఁడు దేవబృందగురువు
గా ధరిత్రిఁ బిండఁగా బ్రహ్మపాత్రమై, పరఁగ ఛందసులు తపంబుగలిగె. 244

క. అవియే క్షీరము లయ్యెను, దివిజులు శతముఖుఁడు దూడతీరున నిలువన్
నవకాంచనపాత్రంబున, రవిదోగ్ధయుఁగాఁగ సురుచిరక్షీరంబుల్. 245

వ. ఓజస్కారంబులుగా లభియించె. పితరులు రజతమయపాత్రంబున యముండు వత్సంబుగా నంతకుండు దోగ్ధగా నిలువ క్షీరంబు సుధారూపంబున లభియింపఁ దృప్తినొందిరి. సర్పంబు లలాబూపాత్రంబునఁ దక్షకుండు వత్సంబుగా నైరావతఫణివరుండు దోగ్ధగా నిలువ విషం బనుక్షీరంబుఁ గాంచిరి. అసురులకు మధువు దోగ్ధయై విరోచనుండు వత్సం బై యాయసపాత్రంబునం బిండి మాయామయక్షీరంబు లభియింప సంతసించిరి. యక్షులకు వైశ్రవణుండు వత్సం బయ్యె. రజతనాభుండు దోగ్ధ యయ్యె. ఆమంబు పాత్రం బయ్యె. అంతర్ధానప యస్సు లభియించె. రాక్షసులకు సుమాలి వత్సంబు. రజతనాభుం డనుదానవుండు దోగ్ధ. కపాలంబు పాత్రంబు. క్షీరంబు శోణితం బయ్యె. గంధర్వులకుఁ జిత్రరథుండు వత్సంబు. పంకజంబు పాత్రంబు. సురుచి దోగ్ధ. క్షీరంబు గంధంబు. పర్వతంబులకు శైలంబు పాత్రంబు. హిమవంతంబు వత్సంబు. హేమగిరి దోగ్ధ. రత్నౌషధులు క్షీరంబు. వృక్షంబులకుఁ బ్లక్షతరువు వత్సంబు. పుష్పితసాలంబు దోగ్ధ. పాలాశంబు పాత్రంబు. ఛిన్నదగ్ధప్రరోహణంబు క్షీరంబు. ఇట్లు భూరూపధేనువునుండి బహువిధలాభంబులం బొంది యెల్లరు సంతసిల్లిరి. అట్టి భూమియె ధాత్రియు, విధాత్రియుఁ, బావనియు, వసుంధరయు నయి చరాచరప్రపంచంబునకెల్లఁ బ్రతిష్ఠాయోనియు నగు. మఱి సర్వకామప్రదాత్రియు దోగ్ధ్రియు, సర్వసస్యప్రరోహిణియు నై సముద్రాంత యై మేదిని యనఁ బ్రఖ్యాతిం గాంచె.

క. మునులారా! మధుకైటభ, దనుజులమేదస్సుచేతఁ దా నాప్లుత యై
తనరుట మేదిని యనఁబడె, నని బ్రహ్మవిదుల్ మహాత్ము లనిరి ధ్రువముగన్.

క. తరువాతన్ వైన్యుం డయి, నిరుపమవిఖ్యాతిఁ గనుచు నెగడు పృథుమహీ
వరునకు దుహితృతఁ గాంచుటఁ, బరఁగెను పృథ్వీసమాఖ్య పండితులారా. 248

క. వేను కుమారుఁడు చక్కఁగ, దీనిన్ విభజించి సన్మతిన్ శోధింపం
బూనుట సస్యాకృతిగని, జానుగఁ బురనగరవితతిశాలిని యయ్యెన్. 249

క. ఈరీతి సుప్రభావము,చే రాజిలి రాజవర్య సిద్ధఖ్యాతిన్
భూరిముదంబునఁ బొందుచుఁ, గోరి జనుల్ మ్రొక్క నెగడెఁ గుతలం బందున్.

ఆ. పూజ్యుఁ డగుచు వఱలె బుధులును వేదవే,దాంగపారగులు మహామతులును
బలికి రిట్లు పృథువె బ్రహ్మయోనియు నమ,స్కారమునకుఁ దగ్గుఁ డారయంగ.

క. నరపతులలోన శ్రేష్ఠులు, ధరణిపతిత్వంబుఁ గోరుధన్యులు పృథువే
నరపతులలోన నాద్యుఁడు, గురువిక్రమశాలి యనుచుఁ గోరికమీఱన్. 252

ఆ. వంద్యుఁ డనిరి; యుద్ధవాంఛనువిజయంబు, గలుగవలయు ననెడుకామ మలరు
యోధు లీపృథుండె యుర్విని నాదిరా, జగును వంద్యుఁడు నగునని పలుకుచు.

తే. వృత్తిదాతయు నితఁడె వేయేల యనిరి;
సంగరముచేయువాంఛను జనెడుయోధుఁ
డెవ్వఁడైనను బృథుధారణీశుఁ దలఁచి
చనిన జయమంది మరలు యశంబు వెలయ. 254

సీ. ధనము గోరినవైశ్యతతులచే వృత్తివిధాయకుఁ డీరాజు తలఁపఁ బడుచు
వందనంబులు చేయఁబడుచు మా కీతఁడె వృత్తి నిచ్చె నటంచు నెన్నఁబడుచు
నుండెను; శూద్రు లభ్యున్నతపరిశుద్ధహృదయులు పరమున హీన మనుచుఁ
గోరువా రీరాజుఁ గోరిక వందనములఁ దన్పవలయు నోమునివరేణ్యు

తే. లార! వత్సంబులును దోగ్ధ లారసి పయ
సులును బాత్రంబులును మీకు సొరిదిఁ జెప్పి
నాఁడ నింకేమి మీరు వినంగఁ గోరు
వారొ తెలియంగ నిప్పుడే పల్కుఁ డనియె. 255

## మూఁడవ అధ్యాయము.

### మన్వంతరచరిత్రము.

చ. అన విని మౌను లిట్టు లని రార్యవరా! మనుకాలముల్ గతిం
చినవి భవిష్యముల్ వినఁగ జిత్తము లాదృతి నొందుచున్న వీ
మనుకృతసృష్టి యెట్లు లరె? మానవకాల మదెంత? దానిరీ
తిని విడనాడకుండ నిఁకఁ దెల్పుము నావిని సూతుఁ డిట్లనున్. 256

క. శతసంఖ్యవత్సరంబులు, మితవాక్కుల నేవిధిన్ దమిం బల్కిన నే
యితిహాసము చెప్పఁగ నేవితమున శక్యమగుఁ దాని వివరింతు నెటో? 257

తే. సంగ్రహంబుగ వినుఁ డింక సాధుచిత్తు
లార! స్వాయంభువుం డన భూరికీర్తి
వెలయు మనువాద్యుఁ డయ్యె నవ్వల మనువనఁ
దనరు స్వారోచిషుండు నుత్తముఁడు పిదప. 258

తే. తామసుండును రైవత నామకుండు
చాక్షుషుండును సత్కీర్తిసాంద్రుఁ డగుచు
వెలయు వైవస్వతుండు నీయుల మనువయి
యున్న వాఁడు తత్పూర్వులు చన్న వారు. 259

వ. సావర్ణి, రైభ్య, రౌచ్య, మేరు సావర్ణిమనువులు నల్వురు రాఁగలవారు వీరిక్ర
మము విన్న యట్లు వచించితి. వారికాలంబున నుండుబుధులం దెల్పువాఁడ.
వారిపుత్త్రులను దేవగణబులనుగూడ వచియింతు. మరీచ్యత్ర్యంగిరసులు,
పులహ, క్రతు, పులస్త్య, వసిష్ఠులు నీ యేడుగురు బ్రహ్మపుత్త్రులు. వీ రుత్తర
దిక్కునందు జ్యోతిశ్చక్రంబున నివసింతురు. ఆగ్నీధ్రాగ్ని బాహు, మేధ్య, మేధా

తిథి, వసు, జ్యోతిష్మ, ద్యుతిమంతులు, హవ్యుండు ననువీరు పుత్త్రులు. ఇది యాద్యం బగుమన్వంతరం బని చెప్పంబడియె. ఔర్వుండు, వసిష్ఠపుత్త్రుండు, స్తంబ, కశ్యప, ప్రాణ, బృహస్పతిదత్తులు నత్త్రిచ్యవనులు ననువీరు వాయుప్రోక్తు లగుమహర్షులు వీరు మహావ్రతులు. దేవతలు స్వారోచిషమన్వంతరంబునఁ దుషితులు నా వినుతిం గాంచిరి. హవిఘ్నసుకృతులు జ్యోతి, రాపో, మూర్తి, ప్రతీప, నభస్య, నభోనామకులు, నూర్జుండు ననువారు స్వారోచిషమనుపుత్త్రులు. వీరు మహితాత్ములు. పృథ్వీపాలురు. మహావీర్యపరాక్రమోపేతులు నని కీర్తింపఁబడుదురు. ఇది ద్వితీయమన్వంతరం బని చెప్పంబడు ఇఁకఁ దృతీయమన్వంతరంబును వివరించెద. సావధానులరై వినుండు. వసిష్ఠపుత్త్రు లేడుగురు వాసిష్ఠు లని కీర్తింపంబడిరి. హిరణ్యగర్భునకు నూర్జనామకతనయులు గలిగి మహాతేజోవిరాజితు లైరి. ఈమన్వంతరగతు లగుఋషులఁ జెప్పెద నవధరింపుఁడు. ఔత్తమేయుం డనుమునిశ్రేష్ఠునివలన నిషోర్జస్తనులు, నూర్జుండును, మధు, మాధవ, శుచి, శుక్ర, సహులును, నభస్యుండును నభోనామకుండు నను పుత్త్రిదశకం బుదయించె ఆమన్వంతరంబున భానవులు దేవతలు మఱియును.

క. మునులార! చతుర్థుం డగు, మనువు ప్రజాపాలనంబు మహిమవెలయఁ జే
సినయంతరమును జెప్పెద,వినుఁ డీకావ్యాహ్వయుండుఁ బృథు వనుమునియున్.

తే. అగ్ని, జాహ్నులు మఱి ధాత యల్లె మహిమ
నలరుచున్నకపీవంతుఁ డనెడు మునియు
నవలివాఁడ కపీవంతుఁ డైరి సప్త
మునులు వీరు పురుణాళిఁ గనిరి కీర్తి. 262

క. తామసుఁ డనఁగా నొప్పెడు, నీమన్వంతరమునందు నెసఁగిరి దివిజుల్
నామమున సత్యు లనఁగా, నామనుపుత్త్రులవచింతు ననఘులఘనులన్. 263

వ. ద్యుతి, తపస్య, సుతపసులు, తపోభూత, సనాతన, తపోరతులు, నకల్మాషుండు, తన్వియు, ధృతియుఁ, బరంతపుండు నను నీపదుగుండ్రు విఖ్యాతులు. ఇది చతుర్థ మన్వంతరంబు. వాయుప్రోక్తంబు. దేవబాహు, యదుధ్ర, వేదశిరసులు, హిరణ్యరోముండు, పర్జన్యుండు, సోమజుం డగునూర్ధ్వబాహుండు, నాత్రేయుం డగుసత్యనేత్రుండు ననువీరు సప్తర్షులు అభుక్తరజసులు. ప్రకృతులు ననుదేవగణంబు లలరు. ఐదవమనువగు వైవస్వతుని యంతరం బింక వినఁదగు. ధృతిమంతుం డవ్యయుండు, యుక్త, తత్త్వదర్శి, నిరుత్సుకులు, నారణ్య, ప్రకాశ, నిర్మోహ, సత్యవాక్కృతు లనువారు రైవతమనుపుత్త్రులు. ఇంక షష్ఠసంఖ్యాకుం డగుమనువు నంతరంబుం జెప్పెద నని సూతుం డిట్లనియె.

ఆ. వినుఁడు మౌనిగణము భృగు వివస్వంతులు
నభసుఁడును సుధామనామకుండు

నతియు విరజసుఁడును నట్లు సహిష్ణువు
ననెడు నేడ్వు రైరి ఘనయశసులు. 265

వ. చాక్షుషమన్వంతరంబున దేవగణపంచకం బలరు. అప్రభూతులు, ఋభులు, దేవతలు, దివౌకసులు, లేఖులు నని వానిపేరులు. అంగిరసునకు మహత్తర తేజంబు లలరఁ గొడుకులు నాడ్వలేయు లనుపేర రురుప్రభృతులు దశ సంఖ్యాకు లుదయించిరి. ఇఁక సప్తమమన్వంతరంబు వినుండు. 266

తే. అత్రియు వసిష్ఠకశ్యపు లవల గౌత
ముఁడు భరద్వాజుఁడును గౌశికుఁడు ఋచీక
మునిసుతుం డగుజమదగ్ని యనెడునాతఁ
డేడ్వు రైరి మహర్షులు హితకరులయి. 267

సీ. ఆదిత్య రుద్ర సాధ్యవసు, మరుత్తులు నశ్వి, విశ్వేదేవు లనెడుత్రిదశు
లధికారపదమున నందియున్నారు, వైవస్వతు నంతరావసర మందు
నిత్తఱి నిక్ష్వాకువే యాదిగాఁగల తనుజాతదశక ముద్దామశక్తి
నలరు నమ్మనువున కావిర్భవించెను, మహితౌజసులు మహామతులు నామ
తే. హర్షులకుఁ గల్గుపుత్త్రులు నట్లె వారి
తనయులును దిక్కులందెల్లఁ దారె యగుచుఁ
నలరుచున్నారు సర్వమన్వంతరముల
ధర్మలోకరక్షణమును దారొనర్ప. 268

క. మును లేడుగురును వెలయుదు, రనఘులు వీరెల్ల మనువు నంతర మేగం
గను గృత్య మ్మొనరిచి బ్రహ్మనివాస మనామయంబు నందుదు రెలమిన్. 269

క. మను వంతట నూతనముగఁ, జను దేరఁగ సప్తమునఁ, జతురతఁ దగుచున్
మును లాస్థానముఁ జేరుదు, రనూనధర్మంబుఁ గాచు నాధృతి మీఱన్. 270

తే. ఇట్టిరీతినె మునిముఖ్యు లెల్ల యంత
రముల వెలయుచు నుందురు విమలచరితు
లార! రాఁబోవు సావర్ణి భూరికీర్తి
మనువు తత్కాలమున మహామౌనివరులు. 271

క. సురపథమున నెవ రెవ్వరు, పరఁగుదురో వారిఁ జెప్ప బాగుగడా యు
ర్వర ధర్మముఁ గావఁగ వత్తురు రాముఁడు సత్యవతిసుతుండును మఱియున్.

వ. ఆత్రేయుండు, భారద్వాజుండు, ద్రోణపుత్త్రుం డగునశ్వత్థామయు, గౌతముండు, నజసుండును, శారద్వంతుం డగుగౌతముఁడును, గౌశిక, గాలవులు, నౌర్వ, కాశ్యపులు ననువీరు సావర్ణిమనుపుత్త్రు లగుదురు. వైరియు, నధ్వరీవంతుండును, శమన, వసువులు, వరిష్ఠుం, డధృష్టుండు, రాజియు నను నీయేడుగురు వీరలు ద్విజపుంగవులు నగుదురు. వీరిని బ్రాతఃకాలమున స్మరిం

చిన సుఖంబు, యశస్సు, చిరతరాయుస్సును గలుగు. సావర్ణులనువారైదు
గురు. వారిలో నొకండు వైవస్వతుండు. తక్కినవారు ప్రజాపతిసుతులు.
బ్రహ్మపుత్త్రు లగువీరు మేరుసావర్ణతను బొందిరి. వీరెల్ల దక్షునకు దౌహిత్త్రు
లయి ప్రియయనుతరుణికిం గుమారులై రాజు లగుదురు. మఱియు మహా
తపోవిరాజితులై తేజశ్శాలురై మేరుపృష్ఠంబున నివసింతురు. రుచి యను ప్రజా
పతిపుత్త్రుండు రౌచ్యుం డనుమనువు. భూతి యనుదేవికిం గుమారుం డుద
యించి భౌత్యుం డనం బరఁగు. ఆతండును రుచికిం బుత్త్రుండే యగు. వీ రేడు
గురు రాఁగల మనువులు. ఈకల్పంబునం బాలింపం గలరు 273

క. వారలచే సప్తద్వీపారమ్యపురాన్విత యగునట్టిధరణి యో
ధారణి సురులారా! ధర్మారంభము మీఱునేల నౌ నిక్కముగన్. 274

తే. యుగసహస్రము పూర్ణమై యొప్పుదాఁక
వార లేలుదు రంతట బ్రహ్మతపము
చేత సప్తతియుగములు చెల్ల నొక్క
రొకరుగా వార లంతంబు నొందువారు. 275

సీ. మన్వంతరంబున మానులార, వినుండు సాగ్రసప్తతియుగంబగుఁ గృతాదు
లందు నియుక్తంబులై యుండుఁ బదునల్వు రనిమనుసంఖ్య విఖ్యాతమయ్యె
సర్వపురాణైకసహిత మా వేదంబు నందు మహాత్ములైనట్టి యీప్ర
జేశులకీర్తనం బిది చాల శుభదమౌ వీర లంతము నొంద ధారణిం బ్రజ

తే. లంత మొందుదురవ్వేల నవని మరలఁ, బుట్టుచుండుదు రిద్ధి చెప్పుటకు శక్య
మెట్టులగు శతవర్షంబు లీపనికయి, వ్యయ మొనర్చిన శక్యమే వరుస నగును? 276

వ. మన్వంతరంబులందుఁ బ్రజల విసర్గసంహారంబులు వినంబడుచుండు. సంహా
రాంతంబున దేవతలు సప్తర్షులం గూడి మృత్యుముఖంబునం బడక యుండఁ
గలరు. తపోబ్రహ్మచర్యశ్రుతంబులు వారికి సహజంబు లయి యుండు.
యుగసహస్రము సంపూర్ణం బగుట నిశ్శేషకల్పం బని చెప్పంబడు. అందు
భూతంబులెల్ల నాదిత్యరశ్ముల దగ్ధంబులగు. ఆకాలంబున మిగిలినభూతంబు
లాదిత్యులంగూడి సురశ్రేష్ఠుం డగుటఁ బ్రభు వగు నారాయణునిం బొందు.
ఆమహాత్ముండు సర్వభూతస్రష్ట యగుఁగదా. కానఁ గల్పాంతంబున మరల
భూతంబులం బుట్టించుచుండు. అవ్యక్తుండై శాశ్వతుం డగునతని వికృతంబె
యీజగం బని యెఱుంగుఁడు. మునులారా! సప్తమమను వగు వైవస్వతుని విస
ర్గంబు సాంప్రతంబు గావున దీనిం జెప్పుచు వంశప్రసంగవశంబున బురాతన
చరిత్రంబును జెప్పితి. ఏవంశంబున శ్రీహరి యుదయించునో యావంశచరిత్రం
బానుపూర్వికంబుగాఁ జెప్పెద వినుం డని లోమహర్షణుండు మరల నిట్లనియె.

## నాల్గవ అధ్యాయము.

### సూర్యవంశకీర్తనము.

క. మునివిభుఁడు కశ్యపుఁడు ద,క్షునికూఁతుం బత్నిగాఁగఁ గొని ద్విజులారా
కనియె వివస్వంతుం డను,తనయుని నాతనికిఁ ద్వష్టృతనయామణి యై. 278
క. తనుసంపద మించెడున,వ్వనజాయతనేత్ర సంజ్ఞ భార్య యయి యశం
బున మించి సురేశ్వరి యను,ఘనకీర్తిం గాంచె సూర్యకాంతయు నంతన్. 279
చ. లలితసురూపయౌవనవిలాసములన్ రహి మించి సత్తపం
బులఁ జెలువారు తేజమునఁ బొల్చి మహామతియయ్యు నత్తఁజన్
జలరుహమిత్త్రరూపమున సంతతతృప్తిని బొందకుండె; ను
జ్జ్వలతరసూర్యరూప మది చాల భయంకరరీతి వెల్గుచున్. 280
వ. తనదగు నంగసంధులను దగ్ధముచేసెడురీతి నొప్పఁగా
వనితకు నోర్వఁగాఁ దగనిభంగిఁ గనంబడె; సంజ్ఞ యంత సూ
ర్యునిగని రూప మీయదియె యొప్పనిరీతిని నండమున్ మృతిం
గను నటుచేయు నం చెలమి గన్పడఁ బల్కెను దాన నాతఁడున్. 281
క. అరుదండి దాని భావముఁ, బరికింపక యీమృతాండవరము రుచులచే
నిరతము వెల్గుట మార్తం,డరమ్యనామంబు మించె నా కని తలఁచెన్. 282
చ. వనరుహబంధుతేజ మదివారనిపూన్కిని ముజ్జగంబులన్
గనలఁగఁ జేయుచున్ వెలసెఁ గాని చ్యుతింగన కించుకంతయున్
దినదినవృద్ధినొందె ఖరదీధితి యాసతియందు నిర్వ్వరం
దనయుల నొక్కకన్యక ముదంబునఁ గాంచెను వారిఁ దెల్పెదన్. 283
క. సుతులం దిద్దఱును బ్రజా,పతులై రందాద్యుఁడయ్యె వైవస్వతుఁ డన్
సుతుఁ డల్లె శ్రాద్ధదేవుం, డతులయశోవంతుఁడై ప్రజాధిపుఁ డయ్యెన్. 284
తే. యముఁడు యమునయుఁ గవలైరి శ్యామవర్ణ
మైనతద్రూపమును గాంచి యతివ సంజ్ఞ
యోర్వఁజాలక స్వచ్ఛాయనుండి యొక్క
తరుణిఁ గల్పించె నాలేమ తత్క్షణంబ. 285
సీ. తచ్ఛాయనుండి యుద్భవ మంది మాయామయాకృతి వెలయఁగా నంజలితగ
నిలువంగఁబడి యిట్లుఁ బలికె శుచిస్మితా! నాచేతఁగాఁదగిన పని యెద్ది
నీయాజ్ఞఁ దలదాల్చి నిల్చెద శాసింపు మిష్టంబురీతి నా నెలమి మీఱ
సంజ్ఞయిట్లనిపల్కెఁ జనియెద నాతండ్రి యింటికి మేలగు నిచట నీవు
తే. నానిమిత్తము నీ వనుమాన మించు,కంతయేఁ బొంద కిట; నిల్వ నౌను తనయు
లిద్ద ఱీకన్యయును జాల నెలమిఁ గావఁ,దగుదు రని యొప్పగించి విధంబు దీని.
క. సరసిజహితునకుఁ దెల్పకు, మరవిందముఖీ యనంగ నామె పలికె నీ

కరణి వచింపక యుండెదఁ, దరుణీ నాకొప్పఁ బట్టి తరణి యడిగినన్. 287
తే. శాప మిచ్చెదఁ జెప్పుమా సత్య మన్న,గుట్టు దీనిని జెప్పెదఁ గోరి నేనె
పలుక నమ్మము విధిలేక పలుకుదాన, వందనం బిదె చన వమ్మ వలసినట్లు. 288
క. అనియిటు సవర్ణపలుకన్, విని యట్లగుఁగాక యనుచు వ్రీడితవలెఁ దం
డ్రినికేతనంబునకుఁ బో,యెను సంజ్ఞయుఁ జింత మనసు నెంతయు నేఁచన్. 289
ఉ. తాతసమీప మొందుచు నుదంతము స్వీయముఁ జెప్పఁ ద్వష్ట్రయున్
జేతముఁ దల్లడిల్లఁ గని సీ! యిటు చేయఁగ నౌనె నాథునిం
బ్రీతునిఁ జేయఁబొమ్మనుచు విస్తృతకోపము మీఱఁ బల్కఱన్
దాత వచింప నేమనక తా బడబాకృతి నొంది వేగమే. 290
శా. ఈరూపం బె యనింద్యితం బనుచు నెంతే వేడుకం బూని సం
జ్ఞారామామణి యుత్తరాశను సుఖస్థానంబులో నక్కురు
క్ష్మారమ్యస్థలు లందుఁ గ్రుమ్మరుచు నిచ్చన్ ఘాసమున్ మేయుచున్
దా రంజిల్లుచు నుండె; సూర్యుఁడును గాంతారత్నమున్ దానినిన్. 291
చ. తనదగుపత్ని యే యనుచుఁ దాఁ దలపోయుచు నాత్మతుల్యునిన్
దనయునిఁ గాంచెఁ; బూర్వజనితప్రియపుత్త్రుఁడె వీఁ డటంచు నా
తనిఁ దలపోసి సంతతముదంబునఁ దేలుచు నుండెఁ గాని యా
వనితయు సంజ్ఞ గాదనుచు స్వాంతమునం దలపోయఁ డయ్యెఁ దాన్. 292
ఆ. మనుసమానవర్ణమున నుంట సావర్ణుఁ,డనుచు నామకరణ మొనరిచె రవి:
యవల నొక్కతనయుఁ డావిర్భవింప శనైశ్చరుం డనంగ నామ మిడియె. 293
చ. సతియును స్వాత్మజన్ములను జాలఁగఁ బ్రీతిని జూచుచున్ దద
గ్రతనయులన్ గనుంగొనక కాలముపుచ్చె; యముండు పూర్వుఁడై
యతులితశౌర్యశాలి యగు నమ్మనువున్ క్షమియింపఁ జాల కా
యతివను గ్రోధయుక్తిఁ గని రందు యముండు క్రుధావిలాత్ముఁడై. 294
మ. చరణం బెత్తి భయంబుఁ బొందునటు సంజ్ఞాదేవినిం జేయఁ గ్రో
ధరతిం బొంది సవర్ణతల్లి కుమతీ త్వత్పాదపాతంబె స
త్వరమౌ నంచు శపించెఁ బేర్వగను; దద్వార్తన్ యముం డప్పుడే
సరసీరుట్ప్రియుఁ జేరి ప్రాంజలియునై సర్వంబుఁ దెల్పెం గ్రుధన్. 295
సీ. మఱియు వచించెని మ్మాడ్కి నాయముఁ డామెశాపంబునం గల్గుసాధ్వసమున
మనము దల్లడిలంగ మాతపై సంశయ మొలయఁగఁ దండ్రి యీయుగ్రశాప
మును మరలింపుమా; జనని యాత్మజుల యందం దఱయందు స్నేహంబు నొక్క
భంగిఁ గూర్పం దగుభామిని మనువును నన్ను వేఱుగఁజూచు చున్న దిప్పు
తే. డంతేకాక సావర్ణాదులందు వేడ్క, మిగులఁ జూపుచునున్నది తగ దిదంచు
నాగ్రహంబున నాచేత నాత్మచరణ, మెత్తఁబడియెను దన్నవే డింతనిజము. 96

క. లోలత్వంబున నో మఱి, బాలత్వంబుననొ మోహభారంబుననో
యీలీలఁ జేసితిని దప్పే లాపలుమాట లింక హితమతి వగుచున్. 297

క. సైరింపవలయు శాపం, బీరీతి లభించెఁ ద్రిజగదీశా నాకుం
గారుణ్యమునఁ బదచ్యుతి, నారయఁగాఁ గలుగకుండు నట్లొనరుపుమా. 298

చ. అనుటయు సూర్యుఁ డిట్లనియె నాత్మజ సత్యరతుండ వీవు ధ
ర్మనిరతిగల్గువాఁడవయి రాజిలుచుండుదు వట్టినిన్నుఁ బై
కొనియెను గ్రోధ మిందులకు గొప్పదిగాఁ దగుకారణంబు గ
ల్గును నిసుమంతయైన నిటఁ గొంకు కనంబడ దెన్నిచూచినన్. 299

క. జననీవచనం బిది తప్పనిదిగ లెక్కింపవలయు బాలక మార్పం
గనశక్యమె యగు; మాంసంబును గొంచుం గృములుభూమిఁ బొందుం జుమ్మా.

క. అంతట జననీశాపం, బెంతయు ఫలియించి నట్టులే యగుఁబిదపన్
శాంతించు శాప మది నీ, వంతట శుభమొందఁగల వహార్యబలయుతిన్. 301

చ. అని వచియించి భార్యఁ గని యాత్మజులం దిటు భేదబుద్ధినిం
గనఁబఱుపంగ నేల యిది కానిప్రయోజనమౌఁ గదా యటం
చనుటయు నామె యుత్తరము నర్హతమంబుగఁ బల్కకుండె నా
వనజసఖుండు యోగమున వార్తను దాని నెఱింగె నంతయున్. 302

క. మది నంతయుఁ గని రవి యా, మదిరేక్షణనున్ శపించి మ్రందింపఁ దలం
చెఁ దరుణియుఁ దత్త్వ మెల్లను,స్వదయితునకుఁ జెప్పె భీతిఁ జాల వడఁకుచున్.

క. తపనుం డా వార్తను విని, యపరిమితక్రోధ మొప్ప నప్పుడె శ్వశురున్
గపటవిహీనుం గనఁ గోరి పరుగిడెం ద్వష్ట చాలఁ బ్రీతిన్ రవినిన్. 304

తే. న్యాయరీతి నర్చించి రోషాగ్నిఁ గాల్ప
దలఁచుచున్నట్టి యల్లునిఁ దపను శాంత
యుతునిగాఁ జేసి పల్కె నీయురుతను విది
దుర్నిరీక్ష్య తేజంబునఁ దోఁచుఁ గాన. 305

చ. అనుపమమై మహత్తరము నై తగు తావకతేజ మోర్వలే
క నెలఁత శాద్వలాయతముగాఁ దగు కాన వసించియున్న దీ
వును శుభధర్మవర్తినిగఁ బొల్చెడు భార్యను జూడ నేగు; మా
వనితయు సాధుయోగబలవర్ణిత యై సుగుణాలవాల యై. 306

క. గురుతర యోగాచ్ఛాదిత, శరీర యై యున్నదీవు చయ్యనఁ జనుమా
సరసిజహితసత్సమ్మత, మురుశుభదం బంచు నీకు నొగిఁ దోఁచినచోన్. 307

క. ఉపసంహరింపు నీదగు, నపఘన తేజమ్ము ననఁగ నట్లే యనెడు నా
తపనుని భ్రమియంత్రంబున, నపు డిడి ఘనశక్తి మెఱయునట్టులు తఱచెన్. 308

క. ధ్యానం దత్తేజము చ్యుతిఁ, గానక యినుమడిగ నొప్పెఁగాని తఱుగదా

భానుఁడు ద్విగుణితతేజుం, డై నెగడుచుఁ జూడఁ జూడ నలరెన్ మిగులన్.

మ. వనజేష్టుండును యోగశక్తిఁ జని భాస్వత్కాననం బందునన్
గనియెన్ సంజ్ఞను స్వీయపత్ని బడబాకారంబునం బొల్చి భూ
తనికాయంబు గనంగరానిదగు నుద్దామాకృతిం దాఁ జరిం
చు నెలంతన్ నియమైకరాజితగుణస్తోమాభిరామం దమిన్. 310

క. అకుతోభయ యై తిరుగుచు, సకలవ్రతనిరత యగుచుఁ జంచత్కాంతిన్
బ్రకటించు చుండఁగాఁ గని, యకటా! యిటు లుండ నేల యని యాతురుఁడై.

క. తురగాకృతిఁ దాలిచి దాఁ, బరమాకృతిఁ దన్ముఖమున స్వముఖముఁ జేర్పం
బరపురుషశంక నాసతి, సరిపడని తదీయరాగసంగతి వదలెన్. 312

తే. మోము మోమునఁ జేర్చుట ముగ్ధ సురత
భీత యై సూర్యశుక్లంబు విడిచె నాసి
కాద్వయంబుననుండి యాతఁడును దాన
నిరువు రుదయించి రాదిత్యు లిద్ధమతులు. 313

తే. అశ్విసంజ్ఞలవారు వైద్యవరులౌచు, సుప్రసిద్ధిని బొందిరి సొరిది వార
లైరి నాసత్యదస్రాహ్వయముల నిర్వు, రశ్వినులటంచుఁ బ్రఖ్యాతి నంది రంత

క. ఎనిమిదవప్రజాపతి యై, తన రెడుమార్తండునకును దనయు లనంగా
ననుపమవిస్తృతిఁ గాంచుచు, వనరుహబాంధవుఁడు కాంతివారిధి భార్యన్.

చ. కని తనదివ్యరూపమును గన్పఁడఁ జేయ మనోహరాంగు భ
ర్తను గని చాల నొందెను ముదంబును, ధర్ముఁడు శాపపీడ నె
మ్మనమునఁ దోఁపఁ జింతిలియు మానితధర్మముచేఁ బ్రజాళి మో
దనియతిఁ బొందఁజేయుచును దాన మహత్తరతేజుఁ డై తగెన్. 316

ఉ. అంతియుకాక యాసరసిజాప్తసుతుండు పితృవ్రజేశతన్
వింతగఁ గాంచి దిక్పతితవేగము పొందెఁ బ్రజాపతిత్వ మా
యంతకు నన్నయామను వహోన్యతరోత్తమశక్తి నొందె ని
క్కెంతయు శక్తిచే వెలసి రిద్దఱు లోకములందు ఖ్యాతిచేన్. 317

వ. సావర్ణుండు భావిమను వగు. మునులారా! మేరుపృష్ఠంబున నిప్పటికి నాతండు నిత్యనియతుండై యున్న వాఁడు. ఈసావర్ణి యనుజుండగు శనైశ్చరుండు గ్రహరూపంబుననాకసంబుననున్న వాఁడు. త్వష్టయు సూర్యసమాగత తేజశ్శకలంబులచే విష్ణువునకుఁ జక్రంబు నిర్మించె. అదిసమరంబుల నప్రతిహతం బై దానవాంతకరం బై యొసంగె. యమునకుఁ జెల్లెలగు యమున నదీరూపంబునుఁ గాంచి లోకవిఖ్యాతి నొందె మనువనియు, సావర్ణుం డనియు, లోకవిస్తృతిం గన్నవాఁ డొక్కండె యని యెఱుంగవలయు సంజ్ఞాదేవి తనఛాయనుంచి పోయెఁగదా. తత్పుత్త్రుండే సావర్ణుం డీతని సోదరుండు శనైశ్చరుండు. వీఁడు గ్రహత్వంబు నొంది

సర్వలోకపూజితుం డయ్యె. ఎవ్వఁ డీదేవజన్మచరిత్రంబును బఠించునో వినునో యాంతం డాపన్నిర్ముక్తుండై యశంబుఁ గాంచు నని యెఱింగించి సూతుండు మునుల కిట్లనియె. 318

---

## ఐదవ అధ్యాయము.

### ఇలునిజననము.

సీ. మను వగువైవస్వతునకుఁ దొమ్మండ్రుగు రాత్మజు లుదయించి రరయ వారు
జనకసమానులై చాల విఖ్యాతిని బరఁగిరిక్ష్వాకు నాభాగ, ధృష్ట
శర్యాతులును, నరిష్యంతుఁడు ప్రాంశువు నవల రిష్ట, కరూషు లనెడువారు
కొండిక యగుపృషధ్రుండు నీనవసుతుల్ బలపరాక్రమముల వెలసి రిలను;
తే. మిగులఁ బుత్త్రకాంక్ష మిత్త్రావరుణులను, గూర్చి యిష్టిఁ జేసెఁ గొదువపడక
యుండ మనువు తొల్లి యురుబుద్ధిబలయుతుం, డతనికాత్మజన్ము లందువలన.

క. పలువురు పుట్టక యుండిరి, సులలితముగ నిష్టిశాస్త్రచోదితముగ ని
ష్ఠలసాగన్ మిత్త్రావరు,ణుల యంశమునందు నామనువు భక్తిమెయిన్. 320

క. ఆహుతి వేల్చెను నంతమ,హాహుతి వేల్వంగ సురుచిరాంబరభూషా
వ్యూహము వెలయంగ వరా,రోహ యిలానామధేయ రూపవతి తగన్. 321

క. జనియించె ననుచు వింటిని, మను వంత నిలాహ్వయంబు మానిని కొసఁగెన్
జనియించినంత నాతఁడు, వనితా నన్ననుసరింపు భద్రాంగి! యనన్. 322

క. ఇలయును వచించె ధర్మం, బొలయన్ బుత్త్రార్థి యగుచు నొప్పు నతనితో
లలితగుణా! మిత్త్రావరు,ణులయంశమునందు నాకునున్ భవ మలరెన్. 323

క. వారలచెంతకుఁ బోవం, గోరెద ధర్మంబు నాకుఁ గొదువపడని య
ట్లో రాజా! కాపాడుము, నారమణీ పొమ్మటంచు నయమునఁ బలికెన్. 324

చ. అతివయు నమ్మనూక్తిఁ గొని యప్పుడ వారలచెంత కేగి కై
జతముకుళించి యిట్లనియె సాధుగుణాకరులార! జన్మమం
దితి భవదంశయుక్తి నిట నే నొనరింపఁగ నర్హమైన దే
దో తగ ననుజ్ఞయిందు మనువుండుము నాకడ నంచుఁ బల్కినన్. 325

క. చనుదెంచితి మిముఁ గానఁగ, నని పల్కెడు సాధ్విఁ జూచి యారా ధర్మం
బునె యాశ్రయించి పల్కెడు, నని మిత్త్రావరుణు లప్పు డాదృతి తోడన్. 326

క. వరవర్ణిని నీదగు ధర్మరతిని బ్రశ్రయముచే దమంబున సత్యా
దరణంబున నలరితి మే,మరయఁగ మాకాత్మజాత వను విఖ్యాతిన్. 327

క. కనఁగల విల నీవే యమ్మనువునకుం బుత్త్రుఁడవుగ మార్పొందుదు వో
వనితా! సుద్యుమ్నుఁ డనం,గను విస్తృతి నప్పు డొందఁగల వీక మీఁదన్.

క. జగముల మూఁడింటను నీ,వగణితయశ మొంది మనువు నాత్మజుఁడ వటం
చు గణింపఁబడుచు ధర్మము, జగముల సుస్థిరత నిల్పఁజాలుదు సుమ్మీ. 329

క. అనవిని మిత్రావరుణుల,కును వందన మాచరించి కోరికఁ దనతం
ద్రినికేతనమును జేరం, జను తఱి మార్గాంతరమున శశితనయుండున్. 330

చ. తరుణి విలాస మెన్ని సురతంబున నామెను బ్రీతఁ జేయునా
దరమును జూప నీయకొనెఁ దద్వనితామణి యంత వార లి
ర్వురు సుఖియించి రాస్మరుఁడు వొంగఁగ నంతఁ దదీయసంగతిన్
గరము ప్రకాశమాను సుతుఁ గాంచెఁ బురూరవసున్ మహామతిన్. 331

క. కొడుకు జనించిన యంతం, బడఁతియు సుద్యుమ్నుతను జవంబునఁ గనియెన్
గడు నాశ్చర్యంబుగదా, పుడమిని నిటు లౌట మౌనిపుంగవులారా. 332

సీ. సుద్యుమ్నునకు మహాశూరులు ధార్మికులును నగుతనయులు వినయవంతు
లైరి ముగ్వురు వినుం డవ్వారి పేరుల నుత్కలాహ్వయుఁడుగయుండు మఱియు
వినతాశ్వుఁడును నన; మునులార,యుత్కల యుత్కలునకుఁ బుర మొప్పెఁ బశ్చి
మము తూర్పుదిక్కును మహితుఁ డౌ వినతాశ్వునకు నివాసంబయ్యెఁ బ్రకటశక్తి

తే. యైనగయునకు గయయె వస్తవ్యంబు, పిదప
మను వరిందముఁ డౌనర్యముని గనంగఁ
బోయి భూమిని దశభాగములుగ క్షత్ర
పాలితంబుగ నలరారుభంగిఁ జేసె 333

క. మను విటు లమ్మనువుత్తము,తనయుల నిక్ష్వాకుముఖులఁ దా వెలయించెన్
వినుఁ డిక్ష్వాకువు పాలిం,చెను మధ్యమదేశమును విచిత్రమహిమచేన్. 334

తే. తాను గన్యగఁ బుట్టుటఁ దండ్రి రాజ్య
మొసఁగ నఁజాలఁడయ్యె సుద్యుమ్నుఁ డంత
మునిమహేంద్రుఁడు నౌ వసిష్ఠునివచనము
బలిమి నొందెఁ బ్రతిష్ఠానపత్తనమును. 335

వ. [ప్రతిష్ఠానపురంబున సుద్యుమ్నుండు రాజనామంబున నొప్పి దృష్ణు, కాంబరీష దండకులను తనయులఁ గాంచె. దండకుఁడే తనపేర దండకారణ్యంబును నిర్మించె. దానిం బ్రవేశించిన నరుండు పాపనిర్ముక్తుండగు. ఇలుండను వానిం బడసి సుద్యుమ్నుండు దివంబునుబొందె.] 336

తే. ఇట్లు ధర్మాత్ముఁడై యిల నేలుచున్న
యట్టి సుద్యుమ్నుఁ డవ్వసిష్ఠానుమతిని
రాజుగా నుండిఁ సుతుఁ బురూరవసు నృపతి
గాఁగ నొనరించె దిక్కులఖ్యాతి యలర. 337

క. తరుణీపురుషులలక్షణ, పరియుతుఁడై మనుసుతుండు ప్రఖ్యాతిం గాం

చె రహిఁ సుద్యుమ్నుం డన, ధరణీస్థలి నిల యనంగఁ దగునామములన్. 338

వ. నాభాగునకు నారిష్యంతులగు శకులు తనయులు అంబరీషుం డుత్తమతనయుం డన విఖ్యాతిం గాంచె. ధృష్టుండు యుద్ధదుర్మదుండై వెలసె. కరూశునకుఁ గారూషులు రణదుర్మదులు తనయులు. నాభాగ ధృష్ట తనయులగు క్షత్రియులు వైశ్యతం గాంచిరి. ప్రాంశుం డను వాని కొక్కండె తనయుండు; ప్రజాపతి ఖ్యాతి నాతండు గాంచె. నారిష్యంతదాయాదుండు దండధరుం డగుయముం డని యెఱుంగవలయు. శర్యాతికి నొక్క కొడుకొక్క కూఁతురు కలిగె ఆనర్తుం డనుపేరు కొడుకునకయ్యె. సుకన్య యని యాపుత్రిక పేరు ఆమెయే చ్యవనునకుం బత్ని యని చెప్పంబడు. 339

సీ. ఆనర్తునకు సుతుం డయ్యె రైవుం డన నతఁడు కుశస్థలి యనుపురంబు
తండ్రియే లెడుదానిఁ దాఁ బొందె నతనికి రైవతుం డనెడుపుత్త్రవరుఁ డొదవె
నతనికి ననుజన్ముఁ డయ్యెఁ గకుద్మి నాధార్మికుం డందు బెద్ద యగు రైవ
తుఁడు కుశస్థలినుండి పుడమి నేలెను; వాఁడె కన్యకాసహితుఁడై కంజభవుని

తే. కడకు గాంధర్వ మున్నట్లుగా విని యట
కరిగి యందు వసించె నాపరము తోఁప
బహుయుగంబులు క్షణ మట్లు బ్రహ్మయాజ్ఞ
మరలి తనపురి కరుదెంచె మానులార. 340

చ. పుర మది యాదవప్రకరపూరిత మంధకభోజవృష్ణిసం
భరితము వాసుదేవముఖవర్ణ్యమహాపురుషాన్వితంబునై
సురుచిర మాచు ద్వారతతిశోభిలి ద్వారవతీసమాఖ్యచేఁ
బరఁగుచు నుండె నవ్విధము బాగుగ నాతఁ డెఱింగె నాత్మలోన్. 341

చ. మన కిట నుండరా దనుచు మానినిఁ బుత్త్రిక రేవతీసమా
ఖ్యను బలదేవు నాకృతిని గాంచి యొసంగి సుమేరుశృంగమం
దనుపమయోగనిష్ఠలను హర్షము నొందుచు నుండ నేగెఁ; బ
త్నిని గుణయుక్తరేవతిని దృష్టిగఁ గూడి సుఖించె రాముఁడున్. 342

చ. అన విని మాను లిట్లు లని రార్యవరోత్తమ లోమహర్షణా
వినవినఁ జిత్ర మయ్యె మది వేడుక నిండె యుగవ్రజంబు లా
వనరుహసూతి చెంతఁ గడువంగ జరాభరితాంగి కాక య
వ్వనితయు యౌవనంబుననె వర్తిలె రైవతుఁ డెట్లు వర్తిలెన్. 343

తే. మేరు వొందిన యతనిదౌ చారువంశవృద్ధి యెట్లయ్యె నవ్వాని వినఁగ వేడు
కయ్యె నావినియాసూతుఁ డనియె నిట్లు, జరయు క్షుత్తు పిపాసయు మరణము నివి.

చ. సరసిజసూతి లోకమున సాధువులార, వినంగ రావు సుం
దరగతి నొక్కకాలమునఁ దప్పకయుండు ఋతువ్రజంబు భూ.

వరుఁ డగురైవతుండు చని బ్రహ్మకడన్ వసియింప రాక్షసో
త్కరములు పోయి తత్పురము గాల్చెఁ గుశస్థలి కీర్తి పోవఁగన్. 345
తే. ధార్మికుం డగురైవతు తమ్ములు శత, సంఖ్యులున్ రాక్షసులచేత నసాధురీతిఁ
గాల్పఁబడిన పురంబును గాంచి దెసల, కరిగి రిటనుండ రా దని యురుజవమున.
ఉ. వారలవంశముల్ జగతి వర్ధిలె నయ్యయితావులందు వి
స్తారముగాఁగ నన్నియును క్ష్మాస్థలి ఖ్యాతిని మించెఁ దద్భవుల్
చారుయశోవిరాజితులు సద్గుణశోభితులై చెలంగి దు
ర్వారసురారిభీతిని నరణ్యములన్ వసియించి రార్తులై. 347
తే. వారి కులపంక్తిశర్యాతివరయశంబు
గాంచె నాభాగుతనయుండు మించు నయ్య
రిష్టుతనయుండు వైశ్యులై యిష్టతపము
చేత సద్బ్రాహ్మణతను గాంచిరి గడంగి. 348
క. వినుఁడీ కరూషనామకు, తనయులు కారూషు లనఁగఁ దనరిరి యుద్ధం
బున దుర్మదులై వారలు, పెనుకీర్తిని గాంచి రరివిభీకరు లగుచున్.
క. గురుధేనువును బృషధ్రుఁడు, పరిమార్చి తదీయశాపభరమునఁ బొందెన్
జరణజతను నవసంఖ్యం, బరఁగుదు రివ్వారు మాని వల్లభులారా. 350
క. మను వగు వైవస్వతునకుఁ, దనయులు పెక్కండ్రు గలరు తనయార్థి యతం
డును దుమ్మె నొక్కనాఁ డట, జనియించె సుతుండు కీర్తిశాలి యనఘుఁడున్.
తే. ఆతఁ డిక్ష్వాకు వనఁబడు నతఁడు గాంచెఁ
దనయశతకంబు వారెల్ల దర్పయుక్త
లందు జ్యేష్ఠుఁడు శూరుఁడై యల్లర వెలసె
నవనియందు వికుక్షి విఖ్యాతబలుఁడు. 352
క. పరమగురుధర్మబుద్ధిన్, ధరణీపతియై యయోధ్యఁ దా బొంది ప్రజో
త్కర మేలె శకునిముఖులౌ, వరతనయులు పంచశతనిబద్ధులు వారల్. 353
క. కలిగిరి .వికుక్షి కవ్వారలు విక్రమవంతు లుత్తరాపథదేశం
బులకుం బ్రభువులుగా నుజ్జ్వలకీర్తిం గాంచి వెలయఁజాలిరి మిగులన్. 354
వ. చత్వారింశ ద్దశాష్ట సంఖ్యగలరాజకుమారులు దక్షిణదిక్కునంగల రాజ్యంబులం బాలించిరి. శశాదప్రముఖులగు రాజకుమారులు గూడఁ దద్దేశంబులం బాలించుటకు సమర్థులైరి. వీరెల్ల వికుక్షిసంతతివా రని తెలియవలయు. 355
సీ. ఒక్కనాఁ డిక్ష్వాకు పురుముదంబున నష్టకాశ్రాద్ధ మొనరింపఁగాఁ దలంచి
తనయు వికుక్షినిఁ దాఁ బిల్చి శ్రాద్ధార్థ మడవికిం బోయి శశాళిఁ జంపి
మాంసమ్ము దెమ్మని మందలించెను, వాఁడు వనమునకుం బోయి జనకు నాజ్ఞ
శశములఁ జంపి మాంసంబు దెచ్చుటమాని శ్రాద్ధంబె మది నెంచి శశపలలముఁ

తే. దినియె వేఁటకుఁ బోయె మేదినివిభుండు, గాఁ జెలంగు నిక్ష్వాకువు గాదిలిసుతు
వానిని ద్యజించె నంతట మౌనిపతి వసిష్ఠుఁ డాతనిఁ బిల్చి యాత్మక్షితిని బ్రోవ.
క. పూనుము నావిని యానృప,సూనుఁడు జనకుండు వెలయుచున్ రాజ్యంబున్
మానితగతిఁ బ్రోచెడుతఱిఁ, దా నేలె శశాదుఁ డెలమిఁ దండ్రియుఁ గనఁగన్.
క. అనఘుఁడు కకుత్థ్సుఁ డనఁగాఁ, దనయుం డారాజునకును దారుణతేజుం
డును నయియుదయించె వినుం, డనేనసుం డయ్యె నతనికాత్మభవుఁడుగన్.
ఆ. అయ్యనేనసునకు నాత్మజుండు పృథుండు, నాతనికి విరాశ్వుఁ డనుఁగుఁదనయుఁ
డతని కార్ద్రినాముఁ డతనికి యువనాశ్వుఁ, డఖిలలోకకీర్తి యలరె నంత. 359
సీ. శ్రావస్తకుండు తత్సంభూతుఁడై వెల్గె శ్రావస్తి యనుపురసత్తమంబు
వానిపేరనె ధాత్రిఁ బ్రఖ్యాతిని వహించె బృహదశ్వుఁ డతనికి వెలసె సుతుఁడు
కువలాశ్వుఁ డవ్వానికొడుకయ్యె ధార్మికుండన విస్తృతింగాంచె నతఁడె ధుంధు
వధసమాగతకీర్తి వర్ధిల్లి ధుంధుమారాహ్వయంబును గాంచె ననఁగ మౌను.
ఆ. లార్యవర్య ధుంధువను వాని వధియించి, నట్టిగాథ వినఁగ హర్షమొదవె
ననిన సూతుఁడిట్టులనియె నోమునులార, వినుఁడు తెల్పువాఁడ విస్తృతముగ.

కువలాశ్వుఁడు ధుంధుదానవుం జంపుట.

క. ఘనుఁడు బృహదశ్వుఁ డెంతయు, వినయాదిగుణోత్తముండు విక్రమయుతులన్
గనియెం బుత్త్రుల నూర్వ్వర, నినిచిరి బలశౌర్యకీర్తినిన్ వారవనిన్. 361
క. క్రతువుల నొనరిచి ధార్మిక, వితతుల నగ్రేసరులయి వెలసిరి భూమిన్
సుతవర్యుని గువలాశ్వుని, క్షితిపతిగాఁ జేసి విరతిఁ జెందెం బిదపన్. 362
క. తనయునిపై భార మ్మిడి, వనికిం జన నెంచెఁ దండ్రి వలదని బృహద
శ్వుని నుత్తంకుం డను ముని, యును బల్కి వచించె మఱియు నురురవమడరన్.
క. చేయఁదగు రక్షణం బొకఁ, డోయవనీపాల! దాని నొగిఁ బూనికతోఁ
జేయు మనుద్విగ్నుఁడవై, యీయడవిం దప మొనర్తు నే నటమీఁదన్. 364
సీ. నాయాశ్రమము చెంతఁ బాయనిమరుధన్వములగు సమస్థలములను వాలు
కాపూర్ణమైన సాగర మొక్కఁ డుద్దాలకాఖ్యచే నలరారు నందు దేవ
తాళి కవధ్యుఁడై యతులదేహం బొప్ప బలవిక్రమంబులఁ బ్రౌఢుఁ డగుచు
వసుధలోపలనుండి వాలుకాంతర్హితుఁ డగుసురారి యొకండు హర్ష మలర
ఆ. నున్నవాఁడు పుత్త్రుఁ డుగ్రబలుండైన
మధుసురారి కతఁడు మహిమ వెలయ
ధుంధుఁ డనఁగఁ బూన్కితో లోకనాశన
మాత్మఁ గోరి తపము ననుసరించి. 365
క. నివసించి యున్నవాఁ డిట, నవివేకి యతండు వాని దౌతపము భయం
బు వఱలఁగఁ జేయు నయ్యసు, రవరుం డేఁటేట విడుచు రయమున నూర్పుల్.

తే. అప్పుడు భూమి చలించు నో యవనినాథ
మఱియు నిశ్శ్వాసపవనంబు మహిమ వెలయ
భానుమండల పర్యంత మేని నిగుడు
నేఁడుదినములదాఁక నీఱుల వడంకు. 367

క. గురువిస్ఫులింగయుత శీకరహవ్యవహుండు ధూమకలితుం డగుచున్
ధర వెడలి వచ్చునటు లా, సురరిపునిశ్శ్వాస మొలయు క్షోణీశేంద్రా. 368

క. దానం గల్గెడు బాధల, కే నట నిల్వంగఁ జాలకే యిట కిపుడున్
భూనాథ! చెప్పవచ్చితి, దానవు నాతని వధింపఁదగుఁ బూనిక మెయిన్. 369

చ. జగముల మేలుఁగోరి త్రిదశప్రియకార్యవినాశకున్ వధిం
పఁగ జగముల్ సుఖంబుగను వాని వధింపఁగ నీవె చాలు ద
త్యగణితశౌర్యసారమున నంతియ కా దొకమాట పల్కెదన్
దగ వినవయ్య నాయెడ నితాంతముదంబున శ్రీనివాసుఁడున్. 370

క. వర మిచ్చెఁ బూర్వయుగమున, ధరణీశా! యట్లు గాన దానవు వానిన్
దురమునఁ జంపుము పూనికఁ, బరమాద్భుతశక్తి గల్గువాఁడవు గానన్. 371

క. వరదానంబున రాక్షస, గురుతేజ మడంప నీ కగున్ దుష్టుండై
పరఁగుట నాతని తేజం, బరయన్ దుస్సహముగాక యతిసులభంబో. 372

వ. వాఁడు స్వల్పతేజుం డౌట లోకంబులనెల్లఁ గాల్పంజాలండు. వీర్యంబునం జాల దురాసదుం డగునని యిట్లా రాజర్షివర్యునితో నామహర్షి పలుకుటయు బృహదశ్వుండు ధుంధుదానవుఁ జంపఁ గువలాశ్వుని నియోగించి యిట్లనియె. 373

చ. మునివర! యస్త్రశస్త్రగణమున్ విడనాడితి నేను, వీఁడుమ
త్తనయుఁడు ధుంధుమారుఁడగుఁ దథ్యము సంశయ మింతలే దటం
చనుపయు మొప్పఁ బల్కి నృపుఁ డాత్మజు నమ్ముని కప్పగించి తా
వనములకేగి సువ్రతము ప్రక్కన సువ్రతుఁడై వసించినన్. 374

క. కువలాశ్వుఁ డంత సుతశతము వరుసఁ దనవెంట రాఁగ మునివరయుతుఁడై
జవమునఁ బోయెను ధుంధువుఁ, బ్రవిదారణమందుఁ జంపు పట్టునలఁ దగన్. 375

చ. అతులితవిక్రమంబు గలయట్టి మహాసురుఁ జంపఁ బోవు నా
క్షితిపతి లోన శ్రీపతియుఁ జెచ్చెను దేజము మాని వేఁడ ము
న్నతని కొసంగి సన్మునుడి యప్పుడు తథ్యము చేయ లోకసం
తతికిని మేలుచేయ; నృపతల్లజుఁ డట్లు చనంగ నొక్కటన్. 376

క. సుకథమున జనుశబ్దం, బరుదుగ వ్యాపించె నీతఁ డౌర! యవధ్యుం
డుమగుఁ బుడు ధుంధుదానవు, బరిమార్పం జాలఁ డటంచుఁ బల్కు సురవరుల్. 377

ఆ. దివ్యగంధములును దివ్యమాల్యంబులు, నతనిపైనఁ గురియునట్లు చేసి
రంత దుందుభులును నమలనిస్వనముల, దెసలు మ్రోఁగఁ జేసెఁ దృష్టిమీఱి.

క. కువలాశ్వుఁ డిట్టు లాత్మజ, నివహముతోఁ బోయి, వీర్యనిర్భరుఁ డయి య
ర్ణవమును ద్రవ్వఁగఁ బంచెను, నవిరళమహా వాలుకామయం బగు చోటన్.
చ. తనయులు వారు పూన్కిమెయిఁ దండ్రియనుజ్ఞ ఖనిత్రసంతతిం
గొని యలవాలుకాంతరము గొబ్బునఁ ద్రవ్వఁ దదంతరంబునన్
గనఁబడెఁ బశ్చిమాశనుదగం దనుసంయుతి నావరించి పెం
పునఁ దగు ధుంధుదానవుఁడు పొంగెడు నాస్యభవానలంబునన్. 380
క. లోకంబుల దహియింపఁగ, వీఁకఁగడంగిన విధంబు వెలయఁగ నతఁడున్
భీకరకోపంబున విధుఁ, డాకసమునఁ దోఁప నబ్ధి యలరెడురీతిన్. 381
క. అలలగుమి చేత నొప్పెడు, జలమును బ్రవహింపఁ జేసెఁ జటులక్రోధో
జ్జ్వలపావకుచే నాపుత్త్రులు ముప్వురకొఱఁతగాఁగఁ ద్రుంగిరి వెలుచన్. 382
శా. దానన్ మానవనాథుఁ డెంతయును గ్రోధం బొంది తేజంబురూ
పై నిల్చెం గన నంచుఁ దోఁచుగతి నత్యాశ్చర్యమహాభంగి నా
మానిప్రాణభయంకరున్ దనుజు నున్మత్తున్ వడిం జేరి శ్రీ
జానిస్ఫారకృపం జెలంగెడుమహాసత్త్వంబు గానంబడన్. 383
తే. ఆతనిజలమయవేగంబు నాత్మయోగ,వహ్నిచే నాపి తన్ముఖవహ్ని విలయ
మొందఁగాఁ జేసి పటుకాయ మొప్ప, నతనినాత్మశక్తిని లయమొందనపుడుచేసె.
క. దనుజుని వధించి యాతని, పెనుకాయము మౌనిపతికిఁ బ్రీతిం గనుచుం
గనఁబఱచె నంత నుత్తం,కనామముని యానృపాలు ఘనతరశౌర్యున్. 385
క. ప్రీతిం గాంచి నృపాలా, యాతతవిత్తంబు వైరు లనిఁ దలఁపడుచో
నేతఱి నపజయమొందని, ఖ్యాతియు నీ కలరుఁగాక యనివరయుగమున్. 386
ఆ. ఒసఁగి ధర్మరతియు నొగి వృద్ధి నొందంగ, నంత మందు స్వర్గమందు సతత
వాస మబ్బునట్లు వర మిచ్చి యసురని,హతులు సుతులు స్వర్గమందునట్లు.
క. వరముల నిచ్చెను; దదశ్వ,వరుతనయులు చావ నట్టివారు మువురు చెం
దిరి ఖ్యాతి దృఢాశ్వుం డం, దరయన్ జ్యేష్ఠుండు గుణగణాఢ్యుం డలరెన్.
సీ. చంద్రాశ్వకపిలాశ్వు లింద్రసమానులు తత్సహజన్ము లుదాత్తతేజు
లైరి జ్యేష్ఠునకు హర్యశ్వుఁడు కొడుకయ్యె హైమవతి యనంగ నతనికాత్మ
జాత యుదయ మందె జగతి దృష్టద్వతి యనుఖ్యాతినిం గాంచె నామెకొడుకు
లోకత్రయఖ్యాతిఁ బ్రాకటంబుగఁ గాంచి తనరెఁ బ్రసేనజిత్తనఁగ నతఁడు
తే. గౌరి యనునాతిఁ బెండ్లాడెఁగాని దానిఁ
గడఁగి శపియించె బాహుదాఖ్య నది యయ్యె
నామె యువనాశ్వుఁ డతనికి నాత్మజన్ముఁ
డయ్యె విఖ్యాతినాఁ బుత్త్రుఁ డలరె మిగుల. 389

క. వినుఁ డతనికి మాంధాతయుఁ, దనయుం డాతండు లోకతతిని జయించెన్
వనితామణియగు చైత్రరథిని భార్యగఁ గొనియె సుగుణదీపిత నెలమిన్. 390

తే. ఆమె శశిబిందునకుఁ బుత్త్రి యగుచు బిందు
మతి యనఁగ ఖ్యాతిఁ గాంచి సుమహితరూప
విలసనంబునఁ దగుచు సాధ్వియయి సోద
రాయుతంబున జ్యేష్ఠ యై యలరె మిగుల. 391

క. పురుకుత్సుని ధర్మజ్ఞుని, వరగుణు ముచుకుందుఁ డనెడువానిఁ దనయులన్
ధరణీపతి మాంధాతయుఁ, బరమాద్భుతతనయయుగముఁ బడసెం బ్రీతిన్. 392

క. పురుకుత్సుఁడు త్రసదస్యుని, గురుమతి రాజితుని గాంచెఁ గొడుకును, వాఁడున్
దరుణీమణి నర్మదఁ బ్రీతిరతిం బెండ్లాడి కనియె ధీరునిఁ దనయున్. 393

క. అతఁడు నామంబున సం, భూతి యనన్ భూతలమునఁ బొలుపొందెం ద
జ్జాతుఁడు సుధన్వుఁ డరిహరుఁ, డై తగె నాతఁడు త్రిధన్వుఁ డనుసుతుఁగనియెన్.

సీ. అతఁడు త్రయ్యారుణుం డనుపుత్త్రునిం గాంచె సత్యవ్రతుండు తజ్జాతుఁడయ్యె
బలశాలియై వాఁడు పొలిచె నాకొమరుఁడే దుర్మతియై యొక్కతోయజాక్షి
నొకఁడు వరింపంగ నుద్ధతి విఘ్నము కలిగించి తద్భర్త కలవిలపడ
బాల్యంబు కాముంబు పటుతరమోహంబు సాహసచపలతల్ చక్కఁగుదురఁ

ఆ. గాముఁ డార్తి ముంపఁ గామిని దానిని, సంగ్రహించె నగరజనులు గుంద
ధర్మనాశనుఁ డగుతనయు నాతనిని, త్రయ్యారుణుండు వదలి దారుణగతి. 395

క. తనయా కుమతీ నాశము, గనుమా యిట నుండ వలదు కడువడిఁ జనుమా
యన నెందుల కేగం జను, నని పలుమరు నడిగెఁ దండ్రి యప్పు డాతనితోన్.

క. శునకంబులఁ దిను దుర్జాతినిఁగూడి చరింపు మింకఁ జెప్పనఁ జనుమా
తనయా కులపాంసన ని, న్ననియు నపుత్త్రకుఁడ నేను ధ్మాతలమందున్. 397

చ. అని నగరంబు దాఁటు నటు లాజ్ఞయిడం జనియెం గుమారుఁ డా
పని తగ దంచు మానితతి భర్త వసిష్ఠుఁడు పల్కఁడయ్యె నా
తనయుఁడు పుల్కసానఖిలధామము లుండెడు చోటనుండెఁ ద
జ్జనకుఁడు కాననంబునను సాధుతపం బొనరింపఁ బోయెఁ దాన్. 398

ఉ. ఆవిషయంబు నందును దదాదిగ ద్వాదశవత్సరంబు లా
భూవిభుపాపకృత్యమునఁ బొల్పగువృష్టి నొసంగఁడయ్యె నా
దేవవిభుండు, నంతట సుధీమణి గాధిసుతుండు భార్యనే
యావిషయంబు నందిడి మహాతప మొయ్యనఁ జేయు నాదృతిన్. 399

క. చని సాగరతీరంబున, ఘన మాగ వసించె నంత మానితశీలం
బునఁ బొల్చుగాధినందను, వనితామణి ఘన్నమార్తి భరియింపంగన్. 400

క. తనవశమ్ముగాఁ దక్కిన, తనయులఁ గాపాడ వేమిఁ దగుమధ్యమునం

దనుగొంతుపట్టుకొని మృతి, గన నెంచుచు గోశతంబు ఘనమూల్యముగన్. 401

వ. ఆతనివిక్రయించి తక్కినవారింగాపాడఁ దలంచుచుండ సత్యవ్రతుం డనున్నృపాత్మజుం డందు నున్నవాఁడు గాన నావిశ్వామిత్రమధ్యమకుమారు విడిపించి యాతనిం గాపాడి యాతనితల్లిని రక్షించె. గళబద్ధుం డగుట నాకొమరుండు గాలవుం డయ్యె. విశ్వామిత్రతృప్త్యర్థ మనుకంప నాతనిం గాపాడి సత్యవ్రతుండు విఖ్యాతి నొందె. ఆగాలవుం డారాజనందనుకటాక్షంబున రక్షితుం డయ్యె నని సూతుండు మఱియు నిట్లనియె. 402

---

## ఆఱవ అధ్యాయము.

సత్యవ్రతుండు త్రిశంకునామము నొందుట.

క. ఆవల సత్యవ్రతుఁ డను, భూవరుఁ డాతండు ప్రతినపూని కరుణచే
నావిశ్వామిత్రుని సతిఁ, బావనమతిఁ బ్రోచె ధర్మపద్ధతి మెఱయన్. 403

సీ. వినయంబు మెఱయ నావెలఁదిని బ్రోచుచు నడవిఁ జరించుచు హరిణచయముఁ
బందుల గాసరపటలంబు వధియించి గాధినందనుఁ డున్నట్టి సమీప
మున వృక్షశాఖలకునుఁ గట్టిగాఁగట్టి తా, నుపాంశువ్రతతత్పరుఁడయి
ద్వాదశవార్షిక వ్రతమును బూని తండ్రినియోగమున వసించెను నృపుండు

తే. తద్వనంబునఁ దన రాజధాని రాజ్య, మట్లె యంతఃపురం బుపాధ్యాయుఁ డైన
యవ్వసిష్ఠుని యాజ్ఞలో నమరియుండఁ, జేసె; మఱియాన్నృపాలుండు చిత్తమందు.

క. రానున్న కాలబలమునఁ, దానయి వ్యాపించు బాలతన్ మునులారా
మౌనివసిష్ఠునిపయిఁ దన, మానసమునఁ గోపయుక్తి మానక యుండెన్. 405

క. జనకుం డీసత్యవ్రతుఁ, దన రాజ్యముమనుండి పంపఁ దా వలదనుచున్
ముని వారింపకపోయెను, దన మది నక్కారణంబు దగులుట కతనన్. 406

వ పాణిగ్రహణమంత్రంబులకు సప్తమపదమందు నిష్ఠ యలరు. సత్యవ్రతుండు పూర్వోక్తవివాహంబున సప్తమపదమందె విఘ్న మొనరించె. ఈవిషయం బెఱింగియు వసిష్ఠుండు నన్నుం గాపాడక యుపేక్షించె నని యామునియం దాగ్రహంబుగలిగి యుండె. గుణబుద్ధిచే భగవంతుఁ డగువసిష్ఠుం డతనిఁ దండ్రి వెడల నంపునపుడు వారింపఁ డయ్యె. మునితాత్పర్యం బిట్టి దని యాసత్యవ్రతుండు గ్రహింపఁ జాలఁడయ్యె మఱియును. 407

క. జనకునియందు నతృప్తిని, గని సత్యవ్రతుఁడు తిరుగు కారణమునఁ ద
జ్జనపదమున వర్షింపం, గను బూనఁడు ద్వాదశాబ్దగణ మింద్రుండున్. 408

చ. జనకునియం దతృప్తిగనఁ జాలుకుమారుని వృత్తి నెంచి యీ
తనికి ననన్యదుర్వహము తద్దయు ఖేదము నీయఁజాలు దీ
క్షను గలుగంగఁజేసి కులగౌరవ మొయ్యన నిల్ప నెంచి యే

జనకుఁడు కోపయుక్తిఁ గనఁజాలు నటంచని పల్కఁడయ్యె న
మ్మునియుఁ దదీయపుత్త్రకుని మూర్ధముపై గురురాజ్యభారమొ
య్యన నునుపంగ లోఁదలఁచి యావిధమేమియుఁ బల్కకుండెఁ; నా
మనుజవరాత్మజుండు నిటు మానక ద్వాదశవర్ష దీక్షఁ జ
క్కనివిధి మీఱఁగా జరపెఁ; గాల మదయ్యెను దుర్భరం బిలన్. 409

క. క్షితిపతిసూనుఁడు సత్యవ్రతుఁ డత్తఱి మాంస మన ధరన్ దుర్లభమై
మతిబాధించుటఁ గలఁగుచు, గతి యింకే మనుచు నెంచు కాలమ్మందున్. 410

క. కోరికలం బిండుసదాధారము నగునిద్ది యనఁగఁ దగుచు వసిష్ఠుం
గూరిమిఁ బొందఁగఁ జేసెడు, చారుతరాంగంబు వెలయ సాధువినుతమై. 411

క తన రారుధేనువర్యము, కనఁబడ సత్యవ్రతుండు కడుఁ గోపంబున్
మనము దహించెడు మోహము,తనువును దహియించుచుత్తు తను నేఁచంగన్.

ఉ. తాను వసించుచోటఁ గలధర్మము చొప్పున దానిఁ జంపి య
ద్దానిని వండి మాంసము ముదంబున గాధితనూజకోటికిన్
జానుగ భోజనం బిడియె క్ష్మాపతిసూనుఁడు హోమధేనువుం
గాన వధించె నం చెఱిఁగి గాఢతరక్రుధమౌని యిట్లనెన్. 413

ఉ. క్రూరుఁడ వీవు రాజసుత కొంకవు పాపముచేయ శంకు వి
ట్లారయకే యొనర్చితి వహంకృతి నంతియకాక యిప్పు డీ
ఘోరతరాఘమున్ మదిని గోరి యొనర్చితి విట్లు రెండుదు
ర్వారము లైనశంకువులు వాసి నడంచెదుఁ గాన నిన్నికన్. 414

తే. నరక మొందింపఁ దగు జననాథుఁ దండ్రి
నవమతిం బొందఁజేయుట సవమహార్హ
గోవుఁ జంపుట శాస్త్రసంకుచితరీతి
హింసచేయుట మూఁ డివియే యఘములు. 415

క. కనుకనె యీశంకుత్రయమున నీవు త్రిశంకు వనఁగ భూమి బరఁగుమా
యని ముని పల్కెంగావున, జనపతియుఁ ద్రిశంకు వనఁగ జనుల నుడిఁ గనెన్.

తే. గాధినందను దారల గారవమున, బ్రోచెఁ గానఁ ద్రిశంకువన్ భూమిధవుని
మెచ్చి కౌశికముని వర మిచ్చె బ్రీతి,నంత నా రాజతనయుఁ డత్యంతనియతి. 417

చ. మునిపతి గాధినందనుఁ బ్రమోదయుతుం గని మౌనివర్య! యీ
తనువుఁ ద్యజింప కేను సురధామముఁ జేరఁగఁబోవునట్టు లా
జ్ఞను దయచేయఁగా వలయుఁ జక్కనివాంఛ యిదంచుఁగోరెఁ; ద
జ్జనపదమం దవృష్టిక మసాధువుగాఁ దగుకాల మంతటన్. 418

క. గడచెను బండ్రెండేడులు, గడుభీతికరంబు లగుచుఁ గడువంగా న
ప్పుడమికి రాజుం జేసెను, దడయక కౌశికుఁడు ప్రీతి దగువిభవమునన్. 419

చ. సురగణమావసిష్ఠుఁడును జూచుచు నుండఁగఁ బైతృకంబుగాఁ
బరఁగెడు రాజ్యమందు గురుపాతకయుక్తుని నాకుమారు నా
దరమున నుంచె నాపిదపఁ దద్విభుఁ డెంతయుఁ గోర శక్తివి
స్ఫురణముమీఱ స్వర్గపురిఁ జొచ్చువిధం బొనరించె వేడుకన్. 420

క. సతనుని సత్యవ్రతునిన్, బితృవైరిని స్వర్గపురికి విహిత మనుచు గా
ధితనయుఁ డంపెను, దత్క్షితిపతికిన్ గైకేయవంశభవ పత్ని తగన్. 421

ఆ. సత్యరథ యనంగ సాధ్వీమణి యనంగ, ఖ్యాతిఁ గాంచి తనయుఁ గాంచె నాతఁ
డఘవిదూరుఁ డమలుఁ డయ్యె హరిశ్చంద్రనామ మలర వంశనామ మలర.

క. అతఁడే త్రైశంకవునా, క్షితిఁ బేరుం గాంచి యశముఁ జెంది యనృతవా
గతిదూరుఁ డగుచు సమ్రాడ్వితతఖ్యాతిం జెలంగె విబుధులు పొగడన్. 423

తే. రాజసూయం బొనర్చి సమ్రాట్టనంగఁ, బరఁగెనని విందు; నాక్షితిభర్తకొడుకు
రోహితుం డనఁ బాపదూరుం డనంగఁ, బేరుపొందెను మునులార వినుఁడు పిదప.

సీ. హరితుఁ డాతనిపుత్త్రుఁడయ్యెను జంచునామకుఁడు తత్సూనుఁడు మహితగుణుఁడు
హారీతుఁడనియుఁ బేరందెనా చంచువే యతనికి విజయాఖ్యుఁ డాత్మజుండు
కలిగె దిగ్విజయమువలన నానామంబు సార్థకమయ్యె నాయవనిపతికిఁ
దనయుండు రురుకుండు ధర్మార్థకోవిదుం డావిర్భవించెఁ దదాత్మజుండు

ఆ. వృకుఁడనంగ నొప్పె నెసఁగె బాహువు వాని, తనయుఁ డగుచు నతని దర్పమొప్ప
హైహయులును గ్రూరులగు తాళజంఘులు, వెడల నడచి రనుచు వినఁబడియెడు.

క. వానికళత్రం బౌర్వుని, మౌనివరున్ శరణ మొందె త్మౌసురుఁ డతఁ డ
మ్మానిని ధర్మపథంబును, దా నెంచి భయంబు వాపి తమిఁ గాపాడెన్ 426

క. సగరుండు తత్సుతుండై, తగియెం గరయుక్తి భవముఁ దా నొందుటచే
సగరాఖ్య నొందెఁ దజ్జన,ని గడున్ సాధ్వసముతో మునివ్రజనాథున్. 427

క. తనకున్ దిక్కని వేఁడన్, మునిపతి యౌర్వుండు నిన్ను ముద్ధా రక్షిం
తును నమ్ము మనియె నవ్వలఁ, దనయుం డుదయించి మౌనితల్లజువలనన్. 428

క. నిరుపమమాగ్నేయాహ్వాయ, మరినాశనచణము నైన యస్త్రముఁ గొని వే
ధరిణిం దిరుగుచు హైహయ, నరపతులం దాళజంఘునాముల శకులన్. 429

ఆ. పహ్లవులను మఱియుఁ బారదు లనఁబడు, ధరణిపులను దఱిమి ధర్మ మొప్ప
ధరణిఁ బ్రోచె ననినఁ దత్కథాశ్రవణైక, నిరతిఁ బల్కి రిట్లు లరసి మునులు.

చ. గరయుతుఁడై కుమారకుఁడు కాననమం దెటుపుట్టెనో మహీ
వరులగు నాశకాదులను బాహుపరాక్రమయుక్తులన్ మహా
త్తరకులజాతులన్ సుకృతధన్యుల రాజులఁ బాఱఁదోల నె
వ్వరుస నుపక్రమించెనో యభంగురరీతి వచింపుమా కృపన్. 431

చ. అన విని మౌనివర్యులకు నాకథకుం డిటుపల్కెఁ బాహువన్
జనపతి రాజ్యమేలుతఱి సంపదలం గొనఁ దాళజంఘు లన్
మనుజవరుల్ శకాఖ్యులును క్ష్మాపతిగర్వసమగ్రహైహయుల్
చని యలబాహునామకునిఁ జయ్యనఁ దోలి హరించి రుగ్రులై. 432

తే. యవనపారదకాంభోజు లట్లె పహ్లవులును హైహయ, భూవరుల్ చెలఁగితమ్ముఁ
బురికొలుపఁగా హరించిరి త్వరగ రాజ్య, మిట్లు పరవశ మగుట భూమీశుఁడతఁ

క. తనపత్నిఁగూడి యడవికిఁ, జనిదేహమువదలె నందె సాధ్వియు యదునం [డు.
దనయునగు తత్కళత్రము, వెనుకొని వని కేగి గర్భవిస్తృతిఁ గాంచెన్. 434

ఆ. బాహువునకు మఱొకభార్యయుఁ గల దామె
యదుకుమారిగర్భ మొదవఁ బొలుచు
టోర్వలేక యామె కుగ్రవిషం బిడె
యాదవియును భర్త యంత మొంద. 435

క. పెనిమిటిఁ జితిపైఁ జేరిచి, తనదేహం బతనితోడఁ దజ్జ్వాలనుముఖం
బునఁ బడిన సఫలమౌ నని, మనమునఁ దలపోసి యెక్కె మానినిపూన్కిన్.

సీ. భార్గవుం డౌర్వుండు పడఁతి నామెం జూచి కరుణాసమగ్రుఁడై కడఁగి యామెఁ
దగదని వారించి తనయాశ్రమముఁ జేర్చె నామెగరంబుతో నందె గర్భ
మును వదలెను దాన జనియించె గురుబాహు వగుతనూజుఁడు సగరాహ్వ
వానికి నమ్మహా మౌనియే జాతకర్మాదికృత్యంబుల నర్హరీతి [యుండు

తే. దానెయొనరించి వేదశాస్త్రములనతని, కాదృతింజెప్పి యాగ్నేయమనుమహాస్త్ర
మరివిమర్దనచణము నహార్యతమము, పరుల కెవ్వారికైన భాస్వరము మిగుల.

క. సురలకు దుస్సహము మహా, స్త్రరూపము నొసఁగె దాన ధరణీశుఁ డతం
డురుతేజుఁ డగుచు హైహయ,ధరణీశుల రుద్రుఁడు పశుతతి వలెఁ జెండెన్.

క. వితతయశ మొందె దానన్, క్షితి శకకాంభోజపతులఁ జెచ్చెఱ యవన
ప్రతతిని బారదులను శక,పతులను నిశ్శేషమృతికిఁ బాల్పడఁ జేయన్. 439

క. తలపోసి వారి మార్కొని, విలయం బొందించుచుండ వీరుఁడు సగరుం
డిల లేకుండఁగఁ దమ్ముం, బొలియించు నటంచుఁ దలఁచి భూరిభయార్తిన్. 440

క. మతిమద్వరుని వసిష్ఠుని, గతి నీవే మాకు ననుచుఁ గడువడిఁ బ్రార్థిం
చి తగన్ శరణం బొందిరి, క్షితి సురమునివర్యుఁ డతఁడు చెచ్చెఱ వారిన్.

చ. కరుణను భీతి వాపి నృపకాంతుని నాసగరున్ మహాబల
స్ఫురితుని మంచి కాలమునఁ జూడఁగఁ బోయి నయంబు పొంగ సం
గర ముడుగంగ నీకుఁ జనుఁ గావుము వీరి నటంచుఁ బల్కినన్
గురువరువాక్య మౌదలను గోరికఁ దాల్చి ప్రతిజ్ఞ నెన్నుచున్. 442

క. వారల వేషంబుల నొక,తీరున మార్పించి చిత్తతృప్తి యలర నా

భూరమణుఁడు ధర్మంబును, నేరుపునం గాంచె నెట్లనిన వినుఁ డింకన్. 443
సీ. శకనరపతుల శీర్షము లర్ధముండముల్ గాఁ జేసి విడిచె; నక్కటిక మూని
యవనకాంభోజుల వగునుత్తమాంగముల్ చక్కముండములుగ సంస్కరించి
వదలెఁ; బారదమహీవరులను ముక్తకేశులఁ జేసి యాపహ్లవులను శ్మశ్రు
ధరులఁగాఁ జేసి స్వాధ్యాయవషట్కారరహితుల నొనరించి విహిత మిద్ది
ఆ. యనుచు వదలె; శకులు యవనకాంభోజులు, పారదులును జేర కేరళులును
దర్యమాహిషకులు తగు కాలసర్పులు, రాజులయ్యు ధర్మరహితు లైరి. 444
క. గురువచనముచొప్పున నా, ధరణీశుఁడు వారిఁ గాచి తనదు ప్రతిన ను
ర్వరసార్థకముగ నొనరిచె;, నిరుపమధర్మంబు నిట్లు నేర్పు మెఱయఁగన్. 445
ఆ. కాచి విజయమొంది క్ష్మాస్థలిని జయించి, యశ్వమేధదీక్ష నాచరించి
వాజివరముఁ బూన్కి వదలె నాయశ్వంబు, పూర్వదక్షిణాశఁ బోలుచు నబ్ధి.
క. చరియించుచుండ నింద్రుఁడు, తురగము హరియించి దానిఁ దోడనె చేర్చెన్
ధరణీవివరము నంత సగరుఁ డాస్థలి సుతులవెదకఁగా బంచె వడిన్. 447
ఉ. వారలు పోయి యాస్థల మవార్యబలంబునఁ ద్రవ్వి రంత నా
ధారణిదేవదేవుఁడు నితాంతమనోహరమూర్తి విష్ణువన్
సారసనేత్రుఁడన్ విమలసంస్తుతిచేఁ గపిలుండు నాఁగ నా
శ్రీరమణుండు ప్రీతిమెయిఁ జేరి సుషుప్తిని బొందఁ జూచుచున్. 448
క. కోపంబున నార్చిరి తద్భూపకుమారకులు దానఁ బొంగెడు క్రోధ
వ్యాపారంబున మేల్కని, శ్రీపతి దృక్తేజముననె చెచ్చెఱ వారిన్. 419
తే. భస్మ మొనరించె నల్వురు వారిలోన, మిగిలి రోమానివరులార తగుసుకేతు
బర్హికేతువులును మఱి పంచనదుఁడు, ధర్మరతుఁడును వీరు నితాంతబలులు.
క. జనకునివంశము నిలుపంగను శక్తిం జెలఁగువారు; కపిలుఁడు సగరుం
గని కరుణ చెలఁగ వరమిచ్చెను నిక్ష్వాకువ్వయంబు క్షితి నక్షయమై. 451
క. నిరుపమకీర్త్యన్వితమై, ధరణిన్ వర్ధిలఁగఁ బుత్త్రతల్లజుఁ బడయన్
సురలోకంబున విచ్యుతిఁ, బొరయ నివాసంబు గల్గ బొందుగ వరమున్. 452
క. కరుణించె నంత సగరుని, వరతనయుం డశ్వవరముఁ బరమర్షికృపన్
మరలం బొందె చెలంగుచుఁ, బురికేగిన సగరుఁ డాత్మఁ బొంగెను కాంతిన్.
క. క్రతువును విధిగా నొనరిచె, క్షితిపతి యజ్ఞాశ్వవరము సింధువులనన్
జతనంబున లభియించుటఁ, గృతకృత్యుం డయ్యె నంతఁ జిత్త మలరఁగన్. 454
క. శతసంఖ్య నశ్వమేధ, క్రతువుల నొనరించి యశముఁ గాంచి మహిమచే
సుతులను నఱువదివేలను, మతిమంతుఁడు గనియె ననెడుమాట వినఁబడున్.
క. అని సంగ్రహముగ సూతుఁడు, వినిపించినసగరుగాథ విని యిట్లని రా
మును లెట్లఱువదివేవేవురు, తనయులు సగరునకుఁ గల్గి ధాత్రి వెలసిరో. 456

చ. చరితము వానినిన్ వినఁగఁ జిత్తము లాదృతిఁ బొందె నంచు నా
ధరణిసురేంద్రు లన్న విని తచ్చరితంబు సవిస్తరంబుగాఁ
బరమముదంబునం దెలుప స్వాంతమునం దలపోసి సూతుఁ డి
క్కరణి వచించె; నింక వినఁగాఁ దగు నిర్వురుపత్ను లావిభున్. 457
క. సేవించుచుండి రంత మ,హీవిభుఁడనఘుండు వారి నెలమిం గనుచున్
భూవిభునాయకుఁడనఁగాఁ, బావనవిఖ్యాతి మించి ప్రజలం గాచెన్. 458
సీ. తొలిభార్య యుత్ఫుల్లతోయజనేత్ర విదర్భభూపతివరుతనయ రూప
వతి కేశిని యనంగ వాసినిమించెను, రెండవభార్య యరిష్టనేమి
తనయరూపంబున ధర్మగుణంబున మించుచు మహతి నాఁ గాంచెఁ బేరు
వీరి కిర్వురకును గోరి వరం బిచ్చె నౌర్వమహాముని యతివలార
తే. యొకతె కర్వదివేలు వేఱొకతె కొక్క
వంశధరుఁ డగుసుతుఁ డుద్భవంబు నొందు
దురు తమిం గోరికొనుఁడు మీ రరసి యొక్క
వరము నా విని వారిలోఁ దరుణియోర్తు. 459
క. తనయులనర్వదివేలను, గనఁగోరెను వంశతిలకుఁగాఁ దగుసుతు నొ
క్కనిఁగోరెను వేఱొక్కతె, మునివరుఁ డట్లయ్యెడు మని ముదమునఁ బలికెన్.
క. వనితామణి యగుకేశిని, తనయుని నసమంజసుఁ డనఁ దగు వానిఁ గనెన్
వినుఁ డతఁడు పంచజనుఁ డను, మనుజేంద్రుఁడు చారుకీర్తిమంతుఁడు సుండీ.
క. రెండవతరుణియుఁ బూర్ణో,ద్దండమహాబీజసంయుతం బయి కనఁగా
నండాకృతిఁదగు తుంబిని, నిండారెడుప్రీతిఁ గనియె నృపుఁ డుప్పొంగన్. 462
తే. అందు షష్టిసహస్రసంఖ్యలఁ జెలంగు, గర్భములు తిలసమ్మితకాయములుగ
నలరె నదియు యథాకాలమందు జనన, మంది వృద్ధినిబొందె నాయంబ యలర.
సీ. ఆశకలంబుల నాజ్యకుండంబుల నునిచి యొక్కొకదాని నుర్వినాథుఁ
డొక్కొక్కధాత్రికి నొగిఁ బెంచఁగా నిచ్చె; నంతటఁ బదినెల లైన వరుస
వెలువడి రెల్లసుతులు తండ్రికిం బ్రీతి వర్ధిల్లఁ జేయుచు వరతనుయుతు
లగుచు నర్వదివేలు పొగడొందుబలముల నారాయణాంశంబు చారుతరము
తే. పొలయుటం జేసి ప్రాణముల్ వెలయఁ దుంబి
నుండి వెలువడి రని యిందు మోమునీంద్రు
లార! పంచజనుం డనుభూరితేజుఁ
డాత్మజుం డొక్కఁ డుద్భవ మయ్యెఁగాదె. 464
క. అతఁ డంశుమంతుఁ డనఁబడు, సుతుఁ గాంచె నతండు వీర్యశోభితుఁ డగునొ
క్కతనయుని దిలీపునిఁ గనె, నతనికి ఖట్వాంగుఁ డనెడు నాత్మజుఁ డలరెన్.
తే. ఆతఁడే స్వర్గమునుండి యవనిఁ జేరి, యొకముహూర్తము జీవించి ప్రకటభక్తి

ముజ్జగంబులఁ గీర్తిలో ముంచి తేల్చి, ముక్తిపదమొందె నని విందుముమునులార.

క. గురుబలుఁడు దిలీపుఁడు మఱియు రహిం దగి సాధువనఁగ నొప్పుసుతుఁ గనెన్
సురసముని భగీరథునిన్, సురలోకమునుండి యతఁడె శుభతమ గంగన్. 467

క. ధరణికిఁ దెచ్చెను మఱి సాగరమునఁ గలియంగఁజేసె గంగను సుతఁగా
నిరుపమకీర్తిం గాంచెను, దరువాతనె దేవగంగ ధరణీస్థలిలోన్. 468

క. కనియెన్ భాగీరథి యన, మునిజనవిఖ్యాతనామమును; బుణ్యాత్ముం
డనఁబడెడుభగీరథునకుఁ, దనయుండుశ్రుతుండునాఁగ ధరఁజెలువారెన్. 469

వ. అతనికి నాభాగుండను ధార్మికోత్తముండు తనయుండు గలిగె. వానికంబరీషుండు సకలలోకవిఖ్యాతుండుపుత్త్రుం, డతనికి సింధుద్వీపుండను వాఁడాత్మసంభవుండు, వాని కయుతాజిత్తును, నారాజునకు ఋతుపర్ణుండును సుతులైరి. ఆఋతుపర్ణుండు యశోధురంధరుండు నక్షహృదయవిద్యావిదుండునయ్యె. ఆర్తపర్ణితత్తనయుండు సుదాసుండు వానికొడుకు వాఁడెయింద్రసఖుండయ్యె. సౌదాసుండు తజ్జనితుండు. కల్మాషపాదుండు వానికుమారుండు. వాఁడు సర్వకర్మయనుకొడుకుం గాంచె. వాని కనరణ్యుండు కుమారుండు. నిఘ్నుండు తత్సుతుండు. వాని కనమిత్రరఘునామకు లిర్వురుసుతులు జనించిరి. వారియం దనమిత్రునకు దులిదుహుం డుదయించె. వానికి దలీపుండు పుత్త్రుండు. ఆతండె శ్రీరామునకుఁ బ్రపితామహుండు. దిలీపునకు దీర్ఘబాహువిరాజితుండగు రఘు వుదయించె. 470

క. అతఁడే యయోధ్యయం దప్రతిమబలుం డగుచుఁ బట్టభద్రుండయి యు
న్నతి నొప్పె వాని కజుఁడను, సుతుఁ డుద్భవమంది సుగుణశోభితుఁ డగుచున్.

క. దశరథుఁ డనుసుతుఁ గాంచెను, దశదిశలవెలుంగుకీర్తిఁ దా నొంది యతం
డు శమితరిపుఁ డౌ రామునిఁ, గృశానుసమతేజుఁ గాంచెఁ గృతనియతుండై. 474

క. రామునితనయుఁడు కుశుఁడనఁ, గా మహి విఖ్యాతినొంది కలితయశుండై
శ్రీమహితుండై యతిథిని, గామసమానాంగకాంతి కలితుం గనియెన్. 473

సీ. అతిథికి నిషధాఖ్యుఁ డాత్మభవుం డయ్యె నలుఁడు తత్పుత్త్రకుఁ డలఘుబలుఁడు
వానికి నభుఁడనువాఁడు సూనుం డయ్యెఁ బుండరీకుఁడు వానిపుత్త్రుఁ డతని
కొడుకయ్యెఁ క్షేమధన్వుఁడు వానికయ్యె దేవానీకుఁ డనఁబడుసూనుఁ డతుల
వీర్యవంతుఁడు వానికార్యసన్నుతుఁ డహీనగుఁ డనునట్టితనయుఁడు కలిగె

తే. వానికి సుధన్వుఁ డుదయించె వాఁడు శలునిఁ
గనియె నుక్థ్యుఁడు తత్సుతుఁ డనఘుఁ డఖిల
ధర్మకోవిదుఁ డామహాధాత్రిపతికి
వజ్రనాభుఁడు తనయుఁడై వాసి గాంచె. 474

క. నలుఁ డతనికి నుదయించెను, నలనామకు లిర్వు రిలకునాథు లనుచు ని
స్తులరీతిఁ బురాణంబుల, విలసిలు నంచెలుఁగవలయు వినుఁ డటమీఁదన్. 475

తే. అందునొక్కఁడు వీరసేనాత్మజుండు, నితరుఁ డిక్ష్వాకువంశజనితుఁడు నైరి
సాధుమతులార! యిక్ష్వాకుసంతతి నిట, విస్తరింపఁగఁబడియెను వేడుక దగ. 476
క. ఈతనయులు భానుకులో,ద్భూతులు దుర్వారతేజమునఁ దగి బహువి
ఖ్యాతిని మించిరి విలస,త్పూతచరిత్రంబు దీనిఁ బూని పఠింపన్. 477
వ. సూర్యయములయనుగ్రహంబున బుష్టియు సంతానంబును గలుగు. సూర్యలోక
నివాసంబు సిద్ధించు నని సూతుండు మఱియు నిట్లనియె. 478

## ఏడవ అధ్యాయము.

అత్రినేత్రమునుండి చంద్రుఁ డుదయించుట.

క. మునులార! సోమునకు న,య్యెను నత్రిమునీంద్రుఁ డిట పిత యెల్లమునులలో
గనియెఁ బ్రధానత నాతఁడు,వనజాసనుమాన సప్రభవుఁ డగుఁజుండీ. 479
క. పరమేష్ఠిసృష్టియొనరుపఁ, బరమాధృతినుండి కనియెఁ బరమర్షిని నీ
శ్వరకుల్య నత్రినాతం, డురునియతిఁ దపంబొనర్చె నోహో యనఁగన్. 480
ఆ. దివ్యహాయనములు త్రిసహస్రములు మహా, నియతిఁ దప మొనర్చె నిర్జరనుతి
చెలఁగ ననుచు వింటిఁ జిత్ర మాతనివీర్య,మూర్ధ్వగతిని బాఱె నొక్కరీతి. 481
క. సోమత్వ మొందె నయ్యది,యామునినేత్రములనుండి యవ్వారి దిశా
స్తోమము భాసిలఁ బాఱె ని,కామము దశవిధము లై నగతు లలరారన్. 482
సీ. ఆగర్భవరము దిగంగనల్ గని హర్ష మలర ధరింపఁగఁ దలఁచియొక్క
మాఱుగాఁ జనుదెంచి మానిసముద్భవం బయి యప్రత్కర్య మానట్టిదాని
ధరియింపఁజాలక తనుబుద్ధి నేమని యూహించుచున్ వారలుండ నద్ది
ధరణిపైఁ బడియె; నం తట నిట్లు ధరఁబడు సోమునిఁ గనుచుఁ బితామహుండు
తే. నతని నెత్తి రథమునందుంచె లోకహి,తమునుగోరి యిట్లు ధరణిఁబడిన
యత్రిపుత్త్రుఁగాంచి యమరులు బ్రహ్మజు, లఖిలమునులు పొగడి రతులనుతుల.
చ. మునిముఖు లిట్లుగాఁ బొగడ ముందట సోమునితేజ మట్టి లో
కనిచయ మాదృతింగనఁగఁ గమ్రతరంబుగఁ దృప్తినొందఁ జే
సెను దెసలెల్ల నిండె; విధిచే వినియుక్తుఁడు నౌచుఁ దద్రథం
బునను వసించి సోముఁడు సముద్రయుతంబగుభూతలంబునన్. 484
క. తిరిగెను బ్రదక్షిణంబుగ, నిరువదియొకమాఱు; లిట్టు లెసఁగెడువీర్యం
బరుదుగఁ బ్రవహించిన యా,ధర నెల్లెడ నోషధులు నితాంతం బొదవెన్. 485
తే. వేనిచే లోకములు తృప్తివెలయుచుండు, నట్టియోషధు లుద్భవం బందె; సంత
లబ్ధతేజుఁడు సోముఁ డుల్లమున నమల,నుతులచేఁ దృప్తి నొందె సంతోష మలర.
వ. దశదశతిపద్మసంఖ్యాకసంవత్సరంబులు తపం బొనరించె. దాన హర్షించి బ్రహ్మ
విద్వరుఁడగుపితామహుండు బీజౌషధులకును, బ్రాహ్మణులకును నధిపతివి

గమ్మని వరంబిచ్చిన సోముఁడు తదనుజ్ఞాతుండై యమ్మహారాజ్యంబునొంది సహస్ర శతదక్షిణంబగు రాజసూయమహాధ్వరంబొనరించి ఋత్విక్కులకుఁ ద్రిజగంబులం దనకుంగల రాజ్యంబు దక్షిణగా నొసంగెనని వినంబడియె. ఆయజ్ఞంబున బ్రహ్మర్షిసత్తములు సదస్యులైరి. హిరణ్యగర్భుండగు బ్రహ్మయు నత్రిభృగువులు ఋత్విజులైరి. బ్రహ్మర్షి పరివృతుండై హరియు సదస్యుండయ్యె. అంత నాసోముని సినీవాలియుఁ గుహూవును, ద్యుతి, పుష్టి, ప్రభా, వసు, కీర్తిధృతి, లక్ష్మీ నామంబుల నలరు దేవీనికరం బాశ్రయించె. 487

క. అవభృథపరిపూతుండై, దివిజర్షిసమూహాసంయుతిని దశదిశలం
బ్రవిమలకాంతుల ముంచుచు, నవమహిమన్ వెలసె మిగుల శశధరుఁ డచటన్.

చ. వనరుహసూతిసత్కృపను వర్ధిలి పొందనశక్యమైనభూ
తిని మునిసంస్కృతం బగుచు దివ్యమునై తగుదానిఁ బొందె; నం
త నతఁడు సంపదంధుఁడయి న్యాయముతప్పి చరించె నుంత త
ప్పనుచు నెఱుంగఁడయ్యెను నయంబును వీడినకారణంబునన్. 489

చంద్రుఁడు తారను గ్రహించుట.

క. వినుఁ డావార్తను దెల్పెద, మునులారా! భూరిభాగ్యమున మోహితుఁడై
కనులంగానక యంగిరసునితనయుని భార్యఁగొనియె సుమతి యడంగన్. 490

చ. సురలు సురర్షులెల్లఁ జని శోభిలునాతనివేఁడి రిట్లు నీ
వరయకచేసి తిద్ది తగ దార్య! యికైనను దీనిమాని యీ
తరుణి నొసంగు మెప్పటివిధంబున సత్క్రియ లాచరింపుమా
గురుతరపాపకృత్య మిది కొంకకచేసితి వంచు దీనులై. 491

తే. ఎంత వేఁడిన నీయఁగా నెంచఁడయ్యె, మరలఁ దారను గురున కిమ్మాడ్కిఁ జంద్రుఁ
డామెనీయమి శుక్రుఁడాయంబుజారి, ప్రక్కఁజేరెను సురగురుపైని గ్రుధను.

చ. ఇది తగుకార్య మెట్టులగు నీయెడ నూరకయున్న న్యాయమె
ట్లుదయమునొంది వర్ధిలెడు నోసురలార! యటంచు రుద్రుఁ డా
త్మఁ దగులునీతిఁ జంద్రుపయి దారుణకోపముఁ బూని కార్ముకం
బు దహనురీతిఁ బ్రజ్వరిలుభూరిశరంబు ధరించి పూన్కితోన్. 493

క. గురుపక్షంబునఁ జేరెను, సుర లాతనిఁగూడి రంత సురలపయిం గ్రో
ధరతిన్ దనుజులు చంద్రునిఁ, బరివేష్టించిరి నితాంతపౌరుషములతోన్. 494

క. అంతట బ్రహ్మశిరంబన, నెంతయు భయదంబుగాఁగ నెసఁగెడు శస్త్రం
బింతనరాని క్రుద్ధం గొని, పంతంబున వైచె శశియుఁ బరబలముల పై. 495

క. సురలు తనకీర్తిఁ జెఱచుటఁ, బరికించి తదంతము నిఁక బాగుగఁజేయం
బరమన్యాయ మ్మని శశ,ధరుఁ డాయస్త్రంబు విడిచె దర్పము పొంగన్. 496

ఆ. తారకామయమయి తద్యుద్ధమప్పుడు, దేవదానవులకుఁ దెంపుమీఱ

సాగుచుండె, లోకసంతతిక్షయకరం, బగుచు నంతదాని నాపఁదలఁచి. 497
క. అనిలోఁ జేరక తుషితా,ఖ్యసుదాల్చినదేవతలు మహర్షులు తొలిదే
వుని శాశ్వతునిన్ బ్రహ్మను, గనఁబోయిరి శరణ మనుచుఁ గళవళపడుచున్. 498
క. తెలిపిరి తత్సంగరమును, జలజాసనుఁ డంత ననికిఁ జనుదెంచి యుమా
లలనాధీశుని శుక్రునిఁ, బలుకుల వారించి న్యాయపద్ధతిమీఱన్. 499
క. ఆంగిరసునకును నాతా,రాంగన నిప్పించె మరల; నాభార్యను జం
ద్రుంగూడుటచే గర్భిణి,గం గాంచి గురుండు క్రోధకలితుం డగుచున్. 500
ఆ. నీదుకుక్షియందు నెలకొనుగర్భంబు, తన్వి! పరకృతంబు దానిఁ దాల్పఁ
జన దటంచుఁ బలికెఁ జాన యిషీకాశ్ర,యమున దాని వదలె నాక్షణంబ. 501
క. వనరుహసూతియు జనియిం,చిననాశిశురూప మెలమిచే దేవతలం
గొనుఁడంచుఁ బలికె; సంశయ,మున దివిజప్రవరు లార్తిఁ బొగిలెడుతారన్. 502
క. కని పల్కి రిట్లు సత్యం,బనె పల్కుము పూవుఁబోఁడి పుత్త్రుఁ డితఁడు చం
ద్రునకుంగల్గెనొ గురునకు, జనియించెనొ నాఁగఁ దార సభఁ బలుకుటకున్. 503
ఆ. సంశయించి తాను సత్యంబు పలికిన, గురున కేమియలుక గుదురుకొనునొ
యనుచు నూరకుండె; నంతఁ గుమారుండు,తా శపింపఁ బూనెఁ దార నపుడు.
చ. జలరుహసూతి యాతనిని శాపమొసంగకు మంచుఁ బల్కి యా
వెలఁదిని జేరి సంశయము వీడఁగఁబల్కను బంకజాక్షిరో!
పలుకుము సూనృతంబుగను బట్టియితం డెవనిం బితా యటం
చెలమిని బల్కఁగాఁ దగునొ యేర్పడ నన్న లతాంగి దీనతన్. 505
ఆ. దోసిలొగ్గి యాతఁ డీసోమునకుఁ బుత్త్రుఁ, డనఁగ నాకుమారు నంతలోన
నెలమిఁ జేరి చంద్రుఁ డేర్పడ మూర్ధము, ముఖమునందుఁ జేర్చి ముద్దుగొనుచు.
సీ. బుధుఁడను నాహ్వయంబును బెట్టె; నాబుధుం డాకాశమునఁ గాననైననేదొ
యశుభంబు భూలోకమం దుద్భవిల్లును;బుధునకు నిలయందుఁ బుత్త్రుఁ డొదవె
నతఁడె పురూరవుండనఁగనై లుండనఁ బ్రఖ్యాతినొందె; నారాజవర్యుఁ
డూర్వశియందుఁ దానొగి సప్తపుత్త్రులఁ గనియె నీయది, సోమజననమిట్లు.
ఆ. చెప్పఁబడియె మీకు స్థిరకీర్తిదంబిది, మానులార! సోమమహితవంశ
కథ యశంబు నొసఁగుఁ గడు నాయువును భాగ్య, మును మనోరథమ్ములను నొసంగు.
క. అనఘుం బిది మర్త్యులకున్, వినినం జదివినను గల్గుఁ బృథుసంతానం
బనయంబు పాపజాలం,బును బోకార్పంగఁజాలు మునివరులారా! 508

పురూరవసుజననము.

క. అనిపలికి లోమహర్షణుఁ, డనూనమోదంబుమీఱ నమ్మునివరులం
గని మఱియు నిట్లు పలికెన్, వినుఁ డాబుధునాత్మజుండు విద్వాంసుండై. 509

తే. తేజముననొప్పిదాతయైదేవతలను, యజ్ఞములఁదృప్తినొందించియమితదక్షి
ణలనుఋత్విజులందన్పివెలసె నతఁడె, పేరునఁబురూరవసుఁడనఁబృథ్విఁదనరె. 510

క. ఆతండె బ్రహ్మవాదియు, భీతశరణ్యుండు వైరిభీముం డనిలో
నేతఱిని దుర్దముండగుఁ, ద్రేతాగ్న్యర్చకుఁడు భూపతిప్రవరుండున్. 511

చ. ఋతమె వచించి సంతత మహీనపవిత్రమతిం జెలంగి వి
స్తృతసుగుణాఢ్య యాలలన నెంతయు వేడుకఁ బెండ్లియాడి సం
యతరతియై జగత్త్రయమునందు నితాంతయశంబు మించఁగా
ఊతి నలరారె నానృపతిసిద్ధుఁడు బ్రహ్మతపస్సమాయుతిన్. 512

ఉ. ఆనృపచంద్రు నూర్వశియు హర్షమునం గని దేవగౌరవం
బూననిచిత్తవృత్తిమెయి నొక్కటిఁ గోరె నతండు నూర్వశిన్
మానసతృప్తిదాయిని నమానుషలభ్యను గూడి తృప్తికై
దా నలరారెఁ గేళుల నితంబిని నెమ్మది మెచ్చునట్లుగన్. 513

తే. చైత్రరథమను నారామసత్తమమునఁ, బదియునైదునువర్షముల్ భవ్యమైన
యట్టిమందాకినీతటమందునైదు, హాయనములాఱువర్షంబు లలకయందు. 514

క. తనరారువిశాలాపుర,మున సప్తాబ్దములు దేవముఖ్యహితంబై
కనుపట్టునందనంబున, నెనిమిదిసంవత్సరంబు లెలమిం గడపెన్. 515

వ. మఱియు నారాజచంద్రుం డగణ్యరూపవిలాసవతియగునాయువతింగూడి యుత్త
రకురుదేశంబులందును, దేవతాస్తుత్యమానేతరస్థలంబులందును విహరించుచుం
బ్రమోదంబు నందుచుండె. మఱియుఁ బుణ్యతమంబై మహర్షిసేవితంబు నగుప్ర
యాగస్థలంబునివాసంబుగా రాజ్యంబు చేయుచుండె. ఇట్లప్రతిహతవిక్రముం
డగునారాజన్యుండు జాహ్నవీనద్యుత్తరతీరంబునఁ బ్రతిష్ఠానపురంబు నిర్మించి
యందును గొంతకాలం బుండె. ఆతని కూర్వశియందు దేవతుల్యులై మహాత్ము
లైన యాయువు నమావసు, విశ్వాయువులును శ్రుతాయువు దృఢాయువు,
వనాయువు. బ్రహ్మాయువు ననునేడ్వురు కొడుకులు గల్గిరి. అం దమావసుతన
యుండు భీమనామకుండు రాజేంద్రుండయ్యె. ఆతనికుమారుండు కాంచనప్రభుం
డావిద్వత్ప్రభువునటి బలశాలియగుసుహోత్రుండు తనయుండాతనిభార్య కేశిని
ఆదంపతులకు జహ్నునామకుండు తనయుండుకలిగె. ఆతండె సర్పమేధం బొన
రించె పతిలోభంబున నాతనింగంగ యాశ్రయించెఁ గదా ఆతండంగీకరింపనికతన
నాతనియజ్ఞవాటంబు నాభాగీరథి ముంచె నప్పుడు. 516

చ. తనదగుయజ్ఞవాటము నితాంతజవంబున గంగముంచుటన్
గనుఁగొని క్రోధవేగమునఁ గన్నుల నిప్పులు రాలఁగా సుహో
త్రుని తనయుండు జహ్నుమునితోడనె దా శపథంబుఁ బల్కె ని
ట్లని; సురవాహినీ వినుము యజ్ఞము దీనిని బాడుచేయఁగన్. 517

ఉ. పూనితివీవు నీదయిన పోకడ లెల్ల నడంగఁ ద్రావెదన్
గానఁగ నౌను నాదగు నఖండమహత్త్వము నిల్వుమింక నెం
దేని చనంగ నెట్టులగు నీజతనంబును మాన్పివైచెదన్
మానిని, దీనికిన్ ఫలము మానక యిప్పుడె నీవు పొందుమా. 518

చ. అని వచియించి దేవనది నాత్మబలంబునఁ ద్రాగె నవ్విధం
బును గని మౌను లాతనికిఁ బుత్త్రికగా వచియించి గంగ నా
ర్తిని గనకుండఁ జేసి నృపతిన్ ముద మొందఁగఁ జేసి; రంత దే
వనదియు జాహ్నవీ ప్రథితభవ్యయశంబును గాంచె నంతటన్. 519

క. యువనాశ్వతనయ లావణ్యవతిం గావేరి యనెడు నామంబున నొ
ప్పు వరారోహను జహ్నుఁడు, వివాహరీతిన్ వరించె వేడుక మీఱన్. 520

వ. ఆ కావేరి యువనాశ్వశాపంబున గంగార్ధంబునుండి వినిర్గతయై నదీశ్రేష్ఠ యను విఖ్యాతిం గాంచి జహ్నుమహర్షికిం బత్నియయ్యె నని యెఱుంగవలయు. 521

తే. జహ్ను వాసతియందుఁ బ్రశస్తగుణుని,
ధార్మికుని బుత్త్రునిన్ సునందప్రథితునిఁ
గాంచె నాతని కజకుండు కలిగె సుతుఁడు,
వానికొక్క తనూజుఁ డుద్భవముఁ గాంచె. 522

క. అతఁడు బలాకాశ్వుం డను, క్షితిపతియై వెలసె నతఁడు సిద్ధబలుని స
త్సుతుఁ గుశు మృగయాశీలుని, వితతయశోవ్యాప్తదిశుని వీరుని గనియెన్. 523

క. నలుగురు తనయులు కుశునకుఁ, గలిగిరి దేవతలఁ బోలు కమ్రయశులు ని
స్తులబాహుబలులు వీరులు, నిలాధిపతిశేఖరులు నహీననియతులున్. 524

వ. కుశిక, కుశనాభ, కుశాంబ, మూర్తిమంతులను నామంబులం బరఁగిరి. పహ్లావు లాకుశికుం బాఱఁదోలిన వనవాసంబు చేయుచు నాతండు శతమఖతుల్యుండగు కొడుకుం బడయం గోరి యుగ్రతపంబు చేయ వర్షసహస్రంబు నిండుటయు, శక్రుండు ప్రత్యక్షుండై సమర్థుం డగు కొడుకు గలుగునని వరం బిచ్చె. తద్వరంబున నింద్రతుల్యుండై గాధియను పేరం బరఁగు కుమారుండు గలిగె. 525

క. పురుకుత్సతనయ యా భూవరునకు సతియయ్యె నామె వరగుణయుతయై
పరఁగుచు గాధికృపం గనె, నిరుపమగుణయుక్తఁ గూఁతు నెమ్మి తనరఁగన్. 526

క. ఆమెయు సత్యవతి యనన్, భూమిని బేరొందిసుగుణభూషిత యగుచున్
నేమమున నుండ గాధియు, నామానిని గావ్యపుత్త్రుఁ డై సన్ముని యై. 527

క. అలరారు ఋచీకున కిమ్ముల నిచ్చెను సత్యవతియు ముదమున నతఁడే
సులలితుఁ డని ప్రేమించెను, గలదే యిలనిట్టి దనుచుఁ గాంతలు పొగడన్.

చ. మనుజవిభుండు గాధి యిటు మానిని నామునికిచ్చి యంతటం
దనయునిఁ బొందఁగోరి మునితల్లజు లెల్లరు సమ్మతించున

ట్లనువుగనల్లుఁడే కడుసహాయుఁడుగా నొకయిష్టిఁ జేసె నం
దు నొకపదార్థ మేర్పడియెఁ దోడనె యాచరు వారగింపఁగన్. 529

తే. తగునటంచు ఋచీకుండు తలఁచి భార్య, యైనసత్యవతిం బిల్చి చాన యిద్ది
సత్పదార్థము చరువనఁజాలు దీనిఁ, దల్లితోఁగూడి భక్షింపు ముల్ల మలర. 530

క. ఇది నీకు భక్ష్యమగుఁ జు, మ్మది నీతల్లికిని భక్ష్యమగు నద్దానన్
గదిరెడుఫల మేమనఁగా, సదమలదీప్త్యన్వితుండు క్షత్త్రియవరుఁడున్. 531

చ. తను నని గెల్చుభూమిపతితల్లజులే యిల లేకయుండఁ జ
క్కనియశ మొప్పఁగాఁదగు నఖండతరప్రతిభాయుతుండు నౌ
తనయుఁడు నీమతల్లికిని దప్పక కల్గెడు నీకు భామినీ!
యనుపమదాంతియుం దపము హారిశమంబును భూషణాళిగన్. 532

క. అలరెడుతనయవతంసము, కలుగున్ సత్యంబు మార్పు గాకుండఁగ నో
లలనా! భక్షింపఁదగున్, బలుకుల వీనిం దలంచి భక్షింపఁ జనున్. 533

క. అని పలికి ఋచీకుఁడు తప,మునఁగలయాసక్తిని వనమునకుం జనియెన్
జనపతివరుఁ డాగాధియుఁ, జనుదెంచెన్ భార్యఁగూడి చరువును గొనఁగన్. 534

తే. తీర్థయాత్రాప్రసంగయుక్తిని ఋచీకు, నాశ్రమంబున కేతెంచి యాత్మజఁ గనె
సత్యవతియును హృష్టయైచరుయుగంబు, భర్తృనానతి గ్రహియించి పలుకు

క. తనజననిచేతికిచ్చెను, జనని యభేదముగ దాని స్వాంతమ్ముననె [లెన్ని.
న్ని నిజాత్మజ కొకదానిని, గొను మని యొసఁగంగ దానిఁగొని యాదృతిమై.

క. తనకిచ్చినదో కాదో, మునిపతి యని తలఁప కాత్మ మునుకొను వేడ్కం
గొని భక్షించెను దానన్, మనుజాధీశాంతకరుని మహితప్రజ్ఞున్ 537

క. తనయుని గర్భంబునఁ దా, ల్చెను దానన్ దీవ్రకాంతిఁ జెలఁగుచుఁ జూడం
గను ఘోరంబగు నాకృతి, వనితామణి కాంచె నంత భర్తయు దానిన్. 538

చ. నిరుపమయోగదృష్టిని గనెన్ విసుగొందెడుచిత్తమొప్పఁగాఁ
దరుణిని గాంచి యిట్లనియెఁ దప్పెను గార్యము తల్లిచేత నీ
చరువు గతక్రమంబుగను జానరొ యీఁబడె నీకు దాన నుం
దరి భవదాత్మజుండు కడు దారుణకర్ముఁడుఁ గ్రూరచిత్తుఁడున్. 539

తే. కాఁగలం డింక నీదునగ్రజుఁడు బ్రహ్మ
వేత్తయుఁ దపోధనుండు నౌవిశ్వ మెల్లఁ
దపమునన్ నిండఁజేయంగఁ దగినతనయు
నీకు నీయ నాచరువును నిల్పినాఁడ. 540

క. ఐనను విధిగతి నీపని, మానిని! వ్యత్యయముగాఁగ మాఱె ననిన నా
మీనాక్షి సత్యవతి తన, మానస మురియాడఁ జాల మన్ననమీఱన్. 541

చ. పతిని బ్రసన్నుఁజేసి భగవంత మదాత్మజుఁ డిట్టివాఁడుగా

క్షితిఁ దగకుండఁ జేయఁదగు సిద్ధతపోబలయుక్తిగల్గి య
ప్రతిమయశంబుగన్న మిమువంటి మహాత్మునిపుత్త్రుఁ డిట్టిఁడౌ
ట తగునె యన్న నామునిక డంక వచించెను ధర్మపత్నితోన్. 542

క. కోరిక నిటు తలఁపఁగలే, దోరమణీ! యిట్లుపల్కుటొప్పునె సుతుఁడౌ
దారుణకర్ముం డస్మత్కారణమున ననిన మరలఁ గామిని పతితోన్. 543

క. తలఁచినయంతన లోకం,బుల సృజియింపంగఁగలవు పుత్త్రుం డన నో
కలుషహరా యెంతటిపని, యలఘుశమాన్వితుని వృత్తిహారిని సుతునిన్. 544

క. కరుణింపఁదగుదుమీ వని, తరుణీమణి మఱియుఁ బలికెఁ దాపసవర్యా!
పరికింప మనకుఁ దాదృశ,ధరణీశాంతకుఁడు కల్గదప్పని దైనన్. 545

క. ఆపలుకు మార్ప నర్హ,వ్యాపారము గానిదైనఁ బౌత్త్రుం డటులే
భూపాలాంతక పౌత్త్రుం,డే పుట్టెడునట్లు వరము నిమ్మా యనినన్. 546

క. తనయుండౌ తత్తనూజుఁడౌ, వనితా! యట్టిండె యగును. బరికింప భవ
న్మనమునఁ గోరినయట్టులె, తనయుండు కృపాకరుం డుదయమొందెడుఁ జూ. 547

చ. అనిపలుకంగ సత్యవతి యప్పటికిన్ ముదమొందె నంత స
త్తనయుఁడు దాంతుఁడున్ దపమెద్రవ్యముగాఁగలవాఁడు భార్గవుం
డన జమదగ్నినాఁబడెడు నట్టియశోనిధి యుద్భవిల్లె; నా
మునియమరేశకేశవుల ముందుగ లోనఁ దలంచి యవ్వలన్. 548

తే. చరువునందుఁదదంశముల్ చక్కఁజేర్చి,యుండె విధిగతి వ్యత్క్రమ యుక్తిసద్ది
వారిచే భక్షితం బయ్యె వైష్ణవార్ధ,భాగమునఁ బుట్టె జమదగ్ని పరమగుణుఁడు.

సీ. అట్లు చరువ్యత్యయంబొనరించుట జమదగ్నినామంబు క్షమఁ జెలంగె
నాసత్యవతి యెంతయే సత్యధర్మపరాయణ కౌశికీ రమ్యనామ
మలరంగఁ బుణ్యాత్మయై మహానదియయి యిదె ప్రవహించెడు లమిమిగుల
నిక్ష్వాకువంశ్యుఁడై యొసఁగు రేణువునాఁగధరణీశుఁడొకఁడొప్పెఁ దత్కుమారి

ఆ. కామలి యన రేణుక యనఁగ నలరారు, నామె యాబుచీకు నాత్మభవుని
భర్తగా గ్రహించి పరమతపోనిధి, సకలవిద్యలందు సాగరసము. 550

క. దారుణచిత్తుని నిగమా,ధారుని వరచాపవేద్యతత్త్వజ్ఞుని గం
భీరమతి జామదగ్న్యుని, భూరమణాంతకుని రాముఁ బుత్త్రుని గనియెన్. 551

క. ఆతండు దీప్తపావకుఁ,డే తగ నీరూపమొందెనేమొ యనఁగ వి
ఖ్యాతుం డగుచుం బితామహు,భూతలమున సకలసుగుణములఁ దుల్యుండై.

క. అలరారె బ్రహ్మవిద్వరుఁ, డలఘుతపశ్శాలియు నయి యాఘుననకు న
వ్వలివాఁడు[శునశ్శేఫుం, డలరె శునఃపుచ్ఛుఁ డతని కనుజుం డయ్యెన్.] 553

తే. కుశికనందనుఁడౌ గాధి కొడుకుఁ గనియె
నవని నతఁడు విశ్వామిత్త్రుఁ డనఁగఁ బరఁగెఁ

దపము విద్యయు శాంతము ధనముగాఁగ
నతఁడు విఖ్యాతుఁ డగుచు బ్రహ్మముని యయ్యె. 554

సీ. ధర్మాత్ముఁడైనయాతండు రెండవపేర విశ్వరథుండన వెలసి కౌశి
కాన్వయవర్ధనుం డగుచు ఖ్యాతింగాంచె; దేవరాతాదులౌ పావనాత్ము
లతనికి సుతులైరి వితతవిఖ్యాతిచే వారిపేరులు చాలఁ బ్రబలె జగతి
దేవరాతుఁడు జ్యేష్ఠుఁడై వానినింగాంచె నతనితమ్ముఁడు కతియనఁగనొప్పె.

తే. నతనిపుత్త్రులు జగతిఁ గాత్యాయను లన, నలరి రవల హిరణ్యాక్షుఁడవలరేణు
రేణుకులును సంకృతియు విరించితుల్యు, లైన గాలవముద్గలు లైరి సుతులు.

వ. మధుచ్ఛందజయులును, దేవతాష్టకులును, గచ్ఛప, హారితులు, ననువీరు విశ్వా
మిత్రతనయులు. వారిగోత్రంబులు జగద్విఖ్యాతింగాంచె. కారూషసంతతివారు
ప్రాణినులనియు, బభ్రువులనియు, ధ్యానజప్యులనియుఁ, బార్థివులనియు, దేవ
రాతులనియు, శాలంకాయనులనియు, బాష్కలులనియు, లోహితులనియు,
యమదూతలనియుఁ బ్రఖ్యాతింగాంచిరి. ఇంకను సౌశ్రవాదిగణంబులు కుశిక
గోత్రసముద్భూతంబు లై ప్రఖ్యాతినొందు. 556

తే. కౌశికుండయి బ్రహ్మర్షి కాంతుఁడైన, పౌరవుం డొప్పెఁ దద్వంశభవులు జగతి
విశ్రుతింగాంచి రరివీరవితతి నడఁచి; గాధినందనుస్సంతానగణమునందు. 557

క. తొలివాఁడు శునశ్శేఫుం, డలఘుప్రఖ్యాతినొందె నాభార్గవుఁ డు
జ్జ్వలకౌశికాన్వయత్వము, పొలయుట రాట్చిహ్నములను బొందె విధిగతిన్.

హరిశ్చంద్రునియజ్ఞంబునందు శునశ్శేఫుండు పశువుగా గ్రహింపఁబడుట.

క. మునులారా! యాగాధేయునకు శునశ్శేఫుఁడనఁగ నుదయించె సుతుం
డని వింటిరి గాదె హరిశ్చంద్రునియజ్ఞమునందు వాని దోర్బలయుతునిన్. 559

తే. నిర్ణయించిరి పశుతనొంది సవమెల్లఁ, బూర్తిచేయంగ నంత విబుధు లతనిని
మరల నిచ్చిరి గాధేయమౌని కెలమి; దానిచే దేవరాతుఁడై తనరె నతఁడు.

సీ. దేవరాతాదులు దీప్తతేజస్కులు సుతు లేడ్వురాగాధిజునకు నుర్వి
విఖ్యాతిఁ దెచ్చిరి వినుఁడు దృషద్వతీసుతుఁడైన యష్టకుం డతనికొడుకె
యతనికి లౌహి యన్సుతుఁడుదయించెను; జహ్నుగణంబు సంస్తవనుచేయఁ
బడియెఁగదా యింక బ్రహ్మమునీశ్వరులార! యాయువునాఁగ భూరికీర్తి

తే. నొందినట్టి మహాత్ముని యుత్తమాన్వ,యంబు వివరింతు నది పాపహరమువిమల
తరము కీర్తికరంబుఁ బుత్త్రప్రదంబు, జ్ఞానవైరాగ్యదము నయి తీమఁ జెలంగు.

---

## తొమ్మిదవ అధ్యాయము.

### ఆయునృపతిసంతతి.

క. వినుఁ డవల నాయువను రా,జునకున్ స్వర్భానుతనయ సుగుణనిధి యనం

జను ప్రభ భార్యగనెలకొని, తనయుల నైదుగురఁ గనియె దర్పోజ్జ్వలులన్.
క. వారెల్ల మహారథులై, ధారుణి బాలించి మిగుల ధర్మాత్ములుగాఁ
బేరొందిరందు నహుషుం, డారయఁ బ్రథముండు వాని కవ్వలివాఁడై. 563
ఆ. వృద్ధశర్మ యలరె వీనికి ననుజుండు, రంభుఁ డయ్యె నవల రజి యనేన
సుఁడును సహజులైరి సొరిది నుజ్జగముల, వీరియశము కీర్తి వెలసె మిగుల.
సీ. రజియన ధాత్రిఁ బరఁగు రాజు పంచశతతనూజులంగాంచెఁ దత్కులంబు
రాజేయమనఁగ నింద్రభయావహంబయి తనరారె నొక్కట దైవదాన
వాతిభయంకరాహవము ఘటిల్లంగ నిరుదెగలందున్న యుద్ధతేజు
లంబుజసంభవునంతికంబున కేగి పలికి రిట్లనుచు నీబవరమందు
తే. విజయ మేపక్షమున కగు విశ్వనాథ, తెలుపవే తత్త్వవార్త నాపలుకు వినఁగ
వేడుకయ్యెడు నా విని విధి వచించెఁ, దనయులార వినుండు సత్యంపుఁ బలుకు.
క. నరపతివరుఁడౌ రజి యెవ్వరికొఱకు ధృతాయుధుఁడయి బవరము చేయున్
వరుసఁ ద్రిలోకంబుల గెల్తురు వా రనుమాన మిందుఁ దోఁపదు సుండీ. 566
తే. ఎందు రజి యుండు నందుండు ధృతియు నద్ది
యెందు నుండునో శ్రీదేవి యందె యుండు
నవ్వి రెండు నెందుండునో యందె ధర్మ
జయము లుండు నటంచని సరసిజజని. 567
చ. పలికిన నాలకించి సురవర్యులు రాక్షసులున్ జయార్థులై
యలయక యారజిం గనఁగ నప్పుడ పోయి వరించి రాప్రభా
జలరుహనేత్రపుత్త్రుఁడు విశాలతరోత్తమతేజ మొప్ప ని
మ్ములఁ బరరాజిఁ జెందుచును భూతదయాపరుఁడై చెలంగుచున్. 568
క. కులవర్ధనుఁడై యుండెను, నిలేశు నారజిని గాంచి యెంతయు హర్షం
బుల దేవదానవేజ్యులు, పలికిరి ధర్మాత్మ! భూమిపాలశశాంకా. 569
క. మాకున్ నిజయముఁ గూర్పం, జేకొమ్ము శరాసనంబుఁ జెప్పెద నన నా
భూకాంతుఁడు వారలతో, నీకరణిన్ సాధుయశము హితముగ వెలయన్.
క. తనవాక్యంబుల స్వార్థము, గనఁబడుచుండఁగఁ బల్కెఁ గడఁగి శతముఖా
దనుజులనందఱ వీర్యం,బున నేను జయించి ధర్మమున నింద్రుఁడనై. 571
క. తనరారఁగఁ గల్గినచో, నని నొనరుతు నన్న సురలు హర్షంబున నో
మనుజేంద్రా! నీయిష్టము, గను సఫలత ననిరి కార్యగౌరవపరతన్. 572
క. నరవరుఁడును సురవాక్యం, బరుదుగ విని దానవాళినంతం గని య
క్కరణిని బల్కెను ద్రిదశో, త్కరముం గని పల్కినట్లు గారవ మొప్పన్. 573
చ. దనుజులు స్వార్థమేయొట నితాంతము ముఖ్యముగాఁ దలంచి ద
ర్పనిహితచిత్తులై మిగులఁ బౌరుష మొప్ప వచించి రో నృపా!

వినుము విరోచనాత్మజుఁడు విశ్రుతుఁ డౌఁగద నాకు నింద్రుఁ డౌ
ఘనుఁడె తదర్థమే కడఁకఁ గయ్య మొనర్తును నీవు నీ యనిన్. 574

క. నిలువుము ప్రహ్లాదున కీ, పలుకుల నెఱిఁగించి మరల వత్తు మనఁగ న
ట్టులె కా నిమ్మనె నానృపుఁ, డల విబుధులు నేర్పుమీఱ నారజినృపతిన్. 575

క. కని పల్కి రిట్లు నీ వీ, యని మొన దానవులఁ గిట్టి యపజయ మొందం
గను జేయు మగుదు వింద్రుఁడ, వన నానరపతియు దానవప్రతతిఁ దగన్. 576

ఆ. మారుకొని కడంక మర్దించె నింద్రున, కని జయింపరాని యమితబలుల
రాక్షసులను మఱియు రజిభూపుఁ డమరులఁ, బాసి చనినసిరిని బలము మెఱయ.

క. మరలించె నంత నింద్రుఁడు, గురువీర్యము మెఱయఁ బొల్చు క్షోణీశుని ని
ర్భరతేజుఁ గాంచి యెల్లరు, సరిగా విన నేను రజికి క్ష్మాపతిమణికిన్. 578

క. తనయుండ ననుచు మఱియును, ననియెన్ విబుధాళికెల్ల నధిపతి వీవే
జనకా! సందియమే లే, దనఘా నే నీకు సుతుఁడ నను విఖ్యాతిన్. 579

తే. కర్మములచేత నొందఁగాఁ గల నటంచుఁ
బలికె నీరీతి శతమఖుపలుకుల విని
యతనిమాయను వంచితుఁడై నరేంద్రుఁ
డట్లె యౌఁగాక యని యింద్రు నలరఁజేసి. 580

ఉ. అంతట నమ్మహీరమణుఁ డావృత్తి స్వర్గము నొందఁ జాలదు
ర్దాంతులు యుద్ధదుర్మదులు తత్తనుజాతులు స్వర్గరాజ్య మొ
క్కింతయు జంకులేక యమరేశ్వరునిన్ గణియింప కేగి వే
పంతము మీఱఁగాఁ గొనిరి బాపురె యంచు జనుల్ తలంపఁగన్. 581

తే. పంచశతరాజసూను లీపగిది స్వర్గ
రాజ్య మాత్మవశంబుగ రమణఁ జేసి
కొని తదాదిగ దుష్పథంబునను స్వేచ్ఛఁ
దిరుగుచున్ ధర్మశూన్యులై తెంపు వెలయ. 582

క. పలువిధముల రాజ్యంబును, విలయాంతకుపగిది మిగుల భీతిలఁ జేయం
గలవిలపాటొందిరి విప్రులు ధర్మము చెడియె ననుచుఁ బొగులుచు నెదలన్.

చ. ధరణిపసూను లిట్లు శ్రుతిదైవములన్ గణియింపకుంట స
త్వరముగ దర్పహీనులయి ధర్మవిహీనులు నౌటఁ గాంచి ని
ర్జరవిభుఁ డాత్మరాజ్యమును గ్రమ్మఱఁ గైకొని యాకుమారులన్
దురమునఁ జంపెఁ గామమునఁ దోరపుఁగ్రోధమునన్ గతాత్మని
ర్భరబలయుక్తులౌట నిటు రాజ్యము నింద్రుఁడు పొందునీకథన్. 584

క. వినునో యెవ్వఁడు నిల్పునో, మనమున నెవ్వండు వారు మహిఁ దౌర్గత్యం
బును మాని సుఖింతురు పుణ్యనికేతను లగుదు రనుచు నమ్మునితతికిన్. 585

ఆ. తేటపఱచి మఱియు దివ్యవాక్కులఁ సూతుఁ, డిట్లుఁ బలికె రంభుఁ డించుకయును
సంతతిం గనంగఁజాలక యుండె న,నేనసునికులంబుఁ బూని వినుఁడు. 586

వ. అనేనసునకు మహాయశంబున నలరు ప్రతిక్షత్త్రుం డుదయించె. వానికి సృంజయుండు తనయుం డాతనికి జయుండు కుమారుం డవ్వానికి విజయుం డాత్మభవుం డాసుకీర్తిధురంధరునకుఁ గృతి కొడు కాతనికి హర్యత్వతుండు సూనుం డాతనికిఁ బ్రతాపవంతుఁ డగుసహదేవుం డౌరసుండు, వానికి నదీనుండును, వానికి జయత్సేనుండును, వానికి సంకృతియు, నాతనికి క్షత్రవృద్ధుండును, నాధర్మాత్మునకు ననేనసుండును జనియించిరి. ఆక్షత్రవృద్ధునకే మరల సునీహోత్రుండు జనించె. వానికి ముగ్గురు కుమారులు కాశ్యశల్యగృత్సమదులనం బరఁగిరి. అందు మూఁడవవానికి శునకుం డాత్మజుండు, వానికి శౌనకుం డుదయించె. మఱియు బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రు లవ్వానినుండి వృద్ధి నొందిరి. శల్లాత్మజుం డార్ష్టిషేణుండు వానికిఁ గాశ్యపుండును, వానికిఁ గాశిపుండును, దీర్ఘతపుండు ననునిరువురును, దీర్ఘతపునకు ధన్వంతరియు జనించిరి. ధన్వంతరి తపఃప్రభావమహితుండయ్యె. కారణాంతరంబున మనుష్యలోకంబున ధన్వంతరియే యుదయించె. ఆతండు కాశిరాజయి సర్వరోగనివారకుండయి భరద్వాజమునివలన నాయుర్వేదంబుఁ బడసి భిషగ్వరుండై యాయుర్వేదంబు నెనిమిదివిభాగంబులుగ నొనరించి శిష్యులకుం బంచిపెట్టె. ధన్వంతరికిఁ గేతుమంతుఁడును వానికి భీమరథుండును, వానికి దివోదాసుండును బుట్టిరి. దివోదాసుండు వారాణస్యధినాథుం డయ్యె నంత. 587

క. నరవరుఁ డీతఁడు కాశీ,పురపతి యగుసమయమందె భూరితరబల
స్ఫురణమున నొప్పు క్షేమక,సురవైరియు దాని మనుజశూన్యముఁ జేసెన్. 588

సీ. వినుఁ డద్దానికిఁ గారణంబును దపోవిఖ్యాతిచే మించు నీ
శునిభక్తుండు నికుంభుఁ డానగరముశ్ శూన్యాకృతిశ్ గాంచు నం
చనుచుశ్ దన్మతి వేయియేం డ్లనుచుఁ గ్రౌర్యం బొప్పఁగా శాప మి
చ్చెను దద్వాక్యము నాలకించి నృపుఁడుం జింతించి సాధ్వాజ్ఞచేశ్. 589

క. తనరాజ్యము తుదిభాగం,బున గోమతి నదికిఁ జెంతఁ బురమును నిర్మిం
చెను, బూర్వము వారాణసి, ఘనభద్రశ్రేణ్యనృపతికాంతుఁడు పతిగశ్. 590

క. అలరుచు నుండెను దద్భూ,పలలామునిసుతులు చాపపాణు లమేయుల్
గలరు శతసంఖ్యు లవ్వా,రలనెల్లర భూరిసంగరంబునఁ గడఁకన్. 591

క. సమయించి దివోదాస,క్షమాధిపతి తా గ్రహించె సరగున రాజ్యం
బమితబలుం డయి పొల్పుట, సమరము తుములముగ మిగుల సాగెడుతఱినిన్.

వ. భద్రశ్రేణ్యపుత్త్రుం డగుదుర్ధముండు బాలుం డని దివోదాసుచేఁ గరుణ విడువంబడియె. ఆతండు హైహయులతో బంధుత్వం బొంది పితృధనం బగురాజ్యం

బును మరల గ్రహించె. ఇట్లు భద్రశ్రేణ్యపుత్త్రుం డగుదుర్దముండు మహాత్ముం డై వైరంబు సాధించె. దివోదాసుండు దృషద్వతిం బెండ్లియాడి వీరుం డగుప్ర తర్దనుం డనుతనయుం బడసె. ఆబాలుండు మరల నారాజ్యంబును జయించె. వానికొడుకు లిర్వురు వత్సభర్గులను వారలు విఖ్యాతులైరి. అందు వత్సతన యుండు శత్రుజిత్తు. వానికొడుకు ఋతధ్వజుండు. అలర్కుండు తత్తనయుండు. ఆతండు బ్రహ్మణ్యుం డై సత్యసంగరుం డన విఖ్యాతి నొందె. ఆయలర్కుం గూర్చి పురాతనపరిగీతం బగు శ్లోకం బొండు గలదు. 593

తే. షష్టివర్షసహస్రముల్ షట్సహస్ర
ములును రూపంబునఁ జాటఁ బూని చూప
జగములఁ జూట లేకుండ సాధుకీర్తి
మించెఁ జుండి యలర్కుండు మేటిఘనుఁడు. 594

క. అతఁడును లోపాముద్రా,పతికరుణఁ జిరాయు వొంది ప్రాయము తేజం
బతిశయరూపము తగ నున్నతరాజ్యం బేలె దేవనాయకుఁ డలరన్. 595

క. శాపాంతంబునఁ దగ నా, భూపతి క్షేమకసురారిఁ బోరిఁ బుచ్చి యశం
బేపారఁగ వారాణసి, స్థాపించెఁ రాజ్య మలఘుసత్త్వము మీఱన్. 596

వ. సంతతికుమారుండు సునీథుం డాతఁ డతిధార్మికుం డని విఖ్యాతినొంది క్షేముం గాంచె. క్షేమునకుఁ గేతుమంతుండు పుత్త్రుండు. వానికి సుకేతుండు కొడు కవ్వానికి ధర్మకేతుండును, వానికి సత్యకేతుండును, నాతనికి విభుండు, నాభూ పతి కానర్తుండును, నాఘనునకు సుకుమారుండును, వానికి ధృష్టకేతుండును, వానికి వేణుహోత్రుండును, వానికి భర్గుండును గలిగిరి వత్సుండను పూర్వో క్తభూపునకు వత్సభూమియు, భర్గునకు భార్గవుండును గలిగిరి. వీరెల్ల నంగిరసి పుత్త్రు లనంబడుదురు. భార్గవం బని తత్కులంబు విఖ్యాతం బయ్యె. బ్రహ్మక్షత్త్రి యవైశ్య లావంశంబున మహాతేజోవిరాజితులై వేనవే లుద్భవించిరి. మును లారా! కాశ్యపులు కీర్తింపఁబడిరికదా. ఇఁక నహుషుసంతతి నెఱింగించెద వినుండని సూతుండు మరల నిట్లనియె. 597

పదియవ యధ్యాయము.

యయాతిచరిత్రము.

క. వినుఁడీ నహుషునిసంతతి, మునులారా! పితృతనూజభూరిఖ్యాతిం
గని మించిన విరజయె నహు,షునిభార్యగ నెన్నఁబడియె సూరిజనులచేన్. 598

క. సతియును బతియుఁ మిగులన్, తితిఁ జేరుం గాంచుసుతుల శ్రీయుతుల శత
క్రతువామనతుల్యోజ,శ్శ్రితులను నార్వురను గాంచెఁ జెల్వమరంగన్. 599

తే. యతి, యయాతి, శర్యాతు, లాయాతి, యాతు
లవ్వల సుయాతియును బుట్టి రందు మిగులఁ

పేరుఁ గాంచె యయాతియుఁ బృథ్వీశుఁ
డయ్యె జ్యేష్ఠుఁడు యతియు విఖ్యాతిఁ గాంచె. 600

వ. యయాతి కకుత్థ్సకన్యకయగు గోదేవిని బెండ్లియాడె. యతి యనువాఁడు మునివృత్తి నవలంబించి ముక్తిం గోరి తపం బొనరించుచుండె. తక్కినయైదు గురిలో జ్యేష్ఠుండగు యయాతి రాజన్యుల నోడించి భూమినెల్ల నార్జించి ప్రభువయ్యె నంత. 601

తే. శుక్రతనుజాతయయి చాల సురుచిరాంగి
యైన యాదేవయాని భార్యగ గ్రహించె
మఱియు వృషపర్వరాక్షసమండనాత్మ
జాత శర్మిష్ఠ నింతగా సంగ్రహించె. 602

సీ. యదుతుర్వసుల దేవయాని యిద్దఱఁ గాంచె
ద్రుహ్యుని నను వుఁ బూరుని గనియెను
శర్మిష్ఠ యాభూపసత్తమునకు నింద్రుఁ
డతిహర్షమున భాస్వరాంగ మగుచు
పాంగమై కనకమయంబు దివ్యమునయి
తగి మనోజవమునఁ బొగడఁబడుచు
సద్వంశభవములై చారులక్షణములఁ
దనరారు హయరత్నతతులు గలిగి

తే. కార్యసాధనమె ఫలంబుగాఁ జెలఁగుచుఁ
దగురథం బిచ్చె నట్టిస్యందనము నెక్కి
యాఱుదినములలో భూమినంత గెలిచి
యుద్ధదుర్ధర్షుఁడై కీర్తి యొప్పుచుండు. 603

క. సురలను దేవారుల న,చ్చెరువును బొందంగఁ జేసెఁ జిత్రతరంబౌ
నరదం బది కౌరవులకు, వరుసగ నొప్పారె దానివైభవ మెల్లన్. 604

వ. సంవర్తవసువునుండియుఁ గౌరవుం డగు జనమేజయునుండియు మరలె. పరీక్షిత్తున కదిలభింపఁ దయ్యె. దీనికిం గారణంబు గర్గమునిశాపంబు తద్విధంబు వినుండు. గర్గమునితనయుండు బాలుండై యుండ జనమేజయుండు హింసించె. దాన బ్రహ్మహత్య నొందె. ఆపాపంబున నారాజు దుర్గంధాంగుఁడై యిటునటు తిరుగుచుఁ బౌరజానపదులు విడువ మనశ్శాంతినొదక దుఃఖసంతప్తుండై యేమహాత్ముల సభకుం బోవంజాలక శౌనకుండను బ్రహ్మర్షిని శరణంబు నొందుటయు నామునిచంద్రుండు. 605

క. జనమేజయుచేఁ జేయిం,చెను హయమేధంబు దానఁ జెందు శుచిత నం
చని యవభృథ మొనరింపఁగఁ, దనుదుర్గంధము నశించెఁ దత్క్షణమాత్రన్. 606

ఆ. ఆక్షణంబ రాజు నాశ్రయించెను దివ్య,రథము తృప్తదేవరాజదత్త
మగుచు దానిచే బృహద్రథుఁ డనఁబడె, నదియు నవల నతనియాత్మజునకు.
క. అనుకూలంబై యొప్పెను, వినుఁడు జరాసంధు నతని భీముండు వధిం
చెను వాసుదేవునకు ని,చ్చెను దానిం బ్రీతిమీఱఁ జెలఁగుచుఁ బూన్కిన్. 608
క. మునులార! పూర్వకథ నిం,కను వినుఁడీ యాయయాతి కంధియుతంబై
పెనుద్వీపసప్తకాన్విత, మనునగు భూమిన్ జయించె మునుకొనుపూన్కిన్.
సీ. అవల రాజ్యంబు యయాతియే విభజించి తనపుత్త్రులకు నిచ్చెఁ దద్విధంబు
వినఁదగియే యుండుఁ గనుకఁ దెల్పెదఁ బూర్వదిక్కునందున్న మేదినికి జ్యేష్ఠుఁ
డైనట్టి యదుని నెయ్యమున నాథుని జేసె మధ్యభూమికిఁ బూరు మహిపుఁ జేసి
దక్షిణపూర్వస్థధరణికిఁ దుర్వసుఁ బట్టభద్రుని జేసె వారిచేతఁ
బత్తనవర్య సప్తద్వీపవతియైన ధరణి పాలితయయి తనరుచుండె.
తే. వారిధర్మంబులే తరువాతివారు, చక్క రక్షింప సాగిరి సతత మట్లు
ధనువు బాణంబులం బూన్కిఁదాల్చి పంచ,తనయయుక్తుండునా రాజతల్లజుండు.
క. జర నొందె బంధువులపై, బరువును మోపుచు యయాతి పార్థివుఁ డంతన్
శరచాపంబులఁ బోనిడి, చరియించెన్ దుర్జయుఁడయి క్ష్మాస్థలి నెల్లన్. 611
చ. తనయుల కిట్టిరీతి వసుధన్ విభజించి యొసంగి యాయదుం
దనయవరేణ్యుఁ గాంచి యిటు ధర్మయుతంబుగఁ బల్కె నోకుమా
ర! నను జరాభరం బిదె కరంబు వ్యథం గనఁ జేయఁబూనె దా
నిని గ్రహియింపు మెట్టులో యనిందితతావకరూపవైఖరిన్. 612
ఆ. నే గ్రహించి ధరణి నెమ్మిఁ జరించెద, నాజరాభరంబు నాకు బదులు
గా ధరించి నీవు కదలక యుండుము, నాఁగ నిట్టులను దనయుఁడు కడఁక. 613
సీ. ఈధర్మభిక్షమే నేబ్రాహ్మణునకు నిచ్చెద నంచు శపథంబుఁ జేయలేదు
గాన నీముదిమిని గ్రహియింపఁగా నొల్ల జరయందుఁజాల దోషములుపొదలుఁ
బానభోజనముఖపద్ధతులం గూడ నాదోషములు గల్గు నట్టు లౌట
దాని గ్రహింపఁగాఁ దలపోయఁజాలను నేఁగాక ప్రియసుతుల్ నీకుఁ గలరు
తే. గాన ధర్మజ్ఞుఁ డవగుట సూను నొరుని
వేఁడుమా యను నమ్మాట వీనులకు బడఁ
గనె యయాతియుఁ గ్రోధయుక్తిని దనూజు
నిస్సిరో యంచు వచియించె నిట్లు కడఁగి. 614
క. నీ కాధారం బెవ్వఁడు, నాకంటెన్ మఱియు నీకు నయఃథముల కా
పోకడలఁ దెల్పు నెవ్వం, డోకొడుకా దుష్టబుద్ధినొందుచు నన్నున్. 615
క. ఫూనితి తిరస్కరింపఁగఁ, గానవు సత్పథము దేశికప్రవరుఁ డనన్
నే నౌదుఁ గాదె నాదగు,నానతి దాఁటంగఁ దగునె యంచు నమర్షన్. 616

ఆ. శాపదగ్ధుఁజేసి క్ష్మాపతి యిట్లనె, నీదుప్రజలు తమకు నృపుఁడు లేక
యుండగలరు శంక యొక్కింతయును లేదు, నాదుపలుకు సఫలమౌఁ దగంగ.
చ. మునివరులార! యీవిధిని భూపతి నల్వురఁ బుత్త్రవర్యులన్
గొనకొని శాపదగ్ధులుగఁ గొంకక చేసి కనిష్ఠుఁ బూరుం
గనుఁగొని యావచస్తతినె క్రమ్మఱఁ బల్కెను నీదుప్రాయముం
గొని చరియింపఁ గోరెదను క్షోణిని నాముదిమిన్ గ్రహింపుమా. 618
క. మనసార నీవు గోరినఁ, దనయా! యిదె యిచ్చువాఁడ దాని ననిన నా
జనకాజ్ఞ రీతి ముదిమిన్, గొనియెం బూరుఁ డంత వయసుఁ గొనుచు నృపుండున్.
క. మనుపటిచందంబున మే,దిని నెల్లఁ జరింపఁ జొచ్చె ధీరుఁడు ప్రాయం
బున నొప్పి స్వేచ్ఛఁ గ్రీడిం,పను గోరి మహేంద్రసభను భాసిలుదానిన్. 621
క. అనుపమలావణ్యము గ,ల్గిన విశ్వాచియును దోడఁ గ్రీడారతి రా
ననవిల్తుఁడు పురికొల్పం,గను జైత్త్రరథంబునందుఁ గాంక్షఁ జరించెన్. 622
సీ. ఎపుడు కామంబుల నెల్లఁ బొందియుఁ దృప్తుఁ డయ్యెనో నృపవరుఁ డపుడు జరను
బూరునుండి కొనియెను వరమునులార! యయాతి పల్కినగీత మాలకింపుఁ
డతఁడు కూర్మం బెట్లు స్వాంగమ్ములన్ లోన నిముడునట్లుగఁ జేయు నెల్లకోర్కు-
లను నట్లుగాఁ బొంది వినుతించె నీగాథ వినుఁ డద్ది వీనుల విందు సుండి
తే. "కామ మనునది యుపభోగకలన నుపశ
మింప దేనాఁడు వహ్నియు మిగులు హవిసు
చేత నభివృద్ధినొందినరీతి వృద్ధిఁ
బొందు నటుగాన విడువంగఁ బూనవలయు. 623
క. ధరణిన్ యవలును వ్రీహులు, హిరణ్యమున్ బశుసమూహ మింతులు మేలౌ
పరికరములు కామంబున, కరయఁగ నివి చాల వద్ది యధికతరం బౌ. 624
క. అని తలఁచి మోస మొందం,గను జనదు మనస్సుచేతఁ గర్మంబున వా
క్కున భూతవితతిపైఁ బా,పనియతభావంబు నెవఁడు పడయఁడొ యతఁడే.
ఆ. బ్రహ్మపదము నొందుఁ బరులవలన భీతిఁ, గనక నొరులభీతిఁ గనఁగఁ జేయు
కెద్ది కోర కెవనినేని ద్వేషింపక, యలరు నతఁడు పొందు నజునిపదము. 626
ఆ. ఎద్ది విడువ సాధ్యమే కాదొ కుమతుల, కెద్ది చెడియుఁ జెడక యే యొసఁగునో
యెద్ది ప్రాణవితతి నెల్లఁగాల్చెడురోగ, మగునొ యదియె తృష్ణయనఁగఁ బరఁగు.
క. దానిన్ మానిన సుఖమే, కానంబడు వార్ధకంబు గల్గినఁ గురులున్
గానఁబడున్ శ్వేతములై, మానుగ దంతములు వదలు మహి వృద్ధునకున్.
క. వినుఁడు ధనజీవితాశలు, తనుపాటవ మెడలుతఱిని దఱుగవు కామం
బునఁ గల్గుసుఖము స్వర్గం,బునఁ గల్గుసుఖంబు నెన్న భూరితరములౌ. 629
తే. ఇవ్వి తృష్ణాక్షయంబున నెసఁగుసుఖము,నందు షోడశభాగంబు నంద లేవు"

సమత నని యిట్లు రాజర్షిసత్తముండు, పలికి జరఁగొని వనిఁ జేరె భవ్యనియతి.

క. చిరకాల మతులతపమును, ధరణీశుఁ డొనర్చెఁ బట్టుదలఁ బూని మహా
త్తరభృగుతుంగంబున వత్సరశతములు తపముచేసి తనువుఁ ద్యజించెన్. 631

తే. అనశనుం డయి తపమిట్లు లొనరిచి నృపుఁ
డంగముఁ ద్యజించి స్వర్గంబు నందె; నతని
వంశమునఁ బంచపూరుషుల్ వఱలి రంత
వారివంశాళి వ్యాపించె వసుధ నెల్ల. 632

వ. సూర్యుం డాత్మగభస్తులచే లోకంబు వ్యాపించునట్లాయయాతివంశ్యులు వసుధాతలంబెల్ల వ్యాపించిరి. అందు యదువంశంబు వివరించెద దానియందె శ్రీమన్నారాయణుం డుదయించెఁగదా. ఆతండె వృష్ణికులంబు నుద్ధరించె నని సూతుండు పలుకుటయు. 633

---

## పదునొకండవ అధ్యాయము.

### దుష్యంతచరిత్రము.

క. మును లిట్లని రోసూతా, వినవలతుము పూరువంశవిస్తృతి నెల్లన్
ఘనవంశ మిద్ధి తత్సహా, జనికాయ తనూజకోటిచరితం బెలమిన్. 634

తే. వేఱువేఱ వచింపుమా విస్తరించి
యనిన సూతుండు పలికె నోయనఘులార
మహిమ వెలసినపూరునిమహితవంశ
మానుపూర్విగ విస్తృతినలర వినుఁడు. 635

వ. పురుభూపకుమారుండు సువీరుం డాతనికొడుకు మనస్యుండు, తత్పుత్రుం డభయదుం డాతనియాత్మభవుండు సుధన్వుం డాతనిసుతుండు సుబాహుం డాతని తనయుండు రౌద్రాశ్వుం డాతనికి దశార్ణేయువు, కృకణేయువు, కక్షేయువు స్థండిలేయువు, సన్నతేయువు, ఋచేయువు, జవేయువు, స్థలేయువు, ధనేయువు, వనేయువు,నను దశకుమారులును;భద్రయు,శూద్రయు, మద్రయు, శలదయు, మలదయు, ఖలదయు, నలదయు, సురసయు, గోచపలయు, రత్నకూటయు నను దశకుమారికలును గలిగిరి. అత్రివంశసంజనితుం డగుప్రభాకరముని వారిని భార్యలఁగా గ్రహించె ఆమునియు భద్రయను భార్యయందు యశోవిరాజితుం డగుసోమునిఁ గనియె. స్వర్భానుహతుండయి సూర్యుండు నభంబునుండి భూమిపైఁ బడుచుండ లోకంబు తిమిరాచ్ఛాదితం బగుడుఁ బ్రభాకరముని లోకసంతాపనాశకరంబుగాఁ బ్రభ నొకదానిం బుట్టించి సూర్యుం గాంచి నీకు శుభంబుఁ గలుగుంగాక యని పలికిన భయంబు వాసి భూపతితుండు గాక యుండె. అట్టి బ్రహ్మర్షిసత్తముఁ డగుప్రభాకరుం డత్రివంశంబులు యశఃపూర్ణం

బులై వెలయునట్లుగాఁ జెక్కింటి నొనరించె. దేవతలత్రిగోత్రంబులు ప్రబ
లంబులని వక్కాణించి యజ్ఞంబులయందు గౌరవించిరి. అట్టి మహిమాఢ్యుఁ
డగుప్రభాకరముని యాదారలయందు బహుపుత్త్రికలఁ బుట్టించె. ఉగ్రతపో
నిరతు లగుపుత్త్రులం బదుగురం బుట్టించె. వారు వేదపారగులై వంశకర్తలై
యత్రిగోత్రకర్తలై ధర్మార్థకామములం గోరక మోక్షకాంక్షులై విఖ్యాతి
నొందిరి. ఇఁకఁ గక్షేయువుసంతతి వినుండు. 636

సీ. కక్షేయువునకును గల్గిరి పృథుకీర్తి వెలసినతనయులు విక్రమాఢ్య
లందు సభానరుం డగుజ్యేష్ఠుఁ డవ్వలఁ జాక్షుషుండును వానిసహజుఁ డైన
పరమన్యువును వీరు ధరణిఁ బాలించిరి నయమూర్తి యగుసభానరుని కొడుకు
కాలానలుం డనఁగాఁ బేరునొందెను సృంజయుం డారాజశేఖరునకుఁ
తే. దనయుఁ డయ్యెఁ బురంజనుం డనుకుమారుఁ
డతనికిం గల్గె మునులార యతనికొమరుఁ
డయ్యె జనమేజయుఁడు వాని యాత్మజుండె
తనరుఁ జూండి మహాశాలుఁ డనఘుఁ డతఁడు. 637

క. సుర లాతని సత్కీర్తిం, బరినుతిచేయుదురు వానిపట్టియు ధర్మం
బరయు మహామనుఁ డయ్యెను,సురపూజితుఁ డగుచు నతఁడు శోభిలు జగతిన్.
క. తనయుల నిర్వుర నాతఁడు, గనియె నుశీనరుఁడు ధర్మఘనుఁడు తితిక్షుం
డను వాఁడు మహాబలుఁ డీ,తనయులలో జ్యేష్ఠుఁ డంత ధర్మం బలరన్. 639
తే. పంచపత్నులఁ జేకొనెఁ బరమరాజ,వంశజనితల వారెల్లఁ వఱలుకీర్తి
సుగుణగణసంయుతిని జాలశోభిలి పతి, భక్తిభూషణలలితలై పరఁగి రవని. 640

వ. నృగయుఁ గృమియు, నవయు, దర్వియు, దృషద్వతియు నని వారిపేరులు.
వారియందుఁ గ్రమంబున నైదుగురుపుత్త్రుల నారాజుం గాంచె. వారు తపో
బలపరాక్రమంబులఁ గులోద్వహు లైరి. నృగయందునృగుండును, గృమి
యందుఁ గృమియు, నవయందు నవుండును, దర్వయందు సువ్రతుండును, దృష
ద్వతియందు శిబియుఁ గల్గిరి. శిబికి శైబంబును,నృగునకు యౌధేయనగరంబును,
నవునకు నవరాష్ట్రపత్తనంబును; గృమికిఁ గృమిలాపురియు, సువ్రతునకు నంబష్ఠ
పురంబును రాజధాను లయ్యె. ఇంక శిబిసంతానంబు వినుండు. 641

తే. శిబికి శిబులను నల్వురు క్షితిఁ బ్రసిద్ధు
లుదయమందిరి వృషదర్భుఁ డొప్పె జ్యేష్ఠుఁ
డగుచు నాతనికి సువీరుఁ డనుజుఁ డతని
కైరి కైకేయమద్రకు లనుసహజులు. 642

సీ. వారికి నయ్యెనివాసముల్ కైకేయ మద్రక వృషదర్భ మహితశర్మ
కర సువీరములనఁ గ్రాలుదేశంబులు; తెలుపువాఁడఁ దితిక్షుకులము నింకఁ

బ్రాగ్దేశవిభుఁడయి పాలించె నాఘనుఁ డతని కుషద్రథుఁ డాత్మజుండు
ఫేనుఁ డానృపతికి సూనుండు; సుతపసుఁ డతనికుమారుండు వితతకీర్తి
తే. యైనబలి యాతనికిఁ బుట్టె మానుషాకృతిని దదీయనిషంగముల్ కనకమయము
లయి చెలంగు మహాయోగి యవనిపతియు, నయ్యె నాబలి పుత్త్రుల నంతఁ గనియె.
వ. వంశవర్ధనులై వా రంగ, వంగ, సహ్మ పుండ్ర, కళింగ నామంబులం దనరుదురు,
తత్కులంబు బాలేయం బనం బరఁగె. బాలేయులెల్ల బ్రాహ్మణప్రవర్తకులై
భూరివిఖ్యాతిం గాంచిరి. 644
క. సరసిజజని ప్రీతుండై, వరమిచ్చెను బలికి మున్ను వసుధాస్థలిపైఁ
జిరకాలము జీవింపఁగ, నిరుపమయోగిత్వ మొంది నెమ్మిఁ దిరుగఁగన్. 645
ఆ. కల్ప ముండుదనుక క్ష్మాస్థలి వర్తించు, నతఁడు ధర్మతత్త్వ మరయుటందు
నసదృశుండు రణములందును విజయంబుఁ, బొందు ధర్మయుక్తిఁ బూని యెపుడు.
తే. మూఁడులోకంబులను బలిచూడఁ జాలు
నాల్గువర్ణంబులన్ ధర న్యాయరీతి
నిల్పుమని బ్రహ్మశాసింప నృపుఁ డతండు
వల్లె యని శాంతమే పూని వఱలెఁ జుండి. 647
క. చిరకాల మవని నాతఁడు, జగపి సురాలయముఁ బొందె జనపదములు త
ద్ధరణిపుపుత్త్రుల పేరిటఁ, బరఁగెన్ మునులార వాని వర్ణింతు నిఁకన్. 648
వ. అంగ వంగ సహ్మక పుండ్ర కళింగంబులు తన్నివాసంబునఁ బ్రఖ్యాతి నొందె.
ఇంక నంగనామకుసంతతిం దెల్పెద. 649
తే. అంగపుత్త్రుండు దధివాహనాఖ్యుఁ డతని
సూనుఁ డయ్యెను దివిరథుం డానరాధి
పతికి వజ్రసమబలుండు స్వర్గరథుఁడు
తనయుఁ డాతఁడు చిత్రరథునిని గాంచె. 650
సీ. అస్వర్గరథుఁడు భక్త్యతిశయమ్మున మున్ను కాలంజరాద్రిని గ్రతు వొనర్చు
చుండఁగాఁ బురుహూతుఁ డురుతరకృపచేత నరుదెంచి సోమపానాదికృత్య
ముల నొనరించె నాభూపతితనయుఁ డౌ చిత్రరథుండును సిద్ధబలుని
దశరథనామునిఁ దనయుని గాంచె నాపార్థివుండే లోమపాదుఁ డనఁగ.
ఆ. ఖ్యాతి నందె నతని యనుఁగుఁగూఁతురు శాంత
యనఁ బ్రసిద్ధిఁ గాంచె నతనికొడుకు
వీరవరుఁడు కీర్తివృద్ధిని దగుచతు
రంగుఁ డుర్వి వెలసె రాజు లలర. 651
క. జనపతితనయుం డాతఁడు, మునిపతియగు ఋశ్యశృంగుభూరికరుణ భూ
వినుతిం గాంచెను గులవర్ధనుఁ డనఁ బృథులాక్షుఁ డతనితనయుం డయ్యెన్.

క. అతనిని గురుతరకీర్త్యన్వితుఁడై చంపాఖ్యుఁ డఖిలవిమలగుణుఁడు సం
తతిగలవానిఁగఁ జేసెను, సుతుఁ డాతఁడు మాలిని యనుశుభనదిచెంతన్. 653

క. పురమును జంపానామము, ధరణిం బాలించుపొంటెఁ దా నిర్మించెన్
నరపతి కతనికిఁ గల్గెను, బురహరుతో సాటియైనపుత్త్రుం డతఁడున్. 654

తే. పూర్ణభద్రప్రసాదసంభూతుఁ డయ్యెఁ, బేరు హర్యంగుఁ డనఁగ సువిస్తృతిఁగనె
నితనిపుట్టుకవేళ దేవేశవాహ,న మగునైరావతంబు నియమ మలరఁగ. 655

క. పిలిపించి మంత్రములచేఁ, జెలఁగుచు నయ్యదియు నిలను జేరెను; వినుఁ డ
వ్వల హర్యంగుని కొక్కుఁడు, గలిగెం జుఁడి భద్రరథుఁడు క్ష్మాసురులారా. 656

సీ. కలిగె బృహత్కర్మ యలభద్రరథునకు నతఁడు బృహద్దర్భుఁ డనుకుమారుఁ
గనియె బృహన్మనుం డనువాఁడు తత్సుతుం డతఁడుజయద్రథుం డనుతనూజుఁ
బడసెను దృఢరథుం డుడురాజతుల్యుండు వానికుమారుఁడై వానిఁ గాంచె
నతఁడును విశ్వజిత్తను కీర్తిఁ గాంచిన జనమేజయునిఁ గాంచె క్ష్మాపతి యతఁ
డాత్మజు వైకర్ణుఁ డనువానిఁ బడసె వికర్ణుఁ డాతనినుండి కలిగె నతని

ఆ. కాత్మభవులు నూర్వు రైరి వంశంబును, వఱలఁ జేయునట్టివార లంచు
నెఱుఁగవలయు నంగనృపునివంశం బిట్లు, చెప్పినాఁడ జ్ఞానసింధులార. 657

క. ఆవంశంబునఁ బుట్టిన, యావీరులు సత్యనిరతు లమలమనీషుల్
పావనతనులు మహారథు,లై విలసిల్లుదురు ధాత్రియం దసదృశులై. 658

వ. రౌద్రాశ్వతనయుం డగుఋచేయువంశంబును వివరించెద. ఋచేయునికొడుకు మతిసారుం డనువాఁడు. వానికిఁ బరమధార్మికు లగు వసురోధ, ప్రతిరథ, సుబాహువు లను ముప్వురు తనయులు గల్గిరి. వీరెల్ల బ్రహ్మవేత్తలై సత్యవాదులై వెలయుదురు. మఱియు నిల యనుకూఁతురు గల్గె. ఆమె బ్రహ్మవాదినియై తంసుం డనువానిం బెండ్లియాడె. ఆతంసునకు నిలవలన ధర్మనేత్రుండు గలిగి ప్రతాపవంతుం డయ్యె. వానిభార్య యుపదానవి యనం బరఁగె ఆమె నలుగురుపుత్త్రులం బడసె. దుష్యంత సుష్మంత ప్రవీ రానఘు లని వారి నామంబులు. 659

క. తనయుఁడు దుష్యంతున కయ్యెను భరతుం డనెడుపేర నెంతయు వీర్యం
బునఁ బొదలి సర్వదమనుం, డనుఖ్యాతిం గాంచి యయుతహస్తిబలుం డై. 669

ఆ. చక్రవర్తి యగుచు క్ష్మాపాలుసంతతి, వెలయఁజేసె జనని యలరె నతని
కిద్ధరూప యగుచు నెసఁగు శకుంతల, యాకుమారుపేరు ప్రాకటమయి. 661

క. వ్యాపించె భూమిఖండం, బాపృథివీపరీతికుమారునాహ్వయమున నే
చూపట్టు భారతం బన, నోపరమమునీంద్రులార యొప్పుగ వినుఁడీ. 662

వ. ఆతనివంశంబు క్షీణింప మాతృపక్షంబున వర్ధిల్లె నని మున్నె చెప్పితిఁగదా. తద్విధం బెఱింగించెద. 663

తే. అంగిరఃపుత్త్రుఁడైన బృహస్పతితను, జాతుఁడైనభరద్వాజుఁ డాతతమగు
తపముబలిమిని నొక్కయధ్వరము పూని, యతనిచేతనె చేయించె నంత దాన.

క. జనియించె భరద్వాజుని, ఘనకరుణన్ వితథనామకలితుఁడు తనయుం
డనఘుం డాతఁడు పుట్టిన, యనంతరము తద్భరతుఁడు నరిగెన్ దివికిన్. 665

తే. ఆభరద్వాజుఁ డంతట నక్కుమారుఁ
బట్టభద్రునిగాఁ జేసి వనమునకును
దపముచేయఁగ నరిగె; వితథుఁడు పంచ
పుత్త్రులం గాంచె వారలు పూజ్యమతులు. 666

వ. సుహోత్త్రుండును సుహోతయు గయ గర్గ కపిలు లనునామంబులం దాల్చి భూవినుతిం గాంచిరి. సుహోత్త్రునకుఁ గాశిక గృత్స్నమతు లనునిరువురు తనయు లుదయించిరి. అందుఁ గృత్స్నమతికిఁ బుత్త్రులై బ్రాహ్మణక్షత్త్రియవైశ్యు లుదయించిరి. కాశికునకు దీర్ఘతపోనామకుం డుదయించె. ఆతనికి ధన్వంతరి కుమారుం డయ్యె. ధన్వంతరికిఁ గేతుమంతుం డాత్మజుండు వానికుమారుండు భీమరథుండు. తత్పుత్త్రకుండు వారాణస్యధిపతి యగుదివోదాసుండు. ఆతని తనయుండు వీరుం డగుప్రతర్దనుండు. తత్పుత్త్రకులు వత్సభార్గవులను నిరువురైరి. అలర్కుం డనురాకొమరుండు హైహాయదాయాద్యమును హరించె. బలవంతంబుగ దివోదాసుండు కొన్నపితృరాజ్యంబును మరలం బడసె. దివోదాసుండు రణరంగంబున శత్త్రువుల నోడించుచుఁ గరుణచే నీయలర్కుండు బాలుం డని విడువం బంచె. అష్టారథుం డనువాఁడు భీమరథునకు వేఱొక కొడుకు గలిగె. ఆపుత్త్రుండు పితృరాజ్యంబు శత్త్రువులచేతఁ బడినదానిని మరల సంపాదించె. అలర్కుండు కాశీనగరాధిపతియై సత్యసంగరుం డనంబరఁగె. అఱువదియాఱువేలసంవత్సరములు ప్రాయంబునను రూపసంపదను భూమినాతండు పాలించె. కులోద్ధారకుండు నయ్యె. అంత దీర్ఘాయుర్దాయం బాతనికి లోపాముద్రాపతి యగునగస్త్యమునికరుణం గలిగె. వయస్సు తుద నాతండు క్షేమకరాక్షసుం జంపి వారాణసియందు నివసించి యందె రాజ్యంబు స్థాపించె. అలర్కునికొడుకు క్షేమకుండు. తత్సూనుండు వర్షకేతువు. తదాత్మజుండు విభునామకుండు. తత్కుమారుం డానర్తుండు. సుకుమారుండు తత్ప్రియతనయుండు. సత్యకేతు వనుమహారథవర్యుండు తత్సూనుండు. వత్సుండు తద్భవుండు తన్నామంబున వత్సభూమియు భార్గవునామంబున భర్గభూమియుఁ బ్రఖ్యాతంబు లయ్యె. వీరెల్ల భార్గవవంశంబున నంగిరస్సంతతివారు. బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులు నిం దుందురు. ఇంక నాజామీఢవంశంబు వివరించెద వినుండు. 667

క. ఘనుఁడైన సుహోత్త్రునకుం, దనయుండు బృహత్తుఁ డన నుదయ మందెను నా

తనికిఁ ముగ్గురుతనయులు, జనియించిరి జ్యేష్ఠుఁ డం దజామీఢుఁ డగుచున్. 668
తే. తగ ద్విమీఢుఁడు పురుమీఢుఁడు గలిగి రతి
బలయుతుల్ వారిలోఁ బెద్దవాఁడు ఘనుఁడు
నౌ నజామీఢువంశంబు ననువదింతు
వానికిఁ ముగ్గు రైరి సద్భార్య లందు. 699
వ. నీలి జ్యేష్ఠపత్ని. కేశినియు ధూమినియు నవ్వలిపత్ను లైరి. కేశినియందుఁ బ్రతాపవంతుఁ డగుజహ్నుం డుదయించె. అతండె సర్వమేధం బనుమహా సత్రం బొనరించె. గంగయుఁ బతిలోభంబున నాతని న్వరియించెఁగదా. అతం డంగీకరింపమి నాతని సత్రంబెల్లఁ దననీట ముంచె నప్పుడు. 670
చ. తనదగు యజ్ఞవాటము నితాంతము ముస్గుట లో దలంచి గం
గను గని కోపవేగమునఁ గన్నుల నిప్పుకణంబు లొల్క ని
ట్లనియెను ముజ్జగంబులను ఖ్యాతిని గాంచినదీని నంజలిం
గొని కడుఁబూనిక్రఁ ద్రాగెదను గోరిక ముంచిన తత్ఫలం బిటన్. 671
ఆ. అనుభవించుఁగాక యని దాని ద్రావిన, గాంచి మౌను లెల్ల గళవళించి
దుహితృతం జెలంగఁ దోయజనేత్రను, గంగఁ జేసి రంత క్ష్మాతలమున. 672
క. కనియెన్ జాహ్నవినామం,బును జహ్నుం డంత యజ్ఞమును బూర్ణవిధం
బొనరించి యవల యువనా,శ్వనిసుతఁ గావేరి యనెడుసుదతీమణినిన్. 673
ఆ. పెండ్లియాడె నంతఁ బృథుకోపమున గంగ, దా శపింప దానఁ దద్వనితయు
సగము నదిగ మారె జహ్నుమహర్షికి, నజకుఁ డనుకుమారుఁ డలఘుబుద్ధి 674
క. జనియించె బలాకాశ్వం, డనువాఁ డాతనికిఁ బుత్రుఁడయ్యెఁ గుశికుఁ డన్.
తనయుండు కల్గె నతనికి, మునులారా! వేఁటయందు ముద మాతనికౌ. 675
క. వనచరు లగుపహ్లవు లా, జనపతితో వైరమూని చరియించిరి త
జ్జనపతి శక్రసమానునిఁ, దనయుని బడయంగఁగోరి తప మొనరించెన్. 676
క. సురపతి భయమున నతనికి, వర మొసఁగెను దాన గాధి ప్రభవిల్లెను ని
ర్భర తేజంబునఁ దానై, పురుహూతుం డుదితుఁడయ్యెఁ బో యనురీతిన్. 677
సీ. అతనికిఁ బుత్త్రుఁడై యావిర్భవించె విశ్వామిత్త్రుఁ డతని కష్టకుఁడు కల్గె
విశ్వబాధియు మహావీరుఁడైన శ్వజిత్తు ననువార లిద్వరై రనుజులు తగఁ
దద్వంశముననె సత్యవతియు జన్మించి తాబుచీకుని మౌనితల్లజుఁ బతి
గా వరించి యపారకరుణుని జమదగ్నిఁ గనియె; విశ్వామిత్త్రుతనయు లైరి
దేవరాతాదులు ధీరులు విలసిల్లి రవ్వారికీర్తి యీ యవనియందె
తే. కాక పైలోకములయందుఁ గలయఁబర్వె, వారిపేరులు వినుఁ డింక వరుసఁ జెప్పు
వాఁడఁదొలిపుత్త్రకుఁడు కీర్తివైభవములఁ, బేరుఁగనె దేవరాతుండు వీరవరుఁడు.
వ. కతియు నవ్వలివాఁడయ్యె. తత్సూనుండు కాత్యాయనుండయ్యె. శాలవతియందు

హిరణ్యాక్షుండు వానికి రేణుండును, వానికి రేణుక యనుపుత్రికయుఁ గల్గిరి. సాంకృతి యనునింతియందు గాలవులును మౌద్గల్యులు ననువిప్రులు గల్గిరి వారెల్లఁ గౌశికులై గోత్రకర్తలైరి. పాణినులు బభ్రువు ధ్యానజప్యులు, దేవరాతులు శాలంకాయనసౌశ్రవసులు, లోహితులు, యామభూతులు, కారీషులు ననువీరు కౌశికు లగువిప్రులు. సైంధవాయనులుగూడ నట్టివారే. ఋష్యంతర వివాహ్యులును గౌశికు లనం బ్రఖ్యాతిం గాంచిరి కౌశికుండై పౌరవుం డను బ్రహ్మర్షిగోత్రంబు బ్రహ్మక్షత్రియయోగ్యం బయ్యె. విశ్వామిత్రాత్మజన్ములలో శునశ్శేపుం డగ్రజుం డని కొంద ఱందురు. భార్గవుండు కౌశికత్వంబు నొందె. దేవరాతాదులు విశ్వామిత్రాత్మసంభవులు. దృషద్వతీసుతుండు విశ్వామిత్రుండు. వాని కష్టకుండు కొడు కని యెఱుంగవలయు. 679

ఆ. అష్టకునకు లౌహి యాత్మజుం డింతకు, మునుపు జహ్నుగుణుని ననువదించి
నాఁడఁ గాదె మౌనినాయకులార! వే, ఱొక్కవంశగాథ యొప్పు జగతి. 680

క. వినుఁ డద్ది యాజమీఢం, బనఁబడు నజమీఢుఁ డొక్కయంగన వరియిం
చెను నీలిని యనుపేరునఁ, దనరారును సాధ్వి యామెతనయు సుశాంతిన్. 681

తే. కనియె వాహ్యాశ్వుఁ డతనికిఁ దనయుఁ డతఁడు
పురుకులంబునకుం జెంది భూరికీర్తిఁ
బడసెఁ దత్పుత్రకులు సుపర్వగణసములు
పంచసంఖ్యులు వారియాహ్వయము లిలను. 682

వ. ముద్గల, సృంజయ, బృహదిషు, యవీనర, కృమిలాశ్వు లని విఖ్యాతంబులు. ఈయైదుగురె సకలజగతీరక్షణదక్షు లని వింటిని. వారికిం బంచాలజనపదంబులు నివాసంబులయ్యె. ధర్మవిధివారు వాని రక్షించిరి ముద్గలునకు మహాయశుం డగుమౌద్గల్యుం డుదయించె. ఆతనిభార్య యగునింద్రసేన గర్భంబు దాల్చి వంధ్యశ్వుం గాంచె. [ఆతనికి ధనుర్వేదపారగుం డగుసత్యధృతి గల్గె. సత్యధృతి యొకచో నచ్చరం గని తమి నిలుపఁజాలక శుక్లంబు విడువ నది శరస్తంభంబునం బడియె. దాన మిథునం బుద్భవించె మృగయారతుండై చనిన శంతనుం డామిథునంబుఁ గరుణచే గ్రహించె. పురుషుండు కృపుండు. కూఁతురు కృపి యనంబరఁగె. వీరెల్ల శారద్వతు లనం బ్రఖ్యాతులైరి. గౌతములనువారు వీరె యని యెఱుంగవలయు. ఇంక దివోదాసువంశంబు వర్ణించెద. దివోదాసునకు మిత్రయుం డనువాఁ డుదయించె. వానికి సోముం డనుతనయుండు కలిగె. తద్వంశంబునఁ బుట్టినవారెల్ల మైత్రేయు లనంబరఁగిరి. ఈ రెండువంశంబులవారు బ్రహ్మక్షత్రియత్వంబు గలవారని తెలియవలయు.] 683

క. పంచజనాహ్వయుఁ డపుడుదయించెక్ సృంజయునకతఁడు హితమతి యగుచుక్
జంచత్కీర్తివిరాజితుఁ, డంచు జనుల్ పొగడ వెలయు నాత్మజుఁ గనియెన్. 684

ఆ. సోమదత్తుఁ డనఁగ నామహీపతి యొప్పె, నతఁడు గాంచెఁ దనయు నమలమతిని
సాధుకీర్తిఁ గన్న సహదేవు నాతండు, సోమకునిని గాంచె భీమబలుని. 685

సీ. ఆసోమకున కొక్కయాత్మజుం డుదయించెఁ
గృత్సమతి యన సత్కీర్తిఁ గాంచెఁ
దండ్రి యంతము నొందఁ దనయుఁ డాతఁడు రాజ్య
భారమ్ము వహియించె బలము మెఱయ
నజమీఢుఁ డతనికి నంగభవుం డయ్యె
నతఁడు సోమకుఁ గాంచె నమ్మహీతుఁడు
జంతునామకుఁ గాంచె శతపుత్త్రు లతనికిఁ
గల్గిరి వారిలోఁ గడపటిసుతుఁ

తే. డయ్యెఁ బృషతుండు ద్రుపదుఁ డాయవనిపతికిఁ
దనయుఁ డయ్యెను వీరెల్ల ధాత్రిలోనఁ
దగి రజామీఢు లనఁగ నుత్తమతము లగు
సోమకు లనంగ వినుఁ డింక శుభతమకథ. 686

క. మునులార! యజామీఢుని, వనితామణి పుత్త్రుఁబడయు వాంఛ యలరు ధూ
మిని సాధ్వి సత్కులోద్భవ, పెనిమిటియానతిని వ్రతముఁ బెలుచంబూనెన్.

క. సతతమ్ము నియమ మలరఁగ, వ్రత మీభంగిగనె యయుతవత్సరములు న
ద్భుతముగఁ గన్పట్టగఁ జేసి తగన్ హోమమున వహ్నిఁ జేసెం దృప్తున్. 688

క. మితభోజనంబు తగ వి,స్తృతనియతిం బూని యుండి యొలమి శుచికుశ
ప్రతతిన్ శయనించెను నీ,గతి నొప్పఁగ గర్భభారకలితయయి తగెన్. 689

క. తనయుండు ఋక్షనాముఁడు, ఘనుఁడు సుదర్శనుఁడు ధూమ్రకం బగువర్ణం
బునఁ బొల్చువాఁడు కలిగెన్, జనకుఁడు సంతోష మంద క్ష్మాజను లలరన్. 690

చ. అతనికిఁ గల్గె సంవరణుఁ డాతనికిన్ గురుఁ డుద్భవించె ను
న్నతమతి యైన యమ్మనుజనాయకుఁడే కురునామధేయసం
గతిఁ గను క్షేత్రముం గలుగఁగా నొనరించెను; క్షేత్రమద్ది యా
క్షితిని బ్రయాగమున్ మిగిలి సిద్ధిదమై రమణీయమై తగెన్. 691

క. అది పుణ్యకృన్నిషేవిత, మదిపావనతమము దాని యన్వయ మిలలోఁ
బొదలెన్ విస్తృతిఁ గౌరవు, లుదితులు పెక్కండ్రు తత్కులోత్తమమందున్.

క. కురుపుత్త్రులు నల్వురు భూ,వరమౌళులు నాఁగఁ గీర్తి భాసిల్లిరి మౌ
నిరమణులార! సుధన్వుఁడు, తరువాతన్ సుధనుఁ డనఁగ దైవారె నిలన్. 693

వ. పరీక్షిత్తు నరిమేజనుండు ననం బ్రసిద్ధులైరి. పరీక్షిత్తునకు జనమేజయుండు. ఆత
నికి శ్రుతసేనుండని, యుగ్రసేనుండని, భీమసేనుండనియుఁ బేరులు గలవు.
[సుధన్వునకు సుహోత్రుండు నతనికిం జ్యవనుండును, వానికిఁ గృతయజ్ఞుండును,

వానికి విశ్రుతుండును గల్గిరి. విశ్రుతుం డింద్రసఖుండై సుప్రసిద్ధుం డయ్యె. తత్పుత్త్రుండు చైద్యుం డాతం డుపరిచరుం డనుపేరం బరఁగి వసువై యంతరిక్షచరుం డయ్యె. ఆతనికి గిరికభార్యయై సప్తపుత్త్రులం గనియె. అందు మహారథుం డగుమగధరాట్టు బృహద్రథుం డన విఖ్యాతిం గాంచె. ప్రత్యగ్రథుం డతని సోదరుండు. క్రథుం డతని యనుజుండు. మణివాహనుం డనునామాంతరం బతనికిం గలదు శాలసుండు తత్సహజుండు. జహ్నువు తత్సహజన్ముండు. మత్స్యుండు వానితమ్ముండు కాలి యనువాఁడు తదనుజాతుండు. బృహద్రథునకుఁ గుశాగ్రుండు తనయుం డతనికి వృషభుండు పుత్త్రుం డాతండు విద్యాభూషణుండను విఖ్యాతిం గాంచె. ఇంక జహ్నువంశంబు సర్వగుణాన్వితం బగుట వివరించెద. జహ్నునకు సురథుండనుపుత్త్రుండు గలిగె. 694

క. వీరెల్ల మహాభాగులు, వీరులు బలయుతులు కీర్తివృద్ధులు నగుచున్
ధారుణి వెలయ మహీపతి, సూరుఁడు జనమేజయునకు సుతుఁడు జనించెన్. 695

క. మతిమంతుఁ డైన యాతఁడు, క్షితి సురథుం డనఁగఁ గీర్తిఁ జెందె మిగులఁగా
నతఁడు విదూరథుఁ డనఁబడు, సుతుఁగాంచెను ఋక్షుఁ డతనిసూనుం డయ్యెన్.

ఆ. మఱి విదూరథునకు మహితభరద్వాజ,కరుణ ఋక్షుఁ డనఁగఁ గలిగె సుతుఁడు
వీర లేకనామధారులై రట ద్వితీ,యుండు సోమవంశమం డనుండు. 697

క. ధర భీమసేనులను ము,వ్వురనున్ జనమేజయు లనఁ బొల్తురు సుండీ
యిరువురు ఋక్షునితనయుం, డరాతిహృద్భీమసేనుఁ డయ్యె నతనికిన్. 698

క. అతఁడు ప్రతీపుని గాంచెను, బ్రతీపుఁడున్ సుతుల మువ్వురం గాంచె నతం
డతిశయగుణుండు శంతనుఁ, డతనికి దేవాపి బాహ్లికాఖ్యులు సహజుల్. 699

క. తొలికొడు కగుశంతనుఁ డా, యిలకున్ రాజయ్యెఁ గులము నెసఁగం జేసెన్
గుల మా బాహ్లికువంకన్, వెలసె నదేరీతి దాని వివరింతు నికన్: 700

తే. సోమదత్తుఁడు బాహ్లికసుతుఁడు చాల, యశమునం బొల్చె నతనికి నాత్మభవులు
భూరి భూరిశ్రవశ్శలు లైరి, బాహ్లి,కాగ్రజుం డగుదేవాపి యమరతతికి. 701

క. అమరె నుపాధ్యాయుఁడుగా
సుమహితుఁ డాతనికిఁ జ్యవనసుతుఁడు కృతకుఁ డ
య్యె మిగుల మిత్రము; శంతనుఁ
డమితపరాక్రముఁడు భూపుఁ డయ్యెంగడఁకన్. 702

క. కౌరవులం దాభూపతి, భూరిధనుర్ధరుఁడు కీర్తిభూషితుఁడు సుఁడీ
యా రాజవంశచరితం, బారసి వర్ణింతు వీను లలరన్ వినుఁడీ. 703

క. గంగామతల్లివలనం, బొంగుచు నారాజు గాంచెఁ బుత్త్రు సుగుణరా
శిం గడువీరుని రిపుబల,భంగదు దేవవ్రతుని నభంగబలాఢ్యున్. 704

ఉ. ఆతఁడు భీష్ముఁ డన్నయశ మంతటఁ గాంచెను బాండవాళికిం
దాతయు నాఁగఁ బిల్వఁబడె ధర్మగుణాన్వితయైన కాలి వి
ఖ్యాతు విచిత్రవీర్యుఁ గనె నాతఁడు శంతనుఁ ముద్దుపట్టియై
పాతకశూన్యుఁడై వెలసె బ్రహ్మమునీశ్వరులార! యవ్వలన్. 705

క. జనపతి యాతఁడు సంతతిఁ, గనకయె మృతినొంద నతని కాంతలవలనన్
గనియెన్ వ్యాసుఁడు ధృతరా,ష్ట్రుని బాండువిదురుల మిగుల శుభతమగుణులన్.

క. ధృతరాష్ట్రుఁడు గాంధారిని, సతీమణిం బెండ్లియాడి శతపుత్త్రుల ను
న్నతులం గాంచెను దత్సుత,శతమున దుర్యోధనుండు సత్తముఁ డయ్యెన్. 707

ఆ. పాండురాజపుత్త్రపంచకమున ధనం,జయుఁడు మేటి యతనిసాధ్వి కృష్ణ
ననుజ యగుసుభద్ర యామె సౌభద్రునిఁ,బడసె సుతుని వాఁడు బాహుబలుఁడు.

క. అతఁడే యభిమన్యుం డన, వితతప్రఖ్యాతి మీఱ వెలయుచుఁ గాంచెన్
సుతునిఁ బరీక్షిత్తును ద,త్సుతుఁడౌఁ బారిక్షితుండు సురమునులారా! 709

సీ. అతఁడు కాశీనామ మలర లావణ్యాంబునిధి యైనభార్యను నెమ్మిఁ గాంచి
యనుఁగుఁబుత్త్రులఁ గాంచె నందుఁ జంద్రాపీడుఁ డవల సూర్యాపీడుఁ డనెడువరుస
సహజన్ములైరి; జ్యేష్ఠభ్రాత రాజయ్యె ననుజుండు మోక్షజ్ఞుఁ డయ్యె; నంత
నగ్రజుం డొగిఁ గాంచె నాత్మజన్ముల నూర్వురను వారు చాపవిద్యాధికులయి
తే. మించి రన్వయ మది జానమేజయ మన, జగతి విలసిల్లె నందు జ్యేష్ఠత్వ మొంది
సత్యకర్ణుండు వారణస మనుపురము, నందు బలశాలియై యజ్వయై తనర్చె. 710

వ. అతనికి శ్వేతకర్ణుండు కలిగె వాఁ డపుత్త్రకుండై తపోవనంబునకుం బోయి
యందుండ నాతనిపత్ని గర్భంబు దాల్చె ఆమె యాదవియై యలరు. సుబా
హుదుహిత మాలిని యను పేరంబరఁగు. అత్తఱి శ్వేతకర్ణుండు మున్నె సంకల్పిం
చినవాఁ డౌట మహాప్రస్థానంబు చేయం బోవ నామె వెనుకొనియె. మార్గమ
ధ్యంబున సుకుమారుం డగుకుమారుం గాంచి యాశిశువుం ద్యజించి భర్త
వెంటం బోయె ద్రౌపదివలె నామె విఖ్యాతిం బొందె. కుమారుం డతండు గిరి
కుంజంబున నేడ్వ దయమెయి మేఘంబు లావిర్భవించె శ్రవిష్ఠాపుత్త్రులగు
పైప్పలాదికౌశికు లిరువురు నాశిశువుం గైకొని, జలకం బాడించి తడియార్చి
రుధిరసిక్తములగు నాశిశువుపార్శ్వంబులు కడిగి శిలాఫలకంబున నునిచి నంత
సాపార్శ్వంబు లజశ్యామంబులై యలరుటంబట్టి యజపార్శ్వుండని పేరు పెట్టిరి.
అంత నబ్బాలకుండు రోమకశాలయందు నిద్దఱు బ్రాహ్మణులచే రక్షింపఁబడియె.
రోమకునిభార్య పుత్త్రకారణంబున నాతని నెత్తిపెంచె. కాన నాశిశువు రోమ
కీపుత్త్రుం డనం బరఁగె. మున్ను పోషించినబ్రాహ్మణులు రోమకుమంత్రు లని తెలి
యవలయు. తత్సంతతి కడువెలింగె. ఆవంశంబె పౌరవం బనం బరఁగి పాండవ
ప్రతిష్ఠకు మూల మయ్యె. 711

క. ఈవిషయంబున నాహుషుఁడై వఱలు యయాతివృద్ధుఁ డౌతఱి శ్లోకం
బీవిధి వచించెఁ బ్రీతుం డై వర్ణితరూప మనఁగ నలరెడు దానిన్. 712

తే. చంద్రసూర్యులు నక్షత్రసమితి యుండు,దాఁక నీభూమియందు నుత్తమతమంబు
పౌరవాన్వయ ముండు నెబ్భంగిఁగనిన,సందియమె లేదు క్రమవృద్ధి నందుచుండు.

వ. మునులారా! పౌరవవంశంబుఁ దెల్పితి. ఇంకఁ దుర్వసుద్రుహ్యానుయదువులను
నల్వురవంశంబుల ప్రవృత్తిం దెల్పెద. అవధరింపుఁడు. 714

సీ. తుర్వసునకును సుతుండు గల్గెను వహ్ని యనువాఁడు గోభాను వతనికొడుకు
త్రైసాను వాతనితనయుండు వానికిఁ గలిగెఁ గరంధముం డలఘుబలుఁడు
తత్తనూజుండు మరుత్తనువాఁడయ్యె నావిక్షితుండు తదాత్మభవుఁడు
వానికిఁ బురుషసంతానంబు లేదయ్యె సంయత దుహితయై చారుకీర్తి

ఆ. యలరఁజేసె; నాతఁ డధ్వరదక్షిణా,ర్థంబుగాఁగ మౌనిరాట్టయి తగి
సాధుతపస్వియైన సంవర్తునకు నిచ్చె, నంతఁ దనయుఁ డొక్కఁ డతని కలరె. 715

క. ఆతఁడె దుష్యంతుం డన, భూతలవిఖ్యాతి నొందెఁ బుణ్యతముండై
యీతెఱఁగున జరనంది య,యాతి శపింపంగ వంశ మది యిటులయ్యెన్. 716

వ. దుష్యంతునకుఁ గరూరోముం డాత్మజుం, డాహ్రీదుండు తత్సుతుండు. తదాత్మ
జులు నల్వురు పాండ్య కేరళ కోళ చోళు లనువారు. వారికి రాజ్యంబులు
తదాహ్వయంబుల విలసిల్లె. 717

క. మునులార! బభ్రుసేతువు, తనయుఁడు ద్రుహ్యునకు నయ్యెఁ దత్తనయుఁడుఖ్యా
తిని శూరత నసదృశుఁ డ,య్యెను బే రంగారసేతు విల విలసిల్లెన్. 718

క. మరుదోఘపతియుతుండై, దురమున నాయౌవనాశ్వుతో ఘోరముగాఁ
జరియించి మాసదశకం, బరాతు లౌరౌర యనఁగ నమరత నొందెన్. 719

క. అతనికె గాంధారుం డను, సుతుఁ డుద్భవ మందె నతఁడె క్షోణిని దనపే
రతిశయత నిల్వ దేశము, నతిసుఖదము నలరఁజేసె నం దుద్భవమై. 720

క. తురగము లుత్తమజాతిం, బరఁగుచు గాంధారము లనఁ బరమయశమునన్
ధర విలసిల్లెను ద్రుహ్యుని, కరయంగా నను వు సహజుఁ డౌఁ గద యతఁడున్.

క. తనయుని ధర్ముం డను నా,తని గాంచెను ధృతుఁడు వానితనయుం డతఁడున్
గనియె శతద్రుహు వాతని, తనయుండు ప్రచేతసుండు ధార్మికుఁ డిలలోన్.

సీ. అతఁడు సుచేతసుఁ డనువానిఁ గాంచెను వినుఁ డింక యదుమహీవిభునివంశ
మతనికి నాత్మజు లైదుగు రమరసూనులఁ బోలువారలు గలిగి రందు
నాద్యుఁ డౌను సహస్రదాఖ్యుండు తర్వాతివాఁడు పయోదాఖ్యవఱలుఁ గ్రోష్టు
వవ్వలివాఁడగు నవల నీలుఁడు వానితమ్ముఁ డంజికుఁ డనఁ దనరుచుండు;

ఆ. నందు జ్యేష్ఠుఁ డైన యల సహస్రదునకు,
ముగురు సుతులు ధర్మమూర్తు లైరి

హైహాయుండు హయుఁడు నవల వేణుహయుండు
ననెడునామములను నలరువారు. 723

కార్తవీర్యుచరిత్రము.

క. తొలివాఁ డగు హైహయునకుఁ, గలిగెఁ జుఁడీ ధర్మనేత్రకమ్రాహ్వయ మి
మ్ముల నొప్పఁ గార్తుఁ డాతని, వలనం బ్రభవిల్లి ధర్మవర్ధనుఁ డగుచున్. 724
క. తనయున్ సాహంజుని గాంచెను భూపతి యతఁడె స్వాత్మచిత్రము సాహం
జని యనుపురి నిర్మించెను, గనియె మహిష్మతుని శౌర్యకలితు నిరుపమున్. 725
క. ఆతఁడు భద్రశ్రేణ్యుని, జేతోభవతుల్యు వీరు శ్రీమంతుని వి
ఖ్యాతుని గాంచెను దుర్దముఁ, డాతనిసూనుండు కనకుఁడతనితనయుఁ డౌ. 726
క. కృతవీర్యుండు కృతౌజుఁడు, కృతకర్మ కృతాగ్ను లన నకృత్రిమబలు లై
రి తనయు లాకనకునకున్, గృతవీర్యున కర్జునుం డహీనుఁడు సుతుఁడై. 727
క. కరముల వేయింటను దుర్ధరసాధనవితతిఁ దాల్చి రాజద్ద్వీపే
శ్వరుఁడై భాస్కరతేజస్స్ఫురణంబున నొప్పు రథము శోభిలుచుండన్. 728
తే. పుడమి యంతయు నిర్జించి భూధవేంద్రుఁ
డయ్యె నయుతాబ్దము లొగి సాధ్యంబుగాని
తప మొనర్చుచు నత్రిపుత్త్రకుని దత్త
యోగి సేవించె నమ్మునియును గరుణను. 729
క. అతనికిఁ బొడసూపిన నా, క్షితిపతి ప్రణమిల్లి భక్తిఁ గీర్తించిన స
మ్మతి నాల్గువరము లిచ్చినఁ, బతి తొలుతం గోరె వేయిబాహువు లుండన్. 730
సీ. అవల రెండవవర మడిగెను ధర్మంబునందు నామతిపూన్కి నావహిల్లఁ
బెద్దలు వలదన్న వినెడు నట్లుగ; మఱి యుగ్రవీర్యంబున నుర్వి గెలిచి
ధర్మంబుననె ప్రజాతతిని రంజిలఁజేయునట్లుగ బహువిధాహవములందు
శత్రుసహస్రంబుఁ జతురిమ నిర్జించి తా నెక్కుఁ డయియుండఁ దగు నటంచు.
తే. వరములను గోరె నీరీతి బ్రహ్మమౌను
లార! యుద్ధంబు చేయంగ భూరమణున
కమ్మహాత్ముని కరుణసహస్రకరము
లొప్పుఁ జిత్రంబుగా వైరు లొగిఁ బరుగిడ. 731
చ. అతఁడును గార్తవీర్యుఁ డనునాహ్వయ మొప్పఁగ నేడుదీవులన్
వితతసముద్రపత్తనసువిస్తృతభూధ్రవరాళి నొప్పునీ
క్షితిని రణైకమార్గమునఁ జేవ దలిర్ప జయించి జన్నముల్
శతము లొనర్చి ద్వీపములఁ జక్కఁగ నిల్పె యశంబు ఖ్యాతియున్. 732
క. అతఁ డొనరించినయజ్ఞప్రతతులు బహుదక్షిణైకభాసురములు ను
న్నతకాంచనయూపంబులు, తతకాంచనవేదికలును ధన్యతమములున్. 733

సీ. వ్యోమయానంబుల నొప్పి భూషణముల వెలయుగంధర్వులు లలితదేవ
రమణులు సతతంబు రంజిల్ల నొప్పారుసవియునై యుండుఁ దదధ్యజ్ఞమందు
గాయకోత్తముఁ డనఁ గ్రాలు నారదుఁ డిట్లు పలికె విస్మితుఁడయి లలితభణితిఁ
గార్తవీర్యుని దైనగతిఁ బూనఁజాలెడు వాఁ డొక్కరుండైన లేఁడు జగతి
తే. యజ్ఞదానతపస్సుల నతులవిక్రమమున శ్రుతమున నసముఁడై క్షమఁ జెలంగు
ద్వీపసప్తకమునయందుఁ దీవ్రఖడ్గచర్మకోదండధారి యాత్మావిభుండె. 734

తే. రథియు నీతండె యోగియన్ ప్రథితకీర్తి
నందువాఁ డీతఁడే శోక మంద కెపుడు
భ్రాంతి నొందక భూరిద్రవ్యంబు చెడక
యుండ మహిమము న్యాయంబు నొప్ప నేలె. 735

క. సతతంబు వివిధరత్నప్రతతియుఁ జెలువారఁ జక్రవర్తియు నయినీ
క్షితినేలెం బశుపాలకుఁ, డతఁడే చుఁడి క్షేత్రపాలుఁ డన నాతండే. 736

క. ధరపై వృష్టి నొసఁగు జలధరుఁ డనఁగా నతఁడె యోగితం దగియుండన్
వరయోగి యతఁడె యయి భూవరుఁడాయర్జునుఁడు వైభవంబున నలరెన్.

తే. కరసహస్రమ్ము మిగుల జ్యాఘాతకఠిన
మైన చర్మము తగఁగ సహస్రరశ్మి
యుతి శరత్కాలమున భానుఁడో యనంగ
సాధుదర్శనుఁడై యొప్పె జనవిభుండు. 738

క. జనపతి యాతఁడు ద్యుతిచేఁ, దనరుచుఁ గర్కోటకసుతతతి యుద్ధమునం
దున నోర్చి యాత్మపురమున, నునిచెన్ బందీకృతముగ సురుతరకీర్తిన్. 739

క. జలనిధి వేగంబున నాయిలాధిపతి బాహువితతి నెంతయుఁ గ్రీడం
జెలఁగినగతి నాపుచు శైవలినులఁ గ్రమహీనగతిని బాఱఁగఁ జేసెన్. 740

తే. అతనిపురిచెంతఁ బాఱుచున్నట్టి నర్మ
దాఖ్యనదమును గలగుండు నందఁ జేసి
యందు విహరించు నాభూపుఁ డద్ది విచల
దూర్మితతి సంశయించుచు నొగిని బాఱు. 741

చ. ఒకతఱి వేయిబాహువుల నుద్ధతి సంద్రమునుం గలంపఁగా
వికలతరాంగజాలముల వింతగ నందు వసించు రాక్షసుల్
సకలవిధంబులన్ బెగడి చర్యల మాని యడంగి యుండి; ర
ప్డు కడఁగి భూవిభుండు తనభూరిభుజంబుల నబ్ధి నూఁపగన్. 742

సీ. పెనుతరంగంబులు విశిథిలములుగాఁగఁ దిమితిమింగిలములు దెరలి కదల
మారుతావిద్ధమై భూరిఫేనము తగ సుడులెల్ల నెంతయు క్షోభ మొందఁ

భయదాకృతిం బొల్చి పాథోధి మిక్కిలి కనఁబడె దేవతాగణము లెల్ల
మందరాద్రిని గంధియం దిడఁ గల్గుక్షోభంబునన్ గరుడుండు వచ్చునేమొ
ఆ. యనుచు శంకనొంది యదరి భయంకర, మూర్తిఁ గార్తవీర్య నార్తిఁ గాంచి
కదలకుండె మీనగణములు మునులార, వినుఁడు కార్తవీర్యవితతబలము. 743

చ. ఖరకరుఁ డస్తమించుతఱి గాలి కనంట్లు చలించునట్లు స
త్వరముగఁ దీవ్రచాపమున దారుణరీతి నెసంగుజ్యాలతన్
నిరుపమశక్తిఁ గూర్చి యరినిర్భరకాండము లైదు దానఁ జే
ర్చి రవముమీఱ సైన్యయుతు జిష్ణురిపున్ దనుజేంద్రు రావణున్. 744

మ. బలమొప్పన్ వెఱగందఁ జేసి దివిజుల్ బల్ మేలు మేలంచు నా
ర్పుల నింగిన్ బగులంగఁ జేయఁ బెలుచన్ బొంగారుశౌర్యంబుతోఁ
గలగుండై దితిజుల్ వడిం బరుగిడంగాఁ ద్రాళ్ల బంధించి ని
స్తులకీర్తిన్ సుజనుల్ నుతింపఁ బురికిం దోడ్తోన కొంపోవుచున్. 745

ఆ. భటులు బలసిరాఁగ వందిమాగధనుతు, లలర బద్ధుఁ జేసె; నంతఁ గొంత
కాల మరుగఁ బౌత్త్రుఁ గారాగృహస్థుని, గాఁ బులస్త్యమౌనికాంతుఁడు విని.

క. చను దెంచి కార్తవీర్యా, ర్జునునిన్ మాహిష్మతీశు రూపవిజితమా
రుని శూరు ధీరుఁ దాఁ గని, యనియెన్ నాపౌత్త్రుఁ గెల్చి తది యశ మొసఁగెన్.

క. ఐనన్ నాపైఁ గల దయ, చే నాపౌత్త్రుకుని విడిచి క్షితి దివిఁ గీర్తిన్
బూనుమ యని యాచించిన, భూనాథుఁడు విడిచి పుచ్చె బుధనుతుఁ డగుచున్

తే. అతనిబాహుసహస్రసంధృతశరాస, నోత్తమజ్యాలతాఘర్షణోత్థరవము
ప్రళయమున మేఘనిర్గతభయకృదశని, నిస్వనముపోలె ఘోరమై నెగడుఁగాదె.

క. ఔరా! యట్టి మహీశుని, దారుణకరదళశతంబుఁ దా ఖండించెన్
భూరిపరాక్రమనిధి యగు, నా రాముఁడు పరశుధార నాహవభూమిన్. 750

క. కనకమయతాళవనమును, సునిశితమౌ పరశుధార సుఖముగ ఛేదిం
చినయట్టు కార్తవీర్యా, ర్జునుబాహుసహస్రము దివిజులు వెఱఁగందన్. 751

క. ఒకతఱి నాఁకలిగొని శుచి, సకలావనిపాలుకడకుఁ జను దెంచి విభూ
యిఁకఁ దాళఁజాల నాఁకలి, సకలాంగకములను గాల్ప సమకట్టె ననన్. 752

చ. విని కృతవీర్యునాత్మజుఁడు వింతగఁ దోఁచుట నగ్నిఁ జూచి ద్వీ
పనికర మే నొసంగితిని బాధ యడంగ దహింపు మన్నఁ బ
త్తనములు గ్రామఘోషసహితం బగు దేశతతిన్ దహించె భా
నునిచయ మెల్లఁ జక్కఁగఁ గనుంగొన శక్యముగాని రీతిగన్. 753

తే. శైలవనముల దహియించి సత్వరముగ, వరుణపుత్త్రుని దౌ తపోవసతిఁ గూడఁ
గాల్చె నవ్వేల భీతిల్లె క్ష్మాపతియును, బెగడె నేయపకారంబు తగులునో యని.

క. వరుణుండు వసిష్ఠుండనఁ, బరఁగుసుతుం గాంచె నాపవప్రఖ్యాతిన్

ధరఁ గనియె నతఁడు నాపవు, పరమాశ్రమ మద్ది కాల్పఁబడియెన్ శుచిచేన్.

చ. కని తనయాశ్రమంబు శుచి కాల్చుట రాజును సమ్మతించుటన్
దనమది నెంచి దుర్భరనితాంత రుడావిలమానసుండు నై
మనుజపతిన్ శపించె నిటు మామకవాసము గాల్పకుండఁ జె
ప్పను దలపోయ కీవు గరువంబున నాజ్ఞ యొసంగి తందునన్. 756

తే. అనుభవింపుము నాశాప మన్యుఁ డొకరుఁ, డీయనుంగుశరీరం బహీనశక్తిఁ
ద్రుంపఁగలఁ డెవ్వఁ డనినచో దుర్జనాంత,కుఁడు మహాబాహుశాలి రాముఁడు తపస్వి.

క. జమదగ్ని తనయుఁడు ప్రతా,పముగల్గుఘనుండు నీదుబాహుసహస్రం
బు మహిమఁ ద్రుంచును దేజం, బమరన్ నీశిరముఁ జెందు నవనీనాథా. 758

సీ. మునులార! యేమహీశునకు సప్తద్రవ్యతయు లేక యుండ శాత్రవులఁ జెండ
వరము గల్గెనొ శౌర్యవంతుఁడు న్యాయైకపాలకుఁ డారాజు బ్రహ్మమౌని
శాపవశంబునఁ జచ్చె నింకొకని చే వరము నట్టిదె మున్ను వలచె నతఁడు
విధివశంబున దాన విప్రర్షిచేఁ జచ్చెఁ దత్పుత్త్రులు శతంబు దగుదు రందుఁ

తే. బంచపుత్త్రులు బలయుతుల్ పరమధర్మ
విదులు కీర్తివిరాజితుల్ విమతహరులు
శూరులు కృతాస్త్రులు మహాత్ము లారయంగ
నసదృశులు వారు జగతిలో నన్నిగతుల. 759

తే. శూరసేనుండు తొలివాఁడు శూర వృషణు
లన్లై మధుపధ్వజుండు జయధ్వజుండు
ననఁగ వారలపేరు లం దాజయధ్వ
జుం డవంతీపురీనాయకుండు వెలయు. 760

క. వీరలె కృతవీర్యాత్మజ, భూరమణాత్మజులు దర్పభూషితులు బలో
దారులు నైరి; జయధ్వజుఁ, డారయ నందుత్తముండు నై సుతుఁ గనియెన్.

సీ. తాళజంఘుం డన ధారణి నతఁ డొప్పె నతనికి శతపుత్త్రు లైరి వారు
తాళజంఘు లనంగ నోలిఁ బేరులఁ బొంది రవ్వార లెల్ల నిత్యాగ్నిహోత్రు
లతిసువ్రతులు నయియవనిపై వీతిహోత్రులు సువ్రతులును భోజులును మఱియు
నావంతు లనఁగ విఖ్యాతిని గాంచిరి; తాళజంఘు లనంగఁ దగినవారు

ఆ. తొండికేరు లనఁగఁ దతకీర్తు లగుభర,తులు సుజాతు లనఁగ వెలసి రట్టి
వారిసంఖ్య చెప్ప వలనుపడకయుండు, విస్తృతిం జెలంగి వెలసియుంట. 762

వ. వృషప్రభృతులు యాదవులై పుణ్యకార్యరతు లైరి. వృషుం డందు వంశకర్త యయ్యె. వానికొడుకు మధునామకుండు వానికి శతపుత్త్రులు. అందు వృషణుండు మూలపురుషుండు. అతనికి వృష్ణులు గలిగిరి. మధువునకు మాధవులు కలిగిరి. యాదవులను హైహాయులు యదునామునిచేఁ గీర్తిఁ గాంచిరి. అయ్యె

డుండు విత్తనాశంబు లేక ధనంబు నార్జించె. మునులారా! కార్తవీర్యునియుత్పత్తి నెవరు ప్రతిదినము పఠింతురో వారు పుణ్యవంతు లగుదురు. యయాతిపుత్త్రులు పంచవిధంబుల లోకైకవీరులై జగత్పాలనచతురులై స్థావరజంగమభూతాధిపతులైరి. నరపతి యీచరితంబు విన్నఁ బంచభూతవశీకరణసమర్థుఁ డగు. దీర్ఘాయుఃప్రభృతి సత్ఫలంబులం బొందు. ఇంకఁ గ్రోష్టువంశంబు వినుండు. యదువంశధరుండై యజ్వయై పుణ్యాత్ముం డగు క్రోష్టునిచరితంబు విన్న సర్వపాపంబు లడంగు. అతనివంశంబునందే కదా మహావిష్ణు వవతరించె నని లోమహర్షణుం డిట్లనియె. 763

---

## పంద్రెండవ అధ్యాయము.

### వసుదేవునియుత్పత్తి.

క. మునులార! క్రోష్టునామకు, వనితామణులిర్వురందు వరగుణయుతలై
తనరెను గాంధారియు నా, మెను మించెను మాద్రి జనులు మేలని పొగడన్.

క. అనమిత్త్రుని గాంధారియుఁ, గనియెన్ బలశాలి యగుచుఁ గడు వర్ధిల్లం
దనయుం డాతఁడు మాద్రియుఁ, గనియె యుధాజిత్తు దేవకల్పుని ననఘున్.

తే. దేవమీఢుషుఁ డనెడు ద్వితీయసుతునిఁ
గనియె వారలవంశంబు క్ష్మాతలమున
మువ్విధంబులుగాఁ దగె నవ్విధంబు
వినుఁడు మాద్రితనూజులు విక్రమించి. 766

సీ. వృష్ణ్యంధకులనాఁగ వెలయుపుత్త్రులఁగాంచి రందు వృష్ణియు శ్వఫల్కాఖ్యుఁజిత్ర
కునిని గాంచెను; శ్వఫల్కుఁడు ధర్మచిత్తుండుమునులార!యాతఁడెందునివసించు
వ్యాధిభయంబును వర్షభయంబును గలుగ దందు వినుండు గాథ యొకటి
కాశిరాజు వసించు క్ష్మాతలంబున వృష్టి వాసవుఁ డీయమి వత్సరత్ర
తే. యము తపించిరి జను లంత నానృపాలుఁ
డరిగి పూజించి యాదృతి నాశ్వఫల్కుఁ
దోడితెచ్చిన వర్షించె నాఁడె యింద్రుఁ
డంత నాకాశినాథుని యనుఁగుఁబుత్త్రి. 267

క. పరిణయ మయ్యె శ్వఫల్కునిఁ, దరుణీమణి గాందిని యనఁ దా గుణమణియై
పరఁగెం దండ్రియు బ్రాహ్మణ,వరునకు నతిథికిని గోఁతు భక్తి నొసంగెన్. 768

క. అతనికి నక్రూరుం డను, సుతుఁ డుద్భవ మందె నవల సౌరిదిఁ గుమార
ప్రతతి యుదయించె నయ్యది, ప్రతిలేని పరాక్రమైకభాసుర మయ్యెన్. 769

వ. ఉపమద్గు, మద్గు, మేదు, రారిమేజ, యావిక్షి, తాక్షిప, శత్రుఘ్న, ధర్మధృగ్యతిధర్మ, ధర్మోక్షాంధకరునామకులు నావహప్రతివాహు లనుకుమారులును,

సుందరి యనుకుమారియుఁ గల్గిరి. అందుఁ దొలికొడుకగు నక్రూరుం డుగ్రసేన యనుభార్యయందుఁ బ్రసేనోపదేవు లనుతనయులం గాంచె. శఫల్కునిసోదరుం డగుచిత్రకుండు పృథు విపృథువులు, నశ్వగ్రీ, వాశ్వబాహు, స్వపార్శ్వక, గవేష, ణారిష్టనే, మ్యశ్వ, సుధర్మ, ధరభృ, త్సుబాహు, బహుబాహువు లనుకొడుకులను, శ్రవిష్ఠా శ్రవణాఖ్యలం గొమరితలను గాంచె మఱియు నక్రూరుం డసిక్ని యనుభార్యయందు శూర, దేవమీఢుషులను గాంచె. భోజ రాజదుహితయందు శూరుఁడు పదుగురసుతులం గనియె. 770

క. తొలికొమరుఁడు వసుదేవుం, డలఘుభుజుం డతఁడు పుట్టు నవసరమునఁ బె
గ్గలముగ దుందుభినిస్వన, మలరెఁ దివి నానకములయారవ మెసఁగెన్. 771

క. ఆనకదుందుభి యనఁగా, మానవవరుఁ డతఁడు పొల్చె మహిఁ దజ్జననం
బౌనెడ సుమవృష్టియు భూ,జాని మహాసౌధమందు సాఁగె ఘనముగన్. 772

క. మునులార మనుజలోకం,బున నతనికి సీడువచ్చుపురుషులు రూపం
బున నెన్న లేరు చంద్రుని, కెనయగు తనుకాంతి యతని కెసఁగెం జుండీ. 773

వ. వసుదేవుని పిదప శూరునకు దేవభాగ దేవశ్రవసులు, ననాధృష్టి, కనవక, వత్సవంతులును, గృంజమ, శ్యామ, శమీక, గండూషనామకులు గల్గిరి. వారి వెనుకఁ బంచపుత్త్రిక లుదయించిరి. పృథుకీర్తియుఁ, బృథయు, శ్రుతదేవయు, శ్రుతశ్రవయు, రాజాధిదేవియు నని వారినామంబులు. వీరెల్ల వీరమాత లనం బ్రఖ్యాతిం గాంచిరి. శ్రుతదేవియం దావత్సుం డనుకొడు కుదయించె. శ్రుతశ్రవయందుఁ జైద్యుండు కలిగె. ఆతండె శిశుపాలుం డనం బరఁగె. 774

క. దనుజేంద్రుఁడు దేవేంద్రా,దినిఖిలసురవీరు లదర దివిఁ బాలించెన్
మును పల హిరణ్యకశిపుఁడె, జనించెఁ బృథుకీర్తియందు సత్తనయుం డై. 775

ఆ. వృద్ధశర్మ యతనిపిత యగు దండవ, క్త్రాహ్వయమును గాంచె నవనిఁ జెలఁగు
నాకరూషదేశ మతనికి వాసమౌ, బలయుతుండు వాఁడు ప్రౌఢశక్తి. 776

సీ. కుంతిభోజుం డొక్కకూఁతు గాంచెను బృథ యనుపేర నాయమ యమరె జగతిఁ
బాండురా జాలేమఁ బత్నిగా వరియించె నామెయందే ధర్మనాశిషముల
ధర్మమూర్తి నితాంతదయకు నాలయమైనయాయుధిష్ఠిరుఁ డొప్పె నతనివెనుక
భీమసేనుఁడు జగద్వీరుఁడౌ వాయువునంశంబునం బుట్టె నమరవిభుని

తే. యంశమునసె ధనంజయుఁ డలరెఁ దండ్రిఁ
బౌరుషంబున మెప్పించి ప్రతియె లేని
యట్టి యతిరథుఁడయి తగె నతఁడె; పిదప
శినియు ననమిత్త్రునకుఁ బ్రియతనయుఁ డయ్యె. 777

క. అనమిత్త్రుఁడె వృష్ణితనూ,జనికరమునఁ గొండిక యగు శైనేయుం డై
తనరారు సత్యకుం డా,తనికిన్ యుయుధానుఁ డనెడుతనయుఁడు గలిగెన్.

వ. సాత్యకియు నతనికి రెండవతనయుండు. దేవభాగునకు మహాభాగుఁడగు నుద్ధవుండు పుట్టె. అనాధృష్టి యనువాఁ డశిక్నీ యనుభార్యయందు యశస్వియగు దేవశ్రవసుం గనియె. వానివెనుక శ్రుతదేవుం డుదయించె. వానికి నైషాది కలిగె. ఏకలవ్యుండు నైషాదితనయుండు. 779

క. మునులారా! వత్సావతి, యనపత్యుండై తపింప నావసుదేవుం
డును నౌరసుఁ డౌశౌశికు,నను రాగము మీఱ నిచ్చె నందఱు పొగడన్. 780

తే. సంతతియె లేని గండూషుఁ జాలిఁ గాంచి
యిచ్చె సుతుల విష్వక్సేనుఁ డెలమి మిగులఁ
గైకొనియె వారి గండూషుఁ డీకరణిని
వారివంశంబు లెంతయు వఱలె జగతి. 781

వ. ఆకొడుకులు చారుదేష్ణ, సుదేష్ణ, పంచాల, కౌక్మిణేయు లనునామంబులం బ్రఖ్యాతిఁ గాంచిరి. అందుఁ బంచాలుం డనవరతయుద్ధాభిలాషుండు. చారుదేష్ణుండు వాయసక్రీడాలంపటుండు. వాఁ డరుగుచుండ సహస్రవాయసంబులు వెనుకొనుచుండు. ఆతండు పెట్టించు పాయసంబు భక్షింతు మని యవి కూయుచుండు. కనవకుం డనువానికిం దంత్రిజ, తంత్రీపాలు లనునిరువురు కొడుకులు గలిగిరి గృంజిమునకు వీరువు, నశ్వహానుం డనుకొడుకు లిరువురు కలిగిరి. శ్యామునకు శమీకుండు గలిగి రాజ్యంబు పాలించె ఆతండు భోజకులజననము నేవగించి రాయసూయం బొనరించె. అజాతశత్రువు రాజసూయం బొనరించి ప్రఖ్యాతిం గాంచె. ఇంక వసుదేవతనయుల వర్ణించెద. 782

తే. వృష్ణివంశంబు త్రివిధమై విమలబహుళ,శాఖలం బొల్చి బహువిధసద్యశముల
నవనిఁ దనరారెఁ బూజ్యమై యతులరీతి, నెసఁగు వసుదేవపత్ను లహీనగుణలు.

సీ. వారలు సంఖ్యచేఁ బదునల్వురైరి పౌరవి రోహిణియు జితరాజబింబ
యగు మదిరాదియు నట్టివైశాఖియు భద్రసునామ్నియుఁ బంచమియును
సహదేవయును మఱి శాంతిదేవయు నట్లు శ్రీదేవి దేవరక్షితయు నవల
వృకదేవి యుపదేవి ప్రకటగుణాఢ్యయౌ దేవకీదేవియుఁ బావనాఖ్య

తే. వైరి సుతనువు బడబయు ననెడు నిర్వు, రాలతాంగుల సేవింప నచట నిలిచి
రందు రోహిణి బాహ్లికు నాత్మజాత, జ్యేష్ఠపత్నియు నటుగాన శ్రేష్ఠ యగుచు.

క. అనురాగ మొప్ప భర్తను, వినయంబునఁ గొల్చుచుండి విమతవిభేదిన్
గనియెన్ రాముని శారణుఁ, డను వానిన్ శఠుని దుర్మదాహ్వయు దమనున్.

తే. శుభ్రపిండారకుల మహాశూరుఁ డగు ను, శీనరుని గాంచె వేడుక సూనుల మఱి
చిత్ర యనుకూఁతు నిటునవపుత్త్రపుత్త్రి, కలను గని ధన్య యయ్యెనీక్ష్మాతలమున.

క. నుతిగాంచె సుభద్ర యనన్, హితమతియౌ చిత్ర యంత నెంతయుఁ బుణ్యం
బు తగన్ ఫలించె నన నా, సతి దేవకియందుఁ బుట్టె శౌరి కరుణమై. 787

క. రేవతి రామునివలనన్, దా వరగుణుని శఠుఁ గాంచెఁ దద్వంశంబే
పావనమై తనరారెను, భూవినుతం బగుచుఁ గీర్తిపూతం బగుచున్. 788

వ. సుభద్ర యభిమన్యు నర్జునునివలనం గాంచె. అక్రూరుని భార్య యగు కాశికన్య సత్యకేతుం గనియె. వసుదేవునిభార్యలం దేడుగురుకనినపుత్త్రులు శూరులు. వారిపేరులు వచించెద. భోజ విజయు లిద్దఱు శాంతిదేవాతనూజులు. వృక దేవగదులు సునామ్నీపుత్త్రులు. వృకదేవి కగావహుండు తనయుండు. త్రిగర్త రాజకన్య శిశిరాయణుభార్య భర్తయం దీర్ఘకాలగలదగుటఁ బండ్రెండు వత్సరంబులు నియతయై యుండ మిథ్యాభిశస్తుండై యాగార్గ్యుండు క్రోధాతిరేకంబున నామెం ద్యజించి ఘోషకన్య గ్రహించి కామించినప్పుడు గోపాలి యను నచ్చర గోపకన్యావేషంబున గార్గ్యుఁ బ్రేమించి గర్భంబు ధరియించె. శూలపాణి యనుజ్ఞచే నామానుషియందుఁ గాలయవనుండు బలాధికుం డుదయించె. వాఁడు వృత్తపూర్వార్ధకాయుం డై సింహసంహననుండై రాజాంతఃపురంబున వర్ధిల్లె. యవనుం డగునాబాలుండు నీలనీరదతుల్యగాత్రుం డగుటఁ గాలయవనుండు నాఁబరఁగె. ఆతండె యుద్ధాభిలాషియై నారదు నడిగిన వృష్ణ్యంధకకులో త్పన్నుల నాతండు తెలిపె. అంత నక్షౌహిణీసేనం గొని మధురాపురంబు నావరించి దూతం బనుప వృష్ణ్యంధకులు శ్రీకృష్ణుం బురస్కరించుకొని మంత్రంబు సలిపి తత్కాలానుగుణం బగుటఁ బలాయనపరాయణులై యీశ్వరాజ్ఞను బాలించుచు మధురాపురంబు వదలి కుశస్థలి యగుద్వారవతిం జేరి సుఖంబుగ నివసించిరి. 789

## పదుమూఁడవ అధ్యాయము.

### జ్యామఘనృపాలచరిత్రము.

క. వినుఁ డింకఁ గ్రోష్టుసంతతి, ఘనుఁడౌ క్రోష్టువున కంతఁ గల్గెఁ గుమారుం
డనఁబడు వృజినీవంతుఁ డ,తనికిన్ స్వాహి యనుపుత్త్రు తల్లజుఁ డొదవెన్. 790

సీ. అతఁడును షద్గుపన్ సుతుఁ గాంచె నాతండు భూరిదక్షిణ లొప్పు పుణ్యమఖము
లెన్నియో యొనరించె నున్న తగుణుఁ బుత్త్రుఁ బడయఁగామదిలోనవాంఛపొదలఁ
జిత్రరథుం డనుస్థిరకీర్తి భూషణుఁ డుదయించె నాఘనుఁ డురుగుణాఢ్యుఁ
జైత్రరథుం గాంచె శశబిందు వాతనితనయుఁ డయ్యెను యశంబునఁ జెలంగు

తే. నాపృథుశ్రవుఁ డతనికి నాత్మజన్ముఁ
డయ్యె నంతరుఁ డవ్వాని యంగభవుఁడు
వానికి సుయజ్ఞుఁ డనునాత్మభవుఁడు గలిగె
నుషతుఁ డాతనిపుత్త్రుఁ డై యుర్విఁ బొదలె. 791

క. వానికి శినేయుఁ డనఁబడు, సూనుం డుదయించె వానిసుతుఁడు మరుతుఁ డా
భూనేత జ్యేష్ఠతనయుఁ, డా నొందెఁ సుగుణశాలి ధర్మమనీషున్. 792

తే. అతఁడు కంబళబర్హిషుఁ డనఁగ వెలసె, వాఁడు సత్సుతుఁబడయంగ వాంఛఁబూని
రుక్మకవచుని గనియె వైరుల నతండు, కవచధారుల నూర్వురఁ గడఁగి గెలిచె.

క. శితశరములఁ జెండి రిపుప్రతతిఁ బెగడొందఁ జేసి రమ చెలువారఁ
క్షితిఁ గీర్తిఁగాంచె నారాత్ముసుతుఁ డగుపరజిత్తు గెల్చె శూరుల రిపులన్. 794

క. పరజిత్తు పుత్త్రిపంచక, మురుతర తేజస్సమూహ మొగిఁ గనియెను న
చ్చెరువయ్యె వారిజన్మము, సురలకు దైత్యులకు నెల్ల క్షోణిజనులకున్. 795

వ. రుక్మేషు, పృథురుక్మ, జ్యామఘు, పాలిత, హరి నామంబులు వారికిం జెల్లె. అందు
బాలితహరినామకుల నిర్వుర విదేహరాజులు ప్రార్థింపఁ దండ్రి యొసంగె. రుక్మే
షువు రాజై పృథురుక్ముఁడు సహాయుండుగాఁ బ్రజలం బాలించుచుండి వైరా
గ్యసంపదచే సంసారంబెఁ ద్యజించె. జ్యామఘుండు తత్త్వాసంబున నలరె. అంత
బ్రాహ్మణులు బోధింప రుక్మేషువు మరల సంసారంబునం బ్రవేశించి ధనుర్ధరుండు,
కవచియు, ధ్వజియు, రథియు నై యన్యరాష్ట్రంబుపైఁ బోయి నర్మదాకూలం
బున నేకాకియై తిరుగుచు మృత్తికావతి మేఖలాపురిం జొచ్చి ఋక్షవద్గిరిని
జయించి శుక్తిమత్పురిం బ్రవేశించె నంత. 796

తే. జ్యామఘునిభార్య శైబ్య సత్యవ్రతయయి
యలరె ననపత్యుఁడై రాజు లలన వేఱొ
కతుకఁ బెండ్లాడఁ డయ్యె నొక్కతఱి సమర
మొప్ప విజయంబు నందుఁ డా నొందె మిగుల. 777

క. అందొక కన్యకఁ గని తన, సుందరినిం గానఁబోయి స్నుషగా దీనిఁ
బొందుమ యన నాశైబ్యయు, సందియమున నెవరి కిది స్నుషయగు మహీశా.

చ. అన విని జ్యామఘుం డనియె నాదృతి నీకు జనింపఁబోవుపు
త్త్రున కిది భార్యగాఁదగును దోయరుహానన దీనిఁ గావుమా
యనియె మునీంద్రులార! పతియానతి శైబ్యయు ఘోరవతా తపం
బొనరిచి పుత్త్రునిం గనియె నుర్వి విదర్భుఁ డటంచు నాతఁడున్. 799

క. వేరుం గని యాకన్యక, గారవమునఁ బెండ్లియాడి క్రథకైశికులఁ
శూరులఁ దనయుల నిర్వుర, నా రాజన్యుండు వినిహతారులఁ గనియెన్. 800

తే. మఱియు నిర్వురఁ దనయుల మానధనులఁ
గనియె నాద్యుండు భీముండు ఘనుఁడు వాని
తనయుఁ డయ్యెను గుంతినాఁ దనరు వాఁడు
సమరభీముండు ధృష్టి తత్సంభవుండు. 801

వ. ధృష్టికిఁ బరమధార్మికులు శూరులు నగు నావంత, దశార్హ, విషహారు లను మువ్వురు పుత్త్రులు గల్గిరి. దశార్హునకు వ్యోమనామకుండు తనయుండు; వానికి జీమూతుం డాత్మజుండు. వికృతి యాతనిపుత్త్రుండు. భీమరథుండు తత్సంభవుండు. నవరథుండు తత్తనయుండు. దశరథుండు తత్సూనుండు. శకునివాని కొడుకు. శరభుండు వానియారసుండు. దేవరాతుండు తత్సంతానంబు. దేవక్షత్త్రుండు వానిని జనకుం డనిపిల్చువాఁడు. దైవక్షత్త్రి తదంగసంభూతుండు. మధువంశకర్త కాఁగల మధుండనువాఁడు తజ్జనిం గాంచె. వానిభార్యయగు వైదర్భి పురుషవరేణ్యుం డగు పురుద్వంతుం గనియె. మఱియు మధుం డిక్ష్వాకుకులసంభూత యగు నొకనారీమణిం బెండ్లియాడి సర్వసుగుణమణిశేఖరుండగు సాత్వతుం గనియె. ఈవంశక్రమంబును వినిన సంతానంబు గలుగు. అధికైశ్వర్యంబు సంభవించు. 802

తే. సాత్వతునిపత్ని కౌసల్య సాధుమతుల, భాగి భజమాన నాముల భాసురాంగుఁ
డైన దేవావృధుని నంధకాఖ్యువృష్ణిఁ, గాంచె వారెల్ల వంశంబు మించ నెగడి.

క. నాలుగువంశంబులు తమ, శ్రీలలితయశంబు నిలుప క్షితి నభివృద్ధిన్
జాలఁగ నొనరించిరి ముని, పాలకులారా! వచింతుఁ బ్రమద మ్మిడఁగన్. 804

సీ. భజమానునకు నైరి భార్యలు సృంజయ యనునామెపుత్త్రికల్ హారిరూప
భాసుర లయి తగు వాహకయును నుపవాహక యనుపేరఁ బరఁగువారు
భర్త సంతోషింప బహుపుత్త్రులం గాంచి రందును గ్రిమియు మహాబలాఢ్యుఁ
డగు క్రమణుండును నట్టి ధృష్టుండును శూరపురంజయుల్ భూరియశము
తే. నొంది వెలసిరి వీరెల్ల నొగిని వాహ్య
కాత్మసంభూతు లని తెలియంగవలయు
నాయుతాజిత్తు పిదప సహస్రజిత్తు
వీరశతజిత్తు దానకుఁ డౌర యనఁగ. 805

క. ఉపవాహక సృంజయికిన్, దపనాయుతతేజులైన తనయులు సుండీ
కపటవిహీనుం డగుచున్, దపమున్ దేవావృధుండు తా నొనరించెన్. 806

క. మనమున సకలసుగుణనిధి, తనయుఁడు నాకొదవుఁ గాక తప్పక యని చే
సెను దపమును బర్ణాశయ, యనునదిజలముల స్పృశించి యనిశము భక్తిన్.

ఆ. పుణ్యనదియు నద్ధి భూపతికిన్ మేలు, చేయఁ దలఁచెఁ జింతచే నతండు
నిశ్చితాంతరంగనిర్మలుండుం గాక, 'పరితపించుచుండెఁ బట్టి కొఱకు. 808

చ. నరపతి మంగళాస్పదుఁడు నా కనుగమ్యతముం డటంచుఁ ద
త్పరమతియై తరంగిణియు భవ్యతమాకృతి మీఱుచుండఁ ద
త్పరిసరసీమఁ జేరె; నరపాలుఁడు నట్టిసతీలలామమున్
ధరఁ గవకుండెఁ బూర్వ మిటు తన్వియుఁ దానయిపోయి ప్రీతితోన్. 809

చ. అనుపమరూపసంపదల నాతనిచిత్తము పొంగఁ జేయుచున్
దనుఁగని మెచ్చురాజును నితాంతకుతూహలిఁ డా వరించె నా
వనిత నతండు గోరె నిటు వారక యిర్వుర కాత్మమోద మ
య్యె నవల గర్భమొప్పె సతి కెంతయు నాథుఁడు వేడ్కనొందఁగన్. 810

ఆ. తపము కలిమిఁ జేసి తద్గర్భ మురుతేజమున వెలింగె నెలలు మొగిని నిండె
దశమమాసమందుఁ దనయుని బభ్రుని, సకలసుగుణుఁ గనియె శైవలినియు. 811

మ. తనయున్ వానినిగూర్చి పూర్వసుకవుల్ తత్త్వంబు నీరీతి గీ
తినికాయంబున నెంచి రెట్టు లనఁగా దేవావృధుం డెట్టులో
తనయుం డట్టులె కీర్తనీయగుణసంతానుండు దూరంబునన్
వినినట్లే దరిఁజేర సాధుగుణముల్ వెవ్వేలుగాఁ గన్పడున్. 812

క. నరులందు బభ్రు వీడ్యుఁడు, సురతుల్యుఁడు వీనితండ్రి సురుచిరకుల మీా
ధరనొప్పు నఱువదార్గురు, సురతుల్యులె తనయు లనుచు స్తుతియింతు రొగిన్.

వ. యజ్వయై దానపతియై బ్రహ్మజ్ఞానసంపన్నుండై దృఢాయుధుండై బభ్రు వలరె. ఆతనియన్వయంబునఁ బెక్కండ్రుగురు వంశకర్తలుదయించి భోజసాత్వతనామంబులం బ్రఖ్యాతి నొందిరి. అంధకునివలనఁ గాశ్యదుహిత నల్వురు తనయులం బడసె. కుకుర, భజమానస, సకబల, బార్హిషులని వారలపేరులు. కుకురునకు వృష్టియు, వృష్టికిఁ గపోతరోముండును, వానికిఁ దిత్తిరియు, వానికిఁ బునర్వసువును, వానికభిజిత్తును, వాని కాహుకశ్రాహుకులను నిర్వురును గొడుకులైరి. ఆహుకుంగూర్చి యొక గాథను బూర్వమునులు వచింతురు. 814

తే. శ్వేతపరివారయుక్తుఁడై సింహశాబ
కప్రతిముఁ డయి యెనుబదిగాఁ జెలంగు
వర్మములఁ గూడి యాహుకవసుమతీశుఁ
డరుగుఁ బరరాజభూముల నాక్రమింప. 815

తే. సంతతివిహీనుఁడై శతసంఖ్యలకును, బూజసలుపక యయుతాబ్దములు బ్రదుకక
శుద్ధకర్ముఁడుగాక విశుద్ధయజ్వ, గాక యుండఁడు తత్సేవకతతి నొకఁడు. 816

సీ. భోజుఁ డౌనాహుకభూపాలు నేనుంగు లొకసహస్రం బింద్రుఁ డున్నదిశకుఁ
బోవును శశిబింబమును స్పృశించెడుధ్వజంబుల నొప్పి మేఘధ్వనులను మించు
శబ్దముల్ వెలయు సుస్యందనంబులు వేయి పదు లేగు రిపులదోర్బలము నడఁపఁ
గాంచనరజతకక్షముల నిర్వదియొక వేయిరథంబులు విమతతతుల

తే. నడఁప నుత్తరమున కేగు నార్యులార, జ్యాలతాంకితకరులయి సమదశత్రు
సూదనులు నగుభోజులు క్షోణి నెల్ల, నిండి ప్రజలను బ్రోచి రఖండరీతి. 817

వ. అంధకరాజు లావంతిదేశప్రభువునకుఁ దమస్వస నిచ్చి రని తెల్పుదురు. ఆహుకునకుఁ గాశీదేవీయందు నిద్దఱుతనయులు గల్గిరి. దేవకోగ్రసేనులని వారిపేరులు.

దేవకునకు దేవతుల్యులగు నలువురుకొడుకులు గల్గిరి. దేవవంతుఁ డుపదేవుండు సందేవుండు, దేవరక్షితుండు నని వారిపేరులు కొమరితలేడ్వురు. వారిని వసుదేవున కొసంగె. దేవకియు, శాంతిదేవియు సుదేవయు, దేవరక్షితయు, వృకదేవియు, నుపదేవియు, సునామ్నియు నని వారిపేరులు. ఉగ్రసేనునకుఁ దొమ్మండ్రుగురుకొడుకులు. అందుఁ బూర్వజుండు కంసుఁడు.న్యగ్రోధుఁడు, సునామకుండు, కంకసుభూషణులు,రాష్ట్రపాలుండు, సుతనువు,నానావృష్టియుఁ, బుష్టిమంతుండు నని వారిపేరులు.వారితోఁబుట్టువులైదుగురు. కంసయుఁ, గంసవతియు, సుతనువు, రాష్ట్రపాలియుఁ, గంకయు నని తన్నామధేయంబులు. ఉగ్రసేనుండు సాపత్యుండుగఁ గుకురోద్భవుం డని కీర్తింపఁబడియె. ఆతండు కుకురవంశోద్ధారకుండై ప్రజావంతుండై యశంబు గడించె. 818

---

## పదునాలవ అధ్యాయము.

### స్యమంతకమణిచరిత్రము.

క. మునులారా! భజమానుని,తనయుండు విదూరథుండు తద్దయు ఖ్యాతిం
గనియెను వానికి శూరుం, డనబడు రాజాధిదేవుఁ డాత్మజుఁ డయ్యెన్. 819

సీ. అతనికిఁ బుత్త్రులై యతివీర్యవంతులై
దగిరి దత్తుం డతిదత్తుఁ డల్లె
శోణాశ్వుఁడును మహాశూరుఁడా శ్వేతవా
హనుఁడును శమియు సద్యశమునఁ దగు
దండశర్మయు మఱి దంతశత్రుండును
శత్రుజిత్తును సప్తసంఖ్యులైరి
శ్రవణాశ్రవిష్ఠలన్ సద్గుణయుక్తలౌ
తనయులు గల్గిరి మునివరేణ్యు

తే. లార! శమి యనువానికి భూరితేజుఁ
డగు ప్రతిచ్ఛత్త్రుఁ డాత్మజుం డయ్యె నతని
కొమరుఁ డయ్యె స్వయంభోజుఁ డమితబలుఁడు
వానికి హృదీకుఁ డనుపుత్త్రవర్యుఁ డలరె. 820

వ. వానికొడుకులు భీమపరాక్రములు. అందుఁ గృతవర్మ జ్యేష్ఠుండు. శాంతధన్వుండు మధ్యముండు. వారిద్దఱివెనుక దేవాంత నరాంత భిషగ్వైతరణ, సుదాం, తాతిదాంత, నికాశ్య, కామదంభను లనువారు గల్గిరి. దేవాంతకునకుఁ గంబలబర్హిషుం డనుకొడుకు కలిగె. వాని కసమంజసుండు తనయుండు. వానివెనుక నాసమౌజసుండు కలిగె. సుదంష్ట్ర, సుబారు, కృష్ణు లనువా రంధకులు. గాంధారి బలశాలియగు ననమిత్త్రునిం గాంచె. మాద్రి యుధాజిత్తుని

దేవమీఢుషునిం గాంచె. అనమిత్రుం డమిత్రనాశకుండై యపరాజితుం డనం
బ్రఖ్యాతిం గనియె. వానికి జహ్నుండను కుమారుం డొదవె. అతనికిం బ్రసేన
సత్రాజిత్తులను నిరువురు కొడుకు లుద్భవిల్లిరి. 821

క. వినుఁ డిం దనుజుఁడు ద్వారవ,తిని వాసముగాఁ దలంచి దివ్యప్రభలన్
గనెడు స్యమంతకరత్నం,బును దుర్లభతమము ప్రీతిఁ బొందె రవికృపన్. 822

చ. అతనికిఁ బ్రాణతుల్యుఁ డయి యంబుజమిత్రుఁడు పొల్చె దాన నా
క్షితిపతి సూర్యభక్తుఁడయి చెందెడువేడ్క నిశావసానమం
దె తరలి దివ్యమౌ రథము నెక్కి తరంగిణియందు నర్ఘ్యమి
చ్చుతమిని బోయెఁ గృత్య మది సూర్యహితంబయి యొప్పఁ గావునన్. 823

చ. ధరణిపపుత్త్రుఁ డీకరణిఁ దన్నొగిఁ దృప్తుని జేయ రాఁగ భా
స్కరుఁ డుదయించి స్వీయకరజాలము చెల్వువహింపఁ బొల్చె భ
క్తిరతిని నాకుమారుఁడు మదిం దమి పొంగఁగ భానుఁ గాంచి యీ
కరణి వచించె వ్యోమమున గాఢమయూఖుని నిన్ను నెప్పుడున్. 824

క. కనుచుందు నెదుటఁ దోఁచిన, నిను నల్లే కాంచువాఁడ నిర్మలధిషణా
వినుమీ శరణార్థిని నగు, ననుఁ జేకొని కాతు వని మనంబున నిన్నున్. 825

ఆ. తలఁచుచున్న నాకుఁ దత్సహాయం బేమి, కలదొ దర్శనమునఁ గలుగు నెట్టి
ఫలమొ తెలియఁజాల భాస్కరా యన విని, లోకబాంధవుండు శ్రీకరుండు.

క కరుణించి స్యమంతకమణి, వరము స్వకంఠమునుండి వదలించి మనో
హర మిది యని యేకాంతము,న రాజపుత్త్రునకు నిచ్చె నరపతి యంతన్. 827

చ. తనువు ధరించి ప్రీతిఁ దనదాపున నొప్పెడుభానుఁ గాంచి యో
వనరుహమిత్ర! నీకరుణ వర్ధిలె నాపయి నంచు నంత ప
ల్కి నిలిచి తాఁ జనం దలఁచు కేవలకారుణికోత్తమున్ రవిం
గని మరలన్ వచించెఁ గలకాలము నేమణిభూషితుండవై. 828

క. జగముల భాసిలఁ జేసెదొ, ఖగనాయక యీస్యమంతకము నాకొసఁగం
దగునంచుం బ్రార్థించెదఁ, దగదే యీభవ్యరత్నతల్లజ మొసఁగన్. 829

చ. అన విని యాప్రసేనుఁ గని యాదృతి నీమణి నీకొసంగితిన్
గొను మిదె యంచు నేగె నృపకుంజరుఁ డమ్మణిఁ దాల్చి ద్వారకం
గనఁ జనెఁ బౌరు లానృపతిఁ గాంచి యిదే రవి పోవుచున్నవాఁ
డని వెనువెంట నేగిరి మహత్తరమోదము పొంగుచుండఁగన్. 830

ఆ. అంత నాధరాధిపాత్మజుం డంతఃపురమున కేగి కాంతిరాజిత మగు
నాస్యమంతకంబు నాత్మసోదరునకుఁ, బ్రీతి మీఱ నిచ్చె వింత గనఁగ. 831

చ. కనకము నిత్య మీనుచును గ్రాలెను దద్గృహమందు రత్న మం
త నిరతవృష్టి యాజనపదంబునఁ గల్గఁగఁ జేసె నింద్రుఁ డా

త్రిని గనవైరి భూజనులు దీనతఁ గాంచరు దేన నైన వ్యా
ధిని గనువాఁ డొకండయిన దేవునకుం గనరాఁడు చూడఁగన్. 832

తే. రత్న మద్దానిఁ బడయంగ యత్నమైనఁ
జేయఁడయ్యె ముకుందుఁడు సిద్ధశక్తి
యలరు చుండినవాఁడయ్యు నాత్మ నైనఁ
దలఁపఁ డయ్యెను నవల భూధవసుతుండు 833

మ. ఒకనాఁ డానృపసూనుఁ డామణివరప్రోద్భాసితగ్రీవుఁ డై
సకలస్వీయజనాళిఁ గూడి మృగయాసంసక్తిమైఁ బోయెఁ గా
నకుఁ దద్రత్నముఁ గాంచి యాసపడి భూనాథాత్మజుం జంపె భీ
తికరధ్వానముతో మృగేంద్ర మొకటం దీవ్రప్రతాపంబునన్. 834

శా. భూనాథాత్మజుఁ జంపి యమ్మణివరంబుం గొంచు సింహంబు స్వే
చ్ఛానూనత్వరఁ బాఱ భల్లుకవరుం డారత్నముం గాంచి య
ద్దానిం గైకొనఁబూని బాహుబలమంతం జూపి చక్కాడి భూ
జానుల్ దాల్పఁగఁజాలు నమ్మణిని హృత్సంతోష మేపాఱఁగన్. 835

క. తలఁదాల్చి యాత్మగుహకుఁ, జెలఁగుచు వేపోయె నంత శ్రీకృష్ణుం డి
మ్ముల దానివేఁడుటయుఁ గా,నలలోనఁ బ్రసేనుఁడు యమునగరికరుగుటల్. 836

ఆ. చాలదూర మెంచి శంకించి రీకృష్ణుఁ
డితనిఁ జంపి యుండు నిందు నరయఁ
గారణంబు మణియె కాఁదగు నని యంత
జనులసంశయంబుఁ జక్రి యెఱిఁగి. 837

చ. మనమున ధర్మ మూని మతిమంతుఁడు కావున నీస్యమంతముం
గొని చనుదెంతునంచు జనకూట మెఱుంగఁ బ్రతిజ్ఞచేసి తాఁ
జనియెను గాఱు కానకు నెసంగెడు పౌరుష మొప్ప నెందు నా
తని మృగయాప్రకారము నితాంతము సాగెనొ యచ్చటుం గనన్. 838

క. చరణము లిడినమహీస్థలిఁ, బరికింపఁగ నేర్పుగలుగువారలతోఁ స
త్వరగతిని ఋక్షవద్గిరి,వరమున్ వింధ్యాచలంబు వరుసం గనుచున్. 839

చ. అరిగి శ్రమంబునం దనదునంగము లార్తి మునుంగ నొక్కచోఁ
దురగముతో మృతిం గనిన ధూర్తుఁ బ్రసేనుని గాంచి యందు న
వ్వరమణిఁ గానలేక పలుభంగుల నారసి చెంత నొక్కచో
హరియును భల్లుకాభిహతి నంది మృతిం గనియున్న సింహమున్. 840

క. కని భల్లుకపదములగు,ర్తును గాంచుచు దానిఁబట్టి తోడనె పోయెన్
వనజాక్షుఁడు భల్లుకవస,తిని గన నాగృహము ముందుఁ దిన్నగ నిలిచెన్. 841

చ. వనిత యొకర్తు దివ్యముగఁ బాడుచు నుండఁగ నాలకించెఁ జ
క్కనినినదం బటంచు నటఁ గాంతయు దాదికరంబునుండి త
మ్ముని నలజాంబవంతునకు ముద్దుతనూజుఁడు గాఁ జెలంగువా
నిని గడుఁబ్రీతి వాక్యములనేర్పున నాటలఁ దేల్చుచుండెఁ దాన్. 842

క. ప్రచురమణితోడఁ గ్రీడిం,చుచునుండెను ధాత్రి యంత శూరమృగేంద్రం
బు చరించుచు రాకొమరుని, నచటఁ బ్రసేనున్ వధించె నాసింహంబున్. 843

క. ఘనబలుఁడు జాంబవంతుం,డని మొన వధియించి తెచ్చె నమలమణివరం
బును దీని స్యమంతకమును, గొనుమా నీయాట కిద్ది కొమరుగ నుండున్. 844

చ. అని పలుకంగ నానుడుల నమ్మురవైరి యనూనభంగిమై
విని వెసఁ జొచ్చె నాబిలము వేడ్కయ పోలె గుహాముఖంబునన్
దనబలనాథులన్ హలిని దారుణశత్రుభయంబు గల్గకుం
డ నునిచి లోనఁ జొచ్చి యచటన్ గనియెన్ ఘనుజాంబవంతునిన్. 845

మహాస్రగ్ధర.—
ఘనబాహాశక్తిమీఱన్ గడువడి మెఱయన్ గాఁ జలం బెంతొ పొంగన్
వనజాక్షుం గాంచి ఋక్షప్రవరుఁడు గదియన్ వాసుదేవుండు తా నా
తనితోడం బోరె బాహూద్ధతబల మడరన్ ధైర్య మాశ్చర్యదంబై
కనుపట్టన్ బూన్కి యొప్పంగను మణివరమున్ గైకొనం జిత్తముబ్బన్. 846

క. ఇరువదియొక్కదినంబులు, వరుసన్ బోరాడుచుండ వాకిటఁ గాఁపై
ద్వరపడు హలధరముఖ్యులు, పరనిహతుం డయ్యె దనుజవైరి యటంచున్. 847

చ. తలఁచుచు నుస్సు రంచుఁ జని ద్వారవతిం బొడఁగాంచి తమ్ముఁడే
విలయము నొందె నంచు విధి వేయివిధంబులఁ దిట్టుచున్ జనం
బుల కిటులయ్యె హా యనుచుఁ బొక్కుచుఁ బల్కుచు నుండి రంతఁ ద
ద్బిలమున జాంబవంతుని సువిస్తృతపౌరుష మొప్పుచుండఁగన్. 848

క. ధరణిఁ బడవేయ వడఁకుచు, శరణు దయావార్ధి! భక్తజనపాలక! నీ
కరుణకుఁ బాత్రుఁడ నన నా,దరమునఁ గాపాడి యతని తనయామణినిన్. 849

తే. కాన్కఁగా నీయ గ్రహియించెఁ గంజనయనుఁ
డతులభక్తి స్యమంతక మాతఁ డీయఁ
గరము ముదమంది చేకొని కమ్రభణితి
జాంబవంతుని సమ్మదస్వాంతుఁ జేసి. 850

క. బిలమును మణితో సతితోఁ, జెలఁగుచు విడనాడి తనదుసేనాసంఘం
బులఁ బోక మిగిలియున్న భ,టులతోడం బత్తనముఁ గడున్ వడిఁ జొచ్చెన్.

క. తనపై మోపిన యపయశ,మును నీగతిఁ దొలఁగ రత్నమును గైకొమ్మా
యని యిచ్చెను సత్రాజి,త్తునకున్ సభవార లెల్లఁ దొలఁగక కనఁగన్. 852

క. మునులారా! మిథ్యానిం,దను శత్రునికృంతనుండు దామోదరుఁ డొ
ప్పినయట్లు రత్నలాభం,బున మానుపుకొనియెఁ జూచి పురజను లలరన్. 853

సీ. వినుఁడు సత్రాజిత్తువనితలు దశసంఖ్య నలరి రాభార్యలయందు నతఁడు
శతపుత్త్రిలం గాంచె సర్వవిధంబుల ఖ్యాతి నొందిరి ముప్వు రందు భంగ
కారుఁడే వారి కగ్రజుఁడయి తనరారె వాతమతియుఁ దరువాతివాఁడు
వసుమేధసుఁడు వెన్కవాఁ డయ్యె నతనికిఁ దరువాతివారెల్లఁ దలఁప నిట్లు

ఆ. పేరుకల్గువారు గారు కుమారికల్, ముపురు దిశలయందు ప్రాయువినుతి
గల్గువార లిట్టికన్యకామణులందు, సత్యభామ యగ్రజ యగుఁజుండి. 854

వ. దృఢవ్రతయుఁ బ్రస్వాపినియు నామె యనుజాతలు. సత్యభామ నాతండు శ్రీకృష్ణున కొసంగె. భంగకారునకు సభాక్షునాదేయులను నిరువురు తనయులు గలిగిరి. వారు రూపగుణపౌరుషంబులం బ్రసిద్ధిం గాంచిరి. వృష్ణి భార్యయగు మాద్రియందు యుధాజితుం డుదయించె. మరల నావృష్ణికి శ్వఫల్క చిత్రకు లుదయించిరి. శ్వఫల్కుండు కాశిరాజకుమారికం బెండ్లియాడె. ఆమె గాందిని యనునామంబునఁ బ్రసిద్ధివహించినకూఁతుం గనియె. ఆమెను గాశ్యుం డను వాని కొసంగె. ఆమె శ్రుతవంతుం డనుకుమారుం గనియె. అక్రూరుండు భూరి దక్షిణల నొసంగి క్రతువు లనేకంబు లొనరించి తనయుల నుపమద్గు, మద్గు, మద, రారిమర్దనుల, నారిక్షేపాక్షేపశత్రుహుల, నరిమేజయ, ధర్మభృ, ద్ధర్మ, గృధ్ర, భోజాంధకుల, నావాహప్రతివాహులను, సుందరి యనుకూఁతుం గనియె. ఆమె వసుంధర యనునామాంతరంబున నొప్పి విశ్రుతాశ్వునకు మహిషియై విఖ్యాతి నొందె. మఱియు నక్రూరుం డుగ్రసేన యనుపత్నియందుఁ గులోద్ధారకు లగు వసుదేవోపదేవులను నిరువురఁ దనయులఁ బడసె. చిత్రకునకుఁ బృథువిపృథులు, నశ్వగ్రీవాశ్వబాహువులు, సుపార్శ్వకగవేషణులు, నరిష్టనేమియు, ధర్మ, ధర్మభృ త్సుబాహుబహుబాహు లను పుత్త్రులుఁ గల్గిరి. శ్రవిష్ఠయు శ్రవణయు నను నిర్వురుపుత్త్రిక లుద్భవిల్లిరి. మునులారా! మిథ్యాభిశస్తిని దెలుపునీకథ మిథ్యాపవాదభయంబుఁ దొలఁగించు నని చెప్పి లోమహర్షణుండు మరల నిట్లనియె. 855

## పదునేనవఅధ్యాయము.

సత్రాజిత్తు స్యమంతకనిమిత్తము చంపఁబడుట.

క. సురుచిరమైన స్యమంతక,నిరుపమరత్నంబు నీలనీరదరుచియై
పరఁగెడుహరి యొసఁగె మహో,దరమున నాసత్యభామతండ్రికి నంతన్. 856

క. దానిం గొన శతధన్వుఁడు, మానసమున నెంచె హరియు మానినిమణియై
తా నలరుసత్యభామను, బూనెం బత్నిగ గ్రహింపఁ బొంగెడుకాంక్షన్. 857

తే. అతనికాంతఁ సత్రాజిత్తు హర్ష మలర
నెఱిఁగి తా నిచ్చెఁ గోమరిత నిది తగు నని
యంత నక్రూరుఁ డమ్మణి నపహరింపఁ
దలఁచె శతధన్వుఁ డుద్దామదర్ప మొప్ప. 858

క. రాజకులాలంకృతు స,త్రాజిత్తును జంపి రత్నతల్లజమును వి
భ్రాజితుఁ డగునక్రూరున, కేజనునకుఁ దెలియకుండ నిచ్చెం బ్రీతిన్. 859

క. వరమణిఁ గొని యక్రూరుం, డరాతిభయదుండు నయ్యు హరిభీతిని జం
కి రయమ్మున శతధన్వుని, బరికించి యొనర్చె నొక్కపద్ధతి సరిగన్. 960

క. నే నీకెఱుఁగం దగ నిఁక, భూనాయక కృష్ణువలన భూరిభయంబుల్
గానంబడు నీమణిచే, నీనగరం బెల్ల నాకు నెంతయు వశమా. 861

చ. జనకుఁడు మృత్యువుం గనఁగఁ జాలఁ దపించుచు సత్యభామ నె
మ్మనమునఁ గల్గుక్రోధమున మాధవుఁ జూడ రథంబు నెక్కి తాఁ
జనియెను హాస్తినాపురికిఁ జక్రి నటం గని భోజకృత్యముల్
వినునటు చెప్పె దుఃఖపరివీతమతిన్ విలపించె నార్తయై. 862

చ. హరియును బంధుసత్తముల కందఱకున్ విధిఁ దర్పణంబు లా
తురమతియై యొనర్చి తనతోఁ జనుదెంచిన సాత్యకిన్ యుధి
ష్ఠిరముఖులైన బంధులకుఁ జేయఁగనైన సహాయ మొప్పు న
ట్లరసి యొనర్పు నుంచి జవమారఁగఁ జేరెను ద్వారకాపురిన్. 863

మ. తనయన్నన్ హలిఁ గాంచి ప్రశ్రయ మెదం దళ్కొత్తుచుండం బ్రసే
నుని సింహంబు వధించెఁగాదె శతధన్వుం డల్కఁ దద్భ్రాతఁ జం
పెను వింటే యిఁక నాస్యమంతకము త్వద్బృందాభిరామంబు నా
దనియే నమ్మెద భోజుఁ జంపి కయికో నా నద్ది యట్లాటచేన్. 864

చ. అరదము నెక్కవయ్య జవమారఁగ నాశతధన్వుఁ గిట్టి సం
గర మొనరింపఁగాఁ దగును గమ్రతరంబగు నాస్యమంతముల్
గురుభుజశక్తిఁ దేఁ దగును గొంకక పోఁదగు నస్మదీయమై
పరఁగెడుఁగాత మద్ది యన భ్రాతృవచఃపరిచోదితాత్ముఁడై. 865

ఉ. స్యందన మెక్కి తోడఁ జనెఁ జక్రికిఁ బ్రాపయి నీలచేలుఁ డం
తం దుములాహవం బట సుదర్శనధారికి భోజుతోడ న
య్యెం దగ; నంత భోజపతి యేర్పడ రత్నము గొన్నమిత్రునిన్
గ్రందుగ నొప్పు సంగరముఖంబున నెల్లెడఁ జూచె నార్తుఁడై. 865

ఉ. భూరితరాహవం బచట భోజజనార్దను లేచి చేయ న
క్రూరుఁడు గాంచి పాయపడఁ గొంకుచు శాపము గల్గునే మొ యం
చారసి యూరకుండెను; జనార్దనుబారికి నిల్వలేక యా
భూరమణుండు భోజుఁ డొగిఁ బొంకముఁ బాసి తొలంగి పర్విడెన్. 867

క. శతయోజనములు చక్రియుద్ధతిఁ దలఁచుచుఁ బోయెఁ దురగతల్లజయుతుఁడై
శతయోజనగామిని యా,నతనితురంగంబు హృదయ యనుపేరఁ దగున్. 868

ఆ. ఆఁడుగుఱ్ఱ మద్ది యాతఁ డద్దానినే, యెక్కి చక్రితోడ నింతసేపు
సంగరంబుఁ జేసెఁ జక్రాయుధుండును, గూడఁ బాఱెఁ బట్టఁ గోరి యతని. 869

క. శతయోజనములు పరుగిడి, యతిశయ మగుశ్రమము నొందె నశ్వమ్మనుచున్
మతినెంచి రథస్థుండై, శితశరములఁ జక్రి యతనిచేవ నడంచెన్. 870

చ. వడివడిఁ బాఱి వైరి ఘనబాణకృతవ్యథఁ జాల నొచ్చి యా
బడబయు నేలఁగూలె నసువంచక మేగెను స్వర్గసీమకున్
దడయక చక్రి యిట్లనె రథస్థుని నన్నను జూచి వైరియున్
జడత వహించె నిల్వు మిటఁ జయ్యన నేఁజనువాఁడఁ గాల్నడన్. 871

చ. తురగము లివ్వియున్ మిగులఁ ద్రోవను దాఁటుట నొచ్చియున్న వి
త్తరుణమునందుఁ బర్విడఁగఁ దార్కొనఁ జాలవు నేన పోయి యా
నిరుపమరత్నముం గొనుచు నిన్గనవచ్చెద నంచుఁ బల్కి తాఁ
బరుగిడె భోజుఁడున్ మిథిలప్రాపున కేగెఁగఁ జేరె నాతనిన్. 872

క తగునే యిట్టు లొనర్పఁగ, మగవాఁడవ యేని నిల్వు మాతో మిగులం
బగఁగొంటి వెండుఁబోవఁగఁ, దగుదు వటం చాడి యస్త్రతతి నని నొంచెన్.

క. రిపుని వధియించి యంతట, నిపుణముగాఁ జూచె నందు నిర్మలరత్నం
బపు డగపడ దయ్యెను జక్రపాణియున్ వేగ వచ్చె రామునికడకున్. 874

క. తనకడఁ జేరినసోదరుఁ, గని లాంగలి రత్న మిమ్ము కాంచెద నన లే
దనియెం గృష్ణుఁడు దానం, గనలుచు ధిగ్ధిక్పదాళిఁ గడువెడలంగన్. 875

క. పలికెం గృష్ణా! తగు నిటు, పలుకన్ సోదరుఁడ వౌఁట బాగా నిది నీ
కెలమిం గల్గుత మిఁక నెగ్గులు పల్కక పోవు వాఁడఁ గోరినయెడకున్. 876

క. ద్వారకతో వృష్ణులతో, నారయ నీతోడఁ గృత్య మనునది నాకీ
ధారణి లే దిఁక ననుచున్, భూరిక్రుధ మిథిలఁ జొచ్చెఁ బొంక మెడలఁగన్.

క. అతనిం గని భయభక్తుల, క్షితిపతి మైథిలుఁడు పూజచే నలరించెన్
జతనమున బభ్రు వాయెడఁ, గ్రతువుల నానాహ్వయములఁ గావించె విధిన్.

క. దీక్షామయకవచంబును, రక్షార్థము దా ధరించె రత్నము తనదౌ
సుక్షేత్రంబుగ నుండఁగ, నాక్షోణీశుండు గాందియాత్మజుఁడు సుఁడీ. 879

క. నిరుపమరత్నధనంబుల, ధరణీసురతృప్తికొఱకుఁ దాను బహువిధా
ధ్వరములయం దర్వదివత్సరములు దానంబు చేసె ధర్మాత్ముండై. 880

క. వినుఁ డక్రూరముఖంబులు, ఘనతమము లటంచు ఖ్యాతిఁ గాంచె నవియు నే
ర్పునఁ బెట్టునన్నమునఁ దృప్తిని జేసెడు దక్షిణలను వెలఁగొందించెన్. 881

చ. హాలి మిథిలాపురంబున మహాత్తరపూజల నందుచుండుటల్
దెలిసిన నాసుయోధనుఁడు తీవ్రతరంబగు భీమసేను దో
ర్బలముఁ దలంచి యాహాలి నరాతినిషూదనుఁ జేరఁబోయి ని
స్తులము గదాపరిశ్రమము దుష్టహరం బగుఁగాన దానినిన్. 882

క. కరుణించి నేర్పు నాకని, పరిపరివిధములను వేఁడ బాగుగ నేర్పెన్
హరిసోదరుఁ డంతట సోదరుఁ గానఁగఁబోయె బంధుతతితో హరియున్. 883

క. కని యందు నీలచేలుని, ననూనసంభాషణముల నలరించి జవం
బునఁ దోడితెచ్చె ద్వారక, కనుపమమగుశక్తిమీఱ నక్రూరుండున్. 884

తే. నిద్రపోవుసత్రాజిత్తు నిఖిలబంధు,వితతితోఁ జంపి యంధకయుతుఁడయి పురిఁ
బాసెఁ బెనుభీతి నంతట బంధుభేద,భయముచేత నుపేక్షించె వాని హరియు.

క. చనె నెపు డక్రూరుఁడు శక్రునిఃంపున మేఘవితతి కుంభిని వర్షం
బును గురియకుంట రాష్ట్రంబున క్షామభయంబు చెలఁగె భూతభయదమై. 886

చ. జనపదరాజి క్షామమున సన్నగిలం గుకురాంధకుల్ జవం
బునఁ జని వేఁడి ద్వారవతిఁ బొందఁగఁ జేసిరి; దాననాథుఁ డై
తనరు నతండు రాఁ గురిసెఁ దక్షణమాత్రన పాకశాసనుం
డనునయ మొప్ప నాజ్ఞ నిడ నబ్దసమూహము భీమనాదమై. 887

క. తనతోఁబుట్టువు శ్రీకృష్ణున కిచ్చెను బ్రీతుఁ జేయ క్షోణీసురహా
నినిచయము మేలు మేలన, మనమున శ్రీకృష్ణుఁ డంత మణివరవార్తన్. 888

క. పరికించి బభ్రుగత మని, యరసి మహాయోగనియతి నక్రూరుసభా
పరిగతుఁ గని యిట్లనియెన్, వరమణిని స్యమంతకమును వారనికరుణన్. 889

క. నీయొద్ద నున్నదానిని, నీయెడ నా కీయవయ్య యించుకయైనన్
నాయందుఁ బ్రీతియుండిన, నా యిట్టియనార్యకము జనంబుల కెల్లన్. 890

క. తొలఁగి చనఁజేయు మీవని, పలుకుచు మఱియున్ వచించె వత్సరషష్టిన్
గల నాయారోప మ్మెద, నిలిచెన్ వేఱూని దాని నిల్వకయుండన్. 891

క. ఒనరింపు కాల మెంతో, చనియెఁగదా యన్న నంతఁ జక్రధరునిప
ల్కులను విని బభ్రువు సాత్వతు, లనుచయ మొప్పారఁ జూడ నమ్మణివరమున్.

తే. ఒసఁగె సభలోనఁ గృష్ణున కురుముదంబు
పొదల; నవ్వల నద్దాని సదయుఁ డగుచు
బభ్రు వీయ గ్రహించి యవ్వాసుదేవుఁ
డొసఁగె మరలను రత్నంబు నూహ చెలఁగ. 893

చ. హరికరదత్తమైనమణి నాదృతి గాందినిపుత్త్రుఁ డై ధరా
వరుఁడగుబభ్రు వప్పుడ సభాస్థలిఁ గంఠమునందుఁ దాల్చి భా

స్ఫురదనఁగా వెలింగె సభఁ గల్గుజనుల్ వెఱఁగంది చూడ శ్రీ
హరికరదత్త మేనయిన నద్భుతదాయకమై చెలంగ దే. 894

---

## పదునాఱవ అధ్యాయము.

### భూగోళప్రశంస.

చ. అన విని మౌను లిట్టు లని రార్యవరా! కరుణాంతరంగ మొ
ప్పను వచియించినారు కద భారతదేశజనిం జెలంగు పా
వనన్నృపనాథసచ్చరిత వ్యాళకదంబకరాక్షసాళిదే
వనికరదైత్యదానవుల వర్ణ్యచరిత్రము నానుపూర్విగన్. 895
తే. సిద్ధగుహ్యకగంధర్వచిత్రచరిత,ములను దద్ధర్మలక్షణంబులను వారి
జన్మరీతుల గాథల సర్గభంగి, నెఱుఁగఁజెప్పితి వున్నట్టు లేర్పడంగ. 896
సీ మఱియుఁ బ్రజాపతిమండలగుహ్యకాప్సరసలస్థావరజంగమముల
యుత్పత్తిఁ జెప్పితి వొప్పుగ వింటిమి సత్పురాణంబును శ్లక్ష్ణవాక్కు
లలరఁ గర్ణమనస్సుఖావహంబుగ నమృతాభవతా చరితంబు నమలధిషణ
యిప్పుడు వినఁగ మే మెంచితి మీపృథ్వీమండలచరితంబు మామకమగు
తే. ప్రశ్నమును దీని నాలించి బదులుచెప్ప
వలయు నీవిషయము విన వాంఛ యలరె
సాగరము లెన్ని ద్వీపవర్షము లవెన్ని
పర్వతము లెన్ని పావనవనము లెన్ని. 897
క. నిరుపమదేవాలయస,త్సరిత్తు లవి యెన్ని భూవిశాలాదిక మె
క్కరణిని లెక్కింపం దగు, స్థిర మేయాధార మూని చెలఁగునొ చెపుమీ.
తే. దీనిసంస్థానమెట్టులు తెలియఁదగునొ, యున్నదున్నట్లు చెప్పుమా యన్నసూతుఁ
డో మహామునులార! మీయుద్యమంబు, తెలిసె సంక్షేపముగ దీనిఁ దెల్పువాఁడ.
క. అతివిస్తృతిఁ జెప్పంగా, శతవత్సరములకునైన శక్యం బగునే
హితమగుభంగిం జెప్పెద, క్షితిదేవమునీంద్రులార! చెచ్చెఱ వినుఁడీ. 900
సీ. అలరు జంబూప్లక్షములు శాల్మలమును గుశ, క్రౌంచ, శాక, పుష్కరము లనెడు
నివి యేడుద్వీపంబు లేడుసంద్రంబుల నావృతములయి యొప్పారుచుండు
జలధులు లవణేక్షువులు సురాసర్పిర్దధులు దుగ్ధజలములు వెలయు మఱియు
వినుఁడు జంబూద్వీప మనునది ద్వీపాళిమధ్యస్థమై తనమహిమ సాటి.
తే. యనునదియె లేక యలరారు నందు మేరు
వనుకనకపర్వతమ్ము చెన్నారు దాని
యుచ్ఛ్రియం బెనుబదినాల్గుయోజనంబు
లది పదాఱుయోజనములయంత క్రింద. 901

క. చోరఁబడి యుండును దద్గిరి,వరమూర్ధము విస్తరమున ద్వాత్రింశత్సం
ఖ్య రహిఁ యోజనముల నం,బరమున వ్యాపించు రుచులభాసుర మగుచున్.

వ. మూలంబు షోడశసహస్రయోజనమితంబు. ఆయామం బంతియ. భూమి యను కమలంబునం దది కర్ణికాకారాకృతి నొప్పుచుండు. దానికి దక్షిణంబున హిమవంతంబు, హేమకూటంబు, నిషధంబు ననుపర్వతంబులు గలవు. ఉత్తరంబున నీల శ్వేత శృంగవద్భూధరంబు లలరు. రెండులక్షలయోజనంబుల యంతరంబు గలవి రెండును, దొంబది వేల యోజనంబుల యంతరంబుగలవి తక్కినవియునై యుండు. అవియన్నియు ద్విసహస్రయోజనోచ్ఛ్రాయంబుగలిగి యంతవెడల్పు గలిగియుండు. మఱియును. 903

సీ. భారతం బాద్యమౌ వర్షంబు కింపురుష హరివర్షమ్ము లాశైలరాజ
దక్షిణంబుగ నుండు దానికి నుత్తరమహి రమ్యకము హిరణ్మయము లనెడు
వర్షముల్ చెలఁగును బంగరుకొండకు భారత మెట్టులో సారభూత
కురుదేశములును నాక్షోణిని భాసిల్లు వీనియంతరభాగ మౌను దలఁప

ఆ. నవసహస్రయోజ నంబులు తన్మధ్య,ధరణియం దిలావృతంబు వెలయుఁ
గనకమయము గాఁగఁ గ్రాలు మేరునగం బి,లావృతంబుచుట్టు లలితరీతి. 904

వ. తొమ్మిదివేలయోజనంబులు తనరు మేరువునుజుట్టి పర్వతచతుష్టయంబు వెలయుచుండు. వానివిష్కంభంబులు పదివేలయోజనంబులవిస్తృతి గలిగియుండు. తూర్పున మందరంబును దక్షిణంబున గంధమాదనంబును బశ్చిమంబున విపులంబు నుత్తరంబున సుపార్శ్వంబు నుండు. వానియందుఁ గ్రమంబునఁ గదంబ జంబూ పిప్పల వటవృక్షంబులు పదునొకండునూఱుల యోజనంబులయాయామంబులు గలిగి పర్వతకేతువు లనం బొల్పాఱుచుండు. జంబూద్వీపంబునకు జంబూవృక్షంబు నామహేతువుగా నుండు. మహాగజప్రమాణంబు లగుఫలంబులు దానియందుఁ గనంబడు. అది పర్వతపృష్ఠంబున నెల్లయెడల శీర్యమాణంబులై పడుచుండు. తత్స్వాదురసంబున జంబూనది యొకం డావిర్భవించి ప్రవహించుచుండు. 905

క. దానిమనోజ్ఞాంభస్సులఁ, బానము చేయుదురు తన్నివాసులు దానన్
మానసములు తృప్తిం గనఁ,గా నాజను లుల్లసిలుచుఁ గానంబడుచున్. 906

ఉ. స్వేదము లేమి దుర్గతులు చేకురమిన్ జర పొందరామి స
మ్మోదము నంగసంఘులసమూహము తగ్గమి నెంతొ చక్కఁగాఁ
బ్రోదిచెలంగ నుందు రల పూజ్యసరిత్తటమృత్తు తజ్జలా
స్వాదన మొప్పఁజేసి సుఖవాయువిశోషిత యౌచు నంతటన్. 907

తే. పరఁగు జాంబూనదాఖ్య సువర్ణ మగుచు, సిద్ధభూషణమయి మునిజిష్ణులార
లలిత భద్రాశ్వ కేతుమాలంబులు దగు, వర్షములు రెండు తన్మధ్యభాగమందు.

క. తనరు నిలావృత మనునది, వన మొక్కఁడు చైత్రరథము వాస్తోష్పతిది
దక్కనసుండు గంధమాదన, మనుగిరి యామ్యమున నొప్పు నసదృశ మగుచున్.

తే. పశ్చిమంబున వైభ్రాజవనము సౌమ్య
భాగమున నందనంబును బరఁగుచుండు
వఱలు నరుణోదమును మహాభద్ర భవ్య
నామ మసితోదమును సమానసము ననఁగ. 910

క. సరసులు నాలుగు తగు నిర్జరభోగ్యము లగుచు మఱియు శైలవరము లా
ధరణీధరవర్యము నిర్జరశైలము నాశ్రయించి రంజిలు వినుఁడీ. 911

వ. శాంతవంతంబు, చక్రకుంభంబు, కురరియు, మాల్యవంతంబు, వైకంకతంబు లోనగు పర్వతంబులు తూర్పునఁ గేసరాచలంబు లనంబరఁగుచుండు. త్రికూట, శిశిర, పతంగ, రుచక, నిషధాదులు దక్షిణంబునఁ గేసరతుల్యంబులై వెలయు. సవైదూర్యంబగు శిఖివాసంబును, గాపిల, గంధమాదన, జానుధిప్రముఖంబులు పశ్చిమంబునఁ గేసరాకృతి నొప్పు. మేరువు ననంతరంబ జఠరాదులయందు శంఖకూటంబు, ఋషభంబు హంసంబు, నాగంబు కాలంజరాదికంబులు, కేసరాకృతి నుత్తరంబున నలరు. చతుర్దశసహస్రయోజనంబులుగల మహాపురి యొండు మేరుమూర్ధంబున బ్రహ్మనిర్మితం బగుట సాటిలేకుండు. 912

క. దానికి నెనిమిది దిక్కులఁ, గానంబడు శతముఖాదికత్రిదశపతుల్
జానుగ వసించునగరము, లానిర్మలమణిమరీచు లలరఁగ వెలయున్. 913

చ. సరసిజనాభపాదతలసంభవముం గని చంద్రమండల
స్ఫురణముఁ గ్రమ్మి యెల్లెడలఁ జూడఁగనై దివినుండి బ్రహ్మపూ
ర్వ్వరమునఁ దాఁ బడుచు బరమపావనమూర్తిగ నొప్పుగంగ య
ప్పురమునసుండి నల్గడలఁ బోవును భూరితరంగసంహతిన్. 914

వ. సీతయు నలకనందయుఁ జక్షుస్సును భద్రయుఁ గ్రమంబున వానినామంబులై యుండు. మేరువునుండి తూర్పుగా సీతయు భద్రాశ్వంబను పూర్వవర్షంబుతోఁ గూడి సముద్రంబునం గలియు. అలకనందయు దక్షిణంబుగాఁ బ్రవహించి భారతవర్షంబుంగూడి సప్తభేదంబులు గలిగి సాగరంబునం గలియు. చక్షుస్సును బశ్చిమమార్గంబునం బ్రవహించి పర్వతపంక్తి నతిక్రమించి కేతుమాలాఖ్య వర్షంబుం గూడి సముద్రంబునం గలియు. భద్రయు నుత్తరపర్వతంబులను గురుదేశంబుల నతిక్రమించి యంభోధిం గలియు. నీల నిషధ మాల్యవద్గంధమాదనంబులకు నడుమ మేరువు కర్ణికాకారంబున వెలయు. 915

సీ. మునులార! భారతములు కేతుమాలముల్ భద్రాశ్వములు కురవకము లెన్నఁ
బత్త్రిముల్ లోకపర్వతమున కెల్లగా నమరును జఠరభూధ్రమును దేవ

కూటము నను రెండుక్షోణీధరంబులు దక్షిణోత్తరములఁ దగుచు నీల
నిషధపర్వతముల నెఱి నంటి యవియుండుఁ బూర్వపశ్చిమముల బొలిచి గంధ
తే. మాదనంబు కైలాసంబు మోదదంబు
లగుచు నెనుబదివేల్ యోజనగణిత మగు
చున్న యాయామమున నబ్ధియుండుదాఁకఁ
గ్రమ్ముకొనియుండు భూమిని గళల మించి. 916

వ. నిషధపారియాత్రంబులు మర్యాదాపర్వతంబులు దక్షిణోత్తరాయామంబులు. మేరుపర్వతపశ్చిమదిగ్భాగంబున నిలిచియుండు. త్రిశృంగజారుధినామకంబు లుత్తరంబున నుండు వర్షపర్వతంబులు ఇవి పూర్వపశ్చిమాయతంబులై సముద్రంబుదనుక వ్యాపించియుండు. ఇవి మర్యాదాచలంబులుగ నాచేఁ గీర్తింపఁబడియెఁగదా. మేరువునకు జఠరావస్థితంబులై నాల్గుదిక్కులయందు రెండేసి పర్వతంబు లుండు. మేరుశైలంబునకుఁ జతుర్దిక్కులయందును గేసరపర్వతంబులు శీతాంతాద్యంబులు మనోహరాకృతి వెలయు. పర్వతద్వయమధ్యభాగంబులు సిద్ధచారణసేవితంబులై మనోజ్ఞంబులై యుండు. అందుఁ గాననంబులు పురంబులు లక్ష్మీవిష్ణ్వగ్నిసూర్యేంద్రదేవనివాసంబులై యలరు. మఱియు వానియందు నరకిన్నరసమాజుష్టంబు లగుప్రదేశంబులు వెలయు. గంధర్వయక్షరక్షస్సులు దైత్యదానవులు నందుఁ గ్రీడించుచుందురు. ఈస్థలంబులు భూలోకస్వర్గంబు లని యెఱుంగవలయు.

క. జననశతంబులకైనను, జను లించుక యఘ మొనర్పఁజాలరయే నిం
దును జొరఁజాలరు వినుఁడీ, మునులారా! నిరుపమానమూర్తి హరియుఁదాన్.

సీ. భద్రాశ్వమున హయవదనుఁడై యుండును గేతుమాలంబునఁ బ్రీతిమీఱ
వారాహరూపంబు భాసిల్ల నుండును భారతంబునఁ గూర్మవపువు గ్రాల
నలరుచుండును మఱి యామహావిష్ణువు మత్స్యరూపంబున మహితకురుజ
నపదమ్ముల వసించు నారాయణుండు సర్వేశ్వరుం డాహరి యెల్లచోట్ల
తే. విశ్వరూపంబుఁ గైకొని వెలయుచుండు, సర్వమునకు నాధారమై సర్వమయత
నుండు నా శ్రీవిభుండు ప్రచండశక్తి, నలరి కింపురుషాది వర్షాష్టకమున. 919
క. శోకాయాసోద్వేగము, లేకరణిం గల్గకుండు నెల్లప్రజల క
ట్లాఁకలివలని వెతం గన, రేకమనీయాకృతులను నెసఁగుదురు జనుల్. 920
క. ఆరోగ్యభాగ్యములచే, భూరిసుఖం బొప్ప దుఃఖముం గన రెంతో
శ్రీరమ్యమూర్తు లగుచున్, వారలు పండ్రెండువేలవర్షము లందున్. 921
ఆ. ఆయు వలర నుండు నాస్థలంబుల భౌమ, ములగు నితరదుఃఖములు గలుగవు
వినుఁడు కృతయుగాదికనిఖిలసమయభేదములు చెప్పఁబడవు తత్త్వ మిదియె.

క. ఈవర్షసప్తకంబున, భావింపఁ గులాద్రు, లేడు వఱలును నదులం
దావహిలి వేనవేలుగ, నేవేళం బాఱుచుండు నెన్నం దగుచున్. 923

## పదునేడవ అధ్యాయము.

భారతవర్షప్రమాణము.

క. అని మఱియు మునులతో ని ట్లనియెన్ సూతుండు భారతాహ్వయవర్షం
బును వినుఁడు సౌమ్యభాగం,బున సంద్రము యామ్యభాగమున హిమగిరియున్.

క. అలరఁగ భారతవర్షము, చెలఁగున్ దత్సంతతియును జెన్నువహించున్
దులలేనిభారతి యనన్, విలసిలు నావర్ష మాత్మవిస్తృతిచేతన్. 925

వ. తొమ్మిదివేలయోజనంబులు దానివిస్తారంబు. స్వర్గాపవర్గంబులఁ గోరువారి కిది కర్మభూమియై యుండు మహేంద్ర మలయ సహ్య శుక్తిమంతంబులు, ఋక్ష వింధ్య పారియాత్రంబు లనునివి కులాచలంబులు. ఈభూమి స్వర్గతుల్యంబు. దీనినుండి ముక్తియుం జేకూరు. తిర్యక్త్వంబును నరకంబును గర్మానుసారంబుగం గల్గుచుండు. ఈభూమినుండియే స్వర్గమోక్షంబు లలవడు. ఈభూమిని దప్ప వేఱొండుతావునఁ గర్మాచరణంబు చెప్పంబడదు. 926

క. ఈభారతవర్షంబున, నే భేధములయ్యెఁ జక్క నెన్న నవమిటిన్
శ్రీభాసిల నవిద్వీపము, లై భారతకీర్తిమును హరొర్వొందించున్. 927

వ. ఇంద్రద్వీపంబు, కసేరుమంతము, తామ్రపర్ణము, గభస్తిమంతము, నాగద్వీపము, సౌమ్యము, గంధర్వము, వారుణంబు నని యెనిమిదిభేదంబులు దీని కయ్యె. ఈభారతం బందుఁ దొమ్మిదవదియై సాగరసంవృతంబై యుండు దక్షిణోత్తరంబుగా నిది సహస్రయోజనాత్మకంబు. 928

సీ. తూరుపునం గిరాతులు పశ్చిమంబున యవనులు నుంద్రు బ్రాహ్మణులు భూభుజులు వైశ్యశూద్రులు సొరిది మధ్యమభాగమున నుందు రిజ్య ప్రథనము బేరమును సేవ యనువృత్తులను వారు జీవింత్రు ప్రాలేయశైలసంభవము గాంచి ప్రవహించు నాచంద్రభాగ శతద్రువు మొదలుగాఁగల మహానదులు వెలయు వేద స్మృతి ముఖముల్ వెలసెడు నాపారియాత్రసంభవములై యలరు నర్మ

ఆ. దయును సురస మొదలు ధన్యనదుల్ వింధ్య,శైలసంభవములు చారుజలము లలరు తాపి యనెడు ప్రోదిని కావేరి,యును బయోష్ణి యనెడు ఘననదియును.

వ. నిర్వింధ్య లోనగునదులు ఋక్షపాదోద్భవంబులై చెలంగు. పాపాపనోదనపటువులై యవి మహాప్రసిద్ధిం గాంచె. మఱియు గోదావరియు భీమరథియుఁ గృష్ణవేణియు లోనగునవి సహ్యపాదోద్భవంబును గాంచి పాపభయంబును దొలఁగించుచుండు. కృతమాలయుఁ దామ్రపర్ణియు మలయపర్వతోద్భవంబులు.

త్రిసాంధ్యయు, ఋషికుల్యాదులు మహేంద్రసంభవంబులు. మఱియు వేఱొక ఋషికుల్యయుఁ గుమారాదులు శుక్తిమత్పాదసంభవంబులు. వీనికి నదు లుపనదు లనేకంబులు గలవు. కురుపాంచాలమధ్యదేశజనులును, బూర్వదేశనివాసులును, గామరూపవాస్తవ్యులును, బౌండ్ర, కళింగ, మగధ, దాక్షిణాత్యులును, సౌరాష్ట్ర శూద్రాభీ రార్బుద మారుక మాళవ పారియాత్ర నివాసులును, సౌవీర, సైంధవశాల్వశాలకవాసులును, మద్రారామాంబష్ఠపారసీకవసతులు నీమహానదులజలంబులం ద్రావుచు నుందురు ఈజనపదంబులు హృష్టపుష్టజనాకులంబులై యుండు. 930

క. వినుఁడీ భారతవర్షం,బున నాల్గుయుగంబు లుండుఁ బొందుగ నవియే
తనరుం గృతమనఁ ద్రేతయు, నన ద్వాపరకలియుగంబు లన ధర్మగతిన్. 931

క. యతులై తప మొనరింతురు, క్రతువుల దేవతలఁ బ్రీతికలితులఁ జేయం
దతమతులై యజ్వలు స, త్కృతిఁ జేయుదు రమలభక్తి కీర్ణాత్మకులై. 932

క. పరలోకార్థముగా నా,దరమున దానముల సమ్మదంబు పొదలఁ గూ
ర్తురు యాచకులకు వినుఁడీ, పురుషులచే నెప్డు యజ్ఞపురుషుఁడు భక్తిన్. 933

క. హోమము చేయంబడుచున్, దా మోదము నొందుచుండుఁ దగ నీజంబూ
నామకమౌ ద్వీపంబున, నీమెయి ద్వీపాంతరముల నెల్లను విధులన్. 934

ఆ. చెల్ల వందు వేలుసిద్ధులు గల వవ్వి, వేలుచోటఁ జెప్ప విశద మగును
ద్వీప మిద్ది యెల్లద్వీపంబులను శ్రేష్ఠ, మౌను గర్మభూమిగానఁ జూడ. 935

క. ఇతరద్వీపంబులు భో,గతతిం బొందంగఁ దగియె కలకాలం బు
న్నతి నొందుచుండు వినుఁడో, క్షితిసురమునులార దీని కీర్తి విరివిగన్. 936

వ. జంబూద్వీపంబున జన్మసహస్రసహస్రంబులచే నొకానొకకాలంబున జంతువు మానుషత్వంబు నొందు. దానికిఁ గారణంబు పుణ్యసంచయంబె యగు. భారతఖండవాసులు ధన్యాత్ము లనియు, స్వర్గాపవర్గాస్పదమగు నఖండంబున నుత్పత్తి గల్గుటయే యందులకుఁ గారణం బనియు దేవతలు కీర్తించుచుందురు. మఱియు నిందు జన్మించినవా రసంకల్పితఫలంబు లగుకర్మముల నొనరించి పరమాత్మయగు శ్రీవిష్ణువునందుఁ జేరి నిర్మలాంతఃకరణులై యందె లయంబు నొందుదురు. స్వర్గప్రదం బగుకర్మము నొనరించి దేహబంధంబును ద్యజించి సుఖంబులందుఁ బొందుదురుగాన నీభారతఖండం బత్యంతపావనంబు. నవవర్షాత్మకంబగు నీజంబూద్వీపంబు లక్షయోజనవిస్తారం బని సంక్షేపంబుగఁ జెప్పంబడియె. ఈద్వీపంబుఁ జుట్టుకొని లక్షయోజనవిస్తృతిగల క్షారవారిధి యుండు నని యెఱుంగఁ దగునని మహర్షులకు సూతుండు మఱియు నిట్లనియె. 937

## పదునెనిమిదవ అధ్యాయము.

### ప్లక్షాదిసకలద్వీపవర్ణనము.

క. జంబూద్వీపం బెటు క్షా, రాంబుధిచే నావృత మగునటు ప్లక్షద్వీ
పంబును క్షారాంభోధిజ, లంబులచే నావృతమయి లలితం బె యగుక్. 938

సీ. వినుఁడు జంబూద్వీపవిస్తృతి నూఱువేల్ యోజనంబులఁ దగి యుండుఁ గాదె
తద్ద్విగుణంబయి తనరు విస్తృతిచేతఁ బ్లక్షాహ్వయద్వీపవరము మించు
దాని కేలికయు మేధాతిథినాఁ దగునతని కేడ్వురుపుత్త్రులైరి శాంత
మయుఁడును శిశిరుండు మఱి సుఖోదయుఁడు నానందుఁడు శివుఁడువినందగియశో

ఆ. మలర నొప్పు క్షేమకాఖ్యుఁడు ధ్రువుఁడును, వీరు ప్లక్షభూమి విభుతఁ గనిరి
వీరి వేరభూమి వెలసె వర్షంబులు, యశము దెసలయందు నలముకొనఁగ. 939

వ. మర్యాదాకారణంబులై యవ్వి యలరు. మఱియు నేడువర్షపర్వతంబులు గలవు. గోమేద, చంద్ర, నారద, దుందుభి, సోమక, సుమనో, వైభ్రాజంబు లని వాని నామంబులు. మనోహరంబులగు నీవర్షపర్వతంబులందు దేవగంధర్వసహితులై ప్రజలు నివసింతురు. ఆద్వీపంబునఁ బావనజనపదంబులు ప్రజానిబిడంబులై యలరు ఆధివ్యాధు లందుఁ గలుగవు. శాశ్వతసుఖంబె వారికి సహజంబై యుండు నని యెఱుంగునది. ఆవర్షపర్వతంబులం బుట్టి సముద్రమునఁ గలియునదు లేడు గలవు. తన్నామసంకీర్తనంబు పాపహారంబై యుండు. అనుతప్తయు, శిఖియు, విపాశయుఁ, త్రిదివయుఁ, గ్రమునామకయు, నమృతయు, సుకృతయు, నను నీయేడునదులును బూర్వోక్తవర్షపర్వతంబులును బ్రధానంబు లని తెలియవలయు. స్వల్పనదీపర్వతంబు లెన్నియో యందుఁ గలవు. జనపదవాసు లంద ఆనదీజలంబులం ద్రావి హృష్టమానసులై యుందురు. ఆనదు లన్నియు జలహీనంబులుగాక యుపద్రవకృత్ప్రవాహంబులు గాక సమముగాఁ బ్రవహించుచుండు. ఆ స్థానసప్తకంబున యుగావస్థ లేదు. మునీంద్రులారా! సదా త్రేతాయుగసమకాలం బందు వర్తిల్లు. ప్లక్షద్వీపాది శాకద్వీపాంతభూస్థితు లగుజనులు పంచవర్షసహస్రంబులు జీవింతురు. 940

క. అమరును ధర్మము నాల్గువి, ధములక్ వర్ణాశ్రమోచితములుగ నాద్వీ
పములందు నాలుగా నా, శ్రమముల వివరింతు మీకు సన్మునులారా. 941

సీ. ఆర్యక కురు వివిశాఖ్యల భావిసంజ్ఞల నొప్పెదురు విప్రకులులు క్షత్త్రి
యులు వైశ్యు లక్లశూద్రులుమానివరులార వానియంతరమున వఱలుచుండు
జంబువక్ తరువు విశాలశాఖలమిన్నుఁ దాఁకుచుఁ బ్లక్షపాదపము గలుగఁ
బ్లక్షనామమున ద్వీపము విస్తృతిం గాంచె నిక్షురసోదధి యెల్లకడలఁ

తే. జుట్టుకొనియుండు నద్దాని సొబగుమీఱ
ద్వీపములరీతి నీరీతిఁ దెలిసికొనుఁడు
సంగ్రహమ్ముగ వానిదౌచరిత మెల్లఁ
బ్లక్షమున నర్యకాది త్రివర్ణభవులు. 942

క. హరిని జగత్స్రష్టను సో,మరూపిఁగాఁ బూజచేసి మహితోత్సవముల్
జరపుదురు వారి కా శ్రీ,హరి కాంక్షల నొసఁగుచుండు నయ్యెడలన్. 943

క. వినుఁ డిఁక శాల్మలమన నొ,ప్పినద్వీపచరిత్ర మెల్లఁ బృథుతరముగ మీ
కును దెల్పెద వీరాహ్వయ,మున నొప్పఁ బదీశ్వరుండు మునివరులారా! 944

సీ. అందు వర్షంబు లేడలరు శ్వేతంబన
హరితజీమూతము లనఁగ రోహి
తము వైద్యుతము మానసము సుప్రభమునని
వానిపేరులు ధాత్రిఁ బరఁగుచుండు
శాల్మలభూరుహసంవ్యాప్తి నాద్వీప
మునకు శాల్మల మనుఘనత గలిగెఁ
దద్ద్విగుణాకృతిఁ దనరి సముద్రంబు
చెఱకురసం బనఁ జిత్రరీతి
తే. నలరు నుదకంబుతో దాని నావరించి
యుండు నాద్వీపమున నేడుకొండ లుండు
మణుల కాకరములు గాఁగ మలయుచుండు
నవియు వర్షాకరంబులై యన్వహంబు. 945

వ. కకుదం, బున్నతంబు, వలాహకంబు, మహౌషధీనిలయం బగుద్రోణాహ్వయంబు, కంకంబు, మహిషంబు, కకుద్మంతంబు నను నామంబుల శాల్మలద్వీపపర్వతంబు లొప్పు. శ్రేణి, తోయ, వితృష్ణ, చక్ర, శుక్ర, విమోచని, నివృత్తి యనుపేరుల నదు లేడును బిలువంబడుచుండు. పాపశాంతిం జేయునమ్మహానదు లాద్వీపంబున కలంకారంబు లసంజెల్లు. శ్వేత, లోహిత, జీమూత, హరిత, వైద్యుత, మానస, సుప్రభంబు లనువర్షంబు లేడును జెలంగు. లోహితంబు లనుపేరు లొక్కదానికే చెల్లునని యెఱుంగుఁడు. ఆద్వీపంబున వర్ణచతుష్కంబు వెలయు. కపిలారుణపీతకృష్ణనామకము లనునవి వేఱువేఱ విరాజిల్లు. అవి క్రమంబున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతు లని పిలువంబడు. వారందు విష్ణువు నవ్యయునిఁ బూజించుచుందురు. యాగముల నొనరింపఁ దలంపుగలవారు వాయుభూతునిగా భగవంతు నారాధించుచుఁ తత్ప్రీతి కొఱకు యజ్ఞంబుల నొనరింతురు. 946

క. వినుఁడు మనోహరతమ మనఁ, జను నాద్వీపంబునందు సమధికముగ దే
వనికాయ మలరుచుండును, ఘనశాల్మలివృక్ష మొండుగల దచ్చోటన్. 947

చ. సురుచిరశాఖలన్ వెలసి సుందరమూలముగా నెసంగుచున్
గరుణ సుఖంబు భక్తులకుఁ గల్గఁగఁజేయుచు నామహీరుహం
బరయ మహోత్తరం బగుచు నంబరచుంబితపర్ణరాజియై
నిరతము నొప్పు ద్వీప మది నిర్మలభూతలమై కనంబడున్. 948

క. అదియుసురోదకమునఁ దగు, నుదధితనుం జుట్టుకొనఁగ నొప్పు నుదధియా
యది శాల్మలిసమవిస్తృతి, యొదవఁగ నొప్పారుచుండు నూర్మిభయదమై. 949

సీ. సాగరం బద్ది కుశద్వీపపరివృతం బౌచు శాల్మలికంటె నరయ ద్విగుణ
విస్తృతి కనఁబడ వెలయుచునుండు నాద్వీపంబునం దేషుదివ్యవర్ష
పర్వతంబులు దగు వానిపేరులు వినుఁ డుద్భిదం బనునది యొప్పు మొదల
వేణుమత్స్వైరథవితతపర్వతములు రంధనధృతులన రాజిలు నవి
క్రమప్రభాకరకపిలంబులను నివి వర్షంబు లనియెడుభవ్యకీర్తిఁ

తే. గాంచి యుండును దద్భూధ్రగణమునందు, దేవదానవపంక్తియుక్తిని మనుష్యు
లుందు రట్టులె గంధర్వయుక్తి దేవ,తలు వసింతురు మునులార లలితగతుల.

క. విలసిల్లు యక్షకింపురు,షులు స్వేచ్ఛగ నుండువారు శుంభద్గతులం
జెలఁగుచు మఱి వర్షంబులు, కలవు చతుస్సంఖ్య వానిక్రమ మింక వినుఁడీ.

వ. దమి, శుష్మి, స్నేహ, మందేహ, నామంబుల బ్రాహ్మణక్షత్రియవైశ్య, శూద్రజా
తులు వరుస నలరారుచుండు. వారు యథోక్తకర్మాచరణతత్పరులై యుందురు.
విశేషించి యందుండువారు బ్రహ్మరూపజనార్దను నర్చించుచు నధికారఫలప్ర
దోగ్రకర్మంబులం ద్యజించియుందురు. మఱియు నందు విద్రుమహేమశైల
ములు, ద్యుతిమ, త్పుష్టిమ, త్కుశేశయ, హరి, మందరంబు లనువర్షపర్వతం
బులు కలవు. నదు లేడు తద్ద్వీపంబునఁ బ్రవహించుచు ధృతపాప యని శివ
యని, పవిత్రయని, సమ్మతి యని, విద్యుత్తని, అంభస్సని, మహీ యని, ప్రఖ్యా
తింగన్న నామంబులు గల్గియుండు. ఆద్వీపంబునఁ గుశస్తంభంబు వెలయుటఁ
గుశద్వీపంబనం బ్రఖ్యాతం బయ్యె. ద్వీపసమానవిస్తృతి గలిగి ఘృతోదకసా
గరం బాద్వీపంబును జుట్టియుండు. ఆసముద్రంబును గ్రౌంచద్వీపం బావరించి
యుండు. దానివృత్తాంతంబు నెఱింగించెద వినుం డని మునులకు రోమహర్ష
ణుండు మఱియు నిట్లనియె. 952

## ౼ క్రౌంచద్వీపము. ౼

క. మునులార! కుశద్వీపం,బునకున్ రెండింత లగుచుఁ బొలిచెడుఘనతం
దనరారి క్రౌంచనామం,బుననొప్పును ద్వీప మొకఁడు బుధనుత మగుచున్. 953

క. దానికి నేడ్వురుపుత్త్రులు, భానిచయం బలర నుండ భాసిల్లుదు రో
మౌనీంద్రులార! వినుఁడీ, వానికిఁగలనామములను వరుసఁ దెలిపెదన్. 954

సీ. ఆపేరు లెల్ల ద్వీపాధీశుఁడే భూమి వెలయునట్లుగఁ దానె పెట్టెఁ గుశగ
మందగోష్ణములును మఱియుఁ బీవరమంధకారకమునులును భూరిరూప
మొప్పు దుందుభియు నత్యురుతరదీప్తులఁ గ్రాలునీతనయులు గల్గఁ దనరు
నాద్వీపమునయందు నమరగంధర్వాదిసేవితంబులుగాఁగ జెలగు వర్ష
తే. పర్వతము లేడు మునులార ప్రబలుచుండు, వానిపేరులుక్రౌంచంబు వామనంబు
నంధకారక దేవవ్రతాహ్వయములు, ధమము మఱి పుండరీకవంతంబు ననఁగ.

క. ఆవల దుందుభి యనునది, భూవినుతిం గాంచి నెగడు మునివరులారా!
యావర్షపర్వతంబులు, వావిరి ద్విగుణప్రమాణవపువులఁ దనరున్. 956

వ. ఒక్కద్వీపంబును, వర్షపర్వతంబులు నవ్వలద్వీపంబు నిట్లీక్రమంబున నలరారు
చుండు. వర్షపర్వతంబుల యాధారంబున ద్వీపాభివృద్ధి గలుగుచుండు. ఆపర్వ
తంబులయందు నిరాతంకులై దేవగణంబులు ప్రజలు నుందురు. పుష్కరంబులు
పుష్కలంబులై యుండు. బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులు స్వస్వవిధుల జరపు
చుందురు. అందు నద్యుదకంబులం ద్రావుచు నాప్రజ లారోగ్యభాగ్యంబులు
గలిగియుందురు. ఆనదుల నెఱింగించెద. అం దేడునదులు ప్రధానంబులై
యుండు. వానినుండి వందలకొలఁది నుపనదు లుదయించుచుఁ బ్రజారక్షకుఁ
దోడ్పడుచుండు. గౌరియుఁ, గుముద్వతియు, సంధ్యయు, రాత్రియు, మనోజ
వయు,ఖ్యాతియుఁ బుండరీకయు ననునీయేడు ప్రధానంబులు. ఇవియే వర్షపర్వ
తంబు లనంబడు. పుష్కరాదివర్ణంబుల జనార్దనుండాద్వీపంబున యోగిరుద్ర
రూపుండై పూజింపఁ బడుచుండు. క్రౌంచద్వీపము దధిమండోదకంబుగల
సముద్రంబుచే నావృతం బగు. ఆసముద్రంబు ద్వీపతుల్యవిస్తృతి వెలయు.
అదిశాకద్వీపసంవృతంబై యుండు. ఆద్వీపంబు క్రౌంచద్వీప ద్విగుణవిస్తృతిం
జెన్నారు. ఆశాకద్వీపేశ్వరునకు సప్తతనయులు గలరు. వారికి నేడువర్షంబుల
నొసంగె. జలద, కుమార, సుకుమార, మనీరక, కుసుమోద, మోదాకి, మహా
ద్రుమనామంబుల నాకుమారులు వెలయుదురు. వీరి నామంబులం దాల్చి యా
వర్షంబులు ప్రఖ్యాతిం గాంచె. అందుఁ బర్వతంబు లేడు వర్షవిచ్ఛేదకారం
బులు గాఁగలవు. ఉదయగిరి యందుఁ దొలుతటిది యనంబరఁగు. రెండవది
జలధారంబు. మూఁడవది రైవతకంబు. నాల్గవది శ్యామంబు. ఐదవ దంభోగిరి.
ఆఱవ దాస్తికేయంబు. ఏడవది కేసరి యనునది. అదియే పర్వతోత్తమంబనం
జెలంగె. 957

క. శాకద్రుమవర మచ్చట, రాకాశశిఁ గీర్తి మించి రాజిల్లు సురా
నీకము గంధర్వులు సే,వాకుంతప్రమద మొప్ప నదయము గొలువన్. 958

తే. దానియాకుల స్పృశియింపఁ దనరుప్రీతి,
వర్ణనాతీతమై యుండుఁ బలుకులేల?
ద్వీపమున నందు బహువిధదేశములు ప
విత్రములు సుందరము లౌచు వెలయుచుండు. 959

క. నాలుగువర్ణంబుల ప్రజ, లోలి నటన్ మించుచుండు రోములారా!
యాలస్యాదికజాడ్యము, లేలీలం గనిన లేకయే యుండఁ బ్రజల్. 960

క. అలరారుదు రట వ్యాధులు, గలుగవు తజ్జనులు చూడఁగా సుమతముల౯
వెలయుచు నిర్మలదేహం,బుల నొప్పుచు దైవభక్తిఁ బొలుతురు సతము౯.

సీ. నదు లందు బహుళపుణ్యం బొసంగుచు సర్వపాపంబులం దోలి పరఁగుచుండు
సుకుమారియుఁ, గుమారి, ప్రకటకీర్తిం గాంచి నట్టి దౌనళినియు నవల రేణు
కయు, నిక్షువును, ధేనుకయు,గభస్తియు ననునీయేడు ఖ్యాతిచే నెసఁగుచుండు
నయుతసంఖ్యలఁ దగునట్టి వెన్నో చిన్ననదు లందు గలవు; పుణ్యగిరివరము

తే. లెన్నొ లెక్కింపరాకుండు సన్నుతిఁ గను
నట్టి వర్షాద్రు లలరారు నందు దేశ
ములును భాగద్వయావని నలముకొనుచు
మెఱయుచుండును సుఖవృద్ధి మించుచుండ. 962

క. నదులందుం బ్రవహించెడు, విదితాత్మమహత్త్వ మొప్ప విమలసలిలముల్
పొదలఁగఁ బవిత్రగతుల౯, ముదమునఁ దమఁజేరి నరులు మ్రొక్కు లిడంగ౯.

చ. మనుజులయందు ధర్మ మొకమాటును హానిని బొందకుండు, నా
జను లొకకాలమందుఁ గడుసంతసము౯ మఱియొక్కవేళఁ గుం
దును గన కొక్కరీతిగనె త్రోయుచునుందురు కాలము౯ ముదం
బుననె; తదీయదేశములఁ బుట్టవు వ్యాధు లదెట్లు చూచిన౯. 964

క. మరియాద విడువ రటఁగల,పురుషులు వర్ణములు నాల్గు పొలుచును ద్వీపాం
తరములయం దెటులో యా, వరుసనె యవ్వానిఁ దెల్పువాఁడ౯ వినుఁడీ.

శాకద్వీపము.

సీ. మగములు మగధముల్ మానసంబులు మందగము లనవర్ణముల్ క్రాలుచుండు
మగములు భూసురమహితవంశంబులు మాగధము లనంగ క్ష్మాపతికుల
ములు మఱి మానసములు వైశ్యకులములు మందగములు శూద్రమండలి కగు
వంశముల్; తద్దేశవర్ణితకులముల పేరు లీరీతిని బిల్వఁబడును

తే. క్రౌంచ మనుద్వీపచరిత యిక్కరణి నొప్పు;
విను(డు మునులార శాకమన్ద్వీపచరిత
మింకఁ దెలిపెద నందు దేవేజ్యుఁడు హరి
సూర్యరూపధరుం డయి శుభము లొసఁగు. 966

క. నరు లట నియతాత్ములు శ్రీహరిని యథావిధిగఁ బూజనలరించుచు నుం
దురు ద్వీపవర్య మయ్యది, పరివృతమై క్షీరవార్ధి భాసిలు చుండున్. 967

## పుష్కరద్వీపము.

వ. శాకద్వీపప్రమాణంబున నాసముద్రంబు వలయాకారంబుగా దానిం జుట్టుకొని యుండు. ఆసముద్రంబు బుష్కరద్వీపసమావృతం బని యెఱుంగవలయు శాకద్వీపద్విగుణప్రమాణంబు పుష్కరద్వీపంబని చెప్పంబడు. పుష్కరద్వీపంబునకు సవననామకుం డధిపతియనం బరఁగు. వానికి మహావీతుం డనికొడుకు గలఁడు. ధాతకియు రెండవకొమరుండు. వారిపేర రెండువర్షంబులు వెలసె. ఆఖండంబులు వరుసగా మహావీత ధాతకీఖండంబు లనంబరఁగె. అందు విఖ్యాతిం గాంచినవర్ష పర్వత మొక్కండు గలదు. అవి తత్ఖండాంతరంబున వలయాకృతిగ వ్యాపించి మనసోత్తరనామంబుఁ దాల్చి పంచాశత్సహస్రయోజనోత్సేధము గలిగి యంత విస్తీర్ణంబుచే నొప్పుచు భాసిల్లు చుండు. అది చూచువారలకుఁ బుష్కరద్వీప వలయమును రెండుగా విభజింప నలువ నిర్మించినట్లు కనఁబడుచుండు. దానిచే నాద్వీపము విచ్ఛిన్నం బయి రెండుఖండంబు లయ్యె. ఆరెండును వలయాకృతి గలిగియుండు. వానినడుమ పర్వతంబుండు. అందలిమానవులు పదివేలవత్సరంబులు జీవింతురు. నిరామయులు, విశోకులు, రాగద్వేషవర్జితులు నై వా రుందురు. అధమోత్తమభేదంబు లందు లేవు. వధ్యవధకనామంబులు నం దుండవు. ఈర్ష్యాసూయాభయరోషదోషలోభాదికంబు లామనుజులయందుఁ గన్పట్టవు. మహావీతవర్షఖండమును ధాతకీఖండమండితంబై కనుపట్టుచుండు. 968

తే. మానసోత్తరనామక క్ష్మాధరంబు
నాశ్రయించి సురాసురయక్షముఖులు
కాలమును బుచ్చుచుంద్రు; పుష్కరమునందు
లేవు సత్యానృతంబులు లేవు నదులు. 969

క. దరణీధ్రంబులు లే వటఁ, బురుషులు సమవేషములను బూని సురలతో
సరిచేయఁ దగినరూప,స్ఫురణంబునఁ బొల్చుచుంద్రు మునివరులారా. 970

సీ. వర్ణాశ్రమాచార వరపద్ధతులు లేక ధర్మాహరణవర్జితంబు నగుచు
నామ్నాయవార్తలు నటు దండనీతి శుశ్రూషలు లేక యాక్షోణిఖండ
యుగళంబు భూస్థలి నొప్పు స్వర్గంబన నొప్పుచుండును; కాల మొక్కరీతి
సుఖముల నే యిచ్చుచున్ రోగములు జరాభయము లేకుండఁగఁబరఁగుచుండు

తే. ధాతకీఖండమును మహావీతఖండ
ములను బొల్చుచుఁ బుష్కరము ధర వెలయు;
నందు న్యగ్రోధతరువు బ్రహ్మకు నివాస
భూతమై యెల్లజనులచేఁ బూజలఁగొను. 971

క. ఆతరువరమూలంబున, ధాత సురాసురులచేతఁ దాఁ బూజితుఁడై
చేతోముదమున నొప్పును, భూతల మది పుణ్యములకుఁ బ్రోవై యలరున్.

క. సురుచిరజలముల సంద్రము, పరినుతమై దానిఁజుట్టి భాసిల్లుటఁ బు
ష్కర మెన్న యోగ్యమై తగు, సరిత్పతియు ద్వీపవర్యసమవిస్తృతిచేన్. 973

క. కనఁబడుచుండును; భూసుర,మునులారా! యేడుద్వీపములు సప్తమహా
వననిధుల నావృతములయి, కనువిందుగఁ గానఁబడుచుఁ గ్రాలుచునుండున్.

వ. ద్వీపసముద్రంబులు రెండును సమవిస్తృతి సెసంగుచుండు. అవ్వలిద్వీపసముద్రంబులు తద్ద్విగుణవిస్తృతిం గానంబడుచుండు. ఇట్లే ద్వీపసముద్రసప్తకం బని యెఱుంగవలయు. సర్వసముద్రంబులు సదా సలిలసంపూర్ణంబులై యుండు. ఆజలంబులకు వృద్ధిక్షయంబులు లేవు. అగ్నిసంయోగంబున జలము ద్రిక్తమగునట్లు చంద్రసంపర్కంబున సముద్రజలంబు వృద్ధి యగుచుండు. క్షీణించుచుండు. శుక్లకృష్ణపక్షములయందు శశ్యుదయాస్తమయంబులం బోలి సముద్రజలంబు వృద్ధిక్షయంబుల నొందుచుండు. ఐదువందల పదియంగుళంబులు సముద్రజలంబులందు వృద్ధిక్షయంబులు చూడఁబడుచుండు. 975

క. జనులకు నాహారము చిక్కును గష్టమెలేక వారు కోరినరీతిన్
మునులార! షడ్రసంబులఁ, గొనుదురు భుజియించువేళఁ గూడిక మెఱయన్.

క. అనుపమమధురజలంబులఁ, గన నందముగాఁ జెలంగు త్ర్యాస్థలమున నె
ల్లను మనుజులు వసియింతురు, వననిధివాయువులు సౌఖ్యవారిధి ముంపన్.

సీ. ఆద్వీపమునయందు నమలకాంచనమయభూమియు ద్విగుణమై పొలుచుచుండు
జంతుజాలము లట జనుల బాధించెడు నవి గాన రావ దెందైనఁగాని
చక్రవాళాహ్వయ శైలంబు పదివేలయోజనంబుల పొడ వొప్పనుండు
దానియుత్సేధంబు తన్మితంబయి యుండు నంధకారము దాని నావరించి

తే. జనులదృష్టికి దానిదర్శనము లేక,
యుండఁ జేయును మునులార! యుర్విక్రోలఁత
కనఁగ నేఁబదికోట్లయోజనము లుండు
ద్వీపసాగరములఁ గూడి వెలయు నదియె. 978

వ. ఆభూమియే విధాత్రియు, సర్వభూతగుణాధికయు, సకలాధారభూతయు నని యెఱుంగవలయు నని పలికి మరల లోమహర్షణుం డిట్లనియె. 979

## పందొమ్మిదవ అధ్యాయము.

### అతలాదిసప్తపాతాళవర్ణనము.

క. క్షితివిస్తృతిఁ దెల్పితి స, ప్తతిసంఖ్యసహస్రములుగ ధాత్ర్యున్నతి స
న్మతులు గల దందు రింకను, క్షితిక్రిందం దనరు వానిఁ గీర్తింతుఁ దగన్. 980
సీ. పదివేలయామడల్ పాతాళలోకంబు లొక్కొక్కటియు నొప్పుచుండు నందు
నతలంబు వితలంబు నితలంబు సుతల తలాతలంబులును రసాతలంబు
పాతాళ మను నివ్వి పరఁగు నధోలోకసంజ్ఞితంబులు గాఁగ క్షమయుఁ గృష్ణ
వర్ణయు శుక్లయు వర్ణింపఁదగినట్టు లరుణయుఁ బీతవర్ణాంచితయును
తే. శర్కరయు, శైలమయియుఁ గాంచనమయియును
నగుచు, నాలోకములను దివ్యంబులగుచు
హర్మ్యములు పొల్చు దానవు లసురులు బహు
జాతులుగ నుండు, రవ్వారి సంఖ్యయరుదు. 981
వ. మహాంగంబు లగునాగంబులు జ్ఞాతులం గూడి యందుండు. స్వర్లోకంబునకంటె నధోలోకంబు లెల్ల రమ్యతరంబు లని నారదముని యొక్కతఱి వర్ణించె. మఱియుఁ బాతాళమునుండి కొందఱు స్వర్గంబున నివసించి రనియుం బలికె. అయ్యధోలోకంబుల నాహ్లాదంబుఁ గల్పించుచు శుభ్రతమంబులై సుప్రభంబులై మణులు వెలయు. అందును బాతాళంబున నాగాభరణంబు లగుమాణిక్యంబు లనర్ఘంబులుగ నలరు. కానఁ బాతాళంబున కేలోకము సాటిగాదు. అందందు నిచ్ఛావిహారంబులు సేయు దైత్యదానవకన్యలు గలపాతాళంబునందు విముక్తునకుం గూడ నప్రీతిగలుగదు. పగటివేళ సూర్యరశ్ములు లోకప్రకాశం బొనరింపం జాలుఁ గాని దానిఁ దపింపఁ జేయఁ జాలవు. రాత్రులందు శీతాంశుజ్యోత్స్నయు శీతోత్పాదనంబునకుం గాక ప్రకాశమాత్రంబునకె యగు. అందుండు భోగులు సురుచిరభక్ష్యభోజ్యమహాపానముదితులుగ నుందురు. అందలిదనుజాదుల కెంత కాలంబు గడచినను గనంబడక యుండు. వనంబులు నదులును సరస్సులును మనోహరంబులై చెలంగు. మఱియు. 982
క. అతులితపుంస్కోకిలకూజితములు తల్లోకమందుఁ జెలఁగుచునుండున్
మతి కింపుఁగూర్చువస్త్రము, లతిమాల్యవిభూషణంబు లనులేపనముల్. 983
సీ. వేణువీణాదికవిమలరవమ్ములు సన్మృదంగాదినిస్వనము లెప్డు
దలరారు నేవేవి యమలతమంబులో భాగ్యభోగ్యములు తద్వాసులైన
దైత్యదానవసర్పతతులచే ననుభవింపఁగఁబడుఁ; బాతాళజగములకును
గ్రిందిభాగంబునఁ గేవలతామసీతనువొప్ప శేషాహి యనుపమాన
తే. గుణనిధానము తానయ్యె కూర్మి నుండుఁ, దద్గుణంబుల వర్ణింపఁ దరముగాదు
సిద్ధదేవర్షివితతిసంసేవితుఁ డయ్యె యనంతుఁడు పొల్చు నట్లెన్నఁబడునొ. 984

క. అతఁడే యాశేషాహియు, క్షితిసురమునులార! వేయిశీర్షంబుల ను
న్నతిఁ గనుచు మహిమ వెలయఁగ, సతతము శ్రీస్వస్తికాదిసద్భూషణముల్.
క. తనువున వెలయఁగ ఫణములఁ, గనదురుమణు లొక్కవేయి గ్రాలఁగ దిశలన్
ఘనకాంతుల వెలయించుచుఁ, దనుధారుల నెల్ల విగతదర్పులుగాఁగన్. 986
క. సురలకు జగములకును హిత, మరయుచు మదఘూర్ణితాత్ముఁడై గుండ్రముగాఁ
బరఁగెడు తనువున నుండును, గిరీటమును దాల్చి శుద్ధకీర్తి యలరఁగన్. 987
తే. పూలమాలిక లొప్పార జ్వాల లొప్పు
నగ్నిఁ గూడిన శ్వేతభూధ్రాభుఁ డగుచు
నసితవస్త్రంబు ధరియించి యమలములగు
శ్వేతహారంబు లొప్పారఁ జెలఁగు నతఁడు. 988
తే. అభ్రగంగాప్రపాతయుక్తాంగ మైన
యట్టికైలాసపర్వత మట్టు లున్న
తిని దగం బొల్చి లాంగలమనెడు నాయు
ధము కరంబునఁ దాల్చి యుత్తమముసలము. 989
క. ధరియించి తన్నుఁ దానే, స్మరియించుచు మనమునందుఁ జంచత్తేజ
స్స్ఫురణమున నొప్పి వారుణ, శరీరమునఁ జెన్ను మీఱు సన్మునులారా. 990
సీ. ఏయనంతునివగు వేయిమోములనుండి విషవహ్నిశిఖలచే విస్తరిల్లి
సంకర్షణాత్మకసారబలాఢ్యరుద్రుఁడు వెల్వడుచునుండు రూఢి లోక
ములను మూఁడింటిని గలవిలపాటొందునట్లు చేయుచు మఱి యయ్యనంతుఁ
డుర్వరామండలం బుత్తమాంగంబున ధరియించి పాతాళధరణిమూల
తే. సంస్థితిని బొల్చుచుండు నిర్జరసహస్ర
సంతతార్చితుఁ డగుచు ననంతువీర్య
సుప్రభావస్వరూపముల్ సొరిదిఁ బొగడఁ
దెలియఁ జాలరు సుంతయు దివిజులైన. 991
వ. ఏయనంతునిచే ధారితంబగునీభూమి ఫణామణిశిఖారుణమై కుసుమమాలవలె వెలయుచున్నదో యట్టియనంతునివీర్య మిట్టిదని వర్ణింప నేరితరంబు? ఆయనంతుఁడు మదాఘూర్ణితలోచనుండై యెపుడు విజృంభించునో యపుడీభూమి సాద్రితోయాదికాననయై కంపించును. గంధర్వాప్సరస్సిద్ధకిన్నరోరగరాక్షసులు తద్గుణంబు లిన్నియని యీనిపార మిది యని కనుఁగొనఁ జాలకుండుట ననంతుం డనం బరఁగె. అతఁడవ్యయుండు నాగకాంతాహస్తలేపితహరిచందనం బయ్యనంతునిశ్వాసానిలంబుల దిక్పటవాసత నొందుచుండు. ఏయనంతు నారాధించి పురాణమహర్షియగు గర్గుండు జ్యోతిస్సుల నెఱింగెనో అట్టిశేష ఫణిపతిచే శిరస్సుచే నీభూమి ధరియింపఁబడుసదేవాసురమానుషంబులగు

సకలలోకంబుల నాతండె ధరియించు నని పలికి మఱియు లోమహర్షణుం డిట్లనియె. 992

## ఇరువదవఅధ్యాయము.

### రౌరవాదినరకనిరూపణము.

క. నరకము లుదకాధస్స్థిత,ధరణిం గనఁబడుచునుండు ధర్మేతరమా
ర్గరతులకొఱ కవ్వానిని, సరసిజజని పుట్టఁజేసె సన్మునులారా! 993

వ. రౌరవంబు, శౌకరంబు, రోధస్తనంబు, విశసనంబు, మహాజ్వాలంబు, తప్తకుంభంబు, మహాలోభంబు, విమోహనంబు, రుధిరాంధంబు, వైతరణియుఁ, గృమిశంబు, కృమిభోజనం, బసిపత్రవనంబు, కృష్ణనామకంబు, లాలాభక్షంబు, దారుణంబు, పూయవహంబు, వహ్నిజ్వాలం, బధశ్శిరంబు, సదంశంబు, కృష్ణసూత్రంబు, తమసం, బావీచినామకంబు, శ్వభోజనం, బప్రతిష్ఠం, బవీచి మొదలగు నరకంబులు మిగుల భయంకరంబులై, దారుణంబులై యమనగరంబున శస్త్రాగ్ని భయదాయకంబులై యుండు. 994

క. పురుషులు పాపక్రియ లా,దరమున నొనరించువారు ధర్మేతరమై
పరఁగెడు పక్షమ్మున నిల్చి రహిఁ సాక్షిత వహింపఁ జేరెడువారల్. 995

తే. పక్షపాతమూని పల్కెడువారలు, వలయు ననుచు ననృతవాక్కు లలరఁ
బలుకువారు వీరు పడుదురు రౌరవ,నరకమందు మౌనినాథులార. 996

సీ. భ్రూణహత్య యొనర్చుపురుషుఁడు, గురుహంత,
గోహత్యయొనరించుకుమతి, యొరుని
యుచ్ఛ్వాసముల నాపునుగ్రమనస్కుండు
ఘోరరౌరవమునఁ గూలుచుంద్రు
సురఁద్రాగునాతఁడు ధరణిదేవులఁజంపు
నతఁడు సువర్ణంబునపహరించు
నతఁడును సూకర మనునరకంబునఁ
బడుదురు వీరితోఁ బరమమైత్రి
తే. యలర నివసించువారు మహత్తరముగఁ
గానఁబడు సూకరంబునఁ గఠినబాధ
లనుభవింతురు రాజవైశ్యజనహంత
లట్లె గురుతల్పగుఁడు నను నఘకరు లొగి. 997

ఆ. తప్తకుంభ మనెడుదారుణనరకంబు,నందుఁ బడుదు; రుర్వియందు నెవఁడు
స్వసను గూడు నెవఁడు సాధ్వీపతిభటుఁ జంపు,నెవఁడు సాధ్వివిక్రయించుఁగడఁగి.

సీ. ఎవఁడు మద్యము నమ్ము నెవఁడు కేసరవిక్రయమున జీవించు వీరంద ఱొక్క
మొగిఁ దప్తలోహంబునఁ గడుఁ గష్టంబుల ననుభవింతురు క్రూరులగుచు నన్న
మును ద్యజింతురొ పుత్రికను స్నుషఁ గూడుదురో మహాజ్వాల మణనామధేయ
మునుదాల్చి భయమును గనఁజేయునరకంబునందు నుందురు కష్ట మనుభవింప;
తే. గురువులకు నవమానంబుఁ గూర్చు నెవఁడు
వారి దూషించు నెవ్వఁ డెవ్వండు వేద
ములను దూషించు వాని నమ్ముకొను నెవఁడు
పొందఁదగనట్టివారిని బొందు నెవఁడు. 999

క. వారెల్లఁ దశబలం బను,ఘోరమహానరకమందుఁ గూలుదు రొకటఁ
జోరుఁడు విమోహమునఁ బడు, ధారణిసురులార! నరకతత్త్వం బిటులొ.1000

వ. మర్యాదాదూషకుండు, దేవద్విజపితరులద్వేషించువాఁడు, రత్నదూషకుండు కృమిభక్ష్యనామకనరకంబునం బడి కృమిగణములం దినుచునుండు. మఱియుఁ బితృదేవాతిథుల వదలి యెవఁడు భుజించు, నప్పాపాత్ముండు లాలాభక్ష్యనర కంబునఁ గ్రుంగు. శరకర్త, వేధకనరకంబునఁ బడియుండు కర్ణినామకబాణంబులఁ జేయువాఁడును, ఖడ్గాదులనిర్మించువాఁడును భృశదారుణం బగు విశసననర కంబునఁ బడుదురు. దుష్టవస్తువులఁ బ్రతిగ్రహించువాఁడధోముఖనరకంబున నుండు. అయాజ్యయాజకుండు, నక్షత్రసూచకుండు, కృమిపూయ మనునిరయం బునంబడి మిష్టాన్నంబులఁ దినుచుందురు. లాక్షామాంసరసంబులను, దిలలను, లవణంబును విక్రయించుబ్రాహ్మణుఁడు కృమిపూయనరకంబునందె పడియుండు. మార్జార కుక్కుట చ్ఛాగశ్వ సూకర విహంగంబులఁ బోషించునతండు పూ రోప్తనరకంబున కేగు. రంగోపజీవియుఁ గైవర్తుండును, గుండాశియు, విష ప్రదాతయు, సూచియు, మహిషవిక్రయమున జీవించువాఁడును, బర్వముల భార్యఁగూడువాఁడును, గృహదాహకుండును, మిత్రఘ్నుఁడును, శకునంబులఁ జెప్పువాఁడును, గ్రామయాజకుండును, నగుబ్రాహ్మణుండు రుధిరాంధంబునఁ బడు దురు. సోమవిక్రేతయు, మధువు దొంగిలించునాతండును, గ్రామాపకారియు, వైతరణియను నిరయంబున నుందురు. రేతఃపానాదికర్తయు, మర్యాదాభేదకుం డును, గృచ్ఛ్రనరకంబునఁ బడియుందురు. అపరిశుద్ధులు, మోసముచేయుచు జీవించువారు నసిపత్రవనంబున బహుకష్టంబుల ననుభవింతురు. నిష్కారణ ముగా వనముఛేదించువాఁడును, నౌరభ్రికుండును, మృగవ్యాధుండును, వహ్నిజ్వాల మనుదుర్గతిం బడి శ్రమములనొందుదురు. ఎవఁ డభక్ష్యవస్తువుల వండునో, వ్రతోపలోప మొనరించునో, ఆశ్రమచ్యుతుఁడయి యాశ్రమాంత రము నొందకుండునో వారెల్ల సందంశయాతనాభాక్కు లగుదురు. మఱియు

ఆ. బ్రహ్మచారియయ్యుఁ బవలు రేతస్సేక, మొనరుచునొ తనూజుఁ డనువదింప

నెవఁడు విద్యనేర్పు నిట్టివారు శ్వభోజ,నాఖ్యనరకకూపమందు నుండ్రు. 1002

క. నరకము లీపేర్కొనినవి, కరము భయంకరము లౌచుఁ గానంబడు నీ
నరకములుగాక యింకను, నిరయంబులు గలవు వేలు నియతంబులుగన్. 1003

తే. అందు దుష్కృతకర్ము లొనట్టినరులు
పడుచుఁ గష్టంబు లొందుచుఁ గడఁగి మున్ను
తమ రొనరిచినపాపాళిఁ దలఁచి తలఁచి
కుందుచుందురు మునులార యందె చిరము. 1004

సీ. ఇచటఁ బేర్కొనినట్టి యెల్లపాపంబులుగాక యింకను బాపగణము గలదు
దాని లెక్కింపఁగఁ దరముగా కుండును నరకాంతరమ్ముల నరులు కుడుచు
కష్టంబు లివియని గణుతింపరాదు వర్ణాశ్రమరహితము లైనకర్మ
ముల మనోవాక్కాయములఁ బూని యొనరించుకుమతులు నారకకూపగణము
తే. నందుఁ బడియుందు; రవ్వియు నమరవరుల
చేతఁ దలక్రిందుగా నున్నయాతనాగ
తులుగ నున్నట్టిపాపితతులు గలవిగఁ
గనుఁగొనంబడుచుండు నిక్కముగ సతము. 1005

వ. నరకంబులు క్రిందనుండ దేవత లూర్ధ్వభాగస్థితస్వలోకంబులనుండి చూతురు. స్థావర కృమి జలజ, పక్షి, పశువులు, ధార్మిక త్రిదశ ముముక్షువులు ప్రథమ స్థానసహస్రగుణితోర్ధ్వభాగంబుల నుందు రని యెఱుంగవలయు. ఎందఱు పుణ్యలోకంబుల నుందురో యందఱు నరకంబులయందు నుందురు. పాపంబుల నొనరించి ప్రాయశ్చిత్తకర్మంబులఁ జేయ నొల్లకుండువారు నరకంబునంబడుదురు. పాపంబులఁ బరిహరింపఁ దగినప్రాయశ్చిత్తంబులు పరమకారుణికు లగుమహర్షుల చేఁగల్పితంబు లయ్యె. మఱియు స్వాయంభువాదులగు మహాత్ములు గురుతరపాపంబులకు గురుతరప్రాయశ్చిత్తంబులను లఘుపాపంబులకు లఘుప్రాయశ్చిత్తంబులను, సర్వవిదులౌట నేర్పఱచిరి. ప్రాయశ్చిత్తంబు లన్నియుఁ దపఃకర్మాత్మకంబులు వాని కన్నింటికిని శ్రీకృష్ణానుస్మరణము ప్రధాన మని తెలియవలయు. మఱియు. 1006

క. మనమున నెవనికిఁ దాఁ జే,సినపాపమ్ములకు శాంతిఁ జేయం దగు నం
చను తాపము గల్గునో యా,తనికి హరిస్మృతియె యఘువితానహరం బౌ. 1007

సీ. ఉదయమధ్యాహ్నము లుభయసంధ్యలు రాత్రి హరిని స్మరింపంగ నర్హములగు
నట్టివేళలయందు హరిని స్మరించినఁ బాపక్షయం బగుఁ బరమపదము
నొందుయోగ్యత గల్గు సుందరశ్రీవిష్ణుసంస్మృతిచేతనే సకలపాప
ములు లయమొందఁగా ముక్తికిం జను స్వర్గసంప్రాప్తి యతనికి సాధుముక్తి

తే. విఘ్నముగఁ దోఁచుచుండును విమలరీతి
సేవనియమమున వాసుదేవేష్టరూప
మర్చనాదిని జపకాలమందు హోమ
సమయమున నిల్చునో యట్టిసాధుమతికి. 1008

క. శతమఖపదాధిపత్యము, మతి దలఁపఁగ విఘ్న మనుచు మానుగఁ దలఁపుం
డితరపదంబులు లెక్కయె, యతనికి? మఱి యొక్కమాట సర్వము వినఁగన్,

తే. మరలఁ బుట్టంగఁజేయు నమర్త్యరాజ
పద మ దెక్కడ? శాశ్వతపరమసుఖముఁ
గలుగఁజేసెడుముక్తి యెక్కడ? తలంప
వాసుదేవమంత్రంబు నెవ్వఁడు జపించు. 1010

వ. అతని కక్షయముక్తిపదంబు లభించుఁ గావున నహర్నిశంబులు శ్రీవిష్ణునామస్మరణంబు చేయఁదగియుండు. అట్టు లొనరించుమహాత్ముఁడు సకలపాపంబులు నశింప నరకంబునుం జూడక ముక్తిపదంబునకుం బోవు. స్వర్గంబు మనఃప్రీతికరంబు. నరకంబు తద్విపర్యయంబు. పుణ్యపాపంబులు స్వర్గనరకంబు లని చెప్పంబడు. 1011

సీ. ఒకవస్తువే దుఃఖ మొయ్యన సమకూర్చు సుఖమును జేకూర్చు సొరిది నీర్ష్యఁ
గలిగింపఁ గోపము వెలయింప నంతియగాని తర్కింప దుఃఖమునె గల్గఁ
జేయువస్తువు లేదు? క్షితిసురమునులార! ప్రీతిని గల్గింప భూతలమున
నేవస్తు వలరునో యావస్తువే దుఃఖమును గలిగింప నొప్పు నని యెన్నఁ

తే. డదియె కోపాలయం బగు నదె ప్రసాద
మునకు నగుఁ గాన నొకదుఃఖమునె గలుగఁగఁ
జేయువస్తువు సుఖమునె సిద్ధి నొందఁ
జేయువస్తువు లే దని చెప్పనగును. 1012

క వినుఁడీ సుఖదుఃఖాత్మక, మనఁ దగులక్షణము గల్గునట్టి యిదియు నో
మునులార! మనఃపరిణతి, జను లెఱుఁగరు దీనివిధము జ్ఞానము లేమిన్. 1013

క. జ్ఞానంబె పరబ్రహ్మము, జ్ఞానమె బంధంబుఁగూర్పఁ జాలునదియు నో
జ్ఞానాత్మక మీవిశ్వము, జ్ఞానేతర మొకఁడు లేదు జగతి నిజముగన్. 1014

సీ. విద్య యవిద్యనా వెలయును జ్ఞానమే మునులార మీకును భూమిమండ
లమురీతిఁ దెల్పితి నమరఁ బాతాళాదికముల వార్తలను జక్కంగఁ దెల్పి
తిని నారకంబుల తెఱఁగు వర్ణించితి జలధులు ద్వీపముల్ శైలములును
వర్షముల్ నదులును వరుసఁ దెల్పంబడె; సంక్షేపముగ నిట్లు జగము వార్త

ఆ నెఱుకపఱుపఁబడియె నింకను వినఁగోరు, వారొ దేనిఁ దృప్తి మీర లనుచు
లోమహర్షణుండు భూమినిర్జరమౌని,వరులఁ జూచి పలుక వారలపుడు. 1015

## ఇరువదియొకఁడవ యధ్యాయము.

### భూమ్యాకాశాదిపరిమాణములు.

క. మునివర! మీచే నంతయు, వినిపింపం బడియె భూమివృత్తాంతం బిం
కను మాకు భువర్లోకా,దినిఖిలలోకములవార్తఁ దెలుపఁబడఁ దగున్. 1016

తే. గ్రహము లుండెడుతావులు ఖచరవితతి
పరిమితులు చక్కఁ దెల్పుమా కరుణ ననిన
లోమహర్షణుఁ డెంతయుఁ బ్రేమ మలరఁ
బలికె నిట్లని మునులకుఁ బ్రౌఢభణితి. 1017

చ. ఖరకర శీతరశ్మి గురుకాంతులచే వెలుఁగొందుచున్ మహా
త్తరతటినీసముద్రగిరితల్లజసంయుత యైనయట్టి దు
ర్వర యని చెప్పఁగాఁబడియె వారియుఁ జుట్టుకొనంగ నొప్పునీ
ధరణిసమప్రమాణ మగుఁ దప్పక వ్యోమము శాస్త్రరీతిచేన్. 1018

సీ. లక్షయోజనము లిలాస్థలినుండి లెక్కింపఁగ నెంతయుఁ గీర్తనీయ
మగు సూర్యమండల మంబరంబున నున్నయట్లుగానంబడు నవల రెండు
లక్షలచేతసంలక్షితస్థలమున శశిమండలం బుండుచంద మొప్పు
నవ్వల నొకలక్ష యగుయోజనంబులఁ దారకామండల మారయంగఁ

తే. గానఁబడు చుండు మీఁద నక్కడకు రెండు
లక్షలగు యోజనమ్ముల లలి బుధగ్ర
హముచెలంగెడుమండలం బమరియుండు
నంతపరిమాణమగు దూరమందె కవియు. 1019

క. ధరణీతనయుం డంతటి,పరిమాణము గల్గుదూరపదమునఁ గలికిం
బరికింపంబడు; నవ్వల, గురుఁ డుండును దివిని గాంతికూటము దగగన్. 1020

తే. రెండులక్షలఁ దగుదూర ముండుఁ గుజగు
రులకు నంతరమందు; నవ్వల ద్విలక్ష
యోజనము లంతపాడవున నుండు శనియు
నతనికిన్ లక్షపరిమితి నంతపైన. 1021

క. మునిసప్తక ముండును నా, మునులకు పైభాగమందు మునుకొని ధ్రువుఁ డుం
డును లక్షయోజనంబుల వినుఁ డాపద మొప్పు సమతవెలయం గనఁగన్.

వ. మేఢీభూతుండయి ధ్రువుం డుండు నని యెఱుంగందగు. ఇది త్రైలోక్యసార కథావిషయంబు. ఇజ్యాఫలంబునకు భూమియిది యాధారంబు. యజ్ఞం బీభూమియందె ప్రతిష్ఠింపఁబడు. ధ్రువునకుం బైన మహర్లోకం బుండు. అందుఁ గల్పవాసు లుందురు. కోటియోజనంబులు తత్పరిమాణం బని లెక్కింపనయ్యె. అవ్వల జనలోకంబు రెండుకోట్లయోజనంబులవిస్తీర్ణంబు గలిగియుండు. అందు

బ్రహ్మసుతు లుందురు. వారె సనందనాదు లని పరిగణింపంబడుచుందురు. నిర్మల
తేజోవిరాజితులై వా రెప్పు డొక్కరీతినుందురు. జనలోకపరిమితి చతుర్గుణిత
పరిమాణంబునఁ దపోలోకం బుండు. విదేహులై వైరాజసంజ్ఞికదేవత లందుం
దురు. తపోలోకషడ్గుణపరిమాణంబు గలిగి సత్యలోకం బలరుచుండు. అందు
మృతివర్జితు లగువారె నివసింతురు. పృథివీమయంబై పాదగమ్యం బగువస్తు
వొక్కటియు నందు లేదు. మునులారా! భూలోకప్రమాణంబు నాచేఁ జెప్పఁ
బడియెఁగదా. భూమిసూర్యాంతరంబున సిద్ధాదిమును లుందురు. రెండవది
భువర్లోకం బని వినుతింపం బడియె. ధ్రువసూర్యాంతరము చతుర్దశనియు
తంబు లని యెఱుంగుఁడు. స్వర్లోకంబు తెఱం గెఱింగించితి. ఈలోకత్రయంబు
కృతకం బనిపెద్ద లనువదింతురు. జనతపస్సత్యలోకంబు లనుమూఁడు నకృతకం
బులని తెలియందగు. ఈకృతకాకృతకంబుల నడుమ నుండునది మహర్లోకంబు
అది కల్పాంతంబున శూన్యంబై యవినాశనం బయియుండు. ఇట్లు మహా
లోకంబు లేడును వర్ణితంబు లయ్యె. పాతాళలోకంబు లేడును జెప్పంబడియె.
బ్రహ్మాండపరిమాణము కీర్తితం బయ్యె. మఱియును. 1023

సీ. ధారణీసురమునితల్లజులార! బ్రహ్మాండకటాహ మీయఖిలభూమిఁ
దిర్యగూర్ధ్వముల నాతీరుననే యధోభాగంబులఁ గపిత్థఫలమునందు
బీజంబు సర్వత్ర వెలసినయట్టులు వ్యాపించియున్నది; యవనిభాగ
మునకంటెఁ బదిరెట్లుగను జలంబులచేత వ్యాపింపఁబడును బ్రహ్మాండ మిద్ధి
ఆ. అట్టిజలము లగ్ని యావరింపఁగ నుండు, వహ్ని యదియుఁ దన్ను వాయు వావ
రింప నొప్పు నదిపరీవృత మగునభం,బుననె యంచు నెఱుఁగుఁ డనయ మిట్లు.

క. వ్యోమమ్ము మహత్తత్త్వము,చే మించిన యీశశక్తిచే నావృతమై
ఓమౌనులార! వెలయును, శ్రీమద్దైవంపుశక్తి జెప్పం దరమే. 1025

వ. ఈయేడును దశోత్తరపరిమాణంబుగలవియై యొకదాని నొకటి యావరించి
యుండు. ఆమహత్తత్త్వంబును బ్రధానంబగువిరాట్టు నావరించియుండు.
ఆవిరాట్టుపరిమాణం బనంతం బగుటనెఱుంగఁ దరంబుగాదు. ఆయావృతి విష
యంబును దెలియ శక్యంబుగాదని నిశ్చయింపుఁడు. మఱియు. 1026

సీ. అదియశేషమునకు నరయఁగా హేతుభూ
తమని చెప్పంబడు నమలతత్త్వ
మది పరాశక్తియే యగునట్టి ప్రకృతియా
బ్రహ్మాండములసంఖ్య పరిమితికిని
మీంచియుండును వాని నెంచఁ దరంబుగా
దనుచుఁ జెప్పుటయె న్యాయంబునగును

దరువున వహ్నియుఁ బరికింప నెట్లుండు
దిలలఁ దైలంబెట్టితీరునఁ గనఁ
తే. బడునొ యట్టులె యోమునివర్యులార!, యా ప్రధానంబునందె యత్యంతనియతిఁ
బురుషుఁ డుండును వ్యాపకుం డరయ నితఁడె, చేతనాత్మనివేదనసిద్ధిఁ గనుచు

క. వినుఁడు ప్రధానము పురుషుఁడు, ఘనతరసద్విష్ణుశక్తికలన వెలయుచుఁ గా
గనఁబడుచుండ్రు పరస్పరమును జక్కని యాశ్రయమును బొందినరీతిన్. 1028

తే. సర్వభూతాత్మభూతయై సమధికముగ
నలరు నావిష్ణుశక్తి నెట్లనువదింప
శక్య మగును? ప్రధానంబు సమధికంబు
పురుషుఁ డట్టిఁడె యగునని పోలఁగనుఁడు. 1029

వ. ఆప్రధానపురుషులకు సంశ్రయకారణంబు పృథగ్భావంబె యగు. సర్గకాలంబున నాపృథగ్భావరూపశక్తి క్షోభకారణభూతయగు. వాయువు జలమందున్న శైత్యమును జలకణికాగతంబుగ నెట్లుధరించునో యట్లే విష్ణువు జగచ్ఛక్తియుఁ బ్రధానపురుషాత్మకం బగునని చెప్పంబడు. వృక్షం బెట్లు మూలస్కంధశాఖాదిసంయుతంబై యాద్యబీజమునుండి పుట్టువుం గాంచునో దానినుండి పెక్కుబీజంబు లెట్లుత్పత్తిల్లునో వానినుండి యెట్లు బహువిధవృక్షంబులు పుట్టునో యవియుఁ దల్లక్షణంబులు గలవిగ నెట్లుండునో యట్లే యవ్యక్తమునుండి మహదాదితత్త్వములు పుట్టువుంగాంచు. వానినుండి విశేషాంతంబు లగుసురాదిభూతంబులు పుట్టుచుండు. వారినుండి పుత్త్రులను పేర భూతంబు లుద్భవిల్లు. వానినుండి సుతు లుద్భవింతురు. బీజమునుండి వృక్షప్రరోహమ్మునఁ దరువున కపచయంబు లేనియట్లు భూతంబులకు భూతసృష్టిచే నపచయంబు లేదు. తరువునకు నెట్లు సన్నిధానంబువలన నాకాశకాలాదులు కారణంబు లగునో అట్లే విశ్వంబున కపరిణామంబున భగవంతుం డగుహరి కారణం బగు. వ్రీహిబీజంబున మూలనాళపత్త్రాంకుర కాండ కోశ పుష్ప క్షీరతండుల తుషాకణంబు లుండి శ్రేష్ఠంబగు ప్రరోహహేతువు నొందునట్లు బహువిధకర్మవిశేషంబుల దేవాదితనువులు సంభవించు. ఆకర్మంబులు విష్ణుశక్తినొంది ప్రరోహత్వము నొందుచుండు. 1030

క. కినఁబడు నీజగమంతయు, జనిఁ గాంచును వృద్ధినొందు సమయు నెవనివం
కను విష్ణు వతఁడె బ్రహ్మయు, నన నతఁడె సమస్తమునకు నాధారుఁడు నా. 1031

సీ. అతఁడె ప్రధానంబు నతులధామము సదసత్పరమం బనఁ జాలుపదము
నగుఁ దదభేదంబె యగు నీజగంబెల్ల నతఁడె యా మూలప్రకృతియు మఱియు
వ్యక్తరూపము నొందనగు జగంబులు గాఁగ విలయమొందినతఱి విలసితములు
గా నున్నభూతముల్ క్రమ్మఱ నాతత్త్వమందె లీనము లగు నట్టితత్త్వ

తే. మఖిలకార్యంబులకుఁ గర్త యగును బూజ్య
మగును యజ్ఞంబు నగు మఱి యజ్ఞఫలము
నగును సర్వంబు నగు భిన్న మంతకంబెఁ
గానరా దెద్దియును మునికాంతులార. 1032

ఇరువదిరెండవ అధ్యాయము.

శింశుమారచక్రనిరూపణము.

చ. అని మఱియుఁన్ వచించెను మహర్షులు ముజ్జలధిన్ మునుంగఁ జ
క్కనిగతి శింశుమార మనఁ గ్రాలెడునాకృతిఁ దారకామయం
బనఁదగు నాపరేశ్వరునిదౌగగనాంగము చెన్నుమీఱు నం
దునఁ దగు పుచ్ఛభాగమునఁ దోఁచు ధ్రువస్థితి నేత్రపర్వమై. 1033

క. తిరుగుచు దా నాధ్రువుఁ డా, సరసిజబాంధవముఖాది సకలఖగములన్
దిరుగం జేయుచు నుండును, సరిగాఁ జక్రాకృతిని భసంతతి త్వరఁగన్. 1034

క. తిరుగుచునుండును; సూర్యుఁడు, సరసీరుహవైరియు నుడుసముదాయము ఖే
చరులును నక్షత్రంబులు, వరుసన్ శ్వసనౌఘుమయసుబంధంబులచేన్. 1035

తే. చక్క బంధింపఁబడియుండు సాంద్రశింశు
మారచక్రాకృతిన్ గ్రహామండలములు,
తారకలు నంబరంబునఁ దగినయట్టు
లుండునో వాని కెల్లర కుద్యమమున. 1036

క. నారాయణుండు సకలా,ధారుఁడు సకలాతిశాయి! ధాముఁడు కననా
ధారుఁడగు మానులారా!, శ్రీరమణుం డతఁడె సర్వసిద్ధిప్రదుఁడౌ. 1037

తే. అతఁ డుత్తానపాదునియాత్మజుండు, చిన్నతనమున నాధ్రువుం డెన్నఁదగిన
నియతిఁ బూని ప్రజాపతి నెమ్మి నాశ్రయించి పూజించి కాంచె నహీనశక్తి.

వ. తారాశింశుమారచక్రంబులకు ధ్రువుండు పుచ్ఛంబున నుండఁజాలె శింశుమా
రంబున కాధారభూతుండు సర్వాధ్యక్షుండు జనార్దనుండు. శింశుమార చక్ర
ధ్రువపదంబున సూర్యుండు వ్యవస్థితుం డగు.సదేవాసురమానుషం బగునీజగం
బెల్లఁ దదాధారం బగు. ఏవిధానమున నిట్లాధార మగునో యావిధం బెఱిం
గించెద నని మఱియు నిట్లనియె. 1039

సీ. సరసిజమిత్రుఁడు సాంద్రకరంబుల మాసాష్టకము రసాత్మకజలంబు
గ్రసియించుచుండుఁ దదవ్వత వర్షించును దాన నన్నము గల్గుఁ దనరునిఖిల
జగములెల్లను; వివస్వంతుండు తీక్ష్ణంబు లగుకిరణంబుల నవనిజలముఁ
గైకొను సోముని గడఁగి పోషించును జంద్రుండు నంబరస్థలమునందు

తే. వాయునాడీమయంబులై వఱలు నీటిఁ
జల్లు ధూమాగ్న్యనిలమూర్తిసముదయముల
యందు సలిలంబు లవి వానియందు నిమిడి
చెదరకయె యుండు నోమునిశ్రేష్ఠులార. 1040

వ. అభ్రగతంబులగు నాజలంబులు వాయుసముదీరితంబులై కాలజనితసంస్కా-
రంబు నొంది నిర్మలంబు లయి సరిత్సముద్రాకృతి భౌమంబు లగు ప్రాణిసంభవం
బులు నగుభగవంతుఁ డగువివస్వంతుండు నాల్గువిధంబుల జలంబుల స్వకరంబుల
గ్రహియించు. ఆకాశగంగాసలిలంబులను స్వగభస్తివితతి నాకర్షించి యుర్వి
వానిచేఁ దడుపు. తత్సంస్పర్శమాత్రనిర్ధూతపాపపంకులై మర్త్యులు నరకంబు
నొందరు.దానికి దివ్యస్నాన మనిపేరు గల్గు. ఆజలంబు మేఘసహాయంబు నొంద
కుండునని యెఱుంగవలయు. ఆకాశగంగాసలిలంబు రవికిరణంబులచే జల్లం
బడు. కృత్తికాదివిషమనక్షత్రంబులయందు దివంబునుండి వచ్చుజలంబు దిగ్గజో
ఝ్ఝితంబగుగాంగసలిలం బని తెలియవలయు. యుగ్మనక్షత్రములందు దివంబు
నుండియరోఁద్ధృతజలంబు పతితంబగునాజలంబు సూర్యరశ్మిలద్వారంబుగ
వచ్చునది యనియెన్నఁబడు. ఈభేదద్వయం బగుజలంబు పుణ్యంబు. నరుల
పాపంబుల నడంచు నని తెలియవలయు. ఆకాశగంగాసలిలస్నానము దివ్య
స్నానమని చెప్పంబడు. మఱియు. 1641

చ. ఘనములు వృష్టిరూపమున క్ష్మాస్థలిపైఁ గురియించు నీరు ప్రా
ణినికరసంప్రమోదదము నిత్యము నౌ మఱియోషధివ్రజం
బును బెనుపొందఁజేయఁదగు భూరితమామృత మద్దియాట జీ
వన మని మానవుల్ పలుకువా రమృతం బదియౌను వారికిన్. 1042

క. దాన మహౌషధు లెల్లను, బూనిమహావృద్ధినొందుఁ బొలుచు మనుజసం
తానమునకు సాధకముగ, నౌను ఫలాంతమ్ము లగుచు నలరు నవనిలోన్.

చ. మనుజులు శాస్త్రదృష్టు లయి క్ష్మాస్థలిఁ బొల్చుట వేదసిద్ధమై
తనరు మఖవ్రజంబును లతాఫలసంతతిఁ జేయుచుంద్రు ని
త్యనియతి దాన దేవతల హర్షము నొందఁగఁ జేయుచుందు రో
మునివరులార! యీకరణి భూమిని యజ్ఞము లన్ని వేదముల్. 1044

తే. విప్రపూర్వకవర్ణముల్ విబుధనికర,
ములును బశుభూతగణములు చెలఁగు వృష్టి
సాయముననె చరాచరజగము దాని,
చేతనే వర్ధితంబగు సిద్ధమిద్ది. 1045

క. ఆవర్షము రవివలననె, యావిర్భావంబు నొందు నాభానునకున్
శ్రావింప ధ్రువుఁడు ప్రాపౌ, భూవిభుసూనునకుఁ బుణ్యమూర్తి కతనికిన్. 1046

తే. శింశుమారచక్రం బనఁ జెలఁగుపదమె,
యాశ్రయం బగు నదియు నారాయణాశ్ర
యమగు; నారాయణుఁడు తదీయాంతరమున
నిలిచి యుండును సర్వంబు వెలయఁజేయ. 1047
తే. భూతజాలంబులను సంప్రభూతశక్తిఁ, దా భరించు నన్నింటికిఁ బ్రధానుఁడగును
మఱి సనాతనుఁడై యొప్పు మౌనులార, తెల్పినాఁడ బ్రహ్మాండమతీరునెల్ల.

---

ఇరువదిమూఁడవ అధ్యాయము.

తీర్థమహిమము.

చ. అనవిని మౌను లిట్లని రహర్శ్యతపోధన! లోమర్షణా!
ఘనధరణీస్థలిన్ గలుగు కామదతీర్థములన్ మహాఫలం
బును గరుణించుక్షేత్రములఁ బూని వినంగను కోర్కి గల్గెఁ గా
వున వినిపింపుమా యనినఁ బొంగెడువేడుక నాతఁ డిట్లనున్. 1049
సీ. ఎవనికరాంఘ్రు లక్లేమది విద్యయుఁ దపసు కీర్తియు నియతమును గనునో
యతఁడు తీర్థఫలంబు నందు నేపురుషుని మనసు విశుద్ధం బగునో తలంప
నదియె తీర్థంబగు నమలవాక్కులు తీర్థమగు నింద్రియావళి నట్టె నిగ్ర
హించుటయును తీర్థ మేయగు నివ్వియె యంగజతీర్థంబు లనఁగఁబడును
తే. స్వర్గమార్గంబు నివి తెల్పఁ జాలియుండుఁ; జిత్త మంతర్గతంబయి చెలఁగి స్వేచ్ఛఁ
దిరుగు, నద్దియు నెన్నియేఁ దీర్థములను,స్నానమొనరించినన్ శుద్ధి నూనదరయ.
క. శతవారంబులు తీర్థ,ప్రతతిజలంబులను శ్రద్ధ వఱలఁ గడిగినన్
సతతం బశుచియె మదిరా,యుతభాండమురీతి నెన్న నోమునులారా! 1051
చ. వ్రతములు దానతీర్థసమవాయము నాశ్రమముల్ దురాశయున్
సతత మనిర్జితేంద్రియుని జాలఁగ దంభరుచిం జెలంగుకు
త్సితమతి శుద్ధిఁ గాంచునటు చేయఁగఁజాలవు సత్య మిద్ది; యో
క్షితిసురమౌనులార! హితచిత్తత నింద్రియసంఘమున్ దగన్. 1052
చ. తనవశమందు నుండెడువిధంబున జేసి మనుష్యుఁ డేస్థలం
బున వసియించినన్ శుచియె పోలనతండు తదీయవాసతం
దనరెడుభూమియే జనపదంబుల మేటి ప్రయాగమౌ నదే
కనుఁగొనఁ బుష్కరంబె యగుఁ గమ్రఫలంబుల నీయఁజాలెడున్. 1053
క. మునులార! కురుక్షేత్రం, బన నదియే యగును, గాన హారితరక్షే
త్రనికాయముఁ దీర్థంబుల, వినిపింతున్ వినఁగ మీకు వేడుక గానన్. 1054
ఆ. విస్తరించి చెప్ప విసుగుజనించునో, యనుచు సంగ్రహించి యనువదింతుఁ;
బుడమిఁగలుగుతీర్థముల నాయతనములఁ, దెలిసినంతవట్టు తేటపడఁగ. 1055

క. ధరణిగల పుణ్యతీర్థో,త్కరముల క్షేత్రములఁ జెప్పఁగా శక్యంబె
క్కరణి నగు; నాదియగుఁ బు,ష్కరణి యనం జెల్లునద్ది కడుఁ బుణ్యదమా.

వ. నైమిశారణ్యంబు, ప్రయాగంబు, ధర్మారణ్యంబు, ధేనుకంబు, చంపకారణ్యంబు,
సైంధవారణ్యకంబు, సగరారణ్యంబు, దండకారణ్యంబు, గయాక్షేత్రంబు,
ప్రభాసంబు, శ్రీతీర్థంబు, కనఖలాఖ్యంబు, భృగుతుంగ, హిరణ్యాక్ష, భీమా
రణ్య, కుశస్థలీ, లోహార్గళ, కేదార, మందరారణ్య, మహాలయ, కోటితీర్థ, రూప
తీర్థ, శూకరతీర్థ, చక్రతీర్థ, వ్యాసతీర్థ, శాఖోటికతీర్థ, కోకాముఖతీర్థ, బదరీ
శైల, సోమతీర్థ, తుంగకూట, స్కందాశ్రమ, సూర్యప్రభ, ధేనుసర, సప్తమా
ముష్మిక, ధర్మోద్భవ, కోటితీర్థ, సర్వకామికతీర్థ, సూర్యప్రభ, మహాకుండ,
సోమాభిషేచన, మహాశ్రోత్ర, కోరక, పంచధారతీర్థ, త్రిధారక, సప్తధారతీ,
ర్థైకధారతీ, ర్థామకంటకతీర్థ, సాలగ్రామ, చక్రతీర్థ, కదలీహ్రద, విద్యుత్ప్రభతీర్థ,
దేవహ్రద, విష్ణుప్రభ, శంఖప్రభ, దేవకుండ, వజ్రాయుధ, వస్త్రాపదతీర్థ, బర్హా
పద, లోకారోహణ,స్వయంవట, భద్రబల, కౌశాంబ, దివాకర, ద్వీపతీర్థ, సార
స్వత, దేవతీర్థ, విజయ, కామజ, సోల్లయ, తీర్థాంగోపచారతీర్థ, చవరతీర్థ, వన
పూర్ణ, స్నానకుండ, ప్రయాగ, గుహావ్యాయ, విష్ణుపద, కన్యాకుండ, వాయు
కుండ, జంబూమా; గ్గోత్తమ, గభస్తితీర్థ, యయాతిపత్తన, కోటితీర్థ,భద్రవట,
మహాకాళవన,నర్మదాతీ,ర్థార్బుదతీర్థ,వాసిష్ఠతీర్థ,వైప్రియతీర్థ,వార్షికతీర్థ,పంచిరక
సుతీర్థ,బ్రహ్మరుద్రతీర్థ,కన్యాకుమారికాతీర్థ,శుక్రతీర్థ,పంచనద, రేణుకాతీర్థ,పైతా
మహాతీర్థ,విమల,రౌద్రపాద, మణిమ,త్కామతీర్థ, కృష్ణతీర్థ,కులింగకతీర్థ,శ్రీశక్ర
యజనతీర్థ, బ్రహ్మవాలుకాతీర్థ, వ్యాసతీర్థ, పుండరీక, మణిమంథ, దీర్ఘమ్య,ధంస
పాద, శయనతీర్థ, దశాశ్వమేధ, కేదార, తమసోద్భేద, రుద్రకూప, సంయమనీ
తీర్థ, సంత్రావనాసిక, స్యమంతపంచక, బ్రహ్మతీర్థ, సుదర్శన, పృథివీతీర్థ, పారి
ప్లవ, పృథూదక, దశాశ్వమేధిక, సాక్షిద, విజయ, పంచనద, వారాహ, యక్షి
ణీహ్రద, పుండరీక, సోమతీర్థ, ముంజావటరథతీర్థ, బదరీవన, బబూరవణ, స్వర్లో
కద్వారకతీర్థ, కపిలతీర్థ, సూర్యతీర్థ, వసుస్థానతీర్థ, భవాభవనతీర్థ,యక్షరాక్షస్య
తీర్థ,బ్రహ్మతీర్థ, కామేశ్వర,మాతృతీర్థ, శాంతవన, భౌమస్థాన,హంసస్థాన, సారస,
సరస,బ్రహ్మజ్ఞ,వరతీర్థ, సప్తర్షికుండ, దేవీతీర్థహాస్పద,కింవాన,కింజయ,కారండవ,
విశ్వ, త్రివిష్టప, పాణిఖాత, మిశ్రక, మధుకంట, మనోమయ, కౌశికీతీర్థ, దేవ
తీర్థ, కన్యాతీర్థ, బ్రహ్మతీర్థ, మనస్తీర్థ, సౌగంధికవనతీర్థ, మణితీర్థ, సరస్వతీ,తీర్థే,
శానతీర్థ,ప్రవరతీర్థ,పంచయజ్ఞతీర్థ, త్రిశూలధారతీర్థ,మహేంద్ర, దేవస్థాన,మహా
లయ, శాకంభరీతీర్థ, దేవతీర్థ, సువర్ణాఖ్యాతీర్థ, కపీమదతీర్థ, క్షీరేశ్వరతీర్థ, విరూ

సూర్యప్రభ కోటితీర్థశబ్దములు రెండుపర్యాయము లిట మూలముననే భిన్నస్థలములఁ గన్పట్టెడిని.

పాతుతీర్థ, భృగుతీర్థ, కుశోద్భవతీర్థ, బ్రహ్మావర్త,బ్రహ్మయోని, నీలపర్వత,భద్రకర్ణహ్రద, శక్రకర్ణహ్రద, సప్తసారస్వ, తౌశనసతీర్థ, కపాలలోచన, నావకీర్ణ, పంచక, చతుస్సాముద్రిక, కాంచనసహస్రిక, రేణుక, పంచకటక,పాపవిమోచన, స్థాణు,కురుతీర్థ, స్వర్గద్వార, కుశధ్వజ, విశ్వేశ్వర, వామకర,నారాయణాశ్రమ, గంగాహ్రద, వటతీర్థ, బదరీపావ,సేంద్రమార్గణకే, శత్రతీర్థ, జిరికావాస, కోటితీర్థస్థలీ, భద్రకాళిహ్ర, దారుంథతీవన, బ్రహ్మావ, ర్త్రాశ్వదేవీతీర్థ, కుబ్జవన, యమునాప్రభవ, వీరప్రమోతు, సిద్ధార్థ, మాయావిదోద్భవ, మహాహ్రద,వేతసికా,రూపతీర్థ,సుందరికాశ్రమ,బ్రహ్మణీతీర్థ,గంగోద్భవసరస్వతీతీర్థ,బాహుకానామతీర్థ, విమలాశోకతీర్థ, గౌతమతీ, స్థైరావతీతీర్థ, శతసహస్రిక, భర్తృస్థాన, కాపిలీతీర్థ, మార్కండేయపంచనదతీర్థ,శివోదతీర్థ,మత్స్యోదరీతీర్థ,సూర్యప్రభ, సూర్యతీర్థ, సోమకవ, నారుణాస్పద, వామనక, సవాలుకసూర్యతీ, ర్థావిముక్తరూపనీలకంఠహ్రద, పిశాచమోచనతీర్థ, సుభద్రాహ్రద, విమలకుండ, చండీశ్వరతీర్థ, శ్రేష్ఠస్థానహ్రద, సముద్రకూప, జైగీషవ్యవన, హరికేశవ, నాజాముఖరసతీర్థ, ఘంటాకర్ణహ్రద, పుండరీకహ్రద, కంటకవాపికాతీర్థ, శ్మశానస్తంభ, వినాయకహ్రద, సిద్ధోద్భవకూప, బ్రహ్మసరస్తీర్థ, భద్రావాస, సోమకనాగతీర్థ, భక్తహ్రద, తీరసరస్తీర్థ, ప్రేతాధార, కుమారక, బ్రహ్మావర్త, కుశావర్త, దధిక, ర్ణోదయాత్మక, శృంగతీర్థ, మహాతీర్థ, మహానదీతీర్థ, బ్రహ్మసరస్తీర్థ, గయాశీర్షాతుయవట, దతిణోత్తరసంజ్ఞికగోమయతీర్థ, హాయశాంతిక, కపిలాహ్రద, గృధ్రకూట, సావిత్రీహ్ర, దాఘునాశన,గీతవన,యోనిద్వార, ధేనుక,ధన్వక, లోహికాఖ్య, మతంగహ్రద, పితృకూప, రుద్రకూప, సుమాలిన, బ్రహ్మస్థాన,సప్తకుండ, మణిరత్నహ్రద, ముద్గలాశ్రమ, ముద్గలహ్రద, జనకకూపతీర్థ, వినశనతీర్థ, శోకాఖ్య,భారత, జ్యేష్ఠాలిక,విశ్వేశ్వర, పుణ్యశత, కన్యాసంవేధ, నిధి రామభవ,వసిష్ఠాశ్రమ, దేవకూట, కౌశికాశ్రమ, కులకర్ణహ్రద, కౌశికీద్రుమ, ధర్మతీర్థ, కాంచనతీర్థౌద్దాలకతీర్థ, మాలినీతీర్థ, వనచండికాతీర్థ,సంధ్యాతీర్థ, కాలతీర్థ, కపిలాలోహితార్ణవతీర్థ, శోణోద్భవ,వంశగుల్మ,రామభంగితీర్థ,పుణ్యావర్తహ్రద, బదరికాశ్రమ,రామతీర్థ, వితస్తాతీర్థ, మేరుజాతీయ, రోహిణీకూ, వేంద్రద్యుమ్నసర, స్నావసర్గ, మహేంద్ర, శ్రీతీర్థ, శ్రీనదీ, తీర్థేషుతీర్థ, వార్షిక, కౌబేరహ్రద, కన్యాతీర్థ, గోకర్ణ, గోపతిస్థాన, సంవర్త, విశ్వాస, సప్తగోదావరీహ్రద, బదరీహ్రద, బ్రహ్మస్థానవివర్ధన, జాతీహ్రద, దేవహ్రద, కుశప్రధన, సర్వదేవవ్రత, కన్యాశ్రమహ్రద, మహారాజహ్రద, శక్రతీర్థ, కుంద, కాంగిరస్తీర్థ, రుద్రారణ్యక, మేధావి, దేవహ్ర, దామరవర్తన, మందాకినీహ్రద, తుమ, మాహేశ్వర, గంగాతీర్థ, త్రిపురుష, భీమతాండవవాముఖ, పృథుకూట, శాల్చకూట, శోణ, రోహితక, మాల్య, కపిలాహ్రద, వాసిష్ఠకపిలాహ్రద, వాలఖిల్యహ్రద, సప్తర్షిహ్రద, మహార్షి

ప్రాద, దాఖండితప్రాద, నామకంబులు తీర్థవర్యంబులు. వీనియందు శ్రద్ధాసమన్వి తుండై జితేంద్రియుండై, యుపవాసవిధిస్నాన మొనరించి దేవర్షిపితృమనుష్య తర్పణంబు లొనరించి తత్రస్థదేవతల నారాధించి రాత్రిత్రయం బచ్చట గడపిన నాకొక్కతీర్థఫలంబులం బొందు. మఱియు నశ్వమేధమహాఫలంబు నొందు. సంశయంబు లేదు. ఎవఁ డీతీర్థమాహాత్మ్యంబు వినునో పఠించునో యితరులకు వినిపించునో యతండు సర్వపాపవినిర్ముక్తుం డగునని పలికిన లోమహర్షణుం గని మును లిట్లనిరి. 1057

## ఇరువదినాలుగవ అధ్యాయము.

### మోక్షప్రదతీర్థవర్ణనము.

క. మునివర! భూమండలమున, ననుపమ మగుభూమి యేది?యర్థము ధర్మం
బును మోక్షదంబు నయి తీ, ర్థనికరమున శ్రేష్ఠమగుచుఁ దగుతీర్థ మెదో? 1058
క. అన లోమహర్షణుం డి, ట్లనియెఁ మును లెల్లఁ బ్రశ్న మాదృతి నిట్లే
యొనరించిరి మద్గురు మును, పనఘుం డతఁ డనువదించె నది వినిపింతుఁ. 1059
సీ. మును కురుక్షేత్రంబునను మహాపుణ్యాదం బగుచు సర్వర్తుపుష్పాఢ్యము నయి
బహువిధద్రుమలతాపటలసంకీర్ణమై బహుమృగసముదయభవ్య మగుచు
సరళముల్ పున్నాగతరువులు కర్ణికారములు సాలములు తాళములు దేవ
దారువుల్ పనసలు ధర ఖాదిర తమాల పాటలాశోకచంపక వకుళము
లును గరవీరమ్ములును మఱియును బహువిధభూరుహమ్ములు విమలకుసుమ
శోభితంబులుగాఁగ సొంపువహింపఁగ నాశ్రమంబునయందు నాసనవర
మం దుపవిష్టుఁడై యఖిలభారతధర్మవక్తృవరిష్ఠుఁడై బహుళశాస్త్ర
కర్తయై యధ్యాత్మకలితచిత్తమ్మున సర్వభూతహితంబు సతముకోరు
తే. చును బురాణాగమములఁ దా ననువదించు
నట్టి నియమంబునం దగి యఖిలవేద
వేత్త యాచుఁ దదంగైకవిద్వరిష్ఠుఁ
డై పరాశరపుత్త్రుఁ డౌ వ్యాసమునిని. 1060
క. సరసిజపత్త్రేక్షణు శాంతు రహితకోపుని మునీంద్రు ధూతాఘునిఁ గాం
చురతిని మౌనీంద్రులు వచ్చిరి ప్రీతి సమాహితైకచిత్తులు నగుటన్. 1061
వ. కశ్యప, జామదగ్ని, భరద్వాజ, గౌతమ, వసిష్ఠ, జైమిని, ధౌమ్య, మార్కం డేయ, వాల్మీకి, విశ్వామిత్ర, శతానంద, వాత్స్య, గర్గ, నామకులు, ఆసురి, సుమంతు, భార్గవ, కణ్వ, మేధాతిథి, గురు, మాండవ్య, చ్యవన, ధూమ్రా సిత, దేవల, మౌద్గల్య, తృణబాహు, పిప్పలా, దాకృతవ్రణ, సంవర్త, కౌశిక, రైభ్య, మైత్రేయ, హారిత, శాండిల్యాగస్త్య, దుర్వాసులును, లోమశ,

నారద, పర్వత, వైశంపాయన, గాలవ, భాస్కరి, పూరణి, సూత, పులస్త్య,
కపి, లోలూక, పులహ, వాయు, దేవస్థాన, తుంబురు, సనత్కుమార, పైల,
కృష్ణ, కృష్ణానుభౌతిక, ప్రముఖు లరుదెంచిన వారిం గూడి సత్యవతీసూనుండు
నక్షత్రపరివృతశశాంకుండుఁబోలెఁ వెలింగె. 1062

చ. మునిపతి యంత నమ్మునుల మోదమువిూఱఁగ వేదవేత్త గా
వున మరియాదలం దనిపెఁ; బొల్పుగ వారును మౌనిచంద్రు నా
తనిఁ బ్రతిపూజలం దనిపి తత్సమయోచితభాషణాళి నొ
య్యన క్షణమాత్రమే జరపి యమ్మునితో నిటు పల్కి రాదృతిన్. 1063

క. ఆమాటలు సంశయముల, నేమాడ్కిం గల్గనీక యెంతో హితముల్
భూమిస్థులకుం గల్గం,గా మిక్కిలి చేయఁజాలి క్రాలుచు నుండెన్. 1064

సీ. మునివర! వేదశాస్త్రనిఖిలవరపురాణాగమభారతాద్యమలసాధు
గాథల నెఱుఁగుదు కడుధన్యుఁడవు భూతభవ్యభవిష్యవిద్వరుఁడ వీవు
సకలవాఙ్మయము నిశ్శంక నెఱుంగుదు, కష్టమై దుఃఖసంకలిత మగుచు
సారవిహీనమౌ సంసారసాగర మదియు రాగగ్రాహసార్థభయద

తే. మధిక రౌద్రము విషయోదకాన్వితంబు, నింద్రియావర్తకలిల మహీనమాన
నేష్టకల్లోలసంకుల మెలమి యనున, దించుకంతయుఁ గనరాక యేఁచజాలు.

ఆ. మోహరూపపంకమున నావిలం బయి, దుర్గమంబు నగుచుఁదోఁచి లోభ
నిమ్నతను బొసంగి నియతగంభీరత, వెలయ నొప్పుచుండుఁ గలుష మగుచు.

క. దానన్ మునిఁగిన లోకముఁ, గాన నిరాలంబ మగుచుఁ గడుఁ జేతనముం
గానక యుండెడు దీనిని, మానసమునఁ దలఁప భీతి మైకొనియెడుఁజూ. 1067

క. భైరవము లోమహర్షణ, మారయ నిస్సారము నయి యలరెడు నీసం
సారము మునివర! యిందే, సారము శ్రేయస్సు గలదొ సరగం జెపుమా. 1068

చ. కనఁబడుచుండు ఘోరమయి కంధివిధంబున నిట్టిదాని నే
యనువున దాఁటనౌనొ యనునట్టి మహాత్తరసంశయంబు మా
మనములఁ దోఁచుచున్నయది మౌనివరా! యుపదేశరూపతన్
జనులకు మేలుగూర్చెడు ప్రశస్తపథంబును దెల్పుమా దయన్. 1069

క. సులువుగఁ బొంద నశక్యం, బలఘుతరం బనుపమంబు నతిమోదదముల్
విలయంబు పాపములకుం, గలుగంగాఁ జేయునదియుఁ గమ్రేష్టదముల్. 1070

తే. కర్మభూమియు నని చెప్పఁగాఁ దగినది
యునగు క్షేత్రంబుఁ జెప్పుమా యొక్కదాని
వినఁగఁ గౌతూహలం బయ్యె జనులదెట్టి
కర్మ మొనరించి విధియుక్తి గడలుకొనఁగ. 1071

క. అలఘుతరసిద్ధి నొందం,గలరో సత్కర్మములను గావింపక దు

ష్ఫలదం బగునరకము కనఁగలరో మునివర్య! యట్టి కర్మవిధంబుల్. 1072
క. కరుణం జెపుమా; మోక్షద, మరయంగా నెద్దియగునో యా క్షేత్రమునన్
బరమాదృతి నొనరించినఁ, బరమార్థము గల్గుఁ గర్మఫలముగఁ గానన్. 1073
ఆ. అట్టి క్షేత్రవరము నానతిమ్మా ముని, గణము ప్రశ్న చేసెఁ గడఁగి యుత్త
రమును జెప్పవలయు రయమున ననుమాటఁ, దలఁచి యనిన మౌనితల్లజుండు.
ఆ. భావితాత్ము లైన బ్రహర్షు లిట్లాడ, నాలకించి కాలజాల మెఱుఁగు
వ్యాసుఁ డిట్టులనియె; నార్యులార! వినుండు, మీకు నుత్తర మగు మేటిపలుకు.
క. మునివరులకుఁ బరమేష్ఠికి, మును జరగిన సాధువాదమును వచియింతున్
ఘన మేరుపర్వతాగ్రంబున నొకతఱి నజుఁడు చాల మోదము మీఱన్. 1076
క. నానారత్నవిభూషిత, మై నెగడుచు బహువిధద్రుమాభివృతంబై
నానాపుష్పాఢ్యం బై, నానావిధపక్షిరమ్యనాదయుతంబై. 1077
క. పలువిధము లైన పులుఁగులు, వెలయఁగ సత్వములు పెక్కు విలసిల్లఁగ ని
స్తులమై యాశ్చర్యంబును, గలుగంగాఁ జేయఁజాలి కమ్రశిలలచేన్. 1078
క. ఒప్పుచు నానా ధాతువు, లుప్పతిలం జూడఁదగుచు నురుతేజములన్
గొప్పఁగ నుపకృతి సేయఁగ, నెప్పుడు తలపోయువాను లెసఁగుచునుండన్.
తే. ఆశ్రమంబులు పెక్కుసంఖ్యలఁ జెలంగ, నలరు నాచోట నుపవిష్టుఁ డైన లోక
పతిని లోకైకకారణు నతులమూర్తి, బ్రహ్మలోకనమస్కృతుఁ బరమనియతు.
క. కని మౌను లంతికమునకుఁ, జనఁగా సురదనుజయక్షసంఘంబులు భో
గినికరగంధర్వులు మఱి, మునిసిద్ధులు నచ్చరలును మోదము తనరన్. 1081
ఆ. అతనిఁ జుట్టియుండి రందు గొందఱు నుతు, లలరి చేయుచుండి రందు గొంద
ఱమ్మహాత్మురూప మాత్మ ధ్యానించుచు, నుండి రొక్కకొంద ఱుద్యమమున.
వ. దాద్యంబుల మ్రోయఁజేయుచుండిరి. కొందఱు నృత్యంబు సల్పుచుండిరి.
ఇట్లు మనోహరంబుగ నలరుచు నానాకుసుమగంధాఢ్యంబై, దక్షిణపవనసంసే
వితంబై, తనరుకాకాలంబున భృగ్వాదిమును లాపరమేష్ఠికి వందనంబు లాచ
రించి చేతులు జోడించి యిట్లనిరి. 1083
క. భగవంతా! పరమేష్ఠీ, జగతీస్థలిఁ గర్మభూమి చక్కని మోక్షం
బు గడున్ దుర్లభతరము నొసఁగు దానిం జెపుమ వినఁగ శ్రవణము లలరన్.
క. అని యిట్లు పలుకు మౌనులఁ గని బ్రహ్మ వచించెఁ దగినగతి నుత్తర మం
చనుపమయోగీశ్వరుఁ డౌ, మునిపతి వ్యాసుండు బ్రహ్మమునులకుఁ జెప్పెన్.

---

## ఇరువదియైదవ అధ్యాయము.

### భారతఖండవర్ణనము.

చ. మునివరులార! వేదహితమున్ గడుఁ బూర్వము భుక్తిముక్తిదం
బును నగుసత్పురాణమును బూని వచించెద నాలకింపుఁడీ

ఘనతర కర్మభూమి యనఁగాఁ దగుఁ గర్మఫలంబు నొందఁగా
ననువగుచోటటంచు స్తుతినందును స్వర్గము నారకం బనన్. 1086

క. వినుతిం గనుఁ; దద్వర్షం, బున మర్త్యుఁడు పుణ్యపాపముల నొనరిచినం
గనును శుభాశుభఫలములఁ, జనదు వృథా కర్మ మద్ధి త్స్వామహిమమునన్. 1087

చ. ధరణిసురాదు లెల్లరు నితాంతము శ్రద్ధ స్వకీయకర్ముల్
సరిగ నొనర్చి తత్ఫలముఁ జక్కఁగ నొందుదు రించుకంతయే
నరయఁగ శంక లేదు; వినుఁ డాధర ధర్మము నర్థకామముల్
నిరుపమముక్తియుం గలుగు నిర్మలకర్మము లాచరించినన్. 1088

క. శతమఖముఖు లచ్చటనే, చ్యుతినొందనికర్మవితతి నొనరించి సురే
శత లోనగుపదముల స్మృతి నొందిరి; మఱియుఁ బుణ్యమతు లొనరులున్. 1089

క. పరమం బగుపురుషార్థము, మరణాంతమునందుఁ గనిరి మహితసుఖసము
త్కర మనుభవించి రీధర, శరీరమును దాల్చియుండు సమయమునందున్.

తే. వీతరాగులు మత్సరవిరహితులును
నగుచు బుధు లుందు రావర్షమందు శాంత
ధనులు నయి; యింకఁ గొందఱు మనుజు లెంతొ
పుణ్యములఁ జేసి స్వర్గభూములను జేరి. 1091

ఆ. వ్యోమయానముల విబుధనుతిం గాంచుచు, నుందు; రమరు లెల్ల నందు వసతి
నెపుడు కోరుచుందు రపవర్గమును స్వర్గమును నొసంగు నట్టిభూమి యనుచు.

క. కనుదు మ దెప్పుడొ భారతము నంచుఁ దత్పరతఁ విబుధముఖ్యులు గనుచున్
మనముల నుతించుచుందు ర,నిన మౌనులు వ్యాసమౌనినిం గని భక్తిన్. 1093

క. మునివర భవదుక్తం బౌ, ననుపమ కర్మం బిదెన్న నన్యద్ధాత్రిం
బొనరింప ఫలము నీయదొ, జనులకు మఱి పాప మిదునొ చయ్యనఁ జెపుమా.

క. భారతవర్షంబుననే, యీరీతి నొనర్పఁ బుణ్య మిదునో తెలియం
గోరెద మింకను స్వర్గ, ద్వారము చోర మోక్షగేహవరముం జొరఁగన్.

క. మనుజుల కీభారత మం,దునఁ దప్ప మఱొక్కచోటఁ దోఁచిన సత్క
ర్మనిరతిఁ బొందిన ఫలముం, గనరాదొ వచింపు దీనికారణ మెల్లన్. 1096

సీ. భారతవర్ష విస్తారమాహాత్మ్యము వచియింపుమా మమ్ము భవ్యదృష్టిఁ
గనుఁగొని; మఱియు నీఖండంబునంగల వర్షపర్వతముల వర్షభేద
ముల, నించుకేనియుఁ బోవిడువక తెలియంగఁజెప్పుమ యని యధికభక్తి
వేడఁగా ముని యిట్లు వివరించె నని బ్రహ్మవచియించె నిట్లని; బ్రహ్మమౌను

తే. లార! భారతవర్షంబు నారయంగ
భేదనవకంబు గలదియా భేదము లవి

సాగరాంతరితంబులై సమము లగుచు
నలరు నొండొంటితో నని తెలియవలయు. 1097

వ. ఇంద్రద్వీపంబు, కశేరువు, తామ్రవర్ణంబు, గభస్తిమంతంబు, నాగద్వీపంబు, సౌమ్యంబు, గాంధర్వంబు, వారుణంబు నని యెనిమిదిభేదంబులు. ఈభారతంబు నవమంబు. ద్వీపంబన సాగరసంవృతంబని తెలియం దగు. ఈద్వీపంబు దక్షిణోత్తరంబుగ లెక్కింప సహస్రయోజనంబులు. పూర్వభాగంబునఁ గిరాతులును, బశ్చిమభాగంబున యవనులు నుందురు. ఈభారతఖండంబున బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రనామకజాతిచతుష్టయవిశిష్టజను లుందురు. ఇజ్యా యుద్ధ వాణిజ్య కృషికర్మంబులు వారిని బవిత్రులను జేయుచుండు. ఈకర్మంబులె వారికి జీవనంబు జరపుచుండు. ఇవియె వారలకు స్వర్గాపవర్గహేతువులు. ఇవియే పుణ్యపాపంబుల నొసంగు చుండు. మహేంద్ర, మలయ, సహ్యా, శుక్తిమంతంబులు, ఋక్ష, వింధ్య, పారియాత్రము లనునీయేడు పర్వతములు కులాచలము లనంబడుచుండు. వీనిచెంత బహుసహస్రపర్వతంబు లుండు. అవియెల్ల నున్నత్యాయామములం దగి విచిత్రసానువులం దనరారు చుండు కోలాహలంబు, వైభ్రాజంబు, మందరంబు. దర్దలాచలంబు, వాతాధ్వగంబు, దైవతంబు. మైనాకంబు, సురసంబు, తుంగప్రస్థంబు, నాగగిరి, గోధనంబు, పాండురంబు, పుష్పగిరి, వైజయంతంబు, రైవతార్బుదంబులు, ఋష్యమూకంబు, గోమంథంబు, *కృతశైలంబు, కృతాచలంబు, శ్రీపర్వత, చకోర పర్వతంబులు లోనగునవి వేనవేలు గలవు. అందు జనపదంబులు విమిశ్రంబులై వేలువేలు భాగంబుల మ్లేచ్ఛాదులు నివసింప నలరు. అందలివారానదీవరోదకంబులఁ ద్రావు చుందురు ఆనదులనామంబు లుగ్గడించెద. గంగాసరస్వతీ, సింధు, చంద్రభాగాయమునలును, శతద్రు, విపాశా, వితస్తై, రావతీ, కుహూ, గోమతీ, ధూతపాపా, బాహుదా, దృషద్వతీ, [1]విపాశా, దేవికా, చక్షుర్నదులును, నిష్ఠీవా, గండకీ, కౌశికీనదులును హిమవత్పాద నిసృతంబులై ప్రవహించు చుండు. దేవస్మృతియు, దేవవతియు, వాతఘ్నియు, సింధువు, వేణ్యయుఁ, జందనయు, సదానీరయు, మహానదియుఁ, జర్మణ్వతియు, వృషీనదియు, విదిశయు, వేత్రవతియు, శిప్రయు, ద్రవంతియు ననునీనదులు పారియాత్రపర్వతంబునుండి వెలువడు చుండును. శోణయు, మహానదియు, నర్మదయు, సురథయుఁ, గ్రియయు, మందాకినియు, దశార్ణయుఁ, జిత్రకూటయు, జిత్రోత్పలయు, వేత్రవతియుఁ, గరమోదయుఁ, బిశాచికయు, నతిలఘుశ్రోణియు, విపాశయు, శైవలయు, శుక్తిమతియు, శకునియుఁ, ద్రిదివయుఁ, గ్రమునది

* కృతశైలః కృతాచలః అని మూ. 1 విపాశానామనది రెండుసారులు చెప్పఁబడినవి. భిన్నస్థలములయందుండునని యెఱుంగవలయు.

యు, వేగవాహినియు నను నీశ్శైవలినులు ఋక్షపర్వతపాదప్రసూతిం గలిగి ప్రవహించుచుండు. *శిప్రయుఁ, బయోష్ణినదియు, నిర్వింధ్యయుఁ, దాపియు, సరిద్వరయు, వేణయు, వైతరణియు, సినీవాలియుఁ, గుముద్వతియుఁ, దోయయు, మహాగౌరియు, దుర్గయు, నంతశ్శిలయు నను నీతరంగిణులు వింధ్యపాదప్రభవత నలరారుచుం బ్రవహించు చుండును. గోదావరియు, భీమరథియుఁ, గృష్ణవేణియుఁ, దుంగభద్రయు, బాపనాశినియు, నను నీనదులు సహ్యపర్వతపాదంబునం బుట్టి నిర్మలజలంబులఁ బొలుపారుచుండు. కృతమాలయుఁ, దామ్రపర్ణియుఁ, బుష్పవతియు, నుత్పలావతియు నను నివి మలయపర్వతసముత్పత్తిం బొంగి ప్రవహించు చుండు వీనిజలంబులు పరమపవిత్రంబులై శీతగుణంబున నలరు. పితృసోమర్షికుల్యయు, వంజులయుఁ, ద్రిదివయు, లాంగలినియు, వంశకరయు నను నివి మహేంద్రప్రభవతం జెలంగునవి. సువికాలయుఁ, గుమారియు, మనసయు, మందగామినియు, క్షయయుఁ, బలాశినియు నను నివి శుక్తిమత్పర్వతంబునఁ బుట్టునవి. ఈనదులెల్లఁ బరమపవిత్రలై సముద్రగామినులగు.

క. జనులకు నీనదు లన్నియు, జనులక్రియ నుపకృతిఁగ విసారజలముచే
నొనరించుఁ బాపసంఘంబును బోఁగొట్టుచు నజస్రమును శోభిల్లుఁగ. 1099

ఆ. వేలకొలఁది మఱియు ద్వీపవతులు పొల్చు, నందుఁ గొన్ని వృష్టియదను నందె
పాఱుచుండుఁ గొన్ని పావనజలముల, సతము పాఱుచుండు వితతగతుల.

వ. ఈనదీప్రాంతములందు మత్స్య, కుముదమాల్య, క్రతుల, కాశీ, కోసలంబులు, నంధ్రక, కళింగ, మశక, వృక మధ్యదేశంబు లుండు 1101

క. గోదావరి సహ్యోత్తర, మా దేశమునందు నెల్ల నావృతిఁ గనుటం
గాదే యాభాగము స్వమోదదమై కాంతము నయి పొల్చుచునుండున్. 1102

సీ. అనుపమతేజుఁడౌ నట్టిభార్గవుని నివాసభూతంబు గోవర్ధనపుర
మతిరమ్యమై తగు నట్లె వాహీకరాటములు థానములను విమలభాగ
ములు సకాలమ్మున జలసమృద్ధిని బొల్చి తనరారుచుండు; నింకను సమృద్ధిఁ
బొల్చు శూద్రకములు భూరిబాహ్లికములు కేరళంబులును గాంధారయవన
తే. ములును సౌవీరమద్రకములును సింధు
జనపదములు శతద్రుహాజనపదములు
పారదములు కళింగముల్ పరమపుణ్య
దములు హారిభూషికాఖ్యభాగములు మఱియు 1103

వ. కనక, మాతర, కైకేయ, దంభమాలికంబులు క్షత్రియోపమదేశంబులు వైశ్యశూద్రకులభూయిష్ఠంబులై యుండు. కాంభోజ, బర్బర, లౌకిక, వీర, తుషార, పహ్లవంబులు, నాత్రేయ, భారద్వాజ, పుష్కలక, దశేరక, లంపక, శునశోక,

* శిప్రానది రెండుమాఱులు మూలమునందే యున్నది.

కులిక, జాంగలంబులు, నౌషధ్య, చలచంద్ర, కిరాతంబులు నీచజాతిజనాక్రాంతంబులు తోమర, హంసమార్గ, కాశ్మీర, కరూశ, శూలిక, కుహక, మాగధదేశంబు లుదీచ్యంబులు ఇఁకఁ బ్రాచ్యదేశంబుల వినిపింతు. 1104

తే. అంధ, వామంకురాకంబు, లక్లె వల్ల
కములును, మఖాంతకములు నంగములు, వంగ
మలదములు, మాలవ ర్తికములును, భద్ర
తుంగములు, ప్రతిజయము లనంగఁ దగుచు. 1105

వ. భార్యాంకా, పమర్ధక, ప్రాగ్జ్యోతిషంబులును, మద్ర, విదేహ, తామ్రలిప్తక, మల్ల, మగధక, నందనామకంబులు ప్రాచ్యజనపదంబు లనంబరఁగు. పూర్ణ, కేవల, గోలాంగూలమ్ములును, ఋషిక, ముషిక, కుమార, రామఠ, శక, మహారాష్ట్ర, మాహిషక, కళింగ, గాంభీర, వైశిక్య, సర, వాటవ్య, పుళింద, మౌలేయ, వైదర్భ, దండక, పౌలిక, మౌలి, కాశ్విక, భోజవర్ధన, కౌలిక, కుంతల, దంభక, నీలకాలక దేశంబులు దాక్షిణాత్యజనపదంబు లని తెలియం దగు. ఇంక శూర్పారక, కాలిధన, లోల, తాళకటనామకంబు లపరాంతనామకంబులు. ఇఁక వింధ్యపర్వతప్రాంతదేశంబుల వినుండు. మలజ, కర్కుశ, మేలక, చోల, కోత్తమర్ణ, దశార్ణ, భోజ, కిష్కింధక, తోషల, కోసల త్రైపుర, వైదిశ, తుంబుర, చర, యవన, పవనములు, నభయ, రుండికేర, చర్చర, హోత్రధర్తినామకంబులు వింధ్యసమీపమునఁ బ్రసిద్ధిం గాంచి యుండు. పర్వతముల నాశ్రయించియుండు దేశంబుల నెఱింగించెద. నీహార తుషమార్గ, కుర, తుంగణ, ఖస, కర్ణప్రావర, ణోర్ణ, దర్భ, కుంచక, చిత్రమార్గ, మాలవ, కిరాత, తోమరనామకములు సుప్రసిద్ధంబులు. ఈజనపదము లందుఁ గృతత్రేతాద్వాపరకలియుగప్రోక్తవిధులు చెల్లుచుండు.

క. వినుఁడీ భారతవర్షం, బనునది నవభాగయుక్త మయి దక్షిణమం
దును బడమరదెసఁ దూర్పున వననిధి యొప్పార వెలయు వర్ణిత మగుచున్.

క. ధనువునకు నారిచందం,బున దీనికిఁ దుహినశిఖరి పొలుచు నుదీచిక
గనుక నె భారతవర్షం, బనఁజను నిది సర్వబీజమై విలసిల్లున్. 1108

సీ. ఇందుఁ బుట్టుకఁ గాంచియే శుభాశుభకర్మములఁ జేసి మృతినొంది సులభరీతి
బ్రహ్మత్వ మమరేశభావంబు, దేవత్వ మనిలత్వ మట్టులె యక్షభావ
మప్సరోజాతిత్వ మహిజాతి భావంబు మృగభావ మారీతిఁ దగినస్థావ
రత్వ మీలోనగు రమ్యరూపంబులు కర్మరూపంబునఁ గాంచుచుండు

ఆ. రట్టులౌట నిందె యఖిలపుణ్యాత్ములు, భవముఁ గాంచుచుంద్రు భవ్యకర్మ
భూమియంచు దీనఁ బొడము ఫలంబులు, తక్కు ఖండములను దలఁప లేవు.

క. సురలకు నీఖండంబునఁ, బరమప్రమదంబు గలదు భవము గనుట కీ
సుర లమరత్వ వీడుచు నీధరఁ బుట్టుదు రమలకర్మతతుల నొనరుపన్, 1110

చ. మనుజత నొంది కర్మముల మంచివి చేయఁగవచ్చు నిర్జర
త్వనియతి బూని చేయఁదగుభంగియె గానఁగరాదు కానఁ గ
ర్మనిరతులైనవారలకు మానితకర్మములం ద్యజింపఁగా
మనమునఁగోరుయోగులకు మంచిది భారతవర్షమే యగున్. 1111

తే. దీనిఁ బోలినవర్ష మీస్థిర మహిందు
గానరాదు; మహీసురగణ మితరులు
సాధుకర్మము లొనరించి సకలవాంఛ
లను ద్వరం బొందుచుందు రోయనఘులార. 1112

క. భారతవర్షంబున నే,వారలు పుట్టుదురొ పుణ్యవంతులు వారే
వారే ధన్యులు మర్త్యుల, నారయఁగా వారె ధన్యు లనఁబడువారల్. 1113

తే. ధర్మ మర్థంబు కామంబు; తగినముక్తి
యనెడు వీనిఫలంబుల నందు మనుజుఁ,
డిందుఁ బుట్టిన; మఱియు నహీనతపము
నకుఁ దగినసత్ఫలమ్ము బొందఁదగు నిందె. 1114

తే. సర్వదానఫలంబును సర్వయజ్ఞ,ఫలము సత్తీర్థయాత్రలఫలము సాధు
గురువు సేవింపఁ బొందఁదగు ఫల మల్లె, దేవతారాధనమ్మును దీవ్రభక్తి. 1115

క. ఒనరింపఁ గలుగుఫలమును, మనుజుఁడు గార్హస్థ్యమందు మానక పొందం
గను జాలునొ యద్దానిని, గనుఁజుండీ భారత మనుఖండమునందున్. 1116

తే. ఎందు దేవతలందఱు నెల్లకాల
మమితహర్షంబులం బొంది యభిమతాను
సారముగ జన్మమొందుచు సకలసుఖము
లొందుదురొ వర్షమయ్యది యొప్పు మిగుల. 1117

క. నానావ్రతముల ఫలమును, నానాశాస్త్రములఫలము నయహిత మగుచున్
గానఁబడు నహింసావ్రత, సూనృతసద్వ్రతఫలంబు చొప్పడు నందున్. 1118

సీ. బ్రహ్మచర్యవ్రతఫలము స్వాధ్యాయసంగతఫలంబును, మఱి కాననాంత
రావాసఫలము, సన్న్యాసఫలంబు, నిష్టాపూర్తఫలమును సాధుకర్మ
ము లవియెన్నో ధరఁజెలఁగు నవ్వానిని జేసినచోఁ గల్గు చిత్రఫలము
భారతవర్షమం దారూఢి గల్గును; దక్కుఖండంబులఁ దత్ఫలంబు

ఆ. గలుగ; దోమహర్షికాంతులార వినుండు, భారతాఖ్యవర్షవరగుణములు
వర్ణనంబు చేయ వశమె యెవ్వరికైన, నిరుపమాన మగుచు నెగడు నద్ది. 1119

క. భారతవర్షం బుత్తమ, మేరీతిం గనిన నంచుఁ నెఱిఁగించితి నో
సూరిజనులార! నయ్యది, యారయఁ బాపాంతకరము నగుఁ బుణ్యద మౌ.

ఆ. మతివివర్ధనంబు మఱియు ధన్యము నగు, నిర్జితేంద్రియుఁ డయి నిత్య మెవఁడు

దీని వినునో చదువునో నరుఁ డాతండు, సర్వపాపములను సమయఁ జేయు.
ఆ. కోరికలను బొందు క్షోణి ధన్యుండగుఁ, జెలఁగు నంతెకాక లలితముక్తి
కతఁడు చనును వాని కాదినారాయణుఁ, డఖిలవాంఛితముల నందఁజేయు.

## ఇరువదియాఱవ అధ్యాయము.

ఓండ్రదేశద్విజవర్ణనము.

క. అని పలికి మఱియు మునులకు, వనరుహసూనుండు పలుకు భారతవర్షం
బున దక్షిణసాగరతటమునఁ గనఁదగు నోండ్రదేశము విభూతి దగన్. 1123
క. అది ముక్తిని స్వర్గంబును, నొదవించును; సాగరమున కుత్తరమందున్
బొదలునది విరజమండల, ముదధిలసత్తోయవాయు వొయ్యన వీవన్. 1124
క. తనరారును దద్దేశంబున సద్గుణశీలతేజములఁ గనఁబడుచున్
జను లుందు; రందు వెలసెడు ఘను లుర్వీసురులు శాంతకమ్రాభరణుల్. 1125
తే. ఇంద్రియవ్రాతములును జయించి తపము
వేదపఠనంబుఁ జేయుచు విశ్వవంద్యు
లగుచుఁ బూజ్యులునై పొల్తు రన్వహంబు
శ్రాద్ధదానవివాహయజ్ఞములయందు. 1126
క. నిరతులును సదాచారులు, సురకార్యములందు శ్రద్ధశోభిలువారల్
సురవర్యాంశజనితులును, నిరతము షట్కర్మకరణనియతధిషణులున్. 1127
క. శ్రుతితతిపారగులును మఱి, యితిహాసజ్ఞులు పురాణహితతాత్పర్య
జ్ఞత నొప్పువారు శాస్త్రవితతికుశలులు యజ్వలును సదాగతరోషుల్. 1128
ఆ. అగ్నిహోత్రపరులు నగుదురు కొందఱు, స్మార్తవీతిహోత్రమహితపూజ
ననునఁ బ్రీతి గలుగు నమలచిత్తులు పుత్ర, దారధనము లలరఁ దనరువారు.
క. హోతలు సూనృతభాషణు, లాతతయజ్ఞోత్సవములయందభిరతమై
ఖ్యాతిం గను నుత్కలమునఁ, జేతఃప్రమదంబునన్ వసింతురు సతమున్. 1130
క. ఇతరులు క్షత్రియముఖ్యు, లున్నతచిత్తస్థిరులు తా రొనరుపం దగుక
ర్మతతిని జేసెడుపూన్కిం, బ్రతిలేక చరించువారు పటుశాంతాత్ముల్. 1131
క. ధార్మికులు నొచుచుందురు, నిర్మలరీతిం జెలంగి నిఖిలజనుల దా
పేర్మి నిదగు నుత్కలమున, శర్మదుఁడై వివిధఖచరజాలవిభుండై. 1132
సీ. అలరుచునుండు దివాకరుం డెప్డు కోణాదిత్యుఁ డన్ పేర ఖ్యాతితనర
నేదివాకరుఁ గాంచి యెల్లపాపంబులు నశియింపఁ దేజస్సు నరులు గాంచు
చుందురో యాసూర్యుఁ డొప్పు నచ్చటను దన్నామంబున వటన్న నామహర్షు
లిట్లని రో దేవ యెఱిఁగింపుమా దివాకరుని క్షేత్రము దాని ఖ్యాతి వినఁగ
ఆ. వేడుకయ్యె మాకు వివరింపు ముత్కల
మందు నెందు నలరు నర్కుఁ డతని

ఖ్యాతి యొట్టి దనిన నాళతానందుఁ డి
ట్లనియె మానులార యాదరమున. 1133

క. వినుఁ డల లవణాబ్ధితటం,బున జూడఁగ సుందరంబుఁ బూజ్యంబునునై
కనఁబడుఁ దత్తీరంబున, ఘనతర వకుళద్రుమములు కడు భాసిల్లున్. 1134

తే. సకలగుణములఁ దత్తటం బకలుషముగ
నలరుఁ గరవీరచంపకంబులు నశోక
పాటలంబులు పున్నాగ వరమహీజ
ములును మఱి కర్ణికారంబు లలరుచుండు. 1135

వ. నాగకేసర తగర ధవబాణాతిముక్తకుబ్జకంబులు విలసిల్లు. మాలతీకుందపుష్పంబులు సదా యలరుచుండు. మల్లికాదిసురుచిరసకలకుసుమంబులు దృష్టిమనోహారంబులై కానంబడు. ఇంతయేల కేతకీప్రముఖసర్వర్తుకుసుమంబులు సదా కనంబడుచుండు. కదంబ లకుచ సాల పనస దేవదారు సరళ ముచుకుంద చందనాశ్వత్థ సప్తపర్ణ రసాలామ్రాతక తాల పూగఫల నారికేళ కపిత్థప్రముఖవివిధభూరుహంబు లాతీరంబునఁ గానంబడుచుండు. 1136

ఉ. అందు దివాకర ప్రభునియాలయ మొప్పెడు క్షేత్ర మెంతయో
సుందరమై మహామహవిశోభితమై సుకృతాంబురాశి నాఁ
గం దగి యోజనాయతముగా నలుప్రక్కల నొప్పి భుక్తి ము
క్తిం దనివార నిచ్చుచు శ్రుతిప్రథమాభరణంబునై తగున్. 1137

తే. క్షేత్రమున నందుఁ దాసరసీరుహసఖుఁ
డర్కుఁ డలరు చుండు సహస్రకరుఁడు
భుక్తిముక్తిప్రదుండు సద్భూమిదేవ
గణసమారాధ్యుఁ డగుచు విఖ్యాతిమీఱ. 1138

వ. కోణాదిత్యుఁ డని తద్దేశప్రసిద్ధనామం బారవికిఁ జెల్లె మఱియు. 1139

సీ. మాసోత్తమంబగు మాఘంబునన్ శుక్ల
సప్తమీతిథియందు సంయతేంద్రి
యుఁ డగుచు నుపవాస ముండి మర్త్యుఁడు మక
రాలయంబున స్నాతుఁ డగుచుఁ గృత్య
వితతి నొనర్చి దేవతలలో ముఖ్యుఁడౌ
భాస్కరు స్మరియింపవలయు వఱియు
సాగరమున యథాశాస్త్రంబుగా స్నాన
మొనరించి భాస్కరునొద్ద నియతి

తే. సురల బుషులను బితరుల నరులఁ దృప్తు
లనుగ నొనరించి యబ్ధిజలంబు వెడలి

ధౌతనిర్మలవస్త్రముల్ తగ ధరించి
ప్రయతుఁడై యాచమించి సంభ్రంబుదరిని. 1140

క. తూరుపుమోముగ నుదయమె, కోరికఁ గూర్చుండి భక్తి కుదురుగఁ బద్మా
కారముగ రక్తచందన,వారిని విలిఖింపవలయుఁ బద్మం బదియున్. 1141

క. ఎనిమిదిపత్త్రంబులుగాఁ, గనఁబడుచుం గేసరాళికలితము వలయం
బును నయి యున్నతకర్ణిక,మునఁ దనరుచు నుండవలయు మునివరులారా.

క. తిలతండులసంయుతమా, జలమున రక్తప్రభాఢ్యచందనమున ని
ర్మలరక్తపుష్పముల దర్భల నుంపంగను దామ్రపాత్రమునందున్. 1143

ఆ. మఱియు నట్టితామ్రమయపాత్రమునయందు,నర్కపత్త్రపుటమునందుఁ దిలలు
తండులాదివస్తుతతి నించి పైవేఱు,పాత్రమునను గప్పవలయుఁ జొండి. 1144

క. కరహృదయన్యాసంబులఁ, బరమశ్రద్ధాళు వగుచు వావిరి నొనరిం
చిరహిన్ భాస్కరు నాత్మగఁ, బరికించుచు భక్తి ధ్యానవశతం గనుచున్.

వ. మధ్యభాగంబునందును,నగ్నినిఋఋతివాయుశంకరకోణదళంబులందు భాస్కరు నారాధింపవలయు నిర్మలుండయిపరమసుఖప్రదాతయై నిరతిశయమహిమంబున నలరుభాస్కరు నాకాశంబునుండి యాకర్షించి యం దావహిల్లఁజేసి కర్ణికోపరి భాగంబున స్థాపించి ముద్రాప్రదర్శనంబుఁ గావించి సుసమాహితుండై యప్పర మాత్ముని ధ్యానింపవలయు. 1146

సీ. ధవళపద్మోపరితలమున శ్రీరవిఁ దేజస్స్వరూపుని ద్విభుజు రక్త
వర్ణునిఁ బింగాక్షుఁ బద్మపత్త్రారుణాంబరు సర్వలక్షణభాసమాను
ననుపమాభరణజాలాభిరాము వరదు శాంతమూర్తిని బ్రభాసాంద్రమండ
లాభిభూషితు సురూపాభిభూషితు భాను నుద్యద్దివాకరు నుగ్రకరుని
తే. సాంద్రసిందూరసన్నిభు సత్త్వమూర్తిఁ
గాంచి యప్పాత్రమును గొని గాఢభక్తి
జానువులుసోఁక ధరఁబడి స్వశిరమందుఁ
బాత్రమును దాని నిడుకొనవలయు నవల. 1147

క. నియమితవాక్కునఁ ద్ర్యక్షర, మయి తగు మంత్రమున రవికి నర్ఘ్యంబిడఁ బ్రీ
తి యలరు భాస్కరునకు నిఁక, నియతిన్ దీక్షితుఁడు కాక నిర్మలమతియై.

ఆ. అలరునట్టిపురుషుఁడైనసూర్యునినామ,
ముచ్చరించి యర్ఘ్య మొప్ప నిడఁగ
వలయు శ్రద్ధనొందు భావంబుగల భక్తిఁ,
దా గ్రహింపఁబడును దరణి యెపుడు. 1149

వ. అగ్నినిఋఋతివాయ్వీశానకోణములయందు, మధ్యస్థలంబునఁ బ్రాగాది దిక్కులయందు, హృచ్ఛిరశ్శిఖావర్మనేత్రముల నస్త్రంబును బూజింపవలయు.

అంత నర్ఘ్యం బిచ్చి గంధధూపదీపనైవేద్యముల నొసంగి మంత్రరాజంబు జపించి స్తుతియించి నమస్కరించి ముద్రాదర్శనంబుఁ గావించి విసర్జింపవలయు. నియతేంద్రియులై యెవ్వరు భానున కర్ఘ్యం బిడుదురో బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో నెవరైనను వారు స్వాభిమతభోగంబులం బడసి యంతమందుఁ బరమగతిం గాంతురు. భక్తిభావము విశుద్ధాత్మయు సూర్యప్రీతికరము లని యెఱుంగవలయు. 1150

క. ఏనరులు గగనచరునిన్, భానునిఁ ద్రైలోక్యవినుతు భాసురమూర్తిన్
మానసమున స్మరియింతురొ, మానవు లవ్వారు సుఖము మహితవిధమునన్.

క. కనుచుండు రుదితుఁడగుసూ,ర్యునకుం దోలువొల్ల నర్ఘ్య మొసఁగి యవలవి
ష్ణుని శంకరు నింద్రునిఁ బూ,జనములఁ దనుపంగవలయు సద్భక్తిమెయిన్.

క. రవికిన్ ముందుగ విష్ణ్వా,దివిబుధులం బూజనములఁ దృప్తిపఱుప రా
దవితథభక్తి మహార్ఘ్యము, సవితకు దినదినమునను నొసంగఁగ వలయున్. 1153

ఆ. సాధుగంధపుష్పసహితమౌ నర్ఘ్యంబుఁ, దొలుఁత నొసఁగవలయు లలితరీతి
సప్తమీతిథినిఁ బ్రశస్తతరార్ఘ్య మిట్లొసఁగ నీప్సితముల నొందు నతఁడు. 1154

సీ. రోగి యిట్లొనరింప రోగవిముక్తుఁడౌ విత్తార్థి యిటు చేయ విత్త మబ్బు
విద్యార్థి యిటు రవి వెలయఁ బూజింపఁగ విద్యలెల్లను ద్వరవెలయు నతని
వశమునఁ బుత్త్రిల వాంఛించి పూజింపఁ బుత్త్రసంపద నిచ్చుఁ బొదలుచుండు
మఱియు నేయేకోర్కి మనమునఁ గల్గి సూర్యార్ఘ్య మెత్తిన వాని కాఫలములు

ఆ. కలుగుచుండు; నిట్టు కడలిని మున్గి భా
నునకు నర్ఘ్య మిచ్చి నూత్నముదము
తనర మ్రొక్కు నరుఁడు తన్వంగియును వాంఛి
తార్థములను గాంతు రన్వహంబు. 1155

క. సరసిజమిత్త్రుని గంగా,తరంగిణిం గ్రుంకి భక్తి దర్భల విధిగా
శిరమున నిడుకొనినం బా,పరహితుఁ డై స్వర్గ మొందుఁ బటుపుణ్యమునన్.

తే. అవల సూర్యునివైనట్టియాలయంబు
నొంది పుష్పములం గొని డెంద మలర
మూఁడుసార్లు ప్రదక్షిణముల నొనర్ప
వలయు మౌనీంద్రులార! భావం బలరఁగ. 1157

క. శ్రుతిహితములు తాంత్రికములు, ప్రతిలేనిఫలంబు నీయఁ బొల్పడునవియున్
వితతములు నైనమంత్రము, లతిభక్తిఁ దలంచుచున్ మహాత్మునిఁ బూన్కిన్.

తే. భానుతిథియందుఁ బూజింపవలయుఁజుండి
గంధపుష్పాక్షతలధూపకమ్రదీప
భూరినైవేద్యముల నమస్కారములను

విజయశబ్దంబులను మహాస్తవవరముల. 1159

చ. సరసిజమిత్రునిం దనిపి శాంతమనంబున ధ్యానయుక్తి నీ
శ్వరుని జగత్ప్రభున్ రవిని సంతతభక్తిని బూజచేయఁగా
నరుఁడు దశాశ్వమేధము లొనర్చినసత్ఫల మొందుఁ బాపముల్
పరుగిడ యౌవనం బలర భవ్యకళేబర మొప్పు రాజిలున్. 1160

తే. ముందువెనుకల నన్వయములను నేడి
టిని దరింపఁగఁ జేయుచుఁ గనకరత్న
మయవిమానంబునం దెక్కి మహితతేజ
మలర గంధర్వగానముల్ చెలఁగుచుండ. 1161

క. భానునిలోకంబున కా, మానవుఁ డింపొందఁబోవు; మహిమము వెలయం
గా నచట సుఖములం గను, మౌనీశ్వరులార! లయసమయ మగుదాఁకన్. 1162

క. సుకృతము నశియింపఁగ యో, గికులమునంబుట్టి చాలఁ గీర్తిం గని భ
క్తికలితుఁడై వేదావళి, సకలాంగయుతంబుగాఁగఁ జదువుచు శుచియై.  1163

ఆ. స్వీయధర్మనిరతిఁ జెంది వివస్వత్సు, యోగ మభ్యసించి తా గణింపఁ
దగనిసుఖము లొంది ధన్యుఁడై ముక్తిని, గాంచుఁజుండి మౌనికాంతులార.

సీ. చైత్రమునఁ దొలిపక్షంబున దమనభంజిక యనుయాత్రను జేయు నెవ్వఁ
డతనికిఁ బ్రాగుక్తమగుఫలంబెల్లను గలుగు సూర్యోదయకాలమందు
నస్తమయం బగునపుడు సంక్రాంతిని విషువద్దినమున రవిదగు వార
మునను దత్తిథిఁ బర్వమున నెందునే నందు యాత్రనొనర్చినయట్టిపురుష

ఆ. లమలతేజములను నర్కవర్ణవిమాన,ములను నెక్కి భానుఁ డలరు లోక
మునకుఁ బోవఁ గలరు; మునులార! సాగర,తటమునందుఁ బుణ్యధామమందు.

క. కనఁబడుచుండు మహేశ్వరుఁ, డనఘుఁడు రామేశ్వరుఁడనునాహ్వయ మొప్పం
గను సర్వకామఫలముల, జనులకు శాంతాత్ములకు నొసంగుచు సతమున్. 1166

మ. జను లేరైన మహోదధిన్ నియతిమై స్నానం బొగిం జేసి కా
మునిలీలన్ వధియించినట్టిమహితాత్మున్ శంకరున్ గొల్చి చం
దనపుష్పంబుల ధూపదీపముల వింతల్ గొల్పునైవేద్యకం
బున సమ్యక్ప్రణిపాతరాజి స్తుతులన్ మోదంబుఁ గల్పించువా
ద్యనికాయంబున గీతిసంతతిని శ్రద్ధం బూని సేవించినన్. 1167

తే. రాజసూయఫలంబును వాజిమేధ,ఫలము గల్గును ముక్తియుఁ గలుగుఁ జారు
కింకిణీజాలమండి తాకృతి మేష్ట, గమన మొప్పు విమానంబు గ్రాలుచుండ 1168

క. హరులోకంబున నుందురు; నిరతము గంధర్వనికరనిర్మలగీతో
త్కరసంశ్రవణప్రమదము, పరఁగంగా నందు నుంద్రు ప్రమథులలోనన్. 1169

వ. ఆభూతసంప్లవం బందుండి సకలసుఖము లనుభవించి పుణ్యంబు తఱుగ నీభారత

వర్షంబునం బుట్టి చతుర్వేదంబుల నభ్యసించి శాంకరయోగంబు నూని ముక్తి నొందుదురు. ఎవండు సూర్యక్షేత్రంబునఁ బ్రాణముల వదలునో వాఁడు సూర్యలోకము నొంది దేవతలం గూడి విహరించి మరల మానవత్వము నొంది ధర్మాత్ముఁ డగు ప్రభువై కొంతకాల ముండి సౌరయోగము నభ్యసించి ముక్తి నొందును. మునులారా! సుదుర్లభక్షేత్రంబుం దెల్పితి. అందుఁ గోణార్కుఁడు నివసించు నని పలుకుటయు. 1170

## ఇరువది యేడవ అధ్యాయము.

### సూర్యపూజాప్రకారము.

క. వినిమౌనులు కథకునితో, నని రిట్లని దేవనాథ యర్కునిమహిమం
బును జెప్పితి రించుక భుక్తిని ముక్తిని నొసఁగునట్టిక్షేత్రమహిమమున్. 1171
క వినిపించితి రైనను దృప్తిని గాంచదు చిత్త మేమొ దేవేజ్యానిచ
క్కనిగాథ వినఁగ నింకను, గనువారము వేడుకను నికామముదమునన్. 1172
తే. పాపనాశనమై పుణ్యఫలము నొసఁగు,నట్టి ఖరకరుమహిమంబు ననఘ! చెపుమ.
పూజచేయంగఁ గల్గెడు పుణ్యఫలము, దెట్టిదో విన వేడుక యొసఁగు మాకు.
సీ. దానఫలంబును దరణికి వందనములను జేయఁగఁ గల్గుఫలము భక్తి
ఫలము ప్రదక్షిణఫలము ధూపము దీపముల సమర్పించినఫలము మఱియు
సమ్మార్జనవిధానసత్ఫలంబును నుపవాసపుణ్యఫలంబు వరుస నక్త
భోజనజనితమౌ పుణ్యఫలంబును వచియింపుమా మఱి భాస్కరునకు
ఆ. నర్ఘ్య మిచ్చువిధము నది యొందు నిడఁ దగు, ననువిధంబు భక్తి ననుకరించు
కరణి యెట్లు? దేవకాంతుఁడు ప్రీతుఁడౌ, నాప్రకారమెల్ల ననఘ చెపుమ. 1774
చ. అన విని బ్రహ్మ యిట్లనియె నర్కున కర్ఘ్యమునిచ్చు రీతిఁ బూ
జనమును భక్తిశ్రద్ధఁగనుచందము చిత్తసమాధి యెట్లు పూ
న నగునో యాప్రకారము మనంబున నిల్వఁగ నేవచింతు నో
మునివరులార! చక్క విని మోదము నొందుఁ డటంచు బ్రహ్మయున్. 1175
చ. మనమునఁ జేయుభావనయె మంచిఫలంబు నొసంగు భక్తియం
చనియును శ్రద్ధయంచు సుజనాళినుతం బగు ధ్యానమేకదా
యనఁబడెడున్ సమాధియని యర్కునిగాథను జెప్పునాతఁడున్
విని ముద మొందునాతఁడు సువిస్తృతభక్తిని బొందునాతఁడున్. 1176
సీ. పూజించువాఁడును బుణ్యాత్ము లనఁబడుదురు వహ్నిశుశ్రూష కరము వేడ్క
నొనరించువారలె యుర్వి భక్తులటంచుఁ జెప్పఁగాఁ బడుదురు చిత్తమెల్లఁ
దద్గతంబుగఁ జేసి తన్మనుండయి దేవపూజారతుండయి పూన్కిసర్వ
కాలముఁ దత్కర్మకాండ మొనర్చుచుఁ గాలంబు గడపునాఘనుఁడె భక్తుఁ

ఆ. డనఁగ నొప్పు శ్రుతుల యర్థప్రకారమే
కర్మములు చెలంగుఁ గడఁగివాని
నొప్పుకొనుమనుష్యుఁ డురుభక్తిఁ గీర్తించు
నతఁడు భక్తవర్యుఁ డనఁగ వెలయు. 1177

క. సరసిజమిత్రుని భక్తని,కరముం గని యోర్వకుండఁగా రాదు నిరం
తర మన్యదేవదూషణ, పరతం గనరాదు మానిపార్థివులారా. 1178

తే. సూర్యవ్రతములనే చేయుచుఁ సతంబు
వెలయునాతఁడె భక్తుఁడఁ లలితకీర్తిఁ
గాంచు నడుచుచు నిల్చుచు గాఢనిద్ర
నందుచుఁ భక్తిసల్పుచు నన్వహంబు 1179

సీ. నిట్టూర్పుపుచ్చుచు నేత్రపక్ష్మములఁ గదలించుచుఁ బద్మకాంతు నెవ్వఁ
డతిభక్తి స్మరియించు నతఁడె సనాతనభక్తుఁడౌ; నీరీతి భక్తియెపుడు
చేయఁగాఁ దగు; భక్తిచేత సమాధిచేఁ దత్త్వంబుచేతఁ జేతస్సుచేతఁ
దగినచందంబున నొగిఁ జేయునియమంబు విప్రుల కిచ్చెడువిపులదాన

తే. ములును, ఫలవంతములగు నప్పురుషు సురలు
మనుజపితరులు గ్రహియింతు రనఘుఁ డనుచుఁ
బత్త్రపుష్పఫలంబుల వారి భక్తి
సంగ్రహించి సమర్పింపఁ జాలఁదృప్తి 1180

క. కనుచుఁ దేవత లామను,జుని బ్రీతిం గనుచునుంద్రు శుభపరమార్గం
బున సంచరించునాస్తికు, లను మానుదు రెల్లదుష్టలక్షణు లొటఁ. 1181

క. నియమాచారసమన్విత, మయి తగుసద్భావశుద్ధి యభ్యాసమునఁ
నియతిమెయిఁ గుదురుకొనఁ జేసి యొనర్చెడు కార్యము లవి చెందు ఫలంబుఁ.

తే. భావశుద్ధిప్రధానంబు ఫలము నిచ్చు
నద్ది యదియే; స్తవంబుల నమలభక్తి
జపమునం బూజచేత భాస్కరునిఁగూర్చి
చేయునుపవాసమున సిద్ధిఁ జెందు నరుఁడు. 1183

సీ. సర్వపాపంబులు సమయు శిరంబును ధరణిని మోపి వందనము చేయు
నెవ్వఁ డాతనియఘ మెంతయు వేగంబ నశియించు శంక యనంగ లేదు
భక్తియుక్తుండయి భాస్కరునకు నెవ్వఁ డొగిఁ బ్రదక్షిణము చేయునొ సమస్త
ధరణికి నతఁడు ప్రదక్షిణసముదయమును జేయుఫలము నొందును దివాక

తే. రుని మనంబున నిడుకొనుచును నభంబు
నం బ్రదక్షిణమొగిఁ జేయునరుఁడు సర్వ
సురలకుఁ వలగొనినట్టి వరసుకృతము
నందు లేవించుకయు సంశయంబు లెన్న. 1184

వ. షష్ఠియం దేకభుక్తినియమంబుఃబూని సూర్యు నారాధించిన నశ్వమేధఫలంబు నందు. సప్తమియందు నక్తే యొనరించిన నాఫలంబె కలుగు. ఎవ్వఁ డహోరాత్రోపవాసవ్రత మూని భాస్కరుని భక్తిఁ బూజించునో యానరుం డగ్నిప్రకాశక విమానంబునం గూరుచుండి సూర్యలోకంబునకుం బోవు. ఈవ్రతంబు షష్ఠీసప్తమీతిథులయం దొనరించిన సమానఫలంబె గలుగు. కృష్ణపక్షసప్తమియం దుపవసించి జితేంద్రియుఁడై సర్వరత్నోపహారంబునఁ బూజించు నరుఁడు పద్మసంకాశవ్యోమయానంబున సూర్యలోకంబునకుం బోవు. శుక్లపక్షసప్తమి నుపవాసనియమము నొనరించి సర్వశుక్లోపహారంబున భాస్కరు నర్చించిన సర్వపాపవినిర్ముక్తుఁడై భానులోకంబునఁ జిరకాలంబు నివసించు. అర్కసంపుటసంయుక్తోదకంబును ద్రావుచుఁ గ్రమవృద్ధిచే నిరువదినాలుగుదినంబులు పూజించుచు మరలఁ గ్రమంబునఁ దగ్గించుచు నిట్లు రెండువత్సరంబులకు సమాప్తనియముఁ డగుమనుష్యునకు సర్వకామములు ఫలించు. ఇది యర్కసప్తమీ వ్రతంబు. సర్వకామప్రదం బనం బరఁగు. శుక్లపక్షసప్తమియం దాదిత్యవారంబు సమకూడిన నది విజయాసప్తమి యనంబడు. నాఁ డొనరించిన దానంబు లనంతఫలదంబులు. స్నానదానజపహోమోపవాసంబులు విజయాసప్తమియం దొనరించినచో నవి సర్వపాపంబుల నడచును. మఱియును. 1185

క. నరుఁ డెవ్వఁ డర్కదినమునఁ, బరమవ్రతపరుఁడు నగుచు భానుప్రీతిం
బరఁగించి శ్రాద్ధ మొనరుచు, నిరుపమఫలరాశిఁ బడయు నెమ్మి నతండున్. 1186

వ. మహాశ్వేతుం బూజించిన మహాఫలంబు గలుగు. అర్ఘ్యంబులు నిరంతరంబు భాస్కరు నుద్దేశించి చేయవలయు. అట్టు లొనరించువారి వంశమ్ములందు దరిద్రుఁడుగాని, వ్యాధిబాధితుఁడుగాని గలుగరు. శ్వేతరక్తపీతమృత్తికలచే సూర్యదేవాలయంబున నుపలేపనం బొనరించిన వాంఛితఫలంబులం బొందు. చిత్రభానుండగుసూర్యుని సుగంధి విచిత్రకుసుమంబులం బూజించునరులు సర్వకామంబులం బొందుదురు. 1187

క. ఘృతమున దీపము వెలిఁగించి తమిన్ రవి కిడఁగఁ దగును జిత్తంబున సం
తతభక్తిఁ దైలమునసే, శతపత్రప్రియున కిడఁగ సత్ఫల మలరున్. 1188

క. తను వలరుఁ జూడఁగాఁ దగు, ననువున దీర్ఘాయు వబ్బు నతిస్ఫురణం
బనవరతము చెడ కుండును, మునులారా! దీపదానమును జేసినచోన్. 1189

క. జ్ఞానప్రదీపవృద్ధిం, గానంగా నొను భక్తగణనాథుండై
మానవుఁ డెంతయు గౌరవ, మూనియొ చరియించు బుద్ధి యొప్పు రుచిరమై.

క. తిలలు పవిత్రతమంబులు, గలఁగనిమది వాని నీయఁ గలుగుఫలము న
త్యలఘువుగద శుచికృత్యంబుల వాని నొసంగఁ బాపములు నశియించున్.

ఆ. నిర్జరాలయముల నిత్యము దీపంబు, నొసఁగునతఁడు మనుజ లోక మొగిని
బోవు త్రోవలందుఁ బొల్పుగాఁ గనఁదగు, తనువులలర నుండు ననఘుఁడగుచు.

వ. హవిస్సులచే సూర్యు నారాధించుట ప్రథమకల్పంబు. ఓషధీరసంబుల నారాధించుట ద్వితీయకల్పంబు. వసామేదోఽస్థినిర్యాసంబులర్కున కెపుడొసంగ రాదు.

ఆ. ఊర్ధ్వగతియె యెప్పు డొప్పు దీపమునకు, నీచగతియె లేదు నిత్య మిద్ది
దాని నిచ్చునట్టి దాత దీప్తింగను, నీచగతిని జెందనేరఁ డెపుడు. 1194

క. జ్వలియించుదీపమును దొంగిలఁ గూడదు శాంతి నొందఁ గీటడగింపన్
గలుగున్ బంధము దనరును, విలయము క్రోధంబు జ్ఞానవిచ్యుతి పొసఁగున్.

క. దీపంబు దాన మిచ్చెడు, నాపూరుషుఁ డభ్రయానముం దేగి జ్వల
ద్దీపావళివలె సురపురి, నేపారుచునుండు సాటియే లే కెపుడున్. 1196

ఆ. మరల జన్మమంది మహనీయధనయశ, శ్శ్రీలఁ బెంపు నొంది క్షితిని వెలయు
మనుజులందు మిగుల మన్నన లలవడ, రక్తపుష్పరాజి రాజిలుఁ గడు. 1197

సీ. ఉదయకాలంబున సదమలభక్తిని రవి కర్ఘ్య మొసఁగువిప్రప్రవరుఁడు
వర్షంబునన్ సిద్ధిఁ బ్రాపించు మఱియు నుదయమాదిగాఁ గ్రుంకుదాఁక రవికి
నభిముఖుఁడై భక్తియలర మంత్రమునేని స్తుతినేని జపియింప వితతఫలము
గలుగు సూర్యవ్రతాఖ్యం బిది నియమంబు పాపౌఘనాశనతాపహరణ

తే. చణము; సూర్యునిఁగూర్చి యేజపము గాని
సంస్తవముగాని చేయుసజ్జనుఁడు పూన్కి
నర్ఘ్యపూర్వకముగఁ జేయ సాంగమగును
గాకయున్నఁ గొంతయే కలుగు దాన. 1198

క. మునులారా! శ్రద్ధాయుతి, వనజాతాప్తునిగుఱించి భక్తి నుదయమం
దునఁ జేయువ్రతము పాపాళిని దొలుచు సత్ఫలము లలిం గలిగించున్. 1199

వ. సువర్ణధేనువృషభవసుధావస్త్రసంయుతంబుగ నర్ఘ్యంబు సూర్యున కొసంగిన నరుం డేడుజన్మంబులదాఁక సుఖించు. అగ్నితోయాంతరిక్షములయందుఁ గాని పరిశుద్ధభూమియందుఁగాని ప్రతిమయందుఁ గాని యర్ఘ్యం బీవలయు. అపసవ్యముగఁగాని సవ్యముగఁగాని విముఖముగఁగాని యర్ఘ్యంబీ రాదు. అభిముఖముగఁ గూరుచుండి యర్ఘ్యదానము చేయవలయు. ఘృతముంగూర్చిదీపంబును గుగ్గులుతో ధూపంబును రవికినభిముఖంబుగభక్తియుక్తిఁ జేయవలయు సర్వపాపంబులా క్షణంబ నశియించుసంశయంబు లేదు. శ్రీచందనదేవదారు సర్జక కర్పూరాగురు ధూపంబుల నొసంగిన స్వర్గలోకంబు గలుగు. సౌమ్యయామ్యాయనంబుల సూర్యునారాధించిన సర్వపాపంబులు తొలంగు. విషువత్కాలంబులఁ జంద్రసూర్యోపరాగంబుల, షడశీతిముఖంబుల విశేషించి సూర్యుం బూజించిన సకలపాపంబులు నాశంబునొందు. ఈరీతిఁ బ్రాగుక్తకాలంబులందుఁ గాని, యనుక్తకాలంబు

లందుఁగాని భక్తియుక్తుండై భాస్కరు నారాధించిన సూర్యలోకనివాసంబు గలుగు. కృసరంబులఁ బాయసాపూపంబుల ఫలమూలఘృతౌదనంబుల సూర్యు నింగూర్చి బలిదానంబు చేయుమానవులు సర్వకామఫలంబులం బొందుదురు. ఘృతతర్పణంబున సర్వశ్రేష్ఠుం డగు. క్షీరతర్పణంబున మనస్తాపంబులు తొలంగు. దధితర్పణంబునఁ గార్యసిద్ధి పొసంగు. సూర్యు నభిషేకింప జలంబుల నదినుండిగాని పరిశుద్ధవాపికనుండిగాని సంగ్రహించువాఁడు పరమగతిం బొందు. ఛత్రధ్వజవితానంబులఁ బతాకను జామరంబుల భక్తిమీఱ భాస్కరు కొసంగినపుణ్యాత్ముండు స్వేష్టగతిం బొందు. ఏద్రవ్యముగాని భక్తియుక్తుండై సూర్యున కొసంగిన నాద్రవ్యము జన్మాంతరమున శతసహస్రగుణితంబుగ లభించు. మనోవాక్కాయజదుష్కృతంబులు సూర్యప్రణామంబున నశించు. ఒక్క పగటికాలంబున శ్రద్ధాభక్తుల సూర్యునారాధింపఁ గలుగుపుణ్యంబు యథోక్తదక్షిణల నొసరించు యజ్ఞశతంబులఁ గలుగనేరదని పంకజాసనుండు పలుక మహర్షు లిట్లనిరి. 1200

ఇరువదియొనిమిదవ అధ్యాయము.

ద్వాదశవిధసూర్యమూర్తిచరిత్రము.

క. వినిసారము లోకేశ్వరుఁ, డనఁబడు భాస్కరునిమహిమ మంతయు నీయా
నననిర్గతమును లెస్సగ, విన వేడుక మరల మాకు వెలసెడు ననఘా. 1201

క. మరలం బ్రశ్నింతుము మునివర! నిన్ను గృహస్థువేని వటువేని వన
స్థిరవసతిఁగాంచు సద్వ్రతపరుఁడేఁ గర్మందియేని పరమపదంబున్. 1202

క. పొందఁగఁ గోరిన నేదేవుం దగ నర్చింపవలయు? భూరిస్వర్గం
బందఁగ నెద్ది యుపాయ మగుం దేనిని బొంద సుఖము కొఱఁతం గనదో.

తే. స్వర్గమునకన్న నెయ్యది సత్పదంబొ, దేనిఁ బొందిన మరలుట గానరాదొ
దేవతలకెల్ల నెక్కుఁడు దేవుఁడెవఁడొ, పితరులకునెల్ల నెవ్వాఁడు పితయనఁదగు.

తే. ఎవనికంటెను బరతర మింకలేదొ, యతని వివరింపుమా మాకు నబ్జయోని
విశ్వమిద్దాని నెవ్వఁడు వెలయఁజేసె, జంగమస్థావరాత్మకసరణి మెఱయ. 1205

సీ. ప్రళయకాలమున విశ్వం బిద్ది యెవ్వానియందు లీనంబగు నతనివిధముఁ
గరుణ వచింపుమా కంజాతసంభవా! యనఁ బ్రహ్మ యిట్లని యనువదించె
వినుఁడింక మునులార! విశ్వమియ్యది యెవ్వఁ డుదయింపఁజీకటులొగినశిఁః
వెలయునో తనవగు విమలకరంబులఁ దిమిరాళిఁ జెండి యేదేవుఁ డెసఁగు

తే. చుండునో యట్టిభాస్కరుం డొకఁడె దైవ
మతని మించినవాఁడు లేఁ డరయ నెందు

నాతఁడె యనాదినిధనుఁ డవ్యయుఁడు శాశ్వ
తుఁడును బురుషుఁడు నన నుతిఁ బడయునతఁడె. 1206

క. జగముల మూఁడింటిని రశ్మిగణంబునఁ దాపమొందఁ జేయుచుఁ దీక్ష్ణం
బుగఁ గాంతు లొప్పఁగా నెపు, డగణితవేగంబు మీఱ నరుగుచు నుండున్.

తే. సర్వదేవమయుండతఁ డుర్వరఁ దపి, యింపఁగాఁ జేయు వారియం దెల్ల నధికుఁ
డఖిల విశ్వేశ్వరుండయి యఖిలకర్మ, సాక్షియవ్వాఁడె యోమునిసత్తములార.

క. తనలోఁ గొనుభూతంబులఁ, గొనినట్లే వెలువరించుఁ గూర్మి మెఱయఁగాఁ
దనకరముల మెఱయుచు నేఁపున నెల్లఁ దపింపఁజేయు భూసురులారా. 1209

క. ఇతఁడే ధాత విధాతయు, నితఁడే భూతాదిభూతహితవర్తనుఁడై
యితఁ డలరు భూతభావనుఁ, డితఁడే యగు క్షయతనొందఁ డెన్నండైనన్.

ఆ. ఇతనిమండలం బదెన్నండును క్షీణ, మెట్టిభంగిఁ గాదహీనతపము
వెలయ నలరు మానివృత్త్రయులార! యీ, యినుఁడె పితరులకు నగును బిత తగ.

క. సురలకు దేవత యీతఁడె, యరయంగా నితనిపదమె యగు ధ్రువ మనఁగాఁ
బొరయదు చ్యుతి యెన్నఁటికిన్, ధరసర్గపువేళఁ గృత్యతతికిన్ రవియే. 1212

క. కారణ మగుఁ బ్రళయంబున, నీరవియే భూతవితతి నెల్ల స్వపదముం
జేరంగఁ జేయు; యోగులు, పారసఖమండలంబు శాశ్వత మనుచున్. 1213

ఆ. గృహకళేబరముల నహి కుబుసంబును, వదలునట్లు వేగ వదలి వాయు
భూతులగుచుఁ దేజములకు సంస్థానమౌ, నినుపదంబుఁ జేరి కనుదు రెలమి.

సీ. భాస్కరుసద్దీప్తివారంబు మానులు సురలతోడను బక్షివరములు తరు
శాఖలయందుండుచందంబునం జేరియుందు రాశ్రయ మిదె యొప్పిదమని
యోగిధర్మంబుల నొప్పి గృహస్థులౌ జనకాదులును దపశ్శక్తివెలయు
వాలఖిల్యాదులౌ బ్రహ్మవాదులు మఱి మునులు వానప్రస్థులును మహాత్ము

తే. లైన వ్యాసాదిభిక్షువు లమలయోగ
మూని రవిమండలంబు నోహో ప్రదీప్త
మనుచుఁ జొత్తురు; వ్యాసునితనయుఁడైన
శుకమహర్షియు సత్తపస్స్ఫూర్తి యలర. 1215

చ. సరసిజమిత్త్రుసత్కిరణసంతతి నొంది సుఖంబు గాంచుచున్
మరల యథోక్తయోగరతి మానెను దత్పద మెంతొ నిత్యమై
పరఁగుట; మానులార! విధిపంకజనేత్రులు శంకరుండును
సురుచిరశబ్దసంశ్రవణశోభితమూర్తులుగాఁ దలంపుఁడీ. 1216

క. భానుం డన్నన్ సాక్షా, జ్జ్ఞానమయాకారుఁ డగుచుఁ జక్కం ద్రోఁచున్
గానం దిమిరనిషూదను, పై నుంపుఁడు భక్తి సర్వభద్రము లలరున్. 1217

క. కనఁబడుచుఁ బాధింపఁడు, కనఁబడకయె నిత్యమగుచుఁ గ్రాలుం గానన్
గనఁబడుచుం గనఁబడకయె, తనరున్ బ్రహ్మంబు నగుచుఁ దపనుం డెపుడున్.

క. అనవరతము భగవంతుఁడు, వనజాప్తుం డర్చ్యుఁ డౌను భక్తిన్ మీరన్
మనమున నిల్పుం డాతని, జననియు జనకుండు గురువు జగముల కతఁ డౌ.

సీ. అతఁ డనాద్యుఁడు జగద్వితతి నాథుం డౌను; మిత్రత్వ మూనుచు మెలఁగుఁగాదె
కనుక ననాదిని ధనుఁడు బ్రహ్మమ్ము నక్షయుఁడును స్రష్టయు సాగరాన్వి
తము లగుద్వీపవరముల లోకంబులఁ బదునాలిగింటిని బరమకరుణఁ
బాలించుచుండు; భువనహితార్థము రవి చంద్రసరిత్తటసంస్థితుఁ డయి
తే. శక్తిమీఱఁ బ్రజాధీశసముదయంబు
బహువిధంబులుగాఁ దగుప్రజల బుట్టఁ
జేసి నియుతాంశు వయ్యును స్థిరుఁడు నయ్యు
దనను బండ్రెండు మూర్తులుగ నొనరించి.　1220

వ. ఆదిత్యుఁ డొండు ఇంద్రుఁడు ధాతయుఁ, బర్జన్యుండు, త్వష్ట, పూష, ర్యమ, భగ
వివస్వ, ద్విష్ణువులు, నంశ, వరుణ, మిత్రులు నను నీద్వాదశనామంబులఁ బిలువం
బడుచు నీజగత్తంతయు నీరూపంబుల వ్యాపించి యుండు మఱియు.　1221

సూర్యద్వాదశమూర్తిస్థానములు.

క. తొలినామ మింద్రసంజ్ఞిత, మలరారెడుమూర్తి యద్ది యాస్వర్గమునన్
జెలఁగుచు సురరాజత వైరులఁ గూల్చుచుఁ దేజ మలర రూఢిఁ గనియెడున్.

క. ద్వైతీయ స్తుతమూర్తియు, ధాత యనంగాఁ జెలంగి తనగురుశక్తిన్
బ్రీతిం బ్రజాపతిత్వ, ఖ్యాతిం గని వివిధజంతుగణము సృజించున్.　1223

క. వినుఁడీ మూఁడవనామం, బనునది పర్జన్యుఁ డనెడు నదిగా దే యా
ఘనమండల వసతిం గని, తనకరముల జలముఁ బీల్చి తా వర్షించున్.　1224

సీ. నాలవమూర్తి వనజమిత్రునకు నగుఁ ద్వష్ట్యనామము కడుధరణిఖ్యాతి
మించు నయ్యది యుండు మేటివృక్షములందు నోషధులందు మహోజ్జ్వలముగ
నలరుచు; మఱియు నహస్కరుపంచమమూర్తి పూషాహ్వయమును ధరించి
యన్నమునం దుండి యతిశయపుష్టిని గల్పించి ప్రజలను గాచుచుండు;
తే. షష్ఠమం బగురవిమూర్తి క్షమను గ్రాలు
నర్యమాఖ్యను వాయువు నావరించి
త్రిదశతతి నాశ్రయించి సమ్మద మొసఁగుచు;
భాను నేడవమూర్తియుఁ బరఁగుచుండు.　1225

క. ధరణి భగాహ్వయమున న, య్యురుమూర్తియు భూతవితతి నొగిఁ బ్రాణికళే
బరములయందును నిల్చును, నిరతము పోషించు వాని నిర్భరశక్తిన్.　1226

తే. భానుసప్తమమూర్తియు వఱలుచుండు, దా వివస్వత్సమాఖ్యను దాల్చి యగ్ని
యందు నెసఁగుచు జీవుల యన్న మెల్లఁ, బక్వముగఁ జేయుచుండును బ్రౌఢశక్తి.
క. ఖరకరు తొమ్మిదవ దగుచుఁ, బరఁగెడు నామూర్తి విష్ణువరనామమునన్
సురలందు వెలసి శత్రు,త్కరనాశనదక్షతం బ్రకాశించుఁ దగన్. 1228
సీ. రవి పదియవమూర్తి రాజిల్లు నంశుమన్నామధేయంబు నుద్దామశక్తి
మంతంబు ధరియించి మారుతమున నిల్చి ప్రజల కాహ్లాదంబుఁ బ్రబలఁజేయు
చుండు; మఱి పదునొకండవరవిమూర్తి వరుణనామంబునఁ బరఁగి సలిల
ములయందు నిల్చి ప్రజల నెప్డు కాచుచు నుండుఁ బండ్రెండవయుగ్రభాను
తే. మూర్తి మిత్రాఖ్యను ధరించి పూని జగము
లకు హితం బొనఁగూర్చు నుల్లాస మలరఁ
దాను జంద్రసరిద్వరతటమునందు
నిలిచి మునివేషమును దాల్చి నియతిమీఱ. 1229
క. అనిలుని నాహారించుచు, జనులకు మే లొప్పఁ గూర్చు చక్షుస్సులచే
ననిశము చూచుచు భక్తుల, మనసులఁ దగు వరముల బహుమానము మీఱన్,
తే. ఇచ్చుచుండును; నాస్థాన మీశ్వరప్ర,కల్పితం బాది నందు శ్రీకరకరుండు
నిలిచె మిత్రాహ్వయంబునఁ గలిగె దాన, మిత్రవన మనునామంబు మించుకీర్తి.
క. మునులారా! యీద్వాదశ, వినుతాఖ్యల భాస్కరుండు విశ్వం బెల్లన్
గనుచున్ వ్యాపించి సతం,బును గాచుచునుండుఁ గానఁ బూనికమీఱన్.
క ధరణీదివిజులు శ్రీభా,స్కరునకు వందనశతంబు సల్పఁగఁ దగు భ
క్తిరతిం ద్వాదశపదగతు, ఖరకరు నెడ నిల్పి సాధుకల్పానుగతిన్. 1233
క. వినయంబునఁ బూజింపం,గను దగు; ద్వాదశవిభాగగతు భాస్కరునిన్
మనుజులు ధ్యానించుచు వం,దనముల నలరంగఁ జేయఁ దగు నిత్యంబున్.
క. ఈనుతి వినినఁ బఠించిన, మానవు లాసూర్యలోక మహితపదమునన్
బూని వసింతురు; నా విని, మౌనులు చతురాస్యుఁ జూచి మనసులుపొంగన్.
చ. సరసిజసంభవా! రవి ప్రశస్తతరుం డగునాదిదేవుఁడై
పరఁగునయే నదేల వరవారముఁగోరి తపస్సు చేసెను
ర్వరఁ దగుప్రాకృతుండు బలెఁ బల్కుము తద్విధ మన్న బ్రహ్మయున్
వరమునులార! గుహ్యతరవార్తను జెప్పెద నాలకింపుఁడీ. 1236
క. మును సూర్యవార్త నారద,ముని యడిగినఁ దీక్ష్ణరశ్మిమూర్తులఁ బండ్రెం
టిని దెల్పఁగా దె తద్విధ,మును దెల్పెద; భానుని వగుమూర్తులయందున్.
సీ. వరుణమిత్రాఖ్యల వఱలు నిద్దఱు తపం బొనరింపఁ బూని రందును వరుణుఁడు
జలములఁ ద్రాగుచు సాంద్రభక్తిని బశ్చిమాబ్ధితటంబున నమలతపము

చేయుచుండెను మిత్త్రుఁ డాయతనియతిమై మిత్త్రవనంబున మేటితపము
వాయు వాహరించి భక్తిఁ జేయుచు నుండె నత్తఱి మేరుశృంగాగ్రభాగ
తే. మున వసించిన నారదముని జగంబుఁ
గనుఁగొనం గోరి స్వేచ్ఛమై గంధమాద
నమున కేతెంచె మిత్త్రుఁ డాయచలగిరిని
దపము సేయుచునుండె నెంతయును బూన్కి. 1238

క. నారదుఁ డామిత్త్రుని గని, యీరీతిం దలఁచె మునిని నితఁ డవ్యయుఁ డఘ
భూరిప్రస్తుతిఁగాంచెను, సారసమిత్త్రుండు సర్వజగదధిపతియున్. 1239
వ. వ్యక్తావ్యక్తుండు. సనాతనుండు నక్షయుండు నగు. ఇతనిచే లోకత్రయంబు
ధరింపఁబడు. మఱియు. 1240
క. పిత యెవఁడు సర్వదేవ, ప్రతతికి మఱి శ్రేష్ఠులందుఁ బరమశ్రేష్ఠ
స్తుతికిం దగువాఁ డెవ్వఁడొ, యతఁ డీభానుండె కాఁడె యట్టిం డయ్యున్.
సీ. ఏదేవతం గూర్చి యితఁడు ధ్యానించెడు నేపితృదేవత నెదను నిల్పి
తపమొనర్చెడు నని తలఁచి నెమ్మనమున నాతనిగుఱించి యిట్లనియె; దేవ
సాంగంబు లగుచు సోపాంగంబులై తగువేదాళిచేతను విమలతరము
లగు పురాణాళిచే ననయంబు నుతియింపఁ బడుదువు నినుఁ గూర్చిపరమమునులు
తే. సకలదేవాత్మకుఁడ వని యకలుషవిధిఁ
బూజ సల్పుదు; రీవె యీభువనములకు
బితవు మాతవు మఱియు దైవత మవుదువు
భూతభవ్యభవిష్యముల్ పొందు నిన్ను. 1242
ఆ. నాలుగాశ్రమములఁ గ్రాలువారలు నిన్ను, నాశ్రయించువార లరయ నీవు
శాశ్వతుఁడవు గావె సరసిజసఖ! యట్టి, నీవె యెవనిగూర్చి నియతభక్తి. 1243
క. తప మొనరించెదవో యీ, తపమున కెదిఫలమొ దానితత్త్వం బెఱుఁగం
దపనా! కోరెద ననఁగా, నపు డామిత్త్రుండు మౌని కాదృతి ననియెన్. 1244
క. ఇది వచియింపఁగ రాని ద్యసఁదగుమహాగుహ్యమును సనాతనము నగున్
మదినీపైఁ గలభక్తిని, నది యెట్టిదియైనఁ జెప్పనగు విను మింకన్. 1245
సీ. అతిసూక్ష్మమై మఱి యవ్యక్తమై యవి
జ్ఞేయమై యచలమై స్థిరము నగుచు
నింద్రియవితతిచే నింద్రియార్థములచే
సర్వభూతములచే సతతము నది
వర్జింపఁబడుచును భాసిల్లు నేతత్త్వ
మదియె భూతంబుల కంతరాత్మ

యనియు క్షేత్రజ్ఞుండు ననియుఁ జెప్పంబడు
నదియె యోగమున సాంఖ్యమునఁ బెక్కు
తే. నామరూపంబులు గలచందంబు చెప్పఁ, బడియె; నదియె హిరణ్యగర్భస్వరూప
మదియె బుద్ధియనంబడు నదె మహత్తు నాఁ బ్రధానంబు యోగి నాథనుతము.
క. అదియె త్రిరూపము విశ్వం, బదియే యేకాక్షరంబు నగు; నద్దానన్
విదితంబగు త్రైలోక్యం, బిది యేకాత్మకము గాఁగనే విధృతంబౌ. 1247
క. తనురహితమయ్యు నయ్యది, తనుధారులయందు నెల్లఁ దా నివసించున్
మునివర! యటు నివసించియుఁ, దనుభృత్కర్మముల నంటఁదగక వెలుంగున్.
ఆ. నాదు నంతరాత్మ నీదగు నాత్మయుఁ, దక్కినట్టి దేహధారుల దగు
నంతరాత్మ యదియె యగు; సాక్షిభూతమై, తా గ్రహింపనెట్లు తగక వెలయు.
క. అదియే సగుణం బనియును, నదియే నిర్గుణ మనంగ నభివర్ణితమౌ
నదె జ్ఞానగమ్య మనియును, నదియే విశ్వం బటంచు నభినుతిఁ గాంచున్.
సీ. అద్ది యెల్లెడఁ జేతు లంఘ్రులు గలదగు సర్వతశ్శిరాక్షిసముదయయుత
మగు సర్వతోముఖమయి విలసిల్లును సర్వతశ్శ్రోత్రమై సర్వమునను
దానయై విలసిల్లుఁ దత్త్వ మద్దియె విశ్వమూర్ధంబు విశ్వైకభుక్కు నదియె
నదె విశ్వపాదాక్షియై విశ్వనాసికమై యేకమై క్షేత్రమందు స్వేచ్ఛ
తే. సంచరించుచునుండును; శర్మ మొదవ, నెల్లతనువులు క్షేత్రములే యనంగఁ
బడును వాని నెఱుంగుటవలన నదియొ,వినుతముగుచుండు క్షేత్రజ్ఞుఁడనఁగజగతి.
క. మునివర! యవ్యక్తపురం,బున నుండుటచేత నదియె పురుషుం డనఁగా
దనరున్ విశ్వము బహువిధ, మని తెలియందగును దైవ మది యెల్లెడలన్.
తే. వివిధ రూపంబులం దాల్చి వెలయుచుంట
విశ్వరూప మటంచును వినుతిఁ గాంచె;
దానిదైన మహత్త్వంబు తగినరీతిఁ
బురుషుఁ డనఁబడు వాఁడెపో పోల నెఱుఁగు. 1253

వ. ఆతండొక్కండె మహాపురుషశబ్దంబు భరియించు. సనాతనుండు నగు. ఆమహాపురుషుండు సత్త్వబుద్ధిక్రియాపన్నుండై స్వాత్మచే జగంబు నిర్మించు. శతధా సహస్రధా శతసహస్రధా కోటిశః స్వాత్మచేఁ బ్రత్యగాత్మ నొనరించు. ఆకాశపతితం బగుజలంబు స్వాదుతరంబుగ భూగుణంబునుబట్టి యగురీతి క్షేత్రగుణంబున మాఱుచుండు. వాయు వొక్కండయ్యు దేహంబులఁ బంచధా వెలయునట్లు బహుత్వైకత్వంబులు పరమాత్మకుం జెల్లు. సంశయంబు లేదు. స్థానాంతరవిశేషంబున నగ్ని యెట్లు మహత్త్వంబు నొందు నెట్లు ధ్రువాదులయందు బ్రహ్మాదులయందు సంజ్ఞలు వెలయు నట్లె మేము నని యెఱుంగుము. ఒక్కదీపంబు దీపసహస్రంబులఁ బ్రభవిల్లం జేసినట్లు రూపసహస్రంబుల

పురుషుం డొక్కరుండె కల్గించు. ఎప్పుడు తన్నుఁదా నెఱుంగునో అపు డొక్క
రుండె నిలుచు. ప్రలయంబున నేకత్వంబును, సర్గంబున బహుత్వంబు నాపురు
షునకుం గల్గుచుండు. జగంబున స్థావరజంగమంబులయందు నిత్యం బగువస్తువు
లేదు. అక్షయుం డప్రమేయుండు సర్వగతుండు నగు నని పురుషుం డాతండె
వర్ణింపంబడు. కావునఁ ద్రిగుణంబయి యవ్యక్తంబె వెలయు ననియెఱుంగఁదగు.
వ్యక్తావ్యక్తభావస్థ యగునదియె ప్రకృతియని తెలియుము. అదియె బ్రహ్మ
యోనియని చెప్పంబడు. సదసదాత్మకం బగుటయె దానికిం గారణంబు. లోకం
బున దైవపిత్ర్యకర్మంబుల నెవఁడు పూజింపఁబడు వానికంటె వేఱగునది
ప్రపంచమున లేదు. ఆతండె తండ్రియనియు దేవుండనియుఁ జెప్పంబడు. ఆతం
డాత్మచే నెఱుంగఁదగువాఁడు. కాన నాపరమాత్ము నారాధించెద. 1254

క. సురపురమున నుండినసుం, బరమాత్ముని నతని భక్తిభావనమెయి ని
వ్వరుసనె పూజింతురు మహా, నిరమణ! తత్ఫలముచేత నిర్మలపదమున్. 1255

క. కనఁజాలుదు రవ్వారలు, వినుమా నిర్జరులు చాలవిధములఁ దగుమూ
ర్తినికరమున రాజిలునా, ఘనమూర్తిని బూజ సల్పఁగా నవ్విభుఁడున్. 1256

క. వారలకు సుగతి చూపును; శ్రీరమణుం డతఁడె యెల్లతీఱిభాగములన్
జేరి చెలంగును నిర్గుణుఁ, డై రాజిలు నంచుమౌను లందు రతనినే. 1257

క. ఈవిధ మెఱిఁగియె వినియే, యావిభుఁ బూజించువాఁడ నాఘనమూర్తిన్
భావించి పూజసల్పిన, నావర్ణితగుణులు పరము నంబుజనేత్రున్. 1258

క. అతనినె పొందుదు; రేకం, బతులిత మగుతత్త్వ మద్ది యమలవిభూతిన్
జ్యోతిలేక యెల్లరకుఁ దా, గతియయి యేకత్వ మలరఁగా విలసిల్లున్. 1259

చ. మునివర! నారదా! మిగుల ముఖ్యము గుహ్యము నైనభావమున్
మనమున నేనిరంతరము మానక ధ్యానముచేయుదాని నీ
కొనర వచించినాఁడ మును లుద్యమ మొప్పఁచునుండఁగాఁ బురా
ణనిచయముం బఠించి కనినా రిదె గుహ్య మటంచుఁ జెప్పనౌ. 1260

క. ఆపరమాత్మ దివాకరు, నేపారెడు భక్తిభావ మేర్పడుచుండం
గాపరియని పూజింతురు, శ్రీపతి యని ధ్యానయుక్తిఁ జేర్తురు మదినిన్. 1261

చ. అని పరమేష్ఠి మౌనితతి నాదృతిఁ గాంచి దివాకరుండె మున్
మునులకు నీవిధం బెఱుఁగఁ బూనిక మీఱ వచించె దానినే
వినఁదగుఁ గానఁ జెప్పితిని వేడుక మీరు మదుక్తరీతిగా
జనులకుఁ జెప్పఁగాఁదగును సారసమిత్రుని భక్తిగల్గియే. 1260

వ. సూర్యభక్తి విడిచిన లాభము లేదు. ఎవఁడీదివ్యచరిత్రము వినిపించునోయెవఁడు
వినునో వారు శ్రీసూర్యనారాయణుం బొందుదురు సంశయంబులేదు. ఈకథ
నాలకించినరోగి రోగవిముక్తిం గాంచు జిజ్ఞాసువై విన్నజ్ఞానంబుం బొందు,

దీనిం బఠించిన ధ్యానయోగనియతి సిద్ధించు. ఏయేవాంఛ లున్న నవియెల్ల ఫలించు. కాన మీ రెల్ల శ్రీభాస్కరు నారాధింపుఁడు. ఆతండె ధాతయు విధాతయు సర్వజగద్ధరుండు నగునని పలికి బ్రహ్మ మఱియు నిట్లనియె. 1262

ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

వసంతాదులయందు సూర్యవర్ణ భేదములు.

క. మునులార! సూర్యమూలం, బనఁదగు నీయఖిలజగము నట్లౌటను భా
నునివలన ససురమానుష, మనఁబడు నీజగము గల్గు నని చెప్ప నగున్. 1263

సీ. ఇంద్రమహేంద్రుల కీశ్వరునకు సర్వనిర్జరులకు మఱి నిర్మలతర
తేజంబుగల్గిన దేహివ్రజమునకు సార్వలౌకికసుతేజస్సు రవియె
సర్వాత్మ యాతఁడె సర్వలోకేశ్వరుఁ డఖిలదేవతలకు నాదిదేవుఁ
డతఁడె ప్రజాపతి యాదిత్యుఁడే త్రిలోకములకు మూలంబు విమలదైవ

తే. తము నగున్ వీతిహోత్రునందు మహితవిధిఁ
జేయుహోమము లాదిత్యుఁ జేరుచుండు
సూర్యునుండియె వృష్టియు క్షోణిఁగల్గు
దాన నన్నము ప్రజలు న ద్దానివలన. 1264

క. కలుగుదు రాసరసిజసఖు, వలననె సర్వంబు గలుగుఁ బ్రళయం బందున్
ఖలహరణువలన భావం, బులభావము లుప్పతిల్లు మునివరులారా. 1265

తే. ధ్యాన మొనరించువారికి ధ్యాన మిదియె,
ముక్తులకు మోక్ష మిద్దియె భూతవితతి
నర్కునం దొగి లయమగు నతనివలన
మఱియు నుప్పతిలున్ బలు మాఱు లిట్లె. 1266

క. జరగుచునుండు ముహూర్తో,త్కరములుక్షణములును దివసకాండమునిశలున్
నిరతము పక్షము మాసము, శరత్తు లబ్దే యుగర్తు జాలము లమరున్. 1267

క. ఖరకరువిడిచినఁ గాలముఁ, బరిగణనము చేయుతోవఁ బట్టుపడదు త
త్పరిగణనము మానినచో, జరగదు శుచిహోమకృత్య జాలం బెల్లన్. 1268

క. ఏనియమము సాగదు ఋతు, మానం బిది యనెడునియమ మార్గమ్ముచెడున్
సూనవితానము ఫలతతి, గానంబడు నిప్పు డనెడు క్రమము చెడియెడున్.1269

సీ. ఆదిత్యువిడిచిన యట్లైన నాపుష్పఫలములు వెలయునె ట్లలరుఁ దృణము
లోషధులును మఱి యుర్విపైఁ గలవ్యవహారముల్ జంతువు లవగుకృత్య
మేవియు సాగక యేపోవు; భూగతజలముఁ గరంబుల నెలమిఁ బీల్చి
వృష్టిరూపంబున వెలయించు భాస్కరుం డావృష్టి లేకున్న నవనియెల్లఁ

ఆ. జాలఁ దప్తయగును సలిలమే పరిధిగా, నర్కు నావరించి యమరియుండు;
వారిచేత రవియు భాసిల్లు మఱివసం, తమునఁ గపిలవర్ణతం దనరును. 1270

క. కనకచ్ఛాయను గ్రీష్మం, బున వెల్గును వృష్టికాలమున శ్వేతాభుం
డనఁబడు శరత్తునన్ భూ, వినుతింగనుఁ బాండువర్ణ విధకరుఁ డనఁగన్. 1271

సీ. హేమంతమునఁ దామ్ర మేరీతిఁ గనఁబడునట్లు కరావళి యమర వెలయు
శిశిరర్తువున సరసిజబాంధవుఁడు లోహితచ్ఛాయ వెలయును దపనుకాంతి
వర్ణముల్ తత్కాలభవములు చెప్పఁగాఁబడియెఁగదా ఋతుభవము లివ్వి
యగు నీవిధంబునఁ దగుకాంతులం దాల్చి జగదభివృద్ధికై సప్తహయుఁడు

తే. పాటుపడుచుండు భాస్కరు ద్వాదశవిధ
నామములు తెల్పఁగాఁబడె నీమమలర,
మఱియుఁ బండ్రెండునామముల్ మహితఫలద
ములు గలవు వాని వచియింతు మోద మలర. 1272

వ. ఆదిత్య సవితృసూర్య, మిహి, రార్క, ప్రభాకర, మార్తండ,భాస్కర, భాను, చిత్రభాను, దివాకర, రవినామంబులు ప్రసిద్ధంబులగు. ఇవ్విగాక విష్ణు, ధాతృ, భగ, పూష, మిత్రేంద్ర, వరుణార్యమ, వివస్వ, దంశుమ, త్వష్టృ, పర్జన్యనామంబులు పండ్రెండును గుహ్యతమంబులుగ భాస్కరునకుం గలవు. ఈనామంబులం దాల్చి పండ్రెండు మాసంబుల నుదయించుచుండు. చైత్రంబున విష్ణువు భూమిఁ దపింపఁజేయు వైశాఖంబున నర్యముం డన వెలయు. జ్యేష్ఠమాసంబున వివస్వంతుఁ డనఁబరఁగు. ఆషాఢంబున నంశుమంతుఁ డనభాసిల్లు. శ్రావణంబునఁ బర్జన్యుఁ డన విలసిల్లు. భాద్రపదంబున వరుణుం డనఁదనరు. ఆశ్వయుజంబున నింద్రుఁ డనం బ్రకాశించు. కార్తికంబున ధాత యన భాసమానుండగు. మార్గశీర్షంబున మిత్రుఁ డన నలరారు. పౌషమాసంబునఁ బూష యన నొప్పు. మాఘమాసంబున భగుం డనఁ బ్రభవిల్లు. ఫాల్గుణంబునఁ ద్వష్ట యనునామంబుఁ దాల్చియుండు. మఱియు విష్ణునామంబుఁ దాల్చినరవి పండ్రెండు వందల కరంబుల, నర్యముం డనునామంబు ధరియించిన భానుండు పదుమూఁడువందల కిరణంబులను, వివస్వంతుం డనునామధారి యగునర్కుండు పదునాలుగు శతంబుల కాంతులను, నంశుమన్నామధారి యగుతపనుండు పదునేనువందలగభస్తులను, బర్జన్య నామధరణకాలంబున నరుణగభస్తి వివస్వంతునివలెను, వరుణనామవహాన సమయంబున నర్యమునిభంగియు, భగుం డనుపేరం దనరుతఱిని, ద్వష్టృనామంబుగల యప్పుడు మిత్రురీతిని వేయి ఘృణుల, నింద్రనామంబుగల నెలఁబండ్రెండువందల రుచులను, ధాతృనామంబుగలకాలమున నేకాదశశత దీప్తులను ధరియించియుండు. మిత్రుం డనఁబడు తరుణంబున సహస్రచ్ఛవులను, బూషుఁ డనందనరు నవసరంబునఁ దొమ్మిదివందల జ్యోతిస్సులను దీవ్రకిరణుండు తనరారుచుండు. ఉత్తరాయణంబున నీకాంతులు వృద్ధినొందు. దక్షిణాయనంబున నివ్వి క్రమంబునఁ దగ్గుచుండు. 1273

తే. ఇట్లు రశ్మి సహస్రంబు నే సమాశ్ర,
యించి యినలోక సంగ్రహ మెంచఁబడును,
ఋతువులనె యాశ్రయించి సంతతము వృద్ధి
హ్రాసమును గాంచుచుండు సూర్యప్రభుండు. 1274

క. ఖరకరు నామవరంబులు, పరిగణితములో మహర్షి పార్థివులారా
పరమపములు సల్వదొక్కం, డరయ సహస్రంబు నెన్న నా నామములన్. 1275

చ. అన విని మౌను లిట్టు లని రక్కని భక్తి సహస్రనామసం
క్తిని నుతియింప నేఫలము దివ్యమునై కను పట్టు దానినిన్
విన విన వేడ్క యయ్యె నన విశ్వగురుం డగు బ్రహ్మ యిట్లనెన్;
మునివరులార! పూర్వతమ మున్ బహుపుణ్యమునై చెలంగుచున్. 1276

సీ. పఠియించినంతనే పరమపుణ్యము నిచ్చు స్తవము నామసహస్ర సారభూత
మును వచించెద; నామముల గుహ్యతములఁ బావనంబుల శుభప్రదములవినఁ
బుణ్యమబ్బును వినఁ బూనుఁడవ్వాని; వికర్తనుఁడు రవి భాస్కరుఁడు మఱియుఁ
గ్రాలెడు లోకప్రకాశక మార్తండులును వివస్వంతుండు లోకచక్షు

తే. వును మహేశ్వరుఁడును గర్తయును త్రిలోక,
పతియు హర్తయుఁ దపనుండు ధ్వాంతహర్త
లోకసాక్షియు శుచి సర్వలోకవిభుఁడు
సప్తహయవాహనుఁడు ననఁ జాలునవియు 1277

వ. గభస్తిహస్త, బ్రహ్మణ్య, సర్వదేవనమస్కృతతాపనులను నీయేకవింశతినామం బులు సూర్యప్రీతికరంబులు. ఈనామస్తవము భాస్కరప్రీతికరము. శరీరారోగ్య ప్రదంబు. ధనవృద్ధికరంబు. యశస్కరంబునగు. ఇదియె స్తవరాజంబనఁ ద్రిలోక విఖ్యాతిం గాంచె. ఎవ్వఁ డీనామంబుల నుదయాస్తమయంబుల భాస్కరు నుతి యించు నతండు సర్వపాపవిరహితుఁడై పరిశుద్ధుండగు. మానసిక వాచిక దేహ జంబు లగుపాపంబులు, కర్మజంబు లగునఘంబులు నీనామజపం బొక్కమాఱు రవిసన్నిధి నొనరించిన నశియించు. ఏకజప్యస్తవంబు, హోమంబు, సంధ్యోపాస నంబు, ధూపమంత్రార్ఘ్యమంత్రంబులు, బలిమంత్రంబు ననునివి యన్నప్రదానం బున, దానంబునఁ బ్రణిపాతంబునఁ, బ్రదక్షిణంబున, స్మరియించిన సర్వపాపంబులు నశియించు. కాన మీరు ప్రయత్నపూర్వకంబుగా నీస్తవంబున సర్వకామఫల ప్రదుండై వరదుండై యున్న దేవుని వినుతింపుఁ డని బ్రహ్మ పలికిన విని మును లిట్లనిరి. 1278

---

## ముప్పదియవ యధ్యాయము.

సూర్యుఁ డదితికిం బుత్త్రుఁడై జనించుట.

చ. సరసిజసంభవా! ద్యుమణి శాశ్వతుఁడై తగు నిర్గుణుండె యా
నరయ మహాత్ముఁ డంచు భవదాననిర్గతవార్త వింటి మీ

హరియె జనించె ద్వాదశమహత్తరరూపములొంది యంచు ని
త్తరణమునందె పల్కితివి తత్త్వవిదుత్తమ దేవనాయకా. 1279
క. అతులితతేజోనిధియగు, శతపత్త్రసఖుండు దేవసన్నుతుఁ డెట్లో
యతివదగుకుక్షినుండియె, జతనంబుగ జన్మమందె సద్వినుతముగన్. 1280
క. అనుమాట వినినతోడనె, మనముల సంశయముదోఁచె మా కెల్ల ననన్;
విని పద్మజుఁ డిట్లను దక్షునిదుహితలు షష్టిసంఖ్య సురుచిరరీతిన్. 1281
క. వెలసిరి; దక్షుం డంతటఁ, గులగుణములరూపమునను గొమరారు తనూ
జలఁ బదుమువ్వురఁ బ్రీతిన్, జెలఁగుచుఁ గశ్యపున కిచ్చె సిద్ధార్థుండై. 1282
క. దితియు నదితియును దనువను, నతివయు వినతయును వార లందు మిగుల ను
న్నతిఁ గాంచు వారలందు న,దితి లోకత్రయము నేలు దేవప్రభులన్. 1283
క. కనియెను; దితియును దైత్యులఁ, గనియెను దను వనెడునింతి కడుఁగ్రూరులుగాఁ
దనరెడు దానవులన్ బల,మున మించెడువారిఁ గనియెఁ బొంగెడు వేడ్కన్.
క. వినతాదులైన కాంతలు, కని రొక్కట స్థాణురూప కలితుల మఱియుం
గన జంగమరూపులనుం, దనయులఁ బెక్కండ్ర భూరి దర్పుల నిలయున్. 1285
సీ. వారిపుత్త్రులు సుతల్ వారిసంతానంబు నిండ నెంతయు నొప్పె నిర్మలాత్ము
లార! వినుండు దైత్యారులో దేవత లాకశ్యపాత్మజులందుఁ జూడఁ
గాఁ బ్రధానులు మఱి గణుతింప సాత్వికుల్ రాజసుల్ తామసుల్ గా జగంబు
నందు వారొప్పి; రా యనఘుండు కశ్యపుఁడవ్వారలందు య జ్ఞాంశహారుల
తే. ముజ్జగంబుల నేలెడు భూరిశౌర్య, రాజితులఁ గా నొనర్చెను బ్రహ్మవేత్త
యై ప్రజాపతియై తగు నమ్మునీంద్రుఁ; డంత వారల యైశ్వర్య మరసి యరసి.
క. దానవులును దైత్యులు వి,జ్ఞానంబునఁ దమ్ము మించి జగతి వెలయు న
మ్మానితుల దేవతల నెపు,డూనిన క్రుధ నేఁచు చుండి రురుభుజశక్తిన్. 1287
ఆ. [అంత నొకట వారి కన్యోన్యవైరంబు, పెరుగ యుద్ధ మెంతొ భీకరముగ
జరిగెఁ జాలకాల మురుతరయుద్ధమం,దమరు లెల్ల నోడి రసురులు కడు. 1288
క. బలవంతు లౌట నొందిరి, గెలు ప,వ్వారలను శక్తి గెల్వఁగ లేకే
కలవిలపా టొందుచు వే,తొలఁగిరి దైన్యంబు చక్కఁ దోఁచుట భీతిన్.] 1289
క. అంతట మునిపతి కశ్యపుఁ, డెంతయు ధృతిదూలి దైత్యు లెల్ల దనుజు ల
త్యంతము బాధింపంగాఁ, జింతిలు నిర్జరులఁ గాంచి చిత్తము దూలన్. 1290
ఆ. ఊరకుండె,నదితియుఁను దైత్యదానవ, హతముఁ ద్రిభువనంబు నంతఁ గాంచి
క్షుత్తృసుతుల నేఁచఁ గుందుచు యజ్ఞాంశ,ములనుదాహరించెఁ జెలఁగుశక్తి.
క. తనయులకు శక్తి గలుగం,గను జేయఁగ సూర్యు భువనకాంతుని నారా
ధనములఁ బ్రీతుం జేయం,గను యత్నము చేసె నియతి గ్రాలుచు నుండన్.
చ. మనము విచంచలంబుగ సమానుషశక్తి నొనర్చి యన్నముం

గొనక వ్రతంబుఁ బూని యొక కొంచెముగా నెదియో గ్రహించి తాఁ
దినుచు మహాద్యుతిప్రకర దీపితుఁడై గగనంబునందె యుం
డినగురుమూర్తి భాస్కరు మునిస్తుతుఁ గొల్చుచు భక్తిమీఱఁగన్. 1293
వ. ఇట్లని వినుతించె. 1294

## అదితిసూర్యు స్తుతించుట.

క. పరముని సూక్ష్ముని మౌనీ, శ్వరకృతనుతివితతి దీన శర్మదు లోకో
త్కరధరుని దలఁతుఁ; దేజ, స్స్ఫురితులకు నధీశుఁ డగుచు శోభిలురవికిన్.
తే. తేజములరాశికిన్ సదా స్థిరతఁ గాంచు,నర్కునకు వందనం బిదె యాచరింతు;
జగములకునెల్ల నుపకృతి సలుపఁ బూను,భానునకు గోపతికిఁ జేయు దాన నతులు.
తే. తీవ్రరూపము గ్రహియించి తేజరిల్లు,సాధుమూర్తికి నేనమస్కారములను
జేయుదానను;మఱియును శీతిగతాంబు,మయరసంబును నెనిమిదిమాసములను.
తే. తానుగ్రహియించి దానిని దాల్చి తీవ్ర
రూపమున వెల్గు శ్రీభాస్కరునకు వంద,
నము లొనర్తును ; రెండుసంధ్యలను రజసు
తనరఁ బొల్చుచు శాంతాత్ముఁ డనఘుఁడు నయి. 1298
క. మనమున నేఁగోరినవాం, ఛను దీర్చెడు సద్గుణైక శరనిధికిన్ వం
దనములు చేయుదు; వేద, ప్రణుతంబయి దేవవార పరికీర్తితమై. 1299
తే. ఋగ్యజుస్సామముల నైక్యరీతి వెలసి,వెలుఁగుచుండు నేరూపంబు విశ్వమెల్ల
నిండు తేజంబులం గల్గి నిర్మల మగు, నట్టి భానుని సేవింతు నన్వహంబు. 1300
వ. ఏరూపం బోంకారమయంబై యస్థూలంబు స్థూలంబు నమలంబునై యలరునో
యట్టి సనాతనమూర్తికి నమస్కారంబు లొనరింతు నని యదితి వినుతించె నని
పల్కి బ్రహ్మ మఱియు నిట్లనియె. 1301
చ. మునిపతిపత్ని యిట్టివిధముం గొని భాస్కరు, గూర్చి సన్నుతుల్
మన మలరంగఁ జేయుచు సమస్తవిధంబులఁ బూతచిత్తయై,
వినియతభోజనంబు దగవిచ్యుతభక్తి చెలంగఁ గొల్చె శ్రీ
దినకరుఁ జాలకాల మిటు తీక్ష్ణతరవ్రత మొప్ప వేఁడినన్. 1302
క. అదితికి సంహృష్టుండై, పొదలెడు ననుకంపఁ దోఁచె ముందుగ నపుడా
సుదతియుఁ దేజఃకూటం. బెదఁ గలవాంఛలను దీర్చు నిద్ధాకారున్. 1303
చ. ధరణికి వచ్చి తేజము నితాంతము వెల్గఁగఁ జూడ రాక భీ
కరముగ నొప్పి వేదమయ గాత్రముతో నలరారుచున్న భా,
స్కరుఁ గని సాధ్వసంబు దగఁ గశ్యపుదేవి వచించె నిట్లు శ్రీ
కర జగదాద్యనన్గరుణఁ గావుము నిన్ననఁజాలఁ జక్కఁగన్. 1304
క. కరుణింపుము నాయెడ భ, క్తరతా! యేరూప మీవు తాల్చిన నేనున్

సురుచిరముగఁ గాంతునో య, క్కరణిని దాల్పంగవలయుఁ గరుణాంబునిధీ.
క. దీనులపాలిటి కల్పక, మా నీవే నాదుసుతుల నార్తులఁ గావం
గా నేర్తువు నాఁ గశ్యపు, మానిని ప్రార్థనము రవియు మన్నించి త్వరన్. 1306
సీ. అతిదుస్సహాంబుగ నగపడుచున్న తేజోమండలమునుండి యామిహిరుఁడు
భక్తనిరీక్షణ పరమగమ్యం బగుదివ్యరూపము దాల్చి భవ్యరీతిఁ
గనఁబడె; నప్పు డాకమలమిత్త్రుని రూప మభితప్తతామ్రసత్త్రాభమగుచు
నలరారె నదితియు నతిభక్తిఁ బ్రణమిల్లఁగా దివాకరు డెంతో కరుణ మెఱయఁ
తే. బలికె నిట్లని యోదేవి వర మొకండు, కోరు మిచ్చెద నన్నీవు కొల్చి నందు
లకు ఫలంబుగ నా విని యకలుషితమ, నంబునం దగునట్టి యానారి భక్తి. 1307
క. తలసోఁక మ్రొక్కి జానువు, లిల నుంచి వచించె ఖేచరేంద్రుని వరదున్
ఖలహరణుభాస్కరుని ను, జ్జ్వలతేజుని దృశ్యరూపు వారక కనుచున్. 1308
క. పరమాత్మ ! దేవనాపైఁ, గరుణింపుము దైత్యదనుజగణ మేఁచంగాఁ
బరమార్తి నొందె జగములు, సురల మఖాంశములు చెడియె సురరిపు లలుగన్.
చ. దనుజులు దైత్యు లుగ్రతర దర్పమునం జెలరేఁగి సేనలం
గొని యరుదెంచి నాసుతుల గొబ్బున మార్కొనిపాఱఁజేసి రే
మని మొఱవెట్టుదానఁ గరుణాన్వితచిత్తముతోడ నాదుపు
త్త్రనికరపీడ పోయెడువిధంబు నొనర్పుము దేవపాలకా. 1310
క. కమలసఖా ! సురలకు నం, శమునన్ సోదరత నొంది శత్త్రువితతిఁ గూ
ల్పుము నాదుపుత్త్రులెట్టి వి, ధమునన్ యజ్ఞాంశముల యథావిధిఁ గొనఁగన్.
క. మరలం దగుదురొ నిర్జర, పురికిం బ్రభువులుగ నెప్డు పొల్తురొ లోకో
త్కర మస్మత్తనయులకుం, గరగతమై యేవిధమునఁ గ్రాలంగలదో. 1312
తే. అట్టియనుకంప నునుపుమా యార్తిహరణ, కార్యకర్తవు నీవె జగంబులందు
ననిన నా వారితస్కరుం డచట మ్రొక్కి, యున్న యదితిని గని తమి యుప్పతిల్ల.
తే. పలికె నిట్లని; యోయంబ భవదభీప్సి, తము ఫలింపఁగ నాదు నంశమున నొకట
నవతరించెద నీతనయారివర్గ, ములను ద్రుంచెద వేగంబ వెలయుశక్తి. 1314
చ. అని వచియించి యాయదితి యద్భుత మంద నదృశ్యుఁ డయ్యె నా
వనరుహబాంధవుం; డదితి వాంఛలు చక్కఫలింపఁగాఁ దప
స్సునకు ఫలంబు గాంచి తనసూనులకష్టము లెల్లఁబాసె నం
చును దనయింటి కేగె; నటసూర్యుని వేయికరంబులం దొగిన్. 1315
క. ఒకకరము సుషుమ్నాఖ్యము, సకలారిధ్వంసనంబు సరగునఁ జేయన్
బ్రకటస్థితి సురలకుఁ గూర్చుకౌతుకము మీఱ భాస్కరుని యానతిచేన్. 1316
తే. అదితి యుదరంబునందు నొయ్యన వసించె
వత్సరంబున కవ్వల; వామనేత్ర

యట విధిం గృచ్ఛ్రచాంద్రాయణాదికముల,
నొనరిచెను;గర్భ మంతటఁ గనఁబడియెను. 1317
క. సురజననియుఁ బరిశుద్ధ, స్ఫురదురునియమంబు మీఱఁ బూని ధరించెన్
వరగర్భంబును శ్రీభాస్కరుఁ డే యుదయించు ననెడుకాంతిఁ గలుగుటన్.1318
చ. మునిపతి కశ్యపుండు తనముగ్ధను గాంచి రవంత కోపముం
గనఁబఱుపంగఁజాలినప్రకారము మాటల చందమొప్పఁ గా
మిని సతతోపవాసముల మించెడుగర్భము నాశమొందఁ జే
యను దలపోయుదే యనిన నాసతియుం బతి భక్తి నిట్లనున్. 1319
క. మునివర! యీగర్భాండం,బును గాంచుము చెఱుప దీనిఁ బూనను రిపులన్
దనుజులఁ గూల్పం జాలెడు,నని యించుక కోప మొదవ నాగర్భంబున్. 1320
క. అతిభయదంబును విడిచెను, క్షితిపైఁ బడునట్లు భర్త చెప్పినవాక్య
ప్రతతిం గల్గినక్రుధచే, నతిశయతేజస్సులను మహాద్భుతరీతిన్. 1321
ఆ. వెలుఁగుచున్నదాని విడిచెఁ; గశ్యపుఁడును, నుదయమందు నప్పు డొప్పు భాను
నట్లు ప్రజ్వరిల్లు నాగర్భమును గాంచి,ప్రణతుఁ డగుచు వేదరాశినుతుల. 1322
క. వినుతించె; దాన భాస్కరుఁ, డనుకంపాసహితుఁ డగుచు నాగర్భాండం
బుననుండి వెడలె సరసిజ, ఘనపత్రసువర్ణ కాంతి కనఁబడుచుండన్. 1323
క. వితతజ్వాలలనాశా, ప్రతతిన్ వెలిఁగించుచున్ నభస్థ్సలముననుం
డి తగన్ వినఁబడ నిట్లనె, హితవాక్కులఁగశ్యపముని హృదయం బలరన్.
తే. అదితియును మోద మందంగ నబ్దనిమ్న, వాక్కు వినఁబడ; నోమునివర్య నీవు
"మారితంబయ్యె నీచేత మానిని" యని, పల్కితివి గాదె యత్తఱి భార్యతోడ.
ఆ. అదియె కారణముగ నాత్మజుఁ డీతఁడు, నీకుఁ గలిగినట్టినిర్మలాత్ముఁ
డగును బేరుచేత నార్య! మార్తండుఁడే,యనుచుఁ జెప్పి మరల ననియె నిట్లు.
చ. దనుజుల యజ్ఞభాగములఁ దస్కరు లట్లు హరించువారి నీ
తనయుఁడు చంపఁజాలు ననఁ దద్వచసుల్ విన రాఁగ దేవతల్
గని రతులప్రమోదమును గర్వరు లప్పుడె హీనతేజులై
చనిరి తొలంగి కశ్యపుఁడు సంతస మందెను దేవమాతయున్. 1327
క. సుతవర్చుఁ జూచి యెంతయు,మతిఁ బొంగెనువరుస సుతుఁడు మార్తండాఖ్యన్
క్షితిఁ గాంచి వృద్ధి నొందెను; శతక్రతుం డంత దైత్యసముదాయంబున్.1328
క. సమరము చేయఁగ రమ్మని, యమితోత్సాహంబు మీఱ నాహ్వానించెన్;
సమరము చేయఁగఁ బూనిరి, యమరులు దేవేంద్రుఁగూడి యసురప్రతతుల్.

దేవదానవయుద్ధము.

చ. సురపతిచేతఁ బిల్వఁబడి శూరతమీఱఁగఁ బోరఁ జొచ్చె; నా
దురమున నస్త్రశస్త్రము లతోఁ దగువృష్టి చెలంగ భూనభో

తరము గనంగరాక తగె; నాకులు ఘోరసురారికార్ముకాం
తరవిగళన్మహాస్త్రముల తాఁకున కోర్వఁగఁజాల కుండియున్. 1330

క. బీరంబు మానఁజాలక, పోరుచు నుండంగ మౌనిపుత్త్రుఁడు కోపం
బారయ రూపం బొందిన, సౌరున మార్తండనామశక్తియు వెలయన్. 1331

క. కనియెన్ దైత్యులు; నాతని, కనుయుగ్మమునుండి వెడలి కడుఁ దీక్ష్ణముగాఁ
గనఁబడు తేజంబున నా,దనుజులఁ గాల్పంగ వారితనువులు పెలుచన్. 1332

తే. భస్మరూపంబు నొందెఁ: నాపనికి మోద;మంది రెల్లసురల్ మఱి యతులనుతుల
నతనిఁ బొగడిరి మార్తండ! యార్తిహరణ, యంచు నాతని తల్లినినాదరమున.

క. వినుతించి స్వాధికారం,బును బూనిరి యజ్ఞభాగములఁ బూర్వపురీ
తిని సంగ్రహింపఁ జొచ్చిరి; వనజసఖుం డంతఁ బ్రీతి వర్ధిలుచుండన్. 1334

తే. సురుచిరకదంబపుల్లప్రసూన మట్లు, సర్వతోవ్యాప్తకాంతిపుంజంబు తనర
నగ్నిపిండసమాకృతి యమర నైజ,మండలము పొచ్చె ననుటయు మౌనివరులు.

చ. సరసిజసంభవా! ద్యుమణి చక్కని నీపసుమంబుభాతి సుం
దరవరగోళరూపమును దాల్చె నదట్లొ యెఱుంగఁజెప్పుమా
పరమముదంబు మాకు నిటఁ బర్వెడు నాగఁ బితామహుండుమా
నిరమణులం గనుంగొనుచు నిర్మలవాక్యల నిట్లుపల్కెఁదాన్. 1336

సీ. వినుఁడు సన్మునులార వృత్తాంత మొక్కండు వినిపింతుఁ ద్వష్టయు మునునిజాత్మ
జాతను ద్యుమణికి జాయగాఁగ నొసంగె నల్లునిఁ గరుణాత్ము నట్లొనర్చి;
సంజ్ఞ నాఁ బరఁగెనా సరసిజాక్షియు నంత భానుఁ డాసతియందుఁ బడసెఁబుత్త్రు
లను నిర్వురన్ గాంతు ననుపమానగుణాఢ్య; నం దాత్మజద్వయ మతులసుగుణ

తే. పుంజ మాకన్య యమున నాఁబొల్చె; రవియుఁ
దాను మార్తండుఁ డనఁబడి తపనుఁ డన్న
పేరు సార్థకముగ నొప్పు భూరితాప
మంది లోకంబు లడలంగ నలరఁ జొచ్చె; 1337

తే. భర్తదగు గోళకాకార మూర్తిఁ గాంచి,సంజ్ఞ యెంతయు నోర్వఁగాఁజాలకతుల
తేజమును దగ్గునట్లుగాఁ దీవ్రశక్తిఁ, జేయఁగా నెంచియిట్లనుస్వీయరుచికి. 1338

చ. జనకునియింటి కేగెదను జయ్యన నేనె యతండు పిల్వకు
న్నను బతి యించుకేని నిజనారియె కాదని సంశయింప కొ
య్యన ననుఁగాఁ దలంచునటు లాదృతి నుండుము నీకు మేలగున్
బనుపును దీనిఁ గైకొని ధ్రువం బగుపూన్కి వసింపు మీయెడన్. 1339

క. తనయుల నీయిర్వుర నీ,తనయను నాకొఱకు సాధుధర్మంబునఁ బ్రే
మను బూని కావఁగాఁ దగు, వనరుహమిత్త్రునకుఁ జెప్పవల దీవార్తన్. 1340

చ. అనవిని ఛాయ యిట్టులను నంబరో! నాథుఁడు కేశపాశముం

గొనఁ దమకించుదాఁకఁ గ్రుధఁ గూరిమిఁ బాసి శపింపఁ బూనుదాఁ
కను వచియింప నీమతమె గైకొని యుండెడ స్వేచ్ఛమీఱఁగాఁ
జను మన సిగ్గుతోఁ జనియె సంజ్ఞయుఁ దండ్రిగృహంబు పొంతకున్. 1341

చ. జనకునియింట వేయి యను సంఖ్యకు నీడగువత్సరంబులుం
డెను; జనకుండు పోవఁదగు నీపతియింటికి నింక నంచుఁ జె
ప్పెను బలుసారు లట్లగుట విహ్వలయై బడబాకృతిం దగం
గొని కురుదేశసీమలకు గొబ్బునఁబోయి వసించె నత్తఱిన్. 1342

చ. క్షితిసురులార! యచ్చట వసించుచు భుక్తిని మాని యుగ్రమై
నతపముఁ జేయుచుండె; గ్రహనాథుగృహంబున ఛాయసంజ్ఞయి
వ్వితమునఁ దండ్రియింటికిని వేడుక పోవఁగ మాటచొప్పునన్
బతికడ సంజ్ఞయాకృతిని బాగుగఁ దాలిచి సేవచేయుచున్. 1343

క. కాలంబుగడపుచుండఁగఁ, జాలశరత్తులు గతించె సారసమిత్రుం
డేలీలనైన సంశయ, మోలిం గనకుండు నట్టు లొక్కతెఱఁగునన్. 1344

క. జరపుచు నుండెను సంసృతి; నిరువురఁ దనయులను గాంచె నేకతనయ; న
త్తరుణమున సంజ్ఞ తనయుల, నరయక స్నేహంబు మానియామెతనరుటల్.

క. మనువనఁగ సంజ్ఞకుం దొలి,తనయుం డొర్చుకొని యుండె ద్వైతీయుం డా
తనయుండు యముఁడు శాంతిం,గొన కుండెను మానసమునఁ గ్రోధ మడరుటన్.

వ. బహువిధంబులఁ బీడ్యమానుండై సపత్నియం దోర్పఁ బూనఁ జాలక కోపంబు
నను బాల్యంబునను భావికార్యంబువలనను యముండు పాదం బెత్తి దండిం
చెద నని పినతల్లి భయపెట్టె. అంతియగాని తాడనంబు చేయఁడయ్యె నప్పుడు
కోపంబున ఛాయ యమున కిట్లనియె. 1347

క. చరణం బెత్తుచు జనకుని, తరుణిన్ బహుమానయోగ్య దండింపంగాఁ
బరికించితి పటులౌటను, జరణము పడిపోవుగాకఁ శమనా యనినన్. 1348

తే. శాపపీడితచిత్తుఁడై శమనుఁ డగ్ర, జన్ముఁడైతగు మనువుతోఁ జని యదెల్లఁ
దండ్రికిం జెప్పె నిట్లని; తండ్రి! మమ్ము, నిరువురం బుత్త్రవాత్సల్య మేర్పడంగ.

క. కనఁబఱుపక యుండెడుఁజూ, జనయిత్రియు; జ్యేష్ఠులైన సాధుమతుల మ
మ్మును నాదరింప కవరజు,లను స్నేహముమీఱఁ జూచులాగు కనఁబడన్. 1350

క. కినుకం గా లెత్తితి నా,జననిం దన్నంగ లేదు సత్యము మోహం
బునఁగాని బాలభావం,బునఁగాని యొనర్చినట్టి పోలసిపనినిన్. 1351

క. క్షమియింపవలయుః నేశా,పమునొందితిఁ దల్లివలనఁ బరికింపఁగ శా
పమునం బుత్త్రుని నేఁచుట, ద్యుమణీ; నాతల్లి యనుచుఁ దోఁపదు నాకున్.

క. పరమాత్మా నీకరుణను, జరణం బిది చెడకయుండఁ జాలెడునటు లీ
వరము దయసేయు మంబయుఁ ద్వరపడి శపియించెఁ గానఁ దప్పింపఁ దగున్.

వ. అన విని భాస్కరుం డిట్లనియె. 1354
మ. తనయా ధర్మవిదుత్తముండ వగుచుఁ ధర్మప్రవృత్తిన్ సతం
బును వర్తిల్లెదునీదుచిత్తమున నిప్పోల్కిన్ మహాక్రోధ మె
య్యన నిల్వంగను గొప్పకారణ మెదో యాలోచనాప్రాభవం
బున నూహించినఁ దోఁచు; శాపములు తప్పంగొన్నిచందంబులన్. 1355
క. ప్రతిఘాతము జననీకల్పితశాపమ్మునకు నెందు లే దిది నిజమౌ;
సుత మాతృవచనమును నేవితమున నిష్ఫలము గాదు విను మేరీతిన్. 1356
క. ఐనను నీశాపమునకు, నే నించుక సాయ మొసఁగ నేర్తు ఫలింపం
గా నది చాలకయుండన్; మానిని వాక్యమ్ము నిలుచుమదిఁ గుం దడఁగున్.
తే. నీదుమాంసంబు గైకొని మేదినీత
లముఁ గ్రిములు సొచ్చు జననివాక్యము ఫలించు
నీవు రక్షింపఁబడుదువు పావనాత్మ
యనుచు సుతు నూఱడిల్లంగ నొనరిచితగ. 1358
చ. వనితను ఛాయఁగాంచి సుతవర్గమునందు సమానమైత్రి యుం
చను జనుఁ గాని యొక్కరుని జక్కనిమక్కువ గారవించి యుం
క నొకని దూఱఁగాఁ దగునె కారణ మెన్నఁగఁ దల్లి నీవు కా
దని తెలియంగ నయ్యె నిజ మారసి చెప్పుము దీని హేతువున్ 1359
తే. సంజ్ఞ యెచ్చటికో పోయె సత్య మిద్ది, నిర్గుణులు నయి తనయులునిలిచియున్నఁ
దల్లిశాపం బొసంగుట ధరణి లేదు,నిజము వచియింపు మని భర్తనేర్పు మెఱయ.
క. అడుగుటయున్ ఛాయయు నప్పుడు కోపము మాని శాపము నిడును బతి త
ప్పఁ డటంచు భీతి నొందుచు, నుడుగక వృత్తాంత మెల్ల నొగి వచియించెన్.
చ. విని తనభార్యవార్త గతవృత్తము నెంచుచు మామయింటికిం
జనియెను భానుఁ; డంతటను సారసమిత్రుని నల్లుఁ జూచిమా
మ నియతి శాస్త్రరీతి బహుమానితుఁ గా నొనరించు చున్ దహిం
పను జను దెంచినట్టి రవిఁ బల్కు ఱు శాంతిలునట్లు చేయుచున్. 1362
సీ. పలికెను బహుమానపద్ధతి నావిశ్వకర్మ యుఁ దపన! నీకాయ మిద్ది
యతిశయదీప్తిచే నతిదుస్సహం బగు దీనిచే వ్యాప్త మీభూనభమ్ము
నట్లౌట సహియింప కలసంజ్ఞ వనములఁ దపముసల్పుచునున్న దిపుడు, నీవు
చూడంగఁగలవు తచ్ఛుభతమవ్రతచారిణిని భార్య వనముల ననుపమాన
తే. మైనతావకరూపార్థ మటవిఁ దపము, సల్పు చున్నది నాయావ చనము నీదు
మదికి రుచియించు నేని యీమహితరూప,మును నడంపుము కాంతమై తనరునట్లు
చ. అనవిని యట్లె చేయఁగల నంచును త్వష్టను సమ్మతిం గనం
గను రవి చేసి కాంతమయి కన్పడఁ జేయు మటంచుఁ బల్క నా
వనరుహమిత్రుబింబమును వర్తులమై తగుదాని శాకనా

మనియతి నొప్పు ద్వీపమున మానితమా భ్రమినామయంత్రముఁ. 1364
తే. భాను తేజంబుఁ దగ్గింపఁ బటుతరప్ర,యత్నమును జేసె; భ్రమియందు నమరి తిరుగు
ననభిభూత తేజుం డగు నర్కుచేత, సాగరాద్రివనోపేతక్షమ నభంబు. 1365
ఆ. వ్యాప్తమయ్యె నంతనబ్జముఖ్యగ్రహ,సంయుత మగు ఖేటచక్ర మెల్ల
ధిక్కరింపఁబడియె దీనత నొందెను, జగము లెల్ల నొక్కక్షణములోన. 1366
చ. జలనిధులందు నీర మటు చాలఁగ బొంగి తటంబు గ్రమ్మె శీ
ర్ణలలితసానుబంధనవిరాజితశైలము లెల్ల బ్రద్దలై
యిలఁ బడియెన్ దృఢంబు లన నెంతయు నేర్పునఁ గట్టియున్న ది
వ్యలలితగేహముల్ చెదరి యట్టిపడెన్ గతరత్నరాజులై. 1367
వ. వేగభ్రమణ సంపాతవాయు విక్షిప్తమహామేఘంబులు వేనవేలుగ ఘోరారా
వంబులు గావించె. ఇట్లు భాస్వద్భ్రమణ విభ్రాంత భూమ్యాకాశరసాతలంబగు
జగంబు మిగుల నాకులంబయ్యె. ఇవ్విధంబునఁ ద్రిలోకంబులు తిరుగుడు పా
టొందిన సురర్షులు దేవతలు చతుర్ముఖుం గూడి శ్రీసూర్యభగవంతుని గాంచి
కరకమలంబులు మోడ్చి యిట్లు వినుతించిరి. 1368
క. సురలందుఁ బ్రథమగణ్యుఁడ, వరయఁగ ధర మేలుకొఱకె యావిర్భూతిం
బరఁగితి; సర్గస్థితిలయ, పరికరముల మూఁడుగతుల భాసిల్లుదు సూ. 1369
తే. సర్వజగదధినాయకా! స్వస్తి నీకు, గలుగుఁగాక దివాకరా! కమ్రధర్మ
వర్ష, యని యిట్లు వినుతింప వాసవాద్యు,లైన సురవర్యులెంతయు నాదరమున.
క. జయజయ దేవా! సూర్యా, జయజయ లోకేశ! నిన్ను సంస్తుత రూపున్,
వియదనిలాద్యాత్మకు శ్రుతి, నియతుం గొల్తుము సతంబు నీరజమిత్రా. 1371
క. మును లంత వసిష్ఠాదులు, ఘనతమ వేదోక్తరీతిగా స్తోత్రములన్
వినుతించిరి గంభీరా, ర్థనియతిఁ బొలుపారునట్లు తత్త్వ మెఱుఁగుటన్. 1372
తే. వాలఖిల్యాదు లంతఁ బావనతరశ్రు,తీరరితస్తోత్రముల భక్తి నెలమిఁ బొంద
వినుతి చేసిరి; యంగిరస్సను మహాత్ముఁ, డాదియైన మునీంద్రు లాయర్కమూర్తి.
క. భ్రమియం దారోపితయై, యమితప్రభలన్ వెలుంగు టపుడెంచి మహా
ప్రమదంబున నీరీతిగ, నమలస్తుతులన్ నుతించి రాదర మొప్పన్. 1374
సీ. సర్వజగన్నాథ! సాధుముముక్షువులకు మోక్ష మీవెగా వికచకమల
సఖ, ధ్యానయోగనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయుఁడ వీవె భూతాళి కొక్కరీతి
గతివీవె సత్కర్మ కాండప్రవర్తకులకు నీవెసుగతివి సకలదేవ
వర పూజ్యతముఁడవు భాస్కర; సుఖము నీవలన లోకంబుల కలరఁ దగును
ఆ. ద్విపదయుతము లగుచుఁ దేజరిల్లెడు ప్రాణు, లనుఁ జతుష్పదముల కకలుషసుఖ
మలర వలయు ననుచు నభినుతింపఁగ నంత, యక్షపన్నగులును రాక్షసులును.
క. వినుతించిరి విద్యాధరు, లనుమతిఁ జేతులు మొగిడ్చి యర్కునకున్ వం

దనము లొనరించి శ్రుతులకు, మనసునకుఁ సుఖము నిచ్చుమాడ్కి నుతింపఁ.
క. మొదలిడిరి; భూతభావన, సదమలతేజంబు మాకు సహ్యం బగుగా
తిఁ దగం జేయుము శర్మ, ప్రద నీవె శరణ్య మెల్లరకు నిత్యంబుఁ. 1377
వ. హాహాహూహూ నామకులు. నారదతుంబురులు గాంధర్వవిద్యా నిపుణులు షడ్జమధ్యమ గాంధారగ్రామత్రయ విశారదులు నగుట మూర్ఛనలచేతను, దాళసంప్రయోగములచే సుఖప్రదమగు రీతిం బాడి వినుతించిరి. విశ్వాచీఘృతాచీ నామకదేవకాంతలు. నూర్వశీతిలోత్తమా మేనకా సహజన్యారంభా ప్రముఖాప్సరసలు జగదధిపతిమూర్తిం గాంచి నాట్యంబు సల్పిరి. అనాట్యంబు భావహావ విలాసాదుల ననుమోదం బొసంగం జాలియుండె. కొందఱు వీణా వేణ్వాదుల వాయించిరి. పణవపుష్కర మృదంగపటహానక దేవదుందుభి శంఖములు శతసహస్రరీతుల మ్రోసె. గీతవాద్య నృత్యంబులచేతను, దూర్యవాదిత్ర నిర్ఘోషంబులచేతను జగంబెల్లఁ గోలాహలీ కృతంబయ్యె నప్పుడు. 1378
క. పరిలిఖ్యమానుఁడౌ భా, స్కరుఁ గాంచుచుఁ జేతు లొగ్గి సమధికభక్తిఁ
శిరసులవంచి సుధాశను, లరుదుగ వందనశతంబు లర్పించి తగఁ. 1379
ఆ. వినుతి చేసి రంతవిశ్వభూతసమాగ, మమునఁ గలకలంబు లమర విశ్వ
కర్మ మెల్ల మెల్లఁగను సూర్యతేజంబు, శాంతముగ నొనర్చె శక్తిమెఱయ. 1380
ఆ. విశ్వకర్మచేత వెరవున నాజాను, లిఖితుఁడైన రవియులీలఁ దఱుగఁ
డయ్యె నింక నేలయని దింపె భ్రమినుండి, గేజమించుకేని తీరుచెడమి. 1381
చ. సరసిజమిత్రురూప మిటు శాతతరభ్రమియందు నుంచినఁ
గరము విరాజిలెఁ, మఱియుఁ గాంతతమంబుగఁ జూడనొప్పె; ని
ష్కరణి హిమాంబుఘర్మయుత కాల సుహేతువు పద్మయోని శం
కర కమలాక్ష సంస్తుతుఁ డఖండతరద్యుతి వారిరాశియుఁ. 1382
క. కరుణాకరుఁడును నగు శ్రీ, హరిదశ్వుని భ్రమిని జేర్చి నట్టికథ నదే
నరుఁడు విను నతఁడు పుణ్యా, స్థిరమతియై సర్వకార్యసిద్ధి గని మనుఁ. 1383
క. మునివరులారా భాస్కరు, జననం బీరీతిఁగల్గెఁ జక్కనిరూపం
బును గాంచెఁ బూర్వరీతిగ, వినిపించితి నీవిధంబు విశ్వనుతంబుఁ. 1384

---

## ముప్పదొకండవ యధ్యాయము.

బ్రహ్మాదులు సూర్యుని వినుతించుట

క. అని బ్రహ్మపలుకఁగా విని, మునులెల్ల వచించి రిట్లుపూషునిచరితం
బును జెప్పు మింకఁ దృప్తిం, గనఁ జాలక యున్నరీతి గనఁబడు మదిలోఁ. 1385
క. వినవిన సుఖము నొసంగెడు, వనజాప్తుని దీప్తహావ్య వహాసమ తేజుఁ
గన సంప్రమోద మలరెడు, వినుతింపుము తన్మహిమము విందుము వేడ్కఁ.
చ. అనవిని బ్రహ్మయిట్లనియె నార్యమునీశ్వరులార! చక్కఁగా

వినుఁడు వచింతు భాస్కరుని వృత్తము తన్మహిమంబు, నాదియం
దునఁ దమ మెల్ల నిండుటయుఁ దోఁపకయుండెఁ జరాచరాత్మకం
బనఁ దగు లోక మెల్ల నపుడాది యనంబడి స్వేచ్ఛ మీఱఁగన్. 1387

ఆ. వ్యాప్తి నొందఁజాలు నట్టిదౌ ప్రకృతికి, నమరు సుగుణహేతువైన బుద్ధి
యలరెఁ; దాన నట్టి యమరె నహంకార, మదియె భూతరాజి కెల్లనాది. 1388

వ. ఆయహంకారంబె మహాభూత ప్రవర్తకంబు. అవ్వేలవాయ్వగ్ని జలాంబరభూ
ములు వానివలన బ్రహ్మాండము ప్రభవిల్లె. ఆయండంబున నీలోకంబులు సప్త
సంఖ్యాకంబులు ప్రతిష్ఠితము లయ్యె. పృథ్వియు ద్వీపసప్తకంబుచేతను సము
ద్రంబులేడింటిచేతను భాసిల్లు. అందే నేనును విష్ణుమహేశ్వరులు నుందుము.
అట్టిమహాంధకారం బావరించియుండుతఱి విమూఢులై యెల్లరు పరమేశ్వరుం
డగు శ్రీసూర్యుం గూర్చిప్రార్థింపఁ జొచ్చిరి. వారిదీనాలాపంబు లాలకించి
తమోధ్వంసకుం డగుభాస్కరుం డావిర్భవించె. ధ్యానయోగంబున మే మెల్లఁ
ద న్నుపాసించిన ట్లతఁ డెఱుంగు. అట్లావిర్భవించిన పరమాత్మను జూచి యెల్ల
రు వేర్వేఱ వినుతింప సాగిరి. మే మెల్ల భక్తియుక్తులమై యీశ్వరుం డగు
శ్రీభాస్కరుని వినుతించితిమి. 1389

క. సురలకు నాదివి నీవే, పరమైశ్వర్యమున నీవెపరమేశుఁడవై
పరఁగుదువు భూరిభూతో,త్కరమునకున్ నీవె యాదికర్తవు దేవా. 1380

తే. ఓదివాకర! యాదితేయోత్తముఁడవు, జీవనంబవు భూతాళిదేవదనుజ
యక్షగంధర్వకిన్నరాద్యఖిలదివిజ, భేదములకును మానిపృథ్వీపతులకు. 1391

క. ఉరగములకుఁ బక్షులకును, బరికింపఁగ జీవనంబు భాస్కర నీవే;
సరసీరుహభవుఁడవు శం,కరుఁడవు విష్ణుడవు నీవె గా సత్యముగన్. 1392

సీ. వాయువుసోముఁడు వాసవవరుణులు నానొప్పు దిక్పతుల్ మానసీయ
నీవెయౌదువు; కాల మీవె సృష్టిస్థితిసంహారకర్తవు సకలలోక
విభుఁడవు నీవె, సద్వీపవతీతతి సాగరపర్వతాశనిసురేంద్ర
చాపవిద్యుత్తతి సరసిజసఖ! నీవె; ప్రళయంబు ప్రభవంబు పరఁగుచుండు

తే. సతము నీవలననె; వ్యక్తమతులితాత్మ, రూప! యవ్యక్తమును నీవె యేపగిదిని
గనిన నీవె సనాతనుఁ డనఁ బరఁగుదు,వీశ్వరునకంటె విద్యయే యెక్కుఁడరయ.

తే. విద్యకంటెఁ బరుండయి వెలయు శివుఁడు, శివునికంటెను నీవెగా శ్రేష్ఠుండవు మ
హాత్మ సర్వగతాంఘ్రిహస్తాక్షిశీర్ష,ముఖుఁడ వన నీవె భాస్కరా! మునివరనుత.

వ. సహస్రకరుండవు. సహస్రముఖుండవు. సహస్రచరణుండవు. సహస్రనేత్రుం
డవు. భూతాదివి. భూర్భువస్స్వర్మహాలోకంబులునీవ. సత్యతపోజనలోకంబులు
నీవ. ప్రదీప్తుండవు. దీపసుండవు. దివ్యుండవు. సర్వలోకప్రకాశుండవు. దేవతల
కుంగూడ దుర్నిరీక్ష్యంబగు తేజంబుగలనీకు నమస్కారము. సురసిద్ధగణాన్వితం
బై భృగ్వత్రిపులహాది మునిస్తుతంబయి యవ్యక్తంబయి వెలయునీరూపంబునకు

వందనంబు. వేదవిన్నిత్యవేద్యంబై సర్వజ్ఞానసమన్వితంబై దేవగణాదిదైవతంబై యలరునీరూపంబునకు నతితతులు. విశ్వకరణక్షమంబై విశ్వభూతంబై వైశ్వానరసమర్చితంబై విశ్వస్థితికారణంబై యవేద్యంబై యమరునీరూపంబునకుఁ జేమోడ్పులు. యజ్ఞవేదలోకములకంటెఁ బరంబై పరమాత్మాభినుతంబై తనరారు నీరూపంబునకు మ్రొక్కులు. అవిజ్ఞేయంబై యనాలక్ష్యంబై ధ్యానాగమ్యంబై యవ్యయంబై యనాదినిధనంబై వెలయు నీరూపంబునకు సాష్టాంగప్రణామంబులు. కారణకారణున కివె నమస్సులు. పాపవిమోచనుని కివె వందనంబులు. అదితివందితున కివె జేజేలు. రోగవినాశనున కివెనతిశతంబులు. 1395

తే. సర్వవరముల నొసఁగుచుసర్వసుఖదుఁడగుచు సర్వధనప్రదుం డగుచు సర్వ
మతి నొసంగుచు నలరుద్యుమణికి నివియె,వందనంబులు మఱియునువందనములు

చ. అని యిటు సన్నుతించు నమృతాంధసులం గని దుర్నిరీక్ష్యమై
తనరెడుతేజ మూపి తనతైజసరూపము నాశ్రయించి చ
క్కనిశుభ మాయఁజాలి శుచిఁ గ్రాలినవాక్కు వచించె నిట్టు; లో
ఘనమతులార! యేవరము గానఁగఁగోరితి రిప్డు చెప్పుఁడీ. 1397

క. అన దేవత లిట్లని రో,వనజప్రియ! తైజసముగ భాసిలురూపం
బును జూచి యోర్వఁ జాలము,కనుకన్ సహనీయమూర్తిఁ గ్రాలుము ప్రీతిన్.

చ. హిత మగు దాన లోకముల కెల్ల మహేశ్వరయంచు వేఁడఁగం
జతతిహితుండు వారిఁగని సాంత్వనపూర్వకభాషణంబులన్
హితమతిఁ బల్కె నట్లె ధరియించెద సహ్యశరీర మంచు నో
క్షితిసురులార! తత్ప్రభృతిసిద్ధులు యోగులు సాంఖ్య లాదృతిన్. 1399

ఆ. మోక్షకాంక్షులైన మునులు హృదంతర,సంస్థు ద్యుమణి నాదిశక్తియుతుని
ధ్యానయోగనియతిఁ దలఁచుచు నుందురు;, సకలలక్షణయుతిఁ జాలువాఁడు.

సీ. సర్వపాతకములసతముచేసెడువాఁడు భాస్కరుసేవించి పాపగణము
వోవశుద్ధుండగుఁ; బావకునర్చయువేదపాఠంబునువిమలభూరి
దక్షిణాన్వితమహాధ్వరము లొనర్చుట యనునివిభాస్కరు నాశ్రయింపఁ
గలుగుఫలంబులఁ గనఁ బదాఱవపాలు నీయఁజాలవు, సిద్ధమిది మఱియును

తే. దీర్థములయందుఁ బరమమౌ తీర్థ మితఁడె; మంగళములందు నిరుపమ మంగళంబు
భానుఁడే యౌను బరిశుద్ధవస్తువితతి,యందు జూడఁ బవిత్రుఁ డీయరుక్కుఁడెయగు.

క. సురపతిముఖ సంస్తుతు భా, స్కరు నెవ్వరు వందనముల సంతస మందన్
వరభక్తిఁ జేయుదురొ వా, రరయఁగఁ బుణ్యాత్ము లగుచు నరుక్కఁ గనంగన్.

క. చని యందుసుంద్రు; నా విని, మును లిట్లని రోమహాత్మ! పూషుని నామా
లిని నష్టోత్తరశతమును, వినఁ గోరుచు నుందు మద్ది వినిపింపఁగదే. 1403

క. అనవిని సరసిజభవుఁడి, ట్లనియెను వచియింతు వీనులలరఁగ గుహ్యాం
బనఁదగి స్వర్గము మోక్షం, బును నీయఁగఁజాలు నామములసంఘంబుల్. 1404

వ. సూర్యుం,డర్యముండు, భగ, త్వష్టృ, పూ, షార్క, సవితృ, రవి, గభస్తిమ
న్నామంబులు, నజ, కాల మృత్యు, ధాతృ, ప్రభాకర, పృథివ్యప్తేజో వా
య్వాకాశ, సోమ, బృహస్పతి, శుక్ర, బుధాంగార కేందువివ స్వద్దీప్తాంశు
శుచి,శౌరి, శనైశ్చర, బ్రహ్మవిష్ణు రుద్రస్కంద వైశ్రవణ యమవైద్యుత,జఠ,
రాగ్నైంధన తేజఃపతి, ధర్మధ్వజ, వేదకర్తృ వేదాంగ, వేదవాహన కృత
త్రేతా ద్వాపర కలి సర్వామరాశ్రయ కలాకాష్ఠాముహూర్త క్షపా యామ
క్షణ, సంవత్సరక, రాశ్వత్థ, కాలచక్ర విభావసు, పురుష శాశ్వతయోగి వ్యక్తా
వ్యక్త సనాతన కాలాధ్యక్ష ప్రజాధ్యక్ష విశ్వకర్మతమోనుద, వరుణ, సాగ
రాంశ, జీమూత, జీవనా రిఘ్న, భూతాశ్రయ, భూతపతి, సర్వలోక నమస్కృ
త, స్రష్టృవివర్తక, యజ్ఞ, సర్వాద్యలోలు, పానంత, కపిల,భాను, కామద,
సర్వతోముఖ, జయ, విశాల, వరద, సర్వభూతహితరత, మనస్సు పర్ణభూతాది
శీఘ్రగ ప్రాణధారణ ధన్వంతరి భూమకేత్వాదిదే, వాదితిసుత, ద్వాదశాత్మ
రవిదక్ష పితృమాతృ పితామహస్వర్గద్వార ప్రజాద్వార మోక్షద్వార త్రివిష్ట
ప దేహకర్తృ ప్రశాంతాత్మ విశ్వాత్మ విశ్వతోముఖ, చరాచరాత్మ, సూక్ష్మాత్మ
మైత్రేయ కరుణాన్విత, నాసంబు లమితతేజసుండగు భాస్కరు నష్టోత్తరశత నా
మంబులనం బ్రసిద్ధంబులు. ఇవి సురగణపితృ యక్షసేవితంబులు, నసురనిశాకర
సిద్ధవందితంబులునగు. కనకహుతాశన ప్రభుండగు శ్రీసూర్యదేవునకు నమస్క
రించు చున్నాఁడను. ఎవ్వఁడు సూర్యోదయకాలంబున సుసమాహితుండై
యీ నామంబులఁ బఠించునో వాఁడు పుత్త్రదారధనంబులం బొందు. జాతిస్మ
రత్వంబు వానికి లభించు. స్మృతిమేధలుగలుగు. దేవాదిదేవుం డగు. శ్రీసూ
ర్యస్తవం బగు దీనిని బరిశుద్ధమనంబున ధ్యానించిన శోకదవాగ్ని సాగరంబు
నుండి తరించి యథేప్సితఫలంబులం గాంచు నని పలికి బ్రహ్మమరల నిట్లనియె.

## ముప్పదిరెండవ యధ్యాయము.

### రుద్రమాహాత్మ్యము.

తే. సర్వగతుఁడయి త్రిపురారి సర్వశక్తి,యై త్రిలోచనుఁడై తుహినాంశుబింబ
మందు నర్థము శేఖరంబై వెలుంగఁ,గా నుమాప్రియుఁడై దేవగణనుతుఁడయి.

క. సురలను గంధర్వులమా, నిసమణవిద్యాధరులను నిర్మలసిద్ధిన్
బరఁగెడు సిద్ధాదిసురో, త్కరములఁ బరువెత్తఁ జేసి దక్షునిఁ గడిమిన్. 1407

క. క్రతు వొనరించుచు నుండఁగ, క్షితిఁ బడఁగాఁదన్నె యజ్ఞసిద్ధియుఁ జెడఁగా
మతిమంతులార! యజ్ఞం, బతులితరత్నాఢ్య మగుచు నమరాన్వితమై. 1408

తే. సర్వసంభారనిబిడమై సాధుమాని, జుష్టమై యుండె దాని దక్షుండు చేయ
నీశ్వరుం డేగి యాతని నిలఁ బడంగఁ, దన్నెఁ దచ్ఛౌర్యమునకు సంత్రస్తులగుచు.

చ. సురపతిముఖ్యులైన దివిజుల్ స్థితిఁ బొందఁగ లేక యీశునే
శరణము వేఁడ వారల విశాలకృపం గొని కాచె; నాతఁడే
వరదుఁడు శూలపాణి వృషభధ్వజుఁ డంతకభీకరుండు ని
ర్జరనుతుఁ డీశ్వరుండు మునిసత్తమ పూజితపాదుఁడై తగున్. 1410

తే. ఆమహాదేవుఁడే యుత్కలాఖ్యదేశ, మందు నేకామ్రకం బననలరు క్షేత్ర
మందు నలరారుఁ గోర్కుల నఖిలభక్తజనులకొసఁగుచు నన మునిసత్తములును.

ఉ. భూతహితక్రియాకరణ పూర్ణముదన్విత చిత్తపద్ముఁడౌ
భూతవిభుం డదేలొకో విభుండగు దక్షుని యజ్ఞకార్యమున్
జేతము పొంగఁగాఁ జెఱచె సిద్ధసుపర్వులు కాచుచుండఁగా
ధాతవు నీవు సర్వమును దప్పకెఱుంగుదు విట్లుగావునన్. 1412

చ. తెలుపుము మాకుఁ బూర్ణముగ దీని విధం బిదియిట్టు లౌటకుం
గలుగును గొప్పకారణము గానియెడన్ సవహింతయానె శ్రీ
గళుఁ డని మాకుఁదోఁచెడిని కామము దీని వినంగఁ గోర్కిమా
కలరెడు నన్న బ్రహ్మయు మహాధృతి నిట్లని తెల్పె వారికిన్. 1413

సీ. వినుఁడు దక్షునకును దనయలై రెనమండుగురు వారు భర్తలఁ గోర్కెఁ గొలుచు
చును బ్రీతితనరంగ శుభతమాచారలై యుండంగ దక్షుఁ డయ్యువిదల నొక
పర్యాయ మాత్మీయ భవనమునకుఁ గొని వచ్చి వస్త్రంబు లాభరణములును
వారలు గోరినభంగి నొసంగఁగా జనకు నింటనె వారు సమ్మదమున

తే. నుండి; రవ్వారియందు సర్వోన్నతగుణ
ములకు రాశి యనంగను బొలిచి జ్యేష్ఠ,
యగుచు నీశ్వరపత్నియై యలరు సతియుఁ
బిలువఁగాఁబడ దయ్యెఁ దత్పితయు మదిని. 1414

క. తనయల్లుని శంకరు దూష్యునిగం దలపోసె నీశుఁ డుద్యమమున మా
మను గౌరవింపఁ డయ్యెను, దనమది నేయాసు లేక తత్త్వవిదుండై. 1415

ఆ. సహజమైనయట్టి శాంతంబునన్ దన్నుఁ
దానె తలఁచుకొనుచు దైవ మొండు,
తనకు వందుఁ డెచటఁ దలఁచిన లేఁడని
యెఱిఁగియుంట మామ యాతఁడనుచు. 1416

క. తనమది నెఱింగియున్ వం, దనముల నొనరింపఁ డయ్యె; దక్షుం డీతం
డనను గౌరవదృష్టిం, గనఁ డంచుఁ ద్యజించె నతనిఁ గన్యను సతినిన్. 1417

చ. తనసహజాత లెల్లరును దండ్రిగృహంబును జేరియుంట దా

విని సతి తండ్రి తన్బిలువ వేడుక నొందమి నెంచకే చనెం
దనమతి? దక్షుఁ డాసతిని దక్కిన నీసపుత్త్రిక లట్లుచూడ కొ
య్యన నతిహీనగాఁ దలఁచి యష్టాదృతిఁ బిల్వకయుండె గర్వియై. 1418

చ. జనకు ననాదృతిం దలఁచి చయ్యన నాఁ గ్రోధ మమర్షయుం బెనం
గొన సతి యిట్లు పల్కెఁ; దొల్లిఁ గూఁతు ననున్ మరియాదమీఱఁగాఁ
గనుఁగొన కిట్లనాదృతిని గన్యక లందఱు చూడఁ జూచుటే
జనక యనర్హ మేనుగద సర్వకన్యకుమారికలందుఁ బెద్దఁజూ. 1419

ఆ. సత్కరింపఁదగిన చంద మెఱింగియుఁ, గొలఁదిచూపుచేతఁ గుందఁజేసి
తేను దొలికుమారి నెల్లగుణంబులఁ, బెద్దదానఁ జుమ్ము ప్రియ మొనర్ప. 1420

చ. అనవిని రక్తనేత్రుఁడయి యాగ్రహ ముట్టిపడంగ దక్షుఁ డి
ట్లనియె; మదీయపుత్త్రికలు పాయకగుణోన్నత లెల్లఁ జూడఁగా
నినుఁ గడు మించువా రనుచు నేనె వచించెద వారిభర్తలో
వినుతగుణప్రసిద్ధులయి వేడుకఁ నుందురు నాదుచెంగటన్ 1421

సీ. బ్రహ్మిష్ఠులై మహావ్రతనిష్ఠులై గురుయోగులై ధర్మవిదుత్తములయి
సద్గుణైశ్వర్యసంస్తవనీయులై నీదుపతికంటె నధికులై వఱలువార;
లందు వసిష్ఠాత్రు లట్లె పులస్త్యాంగిరసులును బులహుండుఁ గ్రతుభృగువులు
మఱియు మరీచియన్ మానినీ కనువీరు జామాతలందు శ్రేష్ఠతనుగాంతు
తే. రిట్టివారలతోఁ బగ పెట్టుకొనియె, నీదుపతి వీరు నతనితో నిత్యవాద
ములను జేయుచునుందురు కొలఁదు నీదు, భర్త గావున నిన్ను నే వదలినాఁడ.

క. హరసంబంధంబున నీ, వరయఁగ సం బ్రతికూలవై తి వని దుర్బుద్ధిం
బరిహాతుఁడై దక్షుఁడు భీ, కరశాపము నొందఁగోరి కడు మూర్ఖుండై. 1423

క. మును లెంత చెప్పినన్ దా, వినకయె క్రుద్ధుఁ బూనియున్నఁ బితరుని గని శం
భునిపత్నియైనసతి యి, ట్లనియెన్ దుర్బుద్ధి నాపునాశయ మొప్పన్. 1424

క. మనసున వాక్కునఁ గర్మం, బున దోష మెఱుంగనట్టి భూతేశ్వరు నీ
వని గర్హించితి వందునఁ, దనువుం ద్వద్భవము విడువఁ దలఁచితి దీనిన్. 1425

చ. అని వచియించి యాసుదతి యాయవమానము నెంచి దుఃఖముం
గని తనభర్తృపాదములు గాఢపుభక్తిని లోఁ దలంచి వం
దనముల భర్తఁ బ్రీతిని గనందగు నంచు గదద్వయంబు నొ
య్యనముకుళించి యిట్లనియె నాయవమానము తొలఁగింపఁగన్. 1426

సీ. ఎందు నే జనియింతు నేని భాస్వత్తను వలరంగ ధర్మంబు నాశ్రయించి
జ్ఞానసంయుక్తనై శంకరుపత్నినై యెప్పుడునట్లు చేయుము మహాత్మ
జగదీశ్వరా యని శపథరూపంబున వచియించి యచ్చట భక్తిమీఱ
నుపవిష్టయై రోష మొప్పంగఁ దనువును విడువంగఁ దలఁచి శ్రీవిశ్వనాథుఁ

తే. బతిని దలఁచుచు నగ్నిసంబంధ మైన
యాత్మ నాత్మను గూర్చి ప్రాణానిలముల,
మెల్లఁ గదలించి యంగాళి నెసఁగు వాయు
వులను నొకచోటఁ జేర్చి యుజ్జ్వలమహితవహ్ని. 1427

క. మండింపఁజేసి తను వు, ద్దండజ్వాలలను భస్మతం గాంచం గాఁ
జండతరయోగశక్తిని, జండీశునిపత్ని చేసె సరగున నంతన్. 1428

చ. తనసతి దక్షుగేహమునఁ దా నవమానము నోర్వఁజాలకే
తనువుఁ ద్యజించె యోగమునఁ దండ్రియుఁ జూచుచు నూరకుండె నం
చును విని శూలపాణి యనశోభిలు శంకరుఁ డాకుమారికా
జనకుల కైన వాదమును సర్వము తా విని తత్త్వ మంతయున్. 1429

చ. తనమది నిశ్చయించి యిదె దక్షుఁడు నాశము నొందు వేళ వ
చ్చె ననుచు వేమహాగ్రహముఁ జెంది వచించె; దురాత్మ! దక్ష నీ
తనయ త్వదీయగేహమునఁ దా నవమానిత యయ్యెఁ దక్కఁ-నీ
తనయలు వారిభర్తలును దద్దయుఁ బ్రీతిని గాంచుచుండఁగన్. 1430

క. కనుకన్ వైవస్వతమను, వానరంగా ధర్మమార్గ మూని జగములం
గనువేళ నీమహర్షులు, జనియింతు రయోనిజులుగఁ శాపవశమునన్. 1431

ఆ. నీదుయజ్ఞమందు నిల్తురు త్వద్యజ్ఞ, మద్ది చాక్షుషుఁ డననలరు మనువు
నంతరమునఁ జెడెదు నని మౌనులన్ దక్షుఁ,దా శపించె భార్యఁ దలఁచి తలఁచి.

క. మనుజుండై చాక్షుషుఁ డ, న్మను వొప్పెడు వేళ నాదుమామ ప్రచేతో
జనపతికిం బుత్రుండై, జనియింపం గలఁడు దక్షజనపతి యనఁగన్. 1434

వ ప్రాచీనబర్హికిం బౌత్రుండు కాఁగలండు. మారిషయను వనితయాతని కాజని
యందుఁ దల్లి యగు. అత్తఱి నే నీతనియజ్ఞంబు ధ్వంసంబుఁ గావింతు. ధర్మకా
మార్థ యుక్తములగు కార్యంబుల దక్షుం డొనరింప విఘ్నంబు నేన గావింతు
నని శపియించిన దక్షుం డాశాపం బెఱింగి క్రోధంబున నిట్లనియె. 1435

క. నాపైఁగల కోపంబునఁ, బాపాత్మా! మునుల కిట్లు పంతంబు మెయిన్
శాపం బిచ్చితివిగదా, కాపురుషుఁడ వౌట నదియె కారణముగనే. 1436

క. నిను శపియించెద నింక న, వనిదేవత లలర యజ్ఞభాగంబుల ని
చ్చు నపుడు నిను వర్జింతురు, ఘనులౌ భూసురులు యజ్ఞకల్పమునందున్. 1437

సీ. నీ కాహుతిని నిడి నిర్మలహస్తముల్ మలినంబులైనట్లు మదులఁ దలఁచి
జలముల స్పృశియింత్రు శాస్త్రసమ్మతమని; నీవిందె యుండఁగలావు దివమఁ
వదలి యుగక్షయపర్యంత మింకను భూతలంబున నిన్నుఁ బూజ్యుఁడ వని
సురలతో హోమంబు శుభతమమంత్రాళి వేల్వ కుందురుగాక విధిహితముగ

తే. ననుచు శపియించె; నీశ్వరుండును రుద్ర
నయనుఁడై వర్ణములు నాల్గు నాకివరుల,
కిచ్చుప్రాజల నేఁ గొన నిచ్చగింప
వారలం గూడి వేఱుగా వానిఁ గొనుదు. 1438

క. లోకంబుల కెల్లను భూ. లోకమె యాది యగు నట్లులుగ నొప్పుట నీ
లోకమ్మునె, ధరియించెదఁ, బ్రాకటదోశ్శక్తి స్వేచ్ఛ వఱలుచునుండన్. 1439

ఆ. నీదునాజ్ఞ గాదు నీచాత్మ! భూలోక, మేను దాల్ప జగములెల్ల స్థిరతఁ
గాంచు దాన నిట్లుగాన నే నిందుందు, నీకు వెఱచి కాదు నీచదక్ష. 1440

చ. అని యిటు లుద్ధతం బయినయట్టి మహత్తర తేజమొప్పు శం
భునిదగు శాపవాక్యములఁ బోలఁ దలంచి ప్రజాపతిత్వమున్
గనుతనువుం ద్యజించి మృతిఁగాంచెడుమర్త్యతనుత్వ మొందెః నం
త నతఁడు యజ్ఞకర్త యయి తా నొనరించెను బెక్కుజన్నముల్. 1441

క. సుర లందులకున్ సాయం,బరుదుగఁ జేయంగ దక్షుఁ డధ్వరశతముల్
ధర నొనరించెను; సతియున్, శరీరముం బాసి యీశు శంభుఁ దలఁచుచున్.

సీ. వైవస్వతమనువు వసుధ ధర్మంబును బాలించువేళను బర్వతేంద్రుఁ
డైన శీతాద్రి మేనాహ్వయమున నొప్పుభార్యయం దుమయనఁ బరఁగు పుత్త్రి
కను గాంచెఁ;నామెయే మును సతీదేవి నాఁ బ్రఖ్యాతి వహియించి పర్వతేంద్రు
నకుఁ దనూజాతయై ప్రకటకీర్తిం గాంచి యుమయనుపేరున నొప్పుచుండెఁ;
తే. భవునిసహధర్మచారిణి పడఁతి; భవుఁడు
నుమయె పత్నిగ నై యొప్ప నుండువాఁడు
తనదుమది నెప్పు డుమను గోరునొ తదుత్త
రక్షణమునందె యామెభార్య యగుఁ బ్రీతి. 1443

క. మునివరుఁ డగుకశ్యపునకు, వనితామణి యదితి యెట్లుభార్యయగునో యా
వనజాక్షునకును శ్రీసతి, తనరారునొ భార్యయయి నితాంతము ప్రీతిన్. 1444

తే. శచియు శతమఖుపత్నియై శాశ్వతప్రమదము నెట్లొందెనో విష్ణు నుదితతేజుఁ
గీర్తి యెట్లు వరించెనో యార్తిహరుని,భాను నుష యెట్లు కోరెనో వాంఛమీఱ.

తే. ముని వసిష్ఠు నరుంధతి మన మలరఁగఁ
గోరెనో యెట్లు వీరెల్ల నారయంగ
విడువ కుందురు పతుల నవ్విధమున నుమ
శంకరుని బాయఁజాల దేజనిఁ దలఁపఁగ. 1445

వ. ఇట్లు ప్రాచేతసుం డగు దక్షుండు చాక్షుషమన్వంతరంబునఁ బ్రాచీనబర్హిష్కిం బౌత్త్రుం
డై ప్రచేతఃపుత్త్రుం డయ్యె. ప్రచేతసులు దశసంఖ్యాకులు మారిషయను భార్య

యందుదక్షునింగనిరి. రుద్రుశాపంబున భృగ్వాదిమును లెల్లమహర్షులై జనిం
చిరి. ఆద్యత్రేతాయుగంబున వైవస్వతమనుయజ్ఞంబున వారుణీతనువుం దాల్చి
ఋత్విక్కు లైరి. జన్మాంతరమున వారి కీశాపంబు వ్యథాహేతు వయ్యె. దక్ష
త్ర్యంబకులకు శాపంబులు పరస్పరశాశ్వతవైరకారణంబు లయ్యె. కాన వైరి
యందు సంశయబుద్ధి నుసుపఁదగదు. వైరంబె వారికి స్థిరతం గాంచు. శుభా
శుభకర్మంబులు జన్మాంతరమందును బ్రాణుల వదలకుండు మఱియును. 1447

[క. తనువును మఱిమొకదానిని గనిన స్వభావంబుగా స్వకర్మంబులు పా
యను జాలకుండు; వాసన,యనునది దేహాంతరమునయందును నంటుక్. 1448

క. కనుకఁ దుఃఖము ప్రాప్తిం,చిన జ్ఞానము గల్గునతఁడు చింతింపంగా
జనదు;] మఱి జంతువులకుఁ, గనఁబడు విఖ్యాతి స్థిరముగాక నశించుఁ.1449

క. కనుకఁ వగవం జనదన,మును లిట్లుగఁ బ్రశ్న సేయఁబూని రజునితో
వనజాసన! ముసు రోషం,బున దక్షునిపుత్రి సతియుఁ బూనిక మెఱయఁ. 1450

చ. తనువుఁ ద్యజించి శీతగిరితల్లజు గేహమునందుఁ బుట్టె నే
యనువున? వేఱుదేహమునయందును శంకరుసంగతిం గనం
గను దగె నెట్లు? వారిదయి క్రమ్మతరంబుగ నొప్పువాదముఁ
వినవిన వేడు కయ్యెఁ గడు వేడ్క వచింపుము మాకు నంతయుఁ. 1451

తే. అలరె నేవిధిగాఁగ స్వయంవరంబు, జన్మమున నందు నాసతీశంకరులకు
జరగినట్టి వివాహ మాశ్చర్యకరము,గాన సర్వము నిపుడు పల్కఁదగు మాకు.

క. పరమపవిత్రం బగుశం,కరుగాథ మనోహరమ్ముగాఁ దనరారుఁ
సరసిజలోచన చెప్పుము, పరికించి యటన్న బ్రహ్మ పరమాదృతితోఁ. 1453

చ. క్షితిసురమౌనులార! వినఁజెల్లును శంకరపార్వతీపవి
త్రతమచరిత్ర మద్ది యఘరాశి నడంచుచు సర్వకామసం
తతుల నొసంగు; నొక్కతరుణంబున మౌనిమహేంద్రుఁడై మహా
వ్రతనియమాన్వితుం డగుచు భాసిలు కశ్యపమౌని స్వేచ్ఛఁగఁ. 1454

చ. సదనముఁ జేరరాఁగ గిరిసత్తముఁ డౌహిమవంతుఁ డాదృతుల్
పొదల సపర్యలం దనిపి పుణ్యదమై తగి ఖ్యాతినెంతొ యీ
యఁదగిన వార్తనుం దెలియునాశయ మౌని వచించె నిట్టు లో
సదయ! మునీంద్ర! దేన సువిశాలమనోహరకీర్తి యబ్బెడుఁ. 1455

తే. అక్షయము లగులోకంబు లమరు దేన, నర్చనీయతయుం గల్గు నరయ దేన
నట్టిదాని వచింపుమా యనినఁ గశ్య,పముని యివ్విధమునఁ దమిఁ బల్కెనపుడు.

క. వినుము మహాబాహూ! నా,కనుపుగ నివియెల్లఁ గలిగె నమలాపత్యం
బున నే బ్రహ్మత్వము ముని,జనవర్యత తద్విధంబుఁ జక్కఁగ నీవుఁ. 1457

క. వినఁదగియుండు నెఱింగియు, ననుఁ బ్రశ్నించెదవు శైలనాథా యైనన్
మును నేఁజూచినవిధమును, వినిపించెద నే నదెట్టివృత్తిం గొనుచున్. 1458

క. కాలంబు పుచ్చినాఁడనొ, శైలేంద్రా వినుము నీకుఁ జక్కఁగఁ దెలిపెదన్
జాలదినంబుల క్రిందట, నే లలి వారాణసిఁ గన నేగితిఁ బూన్కిన్. 1459

సీ. అం దుండుతఱి వ్యోమమందునూత్న విమాన మనుపమంబుగఁ గాననయ్యె నద్ది
మూల్యమిం తనుచుఁ జెప్పుట కసాధ్యంబయి యలరారె దానికి నరయఁ గ్రింద
గర్తభాగంబునఁ గలిగె మహార్తనాదం బది వినఁబడి యెం బటువుగఁ
దద్విధం బెల్ల నాతపసునఁ గల్గుశక్తి నెఱింగి దాఁగియుంటిని సమీప
తే. మందె;యంతట శైలేంద్ర! యవనిసురుఁడు
నియమవంతుఁడు పరిశుద్ధనిశ్చలమతి
తీర్థమజ్జనపరిపూతదేహుఁ డమల
తప మొనర్చిన పుణ్యుండు దాంతుఁడునయి. 1460

క. అరుదెంచె నచటికాభూ,సురుఁ డిటు వేగంబ మున్ను క్షోణి నొకట భీ
కరశార్దూలము తఱిమినఁ, బరికంపితదేహుఁ డగుచు భయసాంద్రుండై. 1461

క. నే నెందుదాఁగియుంటినొ, యా నెలవునఁ దగినగర్త మది కన్పడఁగా
త్మానిర్జరుఁ డాంతం డటఁ, గానంబడు వీరణంపుగంట నిడుపుగన్. 1462

తే. ఆశ్రయించి వ్రేలాడెడు నట్టిపితరు,లను మహార్తులఁ దాఁగనుఁగొనుచు నార్తుఁ
డగుచుఁ బ్రశ్నించె నిట్లని యార్యులార,మీర లెవ్వారొ యిట్లుండు కారణంబు.

క. ఏమో యీస్తంభంబున, నీమాడ్కిన్ వ్రేలుచుండు టేలొకొ మీవౌ
మోము లధోవ్యాప్తములై, వేమఱు దుఃఖించుచుండువృత్త మదేమో.

తే. దేన నీదుఃఖములు తీఱుఁ గానఁబడవు
జగతి నిట్టివి నాకెప్డు సరగఁ జెప్పుఁ
డనినఁ బితరులు బ్రాహ్మణుఁ గని వచించి
రేము కృతపుణ్యుఁ డనెడు మహీసురునకు. 1465

క. పితరుల మైతిమి మఱియును, బితామహులతోడ వారిపితరులతోడన్
వెతలం బొందెద మిట నీ,దుతగనికర్మమున; నీకుఁ దోఁపదె యిదియున్. 1466

చ. నరక మిదౌను గర్తమనునామమునం దగియుండు నిందు నీ
వరయఁగ వీరణాకృతిని నందుచు మా కిపు డాశ్రయంబుగాఁ
బరఁగితి విట్టిస్తంబమును వారక యాశ్రయమయ్యె నంచుని
క్కరణిని వ్రేలుచుండు మిలఁ గాయము దీనిని నీవు తాల్చుచున్. 1467

క. జీవించి యుండుదనుకనె, యీవీరణమును సమాశ్రయించి యదెట్లో
యీవెతలం బొందుదు మీ,వేవేళ మృతుండ వౌదు వేమెల్లరమున్. 1468

చ. నరకము నొందువారలమె నాయన! భార్యనుగూడి సంతతిన్
బరమముదంబునం గనిన పుత్త్రమునన్ బరిముక్తపాపతన్
నరకము వీడి పుణ్యగతి న్యాయవిధంబునఁ బొందువార మో
వరతనయా తపంబునను భవ్యమహోత్తరతీర్థయాత్రలన్. 1469

క. గతి మాకుం గల్గదు సన్మతివై మామతమును విని మానినితోడన్
సుతులం గాంచుము మము దుర్గతినుండి తరింపఁ జేయఁగా నూల్కొనుమీ.

చ. అనుటయు నాతఁ డానుడుల నాత్మఁ దలంచుచుఁ దండ్రితాతలం
గనుఁగొని దుఃఖమంది మిముఁ గాఱియఁ బెట్టిన నీచుఁడన్ క్షమిం
పనుదగుదుర్ వరించెదను భామిని సద్గుణశీల నంచు నీ
శుని గిరిజాపతిం గొలిచి సూనృతభాషణతత్పరుండునై. 1471

ఆ. వారి నుద్ధరించి వరుసఁగాఁ బితృగణ,మందుఁ జేరఁజేసె; నతఁడె రుద్ర
దయితుఁడయి సువేశుఁ డనుపేరఁదగి రుద్ర,గణవరుండు నగుచుఁ గ్రాలె భూతి

చ. కనుకనె నీవు సాధుమతి కల్పితశక్తిని ఘోరమౌతపం
బును బొనరించి యోతుహినభూధర! సాధుగుణాఢ్యయైన స
త్తనయను గాంచు మంచు మునితల్లజుఁ డాడి చనంగ నాతఁ డా
దినమునయందె పూన్కితగఁ దీవ్రతపంబును బూనెఁజేయఁగన్. 1473

ఆ. నియమమూని తపము నిర్భరభక్తిచేఁ, దనకుఁదృప్తి గలుగ నొనరిచె; నట
ననుచు బ్రహ్మ వలికె మునులార ననుఁగూర్చి,తపము చేయ నే ముదంబు నొంది.

చ. ధరణిధరేంద్రుపాలికి నితాంతవరంబుల నీయఁగోరి యే
యరిగి గిరీశ;నీతపము నారసినాఁడ ముదంబు నొంది నీ
పరిసర మిట్లు చేరితిని బాగుగ నీమదిఁ గోరినట్టి స
ద్వరముల నీయ వచ్చితిని వైళమ కోరుము నీకు మేలగున్. 1475

చ. అనవిని పర్వతోత్తముఁడహార్యముదంబున నన్నుఁగాంచియి
ట్లనియెఁ గృపాకరా? ముదము నందితి వేని సమస్తసద్గుణా,
ఢ్యుని సుతు నిమ్ము నా కిదియె యొప్పువరం బని మ్రొక్కి వేఁడు భూ
ధరినృపతిఁ జూచి యట్టులె వరంబు నొసంగెద నంచుఁ బ్రీతిమై. 1476

చ. మనమున నీవు కోరినటు క్ష్మాధరనాయక యీమహాతపం
బునకు ఫలంబుగాఁ గలుగుఁ బుత్త్రిక వేఱొకభంగిగా మనం
బునఁ దలపోయఁగా వలదు పుత్త్రిప్రసాదమునన్ దిగంతకీ
ర్తిని గయికొందు వందునఁ బరిస్ఫుటసంపద లొందు దు నిన్నొగిన్. 1477

సీ. దేవతార్చితుఁడవై తీర్థకోటియుతుండ వౌదువు శుద్ధపుణ్యంబులకు ని
ధానమ వౌదువు; మానితుండవు నీవె నిర్జరులందును; నీకుమారి

దేవతాగణనమ ద్దివ్యపాదాబ్జయై వఱలఁజాలెడుఁ జుమ్ము వసుమతీధ్ర
యింక నిద్దఱు సుత లెసఁగుదు రట్టులే యనిపల్కి నేఁబోయితిని స్వలోక

తే. మునకు; నంతటఁ జిరకాలమునకు మేన
యనెడుతనభార్యయందుఁ బుత్త్రిని సులగ్న,
మందుఁ గనియె నపర్ణయై యామె తనరెఁ
బుట్టినప్పటినుండి యాపుత్త్రి యాత్మ. 1478

ఆ. ఏకపర్ణి యగుచు నేకపాటలయయి, యుండెఁ దద్రహస్య మొప్ప నిట్టు
లమలమానసులార న్యగ్రోధ మేకప, ర్ణ మనఁ బిల్వఁబడు ధరాతలమున 1479

వ. పాటలం బేకపాటలయనంజెల్లు. ఏకపర్ణం బాహారంబుగా గృహంబు నెడఁబాసి తపస్సు చేయసంకల్పించె. దేవదానవులకు దుష్కరంబయిన తపంబును శతవర్షసహస్రంబులు చేయఁబూని యాహారం బేకపర్ణంబుగా నేకపర్ణాఖ్యఁదగు నాయపర్ణ గృహం బెడఁబాసె. కొంతకాలం బేకపాటలం బాహారంబుగాఁగొనుట యేకపాటల యనంబరఁగె. వర్షసహస్రంబు పూర్ణంబగుదాఁక నిట్లు పార్వతీసహచరిణులు కూడ నిట్లే యాహారంబుగాఁ దపంబు సల్పిరి ఏకపర్ణయు నేకపాటలయు నని వారిపేరులు. అవ్వల నపర్ణయు నిరాహారయై తీవ్రతపం బొనరింపఁ బూన నామె తల్లియగు మేనాదేవి యిట్లనియె. 1480

క. తనయా! నీవిటులన్నముఁ, దినకయె తపమూనియుండు తెగువకు దుఃఖం
బును బొందెద నింక "నుమా", యనియెన దేపార్వతికిని నాహ్వయ మొప్పెన్.

తే. తలఁపఁగ నుకారముర్విని దప మనియెడు, నర్థమిచ్చును మాయను నవ్యయంబు
వల దనెడునర్థ మిచ్చు నిట్టులు చెలఁగుటఁ, దపము వలదని పుత్త్రికిఁ దల్లి చెప్ప.

క. పేరదియే లోకంబున, సారప్రఖ్యాతిఁ గాంచె సన్మునులు సురల్
గారవమునఁ బూచించిరి, కోరిక విడుతల్లియే యగున్ భువి ననుచున్. 1483

వ. ఈకుమారీత్రయంబె సచరాచరప్రపంచం బయ్యె. వీరితపః ప్రభావంబె యీ భూమిని ధరించియుండు. వారెల్లఁదపశ్శరీరలై యోగమునాశ్రయించి యుండిరి. ఆమువ్వురు మహాభాగలు. సుస్థిరయౌవనలు లోకమాతలు. బ్రహ్మచారిణులునై సదాతపః ప్రభావంబున లోకంబు ననుగ్రహించుచుందురు. వారియందు నుమ వరిష్ఠయై జ్యేష్ఠయైవరవర్ణినియై యలరె. మఱియు మహాయోగబలోపేతయయి మహాదేవు నాశ్రయించె. దత్తకుండు నుశనసుండు ననువీరాకాలంబున భృగునందనులై వెలసిరి. ఏకపర్ణయు భృగునందనుండగు నుశనసుం బతిగా వరించి దేవలుం గనియె. ఆపుత్త్రికాత్రయంబునఁ గనిష్ఠయగు నేకపాటలయు నలర్కుని వరించి శంఖలిఖితులను నిరువురు తనయులం గనియె గాని వారయోనిజు లనం బరఁగిరి. 1484

క. మునులారా! యుమ యన నే, మును చెప్పినశైలరాజపుత్త్రి మహాభీ

తిని గల్గించు తపంబును, బొనరించుచు నుండె లోకములు ఘూర్ణిల్లన్. 1485
క. పొగగప్పిన చందంబున, జగములు కనఁబడుటఁ జూచి సత్వరముగ నే
నగజాతచెంతకుం జని, తగ వొప్పఁగ నిట్టు లంటి ధన్యమనీషా. 1486
క. కర మరుదౌ తపమున నో, ధరతనయా! త్రిభువనములు తాపం బందన్
బరికింపక చేసెద వీ, శ్వరి నీవే కావె సృష్టి వైఖరి మేఱయన్. 1487
క. నీవే పుట్టించితి వటు, గావున నాశన మొనర్పఁగా రాదుసుమీ
నీవే తేజం బొప్పఁగ, నీవసుధం దాల్తు విట్టులే కోరికచేన్. 1488
క. జననీ!మది నేవాంఛం,గొని యీఘోరంపుఁదపము గూడ దనక యి
ట్లనిశము చేసెదవో నే,వినఁ గోరెదఁ బ్రీతిఁ జెపుమ విశ్వస్తుత్యా. 1489
క. కరుణింపు మెల్లజగముల, వరవర్ణిని! యనిన నుమయుఁ బరమప్రీతిన్
సరసిజసంభవ! విను మి,క్కరణిని నే దేనిఁగోరి గాఢతపంబున్. 1490
క. ఒనరించు చున్నదానరొ, మనమున నీ వెఱిఁగియు నిటు మరలం బ్రశ్నిం
పను జన్నె యన్న బ్రహ్మయు, మనస్వినీ! యెట్టివాంఛమదిఁగోరి యిటన్. 1491
చ. అనిశము సత్తపంబు నియమాన్వితవై యొనరించుచుందు వో
జనని! యతండె యిచ్చుటికిఁ జయ్యన వచ్చి తనంతనే వరిం
చును నిను; శర్వుఁడే ప్రభువు శూరశిఖామణి సర్వలోకపా
లనచణుఁ డీశ్వరుండు ను విలాసకృతాఖిలలోకుఁ డెన్నఁగన్. 1492
క. వరియింపఁ దగిన భర్తయు, నిరతము పూజ్యుండు నగు ననింద్యచరిత్రా.
పరికింపఁగ మే మీశ్వరు, చరణావశంగతుల మనఁగఁజాలుదుముసుమీ. 1493
సీ. శివకింకరులము సూ శివుఁడు మహాదేవుఁ డఖిలలోకేశ్వరుం డాద్యుఁ డతఁడు
పరమదయాపూర్ణుఁ డరయ నాదేవుండె నీయంతికమునకు నెమ్మితనర
నరుగుదెంచును మహత్తరరూపుఁడై గాని వికృతరూపంబున వెలసిగాని
మఱిసమానాకృతి మైకొనియేగాని పరమాద్భుతిని మహేశ్వరుఁడు పర్వ
తే. తాధివాసుఁడు స్థావరం బనఁగ జంగ
మం బనంగ నెసంగు నీమహీతలోక
ముల కధీశుఁడు తొలిదైవ మిల నతండె
యప్రమేయుఁడు భూతేశుఁ డసదృశుండు. 1494
క. తారాధీశవిహీనుం,డై రాజన్నిర్జరేంద్రునట్లు మహాతే
జోరాజితుఁడై భయకృ,ద్భారంజితుఁడై శివుండు వఱలును జననీ. 1495



## ముప్పదిమూఁడవ యధ్యాయము.

*శివుఁడు గౌరీహృదయము నెఱుంగఁగపటవేషమును బూని వచ్చుట; శివపార్వతులసంవాదము.*

చ. అని యిటు తెల్పి యాసరసిజాసనుఁ డింకను మౌనివర్యులం
గని యిటుపల్కె నే నిటులుగౌరిని జేర్కొని పల్కె నంతటన్
మునివరసంయుతిం ద్రిదశముఖ్యులు వేగమ యాపరాంబికం
గనుఁగొనఁ బోయి యిట్లనిరి కమ్రసరోరుహనేత్రరాజితా. 1496

క. దేవీ!నీ వెవ్వనిచే, నీవిధిసృజియింపఁ బడితొ యెవ్వఁడు నిన్నున్
బోవిడువఁజాల కుండునొ, యావిబుధేశ్వరుఁడె నీకు నగుఁ బతిజగతిన్. 1497

క. పరశివుఁడె భర్త కాఁగలఁ, డురుతాపము గల్గఁజేయ నుంకించు మహా
త్తరతపము చేయకుము భూ, ధరతనయా యనుచు దేవతావరులెల్లన్. 1498

క. వలగొని యాపరమేశ్వరి, సులలితవాక్కుల నుతించి చొచ్చిరి స్వర్గం;
బెలమిన్ గిరితనయయు ని, స్తులభక్తిన్ శంభుఁ దలఁచుచున్ దివిజోక్తుల్. 1499

క. మనమున నెన్నుచు స్వాశ్రమ,మున నుండెన్; ద్వారభాగమున నున్నతిచేఁ
గనఁదగియుండె నశోకం, బనఁబడు వృక్షంబు దాని నాగిరిసుతయున్. 1500

ఆ. ఆశ్రయించి శంభు నాత్మఁ జింతించుచు
నుండ; నొక్కనాఁడు యోగివర్య,
వినుతపాదుఁ డమలవిధు భూషితోత్తమాం
గుఁడు సురార్తిహరుఁడు గుహజనకుఁడు. 1501

క. అరుదెంచె వికృతరూపము, పరఁగన్ గిరిజాశ్రమంబుఁ బావనతమమున్
సురపూజితంబుఁ జూడఁగ, హరుఁ డప్పుడు హ్రస్వరూప మమరుచునుండన్.

క. కరయుగము హ్రస్వమై యొ,ల్లరకుం గన్పడఁగ గతవిలాసముగా సు
స్థిరదేహ మొప్ప నాసిక, సరిగాక విభగ్నరీతి స్పష్టం బగుచున్. 1503

క. కనఁబడఁ గేశమ్ములతుద,లను బింగళవర్ణ మట్లొలయఁగాఁ జూడం
గను నేవ పుట్టఁ జేసెడు, తను వమరన్ వచ్చి మోము తగ వికృతంబై. 1504

చ. కనఁగ నసహ్యమై యమరఁగాఁ దనుఁజూచిన వార లేటికీ
తనువు సృజించె బ్రహ్మ యని తద్దయు నేవగొనంగ మెల్లఁగా,
ననియెఁ దపస్వినీ! నిను మహాముద మొప్ప వరింప నెంచి వ
చ్చిననుఁ జూడుమా యనినఁ జేతము పొంగ హిమాద్రిపుత్రియున్. 1505

ఉ. యోగసమాహితాత్మ యగు టొప్పుగ వచ్చినవాఁడు శంకరుం
డాగజచర్మధారి యని యారయఁ జాలినదౌట వేగ య
భ్యాగతు భక్తితత్పరత నాదృతిమీఱఁగ గౌరవించి నా
నాగమసూక్తరీతి హరు నర్చనలం దనుపంగ నెంచుచున్. 1506

క. అంతర్భావవిశుద్ధయుఁ, జింతావిరహితయు నౌట శివుకృప నొందం

చింతించి యర్ఘ్యపాద్యము, లంతట నర్పించి ప్రీతి యధికంబగుటన్. 1507

సీ. మధుపర్క మొసఁగి సుమంబులఁ బూజించి పరమేశ్వరుని సర్వపరు ననంతు
శంకరు ధ్యానించి సరసోక్తులం బల్కె; శ్రీమహాదేవ సంసిద్ధరూప
నే నస్వతంత్రను మానితవిఖ్యాతిఁ గన్న నాజనకుండు గలఁడు జనని
కలదు వారలలో నఖండతరప్రభావమున రాజిలుతండ్రి వరుఁడు యోగ్యుఁ

ఆ. డనుచు నిర్ణయించి నను నొసంగఁగఁ బ్రభు,వతఁడె దాన మీయ నర్హుఁ డేను
గన్యఁ గాన వారిఁ గాదని వరియింప, నర్హ మెట్లు లగు మహాత్మ చెపుము. 1508

చ. ధరణిసురేంద్ర! నీ వరిగి తండ్రిని నం దమిఁ బెంచువాని భూ
ధరవరు నవ్యయాత్ముని నితాంతకృపాకరుఁ గాంచి వేఁడు మా
దరమున నీకు నన్నొసఁగఁ దండ్రి తలంచునయేని నిన్ను నేఁ
గరము ముదంబునం బతిగఁ గైకొనఁజాలుదు న్యాయమాటచేన్. 1509

చ. అనుటయు నమ్మహాశివుఁ డహార్యపరాక్రమశాలి యాగిరిం
ద్రునితనుజాత పల్కిన యనూనతరార్థవచస్తతిన్ ముదం,
బున విని యట్టులే యరిగి భూధరు వేఁడెద నంచుఁ బల్కె చ
య్యనఁ జని కూఁతు నిమ్ము తుహినాద్రివరా కయికొందు భార్యఁగన్. 1510

మ. క్షితిభృన్మౌళియు రుద్రు నవ్యయునిగాఁ జింతించి తద్రూప మ
ట్లతిమాత్రంబు వికారరీతి గను టత్యాశ్చర్యముం గల్గఁగా,
మతిఁ జేయంగ భయంబు నొంది తనయన్ మన్నించి యీకున్న నీ
శితికంఠుండు శపింపకుండఁ డొసఁగం జిత్తంబు రా దేగతిన్. 1511

మ. కనుకం జేయఁగ నైన దెద్ది యనుచున్ క్ష్మాభృద్వరుం డెంచి యి
ట్లనియెన్ శ్రీపరమేశ! బ్రాహ్మణుల దేవాళిన్ మహామాన్యులం
చనయంబుం దలపోయుచుండు నిసుమంతైనన్ దిరస్కారమున్
గనఁ జేయంగఁ దలంపఁ బెండ్లిపలుకుల్ కాంక్షించి నేఁ జెప్పెదన్. 1512

మ. మును పే రొక్కవిధంబుగా జరపఁగా బుద్ధిం దలంపంబడెన్
గనుకన్ దాఁపక తద్విధం బెఱుఁగ నింకం జేయువాఁడన్; మహా
జను లెన్నౌ ననఁగా స్వయంవరమదే సంతోషమే పారఁ జే
యను సిద్ధాంతము చేయఁగాఁబడియె నార్యా! సాగు నావేడ్కయున్. 1513

తే. ఆమహోత్సవమందు నాయాత్మజాత, యెవని వరియించు నాతఁడె యింతి కగును
భర్త యిద్దియె నియమంబు బ్రాహ్మణాగ్రగణ్య! యనవిని యాశితికంఠుఁ డజుఁడు.

క. శైలాగ్రగణ్యు నభిమత, మీలాగని యెఱిఁగి గిరిజ యంతికమునకున్
జాలఁ ద్వరం జని శంకరుఁ, డీలీలం బల్కెఁ బర్వతేశ్వరపుత్రీ. 1515

క. జనకుఁడు నీకు స్వయంవర, మును గావించెద నటంచుఁ బూనికఁ బలికె నె

వ్వని వరియింతువో యందును, వనితా యాతండె నీకుఁ బతి యగుఁజుమ్మీ.
ఉ. ఈవచనంబు దెల్లముగ నీవెఱుఁగన్ వచియించి స్వేచ్ఛఁగాఁ
బోవఁగ వచ్చినాఁడ స్మరుఁబోలినరూపము గల్గువాని నీ
వే వరియింతు గాని వికృతేక్షణు మాదృశునిన్ వరింతువే
కావున నీదుసమ్మతిని గాంతరొ పోయెద నంచుఁ బల్కినన్. 1517
సీ. పరమేశుభావంబుఁ బరికించి కృత్యంబుఁ జక్కఁగా నూహించిశంభుఁడు తను
దుర్లభగా మదిఁదోఁపఁగా వచియించె నంచును భావించియతనికి మదిఁ
దనపైనఁ గల్గినయనురాగ మెంతయు గాఢతమం బనికాంతఁ దలఁచి
సుప్రసాదముఖుండు సురపూజ్యుఁ డీశుండు తనుఁ గోరియే వచ్చెధన్య నైతి
తే. ననుచుఁ దలపోసి వచియించె నాదరమున, దేవతాధీశ! మఱొకరీతిని దలంపఁ
జనునె నిన్నె వరించెద సత్య మిద్ది, యచ్చెరువు గల్గునే యిందు నరసిచూడ.
చ. పరశివ సంశయంబు మదిఁబాటిలునేని మదుక్తియం దదే
వరుసను నిన్ను నీక్షణమె భర్తగ నే వరియించుదాన నా
దరమున నగ్రహింపుము సతంబును నిన్ మది నిల్పియున్నయీ
తరుణిని బ్రోవఁగాఁ దగదె దర్పకభంజన! సోమశేఖరా. 1519
చ. అని వినయంబునం బలికి యాగిరిరాజకుమారి పుష్పహా
రనియతహస్తయై నిలిచి రాజధరోత్తమకంఠసీమయం
దునిచి వరించితిన్ నిను మహోత్తమరూపునిఁ బ్రాణనాథుఁగా
నని పలుకంగ సాంబశివుఁ డాదృతిఁ దన్ను వరించు నాసతిన్. 1520
క. కని పలికె నయ్యశోకం,బును వాగమృతంబుచేతఁ బూని మరలఁజే
తనము గనఁ జేయుమాడ్కిన్, ఘనసుమహారంబ ప్రాక్సుకర్మవశమునన్. 1521
క. వరియించితి నన్నున్ దత్పరతం గావునను నీకుఁ దగులకయుండున్
జర మృతియు; దివిజతం గని, నిరతము నుతిపాత్రమ వయి నెగడుము నెమ్మిన్.
ఆ. కామరూపి వగుచుఁ గామపుష్పంబవై, కామదాయివగుచుఁ గడుముదంబు
నాకుఁ గూర్పఁజాలి ప్రాకటాభరణపు,ష్పాఢ్యమవయి మిగులఖ్యాతిమించి. 1523
వ. సర్వపుష్పఫలోపగంబు. సర్వాన్నభక్షకంబు, సుధాస్వాదంబు, సర్వగంధంబు
దేవతాప్రీతిదాయకంబు ననువిఖ్యాతిం గాంచిసర్వభూమీరుహాముఖ్యంబవై
యుండఁగలవు నిర్భయంబుగా లోకంబుల సంచరింపం జాలుదువు. మునులు
నిన్నుఁ బ్రశంసింపఁ గలరు. ఆశ్రమం బీయది యిదిమొదలు చిత్రకూటం బనం
బరఁగు. ఈకూటంబునకుఁ బుష్పార్థియై యెవ్వండు వచ్చునో యాపూతచరిత్రుం
డశ్వమేధఫలంబు నొందు. ఎవ్వఁడీకూటంబున నీయంతికంబునమృతినొందువాఁడు
బ్రహ్మలోకంబునం దుండగలఁడు. ఎవ్వఁ డీశిఖరంబున నియమంబునఁదపం బొన
రించి ప్రాణంబుల యోగంబున వదలునో యాసుకృతి ప్రమథగణేశ్వరుం డగు.

అనిపలికిపరశివుం డుమాతరుణి యనుమతంబు నొంది యంతర్ధానంబు నందె. ఇట్లుపరమేశ్వరుండు సర్వభూతమహేశ్వరుండు చనుటయు నాహిమవత్పుత్త్రికయుఁదదేకధ్యానపరాయణయై యాశిలాఫలకంబునందె నివసించి పరశంకరదర్శనోన్ముఖియై యుండె. శివవిరహితయగుట నాపార్వతి చంద్రరహితయగు త్రియామవలెఁ జంచలచిత్తయగుట నలరారకయుండె. 1524

మ. తరువాతఁ గిరిజాత యార్తుఁడయి చింతం దెల్పిన శ్లేద్భుభూ
సురపుత్త్రారవ మాలకించె నదియుఁ శోభిల్లుపద్మాకరాం
తరమందుండి చెలంగినట్లయిన శబ్దం బిట్టులేలొక్కొ యీ
తరుణం బందు వినంగ నయ్యె ననియాత్మం జక్కఁగా నెంచుచున్. 1525

ఆ. హేతువేమొ యనుచు నిద్ధమార్గంబునఁ, దలఁచుచుండె; దేవతాగణేశుఁ
డజుఁడు శివుఁడు బాలునాకృతి గ్రహియించి, యాసరోవరమ్ము నంతరమున.

క. జలకేళీకౌతుకమునఁ, బలుభంగులఁ దిర్గుచుండఁ బటుతరనక్రం
బలరెడు తన్గ్రహియించిన, బలమేది రవంబుచేసె బాపురె యనుచున్. 1527

సీ. విశ్వంబుఁ బుట్టించు విపులశక్తిఁ మించు యోగమాయగ్రహించి యాగతి శిశు
వై సరోమధ్యంబు నందుండి యిటుపల్కె; గ్రాహము నన్నిదె కడిమి మెఱయఁ
బట్టుకొనియె నిది వదలకున్నం జావు తప్పదుగాదె యేధర్మబుద్ధి
యైనఁ గాపాడునే నాతనికిం దక్కు జీవనం బిచ్చినసిద్ధపుణ్య

ఆ. మక్కటా జలంబు నం దిట్టికష్టంబు,గలిగెఁ గోర్కులెల్లఁగలవు నాదు
మనసునందు వాని ననుభవింపక యిట్లు, బాల్యమందె చావవలసె నాకు. 1528

చ. వనజజుఁ డెంతొ నిర్దయత వ్రాసెను నాదులలాటసీమఁ జ
చ్చు నితఁడు గ్రాహవక్త్రమున క్షోణి న దెవ్వరు లేనిచోట నం
చును దలపోయువాఁడ నిదె చోద్యము దిక్కొకఁడైన లేఁడునా
తను విది గ్రాహభక్ష్యమయి తప్పక సంయమి వీటి కేగెదున్. 1529

క. దానికి నేఁ జింతింపను,గాని ననుం బ్రీతిమీఱఁ గాపాడినయా
సూనృతవచనుని దండ్రిని. నేనొకఁడనె కొడుకుగా జనింపఁగఁ బ్రీతిన్. 1530

క. తనజన్మము సఫలముగా, ననుదినముఁ దలంచు నట్టియమ్మను మదిలో
నన తలఁచి దుఃఖముందెద;, జనకులు నావార్త నిట్టిచందము వినుచున్. 1531

క. తనువులఁ బరిత్యజింతురు, తనయుం డొక్కరుఁడు గానఁ దమఁగాచెడు వా
రన లేరుగాన జీవింపను గోరరు సత్య మిద్ది బాగుగఁదలఁపన్. 1532

చ. మనమున నెన్న నీస్థితిని మాన్పఁగరాదు కటా! వయస్సునా
తనువును సోఁక కున్నతఱిఁ దల్లియుఁ దండ్రియు నాదుముద్దు చూ
డనితఱి నిట్లు గ్రాహము కడంకను మ్రింగఁగఁ జావు సిద్ధమ

య్యెనుగద దైవచేష్టిత మదెవ్విధి మాన్పనురాదు సుంతయున్. 1533
చ. అని యిటుపల్కుచున్న యల యార్తమహీసురబాలు కంఠని
స్వనము శ్రుతిద్వయిం జొరఁగ సంతతమంగళకార్యలోలయౌ
టను బరితాప మందుచు వడంకెడు దేహముతోడ నచ్చటుం
గనఁజనె నెందు నాస్వనము గల్గెనొ యాసరసుం గనంద్వరన్. 1534
చ. సరసిజనేత్ర యందుఁ గనె బ్రాహ్మసురబాలకుఁ జారురూపు భీ
కరతరనక్రవక్త్రగతు గాఢభయార్తిని వే వడంకుచున్
బరమవిషాదముం గనెడువానిని; నక్రము దేవి రాకచేఁ
ద్వరపడి బాలకుం గొనుచుఁ బాఱెఁ దదంతరసీమ కంతటన్. 1535
ఆ. మొసలి తన్ను నీడ్వ ముద్దులబాలకుం, డార్తిమీఱ నట్టు లఱచె దాని
కెంతొ వగచి యాగిరీంద్రతనూజాత, పలికె నిట్లు తొట్రుపాటు గనుచు. 1536
తే. గ్రాహరాజమ! ఘోరదంష్ట్రావిశేష,భయదమూర్తీ మహాసత్త్వ. ప్రబలశౌర్య
రాజితా యేకపుత్త్రు నీబ్రాహ్మణవటు,వును జవంబున వదలుమీ కనికరించి.1537
క. అనవిని గ్రాహం బిట్లని, యెను నాఱవదినమునం ద దెవ్వరు తొలుతం
గనఁబడుదురొ నాచెంతకుఁ, జను దెంతురొ వారె నాకు సారసనేత్రా. 1538
తే. అగుదు రాహార మని పూర్వమందె లోక,కర్త లుపదేశ మిచ్చిరి; బ్రహ్మభృదాత్మ
సంభవా దేవి యేను షష్ఠమదినమున, నిపుడు విధి పురికొల్పంగ నితనిఁ గాంచి.
క. కరములఁ బట్టితి వదలం, దరమే నా కింక నిద్ది ధాతృవిహితమై
పరఁగుంగద నీబాలకు, పరిగ్రహింపకయె వదలఁబాడి యదెట్లా. 1540
చ. అనవిని యాగిరీంద్రసుత యార్తిని బొందుచు నిట్లు పల్కె గ్రా
హనృపవరేణ్య నేను దుహినాచలశృంగమునందు భక్తిఁ జే
సినతప మెల్ల నొడ్డెదను జెచ్చెఱ బాలునిఁ జంపకుండు వం
దన మిదె నేనొనర్చెద నితాంతకృపారక యన్న గ్రాహమున్. 1541
చ. నిరుపమగాత్రి చంద్రముఖి నీవు తపంబు వ్యయంబు చేయ నీ
తరుణమునందుఁ బాడియె బుతంబు వచించెద వీని కెట్లు నా
కరములనుండి మోక్షణము గల్గునొ యాతెఱఁ గేను జెప్పిన
ట్లరసి యొనర్పుమా యనిన నాతుహినాచలపుత్త్రి యిట్లనున్. 1542
మ. జలజంతూత్తమ సజ్జనప్రియ మదేచందంబునం జూడ నొ
నలరీతిన్ వచియింపు మే నొనరుతున్ హర్షంబునన్ దాని ని
ష్ఠుల బ్రాహ్మదేవతలందుఁ బ్రీతి యలరుం బో నాకు నత్యంతమం
చలరం బల్కిన గ్రాహ మిట్లనియె నార్యా!యింక నాలింపుమీ. 1543
సీ. కొలఁదిరెయ్యైన నిష్ఠుల నుత్తమం బనఁ దగినట్లు చేసిన తపము నెల్ల
నాకొసంగుము దాన నీకుమారుని వేగ వదలెద నా విని సదమలాంగి

పుట్టుకదొట్టి యేపుణ్యంబు లేను జేసిన దానినో వానిఁ గొనుము వీని
వదలు; మంచని పల్కి వారిచరం బప్డె తత్తపోబలమునఁ దనువుపొంగ

తే. వెలిఁగెమధ్యాహ్న మపుడు నిస్తులగభస్తి
మాలికల నొప్పు భాస్కరుమాడ్కి దుర్ని,
రీక్ష్య తేజంబునన్; మృదురీతి నంతఁ
బలికె నిట్లని గ్రాహంబు పార్వతిఁ గని. 1544

క. గిరిజాతా! నియమంబులఁ, బరఁగుచుఁ జేసినతపంబు బహువిధకష్టో
త్కరసాధ్యము గద దానిం, బరికింపక వ్యయ మొనర్పఁ బాడియె చెప్పుమా.

క. మనమున నించుక యరయక, వనితారత్నంబ తపము బాలునికొఱకై
నసుఁ బొందఁజేసితివి దీ, నిని బెద్దలు వినుతిసేయ నేరరుసుమ్మీ. 1546

క. వినన్ బ్రాహ్మణభక్తికి, మానస మలరారె నీదుమహితతపం బి
ద్దాని నొసంగెద మరలం, జానరో కైకొనుము విప్రసత్తమసుతునిన్. 1547

క. తనుమధ్యా! యతిమోదం,బును బొందితి వరముఁ గోరుము చెలంగెడుశ
క్తిని దాని నిచ్చెదను నా, విని పార్వతి నియతయగుచు వేడుకఁ బలికెన్. 1548

క. అవహారరాజమూ భూ, దివిజుఁడు తను విచ్చియైనఁ దేకువ రక్ష్యం
డవు తపముచేసి పుణ్యం, బవితథముగఁ బొందవచ్చు; నవనీసురుఁడున్. 1549

క. ఆపన్మధ్యస్థితుఁడై, యీగతిదిం జిక్కి నతని కింపొనఁగూర్పం
జేపట్టు పుణ్య మయ్యది, ప్రాపించుట యరుదు గ్రాహవర్యమ యెందున్. 1550

క. మనసునఁ జక్కఁగ నెంచియొ, పని యీగతిఁ జేయఁబడియె బాలుండు విమో
చనమునసుఖపడుఁ గావునఁ, జను నీకార్యంబుఁ జేయ సన్మతి మీఱన్. 1551

క. తప మవనీసురుకంటెన్, సుఫలప్రద మనఁగరాదు క్షోణీసురుఁడే
తపమునకంటెన్ శ్రేష్ఠుఁడు, కృపఁ గాచితి విదియొ చాలుఁ గీర్తింపంగన్. 1552

క. ఇచ్చినదాని గ్రహించుట, సచ్చరితులపథము గాదు క్షమియింపుము నే
నిచ్చినతపము గ్రహింపను, బొచ్చెము లే దిందు గ్రాహపుంగవ వినుమా.

ఆ మొదట నిచ్చి మరల మోహంబున న్నరుఁ,డెవ్వఁడే గ్రహింప నెట్లునేర్చు;
మనసు తృప్తిమీఱ ఘనతపం బిచ్చితి, మరల దానిఁ గొనఁగ మనసురాదు.

క. ఘనతప మియ్యది నీయం,దున వెలయుంగాక బ్రాహ్మణుని పుత్త్రుం డీ
యనఘుఁడు విడువం బడుఁగా, కన విని గ్రాహంబు దేవి నభినందించెన్. 1555

క. ధరణిసురార్భకునిన్ విడి,చి రయంబునఁ గానఁబడక చెందె స్వపదమున్
సరసున ముక్తింగని భూ,సురబాలుఁడు చూచువారు చోద్యం బందన్.

తే. స్వప్నలబ్ధధనం బట్లు సరగ నందె

కనె నద్భుతశ్యత; హిమగిరి కన్య స్వీయ
తప మపచయతఁ గాంచుట తలఁచి మరల
నియమ మొప్పారఁ జేయఁ బూనెను దపంబు. 1557

చ. మనసు దృఢంబుగా నిలిపి మౌనవిభూన్కిఁ దపంబుచేయ భూ
ధ్రనృపకుమారిఁ గాంచి సురరాజసమర్చితపాదపద్ముఁడై
తనరు హరుండు పల్కె వనితామణిరో తప మింకఁ జాలు నీ
వనుపమసత్తపఃఫలము హర్షము నొంది యొసంగ దానినిన్. 1558

తే. నేను జేకొంటి నక్షయం బౌ నదియును
వేయిభంగుల నొనరుచు విధమున నది
నీకు ఫలియించు నిఁక మీఁద నీవు తపము
చేయఁగా నేల యని యిట్లు శివుఁడుపలుక. 1559

చ. హరువలనన్ వరం బిటుల నక్షయసత్ఫలదంబు నొంది భూ
ధరవరపుత్త్రి శంకరుని దర్పకభంజనుఁ బ్రీతి నెన్నుచున్
బరమముదంబు నొంది యట వాసముచేసె; మహర్షులార! యీ. 1560
నిరుపమగాథ నే నరుఁడు నిర్మలభక్తిఁ బఠించు నిచ్చలున్

క. గౌరీపాదాంబుజముల, సారెకుఁ బూజించు నట్టి సద్భాగ్యము చే
కూరఁగ దేహాంతమునఁ గుమారగణాధీశులవలె మన్నింపఁబడున్. 1561

ఆశ్వాసాంతము.

క. శ్రుతిశీర్షతతిప్రతిష్ఠా, దితదివ్యచరిత్రభూమిదేవర్షికృతా
యతనుతిపాత్రానిర్జర, వితతి సమారాధితాంఘ్రి బిసరుహాయుగళా. 1562

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్య పాన్వయప్రభవ శ్రీజనమంచివంశాంబురాశి కుముదినీమిత్ర, సుబ్రహ్మణ్యమనీషి పుత్త్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ వినిర్మితంబైన తెలుఁగు బ్రహ్మమహాపురాణంబునఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీః

# తెలుఁగు బ్రహ్మపురాణము

ద్వితీయాశ్వాసము-ముప్పదినాల్గవయధ్యాయము.



నియతవాసహృదయా
బ్జా నిర్మితవామనేత్రభాగవిలసద,
బ్జా నీరజజాదిసుప
ర్వానీకశరణ్య వేంకటాచలనాథా.

వ. మహాప్రభూ తరువాతివృత్తాంతం బవధరింపుము.

## పార్వతీస్వయంవరము.

క. సురుచిరవిమానశతసం,భరితము విస్తృతము నైనపర్వతతతి భూ
వరపృష్ఠభాగమున భూ!ధరపుత్త్రికిఁ జారుమతికిఁ దతగుణవతికిన్. 1

క. చిరకాలంబునకు స్వయం,వరమహము మహావిభూతిఁ బరఁగెన్, క్ష్మాభృ
ద్వరుఁ డగుహిమవంతుఁడు ధ్యా,నరతప్రవరుండు కావునన్ శంకరుచేన్. 2

క. తనదుహితను నభిమంత్రితఁ,గ నెఱిఁగియు స్వప్రతిజ్ఞఁ గాచెడు వేడ్కం
గొని లోకాళి స్వయంవర,మును ఘోషింపంగఁ బంచె మునిసమ్మతిచేన్. 3

ఉ. దేవత లాశరుల్ సకలదిక్పరిపాలకు లెల్లసిద్ధులున్
జేవగలట్టిభూవరులు శ్రీయుతులై తగులోకవాసు లో
హో వరియించె శంకరు మహోత్తమదేవు నటంచు నెన్నఁ గా
నావరపుత్త్రి యెల్లరు గనంగ వరించెడుఁగాక శ్రీశివున్. 4

తే. ఇట్టులొనరించు టే శ్లాఘ్య మిదియె సుకృత
మిదె మదభ్యుదయమునకు హితము ననుచు,
మంతన మొనర్చి శంకరు మదిని నిల్పి
చాటఁ బంచె స్వయంవరోత్సవమునపుడు. 5

చ. వనజజులోకమందు సురవల్లభులోకమునందు నన్యదే
వనికరవాససీమలను వర్ణన మొప్పఁగఁ గాంచియున్న పా

వనభువనంబులఁ దుహిత వారక తానె స్వయంవరంబునఁ
దనమది కెక్కు సద్గుణవితాను వరించెడు నన్న వార్తనుఁ. 6

తే. తెలియఁగాఁజేసి యుత్సవదేశ మెల్ల
మణిమయంబుగ నొనరించి క్ష్మాభృదుత్త,
ముఁడు స్వయంవరమునకు విభూతి మెఱయ
సిద్ధపఱచెను వస్తువుల్ చెలఁగు వేడ్క. 7

సీ. అగజాత తాను స్వయంవరంబునఁ గోర్కి కనువగుసాధుగుణాఢ్యు నెన్ని
వరియించు నంచీసువార్త వినంబడి నంతనే దేవత లాదిరైన
సర్వలోకైకవాస్తవ్యులు సురుచిర వేషముల్ ధరియించి వేడ్క తమ్ముఁ
ద్వర పెట్టఁగా హిమవంతుఁ డేర్పఱచినచక్కటికిం జేరి రొక్క మొగిని;

తే. ఫుల్లపద్మాసనస్థుండు భూతకర్త
సిద్ధసంవృతపార్శ్వుండు శ్రీసమృద్ధుఁ,
డఖిలసద్యోగిపూజితుం డజుఁడు హిమవ,
ద్ధీంధ్రుఁ డాదృతిఁ దెల్పంగ నెన్ని మదిని. 8

క. సురసంయుతుఁ డౌచు స్వయం, వరదేశముఁ గాంచ నేగె బ్రాహ్మణమౌనీ
శ్వరులార! నేనె యప్పుడు, గిరివరుసంప్రార్థమునఁ గృప దళ్కొత్తన్. 9

క. చేరితి నట్టిప్రదేశము, సారసభవుఁ డేగె నంచు సద్వార్తను మీ
రారయ నెఱుంగఁదగు నని,యీరీతి నెఱుంగు నట్టు లేఁ బల్కితిఁ గా. 10

చ. వినుఁడు మునీంద్రులార! మది వేడుక పొంగఁగ వేయినేత్రముల్
కనుఁగొను వారి కగ్గలముగాఁ బ్రమదంబును నిండఁజేయఁగా
ననుపమచందనాంచిత మహార్హ శరీరము తేజరిల్ల హా
రనికరదీప్తు లెల్లెడల రాజిలుచుండఁ బ్రహర్షచిత్తుఁడై. 11

క. కరితతిముఖ్యంబు మహా, త్తరమౌ నైరావతంబు దానాంభ స్సం
భరితకపోలము నెక్కి య, మరతతి గొల్వంగ వచ్చె మఘవుండు త్వరన్. 12

చ. కరమున వజ్ర మొప్ప సురకాండముఖుండు మనోహరంబుగాఁ
బరమగతిన్ గజేంద్రము విభాసురలీలఁ జనంగఁ గాంతి భా
స్కరుఁ డితఁడే యనన్ దెసలఁ గ్రాలఁగఁ జేయుచు వ్యోమయానముల్
సురుచిర హేమచిత్రములు సొంపుగ వెంటను రాఁ బతాకలున్. 13

క. చలియించుచుండ రత్నో, జ్జ్వలకుండలమండితుఁ డయి వహ్న్యర్కమరీ
చుల మించి కాంతు లలరన్, బలరిపుఁ డేతెంచెఁ దనదు భాగ్యం బలరన్. 14

సీ. పీతాంగయష్టియు వెలయఁగా నంగహారములు తేజంబు బలము సమాన
మన లేక యొప్పంగ నతిభయంకరదండమును దాల్చి భీమాకృతిని జెలంగు

మహిషంబు నెక్కి తమోధరోచ్ఛ్రయపీనగాత్రంబు హాటక కమ్రరత్న
భూషణాంచిత మయి పొలుపార దక్షిణదిగధినాథుఁడు హిమాద్రికిని వచ్చెఁ;

తే. విశ్వధారణ నిపుణుండు విబుధదనుజ
నికరమును దేజమున మించు ప్రకటశక్తి,
వ్యోమయానంబుపై నెక్కి యొప్పు మెఱయ
వచ్చె మారుతదేవుండు వైభవమున. 15

చ. అనలుఁడు హారిభూషణము లర్హతమంబుగ వెల్గ వేషమ
త్యనుపమమై కనంబడఁగ హర్షదమై తన కీడులేక యొ
ప్పిన దగు వ్యోమయానమున విశ్వభయంకరతేజ మొప్పఁగా
దనుజులు దేవతల్ వెఱవఁ దాఁ జనుదెంచె హిమాద్రి కాదృతిన్. 16

చ. ధనతతి కెల్లనాథుఁడయి దర్పమునన్ సురదానవాళి మె
ప్పును గనఁజాలి వేషమున భూరితరాప్రతిమానకాంతి న
త్యనుపముఁడై స్వయంవరమహంబునకుం జనుదెంచె రాజరా
జను వినుతిం జెలంగుచు హిమాద్రికి నెంతయు వేడ్కమీఱఁగన్. 17

క. జ్వలదమలరత్నతతి కాం, తుల నొప్పువిమాన మెక్కి తోయజరిపుఁ డెం
తో లలితరూపమున వే, డ్కలు సందడిఁగ్రమ్మ వచ్చె క్ష్మాధరమునకున్. 18

ఉ. నల్లని గాత్రయష్టి తగ నైజవిభూతి యనంతమై శుభ్రు
ద్వల్లభుసంపదన్ గెలువ వర్తితమౌక్తికహారరాజియున్
ఫుల్లసరోజనేత్రములు పొల్పుగణింపఁగఁ బర్వతాభమై
యుల్లమురీతి నేగు పతగోత్తమవాహన మెక్కి యాదృతిన్. 19

క. అరిభీకర మైన గదన్, ధరియించి జగద్విభుండు దామోదరుఁ డీ
శ్వరుఁ డరుగుదెంచెను స్వయం, వరమునకున్ దివిజు లెల్ల వందనము లిడన్.

తే. అశ్విదేవత లిర్వురు హారిరూప, వేషముల నుల్లసిల్లుచు విబుధవైద్య
లోకవ్యోమయానంబున నొప్పుగులుక, వచ్చి రాతుహినాద్రికి వైభవమున.

క. అనలార్కవర్ణమునఁ దగి, యనుపమమై వ్యోమయాన మలరారఁగ స
ర్పనికరపరివృతుఁడై వ, చ్చెననంతుడు కోర్కెలెల్ల సిద్ధిం గనఁగన్. 22

చ. అనలుని దీవ్రభానుని సురాధిపు మారుతు మించు తేజముల్
కనఁబడఁ బెడ్డికిం దగిన కమ్రతరోత్తమవేష మొప్పఁగా
దనుసుతబృంద మాయమర తల్లజరాజిని మించి వచ్చె నా
యనుపమశీతశైలసుత నాదృతిమై వరియించు కోర్కెచేన్. 23

సీ. చారురూపము చూడఁజాలిన యట్లుండ దివ్యాంగదంబులు దివ్యహార
ములు క్రాలుచుండ నిమ్ముల వ్యోమయానంబునను శక్రునాజ్ఞ గంధర్వవరులు

తనుఁ జేరి కొలువ గంధర్వరా జరుదెంచెఁ దక్కినదేవత లొక్క రొకరు
మించురూపముల స మంచితభూషణకలితులై వచ్చిరి విలసితాకృ
తే. తులను గంధర్వకింపురుషులు సురగులు
యక్షకిన్నరు లేతెంచి రమరవరుల
నడుమ రాజుల కెల్లను నాయకుఁ డయి
సమతయే లేక మూర్తి యుజ్జ్వలము గాఁగ. 24
క. బలమాజ్ఞైశ్వర్యంబులు, కలిసి తనుంగొల్వ శతమఖప్రఖ్యాతిన్
వెలసిన దిక్పతి యాగిరి, నలంకరించెను సుధాశ నాళి గొలువఁగన్. 25
వ. అ య్యవసరంబున. 26
సీ. త్రిజగన్మహాప్రసూతికి మూలహేతువు విబుధమహాసుర వితతి కెల్ల
జనయిత్రి యామహేశ్వరునకుఁ బత్నియు సత్వ రాణావళి సతతగీత
ప్రకృతి, పరాపర; పరమేశ్వరియు నయి యొవతుక వెలయునో యింతిమిన్న
యామెయే దక్షునియందుఁ గల్గినకోపమునఁ దనదేహంబు ఘనతమైక
ఆ. యోగశక్తి వదలె నాగజగామిని, యమరకార్యమునకు నమ్మహీధ్ర
తనయగను జనించె జనయిత్రి యామెయే, మణిగణోత్తమో విమానమందు. 27
మ. ప్రచలచ్చామరవీజితాంగి యయి సర్వశ్రేష్ఠభావంబు పొం
గుచుఁ జూపట్టఁగ సాంద్రగంధమున దిక్కుల్ సోఁకు సర్వర్తుపు
ష్పచయాలంకృతమాలికం గరమునన్ సంధించి మోదంబు పెం
చి చనెన్ దేవముఖావృతస్థలికి నాశ్రీకంఠుఁ బెండ్లాడఁగన్. 28
చ. నిరుపమపుష్పహారమును నెమ్మిఁ గరంబునఁ దాల్చి దేవతో
త్కరనిబిడ స్వయంవర ముఖంబునఁ దానొగిఁ బర్వతేంద్రపు
త్రి రహితదేవతాంతరపరిగ్రహసక్తమతిన్ వసింపఁగా
సురపతిముఖ్యదేవవర శోభితయై సభ యొప్పె నెంతయున్. 29
చ. తను మదినెంచు పార్వతి యుదారతరంబగు భావ మెంచి లో
చనముల మూఁడిట న్వెలుఁగు శంభుఁడు పంచశిఖుండుగాఁ దన
ర్చినశిశురూపముం గొని విజృంభితతేజము తోడ మండపం
బున వసియించు శీతగిరిపుత్రియొడిం బవళించె వేడుకన్. 30
చ. శితిగళు నంకసుప్తు సురసిద్ధనుతున్ శిశురూపధారి ను
న్నతవరతేజుఁ బంచశిఖు నాథునిగా మది ధ్యానయోగ వి
స్తృతనిజశక్తి నెన్ని పరమేప్సిత మెల్ల ఫలించె నన్న ప్రీ
తి తనర భర్తగాఁ గొనియె దేవవరార్చిత పాదపంకజున్. 31
సీ. పరిశుద్ధసంకల్పభావయై పార్వతి దేవతోత్తమవితతిం దలంప
కాపరమేశ్వరు నాత్మవిభుం గాఁగ గ్రహియించె; దేవతాకాండ మంతఁ

గాంతావరోత్సంగకలితు నాశిశువును గాంచి యెవ్వాఁడో యిక్కడకు నెట్లు
వచ్చెనో యని యెంచి యచ్చోట గుంపుగాఁ జేరి తన్మహిమంబు భూరితర మ
తే. టంచుఁ గనుఁగొనఁ జాలక చంచలించి, క్రోధఘూర్ణితమతులై రి; గోత్రభేది
యంత నిలుపంగఁ జాలని యాగ్రహమున, వజ్ర మెత్తి జవంబున వైవఁ బూనె.
క. సురపతి మీఁదికి నెత్తిన, కర మట్లే కదలకుండఁగా స్తంభమునాఁ
బరఁగెన్ శిశురూపుం డగు, పరశివుచే స్తంభితమయి బాహువు వెలయన్. 33
చ. కులిశము వైవఁగాని మదిఁ గోరినయట్లు కదల్పఁగాని తా
నిలఁ జలియింపఁగాని తగ కెంతయు నార్తిని గుందుచుండె; నం
త లలితరూపవైభవుఁ డుదారపరాక్రమశాలి కాశ్యపుం
డలఘుబలుండు భాస్కరులయం దొకఁడౌ భగుఁ డెంతొ క్రుద్ధుఁడై. 34
మ. తనదివ్యాయుధ మెత్తి యాశిశువు వే దండింపఁగాఁ బూనె నీ
శునిమాహాత్మ్య మెఱుంగఁజాల కపు డీశుం డాత్మశక్త్యుద్ధతిన్
గనఁగాఁ జేయఁగఁ బూని తత్కరము నాకిస్తోమ మెల్లం గనుం
గొన స్తంభించెఁ; దదీయయోగబలముల్ తుద్రంబులై చేడ్పడెన్. 35
చ. సరసిజనేత్రుఁ డట్లయినచందము గన్గొని చంద్రశేఖరుం
బరశివుఁ గాంచి మస్తకము పల్మఱు కంపము నొందఁజేసె; నో
వరమునులార క్రోధమున బగ్గున మండుచు దేవవర్యు లా
తురమున నుండ నేమియును దోఁపమిఁ జిత్తము చంచలింపఁగన్. 36
తే. వేఱుపాయము లే దని విశ్వసించి
పద్మజుఁడ నగు నేను నాపరమశివుని
ధ్యానయోగంబునం గొల్వఁ దలఁచి భక్తి
గిరిజయుత్సంగమున నున్న పరమపురుషు. 37
క. అనుపమతేజునిఁ దలఁచి య,తనిమహిమము నెఱిఁగినాఁడఁ దత్క్షణమే నే
నును లేచి సాదరంబున, ఘనవాక్కుల సంస్తుతింపఁగాఁ దొడఁగితగన్. 38
సీ. సామగానంబుల సాధుపురాణాళిఁ బుణ్యగుహ్యకనామ పూగములను
నభినుతుండవు గావె యజుఁ డన నీ వీశ యజురుండవు పరాత్పరాహ్వయుఁడవు
స్రష్టవు శంకరా బ్రహ్మము నీవౌదు వలప్రధానంబన నలరు దీవు
పురుషుండ వౌదు వక్షరుఁ డవు ధ్యేయుండ వన నమృతం బనసఖిలకార
తే. ణమనఁ, బరమాత్మ యీశుఁ డనఁగ మహాత్తు,నాఁగ వర్ణింపఁబడువాఁడ వోగిరీశ
నీవె కాదె; చతుర్ముఖభావకల్పి,తము జగత్తగుఁ బ్రకృతియె దాని కాది. 39
క. ప్రకృతికిఁ బరుఁడవు సర్వ, ప్రకృతులు నీయంద వెలయు భవనాశక యీ
మె కదా ప్రకృతి నిరంతర, ము కల్పితామలజగత్సమూహాయు నగుఁ జూ. 40

ఆ. నీవు చేయుసృష్టి కీవామనేత్రయే, మూలహేతు వగును;ముగ్ధ యీమె
విశ్వమూల మగుచు వెలసి పత్నిరూప,మిట్లు తాల్చి వచ్చె నీశ! యిపుడు. 41

క. దేవీసహితుఁడ వగు నో, పావకనేత్రా! మహేశ పరమాత్మా నీ
కే వందన మొనరించెద, భావజపరితాపదూర ప్రమథగణేశా. 42

క. పరమేశ నీదుకరుణన్, గురుతరభవదాజ్ఞ నెమ్మిఁ గొని యీప్రజలన్
ధరఁ బుట్టించితి నీని, ర్జరు లెల్లను మూఢులయి పరాత్పరు నిన్నున్. 43

క. కనఁజాలక త్వన్మాయా, పినద్ధచేతస్కులైరి పృథుతరకరుణం
గను మీశ్వరా మహాత్మా, మునుపటివలె వీర లుండఁబోలున్ జగతిన్. 44

చ. అనియిటు లేను సాంబశివు నర్ఘ్యవిధిన్ వినుతించినాఁడ నో
మునివరులార? యంత సురముఖ్యుల స్తంభితబాహులన్ గనుం
గొని యిటుపల్కితిన్ త్రిదశకుంజరులార విమూఢచిత్తులై
తనరుట నీమహాపురుషు దర్పహరున్ శివు లోకనాయకున్. 45

క. తెలియం జాలక యపకృతిఁ, గలిగింపం బూను టిది యకార్యముగాదే
తెలివిం గైకొని మీ రిపు, డలఘుతమస్తుతుల నీశు నలరించి తగన్. 46

క. శరణం బీవె యటంచని, పరమేశు భజింపుఁ డీమె ప్రకృతి యగుఁజాఁడీ
గిరిజాయుతుఁడై తగు నీ, పరమాత్మునిఁ గొలువుఁ డనుచుఁ బల్కితి నంతన్.

చ. అమరులు స్తంభితాకృతుల నల్లి మనంబుల శంభు నిల్పి యో
సుమహితరూప! నీదయిన చొప్పు నెఱుంగక యేమొ చేయుగ
ర్వము గొనినార మోయభవ వందన మియ్యదియే గ్రహింపు చి
త్తమునఁ గృపం దలంపు మని తత్పద మాత్మల నిల్పి మ్రొక్కినన్. 48

చ. సురలమహార్తిఁ గాంచి మది శూలధరుం డనుకంప నూని ని
ర్జరుల దురంతబాధలను సత్త్వము పొంగ నడంచె; నంత దే
వరమణు లెల్లబాధలను బాసి యథార్థగతిం జెలంగి శం
కరుని మహత్త్వ మెన్ని యిఁకఁ గాఁదగుకృత్య మదేదొ యం చొగిన్. 49

చ. మనముల నెంచు చుండిరి; తు మాధరచాపుఁడు శంకరుండు దే
వనికర మిట్టు లెన్ను తఱిఁ బావకనేత్రము గన్పడంగ న
త్యనుపమమై విచిత్రమును నైతగు దేహము చెన్నుమీఱుచుం
డ నిజమహత్త్వ మేర్పడ జనప్రియరూపముఁ దాల్చె నయ్యెడన్. 50

క. ఆపరమతేజమును గన, నోపాటవ మింత లేక యాత్మనయనముల్
వే పరమభీతి నొందుచు, నాపక్ష్మము లావరింప నలరకయుండెన్. 51

తే. తనదు నాకృతిఁ గాంచు నుదారదృష్టి, దేవతల కిచ్చి శంకరుఁ డావిబుధుల
యార్తి మాన్చెను; శంకరు నమలరూపు, నంతటం గాంచి రేర్పడ సంతసముల.

సీ. సుర లిట్లు పరమశంకరు దివ్యరూపంబు పావకనేత్రవిభాసురంబు
కరము హర్షంబునఁ గాంచి యాపరమేశు మహిమము భక్తిఁబల్మాఱు పొగడి;
రామహేశుని చెంత నంబిక హిమగిరితనయ కన్పడియె శతక్రతుముఖ
దివిజులకెల్ల; నత్తెఱఁగునఁ గన్పడి పుష్పమాలికఁ బ్రీతి భూతనాథు
ఆ. పదయుగంబుమ్రోలఁ బదిలంబుగా నిడి, యామహాద్యుతిని మహాత్ము నీశుఁ
దలఁచు చుండె మదిని దత్కార్యమును గని, మేలుమే లటంచు నోలి సురలు.
క. పలుకుచు గిరిజాయుతుఁడై, యలరారు త్రినేత్రునకు మహాదేవునకున్
దలసోఁక మ్రొక్కి రంతట, నిలాసురుల్ దేవయుక్తి హిమవంతునితోన్. 54
చ. అనుపమసంప్రమోదభరితాత్ములు నౌచు వచించి రిట్లు లో
వినుతచరిత్ర! శ్లాఘ్యుఁడవు విశ్రుతపుణ్యుఁడ వెల్లవారిలో
ఘనుఁడవు నీవు వంద్యుఁడ వఖండసుదీప్తియుతుండ వైతి వీ
శునకుఁ గుమారి నిచ్చుపరిశుద్ధ మహావిభవంబు గల్గెఁ గా. 55
క. గిరిశునితో సంబంధము, పరికింప మహాభ్యుదయము పరినుతమును నౌఁ
ద్వరపడి యింక గిరీంద్రా, పరిణయమహ మొప్పఁజేయ బా గని పలుకన్. 56
చ. విని హిమవన్మహీధ్రపతి వేడుకపొంగఁగ నన్నుఁ గాంచి యి
ట్లనియెఁ బితామహా! కొనుమ యస్మదనేకనమస్కృతుల్ ఘనం
గన మదభీష్టసిద్ధికిని గారణ మీవె కదా తలంపఁ జ
క్కనియనుకంప నాయిని గల్గెను నేఁ గృతకృత్యుఁ డం జుమీ. 57
ఆ. సకలమునకు నీవె సరసిజాసన హేతు, వట్టులౌటఁ బెండ్లి యట్టి రీతి
జేయుపనియు నీదె నీయధీనుండ నే,నేమి చేయవలయు నెఱుఁగఁ జెపుము 58
చ. మునివరులార! యాశిఖరిముఖ్యుఁడు భక్తిని నిట్లు పల్క నీ
శునికరపీడనంబునకు సుందరరీతిఁ బురం బలంకృతం
బును విధియుక్తవస్తుపరి పూర్ణముగా నొనరింపు మంచు నా
జ్ఞ నిడితి నంతఁ దత్పురము చారుమణీయుతి నెంతొ రాజిలెన్. 59
చ. పరశివుఁ గాంచి వేఁడితిని పార్వతినిన్ విధియుక్తిగాఁ దమిన్
సురలు ప్రమోద మంద రిపుసూదన పెండిలియాడవయ్య స
త్వరముగ నన్న శంకరుఁడు త్వన్మతిరీతి నొనర్పు మంచు నా
దరమునఁ బల్క దేవసముదాయముఁగూడి వివాహసిద్ధికై. 60
క. పురమిది తగు నని యెంచితి, మరయం దత్పురవరంబు హారిమణిగణో
త్కరయుతమై హాటకసుం, దరమౌక్తికరాజి నొప్పి తద్దయు వెలిఁగెన్. 61
తే. సకలరత్నంబు లొకమేను సరగఁ దాల్చి
పురవరంబన నాగిరిఁ బొలిచె నేమొ,

యనఁగఁ దనరారె నందు గేహములు దివ్య
మరకతస్థలయుతములై మహితకాంతి. 62

క. కొమరారుచు స్వర్ణస్తం, భములన్ విలసిల్లు నట్టిస్ఫటికంబులకు
డ్యములన్ ముక్తాద్వారచ, యములన్ రాజిల్లుచుండె నభినుత్యములై. 63

ఉ. అందొకమందిరమ్ము తుహినాచలపుత్త్రిక దేవదేవుఁడై
సుందరమూర్తియై మహితశోభల మించు సదాశివున్ మహా
నందునిఁ బెండ్లియాడ మునినాథులసమ్మతి నొప్పియుండె నం
దిందుదివాకరుల్ సమత నిజ్యమణీమయరూపధారులై. 64

సీ. ఆమందిరంబు నింపొమాడ్కి వెలయంగ నొనరించుచుండి; రయ్యనిలుఁ డమల
పరిమళగంధంబు ధరియించుచున్ సుఖసంస్పర్శుఁడై యర్ధచంద్రభక్తి
గనఁబడఁగా వీవఁగాఁ బూనె సంద్రముల్ నాలుగు శక్రాది నాకివరులు
సురనదుల్ గురునదుల్ సురసిద్ధులును మహామునులు గంధర్వులు దనుజరాక్ష

తే. సులు భుజంగులు యక్షులు సురవనితలు
నౌదకంబులు ఖేచరు లనఁగఁ బరఁగు,
ప్రాణులును గిన్నరుల్ మునీంద్రనుతుఁడైన
నారదుఁడు తుంబురుఁడు దేవ చారణులును. 65

క. అనుచరయుతులై వరరత్ననికరములఁ గొంచు మఱి యితరవస్తువులన్
ఘనమూల్యంబులఁ గైకొంచును వచ్చిరి తత్పురంబుఁ జూచెడుకాంక్షన్. 66

చ. శ్రుతితతిగీతముల్ పలుకుచున్ దపమే ధనరాశిగాఁగ ను
న్నతిగను మౌనివర్యులు మనంబులఁ బొంగెడువేడ్కఁ దేవతా
ప్రతతి కధీశుఁడౌ శివుని రమ్యవివాహమునందు మంత్రముల్
హితగతిచేఁ బఠించిరి గిరీంద్రుఁడు సంతసమందుచుండఁగన్. 67

### వర్షర్తువర్ణనము.

వ. జగన్మాతలు, దేవకన్యకలును బార్వతీపరమేశ్వర వివాహంబున మంగళసూచకంబులగు పాటలుపాడిరి. ఋతువులాఱు నానావిధపరిమళకుసుమాన్వితంబులై శరీరంబులు దాల్చి సాక్షాత్కరించె. నీలజీమూతసంకాశంబులై మంద్రనిస్వన ప్రహర్షంబులై మయూరంబులు కేకారవంబు లొనరించుచు నృత్యంబుచేసె. విలోల పింగళస్పష్ట విద్యుల్లేఖా విలాసితంబై, కుముదాపీడశుక్లంబులగు బలాకాగణంబులచే శోభితంబై, ప్రత్యగ్రసంజాతశిలీంధ్రకందళీలతాద్రుమవినిర్గతపల్లవవిభాసురంబై, శుభతమాంబుధారాప్రణయద్రుబోధితమదాలసమండూకకాండనిబిడనిస్వనబధిరీకృతదిగంతరాళంబై, వల్లభవిషయమానోద్ధతమానసనితాంతకామాకులితమనస్వినీగణంబులకుం గూడ మనఃప్రమోదదాయకంబులై,

లై, మానవిభంగహేతువు లగుమయూరకేకారవంబుల ఘూర్ణితగుహాంతరాళంబై, మఱియు వివర్ణోజ్జ్వలరుచిరమూర్తి యగుహాటకకాంతిచేఁ గుటిలంబగుటఁ బయోదసంఘాత సమీపస్థితమహేంద్రచాపంబున విభాసురంబైనయట్టు లొప్పుగలిగి, విచిత్రతమకుసుమవిసరసలిలభవంబు లగుపరిమళంబుల రంజిల్లుచు, ఘనాంబుసంపర్కముగలుగుట సుశీతంబులు నగుచు నొప్పువన వాయువులచే సురాంగనామృదుతమాలకపంక్తిఁ జలింపంజేయుచు, గర్జత్పయోదస్థగి ందుబింబంబై, నానావిధపయస్సంసిక్తరుచిర దూర్వాంకురంబై, సాదరోత్సుకపథికాంగనా నిశ్వాసధూమ్రంబై, హంసనూపురశబ్దాఢ్యంబై సమున్నతపయోధరంబై, చలద్విద్యుల్లతాహారమనోహరంబై, స్పష్టపద్మవిలోచనయుతంబై, యసితజలదబృందాధారచిత్రాంబుహంసంబై, విగళితసలిలధారోత్పాతనమ్రోత్పలాక్షీరుచిరంబై, సురభికుసుమరేణుసంతృప్తసర్వాంగశోభలం బొలిచి, ప్రావృట్కాలంబు పార్వతీపరమేశ్వరవివాహసమయంబున నావిర్భవించె నంత. 68

ఆ. సర్వపరికరములు సమకూర్పఁబడియె దే, వాధినాథు లెల్ల సానుచరులు
గాఁగ సర్వకార్య ఘటనాదరంబుల, నుండి రావివాహ మొప్పఁ గనఁగ. 69

శరదృతు వర్ణనము.

క. ఘనకంచుకనిర్ముక్తయు, వనరుహకోశోపమాన భాసురపీన
స్తనయును మరాళనూపుర, నినాదయును రమ్యదిశయు నిరుపమయునునై.
క. అరుదెంచె శరత్తపు డల, ధరణీధరరాజ మెల్లఁ దగ వెలుఁగొందెన్
సురుచిరవిస్తృతపులినో, త్కరసుశ్రోణియును సాంద్రకాంతియుతయునై. 71

సీ. సస్యనామలసార సగణమేఖలయును సంఫుల్లకువలయ శ్యామలోచ
నమనోహరయు మృదుతమబింబసత్ఫలాధరపుటయునుఁ గుంద దంతహాస
యుతయు నవశ్యామ హితలతాశ్యామరోమసరణివినుతయు; మహితదేహ
హారియు నై శరదూర్భరివిఖ్యాతయౌ ఋతు వొప్పెఁ; జంద్రాంశువితతహార
ఆ. మతికరోరసుస్థ లాభిగామియు నౌచు, వెలయ జనుల నెల్ల నలరఁజేయు
నన్నుమిన్నయట్టు లమరసంఘంబుల, సంతసమునఁ దేల్చె వింతరీతి. 72

క. సమదాళికులోద్గీత, ప్రమదావహమధురనాద భాషిణియుఁ జల
త్కుముదగణచారుకుండల, సుమహితభూషితయు నౌచు శోభిల్లెఁ గడున్.

సీ. హారిరక్తాశోక భూరుహవర్యప్రశాఖోత్థ కాంతకిసలయ లలిత
నిరుపమాంగుళిధారిణియు నశోకప్రసవమయాంబరైకవి భాసురాంగి
యును గోకనదపద యును జాతికాపుష్పమయనఖరాళియు, మహితకదళి
కాస్తంభచారూరు కళితయుఁ జంద్రవదనయు నసమలక్షణనికరయు సు

తే. భూషణాలంకృతయు నయి పొలుపుమిగుల
సానురాగ మనోరమ మానితాంగి
యు నగుకాంతామణియువలె నొప్పి యాశ
రత్తు స్పృశియించె నత్తఱి రమ్యశిఖరి. 74

—హేమంత శిశిరర్తువర్ణనము.—

సీ. నిర్ముక్తనీలాబ్ద నిచయకంచుకపుటయయి పూర్ణచంద్రాస్యయగుచు నసిత
పంకజాక్షియు నయి; భాస్వన్మరీచికాప్రోద్భిన్నపంకజా తోరుకుచయు
నయి బహువిధసుమ నస్సంఘగతరజఃపరిమళసంలగ్న పవనహర్ష
దయునయి కలహంసతతినూపురయు నొచునలశరదంగన యంబికావి
తే. వాహమహమున నెల్లెడ వఱలె; నంత,
మిగులశీతలవారిచేఁ దగినయట్లు
దెసల ముంచుచుఁ జారుకాంతిని వెలయుచు
నలరు హేమంతశిశిరర్తువులటఁ దోఁచె. 75

క. అల రెండుఋతువులును శీ, తలవారిం గురియుచుండఁ దద్దయు నొప్పెన్
గులగిరి యయ్యది సేవకు, వలెఁ గానంబడుచుఁ జూడబహుచిత్రముగన్ 76

ఆ. అట్టితుహినవృష్టి నాహిమవద్గిరి, ఘనసమావృతివలెఁ గానఁబడుచుఁ
గలశవారిపూరకలితదుగ్ధాబ్ధినాఁ, జెన్నుమీఱియుండె నెన్నగుచు. 77

క. ఋతుషట్కము వరుసఁగ నా, క్షితిభృద్వరమందు నలరఁ జెన్నుమెఱసె ను
న్నత సజ్జనోపచార, ప్రతతిఁ గృతార్థుఁడగునీచుపద్ధతి మీఱన్. 78

క. అనయము ప్రాలేయావృత, ఘనశృంగంబులఁదుహినశిఖరివర్యము తె
ల్లనిగొడుగుల నొప్పెడు భూ,పుని చందంబున వెలింగెఁ బొగడం దగుచున్.79

క. సురలకుఁ ద్రిదశాంగనలకు, స్మరభావోద్రేకకర సుమహిత పవనముల్
గిరివరమున నయ్యదనున, సరిగా వీవందొడంగెఁ జంచద్గతులన్. 80

చ. సరసులు నిర్మలాంబువుల సంతతముం బరిపూరితంబులై
యరుదుగ నొప్పుచుండె; మఱి యంబుజ హల్లకముల్ సుగంధసం
భరితములైన పుష్పములు బాగుగ నందుఁ జెలంగుచుండె న
త్తఱుణమునన్ వసంతుఁడు నితాంతము పార్వతిపెండ్లియాతఱిన్. 81

క. తనరుచిరాకృతి మెఱయం, జనుదెంచి మహీధ్రరాజ సానుతలములం
దనుపమగతి నొప్పెను భృం,గనికర మలరారెఁ బుష్పగణసంక్రాంతిన్. 82

సీ. ఉరుతరోద్భిన్నపయోధరాగ్రము లౌటఁ దరుణులవలెఁ రమ్యతరములగుచు
నలరారె సత్సరస్సులు గిరీంద్రమున నాత్యుష్ణశీతాంబువు లొప్పఁ గేస
రాళిచూర్ణంబుల నల్లనఁ గపిలీకృతములౌచు నలరారె; మమతఁ జక్ర
నామకవికిరయుగ్మామలమృదునాదములు చెలఁగఁగసురలతరుణులు

ఆ. ప్రముదితాత్మ లగుచు భాసిల్లిరి; ప్రియంగు, వృక్షములను జాతవృక్షములును
జాతములఁ బ్రియంగుజాతంబు బెదరించు,నట్లు మంజరులను నలరఁ జొచ్చె. 83
క. హిమశిఖరిశృంగములు శుక్లములై కనుపట్టఁ దిలకగణములు పూన్కిన్
విమలసుమోత్కరయుతి సుత, సమితియుతిన్ వృద్ధు లట్లు చక్కఁగఁ దోఁచెన్.
తే. వికసితాశోకలత లొగి వృక్షసంశ్ర
యమునఁ గాంతగళావలంబమున నలరు
కామినులు వోలె వెలుఁగొందె క్ష్మాధరేంద్ర
కూట ముఖభాగములయందుఁ గోర్కు లలర. 85

వ. మఱియు నవ్వసంతర్తువునందు సహకార కదంబ నీప తాల తమాల సరళ కపిత్థాశోక సర్జార్జున కోవిదార పున్నాగ నాగేశ్వర కర్ణికార లవంగ కాలాగురు సప్తపర్ణ న్యగ్రోధ శోభాంజన నారికేళ ప్రముఖ భూరుహప్రకరంబులు పుష్పఫలభరితంబులై మనోహరాకారంబుల నాపర్వతభాగంబుల నెల్లయెడలఁ జూపట్టె. జలాశయంబు లెల్ల సువర్ణతోయపూర్ణంబులై చక్రకారండవ మరాళ సందోహ సంకీర్ణంబులై కోయష్టి దాత్యూహ బలాక యుక్తంబులై నీలోత్పల మీనసంపూర్ణంబులై యలరారుచుండె. ఖగంబులెల్ల నానావిధభూషితాంగంబు లట్లు శరీరంబు లొప్పార, వృక్షశాఖాగ్రంబుల నిలిచి విచిత్రపక్షంబు లొప్పఁ గేళీసమాసక్త ప్రాణేశ్వరులఁ దర్శించుచు, మదనేరితాలాపంబు లొనరించుచు విరాజిల్లుచుండె. ఆహిమశిఖరిమూర్ధంబునఁ బార్వతీవివాహమహంబున సుఖశీతలస్పర్శంబులై వాయువులు వీవఁ జొచ్చె మఱియు. 86

చ. మలయధరాధరేంద్రమున మానుగ నుద్భవ మంది సుందరం
బులు పరిశుభ్రరూపములు పూతసుగంధము లున్నతంబులు,
జ్వలవరపత్రయుక్తములు పావనకేసరపుంజరంజితం
బులు నయి వాయువుల్ ప్రసవపూగము రాల్చుచు వీచె మెల్లఁగన్. 87
చ. ఋతువులు పుణ్యరూపముల నెల్లెడ నొప్పి పరస్పరాశ్రయం
బు తగ వెలింగె; లోకమున భూరినుతిం గనుసత్పదార్థసం
తతి యపుడాగిరీంద్రమునఁ దద్దయు ముద్దులు గుల్కురూపముల్
జతనము మీఱఁ దాల్చి దివిజస్తుతిపాత్రము లౌచు రాజిలెన్. 88
క. అతిశయ మదయుత బంభర, తతి గీతల తాళి సుమవితతి నొండొంటిన్
సతతము భయపెట్టుచు మ్రాఁలతు లెంతయు రాజిలెన్ విలాసము మీఱన్. 89

సీ. నీలాంబురుహముల నీలజలంబులు, గౌరమృణాళైక కాండములను
గౌరపాథస్సులు కమ్రరక్తాంబుజముల రక్తవర్ణాంబువులు ప్రమత్త
బంభరావిలజుష్ట పత్రంబులన్ జేయఁబడియె! నొక్కొకచోట భర్మవర్ణ
కమలముల్ విస్తీర్ణకమోదకంబుల నంతరం బన లేక యలరుచుండె

తే. జారువై దూర్వనాళముల్ చక్కఁగ్రాలు, పంకజంబులు సరసులఁ బ్రబలుచుండె
గొన్ని తావుల; బావులు కువలయముల నబ్జములఁ గూడి రుచిరత నమరియుండె.

క. నానావిహంగ కలరవ, గానంబుల రమ్యపాట కమయవిమలసో
పానంబుల వాపిక లోఁగిఁ, గానంబడె నేత్రములకుఁ గమ్రతరములై. 91

తే. రమ్యపుష్పితకర్ణికారములఁ దుహిన, శైలశృంగము లవిరళ శాతకుంభ
పుష్పసంభరితములుగఁ బొల్పుమీఱెఁ, గనుల కెల్లను విందుగాఁ గానఁబడుచు.

తే. సుంత పూచిన చారుకుసుమ వితతిని
బాటలంబులు హిమశైల భాగములను
గ్రమ్ముకొని గాలిచే వడఁకంగఁ జేయఁ
బడుచు నుండఁగ దిక్కులు వఱలె మిగుల. 93

సీ. కృష్ణార్జునాఖ్య మహీరుహంబులు దశగుణవృక్షముల్ నీలకుజము లాయ
శోకముల్ వికసితసుమ సంతతులతోడ నొండొంటితో స్పర్థనూని యద్రి
వరమున వర్ధిల్లె; సురుచిరపక్షి నిస్వానమ్ములఁ బలాశవనము లందుఁ
గటకభాగంబులఁ గడునిబిడంబులై యలరారెఁ గాన్గుపొదలు శిఖరిని

తే. నెల్లతావుల విలసిల్లి యింపుమీఱి
నుండె; నీలాంబుదౌఘంబు లురుగిరివర
సంధులం దొప్పఁ గువలయసమితిఁ గూడి
యున్న యట్లొప్పె నట్టిమహోత్సవమున. 94

చ. అమలవిశాలశాఖలను హారిసుమాళుల నున్నతంబులై
హిమగిరిఁ దోఁచుచంపకమహీజములన్ హరిచందనంబులన్
భ్రమరసమూహముల్ పికవరంబులు భక్తిని నిస్వనంబులన్
బ్రమదము మీఱఁ జేయుచును బర్వఁగ నద్భుతరీతిఁ గన్పడెన్. 95

క. అనుపమ మృదు కలశబ్దం, బును బరభృతము లొగిఁ జేయఁ బొంగుచు నెమిళుల్
ఘనపక్షంబుల విచ్చుచు, సునాద మొప్పఁగ ధ్వనించె శుంభచ్ఛక్తిన్. 96

చ. వరపికనీలకంఠముల స్వాదురవంబులు ప్రోత్సహింప సుం
దరసుమచాపబాణములఁ దాల్చి యనంగుఁడు నిర్జరాంగనో
త్కరముల నేచఁ బూనె; రవికాంతుల జీవన మింకఁ బల్వలా
ళి రహిఁ దొఱంగ గ్రీష్మము స్వలీల గనంబడఁ జేరె నత్తఱిన్. 97

క. ఋతు వయ్యది సుమవారపి, హితభూరుహగణముచేఁ దుహినగిరిశృంగ
ప్రతతిని నెల్లెడఁ జెలువ, మ్ము తగన్ వర్ధిల్లఁ జేసెఁ బూనిక మీఱన్ 98

చ. ఖరకరుతీవ్రకాంతు లొగిఁ గ్రమ్మెడునామని మీఁదికాలమం
దురుతుహినాచలంబుపయి నొప్పెడు వాయువు లెల్లెడన్ మనో
హరములుగాఁ దనర్చుచు సహర్నిశముల్ వరపాటలాఖ్యస
త్తరువుల పూలవాసనలఁ దార్కొని వీచుచునుండె నొప్పుగన్. 99

తే. అర్జునకదంబపుష్పగంధాత్త తనువు, లలర వీచెడు పిల్లగాలు లవి యెంతొ
హాయిగా నుండె;వాపిక లమలఫుల్ల, పద్మ కేసరయుతి రక్తవర్ణములయి 100
క. కనఁబడుచుండెఁ దటంబుల, ననయము కూసెడు మరాళహారిరవము లొ
య్యన వినఁబడు చుండఁగ స, జ్జను లానందంబుమీఱ స్తవములొనరుపన్. 101
క. కురవకములు కుసుమావృత, శరీరముల బంధరాళి సంతత మొప్పన్
గిరిశృంగంబుల నెల్లెడఁ, బరికింపఁగ నద్భుతముగ భాసిలుచుండెన్. 102
క. క్షితిధరభూరినితంబ, ప్రతతిన్ వకుళములు స్వాదుపరిణతసుమసం
తతి నీనుచుఁ జూడంబడె, నతిశయసమ్మోద మొప్పునట్లుగఁ దగుచున్. 103
సీ. ఈవిధంబున హిమాద్రీశునిపైఁ బుష్పభారవిచిత్రమహీరుహములు
బహువిధవిహగ సుభవ్యనాదాయత దేశముల్, పార్వతీదేవి పెండ్లి
సమయంబునం దప్పు సర్వర్తువులు వెలుఁగొందఁగా మునివీరు లొక్క మొగిని
వచ్చి చేరిరి; భూతివారసమాగమ మిట్టు లొప్పఁగ భూసురేంద్రులార
తే. భూరివాద్యస్వనంబులు బోరుకలఁగ
నేను సౌభాగ్యభరణయుక్తి మేనుపొదల
నలరు గిరికన్యకనుగొని యలవివాహ
నగరమును జొచ్చితిని మహోన్నతవిభూతి. 104

పార్వతీపరమేశ్వరవివాహము.

ఉ. అంతట మౌనిపుంగవస మర్చితపాదసరోజు నంబికా
కాంతుని లోకనాయకునిఁ గాంచి వచించితి నిట్లు శంకరా
సంతతస మొప్ప హవ్యవహు సత్ఫలదుం బ్రణయించి హోమము
త్యంతవిధిప్రకారమున నర్థులఁ గూడి యొనర్తు నిత్తఱిన్. 105
తే. నే నుపాధ్యాయపదవిని బూని యుండు
వాఁడ;నీ వాజ్ఞయిడినచో వహ్నికృత్య
మొనరుతు నటంచుఁ బలుక మహోగ్రతేజుఁ
డమరవరనాయకుఁడు శంభుఁ డనియె నిట్లు. 106
చ. వనరుహసంభవా యెటులు వాంఛయొ తద్విధి నీ వొనర్పుమా
యొనరుప నర్హ మిద్ది యని యూహకుఁ దోఁచిన దానిఁ జెప్పు మ
ప్పనియొనరింతు లోకములపాలన మెయ్యదియో తలంప న
ప్పని భవదాజ్ఞ గా దె జరపందగు నావిని నే ముదంబునన్. 107
చ. ప్రముదితమానసుండ నయి పార్వతిహస్తము శంభుహస్తసం
గమమున నొప్పఁజేయుటకుఁగాఁ గుశలన్ గ్రహియించి యోగబం
ధమున లగింపఁజేసితిని దక్షిణమే జ్వలనుండు హస్తయు
గ్మము నతిభక్తిఁ జేర్చి శితికంఠునిమ్రోలను నిల్చి నంతటన్. 108

క. శ్రుతిగీతమహామంత్ర, ప్రతతులు మూర్తులు ధరించి భవుముందట స
మ్మతి నిల్చె నంత విధియుతి, హుతవహు కుండంబునందు నుత్కంఠ తగన్.

వ. ఘృతహవిస్సుల వేల్చితి. శివునిచే నగ్నికిం బ్రదక్షిణంబు చేయించితి. పార్వతీపర మేశ్వరహస్తబంధనము వదలించి సర్వదేవతలం గూడి సనకసనందనాది మానస పుత్త్రులం గలిసి సిద్ధులు సహాయు లగుచుండఁ బరమానంద కందళితాంతరం గంబున వివాహవేదిక వృషభధ్వజునకు నమస్కరించి గౌరీశంకరులయోగం బున నేవివాహంబు పూర్తికావించితి. ఇతరదేవత లావివాహరహస్యం బెఱుంగరు. ఇది పార్వతీపరమేశ్వరవివాహమహోత్సవ చరితంబు, పరమ పావ నంబు, పాపవిధ్వంసకంబు నగు నని పలికి బ్రహ్మ మునులకు మఱియు నిట్లనియె.

---

## ముప్పదిరెండవ యధ్యాయము.

ఈశ్వరుని దేవతలు వినుతించుట.

చ. పరశివుఁ డద్రిపుత్త్రికయు భవ్యవివాహమహోత్సవంబు ని
ర్జరవరు లెల్ల మే లనఁగ సాగఁగఁజేయఁగ నింద్రముఖ్యులౌ
సురలు ప్రహర్ష మొంద శ్రుతిశోభితవాక్కుల నాపరాత్పరుం
బరశివు సన్నుతించి రిటు వందనపూర్వముగాఁగ భక్తితోన్. 111

సీ. పర్వతలింగుఁడు పర్వతేశ్వరుఁడును బవనవేగుఁడు స్వరూపరహితుండు
నజితుఁ డక్లేశుఁడు హర్షప్రదుండును నీలశిఖండుఁడు నిత్యుఁ డంబి
కాధిపుఁ డనిలరూపాధికుండును శతరూపుండు భైరవరూపుఁ డమల
వహ్నినేత్రుండును వర్ణితరూపుఁడు వేయినేత్రంబుల వేయిపాద

తే. ములను విలసిల్లి సురరూపమునఁ జెలంగి
వేదముల కంగభూతుఁడై వెలసి శతమ
ఖునికరంబుల స్తంభించి వినుతవేద
వితతి కంకురభూతుఁడై సతము తనరి. 112

క. చరమునకు నచరమునకున్, బరమేశ్వరుఁడై శివాఖ్య భాసిల్లుచుఁ బు
ష్కరరాశిలింగుఁడై యీశ్వరుఁడై లయకర్త యగుచు సద్వంద్యుండై. 113

సీ. మఱియుఁ గపాలాళి మాలికాలంకృత కంఠుఁడై, దండియై గదియు నగుచు
హస్తంబులం గపాలావళి ధరియించి, తత్సూత్రవితతిని దాల్చి లోక
ములకు నాథుండయి యలరుచుఁ, బశులోకరతుఁడయి ఖట్వాంగరమ్యహస్తుఁ
డై ప్రణతార్తిసంహరుఁ డయి మఖశిరోహంతయై కృష్ణకేశాపహరణుఁ

తే. డగుచు భగనేత్రభేత్తయై తగి సుపూర్ణుఁ
డగుచు దంతహరుండయి యసిపినాక
శూల ముద్గర ఖడ్గముల్ సొరిదిఁ దాల్చి
కాలకాలుండు శుచినేత్రకలితుఁడు నయి. 114

క. అంతకునకు నంతకుఁడై, చింతింపం దగనిభూతిఁ జెలువారుచు శ్రీ
కాంతగళుఁడయి భూధర, కాంతనివాసుండు నగుచుఁ గడు మహితుఁడునై.

వ. సువర్ణరేతసుండు, కుండలధారియు దైత్యయోగనాశకుండు, యోగియు, గురువును, శశాంకాదిత్యనేత్రుండు, లలాటనయనుఁడు, శ్మశానరతుండు, శ్మశానవరదుండు, నవనీతనాశనుండు, వ్యంశకుండు, నశనీశతహాసుండు, సర్వేశ్వరుండు, గృహస్థసాధువు, నిత్యుండు, జటి, బ్రహ్మచారి, ముండార్ధముండుండు, పశుపతి, సలిలతప్యమానుండు, యోగైశ్వర్యప్రదాయకుండు, శాంతుఁడు, దాంతుఁడు, ప్రళయోత్పత్తికారియు, ననుగ్రహకర్తయు, స్థితికర్తయు, రుద్రుండు, వసువు, నాదిత్యుం, డశ్వియుఁ బితయు, సాంఖ్యుండును, విశ్వేదేవుండును, శర్వుం డుగ్రుండు, శివుండు, వరదుండు భీముండు సేనానియుఁ బశుపతియు, శుచియు, వైరిహరుండును సద్యోజాతుండును, మహాదేవుండును జిత్రుండును, శూలియుఁ బ్రధానుండు, నప్రమేయుండు, కార్యకారణుండును, బురుషుండు, పురుషేచ్ఛాకరుండును, బురుషసంయోగప్రధానగుణకారియుఁ బ్రకృతిపురుషప్రవర్తకుండు, కృతాకృతకర్తయు, ఫలసంయోగదుండును, గాలజ్ఞుండు, సర్వనియమకారియు, వైషమ్యకర్తయు, గుణవృత్తిదాయకుండు, దేవదేవేశుండు, భూతభావనుండు, సౌమ్యముఖుండు నగు భగవంతునకు నమస్కరింతుము. మహాత్మా శంకరా! మా యపచారంబుల క్షమించి మమ్ముం గరుణింపు మని ప్రార్థించి రని మునులకుం దెల్పి విరించి మఱియు నిట్లనియె. 116

చ. సురవరు లిట్లు తగ బొగడ సూర్యశశాంకధనంజయాంబకుం
డురుకరుణాపయోధి భుజగోత్తమహారవిభూషి తాంగుఁ డా
దరమున దేవతావరులఁ దాఁ గని యిట్లు వచించెఁ బ్రీతి; ని
ర్జరవరులార! తీక్ష్ణముఖసంయుతి మీయెడనుందు నొక్కటన్. 117

తే. సౌమ్యముఖసంగతిని జూడఁ జాలియుందు
నొక్కతఱి మీయెడన్ నేను నురుతరకృప
నిపుడు వరమీయఁ బూనితి నింక మీరు
సంశయింపక గోరుఁడు సద్వరముల. 118

క. అనవిని దేవత లెల్లను, మనములు సంతోషవార్ధి మగ్నంబులు కాఁ
గ నపుడు త్ర్యంబకునకు వం, దనములతోఁ దెల్పి రిట్లు తమవాంఛితముల్.

చ. పరశివ నీసహాయ మెటువంటిది కావలె నంచు మామదిన్
బరఁగునో వాంఛ దానిఁ దగుభంగి నొసంగ వరంబు నిమ్ము స
త్కరుణను మేము గోరుతఱి దానిని దీర్పఁగ నంతదాఁక నీ
పరిసరమందె యుండఁగను బార్వతినాథ యనుగ్రహింపుమా 120

చ. అనవిని శంకరుం డటులె యౌ నని దేవవరాళి నంపి మా
నినికరసంయుతుం డగుచు నెమ్మి గణంబులఁ గూడి మందిరం

బున కరిగెన్; మహామునిసమూహములార! సురద్విజాతు లో
య్యన వసియించుచోటఁ బరమాత్ము మహోత్సవగాథ దీనినిన్. 121

క. వినుతించునొ గానము చే,యునొ వాఁడసమానవిభవ మొప్పఁగఁ బ్రమథా
ళిని ముఖ్యుఁడగుచు నంతం,బున మోక్షసుఖంబు నొందు మునివరులారా. 122

క నరుఁ డెవఁ డీ స్తవము మహా, దరమున వినునో సుభక్తిఁ దాఁ జదువునొ యా
నరుఁ డఖిలపుణ్యభూముల, కరిగి సురార్చితుఁడు నగుచు నట వసియించున్.

## ముప్పదియాఱవ యధ్యాయము.

### శివనేత్రవహ్ని చే మన్మథుఁడు దహింపఁబడుట.

చ. ధరణిధరేంద్రపుత్త్రియును దాను గిరీశుఁడు సౌధమందు నా
స్తరణవరంబునన్ మునివితానముతో నుపవిష్టుఁ డయ్యె న
త్తరుణమునందు మన్మథుఁడు తా మును పూనినక్రోధయుక్తి శం
కరునకుఁ బీడగల్గుటకుఁ గార్యము దేనిని జేయ నౌనొకో. 124

చ. అని మది నెంచువానిని దురాచరణున్ గుమతిన్ గులాధమున్
మునికృతసత్తపోనియతి మోదమునం జెఱుపంగ నెంచుమూ
ర్ఖుని సకలాంగసంవరణ కుత్సితు లోకసమూహముం దపిం
చునటులు చేయ నెంచు పరిశుష్కకృపున్ నియమవ్రతాంతకున్ 125

తే. అలరి చక్రాహ్వయునిరూప మంది రతిని, గలిసి వచ్చినమదనునిఁ గాంచి తన్ను
గినుక బాధింప వచ్చిన కృత్రిమునిగఁ,దలఁచి భూసురులార! తద్దర్పమడఁప. 126

చ. తనమది నెంచి కోపమునఁ దన్నుఁ గ్రుధంగొని పీడచేయవ
చ్చెను గదయన్న యూహఁ గొని శ్రీగళుఁ డగ్నిమయాంబకంబుఁ జ
య్యన వికసింపఁ జేసి కనె నప్పుడె తన్నయనప్రభూతుఁడౌ
ననలుఁడు తీవ్రరోచులసహస్రము లొక్కటఁ బర్వుచుండఁగన్. 127

చ. రతిపతిదేహ మొక్కమొగి రాజధరాజ్ఞను గాల్చె నంతలో
మతివినయంబుతోఁచిన రమాసుతుఁ డో శివ శంకర భవ
ద్వితతమహత్త్వ మెన్నక కువృత్తినిఁ బీడయొనర్ప నెంచితిన్
రతిపయినైన సత్కృప ధరాధరవాస! మహాత్మ కావవే. 128

చ. కరుణచెలంగఁ దప్పులను గైకొన కర్మిలిఁ బ్రోవుమా నిరం
తరకరుణాలవాలుఁడవు దాంతుఁడ వీవె కదా యటంచు నా
తురమునఁ బల్కుచున్ శివునితో మొఱపెట్టెడువానిపోల్కి నా
స్మరుఁడు ధరాస్థలిం బడియె; సప్తమయూఖుఁడు తన్ను నేఁచఁగన్. 129

ఆ. లోకతాపనుండు ప్రాకటశౌర్యుండు, వేగ మూర్ఛనొందె; విషమనయను
కంటిమంటచేతఁ గడువడి మ్రందిన. ప్రాణనాథుఁ గాంచి రతియు వగల. 130

చ. కనుఁగొను వారిచిత్తము వికావికలై కరుణార్ద్రమై తగన్
వనటఁ గలంగి యేడ్చెఁ ధరవర్యకుమారిని పార్వతీవిభుం,
దనదురవస్థఁ బాపుఁ డని తత్పరతన్ గయిమోడ్చి వేఁడె నె
వ్వనికయినన్ దదీయదురవస్థఁ గనం దగియుండ దయ్యెడన్. 131
మ కరుణాపూర్ణమనస్కులైరి హిమవత్కన్యాగిరీశుల్ మనో
హర తద్వాక్కులు దీనవృత్తిఁ గని చింతాంభోధిమగ్నంబులై
పరఁగన్ శ్రోత్రము లీరతిప్రహితశుం భద్వాక్కులన్ విన్న మీ
కరయంగా ననుకంపతోఁ బదొకో యాహాయంచుఁ దెల్పెం దర్వన్. 132
క. తనుముందట నీలాగున, భ్రమ చెందినయట్లు దెసలఁ బ్రాఁకుచు రతి యా
సుమశరుని కళేబరమును, మమతం గని యేడ్చుటఁ గని మదులు ద్రవింపన్.
తే. ఊఱడించుచుఁ బల్కి రో యువిద మదనుఁ
డిచట దగ్ధాంగుఁడయ్యె మ ఱితఁడు తనువుఁ
గనఁగఁజాలఁ డనంగుఁ డయ్యును సుమంగ
ళాంగి తీర్చును గృత్యాళి ననుపమగతి. 134
వ. అంతనీశ్వరుండు మఱియు నిట్లనియె.
క. ఏతరుణంబున విష్ణువు, భూతలమున యదుకులమునఁ బుట్టువుఁగని వి
ఖ్యాతిని వసుదేవసుతుం, డై తగ వర్ధిల్లు నప్పు డాహరిసుతుఁడై. 135
క. నీపతి పుట్టంగలఁ డీ, తాపమ్మును వదలియుండఁ దగు నీ కనియా
పాపవినాశకుఁ డాడిన, నాపడఁతియు సద్వరమ్ము నందె నిటు తగన్. 136
ఆ. కామపత్ని యంతఁ గడుఁదమి మోమెంతో, కళల నీనుచుండఁగా గతక్ల
మయయి ప్రీతియుక్తమానస యగుచు ని, ష్టంబురీతిఁ జనియె సరభసగతి. 137
చ. స్మరుని జగత్ప్రతాపకుని జంచదుదగ్ర నిటాలనేత్రవి
స్ఫురదనలార్చిఁ గాల్చి హిమభూధరపుత్రికఁ గూడి భూరిభూ
ధరవిమలప్రదేశములఁ దత్సమయానుగతిన్ మహేశుఁ డా
దరమున నుండెఁ; గందరవితానములం గమలాకరంబులన్. 138
చ. సరసుల నిర్జనస్థలులఁ జారుతరామల కర్ణికార భూ
మిరుహ వనంబులన్ మిగుల మేలగుశైవలినీతటాళిఁ గి
న్నరవర నిర్మితస్థలగణంబుల శృంగతటాక రాజి సుం
దరపతగౌఘచంపకవనంబులఁ బావనతీర్థపేటికన్. 139
సీ విద్యాధరావృతవిమలదేశంబుల, గంధర్వదేవయక్షగణసేవి
తస్థలంబుల, నుమాతరుణీయుతుం డయి విహరించె శంభుఁడు వేడ్క మిగుల;
నాకతతి మునులు యక్షకదంబములు శతమఖముఖదేవతల్ మహిమములను
దనరుసిద్ధులును గంధర్వవిద్యాధర దైత్యముఖ్యులు మఱిదాంతులైన

తే. యట్టిదేవర్షులుం దను నాదరమునఁ, గొలువఁ బర్వతపుత్త్రిని గూడి శివుఁడు
హర్ష మొందుచు నుండె దేవాంగన లొగి, నాడ గంధర్వు లాదృతిఁ బాడిరపుడు
క. మునులగు భూదివిజులు ధ్యా, ననిరతిఁ బూజించి రెలమి నాకులు సురనా
థుని గాంచి వాద్యముల మ్రో, గను జేసిరి భక్తి స్తోత్త్రగణముల శివునిన్. 141
ఆ. అలరఁ జేసి; రిట్టు లామహాదేవుండు, స్వగణసహితుఁ డగుచుఁ జాల హర్ష
మొందె శక్రముఖుల నొగిఁ గేలిసేయుగ, ణాధిపతులు వెలసి రచటఁ గడఁక.
క. పరశివుఁడు పార్వతికి హ, ర్షరతిం గల్గింపఁ దుహినశైలంబును న
త్తరుణంబున వీడక కా, పుర ముండెను సర్వసమతఁ బొల్చెడు కానన్. 143
చ. అనవిని మౌనులెల్లఁ జతురానన! కామహరుండు శైలరా
ట్తనయను గూడి యగ్గిరి నుదారవిభూతి వసించి యెట్లు లో
కనికర మేలె నావిధముఁ గర్ణసుఖంబుగఁ జెప్ప మే మొగిన్
వినఁగఁ దలంతు మన్న విధి వేడుక నిట్లని పల్కె భక్తితోన్. 144
చ. పరశివుఁ డాహిమాద్రిపయిఁ బావనశృంగమునన్ హిమాద్రిజా
పరియుతుఁడై వసించెఁ దనభార్య మనఃప్రియకృత్య మున్నతిన్
గర మొనరింపఁగాఁ దలఁచి కమ్రతరాకృతు లొప్పఁగా గణే
శ్వరముఖు లెల్లఁ గొల్వ మునివర్యులు భక్తి నమస్కరింపఁగన్ 145
క. * అనుదినము క్రొత్తసంతస, మును గూర్చుచు నుండె; దేవి మోదం బందం
గను బాలచంద్రతిలకుఁడు, దిన మొకరూపంబుఁ దాల్చు తెఱఁగునఁ గనన్నై.
ఆ. గొప్పయనుభవంబు నెప్పు డేరూపంబు, వలసినను గొనంగ వఱలు శక్తి
సర్వవేత్తృతయును సామర్థ్యమును గల, భక్తు లెల్లఁగొల్వఁ బరమశివుఁడు.
క. అలరుచునుండె; నదొకపరి యలపార్వతి తల్లి మేనకాంబ యనఁగ ను
జ్జ్వలతేజ మరల నొప్పెడు, లలనామణిఁ గనఁగ మది విలాసము మెఱయన్.
చ. చని కనకాసనంబున నెసంగెడు దేవిని లోకమాతనుం
గని మదిఁ బొంగు వేడుక నికామవిధిప్రహితాభివాదనం
బున నలరించె; నాతుహినభూధరురాణియు నిట్లుపల్కెఁ బ్రీ
తిని జిరకాల మయ్యె నినుఁ దృప్తిగఁ గాంచి కుమారికామణీ. 149
క. చిరకాలమునకు నిచ్చటి, కరుదెంచితి వమ్మ నిన్నుఁ దగుప్రాణేశుం
బరమాత్మునిగాఁ దలఁచుచు, నిరతము విహరింతు వీవు నెమ్మితలిర్పన్. 150
తే. ఎవ్వరు దరిద్రులో మఱి యెవ్వ రాశ్ర
యవిరహితులో కుమారికా యట్టివారె
నీపతివలెనె విహరింత్రు నేర్పుమెఱయ
ననుచు నొకభంగిఁ బలుకంగ వినుచు గిరిజ. 151

* దేవీంబాలేందుతిలకో రమయంశ్చరరామచ = అనిమూలము.

చ. జననిని గాంచి వేడ్క గనఁజాలని చిత్తముతోడ నొప్పి యిం
తనివచియింపరానిక్షమ యాత్మ చెలంగఁగ నించుకేని ప
ల్కను దమి మానియుండె; నిటు ఖండశశాంకధరార్ధదేహయా
జననియు సాగ నంపఁ జని శంకరునిం గని పల్కె నివ్విధిన్. 152

మ. పరమేశా సురనాథ యిందు నివసింపన్ వేడ్క తీఱించె ని
ర్జరసంఘావృతమై నివాసమునకున్ జానైన భాగంబు స
త్వరమే యేర్పఱుపం దగున్ మహితమౌ ధామంబునన్ నిల్వ నా
తురతం బొందు నను న్దయం గనుము యోధూతాఘరాశీ యనన్. 153

చ. హరుఁడిటు పల్కె వేఱొకట నంబికరో వసియింపఁగోర వే
తరుణమునందు నీశిఖరితల్లజమందె వసింపఁ గోరుచుం
దు రమణి యెట్టివేళలను దోఁపదు నీయెద నిట్టియూహ యి
క్కరణిని గల్గునంచు నిదకారణసంభవ మేమిహేతువో. 154

క. ఈతరుణంబున నీవే, భూతలమున నొండుచోటఁ బూనిక నుండన్
జేతస్సునఁ గోరుట కే, హేతువొ సుస్మితముఖాబ్జ యెఱిఁగింపు మనన్. 155

సీ. కాత్యాయనియు నిట్లు కామహరుం గాంచి పలికె; నాథా నేను బరమవిభవుఁ
డగు తండ్రియింటికి నరిగితి నటఁ దల్లిఁ గనుఁగొంటి నేకాంతముననె నేను
మరియాదయొప్పంగ; దరహాసయుక్తమౌ కరణి నిట్లని మేనకయు వచించె
నాతి నిస్వక్రీడనంబులఁ బతిఁగూడి విహరింతు వీక్రీడ విబుధులందుఁ

ఆ. గానఁబడదటంచుఁ గరుణలేకయె పల్కె, నోమహాత్మ నీవు ధీమహితుఁడ
వఖిలగణము లొప్ప నద్రిపైఁ గ్రీడింపఁ, దల్లిమదికి నిదియుఁ దమిఁ గొలుపదు.

చ. అనుటయు నల్లనవ్వి ప్రమథాధిపుఁ డాగిరిరాట్కుమారి నొ
య్యనఁ బరిహాసముల్ పలుక నాత్మఁ దలంచి వచించె నిట్టు లో
వనితరో తల్లి చెప్పినది భవ్యమెయౌ నొకసందియంబు లే
దనిమది నమ్ము; నీదుపతి హస్తివిభూత్తమ చర్మధారియౌ. 157

సీ. వస్త్రవిహీనుఁడు వస్త్యవిరహితుఁడు వనముల గుహలఁ బర్వతములందు
సంతతముండు శ్మశాననిలయుఁడును, నగ్నులై తనరుగణంబు లెల్లఁ
గూడిరాఁ దిరుగుచుఁ జూడ నసహ్యమౌ నాకారమున నొప్పు నంబుజాక్షి!
తల్లిపైఁ గోపింపఁ దగదు సత్యంబు నే వచియించె నీతల్లి వసుధయందుఁ

తే. దల్లి కీడగు బంధువు తలఁప నెందుఁ, గానరా దెట్టివస్తువం దైనఁగాని
యనెడు నాథునిఁ గాంచి యిట్లనియెగిరిజ; బంధువులనుండి కాఁదగుపనియె లేదు.

క. ఇసుమంతయైనఁ గార్యము, పొసఁగదు నాకిందు నోత్రిపురనాశన యె
ట్లు సుఖము నాకొదవునొ యెం, దసమానవిలాసకేళి యలరునొ యచటన్.

క. నను నివసింపం జేయుము, యని పార్వతి వేఁడ దేవతాధీశుఁడు నె

ష్ఠనమునఁ దత్ప్రియమును గూర్పనెంచి యచ్చోటువాసి పర్వతనాథున్.160
ఆ. మామ వదలిపెట్టి మహితమై విబుధేంద్ర, సిద్ధకిన్నరాది సేవిత మగు
మేరుభూధరమున వారిజాక్షిం గూడి, స్వగణయుక్తుఁ డగుచు శంభుఁడుండె.

## ముప్పది యేడవ యధ్యాయము.

### గంగాద్వారమున దక్షుఁడశ్వమేధము జేయుట.

క. అనవిని మౌనులు పంకజ, జనిఁ గని ప్రాచేతసుఁ డన శాశ్వతకీర్తిం
గనినట్టి దక్షుఁ డతిభ, క్తిని జేసెడు క్రతు వదేల తీవ్రవిధిహతిన్ 162
తే. నాశ మొందెను? దక్షుఁడు నాకవాసు
లందు నగ్ర్యుండు గాదె ప్రయత్నమతని,
దయ్యు వైవస్వతుని దగు నంతరమున
విఘ్న మొందఁగ నేలొకో విస్తరింపు 163
చ. క్రతు వది యీశపత్నియయి ఖ్యాతిని మించిన యాసతీక్రుధన్
వితతమునీంద్ర బృంద పరివేష్టిత మయ్యు వినాశ మొందెఁగా
శితిగళుఁ డేల యాగ్రహముఁ జెంది మహత్తర తేజుఁడౌ ప్రజా
పతి మఖమున్ హరించె ననిప్రాగ్వదితం బయియుండు నోవిధీ. 164
తే. తా మహాదేవుఁ డయ్యు నత్తఱి నదేల
యాగ్రహించెనొ శంకరుఁ డవ్విధంబుఁ
దెలుపుమా యన్న మౌనుల పలుకులు విని
పంకజాసనుఁ డివ్విధిఁ బలికె నపుడు. 165
చ. మునివరులార! యాశివుఁడు పూనికమీఱఁగఁ గ్రోధయుక్తుఁడై
వనితపయిం గలట్టితమి వారక తత్ప్రియదంబు తీర్పఁగా
మనమున నెంచి యజ్ఞమునఁ మానుషశక్తి నడంచె నవ్విధం
బును వివరింతు; మేరు వసుభూధరవర్యము పొల్చునే కదా. 166
ఆ. మూఁడులోకములను బూజితంబగు దాని
శృంగ మలరు నప్రధృష్య మగుచు
శుభమణీయుతంబు జ్యోతిస్థలంబు నాఁ
నమరు నప్రమేయ మగుచు నెపుడు. 167
సీ. లోకవంద్యంబయి ప్రాకటమహిమము వెలయనొప్పుచునుండు విబుధజుష్ట
మగుచుఁ; బూర్వము శివుఁ డమలధాతువిచిత్రిత మగునాశృంగమం దమరవరులు
తన్ను సేవింప నుద్దామమహత్త్వంబుపొలయుటఁ బర్యంకమువలె నద్ది
యరుదార నందు సమాసీనుఁడై యుండె భార్యయు సతతంబు పార్శ్వమందె.

తే. యుండ నాదిత్యు లతితేజ మొప్ప నెసఁగు
వసువు లమరుల వైద్యులై వఱలు నశ్వు
లల్లె గుహ్యకపరియుతుండై తనర్చు
నట్టి వైశ్రవణుండు యక్షాధిపుఁడును. 168

క. పరమేశ్వరు దివ్యశ్రీ, చరణాంబుజయుగము భక్తి సాంద్రమనములన్
నిరతము ధ్యానించుచు నుండిరి సేవయె ముక్తి యనుచు నెఱనమ్మి తగన్. 169

క. మహితద్యుతియగా భార్గవుఁ, డహితవినాశకుఁడు గొల్వ నరుదెంచెను లో
కహితము గోరుమహామును, లహిభూషణుఁ గొల్వ వచ్చి రాసమయమునన్.

క. మునివర్యు లగుచు వెలసిన, సనత్కుమారాదులైన శాంతధనులు చ
య్యన వచ్చి రంగిరఃప్రము, ఖనిర్జరర్షులు మహర్షిగణములు పెలుచన్. 171

సీ. విశ్వావసువునాఁగ వెలయుగంధర్వుఁడు తుంబురునారదుల్ తోరపుగతి
వచ్చిరి; దేవతావనితలు నర్తించెఁ బరిమళమిళితమై పరమసుఖద
మై పరిశుద్ధమై యలరు వాయువు వీచె; సర్వర్తుకుసుమవిసరము లమర
ఫలము లొప్పారఁగఁ బావనవనతరువ్రాతంబు లమరె; విఖ్యాతులైన

తే. సాధ్యవరులు విద్యాధరుల్ సాధుమునులు
సిద్ధు లప్డు మహాదేవు శీఘ్రఫలదుఁ
బశుపతిని త్ర్యంబకుని మహాభక్తిఁ గొల్చు
చుండి రావేళ సాధుభూతోత్కరంబు. 172

క. నానావిధరూపంబుల, శ్రీనిలయుని గొల్చె రూపసిద్ధి వెలయఁగా
దానవులు పిశాచంబులు, నానాయుధములను దాల్చి నవ్యప్రీతిన్. 173

క. పురహరుని గొల్చుచుండిరి; సరిసేయఁగరాని మహిత శక్తిం దగునా
పరశివుని వహ్నితేజస్స్ఫురణమునం దగినమునులు పూజించి రొగిన్. 174

చ. తనదగు దివ్యతేజమునఁ దద్దయు వెల్గు త్రిశూలముం గరం
బున ధరియించి శంకరుని భూరితరాజ్ఞను మౌళిఁ దాల్చి ని
ల్చెను దమి నందికేశ్వరుఁడు సిద్ధగణాధిపసేవితుండు గా
వున సురదానవావళుల బుద్ధిబలంబున లోఁగఁ జేయుచున్. 175

తే. సర్వతీర్థజలోద్భవసారమహిమ,మున విరాజిల్లుగంగయు మూర్తిఁ దాల్చి
చంద్రమౌళిని సేవించె సాధుభక్తి,నిట్లు భగవంతుఁ డౌపార్వతీశ్వరుండు. 176

చ. సురమునిదేవతావళులు చొక్కపుభక్తిని దన్నుఁ గొల్వ ని
ర్జరపతి జ్ఞానదాత మునిసంఘసమర్చితుఁ డౌచు నుండె నా
తరుణము హాయిగాఁ గడచెఁ దత్త్వము శంకరుఁ డొప్పఁ జెప్పఁగా.
గిరివరశృంగ మట్లు పరికీర్ణసురర్షిసమూహమై తగన్. 177

తే. కొంతకాలము గడువ దక్షుం డనంగ,
నలరునట్టి ప్రజాపతి యర్హవిధిని
భూరిహయమేధమును జేయఁబూని వేల్పు
చుండె; నాయజ్ఞమున దేవతోత్తములును. 178

క. సురపతిముఖు లెల్లను నిర్జరపురమును మాని యభ్రసరణి విమానో
త్కరముల నగ్నిప్రభములఁ, బరమాదృతి నెక్కి యజ్ఞవాటంబునకున్. 179

క. అనలసమానప్రభ లొయ్యనఁ బర్వఁగ వచ్చి నిల్చి రాగంగాద్వా
రనియతదేశంబున; సుర,వనితామణు లెల్లఁ బ్రీతి వచ్చిరి మఱియున్. 180

సీ. గంధర్వు లప్సరోగణములు నిండఁగా బహువిధద్రుమలతల్ వరుస వెలయ
మునిసంఘపరివృతము నయి తన్మఖవాట మమరె; ధర్మాత్ములయందు మేటి
యగు దక్షుఁ డంబొప్పె; నవనిపై నంతరిక్షమున స్వర్గంబునఁ గ్రాలువార
లెల్లఁ బ్రాంజలులయి యెలమి నచ్చట నుండి రాయజ్ఞమహిమను నర్హరీతి

తే. గాంచు వేడుక; నాదిత్యగణము వసువు, లామరుత్తులు సాధ్యు లబ్జాక్షుఁ గూడి
యజ్ఞభాగంబులం గొన నరుగుదెంచి, రామఖంబున సోమపు లాజ్యపులును. 181

క. మరుదోఘం బశ్విద్యుగం, బురుతరమహిమాతిశయత నొప్ప త్రిదశు లీ
ధరణిఁగల సాధుభూతో, త్కరములు తన్మఖముఁ జూడఁగా నరుదేరన్. 182

వ. జరాయుజంబు, లండజంబులు, స్వేదజోద్భిదంబు లామహాత్ముని సంకల్పబలంబున నాహూతంబులై తత్తత్కార్యంబుల నియుక్తంబులై యుండె. దేవతలు భార్యలం గూడి వచ్చి వేడుకం జూచుచుండిరి. మహర్షులు శిష్యసహితులై వచ్చిరి. నిర్జరోత్తములు దివ్యవిమానారూఢులై ప్రదీప్తాగ్నులంబోలి తేజంబుల వెలుంగుచుండి రంత. 183

చ. [మునివరుఁ డౌదధీచి మునిముఖ్యులఁ గూడి తదీయమహామఖం
బునకు శివుండు రాకునికి పోల నెఱింగి సురర్షిముఖ్యులం
గనుఁగొని యిట్లు పల్కె మునికాండములార! మహామఖంబునం
గనుఁగొన రాదు శంకరునిఁ గారణమేమొ యెఱుంగ రాదుగా. 184

క. పరశివుఁడు యజ్ఞనాయకుఁ, డరయంగా నతఁడు లేని దది యధ్వర మె
క్కరణి నగుఁ దద్విహీనా, ధ్వర మెట్లల రారుఁ జెపుఁడ తద్విధ మెల్లన్.] 185

క. నరుఁ డెవఁ డపూజ్యపూజన, పరుఁ డగునో పూజ్యులైన పరమాత్ముల నే
నరుఁ డర్చింపఁడొ వారలు, నరకమునం బడుదు రనుట న్యాయహితంబౌ.

క. అనిపలికి దధీచియు దక్షునిఁ గన్గొని మరలఁ బలికె సురనాయకుఁ బూ
జ్యుని బశుపతిఁ బరమేశ్వరు, ఘనకరుణానీరరాశిఁ గ్రవ్యాదహరున్. 187

తే. ఏల పూజింపవో తెల్పు పోల ననఁగ
దక్షుఁ డిట్లని పల్కె; రుద్రగణ మెంతొ

గలదు, వారెల్ల శూలహస్తులు కపర్ద
ధరులు పదునొక్కపదములఁ బరఁగువారు. 188
క. వీరలకంటె మహేశ్వరు, నారయఁగాఁ జాల; నొకనిఁ ననఁగ మునివరుం
డీరీతిఁ బల్కె నిర్జర, వారంబునఁ గల్గువిభులు వచ్చిరి కాదే. 189
తే. నీవె పిలిపించితివిగాదె నిర్జరేంద్రు, లను మహాప్రీతి శ్రీశంకరుని నదేల
పిలువఁ బంపవో; శంకరు విడిచి యన్య, దైవతంబును నధికునిఁ బావనమతి.
క. కనుఁగొనఁజాలను; గావున, ననుపమమఖ రాజ మిద్ది యర్హావిధిని వి
ఘ్ననిచయ మొందక పూర్తిం, గనదని నేఁదలంచువాఁడఁ గారణయుక్తిన్.191
చ. [అనవినిదక్షుఁడిట్లనియె యజ్ఞవిభుండయి లోకనాథుఁడై
వనజదళాక్షుఁడైన ఖగవాహనుఁ గూర్చి విధిప్రయుక్తమై
ఘనతరమంత్రపూతమయి క్రాలు హవిస్సు సువర్ణపాత్రమం
దున నిడి భక్తి నిచ్చెదను దోఁపదు శంభున కీయ నీయెడన్.] 192
చ. [మునివర! లోకనాథుఁడు త్రిమూర్తులలోఁ బ్రథముండు నా నుతిం
గనిన సరోజనేత్రునకుఁ గాని మఖాంశ మ దన్యదేవతల్
గొనఁదగు నంచు నేవిధియుఁ గోరదు తెల్పఁగ నట్లుకాన వి
ష్ణున కిడువాఁడఁ జక్రియె కొనున్ మఖభాగము నర్హుఁడౌటచేన్. 193
ఆ. శంకరునకు నెట్లు సవనభాగం బీయ, నర్హమగును? నాఁగ నమరు లెల్ల
నెఱిఁగి భాగముల నదెట్లొ కైకొని చని,రంత నుమయుఁ బతికి ననియె నిట్లు.
చ. జనకునియజ్ఞముం గనెడు సంతస మొప్పఁగ నేగు శక్రము
ఖ్యనిఖిలదేవతావళుల నారయఁజాలక ప్రాణనాథ! దే
వనికర మేగుచున్నయది వైభవ మొప్పఁగ నేమికోరియో
వినమది వేడ్క గల్గె శ్రుతివిస్మృతశక్తివి గానఁ జెప్పవే. 195
ఆ. సంశయంబు మదిని జాల బాధించెడు, దానిఁదీర్ప నీవె తగినవాఁడ
వన మహేశ్వరుం డహార్యతత్త్వవిదుండు, వినుము దేవి దక్షుఁడనఁగ నెగడి.
సీ. తా మహాభాగుఁ డుత్తముఁడు ప్రజానేత యయివిరాజిల్లు మహాత్ముఁ డతఁడు
హయమేధ మొనరింప నమరు లచ్చటి కేగుచున్నవా రన దేవి యొప్పఁబలికె
నోమహాభాగ యాయుత్తమక్రతువున కేలపోవరో మీర లేనిమేధ
మున గమనంబుచేయను బూనకుంటిరో తెలుపుఁడీ యని వేఁడు దేవిఁ గాంచి
తే. పలికె నోసతి యిది దేవతలసహాయ
ముననె చేయంగఁబడియె యజ్ఞనికరమున
నెందునే భాగమును బొంద నే నర్హుఁ
డ నను నొకవిధి కల్పితం బయ్యె నిపుడె. 197
క. మనుపటి విధియార్గంబున, నను భాగమునొందు దేవి నాకివరులు న్మూ

తనవిధిఁ గల్పించిరి కావున భాగము నాకు నీయఁబూనరు యజ్వల్. 198
వ. అనుటయుం బార్వతి యిట్లనియె. 199
చ. పరశివ సద్గుణంబులఁ బ్రభావమునన్ సిరిచే యశస్సుచే
నిరుపమదివ్యతేజమున నీవె ఘనుండవు గావె చూడ ని
ర్జరగణముం దజేయుఁడవు సర్వజగత్పతి వప్రధృష్యవి
స్ఫురదురువిక్రమాఢ్యుఁడవు భూతపతీ మునిసంఘసేవితా. 200
తే. ఇట్టి నీకధ్వరాంశంబు నీయకుంటఁ
దౌష్ట్యమునఁగాదె; యీమాటఁ దలఁప మిగులఁ
జింత పొడమెడుఁ గంపంబుఁ జెందె మేన
ననుచు మఱియును బల్కె నీహారగిరిజ. 201
సీ. భగవంతుఁడని దేవవర్ణితుఁడని కీర్తిఁదనరారు నీకు సవనియతాంశ
మిది కల్లు నట్లుగా నేదాన మొనరింతు నేనియమంబు నేఁబూనఁదగును?
దప మెద్ది చేయఁగాఁ దగునో యెయ్యది గాని యొనరింతు నాపతి కనఘమతికి
సవమునయందు మూఁడవభాగ మేర్పడుఁ గాకయంచు వచించు కాంతఁగాంచి
తే. యామెచిత్తమ్ము క్షుభితమై యార్తిఁ గాంచె
నంచు నెఱిఁగి ప్రహర్షమ్ము స్వాత్మ నలర
బతిహితంబును గోరినపత్ని యనుచుఁ
బలికె నిట్లని మృదుతమ వాక్కు లమర. 202
క. తనురుచిరాంగీ! నను నాత్మను నెఱుఁగవు నీవు నీకుఁ దగినవచన మి
ట్లనుపమగతి వచియించితి, వనూన సంతోషమున మదాత్మయు నలరెన్. 203
క సురుచిరవిశాలనయనా, నిరతధ్యానైకశక్తి నే నెఱుఁగుదు ని
ర్జర కార్యమ్మును; సాధూ, త్కరములు ధ్యానైకదృష్టిఁ గాంతు రఖిలమున్.
చ. వనితరో! త్వావకీనమయి భారతరంబగు నాగ్రహంబుచే
తనె సురలెల్లఁ జేడ్పడిరి దారుణబాధల నొందె లోకముల్
విను నను యజ్ఞనాథునిగ విశ్వనుతంబు రథంతరాఖ్యమై
తనరెడు సామ మేర్పడఁగఁ దా వినుతించు నుతింతు రెల్లరున్. 205
చ. క్షితిసురు లెల్ల నర్హవిధిచే మఖరాజిని నన్నుఁ గొల్తు రా
దృతిఁ గొని మంత్రవేత్త లొగి నెల్లమఖంబుల శ్రేష్ఠభాగ మో
శితిగళ! వే గ్రహింపు మని చేతులు మోడ్చి యొసంగుచుందు రో
యతివరో యన్నఁ బార్వతియు నాత్మవిభుం గని పల్కె నీగతిన్. 206
క. భగవంతా! ప్రాకృతుఁడై, నఁ గడున్ ధీమంతుఁ డగు జనసమాజమునన్
బొగడుకొనుం దనుఁ దానే, తగనివిధిన్ గర్వమూనుఁ దథ్యం బిదియా. 207
క. వనితాసాన్నిధ్యంబునఁ, దనుఁ దా వినుతించుకొనును ధాత్రి విశేషిం

చి నరుం డిది సాజంబొ, నన విని పరమేశుఁ డనియె నాదృతిమీఱన్. 208

మ. అమరేశీ! నను నేస్తుతించుకొనఁగా నాత్మం దలంపం జుమీ
సమయం బెయ్యదియైన నీవెటుల స్త్రీసాన్నిధ్యమం దంచు ని
త్యము భావింతువొ; పార్వతీ! మఖమునం దాత్మీయభాగంబు పూ
ర్వమురీతిం బడయన్ సృజించెద మహారంభున్ జగత్త్రాసకున్. 209

చ. అని తనప్రాణసంఘమునయందును ముఖ్యముగాఁ దలంపనౌ
వనితను గాంచి పల్కి భగవంతుఁ డుమాపతి క్రోధవహ్ని నొ
క్కని సృజియించె భీతికరకాయుని విక్రమమూర్తిఁ బావకుం
డనఁ దగువానిఁ గింకరుని; నంత మహేశుఁడు వాని కిట్లనున్ 210

చ. చను మట దక్షునధ్వరము సాగుచు నున్నది మద్విరుద్ధరీ
తిని గనుకన్ దదధ్వర ముదీర్ణపరాక్రమ మేర్పడంగఁ జ
య్యనఁ జెడునట్లుచేయుము మదాజ్ఞను దద్వ్రతమెల్ల వ్యర్థమై
చనఁగ నొనర్పు మం చపుడు శంకరుఁ డాజ్ఞ నిడంగ నవ్వలన్. 211

తే. పార్వతీమన్యుకృతమయి పరమదారు
ణాంగపంచాస్యవేషంబు నట్టె దాల్చి
యామహారూప మప్పుడే యరిగి దక్షు
నధ్వరముఁ జెండె ననిపల్కి యజుఁడు మరల 212

చ. మునులను జూచిపల్కె సురముఖ్యుని మన్యుజమూర్తి యధ్వరం
బును నశియింపఁ జేయఁ జనఁ బూనఁగ భీకరమూర్తి క్రోధయు
క్తిని దగు భద్రకాళి యతిధీరుని శంకరు నాత్మఁ గొల్చి వే
చనియెఁ దదీయకార్యమును సాగఁగ జేయఁగ సైన్యయుక్తయై 213

చ. తనకు సహాయభూతయయి దారుణరూపముఁ దాల్చి వచ్చునం
బను గని యట్టె పొంగి భగవంతునియాజ్ఞను వీరభద్రుఁ డన్
వినుతిని గన్న యాపురుషవీరుఁడు పార్వతి క్రోధవహ్ని చ
య్యన నడఁగంగఁ జేయఁ జనె హస్తమునన్ వరశూల మొప్పఁగన్. 214

క. తన రోమకూపములనుండి నిఖిలగణనాయకుల ననింద్యచరితులన్
జనియింపఁ జేసె వారును, ఘనవిక్రము లద్రినాథకల్పులు మఱియున్. 215

క. హరకార్యతత్పరులు శంకరతుల్యపరాక్రములు నికామభయంబున్
బరఁగం జేయఁగఁ జాల్డిన, యురుమూర్తులు వీరభద్రు నుగ్రతరాజ్ఞన్. 216

చ. శిరములఁ దాల్చి శస్త్రములచే జ్వలియించెడు చేతు లొప్ప స
త్వరముగ వేలసంఖ్యలుగ వారు భయంకర నిస్వనంబులన్
సురలును బాఱ నాకసము క్షోణియు నిండఁగఁ బొఱి యామహా
త్తరమఖవాటమున్ గని నితాంతము రేఁగినయాగ్రహంబునన్. 217

తే. చుట్టుకొని; రంతఁ దద్ద్రివ మట్టె సర్వ
వనుచు లెల్లరు డిగు లొంది రద్రు లెల్ల
వ్రయ్య లయ్యెను భూమియు వడఁకె మారు
తములు ఘోరంబుగా వీచెఁ దక్షిణమున. 218

క. జలరాసులు ఘూర్ణిలె న, గ్నులుజ్వాలాహీనములుగఁ గుంటుపడియె దీ
ప్తులఁబాసి భానుఁ డూరక, నిలిచెన్ గగనంబునందు నిశ్చలుఁ డగుచున్. 219

క. వెలుఁగక యుండె గ్రహంబులు, సులలితకాంతులు చెడంగ సొరిది నుడుగణం
బులు తారకలును గన్పడె, నిలాసురస్థులును దైన్యమే గని రచటన్. 220

చ. సురలును దానవుల్ మిగుల శోభలఁ బాసిరి; ధ్వాంత మెల్లెడన్
ద్వరగని యావరించెఁ; బ్రమథప్రవరుల్ చెలరేఁగి రంతటన్
గురుగతిగాఁ బ్రభంజనుఁడు ఘోరముగాఁగనె వీవసాగె ని
ష్ఠురతరదుష్టవస్తువులు సొంపుచెడం బడియెన్ సభాస్థలిన్. 221

తే. వీరభద్రుని కింకర వితతులందుఁ
గొంద ఱార్చిరి మర్దించుకోర్కిఁ గొంద
ఱుగ్రులై చొచ్చి రందు యజ్ఞోత్సవమును
జెఱుపఁ గొందఱు పరువిడి చేరి రచట. 222

క. మరుదంతరంగముల నె, క్కరణిని లెక్కింపనట్టి గమనంబుల న
ధ్వరమును ధ్వంసము చేయఁగఁ, బరువిడి రొకకొందఱుగ్రపావకు లట్టుల్. 223

సీ. యజ్ఞపాత్రముల నింతైనను మిగులక యుండునట్లుగఁ జెండి రొక్కకొంద
ఱామఖశాలయం దన్నిభాగంబుల విధ్వంసితములుగ వే యొనర్చి
రప్పు డామఖశాల యంతయు జీర్ణమై యంబరంబునఁ దారకాళి విరళ
ముగనుండ నొప్పెడు పోలికఁ గనుపట్టె నందు దివ్యాన్నభక్ష్యములరాసు

తే. లధికశీతలపానకా ద్యఖిలవస్తు
వులును భూధరవరములవలెఁ గనఁబడె
క్షీరనదులును ఘృతనదుల్ భూరిపాయ
సమయకర్దమములు చూడఁ జాలియుండె. 224

వ. మఱియు దివ్యములగు సుధుమండోదకంబులును, ఖండశర్కరావాలుకంబు
లును, గుడకుల్యలును సుచ్చావచంబులగు మాంసంబులును నింకనుం గల
భక్ష్య విశేషంబులును; లేహ్యములు చోష్యములు లోనగువస్తువు లన్నియు
వీరభద్రకింకరభక్షితంబులై మ్రింగఁబడి వివిధస్థలంబులఁ బడియె రుద్రకోపస
ముద్భూతులై మహాకాయులై కాలాగ్నిసదృశులై, శైలప్రమాణాకారం
బులం గనఁబడుచు, నెల్లయెడలం దిరిగియందఱభయపెట్టుచు, వివిధాకారంబుల
విహరించుచు దేవతాకాంతల భీతిపరవశలం గావించు చుండి రంత. 225

తే. వారుని ప్రమథాళిఁ గూడి యహార్యశౌర్య
ఘనుఁ డయినవీరభద్రుండు కాలకంఠు
ననుమతంబున సర్వదేవాభిరక్షి
త మగు దక్షాధ్వరంబును దా దహించె. 226

తే. దారుణాకృతితో శూల ధారిణియయి
కానఁబడు భద్రకాళిక కనుచునుండ
వీరభద్రుఁడు దహియించె విషగళాజ్ఞ
దైవయత్నంబునకు నసాధ్యంబు గలదె. 227

చ అనుపమతత్ప్రతాపమున కాహరసేవకు లెల్లభూతముల్
మనముల భీతినొందఁగ నమానుషనాద మొనర్చి; రంత నీ
శునిభటులందుఁ గొంద ఱతి శూరత యజ్ఞమృగోత్తమాంగ ము
ర్విని బడఁగొట్టి భీతికరరీతిని నార్చిరి క్రోధమూర్తులై. 228

చ. సురపతిముఖ్యులైనత్రిదశుల్ పరమేష్ఠికి నీడుచేయ నె
వ్వరుసను జాలుదక్షుఁడును బ్రాంజలులై వినయంబుమీఱ నె
వ్వరు పనుపంగ వచ్చితివొ భద్రగుణాకర పేరదెయ్యదో
కరుణచెలంగఁ దెల్పు మనఁగా నిటుపల్కెను వీరభద్రుఁడున్. 229

క. నేనున్ గాను సుపర్వుఁడ, దానవుఁడను గాను భుక్తితత్పరమతినై
రా నీస్థలికి మఖంబును, గానంగాఁ గౌతుకంబు కడలుకొనంగన్. 230

క. రా నిచటికి దక్షాధ్వర, మీనిర్జరు లెల్లఁ జూడ నీశునియాజ్ఞం
బూని వినాశము కూర్పం,గా నిర్జరులార! పూనికను వచ్చితిఁగా. 231

క. రుద్రామర్షోద్భవుఁడ న,భద్రుఁడన్ శంభువైరి వారమునకు ని
ర్నిద్రప్రతాపుఁడను మే,ర్వద్రినివాసుండ శంకరానుచరుండన్. 232

ఆ. వీరభద్రుఁ డనఁగ విఖ్యాతి నొందిన,వాఁడ నేను; నీమె భద్రకాళి
దేవి కోపజనిత దేవదేవేశుండు పనుప వచ్చె మఖము పాడుచేయ. 233

చ. త్రిదశవరేణ్యు మానివినుతింగను దేవు నుమాపతిన్ బ్రమో
దదు సుజనావనాదరుఁ బ్రతాపనిధిం గరుణాసముద్రు శ,
త్రుదమను గాన నేగి దయతో ననుఁ గావు మటంచు వేఁడుమీ
ముదమునఁ గాచుఁ జుమ్ము నిను భూపతివర్య యెఱుంగఁ జెప్పితిన్. 234

క. పరశివుక్రోధము వరమా, హారసేవకవితతితోడి దగు పగకన్నన్
ద్వరపడి శరణుం జొరుమీ, సురపతివరుఁ గానఁబోయి శుభ మగు నీకున్. 235

చ. అనుచు విరించి తెల్పి ముదమారఁగ నింకను మానికార్తతిం
గని వచియించె నవ్వలి యఖండశివాత్మజ పౌరుషంబునున్,

వినుఁడు తదాజ్ఞఁ బూని త్వర వీరులు తత్పరిచారకుల్ మఖా
వనిఁ జొరఁబాఱి యూపసమవాయము పాడొనరించి యుద్ధతిన్. 236

క. పరిచరులఁ జంపి తత్పల, నిరతిం గృధ్రములు వ్రాలి నిర్భరశబ్దం
బురుతరముగఁ జేయఁగ భీ, కరముగఁ దన్మఖధరణియుఁ గనఁ జేసి వడిన్. 237

సీ. పక్షసంచాలన పవనవిధూత శివానినాదంబుల భయదరీతిఁ
గనఁబడఁ జేయ మఖంబు మత్తుండైన దక్షునియవినీతిఁ దానశించె;
నంత యజ్ఞము హరిణాకృతి ధరియించి యాకసంబున కేగునట్లు వెడల
నారూపమును గాంచి యది యజ్ఞమని యెంచి వృషకేతనుఁడు దాని వెంటఁ దవిలి
తే. ధనువుఁ గైఁజేర్చి జ్యాలత దానఁ గూర్చి
శరము సంధించి మృగమును జంప మించి,
యమితతేజంబు దిక్కుల నావరించి
వెలయ నాప్రమథేశుఁడు వేగ మలర. 238

చ. చనుచు గుణంబు శ్రోత్రబిలసంగతి గాంచఁగ లాగి బాణమొ
య్యన విడువంగఁ బూనునపు డాహరు ఫాల తల చ్యుతంబు పా
వన మగు స్వేదబిందువు జవంబున ఘోరతరంబుగాఁగ మే
దిని బడె; నద్ది వే పడఁగఁ దీవ్రతరాగ్ని జనించె నచ్చటన్. 239

క. కాలానలతుల్యం బా, భీలంబై యద్ది వెలసె ద్విజవరులారా
యోలి నటనుండి యపుడు త్రి, శూలి యనన్ బురుషుఁ డొకఁడు శుంభత్తనుఁడై.

క. జనియించె; హ్రస్వమై త, త్తనువు కనంబడియె మిగుల దారుణరక్తం
బును గ్రక్కునయన యుగ్మము, కన నయ్యెను శ్మశ్రువులును గడు హరితములై

క. కనుపట్టుచుండె సాధ్వస, మును గల్గఁగఁ జేయు నంగమును నూర్ధ్వముగాఁ
గను బెరిఁగిన కేశంబులు, తనువెల్లను రోమములును దనరారంగన్. 242

ఆ. శోణకర్ణములు నశుభకృష్ణవర్ణంబు, రక్తవస్త్రములును రాజిలంగ
నప్పురుషుఁడు తోఁచి యధికసత్త్వంబునఁ, గాల్చెఁ గక్షవహ్నికరణి మఖము.

క. అమరులు భీతం గాంచి జ, వమునన్ దిక్కులకు నట్టె పరుగిడి రతితే
జము వెలయఁ జరించెడు వి, క్రమధుర్యుని నప్పురుషుని గాంచి భయమునన్. 244

చ. ధరణి వడంకె ద్వీపసముదాయముతోడను, మౌనులార! స
త్వరముగ నమ్మహాపురుష తల్లజుఁ డివ్విధి సంచరింపఁగా
సురపద మెల్లఁ దల్లడిలె; శూరత మించెడు నీశ్వరున్ మహ
త్తరమహిమాఢ్యు వందనశతంబులఁ బూజితుఁ జేసి భక్తితోన్. 245

క. పలికితి నీవిధి నేనో, ఖలహరణా! దేవదేవ! కంజజుఁడను నా
పలు కొక్కటి వినుమా యు, వ్వలఁ దోఁచినరీతిఁ జేయవచ్చుం జుమ్మీ. 246

క. లోకేశా! నీకు సురా, నీక మ్మధ్వరమునందు నెమ్మి నిడుదు ర
స్తోకాంశము క్షమియింపుము, లోకధ్వంసమ్మునం గలుగు క్షోభంబుల్. 247

క. కావునఁ బ్రతిసంహారము,గావింపుము వీని కింకఁ గరుణావార్ధీ
దేవతలును మునివర్యులు, నీవిధి నీవాగ్రహమున నెసఁగుచునుండన్. 248

తే. శాంతినొందక యున్నారు సర్వలోక,ములును జీకాకుపడియెడు భూతనాథ
తావకస్వేదజుం డయి దారుణాకృ,తిని ధరించిన పురుషుం డవనిని ముందు. 249

సీ. జ్వరనామమును దాల్చి సంచరించెడుఁగాక భూమియందే గాక భూతనాథ
యెల్లలోకములందు నెసఁగుత; మీభూత మొక్క దేహముగాక పిక్కటిల్లి
బహురూపములఁ దాల్చి పరఁగంగఁ జేయుము దాన లోకములకుఁ దగ్గుభార
మని వేఁడినాఁడ; నోమునులార! నే నిట్లు ప్రార్థించి భాగంబు యజ్ఞమందుఁ

తే. దనకుఁ గల్పింప భగవంతుఁ డనుపమాన
శక్తిఁ దనరిన దేవతాస్వామి నన్నుఁ
గరుణ చెలువారఁగాఁ గాంచి కంజజన్మ
యనుచు సంప్రీతినిం బల్కె ఘనుఁడు గాన. 250

క. మనమున దక్షుం డప్పు డీ,శునిశరణము పొంది నీవె శుభదుండవు సు
మ్మనఘా యపరాధము దీ,నిని గావు మటంచు వేఁడి నియతాత్ముండై. 251

వ. [ప్రాణాపానవాయువులనిరోధించి ప్రయత్నపూర్వకంబుగాఁ జత్రుస్థానమునందుఁ
బ్రవర్తింపఁజేసి దృష్టిని నిశ్చలంబుగాఁ దనరఁ జేసెనంత.]

క. స్మితపూర్వకముగ గౌరీ,పతి యిట్లనిపల్కె నేమిపని కోరి ననున్
గతిగా భావించితో పల్కు తగన్ వేగంబ యన్నఁ గోరిక మెఱయన్. 252

క. పితృదేవత లమరులు త,ద్ధితవాక్యము నాలకించి తృప్తింగని రా
వితమునఁ బల్కిన యల్లుని, శితికంఠుని గాంచి భక్తిఁ జేమోడ్పు తగన్. 253

తే. భీతి కనఁబడఁగా శంక వెసలిపోవ, వదన మీక్షణములు బాష్పవారిఁ దడుపఁ
బరశివుం గాంచి పల్కె నిప్పగిది దక్షుఁ,డో మహాత్మ ప్రసన్నత నొప్పు దేని. 254

క. నేనీకుఁ బ్రియుఁడ నని నీ,మానసమునఁ దోఁచు నేని మహితాత్మ! మహే
శా! నేను ననుగ్రాహ్యుఁడఁ,గా నీవు తలంప వలయుఁ గరుణ చెలంగన్. 255

సీ. వరము వేఱొకదాని వాంఛింతు నే యజ్ఞసంభారములఁ బ్రయాసము సహించి
సేకరించితి ఫలసిద్ధిని గాంక్షించి బహుకాల మీశ్వరా! పట్టె దీని
కిట్టిసంభారంబు లెల్ల గణములచే భక్షింపఁబడియెఁ గోపమునఁ ద్రాగఁ
బడియెను మ్రింగఁగాఁ బడియెను బాడు చేయంబడియెను; బిండి యగువిధమునఁ

తే. జేయఁబడియెను నలుదట్ల చిమ్మఁబడియెఁ,గాన నవియెల్ల నీఘన కరుణఁ బూర్వ
రీతి నొప్పంగవలయు విఖ్యాతి నొంది,యనిన మునులార! నే నిట్టు లంటి నప్పుడు.

క. పరశివ దక్షుఁడు కోరిన, కరణిం జెలువారుచుండుఁగాక యనుచు హ
ర్షరతిం బల్కితి; నంతట, హరుఁ ద్రినయను దేవవిభు మహాదేవు శివున్. 257

తే. కనుచు దక్షుఁడు జానువుల్ క్షమను దగులఁ
బడి వరంబులఁ గైకొనెఁ బరశివుండు
కరముహర్షించి యొసఁగె సుఖంబుచెడక
యుండఁ గోరుట హిత మను నూహ యలర. 258

వ. మరల దక్షుండు భక్తిపురస్సరంబుగా నష్టోత్తరసహస్రనామంబుల శంకరు నేకాగ్రమనస్కుండై వినుతించె. 259

---

## ముప్పది యొనిమిదవ యధ్యాయము.

దక్షుం డష్టోత్తరసహస్రనామముల శంకరు వినుతించుట.

క. మునులారా! శంకరున,త్యనుపమవీర్యంబుఁ గాంచి యా దక్షుం డా
త్మను భక్తిరసము పొంగఁగ,వినుతించెఁ బరాత్పరుని సువృత్తరచనలన్. 260

తే. దేవదేవ నమోఽస్తు తే దివ్యరూప
బలనిషూదన శంకరా! వామదేవ
తే నమోఽస్తు సురేశ! యంచానతోత్త
మాంగుఁడై వేఁడి మఱియు నిట్లనియె నతఁడు. 261

వ. శంకరా! నీవు బలశ్రేష్ఠుండవు. దేవదానవపూజితుఁడవు. సహస్రాక్ష, విరూపాక్ష, త్ర్యక్ష, యక్షాధిపప్రియ, నామప్రియుండవు. సర్వతఃపాణిపాదుండవు. సర్వతోఽక్షిశిరోముఖుండవు. సర్వతశ్శ్రుతిమంతుండవు. సర్వము నావరించి యుండువాఁడవు. శంఖకర్ణ, మహాకర్ణ, కుంభకర్ణా, ర్ణవాలయ, గజేంద్రకర్ణ గోకర్ణ, శతకర్ణనామంబులనలరునీకు నమస్కరించెదను శతోదర, శతావర్త, శతజిహ్వ, సనాతన, విఖ్యాతనామధేయుండ వగునీకు వందనంబుల నొనరింతు. గాయత్రీదేవతోపాసకులు నిన్ను గానము చేయుదురు. అకర్ములు నిన్నర్చింతురు. నీవు దేవదానవగోప్తవు. బ్రహ్మవు. శతక్రతుఁడవు. మూర్తిమంతుఁడవు. అమూర్తివి. మహామూర్తివి. సముద్రుఁడవు. సరోనిధివి. గోవులు గోష్ఠంబున నుండునట్లు సకలదేవతలు నీయం దుండువారు. శరీరమున నీవలన సోమాగ్ని వరుణులఁ జూచుచున్నవాఁడను. ఆదిత్యవిష్ణుబ్రహ్మబృహస్పతులను నీశరీరమునఁ గాంచుచున్నవాఁడను. క్రియయుఁ గరణకార్యములు, కర్తయుఁగారణమును, సదసత్తులు, ప్రభవాప్యయమ్ములు నీవకదా. భవ, శర్వ, రుద్ర, వరద, పశుపత్యంధకాసురఘాతి, త్రిజట, త్రిశీర్ష, త్రిశూలధారి, త్ర్యంబక, త్రినేత్ర, త్రిపురఘ్న, చండ, ముండ, విశ్వచండధర, దండి, శంఖకర్ణ, చండీచండ, సామ

ముల నలరునీకు నమస్సులు. అర్ధదండికేశ, శుష్క, వికృత, విలోహిత, ధూమ్ర, నీలగ్రీ, వాప్రతిరూప, విరూప, శివ, సూర్య, సూర్యపతి, సూర్యధ్వజపతాకి, ప్రమథనాథ, వృషస్కంధ, హిరణ్యవర్ణ హిరణ్యకవచ, హిరణ్యకృతచూడ, హిరణ్యపతి, శత్రుఘాత, చండ, పర్ణసంఘశయ, స్తుత, స్తుతి, స్తూయమాన, సర్వభక్ష, సర్వభూతాంతరాత్మ, హోమ, మంత్ర, శుక్లధ్వజపతాకి, నమ్యా నమ్య, కిలకిల, శయమాన, శయితోత్థిత, స్థిత, ధావమాన, భూత, కుటిల, నర్తశీల, ముఖవాదిత్రకారి, బాధాపహ, లుబ్ధ, గీతవాదిత్రకారి, జ్యేష్ఠ, శ్రేష్ఠ, బలప్రమథన, కల్పన, క్షమోపక్ష, మోగ్ర, దశబాహు, కపాలహస్త, సిత భస్మప్రియ, విభీషణ, భీమ, భీమవ్రతధర, నానావికృతవక్త్ర, ఖడ్గజి, హ్వోగ్రదంష్ట్ర, పక్షమాస లవాద్య, తుంబీవీణాప్రి, యఘో, రాఘోరరూప, ఘోరాద్ఘోర తర, శివ, శాంత, శాంతతర, బుద్ధ, శుద్ధ, సంవిభాగప్రియ, ప్రపం, చోగ్ర, సాంఖ్యపర, చండైకఘంట, ఘంటానాద, ఘంటి, సహస్రశతఘంట, ఘంటా మాలాప్రియ, ప్రాణదండ, నిత్య, లోహిత, హుంహుంకార, రుద్ర, హుంహుంకారప్రి, యాపారవద్గిరివృక్షప్రియ, మార్గమాంససృగాల, తారక, తర, యజ్ఞాధిపతి, కృత, ప్రకృత, యజ్ఞవాహ, దాంత, తథ్య, వితథ్య తట, తట్య, తటినీప, త్యన్న, దాన్నప, త్యన్నభు, క్సహస్రశీర్ష, సహస్రచరణ, సహస్రోద్యతశూల, సహస్రనయన, బాలార్కవర్ణ, బాలరూపధర, బాలార్క రూప, బాలక్రీడనక, శుద్ధ, బుద్ధ, క్షోభణ, క్షయ, తరంగాంకితకేశ, ముక్తకేశ, షట్కర్మతుష్ట, త్రికర్మనిరత, వర్ణాశ్రమధర్మ ప్రవర్తక, శ్రేష్ఠ, జ్యేష్ఠ, కలకల, శ్వేతపింగళనేత్ర, కృష్ణరక్తేక్షణ, ధర్మకామార్థమోక్ష, క్రథ, క్రథన, సాంఖ్య, సాంఖ్యముఖ్య, యోగాధిపతి. రథ్యాతిరథ్య, చతుష్పథపథ, కృష్ణాజినోత్తరీయ, వ్యాళయజ్ఞోపవీతి, నామవిఖ్యాతుఁడవగుశంకరా నీకుఁ జేమోడ్పులు. ఈశాన రుద్రసంఘాత, హరికేశ, త్ర్యంబి, కాంబికానాథ, వ్యక్తావ్యక్త, కాలకామద, కామఘ్న, దుష్టోద్వృత్తి నివారణ, సర్వగర్హిత, సర్వఘ్న, సద్యోజా, తోన్మా దన, శతావర్తగంగాతోయార్ద్రమూర్ధజ, చంద్రార్థసంయుగావర్త, మేఘావర్త నానార్థదానభృ, దర్థ, దాన్నస్రష్ట్వ, భోక్తృ, ముజ్ఞభు, గనల, జరాయు, జాండజ, స్వేద, జోద్భిజ్జ, దేవదేవేశ, చతుర్విధభూత గ్రామరూప, చరాచర నిర్మాణ నిరత, ప్రతిహర్తృ, బ్రహ్మ, విశ్వేశ, సర్వపరమకారణ, స్వధారూప, జ్యోతి ర్నిధినామముల నలరునీకు నమస్తతులు. ఋక్సామోంకార ప్రతిపాదకుండ వని బ్రహ్మవాదులు కొనియాడు నీ కివె యంజలులు. మఱియు. 262

ఆ. బ్రహ్మవాదు లనఁగఁ బ్రఖ్యాతిఁ గాంచిన
సామగులు సతంబు శంకర నిను

హాయిహాయి యనుచు హరహరవాహావా య
టంచుఁ బాడుచుండు రంచితముగ. 263

సీ. నీవెయజుర్వేద మీవె ఋగ్వేదము సామవేదము నీవె శంకరా! య
థర్వవేదం బీవెతతభక్తి నిను బ్రహ్మవేత్తలు కల్పైకవిదులు సుపని
షద్వేత్త లెల్లరు సతతంబు సేవింతు; రవనీసురులు భూపు లర్యు లంఘ్రి
భవులు వర్ణాశ్రమవరధర్మములు నీదు నంగంబు లవుఁజుమ్ము హరపరేశ
తే. ఆశ్రమావళి యన నీవె యభ్రమునఁ జెలంగువిద్యుత్తు లీవె యిలాతలమున
భయము గల్గించు నిర్ఘోషఘటల మీవె, వత్సరర్తువు లీవె యోభవ మహేశ.
ఆ. మాసపక్షములును మఱి కలాకాష్ఠాని, మేషతారకలును మించు యుగము
లుక్షములకకుత్తులు ర్వీధరసులవౌ, శిఖరములును నీవె శివపరేశ. 265

సీ. మృగతతిఁ బంచాస్య మీవెకదా భోగిగణములం దెల్లఁ దక్షకుఁడ వీవె
సంద్రములం బయస్సాగర మీవె వేదములయజుర్వేదమమరవంద్య
నీవె దివ్యాయుధనికరమ్మునఁ వజ్ర మీవె వ్రతమ్ములఁ బావనతమ
సత్య మీవే నీవె సతత మిచ్ఛాద్వేషమోహరాగక్షమములును శాంత
తే. మీవె వ్యవసాయలోభముల్ ధృతియుఁ గామ
మల్లె క్రోధంబు సర్వాత్మహర! జయాజ
యములు నీవే గదియనఖట్వాంగి యనఁగఁ
జాపి శరి యన ధ్వజి యన శర్వనీవె. 266

క. హరరథి యాన నీవేకద, పరమాత్మాక్షేత్త్రయనఁగఁ బరఁగుదు వీవే
పరికింప క్షేత్త్ర వీవే, సరియైనప్రహర్త మీవె శంకర దేవా. 267

వ. నేతృశబ్దవాచ్యుండవు· మంతవు దశలక్షణయుక్త ధర్మరూపుఁడవు. అర్థకామములు నీవేకదా ఇంద్రసముద్ర సరిత్పల్వలసరోల తావల్లీతృణౌషధులు నీవ. పశుమృగపక్షిద్రవ్య కర్మగుణారంభములునీవ. కాలపుష్ప ఫలప్రదుఁడవు నీవ. ఆదిమధ్యాంతములు, గాయత్రోఁకారములు, హరిత, లోహిత, కృష్ణనీల, పీతారుణ, వర్ణములునీవ. కద్రు, కపిలబభ్రు, కపోత, మేచకంబులు నీవ. సువర్ణరేతోవిఖ్యాతుఁడవునీవ·సువర్ణంబు నీవ· సువర్ణనామధారివి·సువర్ణప్రియుండవు. చంద్ర, యమ, వరుణ, కుబేరానలో, త్కుల్ల, చిత్రభాను,స్వర్భాను,భాను, నామములు నీకువర్తిల్లు· శంకరా హోత్రము, హోతయు, హోమ్యము, హుతము నీవ· త్రిసౌపర్ణమునీవ. యజుస్సులలోశతరుద్రీయమంత్రములు నీవ·పవిత్రులలో నీవే పవిత్రుఁడవు. మంగళములలో మంగళంబవు. పాపాంతకవృక్షం బన నీవే. జీవప్రలయములు నీవ. ప్రాణరజస్తమస్సత్వములును నీవ. ప్రాణాపానసమానోదాన వ్యానము, లున్మేష నిమేషకాలకల్పములు, నీవ లోహితాంగుడవు· దం

ష్ట్రివి. మహావక్త్రుఁడవు. మహోదరుఁడవు. శుచిరోముఁడవు. హరిచ్ఛ్మశ్రుఁడవు.
ఊర్ధ్వకేశుఁడవు చలాచలుఁడవు. గీతవాదిత్యనృత్యాంగుఁడవు. గీతవాదనప్రి
యుండవు. మత్స్యజాల, జలాజయ్య, జలవ్యాళ కుటీచర, వికాల, సుకాల,
దుష్కాల, కాలనాశన, మృత్యుశబ్దవాచ్యుండవు. అక్షయానంత క్షమామా
యాకరోత్కర, సంవర్త, వర్తక, సంవర్తక, బలవాహక, నామవాచ్యుండవు.
ఘంటాకి, ఘంటకి, ఘంటమాడాల, లవణోదధి, బ్రహ్మ, కాలాగ్నివక్త్ర, దండి
ముండి, త్రిదండధృ, క్చతుర్యుగ, చతుర్వేద, *చతుర్హోత్ర, చతుష్పథ, చాతు
రాశ్రమ్యనేతృ, చాతుర్వర్ణ్యకర, క్షరాక్షర, ప్రియ, ధూర్త, గణాగణ్యగణా
ధిప, రక్తమాల్యాంబరధర, గిరీశ, గిరిజాప్రియ, శిల్పీశ, శిల్పిశ్రేష్ఠ, సర్వశిల్ప
ప్రవర్తక, భగనేత్రాంతక, చండ, పూష్ణ, దంత వినాశన, నామధేయుఁడవు. స్వా
హాస్వధావషట్కారనమస్కార శబ్దవాచ్యుండవు. గూఢ వ్రత, గూఢ, గూఢ
వ్రతనిషేవిత, తరణ, తారణ, సర్వానుస్యూతచారణ, ధాతృ, విధాతృ,
సంధాతృ, నిధాతృ, ధరణీధర, తపో, బ్రహ్మ, సత్య, బ్రహ్మచర్యార్జవ, భూతా
త్మ, భూతకృ, ద్భూత, భూతభవ్యభవోద్భవ, భూర్భువస్స్వరిత, వృ, తాగ్ని
మహేశ్వర, రేక్షణ, దోక్షణాకాంత, దాం, తాదాంతవినాశన, బ్రహ్మావర్త,
సురావర్త, కామావర్త, కామబింబవినిర్హంతృ, కర్ణికారమాలాప్రియ,
గోనేతృ, గోప్రచార, గోవృషేశ్వరవాహన, త్రైలోకగోప్తృ, గోవింద,
గోప్తృ, గోగ, ర్గాఖండచంద్రాభిముఖ, సుముఖ, దుర్ముఖ, ఖాముఖ, చతుర్ముఖ,
రణాభిముఖ, హిరణ్యగర్భ, శకుని, ధన, దాన్నపతి, విరా, డధర్మహంతృ,
మహాదక్ష, దండధారి, రణప్రియ, స్థిర, స్థాణు, నిష్కంప, సునిశ్చల, దుర్వా
రణ, దుర్విషహ, దుర్దర్ప, దురతిక్రమ, దుర్ధర, దుర్వశ, నిత్య, దుర్గమ,విజయ
జయ, శశ, శశాంకనయన, శీతోష్ణ, క్షుత్తృష్ణా, జరా, ధివ్యాధి, వ్యాధిహా,
వ్యధిప, సహ్య, యజ్ఞమృగవ్యాధ, వ్యాధ్యాక, రాకర, శిఖండి, పుండరీక,
పుండరీకావలోకన, దండధృ, క్చండదండ, రౌద్ర.భాగవినాశన, విష, పామృ
తప, సురాప, క్షీరసోమప, మధు పాపప, సర్వప, బలాబల, వృషాంగవాహ్య,
వృషభ, వృషభలోచన, వృషభ, లోకవిఖ్యాత, లోకసంస్కృత, చంద్రాదిత్య
చక్షు, ర్హృదయగూపపితామహా, గ్నిష్టో, మాదేహ, ధర్మకర్మప్రసాధిత,
బ్రహ్మావిష్ణుపురాణమున్యవిదితమాహాత్మ్య, విఖ్యాతుఁ డ వగు నీకు నమ
స్కారములు. 268

క. పరశివ! సూక్ష్మతరంబులు, నిరుపమములు గాఁగ నెపుడు నెగడుచు జగతిం
బరఁగెడు త్వన్మూర్తులు నా, కరుదుగఁ గన్పడెడుఁగాక యపవర్గ మిడఁగ. 269

క. ఆనీమూర్తులచేఁ బిత,సూనుని రక్షించునట్టి చొప్పున సతతం

* చతుర్హోత్ర శ్చతుష్పథః = అని మూలము.

బూనినకృప రక్షింపుము; సూనాయుధహరణ చంద్రశోభితశీర్షా. 270

క. నను రక్షింపఁగ నర్హుఁడ, ననితలఁపు మొనర్తు వందనావళి భక్తిన్
ద్రినయన! భక్తావనరత, యనిశము త్వత్పాదభక్తినలరెడు నన్నున్. 271

క. నిరతముఁగృప గాపాడుము, పరమేశ్వరుఁ డెవఁడు వేలభక్తులు తను సా
గరమునఁ బరివేష్టింపఁగఁ, బరిరక్షకుఁడగునొ యట్టి పరుఁ బ్రార్థింతున్. 272

క. జితనిద్రులు సత్త్వస్థులు, జితనిశ్వాసులును భూరిసిద్ధులు సమదృ
ష్టి తగన్ వెలసెడు యోగులు, సతతం బెజ్యోతిఁ గాంచఁ జాలుదురో కడున్.

తే. అట్టియోగాత్మునను వందనాళిఁ గూర్తుఁ;
బ్రలయకాలమురా భూతవారమును గ్ర
సించి జలమధ్యమున శయనించు నెవ్వఁ
డట్టి కేశవు సేవింతు నహరహంబు. 274

సీ. ఎవఁడు పర్వముల రాహువువక్త్రమును జొచ్చి చంద్రుని మ్రింగునో సప్తహయుని
నల్లె గ్రసించునో యగ్నియు సోముఁడు నై యుండుమహాత్మునతనిఁ గొలుతు;
నంగుష్ఠమాత్రులై యంగములన్ నిల్చుపురుషులు నను బ్రీతి నిరతమేలు
చుందురుగాక నన్నెప్పుగ సంతృప్తిఁ గలవానినిగఁ జేయఁ దలఁచు చుంద్రు

తే. గాక; యెవ్వనిచే సురల్ కాంచిరో జని
నెవనిచే మృతినొందిరో యెల్లవారి
కెవఁడు స్వాహాస్వధారూపుఁడు విభుఁ డెలమి
నగునొ యలశంభు వినుతింతు నాదరమున. 275

క. తనుధారు లెల్ల నేశం, భుని జేరుదురో తమంత భూమిని సృష్టిం
పను బడుదురో యెవ్వనిచే,ఘను నాతని దేవదేవుఁ గనుఁగొందు మదిన్. 277

క. ప్రమదము శోకమ్మును భూ,తములకు నెవ్వాఁడు పుట్టఁ దాఁ జేయునొ యా
ప్రమథాధిపు మూర్తులకును,నమస్సులం జేయువాఁడ నామనమందున్. 278

సీ. సాగరములయందు శైవలినులయందుఁ బర్వతములయందు బహువిధముల
నలరెడు గుహలందు నవనీరుహావలిమూలంబులన్ గోష్ఠములను దుర్గ
మారణ్యగహనంబులందుఁ జతుష్పథములయందు రథ్యల భూరిసభలఁ
గాననములయందుఁ గరిహయరథశాలలందు జీర్ణోద్యానబృంద మందు

ఆ. నాలయములయందు నాపంచభూతంబు,లందు దిగ్విదిక్కులందు నింద్ర
ఖరకరాంతరములఁ దరణిసోమాంశువు,లందు నెవనిమూర్తు లలరునొ తగ.279

క. బలిపద్మమునను దానికి,వెలుపల నేవ్వాని మూర్తిబృంద మలరునో
యలమూర్తుల కివె వందన,ములు ముమ్మాఱులుగ భక్తిఁ బూన్కి నొనరుతున్.

క. హర! నీవు సర్వమగుదువు, పరికింపఁగ సర్వభూతపతివి భవుఁడ వన్

పరమఖ్యాతిం గాంతువు, పరశివుఁడవు సర్వగుఁడవు పరమవు నీవె. 281
తే. సర్వభూతాంతరాత్మవు సర్వలోక, పతివి గావునఁ బిలువంగఁబడవు యజ్ఞ
మునకు; నో దేవ బహువిధము లగుదక్షి,ణ లొగిఁగల్గిన యధ్వరంబులను నీవె.
క. నిరతము పూజింపంబడి,పరఁగుచు నుందువు మహాత్మ! పాలకకార్యో
త్కరమునకు నీవె కర్తఁగఁ, బరిగణితుఁడ వౌటఁ బిల్వఁబడవు క్రతువునన్. 283
క. అనుపమము సూక్ష్మమును నై,కనఁబడని త్వదీయమాయ కిప్పట మోహం
బును గాంచితిఁ గావునఁ గ్రతు,వునకుఁ నినుఁబిల్వనైతి భూతగణేశా. 284
సీ. సర్వదేవేశ! ప్రసన్నుఁడ వగుము నా కెన్నదిక్కనఁగ నీవే మహాత్మ
గతియుఁ బ్రతిష్ఠయుఁ గామహారా! నీవె వెఱొక్కమతి నాకు విశ్వమందుఁ
గానరాకున్నది గరళకంఠా! యని యీవిధి వినుతించి పావనాత్ముఁ
డయి యూరకుండె; నెయ్యమున గౌరీపతి సుప్రీతుఁడగుచు దక్షునకు ననియె
తే. దక్ష! పరితుష్టినొందితి స్తవము దీని
భక్తి నొనరించితివి పలుపలుకు లేల
మత్పదము నొందఁ గలవింక మహితపుణ్య
మతి వటంచు వచించి సమ్మదము మీఱ. 285
చ. మనమలరారు వాక్యము లమానుషశక్తి శివుండు పల్కి యిం
కను వచియించె నిట్టులు; మఖంబు వినాశిత మయ్యె నంచుఁ జిం
తను గనఁబోకు నేనె సవనంబును బాడొనరించినాఁడ నీ
వును గనుఁగొంటి కాదె వగపుం గనకుండ సమాహితాత్మతన్. 286
క. వర మొండు కోరు మిచ్చెదఁ, గరుణించితి నీదు స్తవము కడుఁ దమి వింటిన్
బరమాద్భుత మిది కావున, వర మొసఁగెద నీదు చిత్తవాంఛ ఫలింపన్. 287
తే. అశ్వమేధసహస్రమ్ము లట్లె వాజ,పేయశతములు పొనరింప వెలయు ఫలము
గల్గఁగలదు ప్రజానాథ గాఢమత్ప్ర,సాదమున ముక్తిపదము వాస మగు నీకు.
తే. సాంగము లగు వేదంబుల నాత్మ నెఱుఁగఁ
గలవు సాంఖ్యయోగంబులఁ దెలియఁగలవు
దేవదానవ దుశ్చర దివ్యతపము
చేయఁగల వీవు పొందుదు చిత్తశుద్ధి. 289
వ. ద్వాదశవర్షనియమంబుగలిగి, సూక్ష్మమై, మూర్ఖజనాగమ్యంబయి వర్ణాశ్రమ
ధర్మయుతంబై యొకప్పుడైన భ్రంశంబుఁగాంచక పశుపాశవిమోక్షణంబై,
సర్వాశ్రమోపకారక మగు పాశుపతవ్రతము నాచే నుత్పాదితం బయ్యె. అది
సర్వపాపవిమోచనంబు, సమర్థంబు నగు దీనిఁ జిరకాల మాచరించిన నేపుణ్యం
బుగలుగు నయ్యది నీకు నశ్రమంబునఁ గలుగు. కావున మానసజ్వరంబు నెడ

బాయుమని పలికి సత్త్వసేవకుండై మహాదేవుం డంతర్హితుం డయ్యె. 290

క. నవమం బమతోఁ గూడన్, భవుఁ డంశమ్మును గ్రహించి పరమామోదం
బు వఱలఁ జనుచున్ జ్వరమును, వివిధవిభాగములఁ జేసి విస్తృతిఁ గూర్చెన్

తే. సర్వభూతశాంత్యర్థ మీచందమున నొ,నరిచె వాని నెఱింగింతు ధరణిదివిజు
లార! నాగములకు శిఖాభూరితాప, మద్రులకును శిలాజితు వనెడు రుజయు. 292

సీ. జలములకున్ జ్వర మలరు నీలికయన భుజగంబులకును నిర్మోకమనెడు
నదియు ఖోరక మనునది సౌరభేయంబులకు నూషరాఖ్యమి లాతలమున
కఖిలశునకముల కవనీదివిజులార దృష్ట్యవరోధన మెల్లఘోట
కములకు రంధ్రాగత మనెడునదియును శిఖులకుఁ బింఛంబు జీర్ణమగుచు

తే. క్షమనుబడుటయు నేత్రరాగము పికముల
కగును జ్వర మని శాసించె హరుఁడు మఱియు
జను లదెంతటివా రైనను విభేద
మగుజ్వరం బని పల్కె నాయభవుఁ డపుడు. 293

వ. శుకములకు హిక్కికయను జ్వరంబును, శార్దూలములకు శ్రమమను నదియు, మనుష్యులయందు జ్వరమను నదియుఁ, గలిగియుండు నని శాసించె. ఈజ్వరము జన్మ మధ్య మరణములఁ గల్గునని యాదేశించె. ఇదిమాహేశ్వరతేజంబు. జ్వరనామంబున భయంకరంబై పరఁగె. మహాత్ముఁ డగునీశ్వరుఁడు నమస్కరింపఁదగి మన్నింపఁదగి సర్వప్రాణిశరణ్యుఁ డనందగి యుండువాఁడు! ద్విజవర్యులార! ఈజ్వరోత్పత్తికథ నదీనమానసుఁడై సమాహితాత్ముఁడై పఠించిన విముక్తరోగుఁడై ప్రమదంబు గాంచి వాంఛితములఁ బొందుచుండు. 294

క. స్తుతి యిది దక్షప్రోక్తం, బతిశయఫలదంబు గాన నతిభక్తి నదే
మతిమంతుఁడు వినుఁ జక్కఁగ, నుతియించు నమంగళములనుం బొందఁడిలన్

తే. ఆయురభివృద్ధి గల్గు దేవాళిలందు, శంకరుం డెట్లు శ్రేష్ఠుఁడో స్తవ మిదఖిల
నుతులయం దుత్తమోత్తమ మతిశయఫల,దానదక్షుం బటంచును దలఁపవలయు.

సీ. యశము స్వర్గము దేవతైశ్వర్యవిత్తవిజయములఁ గాంక్షించు జనుఁడు భక్తి
స్తవముదీనిని త్రిసంధ్యలయందుఁ బఠియింపవలయువిద్యాకాంక్ష వఱలునతఁడు
పఠియింపఁదగు వ్యాధిబాధితుం డగువాఁడు దుఃఖసాగరముల దొప్పఁదోఁగు
నతఁడు దీనుం డగునతఁడు భయాదిసంగ్రస్తుఁడు భూపతికార్యముల ని

తే. యుక్తుఁ డగువాఁడు ముక్తుఁడై యొప్పుచుండుఁ
దనువు దీనినె పూని శంభునికరుణను
జగమునం దిందు సుఖములఁ జాలఁ గాంచి
ప్రమథగణరాట్టనంగఁ దాఁ బరఁగు సతము. 297

తే. యక్షనాగపిశాచముల్ పక్షివరము, లేగృహంబునఁ బశుపతి యీస్తవమున

వినుతుఁ డగు నాగృహంబునఁ బీడఁగల్గఁ, జేయఁ జాలవు పలునుడుల్ చెప్ప నేల.

చ. వినుతిని దీని భక్తిదగ విన్న వధూమణి తండ్రిగేహమం
దనుపమగౌరవంబుఁ గను నట్టులె భర్తృగృహంబునందు మ
న్ననఁ గనుచుండు నేనరుఁ డనారత మీస్తుతివర్య కీర్తనం
బునఁ గడు ధన్యుఁడౌను బరిపూతమనోరథముల్ ఫలించెడున్. 299

తే. అంతియే గాక తత్తప మల్పకాల, ముననె సిద్ధిని గను వానిముఖమునుండి
వెడలు వాక్యము మదినుండు విమలచింత, ఫలమునందును నీస్తవ బలముకలిమి.

సీ. తొలుదొల్త స్కందునితోఁగూడి యున్నట్టి శివునకు దేవికి శివకరమ్ము
లగు కృత్యముల భక్తి నారసి యొనరించు నందీశునకును ధనంబుకొలఁది
బలి నిచ్చి శమదమంబులఁ గని తద్వ్రాతహారనామగణము యథార్హరీతిఁ
బఠియింపఁగాఁ దగుఁ బరమభోగంబులు లభియించు వానికి సభను బూజ

తే. గలుగు మృతినొంద స్వర్గంబు క్రమసుఖద
మలరుఁ బాతకములు విలయంబు నొంద,
ముక్తినొందును మనుజుండు; మోక్షనాథుఁ
డైన శితికంఠు స్తవము దక్షాభిమతము. 301

క. మనమునఁ గదిరెడు భక్తిని, ననయము పఠియింపఁ బోవు నఘజాలము చ
చ్చినయంత ప్రమథగణముల, కును బతి యగు దేవదనుజకూట వినుతుఁడౌ. 302

క. నందీశ్వరుఁ డాపురుషుని, సుందర మగు వ్యోమయానసురుచిరపదముం
బొందించి శంభులోకం, బందునుచును బ్రళయకాల మగువఱ కెలమిన్ 303

క. హరునకు ననుచరుఁడై సుస్థిరసంపత్తులర నుండు సిద్ధం బని యీ
శ్వరుమహిమ మెఱింగినమౌ, నిరమణుఁ డగు వ్యాసుఁడనియె నియతుఁడు గానన్.

క. ఇది యెవ్వరి కెఱిఁగింపఁ ద,గదు నీచున కెట్టితఱిని గాని యెఱింగిం
పఁదగదు వినిపింపంగఁ ద,గదు నిశ్చయ మిద్ది ఫలముఁ గల్గదు గానన్. 305

తే. ఎట్టులో పాపమతులు గౌరీశువినుతిఁ
బరమగుహ్యము దీనిని భవ్యదమును
వినుదురేఁ బుణ్యమతులొచు విమలపదము
నందు వారుసుఁడీ వైశ్యులంఘ్రిజులును. 306

క. వనితలు వినినన్ రుద్రుని, ఘనలోకము నొందుదురు నికామప్రమదం
బున విప్రవలనఁ బర్వము, నను వినినన్ శర్వపదమునన్ బ్రీతి దగన్. 307

తే. వాసమును గాంతు రింకేటి వాక్కు లొకటి
పలుకువాఁడను ద్విజులార పార్వతీశు
స్తవము దక్షకృతంబు మోక్షప్రదంబు
నిస్సమంబయి నెగడును నిర్మలగతి. 308

## ముప్పదితొమ్మిదవ యధ్యాయము.

### ఏకామ్రక్షేత్రమాహాత్మ్యము.

చ. అనియిటు లోమహర్షణుఁడు హారిహరస్తుతిరీతిఁ జెప్పె న
మ్మునులకు నంచు బ్రహ్మ మునిపుంగవులం గని పల్కె నెండి యి
ట్లనియెఁ బవిత్రమౌచు సకలాఘవిమోచనమై చెలంగు నీ
శుని వరనామకీర్తనము శుభ్రఫలప్రదమై తనర్చెడున్. 309

సీ. పార్వతీరోషంబు పరమేశుదుస్సహక్రోధంబు వీరభద్రుని యుదయము
భద్రకాళీసంభవము దక్షయజ్ఞవినాశన మద్రిజానాథుని దగు
నద్భుతపౌరుషం బల దక్షువిషయమై హరుసుప్రసాదంబు యజ్ఞభాగ
మాహరునకుఁ గల్గియమరసమ్మతమౌట యజ్ఞఫలంబును హరునికరుణ

తే. దక్షుఁ డొందుట తెల్పితి ధరణిదివిజ, వర్యులార యటంచు నాబ్రహ్మ తెలుప
మౌను లెల్లరు విస్మితమానసులుగఁ, జెలఁగి మున్గిరి సంతోషసింధువందు. 310

క. అనివ్యాసుఁడు వచియించిన, వినుచుఁ గథాశేష మెల్ల వివరింపుము మా
కని మౌను లనఁగ మరలను, వినిపించె నజుండు తెల్పువిధమునఁ బ్రీతిన్. 311

చ. వనరుహసంభవుండు హరువైభవ మిట్లు వచింప మౌను లిం
తని వచియింపరాని తమి నంగములం దొగి లోమరాజి ని
క్క నిటులు ప్రశ్నచేసి రల కాలగళాప్రతిమానపౌరుషం
బును మఖనాశనంబు క్రతుపూర్ణఫలంబును దక్షుఁ డొందుటల్. 312

క. సరసిజసంభవ! వింటిమి, పరమాద్భుత మద్ది వినినఁ బామరుఁడు మునీ
శ్వరుఁడౌ నేకామ్రేశ్వరు, చరితము వినిపింపు మింక స్వాంతము లలరన్. 313

క. అదివిను కౌతూహల మొ, ప్పఁ దగన్ మామదులయందు విశ్వేశ్వర! యం
చుదితప్రీతిం బల్కిన, ముదితుండై బ్రహ్మ చెప్పఁబూనెం దానిన్. 314

క. ధరణీతలమున యం దా, హరు క్షేత్రము భుక్తిముక్తి నందం జేయున్
వరమునులారా! మీకు వి, వరింతు నద్దాని వినఁగఁ బాపహరంబౌ. 315

తే. పరమదుర్లభ మయ్యది గిరిశలింగ, కోటియుతము వారాణసికోటిసమము
పేర నేకామ్ర మనఁగఁ బృథ్వీతలమున, ఖ్యాతిఁ గాంచెను దీర్థాష్టకమ్ము దనర.

క. ఏకామ్రవృక్ష మాస్థలి, భూకాంతముగాఁగ వెలసెఁ బూర్వసమయమం
దాకమ్రభూజనామము, ప్రాకటముగ క్షేత్రమునకు వఱలెం జుండీ. 317

సీ. మునులార! యాక్షేత్రము తదాది నేకామ్రకమన విఖ్యాతినిఁ గాంచె ననుచు
వినఁబడియెడు హృష్టమును బుష్టమును నగు జనతతిచే నిండి మనుజవర్య
లతివమిన్నలు వెలయంగ విద్వద్గణ మలరార ధనధాన్యములును దనర
గృహగోకులావళి యెంతయో కనఁ జెలువముగ నొప్పఁగ గోపురముల మిగుల

. భూషితంబయి బహువణిక్పుంజయుక్తి
నెసఁగి బహువిధమణిరాశి పొసఁగ విమల
వీథ్యలంకృతమయి బహువిధవినుతుల
కర్హమగుచు నిస్సమత విఖ్యాతిఁ గాంచి. 318

*క. పరమాట్టాలకయుతమై, నిరుపమకలహంసరాజి నిభసౌధాళిన్
బరికింప నగుచు సాలో, త్కరముల శోభిల్లుచు నది క్రాలున్ మిగులన్. 319

క. భూరితరద్వారావళి, చే రాజిలి శస్త్రసమితిచే రక్షితమై
సారపరిఖాళ్యలంకృత, మై రమ్యతరంబుగాఁగ నమరుచు మఱియున్. 320

క. సితరక్తంబులు శ్యామా, సితపీతంబులును నగుచుఁ జెలఁగెడువర్ణ
ప్రతతిం దగి వాతాహతి, నతిచపలతఁ గనుపతాక లమర నసమమై. 321

క. అనవరతోత్సవములచే, త నొప్పి వాదిత్రనివహ తతనాదములం
గన విన వర్ణింపం దగి, ఘనవీణావేణుముఖ సకల వాద్యములన్. 322

క. నిరత మ్మలరారుచు సుం, దరమర్దళి కాదు లొప్ప దైవతనిలయో
త్కరములను శ్రేపణీతతిఁ, గరము విరాజిల్లి నుతులఁ గాంచుచు సతమున్.

సీ. ప్రాకారవరముల భాసిల్లి, సురుచిరపూజార్హవస్తుసమూహయుతిని
మెచ్చుఁగాఁ దగి క్షేత్ర మచ్చటఁ జెలువారు ధరణీవిబుధులార ధన్యమైన
యేకామ్ర సుక్షేత్ర మింతటివైభవోపేత మం చెన్నఁగ విబుధవితతి
కైన శక్యముగాదు మానినీమణు లందుఁ దనుమధ్యలను పేరు తమకుఁ దగఁగ

తే. నిరతసంతుష్టలై యుందు నిర్మలమణి, హారసములంకృతగ్రీవ లగుచుఁ బద్మ
పత్త్రసువిశాలనేత్రలై పార్వణవిధు, సమముఖంబుల నొప్పుచు సతము వెలసి

క. పీనోన్నతకుచములఁ దగి, జానగు నలకముల నొప్పి చారుమహాకాం
చీనూపురముల నెసఁగుచు, నానారీమణులు పొల్తు రంగ ప్రభలన్. 325

సీ. సాధుశిరోరుహజాలంబు లొప్పార జఘనవిస్ఫూర్తి విశాలకర్ణ
యుగళ చారుత సకలోరులక్షణముల ఘనత భూషణములఁ గ్రాలునేర్పు
లసమానరీతిచే నలరారుచుండంగ దివ్యవస్త్రంబులఁ దేజరిల్లి
యాక్షేత్రమున నుందు; రందుఁ గొందఱు కాంచనాభదేహచ్ఛాయఁ గ్రాలువారు

తే హంసవారణగతులచే నలరువారు, సాధువక్షోజభరమునఁ జక్క నమ్ర
లైనవారును, దివ్యగంధానులిప్త, లైన వారును శ్రుతిభూష లమరువారు. 326

క. కొందఱు మదాలసలు మఱి, కొందఱు సుశ్రోణు లింకఁ గొందఱు హాసితా
నందమునఁ దగినవారలు, కొందఱు బింబోష్ఠములను గొమరుగులుకఁగన్. 327

* రాజహంసనిభైశ్చ భ్రైః ప్రాసాదైరుపశోభితమ్ = అనిమూలము.

ఆ. అలరుచుండువార లందుఁగొందఱు చారు
దంతపఙ్క్తి మధురతర రవంబు
లమరఁ జెలఁగు వార లుమఱి తాంబూలరం,
జితముఖాంబుజములఁ జెలఁగు వారు. 328

క. కనఁ దగురూపంబులఁ బ్రీతిని గూర్చెడుభాషణముల దివ్యంబగు యౌ
వనగర్వయుక్తిఁ జారిత్రనియతి నసమాన లగుచుఁ దనరుదు రెపుడున్. 329

మ. సురనారీగణ లస్మదుజ్జ్వలతనుస్ఫూర్తిన్ విడంబింతురే
సరియే నాగలతాంగు లంచు నరుదౌసౌందర్య మొప్పారఁగా
నిరతక్రీడల స్వీయసౌధముల వర్ణింపంగ శక్యంబి దె
వ్వరికౌ నన్న విభూతి నుందురు మహాభవ్యంబు క్షేత్రం బదౌ. 330

క. పురుషులు సురూపయౌవన, గరిమను దనరారుచున్న గర్వంబున నా
భరణవిభూషితతనువుల, సురుచిరలక్షణము లొప్ప శోభిలుదు రటన్. 331

క. ధరణీసురులును క్షత్రియ, వరులును వైశ్యులును బాదభవులును శాస్త్రో
త్కరకల్పిత నిజధర్మ, ప్రరతిన్ ధార్మికులు నొచు రాజిలుదు రటన్. 332

సీ. వర్ణచతుష్కాన్యవంశసంభవ మంది చారులోచనముల సరసగాన
ముల నలరారుచుఁ గలకంఠముల నొప్పి యాఘృతాచికి మేనకాఖ్యతరుణి
కారంభకును నూర్వశీరామకును దిలోత్తమకును సాటియౌ నమలరూప
మలరఁగా విశ్వాచియను నన్నుమిన్నకు విప్రచిత్తికి రూపవిభవమందు

తే. సాటియగుచుఁ బ్రమ్లోచకు సదృశలగుచుఁ
బ్రియముగా మాటలాడుచు విహసితాస్య
లగుచుఁ గళలందుఁ గౌశల మమర సుగుణ
మండితలుగాఁ జెలంగుచు మాన్య లగుచు. 333

తే. నృత్యగీతవిశారద లిలను వీరి, కంటె లేరనువిఖ్యాతిఁ గాంచి స్త్రీగు
ణాభిగర్వితలై వేశ్య లామనోజ్ఞ, పుణ్యభూమిని సతతంబు పొదలుచుంద్రు.

చ. పలుకులయందుఁ జాపలము భావముఁగన్పడఁ జేయునేర్పుచే
వెలయుచు సుందరాంగములఁ బ్రీతిని గల్గఁగఁ జేయఁజాలుచున్
స్థలమున నందుఁ జారుగతి సంగతినొప్పదు; రందు రూపమున్
గలుగనినారి వృత్తిసిరి గాంచని లేమయు నుండ దొక్కెడన్. 335

క. పరులకు ద్రోహము కల్గిం, చురతిం గలకాంత లేదుచూఁడి సత్య మిదౌఁ
బురుషులు వారికటాక్షో, త్కరమున మోహంబుఁ గనక తనరుటగలదే. 336

క. ధనహీనులు మూర్ఖులు రో, గనికరపీడితులు మలినకాయులు నీచుల్
మనమునఁ బగఁగల వారలు, కనదంగవిహీను లచటఁ గనరారుసుఁడీ. 337

ఆ. మాయఁ బూనువారు మంచివర్తనమునఁ, దిరుగ కుండువారు తివిరి పరుల
కార్తిఁ గూర్పఁదలఁచు నమ్మానవులు లేరు, ఖ్యాతిమించు క్షేత్రమందు నందు.

సీ. మునులార! పరమపావన మగు నేకామ్ర సుక్షేత్ర మయ్యది సుఖకరంబు
సర్వసత్త్వములకు సాధుసంచరణార్హ మఖిలజనాకీర్ణ మర్హసస్య
కలితంబు మఱి కర్ణికారచంపకములు పనస లశోకముల్ పాటలములు
నాగకేసర కపిత్థాగముల్ వకుళంబు లాయుశోకములు ధవావనీరు

ఆ. హములు చూత నింబ కాఖ్యము లమలక, దంబవృక్షములు నితాంతకుసుమ
నిబిడపుణ్యభూజ నికరంబు లతివిమ, లకుసుమముల వెలయు లతలు చెలఁగు.

వ. మఱియు సాల తాల తమాల నారికేళ శుభాంజనార్జున పిప్పల సప్తపర్ణ కోవి
దార లకుచ సరళ లోధ్ర హింతాల దేవదారు పలాశ ముచుకుంద పారిజాత
కుబ్జక కదళీ జంబూ పూగ కేతకీ కరవీ రాతిముక్త కింశుక మందార కుంద
ప్రముఖఫలకుసుమసాంద్రద్రుమ విరాజితంబును, నానాపక్షివర రవసేవ్య నంద
నోపమోద్యాన నిబిడితంబును, ఫలభారానత భూరుహవితానమ్ముల సర్వసత్త్వ
సముత్కరంబుల విలసితంబును, చకోరశతపత్ర భృంగరాజ, కోకిల, కలవింక,
మయూర, ప్రియపుత్ర, శుక, జీవంజీవక, హారీత, చాతక, ప్రముఖనానావిధ
మధురస్వనవిరాజత్పక్షిగణ దర్శనీయంబును, దీర్ఘికా తడాగ పుష్కరిణీ వాపీ
ప్రముఖ పద్మినీ ఖండ మండిత నానాజలాశయప్రమోద ప్రదంబును, సుప్రస
న్నసలిలవిమలసరోవర మనోహరంబును, కుముద,పుండరీక, నీలోత్పల, ముఖ
కుసుమామోద మనోజ్ఞంబును, గాదంబచక్రవాకజలకుక్కుట, కారండవ,ప్లవ,
హంసప్రముఖ జలచరనిబిడంబును, నై యొప్పుచుండు. 340

క. మునివరులారా! యీవిధ,మున నానావిధ మహీజములఁ బుష్పములన్
ఘననీరాకరములఁ బా,వనభూస్థల మద్ది మిగుల భాసిలుచుండున్. 341

క. ఆస్థలి వృషభధ్వజుఁ, డాసురసంహరణనిపుణుఁ డార్యావిభుఁ డు
ద్భాసితగజచర్మాంబరుఁ, డాసర్వవిదుండు లోకహర్షప్రదుఁడై. 342

తే భుక్తిముక్తుల నొసఁగెడు భూరిశక్తి
వాస మొగిఁ జేయుచుండు విశ్వంభరనుగ
లట్టి తీర్థముల లెన్నియో యఘము నడఁచు
నట్టినదులు సరస్సులు నంబుధులును. 343

తే పుష్కరిణులు తడాగముల్ భూరివాపి
కలును గూపవ్రజంబులు గలవొ యెన్ని
వానినుండియె జలబిందువార మొప్ప
వేలువేలుగఁ దెచ్చి యావిశ్వభర్త. 344

క. సురయుతుఁడై లోకహితం, బురుతరముగఁ జేయనెంచి యొనరిచెఁ బూన్కిన్
నిరుపమము బిందుసర సన, ధరఁ బ్రఖ్యాత మగుపేరఁ దద్దయు వెలయన్. 345

క. మునులనుగూడి సరోవర,మును బిందుసర స్సనంగఁ బొల్పు గనంగా
నొనరిచె నోమునులారా! వినుఁ డవ్వలిచరిత మెల్ల వేడుకమీఱన్. 346

తే. శ్రోత్రాదివిజులార! మార్గశీర్షమున బహుళ
పక్ష మందష్టమీతిథిఁ బరమభక్తి
నెవఁడు బిందుసరస్సన నెసఁగుక్షేత్ర
మందు యాత్రను జేయునో యతఁడు సుకృతి. 347

సీ. విజితేంద్రియుండయి విషువంబునన్ బిందుసరసున స్నానంబు సలిపి శ్రద్ధ
యలరఁగా దేవమునులకును బితరులకును మనుష్యులకును గోర్కిమీఱఁ
దర్పణం బొనరింపఁ దగునామగోత్రంబు లుచ్చరించుచు దాన నొప్పు నశ్వ
మేధయజ్ఞఫలంబు మిహిరశీతాంశూపరాగంబునందు సంక్రాంతియందు

తే. నయనమున షడశీతి యుగాది ముఖ్య, పుణ్యతిథులందు నెవ్వరు భూసురులకు
శక్తి కనురూపముగ ద్రవ్యసంచయంబు,దాన మిత్తురో యాపుణ్యమానవులకు.

క. ఇతర క్షేత్రకృత సుకృత, హితకృత్త్యాగతఫలంబు నిందు ద్విగుణమై
సతతము గల్గుచునుండును, బితరుల కేనరులు భక్తి బిందుసరసునన్. 349

తే. పిండదానముసేసి సంప్రీతి ద్విజులఁ, గొలుతురో వారు పితరులకును నిరంత
రము మహాప్రీతికరు లన రాజిలుదురు; సంశయములేదు దీని కోసాధులార.

సీ. ఈరీతిఁ దీర్థంబు నిద్ధమునీడ్యంబు సేవించి యవ్వల శీతరశ్మి
ధరుని యాలయమునకరిగియతేంద్రియుఁడగుచు వాఙ్నియమంబు నాత్మశుద్ధి
యలరఁగా శంకరు నర్చింపఁదగుఁ బ్రదక్షిణపూర్వకంబుగా క్షీరములను
ఘృతమున స్నానంబు నతిభక్తిఁ జేయించి వరచందనమున లేపనముచేసి

తే. చంద్రమౌళి నుమాపతిఁ జారువివిధ, పుష్పముల బిల్వముఖపత్రపూగములను
బూజసేయఁగఁదగు వేదములను నాగ,మములఁ జెప్పినరీతిని సమధికముగ. 351

క. ఆగమదీక్షం గైకొన, కేగతినో పూజచేయ నెంచునరుం డ
య్యాగమవేద్యుని మూలము, నాఁగఁబరఁగు మంత్రముననె యర్చింపఁ దగున్.

క. ఈరీతి గంధపుష్పా, ద్యారూఢాలంకృతుల నుమాధీశుని లో
కారాధ్యు ధూపదీపము, ఖారాధనములను దనుప నర్హాముసుండీ 353

సీ. అమలనైవేద్యోపహారంబులను స్తుతివరముల దండవత్ప్రణతుల మృదు
గీతవాద్యంబుల ఖ్యాతనృత్యంబుల జపముల బహువిధ జయజయధ్వ
నులఁ బ్రదక్షిణవితతుల విధిమీఱఁగాఁ బార్వతీపతి దేవపతి మహేశుఁ
బూజసల్పిన బాపపుంజంబు లెడఁబాయు రూపయౌవనములు రూఢికెక్క

ఆ. నిరువదొక్కకులముఁ బరమపవిత్రమౌ, కరణి నొనరఁజేసి కాంతరత్న
భూషణముల నొప్పి భూరియజ్ఞంబులఁ, జేసి దాతలగుచు క్షితిపతులయి. 354

వ. ముక్తీశ్వర సిద్ధేశ్వర స్వర్ణజాలేశ్వర పరమేశ్వర సూక్ష్మైకామ్రేశ్వర నామంబులం బరఁగు నాయుమాపతి నెవరు పూజించి దర్శింతురో. వా రాబిందుసరస్స్నానపుణ్యంబునను భవానీపతి పూజనంబునను గింకిణీ జాలమండితదివ్యవిమానారూఢులై గంధర్వాప్సరోగీయమానులై దిక్కుల వెలిఁగించుచు శివలోకంబునకుం బోయి సుఖసంతతు లనుభవించి యాలోకవాసులంగూడి సృష్టినశించునంతదాఁక నందుండుదురు. పుణ్యక్షయంబు గాఁగా భూలోకంబున యోగుల గృహంబున జన్మించి వేదవేదాంగపారగులై పాశుపతయోగంబు సాధించి ముక్తిం జనుదురు. మఱియును. 355

క. అయనంబుల సంక్రాంతుల, శయనైకాదశిఁ బ్రబోధసమయమున బిలే
శయరాట్సుయనుని గొల్తురొ, నియమంబునఁ దత్తిథిని వినీతమతులునై. 356

క. పరశివు నాతనిఁ జూడఁగ, నరుదే మోక్షంబు; మఱియు నందు నశోకా
ఖ్యరహింగను నష్టమి నా, దరమున శివుఁ గాంచ నగు ముదంబు సతంబున్.

క. అనఘుఁ బవిత్రారోపణ, మనఁ బొల్చెడు తిథి నుమేశు నర్చించి తగన్
గనుఁగొందురొ వా రరుగుదు, రనుపమముక్తికి విమానమందు నలరుచున్

క. నిరతం బేకామ్రేశ్వరు, హరు నెవ్వరు గాంతు రట్టి యమలాత్ము లఘౌ
త్కరవిరహితులై పోదురు, పరశివలోకమున నుండఁ బరమాదృతిచేన్. 360

సీ. ఏకామ్రనాథుఁడౌ నీశునాలయమునకును దూర్పుపడమరలను నుదీచి
దక్షిణమునఁ జూడఁ దక్షేత్రమరయ సార్ధద్వియోజనమాత్ర ధరణి వెలయు
నాభూమి భుక్తిని నపవర్గము నొసంగు నందులింగము మహార్హమ్ము భాస్క
రేశాహ్వయంబున నెల్లకోర్కుల నీయఁజాలియుండును దాని సాధుభక్తిఁ

ఆ. గాంచువారు తొలుతఁ గమ్రకుండంబున, స్నాతులగుచుఁ బిదప శంభుఁ గాంచ
వలయు భాస్కరుండు వామదేవుని మున్ను, భక్తిఁ బూజచేసెఁ బరమనియతి

క. కనుకనె భాస్కరలింగం, బను పేరు ప్రసిద్ధమయ్యె నాలింగవరం
బును గాంచువారు పాతక, వననిధిఁ దరియించి దేవవరయానమునన్. 362

క. కలగీతంబుల గంధ, ర్వులు పొగడుచునుండ శంకరుని లోకమునం
గలకాలము వసియించెదు, విలసత్కాంక్షలను బోయి వేడుక నందున్. 363

తే. కల్పమొక్కండు నివసించి కమ్రభోగ
వితతి ముదమంది మరలఁ బృథ్వీతలమునఁ,
బ్రవరకులమున జనియింత్రు వివిధ వేద
వేత్తలై యోగిగృహములఁ విమలజనిని. 364

క. కని భూతహితంబును సత, మును జేయుచు మోక్షశాస్త్రమునఁ బండితులై
మనము సమత్వముగన నీ, శునియోగము గల్గి ముక్తిఁ జొత్తురు త్వరఁగన్.

చ. శ్రుతిసురులార! పుణ్యదము క్షేత్ర మహో నట లింగమొండు వి
చ్యుతి గననట్టిదా మహిమ యొప్పఁగఁ గన్పడుచుండుఁ బూజ్యమై
మతివిభవంబు పేర్మి వనమధ్యతలంబున మార్గమధ్యమం
దితరధరాతలంబుల నదెందును గాని వసించు చుండినన్. 366

ఆ. మఱి చతుష్పథమున మనుజుల యంతంబుఁ, దెలుపు నాశ్మశానతలమునందు
నెందుఁగాని యున్న యేనరుఁడైనను, భక్తి లింగవరము వరశుభదము. 367

క. పరమశ్రద్ధామతియై, పరికించినచో విముక్తిఁ బడయును; భక్తిన్
బరశివలింగమ్ము మునో, హారచందనపుష్పముల సమర్పించి విధిన్. 368

తే. ధూపదీపనైవేద్యముల్ స్తుతులు వంద
నములు దండాకృతిం బెట్టు నమలఫలద,
ములగు ప్రణిపాతములు నృత్యములును గీత
ముఖములగు నుపచారసమూహములును. 369

క. ఒనరంగ శివుని బూజిం, చినచో శివలోకమునకుఁ జేరు నరుం డో
మునులార! వనితయైనను, మును చెప్పినరీతి శ్రద్ధఁ బూజించినచోన్. 370

క. ఫలమును బొందునుజుండీ, కలఁగం బనిలేదు ఫలము గల్గునెయని యా
యలఘుక్షేత్రమహాగుణ,ముల లెక్కింపంగఁజాలు, బుధుఁడున్ గలఁడే. 371

క. పరమేశ్వరుఁ డొక్కండే, నిరుపమ తత్క్షేత్రసుగుణనివహము నెఱుఁగున్
గర మనురాగంబున శం,కరు క్షేత్రము దానిఁజూడఁ గల్గు శుభంబుల్. 372

తే. శ్రద్ధఁ బూనియొ లేక యశ్రద్ధఁగొనియొ, మాధవాదిమాసంబుల మనుజుఁడేని
వనితయే నేతిథినిగాని వరసరసున, స్నాన మొనరించి సద్భక్తసకలఫలదు. 373

క. వరదుని శంకరు, వరదను, బరమేశ్వరి నేకదంతుఁ బ్రమథగణేశున్
శరజన్ముఁ జండు వృషభే, శ్వరుఁ గల్పద్రుమము నల్లి సావిత్ర్యాఖ్యన్. 374

క. కనుఁగొని పూజించిన నీ,శుని లోకమునందు నుండ్రు శుభఫలదంబై
తనరారు కపిలతీర్థం,బున నఘనాశనమునందు మునుకొనుభక్తిన్. 375

తే. స్నాన మొనరింపఁ జిత్తవాంఛలు ఫలించు
నెవఁడు నా క్షేత్రవరమున నెలమిఁ దీర్థ
మొనరుచునో నియతేంద్రియుఁ డనఘుఁ డాతఁ
డేకవింశతికులముల నిద్ధకీర్తి. 376

తే. వెలయఁ జేయుచు శివలోక మెలమి నొందుఁ
దత్కులజు లెల్ల శంభుపదమును బొందు

దురుసుఁడీ; కాశికాఖ్యనగరసమమ్ము
క్షేత్ర మయ్యది మునులార సిద్ధమిద్ది. 377

తే. అందుఁగల తీర్థరాజంబులందు మునిఁగి
భక్తి శంకరులింగంబుఁ బాపహరముఁ
గాంచు నెవ్వఁడు వాఁడు మోక్షంబు నొందు
సత్య మిది సత్య మియ్యది సత్యమిద్ది. 378

—◆—

నలువదియవ యధ్యాయము.

విరజాద్యష్ట తీర్థవర్ణనము.

సీ. విరజనామకమందు విరజాఖ్యమాత బ్రహ్మాణి ప్రతిష్ఠ చేయంగఁబడియెఁ
దద్దర్శనమున సప్తకులంబులం బావనములుగా నొనరించి నరుఁడు తానుఁ
బావనుఁడౌ నొక్కపర్యాయ మాయంబ భక్తిచేఁ బూజించి వందనములఁ
దనుప స్వవంశము తా నుద్ధరించి నాలోకంబునకు వచ్చుఁ బ్రాకటగతి

ఆ. ననుచు బ్రహ్మ పలికి మునులకు మఱియు ని
ట్లనియె విరజమందు వినుతిఁ గాంచు
చున్న లోకమాత లుందురు వారెల్లఁ
బాపముల హరింప వరము లొసఁగ. 379

క. తమభక్తులఁ బాలింపఁగ, సుమహిత శక్త్యతిశయముల శోభిల్లుదు రో
యమలాత్ములార యాక్షేత్రమునఁ వైతరణినదియుఁ దగఁ బొలుపారుఁ 380

క. పాపహరకృత్యమున సందీపించును శక్తి నదియు దివ్యనదిని నే
పాపి జనుండే స్నానముఁ, గావాడు మటంచుఁ జేయఁగల్గునొ యతఁడుఁ 381

తే. సకలపాపవిముక్తుఁడౌ స్తాసురేంద్రు, లార యచ్చట నిరుపమాకార మూని
దంష్ట్రిరూపంబునఁ హరి తనరుచుండు, నతని దర్శింపఁ దత్పద మందు నరుఁడు.

వ. కపిల, గోగ్రహ, సోమాలాబుతీర్థంబులయందును, మృత్యుంజయ, క్రోడ, వాసుక, సిద్ధకేశ్వర తీర్థంబులయందును మతిమంతుఁ డగునరుండు స్నాన మొనరింపం దగు, ఈయష్టతీర్థంబులయందు విధిమెఱయ స్నాన మొనరించి దేవతల దర్శించి నమస్కరించిన సర్వపాతకనిర్ముక్తుఁడై విమానారూఢుండై గంధర్వగీయమానుండై బ్రహ్మలోకంబు నొందుమఱియు. 383

క. విరజం బనుమక్షేత్రం, బరుదుగఁ గన్పడుడు నందు నతిభక్తిని నే
నరుఁ డొగిఁ బిండం బిడునో పి, తరులకు నది చాలఁ దృప్తిఁ దాఁ గల్పించుఁ.

క. అనుమాన మొందవల దో, మునులారా మానుకంబు పూజ్యతమమునై
తనరెడు విరజక్షేత్రం, బున దేహము వదలు నరులు ముక్తులుసుండీ. 385

తే. సాగరంబున స్నానంబు సలిపి కపిలు
హరిని వారాహిదేవిని నిరతభక్తిఁ
గాంచు నాతఁడు పొందు స్వర్గంబు; లోక
మందు నెన్నియొ తీర్థమ్ము లలరుచుండు. 386

క. అమరాలయములు పావనతమములు గల వెన్నొ మానితల్లజులారా
సమ మిది యని తత్క్షేత్రమునకుఁ జెప్పంగఁదగు పదంబు ధరణిలోనన్. 387

క. కనరాదు వెదకిచూచిన, ఘనపదములు దానియందె కలవు తెలుపువాఁ
డను సాగరమున కుత్తరమున ముక్తిప్రదము పుణ్యమూల మసమమున్. 388

సీ. అతిగుహ్య మఘరాశిహరణచణంబు నెల్లెడ వాలుకాకీర్ణ మెల్ల కామ
ముల నిచ్చునది యామడలు దశసంఖ్యలు తనవిస్తృతిం దెల్పఁ దనరునదియు
సరళపున్నాగవృక్షము లశోకంబులు వకుళార్జునంబులుఁ బనస నారి
కేళముల్ సాలముల్ తాళకపిత్థచంపకకర్ణికార బిల్వద్రుమములు

తే. నామ్రపాటల కోవిదారాహ్వయములు,మఱి కదంబలకుచనామ మహితతరువు
లామలక నాగకేసరా హ్వయము లమ్లై, ఖదిరధవలోధ్రనారంగ కద్రుమములు.

వ. సమీచ సర్జ భూర్జాశ్వకర్ణ తమాల దేవదారు మందార పారిజాత న్యగ్రో
ధాగురు చందన ఖర్జూ రామ్రాతక, సిద్ధ ముచుకుంద కింశు కాశ్వత్థ సప్తపర్ణ
మధుధార శుభాంజన శింశు పామలక నీప నింబ తిందు విభీతక మహీజంబులు
సర్వర్తుఫలగంధాఢ్యంబులై సర్వర్తుకుసుమవిభూషితంబులై మనోహ్లాదకరం
బులై శుభవిహగనాదమధురంబులై శ్రుతిరమ్యంబులై మనఃప్రీత్యుద్దీపకం
బులై తనరుఖగవాక్కులఁ దేజరిల్లుచుండఁ జూడఁ దగియుండు. మఱియు
నాక్షేత్రవర్యంబునఁ జకోరశతపత్ర భృంగరాజ శుక కోకిల కలవింక హారీత
జీవజీవక ప్రియపుత్ర, చాతకప్రముఖ వితత మధుర రవ పతత్రి సంఘంబు
లొప్పార నయ్యది చూడఁ దగియుండు. ఆ క్షేత్రవర్యంబు కేతకీవనంబుల
చేత నతిముక్తకుబ్జకమాలతీకుందబాణకరవీర సితేతర జంబీరారుణ కంకోల
దాడిమీబీజపూరక మాతులుంగ 'పూగహింతాలవనములచే, మనోహరంబై,
లతావితానగుల్మ వివిధవిధ జలాశయ దీర్ఘికా తడాగ పుష్కరిణీ వాపీ నివ
హంబులు పద్మినీవితానవిరాజితంబులై తనయందు నమర నలరారుచుండు.
మఱియుఁ బ్రసన్నసలిలంబులు గలసరోవరంబులు కుముద పుండరీక నీలోత్పల
కహ్లార కమలాన్వితంబులై యాక్షేత్రంబునఁ గానం బడు. వానియందుఁ
గాదంబ చక్రవాక జలకుక్కుట కారండవ ప్లవ హంస కూర్మ మత్స్య మద్గు,
దాత్యూహ సారస పతత్త్రులు విహరించుచుండు. మఱియు వర్ణనాతీత పతత్త్రి
కూజితంబు లందు వినంబడుచుండు వివిధవిచిత్ర కుసుమంబులు, జలచరంబులు
పక్షులు వానియందుఁ గనంబడుచుండు. జలగజంబు లాసరోవరజలంబుల

మునుంగుచు లేచు చుండు. తత్క్షేత్రంబున బ్రహ్మచారులు గృహస్థులు వాన
ప్రస్థభిక్షుకులు స్వధర్మనిరతులై యొప్పారు చుండుదురు. హృష్టపుష్ట జనం
బులు నివసింప నారీమణులు సంచరింప నాక్షేత్రం బశేషవిద్యానిలయంబై
సర్వధర్మగుణాకరంబై పరమదుర్లభంబై తనరారుచుండు. 390

ఉ. అందు మునీంద్రులార! కమలాధిపుఁ డుత్కలదేశవాసు లిం
పొందఁగ నెట్టిపద్ధతుల నోర్పున నాచరణంబు లందుఁ గూ
ర్పం దలపోయుచుండుదురొ బాగుగ వానికి సర్వమైనరీ
తిం దగి యుండుఁ జూండి వినుతిం గనుచుఁ సురవర్యసంతతిన్. 391

తే. దేశ మయ్యది దిక్కీర్తిమదీప్యమాన
మగునొ యెందాఁక శ్రీకృష్ణు నాదరమున
నంతదనుకను బుణ్యతమా హ్వయమున
విమలవిఖ్యాతి నొందు భూవిబుధులార. 392

చ. ధరణి నదెందు విశ్వమయతం దగురూపముతోడ నమ్మహా
పురుషవరేణ్యుఁ డుండును విభూతి చెలంగఁగ నాస్థలంబు సుం
దరమయి పావనంబునయి తత్త్వవిదుత్తమవాసయోగ్యమై
పరఁగును దానికిఁ సమత పర్వెడు క్షేత్రము లేదు చూడఁగన్. 393

క. అతఁడె జగన్నాథుం డన,వితతఖ్యాతిం దనర్చు విబుధేశుం డా,
శితిగళుఁడు నేను దక్కన,హుతవహముఖనిర్జరులు మహోత్సవలీలన్. 394

క. అందు సదా నివసింతుము, బృందారకవరులును బితృవితతియు దివిష
త్సుందరులును గంధర్వులు,బృందంబులుగా మహేంద్రవిభవ మ్మలరన్. 395

సీ. వసియింతు;రందు సద్వ్రతముల నలరారు మునులు యక్షులు సిద్ధులును బ్రజాధి
పతులగునాకశ్యపప్రభృతులును, విద్యాధరుల్ వాలఖిల్యాదులైన
నియతమానులు నాగనివహంబు కిన్నరుల్ గరుడులు శ్రుతిచతుష్కంబుసాంగ
మఖిలశాస్త్రము లితిహాసపురాణముల్ వివిధదక్షిణలను వెలయుక్రతువు

తే. లెల్ల నదులును వివిధహృదిష్టదాన
దక్షము లగుతీర్థంబులు దైవనిలయ
ములును సాగరములు శైలములును నచట
వెలయుచుండును మాటలు వేయు నేల? 396

క. సురమునిపితృసేవిత ము,శ్వరఁ బుణ్యతమంబు భోగరాజిసహితముఁ
గర మరువగునదియగుశ్రీ,పురుషోత్తమపదమునందుఁ బూన్కి వసింపన్. 397

క. ఎవని మన సొప్పకుండుఁ?, సువిహితదేశంబు జగతిఁ జూడఁగ నెందే
ని విమలమై వేఁ టొక్కటు,స్తవమున కర్హముగ నుండఁ దగు నెబ్భంగిన్. 393

క. పురుషోత్తముఁ డెచ్చటఁ గా,పుర ముండునో ముక్తి నొసఁగఁ బూని యలమహా
త్తరపదమునకంటెను సు,రవ్వర వేలోకఁ డధికపదము రాజిలు నెట్టుల్? 399

క. వినుఁ డీయుత్కలదేశం,బున వాసము చేయుచున్న పురుషులె ధన్యుల్
ఘనకీర్తియుతులు నవ్వా,రిని మించిన వార లీధరిత్రిం గలరే. 400

చ. అనుపమ తీర్థరాజమునయం దొగి స్నానము చేసి శ్రీహరిం
గనిన నరుల్ సుపర్వపురకమ్రతరస్థలులన్ వసింతు రా
మనుజుల కా యమాలయముమాట వినంబడకుండు; నుత్కలం
బునఁ దగు క్షేత్రవర్యమునఁ బుణ్యదమై తగు దానియందునన్. 401

క. వసియింపంగా జీవిత,ము సఫలమౌఁ గాన నందు మునుకొను వేడ్కన్
వసియించు మనుజులకు సము,లెసఁగెడు పుణ్యుం గనంగ నిద్ధరఁ గలరే? 402

సీ. సుప్రసన్నములును శుభము లాయతములు నగు నేత్రములు గల్గి యనుపమాన
హారిభ్రుకేశస మాయతమకుటంబు తనరఁ గర్ణయుగావతంసములును
జారుదంతంబులు హారిస్మితంబును శుభ్రనాసికయును శుభకపోల
ములు సులలాటంబు లలితలక్షణములు వర్ణనాతీతమౌ భంగి వెలయ
తే. లోకముల మూఁడిటం గల్గు లోకులకు మ
హాత్తరానందజనకుఁడై యమరవంద్యుఁ
డైన శ్రీకృష్ణుని ముఖాబ్జ మే నరుండు
గనఁగఁ గల్గునో సఫల మాతనిభవంబు. 403

---

నలువదియొకఁడవ యధ్యాయము.

అవంతీపురమాహాత్మ్యము.

చ. అని వచియించి పద్మభవుఁ డామునులం గని పల్కె నిట్లు గా
ఘనమునులార! ప్రాక్కృతయుగంబున నింద్రునిఁబోలు విక్రమం
బున సిరిమించఁగా వెలసె భూమిపతీంద్రుఁ డొకండు కీర్తిచేఁ
దనరుచు సత్యవాది శుచితం దగువాఁడు సమస్థుఁ డీద్యుఁడున్. 404

క. పే రింద్రద్యుమ్నుం డన, ధారణి వెలుగొందె శస్త్రధారులలో నీ
వీరుఁడె మేటి యనంగా, భూరితరఖ్యాతి మించె మునులు నుతింపన్. 405

క. శూరుఁడు దాతయు భోక్తయుఁ, జారుతనూసుందరతను జాల ఖ్యాతుం
డారయ సుభగుఁడు యష్టయు, సారధను ర్వేద వేదశాస్త్ర నిపుణుఁడున్. 406

తే. ప్రియము పుట్ట మాట్లాడ నేర్చినఘనుండు
జ్ఞాని సూనృతసంగరుఁ డానతారి,
పూర్ణశశిభంగి వనితలఁ బురుషవరుల
నలరఁ జేయును దుష్ప్రేక్ష్యుఁ డర్కుభంగి. 407

క. అరిజనభయంకరుండును, సరసిజనయనాంఘ్రికమల సంసక్తాత్ముం
డురుబలుఁడు జితక్రోధుఁడు, నిరతము విజితేంద్రియుండు నిర్మలమతియున్.

సీ. అధ్యాత్మవిద్యాసమావృతిఁ గనుమేటి ధర్మతత్పరుఁడు ముక్తసుజనాభి
రతుఁడు ముముక్షుండు రమ్యయశశ్శాలి సర్వగుణాఢ్యుండు జనహితుండు
నయి రాజ్యమేలె భూదయితుఁ డింద్రద్యుమ్నుఁ డతనిబుద్ధియుఁ దగె హరిసమర్చ
నము నొనరింప నెంతయు దృఢభక్తితో నంత నాతం డెట్లు హరి భజింపఁ

తే. దగునో యేక్షేత్రమున జనార్దను సురేంద్ర
విభుని నేతీర్థమున నదే విమలనదిని,
నేమహాశ్రమమునయందు నెట్లు పూజ
చేయఁదగునో యటం చెదఁ జింతఁ బూనె. 409

చ. మనమున నిట్లుగాఁ దలఁచి క్ష్మాపతి తీర్థగణంబు నెల్లప
త్తనముల దేవతాయతన తల్లజసంఘము నిర్ణయించి ము,
క్తినొసఁగఁ జాలి క్షేత్రవితతిం గడు హెచ్చయి పుణ్యరాశినా
జననుతిఁ గన్న క్షేత్ర మిది చాలదె నే హరిఁ బూజచేయఁగన్. 410

క. పురుషోత్తమాహ్వయంబునఁ, బరఁగెడుఁగద యంచు భూమిపాలుం డటకుం
బరమాదరమునఁ బరిజన, పరికరయుతిఁ జనియె భక్తపాలు భజింపన్. 412

క. చని యందు నశ్వమేధం,బున శ్రీపతి విధియుతముగఁ బూజించి ముదం
బున ఋత్విజులకు దక్షిణ, లనుపమభంగిగ నొసంగె నందఱు మెచ్చన్. 411

క. హరికిం బ్రాసాదవరం, బురుతరమును జేయఁబంచి యొప్పుగ నట శ్రీ
హరిసంకర్షణమూర్తిని, దరుణీమణినిన్ సుభద్రఁ దా స్థాపించెన్. 413

ఆ. తీర్థపంచకము విధిప్రహితంబుగ, వీర్య మలరు భూమివిభుఁడు త్రవ్వఁ
బంచి స్నాతుఁడయి తపంబును దానహో, మములు చేసి హరిని మాధవునిని

తే. భక్తి దర్శించి పూజించి పరమపురుషు
నకును బ్రాసాదవరము విన్నాణమొప్పఁ
గట్టఁగాఁ బంచి దృఢభక్తి కడలుకొనఁగ
ముక్తినొందెను భూపతి మును లలరఁగ. 415

క. హరి మార్కండేయుని వట, తరువును బలరాముఁ జూచి తత్పరతన్ సా
గర మింద్రద్యుమ్నాఖ్యను, బరఁగెడు నందున్ మునింగి పరమపదంబున్.

క. కను నేనరుఁడైన నన్, విని మౌనులు పల్కి రిట్లు వినిపింపుము త
జ్జనపతి యెవ్వఁడు? పనిదే, నిని బూని విముక్తిదమయి నెగడి శుభదమై. 417

క. పరమంబై తనరారుచుఁ, బురుషోత్తమ మనఁగ జగతిఁ బొగడొందిన యా
పరమక్షేత్రమునకు నె, వ్వరినిం బూజింప నేగె వరుసం జెపుమా, 418

క. నరపతి యింద్రద్యుమ్నుం, డురుభక్తిన్ వాజిమేధ మొప్పుగ నొనరిం
చి రమానాయకు నేగతి, నిరుపమవిధిఁ బూజచేసె నీరేజభవా. 419

సీ. సకలఫలంబు లొసంగఁజాలిన యల పరమదుర్లభదివ్య పదమునందు
మూఁడులోకంబుల నీడు లేనట్టి ప్రాసాద మెవ్విధి శాస్త్రసరణి మెఱయఁ
గట్టించె? శ్రీకృష్ణుఁ గాంచనాంబరు హాలి బలరాము నట్లె సుభద్ర నెట్లు
నిర్మించె లక్షణనిచయంబు వెలయంగ నమ్మహీపాలుఁ డత్యాదరమున

తే. నట్టిప్రాసాదమునయందు నఖిలదేవ, వరులఁ గృష్ణాదులను భక్తి వఱలఁజేసె?
నీవిధం బెల్ల విస్తృతి నెఱుఁగఁ జెప్పు, వయ్య మాకెల్ల సంశయ మడఁగు నట్లు.

క. అతిసంగ్రహముగఁ జెప్పిన, నతిమోదము తృప్తి గల్గ దబ్జోద్భవ మా
మతిఁ దృప్తిగల్గ వాక్యా, మృతమును గురిపింపవయ్య యిప్పుడు ప్రీతిన్. 421

క. విన వేడుకయ్యె మాకున్, వనజోద్భవ యనిన మౌనివరులారా! చ
క్కనిప్రశ్న మిద్ది సుండీ, సనాతనం బెల్లపాపసంహారణంబున్. 422

తే. భుక్తిముక్తుల నొసఁగును బుణ్యతమము
నైన యారాజచంద్రుని యఖిలచరిత
మిపుడు తెల్పెదఁ; గృత మన నెసఁగుయుగము
నందు నెవ్విధి జరగెనో యట్లు మీకు. 423

చ. వినుఁ డవధానతం దనరి వేడుకతోడ జితేంద్రియత్వముం
గని చరితంబు నే వినెడుకాంక్ష చెలంగఁగ నంచు నబ్జజుం
డనిరెు; నవంతినామమున నార్యయుతిం దగుపత్తనంబు పెం
పునఁదగు మాళవంబున విభూతి నెసంగుచు నుండు నాపురిన్. 424

క. భూపతి యింద్రద్యుమ్నుం, డేపారుపరాక్రమమున నెసఁగుచు నుండున్
దీపించు నాపురవరం, బీపుడమికి భూషణముగ నెల్లవిధములన్. 425

చ. తనరుచు హృష్టపుష్టజనతాయుతి మించుచు నర్గళాళి యం
త్రనికరముల్ చెలంగఁ దగుద్వారములన్ బరిఖాగణంబునం,
గనఁదగి సద్వణిగ్వ్యుతి నికామము పొల్చి యమూల్యవస్తురా
జిని దగునట్టు లమ్మఁదగు శ్రీయుతు లెంతయు నొప్పఁబొల్చుచున్. 426

సీ. రథ్యాపణంబుల రాజిల్లి త్రికచత్వరములభూషితమయి రమ్యతరము
లైన యట్టాలక మాననీయచతుష్పథములఁ గనుంగొనఁ దగుచు గేహ
గోపురసంబాధమై పటువీథుల సమలంకృతంబయి సారరాజ
హంససన్నిభ శుభ్ర హారిచిత్రగ్రీవ బహువిధ ప్రాసాద పటలదృశ్య

తే. మగుచు యజ్ఞోత్సవావళి నలరి విమల, గీత వాదిత్ర నిస్స్వన ఖ్యాత మగుచు
భూరివర్ణ పతాకా భిభూషిత మయి, ధ్వజసమూహమనోజ్ఞమై పావనమయి.

చ. కరిహయరాజి స్యందననికాయము పత్తిగణంబు సాంద్రమై
పరఁగ సమీరకశూర భటవారము లొప్పఁగ గ్రామవాసులౌ,
పురుషులు క్రమ్మియుండ వరభూసుర బాహుజ వైశ్యశూద్రు లా
దరమున వాసముల్ సలుపఁ దత్పుర మొప్పు నితాంతభూతిచేన్. 428

తే. వేదశాస్త్రాళిఁ బాండితి విస్తరిల్ల, నీడులేక విద్వాంసులు గూడియుండ
నాపురంబొప్పుఁ దిలకమై భూపురంధ్రి,కందు మలినులు మూర్ఖులు నరయలేరు.

క. బలహీనులు కనఁబడ రా,స్థలమున రోగులును ద్యూతసరణి బ్రదుకువా
రలు నంగహీనులును లే, రెలమిం దగువారె యందు నెసఁగుదు రెపుడున్.

క. సుమనసులుగాఁగఁ బురుషులు, ప్రమదలు నొప్పుదురు రేలుఁ బవలును సమ్మో
దమునం గ్రీడింతురు నె, య్యమె వారికి భూషణ మని యరయఁ దగుఁజూఁడీ.

చ. సురుచిరవేషభాషలను శుభ్రమణీయుతకుండలంబులన్
నిరుపమసద్గుణంబులను నిర్మలదేహములం జెలంగుచుం,
బురుషులు కామదేవునకుఁ బోల్పఁగ నర్హులునై సులక్షణో
త్కరములఁ జెన్నుమీఱుదురు కమ్రకపోలము లొప్పుమీఱఁగన్. 432

సీ. ఆననంబులు కాంతి నలరారుచుండఁగ శ్మశ్రువుల్ ధరియించి సర్వశాస్త్ర
వేత్తలై వైరుల భేదింపఁజాలుచు సర్వరత్నముల విచారహీను
లయి దాతలకు నిచ్చునట్టి నేర్పునఁదగి సర్వసంపద్భోగశాలు రగుచుఁ
బురుషులొప్పుదురందుఁబూఁబోఁడులతిమనోహరరూపములఁజూడనగుచుహంస

తే. వారణసమాన సద్గతి వైభవములఁ, దనరి కర్ణాంతనయనముల్ తగ సుమధ్య
లగుచు జఘనంబులసిరి చెల్వారఁ బీన, కమ్రవక్షోజములఁ జాలఁగ్రాలి సతము.

క. అనుపమ మృదుకేశంబులు, మనములఁ గరఁగించునాస్యమండలము తమం
తన చెలువారు కపోలము, లనయము తమగొప్పఁదనము నభివర్ణింపన్. 434

క. అలకలు స్థిరసౌందర్యముఁ, దెలుపఁగ విద్యుత్ప్రకాశతీక్ష్ణాగ్ర ప్రో
జ్జ్వలదశనంబులు వినుతిం, గలుగం జేయంగ నుందు రక్కలకాలంబున్. 435

సీ. హావభావంబుల నానతగ్రీవలై బింబోష్ఠములఁ జాల వెలసి రంజి
తముఖులై తాంబూలరమణీయముఖకాంతి యలర స్వర్ణాభరణాళి వెలయ
శ్యామావదాతవర్ణాంచితగాత్రలై శ్రోణీభరంబుల సొబగు వెలయ
హారికాంచీనూపురారవంబులు తగ దివ్యమాల్యాంబర భవ్యచంద

తే. నాను లేపనములు చూడ నర్హములయి
తనరుచుండ విదగ్ధతఁదనరి సుముఖు,
లగుచు సొబగున మించెడునవయవములు
సంతస మొసంగ సుస్మితాస్యముల వెలసి. 436

క. రూపము లావణ్యంబును, దీపింపఁగ సభలయందు దేవవనితలఁగ
రూపింప గానకుశలత, నేపగిదిం గనిన గెల్చి యొసఁగుదు రెపుడుఁగ. 437

క. అరుదగు వాద్యకథాలా, పరతిన్ బ్రఖ్యాతిఁ గాంచి బహువిధకేళీ
నిరతిం గాలము పుత్తురు, పురి నటుఁగల భామ లెల్లఁ బూతచరిత్రలై. 438

తే. వారముఖ్యలు నృత్తవిశారదలును, గీతనైపుణి మించి విఖ్యాతదృష్టి
విజితభీతమృగాక్షులై విమలవాక్య, కుశలతం దగి యోషిత్సుగుణము లొప్ప.

క. పురమున నందుం బొల్తురు; సురుచిరగుణగణ్య లగుచు శుభ్రతమాలం
కరణవిభూషితలై కుల, తరుణులు సాధ్వీయశంబు తగియుండంగఁ 440

తే* మఱియుఁ బుర మది యుద్యానమండిత మయి
యుపవనంబుల వనముల నొప్పి దేవ,
తాయతనములఁ జెన్నారి యమలకుసుమ
శోభితము నగుగృహాతరుస్తోమము తగ. 441

వ. వినుతిపాత్రంబయి యుండు. మఱియుఁ దాలతమాలవకుళ నాగకేసర పిప్పల కర్ణికారచందనాగురు చంపకపున్నాగ నారికేళ పనస సరళనారంగ, లకుచ, లోధ్ర, సప్తపర్ణాంజన, చూత బిల్వ కదంబ శింశుప ధవ ఖాదిర పాటలాశోక తగర కరవీరవృక్షంబులచే మనోహరంబులై పీతార్జున, భల్లాత, సిద్ధామ్రా తక, న్యగ్రో, ధాశ్వత్థ, కాశ్మర్య, పలాశ, దేవదారు, మందార, పారిజాత, తింత్రిడీక, విభీతక, ప్రాచీనామలక, ప్లక్ష, జంబూ, శిరీష, కాలేయ, కాంచ, నార, మధు, జంబీర, తిందుక, ఖర్జూ, రాగస్త్య, వకుళ, శాఖోటిక, హరీతక, కంకోల, ముచుకుంద,హింతాల, బీజపూరక. కేత, క్యతిముక్త, కుబ్జక, మల్లికా కుంద, బాణ, కదళీ, మాతులుంగ, పూగఫల, కరుణ, సిందువారక, బహు వార, కోవిదార, కరంజక, ప్రముఖ పుష్పఫల విరాజమానవృక్షనికర శోభితం బులై, లతాగుల్మవితాన సాంద్రంబులై, నందనోపమంబులై, కుసుమగంధంబుల వెదఁజల్లుచు, ఫలభారంబుల భూమిని స్పృశించుచుఁ జూడఁ జూడ మనః ప్రమోదము నొసంగఁజాలు నుద్యానంబు లానగరంబున నలరారుచుండు. మఱియు నానాపక్షిరుతంబుల శ్రవణపర్వమొనర్చుచుఁ, జకోరశతపత్ర, భృక గార, ప్రియపుత్రక, కలవింక, మయూర, శుక, కోకిల, కపోత, ఖంజరీట, శ్యేనం పారావత, ప్రముఖనిఖిల మనోహరవిహంగము లాపురంబున స్వస్వరంబుల వినుతిం గాంచుచుండు. సరసులు, పుష్కరిణులు, జలాశయంబులు కుము దోత్పలమండితంబులై పద్మకహ్లార సుగంధ బహుళంబులై తనరారుచుండు. మఱియు సర్వర్తుకుసుమంబులందుఁ గననగుచుండు. హంసకారండవ చక్రవా,

* వనైశ్చోపవనైః పుణ్యైరుద్యానైశ్చ మనోహరైః = అనిమూలము.

సారస బలాక కూర్మమత్స్య నక్ర, జలపాద, కదంబకప్లవజలకుక్కుటప్రముఖ
జలవిహంగంబులు జలాశయంబులంగనుపట్టుచుండు. 442

క. నానావిధపుష్పంబుల, నానావిధసత్సరసుల నానాపుణ్యో
ద్యానంబుల మృదురవయుత, నానావిధసత్పతగ గణంబుల బెడఁగై. 443

క. త్రిదశాలయములఁ బత్తన, మది యెంతయు నొప్పుచుండు నందుఁ ద్రినేత్రుం
డుదితార్కకోటితేజుఁడు, సదయస్వాంతుండు వెలయు సాధువరదుఁడై. 444

క. పేర మహాకాళుం డన, నారూఢమహత్త్వయుక్తి నఖిలసుధాంధో
వారములు గొల్వ నుండును; భూరితరాఘౌఘ హరణముగ నచ్చోటన్. 445

క. తనరారున్ శివకుండం, బను తీర్థం బందు మున్గి యమరుల మునులన్
మనమున నెన్నుచుఁ బితరుల, ననుపమవిధిఁ దర్పణముల నలరించి తగన్. 446

క. హారు నాలయమునకుం జని, పరమప్రమదంబుమీఱ వలగొనుచున్ శం
కరునిం గన లోనికిఁ జని, విరహితమతిచంచలుఁడయి విమలాంబరుఁడై. 447

సీ. స్నానంబులను సుగంధంబులఁ గుసుమాళి రుచిరధూపంబులఁ బ్రచురదీప
ముల సాధునైవేద్యముల నుపహారంబులను గీతవాద్యంబులను బ్రదక్షి
ణముల దండాకృతి నమరెడుప్రణిపాతములను నృత్యస్తోత్రములను శివుని
విధియుక్తిఁ బూజించి విశ్వేశ్వరుని మహాకాలుని నొకమాఱు కాంక్షదీఱ

తే. దృష్టిపూతంబుగాఁ జూడ నిష్టసిద్ధి
యశ్వమేధసహస్రంబు లాచరింపఁ
గలుగుఫల మెల్లఁ గల్గును గలుషరాశి
యడఁగు వ్యోమయానంబున నమరపురికి. 448

క. చని మానవుఁ డందుంగల, యనూనభోగాళిఁ బొంది యటనుండియు శం
భునిలోక మొంది దివ్య, త్తనువును ధరియించి మణివితతికృతభూషల్. 449

క. ధరియించి దివ్యభోగో, త్కరముం దగననుభవించి గణనాథులతో
సరిగాఁ దగి ప్రళయాంతము, జరామృతులులేక యుండి శంకరు కరుణన్. 450

తే. గణపతిత్వముఁ బూనుచుఁ గాల మెంతొ
చనఁగఁ బుణ్యము నశియింప క్షమను విప్ర
వరకులంబున జన్మించి వరుస వేద
శాస్త్రములయందుఁ బాండితి చక్కనొంది. 451

క. అనుపమము పాశుపత మనఁ, జను యోగ మ్మభ్యసించి సాధువినుతులం
గని యపవర్గము నొందును, మునులారా పార్వతీశు భూరితరకృపన్. 452

చ. పురమునసందు క్షిప్రయను పూతతరంగిణి లోకవిస్తృతిం
బరఁగుచు నుండుఁ బూర్ణజలవాహము సంతత మొప్పుచుండ నే

నరుఁ డట మున్ని దేవపితృనాథులకున్ విధిఁ దర్పణంబు భ
క్తిరతిని జేయునో యతఁడు తీవ్రతరాఘవిముక్తుఁడై త్వరన్. 453

చ. అనయము వ్యోమయానమునయందె వసించుచు స్వర్గపత్తనం
బున బహుభోగముల్ పడయుఁ; బూర్వరమందట శంకరుండు నాఁ
దనరుచు దేవదేవుఁడనఁ దాపహరుండన సర్వకాముఁడుం
డన నపవర్గదుండనఁగ హారితరాకృతి యొప్పుమీఱఁగన్. 454

క. గోవిందస్వామియనం,గా వసుధన్ ఖ్యాతి మిగులఁ గాంచె నతఁడు; శ్రీ
దేవీపతి గోవిందుని, భావనమతిఁ గనిన ముక్తిఁ బడయును జుండీ. 455

క. ఇరువదియొకతరములఁ బా,పరహితములఁ జేయు; మఱియు భాసురరీతిం
బరఁగుచుఁ గామగతిం దగు, సురుచిరయానమున దేవసుదతులు పొగడన్.

తే. అమరగంధర్వవినుతుల నంది విష్ణు
లోకమున నుండు;నందు స్వేచ్ఛాకలితుఁడు
నగుచుఁ గామంబులం బొంది విగతతాపుఁ
డగుచు నాభూతసంప్లవ మందె యుండి. 457

తే. మరల భూమికి నరుదెంచి క్ష్మాసురాన్వ
యమున జనియించి యోగవిద్యాప్రశస్తి
వేదవేదాంగపాండితి వెలయ వైష్ణ
వ మనుయోగంబుఁ గొని ముక్తిఁ బడయు నిజము. 458

సీ. విక్రమస్వామి నా విష్ణుదేవుం డుండు నం దామహాత్ముని నధికభక్తి
దర్శించు నరుఁడేని తరుణీమణియయేని పూర్వోక్తఫలము నే పొందు ధ్రువము
శక్రాదులగుసురసత్తము లటనుండ్రు సప్తమాతృకలు తత్స్థలమునందు
నివసించి భక్తాళి నెమ్మిఁ గాపాడుచు వారికోర్కులఁ దీర్చి వైభవముల

తే. నలరఁగాఁ జేయుచుండు; రాయంబికలను
భక్తి దర్శించి పూజించి వందనాళి
రంజిలఁగఁ జేయఁగా నఘవ్రజము తొలఁగుఁ
గరతలామలకంబు స్వర్గంబు ధ్రువము. 459

శా. పూర్వర్యం బది రాజసింహుఁడను సద్భూజాని పాలింపఁగా
సర్వాలంకృతి నుత్సవావళులచే స్వర్గంబు నా సద్యశం
బుర్విం గాంచి చతుష్పథప్రతతిచే నొప్పారఁగాఁ బూజ్యుఁడై
శర్వుం డెల్లజగంబు లేలుపతి వాసం బొప్పఁజేయుం దమిన్. 460

క. చాపజ్యాఘోషంబుల, నేపారుచు సిద్ధసంఘ మేతెంచి యటం
గోపుర ముండన్ విద్వద్భూపాలకు లొప్ప మిగులఁ బొల్చుచు సతమున్. 461

క. తనరారుచుండె నామ్నా, యనినాదము వినఁబడుచు మహాత్తరపుణ్యం
బు నొసంగుడు పురాణంబుల, ఘనధర్మంబులను దెల్పుగాథలుమఱియున్. 462
క. ఇతిహాసంబులు శాస్త్ర, ప్రతతియుఁ గావ్యైకవిషయవాదంబులు సం
తతమున్ వినఁబడ నాపురి, హితగుణముల నొప్పుచుండు నెంతయు సిరులన్.
క. మును నే వివరించిన ప, త్తన మదియే మానులార ధాత్రీపతిమం
డనుఁ డగు నింద్రద్యుమ్నుం, డనూనవిధి నేలె దాని నమలపథమునన్. 464

## నలువదిరెండవ యధ్యాయము.

ఇంద్రద్యుమ్నుఁడు దక్షిణసముద్రముదరికిఁ బోవుట.

చ. మును పల రాజమండనుఁడు భూమిని నేలుచుఁ గన్నపుత్త్రులన్
జనకుఁడు వోలె స్వప్రజలఁ జక్కఁగఁ బ్రోచెను జ్ఞానసంపదం
దనరుట సత్యవాది మృదుతం దగు వాఁడును సద్గుణాఢ్యుఁడున్
వినుతపరాక్రముండు శ్రుతివేత్తయు శాస్త్రవిదుండు మానియున్. 465
తే. ధర్మసంపన్నుఁడున్ శీలతన్ సతంబు
వెలయువాఁడును దాంతుఁడు వీరవైరి
పురహుతాశనుఁ డాదిత్యుఁబోలు తేజ
మునఁ జెలంగెడువాఁడును ఘనధిషణుఁడు. 466
సీ. అశ్వితనూజులయట్టి రూపమువాఁడు వర్ధమానగుణౌఘ భాసురుండు
శతమఖసన్నిభశౌర్యంబు గలవాఁడు శారదసంపూర్ణచంద్రు నట్లు
సకలలక్షణముల సమలంకృతుండును యజ్ఞమ్ములను జేసి యమరవరులఁ
దన్పిన గుణశాలి తగుదక్షిణల నిచ్చి యశ్వమేధంబుల నష్టవిధిని
ఆ. జేసినట్టిఘనుఁడు క్షితి దానయజ్ఞముల్, తపము సలిపినట్టి ధన్యతముఁడు
సాటియనఁగ లేరు సత్యమింద్రద్యుమ్న, భూమిపతికి వెదకి పోలఁ గనిన. 467
చ. కనకము మౌక్తికంబులును గ్రమ్రగజాశ్వము లెల్లరత్నముల్
వినుతమహార్ఘ్య వస్తువులు విశ్రుతభూపతియింట నెప్పుడున్
గనవు కొఱంత; యజ్ఞముల క్ష్మాదివిజాళికి ద్రవ్యరాశి ని
చ్చెను దనపేర్మి నెల్లరును జెప్పుకొనం దగినట్లు నేర్పునన్. 468
చ. కరిహయముల్ శతాంగములు కంబళ వస్త్ర చిరత్నరత్నముల్
గురుధనధాన్యముల్ మఱియుఁ గోరినవస్తువు లెల్ల భూమిరా
డ్వరుని గృహంబునన్ వెలయు వాంఛకు మిక్కిలిగా గణింప నె
వ్వరికిఁ దరంబుగాదు; గుణవారవిభూషితుఁడై యజస్రమున్. 469
క. ధనముల గుణముల నెంతయు, వినుతింపం దగి సమస్తవిధముల వృద్ధిం

గని రాజ్య మేలె నుత్తముఁ,డను భూరి యశంబు మించి యలరుచునుండన్.

ఉ. ఆతనిచిత్తమం దొకట నర్థ్వాగతిన్ జనియించె వాంఛ నా
శ్రీతరుణీమనోహరుఁ బ్రసిద్ధమహామహిమున్ మునీంద్రసం
ఘాతసమర్చితాంఘ్రియుగకంజుని యోగిపతిన్ గురూత్తమున్
జేతముఁ జల్లఁజేయుకృపచేఁ దగు నీశుని బూతచిత్తునిన్. 471

క. ఏవిధమునఁ బూజింపం, గావలెనో భుక్తిముక్తికారణు విష్ణున్
దేవవరేణ్యుని నని యా,భూవిభుఁ డెంతయుఁ దలంచి బుధగణయుతుఁడై. 472

క. శ్రుతులఁ దదంగములన్ శా,స్త్రతతిని దంత్రముల సత్పురాణగణము నా
యితిహాసధర్మశాస్త్రవి,తతిమునిభాషితము నెల్లఁదగువిధ మొప్పన్. 473

క. పరికించుచు విద్యాలయ,వరముల గురుజనులను దృఢభక్తిఁ గొలుచుచున్
ధరణీదివిజుల శ్రుతివి,ద్వరులన్ సేవించి యత్నవైభవ మలరన్ 474

క. కృతకృత్యుఁ డయ్యెఁ; భగవ,ద్ధితతత్త్వముఁ జక్కనెఱిఁగి యీశుని విష్ణున్
గృతభక్తరతు నెన్నుచు, మతిభ్రాంతిన్ వదలి ముక్తిమార్గము వెదకన్. 475

తే. సంయతేంద్రియుఁడై యెట్లు చక్రిఁ బూజ
నమున సంతృప్తుఁ జేయుదు నమలవిధి య
దెట్టిదో పీతవస్త్రుఁడై యొసఁగి శంఖ
చక్రపంకజగదల హస్తములఁ దాల్చి 476

క. వనమాల నురస్స్థలమునఁ, దనివారఁగఁ దాల్చి పద్మదళనేత్రంబుల్
గనుపట్టఁగ శ్రీవత్సాం,కనియతవత్సంబు మెఱయఁగా నసదృశుఁడై. 477

సీ. మకుటాంగదంబులఁ బ్రకటబాహువు లొప్పఁ దగుజగన్నాథు నేమి గతిఁ బూజ
సల్పుదు నంచని సరగఁ బట్టణమును వదలి బలంబు లపార్యగతిని
దనవెంట రా భృత్యతతులు గొల్వఁగఁ బురోహితుఁడును దోడరా నెల్ల శస్త్ర
పాణులు గొల్వంగ భాసమానవిమాన సమ రథంబులును ధ్వజములు మఱియు

తే. సత్పతాకలు శోభిల్ల సాదిగణము,ప్రాసతోమరయుక్తమై పవనతుల్య
వేగముల నొప్పుఘోటకవితతు లరుగ, నిర్గమించె నింద్రద్యుమ్న నృపవరుండు.

శా. ప్రాలేయాద్రి జనించి, మత్తగతులన్ భాసిల్లుచున్ సంచర
చ్ఛైలవ్రాతములే యటంచుఁ బ్రజ లెంచఁగా మహాంగంబులన్
జాలం గ్రాలెడు హస్తదండముల భాస్వద్భూషలం బొల్పు శుం
డాలంబుల్ చనియెన్ బ్రజాధిపతితోడన్ భూరిమోదంబుగన్. 479

ఆ. హేమకక్షములను నెంతయుఁ జెలఁగుచు,తాకలను గనంగఁ దగుచు షష్టి
హాయనముల వయసు హర్వేందురూపంబు, గలిగియుండె నేస్థుగముల కపుడు.

వ. విజయయుద్ధవిశారదత్వమునఁ దగుమత్తదంతావళంబు లిట్లు వెంటనంటఁ బదాతులు ధనుఃప్రాసాసివిలసితకరులై దివ్యమాల్యాంబరంబుల ధరియించి దివ్య

గంధానులేపనంబులఁ దనువు లొప్పారుచుండఁ బ్రభువు ననుసరించి నడచిరి. ప్రాయమున నొప్పి మృష్టకుండలమండితులై సర్వాస్త్రకుశలులై శూరులై సంగ్రామలాలసు లగువీరకుమారులు కూడఁబోయిరి. మఱియు. 481

క. అంతఃపురవాసమునన్, వింతగఁ గన్పట్టుచున్న వివిధమణీగణా
క్రాంతాలంకృతులన్ సుర, కాంతల మించంగఁజాలు కమ్రాకృతులన్. 482

క. అరుదగుయౌవనముల సీ, ధరణిన్ వెలయింపఁజేయు తతగుణముల వి
స్ఫురదురుయశముం గాంచిన, తరుణులు ప్రక్పందనయుత తనులతికలునై. 483

చ. సురుచిర కోమలాంబరవిశోభితలై శరదిందువక్త్రముల్
కరము మనోహరంబుగఁ దగంగ సుమధ్యమలోచు నెంతొ సుం
దరముగ నొప్పువేషముల దాడిమబీజములన్ హసింపఁ జా
లిరమణఁ గూర్పుదంతముల లీలలఁ గూర్చెడు కుండలంబులన్. 484

తే. చారుబింబోష్ఠములఁ బంకజదళనయన, ముల వెలుంగుచు వారు తాంబూలరంజి
తముఖపంకజలై రత్నితతుల చేతఁ, జక్క రక్షింపఁబడుచు రాజవరుఁగూడి 485

సీ. ఉచ్చావచములయి యొప్పుయానంబులు మణికాంచనాంచితా గణితవిభవ
యుక్తములై తగ నుపగీయమానలై యం దధిష్ఠించి గాయనులు వంది
మాగధుల్ స్తుతియింప మహితశస్త్రావళి కరములఁ దగుభటగణము కావఁ
జనిరి; సర్వాంగముల్ చక్కనిరీతిని వెలయు నానాలంకృతుల విభూషి

తే. తలయి సురుచిరరూపముల్ గలిగి చూడఁ
గనులకున్ విందుచేయుచుఁ గమ్రయాన,
ముల నధిష్ఠించి పరిచారకులు గొలువఁగ
నృపగణాగ్రణి వెనువెంట నేఁగి రెలమి. 486

క. శ్రుతితతిసాంగము శాస్త్ర, ప్రతతిని గడు నభ్యసించి బ్రాహ్మణవరు లా
క్షితిపతితోడం జని ర, ప్రతిమానపరాక్రమముల రంజిల్లు నృపుల్. 487

క. ఊరుజులు పాదజులుఁ జని, రా రాజుంగూడి మఱియు నానృపు వెనుకం
గోరికల స్వర్ణకారులు, గారవముం గోరు లోహకారులు వేడ్కన్. 488

ఆ. మఱియుఁ జర్మకార మణికార కర్మార, కుంభకార పాచకులును జనిరి
కూడఁ నేగి రశ్మకుట్టక శిల్పివ, ర్యులును వేత్రకారు లొక్కమొగిని. 489

సీ. పణ్యకారులు రాజుపజ్జనే పోయిరి; కడువేడ్కమెయి వేత్రకార ముద్గ
కారులు మఱి కేశకారులు నిషుకార తుంబికారులు ఖడ్గతూణకారు
లల్లె స్వధాకారు లఖిలవాహకులును జలవిక్రయకులును సర్వవస్తు
వుల నమ్మువారు పూవుల నమ్మువారును, భక్ష్యములను నమ్మిపరఁగ ధనము

ఆ. సేకరించువారు శ్రీకలితులు నగు,వణిజు లఖిలపౌరవరులు స్వీయ
ధనమణుల సువర్ణతతులను గొని దార, లరుగుదేర సేవకాళిఁ గూడి. 490

వ. అస్త్రములనమ్మువారు తాంబూలపణ్యజీవులు తృణవిక్రయకులు కాష్ఠవిక్రయకులు రంగోపజీవులు పలలవిక్రయులు తైలవస్త్ర ఫలపత్రవిక్రయకులు కూడ రాఁ బోయిరి. యవసహారులు రజకులు గోపాల నాపిత వస్త్ర సూచక మేషపా లాజపాల మృగపాల హంసక ధాన్య,గుడ, లవణ, విక్రయులు గాయక నర్తక మంగళపాఠక శైలూష కథక పురాణార్థవిశారద కవి నానాకావ్యవిశారద విషఘ్న గారుడవిద్యావిశారద నానారత్నపరీక్షక వ్యోకార తామ్రకార కాంస్యకార, చిత్రకార, కుందకార, పావక, దండకా రాసికార సురాద్యూతోపజీవి మల్ల, దూతకాయస్థ తంతువాయ, రూపకార వార్తిక తైలపాఠక లావజీవ, తైత్తిరిక, మృగపక్ష్యుపజీవి, గజవైద్య, వైద్య, నానావైద్య, వృక్షవైద్య, గోవైద్య, చ్ఛేదదాహక ప్రభృతులనేకు లా రాజు వెంట నరిగిరి.

చ. జనకుఁడు వేఁబుపల్లియకు సజ్జనబృందము పిల్వఁ బోవుచోఁ
దనయులు గ్రామదర్శన నితాంతకుతూహలు లౌచు వెంబడిం
చిన గతి నాగరుల్ నృపతిశేఖరు వెంబడి పోయి రిట్లుగా
జను లొగి రాఁగ శ్రీయుతుఁడు చక్రిపదాంబుజభక్తుఁ డాదృతిన్. 492.

మ. తనతో సజ్జను లెల్లరాఁ గరులబృదంబుల్ హయౌఘంబు స్యం
దనవర్గంబు పదాతిసంతతి తనంతన్ రా గతుల్ మందతం
దనరంగాఁ జని యామ్యసింధుతట మంతం గాంచె సైన్యంబు లో
య్యన భూపాలుని వెంటఁబోయి విడిసెన్ యామ్యాబ్ధివేలాస్థలిన్. 493

శా. కాంచెన్ భూపతి నర్తనంబు సలుపంగా నెంచు నట్లొప్పుచుం
జంచత్తుంగతరంగకోటుల నజస్రం బావిలంబౌచు న
భ్యంచద్రత్నగణంబులున్ వెలయఁ బెక్కు జీవసందోహముల్
మించన్ జిత్రముగాఁ గనంబడుచు నూర్మిస్తోమహస్తంబులన్. 494

క. తనుఁ బిలుచుచు నున్నట్టులు, కనఁబడుచున్ దీర్ఘ రాజ కమ్రఖ్యాతిన్
గనుచు నపారంబై భీ, తిని గల్గించుచు ఘనప్రతీకాశంబై. 495

ఉ. ఇంతని లోఁతు తెల్పదగ కెల్లెడలన్ మకరంబు లొప్పఁగా
బంతమునన్ ఝషావళులు భవ్యమహత్తరశంఖశుక్తికా
సంతతి కూర్మనక్రములు శంకువులున్ మఱి శింశుమారముల్
సంతతభీతిదంబు లగుసర్పగణంబులు పెంపుమీఱఁగన్. 496

చ హరి శయనింప స్థానమయి యాతుగణంబుల కున్కిపట్టుగాఁ
బరఁగుచుఁ బాపశైలముల వ్రియ్యలుచేయుచు సత్తరంగిణీ,

వరుఁ డగుచుం బవిత్రుఁడయి వాంఛల నీయఁగఁజాలుచుక్ భయం
కరగతిఁ బొల్పు నాసుడులఁ గానఁగ నొచు గభీరరాశియై. 497

క. దానవసమాశ్రయంబయి, మానుగసురయోని యనెడు మహితఖ్యాతిం
బూనుచు నమృతాకరణియై, మానవసర్వస్వ మగుచు మ్మానీసుయున్నై. 498

క. జీవనమై ప్రాణులకుక్, బావనమై సర్వవస్తువారంబునఁ దీ
ర్థావృతి నెసఁగుచు నుత్తమ,మై వఱలుచుఁ దీర్ఘవితతి వ్యయవిరహితమై. 499

తే. చంద్రవృద్ధిక్షయంబుల సరణి నెవని,పరిమితియు నిర్ణయింపఁగఁ బడెనొ యట్టి
లవణయాదఃపతిం జూచె లలిత గతి వి,లాసముల నొప్పువాని నిలాధవుండు.500

క. భూతౌఘాభేద్యంబుగ, నేతఱినేఁ గానఁబడుచు నింద్రాదులకుం
బ్రీతిగ నమృతంబిడి వి,ఖ్యాతింగని జననమృతి వికార రహితమై. 501

తే. జంతుసంతతికెల్ల నాశ్రయముగాఁగఁ, దనరి నదనదీపతియయి యనుపమాన
విభవమున నొప్పు సాగరవిభునిఁ గాంచి, విస్మయము నొందె నాపృథివీవరుండు.

క. జలరాశిచెంత నతిని, ర్మలతీరమునందు సర్వమంగళముల కి
మ్ముల స్థానమైన చోటను. నలరుచు నివసించెఁ బరిజనావళి గొల్వక్. 503

సీ. సాలపున్నాగముల్ సరళకదంబక వకుళ పనస తరునికర మల్లి
ఖర్జూర పిప్పలాఖ్యములును నారికేళములును బీజపూరములు తాల
ములు నాగకేసరములును నారంగము లామ్రాతలోధ్రము లాకపిత్థ
కర్ణికా రాశోక కదళికాచంపక పాటల దాడిమ పారిజాత

ఆ. ములు తమాలములును సలలి తార్జునములు, వటమహీజ బిల్వపనసతీజ
ములునుఖాదిరములు భూరిజంబుకమధు,కములు మొదలుగాఁగ మ్మారుహములు

వ. మఱియుఁ బ్రాచీనామల కాశ్వత్థప్రముఖవృక్షరాజంబులు క్రిక్కిరిసియుండ సర్వ ర్తుకుసుమంబులు నేత్రపర్వ మొనరించుచుండ సర్వకాలఫలంబులు పరిఢవిల్ల నానాపక్షిరుతంబులు శ్రుతిసుఖమును గూర్చుచుండఁ బుష్పితవృక్షశాఖాగ్రము లందు నివసించు పతత్త్రిరవంబులు ప్రతిధ్వనుల నిచ్చుచుండఁ గేతకీకుందమల్లి కా యూధనాధికా తగర కుటజ బాణాతిముక్త కుబ్జక మాలతీ కరవీరప్రము ఖ పరిమళ కుసుమవితానంబు లింపుసంపాదించుచుండ విద్యాధరగణంబులు సి ద్ధచారణనివహంబులు గంధర్వోరగరాక్షసవ్యూహంబులు కిన్నరాప్సరోనికు రుంబంబులు మహర్షిసముదయంబులు సేవించుచుండ, బహువిధమృగగణంబు లు క్రిక్కిరిసియుండ హంసకారండవాద్యనేకపక్షినిబిడమనోహరజలాశయం బులు వెలయుచుండ నందుఁ గమలశతపత్ర కహ్లార కుముదోత్పలాద్యనేక కు సుమంబులు జలవిహంగమంబులు విలాసములుమీఱ విహరించుచుండఁ జారు కందరమండి తోన్నతశిఖరవిరాజమాన మహీధరంబులు కనుపట్టుచుండ సకలా

షణ్ముఖు లప్పర్వతంబులఁ బ్రకాశించుచుండ నాసాగరతటంబుచూడం దగి సేవింప
నర్హంబై నివసింప ననుకూలంబై సమ్మోదజనకంబై యుండెనంత. 505

క. దశపంచయోజనంబుల, విశాలమును నాయతంబు వెలయఁబతగరా
జశరణ్యంబై దుర్లభ,ము శివదమునునైన క్షేత్రమును గనె నందున్. 506

---

## నలువదిమూఁడవ యధ్యాయము.

### పురుషోత్తమక్షేత్రవర్ణనము.

చ. అనవిని మౌను లిట్టులని రబ్జభవా యసమానవైభవం
బునఁ దగి క్షేత్రవర్య మనఁబొల్చెడు నప్పురుషోత్తమస్థలం,
బున మును విష్ణుచిహ్నములఁ బూజ్యతరంబగు నట్టివిగ్రహం
బనఘము దేవతార్చితము నై తగునట్టిది లేకపోయెనే. 507

క. ఏకారణమున నరపతి, యాకాంతారమున కేగి యందుఁబ్రతిమ శా
స్త్రోక్తవిధిఁ బ్రతిష్ఠించెనె, శ్రీకృష్ణుని నాసుభద్ర శీఘ్రవరదనున్. 508

క. శ్రీరాముని నిర్మించెనె, భూరమణుఁడు భృత్యసుభట పూగ యుతుండై
కారణమును దానిని వినఁ,గోరిక పుట్టెను వచింపఁగూడును దానిన్. 509

మ. అనినన్ బ్రహ్మయుఁ బూర్వవృత్తమును బాపౌఘంబుఁ జెండాడుదా
నిని దెల్పన్ మదినెంచి యిట్టులనియెన్ నీరేజసంవాసముం
గను నాభార్గవి దేవదేవుఁ ద్రిగజత్కాంతున్ సరోజాక్షు దు
ష్టనియంతం గని వేఁడె దీనిఁ దెలియన్ స్వాంతంబు ప్రేరేపఁగన్. 510

క. హరి లక్ష్మికిఁ దెల్పినయా, చరితమె మీప్రశ్నమునకుఁ జాలినదై య
చ్చెరువును గొల్పందగు ను,త్తర మగునద్దాని వినుఁడు తాత్పర్యమునన్. 511

సీ. ఒకపరి మేరుభూధరోత్తమకాంచనశిఖరంబు చాల నచ్చెరువు గూర్పఁ
జాలియుండఁగ నందు సాధ్యవిద్యాధర గంధర్వ సిద్ధ యక్షవ్రజంబు
నిర్జరచారణ నిచయంబు కిన్నరుల్ దానవ భుజగ సంతతులు దేవ
కాంతలు గుహ్యకగణము మహర్షులు గరుడులు మారుతగణము కాశ్య

తే. పాదులైన ప్రజాధిపుల్ వాలఖిల్య
ముఖ్యనియతవ్రతులు శృంగముననె యందు
భవ్యగుణసాంద్రు మునివర్యవార్ధి చంద్రు
సాధుజన మానసాధారు సతతధీరు. 512

క. సేవించుచుండి రాగిరి, పావనశృంగంబు సర్వవరతరునికరం
బై వఱలి యన్నిఋతువుల. భావింపంబడెడు కుసుమపటలము మెఱయన్. 513

వ. మనోజ్ఞతమంబై యుండు. మఱియు నాశిఖరోత్తమంబున సకలవిధవృక్షంబులు
జాతరూపప్రతీకాశంబులై సాలతాలాది నామంబుల నొప్పారుచుండు వాని
పైఁ బుంస్కోకిలంబులు కూయుచుండు. సకలర్తుకుసుమంబు లెల్లకాలంబు నొ
క్కరీతి నలరారుచుండు. మఱియు. 514

మ. సురసంఘంబులు గొల్వఁ దద్విభవముల్ సొంపొప్పవర్ణింపఁగాఁ
దరమె? ట్లౌ నని శేషముఖ్యులు మనోధైర్యంబు వీడంగఁ గి
న్నరగంధర్వనికాయ మెల్లపుడు గానస్ఫూర్తి రంజిల్ల శ్రీ
కరమై రత్ననిధానమై వెలయుశృంగం బెంతయుం వర్ణ్యమై. 515

ఉ. ఆగిరిమూర్ధమందు సకలామరవంద్యుఁడు లోకకర్త స
ద్భాగవతౌఘ పూజిత పద స్ఫుటపంకజ యుగ్ముఁ డాత్తర
ప్పా గణనీయవిక్రముఁ డఖండవిభూతియుతుం డనంతుఁ డీ
డ్యాగమవేద్యసన్నుత మహత్తరశక్తియుతుండు శ్రీశుఁడున్. 516

తే. వాసుదేవాఖ్య నొప్పునవ్యయుఁడు ఘనుఁడు
మునిజనంబులు సేవింపఁగ నట వసతి,
చేయుచుండంగ భార్గవి శిరసు నాథు
పాదములు సోఁకఁ బ్రణమిల్లి భక్తిపరత. 517

క. జగములకున్ హిత మేవరు, సఁగల్గునో యట్టిదైన సంప్రశ్నము చే
యఁగఁ బూని లోకనాథా, యగణితమహిమాఢ్య! సంశయంబొకఁడు మదిన్.

చ. కలిగిన దద్ది యేమియనఁగా విను తెల్పెద మర్త్యలోకమే
చెలఁగును గర్మభూమియనఁ జిక్కదు పుట్టుక దానియందు న
ట్లలరుచునున్న యాజగమునందును లోభము మోహకామముల్
కలిగెను గ్రోధ మెల్లపుడు కాపురమున్న దిదేమి చిత్రమో. 519

శా. వీనిన్ దాఁటఁగ రామి సర్వజను లుద్వృత్తిం బ్రవర్తింపఁగా
నోనాథా కనఁ జింతయయ్యెడిని నోహో! వారు సంసారదు
ష్పానేకావిలవస్తుసాగర మహార్ణ్యం బెట్లు దాఁటంగఁ బెం
పూనం జాలుదురో వచింపు మనఘా! యోదీనమందారకా. 520

చ. తెలుపుము నాపయిం గరుణ తృప్తియు నుండునయేని పాదసే
వల నొనరించుదాని నను భక్తగణంబునఁ జేర్తువేని యి
మ్ముల మనుజుల్ తరించువిధి భూతపతీ! నిను వీడి సంశయం
బులఁ దొలఁగించువారు మహిఁ బోలఁగ లేరు తలంచి చూచినన్. 521

చ. అని వచియించు లక్ష్మిఁ గని యాదృతితో నమృతోపమానమై
తనరెడునట్లుగాఁ బలికెఁ దద్దయుఁ బ్రీతిని; భార్గవీ! సతీ

వినుము సుసాధ్యుఁడై మిగుల విశ్రుతమౌ ఫల మీయఁ జాలి వే
డ్కను గొలువంగ నర్హుఁ డగు కాంచనచేలుఁడు లోకనాథుఁడున్. 522

క. పురుషోత్తముఁ డను పేరున, సురుచిరవరతీర్థమందు సుందరమూర్తిన్
ధరియించి భక్తజనులకుఁ, బురుషార్థము లిచ్చుచుండు భూతలమందున్. 523

క. దానికి నీడగు క్షేత్రము, గానంబడకుండు లోకగణములయం దో
మానిని దాని నుతింపం, గా నబ్బును ముక్తిపదముఁ గమలదళాక్షీ. 524

క. పలుపాపంబు లడంగును, జలజాక్షీ నాదుప్రతిమ శక్రాదిసురా
వళిచే దానవదైత్యా, దులకున్ మఱి సాధుమునితతులకు నదెపుడున్. 525

క. కనఁబడకుండ నొకానొక, వినుతస్థలమందుగుప్త విధి నునుపఁ బడెన్
విను మదిరాక్షీ! యటుగా, వున నయ్యది తీర్థరాజ పూతాహ్వయమున్. 526

క. ధరణిఁ బ్రసిద్ధముగాఁ గని, పరఁగున్ సుశ్రోణి! యేకభావంబున నా
పరమక్షేత్రమహత్త్వము, కర మరుదై వెలయుఁగానఁ గడఁగెదఁ జెప్పన్. 527

క. ప్రళయము కల్పం బనఁబడు, జలజాయతనేత్ర! యట్టిసమయము రా భూ
తలమున స్థావరజంగమ, ములు నాఁదగు భూతనివహములు వ్రుందుటయున్.

క. సురగంధర్వులు విద్యా, ధరులును దైత్యులును సర్పతల్లజులు నొగిన్
మరణము నొందిన నెల్లెడఁ, బరఁగెన్ దమ మొక్కరీతిఁ బ్రాభవ మెసఁగన్.

ఉ. అత్తఱి సర్వభూతములె యాత్మగ నొప్పు పరాత్పరుండు లో
కోత్తరుఁ డవ్యయుండు సకలోరుతరాంగుఁడు లోకకర్త సా
ధూత్తమపూజితుండు మహితోన్నతుఁ డీశ్వరుఁడున్ ద్రిమూర్తికృ
తోన్నత్తమమూర్తి శ్రీయుతుఁడు యోగమె యాత్మగ నొప్పుదైవమున్. 530

ఆ. వాసుదేవుఁ డనఁగఁ బ్రఖ్యాతి గన్నట్టి, హరియు యోగనిద్ర యంత మొందఁ
దొలుత సృష్టిచేసె లలితనాభ్యంభోజ, మధ్యగునిగ బాలు మహితవిభవు. 531

సీ. పద్మకేసరవర్ణు బ్రహ్మను నవ్యయు; నట్లుసృజింపఁగ నతఁడు సర్వ
జగదధిపతియయి సరగునఁ బంచభూతసమన్వితంబుగఁ దా సృజించె
స్థూలసూక్ష్మములుగఁ దోఁచుభూతముల మాత్రాయోనులన నవితనరి నాల్గు
విధములై స్థిరచరవిఖ్యాతినిం గాంచి మఱిచరాచరనామ మండితముగఁ

తే. దనరె; నవ్వల విధి యాత్మఁ దలఁచి వివిధ
విధములం దగు ప్రజలను విశ్వవృద్ధి,
కరులను మరీచిముఖమునివరుల నురగ
రాక్షసులను గంధర్వుల యక్షవరుల. 532

క. సురలను మఱియును విద్యా, ధరులను గంగాదినదులఁ దగ నరులను వా
నరులను హరులను విహగో, త్కరమును సృజియించె నేర్పు కనఁబడుచుండన్.

తే. అండజములు జరాయుజ మండలములు
స్వేదజోద్భిదజంబులు సృష్టిచేసె,
నలువ బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్య
శూద్రులను సృష్టిచేసె విస్ఫురితశక్తి. 534

సీ. అంత్యజు లనఁబడునట్టివారిని మ్లేచ్ఛులను నిట్లుబహురీతులను జెలంగు
సృష్టిచేయుచు నుంతయే జీవమునఁదగు తృణగుల్మముఖముల నెల్ల జగతిఁ
బర్వఁగాఁజేసి యాబ్రహ్మయు సచరాచరము నిట్లు సృజియించి రమణఁ దనదు
దక్షిణాంగమ్మును దలఁచి పురుషునిని వామాంగమున నారి వరుసఁ బుట్టఁ

తే. గా నొనర్చెను నది మొద లీనిఖిలధ
రణిని మైథునసంభవరమ్యసృష్టి
తనరె; నధమ మధ్యమము లుత్తమము లనెడు
మామకక్షేత్రములు గల్గె మంగళాంగి. 535

ఉ. ధారణి నిట్లుసృష్టియు నితాంతము చూడఁగ నద్భుతంబుగా
సారతరంబుగా వెలయ సారసనేత్రుఁడు వాసుదేవతన్
గోరికఁ దా గ్రహించెఁ దనకుం దగుదేహము నప్డు పుట్టె దు
ర్వారమహత్త్వ మొప్ప మధువైరి సహస్రశిరస్సు లొప్పఁగన్. 536

తే. వేయినేత్రంబు లంఘ్రులు వేయి వెలయఁ
బుండరీకేక్షణంబులు పొలుపుగొలుప
జలదవర్ణంబు శ్రీవత్సలలితలక్ష
ణము కనంబడ దీప్యమానతనుకాంతి. 537

చ. సరసిజసంభవుం డపుడు చక్రధరుం గని పాద్య మర్ఘ్యమున్
ద్వరపడి యాసనంబు నిడి వారక యక్షతపుష్పరాజిచే
సురుచిరపత్త్రసంతతిని జొక్కపుభక్తిని బూజచేసి ధ్యా
నరతిని స్తోత్రరాజిని వినమ్రశిరుండయి వేఁడెనంతటన్. 538

చ. జలరుహసంభవుం గని విశాలవిలోచన యిట్లు నే నొగిం
బలికితి వత్స! నన్నిటులు వర్ణనచేయఁగనేల? నీమదిం
గలిగిన వాంఛలం దెలుపఁగాఁ దగు నంచన బ్రహ్మ యువ్విధిం
బలికెను; మర్త్యలోకమున వాసముచేయుమనుష్యు లేగతిన్. 539

చ. సురపురిద్వారభేదనముఁ జోద్యముగా నొనరించి మోదమున్
స్థిరసుఖముం గనంగఁదగి సిద్ధులునొందురొ యజ్ఞదానముల్
నిరుపమయోగతీర్థములు నిర్మలసత్యతపస్సు లింకనుం
బరఁగువిధంబులన్ వదలి వారలు స్వర్గము నొందువారలో. 540

క. కరుణించి యట్టి మార్గము,సరసీరుహనేత్ర! వే ప్రసాదింపుము నా
కురుతరపావనపదమా,దరమునఁ దెలుపంగఁ దగును ద్వరపడి కొలుతున్. 541

తే. అద్దిసరోత్తమంబయి యలరవలయు,దాన భగవంతు నర్చింపఁ దలఁచువాఁడ
ననిన బ్రహ్మ యభిప్రాయ మాత్మ నెఱిఁగి, పలికితిని బ్రీతిమీఱఁగాఁబద్మనయన.

మ. పరమేష్ఠీ విను దుర్లభంబు గురుపాపధ్వాంతసూర్యప్రభం
బురుపుణ్యప్రద ముత్తమంబు భవరూపోగ్రాబ్ధిసంతారకం
బు రమాప్రాపక మెల్లక్షేత్రములలో ముఖ్యంబు గోబ్రాహ్మణో
త్కరమోదప్రద ముర్వి మానవులకుఁ గాంక్షాప్రదం బెంతయున్. 543

క. ధరణీసురముఖవర్ణో,త్కరశర్మప్రదము నైన ధన్యక్షేత్రం
బు రమాస్పద మొక్కం డిలఁ,బరఁగుఁ భుక్తియును ముక్తిఫలములనిడుచున్.

ఆ. దానికుండి పరమధర్మాభివృద్ధిదం,బైన తీర్థరాజ మావహిల్లు
నాల్గుయుగములందు నానావిధంబులఁ, బూజసేయ వర్ష ముగఁ జెలంగు. 545

సీ. సురలు మహర్షులు నురగులు గంధర్వకిన్నరదానవకింపురుషులు
దైత్యరాక్షసులు విద్యాధరనాగులు స్థావరంబులు మఱి చరములెల్ల
సేవింపఁ దనరు నాక్షేత్ర ముత్తమపురుషుఁడు పొల్చు నందున సురుచిరాంగుఁ
డట్లౌట నాక్షేత్రమాహ్వయంబునఁ బురుషోత్తమం బన ఖ్యాతినొందె;యామ్య

ఆ. సింధుతీరమందుఁ జెలఁగు న్యగ్రోధంబు, యోజనములఁ బదిట నొప్పుమీఱఁ
దగు విశాలతను నితాంతశుభావహ,మగుచు నెందు క్షేత్ర మలరునందె. 546

క. ఎది సర్వప్రాణ్యంతక, మది కల్పం బట్టికల్ప మావహిలంగాఁ
జెదరదు స్థానం బదిము,క్తిదమయి శాశ్వతముగా నొగిం జెలువారున్. 547

క. తరువరమగు న్యగ్రోధముఁ,బరికించుచు దానినీడ వసియించినచో
ధరణీసురహత్యయుఁ జెడు,దురితంబులు మిగిలినవియుఁ దొలఁగుట యరుదే.

చ. వలగొని భక్తిమ్రొక్కిన నవార్యమహాఘము లెన్నియేఁ ద్వరం
దొలఁగ నతండు కేశవుని ధూతమహత్తరపాపుఁ జేసి యి
మ్ములఁ బరమేశులోకమునఁ బొంగుచునుండు ననేకవత్సరం
బులు; వటభూరుహంబునకుఁ బోలగ నుత్తరభాగమందునన్. 549

తే. కేశవస్వామి కింత దక్షిణమునందుఁ,గలదు ప్రాసాద మొక్కండు సులలిత మది
యందు నివసింప ధర్మమయంబుగానఁ,గలుగు సత్ఫలములు వేయు పలుకు లేల.

ఉ. అందొకసుందరప్రతిమ యాపమేశ్వరనిర్మితంబు గా
నందగు దానిఁగాంచు నృగణంబులు మామకలోకమందు నుం
డందగియుండు; దానిని గడంగి కనుంగొని ధర్మరా జొగిన్
డెందము కుంద నన్ననఁ గడింది మగంటిమి దూల దీనుఁడై. 551

క. చను దెంచి స్వీయమస్తకమును నాపాదాంబుజయుగమును దాఁకఁగఁ జే
ర్చి నిలిచి యిట్లనియెను; నో, వనజాక్షా! లోకనాథ వందన మిదిగో. 552

సీ. క్షీరాబ్ధివాసివై చెలఁగి యనంతుని మేనిపై శయనించి తానె కర్త
వై వరేణ్యుండవయి యఖిలార్థదాయకుండవై విష్ణు వజుఁడునై యఖిలలోక
పతియు సర్వజ్ఞుఁడు ప్రభువునై యపరాజితుఁడు నల్లఁగలువలతో సమాన
మగుఛాయ మేని యందలరఁగాఁ బుండరీకనిభేక్షణుఁడవయి జగములకెల్లఁ

ఆ. గర్తయగుచుఁ జ్యోతినిగాంచక శాంతుఁడై
సర్వలోకధాత సర్వలోక
సుఖదుఁ డనఁగ నెగడి సుకృతాలయుండవయి
వ్యక్త మగుచుఁ గాక యాది యగుచు 553

క. పురుషుండు పురాణుం డనఁ, బరఁగి సనాతనుఁడు నగుచు భాసిల్లి జగ
ద్వరుఁడు పరావరసృష్టికిఁ, బరమేష్ఠియు నౌచు రుచిరవనమాలియునై. 554

క. శ్రీవత్స మనెడు సంకము, భావము రంజిల్లఁ దనదు వక్షమునఁ దగం
గా వఱలుచుఁ బీతాంబర, మావిష్కృతదోశ్చతుష్క మతిసుందరమై.

క. కనఁబడఁగా దరచక్రము, లనుపమరీతిం జెలంగు నాగదయును హ
స్తనికరమున వెలయంగాఁ గనకమణీరచితముకుట కాంతులు పర్వన్. 555

తే. హారకేయూరములు దగ నమలసర్వ
లక్షణంబులునిండార లలితరీతి
వెలయుచుఁ సకలేంద్రియవిరహితుఁడయి
యచలుఁడగుచుఁ గూటస్థుఁడై యాద్యుఁడగుచు. 556

క. జ్యోతీరూపమునఁ దగి స, నాతనుఁడై సూక్ష్మ మగుచు నానాభావ
వ్రాతవినిర్ముక్తుఁడు నై, యేతఱినే నెల్లయెడల నిద్ధప్రభలన్. 557

క. వ్యాపించి ప్రకృతిపరుఁడై, దీపించు మహాత్మునకు నతిస్థిరభక్తిన్
బ్రాపించు మదిని వందన, మోపరమేశా! యటంచు నొగి నొనరింతున్. 558

క. అని వినుతిచేసి యముఁ డా, ఘనవటతరుసన్నిధిని నికామప్రీతిం
గనునటు బహువిధవినుతుల, వినతుల ననుఁ దన్పెఁ గంజవిపులదళాక్షీ. 559

ఉ. నే నల ధర్మరాజును వినీతుని గాంచి కరంబు లొగ్గి దీ
నాననమొప్ప నిల్చుటకు నర్థముగాఁదగు కారణం బదే
మో నెఱిఁదెల్పుమంచుఁ గృపయొప్పఁగఁ బ్రశ్నముచేయఁబూని యో
మానిని యిట్లుపల్కితిని మానధనా రవిపుత్త్రభూషణా. 560

మ. అమరాళిం గన నుత్తముండవుగదా యట్లయ్యు నన్నేల నే
మమునన్ సన్నుతి చేసినాఁడ విది యే మాడ్కిన్ ఫలింపంగఁ జే

య మదిం గోర్కె యొసాఁగ నిట్లనియె నాయర్కాత్మజుం డోమహో
త్తమరూపా! పురుషోత్తమస్థలిఁ బ్రదీప్తస్ఫారదివ్యాకృతిన్. 561

ఆ. ఇంద్రనీలమయిగ నెసఁగును బ్రతిమయు,నద్ది కామబృంద మాశ్రితులకు
ననుదినంబు నొసఁగు నద్దానిఁ గనిభక్తి,మనుజు లెల్ల నేకమనము లలర. 562

క. శ్వేతాఖ్యంబగు భవనం, బీతటిఁ గన నేగువార లేకామము లే
కాతతపుణ్యాత్మకులై, నాతట్టునుజూడ రేమి నాపాపంబో. 563

క. అరిసూదనా! మఱేపనిఁ బరికించి యొనర్పఁజాలఁ బ్రతిమను దానిన్
ధరఁ గన్పడకుండఁగఁజే, యు రయంబున నాయెడన్ గృపోన్నతి మెఱయన్.

క. అని వైవస్వతుఁ డాడిన, విని నేనిట్లంటి దేవి! విను మవ్వలి వా
ర్తను ధర్మరాజ! నాప్రతి, మను సికతావితతిఁగప్పి మనుజుల కెల్లన్. 565

క. ఒనరించెదఁ గన్పడకుం, డ నటంచుం బల్కి నేను నానాలతలన్
గనఁబడకుండం బ్రతిమను, మునిపూజం బడయునట్టి పోలికఁజేయన్. 566

చ. ఒనరిచి స్వర్గకాంక్షు లగునుర్విజనుల్ కనఁజాలకుండ నో
వనజదళాక్షి దాఁచితిని భర్మమయాభరణాళి వెల్గు నా
తనుగతచిహ్నముల్ వెలయుదానిని దాఁచ యముండు సంతసం
బునఁ జనె దక్షిణంపుదిశఁ బొల్పుపురంబున కార్తిపాయఁగాన్. 567

చ. అని వనజోద్భవుండు మునులందఱు నచ్చెరువందఁ బల్కె యి
ట్లను వనజాక్షుఁ డాత్మసతి కాదృతిఁ జెప్పిన దెల్లఁ జెప్పెదన్
వినుఁ డలస్వీయరూపమును విశ్రుతసల్లతలన్ దృఢంబుగాఁ
బెనఁగొనఁ జేసె క్షేత్రమది విశ్వనుతంబయి యొప్పె నంతటన్. 568

సీ. రాజేంద్రుఁ డైనయింద్రద్యుమ్నుఁ డచ్చోటి కరుగుట కాంచుట యందు భ
నిలుచుట ప్రాసాద మెలమినిర్మించుట హయమేధ మొనరించు టవల స్వప్న
మందు జనార్దను నవ్యయుం జూచుట యుప్పసంద్రముదరి నొక్కచోట
దక్షిణస్థలమునఁ దరుశాఖఁ గాంచుట వాసుదేవుని శిల్పివరుని నందుఁ

తే. గనుట ప్రతిమను నిర్మింపఁగా దొడఁగుట
మఱియుఁ బ్రాసాదముననం దమరుల నెల్ల
శాస్త్రవిధిమీఱ స్థాపించి సర్వదేవ
తామయంబుగ నాక్షేత్రతల్లజంబు. 569

క. వెలయంజేయుట యాత్రకుఁ, బలుతావులనుండి వచ్చుభక్తుల కెల్లన్
జలజాక్షుని సేవించెడు, స్థలముల నిర్మించుటయును దత్క్షేత్రమునన్. 570

క. మునిపతి మార్కండేయుని, ఘనచరితము శంకరునకుఁ గాగేహంబున్
బొనరించి యందు లింగం, బును స్థాపించుటయుఁ దీర్థములపంచకమున్. 571

క. ధరణి నట వెలయఁ జేయుట, హరుఁగాంచుట వటతరువును నరయుట వృష్టిం
బరికించుట బలదేవుని, హరి దర్శించుటయు వారియనుజాత సతిఁన్. 572

క. వనజాక్షి సుభద్రాంబను, గనుఁగొనుటయు వారిదైన కమ్ర చరితముల్
వినుటయు నరసింహుని ద, ర్శనమునఁ గృతకృత్యుఁడగుట క్ష్మాపతియంతన్.

తే. వృష్టిసంకీర్తనము చేయు టొక్కచోట
నయ్యనంతుని వాసుదేవాఖ్యుఁ గనుట,
వారిసంకీర్తనంబును స్వర్గగమన
యోగ్య మగుద్వారమును గాంచు టుద్యమమున. 574

వ. శ్వేతమాధవమాహాత్మ్యంబు నెఱుఁగుట సముద్రమును దర్శించుట యందు స్నానతర్పణంబులు సేయుట, సముద్రస్నానమాహాత్మ్యంబువినుట పంచతీర్థస్నానఫల మాలకించుట మహాజ్యేష్ఠప్రభావంబును, కృష్ణబలరాముల స్థానవిశేషంబులు సర్వయాత్రాఫలంబులు విష్ణులోకవర్ణనము లోనగు విషయంబుల శ్రీమన్నారాయణుండు లక్ష్మీదేవికిం దెల్పె నన విని మును లిట్లనిరి. 575

---

నలువదినాల్గవ యధ్యాయము.

ఇంద్రద్యుమ్నుఁడు పురుషోత్తమక్షేత్రమున నివసింపఁగోరుట.

మ. పరమేష్ఠీ! పురుషోత్తమస్థలిని భూపాలోత్తముం డుండి యే
కరణిన్ దేవునిఁ గొల్చెనో వినఁగఁ గాంక్షల్ మించె మాకోర్కులన్
వరుసం దీర్పు మటన్న బ్రహ్మ పలికెన్ బ్రహ్మర్షులారా! వినుం
డురుచిత్తుం డొనరించు కృత్యముఁ దదుద్యోగంబునుం దెల్పెదన్. 576

శా. భూపాలుం డలక్షేత్రవర్యమును సంపూజ్యంబు లోకత్రయీ
పాపారణ్యదవానలంబుఁ గని యాపాథోధి తీరంబునన్
జూపట్టం దగు సాధుభాగముల సంశోభిల్లుపుణ్యాపగ
శ్రీపద్మాకర సంతతిం గనుచు సంప్రీతిం గనెం జాలఁగన్. 577

తే. వింధ్యపాదంబునం బుట్టివెలయు నొక్క
పుణ్యశైవలినియు నందుఁ బొలుపుఁ గాంచుఁ
బేరు వింధ్యాపగయనంగఁ బృథ్విఁ జెల్లెఁ
బాపహరణదక్షం బతిపావన మది. 578

సీ. గంగామహానదీ ఖ్యాతిఁగాంచినయది దక్షిణార్ణవమునఁ దాను గలియుఁ
గాన మహానదీమానితనామంబు దానికిం గల్గె నద్దాని జలము
పరిశుద్ధతమమయి పావనంబునునయి దక్షిణాంభోధికి దార యనఁగఁ
దనయాశతోపేత యనఁగ నానది యొప్పు దానితటంబులఁ గాననైన

తే. గ్రామములు నగరంబులు కరము సస్య
శోభితములు మనోజ్ఞముల్ సొంపుఁ బెంపు
గలుగుజనతతి నిబిడముల్ లలితవస్త్ర
భూషణోపేతములు నయి పొదలుచుండు. 579

క. ధరణీదివిజులు క్షత్త్రియ, వరులును వైశ్యులును విష్ణువరపాదభవుల్
నిరతము వేర్వేఱ వసిం, తురు స్వీయస్వీయపద్ధతుల విడువకయే. 580

క. శాంతమె ధనముగ లక్షణ, సంతతియే భూషణముగఁ సంతతమాలా
క్రాంతములగునవయవములు, వింతగ వారలకు నొప్పు వివిధవిధములన్. 581

క. మోమునఁ దాంబూలసుఖప, రీమళమును సాంగవేదరీతులు భూషల్
గా మెఱయుదు రందఱు ద్విజు, లో మానివరేణ్యులార! యుర్వి నరుదుగన్.

ఆ. అగ్నిహోత్రరతులు నౌపాసనక్రియా,రతులు విమలశాస్త్రవితతి దక్షు
లధ్వరములు చేయునాదృతి గలవార,లగుచు ద్విజులు పొల్తు రగణితగతి.

తే. చత్వములందు నుపవనసమితి యందు,వనములను రాజమార్గంబులను సభలను
దేవతాలయములను శ్రుతివ్రజంబు, సాంగముగ వినఁబడుచుండు ననవరతము.

క. ఇతిహాసములు పురాణ, ప్రతతియుఁ గావ్యములు శాస్త్రరాజియు సుజన
ప్రతతులు కీర్తింపఁ బ్రజా, వితతియు వినుచుండు మిగుల వేడుకపొంగన్.

చ. జనపదమందు నందుఁగల చానలు రూపము యౌవనంబు చ
క్కనిగతినొప్ప శాస్త్రములఁ గన్పడులక్షణరాజి యొల్లఁ ద
త్తనువులఁ జూడఁగాఁబడఁగఁ దద్దయు శ్రోణిభరంబు చెల్వుగాఁ
గనఁబడఁ బద్మనేత్రములు కమ్రశరచ్ఛశిసన్నిభాస్యముల్. 586

క. పీనోన్నతకుచములు కన, మానితములుగాఁగఁ దోఁప మందగతులతో
మానినులు తిరుగుచుండఁగఁ, గానందగు నరులె భాగ్యకలితులు సుండీ. 587

సీ. సంపదచే మించి సౌవర్ణవలయముల్ కరముల వెలయంగఁ గమ్రవస్త్ర
ములఁ దాల్చియరఁటిమోపులఁబోలిగాత్రముల్ కోమలతమములై నూర్మి నిడఁగఁ
బద్మకింజల్కసప్రభలు రాజిల్లంగ బింబాధరపుటముల్ వెలయఁ జారు
కర్ణాంతలోచన కలితలై మృదునీలకేశముల్ హారసంకీర్ణకంధ
తే. రములు వెలయంగ సురలోకరమణులఁ దమ
గాత్ర లావణ్యమునఁ దిరస్కార మొప్పఁ,
జేయ నుందురు; కొందఱు స్త్రీలు పద్మ
దళవిశాలాక్షులై సొంపు తనర నుంద్రు. 588

క. కొందఱు నారీరత్నము, లిందీవరదళనిభాయతేక్షణముల నిం
పొందుచు నుందురు మఱియుం, గొందఱు విద్యుత్ప్రకాశ కోమలదశనల్.

క. తనుగాత్రలు కొందఱు మఱి, యనుగొందఱు కుటిలకుంతలోరువిలాసం
బునఁదగువారలు కొందఱు,వనితలు సీమంతవీథి భాసురశీర్షల్. 590
సీ. కంధరాభరణముల్ గ్రాలనొప్పెడువారు హారభూషితలయి యలరువారు
నవరత్నయుక్తకుండలమనోహరముఖభాసురల్ దేవతాభామినులను
దనుగతలావణ్యమున ధిక్కరించెడువారునై కొందఱువఱలు వార
లాదేశమున; వినుఁ డందు గానంబున నందఱు మ్రాన్పడునట్లు చేయఁ
తే. జాలి కొందఱు వనితలు సాధుతమవి, పంచికావేణుముఖవాద్యపటుత నలరి
పణవగోముఖదుందుభి ప్రముఖ వాద్య, నిస్వనంబుల రంజింప నేర్పుగలిగి 591
క. సురుచిరశంఖమృదంగ, స్ఫురదారవములను జిత్తముల వికసిల్లం
గ రయమునఁ జేయఁజాలుచుఁ, బరస్పరము క్రీడ లొప్పఁబరఁగుదు రెపుడున్.
ఉ. సారసనేత్ర లందుఁబలుసారులు గీతములొప్పఁ బాడి హృ
త్సారసముల్ చెలంగ స్మరశాస్త్రవిశారదలౌట సంతతం
బారమణీయహర్మ్యముల హారివనంబుల స్వేచ్ఛ మీఱఁగా
గారవమూని నాయకుల గాఢముదంబుధిఁ దేల్చుచుం ద్రొగిన్. 593
క. జనపదమం దట క్షేత్రం, బనుపమరీతిం జెలంగు నందును సిద్ధుల్
ఘననియతుల్ గలవటువులు, వినీతులగు భిక్షువులును వెలయుదు రెలమిన్.
తే. స్నాతకులును వైఖానసుల్ సవనిరతులు, మంత్రసిద్ధులు తపమున మహితులైన
వారు సేవింప నా క్షేత్రవరముతనరు,చుండుఁ బురుషోత్తమాఖ్యచే నురువిభూతి.
క. పరమంబు దుర్లభంబును, బరికింపఁగ మౌనివేద్య భాసురమహిమ
స్ఫురితంబు నౌట నాభూ,వరుఁ డద్దానిం గనంగ వాంఛించె మదిన్. 596
క. కనినంత దాని నెమ్మన,మున నెంచె సనాతనుఁడయి పొల్చుపరుని లో
కనికరగురు భగవంతుని, వనజాక్షుని ముక్తిదాత వర్ణ్యమహిమునిన్. 597
తే. మఱి యనంతుని సర్వేశు మాన్యు విష్ణు
నచ్యుతు నపారమహిముని నాశ్రయించి,
యిందె పూజింతు; నిదియె రమేశ్వరునకు
మానసం బగుతీర్థంబు మది నెఱిఁగితి.
క. అతితరకాయంబునఁ గ,ల్పతరువునా వటమహీధ్రవర్యం బిట నే
చ్యుతిఁగనని మహిమ వెలయును, బ్రతిమయు నిట నింద్రనీలరమ్యాకృతిమై.
క. వెలసియు భగవంతునిచే, నిల నిట గోపితమ యయ్యె నింకొక్క రమే
శులలితవిగ్రహ మీభూ,స్థలమునఁ గన్పడ దదేమిచందమొ తెలియన్. 600
ఉ. సూనృతవిక్రముండగుచు శోభిలు నప్పురుషోత్తముండు మ
న్మానసవీథిఁ గన్పడెడుమాడ్కి నొనర్చెద యత్న; మద్దియే

దానతపస్స్నవంబులను ధ్యానమునన్ మఱి యర్చనంబులన్
మానితహోమపద్ధతుల మంచివ్రతంబులఁ బూని క్రమ్మఱఁగన్. 601

క. ఉపవాసంబుల మఱియే, మిపద్ధతులఁ గాననగునో మృత్యుంజయు ల
క్ష్మీపతిం దద్విధ మొనరుతు, నపరాధలవంబులేనియట్టి నియతిచేన్. 602

ఆ. అన్యమనను లేక యచ్యుతాధీనమా, నసము చెల్వమీఱ బిసుమూతు
నాయతనముఁ గట్టి యందుఁ దదర్చన, మేను జేయువాఁడ మాన నింక. 603

నలువదిరెండవ యధ్యాయము.

ఇంద్రద్యుమ్నుఁడు ప్రాసాదము నిర్మించుట.

క. అనిమఱియు సిరికి విష్ణువు, తనమహిమముఁ జెప్పినట్లు ధాత మునితతిం
గని చెప్పె నిట్టు లంతట, జనపతిమది నెంచి భక్తిసంపూర్ణుండై. 604

క. ప్రాసాదము నిర్మింపఁగఁ, దా సరగునఁ బూనెఁ నంతఁ దత్త్వవిదులనున్.
భూసురులను దైవజ్ఞుల, నాసుక్షేత్రమున శ్రీశు నాలయవరమున్. 605

తే. కట్టఁగాఁ గోరి వారిని గారమునఁ, బిలువఁగాఁ బంచి పూజించి పృథ్వి నెల్లఁ
జక్క శోధింపుఁడీ యన శాస్త్రరీతి, వారు శోధించి రంత నాభూరమణుఁడు.

సీ. జ్ఞానసంపన్నులై మాననీయాగమపారగులై శాస్త్రపటలి నెఱిఁగి
సత్ప్రవర్తకులయి శాంతధనుల్ మాన్యులయి తగు భూసుర లట్లమాత్యు
లఖిలవాస్తువిధంబు లందుఁబొండితి గల్గు వారును దనతోడ వరుసరాఁగఁ
జక్క నాలోచించి సకలశుభంబుల నిడఁజాలులగ్నమం దెలమిఁ గూర్చు

తే. చంద్రతారాబలంబుల సాధురాశి
గతశుభావిగ్రహంబులఁ గమ్రమైన
యామువాూర్తంబునందు జయధ్వను లొగిఁ
జెలఁగుచుండఁగ మంగళాశిషము లొప్ప. 607

క. పలువిధములైన వాద్యం,బులు మ్రోయఁగ వేదనాదములు శ్రుతిరంధ్రం
బులయందుఁ జొరఁగ సురుచిర,ములుగాఁ దగుగీతరావములు బోరుకొనన్.

తే. పుష్పలాజాక్షతలు గంధములును ధూప
దీపములు పూర్ణకుంభముల్ తృప్తినొసఁగ
నర్ఘ్యమిచ్చెను శ్రీహరి కధిపమౌళి
శ్రద్ధయును భక్తియుం గూడుస్వాంత మొప్ప. 609

క. హరి కిట్టు లర్ఘ్య మొసఁగి స,పరికరుఁడై రాజు పిలువఁబంచెఁ గళింగే
శ్వరు శూరు నుత్కలాధిపు, నిరుపమగుణుఁ గోసలాధినేతం ద్వరఁగన్. 610

క. వారలు రా నిటుపల్కెను, భూరమణుఁడు భూపులార పోదము శ్రద్ధా

ప్రారంభ మలర శిలకై, ధీరులు శిల్పాగమమునఁ దేటినప్రాజ్ఞుల్. 611

క. మనవెంట వచ్చి యుపలవి, ధిని దెల్పఁగ శ్రీపతికి నతిస్ఫుటరీతిం
గనఁబడు ప్రాసాదము సన్నమున నిర్మింపఁదగును మాధవుఁ గొల్వన్. 612

తే. బహుళశిలాకందరముల నొప్పి పరమ మగుచుఁ
జాలవిస్తృతి గలవింధ్యసానుమంత
మునకుఁ బోయి సమస్తభూములను వెదకి
చారుశిలలను గ్రహియించి శకటములను. 613

ఆ. మఱియు నితరములగు మహితసాధనముల, నునిచి తెచ్చి కట్ట నూహసేయుఁ
డాలసింపవలదు హరిపూజ త్వరపడి, చేయవలయు ననుచుఁ జెప్పి విభుఁడు.

క. అనియెను మఱియుఁ బురోహితు, లనుగూడిన రాజవర్యులం గని మీరె
ల్లను దూతలఁ బంపం దగు, జనులకు నాయాజ్ఞఁ దెలుపఁజాలినవారిన్. 615

క. జనపతు లెందెందుం గల, రనుపమగతి వారికడకు నాదూతలు పో
యి నిఖిలబలయుతముగ నిం,ద్రనజాతుని క్షేత్రమునకు వచ్చి మదాజ్ఞన్. 616

ఆ. చేయఁదగు కార్యముల కెల్ల సాయపడఁగ
వలయు నని పల్కఁదగు నంచుఁ బలుక నృపులు
దూతలం బంపి రప్పుడే దూత లరిగి
ధరణిపతులకుఁ జెప్పిరి తద్వచనము. 617

చ. నరపతులెల్ల రాధరణినాయకు నాజ్ఞల నాలకించి స
త్వరగతి సైన్యయుక్తముగ వచ్చిరి తూరుపు దక్షిణంబు నా
వరుణునిదిక్కు నుత్తరముఁ బాలనచేయు మహీశు లేగుదెం
చిరి నికటంబునందనరు శ్రీయుతభూపతు లాదరంబునన్. 618

క. చనుదెంచిరి పర్వతములఁ, దనరారుమహీశు లెల్లఁ దమి పొంగఁగఁ జ
య్యనవచ్చి రల్లె ద్వీపాం,తిని గలభూపాలకులును లీలాగతులన్. 619

చ. కరిహయముల్ రథంబులును గాల్బలముల్ తమవెంట రాఁగ భూ
సురులను ద్రవ్యరాసులను శుభ్రతరోత్తమరత్నరాజి నీ
శ్వరునకు నింకనున్ వలయు సాధనరాజిని గొంచు వచ్చి రా
ధరణిపునాజ్ఞలన్ దలలఁ దాల్చి మహోత్సవ మొప్పునట్లుగన్. 620

క. చనుదెంచిన యావరవర్యు,లను గని తన్మంత్రివర్యులం గని తోడం
జనుదెంచిన విద్వాంసుల, ననూనమగుప్రీతిఁ గాంచి యర్హావిధములన్. 621

క. మరియాద లొప్పఁ గూరిచి, ధరణీశుఁడు కార్యగురుతఁ దలఁచి యనియె నో
నరవరులారా! మీ రాదరమున మద్వాక్యములను ముదం బిడువానిన్. 622

క. వినుఁ డించుక యత్యుత్తమ, మనుపమమును బుణ్యదంబు నైహికమునుము

క్తినిఁగూర్పఁ జాలు క్షేత్రం, బును దీనిం గాంచినంతఁ బుట్టెను గోర్కుల్. 623

తే. అందు హయమేధ మొనరించు టనుచ నొకటి
సాధుతమమైనయట్టి ప్రాసాదవరముఁ
గట్టు టొక్కటి వీనినేగతిని సఫల
ములుగఁ జేయంగవలయునో తెలియఁబడక. 624

క. మనసట్టె చంచలించెడుఁ, గనుకన్ మీ రెల్లఁ గూడి కార్యము దీనిం
గొనసాగింపుఁడు మీదగు, ఘనతరసాహాయ్య మొదవఁ గార్య మి దలరున్.

చ. అనియిటు చక్రవర్తి తను నందఱఁ గూరిచి పల్కువాక్యముల్
విని పరిహృష్టచిత్తులయి వింతగ రత్నధనాళివర్ష మ
ట్లనుపమభక్తితో నృపతి యాత్మఁబ్రమోదము నొందునట్లుగాఁ
గను గురిపించి రొక్కుమొగిఁ గమ్రతరాంబరకంబళాదులన్. 626

తే. రాంకవంబుల మఱియువజ్రములు లోను
గాఁగఁదగు రత్నగణములఁ గరుల హరుల
నరదముల రౌప్యములను ధాన్యముల నింపి
రాస్థలము నెల్ల సజ్జను లౌర యనఁగ. 627

వ. మఱియువ్రీహి యవ మాష ముద్గ తిల సిద్ధార్థ చణక గోధూమ మసూర శ్యామాక మధుక నీవార కుళుత్థ ప్రముఖసకలవిధ ధాన్యముల నారణ్యకపదార్థవిశేషంబుల నచటఁ బ్రోగు పోయించిరి. తండులరాసులు పర్వతంబు లట్లుండె. అవ్వేలసకలపదార్థంబులు పచనముచేయింపఁబడియె. అతిథుల కెల్ల విధములఁ దృప్తిచేయింపఁ బడియె ఇట్లు వచ్చిన వారెల్ల సంతృప్తులుకాఁగా యజ్ఞసంభారము లన్నియు సిద్ధపఱుపఁగా నింద్రద్యుమ్నమహీజాని కరము హర్షించి యంతట. 628

సీ. యజ్ఞకర్మవిదులు నామ్నాయపారగుల్ వేదాంగసముదయవేత్తలు మఱి
శాస్త్రికనిపుణులు సర్వకర్మంబుల నిపుణులునైన మునిప్రముఖులఁ
దపసులఋషులను దగుబ్రహ్మచారుల సద్గృహస్థుల వనస్థులైన
మాన్యుల స్నాతకమండలి నగ్నిహోత్రాదృతిఁగనెడు బ్రాహ్మణులవేద

ఆ. పఠనశీలురగుచుఁ బరఁగు నుపాధ్యాయ,వరుల దేశికులను బరమనియతిఁ
దనరువిప్రవరుల ఘనుల సదస్యులఁ,గనుచుఁ దనపురోహితునకు ననియె. 629

చ ఘనమతులైన వీరల నఖండతరశ్రుతిపార మెంతయుం
గనిన మహాత్ములం గొనుచుఁ గ్రన్నన నేగి మహాశ్వమేధసి
ద్ధిని గనఁజాలు నాస్థలముఁ దీవ్రఫలప్రదమైనదాని య
జ్ఞనిరతిఁ గూర్చుదాని నిఁక శ్రద్ధనుబూని కనంగఁ జెల్లదే. 630

క. అనిపలుక భూమివరుని వ,చనముఁ విని పండితేంద్రసచివుల కవ్వా
క్యనిచయ మెఱిఁగించి ముదం,బున స్థపతులఁగూడి యతఁడు పోయెం ద్వరగన్.
క. ధరణీసురవర్యులనుం, బురస్కరించుకొని యజ్ఞమున కర్హములౌ
సరణుల నెఱిఁగినవిద్వ,ద్వరులం దోడ్కొనుచు రాజవరుఁ డలరంగన్. 632
క. చనియోఁ ధీవరనామం,బునఁ దగుగ్రామంబునకుఁ బ్రభూతమహిమ మొ
ప్ప నిరతముం దగుచోటికి,మనుజేంద్రుని యజ్ఞఫలము మాడ్కి నది తగన్.
వ. ప్రతోళివిటంకంబులం దనరునాగ్రామంబునకుం బోయి యందు. 634
క. వినుతంబగు శాస్త్రము చె,ప్పినయట్టులు యజ్ఞశాలఁ బృథులతరముఁగ
ట్టనుబంచె నట్టు లయ్యది,యొనరింపంబడియె శిల్పికోత్తమతతిచేన్. 635
సీ. ప్రాసాదవితతిసంబాధమై మణివరశోభితంబయి చాల సొగసుమీఱ
నింద్రహర్మ్యంబన నెసఁగుచు రమ్యమై భర్మరత్నావళి భాసమాన
మయి మఖవాటంబు హర్షొందె; స్వర్ణాంచితము లైన స్తంభములమలచిత్ర
తోరణావళులు నందుం బొల్చెఁజూడంగ ననువగురీతి నయ్యధ్వరగృహ
తే. మమలభర్మాంచితమ్ముగ నమరె నందు,నంతిపురములు బహువిషయములనుండి
వచ్చురాజన్యులకును నివాస మొప్పఁ,జేయఁ దగునట్టు లుండె నాక్షితిపునాజ్ఞ.
క. పలుదేశంబులనుండియు, నెలమిం జనుదెంచినట్టి యెల్లద్విజులకుం
గలుముల నీనుచు నుండం,గ లలితగేహములు పెక్కుగా నందమరెన్. 637
వ. ఆసమయంబునం దాయశ్వమేధోత్సవంబు విని. 638
చ. నరపతి మోదమంద నరనాథులు రత్నచయంబుఁ గొంచు వే
తరుణులఁగూడి యుత్సవముఁ దా రటఁ జూడఁగ నేగుదెంచి రా
ధరణిపు లెల్లరుఁ శిబిరతల్లజరాజి వసించి సన్నుతిం
ప రవము సింధుఘోషమును బాగుగ మించి చెలంగె నాదివిన్. 639
ఉ. అంతట వారి రాక విని యాదరముం బ్రమదంబుఁ బొంగ భూ
కాంతుఁడు వారికిం దగిన కమ్రతరాన్నముఁబిండివంటలుఁ
వింతగఁదోఁచు శయ్యలును వేడుకఁ గూర్చుమహోపచారముల్
సంతస మిచ్చునైక్షవరసంబును గోరసముఁ యథావిధిఁ. 640
క. సమకూర్పఁ బంచెఁ దానే, క్షమాధవుల్ మెచ్చుకొనఁగ సవ మది విప్రో
త్తమనికరము మునివర్యులు, క్షమఁగను నార్యులునుగూడి సాగింపంగఁ. 641
తే. వారిశిష్యులు తోడ్పడఁ బార్థివుండు, వారినెల్లను మర్యాద వఱలఁజేయఁ
దానె వచ్చి గృహంబులఁ దగినయట్లు,కనఁబఱుపఁగను సంతోషకలితు లగుచు.
క. జరపించిరి మఖ మయ్యది, నిరుపమముగ సాగుచుండె నృపుఁ డాతఁడు దం
భరహితుఁడై శిల్పుల నా,దరమున నర్చించెఁ దగువిధంబునఁ బేర్మిఁ. 643

క. వారెల్ల రమ్మహీపతి, గౌరవమునఁ గాంచి సర్వకార్యంబు లవే
వేరీతిఁ జేయఁబడెనో, సారవిధానమున నెట్లు సాగంగలదో. 644

క. తెలిపిరి; వారలు చెప్పిన, సులలితకార్యములరీతి సొంపుగ విని మం
త్రులఁగూడి సాంద్రమోదత, నలరారె ఫలించె నన్నయాశయ మొప్పన్. 645

మ. క్రతు విబ్భంగిగ సాగుచుండఁ బటువాగ్భ్రాంతుల్ సభాస్తారసం
తతి యౌరా!యన హేతువాదముల విస్తారంబుగాఁ జేయుచుం
బ్రతిపక్షాళి జయించుకోర్కెల మహారావంబు గావించి; రా
క్షితిభృన్మౌళియు సంతసిల్లఁగ శచీచిత్తేశు నర్చించుచున్. 646

తే. శాతకుంభమయంబులై చారుకాంతి
నలరుతోరణములఁ గట్టి రందుఁగల్లు
జనులు, వానిని వచ్చినజనులు గాంచి
రందుఁగల శయ్యలను మహార్హంపుమణుల. 647

క. పలువిధములైనస్ఫటికం,బులఁ గట్టిన గేహజాలముల రత్నములం
గలయం గూర్చిన కలశం,బులఁ జూచెడు వారి కెల్ల ముద మొనఁగూర్పన్

సీ. వర్ధమానకములన్ వాసి మించినయవ్వి కనుపట్టె నెంతయు గౌరవమును
గూర్చుచు నందునాక్షోణీశుఁ డరయంగ భర్మమయంబుగాఁ బరఁగనట్టి
చెందేని కనఁ డయ్యె; నెల్లచో యూపముల్ శాస్త్రోక్తమైనట్టి సరణిమించి
దారవంబు లగుచు భూరిమయాభరణావళి నొప్పుచు నలరె నవ్వి

తే. తగినతఱి నెత్తఁబడుచుండె స్థలజములును
జలజములు నైనజంతువుల్ సవముఁ జూడ
వచ్చినటు వచ్చుచుండ భూవరుఁడు గనియె
ముచ్చటగ నంద ఱుండిరి యిచ్చమీఱ. 649

వ. గోవులు మహిషీగణంబులు వృద్ధస్త్రీలు, నుదకభవసత్త్వంబులు శ్వాపదంబులు పక్షులు జరాయుజంబు లండజంబులు నందుఁజూడఁ బడుచుండె. పర్వతభవంబులు భూభవంబులు నగుధాన్యవిశేషంబు లందుఁగానఁబడుచుండె. ఇట్లు పశుధాన్యధనంబుల నాయజ్ఞవాటంబు నిండి యుండె నంత. 650

క. ధరణీశు లెల్ల నాయ,ధ్వరవాటముఁ గాంచి మిగుల వైభవములతోఁ
బరఁగెడు నని విస్మయ మొం,దిరి బ్రాహ్మణు లర్య్య లందుఁ దృప్తిం గనుచున్.

క. అనుపమ మిష్టాన్నంబులఁ,దనివార భుజించి రంత ధాత్రీసురు లం
దును లక్షసంఖ్య నొప్పిరి, వినుతించెడువారిరవము వినువీథిఁ దగెన్. 652

క. ఘనములు గర్జించెను బ్రతి,దిన మీవిధ మొప్ప భుక్తి ద్విజు లలరంగా
మనుజేంద్రుయజ్ఞ మయ్యది, వినుతిం గాంచెను త్రిలోకవిభు లెద మెచ్చన్. 653

చ. ధరణిసురుల్ కనుంగొనిరి తన్మఖవాటికయందు నన్నభూ
ధరముల క్షీరవార్ధుల నితాంతమనోజ్ఞదధిహ్రదంబులన్;
గరము ప్రమోద మొప్పఁ గమఖంబును జూడ హిమాలయాఖ్య ము
త్తరమున రామసేతు వది దక్షిణమందుననొప్పు భూస్థితుల్. 654

క. నానాజనపదవాసులు, మానితనియమాళి నొప్పు క్ష్మాదివిజులు భూ
జానిసమాహూతులు నై, మానినులం గూడి శిష్యమండలయుతులై. 655

క. చనుదెంచిరి మఱియును వే, లన లక్ష లనంగఁ జెప్పననువుపడిన మే
దినిదివిజులు వచ్చి మఖం, బునఁ జక్కఁ భుజించి గేహములఁ దగువానిన్. 656

క. కనకమణికుండలాంచిత, ఘనతరకర్ణులుగనొప్పు క్ష్మాదివిజులు వే
లనుమించి యజ్ఞమండప, మును బరివేష్టించి రెలమి మునుకొనుచుండన్. 657

క. నరనాథులకుం దగుపరి, కరముల భోజ్యముల విప్రకాండము పొంగన్
ధరణీశునాజ్ఞ వడ్డిం,చిరి భేదములేక భుక్తిచెల్లెన్ విధిగన్. 658

చ. శ్రుతులఁ దదర్థజాలముల సూనృతభంగి నెఱింగి నట్టివి
ప్రతతుల రాజవర్యుఁ డొగి రత్నధనంబుల గారవించె; భూ
పతుల దిగంతరాగతులఁ బౌరుషశాలుర యుద్ధనైపుణీ
క్షితిని బ్రసిద్ధిఁగాంచి మునిసిద్ధులఁబోలెడు యోగసిద్ధులన్. 659

ఆ. మిగుల గౌరవించెఁ దగుసపర్యలుమీఱ; నటుల నర్తకులను నర్తనాగ
మమున నేర్పుగాంచి యమరుపండితులను, సత్కృతులను నృపుఁ డెసంగఁజేసె.

చ. నరపతిపత్ను లెల్లరును నాథులు రాముద మొప్పుచుండ న
ధ్వరముఁ గనంగఁ జారుకుముదస్ఫుటపత్రవిశాలనేత్రముల్
పరఁగ శరద్ధిమాంశుసమభాసురవక్త్రము లొప్ప సత్కులం
బురుతరశీలముల్ వెలయ నొయ్యన వచ్చిరి లెక్కమించుచున్. 661

క. సవ మది నృపవరదేవీ, నివహాన్వితమై చిరత్న నిచయాంచితగే
హావిసరమై ధ్వజపూగ, ప్రవిమలమై చూడఁగఁ దగి భాసిల్లెఁ గడున్. 662

క. వరరత్నహారయుతమై, నిరుపమచంద్రప్రకాశనిర్మలమై భూ
సురవినుతంబై యొప్పెను, బరమాద్భుత మగుచు దేవవరసవ మట్టుల్. 663

సీ. పర్వతాకారముల్ పరిఢవిల్లఁగ మదజలధార లతిమనోజ్ఞముగజాఱ
నఖిలభూషణముల నందముదగియుండఁ గరులెల్ల నందొప్పెఁ గరము వేడ్కఁ
గలిగించుచున్; వాయుగమనంబునఁ జెలంగి సింధుదేశోద్భవస్థిరత నెసఁగి
శుభలక్షణంబుల శోభిల్లి శ్యామకర్ణంబులఁ జూపట్టి రమ్యతరము

తే. లైన శ్వేతాశ్వములు ససంఖ్యాకములుగ
వెలసె నాచోట; నాయుధబృంద మనిశ

దగినరీతిం దగం గడు దర్ప మొప్ప
వీరభటులందు నుండిరి గారవమున. 664

క. వా రెల్ల దేవపుత్త్రుల, బీరమున౯ గెల్వఁజాలు వీరులు గాన౯
భూరమణుఁ డెల్లతావులఁ, జేరి కనుంగొనియెఁ గార్యసిద్ధిం గనఁగ౯. 665

క. పరమానందము నొందుచు, ధరణీశుం డిట్లుపలికెఁ దగుగుణములతో
నిరుపమగతిఁ దగు నశ్వము, ధరణీస్థలిఁ దిరుగఁ బంపఁదగుఁ గాదె యిక౯. 666

క. దానిం గావఁగ భూధవ,సూనులు దర్పంబుమీఱ శుంభద్బలులై
జానుగఁ బోవం దగు నిట,భూనిర్జరవరులు వేదముల నర్థయుతిన్. 667

ఆ. ఎఱిఁగి శాస్త్రములను నెఱి యజ్ఞవిధుల ను,జక్కఁ దెలిసి నాకు సాయపడుచు
హోమకార్యవితతి నొనరింపఁ దగు నంచుఁ,బలికి రాజవరుఁడు పరమనియతి

క. కరులఁ జతుష్షష్టికిఁ దగు,శరత్తులం బోల్పువాని సాధుమనీష౯
ధరఁదగు నేణముల వృషో,త్కరముల గోవులను బాలకప్రజయుతిగన్. 669

క. తెప్పించి హేమకరకము, లొప్పిదముగఁ దేరఁబంచి యుర్వీదివిజుల్
గొప్ప యి దానన నిచ్చెను,దప్పక సర్వాధినాథుదయ గల దనుచున్. 670

క. నానాదేశాగతభూ,జానుల కెల్లను విధానసరణిఁ గరుల నా
జానేయ వరాంబరముల, నూనినశ్రద్ధం జెలంగి యొసఁగెఁ బురములన్. 671

క. పలువిధము లైన భక్ష్యం,బుల భోజ్యంబులను విప్రముఖ్యుల దీనా
వళుల ననాథులఁ దృప్తిం,బొలుపొందఁగఁజేసి యిష్టములఁ దీర్చెఁ దగన్. 672

చ. ధరణిసురావనీపతులఁ దద్దయుఁ బ్రీతిని గారవించి యా
దరమున వైశ్యశూద్రులను దన్పి స్వదేశముఁ గాననేగ భూ
వరుఁడును సమ్మతించె మఱి వారిసతీతిలకాళి సేవకో
త్కరముల సత్కరించెఁ గడుఁ గౌతుక మందిరి వార లాత్మలన్. 673

క. కృతకృత్యుఁడనైతిని నీ,వితమున నని రాజు తలఁచెఁ బృథ్వీసురులు౯
క్షితిపులులోనగు జను లా,దృతిగాంచుట కన్నులారఁ దిలకించుటచే. 674



నలువదియాఱవ యధ్యాయము.

క. అని పలికి మఱియుఁ జతురా,ననుఁ డిట్లనిపల్కె మానినాథులతో వే
దనియతవిధి హయమేధం,బును నింద్రద్యుమ్నభూవిభుఁడు నియతుండై. 675

క. అంతఃకరణము శుద్ధి౯, వింతగఁ గాంచంగ ఘోరవిపులభవాబ్ధి౯
జింతించి భీతుఁడై యే,కాంతమ్మునఁ గూరుచుండి కడు నిష్ఠమెయిన్. 676

చ. మురహరుసత్పదంబునకుఁ బోవఁగఁగోరి ముకుందు నచ్యుతుం
బరము జగత్పతి౯ భువనవారముదావహదివ్యనాముదు

స్తరభవసాగరోత్తరణ శాశ్వతనౌకనుఁ జిత్తపంకజాం
తరముననిల్పి సన్నుతిని దా నొనరింపఁగఁ బూనె భక్తితోన్. 677

సీ. సర్వలోకాధార! సర్వకామప్రద! శ్రీనాయకా! దయాసింధు భక్త
వత్సలా సజ్జనవారపోషణరత భవసాగరనిమగ్నుఁ బాపనిరతు
నన్నుఁ గాపాడుమా నానావిధాసురసంహారకా లయశ్వసనతుల్య
నరసింహ విక్రమస్ఫురణమూర్తీ! దీప్తనయనా! ననుంగావ హయముఖా, త

తే. లంపుమా మదిని; రసాతలంబునుండి
ధరణి దంష్ట్రాగ్రమునను యెత్తంగఁబడియె
దాన రక్షింపఁబడియె నోదంష్ట్రిరూప
భవభయమునుండి నన్నుఁ గావఁ దగునీవు. 678

క. పరమాత్మా శ్రీకృష్ణా,వరదా; నీమూర్తు లివియె వఱలు జగమునం
బరినుతములయ్యె నవి యే,హరి! బలదేవాదులందు నలరుదు వీవే. 679

క నీతనువులె తార్క్ష్యాదులు,భూతలమున ఖ్యాతినొందెఁ బో లోకేశా
ఖ్యాతింగల యాయుధములు,నీతనుశకలములె చూడ నీరజనాభా. 680

వ. కేశవాదినామభేదంబు లెన్నిరో యా బుద్ధిమత్కల్పితంబులగు నవియన్నియుఁ బ్రసన్నాయతలోచనా! నీతనువులే నాచేఁబూజింపఁబడి నుతింపఁబడి నమస్కరింపఁబడిన వన్నియు నీరూపములే. ధర్మకామార్థమోక్షప్రదములగు హరసంకర్షణాదిరూపభేదములు నాచేఁ గీర్తింపఁ బడియె. మహాత్మా! నాకు వరమిమ్ము. ఆరూపములు త్వత్పూజార్థకల్పితములుగదా యనిపల్కి మఱియు నిట్లనియె.

క. పరమార్థంబునఁ జూచిన, సురవర! భేదంబు నీకుఁజొప్పడ దెందుఁ
నిరుపమతావకతను వ,ధ్వరమునిమిత్తంబు కల్పితంబయ్యెఁ గదా. 682

క. నిను నద్వైతునిద్వైతుని,గను జెప్ప నరుం డెవండు కడఁగును? నేకం
బనఁబడుదు వీవు శ్రీశా,మునిజనవంద్యా! సమస్తమున నీవుంటన్. 683

సీ. సర్వత్ర వ్యాపించి సాధుతరోన్నత చిత్స్వభావుండని చెప్పఁబడుదు
వీవు నిరంజనుం డిద్ధతేజుం డన వర్ణింపఁబడుదు ధ్రువంబు నీదు
నిర్మలరూపమ్ము నిర్లిప్త మమలంబు సూక్ష్మంబు నచలంబు శుభఫలదము
కూటస్థమును బాపకూటవినిర్ముక్తము నగు; సత్తామాత్ర మనఁగఁ జనును

తే. దానితత్త్వంబు దేవతాతతు లెఱుఁగరు, నాఁగ నిఁక నెట్లెఱుంగుదు నరుఁడ నేను
సర్వలోకేశ వేదలోకచారుతరభ, వత్తనువు నాల్గుభుజముల వఱలుచుండు.

చ సురుచిరపీతవస్త్రమున శోభిలుచుఁ దరచక్రముల్ గదా
వరకరవాలముల్ మెఱయ భాసురరత్నకిరీట మొప్పఁగా

నిరుపమహారముల్ చెలఁగ నిర్మలచిత్రతరాంగదంబులున్
గరమువెలుంగఁ జూచుటకుఁ గన్నులు చాలక యుండు నో ప్రభూ. 685

క. ఉరమున శ్రీవత్సాంకము, కరముల వెదఁజల్లుచున్న కమ్రతరమహా
త్తరవనమాలయు నొప్పఁ గఁ, బరగెడు నద్దాని విబుధవర్యులు భక్తుల్. 686

క. అనవరతం బర్చింతురు, వనజాక్షా! భక్తలోకభద్రద కృపతో
ననుఁగావుము భవసాగర, మున మున్గిన వాఁడ వేయుమూర్తి నెలుఁగఁ జూ.

క. నిను నే శరణం బంటిని, వనజదళాక్షా! రమేశ! వారక నాపై
ననుపుము దయ మధుసూదన, నను నేఁచెన్ దీవ్రశుగ్గణంబులు సతమున్.

సీ. జరయు వ్యాధిగణంబు సతము పీడించెడు మూఢుండ, బహువిధభూరికర్మ
పాశయంత్రితుఁడను బలితుఁడ బహుఘోరసంసారకంధి విషయపయసుల
నంతములేని దహార్యరాగద్వేషఝషసంకులం బంగసంఘభీక
రావర్తగంభీర, మతిశయతృష్ణాశుగుర్మిసంకుల మురుతరంబు

తే. నిర్గతాలంబముమఱి, యనిశము చంచ
లంబు నిస్సారమును నయి డంబుమీఱు,
చును నిరాశ్రయమై మాయ గనుంగొనంగఁ
దగనిదానిని గానఁబడఁగ నొనర్చ. 689

క. కనరాని యట్లు భీతిం, గనఁజేయఁగ నట్టి జన్మకంధిం బడి త
ట్టును గానకున్నవాఁడను, గనుకన్ రక్షింపవయ్య! కంజాక్షహరీ. 690

క. నానాజాతిశతంబుల, సూనుత్వముగాంచి కాంచి చొక్కితి; భవసం
తానము గాంచితి వేలని, యైనన్నియుతంబులనియునైన నవి తగున్. 691

క. భవసాగరమున నిచటబ, హువిధవ్యథ లెన్నియేనియో కంటిని భ
క్తవరద! సాంగమ్ముగ వే, దవితతి చదువంగఁబడియెఁ దామరసాక్షా. 692

తే. ఎన్నియోశాస్త్రముల నేర్చియున్నవాఁడ
మఱియు నితిహాసములు కథామండితంబు,
లగుపురాణంబు లెన్నియో యరసినాఁడ
స్మృతివితతిఁజూచినాఁడనచ్యుత! పరేశ. 693

క. ప్రమదము దుఃఖము సంచయ
ము మఱియు నపచయము వ్యయము భూరిధనంబున్,
మమతన్ గడియించుట విజ
యము నపజయము నను నివ్వి యనిశమునా చేన్. 69

ఆ. అనుభవింపఁబడియె నరిమిత్రబంధుభా, ర్యావియోగయుతుల ననుభవించి
తిని బితరుల జననులను నెందఱినొ చూచి, యున్నవాఁడ నేను మున్ను దేవ.

సీ. ఎన్నియో దుఃఖంబు లెసఁగుసుఖంబులు ప్రాపించె బంధుపుత్రకులు భ్రాత
లల్లి జ్ఞాతులునుండి రంగనామణులతోఁ గాలంబుఁ బుచ్చితి గర్భమందు
విణ్మూత్రముఖవస్తువిప్లవం బగుచోట నివసించితిని దుఃఖనీరరాశి
దాఁటంగఁజాలక తపియించితిని బాల్యయౌవనలబ్ధదుఃఖాళి వార్ధ
ఆ. కమునఁగలుగు వెతయుఁ గడుదీర్ఘ కాలంబు,
నన్నుఁ బొందెను మరణమునఁ గలుగు
వెతలు యమునియింటి వివిధకష్టంబులు
తెలియఁబడియె మున్నె దేవదేవ. 696

క. నరకమునందగు దుఃఖో,త్కర మెఱుఁగుదు ద్రుమములు, కృమితతి కీటాళుల్
కరిహయమృగపక్షులు కా, నరముఖజంతువులు నాకు జనకంబులు సూ. 697

క. ధరణీసురముఖులౌద్విజు, లురుమతులౌ శూద్రు లర్థమొప్పఁగఁదగు భూ
వరులు దరిద్రులుగాఁదగు, వరమానులు రాజభృత్యవారము మఱియుక్. 598

తే. ఇతరజాతులు మఱియుల నెన్నొ కలవు, వానియందెల్ల జన్మంబు వరుసఁ గనితి
విసుగుచెందితి శ్రీనాథ వివిధగతుల, రాజులకు దాసుఁడనైతి రాజునైతి.

క. జనియం దొకట దరిద్రత, గనితిక్ స్వామిత్వ మేను గాంచితి జన్మం
బున నొకట నీశ్వరత్వం,బును గాంచితిఁ బల్కులేల మురదనుజహరా. 700

తే. ఎందఱినో చంపినాఁడ నన్నెందఱో వ,ధించి రెందఱకో ధనసంచయముల
నిచ్చినాఁడను గైకొంటి నితరులవల,నను ధనం బెంతయో రమానాథ! దేవ.

క. జననీజనకసుహృద్భ్రా,తృనిచయములనుండి మఱియు నింతులవలనక్
గనితిక్ దైన్యము ధనములఁ, దనరారెడుశ్రోత్రియులవితతినుండి కడుక్. 702

సీ. కనినాఁడ దైన్యంబుఁ గడుదరిద్రులుగాఁగఁ గనఁబడుమునులవంకను మహత్త
రము లగుకష్టమ్ము లమరె వారలతోడ సిగ్గుమానియె వచించితి మదీయ
దైన్య మియ్యదియని; స్థావరములయందుఁ జరములయందును నరులయందు
దేవతాతతియందుఁ దిర్యక్కులందును నేను బుట్టనితావు గానరాదు
ఆ. దనుజహరణ నరకమున వాస మొక్కటి,స్వర్గవాస మొకట జనులవాస
మైనలోకమందు నలరియుండుట నొక్క, యపుడు తీర్థజలములందు నొకట.703

క. జలయంత్ర చక్రభాగము, లలయక పైభాగమునకు నటులె యధస్స్థ
స్థలమునకుఁ దిరుగుచాడ్పున, జలజాక్షా! తిరిగినాఁడ సంతత మీశా. 704

వ. చక్రభాగము లెట్టులూర్ధ్వాధోమధ్యభాగంబు లనునియమంబు లేకతిరుగునో
యట్లు నేను గర్మరజ్జుసమాశ్రితుండనై కర్మయోగంబున నూర్ధ్వమధ్యాధోభా
గంబులందుఁ దిరుగుచున్నవాఁడను. ఇట్లు భైరవంబై రోమహర్షణంబైన సంసా

రచక్రంబునఁ జిరకాలమునుండితిరుగుచున్న వాఁడను. దీనియంతంబుఁ గనఁజాల కున్న వాఁడ. శ్రీహరీ! వ్యాకులేంద్రియుండ నైతి. ఇఁకనేమి చేయుదును. 705

చ. ఘనతరశోకతృష్ణల నికామము భీతుఁడనై పలాయనం
బును గనుచున్న వాఁడ గురుబుద్ధి నశించెడు దేవ నీవె ది
క్కని శరణంబుచొచ్చితి మదాత్మ భయాతుర మయ్యె గోపికా
జనపరిపాలకా! కుభవసాగరమగ్నుని నన్నుఁ గావుమీ. 706

మ కరుణంజూడుము నన్ను భక్తునిగ హృత్కంజంబునం దెంతువే
వరదా నిన్విడనాడి వేఱొకని నే బంధుప్రియంబొప్ప నే
తరుణం బందుఁదలంప నింక హృదయస్థానంబునం గల్గుదు
స్తరచింతౌఘము మాయఁజేసి కనుమా దాక్షిణ్య మేపారఁగన్. 707

మ. నిను నే నాథునిఁ బొంది భూరిభవకంధిస్ఫారభీతిం దొలం
గను శక్తుండనె యైతి నచ్చుఁ దలఁతుం గంజాక్ష! యోనాయకా
జననంబుల్ స్థితిమృత్యువుల్ గలఁప నేనందంబునం జాలవో
యనుకంపన్ దగ నట్లుచేయుము మహోర్వ్యాంఘ్రిద్వయా శ్రీహరీ. 708

క. క్షేమము యోగము నాయది
యేమెయిఁ గనుఁగొనఁగవలెనొ యెన్నుము నీవే
దామోదర! విధియుతముగ
నేమనుజులు నిన్ను గొల్వ నెఱుఁగరొ వారల్. 709

క. నరులం దధములు సుగతికి, నరుగఁగలే రట్టివారి కతిశయభవసా
గర మెట్లు దాఁటశక్యం,బు రమాధీశా! మహేశభువనాధీశా. 710

తే అట్టినరులకుఁ గులమేడ? యలఘుశీల, మేడ? విద్యయదేటికిఁ? జూడ జీవి
తమ్మదేటికి? గాల్పనే దైత్యదమన, యెవరియాత్మల భక్తియుసువిహితముగ. 711

క. జనియింపదొ కేశవునం, దనుమానం బేల యాతఁడాసురిఁ బ్రకృతిం
గని నిన్ను నిందసేయును, జనిఁగాంచు నతండు మరల సరగున ధరణిన్. 712

క. మృతినొంది నరకమునఁబడి, తితి మఱియుం బుట్టి మృతినిజెంది మరలనీ
వితమునఁదిరుగుచునుండును, జ్యోతిలేనిపదంబు నతఁడు చొరఁ డెబ్బంగిన్. 713

క. పరమాత్మా! నారాయణ, దురితహరా! నిన్ను నెవరు దూషింతురొ యా
నరులు పురుషాధములుగాఁ, బరఁగుదు రిల వారికెట్లు భద్రము లలరున్. 714

క. ఎందెందు నేను జన్మము, నొందుదునో పూర్వకర్మ మొప్పుగఁ బురికొ
ల్పం దగ నందందును భ,క్తిం దనరఁగఁ జేయువయ్య కేశవ, కరుణన్. 715

చ. సురలును దైత్యదానవులు శుభ్రపథంబునఁ బోవఁజాలు నా
నరులును భక్తిభారమున నారదవందిత దేవదేవ ని

స్థిర మనురక్తిఁ గొల్చి బహుకామము లందిరి; దేవ యట్టి నిన్
హరి నెవఁ డాదృతిం గొలువఁ డాతఁడె పో తలపోయ మూఢుఁడౌ. 716

చ. శతధృతి లోనుగాఁ గలుగు సర్వసుపర్వులు నిన్ను నీశ్వరా
స్తుతి యొనరింపఁ జాల రన ధూర్తమనుష్యుఁడనై కరంబు మూ
ర్ఖతఁ దగునే నొగిం బ్రకృతికంటెఁ బరుండవుగాఁ జెలంగు ని
న్నుతు లొనరింపఁ జాలుదునె నూత్నవిధం బదికాదె యారయన్. 717

తే. ఐన నజ్ఞానభావము నూని వినుతి, చేసినాఁడను నాతప్పు స్థిరతరకృప
సైఁపుము తప్పు లొనరించు పాపమతుల, నైన సాధులు రక్షింత్రు గానలోల

క. కనుకన్ బ్రసన్నుఁడవు క, మ్మనఘా స్నేహంబు భక్తులం దుండుట నీ
కును సాజము భక్తిని బూ, నిన మది స్తుతియించినాఁడ నిన్నుం బ్రీతిన్. 719

క. ఈనాస్తుతి సత్యంబే, యానట్టులు కరుణ నునుపు మబ్జాక్షా నీ
కే నిదె వందన మిడుదున్, మానినుతా యంచు భూపమండనుఁ డెలమిన్. 720

ఆ. మాన మూని యుండ సూనాస్త్రజనకుఁ డా
గరుడకేతనుండు కడుఁ బ్రసన్నుఁ
డగుచు నతనిచిత్త మందున్నకోర్కుల
నెల్ల నొసఁగె మాను లెల్లఁ బొగడ. 721

చ. నరుఁ డెవఁ డీస్తవంబునను నారదవందితు సన్నుతించునో
నిరతము వానికిం గలుగు నిర్మలదివ్యపదంబు ముక్తియున్
ధరణిసురుండు పాయనిముదంబున దీనిని మూఁడువేళలన్
గురుమతియై జపించినను గూడును వానికి ధర్మకామముల్. 722

చ. ధన మొసఁగూడు ముక్తియును దప్పక యంతమునందుఁ గల్గు నే
మనుజుఁడు దీనిఁ బాడు విను మానక యింకొకరిన్ వినంగఁ జే
యును దమి నట్టివానికి మహోత్తమదివ్యపదంబు గల్గు న
వ్వనజదళాక్షుఁగూడియె నివాసము చేయు నతండు ధన్యుఁడై. 723

సీ. భవ్య మీస్తవము పాపనికరతూలాగ్ని యగు భుక్తిముక్తుల నర్హరీతి
నిచ్చును మంగళ మీస్తుతి లభియించు గుహ్య మియ్యదియెల్లకోర్కు లొసఁగు
నది దుర్లభంబైన యదికాన నెవరికి నుపదేశవిధి మీఱ నొసఁగరాదు
నాస్తికునకు మూర్ఖునకుఁ గృతఘ్ననకును గర్వయుక్తునకు దుష్కల్మషములఁ

తే. జేయునతనికి ధూర్తున కీయమోఘ
వినుతి నొసఁగంగరాదు భక్తునకు సుగుణ
శీలునకు విష్ణుపూజను జేయువాని
కిని సుశాంతున కీయఁగల్గును ఫలంబు 724

చ. ఇది సకలాఘనాశక మహీనకృపాన్విత మిద్ది మోక్షదం
బిది సుఖదంబు వాంఛితము నెల్ల నొసంగసమర్థమై ఫల
ప్రదమయి నిస్సమానతవిరాజిలు శ్రీపురుషోత్తమాజ్ఞ చేఁ
సదయుఁ బురాణపూరుషుని శ్రద్ధను దీన నుతించు నాతఁడున్. 725

తే. పరమపురుషార్థమునుబొందు గరుడగమను
నందు సంలీనుఁడౌ నథ్వరాగ్నియందు
మంత్రహుతమగు నాజ్యంబు మంటఁ గలియు
చందమున సత్య మియ్యది సత్యమిద్ది. 726

చ. అతిశయదుఃఖసాగరనిహంత పరాత్పరుఁ డవ్యయుండు శ్రీ
పతి యొకఁడే చెలంగు మఱి భార్గవినేతకు నీడునేయు వాఁ
డితరుఁడు లేఁడు స్రష్ట యతఁడేయగుఁ బాలకుఁ డన్న నాతఁడే
మృతికరుఁ డన్న నాతఁడె మహిం గడుమాన్యుఁడుగాఁ జెలంగెడున్. 727

ఆ. విద్యయున్న నేమి విపులగుణంబులు, గల్గియున్న నేమి క్రతువు లెన్ని
చేయఁగల్గనేమి యాయతతపములు, చేయనేమి భక్తి చెందకున్న. 728

క. పరమపదంబిడునీపయి, గురుతరభక్తిం దగంగఁ గూర్చినఁ జాలున్
సరసిజలోచన యాతఁడె, ధరణిన్ ధన్యుండు శుచియు దైవజ్ఞుండున్. 729

క. క్రతువితతుల నొనరించిన, యతిపుణ్యునకంటె శ్రేష్ఠుఁ డగుఁ బరమాత్మం
డతులితమహిముఁడు నగు శ్రీ, పతిపై నెవ్వనికి భక్తి పరఁగునొ యతఁడే. 730

క. జ్ఞాతయు సత్యవ్రతుఁడును, దాతయు విజ్ఞానరూప ధనవంతుండున్
భూతలవిఖ్యాతయశో, వ్రాతావృతదిగ్వితతియు రమ్యాత్ముండున్. 731

---

నలువదిరేడవయధ్యాయము.

ఇంద్రద్యుమ్నునకు స్వప్నమునభగవంతుడుదర్శన మొసంగుట.

క. అని చెప్పి బ్రహ్మ మఱియును, మునివరులం గాంచి పల్కె మొదమున నట్లా
మను జేంద్రుండు సనాతను, జనార్దనుని సర్వకామసత్ఫలదాతన్. 732

తే. వాసుదేవుని వినుతించి వసుధఁ గుశలఁ
బఱచి యవ్వానిపై రమ్యవస్త్రము నిడి
నిర్జితేంద్రియుఁడై పరుండెను దదాస
నమునఁ దద్గతచిత్తుఁడై మమత వదలి. 733

క. సురనాథుఁ డాజనార్దనుఁ, డురుతరమహిమాఢ్యుఁ డెట్టు లుర్విని నిందున్
దొరలాడు నాదుమ్రోలను, బరికింపఁగ నైనమూర్తిఁ బ్రత్యక్షంబౌ. 734

తే. ఆర్తిహరుఁడైన యబ్జాక్షుఁ డాదరమునఁ
గనఁబడునో యంచుఁ జింతించుచును బరుండె;
నిట్లు నిద్రించునరపతి యెదుటఁ దోఁచె
వాసుదేవుండు లోకైకవందితుండు. 735

క. పరమకృపానిధి నృపతికి,వరనిజరూపంబు దివిజవారనుతమ్మున్
దరచక్రగదల నొప్పెడు, కరముల వెలుఁగొందు దానిఁ గనఁబఱిచెఁగలన్. 736

చ. నరపతి యంతఁ గాంచె ఖగనాథునియంసముపై వసించి ని
ర్జరగణసేవితుం డగుచు శంఖముచక్రగదాసిశార్ఙ్గముల్
శర మభయాఖ్యచిహ్నము విశాలసరోరుహ మాత్మహస్తరా
జి రమణ వెల్గఁగా మునులు చేరినుతింపఁగ నెంతొ ప్రీతితోన్. 737

క. ఘనతేజోమండల మొ, య్యన లయభాస్కరునిఁ గ్రుంగునట్లుగఁ జేయం
గను దోరష్టకమునఁ జూ, డనునయి రాజేంద్రు మదిఁ గడింది ముదంబున్. 738

క. కలిగించుచు శ్రీదేవీ, కలితుండై యిట్లు పల్కెఁ గమ్రోక్తి తగన్
సులలితమఖభక్తి శ్ర, ద్ధలఁ బ్రీతుఁడ నైతి మిగుల ధాత్రీశవరా. 739

మ. ధరణీశా! ఫలహీనపద్ధతిని జింతంబూనఁగా నేల? యే
కరణిన్ లోకసుపూజ్యమౌ ప్రతిమఁ బ్రాక్కాలంబునం దైనదా
ని రయంబొప్పఁగఁ గాంచఁ గల్గుదువో దానిం దెల్పెదన్ నీకు భూ
వర ప్రాతస్సమయంబునన్ విమలుఁడై భానుండు చూపట్టఁగన్. 740

క. నానావిధతరుభూషిత, మౌ నీరధిజలమునందు నరయఁగఁ జిత్రం
బో నరనాథా యొక్కఁడు, గానంబడుఁ దెల్పువాఁడ గౌరవ మలరన్. 741

క. ఆతరుణంబున వేలను, జేతోముద మొప్పునట్లు చేయుజలము వి
ఖ్యాతతరంగావళిచే, నాతీరము ముంచుచుండు నద్భుతరీతిన్. 742

ఆ. అట్టిచోటఁ దీర మాశ్రయించినయట్లు, లోకవృత్తు రాజ మొప్పుచుండు
దాఁ దరంగముల సుదాత్తరవంబునఁ,గొట్టఁబడియు నింతకుందనట్లు. 743

క. పరికంపము నొందక యా, తరువరము చెలంగుచుండు దానికడకు నీ
వరుగుము పరశువుఁ బూనికఁ, గరమున ధరియించి యొంటిగా రాజేంద్రా.

క. తరు వది యశ్వత్థాఖ్యము, పరశువుఁ జేఁబూని దానిఁ బడఁగొట్టుము భూ
వరశంక గొనుకుమా మఱిఁ దరువిచ్ఛేదంబు జేయఁ దగునే యంచున్. 745

క. ప్రాతఃకాలంబున సం,ప్రీతిం గూర్పంగఁ జాలు పృథువృక్షము నీ
రీతిం దెగవేసితి నని,భూతలనాథా! తలంపఁబూనకుము మదిన్. 746

క. దానిం గన్నంతనె నీ,మానసమున సంతసంబు మైకొనుఁ గానన్
దానిమహాశాఖను గొని,మానితగతిఁ బ్రతిమఁ జేయు మానకరాజా. 747

క. వదలుము చింతను నీవిఁకఁ,గుదురును నీవాత్మ నెన్నుకొను ప్రతిమయు నే
కొదువయు నుండదు నీకని,ముదమున శ్రీహరి వచించె భూపతి పొంగెన్. 748

చ. అని వచియించి శ్రీహరియు నప్పు డదృశ్యత నొందె నంత నా
మనుజవిభుండు మేలుకని మానస మెంతయు విస్మయంబు నొం
ద నిశను దాని నెవ్విధినో దాఁటఁగఁ జేసి రమేశునందె నె
మ్మనముదగంగ విష్ణుసహస్రంబును దెల్పెడు మంత్రరాజినిన్. 749

తే. సూక్తములను బఠించుచు శుభతరగతిఁ, దెల్లవాఱఁగ లేచి సంపుల్లహృదయ
పంకజుండయి విధి నపాంపతిని గ్రుంకి,విప్రవరులకు దానముల్ వేడ్క నొసఁగి.

క. గ్రామంబుల నగరంబుల, భూమీసురవరుల కొసఁగి పూర్వాహ్ణమునన్
దామోదరునకుఁ బ్రీతిగ,నేమములం దీర్చి యేగె నృపుఁ డబ్ధిదరిన్. 751

చ. అరదము నాగఘోటకము లాజిసమర్థుఁడుగాఁ జెలంగి భీ
కరబలుఁడైన వీరభటకాంతుఁడు సారథి యిందు నొక్కఁడే
సరయఁగ లేక యొంటరిగ నబ్ధిసమాత్తరకూలమందుఁ దా
నరిగె మనోవిభూతి తగ నానరనాథుఁడు శ్రీశు నెన్నుచున్. 752

క. కనియె నట నొక్కచోఁ గాం,తినిమించుచుఁ జూడఁజూడఁ దీవ్రతరంబై
తనరారు వృక్షరాజముఁ, గనులకు రౌద్రముగఁ దోఁచి ఘనశాఖంబై. 753

తే. ఎత్తున విశాలమున దీని కిదియె సాటి,యనఁగఁ దగియును జలములయందు మున్గి
సాంద్రమాంజిష్ఠవర్ణమై జాతినామ,వర్జితంబయి కనుపట్టు వరతరువును. 754

చ. నరపతి గాంచి హర్షము మనంబున నొప్పఁగ శ్రీశునానతిం
బరశువుఁ గేలఁ దాల్చి తనపౌరుష మెల్లఁ గనంబడంగ నా
తరువును జెండెఁ దీక్ష్ణతర ధారను వెల్గుమహాయుధంబుచేఁ;
సరగున రెండుగా నఱికె క్ష్మాపతి యొంచెడునంతలోపలన్. 755

తే. చూచుచుండఁగ వేగమ సురవరేణ్యు,శిల్పి యగువిశ్వకర్మయు శ్రీపతియును
విప్రవేషంబు లలరఁగాఁ బృథ్వినాథు,కడకు వచ్చిరి సమగతి కడలుకొనఁగ, 756

క. తమకుం దారే కల్గిన,సుమహితభవ్యులైన చక్రిసురశిల్పులు తే
జములన్ వెలయుచు వరగం,ధము చేతను బుష్పహార!తతిచేఁ దగుచున్. 757

చ: ధరణివిభూత్తముం ద్రిదశతల్లజమిత్రునిఁ గాంచి పల్కి రో
నరవర! యిందు నేఁడని యొనర్పఁగఁ బూనితొ యేటికో మహ
త్తరధరణీరుహంబు తనధర్మము చేయుచునున్న దీని నీ
బరశునిశాతధారలను బాగుగఁ ద్రుంచితి వింత చెప్పుమా. 758

క. అసహాయుఁడవై నిర్జన,ము సత్త్వబహుళంబునునయి పొల్చు గహనమం
దు సముద్రతీరమున ను,న్నసాలవర్యంబుఁ ద్రుంచినాఁడవు గాదే. 759

చ. అనియిటువార లిర్వురు మహాదరమొప్ప వచింపఁగా ముదం
బున విని కోమలోక్తులను భూపతి వారలతోడఁ బల్కె నె
మ్మనమునఁ జంద్రభాస్కరులు క్ష్మాస్థలిఁ జూడఁగ నేగుదెంచిరో
యని మదినెంచి రూపముల నాకృతిఁ గాంచి నమస్కరించుచున్. 760

క. తనముఖము వంచి యోహో, ఘనమతులారా! యమర్త్యకాండేశ్వరు లో
కనిచయరక్షకు భగవంతుని బూజ యొనర్పఁ గోర్కితో నే నిందున్. 761

క. ప్రతిమను నిర్మింపఁగ నీ, క్షితిరుహమును జెండినాఁడ శ్రీపతి నగు స
మ్మతినొందితి స్వప్నంబున, హిత మిక్కార్యముగఁ దోఁచె నీశు భజింపన్ 762

క. గతవార్తనెల్ల వినిపించితి నన్న నరేంద్రమౌళి చిత్తస్థితియున్
జతనమ్ము నెఱిఁగి త్రిజగత్పతి మాధవుఁ డలరి యిట్లు పలికెన్ నృపుతోన్.

తే. ఓమహాభాగ! మేల్మేలు నీవొప్పు దీని
కంటె నుత్తమకార్యంబు గలుగ దెదియు
భవమహాంబుధి ఘోరంబు బహుళభోగ
మకరసంకుల మగుఁగాదె మనుజనాథ. 764

క. కదలీదళసన్నిభమై, యదితగు నింద్రియము లనెడు నావర్తము లొ
ప్ప దురాసదమై సారం, బొదవెడువిధ మెన్నలేక యొప్పును గాదే. 765

చ. తలఁచినయంతనే దిగులు తప్పక కల్గఁగఁజేయుచున్ మలం
బులను విచిత్రబుద్బుదసమూహముల్ దగి చూడ భీతినిం
గొలుపుచు నుండునట్టి భవగాఢమహాంబుధి దాఁటఁ గోరి శ్రీ
లలితునిఁ గొల్వ నీమది చెలంగెఁ గృతార్థుఁడ వైతి వెన్నఁగన్. 766

చ. ధరణిపతీంద్ర సద్గుణవితానముచేత నలంకృతుండవై
తరయ సశైలకాననమహావని ధన్యయె నీదు పెంపునన్
బురనగరాళి గ్రామములు పూజ్యములే నిను నాథుఁగాఁగ ని
త్తరుణమునం గనం గలిగె ధర్మమతీ! విని కృత్తదుర్మతీ. 767

క. రారమ్ము ధర్మలోలా, చారుసుఖాస్పదముగా నెసంగెడు నీభూ
మీరుహమూలంబుకడం, గూరిమిఁ గూర్చుండు మమ్ముఁగూడి ముదమునన్. 768

క. వినుతింపఁ దగినకథలను, వినుమా మానుండి ధర్మవిస్తారక! యీ
యనఘుఁడు శిల్పివరుం డొ, య్యన వచ్చెను నాకుసాయమై యిచ్చటికిన్. 769

సీ. విశ్వకర్మసముండు వినుతిపాత్రుఁడు సర్వకర్మంబులందు నిక్కముగ సాధు
మతి యగు నీతఁడు మన్మత మూనియె ప్రతిమను నిర్మించు రయమునఁ దట
మును దీని విడిచి చయ్యన నొండుస్థలమున నివసింపుమా; యన నృపుఁడు బ్రాహ్మ
ణానుమతిం గొని యబ్ధితీరంబును విడనాడి యాచెంత విడిసె నొక్క
తే. తరువరచ్ఛాయ నంత భూసురతనుఁడగు, వాసుదేవుండు తచ్ఛిల్పివరున కీవు

చిత్రరీతిని బ్రతిమను జేయవలయుఁ, బరమశాంతుని గృష్ణునిఁ బంకజాక్షు. 770
క. ధరచక్రగదాకౌస్తుభ, ధరు శ్రీవత్సాంకు, రుచిరధాముని మఱి యిం
కౌరునిన్ శశినోత్కరా, భరమాధామాంగు దేవవర్యు ననంతున్. 771
తే. స్వస్తికాంకితు దేవయక్షఫణిదైత్య, గరుడగంధర్వ వితతికిఁ గానరాని
మహిముఁడౌట ననంతాఖ్య మహితరీతిఁ, జెలఁగెఁ గావున సట్టిసంసిద్ధవిభవు.
క. ఒనరింపుము బలదేవుం, డన నొప్పెడువాని మఱియు హరిసోదరినిన్
గనకచ్ఛాయఁ జెలంగెడు, తనువున నొప్పారుదానిఁ దన్వంగిఁ దమిన్. 773
క. పేరున సుభద్ర యనఁగా, ధారణి నొప్పారుదాని ధన్యగుణమణిన్
నారీరత్నంబును నీ, నేరుపు గనఁ జేయవయ్య నిర్మలచిత్తా. 774
క. ప్రతిమ యిది మూఁడవదిగా, జతనం బొప్పారఁ గూర్పఁజను నని పలుకన్.
దితిజారిశిల్పి యట్టులె, ప్రతిమల నిర్మించెఁ జిహ్నభాసురములుగన్. 775
క. సురుచిర విచిత్రకుండల, పరిభాసురకర్ణములను బరఁగుచు హలమున్
దరమును గరముల నొప్పఁగ, సురశిల్పివరుం డొనర్చె శుంభచ్ఛక్తిన్. 776
క. తొలిప్రతిమ శుక్లకాంతిని, జెలఁగుచు శారదహిమాంశు సిరిఁగల వక్త్రం
బెలమిం గూర్పఁగ రక్తా,క్షుల దీర్ఘాంగమున భోగశుభచిహ్నంబున్. 777
ఆ. కలిగె రూప మద్ది కమ్రనీలాంబరం,బును ధరించి యుగ్రమును బలమద
దుర్నివారమునయి దోఁచి గదాముస,లములఁ దాల్చి కుండలముల వెలసి. 778
క. తనరారెను; రెండవ దౌ,వనమాలాధరునితనువు వఱలెన్ సితప
ద్మనిభాక్షు మసితవిలస, ద్ఘనవర్ణము పీతవస్త్రకలిత రుచిరమున్. 779
క. శ్రీవత్సలక్షణము పు,ణ్యావహ మఘహారము చక్రహస్తము నగుచున్
బూవిలుతు ధిక్కరించుచు, శ్రీవిభవము నొచు మిగులఁ జెలఁగెం గననై. 780
క. మూఁడవప్రతిమయు మిగులం, జూడం దగి స్వర్ణవర్ణశోభిత మగుచుం
జేడియ యని తెల్పుచు సిరిఁ,గూడిన రూపమున వింతగొల్పుచు నుండెన్. 781
చ. అరుదగు పద్మపత్రములయందము గేలి యొనర్చు నేత్రముల్
నిరుపమచిత్రవర్ణముల నిద్దము గుల్కెడు నంబరంబు నా,
భరణతతుల్ వెలుంగఁగ సుభద్ర యనందగు విగ్రహంబు నా
సురవరశిల్పి గూర్చె నృపశేఖరుఁ డద్భుతరీతిఁ బొల్పుసుం
దరతరవిగ్రహంబుల క్షణంబున నిర్మితిఁ జేయు చందమున్. 782
చ. కనుఁగొని విస్మితుండగుచుఁ గ్రమ్మఱఁ జూచె మహాముదంబుఁ గాం
చెఁ; నవియు దివ్యవస్త్రయుగ చిత్రతరామలరత్నభూషణ
ప్రణుత సుచిహ్నముల్ వెలయ రమ్యతరంబులుగాఁ జెలంగె; వా
నిని గని విస్మయం బొదువ నెమ్మి నృపాలుఁడు పల్కె వారితోన్. 783
క. ధరణిసురరూపముల నీ,ధరణికి నేతెంచి యద్భుతంబగు రూప

స్ఫురణమున నొప్పుమీఱ లెవ్వరొ చెప్పుఁడ దేవవృత్తభాసురు లగుటన్. 784
క. మనుజులు కారని తోఁచెడు; ఘనవిద్యాధరులొ యక్షకాంతులొ పద్మా
సనవనజాతులొ లేక, న్నను నశ్వికుమారకులొ మనంబున నెఱుఁగన్. 785
క. సురుచిరసూనృతభావముఁ, లరుదుగఁ గన్పడఁగ మాయ యమరంగా నీ
ధర కేతెంచిన మీదగు, చరితము వినుపింపుఁడేను శరణాగతుఁడన్. 786

---

నలువదియెనిమిదవ యధ్యాయము.

ఇంద్రద్యుమ్నుఁడు పురుషోత్తమ ప్రతిమల స్థాపించుట.

క. అనవిని భగవంతుం డి, ట్లనిపల్కె నృపాలుతోడ నమరుఁడ నేఁ గా
నని యెఱుఁగుము యత్నునిగా, ననుఁ దలఁపకు కాను దితితనయుఁడన్ రాజా.
క. సురపతిని గాను మఱియున్, విరించి రుద్రుండఁ గాను విస్మయ మేలా
పరమేశ్వరుఁడను నేనే, ధరణీశా! లోకములవితతి కీశ్వరుఁడన్. 788
తే. ఆర్తిహరుఁడను సంపూర్ణ మైనబలము
విక్రమము గలవాఁడను విపులభూత,
వితతిచేఁ బూజఁగొనువాఁడ మృతి యనునది
యెప్పుడే లేకయుండుదు నిద్ధచరిత. 789
సీ. సకలవేదాంత శాస్త్రముల నెవ్వని జ్ఞానగమ్యుఁడం చనునుతిఁ గాంచు నట్లు
చేయుదురో యోగసిద్ధులు వాసుదేవుండని యెవ్వనిఁ బొగడువారొ
యవ్వాఁడ నేనె స్వయంభువుఁడను నేనె విష్ణువు నన నేనె విషమనేత్రుఁ
డనఁగ నేనే యింద్రుఁడన నేనె జగముల లయమొందఁగాఁ జేసెడుయముఁడనఁగ
తే. నేనె పృథ్వ్యాదిభూతముల్ మానసీయ
హుతవహత్రయ మన నేనె యుర్వి నేనె,
వరుణుఁ డన నేనె ధారణీ ధరుఁడ నేనె
స్థావరము జంగమము నేనె క్ష్మావిభువర. 790
క. చర మచర మనెడువిశ్వం, బరయఁగ మన్మయము నాకు వ్యతిరేకముగాఁ
బరఁగెడు నది లేదోభూ,వర! ప్రీతుఁడ నైతిఁ గోరు వరము వరంబున్. 791
క. ఎది నీమనమునఁ గోరితొ, యది నీకు ఫలింపఁగూర్తు నిద్ధచరిత్రా
మది సంశయింపకయె కోఁ, రఁ దగున్ నాదర్శనము విరజసులకె యగున్. 792
తే. అకృతపుణ్యులకున్ స్వప్న మందునైనఁ, గలుగ దది నీవుదృఢభక్తికలితుఁడవుగఁ
దనరుటం గంటి వీనన్ను ధరణినాథ, యనెడు శ్రీవాసుదేవోక్తి నాలకించి. 793
క. తనువున రోమాంచము లొ, ప్ప నిలిచి భక్త్యుత్కటమున భవ్యస్తోత్రం

బును జేయఁ బూనె నెమ్మనమున నారాయణుని బరసుముఖుని దలఁచుచున్.
క. శ్రీనాథా వందనశత, మోనీరజనయన దేవతోత్తమ శ్రీశా
మానితపీతాంబరధర, శ్రీనిలయ మనోజ్ఞహృదయ శ్రీప్రద కృష్ణా. 795
సీ. వందనంబులు నీకు వాసుదేవా; యాద్యుఁడనఁగ నీశానుండెయనఁగ నొప్పి
పరముఁడవైతివి పరమాత్ముఁడయి సర్వవిభుఁడయి సర్వతోవృతముఖుఁ డయి
నిష్కలుండయి మఱి నిర్గుణుండయి పరదైవమై యాసనాతనుఁడయి తగి
శబ్దగుణాతీతుఁ డబ్దనాయకుఁడు భావాభావవిరహితుఁడై చెలంగి
తే. సర్వవిదుఁడు నిర్లిప్తుండు సర్వభావ
నుఁడును సూక్ష్ముండవునై కనఁబడుచు వృష్టి,
కాలమేఘంబుకరణిని గాయకాంతి
వెలయ గోబ్రాహ్మణహితంబుః దలఁచు చెపుడు. 796
క. అందఱకు రక్షకుండై, యందఱచే వినుతిఁగనుచు నంతటఁ దానై
యందఱు తానేయయి యరవిందాక్షులఁ బొల్చువాని వినుతింతుఁ దమిన్.
క. దరచక్రగదలు ముసలము, కరముల నొప్పార నల్లఁగలువలవలె సుం
దరములగు కన్నులలరఁగఁ, బరఁగెడు పరమేశ్వరునకు వందన మిడుదున్.
క. ఉరగపతి శయ్యగాఁ దగఁ, బరిపూర్ణక్షీరవార్ధివసతి యలర దు
స్తరపాపరాశిఁ జెందుచు, హరియను వర్తిల్లు విభున కంజలిఁ గూర్తున్. 799
చ. వరదుఁడు లోకనాయకుఁడు వార్ధిసుతాపతి విష్ణుమూర్తి స
త్పురుషులకోర్కెపంట గురుముక్తి నొసంగెడు నవ్విరాట్టు భా
సురవరతేజుఁ డంచు నుతిశోభిలు విష్ణున కేను భక్తితో
మరల నమస్కరింతు సురమండన ప్రోవు మటంచుఁ గోరుచున్. 800
చ. అని వినుతించి భూమిపతి హస్తయుగంబును మోడ్చి పంచనం
బున నలరంగఁజేసి కడుఁ బూనిక భూస్థలమందె వ్రాలి యి
ట్లని వచియించె; నాథ పరమాత్మక నాపయిఁ బ్రీతియుంచు మె
న్న నిజమయే వరంబును మనంబున నెన్నుచుఁ గోరువాఁడఁజూ. 801
సీ. రాక్షసోత్తములు నిర్జరులు గంధర్వులు యక్షాసురోరగపక్షివరులు
సాధ్యవిద్యాధరుల్ క్షమతఁగాంచినసిద్ధు లఖిలగుహ్యకకిన్నరాళి మిగుల
శాస్త్రసంతతుల విశారదత్వము గన్న మునులు పరివ్రాట్టు లనుపమాన
యోగసక్తులు శ్రుతులొప్పారఁబఠియించి దానితత్త్వంబు నుదారమతిని
ఆ. దలఁచువారు మోక్షధర్మవిచారకుల్, మఱియుఁ లెక్కలేనిమహితగుణులు
పరమపదము దేనిఁ బరికించి ధ్యానింతు, రట్టిపదముఁ బరమమైన దాని. 802
క. అరయన్ నిర్గుణమై మఱి, పరమంబై పావనమయి బహుగుణాఢ్యంబై
విరహితమలినంబై తగు, పరమపదముఁ బొంద నాకు వాంఛ గలదుసూ. 803
క. అది దుర్లభంబు గావున,సదయహృదయ వాసుదేవ చక్రీ నాక

య్యది లభియింపఁగఁ జేయుము,మదిఁ గలవాంఛ యన,నిదియె మాట లిఁకేలా;

చ. అనవిని వాసుదేవుఁ డను నార్యవరా భవదీయ వాంఛితం
బనఘుము కోరఁగాఁదగినయట్టిదియే కనుకన్ ఫలించు దే
నిని మది నెట్లుకోరితివొ నెమ్మిని దానిని నట్ల పొందుమా
మనుజవరేణ్య సంశయము మానుము నాకృప నీపయిం దగున్. 805

క. పదివేలవర్షములు తొ,మ్మిది వందలు వానిపైన మేదిని నేయే
కొదువలు రాకుండఁగ నే,లుదువు ప్రజాసమ్మతంబులున్ వెలయంగన్ 806

క. ఆవల దుర్లభతమమై,పావనమై దివ్యము నగు పదమును బొందం
గా వచ్చు నదిసురాసురు,లేవిధమునఁ గోర దొరకకే చెలువారన్. 807

సీ. పరిపూర్ణమై సదా వాంఛనీయంబయి శాంతమై గుహ్యమై చలనరహిత
మగుచు నవ్యక్తమై యవ్యయంబయి పరాత్పరమయి సూక్ష్మమై భద్రదమయి
నిర్లేపమై క్రియానిచయకారణవర్జితమయి జరాశోకతతుల వీడి
యనుపమానంబయి యలరు నెయ్యది దాని జ్ఞేయాఖ్యపదమును మాయఁ బాసి

తే. యుండుదానిని జూపెద; నుర్విరమణ,దేనిఁ బడసి మహానందమూని పరమ
గతిని గాంచునొ దానినే కరుణ నొసఁగు,వాఁడఁ గీర్తియు నీకబ్బు నీడులేక.

క. కనుకన్ నీవిట నుండుము,ఘనములు నాకాశ మబ్జకాంతుఁడు శశియున్
గనఁబడుదు రెంతకాలం,బనఘా! నక్షత్రరాశి యలరెడుదాఁకన్. 809

క. సరిదధిపతులును మేర్వా,దిరమ్యభూధ్రములు మఱియు దేవతలును నుం
దురొ యెంతదనుక నీవున్,స్థిరకీర్తిం గనుచు నిందె చెలఁగుదు వనఘా. 810

క. క్రతువరతనుసంభవమై,క్షితి నింద్రద్యుమ్న మనఁగఁ జెలఁగెడుసర సొం
డు తనరు భూపతివర్యా,కృతమతి యెవ్వాఁడు స్నానకృత్యం బందున్. 811

క. జరపునొ యామర్త్యుఁడు ని,ర్జరపతిలోకంబు నొందు; జనుఁ డెవ్వం డీ
సరసుతటంబునఁ బిండము,లురుభక్తి నొసంగుఁ బితరు లుప్పొంగంగన్. 812

క. అతఁ డిరువదియొకతరముల,నతిపావనములుగఁ జేసి యమరేంద్రపురిన్
జతనమునఁ జూరఁగొనుఁ జు,మ్మతిపలు సురలోకవసతి నందినవారల్. 813

క. వినుతింతురు గంధర్వులు,మనమునఁ గలసంతసమున మన్నింతురు వా
నిని; వ్యోమయానమున నా,యనఘుఁడు నివసించి ప్రీతి యలరుచు నుండన్.

క శతమఖు లొగిఁ బదునల్వురు, చ్యుతిగాంచెడు నంతదాఁక శోభిలుచుండున్
క్షితిప సరోదక్షిణమున, దితిసుతభాగమున మఱ్ఱి తేజస్స్ఫూర్తిన్. 815

క. అలరుచునుండుఁ దదంతిక, తలమున మండప మొకండు తనరుచునుండున్
గలవందుఁ గేతకీవన, ములు దానింజుట్టి మిగులఁ బూజ్యము లగుచున్. 816

వ. నారికేళ, చంపకవకుళాశోక కర్ణికార, పున్నాగ, నాగకేసర, పాట, లామ్రాత, సరళ, చందన, దేవదారు, న్యగ్రో, ధాశ్వత్థ, ఖదిర, పారిజాతార్జున, హింతాళ తాల, శింశుప, బదర, కలంజ, లకుచప్లక్ష, పనస, బిల్వ, ధాతుక, ప్రముఖ వివిధభూరుహసమావృతంబై యామండపంబు మనోహరంబై యొప్పుచుండు.

సీ. ఆషాఢసితపక్ష మందుఁ బంచమినాఁడు పితృదేవతాకమై పృథ్విఁ గీర్తిఁ
గన్న మఖర్క్షమం దున్నతభక్తితో నన్ను దానితటంబునను విధిమెయి
నునిచి యేడుదినంబు లనుపమమండపమందుః బూజించి వేశ్యలసునర్త
నము మనోహారి గా నము మతి క్రీడావిశేషముల్ రత్నభూషితము లగుచు

తే. స్వర్ణదండంబులైనట్టి చామరముల
వాయువును గల్గ నన్ను సేవావిశేష,
ములను నర్చింపఁదగు; వటువులును యతులు,
స్నాతకులును గృహస్థులు సాధుజనులు. 818

క. ఇతరద్విజులును విమలప, దతతియుతస్తోత్రములను దారామ్నాయో
న్నతనిస్వనముల రాజా, మతివిభవ మ్మొగిఁ జెలంగుమాడ్కిన్ భక్తిన్. 819

క. బలరామకేశవుల ని, మ్ముల సంతస మందఁజేసి ముదమునఁ జేమో
డ్పుల నన్నుఁగనెడు భక్తుఁడు, జలజాక్షునిపురిని నయుతసంవత్సరముల్. 820

తే. అచ్చరలు తన్నుఁగొలువంగ నాదరమున, గీతములను గంధర్వులు కీర్తివెలయఁ
జేయఁగా శ్రీహరికినిదా సేవకుఁడయి, తిరుగు భగవంతునిం గూడి తేజమలర.

క. ఖరకరువర్ణమ్మునఁ దగి, నిరుపమ సద్రత్నహార నిచయాంచితమై
పరఁగువిమానంబున నే, తరుణమునం దిరుగుచుండు ధన్యాత్ముండై. 822

చ. తనతపమెల్ల క్షీణమగుదాఁక వసించి మనుష్యలోకముం
గన నరుదెంచి బ్రాహ్మణుని కమ్రకులంబునఁ బుట్టి యెంతయున్
ధనపతియౌచు వేదసముదాయము నేర్చి చెలంగుచుండు నం
చని వచియించి మౌనులకు నాయజుఁ డిట్లని చెప్పె వెండియున్. 823

చ. అనియిటు లామహీవిభున కచ్యుతుఁ డట్టివరంబు లిచ్చియొ
య్యన సమయంబుచేసి త్రిదశాధిపుశిల్పినిఁగూడి యప్పుడే
చనియె స్వకీయలోకగత సజ్జనులన్ దయఁ గావఁబూని యం
త నృపతి యప్డు హర్షమునఁ దద్దయు మేను చెమర్చుచుండఁగన్. 824

క. కృతకృత్యునిగాఁ దనునెం,చి తమిన్ హరిఁగంటి నింకఁ జేయఁదగిన ద
చ్యుతుసేవయె యని నిశ్చిత,మతియై శ్రీకృష్ణుని హాలమండితకరునిన్. 825

క. వరద సుభద్రను వేడుక, సురుచిరమణిహేమఖచిత శుభయానములన్
బరమముదంబున నునిచి క్షీ,తిరమణుఁ డామ్నాయరవతతియుఁ జెలఁగంగన్.

క. జయమంగళనిస్వనములు, వియదంతర మెల్లనిండ వివిధధ్వను లా
లయ మెల్ల ధ్వనిమయము సేయ యథావిధిఁ బావనమగు నట్టిస్థలమునన్. 827

తే. తాఁ బ్రతిష్ఠించి శుభతిథి తారకమగు
సన్ముహూర్తంబునందు లక్షణము లొప్ప
ద్విజులతోడను వేదవిధిని దగంగ
మూర్తిసంస్థాపనము చేసె భూమిభర్త. 828

సీ. ఆచార్యు ననుమతి నంది కృత్యంబెల్ల శాస్త్రసమ్మతముగ జరపి యంత
నాచార్యునకు విధియమరంగ దక్షిణలిచ్చి ఋత్విజులకు నెల్లనర్హ
దక్షిణ లొసఁగి వేదముల నేర్చిన యితరావనీసురులకు నాదరమునఁ
దగినదక్షిణ లిచ్చి తనరారుప్రాసాదవరమున మూర్తుల వరుస నిలిపి

తే. యించుకైనను శాస్త్రమ్ము మించకుండ, సకలకార్యంబు లొనరించి క్ష్మావిభుండు
బహుళసురభిసుమంబుల భర్మరత్న, మౌక్తికంబుల నర్చించె మహితభక్తి. 829

క. నానావిధవస్త్రంబుల, నానావిధరత్నములను నానాసనసం
తానంబుల గ్రామంబుల, మానితపురములను విషయమండలి నొసఁగెన్. 830

క. ఈరీతి నాధరావిభుఁ, డారూఢంబైన భక్తి హరి కొసఁగి మహా
సారం బగురాజ్యంబును, గారవమున నేలి సన్మఖము లొనరించెన్. 831

క. పలువిధములైన దానం,బులు చేసి మనోరథములు పొలుపుగఁ బండన్
జెలఁగుచు సంసృతి వదలుచు, జలజాక్షునిపదము చేరె శాశ్వతమదియే. 832

క. అనిపలికి బ్రహ్మ పఃతియును,మునులంగని క్షేత్రమహిమమును జెప్పితి నిం
కను వినఁగోరుదు రెద్దా,ని ననన్ బ్రహ్మోక్తి విని మునివరులు తమితోన్. 833

మ. వనజాతోద్భవ! యుత్తరన్ జనిన భవ్యక్షేత్రవర్యంబు చ
క్కనివాంఛావళి నిచ్చు నేవిధిని సత్కార్యంబులం దీర్థసం
క్తిని జేయందగుఁ బంచసంఖ్య నెసఁగుం దీర్థంబు లేవేవి యం
దొనరింపం దగుకృత్య మెయ్యదియొకో యొప్పారఁగాఁ జెప్పుమా. 834

ఉ. ఒక్కొకతీర్థమందు విధియుక్తిని స్నాన మొనర్చి దానముం
జక్కనిభక్తి నీయ నగుసత్ఫల మెయ్యది దానిఁ జెప్పుమా
యక్కమలాక్షు ప్రోక్షణమునందు నదేవిధి యొప్పుదానిఁ బె
న్మక్కువ నిర్వచింపుము సమాహితచిత్తుల మౌదు మందునన్. 835

మ. అనిప్రశ్నింపఁగ బ్రహ్మ యిట్లును నిరాహారుండుగా భూమిపా
లనికాయం బనిసేయు క్షేత్రమున లీలన్ బాద మేకంబు భూ
మినిదాఁకంగ వసించి యింద్రియములన్ మేలొంద నిర్జించి చ
క్కనిరీతిం బదివేలవర్షములు సంక్రాంతాత్మయోగంబునన్, 836

ఆ. ఒక్కమాఱుగాక యొగి నేడుమాఱులు,తపముచేయఁ బొందఁదగు ఫలంబు
పూని ద్వాదశితిథిఁ బురుషోత్తమక్షేత్ర,దర్శనోపవాస ధర్మనియతి. 837
క. కలుగుఁగదా దానినిమించిన,ఫల మబ్బుఁగ శంక లేదు భవ్యతమంబై
చెలఁగెడు జ్యేష్ఠంబున నిమ్ముల స్వర్గముఁ బొందఁగోరు పుణ్యమనీషుల్. 838
క. పురుషోత్తము దర్శింపఁగ, నరుగం దగుఁ; బంచతీర్థ మనుయాత్రను భ
క్తిరతిఁగ జ్యేష్ఠమునందు న్నరుపం జను విధిగ మానినాయకులారా. 839
క. సితపక్షంబున ద్వాదశి,నతిభక్తిఁగ లోకనాథు నంబుజనేత్రుఁగ
దితిజాంతకు నేమానవు,లతిశయఫలకాంక్షఁ గందు రమ్మనుజవరుల్. 840
ఆ. విష్ణులోక మొంది విపులసుఖంబుల, ననుభవించు చుందు రంతెకాని
మరలి రారువారు మనుజలోకమునకుఁగాన జ్యేష్ఠమందుఁ గడు నియతిని. 841
క. పురుషోత్తమసుస్థలమునఁ, బరఁగెడు నాపంచతీర్థవరయాత్రను జే
సి రమానాథునిఁ గనఁదగు, సురుచిరఫల మబ్బు మఱియు శోకము లడఁగుఁగా.
క. దూరంబున నుండినఁ జే, కూరెడుభక్తిఁగ మహాత్ముఁ గుంజరచింతా
పారావారోద్ధారకు, శ్రీరమణుని బొగడవలయు శ్రీవృద్ధికినై. 843
క. ప్రతిదినము పగలు శుద్ధా, త్మత శ్రీపురుషోత్తమునినమస్సుముఖుని స
న్నుతిఁ జేసిన శ్రీహరిపుర, సతతావాసంబు గల్గు సంశయ మేలా. 844
ఆ. కృష్ణపక్షమం దకృత్రిమభక్తిని, యాత్ర చేయునాతఁ డఘవితతిని
బాఱఁదోలి విష్ణుపత్తనమున కేగు, ధన్యుఁడగుచు భక్తమాన్యుఁ డగుచు. 845
క. హరిచక్రముఁ బ్రాసాదో, పరితలమున నున్నదానిఁ బరికించిన స
త్వరముగఁ బాపవిముక్తిని, గరము వెలుంగుఁగ రమేశుఁ గాంచెడుకతనన్. 846

---

నలువదితొమ్మిదవ యధ్యాయము.

మార్కండేయముని మహావటవృక్షమును దర్శించుట.

చ. మునివరులార లోకములు మున్గెడుకాలము రాఁగ బ్రధ్నుఁడా
యనిలుఁడు శీతభానుఁడును నంతము నొందఁగ జంగమంబు నాఁ
జనునది స్థావరం బనఁగఁ జాలిన యయ్యది యెల్ల నష్టమై
కనఁబడకుండె; నావిలయకాలకఠోరఖరాంశుఁ డొక్కెడన్. 847
క. అనఁబడసాగెను భీతిద, ఘనగర్జనముల్ నభంబుఁ గాఱియపెట్టం
గను వినఁబడె విద్యుద్ధ్వజ, మును గన్పడె దాన గిరులు భూజము లడఁగెన్.
క. ఉల్క లట్టెపడియె నొగిఁ దదాహతులచే, జగము నాశమయ్యె జలము లింకె
సరసు లెల్ల నదులు సైకతపూరంబు ననె కనంగ నయ్యె ననఘులార. 849
సీ. సంవర్తకనామకజ్వలనుఁడు పవనుతో నాదిత్యశోభితం బైనజగము
నందుఁ బ్రవేశించి యవనిని భేదించుకొని రసాతల మట్టె కోరి చొచ్చి

దేవతోత్తమయక్షదితిజభయంకరమయి తనర్చుచుఁ గ్రింద నమరియున్న
లోకంబుఁ గనుఁగొని వీక భస్మముచేసి యిరువదివే లన నెసఁగుసంఖ్య
ఆ. నొప్పుయోజనమ్ము లొగి శతగుణితమ్ము, లమరునంత యున్నతమునఁ బెరిగి
పవను సాయమునను బావకుఁడభివృద్ధి, నొందె నేమిచెప్ప నొప్పు నిందు. 850
క. సురగంధర్వులు రాక్షసు,లురగులు లోనైనదివిజయోనులు వహ్నిన్
ద్వారపడి మరణించిరి; భీ,కరమూర్తిం దాల్చి విలయకాలునిపగిదిన్. 851
క. హుతవహుఁ డాతఁడు ఖేచర, పతికోటిసమప్రకాశ పరిణామమునన్
బ్రతిలేక వెలిఁగి లోక, త్రితయము దహియించె వేయితెఱఁగులఁ గడఁకన్.
క. ఘోరాతిఘోరమై యిటు, భూరితరంబైన ప్రళయమున నిరుపమధ
ర్మారంభుఁడైన యొకముని, శ్రీరమణధ్యాననియతచిత్తుం డయ్యెన్. 853
తే. ఒక్కఁడేయుండె నట్టిమహోగ్రవిలయ
కాలమందు మార్కండేయుఁ డోలి మోహ,
పాశబద్ధుండు క్షుత్తృష్ణ లీశునాజ్ఞఁ
దనను బాధింప నింద్రియతతి గలంగ. 854
చ. కరము వెలుంగుపావకునిఁ గాంచి గళోష్ఠము లెండఁ దాలువుల్
సరిచెడఁగా భయమ్ము తనస్వాంతము బెగ్గడిలంగఁ జేయఁగా
ధరణిని గాందిశీకుఁడయి తాను జరించె విచేతనుండునై
శరణుచొరంగ నర్హుఁ గనఁజాలక నాలుగు దిక్కులం దొగిన్. 855
క. చరియించుచుండె నొక్కెడఁ,గరమార్తిని బాయ జాడఁగానక యింకే
కరణిం దిరుగుదు నెవ్వని, శరణము గనువాఁడ నేదిచనుఁ జేయఁగన్. 856
సీ. పురుషేశ్వరుఁడు దేవవరుఁడు సనాతనుం డగుదేవు నెవ్విధి నరయువాఁడ?
ననియిట్టు లేకాగ్రమైనచిత్తమ్మున నూహించి ప్రలయంబు లుప్పతిల్ల
హేతువై తగి పురుషేశవిఖ్యాతమై శాశ్వతం బగువటస్థోరుహంబు
నుండ నాధారమై యొప్పుతత్పదమును జేరె; నంతట మునిక్షితిపమౌళి
తే. త్వరగ నాచోటుఁ జేరి యాస్థానమందు, వృక్షమూలంబున వసించె వేడుకలరఁ;
గాలహుతవహభీతి యాభీలహవ్య, వాహవృష్టిభయము లేక వటముతనరె.
క. ప్రళయాగమవజ్రాశను, లిలఁ గన్పడకుండె నందు నించుకయును భీ
తిలఁజేయు నవ్వి యేవియు, స్థలమున నట లేక మిగులఁ జక్కఁగ నొప్పెన్.

---

## ఏఁబదియొవయధ్యాయము

మార్కండేయునకు భగవంతుఁడు సాక్షాత్కరించుట.

మ. తరువాతన్ గజసంఘతుల్యములు నుద్దామప్రభామాలికో
త్కర భీతిప్రద విద్యుదోఘయుతముల్ కాలాంబుదంబుల్ నభో

తరమం దప్పుడు పర్వెఁ జూడ భయదధ్వానంబు లొప్పారఁగా;
వర నీలోత్పలపత్త్ర భాసురములై వర్ధిల్లె నం దొక్కటన్. 859

తే. కుముదసన్నిభములుగాఁగఁ గొన్ని, తనరెఁ
గొన్ని కింజల్కసమములై కొన్నిపీత,
వర్ణములఁ గొన్నిహరితప్రభా ప్రభావ
ములయి తనరారె మేఘముల్ కలయఁబర్వి. 860

సీ. కాకాండనిభములై కమలపత్త్రాభంబులగుచుహింగుళకాంతిఁ దగుచుమఱియుఁ
బురవరాకారముల్ పొలయ శైలాకృతు లొప్ప నంజనవర్ణ మొలయ మరక
తప్రభల్ చెలఁగ నాధారాధరంబులు వియదంతరంబున వెలసె మెఱపు
లుగ్రరీతిగ నొప్ప నుగ్రరూపంబులు ఘోరనిస్వనములు కుతల మెల్ల

తే. బ్రద్దలుగఁజేయ నంతట వారిదములు, గగనమెల్లను గ్రమ్మి యాత్మాతలంబు
నద్రికాననయుతముగ నమితవృష్టి, ముంచె దిక్కులు తెలియక చంచలింప.

క. పరమేష్ఠి శాసనంబున, ధరణి మహావర్షమున నితాంతము ముంచెన్
గురుకుంభంబులఁ బోసిన, కరణిన్ ధరయెల్లఁ గానఁగా రాకుండన్. 862

చ. జలములు భూతలంబు గనఁ జాలనిభంగిని ముంప నగ్ని యు
జ్జ్వలమగు రూప మెల్లఁ జెడె, ద్వాదశవర్షము లొక్కరీతి నా
జలదము లీశ్వరాజ్ఞఁ గొని, సాంద్రతరంబుగ వృష్టినించి యీ
యిల గనరాకయుండఁగ న, హీనపరాక్రమ మొప్పఁజేయఁగన్. 863

చ. జలధులు వేలదాఁటి గురుశైలములన్ మునుఁగంగఁజేసె నీ
యిల సలిలంబులన్ మునిఁగె నిర్విధి మేఘము లంబరంబునన్
జెలఁగి భయంకరంబులయి సిద్ధమరుత్ప్రహితంబులై మహీ
తలము నశింపఁ జేసె నలతామరసాక్షుఁడు విష్ణు వంతటన్. 864

ఉ. భీకరమారుతంబు ఘనవీర్యము గన్పడ నట్టిత్రాగి య
స్తోకమహాత్త్వమట్లుడుగఁ దోయరుహాయతలోచనంబులన్
శ్రీకలితంబులన్ ముడుఁగఁజేసి పరుండెఁ దమోమయంబు న
శ్లోకదుభీకరంబునయి యేఁచుసముద్రమునందు నొక్కచోన్. 865

క. సురరాక్షసాదు లొక్కట, మరణింపఁగ వివిధభూతమండలిచెడ దు
ర్భరమయిచీఁకటి క్రమ్మఁగఁ బురుషోత్తముఁ డట్టి నిద్రఁ బూనెన్ స్వేచ్ఛన్. 866

చ. మునిపతి యంత నేత్రముల మూసి సనాతను నాత్మ నెంచి య
వ్వనజదళాక్షుఁ గాంచి గురుభక్తి నుతించి విలోచనంబు లొ
య్యన దెఱువంగ భూమియు మహాబ్ధి మునుంగుటఁ గాంచెఁ గానియా
ఘనవటభూరుహోత్తమముఁ గానఁడ దైవముమాయచూపుటన్. 867

చ. ఖరకరు దిగ్వితానమును గ్లౌపవనంబుల దేవదానవో
త్కరములఁగానఁడయ్యె బహుదారుణసాగర మట్టె తోఁచె స్థా
వరములు జంగమంబులు విభాగములేకయె నబ్ధి డిందె నా
తరుణమునందు మౌనికిని దప్పక కన్పడునబ్ధి యబ్ధియే. 868

క. దానిం దరియింపఁగ వెర, వూని మునీశుండు తిరిగె నొగి నట్టిటుగా
మానస మార్తిం గనఁ దగ, బూనికఁగాచెడు మహాత్ముఁ బొడఁగను వేడ్కన్.

క. వగయనుసంద్రంబునను ము, నిఁగె రక్షకుఁ గానలేక నిరతము హృదయం
బగులంగ నిట్లువిహ్వలుఁ, డగు మౌనిం గాంచెఁ బంకజాక్షుఁడు తనలోన్.

చ. కరుణచెలంగ మౌనిగణకాంతు మృకండుతనూజు భక్తిత
త్పరమతి నెంచి యాత్మ నిటుపల్కెను వత్స! ముదంబు నొందె ని
న్వరుసను ధ్యాన మీ వొనరుపంగ మదీయమనంబు భక్తులం
దరయఁగ నీవె యుత్తముఁడవై తగువాఁడవు నిశ్చయంబుగన్. 871

క. బాలుండవు మచ్చింతా, శీలుండవు రమ్ము రమ్ము శీఘ్రింబ మదు
ల్లోలుఁడవు గాన భీతిం, జాలం దపియింపనేల? శర్మము గనుమా. 872

క. నను నాశ్రయించితివి భీ, తిని గంటివి శ్రమము లోలిఁ దీవ్రమ్ముగ ని
న్నును బీడసేయ ధైర్యం,బును గంటివి వలదుచింతఁ బూనఁగ నింకన్. 873

చ. అనుపలుకుల్ చెవిం బడినయంతనె యాగ్రహ ముగ్రరూపతం
గనఁబడ విస్మితుండగుచుఁ గ్రన్నన నిట్లని పల్కె మౌని; యీ
చనువున నెవ్వఁ డిట్లు బలసంపదతోడఁ దపఃప్రభావ మొ
ప్పనివిధిఁ దూలనాడు నటుపల్కెడు నాదగు పేరుచెప్పుచున్. 874

తే. పెక్కువేలవర్షంబుల నొక్కరీతిఁ, బరఁగు నామేను నిర్లక్ష్యభావ మూని
తూలనాడెడు స్వేచ్ఛచేఁ దోఁచినట్టి, పలుకు దేవతలకుఁగూడఁ బలుకఁదగదు.

చ. సురగణనాయకుం డయిన చొక్కపు వేలుపు బ్రహ్మ దీర్ఘమై
పరఁగుఁ ద్విదాయువం చనియె భారతపోయుతశీర్షతం గరం
బరుదుగఁ బొల్చునన్ను నిటులల్పతరాయుషుగాఁ దలంచి భీ
కరరవ మొప్ప మృత్యువుముఖంబునఁ జొచ్చువిధంబుఁ దెల్పుచున్. 876

ఆ. ధీరభాషణములఁ గోరి మార్కండేయ
యనుచుఁ బిలుచునట్టి యతఁ డెవండొ;
యనుచుఁ జింతచేత నార్తుఁడై యమ్ముని
స్వప్న మయ్యెనొక్కొ జలధినడుమ. 877

క. కలగాకయున్న మోహం, బొలసెనో యని చింతసేయుచురుమతికిఁ దప
స్సుల ఫలముగాఁగ దుఃఖం, బులఁ జెందెడునూహ తోఁచె బూజ్యవిధమునన్.

క. పురుషోత్తము లోకేశ్వరు, శరణము వేఁడంగ నిపుడు చను భక్తి నటం
చురుమతి నెన్ని మహాత్ముని, బరిపూర్ణస్వాంతు నాత్మఁ బరితృప్తి మెయిన్. 879

చ. శరణము వేఁడె నంత మునిసత్తముఁ డావటభూరుహంబు సా
గరసలిలంబుపైఁ బొడమఁ గాంచెఁ దదుత్తమశాఖయందు ని
ర్జరవరశిల్పిచేత రుచిరంబుగ నిర్మిత మౌచు హాటకా
భరణము నాఁ దనర్చు నొకపానుపు గన్పడెఁ జిత్రరూపతన్. 880

సీ. వజ్రముల్ సురుచిరవైదూర్య విద్రుమములు పద్మరాగముల్ లలితరీతి
నమరంగ నది వివిధాస్తరణంబుల నచ్చెరువొసఁగుచు నమలకాంతు
లను దీప్యమానమై తనరుచునుండెను; దానిపై శయనించి మాననీయ
మహిముఁడై దేవౌఘమండనుండయి బాలతనువు గ్రాలఁగ గ్రీష్మతపనకోటి

తే. సమరుచుల్ గ్రాల వేషంబు సాధురీతి
నమర బాహుచతుష్కంబు హారిపద్మ
నయనములు చెన్నుమీఱ సంతతము వక్ష
మందు వనమాల రాజిల్ల సుందరముగ. 881

క. దరచక్రగదలఁ దాలిచి, వరకుండలమండితుఁడయి భాసురహారో
త్కర రాజద్గ్రీవుండై, సురుచిరరత్నౌఘహారసుందరుఁ డగుచున్. 882

తే. నిరుపమానగతిం బొల్చి పరమపురుషుఁ, డనఁగ నొప్పారుచున్న శ్రీహరిని గాంచి
వికచనయనారవిందుఁడై విపులహర్ష, జనితరోమాంచములఁ గ్రాలుతనువుతనర.

క. మునిపతి మార్కండేయుఁడు, వనజాక్షున కెంతో భక్తి వందనశతముల్
పొనరిచి యీవిధిఁ బల్కెను, వనరుహనేత్రా! జగంబు వారిమయంబై. 884

క. స్థావరజంగమసృష్టియు, వావిరి నశియింప నిట్టివడువున నొక్కం
డై వటులు బాలరూపం, బీవిధిఁ గొని భీతి లేక యొసఁగెద విచటన్. 885

క. అని భూతభావిభవ్యము, లను కాలమ్ముల నెఱుంగు నట్టిండై నన్
ముని మాయామోహితుఁడై, కనఁజాలండయ్యె దేవ కాంతు ననంతున్. 886

చ. కనుకనె తొల్త విష్ణువని క్రమ్మఱ నీతఁ డెవం డటంచు నె
మ్మనమున నెంచె నిట్లు మునిమండనుఁ డాభగవంతుఁ గాంచి యి
ట్లని తలపోసె, నాతపము వ్యర్థము జ్ఞానము సత్క్రియల్ వృథా
యనఁజను జీవితం బిదియు వ్యర్థము మర్త్యభవంబు వ్యర్థమౌ. 887

క. పానుపునఁ బవ్వళించిన, యీనిర్మలతనుని బాలు నేర్పడ నిందే
కానం జాలక పోతిని, గానని జీవిత మిదెల్లఁ గడువ్యర్థంబే. 888

చ. అనియిటు చింతలన్ మునిఁగి హర్షము వీడినబుద్ధిచే వగం
గని తను నుద్ధరించెడు నఖండమనీషుని గానలేక తోఁ

చని మది నుండె నూరకయె నన్ముని బాలదినేశతుల్యు భ
వ్యుని స్వమహత్త్వరాజితుని నోపఁడ చూడఁగ నించుకేనియున్. 889

క. మునులార! బాలరూపంబున నొప్పియు దివ్యతేజమునఁ బొల్చుట న
మ్మునికిన్ జూడందగునె, ట్లనుపమతేజుండు గాఁడె హరి సంతతమున్. 890

క. ఈరీతిఁ దనను గనఁగా, నేరక చెంతకును వచ్చునిర్మలచిత్తున్
భూరితపోనిధిఁ గని యా, వారిజనేత్రుండు స్మితము వర్ధిలఁ బలికెన్. 891

చ. ధ్వనియది మేఘనిస్వనముభంగి వినంబడె; వత్స! రక్షణం
బును మదిఁగోరి నన్నుఁ గనుబుద్ధిని వచ్చుట నే నెఱుంగుదున్
నిను మఱి శ్రాంతుగాఁ దలఁతు నీవు మదంగములోనఁ జొచ్చినన్
జను వగ లెల్ల భీతియును సత్వరమే తొలఁగున్ దనంతటన్. 892

చ. సరసిజనేత్రుఁ డిట్లు మునిసత్తము గాంచి వచింప నేమియున్
సరిగ వచింపఁ దోఁపమి విశాలముగాఁ దగు విష్ణువక్త్రం
దరమును మాటలాడకయె తత్క్షణమే ముని చొచ్చె మాయ య
త్తరుణమునన్ దనున్ మిగుల దారుణభంగిగఁ గప్పియుండఁగన్. 893

## ఏఁబదియొకఁడవ యధ్యాయము.

మార్కండేయుఁడు విష్ణూదరమునఁ దిరిగి వెడలివచ్చుట.

చ. మునివరులార! లోకవిభుమూర్తి మృకండుతనూజుఁ డిమ్మెయిన్
గొనకొని చొచ్చి యం దొగిని క్షోణి సపర్వతకాననంబుగా
జనపదయుక్తగాఁ గనియె సాగరపంక్తియు భారతాదివ
ర్షనిచయ మల్లె మేరువను క్ష్మాధరవర్యము రత్నపూర్ణమై. 894

తే. కనఁబడియె నందు లవణేక్షుకములు సర్పి
యనియు దధిదుగ్ధసుర లనియును జలాబ్ధి
యనియుఁ బేరువహించిన యట్టిసంద్ర
ములను నేడింటిఁ గాంచె నామునివరుండు. 895

వ. జంబూప్లక్షకుశక్రౌంచశాకశాల్మలపుష్కరంబులను ద్వీపంబులను గనుంగొనియె. నానారత్నవిభూషితకందరమందిరంబుగాఁ దోఁచుహిమాలయంబుఁ గాంచె. అంత్యజుల నంత్యజాతుల నందుఁ జూచె. మృగములను, శాఖామృగములను, సింహములు లోనగుమృగములను గజంబులను జూడంజాలె. మఱియుఁ బృథ్వియం దెన్ని తీర్థంబులు గ్రామములు నగరంబులు గల వవ్వి యెల్లఁ గానంబడియె. కృషిగోరక్ష వాణిజ్యములు, క్రయవిక్రయంబులు దృష్టిగోచరం బయ్యె వెండియు. 896

సీ. శక్రాదినిర్జరసత్తముల్ త్రిదశులు గంధర్వులప్సరఃకాంతలు మఱి
యక్షులు ప్రాక్తనులైనమహర్షులు దైత్యదానవసముదాయ మురగ
ములు నాగములు దేవతలకుశత్రువులగు సింహికాతనయులు ఱితిని మున్ను
తానుజూచిన వస్తుతతులు చరాచర మనఁబడు నదియెల్లఁ గనఁగఁబడిన
ఆ. విస్మయమునఁ గాంచె విష్ణుకుక్షిని, బెక్కుమాటలేల వినుఁడు మౌని
వర్యులార! యందు బ్రహ్మాదిగా స్తంబ,మువఱ కున్నదెల్లఁ బోలఁ దోఁచె. 897

వ. భూర్భువస్స్వర్లోక మహర్లోక జనతపస్సత్యలోకంబులు, నతలవితల పాతాళ భూతలవితలరసాతల మహాతలంబు లనులోకంబులును,గల బ్రహ్మాండ మెల్ల నా మహాకుక్షిఁ దోఁచె. 898

చ. సరసిజనాభుసత్కరుణ నమ్మని కందు నవార్యరీతిరై
పరఁగెడునట్టిదౌగతియుఁ బాటవమొప్పెడుబుద్ధియున్ దగెన్;
దిరుగుచుఁ గుక్షి లోకమును దెల్లముగాఁ గనెఁ గాని యాజగ
ద్వరుతను వెంతయో గనెడువాంఛను దీర్పఁగఁ జాలఁ డాతఁడున్. 899
చ. తనుపరిణామముం గనఁగఁ దా నసమర్థుఁ డటంచు నెవ్వు తోఁ
చెనొ యప్పుడే మహాత్ము సరసీరుహనేత్రుని దీనబాంధవున్
మనమున భక్తి నెన్ని బహుమానముతో శరణంబు వేఁడె; నం
తనె గురువాయువేగమునఁ దాఁ బురుషోత్తము సత్కృపన్ దగన్. 900
ఆ. ముఖము వెడలివచ్చె ముందున్న చోటికి, నంతెకాని యెఱుఁగఁ డింతయైన
వచ్చినట్టిరీతి నచ్చటఁ గాంచిన భంగి మాయ తన్నుభ్రాంతుఁజేయ. 901

---

## ఏఁబది రెండవయధ్యాయము.

### మార్కండేయముని భగవంతు నుతించుట.

చ. మునిపతి విష్ణువక్త్రబిలమున్ విడనాడి యథాప్రకార మం
దు నిలిచి విశ్వమంతయును దోయమయంబుగ నుండఁ గాంచె నే
జనులును గానరామి మును సంశయమొంది శిశుత్వమొంది తన్
గని కృప మాటలాడిన యఖండతరాంగుని గాంచె విష్ణువున్. 902
సీ. న్యగ్రోధభూజశాఖాగ్రపర్యంకోర్ధ్వ భాగసంస్థితుని శ్రీవత్సవక్షుఁ
బీతాంబరుని జతుస్స్ఫీతబాహుని బద్మపత్త్రాయతేక్షణు భద్రమూర్తి
జగములనెల్లను స్వవశంబునందుండఁ జెలఁగువానిం జూచె శ్రీహరియును
దనచెంతకును వచ్చు ముని సంశయాత్మకు స్వముఖనిర్గతుఁ గృప వఱలఁగాంచి
ఆ. ప్రహసనమ్ము మీఱఁ బలికెఁ; నోవత్స యెం,దుంటి వింతకాల ముదర మిద్ది
యస్మదీయ మెకద యందు భ్రమించి యాశ్చర్యమెల్లఁ జూడఁజాలినావె. 903

ఉ. ఆరయ నాకు భక్తుఁడ వహార్యతపోధనరాశి వెంతయున్
ఘోరతరార్తి పైకొనుటఁ గుందితి మిక్కిలి డస్సితీవు నన్
జేరితి విట్టినిన్ను మునిసిద్ధుని విస్మితుఁ గాంచి మేలు చే
కూరఁగఁ బల్కువాఁడఁ గనఁగొమ్ము నను\u0300న్ గడు శ్రద్ధమీఱఁగన్.　904

మ. అనునమ్మాటల నాలకించి మిగులన్ హర్షాంకరోమాంచముల్
తనరన్ జూడ నశక్యమై విమలరత్నస్ఫారహారంబు లో
ప్ప నియంతృత్వము గన్పడం దగిన యప్పద్మాక్షు నీక్షించె న
మ్మునిదృష్టుల్ విమలంబులై కరుణచేఁ బొంగారె నవ్వేళలన్.　905

ఆ. ఒక ముహూర్త మిట్టులుండ నాదేవుని,దివ్యపాదయుగము దివిజసంఘ
పూజితంబు రక్తమును బూసినట్లున్న,యంగుళులఁ జెలంగునద్ది తోఁచె.　906

చ. కనుఁగొని మూర్ధమున్ దగులఁగాఁ బ్రణమిల్లి ప్రమోదగద్గద
స్వనమునఁ జేతులొగ్గి శ్రుతివాక్కుల నిట్లు నుతించె విస్మయం
బున మది చేడ్పడంగ సురపూజ్యు సనాతనుఁ గాంచుచున్; సురా
దినిఖిలసంస్తుతా! సకలదేవవిభూ! సకలార్తినాశనా!　907

క. సురుచిరపంకజనేత్రా! శరణాగతు నన్నుఁగావు చాలఁగ దుఃఖో
త్కరమునఁ గుందినవాఁడను; సురవర! సంవర్తవహ్నిశుంభజ్జ్వాలన్.　908

క. తపియించు చున్నవాఁడను, విపరీతాంగారవృష్టి భీతుఁడ నన్ని
విపదంబుధిఁ దరియింపఁగఁ, గృపఁజేయవె లోకనాథ! కీర్తివిశాలా!　909

క. పురుషోత్తమా! ప్రచండం, బురుతరమును నైనవాయు వొగి వీవఁగ నా
తురపడితిని దీనుఁడ నన్, గరుణింపుము దేవదేవ కంజదళాక్షా!　910

క. నను నాదిత్యులు ప్రళయం,బున నుద్రేకమున మిగులఁ బొలుచుఘనములున్
దనుతాప మందఁ జేసెను, గనఁజాలనుశాంతిఁగనుకఁ గావుము దేవా!　911

సీ. క్షుత్తృష్ణ లొగి నన్ను శోషిల్లఁజేసెడు దుఃఖ మొందితి నుంత తోఁపకున్న
దితఁడు రక్షకుఁడని యెన్న నేరక యున్నవాఁడను నన్నుఁ గాపాడు మీశ;
యీచరాచర మెల్ల నేకార్ణవం బయ్యె నశియించె నన్నియు నాకివర్య
యీచింతకంతంబు నెఱుఁగఁజాలక యున్నవాఁడ ననుంగావు వాసుదేవ;

ఆ. నీదునుదరమందు నేఁ జరాచరమెల్లఁ,గంటి విస్మయంబుఁ గంటి మఱి వి
షణ్ణుఁడనయి యిట్లు చరియించుచున్నాఁడఁ, గావవయ్య నన్ను గమలనాభ.

క. ఘోర మనాధారము సం,సారము సంద్రంబునకును సరివచ్చెడు నో
వారిజనయనా! కడువం, గా రాదు ప్రసన్నదృష్టిఁ గడతేర్పు నను\u0300న్.　913

సీ. సురనాథ, సురరక్ష! సురసమాశ్రయ నీవు సుప్రసన్నుఁడవయి శుభము లిడుము
జగదోఘనాథ జగత్కారణమునకుఁ గారణ మన నీవ కావె దేవ

భూధరా' ననుఁగావఁ బూనుము సలిలసంవాస మధుప్రాణహాయుహరణ
కమలేశ త్రిదశేశ కరుణ రక్షింపుమీ; కంసకేశిప్రముఖాసురవైరి
తే. వివళవాదర మధురాఖ్యవిమలపురని,వాస యదునందనా పరవారభయద
శతమఖానుజ యవ్యయ శక్రవినుత, నన్నుఁ గాపాడుమా సర్వనాథ చక్రి.

క. ధరణియు సలిలము హుతవహుఁ, డరయంగా ననిలుఁడు దివియన నీవెకదా
పరమేశ మనసు బుద్ధియుఁ, బరికింప నహంకరణము ప్రకృతియు నీవే. 915

సీ. సత్త్వాదులన నీవె జగదోఘబీజంబు నీవెకా పురుషుఁడవీవె పురుషు
కంటెను త్తముఁడవు గావె; సర్వేశ్వరా యింద్రియసముదయ మీవె సర్వ
శబ్దముల్ విషయముల్ సరసిజాక్షా! నీవె సర్వదిక్పాలకుల్ సకలధర్మ
ములు వేదములు యజ్ఞములు నీవె యింద్రుఁడ వీవె శివుండవు దేవుఁడవును
ఆ. హవిసు హుతవహుండు యముఁడు కోణపుఁ డపాం
పతియు వాయు వర్థపతియు నీశుఁ
డ వన నీ వనంతుఁడవు గణేశుండవు
షణ్ముఖుఁడవు రుద్రసమితి నీవే. 916

క. ఏతఱి నాదిత్యవసు,వ్రాతము దానవులు యక్షవారము దైత్యుల్
వాతౌఘము సిద్ధులు నన, నీతనువే యచ్చరలును నీవే కృష్ణా 917

క. తలఁపఁగ నాగులు గంధ,ర్వులు చారణవరులును బితరులును బ్రజానా
థులు మునులు మునిసమూహం, బులు నశ్వులు నన్యజాతిపుంజము నీవే. 918

క. ధరణిఁ గలజీవకోటులు, పరమాత్మా! నీవె కావె పల్కఁ లిఁ కేలా
సరసిజభవుఁ డాదిగ గో,చరమగునది యెల్ల నీవె చక్రధర! విభూ. 919

తే. భూతభవ్యభవిష్యముల్ పురుషవర్య, నీవె సచరాచరంబన నెగడుజగము
నీవె నీరూపమే తగు నీరజాక్ష, యరయఁ గూటస్థ మనువేర నవనియందు. 920

చ. నినుఁ బరమేష్ఠిలోనయిన నిర్జరపుల్ తెలియంగలే రనం
గను నిఁక నల్పబుద్ధు లెటు కందురొ నీదుమహత్త్వ మీశ్వరా
వినుతము శుద్ధ మవ్యయము విశ్రుతముం గనఁ దుల్య మెందులే
క నెగడునీస్వభావము తగం బ్రకృతిఁ మితిమీఱి వర్తిలుఁ. 921

ఆ. శాశ్వతంబనంగ సర్వత్ర వ్యాపించు,నది యనంగ వ్యక్త మనఁగ రాని
దనఁగ నీదుతత్త్వ మగుఁ దలపోయ నీ,శ్వరుఁడ వంబరంబు పరుస నీవె. 922

వ. శాంతంబనఁగ నీవెకదా మహేశ్వరుఁడ వజుఁడ వవ్యయుండ విట్టి నిర్గుణుండ
వగు నిన్ను నెవఁడు స్తుతింపఁజాలు? ఇట్టి నిన్నల్పబుద్ధిగల నేను వినుతించితి.
క్షమియింపుము. ఇవె నీకు నమస్కారము లని మార్కండేయుం డూరకుండె.

## ఏఁబదిమూఁడవయధ్యాయము.

### విష్ణుమార్కండేయసంవాదము.

క. మునిపతి మార్కండేయుం, డనూనభక్తిన్ నుతింప నంబుజనాభుం
డనుకంప నిట్లు పల్కెను, ఘనగంభీరోక్తు లొప్పఁగా నమ్మునితోన్. 924

చ. మనమున నెద్దికోరెదవొ మౌనివరా! వచియింపు మేది నీ
కు నొసఁగవచ్చునో యదియుఁ గూర్మి నొసంగెద నంచు బాలుఁడై
తనరు మహాత్ముఁ డిట్లు కృప ధర్మము వర్ధిలఁ బల్క నాలకిం
చి నియతిఁ దద్గతాత్ముఁడయి శ్రీపతితో వచియించెఁ బ్రీతితోన్. 925

చ. తెలియఁగఁగోరువాఁడ నిట ధీరవరా! భవదీయమాయ ని
మ్ముల భవదీయసత్కృపను బొల్చెడు నీస్మృతి యుక్కై యుండఁగా
వలయును లోనవర్తిలుచు బాహ్యమునన్ గనరాక యుందువో
యలఘుచరిత్ర! నీదగు మహత్త్వము నేఁ దెలియంగఁ గోరుదున్. 926

తే. ఇందె శిశురూపమున నిండి యొసఁగుచుండి
నట్లు కనఁబడుచుండియు నఖిలజగము
నాత్మకుక్షిని నిడుకొనినట్టినీదు
చరిత మెల్లను వినఁగ నాస్వాంత మలరు. 927

చ. తనువున నీచరాచరము దానవసూదన! యుండ నేల? నిం
క నిచట నెంతదాఁక నిటు కమ్రశిశుత్వము నూనియుండఁగా
మనమునఁ గోర్కెయో వినఁగ మానస ముత్సుకతం గనెన్ విభూ!
వనజదళాక్ష! యీచరిత వారక తెల్పు మపారసత్కృపన్. 928

క. చింతింప నలవిగాకయు, వింతగఁదగు నేను గన్న విపులజగం బో
చింతామణి యెఱింగింపుము; సంతోషముఁ గనుదు నన్న సర్వేశ్వరుఁడున్. 929

చ. మునిపతి నూఱడించుచుఁ బ్రమోదమునన్ వచియించె సాటిగా
ననితనతేజమెల్ల మునినాథుని గప్పఁగ దేవవర్యులున్
గనుఁగొనలేరు నాదగునఖండమహత్త్వము సత్య మిద్ది యై
నను గృప నీకుఁ జెప్పెదను నాదుప్రవృత్తివిధంబుఁ జక్కఁగన్. 930

సీ. ఏటికి జగములనెల్ల సృజింతునో వినవయ్య నీవనఁ బితరులందు
భక్తిగలాఁడవు పరమాత్ముఁడ నగునన్ శరణంబు నొందితి వరయఁ బాత్రుఁ
డవు వినంగను యోగ్యుఁడవు గాననే నన్నుఁ గనుఁగొనఁజాలితి వనఘ! బ్రహ్మ
చర్యప్రభావ మీచందమునం దగు వినుమింక నారమ్ము లనఁగఁబరఁగు

తే. జలము లీసంజ్ఞ చేసితిఁ జాలకాల, మునకుఁ బూర్వమె నేజలముల వసించు
కతన నారాయణుండనఁగను బరఁగుదు, నామ మద్దియె ప్రఖ్యాతమోమహాత్మ.

క. చ్యుతిలేదు నాకు నేశాశ్వతుఁడను నేనే విధాతృశబ్దముచే నీ

క్షితిఁ బిల్వఁబడుదు సర్వము, మ్రుతి నొందఁగఁజేయువాఁడ మించెడువేడ్కన్
క. నేనే విష్ణువు బ్రహ్మయు, మానీ దేవాధిపతియు మహనీయుండై
గానంబడు యముఁడాయీా, శానుం డర్థపుఁడు సోమసంజ్ఞుఁడు నేనే. 933
సీ. కశ్యపుం డనుమానికాంతుఁడు ధాతృవిధాతలు యజ్ఞంబు తలఁప నేనె
యగ్ని వక్త్రము క్షితి యంఘ్రులు చంద్రార్కు లక్షులు శీర్ష మీాయంబరంబు
దిక్కులు శ్రోత్రముల్ దివ్యజలంబులు స్వేదసంభవములు నాదునవయ
వములు వాయువు నాదు వపువు నాదేహతత్త్వం బిదె; లోకసంస్థాపనార్థ
ఆ. మాప్తదక్షిణలను ననువొందునట్లు య
జ్ఞములు శతము లేనె చక్క నొనరి
చితిని వేదవిదులు చెలఁగి నన్నే దేవ
యజనమందుఁ గూర్తు రర్చనముల. 934
చ. ధరణిపతుల్ సురేంద్రపురతల్లజమందు సుఖింపఁగోరి య
ధ్వరముల నన్నుఁ గొల్తు రొగి వైశ్యులు స్వర్గజిగీషువుల్ నిరం
తరము సవంబులన్ నను ముదంబును బొందఁగఁజేయుచుందు రో
వరముని మేరుమందరవిభాసురమై యసమానకీర్తిచేన్. 935
క. జలధిచతుష్కముచే న్విమ్మున నొప్పెడు భూమిభాగమును శేషుఁడనై
లలిఁ దాల్తు నేనె యీాభూ,స్థలి వారాహంగ మూని జలములఁ మునుఁగన్.936
ఆ. ఉద్ధరించితి బాడబాహోవ్యగ్రవహ్ని
నగుచు నబ్ధిజలంబుల ఁధమరఁ ద్రావి
సమయ మొదవిన విడుతు వక్త్రము తలంప
బ్రహ్మమగు బాహువులగు క్షత్త్రంబు నాకు. 937
క. ఊరువులు వైశ్యు లగుదురు, చారుతరాంఘ్రులుగ శూద్రజాతి పోలుచుఁజూ
ధారణిదేవా! వినవ,య్యా! రమ్య చరిత్ర మిద్ది యగు సుఖదంబౌ. 938
తే. సొరిది ఋక్సామములు యజుస్సును మఱియు న
ధర్వమును వేదములు నాల్గు తగ మదంగ
సంభవంబులె ప్రలయంపు సమయమందుఁ
జొచ్చు నన్ను విచ్యుతిలేక శోభిలుఁజుము. 939
క. యతమతులు శాంతిపరములు, సతతము నాయందె మదిని జక్కనిలుపు నా
యతులెల్ల నన్నె చొత్తురు, చ్యుతకోపు ద్వేష మెడల నొప్పెడుసుమతుల్.
తే. విగతసంగులు వీతకిల్బిషులు శాంత
ధనులు నిరహంకృతులును దత్త్వమునె చింత
చేయుసుకృతులు నన్ను నంచితవిధులను
బూజచేయుదు రుపలబ్ధపుణ్యులగుట. 941

సీ. సంవర్తకంబనఁ జనెడుజ్యోతిస్సేన సంవర్తకంబను జ్వాలనుఁ డేన
సంవర్తకుండను సరసిజసఖుఁ డేన సంవర్తకుండను శ్వసనుఁ డేన
తారకాకృతి నభస్థలమునఁ గన్పడు తేజస్సులెల్ల సందీప్తమూవు
కాంగజరోమకూపాళి యంచెఱుఁగుము రత్నాకరములు సరస్వదాళి
తే. నాల్గుదిక్కులు నావసనంబు శయన
నిలయము లటంచు నెఱుఁగుము నిర్మలాత్మ
కామమును గ్రోధమును హర్ష మామెయి భయ
మోహములు నాదురూపముల్ పూన్కి నెఱుఁగు. 942
క. అవియివి యనఁగా నేటికి?, భువి దివిగల వస్తుజాలములు నాతనుసం
భవము లని యెఱుఁగు మోమహా,నివరా! సర్వంబు నందు నేనే యుందున్. 943
క. నరు లేశుభకర్మంబు నొ,నరుతురో తత్తుల్యకమయిన ఫలమ్మును గాం
తురు సత్యదానతపములు, పరమశుభాహింస జంతువారం బందున్. 944
క. తనుధారులెల్ల నాదగు, పనువున వర్తిల్లువారు బ్రాహ్మణమౌనీ
విను విజ్ఞానము నాచే,తనె యభిభూతంబు గాఁగఁ దత్తఱపడుచున్. 945
క. తిరుగుచునుందురు స్వేచ్ఛం, దిరుగం జాలరు సమగ్రదివ్యసుఖములన్
ధరణీద్విజులు వేదో,త్కరముం బఠియించి శాంతకమాశ్రితులై. 946
క. జితకోపు లగుచు నన్నే, గతియని కాంతురు; కుతంత్రగణముల నెల్లం
బ్రతిదినము చేయు దుర్జన,తతి నన్నుం బొందలేదు ధారణిద్విజా. 947
క. అతిలోభులు కృపణులు స,న్మతిహీనుల్ లనార్యులు నగుమానవులకు నీ
వితతఫల మబ్బ దిఁక స,త్కృతులకు నీఫలము లబ్బు నెల్లవిధములన్. 948
చ అతిశయమూఢతం జెలఁగునట్టి నరాధము లీఫలంబులన్
శతజనులందుఁ బొందఁగను జాలరు మోసపుయోగు లట్లె యు
న్నతిఁ గనఁజాల రెత్తఱిని నాదగునాజ్ఞను బొల్చుధర్మసం
తతికిఁ గొఱంతగల్గునో యధర్మము నెక్కొనఁజూచునో ధరన్. 949
ఆ. అట్టిక్షణమందు నాత్మరూపంబున, నేసృజించుచుందు నీసురారు
లమరవరులచేత ననిఁ బడఁజాలరు, హింసయందు రక్తి యెక్కువగుట. 950
క. లోకంబున రాక్షసులని, యేకరణిని నీడులేక యెల్లయెడలఁ దా
రే కడు నధికుల మనుచున్, భీకరులై పుట్టువారు పృథుబలు లగుచున్. 951
క. నేనుం దత్సమయంబున, సూనృతరతులై చెలంగు సుజనుల దౌ సం
తానమ్మున నాయాత్మను, బూని సృజింతున్ నిజంబు మునిజననాథా. 952
చ. మనుజత నొంది దుష్టజనమండలి నెల్ల శమింపఁజేయువాఁ
డను దితిపుత్త్రసంతతిఁ గడంగి నశింపఁగఁ జేయఁబూనునా

కనుచరులై చరింప దివిజావళి సద్గతిజాలినిన్ భుజం
గనికరమున్ మనుష్యులను క్ష్మాస్థలిఁ బుట్టఁగఁ జేయువాఁడఁ జూ. 953

తే. మఱియు గంధర్వముఖుల జన్మంబు గనఁగఁ
జేయువాఁడను; వారిసహాయ మొప్ప
దుష్టరాక్షసవితతిని దోర్బలమునఁ
బొడవడంగఁగ జేయుదుఁ బో మునీంద్ర. 954

క. ఎత్తఱిఁ గార్యము పొసఁగునొ, యత్తరుణంబుననె దేహ మనుకూలముగాఁ
జిత్తమున నెంచి తాల్తును, సత్తమ! నాయాత్మ యొసఁగు సమయానుస్మృతిన్.

ఆ. సర్వభూతములను సర్వకాలం బేను, నిండియుందుఁ గాని నేనెఱుంగఁ
బడ న దెవరిచేతఁ గడఁగి నన్నెల్లలోకముల భక్తజనులగణము ప్రీతి.

క. ధ్యానింతురు పూజింతురు, మానీ! నాయందుఁ జొచ్చి మదిఁ గ్లేశం బే
మేని గనినాఁడవో యది, యూ నీయభ్యుదయమునకె యనఘమనీషా. 957

సీ. నాకుక్షిలోఁ జొచ్చి నానావిధాకృతు లగుప్రాణులను గంటి వవి మదాత్మ
లనియె యెఱుంగు మదాత్మయు భూతభావన మంచు నెఱుఁగుము బ్రాహ్మణేంద్ర
నారాయణుం డనునామంబు నాకగు శంఖంబు గదయును జక్రమును బ్రి
యములగు దివ్యాయుధావళి సుమ్ము యుగంబులు వేయి యేకాలమునకు

తే. నిండు నందాఁక నాదునుద్దండమాయ
విశ్వమంతయు నావృతి వెలయఁ బవ్వ
ళింతు మునీంద్ర! యీవిధి సుంతకాల
మిట్లు పుత్తును ధ్రువ మంచు నెఱుఁగవయ్య. 958

క. శిశురూపంబును దాల్చితి, నశిశువు నేనయ్యు నిప్పు డబ్జజునకుఁ గూ
డ శరణ్యుఁడ నన్నెఱుఁగం,గ శక్యమే యేరికైన క్ష్మాసురమానీ. 959

చ. మునుపు విరించిరూపమునఁ బొల్చినయేనె వరంబు లిచ్చినాఁ
డను గద నీకు నీస్తుతికడంగి మహాప్రమదాత్ముఁ జేసె నన్
గనుకనె చావులేక యిటు గాంచఁగఁ గల్గితి వీలయంబునన్
నను మునివర్య! సృష్టియు వినాశిత మయ్యెఁగదా తలంపఁగన్. 960

ఉ. నాదు వరప్రభావమున నష్టజగంబులనుండి వెల్వడం
గాఁ దగు శక్తి నందితివి కానఁ గనంబడఁ జేసినాఁడ సొం
పేది జగంబు లన్నియును నీయెడ నాదగు కుక్షి నిల్చె నో
భూదివిజేంద్ర! నాయుదరముం జొరఁజేసితి నిన్నుఁ బ్రీతిచేన్. 961

చ. కనుకనె సర్వలోకములఁ గాంచఁగఁ జాలితి విస్మయంబునుం
గనియు యథార్థ మిద్ది యని గ్రక్కున నెన్నఁగ లేక యున్న ని

న్నను వెడలించినాఁడను గనుంగొనినంతయె చాలునంచు నో
మునివర! యున్నదున్నయటు పోలఁగఁ జెప్పితి నీవెఱుంగఁగన్. 962

సీ. నాయాత్మ నెఱుఁగంగ నాయాదితేయుల కైన దైతేయుల కైన శక్య
మేగాదు కావున నెఱుఁగఁజాలఁడు బ్రహ్మ బ్రహ్మర్షివర! స్వేచ్ఛ వఱలఁ దిరుగ
వయ్య; లోకపితామహాఖ్య గన్నయజుండు మేల్కొనునంతన మించుశక్తి
నేనె భూతంబుల మానక సృజియింతు నాకసంబును బృథ్వి ననిలుఁ దేజ
తే. మును బయస్సుల నింక నీభూతలమునఁ
గలుగుస్థావరజంగమంబులను బూన్కిఁ
బుట్టఁజేయుదు నని పల్కి మురహరుండు
మరల నిట్లని పల్కె నమ్మౌనిఁ గాంచి. 963
తే. యుగసహస్రము పూర్ణమై యొప్పె నప్పు
డబ్దగంభీరరవమున నచ్యుతుండు
మునివరా! యన్నిమిత్త మీవు నను నుతులఁ
దనిపినాఁడవో వాస్తవార్థంబు తెలియ. 964

క. దానికిఫలముగ వరమును, మానసమున నెన్ని కోరు మన్నించెద ని
ప్డే నీ కిచ్చెద వరమును, మౌనీ! దేవాళియందు మద్వరశక్తిన్. 965
క. ఆయుష్మంతుఁడవైతివి,నాయాశ్రితులందు మేటివైతివి మఱియున్
నాయాజ్ఞ మరలఁ గని దీర్ఘాయువు దేవతల మించి యలరుము సతమున్. 966
చ. అనిపలుకుల్ వినంబడినయంతనె మోదము పొంగఁగా జనా
ర్దను మరలం గనుంగొని శిరస్సు పదంబులు సోఁక మ్రొక్కి యి
ట్లనియె మృకండుసూనుఁడు మహాత్మ! పరాత్పర! నీదురూపముం
గనితిని మోహ మెల్లఁ దొలఁగం బొడఁగాంచితి జ్ఞాన మీయెడన్. 967

క. నీతనువు గానఁబడఁగా, నీతఱి విజ్ఞాన మొదవె యిదిసత్యం బో
ధాతృవినుతపాదాంబుజ,శ్రీతరుణీనాథ! యనుచుఁ జిత్తము పొంగన్. 968
క. పలికెన్ మరలన్ దేవా,ఖలహరణా! యిట్లె నాకుఁ గనఁబడుచుండన్
లలిఁ గోరువాఁడ;లోకం,బులకున్ హిత మొదవ నించె మూర్తి నిలుపుమా
క. నానాభావమ్ములు చ్యుతిఁ,గానన్ నీదివ్యతనువుఁ గనఁబడఁజేయం
గా నేఁ గోరెద; మఱియున్,శ్రీనాథా నాదుకోర్కిఁ జిత్తంబందున్. 970

సీ. అవధరింపుము శైవులైన భాగవతులకును, వైష్ణవులకును ఘనతరముగ
జరగువాదములను సమయఁజేయంగ నీపురుషోత్తమక్షేత్రమున వినిర్మ
లమయి పుణ్యంబయి యమలఫలప్రదంబయి యొప్పునిచ్చోట హరునియాల
యంబుఁ గట్టించెద హతపాతకా! నీదుస్థానవరంబున శంకరుఁ బరు

తే. నేఁ బ్రతిష్ఠచేయ నెంచెద నద్దాన,నేకమూర్తులగుచు నెసఁగుమిమ్ము
హరిహరులను గాంచి యఖిలమనుష్యులు, జ్ఞానసిద్ధిఁ గాంత్రు మౌనివంద్య. 971
క. అనిపలుక మౌనివర్యుని,గని శ్రీహరి యిట్లుపలికెఁ గారణుఁడై లో
కనికరనాథుండై తగు,పినాకిలింగంబు నిగమవేద్యము శుభముల్. 972
క. పలువిధములైనభావం,బులు శాంతిం బొందుకొఱకు మునివర నాయా
జ్ఞలఁ బూని శివాలయమును,జెలువొప్పఁగఁ గట్టవయ్య శీఘ్రమ యిందున్.
క. దానిప్రభావమ్మున నో,మౌనీ! యక్షయము మౌనిమండితము మహా
మానితము నైనశంకరు,స్థానమునన్ నిల్వు మీవు సంతత మెలమిన్. 974
క. హరునిన్ సంస్థాపించిన, మురహరునిన్ నన్నుఁగూడ ముదమున స్థాపిం
చి రహిం బూజించిన యట్లురుఫలముం బొందుమర్త్యుఁ డోమునినాథా. 975
క. *హరియిరువురకున్ భేదం,బేయెడలన్ లేదుసు మ్మహీనమతీ! హా
యాయిర్వురభావము లా,మ్నాయవిధిన్ దలఁప నేకమని యెఱుఁగనగున్. 976
క. ఒకతత్త్వమె ద్వివిధముగా, నొకకార్యముకొఱకుఁ జేయనొప్పు ద్వివిధమై
సకలజ్ఞుఁ డొకఁడె రుద్రుం,డొకఁ డతఁడే విష్ణు వాతఁ డొగి రుద్రుఁ డనన్. 977
క. అనిలాకాశములకువలె,వనజాక్షమహేశ్వరులకు వఱలదు భేదం
బని యెఱుఁగవయ్య జ్ఞానం,బున నొప్పనివారు మందబుద్ధులు జగతిన్. 978
క. గరుడధ్వజుండె త్రిపురా,సురహరుఁడగు త్ర్యక్షుఁ డనుచు సొంపుగ నెఱుఁగం
బరికింపంగను జాలరు; వరమౌనీ! నీదునాఖ్య వర్ధిల్లంగన్. 979
సీ. నిర్మింపుమీ దయానీరధి శంకరు నాలయంబున నిందు నమలభక్తి
దేవదేవునకు నుదీచిని దీర్ఘంబుఁ బావనజలపరిభాసురంబు
ద్రవ్యింపు మద్ది మార్కండేయతీర్థ మంచవనిఁ బ్రఖ్యాతమై యలరఁగలదు
పాపప్రణాశనపటుతర మగు నది తపనశీతాంశు లెందాఁక నుందు
ఆ. రంతకాల మద్ది యక్షయముగ నుండు,ననుచు నామృకండుతనయునకును
దెలిపి మురహరుండు తీవ్రగతిం దిరో,హితత నొందె నందె యతులశక్తి. 980

ఏఁబదినాల్గవయధ్యాయము.

పురుషోత్తమక్షేత్రయాత్రావిధి.

చ. అని పరమేష్ఠి తెల్పుచు మహర్షులఁ గాంచి వచించె నిట్టు లో
మునివరులార! క్షేత్రవరమున్ వినిపించితిఁ బంచతీర్థపా

* నావయోరంతరం కించిదేకభావౌ ద్విధాకృతౌ, యో రుద్రస్స స్వయం విష్ణుర్యోవిష్ణుస్స మహేశ్వరః, ఉభయోరంతరం నాస్తి పవనాకాశయోరివ. 65 అని మూలము.

వనచరితంబు స్నానవిధి వారక తెల్పెద వానియందు ము
న్గిన నగుసత్ఫలంబు హరికేవలభక్తిని దాన మిచ్చినన్. 981

క. కలుగుఫలంబును దేవుని, లలిఁ గాంచినఁ గల్గుతత్ఫలంబును మీకుం
దెలియం బల్కెద వినుఁడీ, యలఘుతరంబైనభక్తి యాత్రకుఁ జనుచున్. 982

సీ. తొలుత మార్కండేయ లలితతీర్థంబున నుత్తరముఖుఁడయి యొప్పశ్రద్ధ
స్నానము చేయఁగాఁ జను మూఁడుమాఱులు మంత్ర మియ్యది పరమమ్ము చెప్పఁ
దగును "సంసారమను దారుణసాగరమగ్నుఁ బాపగ్రస్తు మతివిహీను
భగనేత్రభేత్తవై పరఁగుశంకర నన్నుఁ గాపాడుమా నమస్కారములను
తే. జేయువాఁడను శాంతుఁడు శివుఁడు సర్వ
పాపహరుఁడును నగు నుమాపతికి వంద
నము లొనర్తు" నటంచని స్నాన మొప్పఁ
జేయవలయును దానసే సిద్ధి గలుగు. 983

క. మనుజుండు నాభిమాత్రం,బనఁ దగు జలమందు మున్గి నర్ఘ్యవిధిని దే
వనికరము మునులఁ దృప్తిం,గనఁ జేసి తిలోదకములఁ గడఁగి పితరులన్. 984

ఆ. తృప్తిఁ గనఁగఁ జేసి యితరుల సంతృప్తి,నందఁజేయవలయు నట్లు విధియు
తముగ స్నాతుఁడగుచు నమలవిధానంబు, తనర నాచమించి త్రినయను శివు.

క. సేవింప నాలయమునకుఁ, బోవలయును; మూఁడుసార్లు భూతపతికి భ
క్త్యావేశమునఁ బ్రదక్షిణ, మేవిధమునఁ జేయఁ దగునొ యెఱిఁగి విధిగతిన్.

క. ఒనరించి మూలసూత్రం,బునఁ బూజించియె మృకండు మునిసుతు నీశుఁ
గనఁబోయి యఘోరం బనఁ,జను మంత్ర ముచ్చరించి చక్కనిభక్తిన్. 987

ఆ. మ్రొక్కి కరుణఁ బూను నక్కరణిని జేయ,వలయుఁ "ద్రిణయన శశిలలితశీర్ష
వందనములు నీకు వరుస నొనర్తును, గామహరణ నన్నుఁ గావు మీశ". 988

క. అనుమంత్ర ముచ్చరించుచుఁ, ద్రినయను బూజింపవలయు దేవునివలెనే
మునితీర్థంబున మునుఁగుచు, వినాయకునిదండ్రిఁ జూడ వితతాఘంబుల్. 989

క. విలయంబునొందు మఱియుం,గలుగును హయమేధదశకకరణఫలమ్ముల్
విలసిల్లెడు శివలోకము,న లలిని నివసింపఁ గలఁడు నరుఁ డతఁ డెపుడున్. 990

క. అందుఁ బ్రళయంబుదనుకం, బొందుచు సుఖసంతతులను భూలోకముఁ జే
రం దాఁ జనుదెంచును మఱి,యిందు బహుశ్రుతుఁడుగాఁగ నెసఁగును సతమున్.

క. శాంకరయోగంబున నే,ణాంకుని బ్రీతికిని బాత్రుఁడయి ముక్తుండౌ;
సంకటహరమై కల్పక,సంకాశంబైన వటకుజంబును గనుచున్. 992

వ. ప్రదక్షిణత్రయం బొనరించి నిరుపమభక్తిచే "ఓం నమో వ్యాసరూపాయ
మహాప్రళయకారిణే, మహాద్రసోపవిష్టాయ న్యగ్రోధాయ నమోఽస్తుతే" అను

మంత్రంబు జపియించుచుఁ బూజింపవలయు మఱియు. 993

క. హరి కాయతనంబవు నిర్జరుఁడవు కల్పంబుతఱిని సమధికమహిమో
త్కరుఁడవు వటరాజమ నా,గురుపాపగణంబు నీవు గూల్పు నతి యిదే. 994

చ. అని వచియించి భక్తిమెయి నావటవృక్షము భక్తిఁ గొల్చినన్
జను క్షణమాత్రఁ బాపములు సర్వమునుం గుబుసంబు పాయురీ
తిని మునివర్యులార! యల దివ్యమహీజముఛాయ నిల్చునా
మనుజుని బ్రహ్మహత్యయును మానును బీడ యొనర్ప భీత యై. 995

చ. ఇతరము లైనపాపముల నేటికిఁ జెప్పఁగఁ గల్పవృక్ష మన్
వితతమహాఖ్యఁ గాంచి పృథివీసురతేజము నిండియుండఁ గృ
ష్ణుతనువునుండి యుద్భవము సొంపుగ నొంది వటాఖ్యవిష్ణు వు
న్నతగతి నొప్పుఁ దద్వినతి నాకసుఖంబుల నీయఁజాలెడున్. 996

తే. రాజసూయాశ్వమేధసత్క్రతుసహస్ర
ఫలము నీఁజాలు; మానవుఁ డెలమి దానిఁ
గొలిచి వంశము నభివృద్ధి వెలయఁజేసి
విష్ణులోకము నొందు భూవిబుధులార. 997

మ. వినతాసూనుని గృష్ణు ముం దలరు నావిభ్రాజమానాంగుఁ బ
క్షినికాయాధిపుఁ గొల్చి వందనములం జేయంగఁ బాపౌఘముల్
చనుఁ జూర్ణంబయి విష్ణుపత్తనని వాసం బొప్పఁ బక్షీంద్రునిన్
ఘనమతా నవ్వటభూజమున్ గని తగంగా నవ్వలన్ భక్తితోన్. 998

క. పురుషోత్తము సంకర్షణుఁ, దరుణీమణినిన్ సుభద్రఁ దాఁ గను మనుజుం
డురుతరపరమపదంబున, కరుగున్ ధ్రువ మిద్ది యోమహామతులారా. 999

సీ. విష్ణ్వాయతనమును వెసఁజొచ్చి ముమ్మాఱు లటఁ బ్రదక్షిణ మొప్పునట్లు సల్పి
సంకర్షణాఖ్యుని సాధుమంత్రంబున భద్రాంబికను బూజఁ బరమకరుణఁ
బూనఁగాఁ జేయు టొప్పును; మంత్ర మెట్లన "హలధరా శ్రీరామ లలితచిత్త
నీకు వందనముల నే నొనరింతును ముసలాయుధా! నతిపుంజము లివె

తే. రేవతీకాంత! భక్తపరీతపార్శ్వ
బలవదగ్ర్యా! మహీధర వాసుదేవ
పూర్వజ! ప్రలంబసూదనా పురుషవర్య
కావుమా నన్ను" నను మంత్రగణము పలికి. 1000

సీ. దేవు నజేయుని త్రిదశార్చితుని వెండికొండఁబోలినతను వుండువాని
జంద్రునికన్నను జారుతరంబైన యాననమ్మున సొగసైనవాని
నీలాంబరంబును నెమ్మిఁ దాల్చినవాని సత్ఫణావికటమస్తకుని హలిని
నతిశయబలుని నాయతకుండలైకవిభూషితశ్రవసుని బూజ్యతముని

తే. రౌహిణేయుని భక్తి నారాధనములఁ
దనుపు భక్తుఁడు వాంఛితతతిని బొందుఁ
బాపనిర్ముక్తుఁ డగుఁ జక్రిపదము నొందుఁ;
బ్రళయకాలంబు దాఁక నాపదవి నుండి. 1001

క. తనపుణ్యము క్షయమగుడున్, మనుజులలోకమునఁ బుట్టి మానితయోగి
శునిసంతతిఁ బెంపొందుచు, ననుపమవేదాళియందు నధికప్రతిభన్. 1002

క. కని శాస్త్రంబుల నేరిచి, మునులారా! యందు మిగులఁ బూజ్యతఁ గని ము
క్తిని బొందు దుర్లభం బై,నను ముక్తియుఁ గరగతంబ నాఁబడుఁ జుండీ 1003

క. ఈరీతి హరిని బూజల, గౌరవ మేపారఁ దన్ని కమలాక్షుని దే
వారాధితపదపంకజు, శ్రీరమణుని దేవదేవు సేవింపఁ దగున్. 1004

తే. ద్వాదశాక్షరమంత్రంబుఁ దలఁచుకొనుచు
హరిని బూజింపవలయు; నాయమలమంత్ర,
రాజమునఁ బురుషోత్తమారాధనంబుఁ
జేయునాతఁడు ముక్తిని జెందు నిజము. 1005

తే. యోగులును సామగులు నెట్టియుత్తమగతి
నొందువారలొ తద్గతి నొందు ద్వాద
శాక్షరము జపియించి శ్రీహరిని బూజ
చేయునాతఁడు మిక్కిలి చెప్పనేల. 1006

క. ఆమంత్రముచేతనె యతి,మానుషునిన్ లోకగురుని మాధవుఁ గృష్ణున్
గోపలదేహుని భక్త్యు,ద్దామత సేవించి ప్రీతుఁ దగుఁ జేయంగన్. 1007

సీ. జయజయ శ్రీకృష్ణ జయ జగన్నాయకా జయ పాపసంఘనాశన మహాత్మ
చాణూరకేశిఘ్న జయ కంససంహార జయజయ పద్మసంఛదసునేత్ర
చక్రగదాధరా జయ నీలజీమూతసదృశదేహచ్ఛాయ జయమహాత్మ
సర్వసుఖప్రదా జయ సర్వసంపూజ్య జయజయ సంసారసాగరభయ
తే. హరణ! విష్ణూ పరేశ జయ మహనీయ, వాంఛితప్రద జయజయ వాసుదేవ
భూరినిస్సారఘోరసంసారసాగ,రంబు బహుదుఃఖఫేనయుక్తంబు తలఁప. 1008

క. అతికోపగ్రాహకుల, మతిరౌద్రము విషయజలమహాప్లవమయమున్
వితతామయభంగావిల, మతిమోహావర్తఘోర మది లక్ష్మీశా. 1009

తే. అట్టిసంద్రంబునన్ మున్గినట్టినన్నుఁ, గావుమా పురుషోత్తమా కడుజవమున
ననుచు దేవేశు వరదుని నఖిలభక్త,వత్సలుని సుప్రసన్నుఁగా వరుసఁ జేసి.

సీ. పాపౌఘనాశనుఁ బరమదైవము సర్వకామఫలప్రదుఁ గంజపత్ర
నయనుఁ బీనాంసుని నారాయణుని గృష్ణు బాహుద్వయుని భూరివక్షుఁ బీత

వసనుని శుభతమవక్త్రుని శంఖచక్రగదాభిభూషితకరుని బరుని
ముకుటాంగదైకవిభూషితు సర్వలక్షణయుక్తు వనమాలికావిభూషి
తే. తుని బరాత్పరు దర్శించి మనుజుఁడు తమి
నంజలిం బట్టి సాష్టాంగమైన వంద
నము సమర్పింప హయమేధ సుమహితఫల
ములను వేయింటినిం గాంచుఁ బలుకు లేల. 1011
క. ఘనతీర్థరాజములలో, మునిఁగి యటఁ దానపూగములఁ జేసినచోఁ
గనునో యేఫలమును దా, నిని బొందు నరుండు కృష్ణునిఁ దర్శింపన్. 1012
తే. పరమరత్నమ్ములఁ భవ్యభర్మరాశి, నొసఁగ నేఫలమిచ్చునో వెస నుపేంద్ర
దర్శనంబున వందనతతుల నట్టి, ఫలముఁ గల్గును మునులార భవ్యులార. 1013
సీ. సర్వవేదంబులఁ జక్కఁగాఁ బఠియింప సర్వయజ్ఞంబుల సవిధిఁ జేయఁ
గలుగుఫలంబు శ్రీకాంతుని దర్శించి మ్రొక్కినఁ గలుగు నిమ్ముల సుభక్తి
సర్వదానంబుల సకలవ్రతంబుల నియమంబులఁ గల్గునియతఫలము
శ్రీకృష్ణు దర్శించి శిరమునోఁకఁగ మ్రొక్కఁ దప్పక కల్గు నోధన్యులార
తే. యుగ్రతపముల విధియుతి నొగి నొనర్పఁ
గలుగు నేఫల మది కృష్ణు గాంచి మ్రొక్కఁ
గలుగు; బ్రహ్మచర్యంబుఁ జక్కఁగను బూనఁ
గలిగెడుఫలంబు లెల్లను గలుగుదాన. 1014
క. స్మృతి పలుకునట్టివిధమున, జతనము మీఱంగ నియమసంతతిఁ బూనన్
మతి నెంచుగృహస్థుండే, వితతంబగు ఫలమునొందు విష్ణుని జూడన్. 1015
క. నతు లొనరింపఁగఁ దత్ఫల, మతిశయముగఁ బొందు; వనమునందు వసింపన్
మతిఁగొను వానప్రస్థుఁడు, హితమతి తత్ఫలము గాంచుఁ గృష్ణుని గొలువన్.
ఆ. శాస్త్రవిహితమైన సన్న్యాసమున నెట్టి, ఫలము గలుగఁగలదొ బలభిదనుజు
దర్శనమున నతుల దానిమించినఫల, ములను గాంచు నరుఁడు పలుకనేల. 1017
మ. పలుమాటల్ వచియింపనేల గురుతన్ భాసిల్లు శ్రీకృష్ణు ని
మ్ముల దర్శించుమనుష్యసన్మహిమముం బూన్కిన్ నుతింపంగ శ
క్తులు గన్పట్టరు ముక్తి యాతనికిఁ జేకూరున్ మహాపాపరా
సులు తోడ్తోన తొలంగు సంపదలు సంశోభిల్లు నెల్లప్పుడున్. 1018
ఆ. సర్వసద్గుణములు సర్వకామంబులు, వానియందు నెప్డు వఱలుచుండు;
దివ్యకాంతితోడఁ దేజరిల్లు విమాన, మెక్కి కులము నిరువదొక్కటిఁ దమి. 1019
క. తా నుద్ధరించి కమలా, జానిపురిం బొందు నందు శతసంఖ్యలుగాఁ
బూనిక సుఖములఁ బొందుచు, జానుగ సురసన్నుతుఁ డగుఁ జక్రివిధమునన్.
క. మరలన్ నరలోకంబున, ధరణీసురవర్యునింటఁ దాఁ జనిఁ గని మ

త్సరహీనుఁ డగుచు ధర్మో,త్కరముల దక్షుండు వేదకాండవిదుండున్. 1021

క. తనధర్మమందు నిరతుం,డనుపమశాంతుండు దాంతుఁ డఖలహితుండుఁ
వనజాక్షుభక్తుఁడును నై,వినయజ్ఞానముల మిగులఁ బెంపొంది కడున్. 1022

ఆ. పరమపదము నొందు; భవ్యమంత్రంబున,భక్తవత్సలతను భాసిలు జగ
దంబికను సుభద్ర నర్చింపఁ దగు నను,స్కారములను వినుతిసమితి భక్తి.

క. ఒనరించి కృతాంజలియై, వినయముచెలువార నిట్లు వేఁడఁదగు వే
దనుతా దేవీ సర్వం,బుననుండెడు శక్తి నీకుఁ బొల్చునుగాదే. 1024

తే. సర్వశుభముల నొసఁగు సచ్ఛక్తిఁ దనరు
దానవుకదా మహాదేవి దీను నన్నుఁ
గావుమా యంచు భక్తిచేఁ గంజనేత్ర
నంబఁ గాత్యాయనిఁ వేఁడ నగును జుండి. 1025

సీ. ఈరీతిగా సకలేష్టదాత్రిని జగద్ధాత్రిని హలిసహోదరిని వరద
నాసుభద్రను గొల్చి యమలంబుఁ గామగమును నొకమానంబునను ముదమున
విష్ణుపురంబును వేడుకఁ జేరు నాభూతసంప్లవమును బురిని నచట
నివసించి మరల నీభువియందు జన్మించి వేదవేదాంగాళివేత్తయగుచు

తే. విష్ణుయోగంబు నొంది యేవెఱపు లేక
ఘోరసంసారబాధలఁ గుంద కెలమి
మోక్షపదమును బొందు నో మునివరేణ్యు
లార యనిపల్కె మఱియు నంభోరుహజని. 1026

---

ఏఁబదియైదవ యధ్యాయము.

నరసింహపూజావిధానము.

క. ఈరీతిం బలకృష్ణులఁ, జారువిలోచన సుభద్రఁ జంచద్భక్తిఁ
గోరిక సేవించినచో, భూరితరంబైన ధర్మమును నర్థంబుఁ. 1027

ఆ. కామమోక్షములను గడువడిఁ బొందును; దేవతాలయంబు భావితాత్ముఁ
డగుచు వెడలి దాని కతిభక్తిఁ బ్రణమిల్లి, దానిచుట్టు దగుఁ బ్రదక్షిణములను.

సీ. చక్కఁ నేవింపనౌ శక్రనీలమయుండు వాలుకావృతుఁడు నౌవాసుదేవుఁ
డంతర్హితుండయి యట నుండుఁగావున నా దేవుదర్శించినట్లు తలఁచి
వందన మొనరింప వైకుంఠ మొందును; సర్వదేవమయుండు చక్రధరుఁడు
దానవేశ్వరుఁ జంపెఁ దా మును నరసింహుఁ డా దేవు దర్శించి యమలభక్తి

తే. దండమిడిన మహాపాపతతివిముక్తుఁ
డగును సంశయమే లేదు తగ నరహరి

భక్తు లెందఱు భువిలోనఁ బ్రబలువారొ
వారి నింతయుఁ బాపంబు చేర వెఱచు. 1029

క. కనుక నృసింహుని సర్వవి,ధనియమములచేతఁ గొల్వఁ దగు ధర్మం బ
ర్థనిచయము కామమోక్షము, లను వొందఁగ నతనిఁ బొందు నాక్షణముననే.

చ. అనవిని మౌను లిట్టు లని రబ్జభవా నరసింహమూర్తి పా
వనమహిమంబు దుర్లభము వాంఛితసిద్ధిద మట్లుగాన నా
తనిచరితంబుఁ దెల్పుము ముదంబున విందుము కౌతుకంబు గ
ల్గెను విన నట్లుగాన నఘకృంతనదక్షము నాచరిత్రముల్. 1031

క. వినిపింపు మెట్టు లాతఁడు, జనులం గరుణించి ప్రోచు సద్భక్తహితం
బును గోరు మాకుఁ దెల్పు మ,తనిదయ నేసిద్ధు లమరుఁ దమి నవ్వానిన్. 1032

క. వినఁగోరుదు మట్లౌటను, వనజభవా తెల్పు మన్న వారిమనోవాం
ఛను దీర్ప నెంచి బ్రహ్మయు, ననియె మహామౌనులార! యాతనిమహిమల్.

ఆ. తెల్పువాఁడ నతఁడు ధీరుఁడు నజితుండు, నప్రమేయుఁ డాద్యుఁ డసదృశుండు
నై వెలుంగు నతనియద్భుతమహిమంబుఁ, దెలుపశక్తుఁ డెవ్వఁ డలరు జగతి.

క. అతనిసకలగుణముల నే,ర్పుతగం దెల్పంగఁజాల మునులార! మహో
న్నతతచ్చరితముఁ దెల్పెద, మతిఁ దెలిసినయంతదనుక మన్నన మీకున్. 1035

క. ఏయేసిద్ధులు గలవని, యాయమరులు మానవులును నభినుతిసేయం
గా యావత్కాలము దల,పోయుదు రాసిద్ధు లెల్ల బొందుదురు జనుల్. 1036

క. సురపురి మర్త్యంబున సుం,దరబలిసద్మమున దిగ్వితానంబునఁ బు
ష్కరములఁ బురముల వరభూ,ధరముల నరసింహుకరుణ దనరునయేనిన్. 1037

క. గతి యవ్యాహతమై తగు, దితిజాంతకుఁడౌ నృసింహుదివ్యకరుణ నీ
క్షితి సాధ్యముగాని ఫలం,బు తగన్ బరికింప నుండఁబోదు ధ్రువముగన్. 1038

సీ. భక్తానుకంపి యాపరమేశ్వరుండని తలపోయుఁడీ మది నల నృసింహు
నర్చించువిధము భక్తానుకంపం బూని వచియింతు దేనిచే వాసుదేవు
కరుణకుఁ బాత్రుఁడై నరుఁ డిష్టసిద్ధులఁ బొందఁగల్గునొ మునిముఖ్యులార
బహుపూర్వతరము గాఁ బొలుచుకల్పంబున నవతరించి నమ్మృగేంద్రాస్యుచరిత

ఆ. మమరముఖ్యులేని యరయంగఁ జాలరు, వాసుదేవు నతని వన్యములగు
శాకయావకఫలసంతతి మూలపి,ణ్యాకముల భుజించి యర్హగతిని. 1039

క. క్షీరములఁ ద్రావియైనను, భూరితరంబైన నియమమున సాధకుఁ డా
శ్రీరమణుఁ గొల్వఁదగు విధి, నారసి కౌపీనధారియగుచున్ భక్తిన్. 1040

తే. ఇంద్రియాళి జయించి ధ్యానేచ్ఛ తనర
నటవియందైన నిర్జనంబౌ ప్రదేశ

మందునైనను భూధరమందునైన
సింధుసంగమముననైనఁ జేరి నియతి. 1041

సీ. మఱియు నూషరముగుష్మాభాగముననైన సిద్ధిదక్షేత్రమై చెలఁగుచోటు
నందైన నారసింహక్షేత్రమందైనఁ దన్మూర్తి నిలిపి విధానరీతి
నర్చింపవలయు శుక్లాఖ్యపక్షంబున ద్వాదశిఁ బస్తుండి భక్తి నియతి
నరసింహమంత్రంబు నరుఁడు వింశల్లక్షసంఖ్యలుగూడఁగ జపము సలుప
తే. వలయు నుపపాతకమహాఘములు దొలంగుఁ
బావనుండగు సాధకుం డీవిధమున
సంశయము లేదు నరసింహు సకలఫలదుఁ
గనుచు వలఁగొని మ్రొక్కుచుఁ గౌతుకమున. 1042

క. సుమముల గంధాదుల ధూపములన్ దీపముల బహుళపావననైవే
ద్యములన్ దృప్తిం బొందఁగ, సుమహితపూజలను జేయఁ జొప్పడుఫలముల్.

వ. కర్పూరచందనమిళితజాతీపుష్పంబుల శ్రీహరిశిరమున నునుపం దగుదాన భగ
వంతుం డలరి యిష్టసిద్ధుల నొసంగుచుండు. 1044

క. నరసింహమూర్తి కార్యోత్కరమున నెద్దానియందుఁ గాని చొరఁబడం
గరమరుదే తత్కార్యము, స్థిరఫల మొసఁగంగ నింకఁ జెప్పఁగ నేలా. 1045

క. దుర్వారతేజమును నాశర్వాదులు చూడలేక సాధ్వసమతులై
యుర్విస్థలినెంతో స్థితిఁ, బర్వుదు రెక దానవులు సుపర్వులు సిద్ధుల్. 1046

క. గరుడులు గంధర్వులు కింపురుషులు విద్యాధరులును బురుషులు తాళన్
వరశక్తిగాంతురని యనఁ, దరమే నరసింహమూర్తి దారుణతనువున్. 1047

సీ. మంత్రసంతతిఁ బెక్కుమనుజులు వాంఛింత్రు సాధకుల్ మంత్రైకశరణులగుచు
నన్యమంత్రంబుల నతిభక్తి జపియింత్రు వారెల్లఁ బ్రళయంబు వచ్చునపుడు
తపనాగ్నిదీప్తుల దారుణతన్ మ్రందువారు; నృసింహుకవచవరంబు
సర్వసౌఖ్యదము నచలమును జపియించి ఫలసిద్ధిఁ గాంతురు పరమభక్తి
తే. రెండుమాఱులు జపియింప నిండుఁగోర్కు
లమర దానవులకుఁగూడ నమరయోను
లకును గోర్కులు పండుఁ జలత్వ మొంద
నట్టిభక్తిని మూఁడుపర్యాయము లొగి. 1048

క. సురలకు దానవులకు నెవ్వరున్ భేదింపరాని వరకవచంబున్
నరుఁడు జపించిన దైవము, పరితృప్తిం బొంది యట్టిభక్తునిఁ బ్రీతిన్. 1049

తే. యోజనద్వాదశకమున నొప్పుదూర
మున నె నివసించినను గాచు మునివరేణ్య

లార! బలశాలి నరసింహుఁ డారసి తన
మహిమ మేర్పడ నిఁక యాత్రమహిమ వినుఁడు. 1050

సీ. యాత్రకుఁ జని నరుఁ డలబిలద్వారంబుసన్నిధానమున నిశాత్రయం బు
పవసించి హుతవహుఁ బ్రభుని బలాశదారువుల నుండఁగఁ జేసి సవిధిమీఱఁ
గాఁ బలాశద్రుమ కమ్రసమిధలను ద్రిమధుప్లుతంబుల దృఢతరమగు
భక్తి హోమము చేయవలయును ద్విశతసంఖ్యల వషట్కారంబు గలుగఁ జేసి

తే. యట్లుచేయ బిలద్వారమల్లన వివృ
తమగు నాక్షణమందె సాధకుఁడు శంక
నొంద కందుఁ బ్రవేశించు టొప్పఁగవచి,
యగుచుఁ బోవంగఁ బోవంగ నాబిలమున. 1051

క. *తమసును మోహము వరుస ల,యి మగుఁ గా మఱి రాజమార్గ మతివిస్తీర్ణం
బమరిచినయట్లు కన్పడు, భ్రమరాంచితమైనయట్టి పథమునఁ బోవన్. 1052

క. నరసింహుని స్మరణంబున, ధరణీసురవర్యులార! తగఁ బాతాళం
బు రహిం గన్పడు నట సుం,దరభాగమునందు నిల్చి తన్మంత్రంబున్. 1503

సీ. జపియింపవలయును సరగున వీణల వాయించుసుందరవనిత లెన్నో
వేలసంఖ్యలుగాఁగ నోలి వత్తురు వారె స్వాగతం బిడుదురు భోగిలోక
మునకు వారలె హస్తమును బట్టుకొనివానిఁ గొనిపోవుదురు రసాయనముదివ్య
మును బ్రీతిఁ దినుమని వినయమ్మునం గోరి భక్షింపఁ జేయుదు రాక్షణమున

ఆ. దివ్యదేహ మొందు దీప్తిమంతము బలా,న్వితము గల్గు వాఁడు వెలఁదిపిండు
గూడి లయముదనుకఁ గ్రీడించుచుండు న,వ్వాలను జేరుఁజొండి వాసుదేవు. 1054

వ. ఆలోకంబున నివసింప నేక్షణమ్మున నిచ్ఛలేకయుండు నాక్షణంబుననే వెడలి
స్వస్థలమును జేరు. మఱియుఁ బట్టిశూలఖడ్గరోచనామణిరసరసాయనపాదుకాంజన
కృష్ణాజినమనోహరగుటికా కమండల్వక్షసూత్ర సంజీవనీ యష్టిసిద్ధ విద్యాశా
స్త్రంబుల గ్రహించి సాధకోత్తముఁడు జ్వలద్వహ్నిస్ఫులింగోర్మి వేష్టిత త్రిశి
ఖునిహృదయంబునఁ దలంచిన సర్వపాతంబులు దగ్ధంబులగు. దేహగతవిషవస్థం
బులు తొలంగు. భ్రూణహత్యాదిపాపంబు లప్పుడ నశించు. గ్రహబాధలు గల్గు
తఱి మహోగ్రగ్రహగృహీతేషుని జ్వలమానతేజునిగ నృసింహమూర్తిని ధ్యానిం
చిన నాపిశాచము లాక్షణంబ నశియించు నృసింహకవచమంత్రంబును బత్రం
బున లిఖించి గళంబునఁ గట్టిన నది బాలుని సదా రక్షించుచుండు గండ పిండక
లూతంబులు నశించు మఱియు. 1055

తే. మించి చెంగల్వకోష్ఠసమిధలఁ గొనుచుఁ
బాల నేతిని ముంచి తత్పరత హోమ

* రాజమార్గ స్సువిస్తీర్ణో దృశ్యతే భ్రమరాంచితః. అనిమూలము.

మొక్క నెల మూఁడువేళల నొప్పఁజేయ
సర్వరోగమ్ములుం బాయు సత్వరముగ. 1056

సీ. ముల్లోకములయందుఁ బోల నాలోచింప వానికి సాధ్యంబు గానియట్టి
దొక్కటియే లేక యుండు నేయేసిద్ధులను గోరు నవి యన్నియును ఫలించు
నష్టోత్తరశతంబు నలరి పూజించిన; మఱియొక్కపద్ధతి మమత వినుఁడు
వల్మీకమున సప్తవారముల్ పిడికిట మృత్తికం గైకొని మేటిరక్త
చందనం బందున సంకలితముచేసి యావుపాలను జేర్చి యమరఁ దడిపి
యాఱంగుళములదౌ నానరసింహుని ప్రతిమను జేసి భూర్జదళవితతిఁ
బొందుగ రోచనంబున మంత్రవరమును విలిఖించి యద్దాని విమలకంఠ
సీమను గట్టుచు స్థిరభక్తిని స్వశక్తి కనురూపముగ జప మాచరింప
తే. వలయును జలాశయంబుప్రక్కలను నేడు,దినము లీరీతిఁ బూజింప దివ్యవృష్టి
ధరణి యేకార్ణవాకృతిఁ దనరియుండు,నిది యనావృష్టిఁ దొలఁగింపను దగురీతి.

వ. శ్మశానంబునఁగాని చతుష్పథంబునఁగాని మృత్తికం గైకొని పై రీతిఁజేయవచ్చు.
శుష్కవృక్షాగ్రంబున నృసింహమూర్తిని బూజించి యష్టోత్తరశతవారములు
మంత్రంబు జపించిన నతివృష్టిదోషంబు తొలంగు. ఆమంత్రమును లిఖించిన
యంత్రమును బింజకంబున బంధించి గిరగిరం ద్రిప్ప నొక్కముహూర్తంబున
మహావాతం బుద్భవిల్లు. ఇందులకు సందియంబులేదు. అవ్వల నేడుసారులు జ
లంబుల నభిమంత్రించి వానిందడిపి యాయంత్రంబును ధరింపవలయును. మఱి
యు నాప్రతిమ నెవ్వనిద్వారమందున భూస్థాపితంబుగ నొనరింతురో వానివం
శంబు నశియించు ఆదోషంబు తొలంగవలయునన్న దానిం ద్రవ్వి వేఱొకచో
స్థాపింపవలయు. ఆదోషంబు శాంతించు. 1058

క. మునివరులారా! కావున, మనుజమృగేంద్రుని స్వకీయమానసమున ని
ల్పి నిరంతరంబు పూజిం, పనుదగు; గురువీర్యయుక్తి భాసిలునృహరిన్. 1059

తే. సర్వకామఫలప్రదు సాధురక్ష
కుని సమర్చింపఁ బాపముల్ కూలు విష్ణు
లోకమది హస్తగత మగుఁ బ్రాకటఫల
ములు చెలంగును గోరినపోల్కి ధ్రువము. 1060

క. ధరణీదివిజులు క్షోణీ,వరు లూరుజు లంఘ్రిభవులు వనితామణులున్
స్థిరభక్తి మెఱయ నానర,హరిఁగొల్చిన భూర్యఘంబు లడఁగుట యరుదే. 1061

క. జనికోట్యుద్భవపాపము, లనూనపంచాస్యశీర్షు ననుకంప నశిం
చును దత్పూజనమునఁ గో,రినవెల్ల లభించు సిద్ధి ఋతమగుఁ జుండీ. 1062

సీ. దేవత్వ మమరతతిప్రభుత్వము యక్షనాథత్వ మమలగంధర్వసిద్ధ
విద్యాధరత్వముల్ వేవేగ లభియించు మఱియెద్దికోరిన నెఱి లభించు;

నరహరిం దగఁగాంచిననా నుతించిన నమస్కృతు లొనర్చిన సమర్చితుని జేసి
నను నరుల్ రాజ్యంబు ననుపమస్వర్గంబుఁ జాలదుర్లభ మనఁజాలు ముక్తి.

తే. నొందుదురు; వాంఛితంబు లెల్లందమంత
భక్తునిం బొందుఁ బాపముల్ పాఱిపోవు
విష్ణులోకనివాసత వెలయుచుండు
నృహరిసేవకు లోమునినృపతులార. 1063

క. ఒకమాఱు నృసింహుని భక్తికలితుఁడై చూచునేని తీవ్రాఘంబుల్
సకలజనిసంభవంబులు, వికలములై పోవు వగలు విలయమునొందున్. 1064

చ. అనిమొన ఘోరసంకటమునందును జోరులు ద్వీపిసంఘముల్
తను వెసఁ జుట్టుకొన్నతఱి దారుణకాననమందుఁ జిక్కి పో
వను దెరువెద్దియుం గొనని స్వాంతము కుందెడువేళఁ బ్రాణముల్
తనువున నిల్చునా యను వెతం గనునప్పుడు వహ్నిభీతినిన్. 1065

తే. విషభయంబును ఘోరాంబుభీతి పొసఁగు
తరుణమున రాజ సాగర దారుణామ
య గ్రహాదిక పీడలు నలముకొనెడు
నప్డు నృహరిని స్మరియింప నవి తొలంగు. 1066

చ. ఖరకిరణోదయంబునను గాఢతమస్తతి నాశమొందు న
క్కరణి నృసింహదర్శనము గాఢతరంబగు భక్తిఁజేయ దు
ర్భరబహుళాపదల్ తొలఁగుఁ బాదుకసిద్ధియు నంజనాఖ్యసుం
దరఘుటికాదిసిద్ధులు నితాంతము గల్గును దప్పదేదియున్. 1067

వ. పాతాళగమన రసాయనాదిసిద్ధు లానృసింహమూర్తి కరుణింప లభించును.
మఱియు నితరవాంఛితంబులు గల్గిన ఫలించు. ఏయేవాంఛను దలంచి నరసింహ
మూర్తిని స్మరించునో యాభక్తుఁ డావాంఛితమును బొందు. సంశయంబు
లేదు. మఱియు. 1068

చ. కనుఁగొని యానృసింహుని నికామము భక్తిగఁగఁ బూజనం
బున నతిసంతతిం దనుప భూరితరంబగు నశ్వమేధయా
గ నియతసత్ఫలంబు దశకప్రగుణం బొగిఁజేయ నెంతొ యం
త నరుఁడు కాంచుఁ; బాపములు తప్ప కడంగు గుణంబు లొప్పెడున్. 1069

క. జరయును మరణము తొలఁగును, గురుకామము లెల్ల వేగ కొనసాగును; భ
క్తిరతిఁ గనుమానవుఁడు నిర్జరలోకము వ్యోమయానసరణిం గనెడున్. 1070

ఆ. స్వర్ణమయవిమానసత్తమమందునఁ, గూరుచుండి స్వర్ణగుంభితమ్ము
లైన కింకిణుల మహాస్వన మొప్పంగఁ, గామగమనమున నఖండకాంతి. 1071

క. తనరారఁ దారహారము, లనువొందఁగ వెలుఁగ దేవతాంగనలెల్లం
దనుఁ గొలువఁగ గంధర్వుల,వనితలు పాడంగఁ గులమువారు చెలంగన్.1072
క అమరులవలె మోదంబున, నమరుచు శ్రీవిష్ణులోకమందును నచటన్
సమయం బెంతో గడువఁగ,క్షమచేఁ బూజ్యుండు నగుచు సత్వముపొంగన్.
సీ. గంధర్వులు తనుఁ బొగడుచుండఁగాఁ జతుర్బాహువులొప్ప శ్రీవాసుదేవు
దివ్యరూపము నొంది తివిరి లయంబగుదనుక వసించి మోదములు గనుచు
ధరణిని యోగివతంసుకులంబున జనియించి వేదముల్ చదివి శాస్త్ర
సారంబుల నెఱింగి చక్రియోగంబొంది యపవర్గముం గాంచు నమ్మహాత్ముఁ
ఆ. డట్లుగాన మౌనిహరిహయులార! శ్రీ,నారసింహుమహిత భూరిశక్తి
వినుతిసేయనేర రను టబ్బురమె వేద,వితతివేద్యుఁ డతఁడు విశ్వపతియు.1074

ఏఁబదియాఱవయధ్యాయము.

శ్వేతనృపతి కపాలగౌతమమునిమృతపుత్త్రుని బ్రదికించుట.

చ. అని పరమేష్ఠి మౌనులకు నానరసింహుమహత్త్వ మేర్పడం
గను వచియించి యచ్చటను గల్గు ననంతుని వాసుదేవుఁ డం
చు నెగడుదైవమున్ మదిని జొప్పడుభక్తి నమస్కృతుల్ దగం
గను గొలువంగఁ బాపములు గ్రన్ననఁబోవు విముక్తి యబ్బెడున్. 1075
క. మునులార యాయనంతుని, మును నేఁ బూజించినాఁడ ముదమున నవలన్
దనుజారి శతక్రతుఁ డ,ర్చనములఁ గొలిచెన్ దశాస్యసహజుం డవలన్. 1076
క. సేవించె రామచంద్రుఁడు, భావించి నమస్కరించెఁ బరమాత్ముని నా
శ్రీవిభుని గొలువకుండిన, ధీవిభవులు గలరె సేవ తెలుఁగున్ వినుఁడీ. 1077
సీ. శ్వేతగంగ మునింగి శ్వేతమాధవుఁగని మత్స్యాఖ్యుఁదగునట్టి మాధవునిని
దర్శింప వేగ శ్వేతద్వీపమున కేగు మనుజుఁడు;నా విని మునులు పల్కి
రా శ్వేతమాధవునద్భుతమహిమంబుఁ దెలుపంగఁ దగును విస్తృతిని నతని
సుప్రతిష్ఠను; దేవుశుభమూర్తి నాతనిఁ దక్షేత్రవరమున ధన్యుఁ డెవఁడు
తే. శ్వేతమాధవుఁడనఁ బ్రతిష్ఠించె మున్ను
దానివృత్తాంతముం దెల్పుమా నితాంత
మోదమున నన్న నిట్లను సాదరమున
బ్రహ్మ కృతయుగమందుఁ బూర్వమ్ము జగతి. 1078
క. బలశాలి శ్వేతుఁ డనఁబడు, నిలాపతి సుబుద్ధి శూరుఁ డెల్లవిధములం
జెలఁగెడు ధర్మంబుల న్విమ్ముల నెఱిఁగినవాఁడు సత్యమున నిశ్చలుఁడున్. 1079
క. వ్రతమున దృఢతంగను భూ,పతి యొప్పెను శ్వేతురాజ్యపాలనమున వు

త్ర్యతతియును నయుతవత్సరమితి యాయువునందుఁ గాంచి మేటిబలులునై.
ఆ. రోగరహితులగుచు భోగులునై మను, చుండు రక్షకులును గండు రాయు
వంతెకాని మృతిని నసమయమునఁ గన, రతని ధర్మరాజ్యమందు సతము. 1081
చ. క్షితిపతి శ్వేతుఁ డిట్లు పరికీర్తితపద్ధతి రాజ్యమేలుచుం
గతిపయవత్సరంబులు నికామముదంబునఁ బుచ్చె నంతనా
క్షితిని గపాలగౌతముఁడు కీర్తితనిష్ఠుఁడు ధర్మసక్తిచే
సతము చెలంగుమౌనిపతి శాంతమనీషుఁడు పొల్చె నాతఁడున్. 1082
చ. తనయునిఁ గాంచె నాసుతుఁడు తద్దయు సుందరకాయుఁ డయ్యుఁ జ
చ్చె నొకదినంబునందు సుతుఁ జెచ్చెరఁ గైకొని ధీవిశాలుఁడౌ
మునిపతి శ్వేతుకిం గనఁగఁ బోయెను రాజు పరుండియుండిన
ట్లనువుగఁ దోఁచి మృత్యుగతుఁడౌ మునిబాలకుఁ గాంచి నెవ్వగన్. 1083
చ. ప్రతిన యొనర్చె నాశిశువుప్రాణము లెప్పటిరీతి నిల్వ నీ
సుతుని బరేతనాథుపురిఁ జొచ్చినయీతని సప్తరాత్రముల్
క్షితిపయి సాగకుండఁగనె జీవితుఁ జేయనయేని నే నొగిన్
జితిపయి మేనుఁ జేర్చుచు శుచిన్ దహియించెద మేను దీనినిన్. 1084
చ. అనుచుఁ బ్రతిజ్ఞ చేసి కమలావళి సంఖ్యలమీఱునట్లుగా
ననుపమభక్తి శంకరు మహాత్ముని బూజలఁ దృప్తుఁ జేయుచున్
ఘనతరమంత్రరాజము నికామముదంబు తగన్ జపించె నా
తనిదృఢభక్తి కెంతయు ముదంబును బొంది యుమాసమేతుఁడై. 1085
ఆ. రాజు మ్రోల నిల్చి యోజగత్పాలకా, తృప్తి నొందినాఁడ నింక లెమ్ము
జపము చాలు ననెడుశంకరుపల్కుల, నాలకించి శివుని నట్టిచూచి. 1086
సీ. భస్మదిగ్ధాంగుని ఫాలనేత్రుని శరత్కుందేందువర్చసుఁ గుటిలహారుని
శార్దూలచర్మవసనుని శశాంకాంకితోత్తమాంగుని జూచి యుర్వి వ్రాలి
నతు లొనరించి సమ్మతిఁ బల్కె నిట్లని! యోమహాదేవ నన్నురుతరకృపఁ
గాంచి ప్రసన్నుఁడ వంచితవరదుఁడ వగుట సత్యంబేని యవనిసురుని
తే. మృతకుమారకు బ్రదికింపు మీశ నాదు
ప్రతినఁ గావుము సమయము రాకయుండు
తఱి మృతిం బొందెఁ గావున దర్పకహర
యతని బ్రదికించి క్షేమంబు నందఁగూర్పు. 1087
చ. అనివచియించు భూమిపతి హారివచస్సుల నాలకించి యిం
తని వచియింపరాని తమిసంది మహేశుఁడు తత్క్షణంబ ర
మ్మని మదిలో స్మరించె యముఁ డప్పుడె భూతభయంకరుండు వ
చ్చెను బరమేశుఁ డాతనిని జేడ్పడఁ బల్కె మృతున్ గుమారకున్. 1088

తే. మృత్యుముఖమును జొచ్చిన మృదుశరీరు
జీవితుని జేసి కుశలంబుఁజెంది బ్రదుకు
నీతఁ డని తెల్పి భూదేవుఁడెంతొ యలర
దేవితో నేగ నెచటికో దేవవిభుఁడు 1089

క. ఈరీతి శ్వేతనామక, భూరమణుఁడు విప్రవర్యపుత్త్రుని బ్రదుకం
గా రమణఁజేసె నా విని, గారవమున హాను లనిరి కంజభవునితోన్. 1090

సీ. దేవదేవా మహాపావనా త్రైలోక్యసృష్టికారణ జగదీశ్వరావ్య
యా విధీ శ్వేతాఖ్యు నమలచరిత్రతత్త్వంబు వచింపుమా వాంఛ మాకు
వినఁగల్గె ననవిని విధి యిట్లు తెల్పెను మునివరులార వే వినుఁడు భూత
హితమునకయి తత్త్వ మెల్లను వచియింతు మాధవు సంస్తుత్యమహిమ మఖిల

ఆ. పాపహారము దాని భక్తిమీఱఁగ విన, సర్వకామములను సరగఁ బొందు
మునులు తెల్పి రెలమి మున్ను దానిఁ భయ,శోకకష్టహరము శుభతమమ్ము.

క. శ్వేతక్ష్మాపతి భూమిని, వీతారిగణంబు గాఁగ విమలతరలస
త్ఖ్యాతిఁ మెఱయఁగ నేలెను, వీతాహంకారుఁ డగుచు వేయిశరత్తుల్. 1092

క. జనవిహితలోకధర్మము,లను వైదికధర్మవితతులను నియమములన్
విని కేశవు నారాధన,మునఁ జిత్తము నిల్పె సుదృఢముగ వ్రతనిరతిన్. 1093

చ. నిరుపమమైన దక్షిణపునీరధితీరమునఁ బవిత్రమై
పరమును మంగళప్రదము భవ్యమునై తగు క్షేత్రమందు ని,
ర్భరమహిమాఢ్యుఁడై తనరె రాజిలుఁ కృష్ణుని యంతికంబునఁ
ధరణివిభుండు శ్వేతుఁడు ముదంబున శ్రీపతిభక్తిపూర్ణుఁడై. 1094

క. కనుఁగొనఁ దగుప్రాసాదం,బును గట్టించెను మహావిభూతిని శాస్త్రం
బునఁ జెప్పఁబడినరీతిని, మునులారా! యద్ధికృష్ణమూర్తివసతికిఁ. 1095

వ. శతధనుః ప్రమాణాంతరంబున నాప్రాసాదంబు నిర్మింపఁబడియె. శ్వేతశిలా విగ్రహం బందుఁ జంద్రసన్నిభంబు శుభతమలక్షణయుతంబు గాఁ బ్రతిష్ఠింపఁ బడియె. అది విధివిహితప్రతిష్ఠం దనరి శ్వేతమాధవనామంబునఁ బ్రసిద్ధం బయ్యె. ఆప్రతిష్ఠాకాలంబున నాభూపతి విద్వద్బ్రాహ్మణులకు దానంబు లొసఁగి దీనానాథతపస్విజనుల నాదరించి యాదట భూపతి శ్రీశ్వేతమాధవుసన్నిధి యందు భూమిని ద్రవ్వించి శోధించి యందు నియతింగూరుచుండి యోంకారా న్విత ద్వాదశాక్షర మంత్రరాజంబును జపించుచు మౌనియై సమాధినిరతిం గాంచి యొక్కమాసంబు నిరాహారుఁడై భగవత్పాదపద్మాధీనమానసుండై జపాం తంబున దేవదేవు నిట్లని వినుతించె. 1096

సీ. ఓంకారరూపున కురుభక్తి వందనములు వాసుదేవున కెలమి మ్రొక్కు-
సంకర్షణునకు నాసక్తి వందనతతి ప్రద్యుమ్నునకు నమః ప్రతతి మఱియు

ననిరుద్ధునకును నారాయణునకు బహురూపునకుఁ విశ్వరూపునకును
నప్రతర్క్యునకును నతిపరిశుద్ధునకును నిర్గుణునకు శుక్లునకుఁ బద్మ
ఆ. నాభునకును బద్మనయనునకుఁ బద్మ; గర్భభవున కబ్జకమ్రవర్ణ
ననును బద్మహస్తునకు నమస్కారముల్, పుష్కరాక్షునకు విభూతిదునకు. 1097

వ. సహస్రాక్షునకు, సహస్రపాదునకు, సహస్రభుజునకు, వరాహమూర్తికి, వరదునకు, సుమేధసునకు, వసిష్ఠునకు, వరేణ్యునకు, హిరణ్యునకు, నచ్యుతునకు, బాలరూపునకు, బాలపంకజప్రభునకు, బాలార్కసోమనేత్రునకు, ముంజకేశునకు, ధీమంతునకుఁ, గేశవునకు, నారాయణునకు, మాధవునకు, వరిష్ఠునకు, గోవిందునకు నమస్కరణంబులు. విష్ణు, దేవ, వసురేతో, మధుసూదన, శుద్ధాంశుధ, రానంత, సూక్ష్మ, శ్రీవత్సధారి, త్రివిక్రమ, దివ్యపీతాంబర, సృష్టికర్తృ, గోప్తృ, ధాతృ, గుణభూత, నిర్గుణ, వామనరూప, వామన, కర్మ, వామననేత్ర, వామనవాహి, పూజ్యావ్యక్తరూ, ప్యప్రతర్క్య, శుద్ధభయహర, సంసారార్ణపోత, ప్రశాంత, స్వరూపి, శివ, సౌమ్యరూప, ఘోరరూపధర, భవభంగకృ, ద్భవభోగప్రద, భవసంభూతరూప, భవసృష్టికృ, ద్దివ్యరూప, సోమాగ్నిశ్వసిత, సోమసూర్యాంశుకేశ, గోబ్రాహ్మణహిత. నామములనలరు శ్రీకేశవునకు వందనములు. ఋక్స్వరూపుఁడై, పదక్రమస్వరూపుఁడై, ఋక్స్తుతుండై, ఋక్సాధనుఁడై, యజుర్వేదధారియై, యజూరూపుఁడై, యజుర్యాజ్యుఁడై, యజుర్జుష్టుఁడై, శ్రీపతి, దేవ, శ్రీధర, వర, శ్రియఃకాంత, దాంత, యోగిచింత్య, యోగి, ప్రముఖనామధరుండై, సామరూపుఁడై, సామధ్వనివరుండై, సామసౌమ్యుండై, సామయోగవేత్తయై, సామగీతుఁడై, సామధారియై, సామయజ్ఞవిదుండై, సామకరుండై, యథర్వశిరసుఁడై, యథర్వస్వరూపుఁడై, యథర్వపాదుండై, యథర్వకరుండై, యలరుదేవునకుఁ జేమోడ్పులు వజ్రశీర్షుఁడై, మధుకైటభఘాతియై, మహోదధిజలస్థుండై, వేదాహరణకారియై, దీప్తస్వరూపుఁడై, హృషీకేశుఁడై, భగవంతుఁడై, వాసుదేవుఁడనంబరఁగుమహాత్మునకు నమస్సులు. నారాయణా! నీవు లోకహితుండవు. మోహనాశనుండవు భవభంగకరుండవు. గతిప్రదుండవు. బంధహరుండవు. త్రైలోక్యతేజఃకర్తవు. తేజస్స్వరూపుఁడవు. యోగీశ్వరుఁడవు. శుద్ధుఁడవు. రాముఁడవు. ఉత్తగణకారణుఁడవు. సుఖస్వరూపుఁడవు. సుఖనేత్రుఁడవు సుకృతధారివి. వాసుదేవుండవు. వంద్యుండవు. వామదేవుండవు. దేహిదేహకర్తవు. ఖేదభంగకరుండవు. దేవవందితదేహుండవు, దివ్యమాలివి. వాసనివాసుఁడవు. వాసవ్యవహారుఁడవు వసుకర్తవు. వసువాసప్రదుండవు. యజ్ఞస్వరూపుఁడవు. యజ్ఞేశుఁడవు. యోగివి. యతియోగకరేశుఁడవు. యజ్ఞాంగధారివి. సంకర్షణుఁడవు. ప్రలంబమథనుండవు. మేఘఘోషస్వనోత్తర్ణ వేగలాంగలధారివి. జ్ఞానిజ్ఞానమూర్తివి. నారాయణుఁడవు. పరా

యణుఁడవు. అమృతుఁడవు. బంధువవు. నరకోత్తారకుఁడవు. నతవత్సలుఁడవు.
ఇట్టినీకునమస్కారము లొనరించువాఁడను. 1098

చ. తనుజము మానసోద్భవము దారుణరూపమునౌమలంబు నో
వనజదళాక్ష తూళిన మవారితశక్తిని జేయ నీవు త
క్క నితరుఁ డెవ్వఁడేఁగలఁడె కావున సంసృతి రోగమెల్ల నీ
ఘనకృప నమ్మి మానియిటఁ గానఁగ వచ్చితి నిన్నుఁ గేశవా. 1099

ఉ. కావున నీదుసంగతి నికామము నాకుఁ బొసంగుఁగాక నా
కీవిధి లాభమబ్బఁగల దెల్లవిధంబులఁ గేశవా హరీ
యావిలమై మహాపదల కాలయమౌచు నపారమై భవం
బావహిలుఁగదా యనుచు నాత్మ నెఱింగితి నీదుసత్కృపన్. 1100

క. తాపత్రయ బాధితుఁడనె, యై పాలకమూర్తి వనుచు నంబుజనేత్రా
యీపట్టున నీశరణము, వే పొందితిఁ గావవయ్య విబుధార్తిహరా. 1101

సీ. నీదగుమాయచే నెఱి జగంబంతయు నాచ్ఛాదితంబు లోభాదికముల
నాకర్షితంబు నట్లౌట నిన్నే నేను దిక్కంచు నమ్మి యీతీరునఁ దమి
సేవింపవచ్చితి; దేవేశ సంసారమందున్న దేహికి నరయ సుఖము
సుంతయు లేదును మ్మెంతయుఁ దలపోయ నెట్లెట్లునీయందు హృదయ మొప్పు

తే. నట్లె ఫలరహితంబగు నమలసుఖము,శాశ్వతమ్ము లభించును జ్ఞానమెల్లఁ
బోయెఁ గష్టములకును గాపురముజగము, కావు గోవింద భవభయకలితునన్ను.

క. తరియింపఁదగక కడుదు,ర్భరమోహజలావృతమగు భవనీరధి శ్రీ
వర మున్గితి యుద్ధర్తవు, కరుణానిధి వీవె కావె కలఁడె యొరుఁ డిలన్ 1103

చ. అనియిటు శ్వేతభూమిపతి ఖ్యాతిఁ జెలంగెడు క్షేత్రవర్యమం
దునిటులు సన్నుతింప హతధూర్తుఁడు శ్రీపతి వానిభక్తి నె
మ్మనమున నూహ చేసి సురమండలి తన్గొలువంగ రాజుముం
దు నిలిచె నీలమేఘమనఁ దోఁచుతనుద్యుతి యొప్పుచుండఁగన్. 1104

చ. సరసిజపత్రనేత్రములు చాల మనోజ్ఞములై కనంబడన్
నిరుపమదీప్తిమండలవినిర్మలమై తగుచక్రవర్యమున్
గరమునఁ దాల్చి పాలవలెఁ గన్పడుకాంతిని నిర్మలంబుగాఁ
బరఁగుచుఁ జంద్రతుల్యము పావనమై యసమానమై కడున్. 1105

క. తన వారు పాంచజన్యము,వనజాక్షునిహస్తమందు భాసిలుచుండన్
వినతాకనిష్ఠజధ్వజ,మున నొప్పుచు సిరులువెలయ మొనకొని గదనున్. 1106

క. ధరియించి శార్ఙ్గచాపము,కరమున మెఱయంగఁ బల్కె క్ష్మాపాలక నీ
వరమతి నుతింపఁదగు నా, కురుమోదము గల్గెఁ గోర్కు లొసఁగఁ దలఁచితిన్.

క. ఎదికోరఁగ నీమనమునఁ,గుదురునొ వాంఛితము దానిఁగోరికొను మొసం

గెద సుప్రసన్నమతినై, తిఁ దగన్ నాఁ గంజనేత్రు దివ్యోక్తులకున్. 1108

ఆ. అమృతధారలకు మహాహర్షముం గాంచి, నట్టు లలరి శీర్ష మంఘ్రిమూల
ములను సోఁక మ్రొక్కి మురహారునకు నిట్టు, లనియె భక్తిభరితమనము తగఁగ.

మ. పరమేశా భవదీయపాదభజనస్వాంతుండనై నట్లు మీ
రురుచిత్తంబున నెంచుటల్ నిజమయే నొప్పారుచున్నట్టిస
ద్వరమున్ గోరెద బ్రహ్మలోకమునకుం బైబై లయం బెన్న లే
క రహిం బొల్చుచు వైష్ణవంబయి కనం గాంతంబుగా నొప్పుచున్. 1110

క. పరిశుద్ధంబయి విమలం, బరయన్ సంసారరూపకార్ణవభీతిం
బరిహారణము చేయుచుఁ దగి, విరజంబయి యొప్పు పదము వే పొందఁగన్. 1111

క. మనమునఁ గోరెద నీదగు, ననుకంపన్ వాసుదేవ; యనవిని హరి యి
ట్లను విబుధులు మౌనులు సిద్ధనిచయమున్ యోగిజనులు తపము సలిపియున్.

ఆ. దేనిఁ బొంద లేరొ దివ్యమౌ నప్పదం, బునకుఁ బోవఁ జాలుదు నరనాథ!
రాజ్యరూపసుధ విరాజిల్లఁగాఁ బరి, పాలనంబు చేసి భక్తుఁడవయి. 1113

క. లోకప్రకరంబులనున్, వే కడచి సునిర్మలముగ విలసిల్లుచు న,
స్తోకమహిమంబునం దగు, నాకమ్రపదంబు గనుము నరవర! ప్రీతిన్. 1114

సీ. నీకీర్తి మూఁడగు లోకంబులను దాఁటి నాదుసాన్నిధ్యంబునం జెలంగఁ
గలదు; దానిన్ దేవగణము దానవులును శ్వేతగంగ యటంచు వినుతి సేయు
దురు; కుశాగ్రంబున నరవర యీ క్షేత్ర మందొప్పు జలమును హర్ష మలర
స్పృశియింప స్వర్గంబు చేకురు; మద్భక్తు లాత్మసమాహితులగుచు నీవు

ఆ. పూజ చేసినట్టి పుణ్యదప్రతిమను, మాధవాహ్వయమున మహిఁ బ్రసిద్ధిఁ
గనిన దీనిఁ జంద్రకాంతరుచిం దగి, క్షీరశంఖనిభతఁ జెలఁగి మఱియు. 1115

క. పాపావళిఁ జెందుచు స్థిర, మాపద్ధతి ధర్మమందు నవని దగంగా
నేపునఁ జేయుచు నొప్పెడు, నీపరమప్రతిమఁ గాంచి యెవఁడు నతితతుల్. 1116

క. ఒనరించునో యామనుజుం, డనుపమమత్ప్రీతి కర్హుఁడై లోకౌఘం
బును దాఁటి నాదులోకం, బున వెల్గును జాలకాలము మనుజనాథా. 1117

క. సురకన్యలు తనుఁ గొల్వఁగఁ, జిరకాలము నందెయుండు క్షితిపై మన్వం
తరములు చెల్లిన వెన్క, నతఁ డాతం డందు సిద్ధనాథార్చితుఁడై. 1118

సీ. గంధర్వసేవ్యుఁడై క్రమభోగమ్ముల ననుఁగూడి పొందుచు మనుజలోక
మున నవ్వలం బుట్టి భూదేవుఁడై తగి వేదవేదాంగాళివేత్త యగుచు
భోగియై చిరకాలమును జీవితం బొగిఁ గని గజహయరథ కలితుఁ డగుచు
ధనధాన్యయుతుఁడయి తనయులఁ బౌత్త్రులఁ గనుచు రూపంబున ననుపమానుఁ

తే. డగుచుఁ బురుషోత్తముని భక్తి నలరఁ జేసి
యీస్థంబునఁ దగు వటవృక్షమూల

తలమునం దబ్ధిసన్నిధిఁ దనువు విడిచి
నను దలంచుచు ముక్తిని గను ధ్రువంబు. 1119

# ఏఁబదియేడవయధ్యాయము

అష్టాక్షరమంత్ర కవచ వివరణము.

చ. అనిపరమేష్ఠి మౌనులకు నానృపుయత్నముఁ దెల్పి ప్రీతి ని
ట్లనియెను శ్వేతమాధవుని యంతికమందును మత్స్యమాధవుం
డనఘుఁడు పొల్చు సాగరములన్నియు నొక్కటిగాఁ జెలంగి భూ
మిని గ్రసియించి నిల్చుతఱి మించినశక్తిని రోహితాకృతిన్. 1120

చ. శ్రుతులను దొంగిలించి చనుసోమకునుండి శ్రుతుల్ గ్రహించునా
దృతి విలసిల్లె నంతట నహీనరసాతలమందునున్న యీ
క్షితిసతి నుద్ధరించి మును చెందిన కీర్తిని బెంపఁగోరి మ
త్స్యతనువుఁదాల్చె మాధవుఁడు తద్దయుభక్తిఁ దదీయమూర్తికిన్. 1121

చ. వలగొని మ్రొక్కినం దొలఁగు వంత లవెట్టివెయైన దివ్యమై
విలసిలు ముక్తి యబ్బు నెటవిష్ణువు తా వసియించియుండునో
యల హరిముఖ్యవాసమున హరిసుఖంబులఁ బొందుచుండి యీ
యిలపయిఁబుట్టి వచ్చి పృథివీశుఁడుగా జనియించు నాతఁడున్. 1122

సీ. మత్స్యమాధవమూర్తి మహితభక్తిని గొల్చి దుస్సాధ్యుఁ డగును శత్రుతతికెల్ల
దాతయు మిగులభోక్తయు యజ్వయును విష్ణుభక్తుండు సత్యైకవాది సత్య
సంగరుండును, నయి చక్రియోగంబునఁ బరమపదంబును బడయు నిదియె
మత్స్యమాధవునిదౌ మహిమము మునులార! యామూర్తి దర్శింప నఖిలకామ

ఆ. ములనుబొందు ననఁగ మును లిట్లు ప్రశ్నించి
రోమహాత్మ వినఁగ నూహపొడమె
సాగరమున మున్గి జనులుమార్జన మెట్లు
చేయఁదగునొ దాన సిద్ధియెట్లొ. 1123

క. దానం గల్గెడు ఫలముల, మానక వచియింపు మన్న మౌనులఁగని యా
సూనాంబకపితృసూనుం, డూనినమోదమునఁ బల్కె నుదధివిధులనున్. 1124

క. పరమంబగు భక్తిని సాగరమున విధులన్ని తీర్పఁగాఁ బుణ్యంబౌ
నరునొందు మృకండుమునీ, శ్వరసూనుహ్రదమ్మునందు స్నానము విధిమై. 1125

క. ఒనరింపందగు ముందుగ, మునులార! చతుర్దశిని బ్రమోదముమీఱం
గనుజేసిన స్నానము పాపనికరముల్ బొఱిద్రోలు భద్రముల నిడున్. 1126

క. ఆరీతి నుదధి స్నానము, సారవిధిం జేయవలయు సతతము విధిచే

గోరికఁ బున్నమతిథియం, దారీతిం జేయ నబ్బు హాయమఖఫలముల్. 1127
సీ. ఒనర మార్కండేయు ఘనవటద్రుమమును శ్రీకృష్ణు బలదేవు సింధువరము
ననునివి యొప్పెడు నైదుతీర్థము లన జ్యేష్ఠమాసమునందు శ్రేష్ఠమైన
పున్నమయును ఫలముల నీయఁజాలు జ్యేష్ఠాఖ్యనక్షత్ర మేయదనునఁ గనఁ
బడునో యావేళ నీభద్రదమహా తీర్థపంచకమును జూడఁ బరమభక్తిఁ
తే. బోవఁగాఁ జనుఁ ద్రికరణములను శుద్ధుఁ
డయి యనన్యమానసుఁడయి యఖిలయుగ్మ,
ములను విడనాడి మత్సరమును ద్యజించి
వీతరాగుండునయి యాత్రవిధుల నెఱిఁగి. 1128
క. చనవలయుఁ గల్పవృక్షం, బననొప్పు వటంబుగాంచి యటఁ బుష్కరిణిం
గని గ్రుంకి యందును జనా, ర్దనునిఁ దర్శించి మ్రొక్కఁ దగు ముమ్మాఱుల్.
తే. ఎవనిదర్శింపఁ బాపాళు లెల్ల నేడు
జన్మములఁ జేసినవి పోవు సకలపుణ్య
ములును విలసిల్లు వాంఛితములు లభించు
నతనినామములను మీకు నభినుతింతు. 1130
తే. ప్రతియుగంబున నవియె సమ్మతములగును
వరుసఁ గృతయుగముఖముల వఱలు నవ్వి,
వట,వటేశ్వర నామముల్ భాసమాన
ములు కృతమునను త్రేత నవ్వల వినుండు. 1131
సీ. పూర్వనామము ద్వాపరోర్విని విఖ్యాత మవ్వలి దౌకలియందుఁ దగుఁబు
రాణపురుషమను రమ్యనామము వటనామము లివి మునినాథులార
పూర్వోక్త మగుమంత్రమున వృక్షమునకు నమస్కారమొనరించి మహితభక్తి
దక్షిణాభిముఖుఁడై ధనువులు మున్నూఱు లెంతదూరము క్రమ్మియెసఁగునంత
తే దవ్వునం గన్పడుఁ హరి ద్వారమద్ది
స్వర్గమున కేగ సాగరాంభఃప్లుతంబు,
క్షేత్ర మయ్యది సుగుణరాజిని దనర్చు
నందుఁగల విష్ణువునకు మ్రొక్కందగుఁదమి. 1132
క. నిరుపమభక్తిం బూజా, పరతంగని యర్చనముల భద్రుఁ గొలువన్
బరుగిడు రోగపిశాచో, త్కరములు పాపములు మానిగణపతులారా. 1133
క. తొలి యుగ్రసేనుఁ గన్గొని, జలనిధినిం గానఁబోయి చక్రిఁ బరేశున్
జలజాక్షుఁ దలఁచి వార్చుచు, మలరాశి హరించునట్టి మంత్రవరంబున్. 1134
సీ. అష్టాక్షరంబును నఖిలవాంఛాప్రదం బాదృతిఁ బాటించి హస్తదేహ
ముల దానివిన్యాసమున నెన్నవలయు; నారాయణశబ్దంబు నాద్యవర్ణ

ముగ నోంకృతిని జేసి తగఁ జతుర్థ్యంతముగను బల్కవలయు నెట్లన వినుండు ప్రణవము దానికిఁ బ్రక్కననే నమశ్శబ్దంబు నద్దానిసన్నిధాన

తే. మందు నారాయణాయ యనందగుపద
మాదృతింజేర్ప నష్టాక్షరాభిధాన,
మంత్ర మగు నేమనుష్యుఁ డామంత్రరాజ
ముచ్చరించునో ముక్తి కర్హుఁ డతఁడౌను. 1135

చ. మనసున కెంతో భ్రాంతి దగుమాడ్కి నొనర్చెదు వేలుమంత్రముల్
గొనకొనిపల్క నేల? మదిఁగోరెడు కోర్కుల నిచ్చు దీనినే
యనిశము సంస్మరింపఁదగు; నప్పులు లోకమునందుఁ బేరుఁగాం
చెను నరసూను లంచు నవె చెప్పఁబడుం బరమాత్మరూపతన్. 1136

తే. అవ్వి నారములను పేరునందె నవియె
యయనమాట నారాయణుం డనఁగఁ జక్రి,
తనరు; నారాయణపరంబు లనఁగఁజెల్లు
జగములెల్లను మునులార సత్య మిద్ది. 1137

వ. సురలు నారాయణపరు లగుదురు. సత్యము నారాయణపరంబు. పదము నారాయణపరంబు. పృథ్వి నారాయణపరయగు. జలము నారాయణపరంబు. వహ్నియు నారాయణపరంబేయగు. నభంబు నారాయణపరంబే. వాయువుమనస్సు, బుద్ధ్యహంకారములు, భూతభవ్యభవిష్యములు సకలంబు నారాయణపరంబెయని చెప్పంబడు. స్థూలసూక్ష్మభేదంబుల నలరుప్రాణికోటి యంతయు నారాయణపరంబె యని నమ్ముఁడు. శబ్దాదివిషయంబులు, శ్రోత్రాదీంద్రియంబులు ప్రకృతిపురుషులు నారాయణాత్మకులే యగుదురు. జలస్థలపాతాళస్వర్గలోకాంబరనగంబుల నావరించి పరాత్పరుఁడగు నారాయణుం డుండు. విశేషించి వచియింపనేల? చరాచరప్రపంచమెల్ల నాబ్రహ్మస్తంబపర్యంతము నారాయణాత్మకంబ యగు. 1138

క నారాయణుకంటెఁ బరం, బేరీతిం గనిన వేదహీనత నతఁడే
సారంబని చెప్పంబడు, నారాయణుఁ డతఁడె జగమునకా వ్యాప్తుండై. 1139

తే. వెలుఁగుచుండుఁ జరాచరంబులన నొప్పు
నవియుఁ దన్మయములె యంచునరయఁ దగును;
జలము లాయతనంబు లాచక్రి కతఁడె
యంబుపతి యగుఁ గావున నంబువులను. 1140

క. స్మరియింపం దగు నాతనిఁ;బరుఁ డానారాయణుండు పాపద్రుమభీ
కరపరశు వాట మజ్జన,తరుణంబున సంస్మరింపఁ దగు నాచక్రిన్.

క. మనమున ధ్యానింపం దగుఁ,దనయంగములందు నెల్లఁ దద్రూపము నే

వినివేశింపం జను నెట్లనఁ దెల్పెద మౌనులార హరికథ వినుఁడీ. 1142

వ. ఓంకార నకారంబు లంగుష్ఠమందును హస్తంబులందును దర్జన్యాద్యంగుళు
లందు శేషాక్షరంబులును న్యాసక్రమంబున భావింపవలయును. మరల నోంకా
రమును వామపాదమందును నకారము దక్షిణాంఘ్రియందును, మోకారమును
వామకటిభాగమందును, నాకారము దక్షిణకటియందును, దలంపవలయును.
నాభిని రాకారంబును, వామబాహుకంబున యకారంబును, దక్షబాహువున
ణాకారంబును, మూర్ధంబున యకారంబును న్యసింపవలయు. ఊర్ధ్వాధో
హృదయపార్శ్వపృష్ఠాగ్రభాగంబుల నారాయణుం డున్నట్లుధ్యానింపవలయు.
ఇట్లు న్యాసప్రకారంబున భగవంతుని ధ్యానించి పిదపఁగవచంబును బ్రారంభిం
పఁదగు. తద్విధం బెట్టులనిన. 1143

సీ. పురుషోత్తముఁ డేలెడుపూర్వమ్ము గోవిందుఁ డెల్లదక్షిణము నా యనఘమూర్తి
మధుసూదనుఁడు పశ్చిమము శ్రీధరుండు నుత్తరముఁ గేశవుఁడునుదహనుభాగ
మును విష్ణుమూర్తియు దనుజుభాగమ్ము మాధవుఁడు వాయవ్యము ధర్మమూర్తి
యైనహృషీకేశుఁ డాహరుభాగము వామనుండును గావవలయు భూత

తే. లమును వారాహమూర్తి యూర్ధ్వముఁ ద్రివిక్ర
ముఁడును గాపాడవలయును మొక్కలముగ;
ననుచుఁ గవచంబుఁ జింతించి యవలఁ దన్ను
ధ్యానమున నెన్న వలయు నిట్లని దృఢముగ. 1144

క. దరచక్రగదాభయధర, కరుఁ డగునారాయణుఁడనుగా నే నైతిఁ
బరిరక్షకుఁడ నటంచని, కర మాత్మఁ ధ్యానయోగకలితుండగుచున్. 1145

తే. తలఁపవలయు నీమంత్రంబు నుదాత్తమహిమ
మునఁజెలంగెడుదాని నత్యనుపమమును;
"నీవెయగ్నివి ద్విపదౌఘభూవిభుఁడవు
మఱియు రేతోధసుఁడవు కామదుఁడ వీవు. 1146

సీ. సర్వభూతములకు శరణదుండవు ప్రధానుఁడవు జీవములకుఁ బుడమిపతివి
చ్యుతిలేనివాఁడవు సుధకును జనకుండ వమరయోనివి సలిలాధినాథ!
నాభూరిపాపసంతతుల హరింపుమా తీర్థరాజ నమస్తతిని గ్రహింపు"
మని యుచ్చరించుచు ఘనభక్తి విధియుక్తి స్నానంబు చేయంగఁజనును;మఱొక

తే. విధముగానైన స్నానంబు విపులఫలద,మునఁగఁ జెల్లదు స్నాన మిట్లొనరఁజేసి
యవల నబ్దైవతము లగునట్టిమంత్ర,ములను నభిషేకమార్జన ములను సలిపి

క. సలిలాంతర్భాగంబున, నిలిచియొ యఘమర్షణమును నిశ్చలభక్తిఁ
బొలుపారఁగ జపియింపఁ,వలయును ముమ్మాఱు లద్దిబహుపాపములన్.

క. హరియించు నశ్వమేధా,ధ్వర మెట్టిదొ సూక్తమిద్ది తాదృశ మనుచున్.

బరికింపవలయు నవ్వేల,శరనిధి వెల్వడి సుధౌత సాధ్వంబరముల్. 1149

క. ధరియించి యాచమించుచుఁ, బరమేశ్వరు మదిని నిల్పి పాయనిశ్రద్ధా
భరమునఁ బ్రాణాయామము,సరిగా నొనరించి సరసిజసఖు ఘనరుచిన్. 1151

తే. మది నుపాసించి పైఁజూచి మహితపుష్ప
మండితాంజలి యిడి బాహుదండయుగము
నూర్ధ్వభాగా భిముఖమయి యొప్పఁ జేసి
మంత్రముల సూర్యభగవంతు మహిమ మెన్ని. 1151

క. పావని గాయత్రిని శ్రీ,దేవిని నష్టోత్తరశత దీవ్యత్సంఖ్యక
వావిరి జపియింపం దగు,నావిధి సౌరాదికముల నంతశ్శుద్ధిన్.

తే. శ్రద్ధగా జపియించి సూర్యభగవంతు,నకు నమస్కార మొనరించి న్యాయవిహిత
మైనయాసనమున శుచిమానసమ్ము,తనరఁ గూర్చుండి వేదమంత్రముల నెల్ల.

సీ. పారాయణముచేసి భక్తి దేవతలకు మనుజులకుం బితృమండలికిని
దర్పణంబులు చేసి తగ నన్యులకు నామగోత్రముల్ చెప్పి పవిత్రవిధిని
దిలమిశ్రితములైన జలములఁ దర్పణమును జేయఁ దగుఁజూఁడి మున్ను దేవ
తలకుఁ దర్పణము నితాంతభక్తిని జేయ నవ్వలఁ బితృతర్పణాధికారి

తే. యగును;మునులార శ్రాద్ధకృత్యంబునందు
నన్నకాలంబునందును హస్తమొండు
తనరు నుపయోగపఱుపంగఁ దర్పణమున
హస్తయుగమును గూర్పనౌ ననిరి బుధులు. 1154

వ. అన్వారబ్ధసవ్యహస్తంబు దక్షిణహస్తంబుతోఁగూర్చి నామగోత్రము లుచ్చరించి తృప్తినొందుదురుగాక యని వాగ్యతుండై యుచ్చరింపఁదగు. కాయస్థంబులగు తిలలచే నెవ్వఁడు మోహంబునఁ బితరులకుఁదర్పణంబుచేయునో యతఁడు పితరులకుఁ ద్వాఙ్క్షాంసరుధిరాస్థులచేఁ దర్పణంబుచేసిన పాపంబు ననుభవించు. కావున నంగస్థతిలలచేఁ బితృతర్పణము చేయరాదు. ఆయుదకము రుధిరంబగు. దాన దాత కిల్బిషముల నొందు. జలములందుండి తర్పణోదకంబుల భూమిపై విడిచిన నాతర్పణము నిష్ఫలంబు. దానిఫలం బెవ్వనికిం జెందదని తెలియం దగు. స్థలముననుండి జలములఁ దర్పణోదకంబు విడిచిన నదియు నిష్ఫలంబె యగు. ఉదకమునందు నుదకమునుబితృతర్పణంబునఁ గూర్పరాదు. ఒడ్డునఁబరి శుద్ధస్థలంబునఁ గూరుచుండి యుదకతర్పణంబు చేయవలయును. ఉదకములం దును, పాత్రమునందును ఏకహస్తంబునఁ దర్పణంబుచేసిన నాజలంబుపితరులం జెందదు రెండుచేతులచేఁ దర్పణముచేయం దగు. పితరుల కక్షయస్థానము భూమియని నాచే నేర్పఱుపఁబడియె. కావున నందే పితృతర్పణోదకమునువిడు వవలయు. భూపృష్ఠంబునం బుట్టుదురు. భూమియందు నివసింతురు. భూమియం

దేలయంబుఁ గాంతురు. కావున భూమియందే తజ్జలంబు విడువందగు. సాగ్ర దర్భలను బ్రాచీనాగ్రంబులుగా దేవకార్యంబులందును దక్షిణాగ్రంబులుగఁబితృ కార్యంబులందును మంత్రములచేఁ బఱచి యందుఁగృత్యంబుల నొనరింపందగు. అని పలికి మఱియుఁ జతురాననుం డిట్లనియె 1155

---

ఏఁబదిరెనిమిదవయధ్యాయము.

భగవత్పూజా విధి నిరూపణము.

క. సురలను బితరుల మఱియు ని
తరులను దర్పణపువిధి నితాంతము ముదముఁ
బరమాదృతిఁ గనఁ జేయుచుఁ
బురుషుఁడు వాఙ్నియతిమీఱఁ బురమొందుచటఁ. 1156

తే. హస్తమాత్రము నాలుగేయైన కోణ, ములను ద్వారంబులం దగియలఘురీతి
నలరునట్లుగ లిఖయించి యబ్ధితీర,మందుఁ దత్పురమధ్యంబునందుఁ బూన్కి.

సీ. ఎనిమిదిదళములఁ దనరుపద్మంబును విలిఖించి కర్ణికాన్వితముఁ జేసి
యిట్లుమండలమును నెల్లవిధంబులఁ దగుదాని లిఖయించి ధరణిదేవ
వర్యులారా! పూజ వరుసఁ జేయం దగుఁ;నష్టాక్షరవిధాన మలర నజుని
విభుని నారాయణు విమలభక్తిని బూజనములఁ దృప్తుంజేయ నమరు ముక్తి;

తే. కాయశోధనపద్ధతి న్యాయసమ్మ
తముగ వచియింతు దనదుహృదయమునం ద
కారమును జక్రరేఖావికార మొప్పఁ
దలఁపవలయును సాధకోత్తముఁడు నియతి. 1158

వ. పాపనాశనంబయి వెలుంగుచుఁ ద్రిశిఖంబై చంద్రమండలమధ్యస్థంబైన రాకారమును శిరంబునఁ జింతింపవలయును శుక్లవర్ణంబై యమృతమును గురియుచు దాన భూమిని దడుపుచున్నట్లు ధ్యానింపవలయు. ఇట్లుతలంచిన నిర్ధూత పాపజాలుండై సాధకుఁడు దివ్యదేహము గలవాఁడగు. పిదప మంత్రరాజంబగు నష్టాక్షరము నాత్మయందు న్యాసవిధిఁ దలంపం జను. అది వామపాదము మొదలు క్రమముగఁ జేయవలయును. వైష్ణవంబగు పంచాంగమును, జతుర్వ్యూహంబును వరుసధ్యానింపవలయు. తొలుతమూలమంత్రమునఁ గరశుద్ధి చేయవలయు. మంత్రరాజాక్షరంబుల నొక్కొక్కదాని నొక్కొక్కయంగుళి యందు వేఱువేఱుగా విన్యసింపఁజను ఓంకారమును బృథ్వీస్వరూపముగను శుక్లవర్ణముగలదిగను వామపాదంబునందును, శాంభవంబై శ్యామవర్ణంబగు నకారమును దక్షిణపాదమందును, కాలస్వరూపంబగు మోకారమును వామకటి

ప్రదేశమందును, సర్వబీజభూతంబగు నాకారమును దక్షిణకటితటంబునందును,
తేజోబీజంబగు రాకారంబును నాభిదేశమందును, వాయవ్యంబనఁబడు యకా
రమును వామస్కంధమందును, సర్వగంబగు ణాకారమును దక్షిణస్కంధంబు
నందును, యకారమును సర్వలోకాశ్రయంబగు శీర్షంబునందును విన్యసింపవల
యును. మఱియు "నోంవిష్ణవేనమః" అను దానిచే శిరంబును, "ఓంజ్వలనాయ
నమః" అను దానిచే శిఖయు, "ఓంవిష్ణవేనమః" యను దానిచేఁ గవచంబును,
ఓంవిష్ణవేనమః "అను దానిచే దిగ్బంధంబును, "ఓంహుంఫట్" అనుదానిచే
నస్త్రంబును విన్యసించినట్లు తలంపవలయును. శిరస్సు శుక్లవర్ణవిశిష్టవాసుదే
వుండని, రక్తవర్ణవిశిష్టసంకర్షణుఁడు, గరుత్మంతుఁడు తేజస్సు, ఆదిత్యుఁడు
ను లలాటంబని, వాయుమేఘంబగు ప్రద్యుమ్నుఁడు గ్రీవాభాగంబని,కృష్ణుం
డని రుద్ధుండు సకలశక్తి సమన్వితుండాంబీజరూపుండు హృదయంబని, యిట్లు
చతుర్వ్యూహంబె తనదేహంబుగా ధ్యానింపవలయు. పిదపఁ గవచంబును దలం
పవలయు. అవ్విధం బెట్టిదనిన. 1159

సీ. ఎదుటనిల్చియె విష్ణు వీనన్నుఁ గాపాడుఁ జక్రికేశవుఁడు పృష్ఠంబుగాచు
దక్షపార్శ్వమ్మును రక్షించు గోవిందుఁ డలమధుసూదనుఁ డవలిపార్శ్వ
మును,నూర్ధ్వమౌభాగమును గాచు వైకుంఠుఁ డవనినివారాహుఁ డల్లప్రోచు
నల్లె యవాంతరమగు దిగ్వితతిఁ గాచు మాధవుఁ డరుగంగ మహినినిల్వ
తే. మేలుకొనియుండ శయనింప మించుశక్తి,శ్రీనృసింహుఁడు గాపాడుఁ జిత్రరీతి
వాసుదేవమయుండను భాసురుండ, ననుచు విష్ణుమయుం డయియవల నియతి.

క. తనువున నెట్లో యద్దేవునిపై నటు దత్త్వవితతిఁ బొలుపొందంగా
నునుపం దగు న్యాసవిధిన్,వినుఁ డవ్వలఁ బ్రోక్షణమును విమలమనీషన్. [ము

సీ. ప్రణవంబునట దానిఁ బొటింపనగును ఫట్కారాంతముగఁజేయఁ గలుగు శుభ
లార్తులు తొలఁగు; నందర్కచంద్రాగ్నులకును మండలములు తగునొనరింపఁ
బద్మమధ్యమునందుఁ బరమేశు విష్ణువు విన్యసింపందగు విమలబుద్ధి
నోంకృతి హృదయైకపంకజమ్మున జ్యోతిగా విన్యసింపనౌఁ గర్ణికపయి

తే. నలరుచున్నసనాతను ననఘు జ్యోతి
రాకృతిందగువానిగా ధ్యానయోగ,
మునను దలఁపంగఁదగు మంత్రమును యథాక్ర
మముగ నష్టాక్షరమును న్యాసము నొనరిచి. 1162

వ. ఆమంత్రముచేత వ్యస్తసమస్తభేదంబునఁ బూజనము చేయవలయును. ద్వాద
శాక్షరమంత్రంబున భగవంతు నారాధింపఁజను. శ్రద్ధాయుక్తుఁడై హృదయ
మందును, గర్ణికయందును,వెలుపలను న్యాసవిధినొనర్చుట శుభము మఱియు.

చ. కరములునాల్గుగల్గి తనుకాంతి విభాకరకోటితుల్యమై

పరఁగ మహాబలంబు దగ భద్రుఁడౌచుసనాతనుండునై
రుపమని తేజమే తనువు నిశ్చయమిద్ధి యనంగ నొప్పి ని
ర్జరగణసేవితుండయిన చక్రిఁ దలంచెద నంచు నెంచుచుఁ. 1164

తే. అవలమూ నసపంకజమందు దేవుఁ
బోల నావాహనము క్రమంబుగ నొనర్చ,
వలయు ఋషరూపుఁడై కిటివర్యుఁ డగుచు
నారసింహుఁడు వామనుఁడై రహిఁగని. 1165

క. వరదుఁడు నారాయణుఁడుగఁ, బరికీర్తితుఁడైన యట్టి పరమేశుఁడు స
త్వర మేగుదెంచుఁగా కని, వరమంత్రముచేతఁ బిల్వవలయుం జూండీ. 1166

వ. ఇది యీ వాహనక్రమంబు. ఈయర్చనంబున నష్టాక్షరమహామంత్రం బె యుచ్చ
రింపం దగు ననిసర్వత్ర యెఱుంగునది. సుమేరుపాదపీఠాంతంబునఁ బద్మకల్పితా
సనమును ధ్యానించి యందు నోమధుసూదనా సర్వసత్త్వహితార్థము వసింప
వలయునని పూర్వోక్తమంత్రరాజంబున నాసనస్థాపనము చేయవలయు. త్రై
లోకపతులకధిపతియై దేవదేవుండైన హృషీకేశునకు నమస్కార మనిపూర్వవి
హితమంత్రము నుచ్చరింపవలయు. ఇదియర్ఘ్యవిధానము. పద్మనాభా, సనాత
నా, కమలపత్రాక్షా! మధుసూదనా, ఇదెపాద్యమర్పింతు నని మంత్రమును
స్మరింపఁజను ఇదిపాద్యవిధానము. మహాదేవా, పురుషోత్తమా. నీకొఱకు బ్రహ్మా
దులచేఁ గల్పితంబగు నీమధుపర్కమును గ్రహింపుమని ప్రార్థించి ప్రాగుక్తమం
త్ర ముచ్చరించు టొప్పు. ఇది మధుపర్కపద్ధతి. పరమపూరుషా. యీసలిలము
మందాకినీ నదీవరసమానీతము. శీతలము. శుభప్రదము. సర్వపాపహరము. దీని
నర్పించెదను. అనిముందుఁ బేర్కొన్న మంత్రమును ధ్యానింపవలయు. ఇదియా
చమనసమర్పణరీతి. లోకేశ్వరా! నీవేజలము. పృథివియు జ్యోతిస్సు వాయువు
నీవే. ఇట్టినీకు వృత్తిమాత్రమున జలముచే స్నానమునుగల్పించుచున్నవాఁడ.
అని మంత్రవర్యము నుచ్చరింపఁదగు. ఇది స్నానమార్గము. 1167

సీ. దేవ తత్త్వాన్విత దివ్యమహాయజ్ఞ వర్ణసమన్విత స్వర్ణవర్ణ
తనుకాంతిరాజితా దామోదరా వస్త్రయుగము సమర్పింతు నొప్పుకొనుము
యని మంత్రరాజంబు నభిమతఫలదంబు సంస్మరింపంగను జను నిదివస
నముల నర్పించెదు సమయమునఁ,కేశవా నీదుశరీరంబు నేనెఱుంగ

తే. నీదుచర్యల నెఱుఁగంగనేర దివ్య, గంధమర్పింతుఁ గైకొను కమలనాభ
యనుచు మంత్రము పలుకంగ నగును నిదియె, యగువిలేపనపద్ధతి యనఘులార

తే. శతధృతియు ఋగ్యజుస్సుల సామవేద
మును ద్రివృతముగఁ దా నొనర్చెను మఱియును,

భవ్యసావిత్రికాగ్రంథి పరియుతముగ
నట్టియుపవీత మర్పింతు ననుచు వేఁడి 1169

ఆ. మంత్ర ముచ్చరించి మహితయజ్ఞోపవీ, తము నొసంగవలయు; నమలరత్న
సమధికాంగవహ్ని జలజసఖప్రభా, దివ్యభూషణములు దేవదేవ. 1170

క. నేనర్పించెదఁ గైకొను, మా నీరజనాభయనుచు నమలకలాపం
బూనిన శ్రద్ధ నొసంగుచు, మానితమంత్రంబుఁ బలికిమనుజుఁడు పిదపన్. 1171

వ. మంత్రరాజంబు నుచ్చరించుచు భగవంతుని బూజింపవలయు. దివ్యమగువనస్ప
తిరసంబు గంధాఢ్యంబు సమర్పించెద. పరిగ్రహింపు మని మంత్ర ముచ్చరింప
వలయును. ఇదిధూపపద్ధతి. విద్యుత్తునుమించి సూర్యచంద్రతేజస్సులంబోలిన
దీపము సమర్పించెద ప్రతిగ్రహింపు మనిమూలమంత్రము చింతింపవలయు. ఇది
దీపప్రదాననియమము. చతుర్విధంబై, షడ్రసాన్వితంబై మహితంబునగు నన్నమ
ర్పించెద నంగీకరింపుమని మంత్రరాజము నుడువఁదగు ఇదినైవేద్య విధాన
ము. మఱియు. 1172

సీ. వాసవుదిక్కున వాసుదేవుండును గాలుని దెసను సంకర్షణుండు
పడమరదిక్కును బ్రద్యుమ్నుఁడుత్తరమ్మును బూన్కినిరుద్ధుఁడునుముదమున
నాగ్నేయమును వరాహావతారంబును నైఋతిదిక్కును నారసింహుఁ
డనిలభాగమ్మును నలమాధవుండును విషమాక్షుదెసను త్రివిక్రముండు

తే. గాచుఁగావుత మని భక్తి గణనచేసి
యట్లె యష్టాక్షరాఖ్య మంత్రాధిదైవ,
మునకు ముందుగ గరుడుని నునుచునట్లు
ధ్యానయోగముఁ బూనంగనౌను బిదప. 1173

క. హరివామపార్శ్వమందున, వరచక్రముదక్షిణంపు భాగమునందున్
దరముమహాగదయునునర, హరివామమునందునన్ శరాసనవరమున్. 1174

తే. ఉన్నయట్లు ధ్యానించున దొప్పుమీఱ, దక్షిణంబున నిషుధులఁ దగు నిలుపఁగ
వామమున ఖడ్గవరము శ్రీవామనయన, దక్షభాగంబునన్ నిల్చి తనరు నట్లు.

వ. ధ్యానింపవలయు. ఉత్తరంబునఁ బుష్టియు, నురంబున వనమాలయు శ్రీవత్సం
బును, గౌస్తుభంబును, నిలుపందగు. కోణంబున నస్త్రంబును విన్యసించినట్లుతలం
పవలయును పిదప నింద్రాగ్నియమదనుజ వరుణవాయుకుబేరే శానులను
క్రమంబున న్యసింపందగు. బ్రహ్మతోఁగూడ ననంతుని ధ్యానింప వలయు. వై
దికతాంత్రికమంత్రంబుల నూర్ధ్వాధోభాగంబులను బూజింపం జను. ఇట్లుమండ
లస్థుండగు జనార్దను బూజింపవలయు. ఇట్లొనరింప నిష్టకామముల సాధకుండు
పొందు. సంశయంబు లేదు. 1176

క. ఈనియమంబునఁ గేశవు, మానితమండలమునందు మహిమాన్వితుఁగాఁ

పూనికఁ బూజించి తగం,గా నందున్నట్లు చూడఁగల్గు నరునకున్. 1177
క. పరమపదం బబ్బును; నొక, పరియైనం గేశవుండు పరమంబయి శా
స్త్రరతిం బొల్చిన నీవిధిఁ, బరిపూజితుఁడైనఁ గరుణ భక్తుని నతనిన్. 1178
క. జనిమృతిజరావివర్జితుఁ,గను జేయుచుఁ బిదప ముక్తిగతిఁ గల్పించున్
మునులార వినుఁడు నారా,యణు నెవ్వఁడు సాంద్రభక్తి నర్చించు విధిన్.
క. ఆపుణ్యపురుషు శ్వేత,ద్వీపమున వసింపఁ జేయు ద్వీపవరంబై
దీపించుదాని నిప్పని,కై పరమేశ్వరుఁడు ప్రీతిఁ గల్పించెఁ జూఁడీ. 1180
ఆ. ప్రణవమాదిగాఁగఁ బరఁగి నమఃకార, మంతముగఁ జెలంగునట్టి నామ
పరమె తత్త్వవితతి వర్ణితమంత్రమౌ, నీవిధానమునసె శ్రీవిభుఁ బరు.
సీ. గంధపుష్పావళిఁ గరము నివేదించి పరుసఁ బూజింపఁగా వలయు మఱియు
ముద్రలు శాస్త్రోక్తముగఁ జూపఁదగు నదేమాత్రము వానిని మఱువరాదు
మూలమంత్రజపంబుఁ బూనిచేయందగు నెనిమిది యిరువదియెనిమిది మఱి
యష్టోత్తరశతంబులను వీనియందు యథాశక్తి జపియింపఁ దగు నియతిని;
తే. బద్మశంఖంబు లబ్జశ్రీవత్స గదలు, గరుడ చక్ర శార్ఙ్గంబులు ఖడ్గము నను
నివ్వి యెనిమిది ముద్రలం చెఱుఁగవలయు, నిట్లుపూజించి భక్తిజపించి యవల.
వ. పురాణపురుషోత్తమా! పరమస్థానంబునకు విజయముచేయుము విజయముచేయు
ము. ఎందుబ్రహ్మాదిదేవవర్యులు భవద్దర్శనంబుఁగోరుదురో యనిమూలమంత్రము
నుచ్చరించుచు విసర్జన మొనరింపం జను. ఏనరులు శ్రీహరిమంత్రంబుల భగ
వంతుం బూజింప నెఱుంగరో వారుమూలమంత్రముచేతనే యచ్యుతుం
బూజింపవలయు. అని మునులకుం దెలిపి బ్రహ్మ మఱియు నిట్లనియె. 1183

## ఏఁబదితొమ్మిదవయధ్యాయము.

### సుభద్రారామసహిత శ్రీకృష్ణమహిమము.

క. పురుషోత్తము నీవిధముగఁ, బరమవిధిం బూజచేసి వందనవితతుల్
శిరము ధరసోఁక నొనరిచి,సరిత్పతిఁ జేయఁదగుఁ బ్రసన్నునిఁగాఁగన్.
శా. భూతవ్రాతము నీవు ప్రాణముగ సమ్మోదక్రియాస్థానమై
భూతిం జెందునదీసమూహము భవత్పూర్ణస్థితిం బొల్చు సం
ఖ్యాతీతప్రియతీర్థరాజికిని బ్రాణాధార మీవే కదా
యోతీర్థాధిప నీకు వందనము సన్నాహించి కాపాడవే. 1185
మ. అనుచున్ స్నానముచేసి తత్తటమునం దానందభక్తుల్ తగన్
వనజాతాయతనేత్రు శ్రీపతిని సంభావించి పూజించి రా
ముని శ్రీకృష్ణు సుభద్రనుం దలఁచి సమ్మోదంబునం గావుఁడీ
నను దీనుం భవరశ్మిబద్ధుని విపన్నాశంబు మీకృత్యమౌ

శా. ఈరీతిన్ దృఢభక్తిమైఁ దలఁప నెన్నే నశ్వమేధక్రియా
సారప్రాంచితపుణ్యముల్ జనుఁడు శ్రీశస్ఫారమోదంబునున్
ధీరత్వంబును గాంచుఁ బాపవితతుల్ తీఱున్ మహాదుఃఖముల్
చేరంజాలక యే నశించును దపస్సిద్ధుల్ తగున్ వేగమే. 1187
మ. అమరత్వంబును గల్గు రూపము గనన్ హారిత్వ మేపారఁగా
సమరున్ యౌవన మొప్పు శాశ్వతముగా సత్యద్యుతవ్యోమయా
నమునన్ సూర్యసహస్రకాంతు లమరన్ నాకేశపూజల్ తగన్
విమలాభ్రంబునఁ బోవు యానమున వేవేపోవుఁ జక్రింగనన్. 1188
క. ఇరువదియొక్కకులంబులఁ, దరియింపం జేసి విష్ణుధామంబున సు
స్థిరుఁడై యుండును సుఖములఁ, జిరకాలం బనుభవించి సిద్ధులుపొగడన్.
తే. అచ్చరలు తన్నుఁ గొల్వ మన్వంతరశత
కాల మందుండి యేబాధ లోలి లేక
క్షితిని బుట్టును విఖ్యాతిఁ జెలఁగువంశ
మందు రూపం బతుల్యమై యలరుచుండ. 1190
సీ. వేదశాస్త్రార్థవిద్వ్రుఁడై విష్ణుభక్తిని బొలుపొందుచు ననుపమాన
వైష్ణవయోగంబుఁ బాటించి మోక్షంబుఁ బడయును;మునులార పరమయోగ
పరులార గ్రహణంబుతరుణంబునన్ రవిసంక్రాంతులను దినక్షయమునను యు
గాదులందును మఱి యాషాఢపూర్ణిమయందు బాహుళమాస మందుఁ దనరు
తే. పూర్ణిమాతిథియందును బూజ్యములగు
నితరదినములయందు నాయతమహోద
ధికిని జెంతను దానముల్ తెలిసి చేయ
ఫలము వేయిమడుంగులై చెలఁగు ధ్రువము. 1191
వ. ఆమహాసాగరతీరంబునఁ బితరులకుఁ బిండదానంబు చేయవలసిన పద్ధతిం దప్పక చేయ నక్షయసంతృప్తి పితరులకుంగల్గు. ఇది సాగరస్నానఫలంబు. దానపిండ ప్రదానఫలంబు నగు. దీనిం బఠించిన ధర్మార్థకామమోక్షముల కర్హుం డగు. ఆయుష్కీర్తు లలరు. దుస్స్వప్నఫలంబులు తొలంగు. సర్వపాపంబులు నశియించు. ఈ విధానము నాస్తికునకు వచియింపరా దని సకలతీర్థంబు లుద్ఘోషించుచుండు. పుష్కరాదితీర్థంబులు దివ్యఫలంబు లొసంగు. తీర్థరాజమనఁ బడు సముద్రము సర్వతీర్థఫలముల నొసంగుచుండు. భూతలంబునం గలనదనదీ సరస్సులు సాగరంబును జొచ్చుకతన సాగరంబు తీర్థరాజం బనువిఖ్యాతిం గాంచె. సర్వతీర్థరాజంబని సరిత్పతియని సముద్రంబు వర్ణింపంబడు. కాన సాగరస్నాన మనంతఫలప్రదంబయి యొప్పు. సూర్యుఁ డుదయింపఁ దమోనాశం బెట్టులగు నట్లు తీర్థరాజస్నానంబున సర్వపాపంబులు నశించు. తీర్థరాజసమాన

తీర్థంబు లేదని యుద్ఘోషింపం దగు. అందే నారాయణుండు నివసించుంగదా.
దానిమహిమ మెవ్వఁడు వినుతింపంగలఁడు తొంబదితొమ్మిదికోట్లతీర్థంబులందు
గలియుచుండు. కావున సాగరస్నాన దాన జప హోమమ్ములు మహాఫలముల
నొసంగు నని పలికి మఱియు నిట్లనిరి. 1192

## అఱువదియవయధ్యాయము.

### పంచతీర్థమాహాత్మ్యము.

క. జలనిధికడఁ జేయందగు, కలుషహరణకృత్యములను గావించి చనన్
వలయును యజ్ఞాంగంబుగఁ, బొలిచెడు తీర్థంబుఁ జూడ మునివరులారా.
సీ. అద్ది యింద్రద్యుమ్న మను పేరఁ బరఁగును బరమపావనము శుభప్రదంబు
నగుఁ బరిశుద్ధుఁడై యమలమనీషుఁడై యట నాచమించి శ్రీహరిని మదిని
ధ్యానించి స్పృశియించి తజ్జలంబులను నీమంత్రంబు జపియింప మహితనియతి
గొనఁదగు; హయమేధ ఘనయజ్ఞసంభూత సర్వాఘనాశన సకలశుభద
తే. తీర్థరాజ త్వదీయభూతిప్రదాంబువులను మజ్జనమొనరింతుఁ గలుషములను
బాఱఁదోలుము చేయుదు వందనమ్ము,లనుచు వచియించి విధిని మజ్జనముచేసి.
క. సురలను మునులను బితరులఁ, బరమవిధిం దర్పణమునఁ బరితృప్తులఁ జే
సి రహితపాపుండై వ్యాజ్నిరతుండై పిండములను నియతిఁ బితృతతిన్.
క. పరితృప్తి నొందఁ జేయుచు, బురుషోత్తముఁ బూజచేయు పురుషుఁడు పొందున్
స్థిరకీర్తి నశ్వమేధని,కరపుణ్యము సత్య మిద్ది ద్విజాసురులారా. 1196
సీ. ఈరీతి నొనరించు భూరిపుణ్యాత్ముఁడు పూర్వుల నేడ్గుర ముందుఁగల్గ
బోవు వారలను నేడ్వుర నుద్ధరించుచు స్వేచ్ఛమీఱఁగఁ బోవు సిద్ధయాన
మున విష్ణులోకంబుఁ గనుఁగొనఁగాఁబోవు నందుఁ జంద్రాదిత్యు లవనియుండు
దనుక వసించి సుఖనికరమును బొంది మర్త్యంబునం బుట్టి మరల ముక్తి
తే. నొందు; నీరీతిఁ బంచతీర్థోత్తమముల,నమలభక్తి నేకాదశియందు నుపవ
సించి సేవించినను జ్యేష్ఠసితనిశాక,రతిథి సేవించినను గల్గు వితతఫలము.
క. హరి నాదినములఁ గన్గొని, పరిపూజితుఁ జేయఁ బూర్వఫల మబ్బును ని
ర్జరులకునే లభియింపని, పురుషోత్తమపదము గల్గు మునివరులారా.
క. అన మాను లిట్లుపల్కిరి, వనజాసన మాఘముఖ్య వరమాసములన్
వినిపింపక జ్యేష్ఠంబును, ఘనతర మని పల్క తీవు కారణమేమో. 1199
మ. విన వాంఛింతుము నా విరించియును నోవిఖ్యాతమౌనీంద్రులా
ర నితాంతప్రమదంబునన్ బలికెదన్ రమ్యంబు ముక్తిప్రదం
బు ననం జెల్లును జ్యేష్ఠమాసము; నదుల్ పూతంబు లౌతీర్థముల్
వనజప్రాంచితసత్సరస్సులు సదాంభఃపూర్ణ వాప్యోఘముల్. 1200

తే. పుష్కరిణులును జెలువులు భూరికూప
ములును హ్రదములు నదములుజలనిధులును
క్షేత్రవర్యంబునం దందు జ్యేష్ఠశుక్ల
దశమి మొదలుగ నివసించుఁ దత్త్వ మిద్ది. 1201

వ. స్నానదానదేవతాప్రోక్షణాదిక్రియాకలాపము లించుక యొనరించినను దత్కాలంబున నక్షయఫలంబుల నొసంగు. జ్యేష్ఠశుక్లదశమీతిథి దశవిధపాపంబుల హరించుఁ గావున దానికి దశహరాహ్వయము ప్రసిద్ధం బయ్యె. ఏనరుం డాదశమియందు బలరాముని శ్రీకృష్ణుని సుభద్రను దర్శించునో వాఁడు సర్వపాపవినిర్ముక్తుఁడై విష్ణులోకము నొందు. ఉత్తరదక్షిణాయనంబులందును, బురుషోత్తముని రాముని సుభద్రను దర్శించిన విష్ణులోకంబు చేరుభాగ్యంబు గలుగు. 1202

క. నరుఁ డెవఁడు డోలికాగతుఁ, బురుషోత్తము ఫాల్గునమునఁ బొడఁగనఁ గల్గుఁ
మురహరుపురమును బొందును, ద్వర నాతనిపుణ్య మెన్నఁ దరమె తలంపన్.

క. పురుషోత్తము దివసను రా, వరభక్తిఁ బంచతీర్థభాసురవిధి శ్రీ
హరి హలిని సుభద్రను నే, నరుఁ డాదృతిమీఱఁ బొడఁగనంగాఁ గలుగున్.

క. క్రతుఫలము దుర్లభంబును, వితతసమస్తాఘహరము విమలమును గనుఁ
బ్రతిలేని విష్ణులోకముఁ, జ్యోతిగాననిదానిఁ బొందు నోమునులారా.

క. ఏనరుఁడు రాధమాసము, రా నిర్మలపక్షమునను రాజిలుతదియఁ
మానితచందనరూషితుఁగా నీరజనేత్రుఁ గనినఁ గను హరిపురమున్.

తే. జ్యేష్ఠ యనుతారకం గూడి చెలఁగు పూర్ణి
మాదినంబున హరిఁ గను మనుజుఁ డిరువ
దొకకులంబును దరియింప నొగి నొనర్చి
విష్ణులోకముఁ దా నొందు వేయునేల. 1207

## అఱువదొకటవయధ్యాయము.

### మహాజ్యేష్ఠమహిమము.

సీ. ఎపుడు మహాజ్యేష్ఠి యొసఁగునో రాశినక్షత్రయోగములను గలిసి యపుడె
యత్నంబు మీఱంగ యాత్రకై పురుషోత్తమక్షేత్రమునకు సన్మతిని బోవ
వలయు; నాసాధుదివసమున శ్రీకృష్ణరాములనుఁ సుభద్రను గనంగ
ద్వాదశయాత్రలఁ దగుఫలం బెక్కుడయ్యును బొందు నట్టిసన్మనుజు నపుడె;
తే. యమలదినమున నందుఁ బ్రయాగమందు, నాకురుక్షేత్రమందు గయాఖ్యపురిని
బుష్కరంబున నైమిశంబునను గంగ, యబ్ధిఁజేరెడుస్థలమందు మఱియు.

వ. గంగాద్వార, కుశావర్త, కోకాముఖ, శూకర, మధురానగర, మరుస్థల, సాలగ్రామ, వాయుతీర్థ, మందర, సింధుసాగర, పిండారక, చిత్రకూట, ప్రభాస, కనఖల, శంఖోద్ధార, ద్వారకానగర, బదరికాశ్రమ, లోహకుండ, సర్వపాపప్రమోచనదశాశ్వతీర్థ, కామాలయ, కోటితీర్థ, అమరకంటక, లోహార్గళ, జంబుమార్గ, సోమతీ, ర్థోత్పలావర్తక, పృథుతుంగ, సుకుబ్జక, కామ్రక, కేదార, కాశీనగర, విరజ, కాలంజర, గోకర్ణ, శ్రీశైల, గంధమాదన, మహేంద్రమలయ, వింధ్య, పారియాత్ర, హిమాలయ, సహ్య, శుక్తిమత్పర్వత, గోమం, తార్బుద, గంగాసర్వతీర్థ, యామునసర్వతీర్థ, సారస్వతతీర్థ, గోమతీ, బ్రహ్మపుత్రసప్తక, గోదావరీ, భీమరథీ, తుంగభద్రా, నర్మదా, తాపీ, పయోష్ణీ, కావేరీ, శిప్రా, చర్మణ్వతీ, వితస్తా, చంద్రభాగా, శతద్రునదీ, బాహుదా, ఋషికుల్యా, కుమారీ, విపాశా, దృషద్వతీ, సరయూ, గంగా, గండకీ,మహానదీ, కౌశికీ, కరతోయా, త్రిస్రోతా, మధువాహినీ, వైతరిణీ, ప్రముఖనదీవతంసములందును, మఱియుఁ బ్రపంచంబునంగల యితరమహానదులందును, సర్వతీర్థములందును, సర్వక్షేత్రములయందును, సాగరపర్వతసరోవరంబులయందును స్నానదానంబు లొనరించిన నేఫలంబుగలుగునో గ్రహణద్వయమందు స్నాన దానాదికము లొనరింప నేఫలంబులభించునో యాఫలంబెల్ల మహాజ్యేష్ఠియందు శ్రీకృష్ణుని దర్శించినంతన కలుగు. కావున సర్వప్రయత్నములచేతను, బురుషోత్తమక్షేత్రమునకుఁ బోవఁదగు. సర్వకామఫలంబులం గోరువారెల్ల నామహాజ్యేష్ఠియందు రామకృష్ణసుభద్రల దర్శించిన విష్ణులోకమున కరుగుదురు. అంతియగాక స్వకులమును దరింపఁజేయుదురు. విష్ణులోకంబున సకలభోగంబుల ననుభవించి ప్రళయంబుదనుక నందుండి పిదప భూలోకంబునఁ జతుర్వేదవేత్తయై పుట్టి స్వధర్మనిరతుఁడై శాంతుఁడై శ్రీకృష్ణభక్తుఁడై జితేంద్రియుఁడై వైష్ణవయోగమును బొంది ముక్తినొందు ననిపలికిన పరమేష్ఠిం గాంచి మునులిట్లనిరి. 1209

---

అఱువదిరెండవయధ్యాయము.

శ్రీకృష్ణస్నానాదివిధానము.

క. హరికిఁ స్నానం బది యేతెరుణంబునఁ జేయవలయు దాని విధంబే
కరణిం దగు దానిఁ విన, గరముం గోరుదుము కమలగర్భా! చెప్పుమా. 1210

చ. అన విని బ్రహ్మ యిట్లనియె నాదృతి నోమునివర్యులార! శ్రీ
శుపకును రామమూర్తికిని శుంభదభంగురశక్తిచేత నొ
ప్పినయుల భద్రకుఁ సుకృతవృద్ధి నొసంగెడుస్నానరీతినిఁ
వినుఁడు వచింతు జ్యేష్ఠమున వింతగఁ దోఁచెడుపూర్ణిమాతిథిఁ. 1211

తే. చంద్రదైవతమైన నక్షత్రమందుఁ, గృష్ణునకు స్నాన మొనరింప నింతఫలము
గలుగునని చెప్ప శక్యమే కమ్రసర్వ, తీర్థమయుఁడు కృష్ణుండగు దేవుఁడతఁడె.

వ. అత్తఱి భోగవతి ప్రత్యక్షంబై యుండు. కావున జ్యేష్ఠపూర్ణిమయందు సువర్ణ కలశంబులచే జలంబును గ్రహించి శ్రీకృష్ణబలరాములకు సుభద్రకు నని సంకల్పించి యభిషేకార్థమై పరమమంగళంబై పతాకాలంకృతంబై సుదృఢంబై సుఖసంచారంబై వస్త్రపుష్పధూపదీపాద్యలంకృతంబై విస్తీర్ణంబై యొప్పుమంచంబు నిర్మించి పీతవస్త్రంబులు పఱచి ముక్తాహారంబులను గైచేసి యందు.

సీ. బహువిధ విమల సద్వాద్యంబు లొప్పఁగ శ్రీకృష్ణు బలభద్రుఁ జెలఁగి నిలిపి
వారికి నడుమ సుభద్రను నిలుపుచు జయమంగళధ్వనుల్ సంభవిల్ల
బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రాదులఁ గలిసి యందును గృహస్థులును స్నాత
కులు భిక్షువులు వటువులు చేరియుండంగ మంచస్థు శ్రీకృష్ణు నంచితవిధి

తే. బలుని నభిషిక్తుఁగాఁ జేయవలయు నపుడు
సర్వతీర్థంబులను బుష్పసహితములను,
స్నాన మొనరింపఁదగు నిట్లు స్నానకృత్య
మొప్పఁగాఁ జేసి భక్తిమై నుల్లమలర 1214

వ. పటహ శంఖ భేరీమురజ, కాహళ, తాళ, మృదంగ, జర్ఝర, ఘంటాది వివిధ వాద్య శుభనిస్వనములచేతను, బురంధ్రీ మంగళశబ్దములచేతను, మానిజల్పితవేదనాదములచేతను, జయశబ్దస్తుతినాద వీణావేణునిస్వనంబులచేతను, సముద్రనాదంబు ననుకరించునట్లు మంత్రధ్వనులచే ముఖరితంబగునట్లు సామశబ్దోపబృంహిత నానావిధస్తోత్రరాజంబుల నాశ్రమచతుష్కంబును శ్రీహరిని వినుతింపవలయును అత్తఱినవవయస్స్ఫురిత వేశ్యాజనంబులు పీతరక్తచ్ఛాయలు గలిగి బహువిధచామాభిరామంబులై రత్నమండితంబులై సువర్ణస్తబకాంచితంబులై రత్నదండంబులై యలరారు చామరంబుల విసరుచుండవలయు. యక్షకిన్నరసిద్ధ విద్యాధరాప్సరోగణంబులు సేవింపవలయు. అంబరమునుండి దేవగంధర్వచారణాదిత్యవసురుద్రాదు లాతరుణమున సేవింతురని యెఱుంగుఁడు. లోకపాలకులు దివ్యస్తోత్రరాజంబుల వినుతింతురు. మఱియు. 1215

తే. దేవదేవ జగత్పతీ దివ్యరూప, సర్గపాలనమృతికర సకలభక్త
పాలకా! పురుషోత్తమ భద్రదాన, దక్ష నతు లొనరింతుము తగువిధమున. 1216

క. జగముల మూఁడింటిని దాల్చి గదాధరుఁడగుచు మోక్షసిద్ధిదుఁడునునై
తగు వాంఛాఫలముల నీ, యఁగఁ జాలిన దైవమునకు నంజలి యిదిగో. 1217

చ. అనియిటు లాదితేయవరు లాభగవంతునిఁ గృష్ణు రామునిన్
ఘనమతియైన సుభద్రను నికామముదంబున సన్నుతించి య
భ్రనియతసంస్థితిం జెలఁగి పాడుచు నాడుచు సన్నుతించుచున్

గనుఁగొనుచుండ రచ్చరలు క్రమగతుల్ దగనాట్యకేళులన్. 1218

క. కాలముపుత్తురు; తూర్యము, లోలిన్ ధ్వనియించు వాయు వొక్కవిధమునన్
జాలన్ శీతలమై తగు, బోలిన్ మేఘములు పుష్పవారయుతముగన్. 1219

ఆ. వృష్టిఁగురియు; మౌను లెలమిసిద్ధులఁజారణులను గూడిసన్నుతుల మహాత్ము
నలరఁ జేయుచుండ రమరేశుఁ డఖిలది, క్పతులఁ గూడి మౌని వితతితోడ.

క. కరుణానిధి శ్రీకృష్ణునిఁ, బరమాత్మునిఁ గనుచునుండు భద్రపరికరో
త్కరములఁగొని విధి సమ్మతి, సురవరు లభిషేచనంబు సొంపుగఁ జేయన్. 1221

వ. సంసిద్ధులైయుండ నింద్రుండును విష్ణువు సూర్యశశాంకులును, ధాతయు విధాతయు, ననిలాగ్నులు, పూషయు, భగుం, డర్యముండు, త్వష్టయు, మిత్రావరుణులును, రుద్రులు, వసువు, లాదిత్యులు,నశ్విదేవతలు, విశ్వేదేవమరుద్గణంబులు, సాధ్యులు, పితరులు, గంధర్వు, లప్సరోగణంబులు, యక్షరాక్షసపన్నగులు, ససంఖ్యాకదేవర్షులు, బ్రహ్మర్షులు, వైఖానస, వాలఖిల్య, భృగ్వంగిరః ప్రభృతులు, యతులు, విద్యాధరులు, యోగులును వెంటనుండఁ బితామహుండు పులస్త్యపులహాంగిరః, కాశ్య, పాత్రి, మరీచి, భృగుక్రతు, హర, ప్రచేతో, దక్షమనువులంగూడి ఋతువులు గ్రహములు, జ్యోతిస్సులు, మూర్తిమన్నదులు, సనాతనదేవతలు, సముద్రములు, హ్రదంబులు, తీర్థంబులు పృథ్వియు, నంబరంబును, దిక్కులు, పుణ్యవృక్షంబులు, దేవమాతయు, హ్రీశ్రీస్స్వాహా సరస్వత్యుమాశచీ, సినీవాల్యనుమతీకుహూరాకాప్రభృతులు, దేవపత్నులు, హిమవద్వింధ్యమేర్వాది పర్వతవరంబులు, నైరావతద్విపేంద్రంబు, కలాకాష్ఠలు, పక్షమాసర్తుదివానిశలు, హయరత్నంబగును చ్చైశ్శ్రవంబు, నాగరాజంబగు వామనంబు, నరుణుగరుడులు, నోషధివనస్పతులు, ధర్ముండులోనగు వారలంగూడి యరుదెంతురు. కాలయమమృత్యువులు వచ్చి కాచి యుందురు. శ్రీపత్యభిషేకోత్సవార్థులై యరుదెంచి వీరెల్లఁ బుణ్యతోయప్రపూర్ణసువర్ణకలశంబుల నందుకొని సరస్వతీప్రభృతి పతివ్రతాశిరోమణులంగూడి శ్రీకృష్ణుని బలదేవుని సుభద్రను మంత్రంబుల నభిషేకింతురు. విమానంబు లంబరంబున దిరుగుచుండు దివ్యంబులగు కానుకలర్పింతురు. గీతవాద్యములు చెల్లుచుండు. ఇట్టులెల్లరు వారి నభిషేకించి యిట్లు వినుతింతురు. 1222

సీ. జయ లోకపాలక జయ భక్తరక్షక జయజయ ప్రణతవత్సల మహాత్మ
జయజయ భూతైకశరణ పురాతన బహువిధకారణ వాసుదేవ
జయ సర్వదానవసంహార జయజయ దివ్యమీనసురూప త్రిదశవర్య
జయజయ సాగరశయన యోగీశ్వర భాస్కరనేత్ర దేవగణనాథ
జయ కైటభవిరోధి సర్వవేదేశ్వర కూర్మరూపా యజ్ఞకూటనాథ
జయ పద్మనాభ శ్రీశైలసంచరణ, యోగశయన విశ్వాత్మ కమ్రరూప

జయ వేగధర మహాచక్రధారణదక్ష భూతౌఘనాయక భూమిధరణ
జయజయ శేషైకశయనాదరా పీతవస్త్రవిభూషితవరశరీర
జయ సోమకాంతక సాధుయోగనివాస,దహనవక్త్రా హరీ ధర్మవాస
జయ సుగుణనిధాన జయ శ్రీనివాస ఖగేశ్వరగమన యహీనవీర్య
జయజయ సుఖనివాస పరాత్పరా ధర్మకేతూ మహీవాస భూతగహన
జయ యోగిగమ్య సత్వనివాసక వేదవేద్య యోగీశ్వర వినుతచరిత
జయ శాంతికర జయ జ్ఞానరూపా,పుష్టికర కమలాకర సరసభావ
జయ భావవేద్య మోక్షప్రద, నిర్మలతనుధరా సత్త్వనిధానహృదయ
జయ గుణసాగర సవకర గుణశూన్య, భూతశరణ్య లోకాతిశక్తి
జయ కాంతియుత లోకజననీయుతా పంకజాక్షా సదా యోగవారిహృదయ
జయ సర్గకర, ఘనశ్యామదేహాన్విత, సాగరావిష్ట దేహా గణేశ
జయ భార్గవీపంకజభ్రమరాత్మక, భక్తవశంవద పరమశాంత
జయ పావనాత్మక సారభూతాత్మక నీలాంబరా శాంతనిర్మలాత్మ
జయజయ పాపౌఘశమన కృష్ణా జగన్నాయకా సంకర్షణసహజన్మ

తే. సారసదళాక్ష భక్తవాంఛాప్రదాయ,కా మహాత్మక వనమాలికామనోజ్ఞ
వక్ష చక్రగదాధర భార్గవీశ,విష్ణుమూర్తీ నమస్కారవితతి యిదిగో. 1223

చ. అని మఱియుఁ బఠించె విధి యాహరి నీవిధి సంస్తుతించి హా
ర్షనియతచిత్తముల్ వెలయ శక్రముఖుల్ త్రిదశాళిఁగూడి మౌ
నినికరయుక్తులై హరిని నీలరుచిందగు నంబరంబుతోఁ
దనరెడు రాము భద్రను నితాంతముభక్తి నమస్కరించుచుఁ. 1224

క. కనుఁగొని కరములు మోడిచి
వినుతించుచు స్వర్గమునకు విమలాత్మకులై
చనుచుండ్రు విమానంబుల
మునులారా! మఱియు వినుఁడు మురహరుమహిమన్. 1225

వ. విమానరాజంబులు సకలరత్నవిభూషితంబులై కామగమనంబున నప్సరోగణని
బిడంబులై గీతవాద్యంబు లొప్పుచుండఁ బతాకావిభూషితంబులై యంబరం
బునఁ దిరుగుచుండు. ఆమహోత్సవంబు చూడందగియుండు. 1226

క. ఆకాలంబున మానవు,లేకరణిన్ భక్తిమీఱ నీశ్వరుఁ గృష్ణున్
శ్రీకలితు బలు సుభద్రను,వే కాంతురో వారు గాంత్రు విమలపదంబున్. 1227

చ. వరసతి నాఁదనర్చెడు సుభద్రను రామునిఁ గూడి శయ్యపై
నిరుపమశోభ నొప్పు హరి నీరజనాభునిఁ బూరుషోత్తమున్
నరు లెవ రత్తఱిం బమిఁగ నందగుపుణ్యు మొనర్చి యుందురో
పరమపదంబు వారలు ధ్రువంబుగఁ గాంతురు శంకలేదిఁకన్. 1228

సీ. పుష్కరంబను క్షేత్రమునఁ గపిలాశతదాన మొనర్పంగఁ దగు నదెట్టి
పుణ్యమో యది యలపూవుఁబోఁడి సుభద్ర బలుఁగూడి సకలసత్ఫలములొసఁగు
మంచమ్మునందున్న మాధవు దర్శింపఁ గలుగును; నూర్వురఁ గన్యకలను
దాన మిచ్చిన సుకృతం బదెంత చెలంగు నంతపుణ్యము మంచమందు నలరు
తే. కృష్ణు దర్శింపఁ గల్గు నిందేలశంక;
ధర్మశతనిష్కదానసత్ఫల మదెంత
యలరునో మంచసంస్థు శ్రీహరిని గనినఁ
గలుగు నంతటిసుకృతంబు క్ష్మాతలమున. 1229
తే. గోసహస్రప్రదానంబుఁ గార్తిఁ జేయఁ
గలుగుసుకృతంబు మంచస్థుఁ గాంచనాంబ
రుని గనుంగొనఁ గల్గును మునివరేణ్యు
లార! మఱియును వినుఁడు శ్రీశౌరిమహిమ. 1230
సీ. విధి దాఁటకుండ సంప్రీతి భూదానంబు చేసిన నేఫలసిద్ధి గలుగు
నన్నదానమ్ము నర్హాతిథి కొసఁగిన లభియించు నెంతఫలంబు ధరణిఁ
దగ వృషోత్సర్గంబుఁ దమిఁజేయఁగా నెంతఫలము మానవునకుఁ గలుగఁగలదొ
భీష్మగ్రీష్మమునందు విమలజలంబుల నొసఁగ నేసుకృతంబు పొసఁగఁగలదొ
తే. మఱియుఁ దిలధేనుదానంబు మహితభక్తిఁ
జేయ నేపుణ్యఫలములు చెందఁగలవొ
యవ్వి శ్రీకృష్ణు మంచస్థు నలరఁ గనినఁ
గలుగు సందేహములు లేవు పలుకులేల. 1231
క. కరిహయరథదానంబునఁ, బరఁగెడుపుణ్యంబు మంచవరమునఁదగు శ్రీ
హరిఁ గృష్ణుఁ గనిన నబ్బును, ధరణీసురమానులార తథ్యం బిదియౌ. 1232
తే. కనకశృంగిని దాన మిచ్చినఁ జెలంగు
సుకృత మెయ్యది యద్దియే చొప్పడుఁజూడి
మంచసంస్థుని శ్రీకృష్ణు మాధవు విభుఁ
గనినయంతన లేవు శంకలు తలంప. 1233

వ. జలధేనుప్రదానంబునఁ గలుగుపుణ్యంబును, ఘృతధేనుదానజనితసుకృతంబును, జాంద్రాయణవ్రత చర్యావిఖ్యాత మహాఫలంబును, విధివన్మాసోపవాససంగత పుణ్యవిశేషంబును, మంచస్థుఁ గృష్ణుని దర్శించినయంతన కలుగు. విశేషించి వచి యింపనేల సర్వతీర్థంబుల, వ్రతదానంబులఁ గలుగు సుకృతవిశేషంబు పురుషో త్తముని మంచస్థితుని దర్శించినంతన గలుగుట నిక్కంబు. సుభద్రారామాన్వి తుని శ్రీకృష్ణుని సందర్శింప ముక్తి కరతలామలకంబగు. కావున వనితలుగా ని పురుషులుగాని పురుషోత్తమక్షేత్రమున కరిగి శ్రీకృష్ణుని దర్శింపవలయు.

శ్రీకృష్ణస్నానశేషోదకంబును శిరంబున నునిచినంతన సకలతీర్థస్నానఫలంబు వెలయు. వంధ్యయు, మృతప్రజయు, దుర్భగయు, గ్రహాపీడితయు, రాక్షసాదిగృహీతయు, రోగవితతిసంహతయు నగుపూఁబోఁడి శ్రీకృష్ణస్నానశేషోదకాభిషేచనమున విముక్తి నొందు. సకలవాంఛితార్థంబులం బడయు. పుత్త్రులంగోరినఁబుత్త్రిలును, సుఖార్థినిసుఖములను, రోగవిముక్తింగోరిననదియును, ధనముంగోరిన ద్రవ్యంబును, బొంది నారీమణియై వెలయు. ప్రపంచంబునంగల తీర్థంబులెల్ల శ్రీకృష్ణస్నానశేషజలంబుల షోడశభాగఫలంబుల నీయఁజాల వనుట ధ్రువంబు. కావున భగవత్స్నానశిష్టజలంబుల మానవులు తమ సర్వావయవంబుల నభిషేకించుకొనవలయు ఆజలంబు పరమపావనంబుకదా. మఱియు. 1234

క. స్నాతుండై దక్షిణదిశ, కేతెంచెడుకృష్ణుఁ గాంతు రెలమిదనర నా
పూతాత్ములు గురుపాప, వ్రాతంబులు తొలఁగిపోవ వఱలుదు రెపుడున్. 1235

తే. ధరణి ముమ్మాఱుగాఁగఁ బ్రదక్షిణంబు, చేయ నేపుణ్య మాగమసిద్ధ మగునా
యద్దిదక్షిణాముఖుఁడగు హరిని గనినఁ,గలుగు నేశంకలును లేవు తలఁప నిందు.

క. ధరఁగల తీర్థోత్తములఁ, బరమాదృతిఁ గ్రుంక నెట్టిఫలమబ్బునొ శ్రీ
హరి దక్షిణాస్యుఁ గాంచిన, నరునకుఁ దత్పుణ్య మబ్బు నరహరికరుణన్. 1237

తే. బదరికావనమందును బరమభక్తి
నరుని నారాయణుని గాంచినం జెలంగు
ఫల మిటన్ దక్షిణాముఖుఁ బరమపురుషుఁ
గృష్ణు దర్శించినం గల్గు నిది నిజంబు. 1238

సీ. అమలకురుక్షేత్రమందు గంగాద్వారమందు స్నానమొనర్చి యర్హులైన
ధరణినిర్జరులకు దాన మిచ్చినఁగల్గు ఫలమెల్ల నిందు శ్రీబలునను జాని
దక్షిణాముఖుఁ గనఁ దప్పక కల్గు; బ్రయాగమందు మనుష్యుఁ డాదరమున
నలమహామాఘియం దర్హ విధిన్ గంగ మునిఁగినఁ గలిగెడు ననుపమాన

ఆ. మైనఫలము; చైత్రమందొప్పుపూర్ణిమ, నిష్టసిద్ధిఁగోరి యేనరుండు
గండకీనదిమునుఁగంగఁ గల్గెడునది, దక్షిణాస్యుఁ జూడఁ దనరు నిజము.

వ. మహాకార్తికియందుఁ బుష్కరతీర్థంబున స్నానదానంబు లొనరించినఁ గలుగుఫలంబును, గంగాసాగరసంగమంబున స్నానదానంబు లాచరింపఁ గల్గుసుకృతంబును, సూర్యోపరాగంబునఁ గురుక్షేత్రంబున స్నానదానంబులు నిర్వర్తింప జనించుపుణ్యంబును, గంగయందును సర్వతీర్థంబులందును, యమునానదీతీర్థంబులందును, సరస్వతీహ్రదంబులందును, మఱియుంగల పావనసరస్సులందును, స్నానదానంబులు విధిమీఱ నాచరించినఁ గలుగు విశేషపుణ్యంబు దక్షిణాముఖుండగు జగన్నాథుం గాంచినం గలుగు. పుష్కరంబున సర్వతీర్థంబులందును

గయాక్షేత్రంబునందును, యమకంటకంబునందును, నమిషాదితీర్థంబులందును, సర్వదేవాలయములందును, సూర్యగ్రహణకాలంబున స్నానదానంబు లాచరించినఁ బొందుసుకృతవిశేషం బీపురుషోత్తమక్షేత్రంబున దక్షిణాముఖు శ్రీకృష్ణుని దర్శించినంతన లభించు. మునులారా! పెక్కుమాటలు వచింపనేల? వేదశాస్త్రపురాణంబుల సకలధర్మశాస్త్రంబుల నేయేపుణ్యము లనువదింపఁబడినవో యవియెల్ల దక్షిణాముఖుండై సుభద్రాబలరామసహితుండగు శ్రీకృష్ణుని దర్శింపఁగలుగు ననిపలికి మఱియు బ్రహ్మ మునివర్యుల కిట్లనియె. 1240

## అఱువదిమూఁడవయధ్యాయము.

### గుండికాయాత్రావర్ణనము.

తే. గుండికామండపమునకుఁ గోర్కి రథము
నెక్కి యరిగెడు శ్రీపతిఁ గృష్ణు రాము
నలసుభద్రను గాంచుమర్త్యులు రమేశు
భవనమున కేగుదురుసుఁడీ పావనులయి. 1241

క ఆమండపమున శ్రీబల, రాముని భద్రాంబఁగూడి రాజిలు కృష్ణున్
నేమమున సప్తదివసము, లేమాఱక చూచువారలే ముక్తు లనన్. 1242

క. అన మౌను లజునిఁ గన్గొని, వనజభవా! యెవనిచేత వరమండపయా
త్ర నియతిని గల్పితమ్మ, య్యెను? యాత్రాఫల మదెద్ది? యెఱిఁగింపు తమిన్

సీ. ఏటి కింద్రద్యుమ్నుఁ డెలమి నిర్మించిన సరసుతటంబున జనవిహీన
ధరణిభాగంబునః దనరుమండపమున భద్రయు రాముండు బలరిపుసహ
జన్ముఁడౌ కృష్ణుండు సప్తాహములు నిజస్థానంబు వదలి నితాంతహర్ష
మున నరదంబునఁ గనుఁగొనువార లచ్చెరువంద నుండంగ నరయ హేతు

తే వేమి? తెల్పుమ యన బ్రహ్మ యిట్టు లనియె
మునుపు రాజేంద్రుఁ డాహరిఁ గని వరంబు
లడిగె సప్తాహములు మదీయమగుసరసు
నంతికంబున నివసింప నగును దేవ. 1244

క. పరమాద్భృతి గుండిక యిహ, పరసాధనశక్తి వెలయు భవదీయకృపన్
బరమాత్మా! కరుణింపుము, వర మీయవె యంచు వేఁడఁ బరమేశ్వరుఁడున్.

క. వర మిచ్చెయొసఁగె; నేమున, ధరణీశా! నీసరస్సుతటమున నివసిం
చురతిం గాంచెద నదియుం,బరఁగుం గుండిక యనంగఁ బావనరీతిన్. 1246

క. ఆయాత్ర యేడుదివసము, లేయడ్డును లేక సాగు నెల్లఫలములన్
బాయక కాంతురు మానవు, లోయవనీనాథ! కొఱఁత నొందరు మింకన్.

క. మనుజు లదెవ్వరు గుండిక, యనుమండపమందు నన్ను హాలిని సుభద్రన్
ఘనభక్తిఁ బూజచేయుదు, రనఘులు వారౌదు రందు నవనీసురులున్. 1248

క. ధరణీశులు విట్శూద్రులు, తరుణులు చందనము పుష్పదామంబులునున్
సురుచిర ధూపము దీపో, త్కరములు నైవేద్యములు నికామశ్రద్ధన్. 1249

తే. మఱియు నుపహారములును నమస్కరణము
లర్హరీతిఁ బ్రదక్షిణమ్ములు వినుతి
మొదలుగాఁగల యుపచారములను స్తోత్ర
గీతముల నన్నుఁ గొల్చినఁ బ్రీతిఁ గనుచు. 1250

క. మనమునఁ గోరినవాంఛలఁ గనుదురు పొందంగరాని కాంక్ష కలుగ దా
మనుజుల కస్మత్కరుణన్, జననాథా! యిందు లేదుశంక యటంచున్. 1251

క. పలుకుచు శ్రీపురుషోత్తముఁ, డలరఁగఁ బృథ్వీశుఁ జేసి యంతర్హితుఁడై
జలజాక్షుఁ డేగ భూపతి, విలుప్తతాపుఁడయి హర్షవిస్మయములచేన్. 1252

క. కృతకృత్యుఁడ నైతి నటం, చతిశయ తృప్తుండు నయ్యె నటుగావున నా
యతగుండికయం దలరెడు, శ్రితరక్షకుఁ గృష్ణుఁ జూడఁ జెందును వాంఛల్.

క. తనయవిహీనుఁడు సుతులం, గను ధనహీనుండు ధనముగలవాఁ డగు రో
గనికరముక్తుండగు రో,గి నెలంతయుఁ బతిని బడయుఁ గ్రీడారతునిన్. 1254

సీ. ఆయువుఁ గీర్తియు యశము మేధాబలవిద్యాధృతులు పశువితతి, రూప
యౌవనసంపద లభినవంబులుగాఁగఁ దనరారుఁ; గలుగుదు రనఘమతులు
తనయులు వేయేల తనమదిఁ గోరినవాంఛ లెల్ల ఫలించు వరుస మిగులఁ
బురుషుఁడైనను మఱి పూఁబోఁడియైనను బురుషోత్తముని జూడఁ బొందు ముక్తి

తే. గుండికాయాత్ర నాషాఢకువలయాప్త, వృద్ధిపక్షంబునం జేసి విధియుతిఁ దమి
రామకృష్ణుల నాసుభద్రను గనంగఁ, బంచదశహాయమేధ సత్ఫలము గలుగు.

క. తనకున్ ముందును వెనుకను, జనియింపఁగఁబోవునట్టి జ్ఞాతిజనులఁ జ
క్కనిగతి నేడ్వుర ముక్తులఁ,గను నొనరిచి వ్యోమయాన కలితుం డగుచున్.

తే. సర్వరత్నాళిఁ దనరుచు సాధ్యసిద్ధ, గరుడగంధర్వదేవతా కాంత లెలమిఁ
దనను గొల్వఁగ రూపంబు దర్పకాను, సారిగాఁదగఁ జేరు నాచక్రిపురము.

చ. ప్రళయముదాఁక నందు బహురమ్యసుఖంబులఁ నొందుచుండి ని
ర్మలతను వొప్పఁగా జరయు గామిని మృత్యువు చేరకుంట ని
ష్ముల ముద మొంది యవ్వలను భూమిని బుట్టి శ్రుతుల్ పఠించి శ్రీ
శలలితయోగ మొంది కను శాశ్వతముక్తిని గృష్ణుసత్కృపన్. 1258

## అఱువదినాల్గవయధ్యాయము.

పురుషోత్తమయాత్రాదివర్ణనము.

చ. అని పరమేష్ఠి పల్క విని యమ్మును లిట్లని ప్రశ్నచేసి రో
వనజజ! యాత్ర లేపగిది భక్తి చెలంగఁగ వేలువేలు చే
సిన ఫలమెద్ది కలు మఱి స్త్రీలకుఁ బూరుషపాళికైన నా
విని యజుఁ డిట్లుపల్కెఁ గడు వేడుకయొప్పను బ్రశ్నరీతికిన్.

క. ప్రతియాత్రాఫలమును వి, స్తృతముగ వచియించువాఁడ సిద్ధక్షేత్రం
బతిశయ ఫలదము నగు నా,త్మీతిగను వారలకుఁ గల్గు శ్రీపరిణతులున్.

సీ. భగవంతుఁడు సుషుప్తిఁ బాసి మేల్కొనునట్టి యుత్థానతిథియందు నొప్పమీఱు
ఫాల్గుణపూర్ణిమా భాగంబునను విషువమున గుండికయాత్ర భక్తిఁ జేసి
భద్రను రాముని వాసుదేవునిఁ గాంచి ప్రణమిల్లినం గల్గు ఫలము లెల్ల;
విష్ణులోకంబున జిష్ణువుల్ పదునల్వు రుండినంతటికాల మొక్కరీతి

తే. నుండఁజాలును; జ్యేష్ఠమాసోత్తమతిథి
యాత్ర విధిమీఱఁ జేయ మున్ననువదించి
నంతకాలము విష్ణుమూర్త్యంతికమున
భోగములఁ బొందుచుండును బుణ్యమలర. 1261

వ. అపురుషోత్తమక్షేత్రవర్యంబు భుక్తిముక్తిప్రదంబు. సర్వసత్త్వసుఖావహంబు నగు. కావున నందు జ్యేష్ఠమాసంబున యాత్ర యొనరించి పురుషుండుగాని నారీమణిగాని యింద్రియనిగ్రహంబుగలిగి యథోక్తవిధిచేఁ బంద్రెండుప్రతిష్ఠ లొనరించిన శాఠ్యదంభవర్జితులై యీలోకమున సకలభోగంబుల ననుభవించి తుది మోక్షంబునొందుదు రనిఃల్కిన విని మును లంబుజాసనునకిట్లనిరి. 1262

క. వినవలతు మా ప్రతిష్ఠా,ర్చనదానవిధానములను సాధుఫలం బ
ర్చనముఖముల నెదికల్గునో, వినిపింపుము వనజభవ సువిస్తృతి దగఁగన్.

క. అనవిని విధి యిట్లను నో,మునులార! విధిప్రయుక్తముగ నొప్పప్రతి
ష్ఠను దెల్పువాఁడ నద్దా,నినిజేయ లభించుఫలము నెఱి మీకిపుడే. 1624

క. ద్వాదశయాత్రలు పూర్ణము,గాఁదగు నేవేళ నవలఁగాంక్ష తనరఁగా
శ్రీదయితునకుఁ బ్రతిష్ఠను,మోదంబునఁ జేయుదురు సుబుద్ధులు విధిగన్. 1265

సీ. అది పాపములఁ జెండు నఖిలేష్టముల నిచ్చు; జ్యేష్ఠమాసంబున సిత మనఁదగు
పక్షంబునందుఁ బాపహరమై తగిన యేకాదశియందు ని కామభక్తి
సలిలాశయమునఁ జేరి శ్రద్ధ నాచమనము నొనరించి శుచియయి ఘనతరంబు
లగు తీర్థముల నెల్ల నావాహనము చేసి నారాయణుఁ బరు ధ్యానంబుచేసి

తే. యవల స్నానంబు విధియుతి నాచరింప

వలయు; నెవనికి నేవిధి వర మటంచు,
మునులు పల్కిరో స్నానవిధిని వచించు
నప్పుడు తన్మార్గమునఁ జేయ నగునతండు. 1266

వ. ఇట్లు స్నాన మొనరించి యథాశాస్త్రంబుగా దేవర్షిపితృతర్పణమ్ములు సాగించి యితరుల నామగోత్రము లుచ్చరించి చేయఁదగువారికిఁ దర్పణములు చేయవలయు. జలాశయంబు వెడలి ధౌతవస్త్రములఁ దాల్చి భాస్కరాభిముఖుండై నిలువం బడి ధ్యానించి కూరుచుండి పరమపావనియగు దేవిని గాయత్రిని వేదమాతను మనస్సున నష్టోత్తరశతవారంబులు జపింపవలయు. ఆమహాదేవి సర్వపాపంబులఁ దొలఁగించి పుణ్యంబుల నొసంగఁ జాలు. అవ్వలఁ బరమపవిత్రములగుసౌరమంత్రముల శ్రద్ధాసమాహితుండై జపింపవలయు. పిదప ముమ్మాఱులు ప్రదక్షిణంబు లొనరించి సూర్యునకు నమస్కరింపం దగు. ద్విజులనఁబడు బ్రహ్మక్షత్రియవైశ్యులకు వేదోక్తస్నానజపములు విధివిహితంబులు. స్త్రీశూద్రులకు స్నానజపములు వేదవిరహితంబులు.తరువాత నింటికి మౌనియై పోయి పాదప్రక్షాళన మొనరించి పురుషోత్తముం బూజింపం దగు. తొలుత ఘృతముచేతను నవ్వల క్షీరములచేతను బిదప మధుగంధోదకములచేతను, దరువాతఁ దీర్థ చందనోదకంబులచేతను శ్రీపురుషోత్తమునకు స్నానము చేయింపవలయు.

క. పరిధానార్థము వస్త్రము, లురుమాల్యములుగ గ్రహించి యొప్పఁగ భక్తిన్
బురుషోత్తమునకుఁ గట్టం, బరమార్థము లబ్బు వేఱు పల్కు లికేలా. 1268

సీ. చందనాగరుముఖ సద్వస్తువులను గప్పూరమునఁ గుంకుమమునను దేవు
నను లేపితుని జేయనగు; నిరుపమభక్తిఁ బంకజంబుల మఱి వైష్ణవమ్ము
లనఁబడు మల్లికా దినిఖిలపుష్పంబులను బూజచేసి యావనజనయను
భుక్తిముక్తిప్రదుఁ బురుషోత్తముని హరి ధూపమ్ము నగరుసం దీపకముగ
తే. నొసఁగి ఘృతదీపముం బెట్టి యురు విభవము,లలర ద్వాదశవిధదీపములను నిల్పి
తృప్తుఁ జేయంగవలయును దీపము లవి,తైలఘృతముల దేనినేఁ దనరవలయు.

వ. పాయసాపూప శష్కులీ వటకాది సమన్విత నైవేద్యంబు సమర్పింపవలయు. ఫలసహితంబైన నది సత్ఫలప్రదంబు. ఇట్లు పంచోపచారంబుల నుపచరించి శ్రీహరి చెంత "నోంనమః పురుషోత్తమాయ" యనుమంత్రంబు నష్టోత్తరశతవారంబులు జపింప వలయు. పిదప భగవంతు ననుగ్రహంబుఁ గోరి ప్రార్థింప వలయు. 1270

తే. భక్తరక్షక దేవేశ; వందనములు
సర్వలోకేశ భూరిసంసారజలధి,

*యస్యయోవిధి రుదిష్టఋషిభిస్స్నానకర్మణి, తేనైవతువిధానేన స్నానంతస్య విధీయతే— అనిమూలము.

మగ్నున నుద్ధరింపుమా మాధవ యని
ప్రార్థనము చేయవలయు సంయతమతియయి. 1271

తే. యాత్ర లియ్యవి పండ్రెండు హతసురారి!
నీదుసత్కృప సంప్రాప్తి నెగడవలయు,
ననుచుఁ బ్రార్థించి హరికి సాష్టాంగవంద
నములు చేయంగఁదగు మునినాథులార. 1272

క. తరువాత భక్తిఁ బుష్ప, త్కరముల ననులేపనములఁ గమ్రాంబరరా
జి రుచిరభూషణసంతతి, గురువరు నర్చింపవలయుఁ గోరికతనరన్. 1273

క. గురువునకున్ దైవమునకు, నరయఁగ నంతరము లేకయలరుం గానన్
గురుపూజ యుత్తమం బని, వరమతు లూహింత్రు భేదవాదము లేలా. 1274

క. పురుషోత్తముపైఁ బుష్ప, త్కరములచే మండపంబు కల్పింపఁ దగున్
గర మరుదుగ నొప్పారెడు, కరణిన్ సుమమండపాఖ్యఁ గ్రాలెడు నదియున్.

క. ఈరీతి శ్రద్ధగాఁ బూ, జారతి నాపగలు గడపి జాగరణము ని
ద్రారతి లేకుండఁగ నా, శ్రీరమణుచరిత్ర గేయసిద్ధాంతములన్. 1276

క. ఒనరింపఁదగు నా ధ్యానం,బున గీతీపాఠమునను భూతేశురతిన్
గొనకొని రాతిరి గడుపం, జనును; బ్రభాతంబునందు సంతస మొప్పన్. 1277

సీ. ద్వాదశీతిథియందు ద్వాదశసంఖ్యల వ్రతనియమస్థుల క్షితిసురులను
వేదపారగులను వేదాంతవేత్తల నర్థింపఁదగు భోజనార్థ మరుగు
డెండంచు వార లుద్దండభక్తులు నితిహాసపురాణజ్ఞులై జితేంద్రి
యులునయిమతిశ్రోత్రియులునయియుండనొ;నవలఁ గర్తయు స్నాన మాచరించి

తే. ధౌతవస్త్రములను దాల్చి వీతకాముఁ
డగుచుఁ బురుషోత్తముని భక్తితగ విధియుతి
నర్చనములను దనుపనొ నములదివ్య
గంధపుష్పోపహార సంకలనఁ దనరి. 1278

వ. ధూపదీపనైవేద్య బహువిధోపచార ప్రదక్షిణనమస్కార జపస్తుతిమనోహర గీతవాద్యముల నాపూజ యొప్పున ట్లుండవలయు. పిదప బ్రాహ్మణభోజనంబు చేయించి పండ్రెండుగోదానము లాభూసురులకుఁ జేసి యథాశక్తి సువర్ణం బొసంగిఛత్త్రం బుపానద్యుగం బొసంగి వస్త్రాదికంబుల వారిసంతుష్టులను గా నొనరింపవలయు. భగవంతుఁడు గోవిందుఁడు దానఁ దృప్తుండగు. ఆమీఁద నాచార్యు నర్చించి ధేనువు నొసంగి వస్త్రంబులు గట్టనిచ్చిఛత్త్రోపా నద్యుగంబులను, గాంస్యపాత్రంబును ధాన్యంబు నొసంగవలయు. బ్రాహ్మణభోజనంబు పాయసపూర్వంబుగ నుండం జను. గుడసర్పిస్సమన్వితంబై చతుర్విధంబై యాభోజనం బొప్పారవలయు. ఇట్లు తృప్తిమీఱ భుజించి స్వస్థమానసు

లైన భూసురులకు ద్వాదశోదకుంభంబుల సమర్పింపవలయు. యథాశక్తి
దక్షిణ లొసంగి గురువున కుదకకుంభదక్షిణల నిచ్చి యీరీతి ద్వాదశసంఖ్యా
కభూసురలను జ్ఞానప్రదాయకుండగు గురువును బూజించి వారిని విష్ణుతుల్యు
లనుగా భావించి యథావిభవంబుగాఁ దక్కుఁగలభూసురుల నారాధించి
సర్వవ్యాపియు శంఖచక్రగదాధరుండును ననాదినిధనుండును, జగన్నాథుండు
నగుపురుషోత్తముం డానందించుఁగాక యనునీమంత్రంబు పఠించి ముమ్మాఱు
లు ప్రదక్షిణం బాచరించి గురువుపాదములకు నమస్కృతులర్పించి యాసీమాం
తము కూడ నరిగి వారి నంపవలయు. విసర్జనంబు నమస్కారపూర్వకంబు గావ
లయు. మఱియు. 1279

క. తనబంధువులుం దానును, మనమున శ్రీనాథు నెన్నిమాఱులో శ్రద్ధఁ
గనుచు స్మరించుచు భుక్తిం, గొనఁజను నుపవాస మున్నక్షోణీసురులన్. 1280

ఆ. భిక్షుకులను భుక్తివేఁడు నన్యులఁగూడి, తా భుజించుటొప్పుఁ దనరురీతి
నిట్లు పూజసేయు నింతియే నరుఁడేని, ఫలము నొందు వారు పలుకులేల. 1281

సీ. అశ్వమేధసహస్ర మాచరించినఫల మట్టులే రాజసూయములు నూఱు
చేసినఫలము సంసిద్ధించు మునులార నూఱుతరంబుల నూఱుగుర భ
విష్యులఁ బావనవృత్తుల నొనరించి స్వర్గంబునకుఁ బోవు సత్య మిద్ది
సర్వలక్షణముల సంపన్నుఁడయి సర్వవిమలభూషణముల వెలసి సర్వ

తే. కామసంతృప్తిఁ దగి సురగణమురీతి, విగతసంతాపుఁడై రూపవిలసనమున
యౌవనంబున నొప్పారి హరిసుగుణ, రాజినెసఁగుచు నచ్చరల్ రమణఁ గొలువ.

క. అనుపమరవికాంతుల నొ, ప్పినయట్టి విమానమందు విపులపతాకా
ళిని రత్నంబులఁ దగుదా,ని నెక్కి దిక్కులు జ్వలింప నిర్మలకాంతిన్. 1283

క. ఒప్పుచు విగతక్లముఁడై, యప్పురుషుఁడు విష్ణులోకమందు వసింపం
జొప్పడుపుణ్యంబునఁ జను, నప్పూతజగంబునందు నఖిలేష్టములన్. 1284

ఆ. కల్పశతముదనుకఁ గడఁగి తా నొందుచు, సకలసాధువినుతి సంతతంబుఁ
గనుచు విష్ణుమూర్తికరణి నొప్పారుచు, ముదితుఁడగుచు నుండుఁ గదలకుండ.

వ. ఆతనిరూపంబు చతుర్భుజంబు శంఖచక్రగధాధారణంబునై యుండు. ఆలోకం
బున సకలసుఖంబు లనుభవించి బ్రహ్మభవనంబుఁ జేరు. ఆలోకంబు సిద్ధవిద్యాధ
రాదిసేవితంబు కిన్నరాదిపరికీర్ణంబునై యుండు. అట్టిబ్రహ్మలోకంబునఁ దొంబది
కల్పంబు లుండి యందుండి సర్వకామఫలప్రదం బగు రుద్రలోకంబునకుం
బోవు. ఆదిసురగణసేవితంబు. సుఖమోక్షదంబు. అనేకదివ్యవిమానసమాకీర్ణంబు.
సిద్ధవిద్యాధరయక్షాదివిభూషితంబు నయి తనరు. ఆరుద్రలోకంబున నశీతికల్ప
కాలంబు నివసించి సుఖంబు లనుభవించి యటనుండి గోలోకంబునకుం బోవు
నదియు. 1286

క. సురసిద్ధాకీర్ణము న, చ్చరలెల్లఁ జెలంగఁ జూడ నమధికభూతిం
బరఁగెడు నదియును నైయ, చ్చెరువును గల్గించుచుండు శ్రీసుసమృద్ధిన్. 1287

తే. అందు సప్తతికల్పంబు లఖిలసుఖము, లనుభవించుచు నిర్జరునట్లు లుండి
దానిమాని ప్రాజాపత్య మైనలోక, మునకుఁ బోవును; గంధర్వమునివరు లట.

సీ. సిద్ధచారణుల సుశ్రీకులనుం గూడి యచ్చర లొప్పార హాయిమీఱ
నుందురు తల్లోకమందును షష్టికల్పములుండి బహువిధపరమసుఖము
లొందుచు శక్రునిసుందరభవనంబు నరుదగుదానిఁ జెచ్చెరఁ గనంగఁ
బోయి యందొప్పారు నాయమర్త్యుల దేవయోనివిశేషంబులౌ నిలింప

తే. జాతులం జూచు చేఁబదిసంఖ్య నలరు
కల్పములు సర్వసుఖములఁ గమ్రరీతి,
ననుభవించుచు నటనుండి చని యమర్త్య
పదమునన్ వ్యోమయానసంభరితమునను. 1289

క. పరమపవిత్రము దుర్లభ, మురుతరముగ సుఖసమృద్ధి నొప్పారంగాఁ
బరికించి యట వసించుచుఁ, బరమేశ్వరపాదపద్మభక్తిఁ దనరుచున్. 1290

క. నలువది కల్పంబులు సుఖ, ములఁ బొందుచుఁ దృప్తినొంది భూరితరంబై
చెలఁగెడు తారాలోకము, లలి నొప్పెడు దాని సర్వలక్షణయుతమున్. 1291

క. కని యట ముప్పదికల్పము,లనుపమభోగాళిఁ గనుచు నటనుండి శశాం
కుని లోకమునకుఁ బోవును,వినుఁ డందు శశాంకుఁడెల్ల విబుధులతోడన్.

సీ. కలిసియుండును మహాకాంతుల నొప్పుచు నందు నిర్వదిసంఖ్య నలరుకల్ప
ములు నివాసముచేసి యలఘుభోగము లొంది యాదిత్యలోకంబు నచటనుండి
వసియింపఁదగు ననువాంఛయుఁ దగులంగ నద్దానిఁజేరి దేవాళి గొలువ
నాశ్చర్యమునకుఁ దా నాధారభూతమై సురవిశేషంబుల సొంపు మిగుల

ఆ. నలరుచుండ నద్దియావాస మని నిల్చి,కల్పదశక మచటఁ గమ్రభోగ
కలనఁ గడపి యచటుగదలి గంధర్వలో,కమును జేరు దుర్లభ మది ధ్రువము.

క. అందొకకల్పము మదికిం,పొందగఁ గన్పడెడుసుఖములోహో యనఁగాఁ
బొందుచు భూలోకంబున,కుం దగ నేతెంచి ధార్మికుండగు ప్రభువై. 1294

చ. జనులను బ్రోచుచున్ సుజనసంగతిఁ గాంచుచుఁ జక్రవర్తియై
ఘనభుజవీర్య మొప్ప గుణగణ్యులలోఁ బ్రథముండు నౌచు మే
దినిఁ దనధర్మమూని వినుతిం గనఁజాలెడురీతిఁ బ్రోచి య
జ్ఞనికర మెంతొ దక్షిణల సద్విధిఁ జేయుచు జ్ఞానసిద్ధుఁడై. 1295

తే. యోగిలోకంబు నొందు నదొప్పు మోక్ష
దము శివంబును నయి యందుఁ దమి లయంబు

దనుక సుఖములఁ గాంచుచుఁ దరలి వచ్చి
యోగికులమున జనియించు నుర్వియందు.　129

క. అరుదగు వైష్ణవయోగము,పరఁగంగా శ్రుతులు నాల్గు వాగ్వశతఁ గనర్
బరమవిధిఁ యజ్ఞంబుల,నిరతం బొనరించి భక్తినియతి వెలయఁగన్.　1297

తే. ముక్తినొందును; యాత్రాప్రసక్తఫల మి
దగును వచియించినాఁడ నీయాత్రఁజేయు
పద్ధతిని దత్ఫలంబును బరమమౌను
లార యింకేమి వినఁగ మీకోరిక తగు.　1298

ఆశ్వాసాంతము.

క. ద్విరదవిభు పాలనాదర, సరసీరుహసంభ వాదిసకలామర్త్యే
శ్వరపూజిత పదకమలా,పరిపాలిత సర్వలోక భక్తశరణ్యా.　1299

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితా ప్రాభవ కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ వినిర్మితంబైన తెలుఁగు బ్రహ్మమహాపురాణంబున ద్వితీయాశ్వాసము.



శ్రీః

# తెలుఁగు బ్రహ్మపురాణము

## తృతీయాశ్వాసము.

### అఱువదేనవయధ్యాయము.



సంపద్దానరతా
శాసితదైత్యేంద్ర, నిగమశాఖి ప్రసవా,
ద్భాసితకోమలపదనఖ
వ్యాసాదికవినుత వేంకటాచలనాథా.

వ. మహాప్రభూ! తర్వాతి వృత్తాంతంబుఁ జిత్తగింపుము.

విష్ణులోకమాహాత్మ్యము.

సీ. అనుటయు నజుఁగని యామౌను లిట్లని ప్రశ్నించి రోదేవ పావనమయి
సర్వలోకానందజనకమై యామయరహితమై కాంతమై విహితమునయి
వైష్ణవలోకంబు వఱలు నంచనివిందు మది యేప్రమాణత నందియుండు
నద్దాని కాంతిభోగాదుల వివరింపు మెట్టికర్మమున ధర్మశ్రేష్ఠులైన
తే. వారు దానిని బొందంగ వలఁతు లగుదు
రెద్ది దర్శింప స్పృశియింప నెట్టి తీర్థ
ముల మునుంగఁగ లభియించు లలితరీతి
దాని వివరింపుమా వేడ్క తనరు వినఁగ. 1
చ. అనుటయు బ్రహ్మ యిట్టులను నాదృతిమై వినుఁ దద్దియే పరం
బనుపద మన్న ధన్యమన నర్హితమంబనఁ బుణ్యమన్న నీ
జననమృతిప్రణాళికకుఁ జాలఁగ నాశనహేతువన్న లో
కనిచయవర్యమన్న నుతిఁ గాంచెడు వైష్ణవలోక మద్దియే. 2
తే. అద్ది యాశ్చర్యమూలమౌ నది త్రిలోక
పూజితంబగు నద్దాని భూరిచరిత
మెల్ల వినిపింతు వినుఁడు; ప్రఫుల్లపాది
జాతము లశోకములు చారుచంపకములు. 3
సీ. మందారవకుళముల్ మాలతీమల్లికా నాగకేసరసుకుందములు మఱియుఁ
బున్నాగములు నతిముక్తప్రియంగు,తగరము లర్జునచూత ఖదిరపాట
లాఖ్యముల్ కర్ణికారాహ్వయంబులు పనసలు లోధ్రనారంగములును నింబ

సర్జకదాడిమఖర్జూర లకుచముల్ ద్రాక్షామధూకాఖ్య వృక్షరాజ
తే. ములు కపిత్థేంద్రఫలవృక్షములును నారి,కేళములు శ్రీఫలద్రుమతాళములును
గల్పవృక్షము లిన్నని గణనసేయఁ,జాలనట్టి మహీరుహాసమితిఁ దనరి. 4

వ. సరళ, చందన, నీప, దేవదారు, శుభాంజన, జాతీ, లవంగ, కంకోల, కర్పూ,రామోదవాసిత, మహీజగణంబులఁ జెలువారి, తాంబూల పత్రనిచయ పూగీఫలద్రుమ ప్రభృతివృక్షవిశేషంబులఁ బెంపునొంది, మఱియు సర్వర్తుకుసుమఫలద్రుమంబుల నొప్పారి, లతాగుచ్ఛసముద్భవనానావిధ కుసుమంబుల దర్శనీయంబై, నానావిధజలాశయంబులు గలిగి, బహువిధశకుంత సంతాన మనోహర రుతవిశేషంబుల శ్రోత్రవివర హితంబై, నిరంతరజలసంపూర్ణ దీర్ఘికాశతంబుల సుఖప్రదంబై, కుముదశతపత్త్రకోకనద రక్తనీలోత్పల మనోహర కహ్లార ప్రముఖ నిఖిల జలకుసుమ విసరమనోజ్ఞంబై, హంస, కారండవ, చక్రవాక, కోయష్టిక, దాత్యూహ, చాతక, ప్రియపుత్ర, జీవంజీవ కాద్యనేక పక్షినినాద భాసురంబై, దివ్యంబై యొప్పుచుండు. అట్టి వైష్ణవలోకంబునందుఁ గామగమనంబున మహామహిమంబు గాంచి సర్వరత్నాఢ్యంబులై దివ్యగంధర్వ గీతనాదముఖరితంబులై తరుణాదిత్యసంకాశవర్ణంబులై యప్సరోగణసేవితంబులు నగువిమానరాజంబు లసంఖ్యలుగా వెలయుచుండు. అందు నానాభోగోచితపదార్థంబు లొప్పుచుండనవిగృహావరంబులని చెప్పనొప్పుచుండు. మఱియు నావిమానవర్యంబులయందు దివ్యకుసుమమాలిక లొప్పుచుండు. నానావాదిత్రనిస్వనంబులచేతను, గింకిణీస్తబకంబులచేత నావ్యోమయానంబులు సుఖధామంబులను విఖ్యాతి నొందియుండు. 5

చ. హరిపుర మద్ధిలోకముల హారితరంబను కీర్తిఁగాంచి స
త్పురుషనివాసభూమియనఁ బొల్పుచు నుండు; నటఁ వధూమణీ
పరికరసంయుతిఁ బురుషవర్యులు చారువిమానరాజిపైఁ
దిరుగుచునుందు రెంతయును దివ్యకథాశ్రవణంబు లొప్పఁగఁ. 6

సీ. దృఢపీనవక్షోజ దివ్యదేహోల్లస త్కామినీమణుల సంగతుల వెలసి
చారుమధ్యంబుల సరసగతుల్ మీఱఁ జరియించునంగనాసమితిఁ దనరి
మత్తమాతంగ గమనవిశేషంబులఁ దనరారు శ్యామావితతి నెసంగి
రతిఁ గేలిసేయు శుభ్రవిలాసముల మించుపూవుఁబోణులగుమిఁ బొలుపుమిగిలి
తే. తనరునావ్యోమయాన సంతతుల నలరు
నాపురం బందుఁ జామరహస్త లగుచు,
రత్నభూషణగాత్రికరమ్య లగుచుఁ
దరుణు లరుదుగ సేవింత్రు పురుషవరుల. 7

క. గీతమ్ముల వాద్యంబుల, నాతతనృత్యముల సుందరాలాపములఁ

బ్రీతి వధూమణు లాపురిఁ, జేతస్సులఁ దన్పుచుంద్రు సిద్ధుల సతముల్. 8

మ. సురసంఘంబులు సర్వకాల మెలమిన్ శోభిల్లుచుండన్ మునీ
శ్వరు లోంకారపురస్సరంబుగ నుతుల్ సల్పంగ నాపత్తసం
బరులై కన్పడుచుండుఁ బుణ్యపురుషుల్ హరిప్రమోదంబులన్
నిరతంబుం జెలువారుచుం గొలుతు రానీరేజపత్రేక్షణున్. 9

తే. యామ్యసాగరతటమున నమలభూరి
వటమహీజము చెంగట భాసురాంగు
వనజనేత్రుని శ్రీకృష్ణు భక్తిఁ జూడఁ
గలుగుఁ బుణ్యాత్ము లాతారకముగ దివిని. 10

క. చెలువారుచుంద్రు సుఖవృ, ద్ధుల నొప్పుచు హేమవర్ణతులితాంగచ్ఛా
యల నెసఁగి జరయు మృతియును, గలుగని దేహంబు లొప్పఁగా మునులారా

తే. దుఃఖభారంబు లెవ్వియుఁ దోఁపకుండ
గ్లానియేఁ దృష్టయేఁదమ్ముఁ గనకయుండ
భుజచతుష్కము వెలయంగ భూరివీర్య
మున నెసంగుచు వనమాలలనుధరించి. 12

క. శ్రీవత్స లాంఛనులునై, పావన దర చక్ర గదలు భాసిల్లంగా
శ్రీవిష్ణుమూర్తివలె నట, శ్రీవిలసిల నొప్పుచుంద్రు చింతలు తొలఁగన్. 13

సీ. నీలోత్పలచ్ఛాయ నెటె నొప్పఁ గొందఱు కనకతుల్యచ్ఛాయగలిగి కొంద
ఱందు మరకతకాంతిం దగి కొందఱు వైడూర్యమణికాంతి వఱలఁ గొంద
ఱట శ్యామలచ్ఛాయ యమరఁ గొందఱు కుండలముల నొప్పారుచు నమలవజ్ర
కాంతులఁ గొందఱు కలయఁ జూడం దగియుందురు; వారల యొప్పు దేవ

ఆ. తలకునైనఁ గలుగ దల విష్ణులోకస్థు
లచ్చెరువు జనింప నలరువార
లందుఁ జొరఁగ మరల నవనిఁ బుట్టువు గల్గ
దింతవట్టు నిజ మహీనమదియు. 14

క. జగదధిప్రతి మహిమమునన్, దగునటు బహ్వర్థసిద్ధితతి యమరుఁజుఁడీ
జగములు సళించు దనుకన్, భోగ డొందుచునుండనగును బూజ్యచరితులై.

చ. పురమునునందు రూపమునఁ బొంకముగాఁ దగు యావనంబునన్
బరఁగుచు నెల్లవారు తమిపర్వఁగఁ గేళివిహారరీతి సం
చరణము సేయుచుందు రలచక్రిని రాముని నాసుభద్ర నా
దరమునఁ గాంచుచున్ దదుచితం బగుచున్న ప్రభావసంపదన్. 16

మ. పురమధ్యంబున విష్ణుమందిరము సొంపుల్ గుల్కఁగాఁ దప్తక
ర్బురసంకాశముగాఁ జెలంగుఁ దరుణార్కుం బోలి రత్నౌఘసుం

దరమై పెక్కు పతాక లొప్పఁగ నూత్నస్వర్ణసాలంబు శ్రీ
హరిగేహంబును జుట్టి యోజనము దివ్యత్కాంతి నొప్పారుచున్ 17

క. కనఁబడుచుండును ధ్వజములు, కనదుద్యచ్చిత్రవర్ణ కలితము లగుచున్
మనమున కింపును బెంచుచు, ఘనతారాగణముగూడ గ్లౌబింబ మనన్. 18

సీ. హరిమందిరం బదియలరుఁ జతుర్ద్వారముల సువిస్తీర్ణమై యలఘురక్ష
కులచేత రక్షణమలరారఁగాఁ బురసప్తకయుతమయి చాల నున్న
తమయి మనోజ్ఞమై యమలమై యొప్పారుఁ; బ్రథమపురంబు స్వర్ణమయ మల్లై
యవలిది మరకతహరియై నవలిది యింద్రనీలంబుల నెసఁగుచుండు
నవలి పురంబు మహానీలమయ మగుఁ బద్మరాగయుతంబు పంచమంబు
షష్ఠంబు సద్వజ్రసంయుతంబగు సప్తమపురంబు వైడూర్యమయమయి తగుఁ;
గనకప్రవాళాదికములు చెక్కంబడ నొప్పు స్తంభంబుల నురుతరరుచిఁ
గన సుందరంబయి కన్పడుచుండును సిద్ధులామందిర సీమనుండి

తే. దశదిశల వెల్గఁజేయుచు ధ్యానయుక్తి
వెలయు చుందురు మందిరం బెలమిఁ గనఁగఁ
దారకాన్విత చంద్రు విధంబుఁ దోఁపఁ
జేయుచుండును దద్రీతి చెప్పఁ దరమె. 19

శా. సారాశ్మస్థగితాలయంబున నివాసం బొప్పఁగాఁ జేయు లో
కారాధ్యుండు రమాసమేతుఁడయి శ్యామాంగంబుతోఁ బీతవ
స్త్రారమ్యోజ్జ్వలవేషుఁడౌచు దరముఖ్యంబుల్ కరాబ్జంబులన్
ధీరత్వంబునఁ బట్టి సాధ్వవనసం దీప్తాశయం బొప్పఁగన్. 20

సీ. వెలయుచుండును నస్త్రములనెల్ల నశియింపఁజేయనౌఁ జక్రంబు సిద్ధ మిద్ది
యట్టిసుదర్శన మమలతేజోరాశి దక్షిణకరమునఁ దనరుచుండఁ
గుందేందురజతకాంతిం దగి గోక్షీర తారహారచ్ఛాయహారితరము
నగు శంఖమును సవ్యహస్తంబునం బట్టి యలరునద్దాని ధ్వనులు జగంబు

తే. లెల్ల క్షోభంబుఁ గనఁజేయు నిదియె పాంచ
జన్య మనఁగ నావర్తముల్ సరిగవేయి
దానికిం గల;వట్టులే దారుణాఘ
నాశకరి యననొప్పి సాంద్రరుచి గలిగి 21

చ. దనుజుల దానవావళుల దారుణభంగి నడంపఁజాలి భీ
తిని గలిగించుచున్ జ్వలనదీప్తశిఖాకృతిఁ గాననౌచు చే
వనికరమేని యోర్వఁగఁ బ్రభావ మెఱుంగఁగ లేకయుండఁగాఁ
దనరుచు శార్ఙ్గపాణిదగు దక్షిణహస్తమునందు వెల్గుచున్. 22

క. తననామము కౌమోదకి, యనఁగా నొప్పారుచుండు; హరిసవ్యకరం

బున శార్ఙ్గమనెడు చాపము, కనదుద్యద్భానుబింబ కాంతి నలరెడుఁగా. 23

క. జ్వాలామాలాకుల శర, జాలంబులఁ దద్భవముల సచరాచరమై
గ్రాలెడు జగములఁ జెందును, శ్రీలలితుఁడు చక్రి లయము చెలఁగెడుతఱినిఁగా.

వ. సర్వానందకరుండై సర్వశాస్త్రవిశారదుండై సర్వలోకగురుండై సర్వదేవనమ
స్కృతుండై శీర్షనయనచరణసహస్రయుతుండై సహస్రాఖ్యుండు సహస్రాంగుండు
సహస్రభుజుండుననఁబిల్వఁబడుచు, సింహాసనాసీనుండై పద్మపత్త్రాయతేక్షణుండై
విద్యుత్తేజస్సంకాశుండై సర్వజగన్నాయకుండై సర్వగురువై సురసిద్ధగంధర్వా
ప్సరస్సంఘసేవితుఁడై యక్షవిద్యాధరనాగమునినాథసంకీర్తితుఁడై చారణసుపర్ణ
దైత్యదానవ రాక్షసగుహ్యక కిన్నరాదిత్యగణ స్తూయమానుండై శ్రీకృష్ణుం
డాదివ్య మందిరంబున వెలయుచుండు. మఱియు. 25

సీ. ఆదివ్యమందిరమందుఁ గీర్తియు మేధ ప్రజ్ఞాసరస్వతుల్ ప్రభయు బుద్ధి
మతి సిద్ధి మూర్తులు ద్యుతియు క్షాంతియు మఱిగాయత్రి సావిత్రి కాంతిసర్వ
మంగళయును నల్లె మంగళాదేవియు నారాయణియు శ్రద్ధ భూరికీర్తి
రాజిల్లుకౌశికి రాత్రి విద్యుత్తులు సౌదామినియు నిద్ర సాధ్వియైన

తే. మాయయునుదక్కఁగల్గు నమర్త్యనారు
లెల్ల శ్రీవాసుదేవుని నుల్ల మలరఁ
గొలువ నివసించి యుందురు పలుకులేల?
మఱియుఁ జెప్పంగ నెల్ల రమ్మాడ్కి నుండ్రు. 26

వ. ఘృతాచీ, రంభా, మేనకా, సహజన్యా,తిలోత్తమా, నిమ్లోచోర్వశీ, వామనా,
మందోదరీ, సుభగా, విశ్వాచీ విపులాననా, భద్రాంగీ, చిత్రసేనా ప్రమ్లోచా,
మునిసమ్మోహినీ, రామా, చంద్రమధ్యా, శుభాననా, సుకేశీ, నీలకేశా, మన్మ
థదీపి, న్యలంబుషా, మిశ్రకేశీ, ముంజికస్థలా, క్రతుస్థలా, వరాంగీ, పూర్వచిత్తి
పరావతీ, మహారూపా, శశిలేఖా, హంసలీలానుగామినీ, మత్తవారణగామినీ,
బింబోష్ఠీ, నవగర్భా, ప్రభృతిదేవయోషిన్మణులు రూపయౌవనగర్వముల నలరు
వారు సుమధ్యలును, చారువదనులును, సర్వాలంకారభూషితలును గీతమాధు
ర్యసంయుక్తలును సర్వలక్షణసంయుతలును గీతవాద్యకుశలలు, నై జగన్నాథు
దివ్యమందిరంబున నృత్య మొనరించుచుఁ బాడుచు నుందురు. వెండియు నందు.

క. కలుగవు రోగము గ్లానియు,విలయము హీమ మాతపంబు విసుఖము మఱి యా
కలి దప్పులు వైరూప్యము,బలుజరయు నదెట్టివేని పటురోగంబుల్. 28

క. పరమానంద ప్రదమై,నిరుపమ వాంఛాప్రదాననియుతిం గని మం
దిర మది చెలఁగు మనోహర,తరమై క్షితి దానిఁబోలఁ దగునవి కలవే. 29

తే. పుణ్యకర్మములొనరించుపురుషవరుల
కెట్టిలోకము లని పెద్ద లెల్లఁ బలు

చుందురో యట్టివెల్ల దామోదరుపద
షోడశాంశముఁ బోలవు శుభము నొసఁగ. 30

క. ఈరీతి హరిస్థానము,భూరిగుణాన్వితము సర్వభోగదము సుఖా
ధారం బాశ్చర్యమయం,బై రాజిలు మౌనులార యతులం బదియున్. 31

సీ. శ్రీవిభుపదము నాస్తికులును విషయాత్మకులు, కృతఘ్నులు పిశునులును జోరు
లజితేంద్రియులు చోర ననువుగా నుండదు;జగదోఘగురువయి సర్వసుజన
రక్షకుండయి తగు రాజీవనేత్రుని వాసుదేవుని సదా భక్తిమీఱ
నర్చించు వైష్ణవు లాదివ్యలోకంబుఁ జేరఁజాలుదురు శంక లరయ లేవు;

తే. దక్షిణోదధితటమునఁ దనరు కృష్ణు, బలు సుభద్రను గాంచినఁ గలుగుఁ బుణ్య
మావటోర్వీరుహము చెంత నంగము విడు,వఁగనె చేరుదు రావిష్ణు భవ్యపదము.

వ. వటసాగరమధ్యభాగమున శ్రీపురుషోత్తముని సంస్మరించిన నరుండు పురుషో
త్తమ దివ్యపదంబున మృతుఁడయి ముక్తినొందును. మునీంద్రులారా! శ్రీపతి
లోకంబును వర్ణించితిని. అదిసర్వానందకరము. భుక్తిముక్తి ఫలప్రదంబు నగు.
ఇంకేమి వినవలతు రని బ్రహ్మదేవుం డడిగిన మును లిట్లనిరి. 33

## అఱువదాఱవయధ్యాయము.

### పురుషోత్తమ క్షేత్రమాహాత్మ్య నిరూపణము.

క. సరసిజనాభుని లోకం,బరుదుగ వర్ణింపఁబడియె నది నిత్యశ్రీ
కరమై మోదావహమై,పురుషులకు నొసంగు భూరిభుక్తిని ముక్తిన్. 34

క. పురుషోత్తమ మను క్షేత్రము,పరికింపఁగ దుర్లభ మనిపలుసారులు నీ
వరుదుగఁ గీర్తించితి వట,శరీరము దొఱంగి గాంచు సాలోక్యంబున్. 35

తే. క్షేత్రమాహాత్మ్య మెల్ల సంసిద్ధఫలద,మనుచు వర్ణించితివిదానియందుఁ దనువు
వదలినంతనె శ్రీవిభు వాసలోక,మొంద దగుటను దత్క్షేత్ర ముత్తమంబు. 36

క. తనువున్ వదలుట యట ముక్తిని బొందఁగ మార్గ మనుచుఁ గీర్తించితి వీ
వినుతి మనుష్యుల కుపకృతి,నొనరించును సంశయంబు లొదవవు మదిలోన్.

తే. నరు లనాయాసముగఁ గళేబరము నందు
వదలి యామయరహితమై వఱలు విష్ణు
పదముఁ బొందుదు రనుటయే సదమలాత్మ
చాల లోకోపకారమౌ సరణిగాదె. 38

తే. క్షేత్రమాహాత్మ్యమును విని చిత్తమందు
విస్మయము పొందినారము విపులహర్ష
మొదవె మఱియు గగుర్పాటుపొడమె నా ప్ర
యాగమాదిగఁ గలుగు క్షేత్రాళికంటె. 39

సీ. ఇది యుత్తమం బయ్యెఁ నిలఁ గలతీర్థాళి సరసులు నదులును జక్క నిట్లు
వర్ణింపఁబడ వయ్యె వారిజసంభవా యీక్షేత్రవర్యంబు నెన్నినట్టు
లింతకుఁ బూర్వమీ వేక్షేత్రమును జెప్ప విపుడు నీభావంబు నెఱిఁగినార
మిద్ధానిఁబోలు నదెద్దియు లేదని నమ్మినారము నాఁగ నళినభవుఁడు
తే. సత్య మిది సత్య మోమునిచంద్రులార
వినుఁడు పురుషోత్తమక్షేత్రమునకు సమము
గలదు వేఱొక్కక్షేత్రమ్ము పలు కసత్య
మీజగంబునఁ దత్తుల్య మెన్న లేదు. 40

క. ధరఁగల క్షేత్రాయతనము, లరయం బురుషోత్తమాఖ్య నలరెడు పద్మా
వరవాస క్షేత్రమునకు, సరి సేయఁగ షోడశాంశసమతం గనునే. 41

క. పరమాత్ముఁడైన కమలా, వరుఁ డెవ్విధి సర్వదేవవర్యుం డగునో
పురుషోత్తమ సుక్షేత్రము, ధరఁగల క్షేత్రములలో నితాంతము ఘనమా. 42

సీ. సురలందుఁ దలఁప విష్ణువు వర్యుఁ డెట్టులో సకలతీర్థంబుల సర్వపుణ్య
దేశంబులందు నీదివ్యస్థలం బుత్తమం బనియెఱుఁగుఁడీ మానులార
తారకలందు నిశారాజు సరసులవారిధి వసువులఁ బావకుండు
రుద్రులలో శంకరుఁడు వర్ణములలోన బ్రాహ్మణుఁ డెల్ల పర్వతవితతిని
తే. మేరువును బక్షివితతి నమూరుసహజుఁ
డెల్లశిఖరులఁ దుహినాచలేంద్ర మంగ
నాళి శ్రీలక్ష్మి నదుల జాహ్నవి గజౌఘ
మందు నైరావతమువర్య మట్టు లిదియు. 43

క. మునులందు భృగువు సైన్యే, శనికరమున శంకరాత్మజన్ముఁడు సిద్ధా
ళిని గపిలుం డెట్లధికతఁ, గనునో పురుషోత్తమంబు గను నటుకీర్తిన్. 44

వ. తురగంబుల నుచ్చైశ్శ్రవస్సును, గవుల నుశనసుండును, మునులయందు
వ్యాసుండును, యక్షరక్షస్సులందుఁ గుబేరుండును, నింద్రియాళి మనస్సును,
భూతంబుల నవనియు, వృక్షంబుల నశ్వత్థంబును, ద్రుతగతులందుఁ బవనుండు
ను, భూషణావళిఁ జూడామణియు, గంధర్వులందుఁ జిత్రరథుండును, శస్త్రం
బులఁ గులిశంబును, వర్ణంబులయం దకారంబును, ఛందస్సులందు గాయ
త్రియు, నంగంబులయం దుత్తమాంగంబును, స్త్రీలయం దరుంధతియు, విద్యల
యందు మోక్షవిద్యయు, మనుష్యులయందు రాజును, ధేనువులయందుఁ
గామధేనువును, సర్వరత్నంబులందు సువర్ణంబును, సర్పంబులందు వాసుకియు,
సర్వదైత్యులయందుఁ బ్రహ్లాదుండును, శస్త్రభృత్సంఘమునందు శ్రీరాముం
డును, ఝషంబులందు మకరంబును, మృగంబులయందు సింహంబును, సము

త్రంబులయందు క్షీరాబ్ధియు, జలభూతంబులయందు వరుణుండును, సంయ
ములయందు యముండును, దేవర్షులయందు నారదుండును, ధాతువులయందుఁ
గాంచనంబును, బవిత్రంబులయందు దక్షిణయుఁ, బ్రజాపతులయిందు దక్షుం
డును, ఋషులయందుఁ గశ్యపుండును, గ్రహంబులయందు భాస్కరుండును,
మంత్రంబులయందుఁ బ్రణవంబును, యజ్ఞంబులయం దశ్వమేధంబును, నోష
ధులయందు ధాన్యంబును, దృణంబులయందుఁ దృణరాట్టును, సమస్తతీర్థంబుల
యందు సంసారతారకంబగుధర్మంబు, నెట్లు శ్రేష్ఠంబు లట్లు శ్రీపురుషోత్తమ
క్షేత్రంబు సర్వక్షేత్రోత్తమం బని పలికి మఱియు నిట్లనియె. 45

---

## అఱువదియేడవయధ్యాయము.

అనంతవాసుదేవమాహాత్మ్యవర్ణనము.

తే ధర్మతీర్థములందు క్షేత్రజపహోమ, తపములందును వ్రతతతి దానగణము
నందు నేఫల మబ్బు నరాళి కిందుఁ, గలుగు ఫలములకది సరికాదు నిజము.

క. మరలఁ మరలఁ బలుకఁగ, గర మాదృతిఁ బూన నేల? కమ్ర క్షేత్రో
త్కరమునఁ బురుషోత్తమమే, వర మిది సత్యం బె యగుఁ ద్రివారంబులకున్.

క. పురుషోత్తమసు క్షేత్రము, వరభక్తిని నొకటిఁ గాంచి వారిధి నొకమా
ఱరుదుగ స్పృశించినంతనె, నిరుపమఫల మబ్బు మౌని నికరములారా. 48

తే. బ్రహ్మవిద్య జపింప గర్భమున నునికి, గలుగనట్లుగ నీక్షేత్రకంధిదర్శ
నమున గర్భనివాసము నరుల కెల్ల, మరలఁ గలుగదు నిజ మిద్ది మౌనులార.

సీ. హరిసన్నిధిని మహత్తర మను విఖ్యాతి నందినపురుషోత్తమాఖ్యఁ దనరు
క్షేత్రంబునఁ మనస్సిద్ధి మీఱఁగ వర్ష ముపవాస ముండుట యొప్పునట్టి
శక్తిలేకున్న మాసమునైన నుపవాసమునఁ గడుపంగ నో మనుజవర్యుఁ
డద్దాన జపయుక్తి నగుఫలంబును హోమతపములఁ గలుఁగంగఁ దగిన సుఫల

తే. మబ్బు; నంతియగాక దివ్యమగు ముక్తి
పదముఁ లభియించు నెందు శ్రీపద్మనాభుఁ
డఖిలయోగీశ్వరుం డుండు నందు సకల
భోగములఁ బొందుఁ జిరకాలమును నిజంబు. 50

క. సురనారీ సేవితుఁడై, చిరకాలం బందెయుండి క్షితి జనిఁ గాంచుఁ
నిరుపమయోగి కులంబునఁ, బరమజ్ఞానంబు గల్గు బ్రాహ్మణు నింటన్. 51

తే. విష్ణుయోగంబుఁ గల్గి యాపిదప ముక్తిఁ
గాంచు; మునులార! కల్పవృక్షప్రభావ
మట్లె రామునియును సుభద్రాంబయును మ

హాత్త్వమును జెప్పినాఁడ మీ కాదరమున. 52

వ. మార్కండేయేంద్రద్యుమ్నమాధవులమాహాత్మ్యంబును, స్వర్గద్వారప్రభావం
బును, సాగరస్నానమార్జనవిధులను, భాగీరథీసమాగమంబును, వివరించితి.
సర్వాశ్చర్యమయంబు రహస్యంబును, బుణ్యంబును బురాణంబు సంసారమోచ
నంబు నగు నీమాహాత్మ్యంబు వింటి రిఁక నేమి వినవలతు రనిన మును లిట్లనిరి.

చ. పురుషవరేణ్య సత్కథలు పుణ్యతమంబులు వాని విన్న మా
కరుదుగ నింకనుఁ వినఁగ నౌ ననుబుద్ధియెః గాని తృప్తి యె
క్కరణిని గల్గు? నిప్డు వినఁ గాంక్ష జనించె ననంతవాసుదే
వు రహితపాపసత్కథలఁ బూన్కి వచింపుము లోకనాయకా. 54

క. మును పా దేవునిమహిమం,బును విస్తారముగఁ జెప్పఁబూనవు గానఁ
విన వేఁడుకయ్యెఁ జెపుమా,యను మౌనుల కనియెఁ బంకజాత్మజుఁ డెలమిన్.

చ. మునివరులార; సారతరముఁ వచియింతు ననంతవాసుదే
వుని మహిమంబు లోకతతిఁ బూజ్యము దుర్లభముఁ సనాతనం
బును నగుఁ; బూర్వకల్పమునఁ బుట్టితి నేఁ బరమాత్మనుండి యం
త నపుడె విశ్వకర్మయను నామముఁదాలిచి దేవశిల్పియై. 56

తే. కల్పనానల్పమతియయి క్రాలువానిఁ
బిలిచి యిట్లు వచించితిఁ బ్రీతిదనర
వాసుదేవుని ప్రతిమను భాసురాత్మ
మయిగ భువి నుండఁజేయుమా మహితశక్తి. 57

క. దేనిం గాంచిన యంతనె,మానవు లింద్రాదిదేవ మాన్యులు భక్తిం
బూనుచుఁ గర్కశరాక్షస,దానవభీతిం దలంగి తగి సుఖయుక్తిన్. 58

తే. మేరుశిఖరంబునందు న మేయవిభవ,మలరఁ దగుస్వర్గమున నుండఁగలరో వాసు
దేవుపూజావిశేష విస్తృతిఫలముగ,నట్టి శ్రీవాసుదేవుని నయ్యనంతు. 59

క. ప్రతిమగఁ బూజార్థము నీ,వతులితశక్తిని నొనర్పు మను నాపలుకుల్
జతనంబున విని యప్పుడె, ప్రతిమను దరచక్రగదల భాసిలుదానిన్. 60

తే. సర్వలక్షణసంయుక్తిఁ జాలుదానిఁ
బుండరీకాయతాక్షులఁ బొలుచుదానిఁ
మఱియు శ్రీవత్స మనెడులక్ష్మము చెలంగు
దాని నిర్మించె నేర్పు నితాంత మలర. 61

సీ. వనమాలికావృత వక్షమొప్పెడుదాని ముకుటాంగదంబులఁ బొలుచుదానిఁ
బీతవస్త్రము దాల్చి పీనాంసములఁబొల్చి కుండలాలంకృతిఁ గొమరుమిగిలి
యొప్పెడు నట్లుగ నొనరించె నంతట గుహ్యామంత్రంబులఁ గూర్చి నేను
దానిఁ బ్రతిష్ఠించి ధరణి నుంచితిః నప్డు శక్రుండు దేవతా సమితిఁ గూడి

తే. గజవరేణ్యము నెక్కి యక్కడకుఁ బోయి
పూజలను దానిఁదన్ని యాపూజ్యశిలను
గైకొనుచు స్వర్గమును జేరి గాఢభక్తి
నియతకరణత్రయుండయి నిర్మలుఁడయి. 62

క. క్రూరుల దారుణకర్మ,ప్రారంభుల వృత్రనముచులాదిగఁ దగు దే
వారులఁ జెండి జగంబుల, నారూఢప్రాభవమున నలరుచు నేలెన్. 63

క. త్రేతాయుగ మరుదేరఁగ, దైతేయగణప్రభుండు దశకంధరుఁ డ
త్యాతతపరాక్రముఁడు తన,చేతము బిగఁబట్టి తపము సిద్ధులుపొగడన్. 64

ఆ. అయుతవత్సరంబు లాహారమును మాని, యాచరించె నుగ్రమగుచు నద్ది
పరమదుష్కరమయి పరఁగె దానికిఁ దృప్తి,నంది నే వరంబు లతని కిడితి. 65

క. వరముల కవ్వానికి ఫల, మురగులచే దితిజదివిషదోఘముచే సం
గరమున శస్త్రంబులచే, సురతరశాపాళిఁ జావకుండఁగ నయ్యెన్. 66

తే. శమనుదూతలచేఁ గూడఁ జావు గలుగ
దతని కిట్టివరంబుల నంది యమర,
యక్షముఖులఁ గుబేరుని నని జయించి
శతముఖుజయింప నెంచి తాఁ జనియె ననికి. 67

ఉ. ఘోరతరంపు టాహవము క్రూరతరుండగు పంక్తికంఠుఁ డే
పార నొనర్చి దేవపతి నప్డు జయించెను దత్సుతుండు శ
క్రారిని మించువాఁడు సుమహత్తరవిక్రముఁ డింద్రజిత్తు నాఁ
బేరు వహించె నాయనిని వింతగ నేనును వింటి దానినిన్. 68

ఆ. మేఘనాదుఁ డనఁగ మేటిశూరుఁ డతండె, యింద్రజిత్తనంగ నెసఁగె నంత
సమరపతి జయించి యమరావతిని జొచ్చి, శక్రునింట విడిసె శౌర్య మలర. 69

క. కనె నం దంజనతుల్యం, బనుపమ సల్లక్షణాత్త మమలశ్రీవ
త్సనియతచిహ్నము నీరే, జనిభాయతనేత్రము నయి సమధికకాంతిన్. 70

క. చెలువారు వాసుదేవుని, సులలితవిగ్రహముఁ జాల సొంపుగ నది యు
జ్జ్వలవనమాలాభూషిత,ము లలితముకుటాంగాది భూషితమునునై. 71

క. దరచక్రగదాభూషిత, కరకమలమునై యమూల్యకాంచన వస్త్రా
భరణాన్వితమై నాలుగు, కరములఁ జూడంగఁబడుచుఁ గామప్రదమై. 72

చ. తనరుచునుండఁ గాంచి తను ధన్యునిగాఁ దలపోయుచున్ మదిన్
ఘనతరరత్నసంతతులఁ గాదని యాప్రతిమన్ గ్రహించి వే
చనియెను వ్యోమయానమున సాధుగణాన్వితుఁడా విభీషణుం
డనఘుఁడు పత్తనాధిపతి యాదశకంఠుని పిన్నతమ్ముఁడున్. 73

క. మతిమంతుఁడునై శ్రీహరి, ప్రతిమను దేవేంద్రదివ్యభవనవరప్ర
చ్యుతిఁ గన్న దానిఁ గని సన్మతిరోమాంచితతనుండు మహితవిభవుఁడున్. 74
క. పరిపక్వపూర్వపుణ్యుఁడు, పరమేశ్వరుకరుణ కడుపాత్రుఁడు నగుటన్
బరికించి దానివిభవముఁ, బరిగ్రహించెను ముదంబు పర్వచు నుండన్. 75
చ. శిరము తదీయపాదసరసీరుహయుగ్మము సోఁక మ్రొక్కి హ
ర్షరతిని గాంచుచిత్తమున జన్మము నేఁడు ఫలించె నాతప
స్స్ఫురణము ధన్యమయ్యె ననిసూనృతవాక్కులఁ బల్కుచున్ సహో
దరవరుఁ జేరఁబోయి కరతామరసద్వయి మోడ్చి యిట్లనున్. 76
చ. దనుజవరేణ్య! యీప్రతిమ ధన్యమతి న్ననుఁగాంచి యిచ్చి యీ
యనుజుని నుద్ధరింపుము మురారిసువిగ్రహమైనదీని నే
ననయము పూజలం దనిపి యంతములేని భవాబ్ధి దాఁటుదున్
నను సఫలప్రయత్నుని నొనర్పుము నా విని రావణుండనున్. 77
క. అనుజా! ప్రతిమను దీనిని, గొనుమా నాకేల యిద్దికోర్కి శతానం
దునిఁ బ్రీతుఁజేసి విజయం, బునుగంటిఁ ద్రిలోకములను బూజ్యుఁ డజుఁడెసూ
చ. అనుటయు బుద్ధిమంతుఁడయి హరిగుణుండగు నవ్విభీషణుం
డనఘుఁడు దానిఁ గైకొని శతాబ్దము లష్టయుతంబు లొప్పఁగా
వనజదళాక్షుఁ బూజలను వారకచేసి జరామృతుల్ తనుం
గననివిధంబు సిద్ధులను గమ్రసుఖంబుల సాధువాంఛలన్. 79
క. లంకాధిపత్యమును నక, లంకప్రఖ్యాతిఁ గాంచి లలితవిభూతిన్
సంకటవిరహితచిత్తముఁ, బంకేజాక్షుపయి భక్తిఁ బడసె ధ్రువముగన్. 80
చ. అనుటయు మౌను లిట్లడిగి రంబుజసంభవ విస్మయంబు దోఁ
చెను బరమామృతంబె యనఁ జెల్వగు నీకథ విన్నయంత శ్రీ
వనజదళాక్షు వైభవము వర్ణనచేయుము తృప్తిదీఱఁగా
వినవిన వేడ్క యయ్యెఁ గడువింతగదా యిది వీనులంబడన్. 81
క. పరమేష్ఠి యంత వారికి, మురహరుమహిమంబుఁ జెప్పఁబూని యనియె నా
శరుఁ డంతఁ గ్రూరచిత్త, స్ఫురణము మీఱంగ లోకపూజ్యుల సురలన్. 82
క. మనుజుల సిద్ధుల సాధ్యుల, ననిఁ జంపి తదీయసతుల నాత్మనగర మం
దునిచి మహీసుతకొఱకై, చనియెను గపటంబు పూని సాధ్విని దేఁగన్. 83
క. హరిహిరణ్మయ హరిణస, మారంభముగాఁ బ్రయత్న మవ్వని సాగం
గా రావణుఁ డామెం గొని, చేరెన్ లంకాపురంబు శ్రీలు తొలంగన్. 84
క. తనసతిఁ గొనిపోవుట నెమ్మనమున నూహించి క్రోధమార్తాండుండై
తనతమ్ముఁ గూడి రావణు, ననిఁ జంపం గోరి తొలుత నమరేంద్రసుతున్. 85
క. శరమొక్కటఁ దనుమాడెను, హరిపతి సుగ్రీవుఁ జేసె నభిషేకవిధిన్

సురపతిపౌత్రుని యువరాజు రహిం బొనరించెఁ బార శోకం బుడుగన్. 86

వ. అంత రామచంద్రుండు హనుమన్నలనీలజాంబవత్పనస గవయ గవాక్ష ప్రభృతులగు మహోత్తమబలవీర్యసంపన్న వానరులం గూడి ధరణీధరంబుల భూరుహంబుల సేతువుం గట్టి సాగరంబు దాఁటి లంకం జుట్టుముట్టి మహాఘోరసంగ్రామం బొనరించె. ప్రహస్త నికుంభ కుంభ నరాంతక యమాంతక మాలాఢ్య మాలికాఢ్య ప్రముఖదానవవీరులం దునుమాడియింద్రజిత్కుంభకర్ణులంజంపి రావణుంబొలియించి యగ్నిపరిశుద్ధురాలగు వైదేహిని బరిగ్రహించివిభీషణునిలంకారాజ్యమున కభిషిక్తుంజేసి వాసుదేవప్రతిమనుగైకొనిపుష్పకవిమానం బెక్కి పూర్వపరిపాలితంబగు నయోధ్యాపురంబుఁజేరె. సోదరులగు భరతశత్రుఘ్నులయందు రాజ్యభారము నునిచి పురాతనయైన స్వమూర్తిని జక్కఁగ నారాధించి పదునొకండువేల సంవత్సరములు చతుస్సాగరముద్రితభూవలయంబును బరిపాలించి స్వలోకము నొందె. వైష్ణవలోకంబు నొందఁబోవు నపుడా ప్రతిమను సముద్రున కొసంగుచు నిట్లుపలికె. 87

క. జలనాథా! యీప్రతిమను, జలముల నంతర్హితముగ సాధ్వస్ఫున లి
ష్ఠులఁజేయుచు నుండుమ యని, పలికె మహామానులార భద్రుఁడు డెలమిన్.

సీ. ద్వాపరయుగము రా ధాత్రిఁ బాపాత్ముల వధియించి ధర్మంబు వఱలఁజేయఁ
గా జగద్గురు వగు కంజలోచనుఁ డవతార మొందును లోక వారమాత్మ
సద్భావములు లేక సాధుమార్గంబుల విడనాడుటం గాంచివిమలకరుణ
వసుదేవకులమున వాసుదేవుఁడు పుట్టి కంసాదులం జంపఁగా ననంతు
తే సాయముం గొని యుండెడు సమయమందు
నాప్రతిమ నుద్ధరించు వాంఛాప్రదంబు,
గాన లోకహితార్థ మొక్కపని కొఱకు
నల్లపురుషోత్తమక్షేత్ర మందు దాని. 89

క. తానై తీయును జలపతి మానితతోయములనుండి మహి నది యందే
మానవులకు వాంఛల నిడు, మానస మలరంగ నుండు మానులు గొలువన్.

క. సురలకుఁ గల్గెడు నార్తుల, హరియించుచుఁ గోర్కు లిడుచు నమలమునిసము
త్కరములు పూజింపఁగ నా, పురుషోత్తమ నామమునను బొలుచు స్థలమునన్.

క. జను లెవ్వ రాయనంతుని, ననంతమహిమాఢ్యు విభుని నాదరభక్తుల్
పెనఁగొనఁగా సేవింతురొ, మనమున వాక్కునను గృత్యమండలి శ్రద్ధన్. 92

క. వారలు పరమపదంబును, జేరుదు; రొకసారి సర్వసిద్ధిప్రదు నా
శ్రీరమణుని భక్తిరతిన్, గోరి నమస్కృతులఁ దన్పఁ గోరిక లమరున్. 93

తే. రాజసూయాశ్వమేధాధ్వరము లొనర్పఁ
గలుగు ఫల మెల్ల నద్దానఁగలుగు నిజము,

దశగుణంబయి యాభక్తతల్లజుండు
కామగమగు విమాన ముత్కంఠ నెక్కి. 94

ఆ. అందుఁ బొదలుచున్న యమలరత్నాదులఁ, గని ముదంబు నొందుచును ద్రిసప్త
కులము నుద్ధరించి లలితసురాంగనా, కలితుఁ డగుచు విష్ణుకమ్ము పదము. 95

క. తను గంధర్వులు వినుతింప నిజాశయముల్ ఫలింపఁ బరమాత్మునితో
ననువొంద నుండు నచ్చటఁ, గనఁ డాతఁడు జరను మృతిని గడు శోకములన్.

వ. అందు సకలభోగంబు లనుభవించి దివ్యరూపధరుండై ప్రళయంబువఱకు నుం
డిపుణ్యక్షయంబు గాఁగా మరల ధరణియందుఁ జతుర్వేదవిశారదుండై జన్మిం
చి విష్ణుభక్తిని యోగంబు నభ్యసించిముక్తినొందు. మునులారా! వాసుదేవ
మాహాత్మ్యంబు వచియించితి. భగవన్మహిమంబును విస్తరించివచింప నెవ్వఁడు
సమర్థుఁ డగునని పలికి మఱియు బ్రహ్మ యిట్లనియె. 97

---

## అఱువది యొనిమిదవ యధ్యాయము.

### పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యము

క. మునులార యనంతుని పా, వనమహిమము క్షేత్రసంఘవర్యంబై చె
న్నునఁదగి పురుషోత్తమ మనఁ, జను క్షేత్రమహత్త్వమును బ్రసంగవశమునన్.

క. పురుషార్థచతుష్టయముల, నరులకు నది యిచ్చుఁ గావున జక్కంగాఁ
బరిశీలించి వచించితి, దరచక్రగదాధరుండు తత్క్షేత్రమునన్. 99

క. నివసించి యుండుఁ గాంచన, సువస్త్ర మొప్పారుచుండ క్షోణిని ధర్మం
బు వికలముగఁ జేయు నమ, ర్త్యవిరోధులఁ గంసముఖుల నతిశయశక్తిన్. 100

క పాలియించి యందె యుండును, సులలితపురుషోత్తమాఖ్య శోభిలు భూమీ
స్థలమున నివసించిన శ్రీ, జలజాక్షుని నిర్జరవరసముదయ వినుతున్. 101

సీ. సంకర్షణు సుభద్ర సమధికభక్తిచేఁ గనుఁగొన్న ధన్యతఁ గాంత్రు నరులు;
సర్వలోకాధిపు సర్వకామప్రదు హరిని శ్రీకృష్ణుని ధ్యానయోగ
మునఁ గొల్చువారలు ముక్తులే యగుదురు; శ్రీకృష్ణునందు స్వచిత్తములను
నిలిపి యాపరమాత్ము నిత్యముఁ దలఁచుచు రాత్రిఁ బరుండి యారాత్రి నందె

తే. గడపి యుదయంబుననె లేచి కమలనయనుఁ
గొలుతురో వారు దేహమాస్థలమునందె,
వదలి శ్రీహరిలోకను జేరుదురు మంత్ర
హుతహవి స్సగ్నిహోత్రుని నొందునట్లు. 102

చ. మునివరులార! శ్రీహరియు మోదమునం బురుషోత్తమస్థలం
బునఁ జను క్షేత్రవర్యమున నాదృతి నెవ్వనిచేత భక్తిఁ గ

న్గొనఁబడు ముక్తి నాతనికిఁ గోరక యిచ్చును; బూర్వపుణ్య మెు
య్యన ఫలియింప ముక్తిఁగను నంతటికృత్యము చేయు ధన్యుఁడే. 123
క. శయనోత్థానము లనఁబడి, సుయశంబున నొప్పుచున్న శుభతిథులం ద
వ్యయునిఁ బలుని సుభద్రను, నయనము లలరంగఁగాంచు నరు నరహరియున్.
క. తనదివ్యపదముఁ జేరుచు, ననిశం బెవ్వారు భక్తి హరి బలు భద్రాం
బను జూడఁ గల్గుదురొ శ్రీ, వనజాక్షుని పదముఁ గాంత్రువారు ధ్రువముగన్.
తే. వార్షికములగు మాసముల్ వరుస నాల్గు
తత్థ్సలంబున గడపెడు ధన్యుఁ డెవఁడొ,
తీర్థయాత్రాఫలంబుల నర్థి నాతఁ
డొందు సందియమే దీననుండఁ బోదు. 106
చ. అనిశము తత్థ్సలంబున మహామతు లుండెడుచోట నుండు నే
మనుజుఁడు క్రోధముఁ విడిచి మానస మాత్మవశంగతంబుగాఁ
దనరఁగ నామహాత్ముఁడు నితాంతతపఃఫల మందు;నింకనుఁ
వినుఁ డయుతాబ్దముల్ ధరణి విస్తృతతీర్థములందు భక్తిచేఁ. 107
తే తపమొనర్చిన ఫలమేది తనరు నద్ది
యొందు మాసము నిలిచి యహీననియతిఁ
దపము చేసినఁగల్గు; నోధన్యులార
వినుఁడు మఱియును వివరింతు ఘనఫలముల. 108
ఆ. తపము బ్రహ్మచర్య మపరిమితం బగు,సంగమును వదలుట సాగెనే న
దే ఫలంబు గలుగు నీక్షేత్రదర్శన,మునను దత్ఫలంబుఁ గను నరుండు. 109
సీ. సర్వతీర్థంబుల స్నానము చేసిన దానము చేసినఁ దనరు నెట్టి
ఫలము, తదధికమౌ ఫల మీస్థలంబున వసియింపఁ గలుగు;సువ్రతములోలి
నాచరించిన నియమావళిఁదీర్చిన లభియించు నెట్టిఫలంబు దాని
కెక్కుడౌ సత్ఫల మిందు వసించినఁ బ్రాప్తమౌ; మఱియును బహువిధాధ్వ
ఆ. రములు చేయ నేఫలము గల్గు నయ్యది,క్షేత్రవరమున నిటఁ జెలఁగి నియతి
వాసుదేవుఁ జూడ వరుస లభించును,బెక్కుమాటలేల నిక్కువ మిది 110
క. పురుషోత్తమసుస్థలమున,శరీర మెవ్వాఁడు కల్పశాఖి నికటమం
దురు భక్తి వదలు నాతఁడు, పురుషోత్తమదివ్యపదముఁ బొందు ధ్రువముగఁ
క. పారావారవటాంతర,ధారణి నెవ్వాఁడు విడుచుఁ దనువు నతఁడె పు
ణ్యారంభుఁడు మోక్షంబును,జేరును సంశయము దీనఁ జెందదు సుండీ. 112
క. తనమది వాంఛింపక యే,మనుజుం డట వదలుఁ దనువు మానసిదుఃఖా
ళిని బాసి యతఁడు మోక్షం,బును దుర్లభతమము వేగ పొందు నిజముగఁ.
వ. కృమికీటపతంగాదులుంగూడ నట దేహమును వదలినఁ బరమకళ్యాణపదము

లభియించు. మునులారా! లోకులభ్రాంతిం బరికింపుఁడు. ఇతరతీర్థంబుల సేవింపఁ బోవుచుందురు. వారొక్కపురుషోత్తమ క్షేత్రసేవనమున సమస్తతీర్థసేవాఫలంబును గాంతురు. కాన శ్రద్ధచే బురుషోత్తమక్షేత్రంబును దర్శించునది. పురుషసహస్రములలో నొక్కపుణ్యపురుషుం డొక్కరుండే కలఁడు, అతఁడు ప్రకృతికిఁ బరుండు. కావున వేదంబులందును బురాణంబులందునుబురుషోత్తముఁడని పరికీర్తితుం డయ్యె. ఎవ్వాఁడు వేదాంతములందును బురాణములందును బరమాత్మ యని కీర్తింపఁబడునో యాదేవదేవుఁడు నివసించుట నీక్షేత్రంబు పురుషోత్తమనామంబునఁ బరఁగు. మార్గమందుఁగాని శ్మశానమందుఁగాని గృహమండపరథ్యాప్రదేశములందుఁ గాని యిచ్ఛచేనొండె ననిచ్ఛచే నొండె. శ్రీపురుషోత్తమక్షేత్రంబున దేహంబును ద్యజించిన ముక్తిలభించును. కావున సర్వప్రయత్నములచేతను దక్షేత్రంబున ముక్తికాంక్షులగు వారు మృతినొందఁ బ్రయత్నింపవలయు. పురుషోత్తమమహిమము నెవ్వఁడు వినుతింపఁగలఁడు. అందుండు వటవిటపి దర్శించిన బ్రహ్మహత్య తొలంగు. అస్థలమాహాత్మ్యంబున నేకదేశంబు వచియించితిని. వర్షశతంబులు చెప్పినను దన్మహిమము వచింపనలవిగాదు. మునులారా! ముక్తినొంద మీకిచ్ఛగలదేని క్షేత్రవరంబునందు నివసింపుఁడు. అను పరమేష్ఠి పలుకులువిని పురాణమును లా క్షేత్రంబున నివసించి పరమపదమునొంద నర్హులైరి. కావునఁ బురుషోత్తమక్షేత్రవరంబు నివాసార్హంబు సకలవాంఛాప్రదంబుముక్తిప్రదంబు నగు. అని బ్రహ్మకు మునులకునైనసంవాదమును వచించివ్యాసమహర్షి సత్కథాశ్రవణకుతూహలంబున నున్న మునులకు మరల నిట్లనియె. 114

అటువదితొమ్మిదవయధ్యాయము.

కండుమహర్షిచరిత్రము.

చ. మునివరులార! సన్మృగసమూహసుఖావహమై తనర్చి పెం
పునఁ బురుషార్థరాశి నిడు పుణ్యపదంబున నందుఁ గండుఁ డన్
మునిపతి దివ్యతేజమునఁ బొల్చుచు సూనృతవాదియై మనం
బనిశము సంయతం బగుచు నారయ భూతహితంబుగాఁ దగన్. 115
క. జితమత్సరుండు మఱియు వ్రిజితసర్వేంద్రియుఁడు సకలసిద్ధియుతుఁడు వే
దతతిన్ వేదాంతము నంౢదతిశయపాండిత్య మొప్ప హర్షయుతుండై. 116
క. పురుషోత్తమ సుస్థలమున, నిరతము నివసించి దేవనికరేశుని శ్రీ
హరి నిత్యము సేవించుచు,జరపెం గాలంబు పెక్కుసంవత్సరముల్. 117
క. మును లింకను నట నుండిరి, ఘననియమాదరులు భూతగణహితులు మనం

బును వశగతముగ నుండం,గను జేసికొనంగఁజాలు ఘనులు వికోపుల్. 118

క. అనువ్యాసుని వాక్యంబులు, విని యాకండుం డెవండు వృత్తంబును దే
నిని బూని సిద్ధినొందెను, వినఁగోరెతి మవ్విధంబు వివరింపు తగన్. 119

చ అనుటయు నప్పరాశరుని యాత్మజుఁ డిట్లను గండువృత్తముల్
వినఁదగు దానిఁ బాపతతి వేగ నశింపఁగఁ జేయుదాని స
ద్వినుతులఁ గాంచుదాని వినిపింతుఁ గ్రమంబున మీకు నిప్డు పా
వనతమగౌతమీతటము వర్ణితమై విజనంబునై తగున్. 120

శా. తత్తీరంబునఁ గందమూలఫలసంతానంబు పుష్పావళుల్
వృత్తాకారతనొప్పుగుల్మసులు నెంతే మోదముం గూర్చుచున్
నెత్తావుల్ వెదఁజల్లు వాయువులు సాంద్రీభూతవృక్షాళి యు
ద్వృత్తిన్ మాయఁగఁజేయు దర్భలు శకుంతేశావళుల్ రాజిలున్. 121

క. నానామృగగణయుతమై, నానావిధశుకరుతము లనయము వెలయఁగా
మానితమై తగు నచ్చట, మౌనీంద్రుండై సుశాంతమానస మలరన్. 122

తే. ఆశ్రమంబును గల్పించి యనఘుఁడైన
కండుముని యుండెః నందు నఖండభూతి,
నలరు సర్వర్తుసుమఫలంబులు కదళులు
చూడఁ జూడంగ నెంతయుఁ జోద్యముగను. 123

సీ. ఆమహాముని యట నద్భుతమౌతపం బొనరించె వ్రతముల నురుతరోప
వాసంబులను స్నానవర్ణ్యనియమముల దానంబులను నది ధన్య మయ్యెఁ
బంచాగ్నిమధ్యమపద్ధతి గ్రీష్మమునందు వర్షంబుల నవనిమీఁదఁ
గంతంబుదనుక నికామశీతంబగు జలమొప్పు చుండెడు కొలఁకులందు

తే. హిమము గురియుకాలంబున నెంతొ నిష్ఠఁ
దపమునల్పెను గండుఁడు తత్తపమున
కమరగంధర్వసిద్ధవిద్యాధరు లొగి
విస్మయావిష్ట చిత్తులై వెలసి రొకట. 124

చ. మునిపతి తత్తపోనియతి మూఁడుజగంబులు తాప మొందఁగా
నొనరిచెఁ దత్సమాధిఁ గని యొక్కట దేవత లింతధైర్య మిం
తనివచియింప రానినియమాన్విత సాధుతపస్సు మున్ను భూ
మిని గనినార మే యనుచు మించినవేడ్క నుతించి రెంతయున్. 125

ఉ. అంతట నింద్రుఁగూడి యమరావళి మంత్ర మొనర్చె నిట్లు కా
లాంతకుఁ బోలితీవ్రనియమాదృతిమైఁ దప మొప్పఁ జేయ లో
కాంతకమౌఁ గదా యిది; మహర్షిని వీనిని జంచలాత్ముఁగా
నింతటఁ జేయఁగావలయు నీయది విఘ్నము నొందఁ జేయనౌ. 126

చ. త్రిదశుల యాశయంబుఁ గొని దివ్యవయస్సు చెలంగ రూపసం
పద చెలువార దంతరుచి భవ్యముగాఁ దనరన్ సుమధ్యయై
త్రిదశనితంబినీమణి మతిస్థిరతంగను సద్ది యిద్ధియే
సదమలకాంతి నంచు నుతిఁ జాలఁగఁగాంచినదాని నాదృతిన్. 127

ఆ. పిలువఁ బంచి యింద్రుఁ డెలమిఁ బీనస్తని
సర్వలక్షణాఢ్యఁ జారుగాత్రిఁ
బ్రమదలందు మిన్నఁ బ్రమ్లోచ యనుదానిఁ
గాంచి పలికె సమయ మెంచి యిట్లు 128

చ. వనితరో యొందు సత్తపము వారనిపూనికఁ గండుమౌని తా
నొనరుచు చున్నవాఁడొ మది నూహను దేనిని గాంచినాఁడొ నె
మ్మనమున సంశయింప కలమౌనితపంబొగి విఘ్నయోగముం
గన నొనరింపఁ బొమ్ము మునిఁ గాఱియపెట్టుము సత్వరంబుగన్. 129

క. అనివిని ప్రమ్లోచయు నిట్లను జిష్ణుని జూచి నీదునానతిఁ జేయం
గను బూనెద దేవేంద్రా, మనమున శకింతు బ్రదుకుమాటఁ దలఁచుచున్. 130

క. ముని బ్రహ్మచర్యనిష్ఠుం, డనలార్కసముప్రభుండు నత్యుగ్రతపం
బొనరుచు చున్నాఁడాస, క్తిని దేజము చూడఁజూడఁ దీక్ష్ణతఁ గనఁగన్. 131

క. తనతపముఁ జెఱుప వచ్చిన, ననుఁగని క్రోధానలునికణంబులు పొలయన్
ఘనతేజుఁడౌట దుస్సహా, మనఁ దగుశాపం బొసంగు నమరాధీశా. 132

వ. ఊర్వశియు, మేనకయు, రంభయు. ఘృతాచియుఁ, బుంజికస్థలయు,విశ్వాచియు సహాజన్యయుఁ, బూర్వచిత్తియుఁ, దిలోత్తమయు, నలంబుషయు, మిశ్రకేశియు శశిలేఖయు, వామనయులోనగువనితామణులు రూపయౌవనగర్వంబున నలరుచుఁ జారువదనంబుల, సుమధ్యంబులఁ బీనోన్నతపయోధరంబుల నొప్పుచుఁ, గామప్రచారకౌశలంబున విఱ్ఱవీఁగు వారుగలరు. వారి నియోగింపుము. అనవిని శతమఖుం డాముదితపలుకులు విని వారి నే నెఱుంగుదును. రూపయౌవనగర్వంబున వారొప్పుదురుగాక. నీ వీకార్యంబును దీర్ప వలంతివి. కామవసంతవాయువుల నీకుం దోడుగ నిత్తును. వారింగూడి కండుముని యుండుచోటికిం బొమ్మని యాజ్ఞాపించుటయు. 133

చ. శతమఖువాక్యముల్ విని విశాలమనోహరనేత్రపద్మశో
భిత యగు నాతలోదరియు వేగ వసంతముఖుల్ స్వకీయసం
గతిఁ జనుదేరఁగాఁ జనియెఁ గండుమునీంద్రుని యాశ్రమం బదే
తీతిఁ దగునచ్చోటుం గనఁగ సిద్ధపథంబున సంశయించుచున్. 134

చ. చని రుచిరాకృతిం బొలుచుసాధుతదీయవనంబుఁ గాంచె నం
దు నొకట దీప్తతేజమునఁ దోఁచుచుఁ గల్మషలేశహీనుఁడై

తనరెడు కందుపతానిఁ గనెఁ దద్వన మెంతయు నందనాఖ్యమా
వన మన సర్వకాలసుమవర్యములం దగియుండె నయ్యెడన్. 135

చ. కపిగణసంకులం బగుచుఁ గంజవనంబులఁగూడి పావనం
బపరిమితప్రమోదదమునై నవపల్లవయుక్తశాఖరా
జి పరఁగ శ్రోత్రరమ్యమృదు సిద్ధఖగధ్వను లొప్పుచుండ మా
నిపతి మనోజ్ఞవాసమున నిర్మలమై కనుపట్టె నద్దియున్. 136

వ. మఱియు నావనంబుసర్వర్తుఫలకుసుమభారావనమ్రకమ్రద్రుమమనోహరంబై విహగనాద ముఖరిత లతావితాన విరాజితంబై, యామ్రామ్రాతకనారికేళ, తిందుక బిల్వ, జీవ, దాడిమీ, బీజపూరక, పనస, లికుచ, నీప, శిరీష, పారావత,కోలా, రిమేద, వేత, సాహ్వ, భల్లాత, కామలక, శతపర్ణ, కింశుక, కరవీ, రేంగుద, హారీతకీ, విభీత, కాశోకపున్నాగ, కేతకీ, వకుళ, పారిజాత, కోవిదార, మందా, రేందీవర, దేవదారు, పాటల, సాల, తమాల,నిచుల, ప్రముఖ, నిఖిల, పావన, భూరుహావర నిబిడంబై, చకోర శతపత్ర భృంగరాజ శుక పిక కలవింక హారీత జీవంజీవక ప్రియపుత్ర చాతక ప్రముఖ ఖచరగణ సేవితంబై, ఖగముఖ వినిర్గతశ్రుతిమృదునాద సంకులంబై, ప్రసన్న సలిల నిబిడసత్సరోవర నికరమండితంబై, కుముదపుండరీక నీలోత్పల కహ్లార కమలాదిసత్కుసుమ విసర మనోహరంబై, చక్రవాకజలకుక్కుటకారండసత్కాదంబ హంస బక కూర్మప్రముఖ సకలవిధ జలజంతుకుల విలసితంబై శ్రుతినయనమనస్సుల కతిశయామోదంబు నొసంగుచునుండె నంత. 137

చ. తరుణి సురేంద్రు నాజ్ఞ మెయిఁ దద్వన మల్లనఁ జొచ్చి మారుత
స్మరులు వసంతుఁడున్ దనదుసంగతి నొప్పఁగ నెల్లతావులం
దిరిగెఁ దపస్విశక్తిని మదిం గొనియాడుచు నంత మారుత
స్మరుల వసంతుఁ గన్గొని విశాలవిలోచన పల్కె నివ్విధిన్. 138

క. మీరెల్ల నాకు సాయముఁ, గోరిక మెయిఁ జేయవలయుఁ గొదువపడని య
ట్లీరమ్యకాననంబున, నే రయమునఁ బోదు నమ్మునిప్రవరుఁ గనన్. 139

ఆ. అనుచు మఱియుఁ బల్కె నమ్మునీంద్రుని స్మర
శాస్త్రగళితరశ్మి సతతయుక్త
తనుతురంగముని నితాంతకుసారథి
గను నొనర్చుదానఁ గనుఁడు మీరు 140

క. అని శక్తిగర్వమున నొయ్యనఁ బల్కుచు బ్రహ్మనైన హరినైనను శం
భునినైనఁ గామసాయక, వినిహతచిత్తునిగఁ జేయ వేఁకునఁ దుదున్. 141

చ. అనివచియించుచున్ జనియె నమ్మునియాశ్రమ మెందునొప్పఁ బా
వన మగు నాస్థలంబునకు భామిని; యాశ్రమ మద్ది యమ్మునీం

ద్రునిదగు సత్తపోనియతి ధూర్తమృగావలి శాంతచిత్తమై
కనఁబడుచుండె మెచ్చుకొనఁగాఁ దగి యెల్లెడ శాంతరూపతన్. 142

తే. చారుపుంస్కోకిలావళి సరసనాద, ముఖరితంబౌ నదీతటమున వసించె
నంతఁ గంఠస్వరం బెంతొ హారితమము,గాఁగ గానంబు చేసె నికామశక్తి

ఉ. అంత వసంతుఁ డత్తఱిని యాత్మబలంబు గనంగఁ జేయ శ్రో
త్రాంతర శర్మదం బగుచు నప్పుడె కోయిల నిక్కి కూయఁగా
స్వాంతము మార్పఁజాలెడు రవం బది యల్లనఁ బర్వె నెల్లెడన్
శాంతము తగ్గె మౌనులకు సత్వరమే యది కాంచి వాయువున్. 144

చ. మలయమహీధరంబు నొకమాఱు విడంగను జాలనట్టి నే
ర్పలవడ మెల్లఁగా విసరెఁ; నవ్వనిఁ బుష్పము లెల్ల జాతి యా
యిలపయి మెల్లగాఁ బడియె నెంతయుఁ దన్మహి పుష్పశయ్యచేఁ
జెలఁగె మనోహరం బగుచుఁ జెప్పఁ దరంబె తదీయసంపదల్. 145

మ. స్మరుఁ డంతన్ సుమబాణసంతతులఁ బుష్పస్ఫారచాపంబునం
దురుశక్తిన్ గదియించి కందుమునిదౌ నుద్యోగమున్ మాన్ప స
త్వరుఁడై చెంతకుఁ బోయి యాతని మనోధైర్యంబునుం జెండె ని
ష్ఠురబాణావళి వైచి పౌరుష మొగిన్ శోభిల్ల నుద్యద్గతిన్. 146

చ. మునిపతి గీతనాదమును మోదమునన్ విని విస్మయంబునన్
మనము తగంగఁ గామసుమ మార్గణపీడితుఁ డౌచు నెందు నా
వనిత చెలంగు నచ్చటికి వైళమ తాఁ జనియెన్ దదీయపా
వనవనమందె యొక్కతరు వర్యముక్రింద నదీతటంబునన్. 147

చ. అలరెడు వేడ్క గానమును హారితరంబుగఁ జేయుచున్న తో
య్యలిఁ గని విస్మయంబునఁ దమంతనె నేత్రసరోజముల్ వికా
సలలితమోదముం గనఁగఁ జయ్యనఁ బైవసనంబు జాఱ ని
ర్మలమన మప్డు చంచలత మార్పుగనం బులకాంచితాంగుఁడై. 148

తే. చారుహాసిని సుశ్రోణి చారుగాత్రి, యెవ్వతవు నీవు కార్య మదెద్ది యిచట
మన్మనసు హరియించె దీమాడ్కి నేల, నిజము చెప్పు సుమధ్యమా నీరజాక్షి.

క. అనఁ బ్రమ్లోచయు నిట్లను, మునివర! నీసేవచేసి మ్మోదంబును గాం
చ నిచటికిన్ వచ్చితిఁ బుష్పనిచయమునఁ గోర్కి గలదు సత్య మిదియొనూ. 150

క. అనఘా యేవిధ మగు సేవను జేయఁగ నాజ్ఞ యగునొ వారక దానిన్
మనమున హర్షించుచు నే, నొనరుతు నాదేశ మొసఁగు మొయ్యన మౌనీ 151

చ. అనవిని యమ్మునీశ్వరుఁ డహార్యతరం బగుధైర్య మెట్టులో
తను విడనాడి పొవుటయుఁ దత్పదమం దురువిస్మయంబు వే

గ నిలిచియుంటయుఁ దెలియఁగా నసమర్థుఁడయి యాచు దేవతా
వనితను దాని హస్తమున వాంఛలువొంగ గ్రహించి ప్రీతుఁడై. 152

క. తనయాశ్రమంబుఁ జొచ్చెను, వనితామణి మౌనివెంటఁ బరమప్రమదం
బున నేగె వచ్చినటులే, యనిలుఁడు కంతుఁడు వసంతుఁ డరిగిరి దివికిన్. 153

క. కృతకృత్యులౌచు వచ్చిన, యతిలోకుల వారిఁగాంచి హరిహయుఁ డట స
మ్మతిఁ దెల్పె మౌనివరుచే, ష్టితమును విని దేవగణము చెలఁగెన్ మిగులన్.

ఉ. అంతటఁ గండుమౌని త్రిదశాంగనఁగూడి వనంబుఁజేరి య
త్యంతముదంబునింపు తను వల్లనఁ దాల్చెఁ దపః ప్రభావతన్
గంతునిమించుయౌవనము గ్రాలఁగ రూపము నట్టిదై తగన్
గాంతుఁడు పొల్చుటం గని నికామము సమ్మతిఁదెల్పె నాతియున్. 155

సీ. దివ్యభూషణరాజిఁ దేజరిల్లుచు షోడశాబ్దవయస్కుఁడై యమలవస్త్ర
గంధమాల్యంబులఁ గాయ మలంకృతి మించ భోగార్హవస్త్వంచితమయి
వనమెల్లఁ దత్తపోబలమునఁ జెలువారఁ గన్నులుసంతృప్తి గాంచఁ జూచి
ప్రశ్లాఘయును మదిఁ బరమవిస్మయమొందె; నరరే! తపశ్శక్తి యతులముగద

ఆ దీనిఁబోలునట్టిదాని గనుంగొనఁ, జాల నే నటంచు స్తవ మొనర్చె;
నంత మౌని నాథుఁ డర్హకృత్యంబుల, స్నానదానహోమ జపముఖముల. 156

క. సురసమధికార్చనము శ్రుతి, వరపఠనము సద్వ్రతోపవాస నియమమున్
బరమాత్మధ్యానముఁ ద, త్తరుణీసంగతిని మానెఁ దత్క్షణముననే. 157

క. పగలని నిశలని భేదం,బు గణింపక యతివఁగూడి పొంగెడు కాంక్షన్
దగఁ బ్రోత్సహించుమదనుం, డగపడకే మది మహోర్తినందగఁ జేయన్. 158

క. వనితామణితో విహరిం,చెను భూరితపోబలంబు చెడుట తలఁప; కం
త నతఁడు సంధ్యలు రాత్రులు, దినములు పక్షములు నెలలు తీవ్రగతి తగన్.

తే. సాగిపోవుట ఋతువులు చనుట హాయ
నములు గడచుట యెఱుఁగడు సమయ మెల్ల,
జరగిపోవునటుం చని స్వాంతమందుఁ
దలఁపఁ డావిషయేచ్ఛలఁ దగిలియుంట. 160

చ. తరుణియుఁ గామజంబులయి తద్దయుఁ జిత్తముఁ బల్లవింప స
త్వరముగఁజేయు భావములఁ బొండితిఁ గాంచిన దౌట నమ్మునీ
శ్వరుని రహోవిలాసమృదుభాషణయుక్తి వశంగతాత్ముఁగా
మురిపెములం గలంగి కడు మోహమునొందినవానిఁ జేసెఁ దాన్. 161

క ఈరీతిఁ గండుమౌనియు, సారసనయనాభిరాముఁ జంచద్గాత్రిన్
నారీతిలకము దానిం, గోరిక మెయిఁగూడి తపముఁ గోల్పోయెఁ దగన్. 162

తే. మందరద్రోణియందు నమ్మందయాన
తోడ నూఱేండ్లు విహరించెఁ దోయజాక్షి,
యొక్కనాఁ డిట్టులనియె నాయోగివరునిఁ
గాంచి బ్రహ్మమునీంద్ర! యింక దివి కరుగ. 163

క. మనమునఁ గోరెద నాకిపు, డనుమతి యిమ్మా యనుగ్రహమ్మున నన నా
మునివరుఁడు తదాసక్తిం, గను వేడుక నింకఁ గొంత కాలం బిందున్. 164

క. ననుఁగూడి యుండుమా యని, వినయంబునఁ గోరెనదియు విప్రమునివచిం
చిన యట్లె పెక్కుదినములు, మనసిజకేళులను దేల్చె మౌనీశ్వరునిన్. 165

సీ. పెక్కుదినంబు లీవిధి సాగ నొకనాఁడు మునివర్య! నే స్వర్గమునకుఁ బోవ
వాంఛింతు ననుమతి వారక యొసఁగుమా యని వేఁడి శతసంఖ్యహాయనములు
నంత యెక్కువగఁ బుచ్చుచు నొక్కనాఁ డిట్టులమ్మునిఁ బ్రార్థించె నాత్మమోద
ముల నీయఁజాలిన లలితదివస్పతిపురమున కరిగెదఁ బూజ్యచరిత

ఆ. యనుమతింపు మనఁగ హరిణేక్షణా! చిరకాల మిచటనన్ను లీలఁగూడి
యుండు మనియె శాప మొసఁగునని భీతిచే నచ్చరయును నమ్మహాత్ముఁ గూడి.

వ. కించిదూనశతద్వయవత్సరంబులు తత్సంగతిఁ గడపె. అంతదేవరాజనికేతనగమ
నాభిలాషము మదివెలయ మునిఁ బ్రార్థింప నింకఁ గొంతకాలము నిలువుమా యని
పలికె. కామశాస్త్రకుశలయయ్యు నాప్రమ్లోచ శాపభయంబునను మోమోట
మిని బ్రణయభంగార్తి నెఱింగినదిగాన నమ్ముని వదల నెంచకయుండఁ దద్రతి
కేళులం దేలు నమ్మునికి దానియందలి ప్రీతి నవనవాకృతిం జాల్చెనంత. 167

చ. త్వరపడి యొక్కనాఁడు మునితల్లజునాశ్రమభూమి వీడి స్వః
పురి కరుగం దలంచు మృదుపుష్పసమాంగిని గాంచి యెందు నీ
వరిగెద వంచుఁ బల్కెఁ ద్రిదశాంగన స్వఃపురికేగుదాన నం
చురువినయంబునం బలుక నోలలితాంగి రో యాలకింపుమా. 168

తే. దినముగడచెడు నేను సంధ్యను జెలంగు, భక్తిమీఱ నుపాసింతు వదలి నంతఁ
గర్మలోపంబు చేకూరుఁ గాదె యనఁగఁ, బక్కున న్నవ్వి పూఁబోఁడి పలికె నిట్లు.

సీ. గతకర్మములకు నేగతి లోప మొదవకయుండు విస్మయమిట్టు లొందనేల?
యనఁగ నమ్ముని యిట్టులనియె నోసుశ్రోణి వచ్చితి విచటికి నిచ్చ తనర
నీదినారంభమం దీనదీతటమున నినుఁ గంటి నీవు నిందును జెలంగు
నాశ్రమంబును జొచ్చి యాదృతినుంటి విగద యింతలోన భాస్కరుఁడు క్రుంకెఁ

ఆ. జనుచు నున్నవాఁడు సంధ్య యిదే కద, హాస్య మిట్లు చేయ నగునె నీకు
సాధుభావమూనఁ జను నన బ్రమ్లోచ, పలికె నిట్లు మౌనిపతిని గాంచి. 170

క. మునివర! ప్రత్యూషంబునఁ, గనఁ జాలితి నిందు నిన్నుఁ గాదన నగునే
యనృత మదిగాదు మఱి యే, మనినం దత్కాల మిద్ది యనఁ దగదు సుధీమా,

క. ఈనడుమఁ శతసంఖ్యలు,గా నబ్దంబులు గతించెఁ గాదే యన స
మ్మానియు విశాలనేత్రను,మానినిఁ గని యిట్టు లడిగె మానస మదరన్. 172

తే. భీరు! నీతో రతించేలు వేళ నెంత, కాల మరిగెనొ తెల్పుమా కరుణ ననిన
మౌని కిట్లను బ్రమ్లోచ యీనడుమను,సప్తసంఖ్యాధిక నవవర్షశతము లొగి.

క. చనియెన్ మాసము లాఱును,దినములు మూఁడును మునీ!గతించెన్ వింటే
యన నిది సత్యమె హాస్యం,బొనరింపఁగఁ బల్కవుకదయుత్పలనేత్రా. 174

క. నినుఁగూడి యున్న కాలము,దిన మొకఁడే యని తలంచితిన్ బ్రమ్లోచా
యనఁ దరుణి నీదుసన్నిధి,నన్నృతము వచియింతునయ్య యనఘ! మునివరా! 175

క. సురపురి కరుగుచు మార్గాం,తరమున నీవడుగ నెట్లు తథ్యేతర మి
వ్వరుస వచియింపఁ జాలుదు,నరిగెద నిఁక నన్ను నమ్ముహామునియార్తిన్. 176

చ. విని యలపూవుఁబోఁణివగు విశ్రుతవాక్యము లెల్ల లజ్జచేఁ
దనమది నిస్సిరో యిటులు తప్పి చరించితి ధర్మమార్గమున్
జనునె యిదంచు భర్త్సనము స్వాంతమునందు లగింపఁజేయుచున్
మునిధనమౌ తపంబు చెడెఁ బోయె వివేకము సర్వ మీవిధిన్. 177

క. తరుణీ! మోహము విడువం,దరంబు గా దంద్రు దానిఁ దగులువివేకం
బరయఁగ నిష్ఫలమే యొ,క్కరణిని భద్రంబు లీయఁగా నద్ది తగున్. 178

క. కనుకనె యోషిన్మోహం,బును గను టవివేక మనిరి బుధులు షడూర్ముల్
తనుఁ బొందకుండ నొప్పం,గను జాలిన బ్రహ్మ మును నికామశ్రద్ధన్. 179

తే. ఆత్మజయమును గనఁదగు; నకట! నన్ను
నిట్టిగతి బట్టఁజేసినయట్టి స్మరమ
హాగ్రహము తుచ్ఛమౌ నిసీ! యఖిలవేద
ములు వ్రతంబులు కారణంబు లొగినవియు. 180

క. నరకగ్రామపుసరణిగఁ,బరఁగెడు నాకాముచే నభవ్యంబులుగాఁ
బరివర్తితములె యయ్యెను,గర మెదఁ దలఁపంగఁ జెడితిఁ గా నీభంగిన్. 181

చ. అని తను నిందనొందఁ దగినట్లు తలంచుచు ధర్మవేత్త యా
ముని పరమాత్మఁ గాంచఁదగు బుద్ధిగలాఁడు స్వసన్నిధిం దగన్
గనఁబడుచున్న యచ్చరను గాంచి వచించె; నితాంతదుష్టచి
త్త నియతిహీన స్వేచ్ఛఁగ ముదంబునఁ బొమ్మిఁక స్వర్గభూమికిన్. 182

క. ఏకార్యం బొనరింపఁగ,నీకడ కరుదెంచితివొ యహీనగతిని నీ
వాకార్యము చేసితి విఁకఁ,బాకారిప్రియముఁ గోరి పలుమార్గములన్. 183

క. నామదిఁ గలఁచితి వింతీ,యీమాడ్కి నొనర్చినట్టి యీనినుఁ గోపో
ద్ధామాగ్ని నీఱుఁజేయం,గా మన మొప్పదు తదీయకారణ మిదియే. 184

తే. సాధుసఖ్యంబు తలఁపఁగా సాప్తపదము

నిన్నుఁ గూడియు కడపితిఁ గొన్ని దినము
లదియెగాక భవద్దోష మరయ నేది
గలదు? నాదోషమే యిదిగద కృశాంగి. 185

తే. దేన నజితేంద్రియుఁడనయి మానిని వని
తెలిసియును నిన్నుఁ గూడితిఁ దెలివిమాలి
శక్రహితమునుగోరి నీ వక్రమముగ
మత్తపోవ్యయ మొనరిచి తిత్తెఱఁగున. 186

క. కనుక నిసీ! ఘనమోహం,బును గల్గఁగఁ జేయు నిన్ను బుద్ధిఁ దలఁప నిం
కను నిందచేయుచుందును,వనితా యని విప్రమౌనివరుఁడు పలికినన్. 187

క. నెన్నడుమున రాజిలు నా,కన్నియ స్వేదాంబుసిక్తగాత్ర యగుచుఁ దా
ఖిన్నయయి కంపమొందెను, దన్నిర్భరభీతి మునివతంసుఁ డెఱిఁగెఁ దాన్. 188

సీ. వడవడవడఁకుచుఁ గడు స్వేదజలముల గాత్రప్రతానినిఁ గరము తడుపు
చున్నయా యచ్చరమిన్నఁ గనుంగొని సక్రోధుఁడై మునిసత్తముండు
పొమ్ము పొమ్మీ యింకఁ బూర్వ మున్నపదంబునకు నన నాయింతి వికలచిత్త
యగుచుఁ దదాశ్రమ మపుడె విసర్జించి యాకాశసరణిఁ దా నరుగుచుండి

తే. సురపురాంతికముననున్న తరువరముల
నలరు మృదుపల్లవముల స్వేదాంబువులను
దుడుచుకొనుచును బల్లవధూతతాప
యగుచు మెల మెల్లనం బోయె నార్తిఁబాసి. 189

వ. ఇట్లు మార్గంబున వృక్షమునుండి వృక్షమునకుం బోవుచుఁ బల్లవంబుల స్వేదజలంబులఁ దుడుచుకొనుచుఁ బోయె. కండుమునివరనిహిత తదీయగర్భగత తేజంబు తద్రోమకూపంబులనుండి స్వేదజలరూపంబున నిర్గమించె. దానిని ధరించి వృక్షములెల్ల గ్రహించె. అది యొక్కటిగ విధివశంబునఁ జేయఁబడియె. అయ్యది చంద్రకిరణంబుల నాప్యాయితంబై వృద్ధినొందుచుండె. నియతకాలంబున నందుండి కన్యక జనించె. ఆమె వృక్షావళికిఁ బుత్రికయయ్యె. మారిష యనుపే రాకన్నియకుఁ జెల్లె. ఆచారులోచన ప్రాచేతసు లనువారికి భార్యయై దక్షునింగని దక్షమాత యనవిఖ్యాతినొందె. 190

క. మునిపతి కండుఁడు తప మొ,య్యన క్షీణతఁ గాంచఁ బంకజాక్షునిలయమై
తనరెడు పురుషోత్తమమును, గనఁబోయెను విప్రులార కడు శోకార్తిన్. 191

సీ. పరమమై యపవర్గఫలదమై భూలోకమున దుర్లభంబయి మురహరునకుఁ
బ్రీతిప్రదంబయి వెలసి దక్షిణవార్ధితటమున వాంఛాప్రదంబు నగుచు
బహుమనోహరమయి వాలుకాకీర్ణమై కేతకీకాననాకీర్ణమునయి
నానామహీజప్రతానసీసాంద్రమై బహువిధపక్షిరవంబు లలర

తే. సర్వతస్సుఖసంచారసరణి మించి,సార్వకాలికసుమనోవిసరము నగుచు
సర్వసౌఖ్యము లిడఁజాలి సర్వగుణము, లలర మంగళదంబయి యతులమునయి.
క. మునిపతులగు భృగ్వాదులు,తనయందు నివాసమును ముదంబునఁ జేయం
గను సిద్ధులొప్ప గంధ,ర్వనికరములు యక్షకిన్నరవితతి యొసఁగన్. 193
తే. మఱియు మోక్షంబునుం గోరుమాన్యు లొప్ప
నలరు నప్పురుషోత్తమం బగ్ర్య మగుచు;
దాని దర్శించె నమ్మునితల్లజుండు
సర్వదేవాదిదేవునిఁ జక్రిఁ గనియె. 194
క. చతురాశ్రమనిష్ఠులు వ,ర్ణతతిం బొలుపొందువారు రాధావిభు న
చ్యుతుఁ గొల్చుచుండఁ గనియెన్, మతిమోదము చెంగలింప త్ర్యాసురుఁడంతన్.
తే. అట్టిమహనీయసుక్షేత్ర మాహరిఁ దమిఁ
గాంచి కృతకృత్యతను నేను గంటి ననుచుఁ
దలఁచి యేకాగ్రచిత్తుఁడై తగువిధమునఁ
బరమపురుషు నారాధించె భక్తి యొసఁగ. 196
వ. ఏకాగ్రమానసుండై బ్రహ్మపారమయంబుగ జపంబొనరించె. మఱియు నాకండుం డూర్ధ్వబాహుండును, మహాయోగనిరతుండునునై యుండె నను టయుమును లిట్లనిరి. 197
క. మునివరుని బ్రహ్మపారము, వినఁ గోరెద మద్ది శుభము వృద్ధిం జేయుం
గనుకన్ మునివరుజపమున, వనజాక్షుం డలరె నెట్లు వచియింపు విభూ. 198
వ. పరమాత్మరూపుం డగుహరి పరాత్పరుండు. అపారపారు డనంబడు. ఆతఁడె బ్రహ్మపారుండు నగు. పర పారభూతుం డనియుఁ జెప్పంబడు. పరమేశ్వరులకుఁ బరమేశ్వరుం డగుటఁ బారపారుండని మునివినుతిం గాంచు. కారణసంశ్రితుం డైన యతఁడె కారణం బగు. పరహేతుహేతువనఁబడువాఁ డతండే. కార్యములయిం దాపరమేశ్వరుండు బహువిధములగు కర్మకర్తృరూపములచే సర్వముపాలించుచుండు. ఆబ్రహ్మమే ప్రభు వగు. ప్రజలకుఁ బితయని చెప్పంబడు. సర్వభూతుండునగు. అవ్యయంబు నిత్యం బజంబు ననువర్ణనంబులకుఁ బాత్రుం డాతండె యగు. అవిష్ణు వపక్షయాదులచే నసంగుం డనియు వినుతింపంబడు. మఱియు. 199
సీ. బ్రహ్మ మక్షర మజరంబు నిత్యంబును నగు వాఁడె పురుషోత్తమాఖ్యఁ దనరు
నాతని కరుణ రాగాదు లస్మద్దోషములు నాశమొందు నంచెలమి మీఱ
భగవంతు భజియించె; బ్రహ్మపారంబను మంత్రంబు జపియించె మౌని నియతిఁ
బురుషోత్తముఁడు జపంబును దృఢభక్తిని మది నెంచె; భక్తుల మానసేష్ట

ఆ. ముల నొసంగఁజాలి యలరు శ్రీవిష్ణు వా, మునిసమీపమునకుఁ బోయి యిట్లు
మధురవాక్కు లలర మహితమేఘము గర్జ, నాళి దిశల నించునట్లు పలికె. 200

క. వినతాకులవర్ధనుఁడై, తనరారెడు గరుడు నెక్కి తమిపొంగఁగ నో
మునివర! నిరుపమకార్యము, మనమునఁ గలదేని పలుకు మానక తీర్తున్. 201

క. వరదుండను నీకిప్పుడు, వరముల నొసఁగంగ నిటకు వచ్చితి సాధూ!
పరికించి కోరుమా యన, హరివచనము లాలకించి యాపరమాత్మున్. 202

క. సురనాయకాది వినుతుని, బరమేశ్వరుఁ జక్రధరునిఁ బరికించి మనో
హరమూర్తి యెదుటదోఁచుటఁ, బరమాదృతిభక్తియుఁ దగఁ బ్రణతులొనరిచెన్.

సీ. అతసీసుమచ్ఛాయ నలరుదేహమువాని నంబుజదళలోచనాభిరాము
గదయును శంఖచక్రములు హస్తంబుల నలరారఁదగువాని నంగదముల
ధరియించి ముకుటంబు పరికింప నిరుపమమై యొప్పఁగా నాల్గుహస్తములను
గనుఁగొనఁగాఁ దగికమ్రపీతాంబరధారియై ప్రభువయి హరిమూర్తి

తే. యొగుచు శ్రీవత్సలాంఛనం బమర దివ్య
కాంతిఁదగు వనమాలిక గ్రాలుచుండ
నెదుట నిలుచున్న శ్రీపతి ముదము పొదలఁ
గాంచి విస్మయ ముప్పొంగఁగ నిటు పలికె. 204

క. పులకాంచితవిగ్రహుఁడై, జలజాక్షా! నాదుజనియు సఫలం బయ్యెన్
ఫలియించెఁ దపము ననుచున్, గలుషహరున్ వినుతిచేయఁగాఁ బూనె దమిన్.

కండుముని విష్ణుని వినుతించుట.

క. నారాయణ శ్రీకృష్ణా, కారుణ్యాబ్ధీ మహాత్మ కమ్రాంగా శ్రీ
నారీప్రాణాధారా, కోరిక నిను నిరత మేను గొల్తు మురారీ. 205

సీ. జగముల కెల్ల బీజంబవు లోకైకధాముఁడ వగు దీవె తజ్జగముల
కెల్ల సాక్షివి నీవె యిదె మ్రొక్కువాఁడను నవ్యక్త మన నీవె యఖిలమునకు
నీవె ప్రధానుఁడ వీశ్వరా! పుండరీకాక్ష గోవింద లోకాళినాథ
వందనములఁ గొను మిందిరాప్రాణేశ పంకజనాభ తత్త్వవరహేమ

తే. గర్భ శ్రీధామ మేదినీగర్భ యీశ
యంజలుల నోహృషీకేశ యాదృతిఁ గొను
మాది యంతము లేకయె యమృతుఁడనఁగ
నలరు నీమూర్తి కడు నజేయంబు గాదె. 207

వ. జగత్ప్రభూ! సర్వోత్కృష్టమహిమమున వర్తించు నీకు నమస్కారంబులు. శ్రీని
వాసా, యజితాఖండపరాక్రమా యోగమూర్తీ యప్రమేయలోకస్వరూపా,
నీవే సనాతనుండవు. కూటస్థుండవు. అచలుండవు దుర్జ్ఞేయుండవు. ఇట్టినీకుఁ

జేమోడ్పులు సమర్పింతును. వరేణ్యుఁడు, వరదుఁ, డనంతుఁడు బ్రహ్మయోని, గుణాకరుఁడు, ప్రళయోత్పత్తియోగేశుండు, ననం బరఁగి వాసుదేవుండ వగు నీకు నతు లొనరింతును. పర్జన్యధర్మకర్తయని, దుష్పారుండని, దురధిష్ఠితుండని దుఃఖార్తినాశనుండని, విఖ్యాతినొంది జలశాయి వగునీకు జేజే లర్పింతును. భూతపతి, వవ్యక్తుండవు, భూతేశుండవు, భూతతత్త్వంబులచే నాకలితుఁడవు గాకయుండు వాఁడవు. భూతాధివాసుఁడవు. భూతాత్ముఁడవు. భూతగర్భుం డవు నగు నీకుఁ బ్రణామంబు లాచరింతును. యజ్ఞరూపుఁడవు. యజ్వవు. యజ్ఞధరుఁడవు. యజ్ఞధాతవు. అభయప్రదుండవు యజ్ఞగర్భుండవు. హిరణ్యాం గుండవు. పృశ్నిగర్భుండవు. క్షేత్రజ్ఞుఁడవు. క్షేత్రభృత్తువు. క్షేత్రహరుండవు. వశివి, క్షేత్రాత్ముఁడవు. క్షేత్రరహితుఁడవు. గుణాలయుఁడవు. గుణావాసుఁడవు. గుణాశ్రయుఁడవు. గుణావహుండవు. గుణభోక్తవు, గుణారాముండవు గుణ త్యాగివి. ఇట్టినీకుఁ బ్రణతు లాచరింతును. మఱియును. 208

సీ. నీవవిష్ణుండవు నీవ చక్రివి హరి వీవ జిష్ణుండవు నీవ తలపఁ
గా జనార్దనుఁడవు కమ్రభూతమ వీవ నీవ వషట్కార మీవ భవ్య
మీవ భవత్కాల మీవ యవ్యక్తుఁడ వీవభూతావళి కెల్ల భద్ర
ములనిచ్చువాఁడవు జలజాక్షుఁడవు భూతభావనుండవు నీవ నీవయజుఁడ

తే. వీశ్వరుండ వనంతుఁడ వీవ ప్రకృతి, వీవ సూక్ష్ము వృషాకపి వీవ కృతము
నెఱుఁగువాఁడవు రుద్రుండ వీవ సర్వ, భూతతతి నప్రధర్షుఁడ వేతఱఁగన 209

వ. విశ్వకర్మవు. శంభుఁడవు. వృషాకృతివి. శంకరుండవు. ఉశనసుండవు. సత్యస్వ రూపుఁడవు. జపతపస్స్వరూపుండవు, విశ్వజేతవు. సుఖస్వరూపుఁడవు. శరణ్యుఁ డవు. అక్షరుఁడవు స్వయంభువుండవు. జ్యేష్ఠుండవు. పరాయణుండవు. ఆది త్యుండవు. ఓంకారుండవు. ప్రాణరూపుఁడవు. పర్జన్య, ప్రథిత, వేధోసురేశ్వర, నామధరుండవు. ఋగ్యజుస్సామ సమ్మతుఁడవు. అగ్ని, పవన, కుబేర, హవి, స్స్రష్టృ, భోక్తృ, క్రతు, కవి, శ్రేష్ఠ, హరి, లోకపతి, సర్వదర్శన, సర్వదమన, శత్రు, ఘ్నాహోరాత్ర, వత్సర, రూపుండవు. కాలకళా కాష్ఠా ముహూర్తక్షణ లవ, బాల, వృద్ధ, స్త్రీపున్నపుంసక, విశ్వయోని, చక్షు, స్థాణు, శుచిశ్రవ, శ్యామాశ్వ, తాజి తోవేం దోర్రిత్ర, మసర్వవిశ్వసుఖద, వేదాంగ, వేదవేద, ధా తృ, విధాతృ, సమాహిత, జగదోన్యన్యమూల, పునర్వసు, వైద్య, ధృతాత్మాతీం ద్రియగోచ, రాగ్రణీగ్రామణీ, సుపర్ణారిందమ, సంగ్రహ, యమ, నియమ, ప్రాం శు, చతుర్భుజశబ్దవాచ్యుండవు. అన్నాంతరాత్మవు. పరమాత్మవు. గురు, గురు తమ, వామ, ప్రదక్షిణ, పిప్పల, వ్యక్త, ప్రజాపతి, హిరణ్యనాభ, దేవ, శశ్య నిర్దేశ్యవపు, స్సురారిఘ్న, సంకర్షణ, కర్తృ, సనాతన, వాసుదేవ, గుణవర్జి, తా మేయాత్మ, జ్యేష్ఠ, వరిష్ఠ, సహిష్ణు, మాధవ, సహస్రశీర్షవిరాజిత, సహస్రనే

త్ర, సహస్రపాద, విరా, ట్పురప్రభు, ప్రథితశబ్దవాచ్యుండవు ఇట్టి నీకు నమస్తుతు లొనరింతును. దేవదేవా! దశాంగుళమాత్రరూపుఁడవై నీవయుండుదువు. మృతామృతశబ్దంబులునీవ. నీవలననీజగంబు లుదయించు. మహీయాంసుఁడవు. అనుత్తముఁడవు. పరమపురుషుండవు. దశధా స్థితిం గాంచితివి. నవభాగంబులుగ దివియందును, నవభాగంబులుగ నంతరిక్షమందును, నివసింతువు. భాగద్వయంబున భూమి నుందువు. చతుర్భాగంబుల నీపురుషోత్తమక్షేత్రంబున నుందువు. జగద్వ్యాప్తికారణంబగు యజ్ఞములు నీవలన సంభవిల్లు. విరాట్టువు నీవలన నుదయించు. ఆవిరాట్టువె హృదయంబుననుండు పురుషుండు. ఆతండు యశస్తేజః శ్రీసమృద్ధులచే లోకాధికుండగు. నీవలననే సురగణంబుల కాహారంబగుపృషదాజ్య ముదయించు. నీవలననే గ్రామ్యారణ్యౌషధు లుద్భవిల్లు. పశుమృగాదులు నీవలననే పుట్టు. ధ్యేయధ్యానపరుండవునీవే. దేవదేవా! నీవే నిద్రించునపుడు కాలాఖ్యుండవై దీప్తవిగ్రహుండ వగుదువు. చరాచరప్రపంచ మంతయు నీవలనఁబుట్టు. నీయందె లయించు. అనిరుద్ధమాధవ ప్రద్యుమ్నసర్వాసురేశ్వరశబ్దంబులు నీకుం బ్రవర్తిల్లు. మహాత్మా! అరవిందాక్షా! నన్నుం గాపాడుము. నారాయణా; నీకివె నమస్కారములు. విష్ణూ! పురుషోత్తమా! సర్వలోకేశా! కమలాలయా, గుణాలయా, గుణాకరా! నీకుఁబ్రణామంబు లాచరింతును. వాసుదేవా. జనార్దనా సనాతనా యోగిగమ్యా, యోగావాసా, లక్ష్మీపతీ, శ్రీపతీ, జగత్పతీ! జ్ఞానిపతీ! దివస్పతీ! మహీపతీ! మధుసూదనా, పుష్కరేక్షణా, కైటభఘ్నా! సుబ్రహ్మణ్యా, మహామీనరూపా, శ్రుతిపృష్ఠధరా. సముద్రసలిలక్షోభ పద్మజాహ్లాదకారణా, అశ్వశీర్షా, మహాఘోణా, మహాపురుషవిగ్రహా, మధుకైటభఘ్నా, తురగాననా, మహాకమఠభోగా, పృథివ్యుద్ధరణక్షమా, విధృతాద్రిస్వరూపా మహాకూర్మా నీకు నమస్సంతతుల సమర్పింతు మహావరాహా, విశ్వరూపా, సూక్ష్మావ్యక్తముఖ్యవరపరమాణుస్వరూప యోగిగమ్య పరమకారణకారణ, యోగీంద్రవృత్తనిలయ, క్షీరార్ణవాశ్రిత మహాహిసుతల్పశయన, కనకరత్నకుండలమండిత ప్రథితశబ్దరూపుఁడవగు నీకు నమస్కరింతును. 210

క. అని వినుతించెడు కండుని, మునివరుఁ గని మాధవుండు మోదంబున ని
ట్లనియెను ద్వరఁగా వేఁడుము, మనమునఁ గల వాంఛితంబు మానక యిత్తున్.

సీ. అనుటయు నాకండుఁ డతిభక్తి వచియించె జగదధిపా సుదుస్తరము లోమ
హార్షణమును ననిత్యము దుఃఖబహుళంబు కదళీదళాభంబు కడు నిరాశ్ర
యము నిరాలంబము నమృతబుద్బుదచంచలమ్ము సర్వోపద్రవమ్ము లోలయ
దుస్తరంబయి యతివిస్తరంబయి భైరవంబయి దాఁట నెవ్వరుస నైనఁ

ఆ. దరముగాని యట్లు తనరు సంసారాబ్ధి, మాయ పాలయు ముగ్ధమానసుండ

నగుచుఁ జాలకాలముగ భ్రమించెద దేవ, దీనియంత మేను గానఁజాల. 212

క. అనిశము విషయాసక్తిం, గను నింద్రియములనుగూడి కడు బాధల నం
దినవాఁడ నిన్ను శరణం, బని వేఁడితి నిష్ఠ కృష్ణ హతదనుజౌఘా. 213

క. తరియింపఁ జేయుమీ భవ, సరిత్పతిని ముక్తకుండఁ జయ్యెన నీదౌ
పరమపదంబును బొందఁగ, హరి దేవాధీశ వాంఛ నాత్మం గలిగెన్. 214

క. పునరావృత్తిరహితమయి, తనరారు భవన్మహాపదంబును గరుణం
గనఁ జేయుమా పరాత్పర, యని వేఁడఁగ మోదమంది హరి యిటు పలికెన్.

చ. మునివర నాదుభక్తుఁడవు మోదమున న్ననుఁగొల్చుచుండుమీ
యనిశము మత్ప్రసాదమున నన్యజనాళికి దుర్లభంబు పా
వనమును నైన మోక్షమును వారకపొందుదు వీవు; భక్తిభా
వన ననుఁ గొల్చుక్షత్రియులు వైశ్యులు శూద్రులు స్త్రీలు నంత్యజుల్. 216

క. పరమపదంబును వే కాం,తురు విప్రుఁడవైన నీకు దొరకుట యరుదే;
ధరణి శ్వపాకుండే భ, క్తిరతిని శ్రద్ధాన్వితుఁడయి దివ్యపదంబున్.  217

తే. పొందఁగోరినఁ దప్పక పొందుఁజుమ్ము;
పరుల మాట యిఁకే లనిపలికి భక్త
వత్సలుండయి తెలియంగఁబడనిమహిమ
మునఁ దగిన విష్ణు వపుడె పోయెను దనంత. 218

చ. హరి యిటుగానరాక చన హర్షమునం దగి కండుమౌని ని
ర్భరవరభక్తిఁ గామసమవాయముఁ జక్కఁ బరిత్యజించి దు
స్తరభవబాధ తన్వదలి తానె చనంగను స్వస్థచిత్తుఁడై
కర మరుదైన మోహము నికామము మాని శమంబు దాంతియున్. 219

తే. కుదురుకొనఁగ నహంకృతి కుంద నింద్రి
యముల నియమించి మిగుల నేకాగ్రచిత్తుఁ
డగుచు శ్రీహరి నిర్లిప్తు విగతగుణుని
శాంతు సత్తావ్యవస్థితుఁ జక్రధరుని. 220

సీ. అనిశంబు ధ్యానించి యమరులకే దుర్లభమగు మోక్షంబును బడసె నీయు
పాఖ్యాన మెవ్వఁడు హరిభక్తిఁ బఠియించు విను వాఁడు నాకండుమునివరుగతిఁ
బాపవిముక్తుఁడై స్వర్లోకమును బొందు; మునులార యిది కర్మభూమియనుచు
వచియించితిని గాదె ప్రచురతరాఘముల్ చనఁజేయుఁజుఁడి క్షేత్ర మనుపమాన

తే. ము నగుపురుషోత్తమాఖ్యంబు మనుజు లెవరు
కనుదురో హరిఁగొల్తురో కడఁగి ధ్యాన
మునను గొల్తురో ముక్తిదుం డనఁగఁ బరఁగు
హరికృపం గాంతు రవ్వార లద్భుతముగ. 221

తే. ఘోరసంసారదుఃఖ సంహారకంబు
తారకము క్షేత్ర మయ్యాది దాన నిల్వ
మనుజభోగంబు లొంది యమర్త్యదుర్ల
భమగు మోక్షంబు లభియించుఁ బలుకు లేల. 222

## డెబ్బదియవయధ్యాయము.

### శ్రీకృష్ణావతారకారణ ప్రశ్నము.

చ. అని యిటు తెల్పి సూతముని యమ్మునివర్యులఁ గాంచి వ్యాసమౌ
ని నియతి నిట్లు పల్క మునినిర్జరనాథులు హృష్టచిత్తులై
వినియతకాంక్షులౌటఁ గడు విస్మయమోదము లుల్లసిల్ల నె
మ్మనములు పొంగ నిట్లనిరి మౌనివతంసుని బాదరాయణున్. 223
క. కరుణానీరధిఁ గన్గొని,వరమునిచంద్రా మహాత్మ భారతవర్షం
బరుదంచుఁ దన్మహత్త్వముఁ,బరికీర్తించితివి వినఁగఁ బొల్పడితిమి సూ. 224
క. పురుషోత్తమసుక్షేత్రము,గురుచరితముఁ బల్కి తీవు కోరి వినితి మీ
చరితమున విస్మయంబులు,పరఁగెన్ మామదులఁ గానఁ బ్రశ్నింతు మిఁకన్.225
ఆ. ఎవనిమహిమ వినఁగ నీవిస్మయము వాయు,నిట్టి మహిమ మొలయు నెవనివంక
నయ్యె నతనిమహిమ మంతయు వినిపింపు,మెంతకాలమునకొ యిట్టిచరిత. 226
క. వినఁగల్గె సంశయము వ్యా,సను నీవే తక్క నొకఁడు పరికించిన లేఁ
డనఘా! శ్రీబలదేవుని,జని కృష్ణునిజని సుభద్రజననము వరుసన్. 227
ఆ. తెలియఁబలుకవయ్య తృప్తిమీఱఁగఁ బ్రశ్న,మిదియొ యేల వార లీభువి జనిఁ
గనిరొ కృష్ణబలులు క్రమమున వసుదేవు,నింటఁ గార్య మేమొ యిద్దఱకును.
మ. పరికింపంగ నసారమై మృతిభయభ్రాంతంబు ఘోరాతిదు
స్తరదుఃఖాకుల మెన్నఁ జంచలము నై తాపంబుఁ గల్గించి భీ
కరమై బుద్బుదతుల్యమై శ్రమదమై కష్టాలయంబై నిరం
తరవిణ్మూత్రనిషిద్ధమై మఱియు నిద్యంబై యసహ్యంబునై. 229
ఆ. ఒప్పుచుండుఁగాదె నొగి నాతిగర్భంబు, దానియందు వసతి మానితాత్ము
లైన రామకృష్ణ సూనాస్త్రజనకుల,కెట్టు లయ్యె వార లేమిపనికి. 230
క. జనియించి రదే కర్మము,లొనరించిరి వారియద్భుతోత్తమచరితం
బును విస్తరించి చెప్పుము, వినవేడ్కఁ జనించె మౌని బృందమహేంద్రా. 231
క. అతిమానుషమగుఁగద య,చ్యుతుచరితము దేవతాగణోత్తముఁడై యు
ద్ధతులం జెండు ననంతుఁ,డతినీచంబైన మర్త్యమునందుముదమునన్. 232
సీ. వసుదేవుగృహమున వసియించి తా వాసుదేవుఁడన్ విఖ్యాతి దివి భువిఁ గనె

సమరసంవృత మగునట్టిసురావాసమును బుణ్యకృజ్జుష్టమును ద్యజించి
మర్త్యలోకమున నేమాడ్కి జన్మించెను; సురమానవుల కెల్ల శుభగుఁ డీశుఁ
డఖిలలోకంబుల నలవరించిన మేటి మానుషంబున దివ్యమైన యాత్మ
ఆ. నెట్లు పుట్టఁ జేసె; నెవ్వనిచక్రమే, మనుజతతికిఁ గల్గు ఘనతరామ
యములఁ జెండు నట్టిదౌ చక్రమును గదఁ,దాల్చు మేటి మర్త్యతనువుమీఱ.

క. చిరకాలవృద్ధినొందెను; బరమేశుం డెవఁడు సార్వభౌతికజగముం
బరిరక్షింపఁగఁ జాలునొ, సురనాథుం డట్టిసాధు శుభదుం డిలలోన్. 234

క. గోపత్వ మెట్లుపొందెను; శ్రీపతి భూతాత్మకుండు చెలఁగి స్వశక్తుల్
దీపింప మహాభూతో, ద్దీపితలోకంబుఁ దాల్చు దేవుండు కదా. 235

సీ. జగములఁ బుట్టించు శక్తిమంతుఁడుకదా శ్రీగర్భుఁ డతఁడొక స్త్రీకడపున
జనియించె; నెవ్వాఁడు తనపాదముల మూఁడుజగములఁ గొల్చె నిర్జరపదంబు
గ్రహియింపఁ గోరిమార్గత్రయంబులఁ ద్రివర్గఫలదంబుల నిల్పెక్షితిని గాంచ
కుండ నేపురుషోత్తముండు లయంబున జగములఁ ద్రావి వర్షమును దోయ
తే. మయముగా నొనరించి యాత్మను స్వశక్తి
దృశ్యము నదృశ్యముగఁ జేసి యెల్లసృష్టిఁ
జేసె నేకార్ణవంబుగఁ జిత్రమెకద
యిట్టి యద్భుతశక్తి యింకెందుఁ గలదు. 236

ఆ. ఏపురాణపురుషుఁ డీడ్యుఁడు వారాహ
తనువుఁదాల్చి కొమ్ముకొననె జగము
నిలిపె; శతముఖుండు నెమ్మి వాంఛింపఁగ
ముజ్జగముల నొసఁగి ముదముఁ గూర్చె 237

మ. నరసింహాన్విత దేహ మొప్ప మనుజుల్ నాకస్థితుల్ మానులుం
బరితోషింపఁగ నాహిరణ్యకశిపుం బ్రహ్లాదుఁగావంగ ని
ర్భరదోశ్శక్తి చెలంగఁ జంపి సుజనుల్ వర్ణింప వర్ధిల్లె; నే
హరి యౌర్వుండను నగ్నియై ఘనతరంబౌ నాత్మ తేజంబునన్. 238

తే. తాను బాతాళమందుండి దారుణోద
ధిని గలజలంబుఁ ద్రావె నుత్కృష్టశక్తి
గనఁబడంగను; వేయియౌఁ గన్ను లన్ని
తలలు నన్నియుఁ బాదముల్ తనరుచుండ. 239

క. చెలఁగెడు పురుషోత్తముఁడను, సులలితవిఖ్యాతి యోగిజుష్టము నొందెన్;
ఖలహరణుఁ డిట్లు ప్రతియుగ,ముల వర్తిలు నంచుసాధుమునులంద్రుగదా.

క. కమలము నాభిస్థలి జన,నము నొందఁగఁ జేసె నదియె నాల్గువదనముల్
సమతందగు బ్రహ్మకు గే,హము మానివరేణ్యులార! యాదృతి వినుఁడీ. 241

తే. నాగలోకము జలమయమై గనంగఁ
బడఁగఁ బరితప్తకాంచన పంకజంబు
తనర నొప్పు మహాత్ముఁడే తారకామ
యమగు నని దైత్యులం జంపె నద్భుతముగ. 242

సీ. సర్వదేవమయంబు సకలాస్త్రధరము నౌవపువును దాల్చి యవ్వైనతేయు
మూఁపున వసియించి భూరిబలాఢ్యుఁడౌ కాలనేమిని జంపె లీలపోలె;
నమృతమయంబగు నాపాలకడలిలో నుత్తరాంతంబున నురుతరంపు
యోగమూనియె యెవ్వఁడురు కాలము సుషుప్తి జెందెను దిమిరంబు స్థిరతరముగ
తే. నుండఁగాఁజేసి; యేమహోద్దండశౌర్యు
ననుపమానుని దేవతాజనని యదితి
గర్భమునఁ దాల్చె నేదేవి ఖలహరణుని
శక్రుఁ దోలిపుత్త్రుగాఁ గాంచె సంతసమున. 243

చ. సరసిజలోచనుం డెవఁడు శక్రుని విన్నప మాలకించి స
చ్చరణసరోరుహక్రమత శాశ్వతయోగమహత్త్వయుక్తి ని
ర్భరగతి లోకముల్ గొలిచి స్వర్గవిలాసుల దైత్యులన్ ఫణీ
శ్వరపదసంగతిం గనఁగ వారక చేసి సురేంద్రు శక్రునిన్. 244

క. ఒనరించె నెవ్వఁ డాతఁడె, సనాతనుం డంచు వేదసమితి నుతించున్
వనజాక్షుఁ డెవ్వఁ డాదృతి,దనుజారులఁ గావఁ బూని తనగురుశక్తిన్. 245

వ. గార్హపత్యవిధానంబున నన్వాహార్యకర్మంబున నాహవనీయాగ్ని నిసమిద్భవంబుగ
నొనరించి వేదమును దీక్షను బ్రోక్షణీయస్రువంబున వాక్పాణియై యొనరించి దేవత
లహవ్యభాగభాక్కులనొనరించె. దేవతల హవ్యాదులను, బితరులఁగవ్యాదులను
గానాజ్ఞాపించె.యజ్ఞవిధిచేఁ దత్కర్మంబున నిట్టియిట్టిపద్ధతులుండఁదగునని నియ
మించె. మఱియు నేమహాత్ముఁడు యజ్ఞపాత్రములను దక్షిణను, దీక్షను, జరూ
లూఖలములను, యూపసమిత్స్రువంబులను, సోమపరిధులను, యజ్ఞీయద్రవ్య
ములను, జమసములను, సదస్యులను, యజమానులను,మేధాదులను విభజించి
తత్తదుపయోగములం దెల్పెనో,క్షణనిమేషకాష్ఠకలాముహూర్తతిథిమాససం
వత్సరర్తువులను, గాలయోగములను, ద్రివిధప్రమాణములను, ఆయుస్సును
క్షేత్రముల, నుపచయముల, లక్షణమును, రూపసౌష్ఠవమును, ద్రిలోకము
లను, ద్రిదైవములను ద్రైవిద్యమును ద్రేతాగ్నులను ద్రైకాల్యమును, ద్రివి
ధకర్మములను,ద్రివర్ణములను ద్రిగుణములను నియమించియే దేవదేవుఁడు వెల
యించెనో, యేలోకేశ్వరుఁడనంతకర్మమునలోకములసృజించెనో, సర్వాంతర్యా
మియైసర్వభూతగుణాత్మకుఁడై యింద్రియపూర్వయోగంబున నరులలోరమించు
చుండునో, గతాగతంబుల కెవ్వఁడు నేతయు విధియు నీశ్వరుండు నగునో,
యట్టిమహాత్మునిచరితంబును వినిపింపు మని మఱియును. 246

క. గతి యెవఁడు ధర్మయుతుల క, గతియెవ్వఁడు ఘోరపాపకర్ముల కెవఁడౌఁ
బతి చాతుర్వర్ణ్యమునకుఁ, బిత యెవ్వఁడు భూతజాతివితతికి ధరణిన్. 247

సీ. ఎవఁడు చాతుర్విద్య నెఱుఁగు నెవ్వఁడు చతురాశ్రమస్థుల కాశ్రయమగు నెవఁడు
దిక్తదంతరములు దివి భువి వాయువు ద్వాదశాత్ముఁడు చంద్రభాస్కరమయ
మైన జ్యోతియు గేశుఁ డగునో యెవ్వఁడు తక్షణదాచరుం డెవ్వఁ డుత్తమతపంబు
నిరుపమజ్యోతియౌ; నిశ్చలస్వాంతు లెవ్వనిఁ బరుఁ బరమాత్ముఁ బరమపురుషుఁ

తే గను నుతింతురో యాదిత్యగణమునందు
నెవఁడు దేవుఁడో దైత్యుల యేపుమాన్పు
విభుఁ డెవండో యుగాంతపువేళ నెవ్వఁ
డంతకుఁడో లోకలయకర్త కంతకుండో. 248

తే. సేతు డెవ్వండో లోకాళి సేతువులకు
మేధ్యకర్మంబులకు నెల్ల మేధ్యుఁ డెవఁడో
వేదవేత్తలలోపల వేద్యుఁ డెవఁడో
ప్రభువో ప్రభవాత్ములకును నెవ్వండో యరయ. 249

వ. ఎవ్వండు సౌమ్యులకు సోమభూతుండై అగ్నివర్చసుల కగ్నిభూతుండై శక్రుల
కీశభూతుఁడై, తపస్వులకుఁ దపోభూతుండై, నయవృత్తులకు వినయరూపుఁడై
తేజస్వులకుఁ దేజోభూతుండై విగ్రహార్హులకు విగ్రహంబై, గతిమంతులకు
గతియై వెలయునో అతనిచరితంబును జెప్పుము. మఱియు వాయువా కాశప్రభ
వుఁడు. అతనికిఁబ్రాణము మహాకాశనుఁడు. దినమునకుఁబ్రాణమగ్ని. ఆయగ్నికిఁ బ్రాణ
ము మధుసూదనుఁడు. రసమునుండి శోణితంబు ప్రభవిల్లు. ఆశోణితమునుండి
మాంస ముప్పతిల్లు. దానినుండి మేదస్సు పుట్టు. ఆమేదస్సునుండి యస్థి సంభ
వించును. దానినుండి మజ్జయు, దానినుండి శుక్రంబుజనించు. శుక్రంబువలన
గర్భంబగు. దానికి రసమూలకర్మము ప్రధానం బనియెఱుంగఁదగు. ఆగర్భం
బునందు జలము ప్రథమభాగము. ఆజలముసౌమ్య రాశియనం జెల్లు. ఊష్మసంభ
వగర్భంబు ద్వితీయభాగం బగు. శుక్రము సోమాత్మకంబు. ఆర్తవంబు పావకా
త్మకంబగు వీనిభావంబులు రసానుగంబులని యెఱుంగఁదగు. బీజమందుశశిపా
వకభాగంబు లిమిడియుండు. కఫవర్గంబునందు శుక్రంబును, బిత్తవర్గంబున శోణి
తంబు నుప్పతిల్లు. కఫమునకు హృదయముస్థానము. పిత్తస్థానమునాభిదేశము.
దేహామధ్యమభాగమగుహృదయము మనస్సునకు స్థానమని చెప్పంబడు. నాభి
కోష్ఠాంతము మహాకాశనునకుస్థాన మగు. మనస్సుప్రజాపతి యని తెలియవ
లయు. కఫముసోముఁడని చెప్పంబడు. పిత్త మగ్నియని విదితము. ఇట్లుజగం
బెల్లనగ్నిసోమాత్మకంబగు ఇట్లుగర్భముత్పత్తియయివృద్ధినొందుచుండ వాయు
వందుఁ బరమాత్మ నియోగంబునఁ బ్రవేశించు. ఆవాయువైదు తెఱంగుల

దేహమున వర్తిల్లు. ప్రాణాపాన సమానోదాన వ్యానములని యావాయు
వుల నామములు. అందుఁ బ్రాణవాయువు పరమాత్మను వృద్ధి నొందించుచుఁ
బ్రవర్తిల్లుచుండు. అపానంబు దేహపశ్చిమ భాగంబునాశ్రయించి యుండు.
ఉదానంబు శరీరికర్ధభాగంబువృద్ధి నొందించుచుండు వ్యానంబుసర్వత్రవ్యాపిం
చియుండు. సమానంబు సర్వనాడీజన్మస్థానంబునావరించియుండు భూతావాప్తి
దానినుండికల్గుచుండు. పృథివీవాయ్వాకాశజలజ్యోతిస్సులు సర్వేంద్రియము
లఁ దమతమభాగంబుల నునిచి యుండు. దేహము పార్థివంబు. మారుతము
ప్రాణాత్మకంబు వివరము లాకాశభాగంబులు. స్రావభాగంబుజలంబు జ్యోతిస్సు
నయనంబులు. తేజస్సునుదది యద్దియే. మనస్సు వానిం బ్రవర్తిల్లఁజేయు. ఏమన
శ్శక్తిసర్వవిషయములుగోచరించునో యది ప్రధాన మనుట యాశ్చర్యంబుగాదు
కదా. ఇట్లుపురుషుండు లోకముల సృజించి చిరస్థాయులుగా నొనరించును. కాని
యీలోకంబులు మృతినొందునవి ఇట్టిలోకంబున శ్రీవిష్ణువు నరత్వమెట్లుపొం
దెనో. ఈవిషయమున మాకు సంశయముగలదు. దానిందొలఁగింపుము.
మఱియు. 250

క. గతిమంతులకెల్లను స, ద్గతియెవ్వఁడో యట్టి ఘనుఁడు కడఁగి నరత్వం
బతితుచ్ఛ మెట్లు పొందెను, మతిఁ దలఁపఁగ నచ్చెరువిది మౌనిజననుతా. 251

క. సురదనుజవర్యు లెవ్వని, చరితముఁ బరమాద్భుత మని సన్నుతిసేయన్
బరిపరి వింటిమి మౌనీ, పరమేశుని జన్మచరిత బాగుగఁ జెప్పుమా. 252

తే. అమిత తేజుఁడు మిగులఁ బ్రఖ్యాతబాహు
వీర్యుఁడు నగు శ్రీవిష్ణుని విమలజన్మ,
చరిత మాశ్చర్యభూతంబు సాధుతమము
వేగ వివరింపుమా మౌనివితతివినుత. 253

సీ. పురుషోత్తముఁడు దేవపూగార్తిహరుఁడు సర్వవ్యాపి లోకౌఘవల్లభుండు
సర్వలోకేశుండు స్వర్గపాలనమృతికర్త లోకసుఖైక కారణుండు
శాశ్వతుం డక్షయసత్త్వుం డనంతుండు నిర్లిప్తుఁడు నజుఁడు నిర్గుణుండు
నిర్వికారుఁ డుపాధినిర్ముక్తుఁ డేకంబు వికృతిహీనుఁడు సర్వవిభుఁ డచలుఁడు

తే. నిత్యతృప్తుఁడు వ్యాప్తుండు నిర్వికల్పుఁ
డాదినారాయణుం డని యాలకించి,
తిమికదా; కృతయుగమందు నమరుచుండుఁ
బరమునకును హరిత్వంబు నిరుపమంబు. 254

వ. దేవతలందు వైకుంఠత్వంబును మానవులయందుఁ గృష్ణత్వంబును, జెలంగు.
కర్మములగతి గహనంబు. కావున గతాగతభగవచ్చరిత్రశ్రవణేచ్ఛ మాకుం
గలదు. అవ్యక్తుఁడు వ్యక్తలింగస్థుఁడై నారాయణుం డనం బరఁగుచుఁ బ్రపం

చమ్మున వెలుంగుచుండు. బ్రహ్మశక్రరుద్రధర్మశుక్రబృహస్పతిప్రముఖనామం
బులం దాల్చి సృష్టికార్యార్థము బ్రహ్మను బుట్టించె. ఆతఁడు ప్రాగ్యుగమునఁ
బ్రజాపతుల నవతరింపఁజేసె. ఇట్లు పరమపురుషుం డగుశ్రీహరి సర్వలోకేశ్వ
రేశ్వరుండు మర్త్యలోకంబున నేల యదుకులంబున జనించె నెఱింగింపు
మనుటయు వ్యాసమహర్షి మునుకులకు భగవల్లీలలం జెప్ప నెంచి. 255

## డెబ్బదియొకఁడవయధ్యాయము.

వ్యాసులు మునులకు భగవదవతారములఁ దెల్పుట.

చ. సురల కధీశుఁడై మిగుల శోభిలుచున్ సకలస్థలంబులం
బరఁగి పురాణపూరుషుఁడు భద్రదుఁ డవ్యయుఁ డీశ్వరుండు సు
స్థిరవిభవుండు నిర్గుణుఁడు చిత్రగుణాకరుఁ డధ్వరాంగుఁ డన్
చిరనుతిఁ గాంచి యెంతయును శ్రేష్ఠుఁడునై యమితప్రభావుఁడై. 256

సీ. వేదవేత్తలచేత వెదకంగఁబడుచు సర్వాల్పతముండయి యధికవిస్తృ
తాకారుఁడై విశ్వమంతట వ్యాపించి సచరాచరంబగు జగము నెల్లఁ
దానయై జనిమృతిఁ గానక కనఁబడి కనఁబడకయె విలక్షణుఁడు నగుచు
సర్గపాలనలయచతురుఁడై మఱి చతుర్వ్యూహాత్మకుండయి యొప్పు బ్రహ్మ

తే. కును నమస్కారముల భక్తిఁగూర్తు ననుచు
మ్రొక్కి యవికారునకు శుద్ధమూర్తి కజున,
కాపరేశ్వరునకును సదైకరూపు
నకును విష్ణువునకు జగన్నాథునకును. 257

క. హరికిని హిరణ్యగర్భున, కురుతరసుఖదునకుఁ జాల నుత్తమునకు శం
కరునకు సృష్టిస్థితిలయ, కరునకు సారునకు భూతగణనాథునకున్. 258

క. ఏకానేకాకృతికిన్, శ్రీకలితునకున్ సమస్తసిద్ధిదునకు స్థూ
లాకారునకున్ సూక్ష్మ, ప్రాకటకాయునకు వ్యక్తపరమాత్మునకున్. 259

ఆ. వ్యక్తరహితునకును నపవర్గదునకు వి, ష్ణువున కఖిలమూర్తిశోభితునకు
మూలభూతునకును లీలావతారున, కును బరాత్పరునకు ఘనతమునకు. 260

వ. విశ్వాధారభూతుండై యణువులలో నణువై సర్వభూతస్థుండై పురుషోత్తముఁ
డచ్యుతుఁడు జ్ఞానరూపుఁడు నిర్మలుం డర్థరూపుఁ డనభ్రాంతిదర్శనంబున నుండు
వాఁడు. గ్రసిష్ణువు విష్ణువు జగదీశుఁ డనంతుఁ డక్షయుం డవ్యయుం డనం బరఁ
గుపరమాత్మునకు నమస్కరించెద. మున్ను మీరు నన్నడిగినట్లే యతౌదులు
మహామునులు ప్రశ్నింపఁ బితామహుండు వచియించె. దాని మీకుఁ జెప్పెద.
ఋక్సామముల వెడలఁగ్రక్కు వాక్కులచే నెవ్వఁడు జగత్త్రయంబును బవి

త్రము చేయునో యట్టియీశు నేకార్ణవ వినిద్రుని బ్రార్థింతును. ఏమహాను భావుని శాసనమును సకలనిర్జరులు మానవులు నితరదేవతాగణంబులు శిరంబులం దాల్తురో అట్టి యవ్యక్తజన్ముఁడగు బ్రహ్మామతమును విస్తరించివచియించెద. ఎవనిచే సృష్టి నుద్దేశించి ధర్మాదులు సృజింపఁబడిరో ఆపరాత్పరుని చరితంబు వివరించెద వినుండని యిట్లనియె. 261

సీ. అప్పులు నారంబు లనిచెప్పఁబడు నవ్వి యయన మెవ్వానికౌ నతఁడు పిల్వ
నొప్పర నారాయణాహ్వయంబున నట్టిభగవంతుఁ డఖిలంబుఁ బరమశక్తి
నావరించియె యుండు నతఁడు చతుర్భాగములుగ నెల్లెడ నుండు వెలయు నొక్క
మూర్తి వ్యక్తంబయి మూర్తిలేకయె యొక్కఁడగు శుక్లవర్ణంబుగ గణుతించి

తే. బుధులు చూచుచుందురు భూరిదీప్తి, నూలికాన్యతరూపిణి మహితయోగి
వినుత వేతోకమూర్తియు విస్తరిల్లు, సకలసుగుణాతిగయె యనుసంస్తుతిఁగని.

వ. అది దూరమందున్నను జెంతనున్న నొక్కవిధంబుగనె తలంపఁబడు. అది వాసుదేవాభిధానంబున నిర్మమత్వంబునఁ గనఁబడుచుండు. దానికి రూపవర్ణాదులు కల్పనామయంబులగు భావంబులు లేవు. మఱియు నయ్యది సదాశుద్ధంబై సుప్రతిష్ఠికరూపిణియై యలరారుచుండు. రెండవది మూర్ధంబుచే భూమిని ధరించి శేషాఖ్యచేఁ గ్రిందిభాగంబున వెలయుచుండు. అదితామసియని ప్రఖ్యాతిం గాంచె తిర్యక్త్వంబును బొందె. మూఁడవది ప్రజాపాలనకర్మం బొనరించు. అది సత్త్వోద్రిక్తయై ధర్మసంస్థానకారిణియై యుండు నాల్గవది జలమధ్యభాగంబునం దుండి పన్నగతల్పంబున శయనించి యుండు. దానిగుణంబు రజస్సు. అదిసృష్టికార్యం బొనరించుచుండు. శ్రీహరితృతీయమూర్తి ప్రజాపాలనతత్పరయగుచుండు నని చెప్పఁబడెనో యదియే ధర్మసంస్థాపనమును భూతలంబునఁ జేయుచుండు. గర్వించు నసురులం జెండాడు. ధర్మహంతలఁ గూల్చు. ధర్మరక్షణకర్తలగు దేవతలం గాపాడుచుండు. మఱియు. 263

క. ధర నేయే సమయంబులఁ,బరమంబగు ధర్మమునకుఁ బొటిలుఁ జ్యుతి యు
త్తరుణములందె యధర్మము,శిరముం బైకెత్తు నపుడె శ్రీహరి పుట్టున్. 264

క. మును పాదివరాహంబన,జనియించి స్వదంష్ట్రచేత జలము నడఁచి మె
ల్లన భూమిఁ బైకి నెత్తెను,వనజలతన్ బోలె లీల వరతరశక్తిన్. 265

క. నరసింహతనువుఁ దాల్చి,హిరణ్యకశిపున్ వధించె నెంతయుఁ దగుని
ర్భరబాహుబలము మెఱయఁగ,సురవైరులు విప్రచిత్తిశూరప్రముఖుల్. 266

క. పొడసూపి ధర్మహానికిఁ,గడఁగిన నప్పుడె యొఱింగి కమలాక్షుఁడు చే
డ్పడఁ జేసె వామనుండను,బుడుతఁడుగాఁ జెలఁగి మాయ పొంగఁగ బలినిన్.

క. వంచించి జగత్త్రితయము,నంచితగతి నింద్రునకు మహత్తరశక్తిన్
మించి యొసంగెను;యశముం,గాంచిన భృగువంశమం దఖండనియతుఁడై. 268

క. తనరెడు జమదగ్నికి స, త్తనయుండై పుట్టి తీవ్రదర్పంబునఁ దం
డ్రిని జంపిన హైహయులను, జనపతులం జంపెఁ బరశుచంచద్ధారన్. 269
క. ఆరీతి నత్రిమౌనికు, మారుండై సర్వశక్తిసహితుండై దు
ర్వారతర యోగశక్తిని, ధారణి వెలయంగఁ జేయు దలఁపు వెలయఁగన్. 270
ఆ. తగునలర్కమునికిఁ దాను దత్తాత్రేయ, నామమును ధరించి ధీమహత్త్వ
మలరుచుండ నొప్పి యష్టాంగయోగంబుఁ, దెలిపె మౌనులార పలుకులేల. 271
చ. దశరథరాజపుత్త్రుఁడయి ధాత్రి జనించి ప్రతాప మొప్పఁగా
దశముఖు మూఁడులోకముల దర్పమునం దగి భీతిదుండునై
ప్రశమితజిష్ణువై పరఁగు రావణుఁ జంపె రణాంగణంబునన్
యశము చెలంగ రాముఁడన నాపరమేశుఁడె ధర్మరక్షకై. 272
సీ. మూఁడులోకములు సముద్రజలంబుల మునుఁగఁగా దేవతామూర్తి హరియు
వేయియుగంబులు విషధరపతిశయ్య యోగనిద్రను గాంచె నొప్పుమహిమ
మున మూఁడుజగములఁ దనకుక్షి నిడుకొని జనలోకగతసిద్ధసమితి పొగడ
మౌనివర్యులు వేదమహితవాక్కుల నెన్న; నాపరమాత్ముని యమలనాభి
తే. పంకజంబున జనియించె బ్రహ్మ యదియుఁ, బత్త్రదశకంబునం దగి వహ్నిభాను
సమరుచిం బొల్చి శైలకేసరవిభూషి, తమయి మారుతకింజల్కతతిఁ దనర్చె. 273
క. అనుపమతం దగు నందే, జనియించెఁ జతుర్ముఖుండు సకలసురవిభుం
డనఘుండునైన యాతఁడు, జనియించిన యంతలోనఁ జయ్యన నసురుల్. 274
ఆ. చక్రికర్ణమలము జననస్థలంబుగా, మధుకైటభుఁడును మహితశక్తి
సహితులగుచు వచ్చి శతధృతిఁ జంపఁగాఁ, దలఁప వారిఁ జంపెఁ జక్రి లేచి. 275
వ. ఇవ్విధంబున భగవంతుఁ డొనర్చిన యద్భుతకృత్యంబులు లెక్కింపఁ దరంబు గాక యుండు. మథురానగరమున నామహాత్ముఁ డవతరించుట యిటఁ బ్రధానం బగు. ఇట్టులా సాత్త్వికీమూర్తి యవతరించుచుండు. ప్రద్యుమ్నాహ్వయంబున నాసాత్త్వికీమూర్తి ప్రఖ్యాతిం గాంచి రక్షాకర్మమున కుపక్రమించు. దేవత్వమనుష్యత్వతిర్యక్త్వంబులం గాంచు. తత్స్వభావంబులఁ గాంచుచుండు. ఇది వాసుదేవాజ్ఞచే నని యెఱుంగునది. ఆమూర్తి పూజింపఁబడి భక్తుల కభీష్టంబుల నిచ్చుచుండు. మునులారా! ఆభగవన్మూర్తివిభవంబు వర్ణించితి. ఆమూర్తిమనుష్యత్వంబునఁ జెలంగువిధంబు వివరించెద వినుండని వ్యాసుండు మరలనిట్లనియె.

## డెబ్బదిరెండవ యధ్యాయము.

భూదేవి బ్రహ్మకడకుం బోయి తనకష్టములను జెప్పుకొనుట.

చ. వినుఁడు మునీంద్రులార! పృథివీగురుభారము తీర్ప నెంచి మే
దినిపయిఁ బుట్టె శ్రీహరి యతిస్థిరవిక్రమశాలిధర్మమే

యనువున క్షీణతంగనునొ యక్లి యధర్మము వృద్ధి నొందునో
కనుఁగొని ధర్మమార్గమును గావ జనార్దనమూర్తి పుట్టెడున్. 271
క. తనతనువు రెండువిధముల, నొనరించి సాధువులఁ గావ నొక్కటిధర్మం
బును నిల్పి దుష్టశిక్షణ, మును జేసి యధర్మమార్గమును బోఁగొట్టున్. 278
ఆ. తనదు మూర్తులందుఁ దగునొకదానిని
వెలయఁ జేయు దనుజవీరవరులఁ
జెండఁ బ్రతియుగమున క్షితిఁ బుట్టుచుండును
వినుఁడు తద్విధంబు విన్నవింతు. 279
చ. మును పాకవేళ భూమిసతి భూరితరంబగు భార మోర్వనం
బనివడి మోయఁజాలక జవంబున బ్రహ్మను గానఁబోయి మే
రునగశిరంబునన్ సురవరుల్ తనుఁ గొల్వఁగ వెల్గుచున్న బ్ర
హ్మను గని మ్రొక్కి యేడ్చెఁ దనయార్తిని గాంచి మునుల్ తపింపఁగన్. 280
చ. తమకు నమస్కరించి గురుధర్మము గావుఁ డటంచుఁ బల్క నా
క్షమ గని దేవతల్ మునులు కాతియనొందుచు నుస్సురంచు నుం
డ మరలఁబల్కె భూసతి కడంకను జాలిని గల్గఁజేయు వా
క్కమరఁగ నోపితామహ హలుతాశనుఁడో గురు వెన్న భూరికిన్. 281
క. ధేనువులకు సూర్యుండే, యేను గురుం డింక నాకు నఖిలమ్మునకున్
శ్రీనారాయణుఁడే గురు, వోనిర్జరవర్య! మనవి యొప్పగ వినుమా. 282
క. అరుదెంచితి మీచెంతకు, సురరిపులో కాలనేమిశూరాదులు భీ
కరసత్త్వ లిపుడు మర్త్యముఁ, గర ముత్తలపాటు నొందఁగాఁ జేయంగన్. 283
క. పనిపూని యహర్నిశమున్, జనులను బాధించువారు శతధృతి! మునుపా
వనజాక్షుఁడు విక్రమమున, దనుజేంద్రునిఁ గాలనేమి దారుణరీతిన్. 284
క. అనిఁజంపె నుగ్రసేనుం, డనువానికిఁ దనయుఁ డగుచు నాతఁడె పుట్టెన్
ఘనబలు లరిష్టధేనుకు, లనువారలు కేశి నరకులను క్రూరాత్ముల్. 285
క. దనుజేజ్యుండగు సుందుఁడు, ఘనబలుఁడగు బాణుఁ డతఁడె కద బలిపుత్త్రుం
డనఘా! యింకను వీర్యం, బున నసములు దనుజవరులు భూపగృహములన్.
క. జనియించిరి దుష్టాత్ములు, వనజాసన వారి నెన్నవశమే నాకున్
గనుకన్ దృప్తులసంఖ్యులు, దనజులు నాపైనఁ గ్రూరతం జెలువారన్. 287
ఉ. వారల భూరిభారమున వంతను గాంచుచు నున్నదాన దై
త్యారివరేణ్యులార! భువనాళి నొనర్చెడు నోవిధాత యీ
భారము పూనఁజాల నొకవాక్కు వినుం డిఁక నన్ను నేనె యీ
సారి భరించి నిల్పుకొనఁజాల నొనర్చెద విన్నపంబిదే. 288
శా. నా యీవిన్నప మాలకించి దనుసంతానంబు క్షీణించు నే

చాయం దత్కృతి నూహచేయుఁడు మనస్థైర్యంబు మీఱంగ నో
హో యం చూరకయున్న నేఁబడుదు సత్యగ్రాహి లోకంబునన్
న్యాయం బింకఁ దలంపుఁడీ యనుచు దైన్యంబొప్పఁగాఁ బల్కఁగన్. 289
చ. ధరణి వచించినట్టి గురుధర్మవచస్తతి నాలకించి ని
ర్జరవరు లీకృతిన్ సలుపఁ జాలఁ బ్రయత్నముచేయుటే సమా
దరమును జూపుటౌ ననుచుఁ దారు మనంబుల నెంచి రంత నా
సరసిజసూతి యిట్టులనె శ్మాసతి ధైర్యము నొందునట్లుగన్. 290
చ. సురవరులార! యిత్తఱిని క్షోణి వచించిన దెల్ల సత్యమా
హరుఁడును నేను మీరును జరాచరరూపము నౌ ప్రపంచమున్
హరిమయ మామహాత్ముని దయాకిరణంబులె సర్వభూతముల్
పరమవిభూతిసంతతికె పర్వెడు న్యూనతయున్ మహత్త్వమున్. 291
తే. ఒక్కదాని వేఱొక్కటి యుక్కడంపఁ
దలఁచుచున్న వన్యోన్యంబు తద్విభూతు
లట్టులౌటను మనమెల్ల నరుగవలయుఁ
గలశపాథోధితటమున కెలమి మిగుల. 292
క. అందుండు పరమపురుషుం, డెందుం దనకీడు లేని యేపునఁ గానన్
సుందరమూర్తిని గని మన, మందఱ మీవిధము తెల్ప హరి యేమనునో. 293
తే. పరమపురుషుని బూజించి ధరణియార్తిఁ
దెలుప సర్వాత్ముఁడైన యాజలజనయనుఁ
డఖిలవిశ్వమయుండౌట స్వల్పభాగ
మున ధరం బుట్టి ధర్మము పూర్వగతిని. 294
క. నిలుపును గావున మన మా, జలజాక్షుని పజ్జకేగఁ జనునని వారిం
గలిసి సమాహితమతియై, యిలఁదోడ్కొనిపోయె జగదధీశుం గనఁగన్. 295
చ. చనిచని క్షీరవార్ధి దరిఁ జక్రి ననంతు సహస్రపాదశీ
ర్షనయను భక్తి నెంచి శ్రుతిసారవచస్సుల సన్నుతించె నో
వనజదళాక్ష! లోకమును బాగుగఁ బుట్టఁగఁజేయఁ బెంపఁ ద్రుం
పను గతి వీవ సూక్ష్మతరవస్తువులం దతిసూక్ష్మ మీవ సూ. 296
ఆ. అణువులందు నీవె యణువవు గురువస్తు, జాలమందు నీవె చక్రధరణ
యతి గురుత్వమందు నట్టివాఁడవు దేవ, మమ్ముఁ గావరమ్ము మాధవేశ. 297
వ. ప్రధాన బుద్ధీంద్రియ వంతుఁడవు. ప్రధానకారణుండవు. మాయీప్రార్థనంబు
నంగీకరింపు మని మఱియు నిట్లు విన్నవించె. 298
చ. ధర యిదె భూమిఁబుట్టిన నితాంతదురాత్ములఁ గ్రూరకృత్యులన్

సురరిపులఁ భరించుటకు సొక్కుచు దీనత నొంది వారిసం
హారణమునందు నీవె తగు దంచు నినుఁ శరణంబు వేఁడ నా
పురి కరుదెంచె నేను సురపుంగవులం గొని నీదుచెంతకుఁ. 299

క. అరుదెంచితి భూదేవీ, గురుతరభారంబుఁ దీర్ప క్షోణిస్థలిపైఁ
ద్వారఁ జన్మింపుము దేవా, వరుణుం డితఁడే యమర్త్యవల్లభుఁ డితఁడే. 300

సీ. వసువులు వీరె రుద్రసమితి యిదె సూర్యు లివ్వారె వాయువు లెన్న వీరె
హవ్యవాహుఁ డితండె యమదు లింకనుగల వారెల్ల వీరె యీవసుధభార
మును దీర్పఁ జేతగామిని నిన్ను శరణొంద వచ్చినారము దేవ వాసుదేవ
మాకు నాజ్ఞాపింపు మాచేత నగు పని దీర్తు మవ్విలిపని దీర్పఁ బూను

ఆ. మనుచు సన్నుతింప నాపరమేశ్వరుఁ, డాత్మకేశములను నప్డు శ్వేత
కృష్ణవర్ణములను హితమతిఁ జే లాగి పద్మజాదులఁ గని పలికె నిట్లు. 301

క. ఈనాకేశంబులు ధర, పై నవతారంబు నొంది భారముఁ గ్లేశం
బూని నశింపఁగఁ జేసెదుఁ, గానఁ సురలార! స్వాంశకంబుల మీరల్. 302

ఆ. ధరణి నవతరించి దర్పమ్ము పొంగఁ బూర్వమె చెలంగుచున్న రాక్షసులను
మారుకొనుఁడు వారు మ్రందుదు రంతట, భవదమోఘబాణ నివహములను.

చ. దనుజులు చావ భూసతి నితాంతసుఖంబును గాంచు సంశయం
బనునది లేదు; దేవకియు నవ్వసుదేవునిఁ బెండ్లియాడి యా
త్మనియతి దేవతాజననిమాడ్కి వెలింగెడు నామె గర్భ మం
దనుపమకేశ మిద్యోదియె యష్టమపుత్త్రుఁడుగా జనించెదుఁ. 304

మ. ధరఁ బెంపొంది నృశంసుఁ గంసుని మహాదర్పంబునం ద్రుంచి భీ
కరదర్పోద్ధతుఁ గాలనేమి మఱియుఁ గర్వోద్ధతిం బొల్చునా
శరసంతానముఁ ద్రుంచు భీతి వల దేసందేహముల్ పొందకే
యరుగుం డంచు వచించి తాఁ గనె నదృశ్యత్వంబు నచ్చోటనే. 305

మ. హరియుం గన్పడకున్న నయ్యమరు లాయబ్జాక్షు లో నెంచి భ
క్తిరతిఁ మ్రొక్కి "క్షమస్వ దేవ" యనుచుంగీర్తించుచుంబోయి యు
ర్వరపై స్వాంశములఁ జనించిరి; తపోరాజత్ప్రభావుండు భీ
కరవృత్తిప్రతిరోధి నారదుఁడు చక్కఁ స్వాత్మ నూహించుచుఁ. 306

క. దేవకి యష్టమగర్భము, భూవర నినుఁ జంపు ననుచుఁ బోల వచింపం
గా విని కంసుఁడు నారదు, వేవిధములఁ బొగడె మిత్రవిధి యిదెయనుచుఁ.

తే. దేవకీవసుదేవుల భావితాత్ము, లనక కోపంబు దీపింప నాత్మనగర
మందుఁ గారాగృహంబునయందు నునిచెఁ, గంసునకు వసుదేవుఁడు కఠినమతిని.

క. తన కుదయించిన సుతుల న, తనికుశలముఁ గోరియొసఁగె ద నటంచుఁ బ్రతి

జ్ఞను జేసి యున్న రీతిని, మనమున వగ గదుర నొసఁగె మానినిఁ గావన్. 306
తే. అందు నార్గురుతనయు లయ్యసురనేత, యగుహిరణ్యకశిపునకు నాత్మజాతు
లగుదు రవ్వారి శ్రీహరి యాజ్ఞ నిద్ర, దేవకీగర్భమునఁ గూర్చె దివ్యశక్తి.
సీ. ఏమాయశక్తిచే నెల్లలోకంబులు మోహితమ్ములగుచు మునిఁగి యుండు
ఘనతరావిద్యయన్ ఖ్యాతిఁగాంచిన యోగనిద్ర నద్దాని మౌనిపతి వినుతుఁ
డగు జగత్పతి హరి యాదృతిఁ బిల్చి యిట్లనియె; నిద్రాదేవి యస్మదాజ్ఞఁ
బాతాళమున కేగి యాతురపడుచున్న తనయుల నార్వురఁ గొని యనూన
తే. శక్తి నా దేవకీగర్భసంస్థితిఁ గన, వరుసఁ జేర్పుము కంసుఁడు వారిఁ జంపు
నవల నేడవ గర్భమం దయ్యనంతు, నంశము వసింపఁగలదు నాయానతి మెయి.
తే. గోకులంబున వసుదేవు కూర్మిపత్ని, కలదు రోహిణి యనఁబడు కాంత యామె
గర్భమున నీయనంతుని కళను జేర్చ, వలయు; దేవకిగర్భంబు వదలిపోయె.
క. అని లోకు లెంతు రేడవ, తనయుఁడు జనియింపకుండఁ దాఁ జెడె గర్భం
బని కంసుఁడు తలపోయును, జను లట్లే తలఁచువారు స్వాంతములందున్.
తే. గర్భసంకర్షణమున సంకర్షణుఁ డన, నతఁడు విఖ్యాతినొందు శ్వేతాద్రితుల్య
కాంతి నలరారు నవ్వలఁ గంసు నడఁప, దేవకీగర్భమును నేను దివిజు లలర.
క. చేరుదు నప్పుడె నీవును, శ్రీరంజిలు నాయశోద చెలువగు కుక్షిం
జేరుము ప్రావృట్కాలము, రా రమ్యశ్రావణమున రాత్రి శివతిథిన్. 315
ఆ.*కృష్ణపక్షమందుఁ గీర్తనీయంబగు, కాలమందు జనిని గాంతు నేను
నవమియందు నీవు నవనిఁ బుట్టంగల, వపుడె నను యశోద యంతికమున. 316
క. నిను దేవకిచెంతను నా, పనుపున వసుదేవుఁ డునుచుఁ బాపాత్మకుఁడౌ
జనపతి కంసుఁడు నినుఁ జేఁ, గొని శైలశిలాతలమునఁ గొంకక వైచున్. 317
క. వ్యోమమున కెగిరి నీవట, ధీమహితస్ఫూర్తి నిలువు దేవవినుతవై
భూమండలమునఁ బూజల, నేమమునం గొనుము దివిజనేతయు నిన్నున్.
క. వేవిధములఁ బొగడుచు నిం, పావహిలన్ నన్నుఁ గాఁగ నరసి భగినిగా
భావించును బూజించును, నీవును శుంభాదిదనుజనిచయము ననిలోన్. 319
ఆ. పౌరుషంబుమీఱ వధియించితివి గాదె, యట్టినీకు భూమియందుఁ బెక్కు
స్థలము లలరఁగలవు. సజ్జనపూజల, నందుచుందు వీవు హర్షదవయి. 320
సీ.†భూతి సంతతి కీర్తి భూరికాంతులు నీవె ధృతివీవె నీవె పృథ్వివి తలంపఁ
బుష్టివి లజ్జవు భూధరపుత్త్రియా నుమ నీవె జగతిపై నొప్పుమిగులు

---

* ప్రావృట్కాలేచనభసికృష్ణాష్టమ్యామహంనిశి ఉత్పత్స్యామినవమ్యాంచప్రసూతింత్వమవాప్స్యసి = అనిమూలము.

† లజ్జాపుష్టిరుమాయాచకాచిదన్యాత్వమేవసా = అనిమూలము.

నట్టినారీమణి యలరునే నయ్యది త్వద్రూపిణియె సుమ్ము భక్తి నెవ్వ
రంబిక యంచు దుర్గాంబ యంచును వేదగర్భయంచును భద్రకాళి యనుచు
తే. క్షేమకారిణి యనుచు నక్షీణమహిమ
మొప్ప దానవటంచు నిన్నొగిఁ బ్రభాత
మందు నపరాహ్ణకాలంబునందు మ్రొక్కి
పూజసేయుదు రవ్వారు పొలుచుచుండ్రు. 321
క. వారలవాంఛితములు నా,భూరికటాక్షముల మిగులఁ బొంగి ఫలించున్
జారుతరపదార్థము లుప,హారములు నొసంగి నిన్ను నర్చించినచోన్. 322
క. మనుజుల కెల్లను గోర్కులఁ,దనివార నొసంగు మీవు ధన్యులు నిన్నున్
మనముల భక్తిం గొల్తురు, వనితారత్నంబ వారె భక్తులునాకున్. 323
క. మనమున నించుక సంశయ,మును బొందకు మీవు నాదుమూర్తివె నీవై
యనఘార్చితవై చెలఁగుదు,వని శ్రీహరి పలికెఁ జాలనాదృతి దగఁగన్. 324

## డెబ్బదిమూఁడవయధ్యాయము.

మాయాదేవి దేవకీసప్తమగర్భమును రోహిణియందుఁజేర్చుట.

చ. హరి యిటు పల్క దుర్గయు మహత్తరశక్తివిలాస మేర్పడం
ద్వరపడి యాఱుగర్భములఁ దద్వనితామణి కుక్షిలోపలన్
వరుసగఁ జేర్చి యేడవది వారిరుహానన రోహిణీమృదూ
దరమునఁ జేర్చె శ్రీపతియుఁ దత్కృతికై ముద మొందునట్లుగన్. 325
క. హరియును రోహిణి కుక్షిన్, బరమేశ్వరి యయ్యనంతు భద్రదతేజం
బురుశక్తిఁ జేర్చ దేవకి, నిరుపమగర్భంబునందు నెమ్మిం జేరెన్. 326
సీ. యోగనిద్రయు యశోదాగర్భమున నప్డు చేరె శ్రీహరియును సిద్ధతేజ
మలర దేవకికుక్షి నమరి యుండెడురీతి; ఖచరగణంబులు కమ్రగతుల
నందియుండెను దివి హరిదివ్యతేజ మాసుదతిగర్భంబున శోభిలంగ
భూదేవియును బ్రీతిఁ బొలుపారె ఋతువులు శుభసంపదభివృద్ధి సొంపునింపె
తే. నపుడు దేవకిఁ జూడంగ నవని నెవ్వఁ,డైన శక్తుఁడు గాఁడయ్యె హరిసుతేజ
మందునుండుట నతిశయమైన కాంతి,నమరియుంటను గని క్షుద్రులార్తిగనిరి.
చ. పురుషులు కాంత లాసతిని బోలఁ గనుంగొనఁ జాలకుండ ని
ర్జరవరు లాసరోజముఖి చక్రిని గుక్షి ధరించియుండ నా
దరమునఁ గాంచి వేవిధుల ధన్యవు నీవె యటంచు సన్నుతుల్
జరపిరి వేదవాక్కుల నెసంగెడుభావము లొప్పునట్లుగన్. 328
సీ. నీవె స్వాహాదేవి వీవె స్వధాంబవు విద్యయు సుధయునై వెలయు దీవె
జ్యోతిస్సు నీవె యీక్షోణిని రక్షింప సర్వలోకములకు శర్మ మొసఁగ

నవతరించిన దానవమరులయెడ సుప్రసన్నరాలవు గమ్ము సర్వజగము
లకు శుభంబులను గల్గఁగఁజేయు ప్రీతితో నఖిలజగంబుల నాత్మ ననుచు
తే. కొను మహాత్ముని ధరియింపు మనుపమానశక్తి నని వినుతింపఁగ సరసిజాక్షి
పుండరీకాక్షు దేవతాపూగపతిని, జగదవనకారణుని దాల్చె సాధుకుక్షి.

## శ్రీకృష్ణావతారఘట్టము.

సీ. దేవకీప్రాక్సంధ్యఁ ద్రిజగదంభోరుహబోధనార్థము జగత్పూగకర్త
యగు చక్రిభాస్కరుం డావిర్భవించెను మధ్యరాత్రంబున మహితతేజుఁ
డఖిలలోకాధారుఁ డప్పరాత్పరుఁడు దేవాధిపుఁ డమల ధర్మాభిరక్ష
ణముచేయఁ బుట్టంగ నభమునఁ గ్రమ్మి మేఘములు మృదుధ్వని కలుగ మోద
తే. మును సమీచీనముగఁ దెల్పె ననుపమసుమ
వృష్టి పర్వెను దేవతావితతినుండి
వాయువులు వీచె మెల్లన వార్ధులట్టె
పొంగ నేరికి బాధయుఁ బొసఁగకుండ. 330

మ. వికచేందీవరపత్రనేత్రుని మహావిర్భూతిమాత్రోద్ధత
ప్రకటారిప్రళయున్ జతుర్భుజుని శ్రీవత్సాంకవక్షస్స్థలున్
సకలార్తిక్షయహేతుభూతుని జగత్సాక్షిన్ మహాత్మున్ బరున్
సకలేశున్ వసుదేవుఁ డట్టె కనుచున్ సమ్మోద మేపారఁగన్. 331

చ. సులలితవేదవాక్కులను స్తోత్ర మొనర్చి ప్రసన్నచిత్తుఁడై
యిలపయి మాఱులేకయె యహీనపరాక్రమ మొప్ప ధర్మమున్
విలయమొనర్పఁ బూను నృపవీరునిఁ గంసునిఁ గూర్చి చెప్పఁగాఁ
దలఁచి తదీయభీతిమెయిఁ దద్దయు నస్ఫుటవాక్కు లొప్పఁగన్. 332

క. వినయంబున నీరీతిగ, ననియెన్ బరమేశ దేవతానీకమహా
ర్తిని బాప నవతరించితి,వని యెఱుఁగుదు నైన దుష్టుఁ డగు కంసునిచేన్.

క. దరచక్రగదాధరణా, నిరతము కష్టంబుగల్గు నీ వీతనువున్
గరుణ నుపసంహరింపుము, సురగమ్యం బిద్ది తనువు శుభతమమును నా. 334

క. నరపతి కంసుఁడు యాతనఁ, ద్వరగాఁ గల్గించు నాకు దామోదర మం
దిరమున నిట నీజని విని, పరికింపక హింసచేయఁ బరుగిడుఁ జుమ్మీ. 335

క. అన దేవకి యిట్లనియెన్, దనకుక్షిఁ బ్రపంచమెల్లఁ దాల్చి ప్రపంచం
బును దానయగుచు నెవ్వఁడు, తనరారునొ యట్టి పరమదైవం బిచటన్. 336

ఆ. స్వీయమాయచేత సిద్ధార్భకత్వంబు, దాల్చి యున్నవాఁడు తలఁపఁ దాన
నంతుఁడయ్యు మఱి యనాది యయ్యును శిశు,వట్టు లలరు నిట్టి యమరవిభుఁడు
క. కరుణించుఁగాక మమ్మున్; బరమేశ్వర దేవదేవ బాహుచతుష్కం

బహుశక్తిగల్గు తనువును, గరుణ మెయిన్ గానరానిగతిఁ జేయు మిటన్. 338
క. దనుజాంతక! దుష్టాత్ముం, డనఁదగు కంసుండు నీదు నవతారముఁ గ
న్గొనకుండునొ యవ్విధమునఁ, గనఁబడుమా యనుచు వేఁడఁ గంజాక్షుఁడనున్.
క. మును పుత్త్రులకై వేఁడితి, నను నా వాంఛితము దీర్ప నారీమణి నీ
కును దనయుఁడనైతిని బ్రార్థనము ఫలింపంగఁ జేయు తలఁపున గానన్. 340
క. బాలునిభంగిగ నుండెద, నేలీలం గంసుఁ డెఱుఁగు? నిట్టి నను నిఁకన్
జాలును వెతనొందఁగ నని, బాలునివలెఁ గానఁబడియెఁ బద్మాక్షుండున్. 341
క. వసుదేవుఁ డంత బాల, త్వసమాకలితున్ మహాత్ముఁ బద్మదళాక్షున్
వెసఁ గొని తన్నిశయందే, పసరంబులమంద లుండు పట్టున కేగెన్. 342
చ. కొమరుని దోసిటం బొదిగి కొంచుఁ జనన్ వసుదేవు యోగని
ద్రమహితశక్తి నెవ్వరును రక్షకు లడ్డ రదేమి హేతువో
యమరవిభుండు పత్తనము నవ్వలికేఁగఁగ ద్వారపాలకుల్
తమ కపుడేమితోఁచమిని ధాత్రిఁ బరుండిరి నిద్రవెంపునన్. 343
చ. తలుపులు తీయుచప్పుడును దద్దయుఁ బర్విననైన నేమియుం
దెలియక వారలుండ వసుదేవుఁడు బాలకుఁ గొంచుఁబోయె నా
జలదము లప్డు పర్వి గురు శబ్దములొప్పఁగఁ గుంభవృష్టి ని
ష్ఠులఁ గురియంగఁ దజ్జలము పొంగఁగ నించుక బాధలేకయే. 344
క. తనయుం గైకొని పోయెడు, ఘనమతి కాతని కనంతు కమ్రఫణము లా
ర్తిని బాప ఛత్త్రమట్లుగఁ, దనరారెఁ బరేశునాజ్ఞఁ దత్సమయమునన్. 345
ఉ. ఇంతటి లోఁతటంచు వచియింప నశక్యముగాఁ జెలంగుచున్
వంతలఁగూర్చు సుళ్లగమి వందలుగాఁ గనుపట్టుచుండ నా
వంతయు దాఁట శక్యమగు నట్టితెఱంగు కనంబడంగనీ
కెంతయు భీతినించుచు నహీనగతిం బ్రవహించు సూర్యజన్. 346
చ. కనుఁగొని వాసుదేవుని యఖండమహత్త్వము నమ్మి సుంత భీ
తిని మదినిల్ప కాయమున తీవ్రజవంబునఁ బాఱుచుండఁగాఁ
దనదగు జానుమాత్రమను ధైర్యముగల్గుట దాఁటె దాని నం
త నతఁడు కంసభూపతికిఁ దారొసఁగందగు రొక్క మీయఁగన్. 347
తే. యాదవులు నందముఖ్యు లాయమునయవలి
తటమునన్ నిల్చి యుండ ముదంబునఁ గని
వారితోఁ బల్కకే పోయె వారు నతనిఁ
గనుఁగొనం జాల రా కృష్ణుకరుణ మహిమ. 348
ఉ. అత్తఱి గోకులంబున మహాసతి యన్ ప్రథితప్రభావయై
యుత్తమసంపదల్ మెఱయ నొప్పు యశోదయ యోగనిద్ర తన్

మత్తు గనంగఁజేయ నొకమాడ్కిఁ బరుండి కుమారికన్ మహో
దాత్తచరిత్రఁ గాంచె నది తానెయెఱుంగదు తోడి గోపికల్. 349

క. తనయ జనించుట యెఱుఁగక, వనితామణి చుట్టునుండి వారని నిద్రం
గనియుండి రాముహూర్తంబున నానకదుందుభియును బొడిగిటఁ దగుచున్.

తే. ముద్దులను మూటఁగట్టుచు ముగ్ధశిశువుఁ
బోలికన్పడు తనప్రియపుత్త్రు నామె
ప్రక్కలో నిడి యందున్న రాజవదన
యగు కుమారికఁ గైకొని యపుడె తరలె. 351

ఉ. ఆనకదుందుభిస్ఫుటత రామలశక్తి కుమారికై వసం
బైనపదార్థమట్లుగ క్షణార్థమునన్ గొనిపోవ సుంతయున్
గానక స్వీయశయ్యపయిఁ గమ్రతరోత్పలపర్ణవర్ణుఁడై
సూనుఁడు చూడనొటకు యశోద మహాముద మందె నయ్యెడన్. 352

క. సుతజన్మ మాతలోదరి, కతిసంతోషంబు గూర్చు టది యబ్రంబే
యతివలగమి తమపుత్త్రుల, గతి నాసుతు నెంచి రెదలఁ గాంక్షలు పొంగన్.

క. ఆనకదుందుభి యంతట,మానిని గొని వేగ స్వీయ మందిరమును శ్రీ
జానికృపాలేశంబునఁ, గానం జని దారశయ్యఁ గడుఁ దమి నిడియెన్. 354

క, మునుపటివలెఁ దా నుండెను; దనయయు బిట్టేడ్చె నంత ధ్వని నద్దానిన్
విని గేహరక్షకులు మేల్కని సంరంభంబుమీఱఁగాఁ దద్వార్తన్. 355

చ. త్వరఁజని దేవకీసుదతి బాలుని గాంచె నటంచు విన్నవిం
చిరి; ప్రసవించె నన్నుడి చెచ్చెరఁ గర్ణములం బడంగ భూ
వరుఁడు కృపాణహస్తుఁడయి పర్విడి సోదరిసూతికాగృహం
బురుగతిఁ జొచ్చి కాంచె నట నొప్పెసలారు సమాకృతిన్ గృతిన్. 356

చ. కనుఁగొని క్రోధమెంతొ తనుఁ గాఱియ పెట్టఁగ నాఁడుఁబాప యం
చనక తటాలునం గొనఁగ నంతికసీమకు నేగ నన్నరో
వనిత యిదేఁగదా బయలు వాక్కులు తప్పెను బుత్త్రుఁడైనఁ జం
పను దగియుండుఁ గామినిని బాపము చంపుట కాన మానుమా. 357

చ. కొడుకులనెల్ల నిచ్చితిని గొంకక చంపితి వీభవంబునన్
బుడుత జనించెఁ;బుత్త్రుకుఁడె పో పగ నీకగునంచు నభ్రవా
క్కడరెఁగదా మహాత్మ విను మష్టమగర్భము పుత్త్రుఁడై నినుం
బొడవడఁగించు నన్నుడి బొంకుగదా పలుమాట లేటికిన్. 358

ఉ. సందియమూని నాసుతులఁ జంపితి వియ్యది పాపమంచు నీ
డెందమునం దొకప్పుడు కడిందివిచారము నొంద వక్కటా!

యిందొనరించుపాతకములే పరమందు ఫలించునన్న వా
క్యం బగ నెంచకుండు టది ఘోరమదీయమహాఘయుక్తియే. 359

చ. అని యిటు గద్గదస్వరమహార్తర శోకపరీత వాక్కులన్
దనుఁగని పల్కు దేవకిని దత్క్షణమే యటుపోవఁ ద్రోసి యా
వనితఁ దటాలునం గొనుచు వధ్యశిలోపరిభాగమందుఁ జ
య్యనఁ బడనట్టె వైచె నది యద్భుతశక్తి కనంబడం ద్వరన్. 360

చ. ఉపలతలంబునం బడక యున్నతరూపముఁ దాల్చి యాయుధౌ
ఘపరివృతాయతప్రకట కమ్రకరాష్టక మొప్ప నభ్రభా
గపదమునందు నిల్చి క్రుధఁ గన్నుల నిప్పులు రాలుచుండ నొ
క్కపగిది నవ్వి యిట్లనియెఁ గంసునితోఁ గఠినస్వరంబునన్. 361

మ. ధరణీపాలక కంస నన్నెగుర నుద్దామప్రతాపంబు ని
ష్ఠురకోపంబు గనంబడన్ విసరి తీక్షోభంబు నన్నంట దీ
తరుణంబందుననే జనించిన మహాదర్పుండు దేవోత్తమో
త్కరసంపూజితుఁ డొక్కబాలకుఁడు నిన్ ఖండించు సత్యంబుగన్. 362

తే. నీప్రతాపంబు నాయెడ నిష్ఫలంబు
నాదువంకనె జనియించి నీదునామ,
మడఁచు బాలకుఁ డీచెంత నలరువాఁడు
తెలియు మీవార్త నీదుమదిం దిరముగ. 363

క. దీనికిఁ దగినప్రతిక్రియ, మానసమున నీహితముగు మాడ్కి నెఱిఁగికొ
మ్మానరపాలా యనుచున్, మానిని దివ్యాంగరాగ మహితాంగమునన్. 364

క. కనుపట్టుచు భూషణములఁ, దనులత చెలువార గంధదామమ్ముల వా
సనలెల్ల దెసల నిండఁగ, మనుజేంద్రుఁడు గనుచునుండ మంగళనుతులన్. 365

ఆ. పొగడఁబడుచుఁ గంసభూపతి యచ్చెరు
వందుచుండ శ్రీశు నాజ్ఞ మౌళిఁ,
దాల్చి యరిగె నెటకొ తనరూపమే దివిఁ
భువిని బూజ్య మగుచుఁ బొల్పుమీఱ. 366

## డెబ్బదినాల్గవ యధ్యాయము.

### కంసుఁడుబాలవధమునకై ప్రలంబాదుల నియమించుట.

చ. మనమునఁ గొంకొకింతయును మాని తలోదరి యిట్లుపల్కి వే
చనఁగ నృశంసుఁ డానృపుఁడు చయ్యనఁ గేశిఁ బ్రలంబు నింకనుం
దనమది కెక్కు దానవుల దారుణకర్ములఁ బిల్వఁబంచి యి
ట్లనియెఁ గలంకనొంది మది యాత్రపడన్ బలుకుల్ తడంబడన్. 367

సీ. ఓప్రలంబాసురా! యోకేశిదైత్యేంద్ర ధేనుకనామక దానవేజ్య
పూతనా మఱి యిటఁ బోలుచునరిష్టనేమిప్రభృత్యసురేశ మిత్రులార
యాలకింపుఁడు మీర లస్మదీయహితంబె కాంక్షించు వారలు గాన దివిజు
లస్మదవ్యథార్థమై యత్న మొనర్చిరి దుష్టచిత్తులు మఱి ధూర్తులౌట
తే. మత్ప్రతాపాగ్నిఁ గ్రాఁగి దుర్మాను లగుచు
వీరలం బోలి తిరుగు నీవిబుధపతుల,
గణనచేయను నామదిఁ గాని కన్య
పలికినట్టి నుడుల్ వినఁబడుట యరిది. 368

చ. సురలు ననున్ వధింప బలుసూరులఁబోలి ప్రయత్నముల్ పరం
పరలుగఁజేయుచుంట విని పల్మఱునవ్వుచునుందు నేను ని
త్తరుణమునందు వారిదగు దారుణయత్న మడంపఁ బూనుచే
సరియని తోఁచెడున్ గనుకఁ జక్కనిపూనికఁ బూను టొప్పగున్. 369

తే. భూతభవ్యభవత్ప్రభు వీతఁడె ననుఁ,జంపఁగాఁ బుట్టె నని బాల స్పష్టవాక్కు
లలరఁ బల్కెను దద్బాల యస్మదనుజ,యైన దేవకి కాత్మజయగాను జొండి. 370

చ. కనుక ధరిత్రియందు నెమకం దగు బాలుర నెల్ల వేనియం
దనుపమదోర్బలంబు తగు నాశిశువున్ వడిఁ జంప నోఁగదా,
పనియిది చక్కఁగా నడుప బాహుబలాఢ్యులఁ గూర్పనోను స
త్తనయుఁ డెవండు బాహుబలదర్పమునం దగుఁ జిత్రరీతిఁగన్. 371

క. వానిం జంపఁగ వలయున్, గానన్ మీరెల్ల రిట్లుగావింపుఁడు నా
యానతి యందాదృతిఁ దగు, దానవులుగదా యటంచు దారుణభంగిన్. 372

ఉ. ఆనతి యిచ్చి కంసుఁ డపుడంతిపురంబును జొచ్చి యాత్మలో
మానుగ మీఁదికార్యము లమానుషశక్తిగలట్టివాఁడు దా,
వానిఁ దొలంగఁ ద్రోయఁ దగు పద్ధతిఁ జక్కఁగ నెన్ని యప్పుడే
మానిని దేవకిన్ సుగుణమండనుఁడౌ వసుదేవునిన్ దమిన్. 373

చ. పిలువఁగఁబంచి యిట్లనియెఁ బ్రీతులు గందు దురాశచేత మి
మ్ములఁ గడుఁ గష్టముల్ గుడువ భూరివిచారమునొందఁ జేసి పు
త్త్రుల వధియించినాఁడఁ గ్రుధతో మది కూడుట నింతపుట్టె ని
ష్ఫలములు నాప్రయత్నములు చాలు నిఁకేటికి వాని: బల్కఁగన్. 374

చ. నను వధియింపఁగాశిశు వనంతవిభూతిఁ జెలంగ నేస్థలం
బుననో జనించె నంట వగపుం గనుమాటల నేమిలాభమౌ,
వినుఁ డొకమాట దైవగతి వేయివిధంబులఁ బెద్దయౌ భవ
త్తనయులఁ గాలరూపుఁ డగుదైవమె చంపె నొకండు శక్తుఁడే. 375

తే. ఆయురంతంబునన్ మృతి నందుఁ బ్రాణి
కారణం బందులకు విధి గాని యొరుఁడు,
కాఁడు మీకును దెలియదే కడు సుమతులు
కద విశేషించి పలుకంగఁ గలదె నీతి. 376

క. అని పెక్కుభంగులం బ్రీతిని వారల నూఱడించి తృప్తులఁ దగు న
ట్లొనరించి బంధమోచన,మున సత్కారములఁ దన్పి పోవిడిచెఁ దగన్. 377

తే. మంచిమాటల వారలఁ బంచి వారి
వలనఁ గలుగంగఁదగు భూరిభయ మిఁకేమి,
యును బొసంగమి నూహించి చనియెఁ దాను
నంతిపురమున కెద యురియాడుచుండ. 378

డెబ్బదియైదవయధ్యాయము.

మధురనుండి నందాదులు వసుదేవు ననుమతిని గోకులమున కేగుట.

శా. కారాగారవిముక్తి నొంది తనదౌకల్యాణముల్ పుత్త్రజ
న్మారంభంబుననుండి సాగునవి యంచాత్మన్ బ్రమోదంబు లే
పారన్ నమ్మి జవంబునం గదలి నందాదుల్ కరం బిచ్చి భూ
పారాధ్యుం గనవచ్చు టెంచి కనునూహం బోయె నవ్వారలన్. 379

తే. వారియావాసమున కేగి వరసుతాప్తి
వినినయానందమున నొప్పు విమలమతిని
నందునిన్ బంధుజనుల సంతసము పొంగఁ
గనియెఁ; నందునిఁ గాంచి యిట్లనియె నపుడు. 380

క. కనుఁగొన నదృష్టవంతుఁడ,వన నీవే వార్ధకమున నాత్మజలాభం
బును బొందినాఁడ విద్ధా,నినిబోలు నదృష్టమును వినితిమే యెందున్. 381

క. నరపతి కీయం దగువ,త్సరకర మిచ్చితివి చేయఁదగుకృత్యంబుల్
వరుసం జేసితి విఁక నీ,వరుగుము నిల్వఁదగ దిందు నరక్షణమైనన్. 382

క. పనిదేనిఁ దీర్ప వచ్చితి,వనఘా! యాకార్య మెల్ల నను వొందఁగఁ జె
ల్లెను గాన నింకగోకుల,మున కేగుము తడయవలదు పురమున నిందున్. 383

క. నీపురి నాసతి రోహిణి,పాపని గనె వాని నీదు పట్టిం బోలెన్
గోపవరా! కనుచుండుము,వేపలుకు లిఁకేల సర్వవిధముల సుతులన్. 384

ఆ. ఇక్కరీతిఁ గాచుచుండుము నా వి ని, నంద ముఖులు శకటబృందములను
దెచ్చి యన్నిటము లిచ్చినవారాట, వేగ గోకులపురికి నేగి రొకట. 385

—౧ కంసునిపంపుగొని పూతన సంచరించుట. ౧—

చ. పురమున కేగి యాత్మజుని భూరితరంబగు తేజమొప్ప శ్రీ
వరుఁడన నున్నవానిఁ గని వంతలనెల్లఁ దొలంగి నందుఁ డెం
తొ రమణ నుండెఁ;గ్రూరుఁడయి యుద్ధతుఁడై తగు కంసుపంపునం
దరుణి యొకర్తు పూతన యనందగు దానవి సంచరించుచున్. 386

సీ. యాదవులు వసించునట్టి పల్లెల నెల్లఁ గలయంగఁ దిరుగుచుఁ గమ్రరూప
ముల నొప్పుచున్న పాపలఁ గాంచి ముద్దాడి పాలిచ్చుచుండె, నాపాలుత్రాగి
నంతనే వార లయ్యంతకపురి కేగుచుండిరి;పూతన యొకట వ్రజము
చొచ్చి యందలరు యశోదను గని యామె కూరుచుండు మనంగఁ గోర్కితనర

ఆ. బాలుఁగాంచి ప్రీతి వర్ధిల్ల ముద్దాడి,పాలుత్రాగు మన్న పద్మనేత్ర
యనుచు బుజ్జగించు చాపాపనికి రేయి,తనదుపాల నీయఁదలఁచె నంత. 387

ఉ. ఉయ్యెలనున్న బాలకుని నొయ్యన నెత్తి మనోజ్ఞరూప రా
వయ్య; పయస్సు గ్రోలుము మహాముదమందెద నంచుఁ బల్కుచుం
బయ్యెదఁ జక్కనొత్తుచును బాలుని ఱొమ్మునఁ జేర్చె నాతఁడున్
నెయ్యముతోఁప నొక్కకరనీరరుహంబున ఱొమ్ము నంటుచున్. 388

సీ. సవ్యస్తనంబును జక్కఁగాఁ గుడుచుచుఁ దత్కృత్యముల మదిఁ దలఁచి క్రోధ
సంయుతహృదయుఁడై సంరంభ మేపాఱఁ బ్రాణానిలంబులఁ బాలఁ గ్రోలు
నురవడిఁ బీల్చె; నాయుద్ధతి కోర్వక దానవి ఘోరనాదంబు నిగుడఁ
జేయుచుఁ దనవగుస్నాయుబంధనములు విచ్ఛిన్నములు కాఁగ వెతలఁ గనుచు

తే. భీమరూపము గన్పడఁ బృథ్విఁ బడియెఁ; దాని భీమరవం బొగి వీనులఁ బడ
విహ్వలత నొందు మనముల వేగ వచ్చి, యాదవులు పూతనం గని రర్భకునిని.

చ. ధరఁబడియున్న పూతనను దాఁ గనుచుం దదుదగ్రకృత్యముం
ద్వరఁగ నశింపఁజేయఁ దగువైఖరిఁ బూనియు నుంతయేని తా
నరయనియట్టు లున్నయలయర్భకునిన్ భయకంపితాంగియై
సరభస మొప్ప నెత్తుకొని సాధ్వి యశోదయు దీనవాక్కులన్. 390

ఆ. వత్స! నిన్ను దుష్టవనిత పాలిచ్చునె
పమునఁ గీడుచేయఁ బాలుపడియుఁ
దానె మరణ మొందె దైవంబె యీగండ
మును దొలంగఁ ద్రోచె ననుచు వేగ. 391

సీ. గోపుచ్ఛమును ద్రిప్పి యాపగిదిన్ శిశుదోషముల్ వేవేగ తొలఁగఁజేయు
నట్టి కృత్యంబుల నప్పుడే యొనరించి బాలదోషములఁ బోఁదోలె; నందుఁ
డంత గోమయము నాయర్భకు నొదల నునిచి రక్షణముఁ దా నొనరఁజేయు

చును బల్కె నీరీతి నిను వత్స శ్రీహరి దోషజాలంబులఁ దొలఁగఁజేయు
తే. చును దమిం గాచుఁగావుత మనుపముఁడయి
తనరు నాహరి నాభిపద్మమ్మునుండి
జగము లావిర్భవించె నాచక్రి యొకట
స్వీయదంష్ట్రాగ్రమున నెత్తె క్షితిని బూన్కి. 392

క. వారాహతనువుఁ దాలిచె, శ్రీరమణుం డట్టితఱిని శ్రీపతి; యతఁడే
గారవమున నినుఁ గాచుత, భూరిపరాక్రమము మీఱఁ బూజ్యుఁ డతండే. 393

క. నరసింహరూప మొయ్యన, ధరియించి నఖాగ్రవితతి దానవవీరున్
జొరిపుచ్చె నట్టి శ్రీహరి, పరికించి త్వదీయదోషపటలి నడఁచుతన్. 394

సీ. జఠరంబు గుహ్యంబుఁ జక్కఁ గాపాడుత శ్రీమహావిష్ణువు సిద్ధిదాత
జంఘలు పాదముల్ శత్రుజనార్దనుం డోముత నిన్ను శ్రీవామనుండు
సతతంబు గాచుత క్షణమున నేమూర్తి జగములఁ గొలువంగ శక్తుఁడయ్యెఁ;
బాదత్రయంబున బ్రహ్మాండమంతయుఁ గొల్చి యాయుధసమగ్రుఁడుగఁ దనరు
తే. నట్టి గోవిందుఁ డనుకంప యలర నీదు
మస్తకంబును గాచుత నిస్తులవిభ
వమునఁ దగు కేశవుండు కంఠమును గాచుఁ
గాక యని పల్కె మఱియు నిక్కమగు ప్రీతి. 395

వ. ముఖ బాహు ప్రబాహు మన స్సర్వేంద్రియంబుల నవ్యాహతైశ్వర్యుండగు నారాయణుండు కాపాడుఁగాక. మఱియు దిక్కులందు గోవిందుఁడు, విదిక్కులయందు మధుసూదనుండు, నభంబున హృషీకేశుండును, ధరణియందు మహీధరుండును, నిలిచి యాపద లొందకుండఁ గాపాడుఁగాక యని యాశీర్వదించి విధివిహితస్వస్త్యయనకృత్యంబు నిర్వర్తించి నందుఁడునందనునిశకటాధః ప్రదేశంబునఁ బరుండఁ బెట్టించె. శకటాధఃప్రదేశము గోకులంబున బాలపర్యంకికాతలం బని ప్రఖ్యాతంబు. 396

ఉ పూతన మేనివిస్తృతియు భూతభయంకరరీతి నొప్పుచుం
జేతము లెల్లఁ దల్లడిలఁ జేయఁగఁ గాంచుచు నట్టిగోపక
వ్రాతము విస్మయంబు గని బాపురె యిట్టివిధంబు గంటిమే
యేతఱినైన నంచు విధి యీగతి దీని హరించె నం చొగిన్. 397

చ. పలుకుచుఁ బోయి రంతఁ దనబాలుని సోఁకిన కీడు వాపఁగా
బలువిధులం బొనర్చె; నిటు పాఁడు చెన్నువహించి యుండ గో
కులము చెలంగె నందుఁడును గోర్కెలు పండఁ దనూజలాలనం
బులను దివానిశల్ చెలఁగి పుచ్చుచు నెమ్మది నుండె నంతటన్. 398

శకటాసుర భంజనము.

మ. ఒకసా డర్భకుఁ డంబచన్గుడిచి యత్యుత్సాహ మేపార నం
బ కడున్ ముద్దులఁ గాంచుచుండి యెటొ పోవన్ ఖట్వికుం దొప్పుచున్
వికలస్వాంతముతోడ నేడ్పుగతిఁ జాఁపెం బైకిఁ బాదద్వయిన్
సకలజ్ఞుం డగుటన్ స్తనార్థియను నాచందంబు గానంబడన్. 399

క. బాలురు ప్రాయికముగ నిలఁ, బాలకు నేడ్పుటయుఁ బైకిఁ బాదద్వయమున్
బోలఁగఁ జాఁపుటయుఁ దగున్, శ్రీలలితుఁడు కృష్ణుఁ డట్టిరీతి గనఁబడన్. 400

మ. తనపాదంబులఁ బైకి నెత్తి క్షుధచేతన్ బిట్టు వాపోవు బా
లుని చందంబున నేడ్చుచున్ గుటిలశీలుం దన్నెఁ బాదంబులన్
దనుజుం డొక్కఁడు బండిచందమున నుద్దామప్రతాపంబునన్
దనుఁ గొంపోవఁగ రా నెఱింగి వడిఁ బాదద్వంద్వఘాతంబునన్. 401

క. మృతిఁ గూర్చె శకట మయ్యది, దితిజాంతకు పాదయుగహతిం బఱియలునై
త్రుటిఁబడెఁ బరివర్తితమై, యతిఘోరాకృతిని దాల్చి యర్భకు మ్రోలన్. 402

సీ. అందుండి భాండకుంభాదులు విపరీతముఖములై పడియె నాభూతభయద
కృత్యంబుఁ గని భీతి నెల్లగోపకులును గోపికల్ చనుదెంచి క్రూరదనుజుఁ
గని బాలుఁ డుత్తానకముగఁ బరుండుటఁ దిలకించి శకటంబు నిలఁబడంగఁ
జేసిన దెవ్వ రీచిత్రకృత్యము దెలియంగఁ గోరెద మని యడుగ నందుఁ

తే. దిరుగుచున్నట్టి బాలకుల్ తెలియఁబలికి
రీకుమారుఁడె పడఁద్రోసె నీశకటము,
శిశు వితం డేడ్చుచుండె నీ చెంతనుండి
కంటి మీతనిపదహతికమున బండి. 403

క. తిరుగుచు నభ్రమునుండిరొ, ధరఁబడియెను వేఱొకండు తగనీపని ని
త్తరుణమున జేయలేఁ డిటఁ, బరికించితి మిచట శకట పరివర్తనమున్. 404

చ అనవిని గోపకుల్ మిగుల నచ్చెరువొందుచు బాలు నిట్టివా
నిని గనుఁగొంటిమే యనుచు నేర్పఱి పో యితఁడంచుఁ బల్కుచున్
గనుఁగొనుచుండి రిట్లు తమకంబున; నందుఁడు విస్మయంబునం
దనయుని నెత్తి మూర్ధను నితాంతము మూర్కొనె నయ్యశోదయున్. 405

తే. వికకలభాండ కపాలకశకట మచటఁ, బడి కనంబడ దీని దౌబాధ యింక
సంటకుండెడుఁగా కంచు సమలదధిఫ, లాక్షతాదులఁ బూజించె నాదరమున.

---

*విధ్వస్తభాండకుంభంత ద్విపరీతంపపాకవై = అనిమూలము.

## డెబ్బదియాఱవ యధ్యాయము.

### గర్గమహర్షి శ్రీకృష్ణబలరాములకు నామకరణము చేయుట.

చ. దనుజుఁడు క్రూరకృత్యమునఁ దన్గొనిపోవఁగ రాఁదలంచి పా
దనిహతిఁ జంపి శ్రీహరియుఁ దద్దయు శైశవ మూని యుండె; ని
ప్పునివిని దేవకీపతియు భవ్యమతిం దలపోసి గర్గునిం
బనిచెఁ బురోహితున్ దనదుపట్టికిఁ బేరును బెట్ట నంతటన్. 407

చ. పరమతపోధనుండు మునివారమునం దొలి లెక్కపెట్టఁగాఁ
బరఁగుయశంబు గన్న మునివర్యుఁడు గర్గుఁడు గోకులంబు సుం
దరహరిపాదపద్మముల ధన్య మనంజనుదానిఁ జేరఁగా
నరిగి రహస్యభంగిని మహావిభవంబున నున్ననందునిన్. 408

క. కనుఁగొని యానకదుందుభి, పనుపునఁ దనరాక యనెడు పలుకు తెలుప కా
తనిపంపున నే గోపకు, లను బిల్వక నామకరణలలితవిధిఁ దమిన్. 409

క. ఒనరించె నందుఁ దొలికొడు, కనఁదగు వానికిని రాముఁ డంచు సహజుఁ డం
చును బిల్వఁబడెడు హరికిన్, ఘనమతిఁ గృష్ణుఁడని నామకరణము చేసెన్. 410

క. మతిమంతులలో నుత్తముఁ, డతులప్రజ్ఞానిధాన మమ్ముని వ్రజభూ
పతికిఁ దనూజుల మహిమోన్నతిఁ దెల్పి హరిన్ సమస్తనాథుఁ దలఁచుచున్.

క. చనియెఁ దనంతన యాశ్రమ, మున కవ్వలఁ గొలఁదికాలమున బలరాముం
డును శ్రీకృష్ణుఁడు దోఁగా, డను నేర్చిరి లోకమును విడంబించుతమిన్. 412

సీ. అంతఁ గరీషభస్మాంబరధారులై యిటునటు తిరుగుచు నింపుమీఱు
గతులఁ గ్రీడింప శ్రీకలితుల బాలుర నాయశోదయు వల దనకయుండె
నల్లె రోహిణియు మహాదృతిఁ గనుచుండె; గోవాటమునఁదుమఁ గొమరులొకట
వత్సవాటమునందు వరుస నాడుకొనుచు నుండియాదినమున నుద్భవించి
తే. నట్టిగోవత్సములతోఁక లమరఁ బట్టి
యీడ్చుచుండిరి; మఱియు నాయిర్వు రొక్క
స్థలమునం దాడుకొనఁ జూచి సాధ్వి నంద
పత్ని వారింపకుండె నెప్పగిదినైన. 413

చ. వరుసఁ గుమారకుల్ పెరిగి వైభవ మొప్పఁగ రత్నభూషణో
త్కరముల ముద్దుగూర్చుచు నికామమనోజ్ఞగతుల్ చెలంగ సుం
దరమృదువాక్కు లొప్పఁగ ననారతమున్ విహరించుచుండి; రి
క్కరణిని బ్రొద్దుపుచ్చుటకుఁ గాంతలు పొంగుచు నుండి రెంతయున్. 414

ఆ. తల్లిమాట వినక తా నొగిఁ గృష్ణుండు
తిరుగుచుండ నొక్కదినమునందు

నడుము త్రాటఁగట్టి నాతిమిన్నయు దానిఁ
గట్టె ఱోటికట్టె పట్టుదలను. 415

చ. ఒరులకుఁ గష్టమే కలుగకుండఁ జరించెడు కృష్ణమూర్తి న
త్తరుణి యులూఖలంబునకు దామముచే నటుకట్టి యోర్వ లే
కురురవ మొప్పఁ బల్కెఁ జన నోపుదువేఁ జలచేష్టితా! యిఁకం
ద్వరఁ జను మంచుఁ బోయెఁ బని వైఖరి తన్నొగిఁ దొందరింపఁగన్. 416

క. పనిపైఁ గలతత్తఱమున, జనని గృహాభ్యంతరంబుఁ జక్కఁగఁ జేరం
గని శ్రీకృష్ణుఁ డులూఖల, ము నీడ్చుకొని పోయె వృక్షములుగల యెడకున్.

చ. ధరణిఁగలట్టి చిత్రములఁ దానెయెఱుంగుట నర్జునాఖ్యచేఁ
బరఁగు మహీజయుగ్మ మొక భంగిని స్వర్గమనంబుఁ గోరుటన్
ద్వరపడి శాపముక్తి కది తథ్యముగాఁ దగు కాలమౌటచే
నరిగె సరోరుహాక్షుఁ డొకయర్భకుపోలిక మెల్లమెల్లగన్. 418

చ. తరువులు జంటగా నలరుతావునకుం జని వానిదైన యం
తరమును జొచ్చి ఱోలు నొగి ధాత్రిరుహంబులఁదాఁకి యీడ్వ నె
వ్వరుసను మధ్యభాగమునఁ బొఱఁగ రానివిధంబుగాఁ దగన్
నిరుపమశక్తి నీడ్చె వడి నీరజనేత్రుఁడు చిత్రరీతిఁగన్. 419

క. ఱోలడ్డంబుగ నుండుట, బాలుం డవ్వాని మధ్యభాగంబునఁ దా
లీలంజని యీడ్చుట వడిఁ, గూలెన్ వృక్షములు రెండు కుంభిని గదలన్. 420

మ. హరిపాదద్వయి సోఁక వృక్షములు శాపాంతంబు చేరన్ వసుం
ధరపైఁ గూలఁ దదీయనిస్వనము దుర్దాంతంబుగాఁ బర్విభీ
కరమై గోకుల మార్తినొందుగతిగాఁగన్ గోపకుల్ నివ్వెఱం
బరుగుల్ వాఱి తరుద్వయంబు పడనా బాలుండు దోఁగాడుచున్. 421

ఆ. వానియంతరమునఁ దా నేమియెఱుఁగని, యట్టు లుండఁ గాంచి యమ్మహీజ
శాఖ లెల్ల విఱిగి స్కంధముల్ చూర్ణంబు, లయి కనంబడంగ నచ్చెరుపడి. 422

క. అలఁతిరదంబులతో నొ, ప్పులకుప్పఁగ నలరుచున్న మోమునఁ జిఱున
వ్వొలయఁగ బాలక్రీడలఁ, జెలఁగెడు శ్రీకృష్ణుఁ జూచి చేట్పాటుతగన్. 423

సీ. చెట్లసందున రశ్మిచే బద్ధమధ్యుఁడై తనరుట నప్పుడాతనిని వార
లరసి దామోదరుఁ డంచుఁ బల్కిరి నందగోపపురస్కృతుల్ గోపవృద్ధు
లాయుపద్రవ మెంచియట్టియుత్పాతముల్ గలుగఁగారణ మేమి? కాలమిద్ది
దుర్భరంబుగ నిందుఁ దోఁచెడుఁ బైపైన నాపదల్ పొసఁగెడు నట్టులౌట

ఆ. నిచటువాసి పోద మెచ్చటికైన గో, వ్రజము హాయి నొందు భంగినున్న
వనికి నంచుఁ దలఁచి వరుసనీయెడ మహో, త్పాతము లొగిఁ గానఁబడియెడుఁగద.

మ. తొలుతం బూతన యాపయిన్ శకటయుక్తుం డైనక్రవ్యాద్యుఁ డి

ష్టులఁ గానంబడి మ్రంది రిత్తతఱిని నీభూజాతముల్ ధూర్తవా
తలవస్పర్శము గానకే పడియెఁ జందం బిద్ది యూహింప గో
కులము౯ వీడి మతేవనంబునకొ యేగుం డంచు నీచిహ్నముల్. 425

క. మనకుం దెల్పెడి బృందా,వనమునకుం బోవు టొప్పు వారక యిందుం
డిన నెన్ని యిట్టిదోషము,లను గందుమొ చన సుఫలములను గన నగుఁగా.

క. గోకులమున భూమిజము ల,నేకోత్పాతములు పుట్టి యిటువలె బాధల్
చేకూర్పకుండఁగా మన, మేకడకేఁ బోవు టొప్పు హితమతులారా. 427

చ. అని వచియింప నందఱును నందుల కెంతయు సమ్మతించి చెం
తను దనరారి బృంద యన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కియున్న యా
వనమున కేగ నెంచి రటు వారు తలంపఁగ రాజు నాజ్ఞ యొ
య్యెను స్వకుటుంబయుక్తముగ నేగఁదగుం దవ్వర నంచు నత్తఱి౯. 428

బృందావనగమనము.

సీ. గోవ్రజంబులఁ దోలుకొని శకటంబులఁ బరికరంబులఁ గొని బాలుర సతు
లెల్ల గుంపులుగాఁగ నేడ్తెఱఁ జనుచుండ గోపకుల్ పోయిరి గుంపులు గొని
సర్వవస్తువులును శకటగణానీతములయి పోయెను క్షణంబున వ్రజంబు
కాకకాకీవ్రజకలితమై సుంతయు నొప్పకయుండె; నట్లురుతరగతి

తే. నెల్లరును బోయి బృందాఖ్య నెసఁగు వనము,చేరి; రక్లిష్టకర్ముఁడౌ శ్రీహరి తన
మనసునం దీవనంబు గోమండలమున, కెప్డు సుఖదంబుగా దుష్టహీన మగుచు.

క. గతరోగావళియై యుం,డుత మంచుఁ దలంచె వనము నూత్నోత్సాహం
బతిశయముగఁ దోఁపఁగ సం,స్తుతిపాత్రం బగుచు నపుడు చూడంబడియెన్.

క. ఖరకరుని తాపమున భీ,కరమయ్యెను శ్రీశు నిచ్ఛ గలుగుటచే నా
తరుణమున వృష్టికాలము, కరణిం జెలువారె నూత్నఘనోత్కరమై. 431

తే. పల్వలంబులు సలిలసంపన్నములుగ, నపుడు చూపట్టె గోపకు లందు విడిసి
శీతలద్రుమసంయుతిచేత నెలమిఁ, గాంచి గావులమందలు గాసి వదలె. 432

వ. శకటీవాటపర్యంతంబు చంద్రార్ధాకృతి నొప్పియుండ నందెల్లరు మనోరోగం
బులఁ బాసి సుఖం బుండిరి. రామదామోదరుల గోపబాలకులు కూడి యుండి
రంత. 433

చ. వనములఁ దోఁచుపుష్పసమవాయవతంసకులై మయూరబ
ర్హనియతమస్తభూషులయి యర్భకసంయుతి రామకృష్ణు లో
య్యన వ్రజమందు నాడుకొన హారితరంబుగఁ గాంచి నందుఁ డా
తనిసతి సంతసించిరి; నితాంతమహోత్సవ మొప్ప నర్భకుల్. 434

సీ. తమతోడిబాలకుల్ తరుపత్రకృతవాద్యముల నొప్ప వేణుహస్తులయి కాక
పక్షముల్ సొంపుగా భాసిల్ల శంకరుతనయులం బోలి చెంతఁ దగు వనుల

నాడుకొనుచు వరహాసముల్ చేయుచు బహువిధక్రీడల బాలురకును
నేర్పుచు విహరించి రొర్పుమై నొకచోట నొండొరుల్ నవ్వుచు నొక్కయపుడు
తే. నితరులంగూడి యాడుచు నెలమి గోగ
ణముల నడవికి మేపంగ మమత నరుగు
చును గుమారులఁగూడి యచ్చోటనైనఁ
దిరుగుచును గాలమును గొంత జరపి రపుడు. 435
క. కాలము సుఖతమమై యది, యోలిఁ గడువంగ గోకులోర్వీపతి స
ద్బాలకులు సప్తవర్షము, లీలలం గడపి రేమియెఱుఁగని యట్టుల్. 436
తే. జగములకు నెల్లఁ బాలకులుగఁ జెలంగి,యును వ్రజంబున వత్సపాలనమునందె
శక్తితగ నొప్పి ధేనువ్రజంబుఁ గాచు, చుండి రాత్మీయశక్తియు నొప్పకుండ.
చ. ఘనములు మింటఁ బర్వి కడుఁ గ్రమ్మి నిరంతరరీతి నొప్ప భీ
తిని బ్రమదంబునుం గనెడుతీరు గనంబడుచుండఁ గర్షకుల్
మనముల సంతసంబుఁ గనుమాడ్కిని వచ్చెను వృష్టికాల మిం
తని తెలియంగరాని మహిమాతిశయంబునఁ జూడనై తగన్. 438
తే. ఏకధారల దిక్కుల కెల్ల నైక్య
మును బొసంగఁగఁ జేయురీతిని జెలంగె;
ధాత్రి యెల్లఁ బ్రరూఢనూతనసుమాఢ్య
యగుచు శక్రగోపము లొప్పనల రె నపుడు. 439
చ. మరకతపద్మరాగమణిమండితభూషణరాజిఁ బొల్చు న
క్కరణి వెలింగె భూసుదతి; గాఢరయంబున జీవనౌఘముల్
దరుల నడంచుచుం గొని నితాంతముదంబునఁ బొంగుచున్ సరి
ద్వరుఁ గనఁబోవుచుండె వృషభంబు మదించి చెలంగునట్లుగన్. 440
చ. ధనులు చనంగ నత్తఱిని దోఁచెఁ గుబుద్ధులు లక్ష్మి పెంపునన్
మనసులు గర్వయోగమున మార్పు గనం బొలుపారుమాడ్కి నుం
డునటు లకాలమందును గడుంగడు మోదమునం గుమారు లొ
య్యన సరియాడుబాలకుల నందఱఁ గూడి మహాబలాఢ్యులై. 441
క. సురలవిధంబునఁ గ్రీడించిరి సుందరమందిరములఁ జిత్రమహీజో
త్కరనిబిడ కాననంబులఁ, బరమాత్ములె యయ్యు గోపబాలకు లనఁగన్. 442

డెబ్బదియేడవయధ్యాయము.

కాళీయమర్దనము.

చ. ఒకపరి కృష్ణుఁ డగ్రజుని నొయ్యన వీడియె గోపబాలక
ప్రకరము వెంటరాఁ జనె నరణ్యముఖంబున కెల్ల ధేనువుల్

ప్రకటనినాద మామురళి పర్వఁగఁ జేయఁగ నాలకించుచున్
సకలమహీరుహాళిఁ దగుఛాయలఁ బచ్చికఁ బ్రీతి మేయుచున్. 443
క. చరియించుచుండ గోపక, పరివృతుఁడై సంచరించె బాలుఁడు వోలెం
బరమేశ్వరుండు యమునా,తరంగిణీతీరమందుఁ దగినవిధమునన్. 444
మ. తనకున్ సాటి తరంగిణుల్ గలవె యీధాత్రీస్థలంబందు నం
చనుమోదంబునఁ దీరసంఘటితఫేనౌఘస్ఫుటవ్యాజయు
క్తిని నెంతో పరిహాసముల్ సలుప నుంకించెం గదా యంచుఁ దోఁ
చునటుల్ చేయుచు హారివైభవమునన్ శోభిల్లు కాళిందినిన్. 445
చ. కనుఁగొని దానియున్నతికి గాఢముదంబును బొంది యందు నొ
క్కనెలవునందు భీకరముగాఁ గనుపట్టి విషాగ్నిదూషితం
బనయము ప్రాణవాతముల నప్పుడె లోఁగొనఁజాలు బాష్పముల్
కనఁబడుచుండ నొప్పెడు నగాధజలంబుల నొప్పుదానినిన్. 446
క. కాళీయనామఫణిపతి, వాలాయము కాపురంబు వనితలతోడన్
లీలను జేయఁగఁ దద్విష,జ్వాలానలహేతు లొప్ప జనభయదముగన్. 447
క. కనఁబడుచుండు హ్రదంబును, వనరుహనాభుండు గాంచె భయకృద్గరళా
గ్నిని బుట్టుఘోరరూపా,నిలములఁ దటసంస్థభూజనిచయము నెల్లన్. 448
క. దహియించుచు నాహ్రద మా, యహిపతికిం బ్రీతిపాత్రమై విషవాయూ
పహతావిల జలసంస్ప, ర్శహతాఖిల విహగ మగుచు రమ్యేతరమై. 449
క. రెండవమృత్యుముఖం బనఁ, జండతరం బగుచు లోకసంతతికి మహో
ద్దండభయం బొసఁగుచు నా, ఖండలునకునైనఁ జూడఁగాఁ దగకుండెన్. 450
ఆ. అట్టిదానిఁ గాంచి యాబాలకృష్ణుండు, తనదు చిత్తసీమఁ దలఁచె నిట్లు;
హ్రదమునందు నిందు నతిభయంకరవిషా,యుధుఁడు దుష్టచిత్తుఁడొక్కఁడుండు.
క. అతఁడె కాళీయుం డను, ఖ్యాతింగనువాఁడు; వాఁడెకద పూర్వము నా
చేతం గీడ్పడి త్వరగఁ బ్ర, చేతసునాలయముఁ బాసి చెందిన భీతిన్. 452
క. ఈకాళిందీజలముల, నేకష్టము రాదటంచు నెంచి తనవిష
వ్యాకలితభీతికృ జ్జల, మై కన్పడు నీహ్రదమున నలరెడు నెపుడున్. 453
చ. కనుకనె యిందు మానవులుగాని మహోత్తమగోవ్రజంబుగా
ని నియతిమైఁ జొరంగ నెటు నేరుచు దప్పి యదెంత యేఁచుచుం
డినను మహోగ్రపావకు కడిందిరుచుల్ గలదుర్విషంబు తాఁ
కున నపవిత్రమౌ జలముఁ గ్రోలఁగఁబూనవు ప్రాణిసంతతుల్. 454
చ. అటులగుటన్ మహోగ్రభుజగాధిపు నీహ్రదసీమనుండి సం
కటములు పాపఁగోరియె యిఁకన్ వెడలించుట నాకుఁ గృత్యమౌఁ
జటులవిషాగ్నిసాధ్వసము చక్కఁగఁ బోవఁగ గోపబృందముల్

పటుతరసాహసం బలర భద్రజలంబులఁ గ్రోలుచుం గడున్. 455

క. వనముల నిటఁ జరియింపం,గను జాలెడు గోగణములు కమ్రజలంబుల్
తనివారఁ గ్రోలఁ గనుకనె, పని యిది చేయంగఁదగు నుపాయము వేర్మిన్. 456

మ. నరలోకంబున నేను బుట్టుట ప్రయత్నం బొప్పఁగా నిట్టి దు
స్తరకృత్యంబులఁ జేయుపొంటెఁ గనుకన్ దర్పంబునం బొల్చు నీ
యురగేశాదిదురాత్మకవ్రజము నోహో యంచు దేవావళుల్
పరికీర్తింపఁగ శాస్తిచేయుటయె యా భద్రంబు లోకాళికిన్. 457

క. కనుకన్ హ్రదవరపరిసర,మునఁ దటమున నీకదంబభూరుహవర మిం
తనరాని వైభవంబున, ఘనశాఖల వెలయు నదిగో కనుఁగొన బెడఁగై. 458

క. భూరుహవర్యము దీనిని,జేరి యసుప్రతతి నొంచు జీవనముల గం
భీరంబగు నీహ్రదమున,నేరుపునన్ దుముకువాఁడ నేను జవమునన్. 459

చ. అనుచు నెదం దలంచి తనహస్తములం గలగోపసాధనా
ళిని నొకచోట నుంచి పయి లీల నెసంగెడు హేమచేల మొ
య్యనఁ గటిఁ జుట్టి కట్టి సుమహత్తరరీతిని గూల మాక్రమిం
చిన యల నీపవృక్షమును జెచ్చెర నెక్కి విలాస మొప్పఁగన్. 460

చ. గురుతరసర్పరాజ విషగుంఫిత భూరిగభీరనీర భీ
కరతరమౌ హ్రదంబున నికామముదంబున దూఁకెఁ; గృష్ణుఁ డి
క్కరణిఁ బడంగ నాహ్రదము గ్రన్నన క్షోభితమై తరంగసం
ఘరయగతాంబుపూరముల త్మారుహరాజిని ముంచె నేపునన్. 461

తే. ఇట్లు దూరతటంబున నెసఁగు వృక్ష
తతిని ముంచుచు నుబుకుచు దారుణగతి
మించ నొప్పెను; దత్ఫణిమేదురవిష
దహనకీలాలయుతవార్ తమ్ము ముంప. 462

చ. ఎదుగక శుష్కరూపముల నెంతయుఁ దాపము నొందుచున్న యా
ముదురుమహీజశాఖలు ప్రభూతమహార్తిని బెంచు వారి యు
క్తి దగ జ్వలించె నెంతయును దిక్కుల మంటలు పర్వినట్లు త
ప్పదుగద ప్రాణికోటులకు బాధలు కర్మజముల్ తలంపఁగన్. 463

చ. కరముల నప్పళించి హ్రదకాండము భూరితరంగసంఘభీ
కరమయి యొప్పఁజేసి తనగాఢబలంబు ఫణీంద్రుఁ డోర్వకే
పరుగిడు నంచు నెంచుచును బల్విడి నాలుగు ప్రక్కలన్ వడిం
దిరుగుచుఁ గ్రీడసల్పె దివి దేవత లొప్పుగఁ గాంచుచుండఁగన్. 464

చ. జలచరముల్ కలంగి యొకచక్కటిఁ జేరి యిదేమి కాలమో
ప్రళయముగాఁగఁ దోఁచెడిని బాధను దీనిఁ దలంగు టెట్లొ యు

జ్జ్వలవిషమూర్తి యిందలరువార్త నెఱుంగనిబాలుఁ డీతఁ డీ
యిల నిఁక నుండఁగాఁగలఁడె యీయవమానము వ్యాళ మోర్చునే. 465

చ. అని తలపోయుచుం దటమునందు బిలంబుల నుండె నెంతొ యా
ర్తిని ఫణిరాజు తద్ధ్రదము తీవ్రతరంగములం గలంగుటన్
గని యిది యేటిశబ్ద మెటుగల్గెనొ భీతియె లేక యిందుఁ జొ
చ్చిన యతఁ డెవ్వఁడో యనుచుఁ జెచ్చెరఁ బర్విడెఁ బూన్కి మీఱఁగన్. 466

శా. ఆతామ్రాయతలోచనుం డగుచు సంహారోద్యమస్ఫార దు
శ్చేతోభీతికరుండు దుర్విషశుచిస్ఫీతార్చిరత్యుగ్రగ
వ్యూత వ్యాయత దుష్ఫణావృతుఁడు ప్రాణోత్ఘైకసంహారదీ
క్షాతాత్పర్యయుతోగ్రజిహ్వుఁడు మహాకాళీయుఁ డెంతేవడిన్. 467

క. చనుదేరం గని దుర్విష,ఘనభీతిదరక్తవర్ణకలిత ఫణారా
జిని జూడఁ దగనియట్లు ద,గినభుజగము లొక్కమాఱు కినుక మెఱయఁగన్.

క. తనుఁ గూడిరాఁగ నతిజవ,మున వచ్చెను;దత్కళత్రములు బహురత్నా
ళిని బొల్చు భూషణంబులఁ, దనువులు వెలయంగ వేగ ధవుని వెనుకనే. 469

క. అరుదెంచెను; శతసంఖ్యలు, కరము తనూలతలు కదలఁగాఁ గుండలముల్
నిరుపమకాంతుల మించఁగ, గరళము ముఖవాయువులను గడువడి వెడలన్.

చ. ఉరవడి నాగరాజు హరియుద్ధతిఁ గన్గొనలేక యెవ్వఁడో
పురుషుఁ డొకండు వచ్చె నిటఁ బుచ్చెదఁ గాలునియింటి కంచుఁ గా
వరమున నాత్మదేహమను బంధనరశ్మిని జుట్టె నట్టె త
త్తరుణులు క్ష్వేళహేతిసముదాయ మహోగ్రముఖంబులన్ హరిన్. 471

క. బలువిడి కఱచిరి శ్రీహరి, చలియింపక యట్టె యవ్విషస్పర్శమునన్
గలగుండుపడిన యట్టులు, పలుకులు చేద్పడఁగ నుండె; బాలకులంతన్. 472

చ. హ్రదమున దూఁకి క్రూరభుజగాధిపభోగనిపీడితాంగుఁడై
కదలకయుండఁ గాంచి యిఁకఁ గల్గునె జీవిత మంచు నార్తి న
య్యదనున నేగి శోకముల నయ్యదువుల్ తగు గోకులంబునన్
సుదతి యశోదఁ గాంచి కడుశోకము పొంగ వచించి రివ్విధిన్. 473

చ. ఇదె మనకృష్ణుఁ డజ్ఞుఁడయి యేమితలంచియొ మేమెఱుంగ మా
హ్రదమునఁ గాళియుండు గరళానలహేతుల నెట్టివారినే
నదయతఁ జంపుచుండుఁగద యద్ది యెఱుంగఁడొ యేమొ వృక్షమె
క్కి దుమికి మున్గె నీరమునఁ గేవలమూర్ఖత నక్క! టక్కటా! 474

క. చని మేము చూడ నిప్పుడు, ఘనసర్పము చుట్టుకొని ని కామక్రోధం
బున భక్షించుచు నుండం,గను గంటి మిఁకేమి చెప్పఁగలమో దేవీ. 475

మ. మనవీటంగలవారలెల్లఁ జని యమ్మాయావి మర్దించి నీ
తనయుం దోడ్కొని రాఁదగుఁజా దరలుఁ జేతల్లగ్నమందే యనన్
విని యందుంగల గోపకుల్ తరుణులున్ వేవజ్రపాతంబునన్
తనువుల్ చేడ్పడ మేదినిం బడెదు చందం బొప్ప నిశ్చేష్టులై. 476
క. ధరఁబడి పొరలుచు నిట్లా,తురులై వచియించి రేమి దోషంబో శ్రీ
హరి యిట్టులయ్యె నెల్లరుఁ, దరలుఁడు మనకృష్ణుఁ గావఁ దగు నిత్తఱినిన్. 477
క. అనిపల్కు నంత నందుని, వనితామణిఁగూడి యెల్ల వనితలు గోపా
లిని గూడి హ్రదము చెంతకుఁ, జని హాహాకారములను సాంత్వము లలయన్.
క. ఎచ్చట మనకృష్ణుం డని, యెచ్చట ఫణి యంచుఁ గఱచె నెట్టు లనుచు నా
సచ్చరితున కెటు లీవగ, వచ్చె నటంచున్ యశోద వగపున నడుగన్. 479
ఆ. అంగనాజనంబు లత్యార్తి మడువును, గాన నేగి రంత గాఢరయము
నను వ్రజంబునుండి నందుఁడు గోపకు, లరిగి రాహ్రదంబు పరఁగునదికి 480
క. అతిశయవిక్రముఁడయి య,చ్యుతుఁ డన నొప్పారు రాముఁ డొగి ననుజుఁ గనన్
మతినెంచి పోయె; నందఱు, కృతకృత్యుఁడు గాకయున్న కృష్ణుఁ గని రటన్.
తే. సర్వరాజవశంగతు శౌర్యరహితు,వలెఁ గనంబడుచున్న యాబాలుఁ గనిరి;
సర్పభోగసమావృతి జడుఁడుపోలె, నూరకుండెను శ్రీకృష్ణుః డూహచెలఁగ.
క. నందుఁడు నిశ్చేష్టుండై, నందనుముఖచంద్రు వగపునం జూచుచు నుం
డెం దల్లియు మాటాడక, నందే కనుచుండె మది మహార్తి గదురుటన్. 483
తే. శోకకాతరలై గోపి కాదుకేశ,యాతు లేడ్చుచు శ్రీకృష్ణ నమలమూర్తి
గనుచుఁ నిట్లనిపల్కి; రీతనయుకొఱకు, నీహ్రదంబునఁ జొత్తు మిం కేమిచెప్ప.
క. మాదేవి యశోదయు మ,మ్మీ దుఃఖమునుండి త్రిప్ప నెటుచాలు? మహా
ఖేదమున మమ్ముఁగూడియె, యీదామోదరునికొఱకు నీనదిఁ బడెదున్. 485
చ. తనయుని నీతనిన్ విడిచి ధన్యులపోలిక గోకులంబు నే
మని కనఁబోఁగలాము; కమలారివిహీన నిశావిధంబునన్
దినపతిలేని యాపగటితీరున దుగ్ధములేని ధేను వ
ట్లనుపమకృష్ణహీన మగు నావ్రజ మింకఁ జెలంగ కుండుఁగా. 486
ఆ. విధియు మమ్ము నిట్లు వెతలపా లొనరించె, గోపబాలు నితనిఁగూడి పోవ
కొక్క మేమెపోవ నోపము నిజ మని, గోపికలు వచింప గోపకు లొగి. 487
క. దిగులొంది దిక్కు తోఁపమి, వగచుచు నుండంగ భూరిబలుఁడు సుమతియున్
దగు నూహలు గలవాఁడును, నగు రోహిణికొడుకు వారి యప్పటినుడులన్.
చ. విని యతిదీనమానసుల విహ్వలతం గనుచుండు వారలం
గనుఁగొని దృష్టులందు రుచిక్రాలఁగ నిట్లని పల్కెఁ; నందుఁడున్
దనయుని పాటుకై వగపు దార్కొన నాతనిమోము చూచుచున్
దనుఁ గనఁ దన్మనోరుజయుఁ దప్పక పాయువిధంబునం దగన్. 489

ఆ. మూర్ఛ మున్నియున్న ముగ్ధ యశోదయుఁ, దెప్పిఱిల్లునట్లు దివ్యకృష్ణ
మహిమమును నెఱింగి మాటాడుచందంబు, గనఁబడంగ నిట్టు లనియె నపుడు.

క. సురలోకేశా! యేమిది? నరభావము పొందువిధమునఁ బరఁగెద వీ
శ్వరతఁ దలంపం జనదో, పరికింపవుగాని తెలియఁబడనిది కలదే. 491

ఆ. విశ్వమునకు నీవె వెలయుదు నాభివై, యమరతతికి నాశ్రయంబ వీవె
లోకకర్త వీవె లోకరక్షకుఁడవు, నీవె హర్త వనఁగ నీవె కావె 492

క. శ్రుతిమయుఁడవు శ్రీకృష్ణా, క్షితి గోపకులంబునందుఁ జెందితివి జనిఁ
మతిమంతా! గోపకులే, హితులును బాంధవులు నీకు నిత్తరుణమునన్. 493

ఉ. గోపిక లెల్ల నిందు వగఁగుం దెదరీశ్వర! యిట్టివీరి సం
తాపముఁ జూచుచుండియును దత్పరతం బరికింపవేమొ నీ
దాపునఁ జేరినట్టి జనతల్ వగ పొందుట పాడియౌనొకో
యీపనిఁ దీర్పు మింక నిను నేఁచెడువ్యాళమదం బడంపుమీ. 494

క. మనుజాశయంబు నిత్తఱిఁ, గనఁబఱచితి వర్భకు లిలఁ గావించెడు రీ
తినిజూపితి విఁకఁ జాలును, వనజాక్షా! యీభుజంగవరుని దురాత్మున్. 495

క. ఘనదంష్ట్రాయుధుఁడై భీతిని లోకులు చెందఁజేయు తీవ్రతతో నా
ప్తినవానిచేవ మాన్పుమ, యని పురికొల్పంగఁ గృష్ణుఁ డతిశయశక్తిన్. 496

క. స్మితభిన్నోష్ఠపుటుం డయి, హిత మీయ దటంచు మదిని నెంచుచుఁ దనుపుఁ
జ్యుతఫణిబంధముగా నీల్గి తగఁ హస్తద్వయమున లీలయ పోలెన్. 497

క. ఉరగేంద్రు నదిమి పడగను, గరమరుదుగ వంచి పాదకమలద్వయ మా
శిరమున నిడి శ్రీకృష్ణుం, డురువిక్రముఁ డాడెఁ ద్రిదశు లోహో యనఁగన్.

చ. చరణవికుట్టనంబులను సర్పగణేంద్రుని భోగమందు శ్రీ
హరిచరణాంకముల్ వెలసె నద్భుతరీతిని; వీతగర్వుఁడై
త్వరపడి సర్పరాజు పరతత్త్వముగాఁ దగు మేటి బాలుఁ డి
క్కరణి నడంచె నాకుఁగల గర్వము నొక్కక్షణంబులోపలన్. 499

చ. అని తలపోసి యీప్రభువె యాను శరణ్యుఁ డటంచు భక్తి మ్రొ
క్కెను; మఱి మూర్ఛనొందె నటు కృష్ణునిపాదవికుట్టనంబు లా
క్కనియతి గ్రాల భ్రాంతిఁగనె గాఢతరాంఘ్రినిపాతనంబు లా
ర్తినిగలిగింప రక్తమును దీనతఁ గ్రక్కెను జూడ భీతిగన్. 500

చ అవనతశీర్షకంధరుని నాననరాజి గళన్మహాసృగు
గ్రు వినయవిత్తరాశిఁ గని కుందుచు నీతఁ డనంతుఁ డాద్యుఁ డె
ల్లవిధములఁ శరణ్యుఁ డఖిలప్రభు వంచుఁ దలంచి తత్సతుల్
ప్రవిమలబుద్ధులై నొకట భక్తి చెలంగఁగ వచ్చి శ్రీహరిన్. 501

ఆ. శరణుచొచ్చి తెల్వి సంధిల్లఁ బల్కరో, సకలదేవవంద్య చరణకమల
దేవదేవ మాకుఁ దెలిసె నీమహిమమ్ము, నీవనుత్తముఁడవు నిర్మలుఁడవు

నాగపత్నులు హరి వినుతించుట.

సీ. భవదంశభూతులే బ్రహ్మాదిదేవతల్ తలఁపఁ బరంజ్యోతి వలఘుమూర్తి
వమరోత్తములు నిన్ను నభినుతింపఁగఁ జాల రభవుఁడ వీవు విశ్వౌఘపతివి
కావున నిన్నెట్లు కాంతలమగు మేము వినుతింప నేర్తుము విశ్వమూర్తి
వగు నీదుమహిమంబు తగునట్లు పల్కఁగా శక్య మెట్లగు? మాకుఁ జక్రపాణి
ఆ. క్ష్మాంబుపవనవహ్ను లాకాశ మనుపంచ, భూతములను మిగులఁ బొలుచునట్టి
విశ్వ మెల్ల దేవ విభుఁడగు నెవ్వని, యల్పకాంశములగు నట్టి నిన్ను. 503
క. తలమే నుతింప మా; కో, జలజాక్షా లోకనాథ శరణు గనిన మ
మ్మెలమిం గావుము కృష్ణా, కలఁడే యిఁక నిన్ను మానఁ గావ నొకఁ డిలన్.
చ. కలఁగెను జిత్త మీభుజగకాంతున కాయువుదూర మయ్యె నీ
వెలఁదుల జీవనం బితఁడె వేయివిధంబులఁ బల్కనేల ని
ర్మలకరుణార్ద్రచిత్త! గుణరాజిత! మాకిట భర్తృభిక్ష మి
మ్ముల దయచేయవయ్య కృపఁ బూనుము దీనుల మొఱ్ఱలన్ వినన్. 505
మ. అనుచుం గాంతలు వేఁడుచుండ విని భీతాక్షుంబుల్ తగన్ గ్లాంతమై
తను వొప్పారిన నెట్టకేలకు మనోధైర్యంబునన్ భూరిస
ర్పనికాయాధిపుఁ డార్తుఁడై పలికె నోభవ్యాత్మ దేవేశ నన్
గనుమా సత్కృప నీవె దిక్కనుచుఁ బల్కం జాలె మందోక్తులన్. 506
క. నీదగు నష్టైశ్వర్య, ప్రాదుర్భూతప్రభావ పరమయశ మిలన్
శ్రీదయిత! నిరతిశయమై, యాదిత్యులకే నుతింప నవశంబుగదా. 507
క. దానన్ నే నెవ్విధమున, మానితభాషల నుతింప మైకొందును శ్రీ
శా! నన్ను సృష్టిచేసితి, వీనియతిన్ జాతిఁ బరఁగు మీవని కానన్. 508
క. ఈరూపమునకుఁ దగు వ్యాపారంబున వర్తిలంగఁ బొల్పడితి ని దే
ఘోరంబుగఁ దోఁచెను గద, నేరము నాదేది కలదొ నేనెఱుఁగ నెటా. 509
చ. పరుఁడవు తత్పరాత్ముఁడ వపారకృపానిధి వీశ్వరుండ వీ
శ్వరులకు నాయకుండవు విశాలజగంబుల కీవె ఱేఁడవై
పరఁగుదు వట్టి నిన్ను శుభవాక్కుల నెన్నఁగ నెంతవాఁడ శ్రీ
వర! కరుణింపవయ్య ధరభక్తులఁ గాచుట నీకుఁ గృత్యమా. 510
క. నీయాజ్ఞరీతి వర్తిల, న్యాయమె కద! వేఱుభంగి నాత్మఁ గడఁగి నేఁ
జేయ నదే వర్యను నను, న్యాయమె దండింపఁ గృష్ణ నారదవరదా. 511
తే. వేఱువిధమున వర్తింప విహితమాను
దండనము, వాక్య మిది నీవె ధర్మశాస్త్ర

మనుచుఁ జెప్పంగఁ దగు నట్టులైన నాకుఁ
దగును దండన మిత్తఱి దర్ప మడఁప. 512

క. తగినగతిన్ దండించితి, వగధర! యిది యనుభవించు టర్హము సుమ్మీ
తగుఁగద దీనుం గావఁగఁ, బగఁబూనక కావు మింకఁ బద్మదళాక్షా. 513

క. హతవీర్యవిషుఁడ నైతిని, దితిజాంతక గర్వమెల్లఁ దెగియెను నీశ
క్త్యతిశయమున జీవన మీ, క్షితి నిమ్మా యాజ్ఞ యిమ్ము చేయుదు నట్లే. 514

చ. అని వినయంబునన్ బలుక నాఫణినాయకు సూక్తులెల్ల నె
మ్మనమున కెక్కఁగా విని రమాపతి యిట్లనిపల్కె సర్పరా
జ నిలువఁగూడ దీయమున సన్నిధినైనను దారపుత్త్రులం
గొని పరివారయుక్తిఁ జని గొబ్బున సాగరవారిఁ జేరుమీ. 515

సీ. యమునాజలం బిది యఖిలజనంబుల కెప్పుడు సేవ్యంబయి యేభయంబు
గలుగ నీయక యుండగాఁ దగు నాపాదచిహ్నముల్ నీవగు శిరములందుఁ
గనఁబడుచుండుట గరుడుఁడు పన్నగవైరియయ్యును నిన్నుఁ జేరకుండు
నీవారలను గొట్టనేరఁడు సుమ్మని కాళీయు వదలె శ్రీకాంతుఁ డంత
తే. నతఁడు శ్రీకృష్ణునకు మ్రొక్కి యాత్మజాది
పరియుతుండయి పోయెను సరిదధిపతి
నాశ్రయింపఁగ నందఱు నాత్మరూప
మును విపాధ్వమునఁ గనుఁగొనుచు నుండ. 516

చ. తనసతులెల్ల నాధునిప్రహ్లాదంబును వెల్వడి వెంటరాఁగ భీ
తిని గలిగించు సర్పకుల ధీరుఁడు సంహృతగర్వుఁడౌచు నో
య్యనఁ జనఁ; గోపకుల్ యమునియంతికసీమకు నేగి వచ్చి న
ట్లనఘుని గృష్ణుఁ జూచుచు ముదశ్రుజలంబుల మస్తకం బొగిన్. 517

క. తడిపిరి; మరలం బుట్టెను, బుడుతం డని విస్మయంబు పొదలుచునుండన్
గడుకొని శ్రీకృష్ణుని హరి, నుడులన్ బూజించి రెంతో నూతనభక్తిన్. 518

క. పరిశుద్ధ సలిలములచేఁ, బరఁగెడు యమునాజలంబుఁ బరికించి మహా
త్తరకార్య మిద్ది యని శ్రీహరినిన్ వినుతించి రెంతో యాదృతిమీఱన్. 519

చ. మనమున కింపుఁ బెంపఁదగు మాధవుచేష్టితముల్ గలట్టి పా
వనచరితంబు గోపికలు పాడిరి కంఠము లెత్తి గోపులో
య్యన బహుమానపూర్వముగ సర్వవిధంబున సన్నుతించి రం
త నిజసహోదరుం గలిసి తాఁ జనెఁ గృష్ణుఁడు తండ్రియింటికిన్. 520

## డెబ్బదియొనిమిదవ యధ్యాయము.

### తాళవనవిహారము.

ఉ. ధేనుగణంబు మేపుచు మతిస్థిరతం గను గోపబాలకుల్

దాను సహోదరుండు వన ధాత్రుల మెల్లగ సంచరించుచున్
జానుగఁ దాళకాననము చక్కని క్రీడకు నర్హమౌట చే
దానవుఁ జంపుకోర్కిని వెసం జని చొచ్చిరి స్వేచ్ఛమీఱఁగన్. 521

చ. వనమున నందు నిత్యము నివాసముచేయును ధేనుకాఖ్యుఁ డౌ
దనుజుఁడు మర్త్యధేనుసముదాయముఁ జంపుచు మాంస మంతయుం
దినుచు విచారహీనత మదించి ఖరాకృతిఁ బూనియుండు నే
మనుజులు దానినిం జొరఁగమానుదు రాతనిచర్య లెంచుచున్. 522

సీ. తాళవనం బద్ది లీలాస్పదంబయి చారుఫలంబుల సంతసంబుఁ
గూర్చుచునుండు నిగూఢవనం బని చొరఁబూన రెవ్వ రాసరణిఁ బోవ
రట్టులౌట నెఱింగి యచ్యుతుఁ డాచెంత గోవుల మేపుచు గోపబాలు
రాదృతి వెంటరా నందుండె గోపకు లాఫలంబులఁ దిను నాసఁ బూని

ఆ. హరికి నిట్టు లనిరి హరిఫలంబుల, రామ! కృష్ణ! తినఁగ మేము కోరు
వార మైన నందు భూరిదానవుఁ డుండు, నంచుఁ జొరఁగ మాని రఖిలజనులు.

చ. కనుఁగొను మీఫలంబుల నికామపరీమళ మట్టె వీచెడున్
దినఁగ నభీష్ట మొప్పెడిని ధీరత నున్నఫలంబు లట్టె మే
దిని బడఁగొట్టుమా యనుచు ధీరులుగాని వ్రజార్భకుల్ ముదం
బున వచియింప రాముఁడును బొంగెను గృష్ణుఁడు మెచ్చె నానుడుల్. 524

క. అనుపమవేగంబున రా, మునితమ్ముఁ డు రాముఁడుం బ్రభూతతరంబై
కనఁబడుశక్తిం బ్రాకిరి, ఘనతాళద్రుమము లెల్లఁ గ్రక్కదలంగన్. 525

క. ఫలములు మేదిని నిండఁగ, నలఘుక్రమ మొప్ప రాల్చి రాఫలపతనా
కులశబ్దము దెసలందున్, విలసిల్లఁగ నాలకించి విహ్వలమతియై. 526

చ. దనుజుఁడు గార్దభాకృతి సతంబును మెచ్చెడు వాఁడు దుష్టుఁడై
జనుల నడంచి మ్రింగఁ దగుశక్తి నెసంగెడువాఁడు ధేనుకుం
డని తనుఁ బిల్వ నొప్పెడు మదాంధుఁడు కోపము మూర్తిఁ దాల్చెనో
యని తనుఁజూచు వార లొగి నాత్మల నెన్నఁగ నుండువాఁ డటన్.

క. చను దెంచె నాదురక్షణ, మునఁ దగు నీతాళగహనమును జొచ్చుటె యె
ట్లని యెన్న రాకయుండం, గను బండ్లను రాల్చుబెట్టి కడఁకయొయెటుఁగన్. 528

క. అని తలపోయుచు వేగమ, చను దెంచి పిఱింది రెండుచరణంబుల నొ
క్కనియతి నెత్తి హరిం దన్నెను ఱొమ్మునఁ బీడఁగూర్చు నెపమునవో యనన్.

చ. ఉరమునఁ బాదయుగ్మహతి యొప్పక ముందె సరోజనేత్రుఁ డా
చరణయుగంబుఁ బట్టుకొని చయ్యనఁ గుమ్మరసారెపోలికన్
గిరగిరఁ ద్రిప్పి యంబరము కేసి యొహోయని యార్చి వైచె న

త్తరుణమునందె ప్రాణములు దాఁటె శరీరమునుండి యంతటన్. 530

చ. అతనికళేబరంబు గని మహోత్తరతాళమహీరుహాగ్రము
న్నతగతిఁ దాఁకెఁ దద్ధతిని సవ్యఫలంబులు భూమిపైఁ బడెన్
క్షితిరుహసంయుతిన్ దనుజసింహు శరీరము నుగ్గునుగ్గుగాఁ
బతనముఁ గాంచెఁ దత్తనువుభారము నోర్వక భూమి బెగ్గిలెన్. 531

చ. అనిలజవంబునం జెడిన యంబుద మట్లు ఖరాసురాంగ మె
య్యన హరిశక్తిఁ జెదరెడ నద్దనుజోత్తము బంధురాజి చ
య్యన నరుదెంచి నందసుతు నద్భుతశక్తి నడంగె రాముఁడున్
దనుజులఁ గొందఱం దునిమె దర్పము పొంగఁగ గోపు లౌననన్. 536

చ. ధరణి ముహూర్తమాత్రమునఁ దాళసుపక్వఫలంబులన్ మహా
త్తరసురవైరి దేహసముదాయములన్ గడు నిండియుండె భూ
సురమును లావిధంబు గని చోద్యము నందిరి దేవవర్యులున్
గరము సుఖంబుగా మనఁగఁ గంటె మటంచుఁ దలంచి రాత్మలన్. 533

చ. దనుజుల బాధ పోవఁగనె తద్వనభూమిఁ గనంగనౌ తృణ
మ్మును మెసవంగ నోచె హరి భూరికృపాయుతి గోగణంబు త
ద్వనమున మున్ను దానవుని భక్ష్యముగా మృతినొందుచుండెఁ గా
వునఁ దదుదాత్తసాధ్వసము పోవఁగ హాయిని జెందె నాత్మలన్. 534

క. ఆ రాసభదైతేయుఁడు, ఘోరాజిన్ సానుజుఁడయి కూలిన గోపీ
సారసనేత్రలు గోపకు, లారమ్యవనంబుఁ జూచి యలరిరి మిగులన్. 535

చ. దనుజుఁడు కాలుగేహము నితాంతజవంబునఁ జూడఁబోవ నం
దుని తనయుల్ దురాత్ముఁడుగఁ దోఁచెడు ధేనుకదైత్యుఁ డీల్గ నా
వనమును వీడి గోపపరివారయుతిం బ్రమదంబుఁ దెల్పు ని
స్వనములు చేయుచున్ మురళివాదన మొప్పఁగఁ జేయుచున్ దమిన్. 536

క. అరిగిరి భాండీరాఖ్యం, బరఁగు వనంబునకు వృక్షపంక్తులఁ గనుచున్
ద్వరపడి వంచుచుఁ జెందుచు, సరి బాలురఁ గూడి మిగుల సంతసమొప్పన్.

సీ. ధేనువారంబులఁ ద్రిప్పుచు నందందు వానిపేరుల నెల్ల వరుసఁ బిల్చు
చును వానికిం గట్టననువగు పాశముల్ స్కంధభాగముల నాసక్తిమీఱఁ
దాలిచి వనమాల లోలిఁ గన్పడ సువర్ణాంజనవర్ణవస్త్రాభిరాము
లగుచు మహేంద్రాయుధావళిఁ గూడిన శ్వేతకృష్ణాంబుదఖ్యాతిఁ గాంచి

తే. నట్లు మెఱయుచుఁ బ్రాకృతు లట్లు క్రీడ
లమరసల్పుచు లోకనాథాధిపులయి
ధరణిఁ దిరుగుచు మానవధర్మసంఘు
సక్తి మనుజతఁ బూజించు సరణిఁ గనుచు. 538

క. కులముల కనువగునటు క్రీడలఁ దేలుచు సోదరులు కడంగి వనమునన్
బలములఁ దగు వృషభంబుల, చెలువున విహరించి రాత్మసిద్ధులతోడన్. 539
వ. మఱియు నారామకృష్ణులు సమానవయోరూపులగు బాలకులం గూడి యాం
దోళికాక్రీడనంబుల, నియుద్ధభేదంబుల క్షేపణీయకృత్యంబులఁ బ్రస్తరప్రహార
విశేషంబుల విహరించుచుండ నాయిరువురం బట్టుకొనం గోరి యొకమహాసు
రుండు ప్రలంబాఖ్యుండు గోపవేషతిరోహితుండై వచ్చి. 540

ప్రలంబాసురవధము.

ఉ. వారలయంతరంబున నవారితవిక్రమశాలిరీతి శం
కారహితాత్ముఁడై మనుజకాయమునన్ వడిఁ జొచ్చి వారిగం
భీరతరస్వభావమును విశ్వతనుత్వము నెన్నలేక సా
ధారణు లంచు నెంచి మదిఁ దార్కొనురోషము పెంపు దాఁచుచున్. 541
ఆ. అంతరం బెఱింగి యా రామకృష్ణులఁ, జంపఁ బూనెఁ దొలుతఁ జక్రి నవల
రాము నొంపఁ దలఁచి రాక్షసుఁ డోర్పున, వారితోడఁ గ్రీడ వరుస సలిపె.
క. హరితోడం గ్రీడించెను, హరిసోదరుతోడ సల్పె నవ్విధిఁ గేళిన్
సరిగా వా రాగోపకు, లరుదందఁగ ద్వివిధములుగ నైరి కడంకన్. 543
సీ. ప్రక్రీడనము సల్పఁ బల్విడిఁ బూనిరి యందు శ్రీరాముతో హరియుఁ గ్రొత్త
గోపాలకునితోడఁ గోరిక రాముఁడు నితరగోపాలకు లితరగోప
బాలురతోడ నాప్రక్రీడనము సల్పఁ బూని రందోడినచో నితరుని
వహియించి పరుగిడ వలయు నంచని నియమంబు చేయంబడె మాధవుండు
తే. గెలిచె శ్రీదాము రాముండు గెలిచెఁ గ్రొత్త
గోపబాలుఁ బ్రలంబుని శ్రీపతిదగు
పక్షమెల్ల జయించెను బరులపక్ష
మెల్ల నోడెను; గెల్చిన గొల్ల లపుడు 544
క. తా నోడించిన బాలునిఁ బూనిక వాహనము గాఁగఁ బొంగుచు నెక్కం
గా నతఁడు మోచికొని చని, యానెలవున నున్న భూరుహస్కంధమునన్. 545
తే. ఉనిచి వచ్చుచు నుండంగ నుబ్బుచుండి
రంత శ్రీదాముఁ డావిధి హరివహించి
యట్టి భాండీరభూమిరుహంబుకొమ్మ
యందు నిడివచ్చె నాప్రబలం బాహ్వయుండు. 546
క. బలరాము నెత్తికొని యిమ్ములఁ బాఱెను జంద్రయుక్తముగ నొప్పుమహా
జలదంబుభాతిఁ బొల్చెను, బలువిడి దానవుఁడు పర్వుపాఱఁగ నంతన్. 547
తే. రౌహిణేయుని భార మోర్వంగరాని
యట్టు లయ్యెను దాన నహంకరించి

తనదు దేహంబుఁ బెంచె నాదనుజుఁ డప్పు
డంబుదాళి ప్రావృట్కాలమందుఁ బోలె. 548

సీ. *దగ్ధశైలోపమతనుని స్రగ్దామలంబాభరణాఢ్యుని హారిముకుట
భాసురమస్తకుఁ బాదతలన్యాసచలితభూచక్రు విపులభయంక
రాకారు శకటతుల్యాక్షుని దానవు సంకర్షణుఁడు గని సత్వరముగఁ
దను మోచికొని పోవుటనుగూర్చి యనుజున కిట్లు తెల్పెను గృష్ణ కృష్ణ యిదిగో

తే. పర్వతోదగ్రమూర్తియై పరఁగు నితఁడు
నన్నుఁ గొనిపోవుచున్న వాఁ డెన్న గోప
తనువు ధరియించి మాయఁ బూనిన దురాత్ము
నితని నే నేమిచేయుదు నిపుడె చెపుమ. 549

క. త్వరపడి ననుఁ గొనిపోయెడు, మురదానవహరణ వీనిఁ బోకార్చు తెఱం
గరయుమ యన స్మితయుక్తా, ధరుఁడయి బలభద్రుశక్తిఁ దా నెఱుఁగుటచేన్.

చ. అలరుచుఁ బల్కె నేల యిటు లార్య మనుష్యతఁ దాల్చి దీవు ను
జ్జ్వలభవదీయతేజమును వాసవుఁడైన నెదుర్కొనంగ ని
మ్ముల సహియింప శక్తుఁడె ప్రభూతరహస్యవిదుండ వీవు నీ
వలసినయట్లు చేయఁదగువాఁడవు లోకవిభూ! మహాప్రభూ! 551

క. స్మరియింపు కారణంబును, బరమేశా! కారణములు పరఁగెను నీనుం
డి రహిఁ జగమెల్లను సాగరమయముగ నుండ నీ వఖండస్ఫూర్తిన్. 552

క. ఏరీతినుంటివో మది, నారయుమా నేను నీవు నఖిలంబునకుం
గారణ మగుదుము తలఁపఁగఁ, జేరునె భేదంబు మనకు జీతి నొకపనికై. 553

క. ఇరువురము తనువు లొప్పఁగ, ధరియించితి మివ్విధమున ద్వైవిధ్యముగాఁ
బరమేశ్వర! లోకగణేశ్వర యాత్మఁదలంచి వీనిఁ జంపుము దుష్టున్. 554

క. మనుజత నిట్టులె తాలిచి, నిను నమ్మిన వారికెల్ల నియతహితంబుల్
గనఁ జేయుమనుచు హెచ్చరి,కనుగూర్పఁగఁ గృష్ణుహితముగడు వరమనుచున్.

చ. మనమున నెంచి సుస్మితము మానక మోమున నర్తనంబు స
ల్ప నెఱి నొనర్పఁగాఁ దగిన పద్ధతి యోజనచేసి యాప్రలం,
బుని మది వీడనొందునటు భూరిబలంబున నొక్క నంత నా
దనుజుని భూరిమస్తకము దారుణముష్టిహతుల్ కడుంగడున్. 556

క. వడిఁబడఁగఁ జేసి నొంచెను,గడుఁగోపము వీతిహాత్రుకై వడి నటఁ గ
న్పడు చుండ రక్తనేత్రము, లుడుగక మిణుఁగురులఁ గురియుచుండఁగ నంతన్.

మ. బలరాముం డిటు ముష్టిఘాతముల నప్పాపాత్ముశీర్షంబు ని
మ్ముల నొప్పింపఁగ నేత్రముల్ వెలికి రా మూర్ధంబు మస్తిష్కముల్

*స్రగ్దామలంబాభరణం ముకుటాటోపమస్తకమ్ అనిమూలము.

వెలికిం ద్రోయఁగ మోము శోణిత మొగిన్ భీమంబుగాఁ గ్రక్క భూ
స్థలి నద్దానవుఁ డొక్కటం బడి యమస్థానీయముం జేరెఁ దాన్. 558
చ. దనుజుఁడు ప్రేతనాథుపురిదాపున నిల్వఁగఁ బోవ నద్భుతం
బనఁదగు నిట్టికార్యముమహోత్తరశక్తి నొనర్చినట్టి రా
ముని నుతియించి రెల్లరు ప్రభూతముదంబున మేలు మే లటం
చును; బలభద్రుఁ డత్తఱిని శుంభదభంగుర పౌరుషంబునన్. 559
క. క్రూరుఁ బ్రలంబాసురునిన్, ఘోరాజిం దున్మి కృష్ణుఁగూడి వ్రజంబుం
జేరెను గోపుల మెల్లను, భూరిప్రమదంబు గాంచి పొంగుచు నుండన్. 560

---

డెబ్బదితొమ్మిదవయధ్యాయము.

ఇంద్రయాగమును జేయఁబూన శ్రీకృష్ణుఁడు నివారించుట.

క. బలరామకేశవులు దోర్బల మలరన్ వేడ్క సల్పఁ బ్రావృట్కాలం
బెలమి విడి యెటకొ పోయెను, లలిఁ జేరె శరత్తు భూస్థలంబున నెలమిన్ 561
చ. సరసిజముల్ వికాసమున సంతసముం దెలిపెన్ లసత్తను
స్ఫురణము మీఱఁ దారకలు శోభిలుచుండఁ బ్రమోదయుక్తి నం
బరము శరత్సమాగమము భవ్యగతిం గొనియాడుచుండె ని
ష్కరణి శరత్తు రా వ్రజ మఖండవిలాసము మీఱ శోభిలెన్. 562
చ. శతమఖుఁ గొల్వ నుత్సవము సల్పఁగ గోకులవాసు లెల్ల ను
న్నతమగుపూన్కి నుండిరి గనంగన యత్నము లెల్లఁ బెల్లుగన్
వితతపదార్థసంగ్రహణ విస్తృతపద్ధతి సాగుచుండె న
చ్యుతుఁ డది గాంచి గోపకుల యుత్సవవైఖరి లోఁ దలంచుచున్. 563
క. కౌతూహలమున వృద్ధ, వ్రాతంబుం జూచి పల్కె వరమతివిభవ
స్ఫీతుండై శక్రమహాఖ్యాతంబగు దీనిఁ జేయ నవసర మేమో. 564
ఉ. ఎవ్వనినుండి మీరు ముద మివ్విధిఁ గంటిరి? దీనిఁ జేయఁగా
నెవ్వఁడు ప్రీతుఁడౌ విధి యదెట్టిది? నాకెఱిఁగింపుఁ డన్న నా
పువ్విలుకానితండ్రిఁ గని పొచ్చె మొకింతయు లేక యాదృతిన్
నవ్వుచుఁ బ్రశ్నచే యుతననందనునిం గని నందుఁ డిట్లనున్. 565
క. మేఘములకు నుదకములకుఁ, దా ఘనుఁడౌ దేవరాజు తనయ! యతఁడె స
ర్వాఘములఁ జెందు నతనియ, మోఘాజ్ఞను మేఘబృందములు వృష్టి నిడున్.
క. వినవయ్య యంబువుయవృష్టిని గురియు ఘనంబు లదియె చెలఁగు రసమునాఁ
గను దానినుండి సస్యము, జనియించును దానిఁ దినియె జంతువు లెల్లన్. 567
తే. బ్రదుకుచుండును మన కెల్ల బ్రదుకు వృష్టి
మూలమునఁ గాదె దానిచే నోలి దివిజు

లను విధిం దృష్టిచేయనోఁ దనయ! వృష్టి
చేతఁగద గోవు లివి యెల్లఁ జెలఁగుచుండు. 568

క. క్షీరము లొసఁగుచు దూడల,తో రంజిలుచుండు సుఖము తోఁచుట వృష్టిన్
ధారణి రంజిలఁగా దె కుమారా! సస్యములు సర్వమనుజార్థితముల్. 569

క. వానిన తుష్టియుఁ బుష్టియుఁ, గానంబడు సస్యవృద్ధికలితము తృణసం
తానయుతమునౌ క్ష్మాస్థల; మే నరులకు సుఖద మగుచు నెసఁగుం గాదే 570

క ఘనములు నభ్రతలంబునఁ, గనుపట్టినయంత తుత్తు కాఱియపెట్టం
గను జాలకుండు వృష్టిం, గని నంతనె పొగడుచుండ్రు ఘనములఁ గృషికుల్.

ఉ వారిద ముజ్జబాంధవు ప్రభానిచయంబుల భూజలంబులన్
ధారణ మొప్పఁజేయు బహుధా పరికించి జగంబు మేలుకై
కోరిక నింద్రుఁడే కురియుఁ గుంభిని వర్షము కానసే మహా
సారుని దేవతాపతిని క్ష్మాపతు లెల్లరు భక్తిమీఱఁగన్. 572

క. ప్రావృట్కాలంబున ముద, మావహిలం బూజచేయ నారంభంబుం
గావింతురు మనమును నటు, గావింపఁగ వలయు మేలు గనినందులకై. 573

చ అని తనతండ్రి పల్క విని యయ్యుమ రేశునిపూజ నాపి యా
తనికి మహాగ్రహం బడరఁ దా నొనరింపఁగఁ బూని కృష్ణుఁ డి
ట్లనియెను; గర్షకావళులయందును జేర్పఁగరాదు యాదవా
ళిని యదువంశసంభవులు లీలగ గోవుల మేపుచున్ వనిన్. 574

క. తిరుగుచు నుందురు వైశ్యుల, యురుధర్మంబుగను క్షితిని నొప్పుచు విత్తో
త్కరమును గూర్పఁగఁ జాలిన, వర వాణిజ్యంబు మనకు వలనుపడదుసూ 575

తే. మనకు గోవులు పరమవృత్తి నియత మిది
వనచరులమాట శాస్త్రోక్త మనఁగ వలయు
వరుస నాన్వీక్షకియుఁ ద్రయీవార్త లవల
దండనీతియు నివియె విద్యలగు నాల్గు. 576

సీ. ఇందు వార్తనుగూర్చి యేను జెప్పెదు దాని వినఁదగు నాయనా యనఘ కృషియు
వాణిజ్యమును బశుపాలనమ్మును నాఁగ వార్త వృత్తిత్రయభాసురాశ్ర
య యగు; మహాభాగ! యందుఁ గర్షకులకు వృత్తియౌఁ గృషి యను విద్యపణ్య
జీవులకుం బణ్యమే విద్యయగు మన కనఁగ గోవులు శ్రేష్ఠమైన వృత్తి

తే వార్తయందలి మూఁడగు పక్షములను
దెలియఁ జెప్పితి నెవ్వఁ డేతీరునఁ దన
బ్రదుకుఁ జూచుకొనం బూనువాఁడు దాని
నాశ్రయింపఁగఁ దగు మాన నయితిగాదు. 577

క. ఏవిద్యచేత నెవ్వఁడు, జీవింపఁగఁ గోరుచుండు సిద్ధ మదియెయా
దైవత మతనికిఁ దండ్రీ!, యావిద్యయె పూజ్య యగును హర్షము నొసఁగున్.

తే. అతని కుపకారిక యనఁగ నదియె సుమ్ము
మనుజుఁ డెవ్వఁ డేవిద్యచేఁ గనుచు ఫలము
మతొకవిద్యను బూజించు మానసమున
నిహపరములందు శుభ మొందఁ డెన్న నతఁడు. 579

— నందాదులు గోవర్ధనమును బూజించుట. —

చ. కనుకనె మీరలుం బ్రథితకాననపంక్తిని సీమలం దదం
తనిచయముం వనాంతముల ధాత్రిధరంబుల భక్తి మీఱఁగా
ననుదిన మర్చలం దనుపుఁ డయ్యవియే వరవృత్తి గాన నిం
ద్రునిఁ బరితృప్తుఁ జేయుటకు నూల్కొన కిత్తఱి భూధ్రయజ్ఞముం. 580

ఉ. అవ్వల గోమహాధ్వరము సర్వవిధిం జరపంగఁ బూనుఁ డీ
యివ్వసుధం శుభంబు గనుఁడీ యమరేంద్రుని గొల్వ నేల? యీ
మవ్వపుగోధనంబు గిరిమండలముల్ దలపోయ దేవతల్
పువ్విలుకానితండ్రిగను బుద్ధిఁ దలంచుచుఁ బూజచేయుఁడీ. 581

సీ. *మంత్రయజ్ఞపరులు మాధ్యదేవతలు సీరమఖపరుల్ కర్షకుల్ మాధవేంద్ర!
గోయజ్ఞనిరతులు గోపాలకులు మనమెల్ల గోపకులుగ నుల్లసిల్లు
వారముకద ధేను పర్వతాశ్రయులమై వర్తిల్లఁగాఁ దగువార మాట
గోవర్ధనాద్రిని బావనవస్తువుల్ గొని పూజచేయుట వినుతిసేయు

తే. టయు మహార్హము మీ రెల్ల నయము మీఱ
మేధ్యపశువుల వధియించి మేదినీధ్ర
యజ్ఞమును జేయుఁడీ సంశయంబు మాని
గోవ్రజంబుల నొకచోటఁ గూర్పుఁ డింక. 582

క. సమయము వృథచేయక సర్వము సిద్ధ మటంచు నమ్మి పర్వతయజ్ఞం
బమలవిధిం జేసి ద్విజో, త్తములం బూజించి భక్ష్యతతులం దృప్తిన్. 583

ఆ. తినుఁడు యాచకులకుఁ దృప్తిసేయుఁడు,హోమ,కృత్య మెల్లఁ దీర్పుఁ డిద్ధభూమి
సురుల భక్తిఁ దన్పుఁ డురుశరత్పుష్పౌఘ,భూషితముల ధేను పూగములను.

క. అలరింపుఁడు పూజనముల, వెలయింపుఁడు, భక్తి నెంతొ విపులంబుగ నీ
పలుకుల నమ్మి చరించినఁ, గలుగును గిరిమైత్రి ధేనుకాండప్రియమున్. 585

క. నే నొనరించెడు మేలును, గానంబడు నవల ననుచుఁ గమలాక్షుఁడు పెం
పూనినగతిఁ బల్కిన విని, యా నందాదులు నితాంత హర్షాత్మకులై. 586

తే. మేలుమేలని వినుతించి రోలిఁ గృష్ణు
వచనముల నెల్ల; నంతటఁ బలికి రిట్లు

* అర్చ్యతాం పూజ్యతాం మేధ్యం పశుం హత్వా విధానతః అనిమూలము.

వత్స! నీవాక్యముల మేలు వఱలు నిజము
భవనుమతి నొనర్పంగ వలయును నను. 587
క. మనముల నెంచితి మఖ్లే, కొనసాగు గిరీంద్రమఖము గోపూజనముల్
దనరఁగ! యని పల్కెను; నం,త నతఁడు గోపకుల కెల్లఁ దద్విషయంబున్.
క. వినిపించె నంత గోపకు, లనూన భక్తిన్ గిరీంద్రు నంతికమును జే
రి నిలిచి దధిపాయసపాయసనకూరాంసంబులను బలిని వరుసగ నిడుచున్. 589
క. తితిసురవర్యుల భక్తిని, శతముల వేలను సుభక్తి స్వాంతము లలరన్
హితవిధిఃజేసిరి ధేను, వ్రతములఁ గ్రై చేసి రెంతొ ప్రమదము తనరన్. 590
క. అంతఁ బ్రదక్షిణముల గిరి, కాంతుని నలరించి వృషభగణముల భూషా
క్రాంతశరీరమ్ములుగా, వింతగ నొనరించి రవియు వేడుక నార్చెన్. 591
తే. వానిఱంకెలు సజలమౌ వారిదంపు
గర్జనముఁ బోలియుండె; నక్కాలమందుఁ
బర్వతము మూర్ధమునఁ జేరి పద్మనాభుఁ
డేనె భూధర మని పల్కె నెంతొ వేడ్క. 592
చ. తనువు ధరించి మీ రిడునితాంతమనోహరషడ్రసాన్వితం
బును దధి భక్తియుక్ వెలయఁ బొల్చెడుదాని భుజించినాఁడ నె
మ్మనమునఁ దృప్తిఁ గాంచితిని మంచిఫలంబులు మీకుఁ గల్గు నా
విని రలగోపకోత్తములు వింతగఁ జూచిరి తన్మహాకృతిన్. 593
క. పరమేశుఁడు తద్భూరిప్, స్ఫురణంబున గోపబాల పూగముతోడన్
గిరిశిఖరంబున నిల్చెను, ధరవర్యము రెండవతన తనువుం బ్రీతిన్. 594
క. అలరుచుఁ బూజించెను ని, మ్ముల నంతర్ధాన మయిందె భూధరపతిచే
లలితవరంబులఁ గొని గో,పులు యజ్ఞముఁ బూర్తిచేసి పురిఁ జేరి రొగిన్. 595

ఎనుబదియవయధ్యాయము.

ఇంద్రుఁడాగ్రహించిగోపకులపై వర్షము గురిపించుట.

చ. తనమఖ మిట్లు కృష్ణనిహతంబయి రూపఱి నాగ్రహించి దే
వనికరసంయుతుం డగుచు వాసవుఁ డేనిచేయ గోకులం
బున నివసించువారు భయమునుం గనువారొ యటంచు నెంచి మే
ఘనిచయ మంత రాఁ బనిచి గాఢరవం బలరార నిట్లనున్. 596
క. ఘనతతి సంవర్తక మే, ఘన విస్తృతకీర్తిఁ గాంచుఁ బో మీ రిపు డే
పనిచేయు నాజ్ఞ నిర్తునో, యని భారం బనక చేయ వలయుం జుండీ. 597
క. నాయానతి విన్నంతనె, యేమనువునసైనఁ జేయుఁడిఁక దాని మహా
మాయాబల మొప్పుఁగదా, చేయందగు దానిమీరు చేకొని కడఁకన్. 598

క. ఇది చేయఁదగునె యనుచ, న్నదగం జేయంగరాదు సరగున మీరీ
యదనున గోకులమును నా, ల్పఁదగుఁగా నంచుండు గోపబాలకయుతుఁడై.

క. మతిదౌష్ట్యంబునఁ బొల్చె ను, సుతుఁడౌ కృష్ణుని ఘనంబు చొప్పున నస్మం
గ్రతుభంగవ్యాజంబున, నతిదుఃఖితుఁ జేసె హేతు వారసి చూడన్. 600

క. తనయార్జవమున గోవులు, ధనమౌటం దానఁ బెద్దదాత యనెడు కీ
ర్తిని గాంచెఁ గావునన్ గో, ధనమును బోకార్పవలయుఁ దగుయత్నమునన్.

క. ఘనవృష్టిపాతమున ధేనునికరమున్ నొంపవలయు నూత్నోత్సాహం
బున నేను వారణోత్తమ, మును విస్తృతి భూధ్రశృంగమునకు సదృశమై. 602

క. తనతనువు గ్రాల నొప్పెడు, ఘనదంతావళము నెక్కి కడుసాయము మీ
కొనరింతు వాయుసంగమ,మున ననుచుం బల్కె దేవముఖ్యుఁ డనుపునన్. 603

ఆ. ఆబలాహకంబు లనిలసాహాయ్యంబున, భయదవృష్టి ధేనుపటలి మీఁద
నొక్కక్షణమునం బె యుర్వియు దిక్కులు, నభ్ర మేకధార నమరునట్లు. 604

క. పెనుగర్జ లమరఁ జేసెను; వనటం గుందుచును ధేనువారము కంపిం
చెను గొన్ని యందుఁ జచ్చెను, మనముల దిగులొంది కొన్ని మ్రాన్పడియుండెన్.

తే. మోము లడ్డముగాఁ ద్రిప్పి మోప మెడలి
వాన దాడికి నోర్వక వత్సగణముఁ
గ్రోడభాగమునన్ నిల్పికొనుచుఁ గొన్ని
నిలిచియుండెను బ్రళయంబు గలిగె ననుచు. 606

సీ. ధేనువు లొకకొన్ని తీవ్రవాహినుల విపత్సలుగాఁ జేయఁ బడియె నొకట
వత్సంబులును దీనవదనంబులై పవనాకంపితగళము లగుచుఁ గృష్ణ!
మమ్ముఁ గాపాడుమూ మానక యంచనువడువున నార్తనిస్వనము లొప్ప
నిలుచుండె; నంత గోపుల మెల్ల గోపికాగోపసంకులమయి గోడుగోడు

తే. మనెడు నార్తరవంబుల నపుడు నిండి, వెక్కసంబుగఁ దోఁచె నావేళఁ గృష్ణుఁ
డార్తి వాపంగ నెంచె నీయార్తికితము,ఖకృత మధ్వరవిఘ్నంబె కారణ మగు.

ఉ. గోకుల మెల్ల నీయెడన కూలెడుదీటిఁగఁ దోఁచుచున్న దీ
యాకులపాటు దీర్ప నగు నందఱఁ గాచుట నాదుకృత్య మీ
పాకవిరోధిపౌరుషము భంగ మొనర్తును భూధరోత్తమం
బీకడఁ దోఁచెడున్ విపులశృంగశతంబులతోడ నెంతయున్ 608

చ. ధరణిధరంబు ప్రస్తరవితానములం దగియున్న దౌట నా
కరముల నెత్తి ఛత్ర మనఁగాఁ దగియుండ ధరించువాఁడ ని
త్తరుణమునందు గోవ్రజము దానిని బైఁగని క్రింద నిల్పి దు
స్తరమగు నాపదం గడచి శర్మము గాంచు నటంచు నెంచుచున్. 609

## గోవర్ధనోద్ధరణము.

క. భూరితర భూధరమ్ము ము, ద్ధారియు నవలీల మోసె నౌరా! యన గం
భీరధ్వను లొప్పఁగఁ గర, సారసమున లాగి ఘూస సదృశముగాఁగన్. 610

చ. కరమున నిల్పి; నంతట నఖండతరార్తిని దీనులైన భీ
తిరతుల గోపసత్తముల దిక్కొకయింతయు లేని బాలురం
దరుణుల నెల్లఁ బిల్చి గురుధాత్రిధరంబును జూపి మీరు ని
ర్భరగురుతాపముల్ చనఁగ వర్షము పోయినదాఁక నిల్వుఁడీ. 611

ఉ. అందఱుఁగూడి వృష్టిభయ మాత్మల వీడి వివాతదేశమం
దిందు యథార్థరీతి వసియింపుఁడు పర్వత మిద్ది గొప్పదా
నిందఱ మిందు నిల్ప నెపుడే భయ మబ్బునొ వీఁడు బాలుఁ డ
ద్రిం దగ నిల్పఁగాఁ గలఁడె క్రిందిజనుల్ భయ మందకుండఁగన్. 612

చ. అనితలపోయ కుండఁదగు నద్రి యిదెంతయు సారహీనమై
కనఁబడు నాకు నిర్భయముగా వసియింపుఁడు దీనిక్రింద నీ
యనిమిషులైన విష్ణుఁ గన నర్హులు గారు చుఁడీ యటన్న కృ
ష్ణుని వచనంబులన్ వినుచుఁ జొచ్చిరి గోవులతోడ నెల్లరున్. 613

తే. ప్రీతివిస్తారితాక్షులై పృథులవృష్టి
బాధ యిసుమంతయును లేక బండ్లనిండ
భాండములఁ గొంచుఁ జొచ్చి రాపర్వతోత్త
మంబు క్రిందను శ్రీహరిమాట నమ్మి. 614

క. ఆసారపీడితులునై, వేసరి దిక్కేది యనుచు విహ్వలమతులౌ
నాసరసిజాక్షు లట వి,శ్వాసము హరియందుఁ గల్గు వారలు గనుకన్. 615

క. హరికరమున నొప్పెడు భూ,ధరమును ఛత్త్రంబుక్రిందఁ దమతనయులతో
స్థిరమతులన్ వసియించిరి, పరమేశ్వరుకరుణ కెన్నఁ బారము కలదే. 616

ఉ. అచ్చెరువంది కృష్ణుకరమందుఁ జెలంగెడు భూధరంబుఁ బెన్
మెచ్చురికల్ దగం గనుచు, నియ్యది ఛత్త్రముపోల్కి నొప్పెఁ జం
చచ్చటుల ప్రతాపమునఁ జంపఁగఁ బూనినయింద్రు వాంఛ యి
ట్లిచ్చట వ్యర్థమయ్యె నని యేత్తెఱఁ బల్కుచు నుండి రందఱున్. 617

చ. మనములు హాయినొందఁ దమమానిను లందఱు తృప్తిఁబొందగో
ధనము మహార్తిఁ బాసి తమదాపున నిల్చి ముదంబు నొంద శ్రీ
శునికరుణావిచేష్టితము చోద్యముగా యని గోపకుల్ తమం
తన నుతియించి రాహరిని దమ్మొగిఁ గాచిన దైవ మంచొగిన్. 618

క. గోపకజనపరినుతుఁడై, యాపర్వతవరము లీల హస్తతలమునం
జూపట్టనిశ్చలాకృతి, నాపట్టుననుండె దివిజు లచ్చెరుపడఁగన్. 619

చ. హరి యిటులుండ మేఘగణమత్తతి సప్తదినంబు లెంతొ భీ
కరగతి నార్చుచుఁ బవనికాయము లెల్లెడఁ బర్వఁజేయుచుఁ
గురిసెను వృష్టి నొక్కగతిఁ గుంభినిపైఁ ద్రిదశేశు నానతిఁ
శిరమునఁ దాల్చి యించుకయుఁ జేడ్పడ కెల్లెడ నావరించుచుఁ. 620

తే. వ్రజము నశియింపఁగా జేయు వాంఛఁ బూను
వృష్టిబాధ యించుకయును గృష్ణుఁ డద్రిఁ
గరమునం దాల్చియుండంగఁ గలుగ దయ్యె
గోకులం బెల్ల సుఖవృద్ధిఁ గూడియుండె. 621

క. హరి కరమునఁ బర్వతమును, ధరియించుట గోకులము యథాసుఖవృద్ధిం
బరఁగుట గని శపథమ్మును, విరహితఫలమౌట నెఱిఁగి విబుధేంద్రుండున్. 622

క. ఘనముల వారించెను; నింద్రునిశపథము చెడుట మబ్బులోఁపమి నభముఁ
గనుఁగొన విమలతరంబై, తనరుట గోకులము తొలివిధంబున వెలసెన్. 623

క. మరలి గృహంబుల గోపకు, లురుముదమునఁ జేరి; రంత నుర్వీధర మా
మురహరుఁడు తొంటిచోటను, స్థిరముగ నుండంగఁ జేసి చింతలఁ బాపెన్.

ఆ. వ్రజనివాసు లెల్ల స్వాంతంబులందు న
చ్చెరువుపడఁగఁ గృష్ణుఁ డురుముదమున,
నలరుచుండె; యత్నములు స్వీయనులు చెడ
హరిని గాన వచ్చె హరిహయుండు. 625

క. వారణవర్యం బగునా, యైరావతగజము నెక్కి యాహరిఁ గాంచెఁ
గోరిక గోవర్ధనగిరి, చేరువఁ దనకోర్కు లెల్ల సిద్ధిం బొందన్. 626

సీ. అతులవీర్యమున గోవ్రతతుల మేపుచు గోపవేషముఁ దాల్చి గోకులమునఁ
దిరుగుచు విశ్వంబు దివ్యమాయాశక్తిఁ గప్పి గోకులబాలకలితుఁ డగుచు
నలరు కృష్ణునిఁ గాంచె నాతనిచెంగటఁ గనఁబడనట్టి యాకార మూని
యున్నట్టి గరుడుని నొగిఁ బక్షములవెంట హరిమూర్ధమునను సూర్యాతపంబు

తే. పడకయుండఁగఁ జేసెడు పరమభక్తుఁ
గాంచె; నంతట నేకాంత మెంచి చూచు
నంతలో నొక్కఁడే యుండె హరి మహేంద్రుఁ
డవతరించి మహీస్థలి కధికభక్తి. 627

క. స్మితపూర్వభాషణంబుల, నతిశయమోదప్రఫుల్లహరి నయన సం
తతి యొప్ప నిట్లు పల్కెను, హతదానవ కృష్ణ కృష్ణ యాదృతి వినుమా. 628

క. నేనేటికి వచ్చితినో, యీనెలవున నన్నుఁ జూడ నిది వేఱుగ నీ
మానసమునఁ జింతింపకు, మోనీరజనేత్ర నీదు నుద్యమ మెల్లన్. 629

క. అరసితి భూభారంబును, హరియింపఁగ నఖిలమునకు నాధారుఁడవై
పరమేశ్వరుఁ డన నొప్పెదు, హరి నీవే పుట్టి తిట్లు హరితనువునన్. 630

తే. ఉత్సవంబును మానుట కొప్ప కేను, జలదములఁ బంప నవ్వి గోసమితి పొడవ
డంగఁ జేయంగ వర్షించె సంగరంబు, జాసఁ గల్లెను; వ్రజము నుద్దామశక్తి.

ఉ. త్రాసము నొందకుండఁ గృపఁ దద్దయుఁ గాచితి నంతె కాక స
ద్భాసురతేజ మొప్ప గిరివర్యము కేల ధరించి గోవ్రజం
బేసరణిం దొలంగకయె యుండ వసింపఁగఁ జేసి తౌర! నే
నీసముదగ్రశక్తికిని నెంతయు మెచ్చితిఁ జూడ వచ్చితిన్. 632

క. నీయీయద్భుతకృత్యం, బేయెడలం గానఁబడ దహీనగుణాఢ్యా!
మాయాకల్పితరూపా, యోయాఁడవనీ దేవతోద్యము మెల్లన్. 633

తే. ఇంక సాధింపఁబడు నంచు నేఁదలంతు, నొక్కకరమున నీభూధరోత్తమంబు
నుద్ధృతం బయ్యె గోతతి యొక్కరీతిఁ, బిల్వఁబడి నీదుప్రాపున నిల్వ నయ్యె 634

క. కారణకారణుఁడవు నీ, కారణమున గోపు లెల్లఁ గనిరి సుఖంబుల్
శ్రీరమణ! గోతతుల్ నను, బ్రేరేపించుటను నిన్నుఁ బ్రీతి దలిర్పన్. 635

తే. ఇప్పు డభిషిక్తుఁ జేసెద నింకమీఁద, నీవు పేంద్రత్వ మొందితి వీమహాభి
షేకమున గోతతీంద్రతఁ జెందవయ్య, పేరు గోవిందుఁడని నీకు వెలయు నింక.

చ. అని వచియించి వాహనమునం దలరారెడు స్వకపురీలస
ద్ఘనతర నిమ్నగా సలిలకాండఘటంబును దెచ్చి శ్రీహరిన్
దన యనుజన్ము దేవపతి తత్పరుఁడై యభిషిక్తుఁ జేసెఁ ద
ద్వనముల నామహంబు గుణవంతముగాఁ దనరారె నెంతయున్. 637

క. ఈవిధి మహంబు సాగఁగ, గోవులు ప్రస్రవసముత్థగుణాయుక్తపయః
పావననదులం బడి కేను, గోపందునిరుదుటఁ బ్రీతి గోత్రఁ జెలఁగుచున్. 638

సీ. అభిషేక మొనరించి యమరేశ్వరుఁడు ధేనుపాక్య చోదితుఁడయి వాసుదేవుఁ
గనుఁగొని ప్రశ్రయంబున నిట్లు పలికె; నో శ్రీకృష్ణ! గోపులు చెప్పుకొనెడు
వచనాళి దీనిని వరుస నాలింపుమా గోవిందుఁ డనుపేర నీవు పిల్వఁ
బడుచు మమ్మేలుమా పరమేశ్వరా యని ప్రార్థించె నిదె ధేనుభావ; మింక

తే. నాదువిన్నపమాలింపు మేదినిపయి
నవతరించితి వీవు భారంబునోద
నార్థ మోదేవ నాయంశ మాత్మ గాఁగఁ
బుట్టినాఁ డొకపురుషుండు పూజ్యమతిని. 639

క. తనుకాంతి నర్జునుం డని, జను లెల్లరు పిల్తు రతనిఁ జక్రధర! నా
తనయుని రక్షింపుము నీ, పనుపునఁ జరియించువాఁడు బాహుబలమునన్. 640

క. భారావతరణకృత్యము, సేయుపునన్ నీవుచేయ నెచ్చెలివై నీ
కారంభమునుండి సహాయీభూతులు గనుకన్ సమస్తవిబుధులం దోడా. 641

క. నీయాత్మవోలె నాసుతుఁ, డాయర్జునుఁ డెన్న నస్త్రుఁ డనవిని మధుహై
తేయారి యిట్లు పల్కెఁ-సు, రోయమరాధీశ! నీమనూహ తెలుఁగుదున్. 642

ఉ. భారతవంశమందు గుణహారుఁడై భవదంశసంభవుం
డై రహించు నర్జునుని నాత్మ నెఱుంగుదుఁ బార్థు నాతనిన్
గారవ మొప్ప నీధరణిఁ గాయు మిదుండెడుదాఁకఁ గాతు నే
వీడుఁడుగాని నాతనిని విక్రమసంపద మీఱలేఁడు సూ. 643

తే. ఈశరీరంబు మేదిని నెసఁగుచుండుక, నర్జునుని యుద్ధరంగంబునందు నోర్వఁ
జాలఁ డెవ్వఁడు కంసరాక్షసుఁ డరిష్టుఁ, డశ్వి కేశియు ననుపీర లవనిఁ గలరు

తే. కువలయాపీడనామకకుంజరంబు, నరకముఖ్యులు భూస్థలి నైజశక్తి
మెఱయుచున్నారు వీరల మించి వేడ్క-, సంహరించెద నామీఁద ద్వాతలమున.

క. పెనుసంగరంబు కాఁగల, దనఘా! దివిజేంద్ర! యమ్మహాహవమున మే
దినిభార మెల్లఁ బోవం,గను జేసెదఁ బుత్త్రుగుఱించి కలఁతఁ గనకుమా. 646

క. నీతనయు నొంచుశత్రువు, భూతలమున నుండఁబోఁడు పొమ్మిఁక దివికిన్
నీతనయుకొఱకుఁ గుంతీ,జాతుల ధర్మాత్మజపవనభవముఖులన్. 647

క. కలహంబున విడుతదే,వాలనుగఁ గుంతికి నొసంగ నూహించితి నాఁ
జెలఁగుచు నాలింగనముఖ,ములఁ గృష్ణుని బ్రీతుఁజేసి మురహరుఁ డనుపన్.

క. ఐరావతనాగేంద్రస,మారూఢుం డగుచు నేగె నాత్మపురికి; శ్రీ
దారుఁడు గోగోపాన్వితుఁ, డై రయమున వ్రజముఁజేర నరిగెం బ్రీతిన్. 649

క. గోకులమున గోపకుమా,రీకమ్రాక్షీప్రభూతరీతి నలరుచున్
బ్రాకటమైతగు వీథిని, శ్రీకృష్ణుఁడు నడిచె గంధసింధురగతిచేన్. 650

## ఎనుబదియొకఁడవయధ్యాయము.

### శరద్వేణుగానవర్ణనము

చ. సురపతి స్వర్గపత్తనము చొచ్చినయంత సుఖంబుఁగూర్చు శ్రీ
హరిఁ గని భూధరోత్తమము హస్తతలంబున నిల్పె నన్న ని
ర్భరతరవిక్రమంబునకు రంజిలుచుండెడు వారలొట నా
దరమున గోపకోత్తములు తథ్యవచస్సులఁ బల్కి రీగతిన్. 651

చ. కరుణ మెయిన్ మహాభయము గ్రమ్మినయమ్ము మహామహీధరో
ద్ధరణమునన్ మహిన్ నిలువ ధన్యులఁగా నొనరించినాఁడ వా
తురమునఁ బాఱు గోసమితిఁ దోరపువేడుక నిర్భయస్థితిన్
బరమకృపన్ మనంగ సదుపాయము పన్నితి వోమహాప్రభూ. 652

క. అనుపమ బాలక్రీడయొ, యనఁదగు గోపాలత యన నర్హ్యం బెటులొ
జనవినుత దివ్యకర్మం,బును జేసెదు నీకు నిదొక భూరితరంబే. 657

చ. జలముల నున్న కాళియుని సత్త్వము దూలఁగఁజేసినాఁడ వు
జ్జ్వలపృథుతేజుఁడై దనుజసత్తముఁడైన ప్రలంబుఁ ద్రుంచి తి
మ్ముల క్షితిభృద్వతంసమును బోల ధరించితి వొక్కకేల నో
జలరుహనేత్ర నీపనులు శంకను గల్గఁగఁజేయు నట్టివొ. 654

క. ఋతమె వచింతుము నీయ,ద్భుతకృత్యములం దలంపఁ దోఁచు నరుఁడవే
క్షితిఁబుట్టిన హరివని య,చ్యుతుపాదము లాన పల్కనోపుదు మిట్టుల్. 655

సీ. దేవతవో లేక దితిజుఁడవో యక్షగంధర్వులందు నొక్కఁడవొ యీవి
చారమేటికి? మాకుఁ జక్కనిబంధువ విదె నమస్కారమ్ము సిద్ధచరిత
సత్స్త్రీకుమారమై చాల దీనంబగు వ్రజముపైఁ గృప నీకు వఱలుఁజుమ్ము
నీవొనర్చినకృతి దేవతలందఱు గూడివచ్చినఁ జేయఁగూడునె? మఱి

తే. బాలుఁడవు వీర్యశాలి వీపట్టణమునఁ, బుట్టుటయొ నీచు మనఁదగు బుద్ధి నెన్న
శంక యొప్పకమాన దోజలజనేత్ర, యనఁగ విని క్షణ మేమియు ననకయుండి.

క. కని ప్రణయకోపమును గ, న్గొనలం బ్రియ మువ్వతిల్ల గోపకులం గ
న్గొని మత్సంబంధమ్మున, మనమున లజ్జింపరేని మాకు యశంబే. 657

ఆ. పొగడఁ దగుదు నేను బొం డీవిచారంబు,
వలన నేమిఫలము గలుగు మీకు
నాపయిం బ్రమోద మేపారునేని నే
ధన్యుఁడను దలంప ధాత్రియందు. 658

క. ప్రియబంధువుపై నునిచెదు, ప్రియమును నాపైన నునుప వేడుకపడుదుర్
బ్రియులార! దేవుఁడను గా, ను యక్షుఁడనుగాను దితితనుజుఁడ నగుదునే.

క. నే మీకు బాంధవుండను, నామీఁదన్ వేఱుగా మనంబున నూహల్
ప్రేమమునఁ జేయకుండుఁడు, నా మాధవుమాటలను వినంగనె గోపుల్. 660

తే. ప్రణయకోపంబుననె యిట్లు పల్కి ననుచుఁ
దలఁచుచుం బోయి రిండ్లకు జలజనయనుఁ
డాదరమున శరత్కాల మమల మగుచుఁ
గానఁబడు టెంచి నిర్మలమౌ నభంబు 661

క. శరదబ్జబింబచంద్రికఁ, బరికించి పరిమళమున భవ్యతమముగాఁ
బరఁగెడు కుముదిని గని త,త్సురుచిరపత్త్రాళి కెంతొ చోద్యము గనుచున్.

క. ఝుంకారంబుల దెసలం, బింకంబునఁ బ్రతిరవంబు వెలయఁ జెలఁగు మీ
నాంకుని దళముల నళిల వి,శంకట వృత్తిం జరింప సంతసపడుచున్. 663

క. వనరాజిఁ బుష్పసంభృత, మనుపమమును నొటఁజూచి హరి గోపికలం

గొని చని మనఃప్రియంబును, గన నెంచెన్; బిదప రాముఁ గాంచి ప్రియమునన్

చ. తనమదినూహలం దెలిపి తత్పరతన్ హలి సమ్మతింప ని
ర్జనయమునాతటంబున విశాలవనంబున నొక్కచోట నె
మ్మనమున కింపుఁ బెంచు మహిమంబున మించెడు సైకతస్థలం
బునఁ దమిఁ గూరుచుండి యొకపోలిక వేణువు నూఁదెఁ జల్లఁగన్. 665

ఉ. వీనులవిందుఁ గూర్చుచును వేడుకఁ జిత్తము పొంగఁజేయు నా
గానము వీనులంబడఁగఁ గ్రన్నన గేహములం ద్యజించి యా
శ్రీనిలయుండు వేణువును జిత్రముగా ధ్వని మించఁజేయు నా
మానిత యామునాసలిలమండిత నిర్మలసైకతస్థలిన్. 666

ఉ. కానఁగఁబోయి రానగరకాంతలు శ్రీహరిఁ జూచువేడ్కతో;
మానిని యోర్తు వారిపదమంజులచిహ్నము లట్టెచూచుచున్
దానును బోయె, వేఱొకనితంబిని శ్రీహరిపాదపంకజ
ధ్యానమునందె చిత్త మిడి యచ్యుతుసన్నిధి కేగె మెల్లనన్. 667

చ. ఒకతుక కృష్ణ కృష్ణ యని యొప్పుగఁ బిల్చుచు లజ్జచేతఁ బా
దకమలమట్టె వాడ హరిదాపున కెట్టులొ పోయె నంతటన్
వికచసరోజనేత్ర మది ప్రేమభరంబున నంధమై తగన్
బ్రకటవిలాససంపదల బాగునెఱుంగక పోయె నెట్టులో. 668

చ. తరణి యొకర్తు కృష్ణుఁ బ్రమదంబునఁ గన్గొనువేడ్క మందిరాం
తరముననుండి పోవ జతనంబును బూని బహిస్థలంబునన్
గురువు కనంబడంగ వగఁగుందుచుఁ దన్మయతం జెలంగి శ్రీ
హరిని నిమీలితాక్షియయి యాత్మఁ గనుంగొనెఁ దృప్తిమీఱఁగన్. 669

చ. ఒకొక్కపద్మనేత్రయును సుద్యమ మొప్పఁగ నేరికేఁ గనం
జిక్కక శ్రీమనోహరునిఁ జిన్మయమూర్తిని గానకోవిదున్
జక్కనిమూర్తిఁ దాల్చియె యొసంగెడుబ్రహ్మముఁ జూడఁబోయి రే
యిక్కలఁ జూచినన్ సుదతులెల్లరు పోయినజాడ కన్పడెన్. 670

క. శరదంబుజవైరి మనోహరయా నారాత్రి గోపికాజ్జాతులతో
మురహరుఁడు రాసకారం,భ రసోత్సుకుఁడై ప్రమోదభరమునఁ గడపెన్ 671

ఉ గోపిక లెల్ల గుంపులుగఁ గూడి రమేశ్వరు చేష్టలందె ని
ష్పాపమతుల్ తగంగ బహుభంగుల వేడుక లందుచుండి;రా
పాపవిదూరుఁ డచ్యుతుఁడు భామినులించుక యే నెఱుంగ న
ల్లెపున నేవనంబునకొ యేగెను శ్రీహరిఁ గాన కవ్వలన్. 672

క బృందావనాంతరంబున, సుందరు లెల్లరును గృష్ణుశుభతమరూపం
బుం దమిఁ గనుఁగొనఁ గోరుచుఁ, బొందుగఁ జరియించిరెన్నొపోకలగుమ్మలై.

మ. హరి పాదద్వయి నిందె యుంచెఁ గనుఁడో యబ్జాక్షులారా యటం
చురుమోదంబున నెల్లెడం దిరిగి యోహో యెందు నున్నాఁడో యే
ధరణిం గ్రుమ్మరువాఁడో యంచు మదులం దాపంబు దీపింప శ్రీ
తరుణీకాంతు విహారవైఖరులచందం బెల్ల నూహించుచున్. 674

తే. వ్యగ్రమనసులఁ దిరిగి రాయమలదివ్య, వనములం దొక్కచోట నేఁగనఁబడమికిఁ
జింతలం గుందుచున్ హరి చేరె నెచటి, కో యనుచు యమునాతీర గుల్మసమితి.

క. కనఁబడునేమో కృష్ణుం, డని వెదకుచుఁ దచ్చరితము నద్భుతమోదం
బునుగూర్చుదానిఁ బాడుచుఁ, గనకాంగులు నిల్చి రందుఁ గంజాక్షుఁ గనన్.

చ. హరిచరితంబుఁ బాడుచు మురారిని జూడఁగఁ గోరుచుండ స
త్వరముగ వచ్చె ఫుల్లముఖవారిరుహుం డఖిలప్రపంచరా
డ్వరుఁడు ప్రపంచపాలనము వారక చేయుకృపాసముద్రుఁ డే
తరుణమునందుఁ గ్లేశమును దా నిడనట్టి పరేశుఁ డాదృతిన్. 677

క. తరుణియొకర్తుక వచ్చెడు, పురుషోత్తముఁ బ్రీతిమీఱఁ బొడఁగని కృష్ణా!
పరమాత్మా కృష్ణా యని, పరిస్ఫుటాబ్జాక్షి యగుచుఁ బలికెం ద్వరఁగన్. 678

చ. వనిత యొకర్తు భ్రూలతికభంగురమై తగ భాలభాగ మా
వనరుహనేత్రునిం గనెడువాంఛను వంచియె దృష్ట్యళిద్వయం
బునను దపస్సు చేయు ముని ముఖ్యునకేఁ గనఘానియట్టి శ్రీ
శునిముఖపంకజాతమును జొక్కుచుఁ బానము చేసెఁ దృప్తిగన్. 679

ఉ. అంగనయోర్తు కృష్ణుఁ బరమాత్ము నిమీలితలోచనాబ్జ యా
చుం గని తచ్ఛరీరమును జొక్కపుభక్తినిజిత్త పీఠికం
బొంగుచు నిల్పి ధ్యానవిధిఁ బూర్ణముగా నొనరించి యోగస
త్సంగము గల్గువానివలెఁ జక్కఁగ నిల్చియె యుండె నత్తఱిన్. 680

చ. హరియును గోపికాంగనల నాదృతి మించెడు భాషణంబులన్
వరుసగఁ గొందఱిన్ మఱియు వారని భ్రూకుటిలప్రకాశసుం
దరతరవీక్షణంబులను దా మఱికొందఱఁ గొందఱిన్ మనో
హరకరపద్మసంగతిని నల్లన నూఱడఁ జేసె నేర్పునన్. 681

చ. వినుతచరిత్రుఁడైన హరి వేడుక మీఱఁగ రాసగోష్ఠులం
దనుపమరూపసద్గుణము లందినగోపిక లెల్ల వెంటనుం
డ నిరతకేళిఁ దేలెను; గడంక నటన్ జలదూర్మికారవం
బును నడపంగఁ జాలు వ్రజభూపతి మంజులనూపురధ్వనుల్. 682

క. సరసీరుహనేత్రల సుం,దరవలయప్రచలనోత్థతతనాదమనో
హరనిస్వనములు సురుచిర, శరత్సమయ గేయగీతి సాధురవంబుల్. 683

క. వరుసగ వృద్ధిం బొందెను, శరదుదితమహోత్సవమ్ము సమయంబున శ్రీ

హరి కుముదకౌముదీభూ,వరుఁ దుహినాంశుని నుతించె వర్ణ్యవిధి మెయిన్.

క. గోపీజన మెల్లను సం,తాపహరుం డగుచు దివ్యధాముఁడు నగు నా
గోపతి వినుతిని నామ,వ్యాపారసుగేయములను వరుసగఁ బాడెన్. 685

ఉ. రామయొకర్తు నాట్యమున రాగసమన్వితగేయకీర్తనో
ద్దామసమాదృతిం దనరి తద్దయు వ్యాకులతన్ జలన్మనో
జ్ఞామలభాసమానవలయస్ఫుటనాదములన్ శ్రమంబు నె
మ్మోమునఁ దోఁప బాహులతఁ బొందుగ శ్రీహరి స్కంధమం దిడెన్. 686

చ. అతివయొకర్తు గీతముల నాదృతిమీఱ నుతించుచుంద మే
వితమునఁ దోఁచు నట్లుగనె విభ్రమమొప్పు మురారిదో కరం
బతులితశక్తిఁ బట్టుకొని యట్టె కవుంగిటఁ జేర్చి చుంబనం
బతిశయమోద మొప్పునటు లత్తఱిఁ జేసెను నేర్పుమీఱఁగన్. 687

ఉ. భీరువొకర్తు గోపకుల వీరుని బాహుయుగంబు భూరిగం
భీర విలాససంపదల పెంపున స్వీయకపోలయుగ్మముం
జేరి కవుంగలించి యతిచిత్రముగాఁ బులకాంకురంబు లిం
పారజనింప స్వేదసలిలాంబుదమూర్తి ధరించె నత్తఱిన్. 688

తే రాసగీతిక గోపికారమణుఁడు తమిఁ,బాడు చున్నంతకాలము పరమనినద
మార!శ్రీకృష్ణ!శ్రీకృష్ణ! యనుచుద్విగుణ,మగుచు వినఁబడఁ బాడిరాయతివలెల్ల

క. వనరుహనేత్రుఁడు నడువఁగఁ, జనుదురు వెనువెంట వలన సరణి నడువ నా
తని కెదురేగుదు రాదృతి, వనితలు హరిఁ గొల్చి రిట్లు వాంఛలు వెలయన్.

క. హరి ప్రతిలోమగతిం జనఁ, దరుణులు ననులోమగతులఁ దార్కొని భక్తిన్
బురుషోత్తము సేవించిరి, స్థిరసేవ్యుం డీతఁ డన్న చిత్తంబులతోన్. 691

చ. మురహరుఁ డిట్లు రాసమున మోదముతో విహరించుచుండఁగాఁ
దరుణులు శ్రీశుసంగతిని దత్సమయంబు క్షణంబుగాఁగ నా
హరిఁ గననట్టికాల మది యల్పమెయైన యుగంబుగాఁ దలం
చిరి; సురనాథుసంగతిని జెందిన చిత్తము లట్టులౌఁగదా. 692

చ. అతివలు రాసమండలమునందు హరిం గను వేడ్కఁ బూని పో
వుతఱిని దండ్రు లన్నలును భూరిముదంబును బెంచునాథులున్
జతనముమీఱఁ బోవలదు సాధుపథం బిదిగా దటన్న శ్రీ
పతిపదసంగతిన్ దగిలి పర్విడి రింతయు భీతి తోఁపమిన్. 693

సీ. *తా నమేయాత్ముఁడై తనరియుఁ గైశోరకవయస్కుఁడౌట నిక్కంపుఁబ్రీతి

* సోపి కైశోరకవయా మానయన్మధుసూదనః, రేమే తాభిరమేయాత్మా క్షపాసు క్షపితాహితః. తద్భర్తృషు తథా తాసు సర్వభూతేషు చేశ్వరః, ఆత్మస్వరూపరూపోఽసౌ వ్యాప్యసర్వమవస్థితః. ర.అ. అనిమూలము.

గలవానివలెఁ గీడుఁ గలుగఁ జేయనిభంగి రాత్రులఁ బుచ్చె నా రాసనటన
గీతకృత్యంబులఁ గృష్ణుఁడు తద్భర్తలందు వారలయందు నఖిలభూత
ములయందుఁదనదైనమూర్తి యాత్మస్వరూపముగాఁగ వ్యాపించి పరఁగుచుంట
తే. దానె యీశ్వరుఁడై యుంటఁ దన్ను నమ్మి
నట్టి వారలు తరియించునట్టి విధులఁ
దానె తెలుపఁగఁ దగియుంట ధరణి జలము
ననలుఁ డనిలుఁడాకాశంబు నన్నియెడల. 694

క. వ్యాపించి సర్వభూత, వ్యాపారము సాగఁజేయు ననువున సర్వ
వ్యాపకుఁడు తానె యాటఁ, గోపికలం బొంగఁజేసెఁ గోర్కు లొసఁగుచున్.

## అరిష్టాసురుని శ్రీహరి వధించుట.

క. ఒకనాఁటిప్రదోషార్థము, సకలేశుఁడు రాసకేళి సంసక్తిని గో
పికలం గూడి నటింపఁగ, వికటమనస్కుం డొకండు విధి పురికొలుపన్. 696

తే. గోకులమునందు నివసించు గోపకులము, నెల్ల భీతిల్లఁ జేయుచు నేగుదెంచె
నాతఁడె యరిష్టనామ విఖ్యాతదనుజుఁ, డెపుడు కంసున కిష్టుఁడై యేపుచూపు.

సీ. సలిలపూర్ణాంబుదసంకాశదేహంబు నతితీక్ష్ణశృంగంబు లర్కలోచ
నములు వెలయుచుండ నైజఖురాపాతమున భూమి వ్రయ్యలుగను నొనర్చు
చును భూరిజిహ్వచేతను బలుమాఱు లోష్ఠములను నాకుచు స్కంధము లతి
కఠినములై యొప్పఁ గదలికాతుల్యలాంగూల ముదగ్రకకుదమును దగి

ఆ. యుండఁగాఁ బ్రమాణయుతిని మించినదేహ,మలరుచుండ మూత్రమలసమన్వి
తమగు తోఁక చూడఁ దగకయుండఁగ ధేను, తతికి మిగుల భీతి దగులఁజెలఁగ,

క. క్రిందికి జాఱిన కంఠం,బుం దగఁ దరుఘాతచిహ్నముల మోము భయం
బొందఁగఁ జేసెడు నట్లుగఁ, గందోయికిఁ దోఁప ధేనుగర్భములు పడన్. 699

తే. వృషభరూపంబు ధరియించి విషమబుద్ధి,యొప్పుచుండంగ దానవుఁడుగ్రమూర్తి
యగుచు నెల్లరఁ జంపుచు నటవిఁ దిరుగు,నయ్యరిష్టాసురుఁడు వచ్చె హరిని జంప.

మ. అతిఘోరాకృతి వచ్చు నయ్యసురు భీమాటోపునిం గాంచి గో
పతతుల్ భీతిలి రక్షై యంగనలు దుర్వ్యాపారపారీణు ను
ద్ధతుఁ గన్నంతనె ప్రాణముల్ తొలఁగుచందంబైనఁ గుయ్యో యటం
చతిదీనాననలౌచుఁ గృష్ణ! మురనామాదిత్యవైర్యంతకా. 701

చ. శరణము గోరువారల విశాలకృపం బరిరక్షసేయు నో
హరి మధుసూదనా యనుచు నందఱు వెల్లున నేడ్చి; రంత శ్రీ
వరుఁడు మృగేంద్రనాదమును బర్వఁగఁజేయుచు దోస్తలధ్వనుల్
సురరిపుశ్రోత్రముల్ చొరఁగఁ జోద్యముగా నొనరించె వేడుకన్. 702

ఉ. ఆనినదంబు శ్రోత్రయుగళాంతరసీమఁ జొరంగ భీతిక్రు
ద్ధానవుఁ డచ్యుతాభిముఖతన్ వెసఁ బాఱెను దీక్ష్ణశృంగముల్
శ్రీనిధి కుక్షినిం బొడువ సిద్ధముగాఁ దగియుండ దృష్టి వై
శ్వానరకీలలం గురియ సత్వర మేగె దురాత్ముఁ డాటచేన్. 703

తే. వృషభరూపంబు ధరియించి విక్రమించి
తన్నుఁ బొలియింప నెంచి యద్దానవుండు
పరుగువాఱుట చింతించి పద్మనయనుఁ
డతని బల మెన్ని వధియింప నాత్మ నెంచి. 704

ఉ. తా నిలుచున్నయాధరణి దాపున నైనఁబదంబుఁ బెట్టఁగాఁ
బూనక యే యవజ్ఞఁ దనబుద్ధి నెఱింగెడుఁగాక వైరియం
చానిఖిలాత్ముఁ డాస్యమునయందు స్మితంబు గనంగఁజేయ నా
దానవుఁ డుద్ధతిం జెలఁగి దాపునుజేరఁగ వచ్చినంతనే. 705

క. మకరము చెంతకుఁ జేరిన, సకలపదార్థములఁ గొనెడుచందంబున దో
షకలితు నరిష్టునిం బ, ట్టుకొనెన్ జానువుల నే కడుంగడుఁ గ్రుధచేన్. 706

ఆ. వానికుక్షియందుఁ బటుశక్తిమైఁ దన్నె, నంతవాఁడు దర్ప మడర శృంగ,
యుగముఁ బూన్కినొడ్డి యుద్ధతిఁ బొడువ రా, దానిఁ బట్టుకొనియె దానవారి.

క. దనుజుని మస్తకమును గళ, మును బీడించుచును వస్త్రమును బ్రాచీనం
బును జించుకరణిఁ జీల్చెను, వనజాక్షుం డంత శృంగవరముం బెలుచన్. 708

క. కరమున లాగుచు దాననె, యురుబలమున మోఁదె దాన నుగ్రాసురుఁ డా
తరుణమున రక్తధారలు, దొరఁగన్ మృతినొందె మ్రోగెఁ దూర్యములు దివిన్.

చ. సురవరు లాయరిష్టదనుజుండు మృతింగనె నంచు సంస్తుతిం
చిరి హరి; వృత్రదానవుని జిష్ణుఁడు ద్రుంచిననాఁడువోలె న
చ్చరలు భయంబు వాసె నిఁక క్ష్మాస్థలి నెల్లెడ హాయిమీఱఁగాఁ
దిరుగఁగ వచ్చునంచుఁ దమితీఱఁగ నాడిరి పాడి రెంతయున్. 710

## ఎనుబదిరెండవయధ్యాయము.

కంసుఁడు ధనుర్యాగము చేయం బూనుట.

సీ. అట్టు లరిష్టమహాసురుం డీల్గుట ధేనుకాసురుఁడు మృతిం గనుటయు,
నల్లె ప్రలంబాఖ్యుఁ డంతమొందుటయును గోవర్ధనాఖ్యమహా క్షోణిధరము
పటుశక్తి నెత్తఁగాఁ బడుటయుఁ గాళీయు మద మడంచుటయును క్ష్మారుహద్వ
యము మహోన్నతరూపమయ్యుఁ గూలఁగఁ ద్రోయఁబడుటయుఁ బూతన ప్రాణ
తే. బాయుటయు శకటాఖ్యుఁడు భగ్నతను గ [ములను
నుటయు నీమొదలయిన పనులు జరగుట

కంసునకుఁ జెప్పె జరగిన కరణియెల్లఁ
బూసగ్రుచ్చినవిధమునఁ బొదలు వేడ్క. 715

క. అరసి యశోదాదేవకు, లిరువురు నొండొరుల గర్భమెట్లో విధిచేఁ
బరివర్తన మొందుటఁ గాంచిరి దుహితఁ గుమారకు నని చెప్పెఁగామునియున్

చ. సురముని యిట్లు కంసుఁ డెదఁ జోద్యము శోకముఁ గాంచునట్టిదా
కరణి నెఱుంగఁజెప్పిన నికామము చింతిలి దేవమౌని యా
దరమున నీరహస్యములఁ దప్పక చెప్పె నటంచునమ్మి సో
దరిపతిపైన నాగ్రహము దారుణరీతిని బెంచె నెమ్మదిన్. 713

తే. దుఱమతియాట వసుదేవు దోష మిద్ది, యెల్ల ననుచును సభలోన నుల్లసంబు
లాడి యాదవవీరుల నవమతిగనఁ, జేసి యోజించె నింకేమి చేయుదు నని. 714

క. బలభద్రుఁడు కృష్ణుఁడు దో, ర్బలముల వెలయక యున్న బాలుర వీరిన్
బొలియించు టుచిత మని యి, మ్ముల నెంచుచు మఱియు నిట్లు భూపతి తలఁచెన్.

క. సోదరులు వీర లిర్వురు, మేదినిపై రూపబలసమృద్ధి లెసఁగ స
మ్మోదమున నున్న గెల్వం, గాఁదరమే యేరికైనఁ గాన నడఁప నౌ. 716

సీ. చాణూరముష్టికుల్ సాంద్రబలాఢ్యులు మల్లయుద్ధంబున మహిమ నసములు
గావున వీరిచేఁ గడుబాలకుల రామకృష్ణులఁ జంపించుకృత్య మేను
జేసెద నది యెట్లు సిద్ధించు నన్నచో మాన్యధనుర్యాగమహము పేర
వారల రప్పించువాఁడ గోకులమునుండి యంచని మది నొప్పునట్టు

తే. లెంచి యేవిధినైనను మృతిని వారు, గాంచునట్లుగఁ గృత్యంబు కడఁగి చేయఁ
జనునటంచు మనంబున సకలవిధము, లను దలంచెను దుష్టుఁడౌటను నతండు.

క. ఈరీతి మదిఁ దలంచుచు, వీరుని నక్రూరు మిత్రుఁ బిలిపించి హలిన్
శౌరిని బిలువఁగ బంపుట, నారదుమత మంచుఁ దలఁచి నయవిధి మెఱయన్.

తే. సఖుని నక్రూరుఁ బిలిపించి సాధుభణితిఁ
బలికె నిట్లని యోదానపతి మహాత్మ !
నాదుసంప్రీతికొఱకు వినంగ నగును
గార్య మొక్కఁడు వినఁ జేయఁగాఁ దగుఁజుము. 719

చ. అరదమునెక్కి గోకులము నల్లనఁ జొచ్చి రమేశు నంశ మీ
ధరణిని రెండురూపములఁ దాల్చిన దంచు జనుల్ నుతింప భీ
కరబలయుక్తులై వరుసఁ గ్రాలెడు నవ్వసుదేవపుత్త్రు లి
ర్వురు గల రంచు వింటిఁ గడు రూఢపరాక్రమ మొప్ప నా సుతుల్. 720

క. అరులైననుఁ జంపెదు నా, తఱమున వర్ధిల్లునట్లు తోఁచెడుఁ జుమ్మ
ధ్వరము ధనుర్మహ మనునది, జరగుఁ జతుర్దశిని వేడ్క సాగింప నగున్. 721

సీ ఆవేడుకలయందు నందఱు చూడంగ మలయుద్ధము సాగు గొల్లవారి

నిర్వైరఁ ద్రోడ్రోఁకిని యేతెమ్ము తద్యుద్ధమును వారు చేయంగఁ బూనువారు
చాణూరముష్టికుల్ సత్త్వసమగ్రులు మల్లులిద్దఱు నాకు నుల్లసంబుఁ
గూర్చువారలు గలరోర్చి వారిని గెల్చువారు ధరాస్థలి లేరు సుమ్ము
తే. బాలకులు వారితోడ నీబవర మేచి
యొనరుపఁగ నెల్లసభ్యు లోహో యటంచుఁ
జూచువారలు మఱియును శుంభదమల
సత్త్వయుక్తము గల దొక సామజంబు. 722
తే. కువలయాపీడ మనఁగ నాకుంజరోత్తముఁడుమహామాత్రసంచోదితము ననుపమ
మదియు నాపాపచిత్తుల వెదకి చంపఁగలదు వసుదేవసుతు లని తెలిసినంత.
క. ఈరీతివారు పొలియఁగ, శూరుఁ వసుదేవు గోపశూరుని నందున్
నే రణమున వధియించెద, నారయ దుష్టాత్ముఁ దండ్రి నల్లె వధింతున్. 724
ఆ. ఇట్టు లుగ్రసేను నెట్టనవధియించి,యవల గోపకుల మహోగ్రరీతిఁ
బోలుచు ధేనుధనము నెలమిఁగైకొను వాఁడ,నన్నుఁ జంపఁబూను నెన్ని మదిని.
క. నిను వదలిన యాదవు లెల్లను నాకుం బగతు రగు టిలాస్థలి జను లె
ల్లను దెలియుదు రక్రూరా, జను లెవ్వ రహితులో వారిఁ జంపుజతనమున్.
క. ఒనరించెద నిష్కంటక, మనఁదగి యాదవవిహీనమయి నా రాజ్యం
బనుదినము వెలయునదిగాఁ, గనుపట్టం దగును నాదుకాంక్షయు నిదియే. 727
క. కావున మత్ప్రీత్యర్థం, బీ వేగఁగవలయు యాగ మిది చక్కంగా
భూవినుతిఁ గాంచునో యటు, నీవే చేయంగవలయు నిర్మలచిత్తా. 728
సీ. మాహిషంబగు సర్పి మంచిదధియుఁ బాలుఁ గైకొని యాదవుల్ కదలివచ్చు
నట్టు లాజ్ఞాపింపు మని యానతీయంగఁ గంసునియాజ్ఞను గడు ముదంబు
మీఱఁగాఁ దలఁదాల్చి మిక్కిలిపుణ్యాత్ముఁడను గృష్ణు దర్శింపఁగను గలిగితి
నాజని సఫలంబె నావంశ మున్నతఖ్యాతిఁ గాంచినయదె కద యటంచుఁ
తే. బరమభాగవతుండయి పరఁగు నతఁడు, చనియె నింటికి నీపంపు సత్వరంబ
చేయువాఁడ నటంచు నిశ్చింతమీఱ, నంత రథమెక్కి వ్రజమున కరిగె వేడ్క.

కేశిదైత్యుఁడు బృందావనమునకరుగుట.

క. కంసునిపనుపునఁ గృష్ణుని, హింసింపఁగఁ గేశిదైత్యుఁ డేపున జగముల్
హింసింపఁజాలు శ్రీహరి, సంసారిగ నమ్మి చనియె సత్త్వముపొదలన్. 730
చ. కరుణ దొరంగి బాలకుని గాలునిపీటికిఁ బంపి రమ్ము స
త్వరముగ నంచుఁ గంసనృపవర్యుఁడు పంపఁగ నల్లె యంచు భీ
కరహయరూపధారియయి గాఢఖురక్షత భూమిపృష్ఠుఁడై
ఖరకరశీతభానువులఁ గంపితదేహులఁగా నొనర్చుచున్. 731

తే. సటలయుబ్బిన నీరదసంఘ మట్టె, చెదరి పోవఁగఁ జేయుచు శ్రీహరి దగు
నట్టి బృందావనముచేర నరిగె; దాని, హేషితధ్వని నాలించి యేమి దనుచు.

క. పరికించి దానవుఁడె యిక్కరణిన్ జనుదెంచె ననుచు గాఢభయమునన్
దరుణులు పురుషులు భీతిలి, శరణము శ్రీకృష్ణుఁ డనుచు సరభస మొప్పన్. 733

క. హరి చక్కిఁ జేరి ప్రార్థించిరి కావుము కావు మనుచు శ్రీకృష్ణుఁడు గో
పరమణుల యార్తరవములఁ, గరుణం బరికించి మేఘగర్జన మనఁగన్. 736

క. వినఁబడు నినదంబున ని, ట్లని పల్కెను జాలుఁ జాలు నార్తిగనుట యీ
దనుజుని కేశిని గని భీ, తిని బొందఁగనేల మీమతిప్రతిభ చెడన్. 735

క. యాదవవీరుల ధైర్యము, మేదినిపై నింకమీఁద మించదొ యల్పం
బీదనుజుబలము హేషా, నాదము విని నంత మీమనంబులు వడఁకెన్. 736

క. దనుజుల బల మధికంబని, మనమున యోజించి హయముమాడ్కి నిటకు వ
చ్చినవాఁడు దుష్టమతిచే, నని వారలభీతిఁ బాపి యాతని కెదురై. 737

క. రారమ్ము దుష్ట! కేశీ, శూరుండవు నీవు మున్ను సూర్యదశనముల్
ధీరత శంభుఁడు రాల్చిన, తీరున నిను భూమిమీఁదఁ ద్రెళ్లనొనరుతున్. 738

ఆ. నోటిపండ్లు రాల నూత్నవిక్రమమునఁ, జేయువాఁడ ననుచుఁ జెప్పుచు హరి
కేశి కెదురుపోయెఁ గేశియు వివృతాస్యుఁ, డగుచుఁ గృష్ణుఁ జేర నరుగుదెంచె.

చ. హరియును బాహు వట్టి పొడవై కనుపట్టఁగఁజేసి యాస్యగ
హ్వరమును దూఱఁ జేసెఁ; గఠినాత్మత నొప్పు హయంబు శ్రీశు బా
హుకరతిని భగ్నదంతముగ నొప్పెను వాయుసమాహతిన్ భయం
కరగతి శ్వేతనీరద నికాయలవంబులు తూలుచాడ్పునన్. 740

క. దనుజుని దేహముఁ జొచ్చిన, వనజాక్షుని బాహు వట్టి వర్ధిల్లె మృతిం
గనఁజేయు వ్యాధి యాప్తులు, గని యూరకయుండఁ బెరుగు కరణిం బెలుచన్.

ఆ. పెరిగి యోష్ఠయుగము భేదించె నంతట, ఫేనయుక్తరుధిర మానిశాచ
రేశుఁ డట్టె గ్రక్కి యేపుదూలఁగఁ బెద, వులను దెఱచి పడియె నిలను వగను.

క. చరణమ్ముల ధరఁ దన్నుచుఁ, బురీషమూత్రముల నట్టె భూమి విడుచుచున్
బరిఖేదమ్మున స్వేదం, బురుగతి మై నిండఁ గప్ప నూహాలు చెడఁగన్. 743

ఆ. వ్యాదితాస్యుఁ డగుచు భయదశరీరుఁడై, కరము తనువు రెండుగాఁగఁ జీల్పఁ
బిడుగుపడిన తరువు నడవున మృతి నందెఁ, జూచు వారలెల్లఁ జోద్య మంద.

వ. ద్విపాదపృష్ఠ పుచ్ఛార్ధశ్రవణే కాక్షీనాసికములై కేశిదానవు దేహశకలములు
రెండు ధరాతలంబునఁ గనుపట్టె నంత. 745

చ. దనుజుని కేశిఁ జంపి వ్రజధామము భీతి దొలంగి చక్కఁగాఁ
దనరఁగఁ జేసి గోపసముదాయముఁ గూడి శ్రమం బొకింత యే

మనమునన్నైన లేక స్మితమండితవక్త్రముతోడ నందె యుం
డెను హయరూపదైత్యపతి నీల్గిన గోపులు గోపికామణుల్. 746
తే. విస్మితస్వాంతములతోడ వెలసి పుండరీకనయనుని ననురాగరీతు లలర
వినుతి సల్పిరి; నారదమునివరుండు, జలదమార్గమునుండి యాయిలకు దిగియె.
క. పరిమితము లేని హర్షము, పురికొలుపఁగ వచ్చెఁ గృష్ణమూర్తియుఁ గేశిన్
బోరిపుచ్చఁగ సురహితముగఁ, బరమాదృతిఁ బలికె లోకపాలక! దేవా. 748
చ. సురభయదుండు కేశి దనుసూనుఁడు వాని విలాస మొప్పఁగా
మరణము నొందఁజేసితివి మాటలు పెక్కఁక నేల? దుష్టుఁ డా
శరుఁడు సురాలయంబునకు సాధువు వోలెఁ జనంగఁజాలె నీ
వరుసఁగ సాధుకర్మములు వారిజనేత్ర! యొనర్చి తీజనిన్. 749
క. ఈయద్భుతకర్మంబుల, నీయత్నులఁ గాంచి చాలఁ దృప్తిఁ గనితి నా
రాయణ తురంగమాస్యున, కా యింద్రప్రముఖు లెల్ల నానతులుసుమీ. 750
క. ధుతకేసరజాలుం డయి, క్షితినుండియు దివికిదృష్టిఁ జేర్చిన నింద్రుం
డతిభీతిఁ జెందుచుండును, జ్యోతిరహితా! వానిఁ జంపి తుద్యము మలరన్. 751
క. కనుకన్ గేశవుఁడని మే,దిని ఖ్యాతిం గాంచు మీవు దివ్యపురుష! నీ
కనుపమమంగళ మగు నిన్,గనువాఁడం గంస యుద్ధకాలమునందున్. 752
క. మూఁడవదినమున మథురం, జూడం గలవాఁడ సానుజుండగు కంసుం
డోడి మృతింగనఁ దత్కృతిఁ, జూడఁగ నాకన్ను లలరుఁజుము శ్రీరమణా 753
క. అవనీభారముఁ దీర్పఁగ, నవతారము గంటి వీవు హరివి విభూ! యీ
యవనిం బెక్కురణంబులు, చవిచూపును భూపతులకు శౌర్యస్ఫూర్తిన్. 754
చ. అరిజనమర్దనా! బహువిధాహవముల్ కొనసాగఁ జేయ నీ
వురుతరయత్నతత్పరత నుండఁగ నేనుఁ గనుంగొనం దగున్;
సురగణకార్య మీయదియు శుంభదవక్రభవత్పరాక్రమ
స్ఫురణమునన్ ఫలించె నిట శూరశిఖామణి వీవె శ్రీహరీ. 755
క. నీచేతఁ బూజఁ గొంటిని, వే చనియెద స్వర్గమునకు విశ్వవినుతమై
నీచాతుర్యము వెలసెడు, నీచుల నిమ్మెయి వధింపు నీకు శుభంబౌ. 756
చ అని కొనియాడి నారదమహాముని స్వేచ్ఛఁ జనంగ గోపికా
జననయనప్రమోదకరసంహననుం డయి గోపబాలకుల్
తనుఁ గొలువంగ విస్మయయుతంబుగ నొప్పని చిత్త మొప్ప నం
దునితనయుండు సేవకులతో వడిఁ జేరెను గోకులం బొగిన్. 357

## ఎనుబదిమూఁడవ యధ్యాయము.

అక్రూరుఁడు గోకులమున శ్రీకృష్ణు దర్శించుట.

చ. జనపతియాజ్ఞ నొంది రథసత్తమ మెక్కి జవంబుమీఱఁగాఁ

జనునరదంబు నెంచి మది సంతస మట్టులె పొంగిపాఱఁగా
వనరుహనేత్రు దర్శనసుభాగ్యము గల్గెను నింక నేమి యీ
జనికిఁ గొఱంత యంచు నిజసద్మము వీడి చనెం గృతార్థుఁడై. 758

తే. చనుచు నక్రూరుఁ డిటెంచె స్వాంతమందు
ధన్యతముఁడను నేనె యీధాత్రియందు
నవతరించిన చక్రియాస్యంబు నేఁడు
గనుఁగొనం గలవాఁడఁ గావున సుకృతిని. 759

క. జని ఫలియించెఁ ద్రియామయు, ననువొందఁగ సుప్రభాత యనఁ జెల్లును నే
నును విష్ణుని స్ఫుటపద్మదళనిభాక్షియుతాస్యమును విలాసము మీఱన్. 760

క. పరికింపఁ గలనుగాదే; పురుషుల పాపము లడంగుఁబో యెవ్వని సం
స్మరణంబున నల శ్రీపతి, సరసిజనేత్రునిని జూడఁజాలుదు నహహా. 761

క. శ్రుతులు తదంగంబులు సంహితలును లోనైన విద్య లేముఖమునసుం
డి తగఁ వెలువడునో స్మృతి నా శ్రీకృష్ణుఁ జూచుమహిమముఁ గంటిన్. 762

క. నిరుపమధామం బది ని, ర్జరులకు నట్టిమోముఁ జక్కం జూడన్
బరికింపఁ గల్గె నేఁటికిఁ దరమే నాపుణ్య మెన్న ధాత్రి నెవనికిన్. 763

క. పురుషోత్తముఁ డెవ్వం డధ్వరములఁ బూరుషులచేతఁ దా మఖపురుషుం
డురుమహిముఁడనఁగ విధియుతిఁ,బరిపూజితుఁడగునొ యట్టిభవ్యాత్ము హరిన్.

క సకలాధారు జగత్పతి, సకలాపద్ధరణుఁ జూడఁజాలితి; నింద్రుం
డకలుషమతి హయమేధ, ప్రకరంబున నెవనిఁ గొల్చి పడసె నమరతన్. 765

తే. అట్టియచ్యుతు నజుని నే, నమలపుణ్యావశమునం జూడఁగల్గితి; బ్రహ్మరుద్ర
శక్రభాస్కరముఖ్యు లేచక్రిరూప, మెఱుఁగఁ జాలరొ యట్టి సర్వేశు హరిని.

సీ. కాంచఁజాలితి; నెల్లకడలఁ దానుండుచు సర్వభూతాంతరస్థాయి యగుచు
సర్వాత్ముఁడయి వ్యాపి సర్వవిభుండు సత్తామాత్రుఁ డని జనుల్ తన్నుఁ బొగడ
మత్స్యకూర్మవరాహమనుజసింహాద్యాకృతులఁ బూని వెలయుచు ఖలులఁ జంపు
చును యోగులకు యోగమును దానెయగుచును నరుదుగ వర్తించు హరిని గనఁగఁ

తే. గల్గె నాభాగ్య మెన్నఁగాఁ గలనె; లోక
పాలకుండయ్యు వ్రజమున భవ్యకార్య
మును ఫలింపఁగఁ జేయఁగ మనుజతఁ గని
వాంఛితాంగము దాల్చిన వాసుదేవు. 767

క. కనుదమ్ములు ఫలియింపఁగఁ, గనఁజాలితి; నెవఁ డనంతగాత్రమ్మున మే
దిని దాల్చె శిఖరముననుం,డిన యట్టులు నేర్పుదగఁ గడిందిమగటిమిన్. 768

క. అతఁ డవతరించె భూమిని, జతనమున న్నన్నుఁ బిల్చి సరసవచనసం
తతిచే నక్రూరా! సమ్మతిరమ్మని పిల్వఁగలఁడు మాటలిఁకేలా. 769

చ. జనని యటంచుఁ దండ్రియని సాధుసఖుండని భ్రాత మామ యం
చను నిజమాయనుండియె బయల్పడఁజాలక మోహితాత్ములై
జనులు భవార్ణవంబునసె సంతతముం బడియుండువారొ యీ
శుని సకలాత్ము నాహరిని జూతును మ్రొక్కుదు సన్నుతింతుఁగా 770
క. ఏవాసుదేవు మనమున, నావహిలం జేయ వితతమగునజ్ఞానం
బావిష్కృత తత్సన్నిధిఁ, బోవుఁగ దూరముగ భీతిఁ బొగులుచు నపుడే. 771
ఆ. అట్టియోగమాయ కధిపతియై విశ్వ,మూర్తి యగుచు నున్నమురహరునకు
వందనము లొనర్తు భక్తిభరంబునఁ, దలనువంచి మది హితముగఁ జేసి. 772
సీ. యజ్వవితతులచే యజ్ఞపూరుషుఁడని శాశ్వతసమితిచే సాధువాసు
దేవుఁ డంచునుమతీ పావనమతులగు వేదాంతవిదులచే విష్ణువనియు
దలఁపంగఁ బడుచు నుత్తమపూరుషుండగు పరమేశునకు నమస్కరణ మొప్పఁ
జేయుదు; జగములఁ బాయక ధరియించు చక్రియందొగి సదసత్త్వ మెల్ల
ఆ. సంప్రతిష్ఠిత మగు శౌరి యాతఁడు నాకు
సౌమ్యరూపమున నెసంగి దర్శ
నము నొసంగుఁగాక నారాయణస్మృతి
సకలశుభములను నొసంగఁ జాలు. 773
క. పురుషార్థ మొసఁగఁజాలును, హరి నాపరమాత్ము నిరుపమాకారుని నే
శరణము నొందుదు ననుచుం, బరిపరి యోజించుకొనుచుఁ బయనము చేసెన్.
క. అతిభక్తి నమ్రకంధరు, డతిశయసుగుణుండు నైన యక్రూరుం డ
వ్వితమునఁ బయనము సాగించి తగన్ రవి యస్తగిరికిఁ జేరునదనునన్. 775
ఆ. గోకులంబుఁ జేరి గోదోహనమునందు, వత్సమునకు నడుమఁ బ్రస్ఫుటోత్ప
లదళకాంతియుక్త లలితదేహుని ఫుల్ల, పద్మనయను భక్తపాలనరతు. 776
క. శ్రీవత్సాంకితవక్షుని, భావిలసిత లంబమాన బాహు మహాత్మున్
బావనసుస్మిత మధురో,ష్ఠావిష్కృత దివ్యవచను నాదిరహితునిన్. 777
సీ. తామరసాక్షు నుత్తమతుంగరక్తనఖరుఁ బాదయుగమున క్షమను నిలిచి
యున్న నారాయణు సన్నుతకాంచన వస్త్రయుగ్మమ్మును వాంఛమీరఁ
దాల్చి యున్నట్టి యుత్తమబాలకుని వన్యపింఛవిభూషితుఁ బీనవక్షు
శ్వేతారవిందమ్ముఁ జే ధరించినవాని నీలలతాహస్తు నిర్మలాంగుఁ
తే. గనియె; హంసేందుకుందాభకమ్ర దేహు, నీలవస్త్రధరున్ హలి భాలభాగ
లలితునిన్ హరిసన్నిధి నిలిచియున్న, వానిఁ గాంచెను గన్నుల వాంఛ దీఱ.
క. తను వుచ్ఛ్రియముగ నొప్పఁగ, ఘనమాలాపరివృత మగుకైలాసధరం
బన నొప్పెడు బలరామునిఁ, గనుఁగొని యానందబాష్పకలితాక్షుండై. 779
క. వారల నిర్వురఁగని య,క్రూరుఁడు పులకాంకురములు కోమలతనువున్

గోరికఁ గప్పఁగ నపు డక్రూరుఁడె యై యంతరాత్మఁ గుతుకము పొంగన్. 780

క. పరమంబగు ధామం బిదె, పరమపదం బిదియె చూడ వర్ణింపఁగ సుం
దరవాసుదేవరూపం, బరయఁగ రెండుగను దోఁచె నౌరా! కంటిన్. 781

క. బలరామకృష్ణు లనఁగా, విలసిలు వీర లెసమస్తవిశ్వాత్ములు వీ
రలు గాని దెద్ది లేదిఁక, దలపోయఁగ వీరిఁ గనుట ధన్యుఁడ నైతిన్.

ఆ. సృష్టికర్తయగుచుఁ జెలఁగు శ్రీకృష్ణరూపమును గంటి నేత్రఫలము గలిగె
నొక్కమాటె యిద్ది యుత్తమహరిసంగమునకుఁ బాత్రభూతముగఁ జెలఁగిన.

క. ఫలియింపఁ దగినకాలము, చెలఁగె నటం చెంచువాఁడ శ్రీహరి మేనున్
విలసిల్లు నాదు కరయుగ, జలజము స్పృశియించు నేని సత్కార్య మగున్.

క. వారిపాదాంగుళి సంస్పర్శరహితపాపులయి సిద్ధ రాజత్పదమున్
బరమమును బొందఁజాలుదు, రరయంగాఁ బుణ్యపురుషు లన నవ్వారే. 785

సీ. పరమమిత్రుండనై బాంధవుండనునయి యన్యదైవము లేని యట్టి నన్ను
నిరుపమబాహువుల్ నిండు ప్రీతిని జాఁచి యాలింగనము చేయ హరి దలంచె
నేని తీర్థంబుగ మానసమును జేయువాఁడ నద్దాన నాబంధనములు
కర్మాత్మకములు తెగంగ పోయిగనుండుఁ బ్రణతుండనై కరాబ్జములు చేర్చి

తే. తనువుఁ దాఁకుచునున్న నన్నని ప్రియమున
నోయి యక్రూర యని పిల్చునే యనంతుఁ
డట్టులేయైన జనిఁ గన్నయట్టి మేము
సిద్ధసంకల్పులమె యయి చెలఁగఁగలము 786

క. కనిపల్కరింప కున్నను, జని యది నీ యనఁగ జెల్లుఁ జక్రికరస్ప
ర్శనమున ధన్యము గానిది, తనువే యది కాల్పనే హుతవహునియందున్.

చ. పరమశుభప్రదాత యగు పంకజనేత్రున కెన్న మిత్రుఁ డొ
క్కరుఁడును లేఁడు బంధువును గానఁబడం డొకఁడైన లోకమం
దరియును లేఁడు ప్రీతికిని నర్హుఁడుగాని జనుండు లేఁడ దే
వరుప నుపేక్ష్యుఁ డంచుఁ దగువాఁడును లేఁడిది నిక్కమే కదా. 788

క. ఐనను భక్తులఁ బ్రోవంగా నాదృతిఁ గాంచుచుండుఁ గల్పద్రుమ మె
ట్లూనినకృప నాశ్రితులను, దా నెప్పుడు గాచు నిష్టదానము చేతన్. 789

క. ఆరీతిం బరమేశుం, డారసి భక్తాళిఁ బ్రోచు హరిచక్రము దే
వారులఁ జంపిన వారల, నారీమణు లడల నదితినందను లంతన్. 790

తే. భక్తులకు నెల్లవాంఛల శక్తికొలఁది
నిచ్చుచుండురు శ్రీహరికృప గలిగిన
మున్ను బలిచక్రవర్తి, యాపుండరీక
నయను కరతలమునయందుఁ బయసు నునిచి. 791

చ. ధరణితలస్థితిం గని యుదారమనోహరభోగసంతతుల్
హారికరుణాతిరేకమున నల్లనఁ బొందెఁ; ద్రిలోకరాజ్యముల్
హరిహయుఁ డారమేశుకృప నద్భుతరీతిగ శాశ్వతంబుగా
సురపతితం గనం గలిగెఁ జోద్యమె శ్రీపతి ప్రీతిఁ గల్గినన్. 792

క. ఐన నదోఘుఁడ నగు నను, మానవపతియైన కంసు మన్ననఁ గనె నం
చూనినక్రుధ మది నెంచునొ, సీ! నరపతి కరుణ యేమి చేయుదు నింకన్.

తే. సాధుమతుల తిరస్కృతిఁ జక్కఁ గనిన
యట్టి జనిఁ గాల్పనే వాఁడె యధముఁ డిలను;
స్వామి జ్ఞానాత్మకుం డెల్ల సత్త్వరాశి
విగతదోషుఁ డదృశ్యుఁడై విష్ణు వలరు. 794

క. అతఁ డఖిలప్రాణులయం, డితరులకుం గానఁబడక హృదయాంబుజసం
స్థితిఁ గాంచుఁ గాన నెల్లర, మతిచర్య లెఱుంగు నేటి మాటలు పలుకన్. 795

చ. కనుకనె భక్తినమ్రనిజగాత్రుఁడనై సకలేశ్వరేశ్వరుం
డనఁ దగు కృష్ణమూర్తిఁ దన యంశమునన్ జనియించి యవ్యయుం
డనఁ బురుషోత్తముండనఁగ నంత మెఱుంగని దైవతం బనన్
వినుతిని గాంచు శ్రీహరిని వేగమునే శరణంబు వేఁడెదన్. 796

## ఎనుబదినాల్గవయధ్యాయము

అక్రూరుఁడు శ్రీకృష్ణాదులతో సంభాషించుట.

క. అని మదిఁ జింతించుచుఁ జ, య్యన శ్రీహరి పాదపంకజాంతికమున భ
క్తిని వ్రాలి శిరము సోఁకఁగఁ, బ్రణతుండయి పేరు చెప్పి పడియుండె ధరన్.

చ. హరియు ధ్వజాంబుజాతకులిశాదికచిహ్నమనోజ్ఞపాణి నా
దరమున సంస్పృశించి ప్రమదస్ఫుటభాషలఁ బల్కి లేపి స
త్వరముగఁ గౌఁగిలించుకొని వంశసదాచరణంబురీతి సో
దరయుతి మ్రొక్కె నాతనికిఁ దత్పరుఁడై యతఁ డూరకుండఁగన్. 798

చ. అలరుచు రామకేశవులు హర్షము పొంగ వచింప నేరకే
నిలిచిన యాదవప్రవరునిం గొని నందుని మందిరంబుచొ
చ్చి లలితపీఠవర్యమునఁ జెందిన వేడుకఁ గూరుచుండ ను
జ్జ్వలవిభవంబు మీఱఁగ సపర్యల నర్ఘ్యవిధిం బొనర్చుచున్. 799

తే. చక్క భుజియింపఁగాఁ జేసి సాధుభణితిఁ
గుశలముల నెల్లఁ బ్రశ్నించి కూరుచుండ;
సంత నక్రూరుఁ డెల్లరు హర్షమంద
క్షేమవార్తల నన్నింటిఁ జెప్పి మఱియు. 800

సీ. వసుదేవుఁ గంసుం డవమతిచేసినరీతి దేవకీదేవి నా దృప్తచిత్తుఁ
డఖిలకష్టంబుల ననుభవింపంజేసి నట్టివిధంబు నా యాలుమగల
పై నుగ్రసేనుని పై నున్నకోపంబు గనఁబఱచుటయుఁ దఱ బనుచు నపుడు
కంసుండు తెల్పిన కష్టవాక్యంబులు విడువకయుండఁ దా నుడివెఁ; గృష్ణుఁ
తే. డన్నివార్తల నక్రూరుఁ డాదరమునఁ, దెలుప నాలించి యిట్లని పలికె నోమ
హాత్మ! దానపతీ! వీని కన్నిఁటికిని, బదు లొనర్తును గంసభూవరుఁ డికధర.
క. మనఁడని నాచే హతుఁడై, చను స్వర్గంబునకు నంచు స్వాంతంబున నీ
వును నిశ్చయింపు; మే న, న్ననుగూడియె యెల్లి మథురనామపురంబున్. 802
క. నినుఁగూడి చొత్తు వృద్ధులు, ఘనమతులును నైన గోపకాంతులు మరిఁగూ
డను మీఱ కుపాయనములఁ, గొనివత్తురు చింతఁ బాసి క్షోణీశ్వరునిన్. 803
క. ఆహవమునఁ దెగినట్టులె, యూహించుచు నీత్రియామ నొప్పుగ నిచటన్
మాహాత్మ్యము దళుకొత్తం, గా హాయిగఁ బుచ్చు మీవు కడుధన్యుఁడవై.
క. సోదరుల మమ్ముఁ దోడ్కొని, మేదినిపతిఁ జూడఁ బొమ్ము మించినపూన్కిన్
నీదగుచింతలు మూఁడవ, దౌ దినమునఁ దీఱఁ గంసు నని వధియింతున్. 805
చ. అని పలుమాఱుపల్కి మరియాదను నాతని గోపవృద్ధులన్
మనములఁ బొంగఁ జేసె నిటు మన్ననఁ బల్కఁగఁ బొంగి యాతఁ డా
య్యన శయనించె నందునిగృహంబునఁ; గృష్ణుఁడు రాముఁడున్ సుఖం
బున శయనించి రాయుదయ భూధరమందు రవిద్యుతుల్ తగన్. 806
మ. బలభద్రుండును గృష్ణుఁడున్ నభ మొగిన్ స్వచ్ఛంబుగాఁ దోఁప ని
మ్ముల మేల్కాంచి యథార్హముఖోచితవిధుల్ పొంకంబుగాఁ దీర్చి; రు
జ్జ్వలతేజంబు వెలుంగ నగ్రజయుతిన్ సర్వప్రయత్నంబులన్
ఖలుఁ గంసున్ వధియించుకోర్కిని జనంగాఁబూనె నక్రూరుతోన్. 807
చ. హరి మథురాపురంబునకు నగ్రజుఁగూడి చనంగ నెంచె ని
త్తరుణమునం దె యంచువిని తామరసాక్షులు గోపికాంగనల్
త్వరపడి హస్తకంకణవితాన మదెల్లను దాఱుమాఱుగా
స్వరగతిఁ దెల్పె దుఃఖముల స్వాంతము లార్తిని బొంద వచ్చుచున్. 808
తే. వేఁడినిట్టూర్పులం జాల విడుచుచుఁ దమ
లోనఁ దమ రిట్లు పల్కఁగఁ బూని రందు
నొకత లోదరి యిట్లనె నూహ చెలఁగ
మథుర కేగిన కృష్ణుండు మరల నిచట. 809
క. తనుఁజూడఁ బరితపించెడు, మనలం జూడంగ వచ్చుమాట పొసఁగునే
వనజాక్షుల కలభాషణ, వినిర్గతంబైన మధువు వీనులఁ గ్రోలున్. 810
చ. పురవరమందునున్న ననఁబోఁడుల కోమలవాక్పరంపరా
పరిగత చిత్తుఁడైన హరి పల్లియ నుండెడుగోపగోపికా

విరసవచస్తతుల్ వినఁగ వీనుల కింపును గూర్ప నెంచునే
త్వరపడి పోయి చూడనగుఁ దామరసాక్షు నటంచుఁ బల్కనన్. 811

చ. వనరుహనేత్ర యోర్తు హరిఁబాయుట కోర్వక యమ్మచెల్ల! యీ
మనపురసారమౌ హరిని మానక లాగెడు ధాత క్రౌర్య మం
గనలకుఁ దాఁకి యార్తిగనఁగా నొనరించెను క్రూరుఁ డంచు న
వ్వనరుహసూతిఁ దిట్టెఁ దమివర్ధిలఁ గృష్ణునివీడఁ జాలమిన్. 812

సీ. భావగర్భస్మితవాక్యముల్ సువిలాసక్రమగతుల్ పురకాంతలకును
గలుగు వారలకటాక్షశరఘాతంబులు గ్రామ్యుఁడౌ హరిఁ దాఁకఁగా నితండు
తద్విలాసనిగడధార్యమాణుండయి యచ్చటనే యుండు నంతెకాని
మీపార్శ్వమున నిల్చి మెలఁగనే హేతువు కలదొ నేఁ దెలియంగఁగలనె యనియె;

తే. మఱొకమహిళావతంస మిమ్మాడ్కిఁ బలికె
నితఁడె రథమెక్కి కేశవుఁ డేగువాఁడు
మథుర కక్రూరుఁ డనెడు నామమునఁ దనరు
క్రూరుఁ డీతఁడు వంచకుఁడై రమేశు. 813

క, కొనిపోయెడు; నీక్రూరుం,డను నాగపరాయణమున నలరుజనంబుల్
గననేరఁ డితనిచే నేర్పున శ్రీహరి వంచితుఁడయి పోవం బూనెన్. 814

క. మనయక్షయసమ్మోదం,బనఁ దగు శ్రీకృష్ణమూర్తి యక్రూరుఁడు నా
జను లనుక్రూరాత్మునిచే,తను గైకొని పోవఁబడెడు దైవ బలమునన్. 815

మ ఇదె రాముల్ జతగూడి యమ్మథురనే యీక్షింపఁగా నేగెడున్
మది నింతేఁ గృప లేదు కృష్ణునకు సమ్మానింపఁ డొక్కింత యీ
సుదతీవ్రాతము స్యందనోత్తమమునం జూడంగనౌ నిప్పు డీ
యదయుల్ నిల్పఁగ రండు రండు తమితో నాలస్య మింకేటికిన్. 816

చ. గురువులచెంత నిట్లనఁగఁ గూడదుగాని వచింప కూరకి
త్తరుణమునందు నుండ మది ధైర్యము చాలదు దుర్భరంబుగా
విరహమహాగ్ని కాల్చెడిని వ్రేతలచిత్త మనుక్షణం బొగిన్
గురువు లిఁకేమిచేయుదురు? గొబ్బున రండు మురారి నిల్పఁగన్. 817

సీ. నందగోపాలకుఁ డిందె యున్నాఁ డింక నెందఱో గోపకు లితనివెంట
మథురకుం బోవు ప్రమదమున నున్నారు గాని యిందొక్కరుం డైనఁ గృష్ణుఁ
బయనంబు చేయుట పాడిగాదని నిల్ప జతనంబు సేయఁగ స్వాంతమందు
దలఁచినవాఁడు లేఁ డలఘుపాపం బిది యనఁదగుఁ గాని వేఱనఁగ రాదుఁ

తే. మథురయందున్న మదవతీమండలమున,కిదియె శుభదాత్రి రాత్రి శ్రీకృష్ణవక్త్ర
జలజదర్శన మొగిఁజేయఁ జాలు భాగ్య,మబ్బె వారల నయనముల్ సార్థకములు.

చ. మురహరుఁ డేగు మార్గమునఁ బొంగుచు నడ్డెడువారు లేక ష

త్సరసిజ ముఖ్యముం గన నెసంగినభాగ్యముగల్గు వారలే
యరయఁగ ధన్యు లామహిత లంగనలం బులకాంచితంబులన్
సరిగ వహించుపుణ్యముల సల్పినవారుగదా ధరాస్థలిన్. 819
తే. శౌరి! గోవింద సుందరాస్యావలోకనమున మధురాపురీపౌరనయనములకు
నుత్సవం బగు వారలెంతో కృతార్థు; లికను యిచ్చటివారల కింక లేదు 820
క. తరుణిమయొవర్తక కలలో, గురుతరసౌభాగ్యఫలము గోవిందుని శ్రీ
వరుఁ గను నాయింతియె యీ, ధరనుత్తమురాలు చాలధన్యయుఁ జూండీ. 821
క. ఏసుదతు లింపుమీఱఁగ, నీసరసిజనేత్రుఁ గృష్ణు నిందీవరభా
భాసురగాత్రుని గాంతురొ, భూసన్నుతిఁ గాంత్రు వారె పో తలపోయన్. 822
చ. కరుణ యొకింత లేని విధి కమ్రమహానిధి గోపబాలికా
త్కరమున కట్టిచూపి చిరకాలము నట్టులెయుండనీక స
త్వరముగ నేత్రపద్మములఁ దా హరియించె నిఁకేమి చెప్ప నీ
ధరపయి నిట్టి నిర్ఘృణులు ధాతలు పుట్టిరె మున్ను వింటిరే. 823
క. అనురాగము శిథిలతఁ గను, మనసులుగల యిట్టిమనకు మంజులమణివ
ర్యనికరయుత వలయంబులు, గనె శిథిలత కేలనుండి కడుఁ జిత్రముగన్. 824
క. కనుఁడీ యక్రూరుం డని, జనులు తనుం బిల్వ నొప్పె సతతము క్రూరుం
డనఁ జను నిదె హయముల ని, ల్పను బూనక తోలుచున్నవాఁడు త్వరఁ జనన్.
చ. జను లిట నెందఱేఁ గలరు చానలయార్తిని బాపఁబూను స
న్మనసులు కానరారు మురమర్దను స్యందన మేగుజాడఁ దె
ల్పెనుగద భూమిరేణువులు వేగము చూడుఁడు దూర మేగె నా
వనరుహనేత్రుఁ డిప్పు డనువార్తను దెల్పెఁ బరాగలేశముల్. 826
చ. అని బహుళార్తిఁ గ్రాఁగెడు వ్రజాంగన లెంతయు నిక్కిచూడ రా
మునిఁ దమిఁగూడి శ్రీహరియుఁ బోయెను గోకులభూమిభాగ మె
య్యన విడనాడి యట్టె; జవనాశ్వసమాయుతమౌ రథంబు యా
మునతట మొందె భాస్కరుఁడు పోలనభోంతరమందు నున్నెడన్. 827
తే. రామకృష్ణు లక్రూరుఁడు రథమునందు
వెలయుచుండిరి; శ్రీకృష్ణుఁ బలికె దాన
పతియు మీరిద్ద ఱిందె ద్వీపవతితీర
మందు నుండుఁడు నేను మాధ్యాహ్నికముల. 828
క. శైవలినీవారిని దగఁ, గావించి జపంబ వత్తుఁ గరుణ నునుపుఁడీ
నా విని వారు తథాస్తనఁ, గా వారిం జొచ్చి మునిఁగెఁ గడునియతుండై. 829
ఆ. ఆచమనము చేసి యతులతేజము పొంగ, స్నానమాచరించె జలములందె
యుండి మదిని దేవతోత్తముఁ బరమాత్ము, సర్వగతుని హరిని సర్వవంద్యు.

సీ. భక్తిమైనిల్వె నాపట్టునసే వేయిఫణములమాలికల్ పరఁగుచుండ
నలరు ననంతుగా నాబలభద్రుని గనుఁగొనియెను దనుకాంతికుంద
సుమమట్లు స్వచ్ఛమై శోభిల్లుచుండె నున్నిద్రకంజాయతనేత్రము లొగిఁ
బరఁగుచుండెను జెంత వాసుకిప్రభృతి డింభకరూపఫణితతి వరుసఁ గొల్చి
తే. వినుతి సల్పఁగ వనమాలికను ధరించి, యసితవస్త్రంబులం దాల్చి హరిరూప
మలర మంజులకుండలములు వెలుంగ, నలరె బలభద్రుఁ డాసలిలాంతరమున.
క. కనుఁగొని బలభద్రుని నా,తనియుత్సంగంబునందుఁ దగిన ఘనశ్యా
ముని నాతామ్రవిలోచను, ఘనబాహుచతుష్కు దీర్ఘకాయు మహాత్మున్. 832
క. దరచక్రాద్యాయుధవర,ధరుఁ గాంచనచేలుఁ జిత్రదామాంచితసుం
దరకంఠు విద్యుదమరే,శ్వరచాపవిచిత్రజలదసన్నిభుఁ డనఁగన్. 833
క. వినుతిం గనఁదగు వానిం, దనరెడు శ్రీవత్సచిహ్నధారిని రత్నా
ళిని వెలయు మకుటమొప్పం,గను గేయూరములు మెఱయఁగాఁ దగువానిన్.
చ. కరమునఁ బుండరీకము తగంగ నదెవ్వరికేని కష్టమే
తరుణమునందుఁ జేయక నితాంతకృపాకరమూర్తియై మహా
త్తరవిభవంబునం జెలఁగు తామరసాయతనేత్రుఁ గృష్ణునిం
బరమమునీంద్రహృజ్జలజభాసురపీఠనివాసునిం గనెన్. 835
సీ. సనకసనందనాదినిఖిలమునులును సిద్ధయోగు లఘంబుఁ జేరకుండ
నలరుమహాత్ములు నందుండి నాసాగ్రవిన్యస్తనయనులై విశ్వమయుని
దర్శించుచును సదాధ్యానించుచుండంగ నలరుచున్నమురారి నచటఁ గాంచె
బలరామకృష్ణులఁ బరికించి యారీతి విస్మితస్వాంతుఁడై వేగ వీర
తే. లిచటి కెట్లరుదెంచిరో యింతలోన, ననుచు యోజించి భాషింపఁగను దలంప
వాక్కు స్తంభించెఁదనశక్తివాసుదేవుఁ, డంత నాజలములనుండి యతఁడు వెడలి.
చ. అరదముఁ జేరి దానిపయి నగ్రజుఁగూడి వసించుకృష్ణునిన్
బరమవిలాసమూర్తిఁ గని వారిమనుష్యశరీరముల్ మనో
హరముగఁ బూర్వరీతిఁ దగ నప్పుడె యంబువులందు మున్ని శ్రీ
హరి బలరాముఁ గాంచెను యథార్థముగాఁదగు వారి ముఖ్ బలెన్. 837

రథయమునాజలంబుల రామకృష్ణులంగాంచి యక్రూరుఁడు వినుతించుట.

క. మునిసిద్ధులు గంధర్వులు, ఘనతర ఫణు లొక్కరీతిగా వినుతింపన్
మునుపటి మాడ్కిఁ జెలంగం, గని సద్భావంబు మిగులఁ గాంచి యతండున్.
తే. సర్వవిజ్ఞానమయుఁ జక్రి సర్వరూపు
నీశ్వరుని భక్తిచే నుతియించె నిట్లు;
పరముఁడై సుంత యెఱుఁగంగఁబడని మహిమ
మున వెలుంగుచుఁ జిన్మాత్రతనువుఁ దాల్చి. 839

సీ. సర్వత్ర వ్యాపించి సర్వదేహంబులఁ గని యొక్కరూపంబుగాక యన్ని
రూపముల్ దానయై దీపించు నీకును నభివందనంబు లేనాచరింతు;
శబ్దరూపుండయి సంతతాచింత్య మహిమ్నాఖ్యుఁడై తగు విమలునకును
వందనంబు లొనర్చువాఁడ; విజ్ఞానరూపమున వెలుంగుచుఁ బరుఁ డనంగఁ
తే. బ్రకృతికంటెఁ బరుండనఁ బరమభూత
మయుఁడు నింద్రియాత్ముఁడు సర్వమయుఁడు నైన
హరికిఁ జేమోడ్పు లర్పింతు ననుచు మఱియుఁ
బలికె నీశ్వరుఁ గూర్చి దేవపతి వీవె. 840
తే. ఆత్మవన నీవె మఱిపరమాత్మ వీవె, నీవ యొకఁడవె పంచధానెగడుచుందు
వోహరీ ధర్మమయచిత్త యోమ హేశ, సుప్రసన్నుఁడవయినాకు శుభములిమ్ము.
క. క్షరుఁడవు నీ వక్షరుఁడవు, పరమేష్ఠి సరోజనేత్ర పరమశివ మనో
హరవాగ్వినుతచరిత్రుఁడ, వరయంగాఁ గలరె నీమహత్త్వము మునులున్.
సీ. వచియింప శక్య మేవరుసఁగాని స్వరూప మట్టిప్రవర్తన మట్టిపేరు
లలరు నీకు నొనర్తు నతిభక్తి జేజేలు విశ్వేశ్వరా! యొందు వినుతిచేయ
నామము వంశము నేమము లేకుండు నట్టిపరబ్రహ్మ మవికృతితోను
వజత నీయందు నేహర్ష్యోందుఁ గావున నవని సోఁకఁగఁ దల సంఘ్రినిలిపి
తే. మ్రొక్కువాఁడ; నర్థమును భూరికల్ప
నలు బొసంగక యున్నచోఁ దెలియ శక్య
మగునె? కావునఁ గృష్ణుండ వనఁగ నచ్యు
తుఁడ వనంగను మఱి యనంతుఁడ వనంగ. 843
తే. విష్ణు వనఁగ నీరీతులఁ బిల్వఁబడుదు, లెల్లరకు నాత్మవన నీవె యొఱుఁగవు జని
నామభేదంబులను నీవె నాకవసతు,లుగనె పిల్వంగఁబడుదువు తగినయట్లు. 844
క. విరహితవికారుఁడవు నెల్లరయందును గలదు నీవిలాసతనువు త్వ
ద్విరహితవస్తువు లేదే, వరుసను దలపోయ నీకు వందన మిదిగో. 845
సీ. బ్రహ్మవు శివుఁడవు భాస్కరుఁడవు మఱియును విధాతవు ధాతవును సురేశుఁ
డవు సమీరణుఁడ వగ్ని వితోయవిభుఁడవు ధననాయకుండ వంతకుఁడ వీవె
యొక్కఁడవయి యనేకోపాధులను నిండి జగములనెల్ల రక్షణము చేయఁ
దగుశక్తిభేదంబు లగణితంబులుగ నొప్పంగఁదాల్తువు; విశ్వపటలములను
తే. నీవె సృజియింతు, పాలియింతు వీవె నీగ
భస్తిరూపమె విశ్వంబు పావనగుణ,
మయమె యీ సృష్టిభవము చిన్మాత్రుఁడ వగు
నీకుఁ గలుగునె యోజగన్నిచయ నాథ. 846
వ. సద్రూపం బక్షరంబు జ్ఞానమయంబు ననఁజెల్లు నీకుఁ జేమోడ్పులు. వాసుదేవ

సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధనామంబులఁదగునీకు సాష్టాంగప్రణామంబు లని పలికి యక్రూరుండు భక్తిపరవశత్వమున శ్రీకృష్ణు నంతర్జలంబుల సంస్తుతించి పూజించె. ఆపూజ మానసికం బనందగు. 847

చ. మనమున వేఱువాంఛలను మాని పరాత్పరునందె చిత్తమె
య్యన నలరారఁజేసి పరమాత్ముని జక్కఁగ నందె చూచి యో
గనియతిమాని తన్నుఁ గృతకార్యునిగాఁ సఫలప్రయత్నుఁగాఁ
గను దలపోసె; నంత యదుకాంతుఁడు కంససఖుండు పూనికన్. 848

క. జలముల విడిచి రథంబున, కెలమిం జను దెంచి రథము నెక్కి సహాజులన్
బలరామకృష్ణులం దమి, విలాసముగఁ గూరుచున్న విశ్వాత్మకులన్. 849

క. కనుఁగొని విస్మితనయనుం, డనఁ దగునక్రూరుఁ గాంచి హరివచనముల్
తనివిం గల్పింపఁగ ని, ట్లనియెన్ శ్రీకృష్ణమూర్తి యాదృతి మెఱయన్. 850

శ్రీకృష్ణం డక్రూరు ననునయించుట.

క. యామున జలములనడుము న, దేమి గనుంగొంటివయ్య యింతదనుక నం
దేమి మహాశ్చర్యము గల, దోమానితశీల! విస్మయోత్ఫుల్లాతుల్. 851

క. కనఁబఱచెదుఁ జిత్రంబుం, గనుఁగొంటి వటంచు ననినఁ గడుమోదమునన్
వనజాక్షా! యనిపిలిచి య,తనిఁ గాంచుచు దానపతి యుదాత్తరవముననన్. 852

క. పలికెన్ శ్రీకృష్ణా! నది, సలిలాంతరమందుఁ జూడఁజాలిన చిత్రం
బులఁ గాంచుచున్న వాఁడను బలికెదఁ దనుధారియైన పరతత్త్వ మిటన్. 853

తే. నేను గాంచినచిత్రమే నిలిచియున్న, దెదుట స్యందనమునయందు నెవ్వరికిని నచ్చెరువు గల్గఁజేయుచు నఖిలవిశ్వ,మయముగా నొప్పురూపంబు మానినుతము

క. అరుదుగ నొప్పునో యద్భుత,పరుఁడగు నాదేవుతోడ బాగుగ నా కి
త్తరుణమునఁ గల్గె సంగతి, మురహరణా యేమిచెప్పఁ బూనుదు నింకన్. 855

క. పరమేశు నతనిఁ గూడియె, యరుగుచు నున్నాఁడ మథుర కతిమోదమునన్
దురితాత్ముఁడైన కంసుని, ధరణీశ్వరుగాఁ దలంచి తత్త్వ మెఱుఁగకే. 856

క. భీతిం జెందితి నిన్నీ!, యీతను వికఁ గాల్పనే మహేశ్వర! పరపిం
డాతతజీవనమునఁ దగు, నాతనికిన్ జేటు లొగ్గి యాదృతిఁబడయన్. 857

క. మనమున నెంచితి నకటా, యని పలుకుచుఁ గృష్ణుఁ గనుచు నత్యామోదం
బునఁ బొంగుచు వాహనముల, ఘనజవమునఁ బోవఁ దోలెఁ గంసు నడంపన్.

క. సాయంకాలమునకు సరి,గా యాదవముఖ్యుఁగూడి కాంచనచేలుం
డాయాస మింతలేక హ,లాయుధుఁడున్ వెంటనుండ నప్పురవరమున్. 859

క. అనుపమము మథుర యన నొ,ప్పినదానిని గాంచె; నపుడు ప్రీతిని బద్మా
క్షుని గని యక్రూరుం డి, ట్లనియెన్ బరమాత్మ నీవు హలియున్ మథురన్. 860

తే. కాలినడకలఁ జోరఁదగు నోలి నేను, స్యందనం బెక్కి యొకఁడనె చనఁగఁదగును
మీరు వసుదేవుగృహమును జేరుటొప్పు, మీనిమిత్తమె కాదె యామానవపతి.

క. వసుదేవు నవమతిఁ దుఃఖసమన్వితుఁ జేసె; ననుచు గాఢప్రీత్యు
ల్లసితోక్తులాడి యాతఁడు, వెస నరదముఁ గొంచు మథుర వింతగఁ జొచ్చెన్.

రామకృష్ణులు రాజమార్గమున మథురం బ్రవేశించి రజకుఁ జంపుట.

క. శ్రీరాముఁడు కృష్ణుం డక్రూరుని హితవాక్కులెల్లఁ గోరిక విని య
ట్లే రాజమార్గమున నగ, రీరాజముఁ బొచ్చిరి హితరీతి నడచుచున్. 863

క. జలజాక్షులు పూరుషులున్, విలసిల్లెడు నెమ్మనముల వింతగఁ దగుపు
త్త్రుల రామకేశవుల మో, దలతల్ పుష్పించి ఫలవితానము లొసఁగన్. 864

చ. కనుఁగొని రప్డు రాముఁడును గాంచనచేలుఁడు వీర్యవంతులై
కనుఁగొను వారికన్నులకుఁ గమ్రసుఖంబును గూర్చుచున్ జవం
బనువుపడంగనీక చనునట్టి ద్విపార్భకయుగ్మ మట్లుగా
వినుతవిలాససంపదల వింతగతుల్ చెలువారు చుండఁగన్. 865

తే. రాజమార్గంబునం జని రాజగత్వ
తులు తముం జూచువార లుత్సుకత నలర
నంత నొకచోట రంగాహ్వయమున నొప్పు
రజకుఁ గాంచిరి భూపాంబరములఁ గొనుచు. 866

క. పరిశుద్ధములుగ నొనరిచి, ధరణీశుని సౌధమునకుఁ దాఁ గొని చనుచుం
డె రుచిరవస్త్రంబుల శ్రీ,హరియున్ రాముండు గోరి యాతని వేడ్కన్. 867

క. కనుఁగొనఁదగి మూల్యాధిక, తను గాంచిన చారువస్త్రతతుల నొసఁగుమా
యని యాచించిరి యాతం, డనుకంపారూఢవిస్మయంబు కనఁబడన్. 868

క. ధరణీశు రజకుఁ డౌటం, బరిహాసోక్తులను బల్కి పలుమఱు నవ్వన్
హరి యెంచి దురాత్ముఁడు భూ, వరరజకుం డంచుఁ గోప పరవశుఁ డగుచున్

చ. కరతలసంప్రహారమునఁ గ్రక్కున వానిశిరంబు భూమిపై
దొరలఁగఁ జేసి పీతరుచిఁ దోఁచెడు కోమలవస్త్ర రాజి నీ
లరుచిఁ జెలంగు నంబరములన్ వడిమీఱ గ్రహించి తాను సో
దరుఁడును జక్కఁ దాల్చి ప్రమదంబునఁ దేలుచుఁ బోయి రవ్వలన్. 870

క. చనిచని మాలాకారు సదనమును జేరంగ వికసితద్వ్యక్ష్యబ్జుం
డును విస్మితచిత్తుఁడునై, యనఘుం డగుటం దలంచె నౌరా వీరల్.

తే. ఎవనికులమునఁ బుట్టిరో యేకృశాంగి, వీరి జననియొ యేపుణ్యసారముననొ
వీరిఁ గంటిని గడు మనోహారిరూపు, లసితపీతాంబరధరు లీయర్భకు లిట. 872

*కంసస్యరజకస్సోఽథ ప్రసాదారూఢ విస్మయః = అనిమూలము.

క. చను దెంచు టేమి కార్యం, బును సాధించుటకొ భూమిఁ బొల్పుగఁ జూడం
గను వచ్చిన దేవతలే, యని యూహించెను స్వభావ మగునాదృతిచేన్. 873

తే. మఱియు నాపూల నిర్మించు మహితమూర్తి
వికసితాక్షిరాజీవయుగ్మకము చేత
వారిఁ బూజించె నాదట వార లెలమి
ముఖసరోజము లలర నాపుణ్యపురుషు. 874

చ. కనుఁగొని హారిపుష్పములఁ గ్రక్కున నిమ్ము ధరించుకోర్కె మై
కొనె హృదయంబులం దనుచుఁ గోరిన యాబలరామకృష్ణులం
దనశిర ముర్విపైఁ దగులఁ దత్పరుఁడై స్పృశియించి యెట్టిప్రీ
తినొ మహనీయమూర్తు లిటు దినుని గేహము చూడ వచ్చుటల్. 875

ఉ. స్వాములు మీరు నాకుఁ గృపసంధిల వచ్చితి రింతె చాలు నీ
ధామము పూతమయ్యె జని ధన్యతఁ గాంచెఁ గులంబు పావనం
బై మహి మించె మిమ్మిపుడె యర్చనలం బరితృప్తి నొందఁగా
నేమము మీఱఁ జేయఁదగు నిల్వఁ డొకించుక సేపు వేడుకన్. 876

క. అనిపలికి మాల్యజీవికుఁ, డను మోదంబున ముఖాబ్జ మలరఁగ వారల్
తనుఁ గోరిన పుష్పంబుల, మనోహరాకృతులఁ గూర్చి మనసులు వెలయన్.877

ఆ. ఒసఁగి మరలమరల సురుభక్తిమై మ్రొక్కెఁ; బరిమళములఁ జల్లు పావనసుమ
మాల్యముల ధరించి మంచి వంచు నుతించి, వర మొసంగెఁ గృష్ణుఁ డురుతరకృప.

క. భావుకగుణ! నాయాశ్రయ, మై వఱలెడు లక్ష్మి నీగృహంబున నెపుడేఁ
డా విడనాడక యుండును; నీవపువు బలాధికత వినీతంబగుఁ జూ. 878

క. ధనహాని నీకు నెప్పుడు, కనఁబడ దో సౌమ్య! తుహిన కరుఁడు రవియు మే
దినియును దగుదనుకన్ నీ, తనయులు తత్పుత్త్రు లిట్లు త్వత్సంతతియున్. 880

క. విచ్ఛేదంబును గాంచక, స్వేచ్ఛం దులదూఁగుచుండుఁ జింత లొదవవో
స్వచ్ఛగుణాకరభోగము, లిచ్ఛాధీనములు నీకు నే కాలమునన్. 881

తే. సకలసుఖములఁ బొంది నీ వకలుషాత్ముఁ, డవయి మృతి కాలమున నాదు హరినామ
మును స్మరించుచు నక్షయం బనఁగఁదగిన, పదమునకుఁ జేరఁగలవు శ్రీసదనమదియె.

చ. మనమున ధర్మచింత యణుమాత్రము లోపము నొందకుండు నీ
ఘనతమవంశమందు జనిఁ గాంచినవారలకుం జిరాయు వో,
విను భవదన్వయంబునను వింతగ నొప్పడు రోగజాలముల్
కనఁబడ వేతఱిన్ గులము క్ష్మాస్థలి వర్ధిలుచుండు సుస్థితిన్. 883

చ. అని వర మిచ్చి యాతనికి నందఁగరాని పదంబుఁ జేరనొ
నని వచియించి మాల్యకరుఁ డాదృతిభక్తులఁ బూజసేయఁ గై

కొని బలభద్రుఁ గూడి నృపకూటవిషాభునిఁ గంసుఁ దున్మ వే
డ్కను జనె బాలకృష్ణుఁడు నికామముదంబున మేను పొంగఁగన్. 884

---

ఎనుబదియైదవ యధ్యాయము.

కుబ్జను శ్రీకృష్ణుఁడు చందనాదుల యాచించుట.

చ. సురుచిర రాజమార్గమున సొంపుగఁ బోవుచు నొక్కసుందరిన్
బరిమళవస్తుభాజనముఁ బైఁటచెఱంగున మూసి మెల్లఁగా
ధరణిపుమందిరంబునకు దర్పకసాయకమట్లు యౌవన
స్ఫురణము మీఱఁగాఁ జనెడు పూర్ణవిలాసవతిం గనుంగొనెన్. 885

క. తరుణి యది కుబ్జ యనఁగాఁ, బరినుతిఁ గాంచెను త్రివక్రపరిగణితంబై
సురుచిరదేహము తగె నా, తరుణంబున దానిఁ జూచి తమి హరిపలికెన్. 886

క. అనులేపన మెవ్వరికో, వనితా సత్యంబు పల్కవలయుం జుమ్మీ
వనరుహనేత్రవు నీ వన, నను రాగమునన్ సకామయై కుబ్జ హరిన్. 887

క. కని పలికె లలితవాక్కులు, మనమున కింపొసఁగు చుండుమాడ్కిఁ జెలంగన్
వనరుహనేత్రుని రూపంబును బల్మఱు చూచుచున్ బ్రమోదము పొంగన్.

సీ. కాంత! కంసుం డనుక్ష్మాపతి వర్యుని యనులేపనాఖ్య కృత్యమున నేను
జరియించుదాన నం చరయవేలొకొ త్రివక్ర యనుచు విఖ్యాతిఁగాంచుదానఁ
గంసున కేలాటికమాని నులేపన మిష్టంబుగాక నేనే యొసంగు
ననులేపనంబుల నాదృతిఁ దగియుండుఁ గావున నన్నెప్డు గారవమునఁ
జూచి సన్మానించుఁజుమ్ము; నావిని హరి యోరుచిరాననా యుర్విపతికి

తే. నర్హ మీయనులేపన మతిరుచిరము, నగుట నిజమేని మామృదులాంగకముల
కనుగుణంబయి తనవారున ట్లొసంగ, వలయు ననులేపనము నిప్డు వక్రదేహ.

చ. అని తనుఁ గోరుకృష్ణుని మహత్తరభావ యుతోక్తులన్ దమిన్
విని యలకుబ్జ యాదృతిని వింతగనొప్పెడు దివ్యచందనం
బు నొసఁగె వారిదేహవరముల్ చెలువారెడునట్లు వేగమే
మనముల వార లాసుదతి మానసశుద్ధి నెఱింగి చక్కఁగన్. 890

క. తనువులనిండఁగ ననులేపనములఁ బూసికొని దేవవర్యులు సురనా
థునిచాపయుతసితాసిత, ఘనములచాడ్పున మనోజ్ఞ కాంతులఁ దగుచున్. 891

సీ. అంత శ్రీగోవిందుఁ డంగనామణిఁ గాంచి యుద్ధారణవిధాన ముత్తమగతి
నెఱిఁగినవాఁడౌట నెఱిఁ జుబుకంబు క్రిందను వ్రేళు లుంచి వెన్కనుగరాంగు
ళుల నిల్పి తత్పదంబుల స్వాంఘ్రియుగమున నదిమి పైకెత్తె నాహరి కరముల
స్పృశియించినంతనే చెలువ దేహము చక్కనాగెఁ ద్రివక్రముల్ సమసిపోయె

తే. నప్పు డాలేమ యతిసుందరాంగ మలర, నంగనారత్న మన నొప్పి యతివిలాస
లలితమై ప్రేమగర్భమై వెలయుపలుకు, లమర నిట్లనిపలికె నిక్కమగుభక్తి. 892

క. కరమున గోవిందుని యం, బరమును బట్టుకొని నాదుభవనంబునకున్
బరమేశ్వర రమ్మా నా, పరిచర్యం గొనుము కరుణ పర్వం గనుమా. 893

చ అనవిని పద్మనేత్రుఁ డపు డవ్వనితామణి నాదరించి పా
వనమతి నీవు వచ్చెద భవత్సదనంబున కొక్కమాఱు నె
మ్మనమున నమ్మియుండు మని మంజులవాక్కుల నగ్రజాననం
బును గనుఁగొంచుఁ బల్కి సతిఁ బుచ్చెను బొమ్మని నవ్వుచుం దగన్. 894

చ. పరిమళచందనాదులను బాగుగఁ బూసి వినీలకాంచనాం
బరములఁ దాల్చి రాముఁడును బద్మదళాక్షుఁడు సత్వరంబ పో
యిరి ధనువున్నశాలకు నవీనవిచిత్రమనోజ్ఞ సత్సుమో
త్కరవనమాలికాభరణ కాండవిరాజిత కంఠభాగులై. 895

క. ధనువును గనుఁగొని రక్షక, జనులను దద్వార్త నడిగి చక్కఁగ వారా
యనుపమ చాపమహత్త్వము, వినిపింపఁగ వినిరి హరియు వేడుక దానిన్. 896

ధనుర్భంగము కువలయాపీడగజవధము కృష్ణుఁడొనర్చుట.

క. కరమున గ్రహించి లీలఁగ, వరశక్తిని దాని నక్కటవంచిన నది యా
తరుణమున రెండుగా భీ,కరనాదము నిగుడ విఱిగెఁ గంసుఁడు బెదరన్. 897

తే. ఆనినాదము పురవరమందు నెల్ల, తావులను నిండె దాన సంతసము నంది
రందుఁ గలసజ్జనులు వగనంది రధిపు, దుష్టమిత్రులు; దానిచేఁ దోఁచు కినుక.

క. వారలను జుట్టుముట్టెను, భూరిబలోపేతసుభటపూగము చాపం
బారీతి విఱుగఁ గొట్టిన, కారణమున నంత రామకాంచనవసనుల్. 899

తే. వీరభటులఁ ద్రుంచి వెడలి రా కార్ముకా, లయమునుండి తగువిలాస మొప్ప;
నంత వ్రజమునుండి యక్రూరురాకను, జాపభంగవార్త భూపతి విని. 900

క. ఇదియేమి చిత్రమో యి, ట్లొదవెను గార్యంబు మనుజుఁ డొక్కవిధమునన్
మదిఁ దలఁప దైవ మొకవిధి, గఁ దలఁచు నని యెంచి చాలఁ గలవలపడుచున్.

క తనసమ్మినవీరులఁ గృష్ణుని రాముని బొడవడంచు శూరులు వీరే
యని తలఁచి యున్నచాణూ, రునిముష్టికుఁ జేరఁ జీరి రూక్షేక్షణుఁడై. 902

ఉ. యాదవబాలకుల్ మనపురాంతరమం దిదె చొచ్చినారు మీ
మీఁదఁ జెలంగునమ్మకము మిక్కిలి నామది వృద్ధినొందెడున్
గాదన కీదినంబున నఖండతరం బగుమల్లయుద్ధ మా
మోదము నాకుఁగల్గుగతిఁ బూనుఁడు చేయఁగ సాహసంబునన్. 903

క. ఆయుద్ధంబున వారల; నే యనవునవైనఁ జంపు కేతగు వారే

నాయంతమునకు హేతువు, లై యున్నా రనుచు వింటి నట్లౌటఁగదా. 904

ఆ. మిమ్ము నమ్మియుందు నెమ్మది నిపు డట్టి, సంగరమున వారిఁ జంపి నన్ను
బ్రమదవార్ధిఁ దేలుభంగి నొనర్పుఁ డ, వ్వల నొసంగువాఁడ వాంఛితముల.

సీ. మఱియొకవిధమున మ్రందఁ రంచును దోఁచె న్యాయపద్ధతినో యన్యాయమార్గ
ముననో వధింప నో ననుఁ జంపఁబుట్టిన వారలుగావున వారిఁ జంపి
నంతనె నారాజ్యమరయ మీయదియగు; నని పల్కి వార లట్లనుచు సమ్మ
తింపఁగా హస్తిపుఁ దీవ్రరణోత్సాహుఁ బిలువంగఁ బంచి యుజ్జ్వలమహోత్స్వ

తే. మలర నిట్లను నేఁడు సభాంగణమున, ద్వారసీమను మత్తదంతావళంబుఁ
గువలయాపీడమును నునుపవలయు మఱి,గోపబాలుర నయ్యెది కూల్పవలయు.

క. వారలును మల్లయుద్ధము, నేరుపునం జేయ సభను నిశ్చయముగ రా
ద్వారముకడఁ ద్రొక్కింపుము, వారిని గరిచేత నీవు వైఖరి మెఱయన్. 907

చ. అనివచియించి యప్పటిసభాంతరసీమను మంచరాజి చ
క్కనివిధిఁ జేర్పఁగాఁబడుటఁ గాంచి సమీపగతాత్మమృత్యువై
జనపతి భాస్కరుం డుదయశైలముఁ జేరెడువేళ యెప్పుడో
యని తలపోయుచున్ గడపె నానిశ యెట్టులొ వీతమోదతన్. 908

తే. అర్కుఁ డుదయాద్రిమూర్ధంబునందు వెలయఁ
బౌరులెల్లరు మంచాగ్రభాగములను
నిండియుండిరి భూపార్థ్వ నియతమంచ
ముల సభృత్యులు భూపతుల్ వెలసి రపుడు. 909

చ. గురుతరమల్లయుద్ధమును గోరికఁ జేయఁగనున్న మల్లు లా
తరుణమునందు రంగమునఁ దద్దయుఁ బొంగుచు నిల్చియుండి రా
ధరణిపుఁ డున్నయాసనము దాపునఁ, గంసుఁడు మంచవర్య మా
తురమున నెక్కె భూవరు సతుల్ వసియింపఁగ నర్హపద్ధతిన్. 910

క. పరికల్పితంబు లయ్యెను, వరమంచము లందువారు వైభవ మలరన్
వరుసగఁ గూర్చుండిరి త,త్పురవనితలు గణిక లెల్లఁ బొంగెడు వేడ్కన్. 911

ఆ. కూరుచుండి రందుఁ బౌరయోషిన్మణీ, మధ్యభాగమందు మహితశీల
పుత్త్రగర్ధిని యగు పొలఁతులమిన్న యా, దేవకియును నుండె దీనయగుచు.

తే. నందగోపాదులగుగోపబృందములును; దగినయాసనములనుండిరగణితతప
ములనొనర్చినయక్రూరుడలరుచుండె, నతనిచెంతనెవసుదేవుఁడధివసించె 913

సీ. దేవకీదేవియుఁ బావనతనయాస్యపద్మము కన్నులవాంఛ దీఱ
నంతకాలమునసే నాదృతిఁ జూచెదఁగాక యంచని కోర్కె గడలుకొనఁగఁ
గూరుచుండెను;వాద్యఘోషముల్ చెలరేఁగెనంతఁ జాణూరుండు హర్ష మెసఁగ
నాసభాంతరమునయందుఁ జరింపఁగ ముష్టికుఁడును బ్రీతిఁ బొంగి బాహు

ఆ. యుగము నప్పళింప నొగి సభాంతరము హా, హారవము లనిండి యప్పు డుండె
నంత రామకృష్ణు లాసభాంతరమున, కేగుదేరఁ బూన నాగుఁ డనుచు. 914

చ. కటఁ బురికొల్పె నయ్యదియు గండతలచ్యుతదానధారలన్
గరము భయంకరంబగుచుఁ గ్రాలుచు హస్తిపకప్రచోదిత
స్ఫురదురు వేగవంతమయి పొంగుచు రాఁ గని కృష్ణుఁ డట్టె త
త్కరముఁ గరంబునం బెనచి క్రన్ననఁ ద్రిప్పి పరాక్రమంబునన్. 915

చ. ధరఁ బడ నేయఁ బ్రాణసముదాయము దేహమునందు నుండకే
పరుగిడఁ జచ్చె నాగజము; బాహుబలంబున నన్నదమ్ము లి
ర్వురు గజదంతముల్ పెఱికి రూక్షతరాస్త్రము లట్లు వానిఁ దా
ల్చిరి; ధరణీశుమత్తకరి చేరెను స్వర్గము శ్రీశుఁ డంటుటన్. 916

ఆ. మత్తహస్తిఁ జంపి మాధవబలభద్రుఁ, లఖిలమృగములందు హరులరీతి
గర్వలలితదృష్టికలితులై రంగంబుఁ, జేరి రంత వారు చేరినపుడె. 917

క. అంతట హాహాకారము, వింతగఁ జెలరేఁగె నపుడు వీఁడే కృష్ణుం
డంతటఁదగు వాఁడే హలి, యంతర మెఱుఁగంగ శక్యమగునె యొవరికిన్. 918

క. అనుచున్ విస్మయమునఁ జను, లనుకొను చుండంగఁ గొంద ఱలగోవిందుం
గని వీఁడే శ్రీకృష్ణుఁడు, కనుఁగొంటివె యంచు నొకఁడొ కనికిం జూపెన్. 919

ఉ పూతనయన్న రక్కసిని బుద్ధిచమత్కృతిఁ జంపె మాయచే
ఖ్యాతినిగన్న యట్టి శకటాసురుఁ బాదహతిన్ గతాసువై
ప్రేతపతిం గనంజనఁగఁ బెంపునఁ జేసె నులూఖలంబునన్
మాతయొగట్ట నట్టె చని మద్దులరెంటిని గూల్చె నీతఁడే. 920

శా. బాలత్వంబుననుండియే విషయుతిన్ భాసిల్లి దుర్దాంత మా
భీలస్ఫారఫణాళియై యొసఁగి నిర్భీతిన్ విరాజిల్లు నా
కాళీయోగ్రభుజంగు భోగములపైఁ గాలూని నృత్తక్రియా
కేళిం దేలె నితండె చూచితివె యీ కృష్ణున్ మహావిష్ణునిన్. 921

క. గోవర్ధనభూమీధ్రము, నావిష్కృతశక్తి నెత్తి హస్తాంగుళిపైఁ
జేవమెయి సప్తరాత్రము, లావాసవుఁ డద్భుతపడునట్టులు నిల్పెన్. 922

క. ధేనుకుఁ డరిష్టనామక, దానవపతి కేశియనెడు దైత్యేశుండీ
మానితమతిచే హతులయి, రీనిర్జరపూజితుఁడెసుమీ కృష్ణుఁ డనన్. 923

క. అతఁడే బలరాముం డ, చ్యుతుని పురోభాగమందు నున్నాఁడు విలా
సతతగతు లొప్ప నరిగెడు, నతివలహృన్నేత్రములకు నానందదుఁడై. 924

చ. అనుపమ సత్పురాణముల యర్థమెఱింగిన ప్రాజ్ఞు లెల్లఁ గృ
ష్ణుని యదువంశ ముర్విపయి శోభిలఁ జేయఁగ గోపబాలుఁడై
జని గనియుం బరాత్పరుఁడు చక్రియటంచు వచింతు; రీతఁడే

వనజదళాక్షుఁ డీశుఁడు విభాసురతేజుఁడు భూతనాథుఁడున్. 925

తే. అవతరించెను భూభార మడఁప విష్ణు
వీవ్రజంబున నిశ్చయ మెన్న నిద్ధి;
యనుచు నొకనికి వేఱొక్కఁ డనువదించెఁ
బౌరు లీరీతిఁ దమలోనఁ బలుకుకొనఁగ. 926

చ. బలుఁడును గృష్ణుఁడున్ నృపసభం గనుపట్టిరి వారిఁ జూచినం
త లలితదేవకీహృదయ తామరసంబుననుండి స్నేహధా
రలు వడి జాఱెనో యనఁగ రమ్యపయస్సు లొగిన్ స్రవించె నా
జలరుహనేత్ర పుత్త్రకుల సంతస మొప్పఁగఁ జూచుచున్ వగన్. 927

క. విడనాడె నంత వసుదే, వుఁడు హర్షరసంబు మిగులఁ బొంగుచునుండం
గొడుకులఁ గనుఁగొని జరనున్, విడనాడుచుఁ దరుణతఁ గని విలసిలుచుండెన్.

క. ధరణిపు నంతఃపురసుం, దరు లతివిస్తారితాక్షి తామరసలునై
పరికించిరి బలకృష్ణులఁ, బురజనయోషిద్వతంసపూగము ప్రీతిన్. 929

క. హరినిన్ బలరాముని నే, త్రరమోత్సవ మొప్పఁ గనుచుఁ దద్విరతికిఁ గుం
దిరి వారిలోనఁ గొందఱు, తరుణీ మణు లొండొరులను దగు నాదృతిచేన్.

క. పిలుచుచు సంతోషంబునఁ, బలికిరి సఖులార! గోపబాలుని నయనో
త్పలముల మోమును గనుఁడీ, తలమే సౌందర్య మెన్న ధాతకునైనన్. 931

సీ. కువలయాపీడంబుఁ గూల్పుచప్పటిదగు నాయాసమునఁ గల్గి నట్టి స్వేద
బిందువు లొప్పుట వికసితశరదబ్జమున హిమాంబువులు గ్రమ్మినవిధంబు
కనఁబడియెడు మనజననంబు సఫలంబెయయ్యె నేత్రంబుల కమలతృప్తి
కలుగు నదృష్టంబు చెలఁగెను; శ్రీవత్సచిహ్నంబు లోకముల్ సిద్ధ మిచట

తే. నున్న వంచుఁ దెల్పు చున్నది చూడుఁడీ, వక్ష మరిహారణము బాహుయుగము
శత్రుజయమునుఁ దెల్పు సఖి! వీనిఁ జూడవే; బిససితంబు మోము వెలసె నదిగో.

క. సురుచిర నీలాంబరమే, పరిధానముగాఁగ మీఁది వస్త్రముగాఁగం
బరఁగెడుఁ; జాణూరుఁడు ఛీ, కరబలుఁడౌ ముష్టికుండు గర్వోక్తితతుల్.

ఆ. పలుకుచుండఁ దుల్యభాషణంబులఁ గృష్ణుఁ, గూడి పల్కుచున్న వాఁడు కనుము;
సాధుచిత్తుఁడు హరి చాణూరుఁడును దను, బాహుయుద్ధమునకు బలిమిఁ బిల్వ.

క. ఆయత్తపడుచు నున్నాఁ, డోయబ్జాక్షీ యిదేమి యొప్పునె యిది యం
చీయుద్ధ మాపు వృద్ధుం, డీయదనున నొక్కఁడైన నుండఁ గనను జూ. 935

చ. ఇపుడిపు డేగుదేర మది నెంచెదుయౌవన మొప్ప లేఁతయై
వపువు తగంగఁ గన్నులకు వారసిహర్ష మొసంగుకృష్ణుఁ డే
డ? పవిసమానకాయము వెడందయురంబును గల్గి చూడఁగా
నపరిమితాఘయుక్తుఁడును నై తగు వీఁడన నేఁడ? యక్కటా. 936

క. ఇరువురు సోదరులును సుం, దరతనువులు నూత్నయౌవనము గ్రాలఁగ భీ
కరరంగమునఁ జెలంగిరి, తరుణీ! చాణూరముఖులు దైతేయులు సూ. 937

క. దారుణరూపులు మల్లులు, ఘోరంబు నియుద్ధ మద్ది కోరెడువారల్
సారతరన్యాయంబును, గోరెడు వారనుచుఁ జెప్పఁ గూడునె చెప్పుమా. 938

క. ఏలన బలశాలురకుఁ, బాలకులకు సాగఁబోవు బాహురణంబుల్
జాలును దగదని నిల్పుకృ, పాలలితులు లేరుగాదె పద్మదళాక్షీ. 939

రామకృష్ణులు ముష్టికచాణూరులవధించుట.

చ. అనుచుఁ దలోదరుల్ పలుకు నాసమయంబున భూమి కంపమొం
దునటు ప్రమోదచిత్తమునఁ దోయజనేత్రుఁడు కృష్ణుఁడుఁ బలం
బున నరిభీతిదుం డగుచుఁ బొంగెడురాముఁడు రంగమందుఁ బెం
పునఁ దగి నిల్చి మల్లులసమూహము భీతిలునట్లు బాహువుల్. 940

చ. కరముల నప్పళించుచును గర్జనువారు మహాద్భుతం బిదే
వరుస నెఱింగిరో యనుచుఁ బల్కెడునట్లు చరించి; రప్పుడ
య్యిరువుర పాదఘాతముల నీధర బ్రద్దలుగాకయుండు ట
బ్బుర మని తోఁచుచుండెఁ; హరి భూరిపరాక్రమసార మేర్పడన్. 941

తే. పెనఁగ బూనెఁ జాణూరుతో వీరుఁడైన
హలధరుఁడు ముష్టికునితోడ నాహవంబు
చేయఁగాఁ బూనె; నత్తఱిఁ జెలఁగె వారి
భాషణంబులు శ్రుతులకు భూషణములు. 942

క. ఇరువురు సోదరు లల్లన, నిరువురు మల్లులను యుద్ధ మేపునఁ జేయం
దొరఁకొన సాధుజనంబులు, పరికించుచుఁ దగునె యిట్టి పద్ధతికలదే.

సీ. అనుచుండఁ జాణూరుఁ డాకృష్ణుఁడును బూన్కినొక్కభంగిగనొక్కరొక్కరిపయిఁ
బడుచుంట నప్పాటు పరువడిఁ దప్పించుకొనుటయు నెల్లరు వినుతిచేయఁ
దగియుండెఁ; నిదెవ్రేటు తప్పించుకొను మని హెచ్చరించుచు వార లేచి ముష్టి
తాడనంబుల విచిత్రముగఁ బోరుచుఁ జిల్లకోలల దెబ్బల నోలి నొవ్వఁ

తే. జేసి యార్చుచు నొండొరుఁ జేరి వజ్ర
సన్నిపాతములను నొంచి సత్త్వ మడఁగఁ
జేయఁ బూనుచుఁ బాదముల్ చేర్చి పీడఁ
గలుగఁగా సంతసించుచుఁ గదన మిట్లు. 944

క. అతిఘోరము గతశస్త్రం, బతిదారుణము నయి యుద్ధ మయ్యాది చూడన్
బ్రతిలేక విరాజిల్లెను, జ్యోతిలేనిబలంబు మిగుల నొప్పు నిరువురన్. 945

క. పోరాడుచుండి రొక్కట, ఘోరాహవ మద్ది ప్రాణఘాతము బలముల్

వైరికి వ్యయించి యశమును, గోరినదై చూచుజనులకుఁ బ్రమోదదమై. 946

క. అలరారుచుండెఁ; మల్లుం, డలయక పోరాడుచుండ హరి శక్తియు ని
ష్ఠుల దాని నడఁచు చుండెను, గలఁడే హరితోడఁ బోరఁగా నెవఁడైనన్.

క. క్రమముగఁ జాణూరుని స, త్త్వము తగ్గుచునుండెఁ బ్రాణతతి యిఁక నిలువన్
సమయము లేదని తోఁచెను, మమతం గాపాడువాఁడు మహి లేకుండెన్.

చ. హరియు జగన్మయుండగుట నాతనితోఁ బ్రమదంబుమీఱ సం
గర మొనరించుచుండె శిశుకల్పునిగా రిపునెంచి లీలఁ; న
త్తరుణమునందు స్వేదజలధామము దేహముగా రుడుగ్రుఁడై
కరములఁ ద్రిప్పుచున్ మనసు గాఢతరవ్యసనాబ్ధి మున్గఁగన్. 949

ఆ. పోరుచుండె నెటులొ భూపతి యప్పుడు, తనదుమల్లునందు దర్పహాని
గలుగుచుంట నెఱిఁగి జలజాక్షు బలవృద్ధి, యును దలంచి కోపమున మునింగి.

సీ. వాద్యతాడనముల వలదని వారించె నపుడు మృదంగాది హరివాద్య
రవములు తగ్గె నభ్రమున దేవత లొగిఁ దూర్యనాదములు సంతోష మలరఁ
జేయుచు గోవింద నీయరిఁ జాణూరు మాయింపు వేగంబ మావినుతులఁ
గైకొను విజయంబుఁ గాంచుము దానవుం డీతఁడు గావున నిపుడె చంపు

తే. మనుచు నంతర్హితులునయి యమరులెల్లఁ
బలుక నాలించి మల్లుతో బాహుసంగ,
రమున నించుక క్రీడించి యమరతృప్తి
చేయ నూహించి యవలీలఁ జేవ మెఱయ. 951

చ. కరములఁ బట్టి పైకెగయఁగా వడివైవఁగఁ బూని దిర్ధిరం
దిరుగఁగఁ జేసి వానిని వధింపఁగఁబూనియె నూఱుమాఱు లం
బరమున బంతివోలెఁ బలుభంగులుగాఁ దిరుగంగఁద్రిప్పి వే
ధరణి స్పృశింప మోఁదె శతధా తను వత్తఱి నయ్యె ధూళిఁగన్. 952

చ. అతనిశరీర మత్తరుణమందు నసృగ్బహుధారలన్ గనన్
వితతభయంబు గల్గుగతిఁ బృథ్విని వే తడిపెన్; హలాయుధుం
డతులితశౌర్య మొప్పఁగ మహాసురుతో హరిభంగిఁ దాను ను
ద్ధతుఁడగు ముష్టికుండనెడుదానవుతో రణమొప్పఁ జేయుచున్. 953

మ. హరి చాణూరు వధించు టారసి మహాహంకారు నాదైత్యు ని
ష్ఠురముష్టిన్ దల బ్రద్దలౌవిధమునన్ శూరత్వమేపాఱ నా
తురతం బొందఁగ నొంచి జానుహతి నాధూర్తోరువక్షస్థ్సలం
బురుపీడం గనఁజేసి దేవవరు లోహోయంచుఁ గీర్తింపఁగన్. 954

క. ధరణిం బడవైచి జనో, త్కరములు గనుఁగొనుచు నుండఁగాఁ బిండిగఁ జే
సి రహితజీవితుఁ జేసెను; హరి తోశలకాఖ్యమల్లు నట్టి బలమునన్. 955

క. బలశాలి యనుచు జంకక, బలుముష్టిప్రహరణమున వసుమతిఁ బడి మి
త్రులు చూచుచుండఁ బ్రాణం,బులఁ బాయఁగఁ జేసెఁ గ్రోధమూర్తి తనరఁగన్.
సీ. చాణూరముష్టికుల్ సమసిన బలశాలి తోశలాఖ్యుండు ధూర్తుఁ డిట్లు
హతుఁడయినం గాంచి యవ్వారిమిత్రులౌ మల్లు లెల్లను భీతి నుల్లము లోఁగఁ
దల్లడిల్లఁగఁ బాఱి రెల్లదిక్కుల కట్టె; రంగస్థలంబున రామకృష్ణు
లుల్లాస మొప్పాఱ మల్లులు చరియించుపద్ధతిఁ జరియించి రిద్ధపౌరు
తే. షములఁ దుల్యవయస్కులై సమబలు లగు, గోపబాలురఁ జేరి యకుంఠితగతు
లలర నుండిరి; కోపరక్తాత్ముఁ డగుచుఁ, గంసుఁ డంతట సేవకగణముఁ బిల్చి.
క. గోపాలబాలకులు వీ, రీపట్టున రంగమందు నెసఁగుచు నున్నా
రీపాపుల వెడలింపుఁడు, గోపవరున్ నందుఁ బట్టుకొనుఁడు జవమునన్. 958
క. పాపుఁడు గావున నిగడ, వ్యాపారంబునను వీనిబంధించుటయే
యీపట్టున న్యాయం బగుఁ, బాపుని వసుదేవు వీనిఁ బట్టుకొని తగన్. 959
తే. వృద్ధులకుఁ జేయఁగారాని విధిని దండ
నమున బాధింపుఁ డిదె గోప సముదయంబు,
కృష్ణునిన్ రామునింగూడి క్రీడచేయు,
చున్న వారిందు మర్యాద యొప్పకుండ. 960
క. గోవులు ధనముఖ్యంబులు, గావున వానిన్ హరింపఁగాఁ దగు మఱియే
మే వసుసంచయ మున్నను, వేవేగమ దీసికొనుఁడు వేడ్క మదాజ్ఞన్. 961

కంసవధము.

చ. అనుచు విధించుకంసుఁ గని యాహరి నవ్వుచు నెల్లవారు తన్
గనుఁగొన నేలనుండి యొకగంతున కాఘనమంచమూర్ధమున్
గనునటు దాఁటి కంసుని నఖండవిభూతి నెసంగువానిఁ బెం
పునఁ గనులావరింపఁ దనపోకడ నెన్నకయుండు దుర్మతిన్. 962
చ. కరమున జుట్టుపట్టుకొని గాఢతరంబగుశక్తిమీఱ సుం
దరవరరత్నసంఘటితం బగు హారికిరీట మొక్కటన్
ధరణిఁ బడంగ నీడ్చి వసుధంబడు నాతనిమీఁదఁ దాఁ బడెన్
సురవరు లెల్ల నౌర యని స్తోత్రముచేయుచుఁ జంపు మంచనన్. 963
క. జగదాధారుం డగునా, యగణితమహిమాఢ్యుఁ డట్టె యాత్మాంగముపైఁ
బగపూని దుముక నోర్వం, గఁగలఁడె యెవఁడైనఁగాని కంసుఁడు ఘనుఁడే.
చ. హరియు నురస్స్థలిం బడినయంతనె ప్రాణము లట్టె లేచి స
త్వరముగఁ బోయె నెచ్చటికొ తత్పద మెవ్వరికే నశక్యమౌ
ధరణిపుఁ డుగ్రసేనవసుధాపతిపుత్త్రుఁడు కంసుఁ డీల్గ శ్రీ
వరుఁడు శిరోజముల్ కయినిబట్టి వడిన్వడి నీడ్చె మేదినిన్. 965

చ. అతిబలమొప్ప భూవరుని యంగము నెల్లెడ రంగమందుఁ గు
త్సిత మిది యంచుఁ దోఁచెడుగతిన్ హరి యీడ్చెను; గౌరవంబు భూ
పతితఁ జెలంగునాతను వధవ్యముగాఁ గనుపట్టెఁ బ్రాణవి
చ్యుతి గనినంతనే సురుచిరోన్నతియున్ నశియించు టబ్రమే. 966

మ. హరిచేఁ గంసుఁడు చంపఁగాఁబడిన నుద్యత్క్రోధ మొప్పార సో
దరుఁడై నట్టి సునాముఁ డాహరిని దోర్దర్పంబునన్ జంప నా
తురమొప్పం జనుదేర రాముఁ డచటన్ దోర్లీలమైఁ ద్రుంచె నా
మరణంబుం గని రంగమండలము భీమంబై తగెం జూడఁగన్. 967

క. పరఁగెను హాహాకారము, లురుగతి తచ్ఛబ్ద మట్టె వ్యోమంబున ని
ష్ఠురగతిఁ బర్వెను మథురే, శ్వరుఁ డిట్టు లవజ్ఞఁ గృష్ణ బాహాహతుండై.

క. తనువుఁ దొఱంగుట మాత్రము, జనులకు నప్రీతి నొసఁగె సంతసమున నా
వనజాక్షుఁ డంతఁ జయ్యన, జనకుని పాదముల కెరఁగె శాస్త్రవిధియుతిన్. 969

క. జననికి వందన మర్పిం, చెను దేవకి భర్తఁగూడి శ్రీహరిఁ బ్రీతిం
గనియెన్ బలదేవుండును, జననీజనకులకు మ్రొక్కె సద్భక్తి తగన్. 970

వ. దేవకీవసుదేవులు శ్రీకృష్ణునిం జూచి తదుక్తవచనంబులు తలంపునకురా నతని
మహత్త్వంబును స్మరించి నిలుచుండియే మనంబుల నమస్కరించి రప్పుడు
వసుదేవుండు. 971

క. సురనాథా! త్రిదశార్చిత, వరదా దయ యనుపవయ్య వారిజనేత్రా
కరుణాకర మమ్ముల ని, ర్వర నీసంసృతిని దాఁటఁ బూన్పుము త్వరగన్. 972

మ. తొలిజన్మంబునఁ బూజితుండ వయి సంతోషంబునం బుట్టి తీ
యిల మద్దేహమునందు దుష్టమతులన్ హింసింప నట్లౌట మ
త్కులమున్ బావిత మయ్యె భూతములలో గూఢంబుగా నుండు వు
జ్జ్వలతేజుండవు భూతభావనుఁడవై భాసిల్లుచుం డెప్పుడున్. 973

తే. సముఁడవై యెల్లకాలంబు సర్వభూత
మయుఁడవై యుందు వట్టినీమాయ తెలియ
శక్యమే దేవకీపుత్త్ర శబ్ద మిద్ధి
నీకు నొక్కవిలాసంబు నిర్వికల్ప. 974

సీ. సర్వదేవార్చితాసనములఁ బూజింపఁబడుదువు చింతింపఁ బడనిరూప
మునఁ దగియుండియు వనజాక్ష యజ్ఞంబు యజ్ఞకర్తయు నీవ యాదిదేవ
పాపహ్నవంబయి యాత్మ నీయందున నలరారుచున్నది యనుపమాన
కరుణచే దేవకీ కాంతకుఁ గొడుకనఁ బ్రఖ్యాతిఁ గాంచుట వాసుదేవ
తే. నీకు నొక్కవిలాసంబు శ్రీకళత్ర!, సృష్టికర్తవు నీవె భూతేశ్వరుండ
వీవె యాద్యంతములులేక యొసఁగు దీవు, నిన్ను వర్ణింప నేర్తునే నీరజాక్ష.

ఉ. మానుషజిహ్వ యియ్యది కుమార యటంచుఁ బిల్వఁ బూను నీ
మానము నెన్న శక్యమె సమస్తజగంబులు వెల్గఁజేయు దో
శ్రీనిలయా జగంబులకు సిద్ధివి నీవెకదా తలంప మా
యానియతిం గుమార యని యాదృతిఁ బిల్చుట సంభవించెఁ జూ. 976

తే. మాయచేతను గాకున్న మాధవా భ
వత్స్వరూపంబు తెలియంగ వశముగాక
యున్నను గుమారయని పిల్వఁ జన్నె మాకు;
నీతనువునందె జగమెల్ల నిలిచియుండు. 977

సీ. తలఁపఁ గోష్ఠోత్సంగ ధామమునం దీవు శయనించియుందు వో జలజనాభ
యట్టి నీవెట్లు మర్త్యాంగధారివిగాఁగఁ గానంగఁబడుదువు కరుణ యునుపు
మీశ్వరా జగమును నెల్లధర్మంబుల నలరారఁగాఁ జేయ వయ్య భూమి
నంశావతారంబు నంది నాకుం బుత్రుఁ డవె యైతి పరమేష్ఠి వివిధజంతు

ఆ. సృష్టిచేయు నతఁడు శ్రీధరా! నీనుండి, కలిగె నతఁడు మొదలుగా మహీరు
హములవఱకుఁ గలుగు నఖిలప్రపంచంబు, మాయచేతఁ జిక్కు మాడ్కిఁ జేసి.

క. చరియింపఁ జేయుచుందువు, పరమేశ్వర! నీదుమాయఁ బడి కొడు కంచుం
బరికించి కంసుభయమునఁ, ద్వరఁ జేర్చితి గోకులంబు వాంఛానుగతిన్. 979

తే. గోకులంబున నించుక కొఱఁత గనక, వృద్ధినొందితి నాపుణ్య విధిని గృష్ణ
సకలదేవతలందు నా జని ఫలయుత, మనఁగఁ దగు నీకుఁ దండ్రినై తనరుచుంట.

ఆ. విష్ణుమూర్తివీవు విశ్వోపకారము, చేయఁబూని పుట్టితీయిలాస్థ
లమున నాదుపుణ్య మమర ఫలించుట, నాకు సుతుఁడవైతి నళిననేత్ర. 981

ఎనుబదియాఱవయధ్యాయము.

శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవులతో సంభాషించుట.

క. తొలిజనిఁ జేసినకర్మం, బుల తీరునెఱింగియుంటఁ బొల్పుగ జ్ఞానం
బులఁగాంచిన జననీజన, కులఁ జూచి పరాత్పరుండు కోరిక మీఱన్. 982

క. తనవైష్ణవమాయను గ, ప్పెను వారలఁ జేయఁదగిన పృథుకార్యములన్
మనమున నెంచుచు నపుడి, ట్లనియెన్ దల్లీ కుమారు నాదృతి గనఁగన్. 983

క. జనకుఁడు నీవును దలఁచుట, యు నెఱుంగుదు నేను మిమ్ము నొప్పుగఁజూడం
గను గోరుచుందుఁ గాలము,చనియెం గార్యాంతరముల సంపడివలనన్. 984

ఆ. దుష్టకంసభీతి దోఁచుట గర్భసం, కర్షమునఁ గొంత కాల మెట్లొ
గడపినారు మీరు కావున నట్టిమీ, కష్టములను మాపఁ గడఁగకుంటి, 985

క. ఈయపరాధము సైపం, దేయధముఁడు మాత్రపితల నెంతయుఁ బ్రీతిన్
న్యాయమునఁ గావఁ డాతని, యాయుఃకాలంబు వ్యర్థ మనఁ దగుఁ జుండీ.

సీ. అట్టులుండియు నేను నార్తుల మిమ్మును గాపాడకుండ నిక్కాలమువఱ
కూరక గడపితిఁ; గోరి దేవద్విజగురుమాతృపితృపూజకుండు గాఁగ
నుండు నాతనిజన్మ మొప్పారుసఫలమై తనుధారులకుఁ జేయఁ దగిన కృత్య
మిద్దియే కావున నేఁ జేసినట్టియీ యపరాధమును సైప నర్హము మహిఁ

ఆ. గంసభీతి వాసెఁ గాదె యం చోగి వేఁడి, వందనంబు సలిపి వరుస నితర
వృద్ధులకును మ్రొక్కి యొలమిఁ బూజించి వా, రెల్ల సంతసముల నెసఁగఁజేసె.

ఉ. అంతటఁ గంసుపత్నులు మహాహవభూమి శవాకృతిం గనన్
సుంతయుఁ గానిభంగిఁ బడి శోణితరజంబున బుంగియున్న భూ
కాంతుని గంసుఁ గాంచి వ్యథ కాఱియ పెట్టఁగఁ జొట్టునిల్చుచున్
వంతలఁగుంది యేడ్చి రోగి వారనిదుఃఖము పెల్లునం గడున్. 988

ఉ. తల్లులు నట్టె యేడ్చిరి వ్యథన్ మది పెల్లుగఁ దల్లడిల్ల భూ
వల్లభవర్య పుత్త్రక యభవ్యగతిన్ రణభూమి బ్రుంగితే
తల్లుల మంచు మమ్ము సతతమ్మును గౌరవమొప్పఁ జూచు నీ
యుల్లమి దేల నిర్దయత నొప్పె నటంచును నార్తిఁ బల్కుచున్. 989

చ హరియును వారిదుఃఖమున కార్తిని గాంచుచు నశ్రుపూరముల్
దొరఁగఁగ వారిఁ జేరి యిఁక దుఃఖము మానుఁడు వ్యర్థ మీవ్యథా
తురత యటంచుఁ బల్కి గతదోషుఁడుగాఁ దగె మీకుమారుఁ డి
త్తరుణమునందు నన్న విని దారుణశోకము మాని మానినుల్. 990

తే. ఊఱడిల్లిరి; మధునామకోగ్రదనుజ, హంత యంతట నుగ్రసేనాఖ్యుఁ జేరి
చెఱనువిడిపించి యభిషిక్తుఁ జేసె నైజ, రాజ్యపదమున నాత్మజరహితుఁ గృపను.

సీ. రాజ్యాభిషిక్తుఁడై రామకృష్ణులఁ దగఁ బూజించి మృతుఁడగు పుత్త్రునకును
రంగమండపమున రామకృష్ణులచేత హతులగు వారికి నయ్యదనుఁ
బ్రేతకార్యములనువిధియుక్తి నొనరించె; నిట్లౌర్ధ్వదైహిక మెల్లరకును
జక్క నొనర్చి సంసక్తరాజ్యుండయి యొప్పుచున్న యయ్యుగ్రసేనుఁ

ఆ. గాంచి పలికె నపుడు కాంచనచేలుఁడు, భూప! నేను జేయఁ బూనఁదగిన
కార్య మిద్ది యనుచుఁ గరుణ నాజ్ఞాపింపు, మాత్మ సంశయములనంద కింక.

ఉ. అమలకులంబు యాదవులదయ్యు యయాతి యొసంగినట్టి శా
పమున నరాజ్యయోగ్యమయి భాసిలకున్నది యింతదాఁక నిం
క మహిఁ జెలంగుఁ బూజ్యమయి క్ష్మాపతు లౌర! యనంగ సేవక
త్వమును వహించి నేను నిట దాపున నుండఁ గొఱంత యేమిఁకన్. 993

చ. మనుజులమాట యేటికి? నమర్త్యుల నెల్లర నాజ్ఞ నిల్పు మో
జనవర యంచుఁ బల్కి మనుజప్రహితోక్తుల లీలచేత నే
మనుజతఁ గాంచియున్న హరి మారుతుఁ గన్గొనిపల్కె నిట్టులో
యనిలవిభూ! త్వరం గదలి యాపురుహూతునిఁగాన నేగుమీ. 994

మ. కని నామాటగ నిట్లుపల్కు హతపాకా! గర్వముల్ వీడి నా
పనుపుం జేయుమ యుగ్రసేనునకు నీభాస్వత్సుధర్మన్ జవం
బున నర్పింపుము యాదవక్షితిపుఁడై పొల్పారు నీరాజవ
ర్యున కర్హంబది యొక్క నన్నువిని వాయుస్వామి హర్షంబునన్. 995

చ. కదలి యమర్త్యవాసమును గానఁగఁబోయి పురందరున్ మహా
ముదమునఁ బొల్చువానిఁ గని మ్రొక్కి పరాకని కృష్ణువాక్యముల్
వదలక తెల్పఁగా వినుచు వాసవుఁ డప్డె సుధర్మ నిచ్చె న
య్యది పవనాహృతంబగుచు నాహరి చూడఁగఁ జేరె నప్పురిన్. 996

సీ. సర్వరత్నాఢ్యయై సాధుసంస్తుతయయి మాన్యయై తగు సుధర్మను యదూద్వ
హులు మురారిసహాయ మొప్పఁగానసుభవించిరి కృష్ణమహిమనుచిత్తమందు
నెఱఁగియు గురుశిష్యు లేరీతిఁ జరియింతు రట్టి మర్యాదనే యాశ్రయించి
జగ మెఱుంగఁగ ధర్మసంతతి వీడక; యంతట సోదరు లఖిలశాస్త్ర

తే. విద్వరులునయ్యు సుజ్ఞానవేత్తలయ్యు
గురువు శిష్యుఁడు నను నీతి నరసి ప్రోవ
జగములకుఁ దెల్ప సకలాస్త్రసరణి నెఱుఁగఁ
గోరి సాందీపనిం జూచు కోర్కి మిగుల. 997

క. చని రాసాందీపనియున్, మునిపతియై కాశ్యపకులమున జనితుండై
ఘనుఁడై యవంతినగరం, బునఁ గాపురముండె వేదమూర్తి యనంగన్. 998

రామకృష్ణులు సాంగీపనియొద్ద విద్యనభ్యసించుట.

ఉ. ఆముని నాశ్రయించి తగినట్టులు శిష్యులుచేయు కృత్యముల్
నేమము మీఱఁజేయుచు మునిన్ ముదమొందఁగఁ జేయుచున్ మహో,
ద్దామపరాక్రమంబు తగఁ దద్దయుభక్తి రహస్యయుక్తమై
శ్రీమహితంబు సర్వవిధసిద్ధి పదంబునునై దురూహ్యమై. 999

క. తనరు ధనుర్వేదంబును, మునివరు నుపదేశమాత్రమున నెఱఁగిరి; యం
దు నిలిచి యఱువది నాలుగు, దినములు శాస్త్రాళి నేర్చి ధీమహిమమునన్. 1000

క. అరుదంది యంద ఱియ్యది, ధరణిం గలదే యటంచుఁ దమ్ము నుతింపన్
బరఁగిరి సాందీపని యొ,వ్వరికిన్ సాధ్యంబుగాని వారిచరితమున్. 1001

క. పరికించి యమానుష మిది, ధరఁ జేరిన చంద్రరవులె తప్ప దనుచు నెం

చి రహిఁ నెఱింగించెను సత్వరముగ సకలాస్త్రములను ధన్యుఁడ ననుచున్.
క. ముని యుపదేశించినరీతిని సర్వ మెఱింగి భక్తి దేశికవర్యా
మతమున నెన్ని వరింపం,జను గురుదక్షిణయు నే దొసంగం దగునో. 1003
చ అనుటయు నామహాముని మహామతి గావున వారిదో మహా
త్త్వనియతి నెంచి ముక్త లవణవార్ధి మృతుండగు పుత్త్రుఁ దెచ్చి యి
మ్మని తెలియంగఁ జెప్పెఁ దనయాశయ; మంతట రామకేశవుల్
చనిచని యస్త్రసంపదలఁ జాలఁగఁబొల్చుచు నుప్పుసంద్రముక్. 1004
చ కనుఁగొని సాగరోత్తము యఖండతరంగవిభూతి నొప్పు నీ
వనువున మద్గురూత్తముల యాత్మజు నిమ్మని పల్కఁ; రంత నా
వననిధి చేతు లొగ్గి తనబాహుతలంబున నర్ఘ్యపాత్ర మొ
ప్ప ననియె మీగురూత్తముని బాలకు నే హరియించినాఁడనే. 1005
క. ఓమాన్యులార; నేనో, యామాన్యుని సూనుఁ గొనఁగ నఘశీలుఁడనే
నామమునఁ బంచజనుఁ డన, నీమహిఁ బ్రఖ్యాతిఁగన్న హీనుఁ డలరెడిక్.1006
చ. దనుజుఁ డతండు మీగురువతంసుని పుత్త్రికనిక హరించె నా
తని తనువొప్పు శంఖముగ దారుణవిక్రముఁడైన యాతఁ డొ
ప్పును మదుదగ్రసాథసులఁ బూన్కి వధింపుఁడు వాని నంచు నా
వనధి యదృశ్యుఁ డయ్యెఁ; హరి వార్తను దాని నెఱింగి యంతటక్. 1007
చ జలనిధియంతరంబు శరచాపములూని జవంబుమీఱ ని
మ్ములఁ జొరఁబాఱి పంచజను మూర్ఖుని దైత్యునిఁ జక్రధారచే
విలయము నొందఁజేసి యలవీరుని యస్థిభవంబు శంఖముక్
బలిమి గ్రహించె శ్రీహరియు; భవ్యతదుత్థనినాద మెంతయుక్. 1008
క. దితిజుల చెవిసోఁకిన చోఁ, మితిమీఱిన తద్బలంబు మిక్కిలి తగ్గుక్
గ్రతుభుజులకుఁ దేజం బున్నతిగాంచు నధర్మరాశినశియించు వడిక్. 1009
చ. హరియిటు పాంచజన్యమన ఖ్యాతి వహించిన శంఖవర్య మా
దరమున నొత్తి ప్రేతపతి స్థానముఁ జూడఁగఁ బోయె నంత సో
దరుఁ గనఁబోయి రాముఁడు నితాంతబలంబున ధర్మరాజు సం
గరమున నోడఁజేసి యటఁ గల్గుకుమారుని యాతనాగతుక్. 1010
చ. మునుపటి యట్ల దేహమునఁ బొల్చినవానిగ వే యొనర్చినక్
వనజదళాక్షుఁ డన్నయును బాలుఁడు తోఁ జనుదేర వచ్చి యా
తనయుని గాంచుహర్షమునఁ దద్దయుఁ బొంగుచునున్న సద్గురుం
గని తమి నప్పగించె శిశుకల్పుని ఖేచరు లెల్ల మేలనక్. 1011
చ. గురునియనుజ్ఞ నొంది యదుకుంజరుఁ డగ్రజుఁగూడి సాధుభూ
వరపరిపాలితం బగుచు భవ్యవిలాసమునక్ జెలంగి పూ

ర్వరమన నొప్పునమ్మథురభాసురలీలను జేరి యందు హ
ర్షరతి మెలంగు స్త్రీపురుషసంతతి గాంచెను వేడ్కమీఱఁగన్. 1012

## ఎనుబదియేడవ యధ్యాయము.

జరాసంధుఁడు రామకృష్ణులతోఁ బోరి యోడుట.

క. బలశాలి జరాసంధుఁడు, ఖలయుతుఁడై భూతలంబు కడు స్వేచ్ఛమెయిన్
గలుములు తగఁ బాలించెను, గల రాతనికాత్మజలు నికామగుణాఢ్యల్. 1013
ఆ. అస్తి యనియుఁ బ్రాప్తి యనియు వారలపేరు,లిలఁ బ్రసిద్ధి నొందె నిర్వురను ద
గంగఁ గంసుఁ డాత్మకాంతలఁ గాఁ గొనె,విధియుతముగ నట్టి వెలఁదులు క్రుధ.
చ. హరి తమభర్తఁ జంపె నని యార్తితగన్ దెలియంగఁజేసి రా
తురమునఁ దండ్రి కాతఁడును ధూర్తభటావళిఁ గూడి రామునిన్
హరిని వధించుకోర్కి మెయి నాగ్రహమూని సయాదవంబుగాఁ
బురమును గాల్ప వచ్చె హరిపూన్కి నెఱుంగని మూర్ఖుఁ డౌటచేన్. 1015
చ. పరిసరమందునిల్చి వగఁ బౌరుష మట్టె చెలంగ ముట్టడిం
బోరి నొనరింప నాజ్ఞయిడ భూరిపరాక్రమ ముల్లసిల్ల నా
పురమును నాఁగి రాభటులు పోవుట వచ్చుట యాఁగిపోయె నె
వ్వరికిని దక్క దీపురము వైరిబలంబులచేతఁ జిక్కెడున్. 1016
ఆ. అనుచు మదులఁ దోఁచె నక్షౌహిణులు త్రయో,వింశతులుగ లెక్క వెలసె నంత
గొల్లఁది యాదవసుభటులఁ గూడి రామకృ,ష్ణులు రణంబు చేయఁ జొచ్చి రపుడు.
చ. ఇరువురు బాలకుల్ కదన మెట్టు లొనర్తురొ వీరిసైనికో
త్కరములతోడ నంచు సురకాండము లోనఁదలంచి చూడ నం
బరమున నిల్చె నప్డు బలభద్రుఁడు శౌరియు నాత్మలందు నెం
చిరి తమ పూర్వశస్త్రములు చెచ్చెర రాఁదగు నంచుఁ బూనికన్. 1018
చ. తలఁచినయంత నే యట సుదర్శనశార్ఙ్గము లక్షయాంబకం
బులఁ దగుతూణయుగ్మమును బొల్చెఁ బురస్థలిఁ జిత్రరీతిఁగా
హలము సునందనామముసలాయుధమున్; హరి సీరపాణు లు
జ్జ్వలతమసాధనంబులను బాహువు లందొగిఁ దాల్చి యంతటన్. 1019
మ. సమరంబున్ సలుపంగఁబూనఁగ జరాసంధోగ్రసైన్యంబు లు
ద్యమ మొప్పారఁగఁ బోరి యోడె నధిపుం డట్లయ్యె నాసోదరుల్
క్రమముం దప్పక వారిఁ జెండి పురవర్యంబుం బ్రవేశించి రు
త్తము లానందమహాబ్ధి మున్గ రిపుఁడున్ దా నోడి సిగ్గొందుచున్. 1020
క. తలవంచుకొనుచుఁ బోయెను; నిలయంబున కంతఁ జక్రి నిర్జితుఁడయ్యెన్

బలశాలి వైరి యని యెదఁ, దలపఁక యతఁ డోడఁడనుచుఁదలఁచెఁ మిగులఁ
ఆ. బ్రదికి యుండినంత పర్యంత మీవైరి, యోడె ననుచుఁ దలఁచుటొప్ప దనుచు
హరి తలంచె నంత నాజరాసంధుఁడు, బలయుతముగ మరల వచ్చె ననికి. 1022
క. మరలం జని బలభద్రుఁడు, హరియు జరాసంధుతోడ నద్భుతరీతిఁ
దురమొనరించి జయించిరి, పరబలములఁ బరుని శౌర్యపాటవ మలరఁ. 1023
సీ. ఓడి సైన్యంబులఁ గూడి పురింజేరి మరల యుద్ధముసేయ మాగధుండు
వచ్చుచు నోడుచు వరుసగాఁ బదిపైని నెనిమిదివారము లేకవిధము
గా సంగరముచేసి ఖండితభటుఁడయి కృష్ణపురోగముల్ జిష్ణుతేఁ గన
వగుచుచుఁ బోయెను స్వల్పవీరులఁగూడి యదుబలం బత్యల్ప మైనఁ గృష్ణ
ఆ. రక్షితంబుగాన రంజిల్లు చుండెను, హరియె చెంతనుండ నపజయంబు
గలుగు నెట్లు?మనుజకాయంబుఁ దాల్చిన, నది విలాసమెకద యఖిలపతికి. 1024
క. పలువిధములైన యస్త్రం, బుల వైరులపైని వైచు పోలిక మదిలోఁ
దలఁచిన భగవంతునిదౌ, విలాస మలరారు నెదుట వింతగ నెపుడుఁ. 1025
క. ఏమహనీయుఁడు మనమున, నేమాత్రము శ్రమము గనకయే సృజియించుఁ
దా మనుచుఁ ద్రుంచు జగముల, సామాన్యన కరివధ మన నది యొక పనియే.
క. ఐనను ధర్మము లెయ్యవి; మానవులకుఁ జెప్పఁబడునొ మాధవుఁ డిల న
వ్వానిని దాఁ జేయును మఱి, హీనులతో యుద్ధమును నహీనులమైత్రిన్. 1027
తే. తానుజేయుచు మానవధర్మ మూని
యుండు సామము దానము నొప్పు భేద
మల్లె దండము చూపుచు నరసి యొక్క
తఱి బలాయనమును జూపుఁ దగిన దనుచు 1028
క. మనుజాంగము నూనిన వా, రొనరింపం దగిన విధుల నొగి నాదృతిఁ జే
యనుబూను లీల యనఁ దగు, వనజాక్షున కఖిలలోక వాసున కెపుడుఁ. 1029

---

ఎనుబదియెనిమిదవయధ్యాయము.

కాలయవనోత్పత్తిప్రకారము.

క. ధరణీసురు గార్గ్యుని నొక, తరుణంబున షండుఁడనుచుఁ దా యాదవుఁడుఁ
బరిహాసము చేసెను న, వ్వారి యాదవులెల్ల గోష్ఠవీథిఁ సభలోన్. 1030
తే. దానఁ గోపించి గార్గ్యుఁడు దక్షిణాప
థమున కప్పుడె పోయి పుత్త్రరతిఁ బూని
తప మొనర్చెను యాదవతల్లజులకు
భయము గల్పింపఁబూని యభవునిగూర్చి. 1031

క. హరు నారాధించుచు ని, ర్భరనియతి నయోరజంబు భక్షించుచు వ
త్సరములు ద్వాదససంఖ్యల, జరపంగాఁ దృప్తిఁబొంది శంకరుఁ డంతన్. 1032

క. వరమిచ్చెఁ గొడుకుఁ గనుఁదని, ధరణీసురమౌని నతనిఁ దగినవిధుల నా
దరమున యవనేశుఁడు పు, త్రిరహితుఁ డలరించె భక్తితాత్పర్యమునన్. 1033

చ. మునియుఁ బ్రమోదమంది తనబుద్ధిని వానియభీష్ట మెన్ని త
ద్వనితయు నప్డు పూతమతి వర్తిలుచుంటను సంగమించె నం
త ననలసన్నిభుండు గురుదస్యుగణాంతకరుండు నైన స
త్తనయుఁడు గల్గె యాదవుల దర్ప మడంపఁగ వీరవర్యుఁడై. 1034

తే. కాలయవనుఁ డంచు ఖండితారాతియౌ, నన్నయాశఁ బూని యవనపతియు
నామ మునిచెఁ దనతనయునకుఁ బ్రీతిమై, వయసు రాఁగఁ జేసెఁ బతిఁగ క్షితికి.

చ. తనయుని రాజుచేసి జర తత్తఱపెట్టఁగ సత్తపంబు చే
యను వని కేగె వృద్ధయవనాధిపుఁ డంతటఁ దత్తనూజుఁ డొ
య్యన మదమత్తుఁడై నృపుల నాత్మబలోన్నతిమీఱువారిశౌ
ర్యనియతి మించువారి రణమందు జయింపఁగఁ బూని వేడుకన్. 1036

ఉ. నారదుఁ గాంచి మౌనిజననాథ జగంబున విక్రమోన్నతిం
బోరఁగఁ జాలు వారలను భూపతులన్ వినఁగోరినాఁడ నీ
వారసి తెల్పుమీ యనిన యాదవవీరులె శౌర్యసంపదన్
ధారణిఁ బొల్చువా రనియెఁ దత్త్వవిదుత్తముఁడై తనర్చుటన్. 1037

ఆ. పెక్కుసంఖ్య మ్లేచ్ఛ వీరులతోఁగూడి, కరులు హరులు రథనికాయములును
గాల్బలంబు ననెడు క్రమమునఁ జతురంగ,బలము లొప్పుచుండ బవరమునకు.

క. చనియెను యాదవవీరుల, మునిపతి యొఱిగింప వారి పొగ రడఁగింపన్
దినదిన మెంచుచు నీర్ష్యను, గనఁబఱచుచు మథుర నొక్కగతిని జయింపన్.

చ. హరియు నెదందలంచె నిట యాదవసేనలు వీనిచేత సం
గరమునఁ జంపఁగాఁబడును గ్రమ్మఱ మాగధుఁ డేగుదెంచి యే
తరుణమునందు నొంచునొకో దారుణసంగరమందు మాగధున్
విరహితసైన్యుఁ జేసితిని విక్రమసంపదనైన నిత్తఱిన్. 1040

ఆ. బలవిహీనుఁడయ్యుఁ బంతంబుమీఱంగ, మరల ననికి రాఁగ మాగధుండు
దలఁచుచుండు మ్లేచ్ఛధరణీశుఁ డీతండు, కాలయవనుఁ డధికగర్వయుతుఁడు.

క. బలశాలియునగు నక్కట, విలయము యాదవుల కబ్బె ద్వివిధగతుల ని
మ్ముల దుర్గము గావించినఁ, బలుభంగులఁ గష్టము లొగిఁ బాయునుగాదే.

చ. అరిజనదుర్జయంబయిన యట్టి సుదుర్గము గట్టువాఁడ నుం
దరులును దానిసాయమున దస్యువధం బొనరింపఁజాలు సం

గరమును జేయువారన నీఁకఁ యదువృష్ణిముఖాన్వవాయజుల్
దుర నెుసరించు టబ్రమని తోఁపఁగఁజేయునె యట్లు గావునన్. 1043

క. మత్తుఁడనైనను నేను బ్రమత్తుఁడనేయైన నిద్ర మతి చేద్పడినఁ
జిత్తమునఁగల్గు ముదమున, నెత్తఱినే నితరదేశ మేగినైనన్. 1044

ఉ. వైరులు యాదవాభిభవవాంఛను బూనకయుండఁ జేయనా
నేరుపుమీఱ నట్టిపని నే నొనరించెద నంచు నెంచి యా
శ్రీరమణుండు వార్నిధిని జిత్తమునం దెయెసంగు వేడ్కమైఁ
గోరెఁ దదంతరంబునను కుంభిని ద్వాదశయోజనాకృతిన్. 1045

తే. పురముఁ గట్టంగ నిమ్మని పరమవిధినిఁ,గోరె నబ్ధియు నెంతయుఁ గూర్మి నొసఁగె
నందు నాత్మీయశక్తిచే నపుడె పురము, ద్వారకను గోర్కి నిర్మించె వైభవమున.

సీ. సురుచిరోద్యానముల్ శోభిల్ల నిరుపమవప్రముల్ తగ సరోవరశతమ్ము
లొప్పఁ బ్రాకారము లుప్పరంబును దాఁకునట్లసంఖ్యలుగ వియచ్చరు లెద
మెచ్చునట్లుగ నుండ మేటిపురం బిదె యనఁగ నిర్మించె నాయమరపతికి
నమరావతిని బూర్వ మమరశిల్పి చమత్కృతిని గట్టినట్లుగ దివ్యశక్తి

తే. నిట్లు పురమును నిర్మించి యెవ్వ రెఱుఁగ,కుండ మథురాపురంబున నున్నయట్టి
యాదవుల నెల్లఁ దనశక్తి నప్పురమును, జేర్చె నారీతి యాదవశ్రీని నిలిపి. 1047

క. జవమున మథురను బట్టం,గ వలయునని కాలయవనకాలుఁడు రాఁగా
నెవరిని సాయముగోరక, యవనేశుని జంప నరిగె హరి యొక్కండే. 1048

క. పురివెలుపల యవనేశుని, పరిజను లెల్లరును నిల్చి పంతంబున నీ
పురిఁ గొల్లఁ గొట్టఁ దగునని, త్వరపడుచుండంగ హరియుఁ దా నొక్కండై.

తే. ఆయుధములను గైకొన కట్టె వెడలె
నతని నా కాలయవనేంద్రుఁ డచటఁ గాంచి,
యితఁడె వసుదేవు సుతుఁ డనియెంచి హస్త
తాడనంబులఁ బట్టంగఁ దలఁచి వెంట. 1050

క. చనియెను యోగీంద్రులచే,తను మదిఁ నిల్పంగఁబడని దామోదరుఁ బ
ట్టను గోరి వెంటనంటెను, జనపతి యజ్ఞుండుగాన సంతసపడుచున్. 1051

చ. యవనుఁడు వెంటరాఁగ హరి యార్తని బాఱినయట్లు పోయి య
ద్రివరగుహం జొరంబడియెఁ దెంపుమెయిఁ ముచుకుందుఁ డందుని
ద్ర వజిలగాఁ బరుండి ఘనదర్పము సూపఁగమాని యుండె; హే
తువు గలదట్టులుండుటకుఁ దోఁచును గృష్ణున కావిధం బెదన్. 1052

చ హరి గుహఁ జొచ్చెనం చెఱిఁగి యయ్యవనేశకుమారుఁ డట్టె భీ
కరగుహఁ జొచ్చె శ్రీహరియుఁ గన్పడకుండెను శయ్యయందు సు,

* స్త్రీ రోఽ ఽీయత్ర యుధ్యేయుః కింపునర్వృష్ణి పుంగవాః=అనిమూలము,

స్థిరమతి నిద్రపోవునపుఁ జెచ్చెరఁ గాలను దన్నెఁ గృష్ణుఁగా
నరసి స్వకీయజీవిత మదంతము నొందు టెఱుంగకుండుటన్. 1053

చ. చరణము మేను సోఁకగ నెసంగెడుయోగము మాని యప్డె ని
ష్ఠురతరదృష్టిఁ జూచెను గడున్ దురితాత్ముని మ్లేచ్ఛవీరునిన్,
ద్వరఁగఁ దదీయదృష్టిజనితప్రబలాగ్ని శిఖాకలాపముల్
వరుస దహించె వానిదగు వర్ష్మము భస్మమయంబుగాఁ బడన్. 1054

చ. అతులితకోపదృష్టి దహనార్చుల నాతఁడు నీఱుగాఁ బడెన్
క్షితపయి; నామహామహుఁడు చిత్రచరిత్రుఁడు పూతశీలుఁడ,
ప్రతికృతి విక్రమాఢ్యుఁడు సురప్రకరంబులు దానవాళి యు
ద్ధతి ననిసేయ దేవసముదాయము పక్షము మాని దైత్యులన్. 1055

ఉ. భూరిపరాక్రమం బలరఁ బొంగడఁగించి చిరంబు శ్రాంతినే
కోరి సుషుప్తి యేఁచుటకుఁ గుందుచు వేఁడె వరంబు నంతదై
త్యారులు నిద్రనుండి నిను నారయ కెవ్వఁడు లేపఁజూచు దు
ర్వారభవత్క్రుద్ధాగ్నిశిఖ భస్మమగుం జుమి వాఁడు ప్రేల్మిడిన్. 1056

మ. అనుచున్ వేడ్క వరంబొసంగి రతఁడే యయ్యద్రియం దాబిలం
బున నిద్రించె నెఱుంగు దానిహరియుం బోయెన్ భయార్తుండు నాఁ
గననై వానివధింప నట్లె జరగెం గార్యంబు; నీరీతి నా
మనుజేశుండు దురాత్ముఁ జంపి యెదుటన్ మాయామనుష్యాంగునిన్. 1057

చ. హరిఁగని యేల వచ్చితివొ యన్వయమేదియొ యంచుఁ బ్రశ్న మా
దరమునఁ జేయఁ గృష్ణుఁడను ధన్యమతీ విధువంశమందు నీ
ధర జనియించి శూరసుతుఁ దండ్రిగ నెంచుచునున్న వాఁడ సు
స్థిరయశమొప్పు యాదవుల దివ్యకులంబునఁ బుట్టితింగదా. 1058

క. అన ముచుకుందుఁడు నెమ్మన, మున నప్పుడు వృద్ధగార్గ్యమునివరుపలుకుల్
దనపూర్వపుణ్యమునఁ దలఁ, పునకున్ రా సర్వమయునిఁ బూతచరిత్రున్. 1059

క. బ్రహ్మాండనాయకుని హరి, బ్రహ్మాదిసుపర్వవర్య వర్ణితవిభవున్
బ్రహ్మమును ముక్తిదాత న, జిహ్మాధిపశయను మాని సిద్ధవినుతునిన్. 1060

క. కని భక్తిపురస్సరముగఁ, బ్రణామ మర్పించి నీవె పరమేశాంశం
బునఁ బుట్టినశ్రీహరి వం,చని యష్టావింశతితమ మగుయుగమందున్. 1061

ఆ. వృద్ధగార్గివలన వినినాఁడ ద్వాపరాం,తమున యదుకులమున సుమహితాత్ముఁ
డచ్యుతుండు పుట్టు ననుచు నాహరివీవె, సందియమ్ము లేదు సత్యమిద్ది. 1062

క. మనుజుల కుపకారంబుం, బొనరింపఁగఁ బుట్టినావు పూజ్యచరణ! నీ
యనుపమతేజము చూడం,గను జాలను దేవదేవ! కరుణింపు మిటన్. 1063

క. అనుచుఁ సజలాంభోము, ధ్వనిఁ బల్కి త్వదీయపాదవనజయుగళసే
వను గోరినాఁడ మఱియుఁ, మును దేవాసురులకలహమున నేను విభూ. 1064

క. సురపక్షమూనియుంటిని, గరుణించితి వపుడు నీవు కమలాక్షా నీ
వర తేజముఁగన జాలక, సురులోగిఁ బాఱిరి భయంబు చొప్పడుట మఱిన్. 1065

ఆ. నేను జూడఁ జాలకే నిల్చితిని ప్రభూ!, భవమహాబ్ధియందుఁ బడినవాని
కొక్కనీవె శరణ మొక్కఁ డన్యుఁడు లేఁడు, తలఁప దీనసుజనతాపహరణ

క కరుణింపుము నాపయి నా, దురితంబుల నడఁచి కావు దోషాచరసం
హారణా! నీవే జలధులు, ధరణీధ్రములు నదులు వనతతులును నీవే. 1067

చ. ధరణియు నీవె యంబర సదాగతి వారి ధనంజయుల్ మహే
శ్వర! తలపోయ నీవె పర వస్తువు నీవె చరాచరంబులై
పరఁగెడు లోకజాలములఁ బర్వుచు వానికిఁ బైన లోన నీ
శ్వరుఁ డన నొప్పుచుండుదువు జన్మము నీకిల నామమాత్రమే. 1068

సీ. శబ్దాదిరహితుఁ డ జరుఁడు జన్మక్షయవర్జితుండును నన వఱలువాఁడ
వీవెకదా; నీదు నెల్లయంగములను విబుధులు పితరులు విమల యక్ష
గంధర్వరాక్షస గణములు సిద్ధులు నచ్చరల్ మనుజులు నంబరగతు
లలరు పక్షులు పశువులు సరీసృపములు మృగములు మఱియును మేదినీరు

తే. హములు జనియించె భూతభవ్యమ్ములు నగు
నట్టిచరములు నచరంబులైనప్రాణి
సముదయంబులు నీనుండి సంభవించుఁ
బరమపురుషా మహాత్మక భవ్యరూప. 1069

క. తనుధరము తద్విహీనం, బును స్థూలము సూక్ష్మ తరముఁ బొల్చును నీవై
విను నీ కన్యము లే దిల, వనజాక్షా నన్నుఁ బ్రోవు వారక యింకన్. 1070

క. తరియింపరాని భవసా, గరమునఁ బడి తిరుగుచుఁ ని కామము తాపో
త్కరపీడితుండ నగుచుఁ, వరనిర్వృతి గాంచలేక భ్రాంతుఁడ నగుచున్.

తే ఉన్నవాఁడను మృగతృష్ణ నురుజలాశ
యముగఁ దలపోయు నట్లు దుఃఖముల సుఖము
లనుగ భావించుచున్నాఁడఁ గనుక నవియె
తాపమున కయ్యె నాకు మాధవ కృపాబ్ధి. 1072

వ. రాజ్యబలకోశ మిత్రపక్షాత్మజ భార్యాభృత్య జనులును, శబ్దాది విషయం
బులును సుఖబుద్ధిచే గ్రహింపఁబడియె. ఇవి యన్నియుఁ బరిణామమునఁ దాప
కరంబు లయ్యె. దేవలోకమున నున్న దేవతలు నాసహాయంబును గోరిరి. కావున
నిర్వృతియనునది నామమాత్రంబ యని తెలియనయ్యె. పరమేశ్వరా! నిన్నా
రాధింపక లోకంబున నెవ్వఁడేని శాశ్వతనిర్వృతిని బొందఁజాలఁడు. త్వన్మా

యామూఢమనస్కుఁడై జన్మమృత్యుజరాదిబాధలం బొందుచుఁ బాపఫలంబు
లనుభవింప యమనికేతనంబున కరుగు అందు మానవుఁడు పాశశతబద్ధుఁడై
దారుణనరకకూపంబులఁ బడఁ ద్రోయఁబడు. విశ్వరూపుండ వగునిన్నుఁ గానక
భవన్మాయామోహితుండనై తిరుగుచున్నవాఁడ. దుస్తరసంసారగర్తమునుండి
యుపాయంబుఁ దెలియఁ జాలకున్నవాఁడ. అట్టినేను బరమేశ్వరుఁడ వగునిన్ను
రక్షకుం గాంచి సకలతాపవిరహితశాశ్వత సుఖధామంబుఁ జేర్పు మని
ప్రార్థించె నంత. 1073

## ఎనుబదితొమ్మిదవయధ్యాయము.

హరివలన వరములొంది ముచుకుందుఁడు తపంబున కరుగుట.

చ. మనుజవిభుండు తన్ను బహుమానపురస్సరభంగి సన్నుతిం
చిన హరి తన్మతిప్రకట సిద్ధికిసమ్మద మంది మృత్యువుల్
జనియును లేని స్వీయగురుసంపద వెల్లడి కాఁగ నివ్విధం
బున వచియించె రాజమునిపుంగవ! నీనుతి కాత్మ మెచ్చితిన్. 1074

చ. మనమునఁ గోరినట్లుగనె మౌనివరేణ్యసమన్వితంబులై
తనరెడు దివ్యలోకముల ధారణినాయక! పొంది యందు స్వే
చ్ఛను జరియింపు మీవతుల సంపద యిద్దియె యక్షయంబుగాఁ
గను జెలువారు మత్కరుణ గల్గుట నింకొకమాట చెప్పెదన్. 1075

చ. గురుతరదివ్యలోకములకుం జని స్వేచ్ఛఁగ నన్నిభోగముల్
వరుసఁగఁబొంది సద్యశము వర్ధిల నొప్పుకులంబునందుఁ బ్రా
క్స్మరణముగల్గునట్టి మహిమంబున నాదు ననుగ్రహంబునన్
ధరణి జనించి యాదట ముదంబునఁ బొందఁగలావు ముక్తినిన్. 1076

చ. అని వచియించు శ్రీహరికి! నాదృతి మ్రొక్కి తదీయసత్కృపం
గని గుహనుండి వెల్వడి నికామము నల్పతరాంగులన్ గుబు
ద్ధినియతులన్ మనుష్యులను దృగ్విభవంబునఁ గాంచి యిప్డు మే
దినిఁ గలికాల మొప్పు నని ధీమహిమంబునఁ దా నెఱుంగుచున్. 1077

ఉ. ఇందు వసింపరా దనుచు నెంచి నరుండును శ్రీశుఁడున్ దపం
బెందు నొనర్చిరో మును పహింసవిధుల్ తగ నాస్థలంబునన్
డెందము తృప్తినొందఁగఁ గడిందిసమాధిని బూని సత్తపం
బుం దగఁజేయఁ బోయె హరి పూజ్యతమాంఘ్రులలోఁ దలంచుచున్. 1078

తే. గంధమాదనపర్వత కాంతునందె, యాశ్రమం బద్ది యొప్పారు;నట్లు కాల
యవను దుష్టాత్ము నుపమచే నంతమొందఁ, జేసి తద్బలమెల్లఁ జెచ్చెర భయమున

క. తను నాశ్రయింపఁ గైకొని, చని ద్వారకఁ జొచ్చి యవను సైన్యంబులపా
టును దెల్పి యుగ్రసేనున, కనఘునకుం దెల్పెఁ దనప్రయత్నం బెల్లన్. 1080

సీ. మథురాపురమునుండి మాతంగహయరథబలముల నెల్లను ద్వారవతికిఁ
జేరిచె నంతట వైరిపీడలులేక యాదవబలమెల్ల నలరుచుండె;
బలదేవుఁ డీరీతి వైరులెల్ల నశింపఁగాఁ బ్రశాంతాత్ముఁడై కదలి జ్ఞాతి
దర్శనోత్కంఠచిత్తమునందుఁ బొలయంగఁ జనియెను గోకులమునకు నంత;

తే. గోపకులు గోపికలు తన్నుఁ గుతుకమొప్పఁ
జూడ రా వారలెల్లరు చోద్యమందు
నట్లు కుశలంబు లడిగి ప్రేమాతిశయము
మన్ననయుఁ దోఁప వర్తించె మున్నువోలె. 1081

బలరాముఁడు గోకులమున కరుగుట.

ఉ. కొందఱు గోపబాలకులు కూర్మి తగం దనుఁ గౌఁగిలింప నిం
పొందఁగఁ దాను వారిఁ బ్రియ మొప్పఁగఁ గౌఁగిటఁ జేర్చె నింకనుం
గొందఱు హాసయుక్తముగఁ గోరికఁ బల్కిన నట్లె వారితో
డం దగఁ బల్కెఁ బూర్వపువిడంబన యొప్పఁగ వార లుబ్బఁగన్. 1082

చ. హలధరుఁ గాంచి గోపకులు హర్షమునన్ బహుభంగులన్ సువా
క్కుల వెడలించి రంతటను గోపిక లాదృతిమీఱ నీసుతోఁ
గలిసినయట్లు పల్కి రిటు కాలము పుచ్చుట న్యాయమే యిటన్
గలుగునె మీరు లేమి శుభకాండము లియ్యది నీవెఱుంగవే. 1083

క. అని యిటుకొందఱు పల్కఁగ, వనజేక్షణ లింకఁ గల్గు వారలు స్వామీ
మనమునఁ దలంతువే మము, జనపదవసతుల నదొక్క సమయమునందున్.

తే. నగరకాంతల ప్రీతియు సొగసుఁదనము,గాంచి మఱచితివే మము మ్మంచుఁ దలఁచి
యార్తిఁ గనుచుండు మిపు డది యస్తమించెఁ, గరుణ దర్శన మిచ్చితి గాన దేవ.

చ. హరి యటఁ బ్రీతిమీఱ నెపు డాడుచునుండునె నాగరీమనో
హరవచనంబులన్ వినుచు నస్మదుదంతము నెప్పుడేని తా
స్మరణము చేయునే నగర సారసనేత్రల యల్పకాల మో
దరతి యడంచుఁబో కపట తత్త్వ మెఱుంగని మామకాదృతిన్. 1086

చ. అన మఱియొక్కగోపికయు నార్య! యశోదకుమారకుండు నె
మ్మనమున నేను బ్రీతిఁ దన మంజులగానము నాదరించి పా
డిన శుభవార్త మిత్రులు కడిందివిచారమునన్ మునుంగఁ బ
ల్కినె యొకవేళనైన మన గోపిక లంచని యైన నెంచునే. 1087

మ. జననిం జూచుటకైనఁ బోవలయు నాసక్తిన్ ననుంజూడ నెం

చును నెల్లప్పు డటంచు నైన స్మరియిం చుంగాదె నామాటపో
యినఁ బోనీయని హెచ్చరించె; మదిలో నెంతేఁ గ్రుధం గాంచు కా
మిని యొక్కర్తుక యీప్రసంగములతో మే లేమియుక్ లేదుసూ. 1088

క. హరి యొనరించిన తక్కిన, సురుచిరకార్యముల నెల్ల శ్రుతు లలరంగాఁ
బరమకృపం జెప్పుము హల,ధర! యని యాశయముఁ దెల్పెఁ దత్పరమతియై.

క. హరి మమ్ము వీడ మే మా, హరి వీడఁగ శక్య మగునె యటు విధియున్నే
పరికింపఁ దల్లి దండ్రియుఁ, బరమేశ్వరుఁ డగునుగాదె భ్రాతయు నతఁడే.

క. భరియించుప్రోడ యతఁడే, వరబంధు వనంగ నతఁడె వలదని మైత్రిం
బరఁగెడుమము వీడిన శ్రీ,హరి యకృతజ్ఞుం డటన్న నాఱడి విడునే. 1091

ఆ. ఏది యెట్టులున్న నీగోకులంబున
నన్నె యాశ్రయించి యున్నవార
లుందు రన్నయూహ లొప్ప రాఁ దగుఁజుమీ
హరికి నమృత వాక్కు లమరఁ జెప్రుమ. 1092

క. గోవిందుఁ డిప్పు డోబల, దేవా పౌరాంగనారతిం జిత్తము సం
భావితమై యుండఁగ మా, పై వాంఛలు వదలుటయును బరికింపంగన్.

తే. మామకంబగు దౌర్భాగ్యమే మఱేమి
కాదనుచుఁ దోఁచె నని యొక్కకాంత విసుగు
తోఁప వచియించె; నింకను దోయజాతు
లాతురంబున బలభద్రు నడిగి రిట్లు. 1094

క. హరి మమ్ము ముదము మీఱఁగ,స్మరియించునె కృష్ణుఁ డెపుడు చను దెంచు సమా
దరమున మముఁ జూడఁగ నని, పరిహాసోక్తులను జాలఁ బల్కిరి వేడ్కన్.

చ. హలియును సాధురీతిగను హర్షమొసంగుచుఁ బ్రేమగర్భితన్
వెలయుచుఁ బ్రౌఢభంగిఁదగి వింతగఁ గన్పడు భాషణంబులన్
వెలఁదుల నూఱడించి హరి వేడుక మిమ్ముఁ దలంచుచుండు వ్యా
కులపడ కుండుఁడీ యనుచు గోపకులం గని ప్రీతి నిట్లనున్. 1096

తే. హరిసమాకృష్టమతులయి యలరు మిమ్ము,సర్వదా సంస్మరించుచుఁ జక్రి యున్న
వాఁడు మీ రెల్ల నెంతయు వర్ధిలంగఁ,గోరుచున్నాఁడు నిజమని చేరెగృహము.

తొంబదియవయధ్యాయము.

బలరాముఁడు వనమున విహరించుట.

మ. బలరాముం డట బృంద నాఁదగుచు భవ్యంబైన యారామమం
దలరంగా మది గోపికాగణము గోపాళుల్ తనున్ గొల్వ ని

* పితా మాతా తథా భ్రాతా భర్తా బంధుజనశ్చ కః=అని మూలము.

ర్మలచిత్తుండు మనుష్యదేహమును గార్యంబూనియే తాల్చి ని
స్తులభూభారముఁ బూని శేషుఁ డనఁగా శోభిల్లి సర్వాత్ముఁడై. 1098

క. తనజనికిం దగు కార్యం, బొనరిచి యింకను బొనర్పఁ బోలినకార్యా
ళిని జేయఁ బూని విహరిం,చెను బృందావనమునందు శ్రీశుం డంతన్. 1099

క. వరుణుం డాతనిక్రీడా, పరతంత్రత నెఱిఁగి నేర్పు భాసిల్లఁగ స
త్వరముగ వారుణిఁ బిలిచి మదిర! నీవిష్ణ్వానుజునకును దృష్టిదవు కదా. 1100

క. సతతము నిను సేవించును, హితమని మన్నించుచుండు నేకద కానన్
జతనమున నిప్పు డేగుమ, యతనిం గొల్వంగ ననిన నాతనియాజ్ఞన్. 1101

క. శిరమునఁ దాలిచి వనమునఁ, జరియించు ననంతుఁ డున్నచక్కటి కేగెన్
హరిసోదరుండు బృందా, సురుచిరవన నీపభూజ శోభితధరణిన్. 1102

చ. మనము ముదబ్ధిమగ్నమయి మానితమై తగఁ గేళిసల్పుచో
ఘనమదిరాపరీమళము ఘ్రాణబిలంబుల కింపుఁగూర్ప మ
న్ననమెయిఁ గ్రోల నెంచుచు వనంబునఁ దోఁచుకదంబకోటరం
బున జనియించి ధారలుగఁ బొల్చెడు మద్యము నాని నెంతయున్. 1103

క. తరుకోటరగళ దుద్య, త్పరిమళ మిళితాతిపూత పత దతిజవయు
క్సురఁ ద్రావె నాతురంబునఁ, బరుగిడి తమిపెల్లిదంబు బయలుపడంగన్. 1104

చ. అలరుచు గోపికానివహ మట్టులె గోపకు లెల్ల మద్యధా
రలఁ దమిఁ గ్రోలి రంత బలరాముఁడు గోపిక లోపికన్ స్వరం
బుల మదికింపుఁ బెంచుచును బొల్చెడుగీతము లట్టిపాడ ని
మ్ములఁ గొనియాడుచున్ బ్రమదముగ్ధమనస్కుఁడుగాఁ దనర్చుచున్. 1105

చ. శ్రమభవఘర్మబిందుకణరాజి శరీరమునందుఁ గన్పడన్
యమునరో! స్నాన మాడఁ దగు నంచు హృదంతరమందుఁ దోఁచె వే
గము యిటు రమ్మటంచుఁ గడుఁ గైపునఁ బిల్చెను రామమూర్తివా
క్యము మదిరాత్తమత్తజముగాఁ దలపోసి కళిందకన్యయున్. 1106

చ. పలుకక యుండెఁ దాఁ బిలువఁ బంతమునన్ వడి రాకయున్న సై
వలిని తెఱం గెఱింగి మది వారనిక్రోధము పెల్లురేఁగఁగా
హలము గ్రహించి దానిదగు నగ్రముఁ దత్తటినీతటంబునన్
హలి తగిలించి యీడ్చె మదిరాయతమత్తత హద్దుమీఱుటన్. 1107

క. దురితాత్మురల యోఘున, దురితాత్మకురాల చాల ధూర్తత నేఁ బి
ల్వ రయమున రాక తక్కితి, వరుగుమ యిఁక నిచ్చకోలఁది నన్య ధరణికిన్.

చ. హలియిటు తన్నలాగ గతి యడ్డిన ముఁకవలెఁ బోవఁజాలకు
జ్జ్వలతరభంగసంతతుల వర్థిలునాత్మజలంబుచేత సై

వలినియుఁ దద్వనస్థలులఁ బాఱుచు ముంచె ననంతరంబ యా
జలములనుండి యొక్కసతి చక్కనిదేహముతోడ వెల్వడెన్. 1109

చ. వెలువడి రాము భీతిఁగని వింతగఁ గంపము గన్పడంగ వి
హ్వలమతియౌచు భీతహరిణాక్షులు చూడఁదగంగ నివ్విధిం
బలికె మహాత్మ! నైపు మనవద్యభవద్గురుశాసనంబు నేఁ
దలఁపక యుంటి నంచుఁ గ్రుధఁ దాల్పకుమా హల ముజ్జగింపుమా. 1110

మ. నను మన్నింపుము లాంగలాయుధ! యటన్నన్ బల్కె రాముండు నన్
ఘనసత్త్వుం డని యెంచకే యవమతిం గావించి తట్లౌట నో
య్యన నీరాగ్రమునన్ సహస్రముగ నీయంగంబు వే చీల్చి లా
గను యత్నించెద నన్నవాక్కు విని యుత్కంపంబు దీపింపఁగన్. 1111

క. బ్రతిమాలె నతని నెంతయు, మతివిభవముతోఁప నదియు మాని యతండు
ద్ధతి దాని విడిచిపుచ్చెను, గృతమజ్జనుఁడయ్యె సాధుకీలాలములన్. 1112

క. యమునాజలముల మజ్జన, మమరిన వెంటనె జలేశు నానతిని మనో
జ్ఞము కాంతియుతమునయి శుభ్రము నగు నొకయుత్పలంబుబలు నలరించెన్.

సీ. కుండలవరములు రెండు సింగారించె నాతనిశ్రవణద్వయమ్ము నంత
నమ్లానపద్మమాల్యంబు కంఠప్రదేశమును శృంగారించె జలధికాంతి
నలరువస్త్రయుగంబు నంగంబునన్ వెల్గె నిట్టు లలంకృతు లెల్ల వెలయ
నీలాంబరుఁడు కాంతిజాలావృతాంగుఁడై బృందావనంబున వింత మీఱఁ

తే. గన్పడియె నిట్లు; రాముండు కడు మనోజ్ఞ
విధములన్ రెండుమాసముల్ వేడ్క నందుఁ
గడపి శ్రీకృష్ణుఁ జూడంగఁ గాంక్ష యొదవ
వచ్చె ద్వారక కెలమిని బందులఁ గన. 1114

క. రైవతభూపతితనయను, రేవతిఁ బెండ్లాడి సుతుల రేఱేఁడు లనన్
భావింపఁ దగిన వారిని, శ్రీవర్ధనులైన వారి శీలగుణులనున్. 1115

తే. కనియె రేవతియందు నిక్కరణిని శఠుఁ
డుల్ముఖుఁడు నాఁగఁ జెరొండు నుగ్రబలులఁ
బ్రీతిఁ జూచుచు రేవతీప్రియుఁడు బంధు
జనుల కానందదుండయి క్షమఁ జెలంగె. 1116

---

తొంబదియొకఁడవ యధ్యాయము.

రుక్మిణీ కల్యాణఘట్టము.

చ. అనివచియించి వ్యాసుఁడు ద్విజాగ్ర్యగణంబును గాంచిపల్కె నో
మునివరులార శ్రీహరివిభూతుల నింకను నాలకింపుఁ డిం

పును దగఁ గూర్చు భీష్మకుఁడు భూపలలాముఁడు కుండినాఖ్యప
త్తనమున నుండె నయ్యది విదర్భకు ముఖ్యపురంబుగాఁ దగెన్. 1117

ఉ. భూరమణుండు రుక్మి యనుపుత్త్రుని రుక్మిణి నాఁ గుమారికం
గూరిమిఁ గాంచె నింక ననుఁగుం గొమరుల్ కలరందుఁ బెద్దవాఁ
డై రహిమించె రుక్మి యసహాయపరాక్రమశాలిఁ రుక్మిణీ
సారసనేత్ర కొండిక యొసంగెడురూపగుణాభిరామయై. 1118

చ. తొలిజనిఁ జేయుపుణ్యమునఁ దోఁచును బ్రీతి యదెల్ల వారికిన్
జలరుహనేత్రుఁ డాసుదతి స్వాంతమునన్ వరియించె నామెయుం
దలఁచె ముకుందుఁడే ధవుఁడు తప్పక నాకని నెమ్మనంబునన్
వెలసెఁ బరస్పరంబు తమి వింతగ నెవ్వ రెఱుంగకుండఁగన్. 1119

చ. మురహరుపక్షమాను మునిముఖ్యులు రుక్మిణి కృష్ణమూర్తికే
సరియగు భార్యయంచు నిదిచక్కని కార్యముగాఁ దలంచి యీ
శ్వరునకు నిష్మటంచుఁ బలుభంగులఁ దెల్పిన రోషమూని సో
దరి హరి కీయరా దనుచు దర్పసమగ్రుఁడు రుక్మి పల్కఁగన్. 1120

చ మునులిఁక నేమి చేయఁదగు మూర్ఖుఁడు వీఁ డని యెట్టులైన నీ
వనరుహనేత్ర కృష్ణునకు భార్యయెయౌ నని యెంచియుండి రం
త నిచట రుక్మి చైద్యుఁడు నితాంతగుణోత్తరుఁ డుత్తమాన్వయం
బున జనియించి కీర్తిగను భూపతి యంచుఁ దలంచి యాత్మలోన్. 1121

క. అనిశమ్ము జరాసంధుఁడు, తనుఁ బురికొల్పంగ నీయఁ దలఁచెన్ శిశుపా
లునకున్; భీష్మునకు బు, త్త్రుని యాశయ మొప్పకున్న ధూర్తుండనుచున్. 1122

క. తనమాట చెల్లనీయక, పని సాగింపఁగఁ గలండు పౌరుషమున నం
చని యాతని యాశయమే, యనుసరణీయం బటంచు నాత్మఁ దలంచెన్. 1123

క. శిశుపాలున కిచ్చుటయే, ప్రశస్త మనుపుత్త్రబుద్ధిఁ బాటించియె దు
ష్టశమనుఁడు కృష్ణుఁ డని తా, నశక్తుఁ డగుటం దలంప కట్టులె చేయన్. 1124

క. తానెంచి పెండ్లియత్నముఁ, బూనెం జేయంగ బంధువులఁ బిల్వంగా
మానవనాథులు చైద్యమ, హీనాథానుచరు లెల్ల నేతెంచి రొగిన్. 1125

క. అంత జరాసంధుఁడు భూ, కాంతులు గొల్వంగ భటనికాయముతోడన్
బంతము సాగింపంగ ది, గంతములన్ గీర్తి నింప నరుదెంచె వడిన్. 1126

క. వేరాశన్ శిశుపాలమ, హీరమణుఁడు కుండినపురి నేత్తెఱఁ జొచ్చెన్
భూరిబలంబులతో నల, సారసనేత్రన్ గ్రహింపఁ జాలుదు ననుచున్. 1127

మ. బలభద్రాదులఁగూడి యాదవబలవ్రాతంబు లొప్పారు వే
డ్కల రాఁ గుండినపత్తనంబునకు భూకాంతాత్మజన్ రుక్మిణీ

జలజాక్షిన్ శిశుపాలుఁ డేవిధమునన్ సాధించి పెండ్లాడునో
కలయం జూచెద నంచు వెల్వడియె సంకల్పక్రియాదక్షత౯.
చ. పురమును జేరి రేపె యగుఁబో మనరుక్మిణి పెండ్లి యంచు నా
తురమున బాంధవావళులు తోఁచినభంగులఁ బల్కుచుండ శ్రీ
హరి బలరామముఖ్యు లగునాత్మహితంబునుగోరు బంధువుల్
పరబలభంగహేతువులఁ బల్విడిఁ గోరుచునుండ నేపునన్. 1129
చ. నరపతిమార్గమందుఁ జనునాతిని రుక్మిణిఁ దన్నుఁగోరు సుం
దరిఁ దమిమై గ్రహించె నిది ధర్మమె యంచు మహాగ్రహంబుఁనన్
ధరణిపులందుఁ బౌండ్రకుఁడు దర్పసమగ్రుఁడు దంతవక్త్రుఁ డీ
శ్వరు మదిఁజిమ్ము చైద్యుఁడు నెసంగెడు వేడ్క విదూరథుండునున్. 1130
ఆ. అతులగర్వమూను నాజరాసంధుండు, శాల్వభూపముఖులు సత్వరమున
నాగ్రహంబుపొంగ హరిఁ జంపు యత్నంబు, చేయఁబూని రాత్మసిద్ధిలేమి. 1131
చ. సమరముచేయఁ దాఁకి రట సత్త్వసమగ్రుల రామముఖ్యులన్;
బ్రమదముమీఱ యాదవుల పౌరుష మొప్పఁగఁ జూపఁగోరి రా
మముఖులు వారిమార్కొని యమానుష దివ్య మహాస్త్రపంక్తిచేఁ
గ్రమమున వారినొంచి యసుకాండము శిష్టముగాఁగఁ జేయుచున్. 1132
తే. ఒకరితో నొక్కరును జెప్పకుండఁ బాఱఁ, గా వడింజేసి, రంత సంగరవిధంబు
నెఱిఁగి కేశవు నోడింప కేఁ బుసంబుఁ, జొరఁగ నొల్ల నటంచును శూరత దగ.
క. ప్రతిన యొనర్చుచు రుక్మియు, క్షితిపులఁ జక్కాడినవిధిఁ జెవిఁబెట్టక యు
ద్ధతిఁబాఱి శౌరి మార్కొనె; మతి నాతనిగర్వమెల్ల మాన్పఁ దలఁచుచు౯.
చ అరదముఁ ద్రిప్పి శ్రీహరియు నల్లన మార్కొని వానిసైనికో
త్కరమును ద్రుంచి మత్తగజకాండము వేగ హరించి యవ్వలం
దురగములం గలంచి రణధూర్తుల వీరులఁ గీటడంచి రు
క్మిరథముఁ జెండి భూమిఁబడఁ గేతన ముద్ధతిసేసి యార్చుచున్. 1135
క. తన కదివిలాస మట్టులు, కనఁబడఁగా నిశితవిశిఖకాండంబుల నా
తని ద్రెళ్లసేసి గర్వం, బును మాయంజేసి భూపముఖ్యులు పొగడన్. 1136
చ. పరిణయమాడె రుక్మిణిని బద్మదళాక్షుఁడు శాస్త్రరీతి భూ
వరులకు రాక్షసం బనువివాహము శస్తము గాన నట్టులే
సరిసరి యంచు మౌనులొగి సంతసమొప్పఁగ నాశిషంబులన్
వరుస నొసంగ దేవతలు వైభవ మెన్ని నుతింప నత్తఱిన్. 1137

ప్రద్యుమ్నచరిత్రము.

ఉ. ద్వారకయందు రుక్మిణియుఁ దానును వాంఛలుమీఱ నుండ దు
ర్వారపరాక్రమాన్వితుని బంచశరాంశుని సద్గుణాఢ్యు గం

భీరమనీషుఁ బుత్త్రి నరి వీరభయంకరుఁ గాంచె రుక్మిణీ
సారసనేత్ర చిత్తమున సంతసమందఁగ బంధు లుబ్బఁగన్. 1138

క. అతఁడె ప్రద్యుమ్నుం డన, ఖ్యాతింగనె వాని శంబరాసురుఁడు మహా
భీతిన్ దొంగిలిన న్హరి, చేతం బలరంగఁజంపెఁ జిత్రరణమునన్. 1139

చ అనవిని మౌను లిట్టులని రాగమపారగ! వ్యాసమౌని యా
తనయుని శంబరాసురుఁడు తాఁ గొనిపోయెను మాయచేత నం
చును వచియించి తీవు పటుశూరతనొప్పెడు దానవేజ్యు నె
ట్లని వధియించె నాతనయుఁ డంతయుఁ దెల్పుము తచ్చరిత్రమున్. 1141

క అని ప్రశ్నించిన వ్యాసుం, డను మౌనివరేణ్యులార యద్భుతవార్తన్
వినిపింతు దాని వినుఁడా, తనయుఁడు జనియించుట విని దానవుఁ డాత్మన్

తే. తలఁచె నిట్లని వీఁడె యంతకుఁడు నాకుఁ గాఁగలఁడు కాదె వీనినిగడఁగి చంప
జను నటం చెంచి యాఱవదినమునందె, కాలశంబరుఁడెట్టులో గాఢశక్తి. 1142

క. హరియించి వేగమున సా, గరమునకుం బోయి గ్రాహగణసంయుతి భీ
కరమిద్ది యిందు వైచిన, మరణించు నటంచుఁ దలఁచి మారుని వైచెన్. 1143

క. దారుణకల్లోలభవ, స్ఫారావర్తంబు సాధ్వసప్రదమును నై
పారావారం బయ్యది, ఘోరగ్రాహాది జంతుకుల నిబిడంబై. 1144

క కనుపట్టుచుండె నట వై, చినమాత్రన మత్స్య మొండు చిత్రగతులఁ దోఁ
కనుఁద్రిప్పుచు నామిష మని, మనమున నూహించి మ్రింగె మారుని నతనిన్.

తే. దానిజఠరాంతరమున నుద్దామవహ్ని, దీపితుండయ్యు నతఁడుమృతిని గనకయె
యుండె; వలలొడ్డి జాలరు లుగ్రకర్ము, లబ్ధిమత్స్యంబులం బట్టు నపుడు దీని.

సీ. పెద్దమత్స్యము చిక్కె నద్దిరా! యని కొనిపోయి శంబరున కుపాయనముగ
నీమత్స్యవర్యంబు నిచ్చి రద్దానవపతికి మాయావతి హితమనీష
భార్య యొప్పారు నాపడఁతియే సర్వగృహేశ్వరి యగుఁగాన నెల్లపనులఁ
దా నిర్వహించుచుఁ దగురీతిఁ బాచకులకుఁ బనిచెప్పుచు సకలకార్య

ఆ. దక్ష యనఁగ నొప్పెఁ దన్మత్స్యవిచ్ఛేద, నమున జఠరమందు నమలకాంతి
వెలుఁగు బాలుఁ గనియె విషమాక్షదగ్ధస్మ, రావనీరుహాదిమాంకురంబు 1147

చ. కని యొవఁ డీకుమారకుఁడు కమ్రతరాంగుఁడు మత్స్యకుక్షియం
దునిలువ నేమి కారణమొ తొయ్యలి యెవ్వతె వీని మారరూ
పునిఁ గననోచెనో యనుచు భూరిముదంబున నుబ్బుచుండ మా
నినృపతి నారదుం డనియె నిర్మలవాక్కుల నోతలోదరీ. 1148

చ. హరితనయుండు వీఁడు మృదులాంగుఁడు, లోకములన్ సృజింప సం
హరణముచేయ శక్తిగలయట్టి భవత్పతి సూతికాగృహాం

తరముననుండి మాయఁగొని తా వడిఁ దెచ్చి సముద్రమందు వై
చె, రమణిరో ఝషోత్తమము చెచ్చెర మ్రింగెను నామిషాశచేన్. 1149

క. ఆమత్స్యము పట్టుపడెన్, నీమందిరమునకుఁ జేరె నీభాగ్యమునన్
ధీమహిత వగుటఁ బెంపుము, యీమానవరత్నమును నభీష్టప్రదమున్.

క. అనినారదుఁ డుపదేశిం, చిన విశ్వాసంబుఁబూని శిశువును బెంచెన్
వనజాక్షి రూపసంపదఁ, గని మోహితయగుచుఁ జిత్తకాంక్ష ఫలింపన్.

చ. ప్రతిదినవర్ధమానుఁడయి బాలకుఁ డల్లన యౌవనంబు నొం
దుతఱిని సాభిలాషయయి తోయరుహాసన యొప్పె; నంత నా
సుతునకు సర్వమాయలను జూపెఁ బ్రాకయింతయుఁ దప్పకుండ నే
ర్పి తనమనఃప్రమోదమును బెంపువహింపఁగఁ జేసె నంతటన్. 1152

క. అనురూపుఁడు ప్రద్యుమ్నుం, డని హృదయము నక్షియుగము నాతనియందే
యనిశము నిలిపె నతం డా, వనితామణిహృదయ మెఱిఁగి వాగ్వైభవముల్.

క. కనఁబడ నిట్లని పలికెన్, వనజాక్షీ మాతృభావవర్తనమున్ బో
వను జేసి యన్యభావం,బున వర్తించెద విదేలపూనికఁ జెపుమా. 1153

చ. అనవినిపద్మలోచన హృదంతరభావము దాఁచ కివ్విధం
బున వచియించె నీవనఁగఁ బుత్త్రసమానుఁడ వేలకావా నే
నును వచియింతుఁ గృష్ణుని తనూజుఁడవౌ నినుఁ గాలశంబరుం
డనఁబడు నాదుభర్త తనదౌకపటంబున నిన్ గ్రహించుచున్. 1155

చ. ఒరులకు నించుకేని దనయూహ యెఱుంగఁగ జాలకుండ సా
గరమున వైచె మీన మొకఁడు గ్రక్కున మ్రింగె నినున్ మహామిషం
బరయఁగ దైవయోగమున నంతికసీమను జిక్కె నంచు; జా
లరు లలమత్స్యరాజముఁ జెలంగెడు వేడుకఁ బట్టి నెట్టనన్. 1156

క. కొనివచ్చి మాకు నిచ్చిరి, ఘనమీనోదరమునుండి కాంచితి నిను నీ
జననియు నిప్పటికిన్ వగ, పునఁ గుందుచు నున్నదఁట సుపుత్త్రార్తిమెయిన్.

క. అనవిని ప్రద్యుమ్నుం డా, వనితామణి గౌరవించి బాహుబలస్ఫూ
ర్తిని గాలశంబరాసురు, నని చేయం బిల్చె నాతఁ డతికోపమునన్. 1158

చ. నిరుపమబాహుశౌర్యమున నిర్జరులన్ వెఱపించువాఁడు గా
ధరణిఁ బ్రసిద్ధిగాంచిన యతం డగుటన్ హరిపుత్త్రు వీరుగాఁ
బరిగణనంబుచేయక జవంబున మార్కొని పోరుసల్పె శ్రీ
హరిసుతుఁ డుం దదీయచతురంగబలంబుల మార్గణాహతిన్. 1159

తే. ఒకముహూర్తంబునన త్రుంచె నురుతరబలుఁ
డైనశంబరుఁ డేడుమాయలను బన్ని,

యాహవము చేసెఁ బ్రద్యుమ్నుఁ డష్టమమగు
మాయచేఁ గాలశంబరు మ్రందఁజేసె. 1160

క. దితిజు ననిఁ జంపి మాయా, వతితో ద్వారకకు వచ్చి వరశుద్ధాంతం
బతిజవమున మాయావతి, జతగా నుండంగఁ జేరె జనని యలరఁగన్. 1161

చ. తనయునిఁ గాంచి కృష్ణవనితామణు లందఱు సంతసిల్లి రం
త నియతసాధుశీలమును దాల్చినరుక్మిణి ప్రేమమీఱఁగాఁ,
దనయునిఁ జూచి యిట్లనియె ధన్య యదెవ్వతయో నవీనయౌ
వనమున నున్నపుత్త్రు నిటువంటిమహాత్ముని గాంచఁ జాలెడిన్. 1162

క. తనయుఁడు ప్రద్యుమ్నుఁడు యౌ,వనమున నీరీతి బ్రదుకుభాగ్యము గనె నే
జనని నగు నేను దొలిజని, ఘనపుణ్యముఁ జేసినట్లుగా నెంతుఁజుమీ. 1163

తే. వత్స! యేపుణ్యవతి నీవు వరకుమారుఁ
డవుగ వెలసెనో నాయందుఁ దవులుప్రీతిఁ,
గానఁబడితివి నినుఁ జూడఁగా మురారి
తనయుఁడవుగా మనంబునఁ దట్టె నిపుడు. 1164

చ. అనివచియించు నత్తరుణమందు మురారియు నారదుండు వ
చ్చి నిలిచి సౌధసీమ మదిఁ జెందినవేడ్కఁ గుమారుఁ జూచున
వ్వనరుహనేత్ర రుక్మిణిని భవ్యమనీషను గాంచి రంత న
మ్మునిపతియున్ వినంగ హరి మోదమునన్ వచియించెఁ బత్నితోన్. 1165

క. ఈతనయుఁడు నీకుం దను, జాతుండే సుభ్రు! వీఁడు శంబరు మాయన్
ఖ్యాతిం గనిన దురాత్ముని, నీతఱిఁ బొలియించి వచ్చె నిచటికి వినుమా. 1166

తే. దనుజుఁ డాతండె సూతికోదవసితంబు
నుండి నీసుతుఁ గొనిపోయెఁ జండమాయ
నతని వధియించె వీఁడు మాయావతియను
నింతి యీతనిపత్నియౌ నీమె సాధ్వి. 1167

తే. శంబరునిభార్య యనుచును సంశయంబు,గనకు మోసాధ్వి కారణంబునువచింతు
వినుము మన్మథుఁ డంత మొందిన రతియును, వానిఁబుట్టింపఁ బూనిక వర్ధిలంగ.

క. మాయారూపంబున రతి,యే యాశంబరుని ముగ్ధు నెంతయుఁ జేసెన్
మాయామయరూపముఁ గొని,యే యుద్వాహాదులైన కృత్యములందున్.

క. కనఁబఱచె నొక్కరూపం,బును మదిరేక్షణయు స్మరుఁడె పుత్త్రుఁడు నీకై
జనియించె నిందు నాతని, వనితామణి రతియె యీమె వార్తందీనిన్. 1170

క. ఋత మని నమ్ముము శంకల, మతిఁ గూర్పకు మీమె నీకు మానితసుగుణో
న్నతిఁ దగిన కోడలగు న, ప్రతిమానుఁడు వీఁడు సుగుణరాజి జగమునన్. 1171

చ. అని పలుకంగ రుక్మిణి మహాత్తరహర్షమునం దెఁ గృష్ణుఁడుం
దనయునిఁ గౌఁగిలించె మునితల్లజుఁ డేగె సురేంద్రపత్తనం,
బునకుఁ బురంబు నెల్లెడల బోరన వాద్యము లొప్పుచుండెఁ బౌ
రనికర మాకుమారుఁ గని రంజిలి మేలని పల్కి రంతటన్. 1172

మ. చిరకాలంబుగ నష్టపుత్త్రియగుచుం జింతిల్లు నీరుక్మిణీ
తరుణీరత్నము పుత్త్రుఁ గాంచు టనఁ జిత్రం బేకదా యంచు నె
ల్లరు నాశ్చర్యము నొంది ద్వారవతి చాలన్ బొల్చె నంచాడుచున్
బరమామోదము తెల్పువేడుకల సల్పం బూని రొక్కుమ్మడిన్. 1173

---

## తొంబదిరెండవ యధ్యాయము.

### రుక్మిణీపుత్త్రచరిత్రము.

చ. పరమకృపాతిరేకమునఁ బద్మదళాక్షుఁ గుమారుఁ గోడలిన్
గరమనురాగభారమున గారవ మొప్పఁగ సత్కరించె, నో
ధరణిసురర్షులార యని తత్కథఁ దెల్పి యనంతరంబ త
చ్చరితము తెల్ప నిట్లనియె సాధుమనీషుఁడు వ్యాసుఁ డాదృతిన్. 1174

సీ. చారుదేష్ణుసుదేష్ణుఁ జారుదేహు సుషేణుఁ జారుగుప్తుని భద్రచారు వనెడు
వాని శోభనుఁడను వానిని జారువిందుని సుచారుని జారువనెడువానిఁ
దనయుల రుక్మిణి దశసంఖ్యులం గాంచె వారిసహోదరి చారుమతియు
నయ్యె నీరీతిగా నలరెఁ దత్సంతతి; హరికి రుక్మిణి గాక యతివ లేడ్గు

తే. రైరి కాళింది యనులేమ యల్లె మిత్ర, వింద సత్యయు రోహిణి వెలఁదులందు
జాణయగు నాగ్నచిత్తియు జాంబవతియు, మద్రరాజాత్మజాతయు మాన్యలైరి.

వ. సాత్రాజితియు సత్యభామయు లక్ష్మణయు నను వారునుం గలరు. వీరుగాక పదాఱువేలసంఖ్యగల నారీమణులు భార్యలైరి. వారెల్లఁ జారుగుణశీలములం బ్రఖ్యాతిం గాంచి శ్రీహరిపాదారవిందములఁ బూజించుచు లోకోత్తర యశంబుఁ గాంచిరి. 1176

క. హరితనయుఁడు ప్రద్యుమ్నుం, డురుతరవీర్యంబు గల్గి యొప్పుచును స్వయం
వరమున రుక్మితనూజను, వరియించెను గన్య యతని వాంఛించెఁ దమిన్. 1177

ఉ. సాగె వివాహ మిర్వురకుఁ జానయు భర్తృపదాబ్జసక్తయై
భోగము లెల్ల నిచ్చ మెయిఁ బొందుచు విస్తృతకీర్తిఁ గాంచి నా
నాగతులన్ మనోహరు ననారతముం దమిఁ గొల్చెఁ గాంచె నా
నాగమపారగున్ సుతుని హరిసుమాంబక దివ్యమూర్తినిన్. 1178

ఆనిరుద్ధజననము.

మ. అనిరుద్ధుం డను నాకుమారకుఁడు వీర్యస్ఫారతేజంబులన్
ఘనుఁడై శౌర్యసముద్రుఁ డంచు రిపుభూకాంతాంతకుం డంచుఁ గీ
ర్తిని గాంచెన్; హరి రుక్మిపౌత్త్రిని లసద్ధీశాలినిం బత్నిఁ గా
నొనరింపం దలపోసె రుక్మియును స్పర్ధోన్మత్తుఁడై యుండియున్. 1179

క. హరిపౌత్త్రున కనిరుద్ధున, కురుశౌర్యున కాత్మపౌత్త్రి నుద్వాహము సే
యురతిం గొనియెన్ బెండ్లికి, నరిగిరి హరితోడ నాహలాయుధముఖ్యుల్.

క. ఆపురము భోజకటమన, దీపించువిభూతి నెసఁగు దివిజేంద్రపురం
బేపాటి యనుచు నొప్పెడు, నాపురమునఁ బెండ్లిసాగె నరుదుగ నందున్. 1181

ఆ. విమలరీతిఁ బెండ్లి వెలసె శాస్త్రోక్తిని, దప్పకుండ నవల ధరణిపతులు
సంతసములఁ బొదలి రెంతొ వేడ్కఁ గళింగ, నృపతిముఖులు రుక్మి కిట్టు లనిరి.

క. హలికిన్ ద్యూతంబున నేర్పలవడ కున్నన్ సతంబు వ్యసనం బక్షం
బులయందుఁ గలదు గావున, బలియా హలినిన్ జయింపవచ్చున్ మనకున్.

క. ద్యూతంబుననే నేర్పున, నాతని నోడింత మనిన నౌఁగాకని యా
భూతలపతి రుక్మి మనో, జ్ఞాతతసభయందు రాజులందఱు చూడన్. 1184

తే. సాఁగఁజేసె నక్షక్రీడ సవిధి నందు
వేయి నిష్కములను రుక్మి వేడ్క గెలిచి
హలధరునినుండి గ్రహియించె నవలి దినము
నందు నిష్కసహస్ర మాహలియు నోడె. 1185

క. తాలాంకుం డంతటఁ బది, వేలగు నిష్కముల నొడ్డి వెస రుక్మికర
వ్యాలోలాక్షంబులచే, నోలిం దా నోడె వైరు లురుముదమందన్. 1186

సీ. బలరాముఁడిటుమూఁడు పర్యాయములు పరాజితుఁడైనఁ గాంచి యుద్ధతిదలిర్ప
గాఁ గళింగేశ్వరుఁ డీగతి నొడ్డితే యని నవ్వె దంతములను గనఁబఱ
చుచు రుక్మి గర్వంబు నచటఁ గనంబడఁగా నిట్లుపల్కె నక్షక్రియలను
బండితుండే గామి బలి పరాజితుఁ డయ్యెఁ గంటిరే యీతండు కదనమందు

ఆ. నక్షవిద్యయందు ననభిజ్ఞుఁ డనఁ జను, సభ్యులార యనుచుఁ జక్కఁ బలికి
యాకళింగరాజు నాననంబుఁ బ్రదర్శి, తదశనమును గాంచె ధైర్యమూని. 1187

చ. పరనిజశక్తులం దెలియు భవ్యమనీషయె లేని రుక్మిభూ
వరులసమక్షం బిటు లవాచ్యములం బలుకంగఁ గ్రోధవి
స్ఫురితముఖంబుతో హతరిపుం డగుకృష్ణునియగ్రజుండు స
త్వరముగఁ గోటినిష్కములఁ బందెము పెట్టి జయేచ్ఛ పర్వఁగన్. 1188

ఉ. పందెముచేత నందుకొని పౌరుష మొప్పఁగ రుక్మి ద్యూతసం
క్రందనుఁ డౌట నక్షముల క్ష్మాస్థలిపైఁ దొరలంగఁజేసె; నా

పందెము సీరపాణికె శుభప్రదమయ్యె జయించినాఁడ నే
నిందని రాముఁడాడెఁ దనయిచ్ఛ ఫలించుట మోద మబ్బఁగన్. 1189

ఆ. నేనె గెల్చినాఁడ నిశ్చయంబుగ నని, రుక్మి పల్కె యనృత రూపవచన
ములను బల్కనేల హలధరా! యనియును, బలికె! నాది నాది పందె మనుచు.

చ. ఇరువురు పల్కఁజొచ్చి రిది యే జయమైన జితమ్మటంచు ని
క్కరణి వచించినాఁడ వని క్రమ్మఱ నిర్వురు వాగ్రణంబుఁ గో
పరతిని జేయుచుండఁగ సభంబుననుండి గభీరరావముల్
పరఁగఁగ నొప్పెఁ బల్కు బలభద్రుని కోపము వృద్ధినొందఁగన్. 1191

ఉ. పందెము గెల్చె రాముఁడె సభాసదులెల్లరుఁజూడ రుక్మి యీ
పందెము నేనె గెల్చితిని బాగుగ నంచు వచించె మిథ్యగా
సందియ మిందు లేదు తొలి సారి యిదే యిడినాఁడ నాది యీ
పందె మటంచుఁ జెప్పుమి నెపంబుగ నోడె నటన్నఁబాడియే. 1192

ఆ. కార్యమున ఫలంబు గల్గును మాటాడ, కున్న నేమటంచు నొప్పెఁ బలికె;
నంత హాలధరుండు నాగ్రహాసంరక్త, నయనుఁ డగుచు లేచి నయములేక.

క. *తనయెదుటఁ బల్కు రుక్మిని, గనకాక్షంబులను గొనియె కదువడిఁ బ్రహరిం
చెను గాళింగుని రదములఁ, గనఁబఱచుచు నున్నవాని గర్వసమగ్రున్. 1194

క. కని దంతవిహీనునిగా, నొనరించెను స్వర్ణవికృతి నొప్పెడు స్తంభం
బును లాగి వారిపక్షం, బున నున్న క్షితీశభటసమూహముఁ గూల్చెన్. 1195

సీ. అష్టాపదహతిని నటఁ గూలె రుక్మియు నంతహాహాకార మాసభాస్థ
లమునందు నిండె నెల్లరుఁ బాఱిపోయిరి ధరణీశు లందఱు దారుణాగ్ర
హము హాలాయుధుఁ డొంద నడలిరి; రుక్మిని హలి వధియించుట హరి వినియును
నంతయేఁ బలుకక వింతగా నూరక యుండెను రుక్మిణియును హలియును

తే. గోపమందుదు రేమన్నఁ గొదువఁదీర్పఁ
దరముగా దింక ననుచు నుద్వాహపూర్తి
యగుటఁ దనపౌత్త్రుఁ దోడ్కొని యఖిలబంధు
జనులు వెంటనె రాఁ బురంబునకుఁ బోయె. 1196

ఆశ్వాసాంతము.

క. ధరణీజలశుచిమరుదం, బరరవిశీతాంశుయజ్వభవ్యాకారా
నిరుపమవిజ్ఞానాత్మక, పరిపాలితదీనలోక భవభయహరణా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితా ప్రాభవ. కాశ్యపాన్వయప్రభవ. శ్రీజనమంచి వంశాంబురాశి కుముదినీమిత్ర సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ వినిర్మితంబైన తెలుఁగు బ్రహ్మపురాణంబునఁ దృతీయాశ్వాసము.

* జఘానాష్టాపదేనైవ అని మూలము.

శ్రీ

# తెలుఁగు బ్రహ్మపురాణము

## చతుర్థాశ్వాసము.

### తొంబదిమూఁడవయధ్యాయము.

నరకాసురవధము



కరుణామూలముని
స్తోకాభీష్టప్రదానతోషితహృదయా
శ్రీకంఠశతధృతిప్రము
ఖాకల్పితరూపవేంకటాచలనాథా.

వ. మహాప్రభూ! తరువాతివృత్తాంతం బవధరింపుము. మునుల కనంతరకథం జెప్పం బూని వ్యాసుం డిట్లనియె.

ఉ. ద్వారవతిన్ సుఖంబుగ నివాసముచేసెడు కృష్ణుఁ జూడఁగాఁ
గోరి త్రిలోకనాయకుఁడు క్షోణిసురర్షులు వెంటరాఁగ దు
ర్వారమదంబునన్ వెలసి రాజతకాంతిఁ జెలంగు దంతి నిం
గోరిక నెక్కి వచ్చె రిపుకూటవినాశముఁ గోరి యొక్కటన్. 1

చ. పురవరమందు లోకములఁ బూనికఁ గావఁగ నున్నసర్వలో
కరమణుఁ గృష్ణుఁ గాంచి నరకప్రబలాసురు చేష్టితంబు దు
ర్భరమయి యద్దిలోకములఁ బాడొనరించువిధంబుఁ దెల్పఁగా
దొరకెను వేళయంచు మదిఁ దోఁపఁగ నిట్లని పల్కె శ్రీహరీ. 2

చ. మనుజత నొందియుం ద్రిదశమండలముం గరుణైకదృష్టితోఁ
గనుఁగొనుచుండ దుఃఖములఁ గానక హాయిగనున్నవార మో
వనజదళాక్ష! నీవు మునివర్యులఁ గావ నరిష్టు ధేనుకున్
దనుజవరేణ్యుఁ గేశిని మదంబునఁ బొల్చు ప్రలంబముఖ్యులన్. 3

క. అని వధియించితి కంసుని, ఘనహస్తిని బూతనాఖ్యఁ గనలి శిశువులన్
దనివారఁ జంపురక్కసిఁ, బనిపూని వధించితివి సుపర్వసుఖముకై. 4

క. ధరణికి నపకారము చే, యురతిం జరియించువారి నుద్ధతులన్ శ్రీ
హరి! నీవు చంపినాఁడవు; నిరుపమభవదీయ దర్పనిర్జితరిపులై. 5

సీ. భవదున్నతమనీష బాగుగా వర్ధిల్లఁ జేయ లోకములు సుస్థితిని బొంద
యజ్ఞముల్ సాగంగ హవిసు తృప్తిగఁ జిక్క నమరు లేఖేదంబు నాత్మలందుఁ

గనక సుఖంబును గాంచుచు నున్నారు; నేను నీచెంతకు దేనిఁ జెప్ప
వచ్చినాఁడనో విను వాసుదేవా విని తత్ప్రతీకారంబుఁ దలఁపు మొనరు

తే. వంగ భూమికుమారుఁడై బాహుబలము
తనరఁ బ్రాగ్జ్యోతిషాఖ్య పత్తనమునందు,
వెలసి నరకాసురుఁడు మాఱుతలఁపలేమి
భూతముల నేఁచు చున్నాఁ డరాతిదమన. 6

చ. సురలను సిద్ధచారణుల శోభిలుకిన్నరదానవాళి భూ
వరుల నడంచి తత్సుతుల వారక తెచ్చి స్వకీయదివ్యమం
దిరమున నిల్పినాఁడు జలదేవుని భవ్యతమాతపత్త్రముఁ
బరవసమొప్పఁ గైకొనియె బాహుబలం బది యెట్టిదో కదే. 7

క. సురుచిరమణులం గొన మం, దరపర్వతశృంగవరము దర్పంబు మెయిన్
హరియించె నేమి చెప్పుదుఁ?, బరమేశా! నన్నుఁ గన్నపడఁతి యదితి సూ. 8

*ఆ. సాధ్వియామె సుధను స్రవియించు నమృతకుం
డలము లెపుడు తాల్చు నలరుప్రీతి,
వాని బలిమిఁ గొనియె మానమున్నదె నాకు
నింక నేమిపలుక నిచట నేర్తు?. 9

క. ఐరావతమును దీనిని, గోరుచు నున్నాఁ డదెప్డు కొనిపోవునొ యో
శ్రీరమణా! వచియింపఁగ, నేరను దుష్టాత్ము దుష్టనీతుల నింకన్. 10

క. దీనికిఁ బ్రతికారము నీ, మానసమున నెట్టిదో రమాధవ నీవే
కానం దగు నని పల్కిన, శ్రీనిధి విని సుస్మితంబు చేసి ముదమునన్. 11

క. హరిహయునిఁ జెంతకున్ రాఁ, గరమునఁ దీసికొని భీతి గలుగదు త్రిదశే
శ్వర! హాయిమీఱఁగా ని, ర్జరపురమున నుండవచ్చు రమ్యవిభూతిన్. 12

చ. అని వచియించి మానసమునందుఁ దలంచెను దార్క్ష్యు నంతనే
వినతకుమారుఁ డెంతయును వేగముమీఱఁగ వచ్చి నిల్చె; నిం
ద్రునిఁ జనఁ బంచి దుష్టమతితోఁ దగు భూసుతుఁ జంపఁ గోరి యె
క్కెను విహగేంద్రుమూఁపుఁ దనకీర్తిని బెంచెడు సత్యభామతోన్. 13

చ. తనమనసుం గనుంగొనుచుఁ దా నెఱిఁగింపకయున్నఁ గార్యముం
బొనరుచు నంచు లోఁదలఁచి పొంగెడువేడుక సత్యభామనుం
గొనిచన నెంచె యుద్ధమునకున్ బతియానతి మౌళిఁ దాల్చె న
వ్వనరుహనేత్ర యంతటను వాసవుఁ డాహరిపంపునం జనన్. 14

క. తనకరివరుమూఁపున వే, డ్కను జక్కఁగఁ గూరుచుండి కదలి చనియె దే

* అమృతస్రావిణీదివ్యేమాతుర్మే ఽమృతకుండలే = అనిమూలము.

వనికరము లుండుచోటికి, జను లెల్లరుఁ దన్నుఁ గాంచి సంతసపడఁగన్. 15
క. హరిప్రాగ్జ్యోతిషపురమున, కరిగెం దత్పురముచుట్టు నరివారణభీ
కరపాశము లమరుపఁబడి, పరసేనల సాధ్వసంబుపాల్పడఁ జేయన్. 16
తే. తగినయట్లుండె వాని సుదర్శనమ్ము
వైచి ఛేదించె శ్రీహరి; బాహుబలము
మెఱయ మురదానవుండును మించువేడ్క
హరిని మార్కొని క్షణములో నంత మొందె. 17
ఉ. ఆమురదైత్యపుత్త్రుల సహస్రములై తగువానిసేనలన్
భామయుఁ గాంచుచుండఁగడు బౌరుషమూని త్రివిక్రముండు ను
ద్దామ సుదర్శనప్రబల దావహుతాశనకీలలన్ బడం
గా మఱి భస్మమై చనఁగఁ గ్రక్కునఁ జేసె సురాళి మెచ్చఁగన్. 18
క. త్రోవన్ మురదైత్యు హయ, గ్రీవుని నటుపంచజనునిఁ గీటడగించెన్
దేవ దలిర్పంగా నర, కావాసముఁ జేరఁ బోయె హరి త్వరమీఱన్. 19
మ. హరి యుద్ధం బొనరింప వచ్చె ననఁగా నాలించి భూపుత్త్రుఁడౌ
నరకుం డుద్ధతి వాహినీతతి నితాంతస్ఫార దర్పంబునం
ద్వరమీఱం జనుదేరఁగా నడిచి యాదైత్యాంతకున్ మార్కొనన్
దుర మెంతో భయదంబుగాఁ జెలఁగె నెందుం జూడ రానట్లుగన్. 20
*చాపజ్యావల్లి మ్రోయన్ శరసముదయముల్ స్ఫారవేగంబు మీఱన్
గోపాలక్రోధదృష్టుల్ కుమతితతిహృతిన్ గోరి యొండొందు వేవే
వ్యాపించున్ లక్ష్యశుద్ధుల్ వఱల నట నటన్ బాఱి యవ్వైరివీర
వ్యాపారంబున్ హరించెన్ హరి గని మదిలో హర్షముం బొందుచుండన్. 21
ఉ. సేనల రూపుమాపి హరి చిత్రగతుల్ గనుపట్టుచుండ భూ
సూనుఁడు వైచుశస్త్రముల శుంభదభంగుర బాణసంతతిన్
దానవు డాపి చక్రశితధారల వానిశిరంబుఁ ద్రెంచె నా
దానవుపాటు గాంచి విబుధప్రకరంబులు వేడ్కఁ బొంగఁగన్. 22
ఉ. దానవచక్రహంత యనుధన్యత మాత్మ సమాహ్వయంబు స
న్మానసమోదదంబయి యమానుషకీర్తిని జెంది వెల్గఁగా
శ్రీనిధి యప్పు డొప్పెఁ దనచెంతఁ జెలంగెడు సత్యభామ యెం
తేని ప్రమోదభారమున నీశునిఁ దన్గని మెచ్చుచుండఁగన్. 23
చ. నరకుఁడు ప్రాణపంచకమునం బరిహీనుఁడు కాఁగ మాతయౌ
ధరణియు దేవమాతవగు తన్మణికుండలముల్ వినీతయై
కరములఁ బూని శ్రీహరి జగత్పతిఁ జేరి భయంబు భక్తియున్

---

* స్రగ్ధర:

బరఁగ వచించె దేవగణ వందిత పాదసరోరుహద్వయా! 42

చ. కిరితనువొప్ప దానవుని కృత్రిమశక్తిని నీటమున్గి యా
తురమునఁ గ్రిందికిన్ వగపుతోఁ జనుచుండిన నన్నుఁ దేల్చి స
త్కరుణను నిల్పఁబెట్టితివి కంజరుహాక్ష! త్వదంగసంగతిన్
నరకుఁడు వీఁడుపుట్టె సురనాయక! నీవె యొసంగి తీసుతున్. 25

ఉ. అతని నీవె చంపితివి హర్షము నే నెటులొందుదున్ బలా
రాతిని గన్నయాయదితి భ్రాజితకుండలయుగ్మ మిద్దియే
యీతఁడెఁ గైకొనన్ వలయు నీశ్వర! నాసుతు సంతతిన్ ధరి
త్రీతలమందు నిల్పఁగ మదిం దలపోయుము ప్రార్థనం బిదే. 26

క. కుజనుల భారము పాపం, గఁ జనుఁగదా యన్న వేడుకన్ నాయందే
ప్రజననముఁ గాంచినాఁడవు, త్రిజగన్నాథా! ప్రసాదదృష్టింగనుమా. 27

ఉ. కర్తవు నీవె లోకములఁ గాఁచియ పెట్టెడు వాఁడ వీవె సం
హర్తవు నీవె పాలకుఁడవై తగువాఁడవు నీవె యన్యథా
కర్తవు నీవె పుట్టుకనుగాంచక నాశము లేక యంతకున్
భర్త వటంచు నిన్బొగడ భాసిలువాఁడవు నీవె యీశ్వరా. 28

క. లోకాకృతివే యగు నిను, నేకరణి నుతించుదాన నీశ్వర! వ్యాపి
త్వాకలననొప్పి వ్యాప్యుఁడ, వైకర్తయుఁగార్యమును గ్రియయునయితగుచున్

తే. సర్వభూతాత్మ భూతాత్మసర్వనాథ, యనుచుఁ బొగడంగఁబడచునొప్పునిను నేమి
వినుతులం దన్పుదాన నో విశ్వమూర్తి, యాత్మవనః గనుబరమాత్మ వనఁగనీవె

క. భూతాత్మకుఁడవు చ్యుతిలే, కేతఱి సుండుదువు దేవతేశ్వరుఁడవు నీ
ఖ్యాతిని వర్ణింపఁగ నే, నాతగుదును గరుణఁజూడుముఖిలాంశపతీ. 30

చ. నరకుఁ డొనర్చినట్టి సుజనప్రకరావమతిన్ క్షమింపుమా
వరకరుణాఢ్య పాపసమవాయముపాయ వధించితీవు నీ
కరములఁ జంపఁగాఁబడియెఁ గావున నాతఁడు ముక్తినొందు నీ
శ్వర! యిఁక వానిసంతతిని వారక కావఁగదే మదర్థమై. 32

మ. అని ప్రార్థించిన భూమివాక్కులకు సత్యంతంబు హర్షించి నీ
తనయుం జంపితి వానిసంతతిని దథ్యం బేను జంపంజుమీ
యని వాగ్దానముచేసి భూతసముదాయాత్మస్వరూపుండు న
వ్వనజాతాక్షుఁడు వానియింటఁ గలభాస్వద్రత్నముల్ గైకొనెన్. 33

సీ. కన్యాపురంబునఁ గడు విక్రమంబునఁ గొనివచ్చి నరకుఁ డుంచిన పదాఱు
వేలపై శతసంఖ్య వెలయు కాంతలఁ గాంచె నుగ్రచతుర్దంష్ట్ర లొప్పనున్న
సామజంబులఁ గాంచె షట్సహస్రంబులఁ గాంభోజజనపద సంభవముల
నేకవింశతిసంఖ్య నెసఁగు లక్షలఁ దగు నశ్వంబులను జూచె హరియు; నంత

తే. నరకదనుజుని కింకరోత్కరముఁ బనిచి
కన్యకల హస్తిఘోటకగణము నెల్ల
ద్వారవతిఁ జేరఁగాఁ బంపెఁ దత్క్షణంబ
తత్పురంబున మఱియు నాదైత్యహరుఁడు. 34

క. నరకుఁడు బలిమిన్ మున్గొన, వరుణుఁడు దీనత నొసంగఁ బ్రాభవ మెడలం
గరిమఁ దొలంగఁగ నుండిన, నిరుపమ మగుఛత్రముఁగనె నెఱి హరిమఱియున్

క. కనియెన్ మణిపర్వతమును, వనజాక్షుఁడు దాని గరుడవాహనముపయిన్
మనమలరఁ బెట్టుకొని వాహన మెక్కి సతీలలామ యాకృతిఁ గనఁగన్. 36

ఆ. అదితికుండలముల నామెకు నొసఁగి సంతసము పుట్టఁజేయఁ దలఁచి సత్య
భామఁగూడి శక్రపత్తనంబున కేగెఁ, దనప్రతాప మెల్ల జనులు పొగడ. 37

## తొంబదినాల్గవ యధ్యాయము.

### అదితి హరిని నుతించుట.

చ. గరుడుఁడు వారణంబగుచుఁ గ్రాలెడు ఛత్రము రత్నశృంగభూ
ధరమును సత్యభామ హరిఁ దద్దయుభక్తిని గొంచుఁ బోయె స
త్వరగమనంబుమీఱ నట వారిజనేత్రుఁడు పాంచజన్య మూ
సురపతి కాత్మ శౌర్యమును జూపెడుకోరిక నొత్తె నంతటన్. 38

చ. హరికృత పాంచజన్యరవ మల్లనఁ గర్ణపుటంబులం బడన్
సురవరు లర్ఘ్యపాద్యముల శోభిలుపాత్రము లూని యద్దెవ
చ్చిరి హరిఁ బూజసేయఁ దనుఁజేరిన నిర్జరు లిచ్చు పూజలన్
గర మరుదంది కైకొనియెఁ గామునితండ్రి మునీంద్రు లుబ్బఁగన్. 39

తే. చనియె నంతట దేవతాసమితి గొలువ, నదితి యావాసమునకు మురాంతకుండు
శ్వేతగిరి సన్నిభంబయి చెలఁగు నామె, సౌధ మయ్యాది చొచ్చెను జక్రి యొలమి.

క. కనుఁగొని యట దేవాంబను, వినుతచరిత్రను సుపర్వవిభుఁడున్ గూడం
జనుదేర మ్రొక్కి మణిమయ, ఘనకుండలయుగము నిచ్చె గారవ మలరన్. 41

క. నరకసురారి వధంబును, హరి తెల్పుచుఁ గుండలముల నాదృతి నీయం
గర మరుదందుచుఁ ద్రిదశేశ్వరుతల్లియు వానిఁ గొనుచు సర్వేశ్వరునిన్. 42

క. పరమాత్మ సృష్టికర్తను, హరిఁ గన్నులకఱవుదీఱ నస్టె కనుచుఁ ద
త్పరవశతం గనుమనమునఁ, బరికీర్తించెన్ స్వభావభక్తి వెలయఁగాన్. 43

దండకము. శ్రీపుండరీకాక్ష భక్తామయధ్వంసకా, దేవదేవా, సమస్త ప్రపంచాత్మ
రూపా, ఇలాధార, భూతేశ, మౌనీశ, యోగీశముక్తిప్రదా, చిన్మయాకాన్
నీకున్ నమస్కారమోతారక బ్రహ్మరూపా, తలంపంగఁ బ్రాణాత్మచిత్తంబులు ర

బుద్ధియుఁ దక్కనంగంబులుఁ గాంచు నేయేగుణంబుల్ తదాకారమిావే
కదా దేవ, సత్వాదికాఖ్యల్ తగఁ బెల్లు మూఁడౌగుణాంబుల్ వడిఁ దాఁటి
ద్వంద్వంబులఁ మిాఁటి శుద్ధంబు బుద్ధం బచింత్యం బమేయంబు భూతాళి
హృత్సంస్థ మంచుఁ మహామౌనివర్యుల్ నుతింపంగ నొప్పారు నీయాకృతిం
గాంచ నేరే సమర్థుల్ గలారే, యయారే, సితం బెన్న నీలంబు, రక్తంబునీరూ
ప మంచుఁ వచింపంగ సాధ్యంబె, జన్మాదిదుఃఖంబులే లేక స్వప్నాద్యవస్థాళి
వర్జించి సంధ్యాత్రియా మాదిరూపుండవై భూజలాగ్న్యంబరంబుల్ మరు
న్మానసంబుల్ తగఁ బుద్ధి నానొప్పు వాఁడంచు నెన్నంగనై యున్న సర్వేశ్వరుం
డీవ కావే పరేశా నమస్తే నమస్తే నమః. 44

చ. జగముల సృష్టిచేయఁ గడుసంతసమందఁగఁ బ్రోవ మృత్యువాం
దఁగ నొనరింపఁ గర్త వనఁ దామరసాయతనేత్ర! నీవెక
ర్తృగణము నేలువాఁడ వన నీవె విరించి యనంగ విష్ణు వం
చు గణుతిసేయ శంభుఁడన శోభిలు మూర్తులు మూఁడు నీవెకా. 45

ఉ. నీదగుమాయ విశ్వమిది నీరజనేత్ర! సమస్తభంగులఁ
బ్రోదియొనర్పఁగాఁ బడుచు భూరితరత్వము నొంది వ్యాప్తమై
గాదె చెలంగుచున్నయది గాఢముగా మది నెన్న శక్యమే
నీదగు దివ్యవైభవము నేఁ దెలియం దగునంతవాననే. 46

ఆ. మఱి యనాత్మయందు మహితాత్మవిజ్ఞాన, మమరియుంటఁ దావకమగు మాయ
చేతనేగదా విధాతరో;యిది నాది, యనెడు మాయ తోఁచు నఖిలమందు. 47

సీ. సంసారమధ్యమస్థలమున నీమాయ చరియించుచుండును సత్యమనెడు
భ్రాంతి గల్గించుచు స్వస్వధర్మాసక్తిఁ దగువారిచే నీవు తత్త్వరూప
యారాధితుఁడ వయి యలరుచు నుందువు; తావకభక్తులే తత్త్వ మెన్న
లేని యీమాయను జ్ఞాననౌకాసహాయమునఁ దరింతురు హర్షపదము

ఆ. శాశ్వతంబునైన సరణి నొందుదు; రజ, ప్రముఖదేవవరులు పంచజనులు
పశుగణంబు విష్ణుభవమాయయను సుడి,యందుఁ దిరుగువారె యంబుజాక్ష.

క. నీమాయ యంధకార మ,దేమాడ్కిని దాఁటఁజాలకే యందు సదా
వ్యామోహంబునఁ దిరుగుచుఁ, దామసవృత్తుల్ తగంగఁ దగియుందురుసూ.49

మ. నిను నారాధనవృత్తిఁ గొల్చు నరులే నిశ్చంచలస్వాంతులై
ఘనసంసారసముద్ర మింకఁగ మనఃకాంక్షల్ ఫలింపంగ నొ
య్యన ముక్తింగనఁజాలువారు కనవయ్యా! వీరె త్వన్మాయచే
తనె బద్ధాత్ములు నే ననంగ నినుఁ బుత్రప్రీతిఁ గాంక్షింతుఁజా. 50

చ. కనుకనె వైరిపక్షమును గాల్పు మటంచును వేఁడితిఁ జనా
ర్దన యపవర్గకాంక్షమెయిఁ దథ్యముగాఁ గొలువంగ లేదు నె

ష్మనమున నెన్న నీయదియె మాయ యొనర్చిననేర్పుగాదె యో
యనిమిషవృక్షమా! యొసఁగుమా యొకకోఁచి నటన్న నెట్టిదో. 51

క. నిను ముక్తిఁగోరి యార్తా, ధనములఁ గొల్వకయె వాంఛితంబులఁ గోరం
గనుఁబూనుట పై నేఁ జె, ప్పినయట్టియుదాహృతికిని బ్రియలక్ష్యంబౌ. 52

క. కృతపుణ్యజనుల కది స, మ్మతమా నపవర్గవాంఛ మహితంబె కదా
కృతపాపుల కది తోఁపమి, హితముగ వారల యఘంబయే హేతు వగున్. 53

ఉ. కావున సత్కృపానిరతిఁ గావుము లోకము నాత్మమాయచేఁ
జేవదలిర్పఁ గప్పిన యశేషజగన్మయ! యవ్యయా! జగ
త్పావనకారణా! నిగమభావితరూప! మదజ్ఞతల్ చెడం
గా వసుదేవపుత్త్రక తగం దలపోయుము జ్ఞానదుండవై. 54

క. కరమునఁ జక్రము దాల్చిన, హరికిన్ నీ కిదియె మ్రొక్కు హస్తాబ్జమునన్
దరముం దాల్చిన నీ కిదె, పరమాత్మా వందనంబు భక్తిదలిర్పన్. 55

క. గదయును బద్మము ధరియిం, చు దయామయ నిన్నుఁ గొల్తు శుభదుఁడ వగుమా
మది నెంతు సూక్ష్మచిహ్నా, ళి దగం జెల్వారు నీదులీలాతనువున్. 56

క. పరతత్త్వ మెఱుఁగఁ జాలను, గరుణింపుము దేవదేవ కమలాక్షా! యం
చురుతరభక్తిన్ వేఁడెను, సురమాతయు నెదుటనున్న సురకార్యరతున్. 57

చ. అని వినుతింప నవ్వుచు సురారణి నాఁ దగు దేవిఁ గాంచి య
వ్వనజదళాక్షుఁ డిట్టులను బావనమూర్తివి! తల్లిరో! ననున్
వినుతి యొనర్పనేల కృపవిస్తృతిఁగాంచఁగ నన్నుఁ గావుమా
యనుటయుఁ బుత్త్రుతో నదితి యట్లగు నీవు సురార్చితుండవై. 58

క. పురుషోత్తమా! య దెవ్విధిఁ, బరులకు గెల్వంగరాక భాసిల్లుము కీ
ర్తిరమం గను మెల్లెడలన్, వరపుత్త్రా! యనుచు నదితి వలుకు నదనునన్. 59

క. చనుదెంచి యింద్రపత్నియుఁ, దనయత్తను గూడి కృష్ణు తరుణీమణిఁ గాం
చెను; సత్యభామ యామెకుఁ, బ్రణతుల నొనరించి కరుణ వాంఛించెఁ దగన్.

క. కని యదితి సత్యభామను, దనకోడలిఁ దల్లి నీవు ధరనాదుకృపన్
గనుదువు స్థిరతరయౌవన, మును మాజని దేహకాంతి మురహరుప్రీతిన్. 61

క. అనవద్యాంగీ! భాగ్యం, బున వర్ధిలి సర్వభోగములఁ గనఁగల వం
చనియును దీవించెను ని, ట్లనుతల్లిని సెలవు వేఁడె హరి మరియాదన్. 62

క. హరిహయుఁ డయ్యదితిని గని, హరి నిఁకఁ బంపుమ యటంచు నాజ్ఞనుగొని యా
పరమేశ్వరుఁ దనగృహమును, కరుదెంచుచుఁ గొనుచుఁ బోయి యాతిథ్యములన్.

పారిజాతాపహరణము.

క. మరియాదతప్ప కొనరిచెఁ, హరి యంతట నింద్రుఁగూడి యమరావతియం
దరయందగు సుస్థలముల, నరసి మహోద్యానములను నాదృతి గాంచెన్. 64

క. తనుఁగూడి సత్యభామయు, మనమున హర్షించుచుండ మధువైరియు నం
దనముఖములఁ దిరుగుచు వే, డ్కను నందలి చిత్రములను గని హర్షించెన్.

చ. సురలు పయస్సముద్రమును శూరతమీఱ మహాసురుల్ సహా
యరతిఁ జెలంగఁగాఁ దఱచు నాసమయంబునఁ బుట్టి హాటకా
భరుచిని గాంచి మంజుతర భాసుర మంజరులన్ మనోజ్ఞమై
పరిమళ మొప్ప నూత్నతమపల్లవ కాంతుల వేడ్క నించుచున్. 66

తే. చల్లఁదనము నాహ్లాదము నెల్లవారి, కుల్లసిల్లంగఁ జేయుచు నున్నతమయి
నయనపర్వమ్ముగాఁగఁ దనర్చునట్టి, పారిజాతద్రుమంబు శ్రీపతియు నొకట. 67

చ. కనుఁగొని నంతనే మది నికామముదంబును గాంచె నట్టి శ్రీ
వనజదళాక్షు నచ్యుతుని భర్తను జూచుచు సత్యభామ యి
ట్లనియె మహాత్మ! చూడఁదగినట్టి మహీరుహ మిద్దిద్వారకా
వనముల నేల వర్తిలెడు భంగిగఁ జేయఁగ రాదొ యుత్తరిన్. 68

చ. మనసున కెక్కనంగనల మండలమందును సత్యభామయే
నను బ్రమదంబు నొందఁగ ననారతముం దమిఁ జేయు నంచు నీ
వనియెడు మాట సూనృతమయైన మహాత్మక! పాదపంబు దీ
నిని గొని ద్వారకాపురిని నిల్పుము నాకు మనఃప్రియంబుగన్. 69

చ. తరువిది నాదునిష్కుటముఁ దద్దయు వెల్గఁగఁ జేయఁ గోర్కె శ్రీ
హరి! మది యందుఁ బొల్చెడిని నయ్యది తీర్చుట నీదుభారమై
పరఁగెడుఁ గాదె యట్లగుట భవ్యతమోత్తమకల్పకాఖ్యభా
సురతరువున్ జవంబునను శోభిలఁ జేయుము దీనినావనిన్. 70

చ. "తరుణులలోన జాంబవతి ధన్యయనందగు రుక్మిణీసమా
ఖ్యరహిఁ జెలంగుభీష్మనృపు కన్యయు నీవలె నెన్నఁగా మనో
హరసుఖవృద్ధిఁగూర్చునవి యారయ లేదు నిజంబు సత్యభా
మరో" యనుమాట సత్యరుచినుండితమే యనిఁ జేర్పు దీనినిన్. 71

క. ఉపచారకృతముగాక య, కపటముగా వాక్యమిద్ది క్రాలునయేనిన్
గృపమీఱ దీనిఁ జేర్పుమ, యిపుడే గోవింద! కృష్ణ! యీతరువరమున్. 72

ఆ. పారిజాత మిద్ది హరిమధ్ధర్మ్యంబు, నకు విభూషణమయి ప్రకటకీర్తి
నొసఁగు చుండుఁ గాక యసమానమంజరీ, భూషణమును నేను బొలుపుమీఱ.

ఆ. కేశపాశమందుఁ గీలించి నాసఖు, త్నులసమూహమందుఁ జెలఁగుదాన
నాదుకోర్కె దీర్పు నాథ! యంచని వేఁడు, సత్యభామఁ జూచి శౌరి నవ్వి. 74

చ. వనితరొ! యింతదూర మిటు వాంఛను దీనిని దెల్పనేల? యి
ప్పని యొకగొప్పయే యిపుడె పంతముమీఱ ఫలింపఁ జేయుదున్

మనమునఁ గల్గుసందియము మాను మటంచని హెచ్చరించి చ
య్యన నలపారిజాతమును హర్షము సత్యకుఁ గూర్చుదానినిన్. 75

చ. కరములఁబట్టి లాగి తమకంబునఁ దార్క్ష్యనిపక్షమధ్యముం
శరణముగాఁగ నిల్పె నది సత్యయుఁ గాంచి ముదంబు నొందె ని
ర్జరవనపాలకప్రతతి శౌరిఁ గనుంగొని కృష్ణ! కృష్ణ! దే
వరమణి పత్నియా శచిని భవ్యచరిత్ర నెఱుంగుదేకదా. 76

క. ఆతన్వి ప్రీతిపాత్రం,బై తగు నిప్పారిజాత మనిశము దీనిం
జేతోమోదప్రదమును, నీతఱి నీవిట్లు కొనఁగ నెంతయు ముప్పౌ. 77

క. వినుము పులోమజ ప్రీతిం, గనఁ జేయ విభూషణంబుగా దేవత లె
ల్లను సుధమథియించికొనం; గను యత్నము చేసి పాలకడలిని దీనిన్. 78

క. పడసిరి దీనిం గొనునా, తఁడు మేలును బొందఁబోఁడు తథ్యంబిది యి
ప్పుడు నీవు కోరినాఁడవు, పడయఁగ సాధ్యంబె దీని బ్రహ్మకునైనన్.  79

క. ఏమఱుపాటున నైనం, బ్రేమాతిశయంబు పొలయ విబుధులసొమ్మా
భూమిరుహావరము దీనిని, మామదమునఁ గొనిన బ్రదుకుమాట యన్నృతమా.

క. ఎవఁడేఁ గొనిపోవఁగఁ గ, ర్మవశతఁ గాంక్షించు వానిమదమడఁచును వా
సవుఁడు సురావళి గొల్వఁగఁ, బ్రవిదారణమందుఁ దీవ్రవజ్రకరుండై. 81

చ. కనుకనె కృష్ణ! దైత్యరిపుకాండముతో ననిచేయు యత్న మిం
కను మదిఁగోర కీవు చనఁగాఁ దగు నూహయొనర్పవయ్య! స
జ్జనులు విపాకదుష్ఫలదసారవిహీనకుయత్న మెన్ని నె
మ్మనముల దుష్టకర్మ మనిమానుదు రెంతయు నేర్పుమీఱఁగన్. 82

క. అనుమాటలు చెవిసోఁకిన, వనితామణి సత్యభామ వారని క్రుద్ధంబౌ
నిన మదితో నిట్లనియెను; వినుఁడీ శచి యెవతె దేవవిభుఁ డెవ్వండో. 83

క. ధరణీరుహావర్యముపైఁ, బరమాదృతి వీరి కున్నవడువున మాకుం
బరమాదృతి యుండదొకో, తరువున నధికార మమరతతి కేటికొకో. 84

ఆ. సకలలోకములకు సామాన్య మీపారి, జాతతరువు; మున్ను జలధిఁ దఱువ
జనన మందె దీని శక్రుండు గ్రహియించె, దానిహేతు వేమొ తలఁపఁజాల. 85

క. సురలును శీతాంశుండును, సిరి యెట్లు జనించి రట్లె సింధుజనితమా
తరువర్యమిద్ది యెల్లర, పరమాదృతిఁ బడయఁజాలు భావింపంగన్. 86

చ. పెనిమిటి విక్రమాఢ్యుఁడను పెంపుతగం శచి యడ్డగించెడిం
గనుకనె మీఱుపోయి సురకాంతునిపత్నిని గాంచి నేను జె
ప్పినయటు పల్కుఁడీ; విబుధ బృందవరాంగనరో! మదుక్తినె
మ్మనమున నున్ప నేననిన మామకనాథుని శౌర్యసంగతిన్. 87

ఆ. గసువమూని యిట్లు పరుషంబులాడెద, నాలకింపు మీవు హరిహయునకుఁ
ప్రీతిపాత్రమవగు వెలఁదివే నీయందుఁ, బతికి మిగులఁ బ్రీతివఱలునేని. 88

ఉ. నాదగుప్రాణనాయకుఁడు నామురిపెంపునుడుల్ మనంబునన్
గాదన కాదరించి తనకాంత మనందగుపారిజాతమున్
మేదినిఁ జేర్పఁ గొంచుఁ జన మిక్కిలికోరెడు శక్తియున్నచో
నీదయితున్ సురేశ్వరుని నేర్పున నడ్డపడంగఁ బంపుమా. 89

చ. సురపతి యంచు శక్రుఁడని శూరుఁ డటంచును నొప్పు నీమనో
హరుని నెఱుంగుదున్ జలరుహాక్షిరో యైనను మర్త్యనారినై
పరఁగెడునేను గల్పతరువర్గము భూమికిఁ గొంచుఁ బోయెదన్
ద్వరపడి నిల్వరింపు మని దారుణభంగిని బల్కె రక్షకుల్. 90

చ. చని శచిఁ గాంచి నెమ్మదుల శంకతగన్ వచియించి రెవ్విధం
బున హరిపత్ని పల్కె నటు పొంకముగాఁ; దదనంతరంబ శ
క్రునిసతి కోపమూని పురికొల్పెను దేవపతిం బతిం ద్వరం
జని హరి నడ్డగింపుమని; శక్రుఁడు తద్వచనాదరంబునన్. 91

మ. సురసైన్యంబులఁగూడి వే చనియె నాక్షోణీరుహార్థంబు శ్రీ
హరితో యుద్ధముచేయుకోర్కి; రణమందాసక్తులౌ దేవతల్
పరిఘంబుల్ వరశూలముద్గరగదల్ భాసిల్లు నిస్త్రింశముల్
కరయుగ్మంబుల నొప్ప వజ్రధరుఁ డుత్కంఠన్ దముం బంపఁగన్. 92

క. హరిఁ దలఁపడఁగాఁ బోయిరి; కరిరాజముమీఁద దేవకాండము సేవిం
ప రణము చేయఁగ వచ్చిన, హరిహయునిం గనియె నమ్మురారియు నచటన్.

చ. నిరుపమపాంచజన్యమును నిర్భరపౌరుషమొప్ప నొత్తి భీ
కరతరతధ్వనుల్ దిశలఁ గ్రమ్మఁగఁజేసి శరాసనంబు సం
గరమున కాయితంబుగ నికామజవంబునఁ జేసి సాయకో
త్కరము సమంత్రకంబుగఁ దగంబరఁగించెను సత్యయుబ్బఁగన్ 94

తే. దిశలు విదిశలు నభమును దీవ్రసాయ
కాంచితంబులుగా నుండఁ గాంచి సురలు
శస్త్రముల నస్త్రములఁ బెక్కుచందములను
వైచి యార్చిరి; శౌరియుఁ బౌరుషమున. 95

చ. అమరభటాళి వైచినమహాస్త్రము లొక్కొకటొక్క వేయిరై
క్షమఁబడఁ జేసె; నంత విహగప్రభుఁ డంబుపతిప్రయుక్తపా
శమును విలాస మొప్పునటు చయ్యనఁ దుండము చేఁ గ్రహించి ఖం
డములుగఁ జేసి యాడె శిశునాగశరీరముఁ బోలె నెంతయున్. 96

ఉ. *అంతట దేవకీతనయుఁ డంతకుఁ జేసిన దండ మట్లు దు
ర్దాంతగదాప్రహారమున ధారణిపై శకలాకృతిం బడం
బంతము మీఱఁజేసి ధననాథుని దౌశిబికన్ సుదర్శన
క్రాంతిఁ దిలప్రమాణములు గా నొనరించె భయంకరంబుగన్. 97

ఉ. అత్తఱిఁ బుష్పవంతులు తదాగ్రహదృష్టిహృతప్రకాశులై
రిత్తగఁ గానఁగాఁ బడి; రరిందముఁ డౌ హరి బాణముల్ మహో
దాత్తగతుల్ చెలంగునటు తద్దయుఁ బౌరుష మూని వైవన
ప్పిత్తమ మట్టె తున్కలయి పృథ్విని ద్రెళ్లె హృతాత్మగర్వుఁడై. 98

చ. వసువులు మార్కొనంగ హరి వారిని వీలఁగ నొవ్వఁజేయఁగా
దెసలకుఁ బాఱి;రత్తఱిని దీవ్రపరాక్రములైన రుద్రులో
క్కసరణి దాఁకెఁ జక్రమున గాత్రములాయతశూలముల్ కడున్
వెస హృతసారతం బడఁగ విక్రమసంపదఁ జేసె నేర్పునన్. 99

సీ. సాధ్యులు మారుతసమితి విశ్వేదేవగంధర్వు లాచక్రికాండములను
శాల్మలితూలంబు సరణిఁ జిమ్మంబడి; రప్పతంగేశ్వరుం డాత్మవక్త్ర
పక్షనఖాంకురశిక్షణంబున దేవతలఁ జెండె నుపదేవతలను దోలె
నత్తఱి దేవేంద్రుఁ డమరులభీతిని గని వాసుదేవు మార్కొనియె నప్పు
తే. డిర్వురును బౌరుషమున జయేచ్ఛ లొప్ప
శతసహస్రంబులుగను వర్షంబుకరణి
బాణములఁ గురియించిరి ప్రబల మేఘ
రాజములు వోలె సురముని రాజి యలర. 100

క. ఆవిగ్రహమున ఖగ మై,రావతమును బోరి రొక్కక్రమమున నపుడే
దేవతలు సాయపడి తమ, వౌవిక్రమములను జూపి రాహరిహయుఁడున్. 101

చ. తనగురుశస్త్రసంతతులు దారుణరూపములైన యస్త్రముల్
వనజదళాయతాక్షు శితబాణపరంపర రూపడంగ నిం
కను ద్వరఁబూనకున్నఁ జెడుఁ గార్య మిదంచుఁ దలంచి వజ్రముం
గొనియె సుదర్శనాయుధము గొబ్బునఁ గైకొనె శౌరియుం ద్వరన్. 102

వ. అత్తఱి సచరాచరంబగు త్రైలోక్యంబు హాహాకారమయం బయ్యె. వజ్రచక్రంబులం దాల్చి నిల్చి యున్న హరిహయహరిహయానుజులం జూచి భూతవ్రాతం బెల్ల భీతిల్లె నప్పుడు. 103

చ. హరిహయుఁ డాత్మతుల్యమగు నట్టిమహత్తర వజ్రమేయఁగా
హరి భగవంతుఁ డౌట నొకయాటఁగ దానిగ్రహించి చక్రముం

* శిబికాంచధనేశస్యచక్రేణతిలశోవిభుః=అనిమూలము. శిబికయను పేరుగలశక్తి.

ద్వరపడి వైవ కింద్ర యిఁకఁబాఱక నిల్వుము నిల్వు మంచు భీ
కరరవమొప్పఁబల్కెఁ; విహగప్రభుతాడిత వాహనుండునై. 104

చ. హృతకులిశాయుధుండునయి యేమియుఁ దోఁపమి నూరకున్న యా
శతమఖుఁ గాంచి కృష్ణుసతి చయ్యనఁ బాఱఁ దలంచు బెంచి యీ
వితమునఁ బల్కెఁ; లోకతతి వేడుకఁగాచుచు దేవతాళికిం
బతివయి యొప్పునీవిటులఁ బర్విడఁ జూచుట యుక్తమే యగున్. 105

తే. మఱియు నీవు పులోమజామానినీవ, తంసమున కీశ్వరుఁడవయి తగుదుగాదె
పారిజాతస్రగాభోగపరత నిన్ను, వలచె నాశచి దీనినేఁ దలఁపవలదె 106

సీ. పారిజాతస్రగుజ్జ్వలదేవ రాజ్యంబదెక్కడ? మదినొప్పుపృథుతరప్ర
ణయసమాగత శచీనారీశిరోమణి యెక్కడ?నీవిట్టు లేగఁజూచు
టనునది యెక్కడ?యంగనంజూడక పాఱఁజూచుట నీకుఁ బౌరుషంబె
శక్ర!ప్రయాసము చాలును సిగ్గును బొందనేటికి? కల్పభూరుహమును

తే. దీనిఁ గైకొనిచనుము నీదేవతలు గ,తవ్యథులుగాఁగఁ బొల్తురు తగనిగర్వ
సంపదన్ నీదుపత్ని స్వపద్మమునకు, వచ్చినట్టి ననుం బ్రీతివఱలఁగనక. 107

క. ఎవతుకనో కనినట్టులు, సువిహితపద్ధతిని మాని చుల్కనఁ జూచెన్
దివిజేంద్రా! నారీత్వం, బవిమలచిత్తంబు నుంటనాత్మేశ్వరునిన్. 108

తే. పొగడఁజొచ్చితి నేను నిప్పోల్కి తగదు
దానినటులుండ నిమ్ము నీతోను గలహ
మిపుడు చేయుచున్నాను హితముమాని
యైన నిప్పుడు చెప్పెద నమలహితము. 109

క. పరధనము పారిజాతము, హరియించుటయేల? దీన నగు ఫలమేమో
పరికింపఁజాలఁ గైకొని, యరుగుము లోకమున రూప నులవడియున్నన్. 110

ఆ. యశము వెలసియున్న నంగన యెవతుక, గర్వయుక్తిఁ గనక కమ్రవృత్తి
నుండఁజాలు? ననిన నుగ్రసంగరమును, మాని యిట్లు పలికె మఘవుఁడార్తి.

వ. చండీ! ఖేదాతివిస్తరోక్తు లిఁకఁ జాలింపుము. సర్వప్రపంచనిర్మాణ పరిపాలన సంహారకర్తయై విశ్వరూపుండగు నీశ్వరునిచే నోడింపఁబడిన నాకు లజ్జ యెక్కడిది? ఏప్రపంచస్వరూపునివలన నీప్రపంచము వృద్ధియగునో, అనాదిమధ్యలయుఁడగు నాపరమేశ్వరునకు నమస్కరించెదను. సృష్టిస్థితిలయకర్తచేఁ బరాజితుఁడ నగు నాకు లజ్జయుదయించుననుట వెఱ్ఱితనమునఁగాదే. దేవీ సకలభువనమూర్తి యగు శ్రీహరిమూర్తి యతిసూక్ష్మమగు. తన్మహత్త్వమును సకలవేదతత్త్వజ్ఞు లగువారికిం దక్క నన్యు లెఱుంగఁజాలరు. అట్టి యజు నీశ్వరుని శాశ్వతుని నెవ్వఁడు మార్కొని యోడింపఁగలఁడని పల్కి యూరకుండెనంత. 112

## తొంబదిరెండవయధ్యాయము.

పారిజాతముంగొని శ్రీహరి ద్వారకానగరమున కేతెంచుట.

మ. ఘనవాహుం డిటుసంస్తుతింపఁగ రమాకాంతుండు తద్వాక్యముల్
విని హాసాంకుర మాస్యపద్మమున వే వే వింతగా నాడ ని
ట్లను గంభీరతఁగాంచు భావమున దేవాధీశ!యింద్రుండ వీ
వన లోకత్రయరాజ, వేమనఁగ మర్త్యవ్రాతసంబంధతన్. 113

క. కాలమును ద్రోయువారము, శ్రీలలితా మదపరాధరీతి క్షమింపం
బోలును గల్పద్రుమ మిది, సాలవరంబౌట నుచితసంస్థితిఁ గననౌ. 114

ఆ. పారిజాతమిద్ది చారువనంబున, నిలుపఁగా గ్రహింపవలయు దీని
సత్యభామవచనసంగతి గ్రహియించి, నాఁడఁ గాని వాంఛఁ గూడి గాదు. 115

క. నను నొప్పింపఁగ నీవై, చినవజ్రము దీని మరలఁ జేకొను మింద్రా,
ఘనమైన యాయుధం బిది, యనఃజను నీయరివిదారణార్థము పుట్టెన్. 116

చ. అనవిని శక్రుఁ డిట్లనియె హారివచస్తతి మోహితాత్ముగా
నొనరుపఁ బూనినాఁడవు సురోత్తమనాయక! మానవుండ నం,
చని నిను దేవదేవునిగ నాత్మనెఱుంగుదు నోయనంత! యిం
తనఁదగనట్టి సౌఖ్యముల నందితి నేను త్వదంఘ్రిసేవచేన్. 117

క. శ్రుతు లెవ్వండవు నీవని, సతతము వచియించు నట్టిచక్రివి నీవే
క్షితిఁ గార్యార్థము పుట్టితి, వతిశయలోకార్తి నడఁప నసురుల మాపన్. 118

చ. తరువిది పారిజాతమనఁ దద్దయు ఖ్యాతిని గాంచు ద్వారకా
పురమున కీతరూత్తమముఁ బొంగెడువేడుకఁ గొంచుఁబొమ్మదే,
తరుణమునందు మర్త్యమునఁ దాదకవాసము లేకయుండు నీ
తరు వటనుండ కిచ్చుటకిఁ దప్పక చేర్పఁబడున్ ధ్రువంబుగన్. 119

చ. అనవిని పద్మనాభుఁ డటు లౌనని యింద్రునిసమ్మతిన్ సురల్
వినుతి యొనర్పఁగా వినుచు వేగము తార్క్ష్యుఁడు గొంచుఁబోవఁగా
మునులు మహాత్మ! వేదనుతమూర్తి! పరాత్పర; నీకు మ్రొక్కుటం
చును వచియించుచుండఁ దను సొంపుగ సత్యయుఁ గాంచు చుండఁగన్. 120

ఉ. పాదపవర్యముం బరమపావనరూపముఁ గొంచు శంఖస
న్నాదను దిక్కులన్ వెలయ నాకులు మోదమునం గనుంగొనన్,
శ్రీదయితుండు స్వీయనగరీవరమూర్ధముపైఁ జెలంగ స
మ్మోదమునొంది రెల్లరును భూస్థలికిన్ హరి వచ్చె నంచొగిన్. 121

మ. గరుడుం డల్లనఁ గ్రిందికిం దిగ రమాకాంతుండు సత్యాయుతిన్
బురముం జేరి మనోహర ద్రుమవరంబున్ నిష్కుటంబందు ని,

ల్పె రహిఁ దత్తరురాజసన్నిధిని హృల్లీనాత్మపూర్వస్మృతుల్
వరుసం దోఁచు నదెట్టి వారికయినన్ వాంఛింప కున్నం ద్వరన్. 122

ఉ. ఏతరువర్యపుష్పముల నెంతయుఁ బొల్చుపరీమళంబు చే
భూతల మట్టె వాసితమవున్ గద మూఁడగుయోజనంబులున్,
శీతలవాతపోతములచేత సువాసనచేత నిండి వి
ఖ్యాతిని గాంచుచుండు జను లంద అమానుష దివ్యగంధముల్. 123

క. కనుఁగొని రాపాదపవర, మున దర్శనమాత్రముననె పొలుపుమిగులు శ్రీ
లనుగూడి యొప్పు నంచని, యును నూహించిరి తదున్నతోన్నతమహిమన్. 124

క. హరిపరిచరు లాత్రిదశే, శ్వరుపురవర్యంబునుండి క్ష్మాపతినగరో
త్కరములనుండియు నరకా, సురపురినుండియును మిగుల సొంపగుమణులున్.

క. ధనచయకరిహయములు స్యం, దనరాజియు నన్నుమిన్నతండంబును నై
కొనిరాఁగ హరియుఁ దత్ప్రియ, లును గైకొని రాత్మముదములు వడిం బొంగన్.

శ్రీహరిపదాఱువేవురు కన్యలవివాహమగుట.

ఆ. కొలఁదిదినము లిట్లు సులలితపద్ధతి, సాగ మధుహరుండు భోగివర్య
శయనుఁ డంత మంచిసమయంబునన్ నర, కాసురుని పురంబునందు మున్ను.

క. బలవంతమ్ముగఁ జెఱలో, ఖలుఁ డుంపఁగ వెతలఁగుందు కాంతలఁ దనునే
లలిఁ గోరువారి సద్వృ, త్తలఁ బెండిలియాడె నొక్కతరుణమునం దే. 128

క. విధి తానెయయ్యు జనులీ, విధమున వర్తింపవలయు విశ్వంబున నీ
విధి తప్పఁ గూడదని తా, విధించుగతి శాస్త్రయుక్తవిధిఁ బెండ్లాడెన్. 129

క. వారెల్లఁ దనపృథక్తను, లై రంజిల్లుదురు గాన నఖిలముతానై
కోరిక నుండుంగావున, శ్రీరమణుఁడు పెండ్లియాడె శ్రీ వెలయంగన్. 130

సీ. వారుపదార్వేలుగా రహిఁ దనరారుచుందురు మఱియును నొక్కనూఱు
సంఖ్యప్రాక్సంఖ్యపై సమధికంబుగ నొప్పు నట్టికన్యకల శ్రీహరిస్వకీయ
మైనరూపమ్ముఁ బదార్వేల నూఱురూపమ్ములు గాఁజేసి పరమపురుషుఁ
డగుట నెల్లరయాత్మలందు వెల్లడికాఁగఁ బెండ్లియాడెను బ్రీతి వెలసినట్లు;

తే. కన్యకలు వారలెల్లరు కమలనయనుఁ, డొక్కతనునే వివాహమైయొప్పెననుచు
నెంచి రాత్మలఁ బ్రత్యేక మీమురారి, నాకె నాథుండు ననుఁజూచుఁ గాక ప్రీతి.

చ. అని తలపోయసాగిరి; మహాత్ముఁడు కేశవుఁ డంత రాత్రులన్
వనితల గేహవర్యముల భవ్యమృదూత్తమతల్పరాజి లో,
కనిచయసృష్టికర్త యయి గ్రాలుట హాయిగఁ బవ్వళింప నే
ర్చెను నొకకాంతకే తనదుచిత్తము నర్పణచేసి నట్లుగన్. 132

క. హరి నాయింట వసించెను, బురుషోత్తముఁ డొక్కనన్నె బుద్ధి వలచె శ్రీ
వరుఁ డొగి నాకే దక్కెను, సిరి నాదే యనుచు వారు చెందిరి తృప్తిన్. 133

---

## తొంబదియాఱవ యధ్యాయము.

### అనిరుద్ధచరిత్రము

చ. అని హరిదివ్యమా చరిత మాదృతిఁ దెల్పి పరాశరాత్మజుం
డనుపమతచ్చరిత్రము మహర్షుల కింకను దెల్పఁబూని యి
ట్లనియె మహాత్ములార! త్రిదశాధిపపూజ్యుఁడు చక్రి రుక్మిణీ
వనితను బెండ్లియాడి సుతవర్యులఁ గాంచిన వార్తఁ దెల్పితిన్. 134

తే. అందుఁ బ్రద్యుమ్నుఁడే యాద్యుఁ డంచుఁ దెలిపి
తినిగదా సత్యభామయుఁ దనయులఁ గనె
భానుముఖులను రోహిణీప్రమద దీప్తి
మంతులైన ప్రపక్షాదిమాన్యులఁ గనె. 135

సీ. జాంబవతీదేవి సాంబాదితనయులఁ బడసెను వారెల్ల బాహువిక్ర
మమ్ముల నొప్పిరి; మఱి భద్రవిందాద్యు లానాగ్నిజిత్తికి నాత్మజన్ము
లైరి సంగ్రామజిత్తను వాఁడు తొలికొడు కాశైబ్యకయ్యె మహాబలులగు
తనయుల మఱికొందఱను గాంచె నాశైబ్య మాద్రి వృకాదికుమారకులను

తే. గనియె లక్ష్మణతనయుల గాత్రవన్ము
ఖులను గాంచెఁ గాళింది యన్ కోమలాంగి
శ్రుతముఖులఁ బుత్త్రికులఁ గని సొబగుమిగిలె
నితరపత్నులు పుత్త్రుల నెలమిఁ గనిరి. 136

వ. శ్రీకృష్ణునితరభార్యలందుఁ గలిగిన పుత్త్రులెనుబది వేలనూఱుగురని పరిగణితం బయ్యె. రుక్మిణీతనయుండగు ప్రద్యుమ్నుం డాతనూజులయందు జ్యేష్ఠుండయ్యె. ప్రద్యుమ్నున కనిరుద్ధుం డనువాఁడు తొలికొడుకు. వాఁడు వజ్రనామకుని గనియె. 137

క. అనిరుద్ధుఁడు భూరిరణం, బున రుద్ధుండయ్యె బలికిఁ బుత్త్రుండగు బా
ణునకుం బుత్త్రికయగు నుష, యనుదానిం బెండ్లియాడె నతిశయబలుఁడై. 138

క. అనిరుద్ధుకొఱకె మును, పెను సంగరమయ్యె నందుఁ బెనఁగిరి హరుఁడున్
వనజాక్షుఁడు ఘోరంబుగ, దనుజోత్తముఁడైన బాణు దారుణకరముల్. 139

క. హరి కఱకుటమ్ములన్ వడిఁ, బరఁగించి సహస్రసంఖ్యబాహువులన్ భీ
కరగతిఁ ద్రుంచెను బౌరుష, ముఱుతరముగ భూమియందు నొప్పారంగన్. 140

చ. అనవిని మాను లిట్టులని రార్యవరా! మునిచంద్రమా యుషాం

గనకొంటి కాహరీశ్వరులు క్రందుగఁ బోరిరి వేయిబాహువుల్
దనుజుని వేలత్రుంపఁబడె దానవవైరి శితాంబకాళిచే
వినఁగడు వాంఛగల్గె గతవృత్తము నెల్లను మాకుఁ జెప్పుమా. 147

చ. ఇది వినసర్హమైన కథ యెంతయు దీన శుభంబుగల్గు స
మ్మద మటులౌటఁ జక్క విన మావగు నాత్మలు కోరుచున్న వీ
యదనునఁ గానఁ జెప్పుము మహాత్మ పరాశరపుత్త్ర నాఁగ నె
మ్మిదనర వ్యాసుఁ డిట్లనియె మేలగు ప్రశ్నమిదౌ దలంపఁగన్. 142

చ. వినుఁడు వచింతుఁ దచ్చరిత వీనులవిందుగ బాణనాముఁ డౌ
దనుజలలామపుత్త్రి యుష తా నొకనాఁడు విహారవాంఛ మై
కొన రజతాద్రికిం జని నికుంజతలంబుల విశ్రమించి యీ
శునిఁ దమిఁ గూడి వేడుకల శోభిలు పార్వతిఁ గాంచె నొంటిగన్. 143

చ. నయనఫలంబుగాఁ బ్రమథనాథునిఁ బర్వతరాజపుత్త్రికన్
నయహితగౌరవంబునఁ గనం దగ నోచితిఁ బూర్వపుణ్యమే
నియతి ఫలించె నిప్పు డనినెమ్మది నెంచుచుఁ దాను గూడ ని
ట్టియనువునం బ్రియుం గలిసి తీవిగ నుండఁగ నెప్పు డబ్బునో. 144

చ. అనితలపోసె; సర్వహృదయస్థితవాంఛల నెల్లనుం గనుం
గొనఁ దగినట్టి మంచుమలకూఁతురు కుంజముచెంతనున్న యా
వనితలమిన్నఁ గాంచి యిటువల్కెను భామిని! నీమనోంబుజం
బున ననుతాప మానసము పొందుగ నాథునిఁగూడి నావలెన్. 145

మ. చరియింపం గలవీవు చింతిలకు నాఁ జార్వంగి యాభాగ్య మే
తరుణంబందుఁ జెలంగునో యనుచు సంతాపము నందెన్ మనో
హరుఁ డెవ్వాఁడు లభించునో యెచటనో యంచుం దలంచెన్ దగన్
మరలన్ బార్వతి దానినిం దెలిసి యీమాడ్కిన్ వచించెం గృపన్. 146

తే. సొగసులాడిరో వైశాఖశుక్లపక్ష, మందు ద్వాదశిరాత్రి నెయ్యమున నీవు
నిద్రఁ జెందంగఁగలయందు నిన్నెవఁ డభి, భవమునొందించువాఁడెపో భర్తనీకు.

క. పతి యతఁడే కాఁగలఁ డో, యతివా చింతింపకు మని యగజాత వచిం
చి తగఁ దిరోహితయయ్యెను, బతిఁ గోరుచు నుండ నల్లె ద్వాదశిరేయిన్.

చ. హరుసతి చెప్పినట్టులె యుషాంగన స్వప్నమునందు వింతగాఁ
బురుషుఁ డొకండు తోఁచి పలుపోకలఁ జిత్తములొంగఁజేసి యా
స్మరశరలక్ష్యభూతగ నమానుషశక్తి నొనర్చి యప్పుడే
యరిగెను వానిపైని హృదయంబును జేర్చెను రాగసంపదన్. 149

---

వైశాఖేశుక్లద్వాదశ్యాం స్వప్నే యోఽభిభవంతవ । కరిష్యతిస తేభర్తా రాజపుత్త్రి భవిష్యతి ॥
అనిమూలము.

చ. కల తనుఁ బాసి పోవ నుష కాంతునిగానక తత్పరాత్మయై
సులలితరూప! నన్వదలు వొప్పు నెఱుంగఁగఁ జాలనైతి నా
ర్తుల ననుముంచి చెప్పకయె తోఁచినయట్టులు నాథ పోయితే
పలుకుల నన్ను నమ్మునటు పల్మఱు చేసితి వవ్వి వమ్ములే.
చ అని తలపోయుచుఁ గా మనమునం దినుమంతయు లజ్జలేకయే
మనసునకెక్కు నెచ్చెలిని మాటికిమాటికిఁ బిల్చి నాథువా
ర్తను వచియించుచుండె; నలతన్వి యుషాసుదతీప్రియంబె చే
యను దలపోయు నిర్మలహృదంబుజ బాణునిమంత్రిపుత్రియా. 159
తే. కలఁడు కుంభాండుఁ డనుమంత్రి లలితగుణుఁడు
బాణునకుఁ గూర్చువాఁడు సత్పక్షపాత
మతియు నగు వానిపుత్త్రిక మహితరూప
చిత్రరేఖ యనంబడు చిత్రలేఖ. 152
క. ఆకన్నియ బాణాత్మజ, కేకాంతసఖిత్వ మలర నెప్పుడు కార్యం
బాకాంక్షించిన నప్పుడె, యాకాంక్షం దీర్పఁజాలు ననుపమశక్తిన్. 153
ఆ. అట్టిచిత్రలేఖ యాయుషావాక్యంబు, లాలకించి యొవని నాత్మఁ దలఁచి
పలుకుచున్నదాన వలుకఁ బూనక నాకుఁ, దెలుపవమ్మ మదికిఁ దేటపడఁగ. 154
చ. అనవిని నెచ్చెలిం గనుచు నార్తి మనంబున శాంతిమాన్ప ని
ట్లనిరెయును వ్రీడమాని కలయం దొకనూతనపుష్పబాణుఁ డౌ
య్యన ననుఁ గౌఁగిలించి ప్రియమార మృదూక్తుల నన్నుఁ దేల్చి వే
చనిరెయ నదెట్టులో తెలియఁజాలను వానితెఱంగు నెచ్చెలీ. 155
తే. చిత్రలేఖయు నయ్యుష చెప్పినట్టి
పల్కులందు విశ్వాస మేర్పడఁగఁ జక్క
వినిరెయుఁ; దనవార్తనెఱిఁగినదని యెఱింగి
పలికె మఱియును నుష మదిఁ బట్టుదలను. 156
చ. వినితివి నాదువాక్యముల విశ్వసనీయము లివ్వియంచు నీ
మనమున నెన్నినట్టు లనుమానములేక యెఱింగితిఁగా సఖి
మనుజలలాము నాప్రియుని మన్మథమన్మథు నెట్లు తెచ్చెదో
నను నెటు ప్రాణసంయుతి తనర్పఁగఁ జేసెదొ యే నెఱుంగఁజా. 157
చ. త్వరపడి కార్య మిద్ది ఫలవంతముగాఁ గొనసాగఁజేసినఁ గా
ధర మనుదాన వేఱయినఁ దాళఁగఁజాల ముహూర్తమైన నా
దరమున నన్నుఁ గావుమని తగ వినయంబున వేఁడు నెచ్చెలిఁ గా
గరువముమాని పల్కుప్రభుకన్య నుషంగని చిత్రలేఖయున్. 158
చ. వలిపెపుఁజీరయందు సురవర్యుల దైత్యుల దేవయోనులై
చెలఁగు మనోహరాంగులను సిద్ధుల మానవులఁ గా క్షణంబులో

పల లిఖియించి యచ్చెరువుపర్వెడు నట్లుగఁ జూపె నోయుపో
త్పలదళనేత్ర! కాసుదతి తత్పరయై గనె దాని వేడుకన్. 159
సీ. తొలుత గంధర్వవీరులఁ జూచి తలఁ ద్రిప్పె సురగులఁ గనుచు నధరము విఱిచె
సురలఁ గనుంగొని శుభదృష్టులను మూసె నాసురులం గని యీసడించె
మనుజులఁ గొందఱఁ గని మదిఁ ద్రిప్పెను నందకవృష్ణుల నరయమానె
బలరాముఁ గృష్ణుని జెలఁగి కనుంగొని మందాక్షవతియయి మాట యుడిగె
తే. నవలఁ బ్రద్యుమ్నుఁగని వ్రీడ యలముకొనఁగ
దృష్టి మరలించెఁ దత్సుతు నిష్టఫలదుఁ
గాంచినంతనె స్వేదాంబుకణము లొలయ
నతఁడె యతఁడే యతండె యా ననియెఁ దమిని. 161
చ. అనుపలు కాయుషాలలనయాస్యసరోజమునుండి వెల్వడం
గనె తమిఁ జిత్రలేఖయు వగన్ నినుఁగుందఁగఁజేసినట్టి నీ
యనుఁగుయదూద్వహున్ గుటిలు నర్భకతుల్యుని నాదుశక్తిపెం
పునఁ గొనితెచ్చి నీయెదుటఁ బొందుగ నిల్పెదఁ జింతఁదీర్చెదన్. 161
ఆ. అనుచు నూఱడించి యాశ్వాసితస్వాంతఁ, జేసి యోగగమన సిద్ధి వెలయ
ద్వారవతికి నపుడె తరలి పోయెను మాయ, పెంపుఁజూప సఖికిఁ బ్రియముఁగూర్ప

---

## తొంబదియేడవయధ్యాయము.

అనిరుద్ధుని బాణాసురుఁడు నిర్బంధించుట.

చ. అని వచియించి వ్యాసుఁడు మహర్షులతో మఱియున్ వచించె నిం
క నొకవిశేషముం దెలుపఁగా వలయున్ వినుఁ డద్ది యేమనన్
మును పొకచోట బాణుఁడు త్రిమూర్తులలోఁ గడుమేటియైన శం
భుని గని మ్రొక్కి యిట్లనియె భూతపతీ! పరమేశ్వరా! హరా. 163
సీ. వినవయ్య నాదగు విన్నపం బొక్కండు బాహుసహస్రముల్ వఱలు నాకు
సంగరములు లేమిఁ జాల నిర్విణ్ణుఁడనై యున్నవాఁడ భుజాళికిఁ దగు
ప్రవిదారణం బొక్కపట్టునఁ గలిగిన సఫలతఁ గను నివి సంగరంబె
పొసఁగకయున్నచో భూరిభారమెకాక ఫలమేమిగల్గను భాలనయన
తే. యనఁగ శంకరుఁ డిట్లను నసురనాథ, విను మపూర్వభవధ్వజమునకు నెపుడు
భంగ మొనఁగూడు నప్పుడే సంగర మగు, దనుజసంతతి సంతోషదాయకముగ.
చ మనసున నీవు కోరినది మంచిదె నీకుఁ బరాక్రమంబుఁ జూ
పను దఱిసంభవించు నన బాణుఁడు సంతసమంది శంభుచే
తను సెలవొంది పోయెఁ బురతల్లజముం గన నొక్కనాఁడు చ
క్కనిధ్వజ మొక్కపెట్టున నకారణ ముర్విఁబడెన్ మహాధ్వనిన్. 165

ఉ. దానిని గాంచి సంగరము తప్పక కల్గు నటంచు నెమ్మదిన్
బూనె ముదంబు బాణుఁడు ప్రభూతపరాక్రము ముల్లసిల్లు నా
దానవు లెల్ల సంతసముఁ దా రొగిఁ గాంచిరి; యప్పుడే యుషా
మానసవాంఛ దీర్పఁ జనె మాయలనేర్చిన చిత్రలేఖయున్. 116

తే. యోగవిద్యాబలంబున నొరు లెఱుంగ,కుండ ననిరుద్ధుఁ గొని తెచ్చెఁ జండసాహ
సను బయల్పడఁ బ్రియసఖి స్వాంత మలర,వానిఁ గని యుష సమ్మోదవార్ధిఁ దేలె.

చ. ననవిలుకానిఁ గేరు తననాయకుఁ గూడి సుఖించె నయ్యుషా
వనితయు సౌధసీమఁ బ్రియభాషల బ్రేయసిఁ దేల్చె నాతఁడున్
గొనకొని యించుకేని చ్యుతిఁగోరని పెన్దమి చిందులాడఁగా
మనసిజకేళి దేలి రభిమానము లూరఁగఁ గాంక్ష లుబ్బగన్. 168

చ. జరగెను గొంతకాల మిటు సౌధము గాచుభటాళి యెట్టులో
పరపురుషుండు వచ్చి నృపుబాలికతో విహరించు చున్న వాఁ
డరయఁగరాని మార్గమున నంచు నెఱింగి నృపాజ్ఞ నెంచి స
త్వరముగఁ బోయి దేవరిపువర్యుని గాంచి యడంకువల్ దగన్. 169

క. అవధారు దైత్యరాజా, యెవఁడేఁ జొరరానియట్టు లే మొగిఁ గావన్.
సవహరుఁడె యెఱుఁగు నెవ్వఁడొ,యువజనుఁ డేతెంచి యింటనున్నాఁడు తమిన్

ఆ. అంతిపురిని జొచ్చు నధికారమే లేదు, మాకుఁ జెలులవలన మాటవెంట
వార్త యిద్ది బయలుపడె నింక దేవర, యాజ్ఞ యనెడు కింకరాళినుడులు 171

చ. శ్రుతివివరంబులం గదియఁజొచ్చిన యంతనె యాజ్యధారలన్
హుతవహునట్లు మండిపడి యుద్ధతిమీఱఁగ వీరవర్యులన్
జతనముమీఱఁ బిల్చి జవసత్త్వము లొప్పఁగ మీర లేగి యా
పతితుని శాస్తిచేసి యొకపల్కును మన్ననచేయ కాఖలున్. 172

క. కొనిరండు నాదుచెంతకు, నని పంచిన వార లేగి యనిరుద్ధు నద
ల్చిన నుషభీతిన్ మాన్చుచు, దనుజుల మార్కొని యఖండదర్పము పొంగన్.

క. పరవీరహుఁడౌటను శ్రీ, వరుపౌత్త్రుండౌట లోహపరిఘంబున నా
శరవీరులఁ బొలియించెను, సుర లంబరమందునుండి చోద్యం బందన్. 174

చ. తనరణశూరసద్భటవితానము ద్రుంచుట కాగ్రహించి స్యం
దనవర మాయితంబగుడు దానిఁ బరాక్రమము మొప్పనెక్కి శ
త్రునిహతియందు నాతురముతోఁ బగఁ బోయెను బాణుఁ డంతఁ గృ
ష్ణునిసుతసూనుఁడున్ దనుజశూరుని మార్కొని పోరె శూరతన్. 175

ఉ. ఓపినయంత నిర్జరు లోహోయనఁ బోరెడు కృష్ణపౌత్త్రు నిం
కేపగిదిన్ జయింపఁ దర మెన్నినఁ గాదని యెంచి యప్డు మా

యాపరతన్ గుయుద్ధమున నాతని నొంపఁ దలంచి మంత్రసం
దీపితశక్తిచే దనుజధీశుఁడు పోరె సురారు లార్వఁగన్. 176

ఉ. పోరుచునుండి సర్పశరముం బరఁగించెఁ దదీయపాశముల్
చేరి యదూద్వహాంగమును జిత్రగతుల్ దగఁ జుట్టి భూస్థలిన్
బోరన వైచె; నంత భటపుంజము లాతని వేగబంధనా
గారముఁ జేర్చి యుంచి రటఁ గన్యక యార్తిమునింగి యుండఁగన్. 177

తే. ద్వారవతియందు నొకరాత్రి దన్ను నొరు లె
వరును గనకుండఁ బ్రద్యుమ్ను వరకుమారుఁ
డెచటికో పోయె ననువార్త యెల్లచోటు
లందుఁ జక్కఁగ వ్యాపించి యార్తిఁ బెంచె. 178

చ. *నారదుఁ డాముహూర్తమున నాకపురంబుననుండి వచ్చి వా
రారయలేక యార్తిఁ గను టారసి మీయనిరుద్ధు బంధనా
గారమునందు నుంచెఁ దనకన్యకఁ గూడె నటంచు బాణుఁ డే
పారెడు కృత్రిమాహవము నందున శోణితపత్తనంబునన్. 179

ఆ. చిత్రలేఖయను విచిత్రవిద్యావిదగ్ధయగు నొర్తు బాణకన్యక చెలి
హరితనూజపుత్త్రు ననిరుద్ధుఁ గొనిపోయె, మాయ కలిమి ననెడు మానిపలుకు.

క. విని యెల్ల యాదవులు నెమ్మనముల విశ్వాస మలర మన్నించిరి శ్రీ
వనజాక్షుఁ డఖిలవిదుఁ డయ్యును మౌనివచింప విస్మయోత్సవం దెలిపెన్. 181

యాదవులు బాణునిపై దాడెత్తిపోవుట.

క. అంతట రణవృత్తాంతం, బంతట వ్యాపించె వీరులందఱుఁ గుతుకం
బంతస్సుల నుప్పొంగఁగఁ, బంతంబులు పలుకు చనికి బయలు వెడలఁగన్. 182

చ. గరుడుని నెక్కి శ్రీహరియుఁ గార్ముకవర్యము పాంచజన్యమున్
బరజనభీకరం బగుచు భాసిలు చక్రము నందకంబునుం
గరముల వెల్గఁ, రాముఁడును, గాఢహలాయుధ మూని రాఁగ ని
ర్భరబల మొప్ప రాజసుతవర్గము వెంటను రా సముద్ధతిన్. 183

చ. వడివడిఁ బోయి శోణపురవైభవ మంతయుఁ గాంచి మెచ్చుచున్
దుడుకుతనంబునన్ రిపులఁ దోలుసుగారుల పోతరం బదె
ప్పుడు మడియింపనౌనౌ యని పొంగుయదూద్వహు లెల్లఁ గొల్వ గా
పడి దివి నిల్చి ఖేచరులు బాణవినాశము గోరు చుండఁగన్. 184

చ. పురమును ముట్టడించె హరి పొంగెడు వేడుక నంతలోన నీ

* తం శోణితపురే శ్రుత్వానీతం విద్యావిదగ్ధయా = అనిమూలము. శోణపురమను నామాంతరము దీనికిఁ గలదు.

శ్వాసభటు లొక్కరీతి హరిసైన్యముఁ దాఁకిరి విక్రమాఢ్యు లా
హరభటులన్ జయింప నెట్టులైన సమర్థులుగాని యాదవో
త్కరములమీఱి శౌరి శితకాండములం బరఁగించి వారలన్. 185

చ. దురమున నిల్వరించి యలఘూర్తనిశాచరపూర్వరంబు వే
విరహితదానవౌఘమయి విహ్వలతం గనఁజేయఁ బోవ నం
తరమున మూఁడు పాదములు తత్సమశీర్షము లొప్పఁగా శివ
జ్వర మెుగి ఘోరరూపమున వచ్చి సుఁరిని గాచుకోరికన్. 186

క. హరి మార్కొని ఘోరంబుగ, దుర మొనరిచె నంత దానితోఁ బోరుచు శ్రీ
హరి తద్భస్మస్పర్శన, పరితాపముఁ బొందె సుంత బలరాముండున్. 187

క. భరియించెం బరితాపము, హరిబలు లొక్కింతకాల మతియుగము మూ
సి రహితచేతనులువలెం, బరఁగిరి; పద్మాక్షుఁ డంతఁ బౌరుష మలరన్. 188

ఆ. ప్రజ్వలింపఁజేసె వైష్ణవజ్వరమును, నవియు రెండు పోరె నందు వైష్ణ
వజ్వరంబు గెల్చె వాసుదేవాంగము, వదలిపోయె నదియు భయము గదుర.

సీ. నారాయణుని బాహుసారఘాతాపీడనమున విహ్వలమయి నైజశక్తి
తగ్గఁ బర్విడుచున్న యగ్గజచర్మాంబరుని జ్వరమ్మును గాంచి వనజభవుఁడు
వాసుదేవుని జూచి జ్వరము శైవంబును క్షమియింపుమా భక్తకామధేను
రూప యంచని వేఁడ నేపారుకరుణచే క్షమియించినాఁడను గమలజన్మ

ఆ. యనుచుఁ బల్కి స్వీయమగు నీజ్వరంబును
హృదయమందె యడఁగ నిపుడుచేసి
నాఁడ నిచటి యీరణం బదెవ్వాఁడు నె
మ్మది స్మరించు నతని మాను నిదియు. 190

క. శైవజ్వరబాధయు నే, యేవరుసలనైన నతని కేమాత్రము లే
కే వసుధ వాఁడు వెలయును, నావాక్కున ననుచుఁ బలికె నారాయణుఁడున్.

ఆ. అచటు వాసిపోయె నంతఁ బంచాగ్నులు, శత్రువులకుఁ జూడ శక్యములెటు
గాకయుండె వానిఁ గడుశక్తిఁ జల్లార్చి, బాణదనుజనాథ బలము నెల్ల. 192

ఆ. నీఱుచేసె హరియు నెమ్మి నాటాడెదు, భంగి నావిధంబుఁ బరమకోప
మడర నెఱఁగి దానవావళితోఁ గూడి, బాణుఁ డేగె నపుడు ప్రధనమునకు.

చ. దనుజునిఁగూడి శంకరుఁడు తానును బోయెను గార్తికేయుఁడున్
జనియెను దండ్రితోడ నట జన్యము ఘోరతరంబుగాఁగ సా
గెను, హరకేశవుల్ తమసుకీర్తులు భాసిలఁజేయఁ బూని న
ట్లని నొనరించి రయ్యది మహాభయదంబయి యొప్పె నయ్యెడన్. 194

చ. హరిహరు లొక్కటం జెలఁగి యస్త్రగణంబుల శస్త్రరాజి భీ
కరగతివైవ వానిదగుగాఢసమాహతి లోకజాలముల్

వరుసఁ దపించె; నీయదియు భావమునం దలఁపోయఁగా మహా
త్తరలయకాలమే నవవిధంబున వచ్చె నటంచు దేవతల్. 195

క. మనములఁ దలఁచిరి సంగర,మును దానిం జూచి మురహరుఁ డంతన్
బెనుకోపంబున జృంభణ, మనునస్త్రము నీశుపైన నడరం జేసెన్. 196

సీ. జృంభణాస్త్రమ్ము విజృంభింపఁగాఁ జేయ దానవుల్ ప్రమథులు తత్తఱపడి
రాయస్త్రవర్యము హరుసోఁకె నంతట వివశుఁడై ధ్వజమూఁతఁగ విషమాక్షుఁ
డరదంబునంబడి హరితోడ ననిచేయఁ జాలకయుండెఁ; దార్క్ష్యనఖవితతి
హతిభిన్నవాహనుం డగుచుఁ బ్రద్యుమ్నాస్త్రపరిపీడితుండయి హరియొనర్చు

తే. నట్టి హుంకృతిచే శక్తి యడఁగ గుహుఁడు
పరుగిడెన్; జృంభణాస్త్రము హరుని నొంప
హరిశరంబులు దైత్యుల నార్తి ముంప
స్కందు శ్రీహరి యోడింప శైవబలము. 197

క. హరికోల్లల కోర్వక స,త్వరముగఁ బాఱంగ నంది వరరథ మెక్కం
డరసి దనుజేశునకు న,త్తరుణంబున సిద్ధపఱచె దానిం గనుచున్. 198

చ. మనమునఁ బొంగుచున్ దనుజమండనుఁడై చెలువారు బాణుఁ డా
వనజదళాక్షుఁ దన్బలము బాహుబలంబున గెల్వఁగోరి చ
య్యనఁ జనుదెంచె సద్భటసహాయుఁడుగా, బలభద్రుఁ డేచి యా
దనుజవరేణ్యువాహినుల దారుణకోపము పొంగ మార్కొనెన్. 199

క. హలికిం బ్రద్యుమ్నుఁడు దో,ర్బలసంపద తోడుచూపె బాహువులన్ లాం
గలమూని కొంపఱఁ బెనుము,సలమునఁ గొందఱను బోరఁ జంపెన్ బలుఁడున్.

క. బలములు బలభద్రుని దగు, హలమున బాణాసురుండు హరిబాణములన్
గలగుండు పడెఁ; బాణుం, డలయక శ్రీకృష్ణుతోడ నని నొనరించెన్. 201

క. ఇతరేతరంబు బాణ,ప్రతతుల గాత్రములఁ బొలయు త్రాణలు తగ్గన్
మితిమీఱి యొనర్చుచు నుద్ధతిఁ బోరిరి శంకలేని తాత్పర్యములన్. 202

చ. దనుజవరేణ్య సంప్రహితదారుణబాణములం బరాక్రమం
బున హరి తీవ్రసాయకసమూహముచే శకలంబులై ధరి
త్రిని బడఁజేసె; బాణుఁడును దీవ్రరుషం గొని చక్రి నొంచె నా
తనిమెయిఁ గృష్ణుఁ డుగ్రుఁడయి దర్పమడంగఁగ నాటెఁ దూపులన్. 203

చ. హరిదనుజప్రభుల్ విజయ మందెడువాంఛలు పర్వ నొక్కరొ
క్కరు తమవాఁడియస్త్రములఁ గ్రందుగ వైవఁగఁ బూని రంత న
య్యిరువుర మేనులందుఁ గన నెంతయు భీతిని బుట్టఁజేయు దు
ర్భరహతు లెన్నియో వెలసెఁ; బౌరుషమూనిన వారలంతటన్. 204

క. పరిఘములఁ బోరి రంతట, నిరుపమశస్త్రాస్త్రవితతి నింగిఁ బరఁగుచున్
ధరఁబడెఁ బొడిపొడియై యి,వ్వరుసను సంగ్రామ మద్ది వారకసాగెన్. 205

చ. హరియును బాణుఁ గూల్పఁదగు నంచుఁ దలంచెను నాత్మయందు; స
త్వరముగ సూర్యకోటి రుచిభాసురమై దితిజాళిఁ జంపు నా
తురమునఁ బొల్చు చక్రమును దోర్లతయందు విలాసమొప్ప దే
వరమణులెల్ల భీతిఁ గన బాణుఁడు తత్తఱమందఁ దాల్చినన్. 206

చ. *ప్రళయ మిదేమొ యంచు మునిరాజి తపించెను మాధవుండు బా
ణలయము గోరి వైవఁగ మనంబున నెంచుచు నుండునంతలో
పల దనువంశకర్త్రియయి భాసిలి కోటరి నాఁగ బేరుభూ
స్థలిఁగని యొప్పు విద్య దనుజప్రవరుం బరిరక్ష చేయఁగన్. 207

క. హరిమ్రోల నిల్చెను దిగం,బరయై యావిద్య మ్రోల బాణుని గావన్
బరమాదరమున నిల్చుట, మురహరుఁ డూహించి కనులమూసి శరంబున్. 208

చ. దనుజవరేణ్యదోర్వనవిదారణ మీయది చేయుఁగాక యం
చును మది నెంచుచున్ వదలెఁ జోద్యముగాఁగ సుదర్శనంబు శ్రీ
శునిదగు నూహ పెంపుననె చూర్ణము చేసెను బాహురాజి య
స్త్రనికరసంప్రయోగరతిఁ దద్దయుఁ బొల్చెడు దాని నప్పుడే. 209

చ. తనశర మిట్లు బాహుసముదాయము జూర్ణము చేయునంతలో
ఘనతరసాయకంబు రిపుకాంతుని గూల్చెడుదాని సేయఁగా
మనమున నెంచె నావిధ ముమాపతి యాత్మ నెఱింగి వచ్చి సా
మనియతి నొప్పుస్తోత్రమున మాధవుఁ దన్పుచుఁ బల్కె నివ్విధిన్. 210

మ. కరదండంబులు చక్రధారలఁబడంగా రక్తపూరంబు భీ
కరమై పాఱఁగ నూరకున్నదనుజుం గావంగ నూహించి శం
కరుఁ డోకృష్ణ! మహాత్మ! నిన్నెఱుఁగుదుం గాదే జగన్నాథుగాఁ
బురుషోత్తంసమ యోసనాతన! జగన్మూర్తీ! పరేశా విభూ. 211

తే ఆదియంతము లేక దేవాదులందుఁ, బశుపతత్త్రులు లోనగువానియందు
నవయవస్ఫురణంబున నలరు దీవు, చేష్టలివి నీవిలాసముల్ చెప్పనేల? 212

క. దనుజులఁ జంపు ప్రయత్నం, బనునది యొకలీల నీకు ననఁ జనుఁ గాదే
వనజాక్ష! ప్రసన్నుఁడవై, దనుజున కభయం బొసంగఁ దగు నీవేళన్. 213

క. వీనికి నభయం బిచ్చితి, నేనే మును పద్ధి సత్యనియతిఁ బోరయఁగాఁ
బూనుము చేయఁగఁ గృష్ణా, దానవుఁ డీతండు నను సదా సేవించున్. 214

క. నాయాశ్రయమున వృద్ధి న,పాయంబె లేక గాంచె భవ్యవరము లే

* నగ్నా దైతేయవిద్యాభూత్కోటరీ పురతో హరేః = అనిమూలము.

యీనీయసురుఁ డొందెఁ గావున, నీయదనున వానినెల్ల నీవె ఫలింపన్. 215

ఆ. చేయవలయు ననుచు శితికంఠుఁ డాడిన, హరియు సంతసించి యనియె నిట్లు
సుప్రసన్నవదన సురుచిరకాంతులు, దెసలఁ బర్వ దుషయు వెస నశింప. 216

సీ. *శంకరా నీవె యొసంగినవరములు ఫలియింపకుండునే బాణుఁ డితఁడు
చాలకాలము క్షమాస్థలమున జీవించుఁ గాక నీవాక్యంపు గౌరవమునఁ
జక్రంబు మరలింతు శంకరా! నీచేత దత్తాభయుండగు నుత్తముండు
మద్దత్తవరుఁడయి మాఱులేకయె ప్రవర్తిల్లును మనకెన్న నుల్లములను

తే. కలదె భేదంబు నవయవంబు లివి వేఱు
గాని నీవన నేననఁగా నిరువుర
మనఁగ నొక్కండె యజ్ఞానమునను గప్పఁ
బడిన మూర్ఖులు వేఱంచుఁ బలుకుచుంద్రు. 217

క. అనుచుం బల్కి పురారిం, బనిపి వెసం జనియెఁ దనదుపౌత్త్రుఁడు గలచో
టును జూడ నాగపాశము, లనువుగ గరుడాంగజనితమగు గాలి వెసన్. 218

క. తమయంత తామె వదలెను, గమలాక్షుం డాకుమారకంఠీరవుతోఁ
బ్రమదలతోఁ గూడి జయం, బమరం గొని ద్వారవతికి నరిగెం బ్రీతిన్. 219

తే. హలధరుండును బ్రద్యుమ్నుఁ డాదియైన, వీరవరు లందఱుం దనుఁ జేరి రాఁగ
ద్వారవతిఁ జేరె శ్రీహరి దానవజయ, సంప్రసారిత యశుఁడయి సరభసమున.

వ. అనుటయు మౌను లిట్లనిరి. 220

## తొంబదియొనిమిదవ యధ్యాయము

శ్రీహరి పౌండ్రకవాసుదేవుం జంపుట.

చ. మానవదేహ మూనియె యమానుషకర్మ మొనర్చె శౌరి యీ
శానుని దేవనాయకుని సంగరరంగమునన్ జయించె నా
దానవవీరునిన్ గెలిచి ధైర్య మొసంగె సురాళికిన్ మహా
మానివరేణ్య! యింకను రమాధవుఁ డెట్టికృతుల్ పొనర్చెనో. 222

క. ఏయే కాలంబుల హరి, యేయే ఘనకార్యవితతి నెట్టు లొనరిచెన్
మాయందుఁ గల్గు కరుణను, మాయాతీతుని గుణాభిమానము నెల్లన్. 223

క. వినిపింపుము హరిచర్యల, విన వేడుకఁ గలదు మాకు విమలాత్మ యనన్

*త్వయా యదభయం దత్తం తద్దత్తమభయం మయా, మత్తోఽవిభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర. ౪౭. యోఽహం స త్వం జగచ్చేదం సదేవాసురమానుషం, అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః. ౪౮. ఆదిమూలము.

మునిపతి వారల కిట్లని, వినిపించెన్ శౌరిచరిత విమలోక్తులచేన్. 224

చ. మునివరులార! నావచనముల్ వినుఁ డాదృతిమీఱ శౌరియున్
మనుజశరీరధారియయి మానిశరణ్యముఁ గాశిఁ గాల్చె గ
ర్వనిరతి మించు పౌండ్రకుని బల్లిదుఁ జంపె నదెట్లు లన్న మే
దిని బలపౌరుషంబులను దెంపున మించును బౌండ్రకాఖ్యుఁడున్. 225

తే. అతఁడె పౌండ్రక వాసుదేవాహ్వయమునఁ
బిల్వఁగాఁబడు నెవ్వనే బింక మూని
ఘోర వధియించుఁ దానె యీభూతలమున
వాసుదేవుఁడ నని యెంచు వాఁడు సతము. 226

తే అవతరించెను వాసుదేవాఖ్యుఁ డన్యు
డని వినంబడినంతనె యజ్ఞు లిట్లు
పలుకుదురుగాని నాకంటెఁ గలఁడె మఱొక
వాసుదేవుఁడు తలఁప విశ్వమున నిందు. 227

చ. వనజదళాక్షుఁ డంచు మునివర్యులు పల్కెడు వాసుదేవుఁడన్
మనుజులఁ గావ నీజగతి మానితరీతిని బుట్టినాఁడనం
చని తలపోసి పంకజదళాక్షునిచిహ్నములన్ ధరించె నా
మనుజవిభుండు కృష్ణునియమానుషచర్యల నాలకించుచున్. 228

ఆ. స్మృతియె లేక దూతఁ గృష్ణుని చెంతకుఁ, బనిచె నొక్కనాఁడు మనుజపుత్త్ర
చక్రముఖ్యచిహ్నసంతతి నాయది, విడువు మాహ్వయమును దడయ కెన్ని.

తే. మూఢుఁడవు గాన నాచిహ్నములను దాల్చి,నాఁడ వీజగమున జీవనమ్ముఁ గోరి
తేని వానిని విడనాడి యిపుడె వచ్చి, నాదు శరణంబు గోరుము నందతనయ.

క. అని చెప్పఁ బంప దూతయుఁ, జని కృష్ణుని గాంచి ప్రభువచనముల నెల్లన్
వినిపింపఁ గృష్ణుఁ డిట్లని,యెను నిజచిహ్నమ్ముగాఁగ నెసఁగుశరంబున్. 231

క. నేఁదమి నీపైఁ బఱపెద, భూదయితా పౌండ్రక! మముం జుల్కనఁగా
నీదయినతుచ్ఛబుద్ధిని, నాదనక తలంచి తీవు గర్వసమృద్ధిన్. 232

క. పనుతును యమపత్తనమున, కని చెప్పుము ప్రభువుతోడ నస్మద్వాక్యం
బని మఱియుఁ బల్కు దీనిని, విని చేయంగల్గు పనిని వేగమ చేయన్. 233

క. మనమునఁ దలంపుమా యని,యును బల్కుము చక్రమూని యుద్ధతిమెఱయన్
జను దెంతు నీదు పురిపయి, కని మఱవక తెల్పుమా సముచితరీతిన్. 234

సీ. ఆజ్ఞ చేసితివి రమ్మస్మత్పురంబున కని యట్లె రేపె నీయానతిమెయిఁ
జను దెంతు నాలస్యమును జేయ నిఁక మీఁద శరణుచొచ్చెదనిన్నుఁ జక్కనిగతిఁ
గర్తనౌదును నీకుఁ గడుదుష్టమతి వగు నీవలనన్ జననిచయమునకు
బాధ లేపోల్కి నెప్పటికిఁ గల్గకయుండ నొనరించు వాఁడ నంచనిన దూత

ఆ. యప్పుడెపోయి తెల్పె నమ్మహీజానికి, నతఁడు కృష్ణుఁ గాక నరయుచుండె;
హరియు గరుడు నెక్కి త్వరఁగఁ బౌండ్రకవాసు, దేవు పురికిఁ జనియె భావమలర.
మ. హరి యుద్యోగమెఱింగి కాశిపతి సైన్యంబుల్ సమగ్రంబులై
పరివేష్టింపఁగ వెన్కనుండి హరిసిన్ బాధించి నిల్వంగ స
త్వరుఁడై పోయెను బౌండ్రకుం డొగిఁ బురోభాగంబునన్ గాశికా
ధరణీకాంతుఁడు వెన్కభాగమున నుద్దామాహవక్రీడకై. 236
క. తను మార్కొనంగ హరియును, మనమున నుల్లాస మలర మంచి దిదే యం
చని యెంచి యుదారస్యందనమునఁ దగు పౌండ్రకాఖ్యధాత్రీవిభునిన్. 237
చ. కనుఁగొనియెం; దదీయకరకల్పితశంఖసుదర్శనంబులన్
ఘనగదఁ బద్మమున్ మఱియుఁ గమ్రసుమావళిహార మాయురం
బునఁ, దనశార్ఙ్గమున్ బలుపుమూపురమందు గనంబడంగ గే
తనమునఁ దార్క్ష్యచిహ్నము నితాంతము చెల్వమరంగఁ దోఁపఁగన్. 238
క. పరికించె మఱియు నాతని, యురమున శ్రీవత్సచిహ్న మురుతరముగ నొ
ప్పె రహిన్ మణిముకుటంబును, ధరియించినవాని శిరము తద్దయు నొప్పెన్.
సీ. కుండలంబులఁ దాల్చి కోరి పీతాంబరంబును ధరియించి యామనుజవిభుఁడు
హరికిఁ గన్పడియె నాయరిమది గంభీరభావంబుఁ దగియుండెఁ బౌండ్రకాఖ్య
వాసుదేవుని జూచి వనమాలి పక్కున నవ్వె తద్బలముల క్రొవ్వడంపఁ
దలఁచి మార్కొని యష్టి దారుణ నిస్త్రింశ గదల శూలంబులఁ గార్ముకముల
తే. వారు నొప్పింపఁ గ్రుద్ధుఁ బూని భూరిశార్ఙ్గ, చాపనిర్ముక్త శుచికల్ప శరవితతులఁ
జక్రతీవ్రగదాదికసాధనములఁ, దద్బలంబుల ఖండించెఁ దత్క్షణంబ. 240
చ. వెనుకనె తన్ను మార్కొనెడు వేడుక వచ్చిన కాశిరాజు సై
న్యనిచయమున్ శరాగ్నిరుచి నాశము చేసె మురారి పౌండ్రకున్
గనదగు చిహ్నరాజిఁ దమిఁ దాల్చి చెలంగెడువాని మూఢునిన్
గని యిటుపల్కె మూర్ఖ క్షితికాంత త్వదుక్తుల మాతపల్కఁగన్. 241
క. వినినాఁడ నాదుచిహ్నము, లనుమానము వీడి వదలు మను నీయాజ్ఞన్
వినినాఁడ దానిసార్థకము నొనర్చెద నిపుడె కనుము మోదం బలరన్. 242
ఆ. చక్ర మిపుడె విడుతుసారగదా వండ, మిదె త్యజించినాఁడ నీసుపర్ణుఁ
డిపుడె నీధ్వజంబు నెక్కుఁ గావుత మని, చక్రనును దురాత్ము శత్రువు ఖలు.
క. మృతినొందఁ జేయుఁ గాక ని, హితమతి నూహించి వైచె నేపున నది యు
ద్ధతులైరి నపుడె చూర్ణాకృతిగా నొనరించె సురలు కీర్తింపంగన్. 244
ఆ. గదయు వానిమోఁదె గరుఁడుండు తద్ధ్వజ, గరుడుఁ గూల్చె నద్ది గనిన జనులు
సాధ్వసంబుమీఱ సల్పిరి హాహాకృ, తులను గాశిరాజు కలఁగి యంత. 245

క. హరి మార్కొని పోరాడెను, వరమిత్రుని చావుఁ గాంచి బాహుబలమునన్
గరుడధ్వజుఁడును గోప, స్ఫురణంబున శార్ఙ్గచాపమును దీటివెసన్. 246

మ. ఖరనారాచము లొక్కసారిగ నసంఖ్యాకంబులన్ వైవ నా
శరవారంబున నొక్కతూఁపు రిపుహస్తంబున్ వడిం ద్రెంచి భీ
కరరీతిం గొని కాశికాపురిఁ బడంగాఁ జేసె లోకంబు త
చ్ఛరకృత్యంబున కెంతొ విస్మయమెదన్ సంధిల్లఁగాఁ జేద్పడెన్. 247

చ. హరియిటు పౌండ్రకాఖ్యుని మహత్తరగర్వసమేతుఁ గాశికే
శ్వరుఁ బరివారయుక్తముగఁ జంపి స్వకీయపురంబుఁ జేరి స్వః
పురమును జేరు దేవపతిపోలిక సౌఖ్యమహాబ్ధిఁ దేలెఁ; ద
చ్ఛిర మటు కృష్ణసాయకము చేర్పఁగఁ గాశిపురిం బడెన్ వడిన్. 248

మ. జను లద్దానిని గాంచి యేమి దెవఁడీ చందమ్మునం జేర్చె నం
చనుచున్ విస్మయచిత్తులైరి నరపాలాగ్రాత్మజుం డంతటన్
జనకుం గృష్ణుఁడు చంపె నం చెఱిఁగి కృష్ణస్వామినిన్ మీఱుశ
క్తిని బొందన్ మదిఁగోరి సత్తపమునన్ దృప్తున్ హరుం జేయఁగన్. 249

ఆ. మదిని నిశ్చయించి మాన్యుఁ బురోహితుఁ, గూడి నియతిఁ బూని కోర్కె వెంపు
నొందఁ జాలకాల మురుతరవ్రతమూని, ముదితచిత్తుఁ జేసె ముక్తిదు హరు.

క. అవిముక్తక్షేత్రంబున, నివసించి విధిప్రయుక్తనియతి తనర హై
మవతీశుని బ్రీతుని జేసె వరంబులఁ బడయఁగోరి శితిగళుఁ డంతన్. 251

చ. ఘనమున మోదమొప్ప బహుమానము మీఱ నృపాత్మజన్ము ముం
దు నిలిచి కోర్కెఁ దెల్పు మన ధూర్జటుఁడు గావున నాదుతండ్రిఁ జం
పిన యల కృష్ణుఁ జంపఁదగుఁ బ్రీతుఁడవేని తదర్హకృత్తి నో
ఘనకరుణాసముద్ర! ననుఁ గాఱియపెట్టక యిమ్ము నాకిటన్. 252

ఆ. నేను గోరినప్పుడే నిర్భరార్భటి, లేచి కృత్తి పరుని నేఁచవలయు
నిదియె నాదుకోర్కె యీశ్వరా! కరుణింపు, మనఁగ నట్టులే యగు నని హరుఁడు.

సీ. అంతలోనన దక్షిణాగ్నికుండమునుండి పొడసూపె నొకకృత్తి భూతభయద
మైనయాకృతితోడ నర్చిస్తతికరాళవక్త్రయై వెద్రుకల్ జ్వాలలఁ దగఁ
గృష్ణ కృష్ణా యని యెత్తైఱఁ గుపితయై పిల్చుచు హరిఁ గూల్చు ప్రీతి తనర
ద్వారవతికిఁ బోయె దానిరౌద్రాకృతి వికృతలోచనముల వికృతజిహ్వఁ

ఆ. గాంచి జనులు భీతిఁ గలఁగినమనముల, హరి శరణ్యుఁ జేరి యాశ్రయించి
సర్వజగములకును శరణ మీవె కృష్ణ!, యనుచు విన్నవించి రార్తులగుచు.

మ. పరమేశా! యలకాశిరాజసుతుఁ డప్పాటన్ దపోయుక్తి శం
కరుఁ బ్రీతాత్ముని జేసి కృత్తి నిపుడే కల్పించె నిన్ జంపనా

తురమొప్పఁగ భయదాగ్నిరోచులను దోడ్తోఁ జిమ్ము నీకృత్య వే
హరియింపం దలపోయుమా యనఁగ లీలార్థంబుగాఁ గృష్ణుఁడున్. 255

వ. సుదర్శనంబుఁ బ్రయోగించె. అదియు నతివేగంబ చని మహాగ్ని జ్వాలామాలికా జటిలంబై జ్వాలోద్గారాతిభీషణంబు. నైనరూపంబునఁ దోఁచు నాకృత్య వెంటం దవిలె. అదియుఁ జక్రవిధ్వస్తయై యతివేగంబ పాఱఁజొచ్చె. సుదర్శనం బద్దానిం బోనీయక వెంటం దగిలె. ఆకృత్యయు నతిభీతిం గాశికాపురంబునకుం బోయిన నవ్విధం బెఱింగి రాజసైన్యంబును బ్రమథగణంబును సకలపరికర సమేతంబుగా సుదర్శనాభిముఖంబై చనియె. విష్ణుచక్రం బాసైన్యంబునెల్లం గాల్చి స్వరోచిర్జ్వాలలఁబ్రభూతభృత్యపౌరనికరంబై సాశ్వమాతంగబృందంబై యశేషదుర్గభీషణంబై సురలకుంగూడ దుర్నిరీక్ష్యంబై యలరువారాణసీపురం బును దహియించె. పిదప నాసుదర్శనంబు కోపంబుమాని శ్రీహరియంతికంబుం జేరె. కృష్ణుండును దానిఁ గారవించి కరంబున ధరియించె ననిన విని మహాను లిట్లనిరి. 256

తొంబదితొమ్మిదవయధ్యాయము.

దుర్యోధనపుత్త్రికను సాంబుఁ డపహరించుట.

చ. మునివర! సీరపాణి దగుభూరిపరాక్రమ మాలకింపఁగా
మనముల వాంఛమీఱె మహిమంబున మించుతదీయపౌరుషం
బును వినిపింపుమా యమున ముందుగ నాగటిచేత నీడ్చెఁ గా
యన వినియుంటి మింకను దదాయతవిక్రమకృత్యముల్ వినన్. 257

ఆ. వేడు కలరె మాకు వినిపింపుమా యన, వ్యాసుఁ డిట్టులనియె వరుస వినుఁడు
గగురుపాటు పుట్టఁగాఁజేయు తచ్చరిత్రములఁ దెల్పువాఁడ ధన్యులార. 258

సీ. బలభద్రుఁడే శేషఫణి యనంతుం డప్రమేయుఁడు భూమిని మించుశక్తి
ధరియించువాఁడు నేఁ దచ్చరిత్రము వినఁదగినదే యగు; మున్ను ధార్తరాష్ట్ర
తనయ స్వయంవరదర్శనేక్షణను బంతమున జాంబవతికిఁ దనయుఁడైన
యట్టి సాంబుఁడు ధీరుఁడై హరియించెను; దాన మహాక్రోధ మూని భీష్మ

తే. కర్ణముఖ్యులు ద్రోణముఖ్యప్రతాప,ఖనులు దుర్యోధనుం గూడి యని నొనర్చి
యాతని జయించి బంధించి రట్టివార్త, వినిన యాదవు లందఱు వీరు లగుట.

క. మనముల దుర్యోధనముఖు, లనుమానింపకయె గట్టి రస్మత్సాంబుఁ
గనువార మెట్టివిక్రమ,మున మారొ్కను వారొ యనుచు భూరిక్రుధనున్.

క. పురికొల్పి వారి మారొ్కన, నరుగంగా నిశ్చయించి రంత హలియు సం
గరయత్న మాపి మదిరా,తుర వాక్కుల నిట్టుపల్కెఁ దొరపు వేడ్కన్. 261

క. నావచనంబును విని మన, యావాసముఁ జేర సాంబునంపుదు రిపుడే
నే వారిచెంత కేఁగెదఁ, గావున మానంగవలయుఁ గలహము మీరల్. 262

చ. అని వచియించి వారల మహాగ్రహ మల్లన శాంతినొందు న
ట్లొనరిచి హస్తినాపురి కుద్ధతిఁ బోయి పురోపకంఠసీ
మను గనుపట్టుసాధుకుసుమప్రకరావృతమౌ వనంబునం
దు నిలిచెఁ గాని దానిఁజొరఁ డోడనె పూనఁ డతండు మానియై. 263

మ. బలభద్రుం డరుదెంచి బాహ్యవన మావాసంబుగానుంట యి
మ్ముల దుర్యోధనముఖ్యు లద్దెఱిఁగి సమ్మోదంబునన్ గోజలం
బుల నర్ఘ్యమ్మును లోనుగాఁగలుగు నప్పూజార్హవస్తూత్కరం
బులఁ బంపం గొని వారు రా నలరుచుం బూజ్యోక్తు లింపారఁగన్. 264

తే. పలికె నిట్లుగ్రసేనుఁ డిమ్ముల విధించెఁ, గాన సాంబుని వదలుఁడు కడుజవమున
ననిన భీష్ముఁడు ద్రోణుఁడు నంగరాజు, బాహ్లికాదులు ధృతరాష్ట్రబాలకులును.

క. కోపం బాకృతిఁ గైకొని, దీపించెశుభంగి మండి స్థిరరాజ్యంబుం
బ్రాపింప నవర్హంబయి, చూపట్టెడు యదుకులము ప్రసూతిస్థితిగన్. 266

క. తనవారు రాముఁ డాడిన, ఘనవాక్కుల నాలకించి కాలు లివియటం
చును నెంచి పల్కి రిట్లని, యనఘా! బలభద్ర యిట్టు లాడితివేలా. 267

చ. కురుకులసింధుసంభవులకున్ క్షితి యాదవుఁ డాజ్ఞ చేయఁగా
దొరఁకొనునే విచిత్రముగఁ దోఁపదె మాకిట నుగ్రసేనుఁ డి
క్కరణిని నాజ్ఞ చేయుటకుఁ గా నిపు డాల్కొనునేని కౌరవో
త్కరము సితాతపత్త్రముల త్సావరయోగ్యములన్ ధరించుటల్. 268

తే. వదలుకొందురుగాక యవ్వానివలనఁ, గలుగు మర్యాదయే లేదుగాన నింక
నరుగుమా బలభద్ర! యన్యాయచేష్టి, తము నొనర్చిన సాంబునిఁ దగునె విడువ.

ఉ. నీవిటు లాజ్ఞ చేసినను నీ విపుఁ డాడిన యుగ్రసేనుఁడున్
భూవిభుఁ డాజ్ఞ చేసినను బూనిన కార్యము మానువారమే
యేవిధినైన మాదగు నహీనత రాజ్ఞను నంధకాదులై
చేవఁ దనర్చుయాదవులు శీర్షములన్ ధరియింపఁగాఁ దగున్. 270

తే. అధిపతికి భృత్యుఁడే యెట్టు లాజ్ఞ చేయు? నట్టులున్నది యాదవు లాజ్ఞ మాకుఁ
జేయుటన మాము కాజ్ఞను జేయువారు, గాదె యాదవు లనఁగ నీక్ష్మాతలమున.

క. సమముగ మీ కాసనముల, నమరిచి భుజియింపఁ జేయ నాత్మల మీరల్
సములము కురుకులజనిత, క్షమాపతులతోడ నంచు గర్వించి యిటుల్. 272

సీ. పలుక సాగితిరిగా భవదీయదోషంబు గలుగ దిందొక్కింతగాని భృత్యు
దోషముల్ నెమకని దోషంబు మాదియే మాచేతఁ బూజ్యుఁడం చేచరిత్ర

పావనుఁ దెల్పితో బలభద్ర! యయ్యది సంప్రీతిచేతనే సాధువంశ
సంభవతం గాదు సంస్తవం బీయది యుష్మత్కులార్హమై యొప్ప ననుచుఁ

ఆ. బలికి రంతెకాని బంధితు సాంబుని, హరికుమారు విడువ నాత్మఁ దలఁప
రైరి కౌరవు లిటు హరిసుతబంధన, నిశ్చితాత్ములగుచు నియతిఁ బూని. 273

క. అరిగిరి పురమున కంతట, హరియగ్రజుఁ డాదురుక్తు లాత్మఁ గలంతం
బొరయం జేయఁగఁ గోపస్ఫురణవిఘూర్ణాంగుఁ డగుచు మూర్తి తెలియమిన్.

క. ఆక్షేపించిన తుచ్ఛుల, రూక్షోక్తుల కాగ్రహంబు రూపొందుగతిన్
సాక్షాద్రుద్రుం డనఁదగి, వీక్షింపఁ దరంబుగాని వికృతాకృతితోన్. 275

చ. హలధరుఁ డప్డు స్వీయమగు నాయుధమౌ హలమెత్తె నప్పుడా
హలిపదఘట్టనంబుల సమాకులితాంగముతో ధరిత్రి యి
మ్ముల వడఁగుం దె నాబలుఁడు భూరి భయంకరకోపనిస్వనం
బుల దిశలన్ విదిక్కులను బోల ధ్వనించెడునట్లు చేయుచున్. 276

క. భ్రుకుటీకుటిలాననుఁడై, వికటముగాఁ దామ్రవర్ణవిషమఫలదభీ
తికరాంగము గన్పడఁగా, వికృతస్వర మొప్పఁ బలికె విధి పురికొలుపన్. 277

చ. మదమున విఱ్ఱవీఁగుచు నమాత్యులు చెప్పనసత్యవాక్కులన్
కొదువపడంగనీక విని క్రూరతరాత్ములు సారహీను లు
న్మదమనసుల్ దురాచరణమానవిహీనులు నైన కౌరవుల్
కదిసి మముం బ్రభుత్వమునఁ గాచుట మాదురదృష్టమే యగున్. 278

సీ. ఉగ్రసేనుం డస్మదుద్యదాజ్ఞను దాఁట రాదని యెట్టికారణము చేతఁ
గౌరవుల్ తలఁచిరో యారయ నీయది మాదురదృష్ట మీమాడ్కి వెలసె
ననుకొనఁ దగుఁగాదె ఘనమతియగు నుగ్రసేనునానతిని శచీవిభుఁడును
త్రిదశులతోఁగూడి త్రిదివంబునందుండి శిరమున ధరియించుఁ జెలఁగుభక్తి

ఆ. ధర్మమూని యలసుధర్మపై నధివసి,యింపఁదగినవాఁడె యెన్న నుగ్ర
సేనుఁ డట్టివాని సీత్కారమునఁ గుందఁ,జేయుచున్నవారు న్యాయ మెడలి.

చ. మనుజశతంబు తన్గడువ మానవిహీనత నొప్పనీనృపా
సనమునఁ దుష్టిఁబూను టిది చాలు నిసీ! యలపారిజాతపా
వనసుమమంజరీవితతి వారక తాల్తురుగాదె యుగ్రసే
నన్నృపతిభృత్యపత్నులు ననారత మాతఁ డనర్హుఁ డయ్యెఁగా. 280

చ. నరపతిరాజి కెల్ల క్షితినాథుఁడు కాఁడొకో యుగ్రసేనుఁ డా
ధరణిపుమాట యేటి కిట దర్పముపొంగ సకౌరవంబుగా
ధర నొనరింతు నిత్తఱిని దప్పక యట్లొనరించి ద్వారకా
పురమున కేగువాఁడ సురపుంజము లుబ్బగ యాదవుల్ కనన్, 281

సీ. ద్రోణభీష్ములఁ గర్ణ దుర్యోధనుని బాహ్లికుని భూరి దుశ్శాసనుని దురాత్ము
భూరిశ్రవసు శలభూపతినిఁ సోమదత్తు జగత్ప్రాణతనయు విజయు
నాయుధిష్ఠిరు మాద్రియాత్మజద్వయమును దక్కినకౌరవతతుల నిరవ
శేషంబుగాఁగ హస్తిస్యందనహయసంయుతముగఁ బోరిపుచ్చి యొప్పుమెఱయ
తే. వీరవర్యు సాంబు వేవేగ తోడ్కొని, యతనిపత్నిఁ గూడ నరుగుదేర
ద్వారకాపురీవతంసంబునకుఁ బోయి, యుగ్రసేనముఖుల కొప్పఁజెప్పె. 282
క. మనమున సంతస మందెదఁ, బనియిది వేఱొక్కభంగి బాహాబలముచే
నొనరింపవచ్చుఁ గౌరవ,జనపాలకసుతులతోడ శత్రుననుజ్ఞన్. 283
క. ధరణీభారము వోవఁగఁ, గరినగరము దీని దేవగంగానదిలోఁ
ద్వరఁ బడఁజేసెద నిదె యీ,తరుణంబున నేనొర్వఁదగునంచు మదిన్. 284
ఆ. చక్క నిశ్చయించి శౌర్యముపొంగఁ డా,మ్రాత్ముఁడగుచుఁ గృష్ణునగ్రజుండు
హాల మధోముఖముగ నమరించి ప్రాకార,వప్రమందు నునిచి బలము మెఱయ.
క. ఆకర్షించెను హాలధరుఁ, డాకరణిన్ లాగ హస్తినాఖ్యపుర మొగిన్
వే కదలె భీకరధ్వను, లాకసమునఁ బర్వ నమరు లచ్చెరువందన్. 286
చ. కని యటులొటఁ గౌరవనికాయము చిత్తములెల్ల నొవ్వఁగాఁ
జని బలదేవ రామ దయ స్వాంతమునం బొలయంగఁ జేయుమా
మనమున ఱొంతి నూనుచు సమర్షను సుంతయుఁ బూన కింకనై
నను మముఁగూర్చి పత్తనము నాశమొనర్పక ప్రీతిఁ గావుమా. 287
తే. సుప్రసన్నుఁడ వగుము నీసూరతఁ గనఁ
బఱుపఁ బూనకు సాంబుఁడు భార్యతోడ
విడువఁబడియెను నీదుదోర్విక్రమంబు
మాకుఁ దెలిసెను గద యీసమయమునందు. 288
క. ఈయపరాధము సైపుము, మాయందుం గల్గుప్రీతి మానధనాగ్ర్య!
యోయదువర్యా! యని యప్పు,డే యంగనతోడ సాంబు నింపుదలిర్పన్. 289
తే. బంధముక్తుని గావించి బలుని జేరఁ
బనిపి రాసాంబుఁ డత్యంతభక్తి ద్రోణ
భీష్మకృపముఖ్యులకు నమోవితతిఁ గూర్చి
ప్రియము చూపంగ వారెల్లఁ బ్రీతులగుచు. 290
చ. పనిపిరి సీరపాణియును భామినిగూడినసాంబుఁ గాంచి నా
మనమునఁగల్గు క్రోధపవమానుఁడు శీతలుఁ డయ్యె నంచు నో
య్యన వచియించె; నేఁటికిని నాపురభాగము ఘూర్ణితాకృతిం
గనినటు చూడఁగాఁబడెడుఁ గా యని వ్యాసుఁడు తెల్పె క్రమ్మఱన్. 291
క. వినిపించె మౌనులకు ని, ట్లని యీయది హలి ప్రభావ మార్యవినుతమై

తనరారుఁ గానఁ దెల్పితి, వినుఁ డవ్వలివార్త సాంబు వినమితశీర్షున్. 292
క. కని కౌరవులు మహాముద,మునఁ బత్నిం గూర్చి ద్రవ్యమును మిక్కిలిగాఁ
దనివార నిచ్చి హలితోఁ, బనిపిరి వారెల్ల ద్వారవతిఁ జేరి రొగిన్. 293

---

## నూఱవ యధ్యాయము.

### బలరాముఁడు ద్వివిదుఁ డనువానరుం బొలియించుట.

క. అని తెలిపి మఱియు వ్యాసుం, డనియెన్ మునులార! యింక నబ్బలదేవుం
డొనరించిన యద్భుతకృత్యము, లను దెల్పెద వినుఁడు మది విలాసము లొప్పన్.
చ. నరకమహాసురుండు సురనాయకకీర్తివిరోధి యుండె నా
హరి వధియించెఁ గాదె దురితాత్ముని నాతని వానిమిత్రుఁడై
నిరుపమబాహువీర్యమున నిశ్చలుఁడై ద్వివిదుండు నాఁగ వా
నరుఁ డొకఁ డుండె నాతఁడు మనంబునఁ బెన్పగఁ బూనె నింద్రుపై. 295
చ. హరి వధియించె బాహుబల మారయ నెవ్వఁడు నాకు నీడు గ
హ్వరిపయి నంచు దర్పమున వర్ధిలు మత్సఖునిన్ ధరాసుతున్
సురలపయిన్ విరోధమును జూన్పి ప్రతిక్రియఁ జేయువాఁడ నే
వరుసను గాని యం చనియె వాఁ డొకనాఁడు దురాగ్రహంబునన్. 296
చ. అది మొదలా కపీంద్రుఁడు సురార్తికి మూలము యజ్ఞనాశమే
కద యని నిశ్చయించి నరకాండము మర్త్యమునన్ వసించుఁ గా
నఁ దొలుత మర్త్యలోకమును నాశము చేసెద నంచు నెంచి యు
న్మదుఁ డొగి యజ్ఞసంతతుల మానక విఘ్నము లొందఁ జేయుచున్. 297
తే. సాధుమర్యాదలన్ మాన్పి సజ్జనులకుఁ, దిరుగ రాకుండఁగ బెనుభీతిని జనింపఁ
జేసి పురముల గ్రామాళి గాసి నొందఁ,జేయుచుం గాల్చెఁ జపలుఁడై చిత్రరీతి.
క. పురపల్లిగ్రామఘోషాం,తరముల నీసునను గాల్చె ధరణీధ్రసము
త్కరదాహంబుగ గ్రామో,త్కరముల నశియింపఁ జేసె దర్పస్ఫూర్తిన్. 299
సీ. పర్వతంబుల నట్టె బాహుబలంబునఁ బెకలించి పాథోధివితతజలము
లందు వైచెను; దానె యబ్ధిమధ్యంబున నిలిచి కలంచెను జలధి మఱియు
నతఁడు కలంచుట నాయబ్ధి యుప్పొంగి హద్దుమీఱుచు నగరాళి ముంచెఁ
జెంతనున్నట్టి విచిత్రపల్లీతతి జలపూరమునయందు విలయ మొందఁ
తే. జేసె నొక్కొక్కతఱిని వైచిత్ర్య మలరఁ, గామరూపుఁడుగాన నుద్దామతనువుఁ
దాల్చి సస్యములన్ బహుధా నశింపఁ, జేసె నంతట మానక శిలలవైచి. 300
క. ఖరతరరూపంబున నే, పారలాడి యనేకమార్గములఁ బ్రీతి మెయిం
దిరుగాడుచు సస్యంబులఁ, గర ముత్కంఠన్ నశింపఁగాఁ జేసె వడిన్. 301

క. దానన్ జగమంతయుఁ గన, మాననిపీడన్ నశించె భూసురులు శ్రుతి
ఘోషమునఁ బెంపు నింపఁగ, మానిరి యజ్ఞములఁ జేయమానిరి పిదపన్. 302

చ. సురపతి సాధుచిత్తమున సొంపున హాయిని గూర్పఁజాలు నా
సురుచిరనందనోపవనశుభ్రతరస్థలరాజిఁ జేరి శ్రీ
హరికిఁ బ్రియాగ్రజన్ముఁడగు నాబలదేవుఁ డదొక్కవేళ సుం
దరులనుగూడి రేవతియు దాపుననుండ మహాముదంబునన్. 303

క. లలనామధ్యంగతుఁడై, హల మంతికసీమ వెలయ నమలసురను ద్రా
వె లలిన్ మృదుగీతంబులఁ, జెలఁగుచు గానంబు మిగులఁ జేసె నసమతన్. 304

చ. ధనపతి స్వీయపత్తనవతంసమునందుఁ జెలంగురీతి నె
మ్మనమునఁ గల్గువాంఛలను మానక వారలఁగూడి కాంచె ని
ట్లనుపమకేళిఁ దేలుసమయంబున నాద్వివిదుండు వచ్చి చ
య్యన హాలమున్ గ్రహించి ముసలాయుధ మల్లన సంగ్రహించుచున్. 305

ఆ. అతనిసమ్ముఖమున నతివిలాసంబునఁ, దిరుగసాగె నందుఁ దెఱవలుంటఁ
గాంచి వారియెదుటఁ గడునవ్వి వారల,సుఖము నట్టె కలఁచె శూరుఁ డగుచు.

ఆ. *పానపూర్ణకరకపటలంబుఁ బదముల, నట్టె త్రొక్కివైచె నవలఁ బడఁగ
నాగ్రహంబు రూపమైనట్లు కన్పడ, బలుఁ దిరస్కరించి పలికె నపుడు. 307

ఉ. అంతట నూరకుండక మహత్తరశౌర్యము పొంగ గర్వ మ
త్యంతము మీఱఁగాఁ గిలకిలారవ మొప్పఁగఁ జేసె; నివ్విధిం
గాంతల: గూడియుండుటను గానక తన్ బలుమాఱు పల్కఁగా
నెంతయు నాగ్రహించి మదిరేక్షణ లెల్లను జూచుచుండఁగన్. 308

చ. త్వరపడి లేచి రోషమున వాని వధింపఁగ నిశ్చయించి భీ
కరముసలాయుధంబుఁ గొనఁగాఁ గపివర్యుఁడు చూచి వేగ ప్ర
స్తరమును భీమరూపమును దా గ్రహియించి బలంబుమీఱ వై
వ రయముగా హలాయుధుఁడు బాహుబలోద్ధతి మీఱ నుగ్రుఁడై. 309

తే. వానరుఁడు వైచినట్టి యాప్రస్తరంబు, వేయి శకలంబు లగునట్లు విసరి వైచె
ముసలమును దాన నయ్యది పొడవడంగె,నంత ద్వివిదుఁడు లాఘవ మతిశయిల్ల.

క. బలమొప్ప నెగిరి భీకరు, బలభద్రుని జేరి వెడఁదవక్షము నొంచెన్
బలుఁడును గోపంబునఁ బిడి,కిలి గూరిచి పొడిచెఁ దలను కీలలు దొరఁగన్. 311

క. ఆదెబ్బ నొవ్వఁజేయఁగ, మేదినిపైఁ బడియెఁ బ్రాణమిత్రుని నరకున్
గాదిలిప్రీతిం జూడం,గాఁ దానరిగెడువిధంబు గనఁబడుచుండన్. 312

క. గిరిశృంగ మతనిదగు భీ,కరదేహస్పర్శమున శకలములుగా న

* పానపూర్ణాంశ్చ కరకాన్ = అని మూలము.

చ్చెరువును బుట్టించుచుఁ బడె, ధరణిపయిన్ ఖేచరులు నితాంతం బలరన్. 313
క. శిర మది వజ్రాయుధు భీ,కరవజ్రముచేతఁ గూల్పఁ గాఁబడు గురుభూ
ధర మట్లుపడియెఁ గుసుమో,త్కరమును వర్షించె నమరకాండ మతనిపై. 314
చ. సుర లయదెంచి సీరపరిశోభితదివ్యకరా! మహాత్మ! వా
నరుఁ డితఁ డాశరావళిమనంబున వర్ధిలఁగోరి దుష్టుఁడై
సురల మునీంద్రసంఘముల శోకసముద్రమునందు ముంచె ని
ర్జరసమవిక్రముం డితఁడు చచ్చె భవద్గురుపౌరుషంబునన్. 315
చ. అని వినుతించి రోక్షితిసురాన్వయసాగరచంద్రులార! రా
మునిచరితంబు లిట్టివయి పొల్చు ననేకము లాలకింపఁగా
జనులకుఁ దెల్పఁగా నెపుడు సంస్మరియింపఁగ సర్వముల్ ఫణీ
శుని యవతారమాట విన శ్రోత్రరసాయన మాచరిత్రమా. 316

---

నూటయొకఁడవయధ్యాయము.

శాపమున సాంబుఁడు స్త్రీయయి లోహముసలమును గనుట

చ. మునివరులార! యిప్పగిది భూస్థలి రామసహాయుఁడై దురా
త్మనికరమున్ మురారి తగుదర్పమునన్ వధియించి లోకపా
వనచరితంబు లెల్లమగుభంగి నొనర్చుచు భూమిభారమున్
గొనకొని తగ్గఁజేయుచును గోర్కెఁ జరించెను స్వేచ్ఛమీఱఁగన్. 317
మ. క్షితిభారంబు యుధిష్ఠిరానుజుఁడు తన్ జేరంగ రా వానితో
జతగాఁ గూడి యనేకరాజపతులన్ సైన్యవ్రజంబున్ రణ
క్షితిపైఁ గూలఁగఁజేసి తీర్చె; నిటు రాజీవాక్షుఁ డాత్మీయస
త్కృతి పూర్తింగన శాపదంభమునఁ బోయెన్ స్వస్థలిం జేరఁగన్. 318
క. ద్వారవతిన్ వీడి వడిం, బ్రారంభించిన మునీశ్వరామరతోష
స్ఫారమహాకార్యంబులఁ, దీరిచి నరతనువు విడిచి దివ్యపదంబున్. 319
క. తానున్న యక్షయంబగు,స్థానముఁ జేరంగఁ జనియె క్ష్మాసురులారా!
నా నియతి నాలకించెదు,మానులు సందేహ మాత్మమైకొన మునితోన్. 320
సీ. పలికి రిట్లనుచు విప్రస్ఫారశాపదంభమున యాదవులవంశము నదెట్లు
వదలె మానుషమగువపువు నేపగిదిని బాసె మా కెఱిఁగింపు వ్యాసమౌని
వర్య నావిని యిట్లు వర్ణించెఁ దత్కథ; వినుఁడు మీ కెఱిఁగింతు వేడ్క దానిఁ
గౌశికనారద కణ్వ మహర్షులు పిండారికాఖ్యచేఁ బ్రథుయశంబుఁ
ఆ. గనిన తీర్థమందుఁ గాంచిరి యదుకుమా,రులను వేడ్కనున్న యలఘుబలుల
వారు యౌవనమదవారణసన్నిభు, లొట భావికార్య మాతురమున. 321

క. తముఁ బ్రేరేపించుట నీ,మము మానియె జాంబవతికుమారుని సాంబుఁ
బ్రమదాకృతిభూషితుగా, నమరించి మహర్షులున్న యచటికి సుగతిన్. 322
క. కొనిపోయి వందనంబులఁ, బొనరిచి యిట్లనిరి మునిపుంగవులారా!
వనిత యిది పుత్త్రకామం,బున నుండెడు దీని కేమిపుట్టునొ చెప్పఁడా. 323
చ. అని పలుకంగ మునివరు లాత్మగతంబగు యోగదృష్టిచే
తనె సకలం బెఱింగి ధనదర్పమునన్ దముఁ గేలిచేయ వ
చ్చినయదుపుత్త్రులం గనుచుఁ జెప్పఁగరాని మహోగ్రహంబునన్
మనములు నావిలంబులయి మ్రొవ్వడ వారి వినాశనార్థమై. 324
క. శాపం బొసఁగిరి కోపం, బేపారఁగ నిట్లు; పంకజేక్షణ కిపుడే
మూపట్టు జనిని ముసలము, ప్రాపించును సర్వభూతభయదం బగుచున్. 325
క. వినుఁ డద్దాననె యదుకుల,మునకుం గాఁగలదు నాశము జవంబున నం
చనిపల్కి పోయి; రంతటఁ, జని రాయదుపుత్త్రకులును సరగం బురికిన్. 326
చ. అరిగి యుదంతమెల్ల నిసుమంతయు వీడక యుగ్రసేనభూ
వరున కెఱుంగఁ జెప్పిరి ధ్రువంబుగ సాంబునికుక్షినుండి భీ
కరముసలంబు పుట్టును నిఁకన్ గతియే దని చింతనొందున
త్తరుణమునందె యాయసము దారుణమా ముసలంబు పుట్టినన్. 327
క. దానిఁగని యుగ్రసేనుఁడు, మానక చూర్ణంబుగాఁ గుమారులు చేయం
గా నియమించెను దానిని, బూని సముద్రమునఁ గలుపఁబోలు నటంచున్. 328
చ. మనమున నెంచె నంధకకుమారులు చూర్ణముచేయఁ బూని రే
పున నది చూర్ణితంబయియుఁ బొల్చెను శిష్టము తోమరాకృతిన్
మునుకొని దాని నెంత బలముంగొని యత్నముచేసినన్ మహా
మునితతిశాపశక్తి నది మూర్ఖునిచిత్తముపోలె నిల్చినన్. 329
తే. ఎంతయత్నముచేసిన నెంతబలము, చూపినను శిష్టభాగంబు చూడఁబడియెఁ
దోమరాకృతిఁ జూర్ణముతోడ దాని, నంబునిధిలోనఁ గలిపి రాయర్భకు లొగి.
క. దాని నొకచేప మ్రింగెను, దానిన్ జాలరులు బట్టి తగ ఖండింపం
గానఁబడెఁ దోమరాకృతిఁ,గా నిల్చిన ముసలభాగకము తత్కుక్షిన్. 331
తే. దాని గ్రహియించె జరయనుతన్వి; యావి
షయము నెఱిఁగియుఁ సర్వసచ్ఛక్తియుఁడు,
హరి మునీంద్రులశాపము నాత్మశక్తి
మార్పఁగా శక్తుఁడయ్యు బ్రహ్మగతి యనుచు. 332
క. ఊరకయుండెను దేవత, లారసి తద్విషయమెల్ల హరిచెంతకు గం
భీరతశార్థము దెల్పఁగఁ, దా రనిపిరి దూతనొకనిఁ దత్సమయమునన్. 333

క. అతఁ డాకేశవు దర్శించి తగంగా నొంటినిలువఁ జేరి పలికె దే
వతతులు నశ్వివసువులును, శితికంఠులు వాయుసాధ్యసిద్ధులు తెలుపన్. 334

క. వారల యనుమతిఁ గైకొని, శ్రీరమణా నీదుమ్రోలఁ జిత్తమలరఁగా
స్వారాట్టు విన్నవించెను, నారయుఁడీ తద్వచనమునర్థము లెల్లన్. 335

చ. ధరణిభరంబు వాపుటకుఁ దమ్మెద నమ్మితి పుట్టినమ్ము స
త్కరుణను గావ వత్సరశతంబునకన్నను సుంత యెక్కువౌ,
తరుణము ధాత్రినుండితిరి దైత్యులు దుష్టనృపుల్ నశించి రీ
ధరణియు భారహీనయయి త్వద్ద్యుతి హాయిగ నున్న దిత్తఱిన్. 336

క. ఇపుడు సనాథులు త్రిదశులు, స్వపదమునకు వేగ రాఁగ సమయం బిదియే
కృప నూప్రార్థన మాత్మఁ దలఁపవలయును గృష్ణ యీయిలన్ బహుసమలన్.

తే. గడపినాఁడవు దేవతాగణము వేఁడు,కోలు మీఁదమది కెక్కినఁ జాలు నింక
ధర వసించుటయని సురధామమునకు,నిపుడు రాఁదగుఁ ద్రిదశులయిష్టమెల్ల.

తే ఆలకించియు భూతలమందు నింకఁ, గొంత కాలము నివసింపఁ గోర్కెయేని
కింకరులఁ గూడియుండుము కేశవేశ, యనుచుఁ దెలుపంగ శ్రీహరి యాలకించి.

క. వినిపించె దూత కిట్లని, తనయాశయ; మేను వింటి దైవతభావం
బును భూమిభార మడఁగెను, గనుకనె యాదవులఁ ద్రుంచు కార్యం బిపుడే.

క. ఆరంభించితి యాదవ,శూరు లదెవ్వారిచేత క్షోణింబడ రీ
వీరులను సప్తరాత్రము, లారూఢిగ వ్రతముపూని యంతమునొందన్. 341

క. సంకల్పించితి నామది, నింకన్ సంద్రమ్మునుండి యీద్వారక నే
వంకన్ సాధించితి నటు, లింకంగాఁ జేయువాఁడ నీయంబుధిలోన్. 342

తే. యాదవులనెల్ల నడఁచి యీయబ్ధిఁ బురము
మునుఁగఁగాఁ జేసి స్వర్గము గనఁగఁబోవఁ,
దలఁచి యున్నాఁడ మానవతనువు దీని
సరగ విడుతు సంకర్షణుసాయమునను. 343

సీ. స్వర్గమునకు నేను జనుదెంచినట్టులే యింద్రుఁ డెన్నఁగవచ్చు; నిచట దర్ప
వంతులై భూదేవిభారంబుగా నున్న యాజరాసంధాదు లంతమొంది;
రవ్వారిచేతనే యవనికి భారంబు వహియింప రాదయ్యె వరుస యాద
వులు నట్టివారలే తలఁపంగఁ గావున నీభారమును గూడ నిపుడె తీర్చి

తే. యమరలోకంబునకు దేవతావనార్థ
మరుగుదెంచెద నీమాట హరిహయునకుఁ,
జెప్పుమా యన దూతయు నప్పుడు హరి
పదములకు మ్రొక్కి చేరెను ద్రిదశపురము. 344

చ. హరి హాయుఁ గాంచి కృష్ణువచనావళిఁ దెల్పెను; గృష్ణుఁడంతటం
బోరిఁబోరి సర్వభూతములఁ బోకడఁజేయఁగఁజాలినట్టివై,
ధరణి నభంబునందు జలదంబులయందును స్వర్గమందు భీ
కరగతిఁ దోఁచుచిహ్నములఁ గాంచెను ద్వారకయందు నెంతయుస్. 345

తే. అట్టియుత్పాతములు పెక్కు లవని యాద
వులవినాశనసూచకంబులయి కానఁ
బడియెఁ బగలును రాత్రులు వానిఁ జూపి
యాదవుల కిట్టు లనియె శ్రీహరి కడంక. 346

క. ఇట్టి మహోత్పాతంబుల, నెట్టనఁ దొలఁగింపఁగా ననింద్యమహిమఁ గ
న్పట్టు ప్రభాసమునకుఁ దల, పెట్టితిఁ బోవంగ నిచటి ప్రీతి తొలంగన్. 347

చ. అనుటయు నుద్ధవుండు పరమాద్భుతి శ్రీహరికిం బ్రణామముల్
పొనరిచి దేవదేవ పరిపూర్ణచిదాత్మ! కృష్ణ! నేనొన
ర్పనుదగు కార్య మేదియొ కృపన్ వివరింపుము నేఁదలంతు దై
వనియతి యాదవక్షయము వారక చేయఁగ నున్నయట్లుగన్. 348

క. ఈవంశము నశియింపంగా విధి యుత్పాతములను గల్పించె నటం
చే వారక తలపోసెద, నీవిధమున నవశకునము లిటఁ దోఁచుటచేన్. 349

క. యాదవవంశము నాశం,బౌ దైవమునాజ్ఞ ననుచు నాత్మకుఁ దోఁచెన్
శ్రీదయితా! నా కేమని, నీవగునానతి యటన్న నెమ్మి హరి యనున్. 350

చ అనుపమదివ్యసద్గతి మహత్తరపుణ్యపదంబు మానిరా
డ్వినుతము ముక్తిదంబునయి విశ్రుతమౌ బదరీవనంబు నొ
య్యనఁ గనఁ బొమ్ము మత్కరుణ నయ్యది యొప్పును గంధమాదనం
బున నట నీకు నగ్గనెడుపుణ్యము చేకురు సర్వకాలమున్. 351

క. నరనారాయణపదమై, ధరణికిఁ బావనతఁ గూర్పఁదగి యుండును; నా
కరుణన్ సిద్ధిం గాంచెదు, పరఁగుము మత్పదరతమగు స్వాంతము తోడన్.

చ. కులమును దీని నీజగతిఁ గూడకయుండ నొనర్చి స్వర్గమున్
గులిశధరాదిసేవితముఁ గూర్మిఁ జొరం జనువాఁడ నింక నీ
జలనిధి ద్వారకాపురముఁ జయ్యన లోఁగొనుఁ దప్పదిద్ది నీ
వలరుచుఁ బొమ్ము మేలగుత మంచని కృష్ణుఁడు పల్కె మ్రొక్కుచున్. 353

క. అరిగెం గృష్ణుఁడు తన్నుం, బురికొలుపఁగ నుద్ధవుండు పుణ్యపదంబౌ
నరనారాయణవాస బ,దరికాశ్రమమును గనంగఁ దద్దయుఁ ద్వరతోన్. 354

చ. హరి యిటు తెల్ప యాదవులు స్యందనవర్యములందు నెక్కి స
త్వరగతిచేఁ బ్రభాస మనభాసురకీర్తిని గాంచియున్న యా

సరసున కేఁగి రాహాలియు సారసనేత్రుఁడు కూడ రాఁగ మృ
త్యురతిని గోరెఁ; హేతువది తోఁపదు వారికి నించుకేనియున్. 355

సీ. కుకురాంధకప్రముఖులు యాదవులు ప్రభాసాఖ్యతీర్థము చేరి హర్షపులకి
తాంగులై శ్రీకృష్ణుఁ డనుమతి నీయంగ సురఁ గ్రోలి రెంతయుఁ ద్వర గదురఁగ
నప్పుడు వారల కన్యోన్యసంఘర్షణము త్రాగునట్టి యాసమయమందుఁ
గలిగె నద్దాన వారల నాశనముగోరు కలహము పొడసూపె గాఢవహ్ని

తే. పగిది; నంతట వారెల్లఁ బౌరుషంబు
లుబ్బుచుండఁ బరస్పర ముగ్రసాధ
నములఁ గైకొని మోఁదుకొనంగఁ బూని
రందుఁ బ్రద్యుమ్నసాంబాదు లమలమతులు. 356

క. కృతవర్మయు ననిరుద్ధుం, డతిశయబల మొప్పునట్టి యాదవవీరుల్
తుటిఁ బేరుగన్న పృథువును, మితిలేనిపరాక్రమమున మించు విపృథువున్. 357

సీ. * చారుదేష్ణాఖ్యుఁ డక్రూరసుబాహువుల్ కాలంబు పురికొల్పఁగా మహోగ్ర
విక్రమంబులుమీఱ వెస నేరకారూపవజ్రంబులను బరస్పరము వైచు
కొనుచుఁ బోరాడిరి వనజనేత్రుఁడు హరి వారి వారించె దుర్వారరణమి
దేల యంచన యదుజాల మాహరిసహాయునిగఁ గోరుచును మహోగ్రరీతిఁ

తే. దుంగలును నాయుధములుగఁ దోఁప వాని
గరములం గొని ప్రహరింపఁగాఁ గడంగి
రరుల వారలు తుంగలేయాయుధములు
గాఁగఁ బ్రహరించి రరులను గండుమిగిలి. 358

క. సమవిక్రములఁ బోరెను,తమబంధువులను దలంచి త్వరఁగ మృతిని గూ
ర్ప మదిని దలంచి తుంగను, నమరించెను ముష్టియందు నాయుధమునుగన్.

ఆ. ఆగ్రహించి యిట్టు లాతుంగనే యాయు
ధముగఁ గొనియె నదియె దారుణమగు
ముసల మయ్యె మున్ను మున్నీటిలో వైచి
నట్టి శిష్టమెగద యదియుఁ గాన. 360

సీ. యాదవులం జంప నాలోహమును గొని దానిచే వారల దర్ప మలరు
వారిని శేష మేవరుస లేకుండఁగ వధియించె వారలు వాసుదేవ
హతులు గాకుండినయపుడు తుంగలఁగొని యొండొరులం జంపనూహ లమరఁ
బ్రహరించుకొనుచుండి పౌరుషములఁ జూపుచుండిరి వారల నుక్కడంచె;

* ఏరకారూపిభిర్వజ్రైస్తే నిజఘ్నుః పరస్పరమ్ = అని మూలము. ఏరకము లనఁగా నొకజాతి తుంగలు.

తే. హరియు; వచ్చెను జలనిధియంతరమ్ము
నుండి చైత్రరథం బొందు హుతవహువలెఁ
దేజముల వెదఁజల్లుచు దేవవర్య
సంప్రహితమయి యద్దాని సంద్రమందు. 361

క. కనుఁగొని దారుకుఁ డశ్వము,లను బట్టుకొనంగ నందు లలితాకృతితోఁ
గనుపట్టెఁ జక్రమునుగద, యును శార్ఙ్గము శంఖతూణయుగములు నసియున్.

క. దాని నధిష్ఠించిరి శ్రీ,జానియు దారుకుఁడు; నిట్లు క్షణమాత్రమునన్
మౌనివరుశాపమున యదు, సేనలు యదువీరులును గృశించిరి విధిచేన్. 363

క. హరియును దారుకుఁడును సం,గరమున నద్దానియందుఁ గాలుని గనకుం
డిరి, వారు దివ్యరథ మం,బరమునఁ బోవంగ భూమి బలభద్రు నజున్. 364

చ. తరువరమూలమందుఁ బ్రమదస్థితిమైఁ మృదులాసనంబునం
గరము విచిత్రరీతిఁ దగి కాలముఁ గోరుచునున్న వానిఁ గాం
చిరి; తదుదారవక్త్రమునఁ జిత్రగతుల్ దగ భూరిసర్ప మొం
డరయఁగ నయ్యె నయ్యదియు నప్పుడె వెల్వడసాగె మెల్లఁగన్. 365

ఆ. అతనిమోమునుండి యామహాభోగభు,జగము సిద్ధవరులు సాధునుతులఁ
దనుపుచుండ నురగతల్లజములు గొల్వ, జలధిఁ జొచ్చె నంత సాగరుండు. 366

చ. చెలఁగెడుభక్తి నర్ఘ్యమును జేతులఁ జూడఁగ నొప్ప నేగి యి
మ్ముల విధియుక్తమౌగతిని బూజ లొనర్చెను బన్నగేంద్రుఁ డా
జలనిధియందుఁ జొచ్చి ఫణిజాలము గొల్వఁగఁ బోయె నత్తఱిన్
బలుఁ డిటు దేహముక్తిఁ గన వారిజనేత్రుఁడు దారుకుం దగన్. 367

చ కనుఁగొని పల్కె; దారుక వగం గనకుండఁగ నాదుతండ్రికిన్
ఘనుఁడగు నుగ్రసేనునకు గాదిలిసోదరుదేహముక్తి నీ
వననిధితీరమందు యదువంశభవౌఘము మ్రందినట్టిరీ
తిని వినిపింపుమా మఱొకతీరున వారు తలంపకుండఁగన్. 368

ఉ. నేనును యోగమూని యతినిర్మలలోకము మామకంబునుం
గానఁగఁ బోవుదూహఁ గొని కాయముఁ బాసితి నంచుఁ జెప్పుమీ
మానక ద్వారకాపురిని మామకసంగతిఁ గోరియున్న సు
జ్ఞానుల కెల్లఁ దెల్పుము; నికామజవంబున ద్వారకాపురిన్. 369

చ. జలముల ముంచుఁ గావునను స్యందనరాజిని గూర్చి యీపురిన్
వెలువడుయత్నముం గనుచు విహ్వలతం గనకుండ నుండఁగా
బలయుతుఁ డర్జునుండు ప్రియబంధుగణంబును జూచుకోర్కెఁ రాఁ
గలఁ డది చూచుచుండుఁ డని క్రమ్మఱఁ బల్కుము నాదుమాటగన్. 370

చ. పురమును గాంచి యర్జునుఁడు భూరితరంబగు దుఃఖమొంది వే
యురుగును వానితోడఁ జననౌ జనులెల్లను మీఁద సుంతయేఁ

బురమున నుండ రా దతఁడు పోయినవొప్పునఁ బోవఁగాఁ దగుణ
ద్వరపడి యంచొగిం బలికి దైవగతిం జనె నంచుఁ దెల్పుమా. 371
చ. నరుఁ డరుదేర నీవు చని నావచనంబుగఁ బల్కు మిట్లు నా
శరణము గోరియున్న మతిశాలుర వీరిని బ్రీతిమీఱ నే
వరుసను గావఁగాఁ దగునొ వర్ధిలు ప్రీతిని శక్తి కర్మమా
కరణిని గావు మంచనియె గాదిలిమిత్రుఁ డటంచుఁ జెప్పుమా. 372
తే. మత్పరిగ్రహ మీయది మనుజవితతి
గానఁ గాపాడఁగాఁ దగుఁ గౌరవేజ్య
యనుచు వచియించి జనుల నెల్లను ద్వరపడి
తోడుకొని పొమ్ము విజయుని గూడి నీవు. 373
ఆ. వజ్రనామకుండు ప్రభువగు యదువంశ,మునకు నింక మీఁద జనులనెల్ల
సత్వరముగఁ గొంచు జనవయ్య దారుకా, యర్జునుండు దుఃఖమందఁదగదు.

## నూటరెండవ యధ్యాయము.

### శ్రీకృష్ణుఁడు వైకుంఠమునకుం బోవుట.

చ. అని వచియింప దారుకుఁ డహార్యతరంబగు దుఃఖపూరమం
దును బొరలాడుచి త్తమును దోరపుశక్తిని జిక్కఁబట్టి వం
దనముల మాటిమాటికి నొనర్చి ప్రదక్షిణ మొప్పఁజేయుచుం
జనియెఁ దదుక్తులం దెలుపఁ జయ్యన ద్వారవతీపురిం గనణ. 375
మ. హరియాజ్ఞం దెలుపంగఁ బౌరుజను లౌరౌరా! యిదే కాల మీ
శ్వరు సంకల్పమురీతి సాగు నని పోవంబూని రథ్యే నరుం
డరుదెంచెణ హరిఁజూడ దారుకుఁడు దుఃఖాంభోధిమగ్నాత్ముఁ డై
స్థిరతం గాంచని లోకవృత్తము నిసీ! సీ! యంచుఁ బోనాడుచుణ. 376
క. హరివాక్యంబులు తెల్పఁగ, నరుఁ డాతురపడుచు వజ్రనాముని యదుభూ
వరుఁజేసె; నంత నచ్చట, హరియును భగవంతుఁడ నను నాశయ మొప్పణ. 377
తే. వాసుదేవాత్మకంబయి వఱలు తనదు
తనువు సర్వభూతంబుల నునిచి లోక
మయుఁడుగా నొప్పె నపుడు బ్రహ్మ మనుపేర్లు
హరికిఁ దనరారె; వనజాక్షుఁ డంత మున్ను. 378
సీ. దుర్వాసుఁడను మౌని ధూర్తుఁడై యేపల్కు పలికెనో దానిని భావమందు
గౌరవించుచుఁ దనకాయంబు భూస్థలి నున్న దానిని యోగయుక్తుఁ డగుచుఁ
బాదంబు జానువుపై నుండఁగాఁ జేసి శయనించియుండె భూస్థలిని నంత

జర యనునామెయుఁ జనుదెంచె లుబ్ధకుఁ డచటికి వచ్చె లోహమయముసల
తే. శేష మాయుధముగ నొప్ప శింజినీర
వము నొనర్చుచు నందున్న వాసుదేవు
పదము మృగముగ భావించి బాణమోక్ష
ణమునఁ గూల్పంగఁ బొంచె లక్ష్యము తగంగ. 379

చ. అరుదుగ బాణమున్ విడిచి యాపదమున్ మృతినొందినట్లుగా
వరుసఁ దలంచి యచ్చటికి వైళమపోయి చతుర్భుజంబులున్
నరతనువున్ గలట్టిసురనాథనమస్కృతుఁ గాంచె శ్రీహరిన్
బరముని గాంచినంతటనె వందన మొప్పఁగఁ జేసి భక్తిచేన్. 380

క. క్షమియింపు మీశ్వరా యని, యమలాత్ముం డగుచు వేఁడి యటవీమృగ మీ
క్షమ నిట్టి లున్నదను నూ,హ మదిం దోఁపంగ నెఱుఁగ కజ్ఞుఁడఁ గానన్. 381

తే. హరిణశంకను శరమున నార్తుఁజేసి
తిని గదా నన్ను క్షమియింపు దేవదేవ
యాత్మపాపంబు ననుఁ గాల్చె నట్టినన్ను
మరలఁ గాల్పకుమా కృష్ణ! మాధవ! హరి! 382

చ. అని తను వేఁడ శ్రీహరియు నాతని కిట్లను సుంతయే భయం
బును మదిఁ బొందకుండుము సుబుద్ధివి గావున మత్ప్రసాదసి
ద్ధిని సుఖధామమై పరఁగు దేవపదంబును బొందఁజాలు దీ
వని వచియించె నత్తఱినె యచ్చటఁ దోఁచెను వ్యోమయానమున్. 383

క. హరి కరుణ దాని నెక్కియె, సురలోకంబునకుఁ బోయెఁ జోద్యంబుగ నా
హరియును నాత్మను నాత్మన్, బరమాదృతిఁ జేర్చి దేవభావము తనరన్. 384

సీ. బ్రహ్మభూతంబు నవ్యయము నచింత్యంబు వాసుదేవమయంబు భాసురంబు
నభవంబు నజరము నగతనాశంబు నప్రమేయము నఖిలాత్మకంబు
నగు తత్త్వమునఁ జేర్చె నామానుషశరీరమందున్న తన తేజ మప్పుడె తన
దివ్యపదంబును దివిజమౌనీంద్రసంసేవ్యంబు నొందె నీక్షితిని వదలి
ఆ. మానులార! యిట్లు మానవలోకంబు,నందుఁ దాను జేయ నర్హములగు
పనుల నిర్వహించి భారము మాయించి, నిజపదంబుఁ జేరె నియతి తనర. 385

## నూటమూఁడవయధ్యాయము.

ఎనమండ్రు కృష్ణభార్య లగ్నిప్రవేశ మొనర్చుట.

చ. హరి యిటు లాత్మలోకమున కల్లనఁ బోవఁగ నర్జునుండు త
ద్విరహము నోర్వరామి నటవీస్థలిఁ గ్రుమ్మరి రామకృష్ణసుం

దరతనువర్యముల్ గని నితాంతము కుందుచు శాస్త్రరీతి సం
స్కరణముచేసి యావ్వల నెసంగెడు నెవ్వగఁ జూచె నెల్లెడన్. 386

ఆ. సర్వబంధువులయు సర్వసద్భటులయు,గాత్రములను ధూళి గ్రమ్మియుండఁ
గాంచి వగపుమించఁ గా నెట్లొ సంస్కార, మొప్పఁ జేసె సాగరోర్వియందె

సీ. రుక్మిణీప్రభృతివారలు నెనమండ్రపు డాహరిదేహంబు నాశ్రయించి
హుతవహుఁ జొచ్చి రీవితమున వారెల్ల ప్రుందఁగా రేవతీరమణి రాము
తనువుఁ గౌఁగిటఁ జేర్చుకొని మండుచున్నట్టియగ్నిఁ జొచ్చెను దేహమద్ధియపుడు
కడుశీతలంబుఁగాఁ గనఁబడె; నావార్త నానకదుందుభి యట్లె యుగ్ర

తే. సేనుఁడును విని రవ్విధి శ్రీపతిఁ గని,నట్టిదేవకీరోహిణు లార్తి మునిఁగి
యగ్నిఁజొచ్చిరి వారల కర్జునుండు, ప్రేతకార్యంబు లెల్లఁ దీర్చె విధియుక్తి.

చ. తనవిధిఁ దీర్చి యంతటను దారుకుఁ డాడినశ్రీశువాక్యముల్
మనమునఁ దోఁప నందుఁగల మానుషసంఘముతోడ వజ్రునిం
గొని పయనంబు చేసె; నరుఁ గూడియె శ్రీహరిపత్ను లెందఱో
చని రిటు ద్వారకాపురిని జయ్యన వీడి క్షణంబులోపలన్. 389

క. జనసముదాయము వజ్రుని, గొని యక్కురువంశరాజకుంజరుఁడును మె
ల్లన వారితోడఁ బోయెను, మనమునఁ దగుదుఃఖవార్ధిమగ్నుం డగుచున్.

చ. ఘనపతిగెల్చి తెచ్చినయఖండరుచుల్ తగునాసుధర్మ యా
వనరుహనేత్రుఁ డాపురముఁ బాసినయంతనె నభ్రవీథిపైఁ
జని మును పున్నయట్టులె యెసంగెను గల్పకభూరుహోత్తమం
బనఁజను పారిజాతమును నట్టులె పోయెను స్వర్గసీమకున్. 391

క. ఏదినమున శ్రీనాథుఁడు, మేదిని విడనాడి దివికి మించురుచులతో
శ్రీదయితఁగూడి పోయెనో, యాదినమునయందె కలియు నవనిం జేరెన్. 392

మ. జనసంబాధములేని ద్వారకను జంచత్తుంగభంగార్భటిన్
దనలో మున్గఁగఁ జేసె సాగరము పద్మానాథు వాసార్హమై
ఘనరోచుల్ వెదఁజల్లు శ్రీగృహ మదేకాలంబునన్ నిల్చువం
చని ముంపం దలపోయఁ డయ్యె సుర లత్యాశ్చర్యముం బొందఁగన్. 393

క. అప్పుడు కా దంభోనిధి, యిప్పటికిన్ దానిముంప నెంచఁడు సుండీ
యప్పతియాజ్ఞయె తనకది, తప్పనిపని యన్నయూహ తగఁదోఁచుటనో. 394

క. అనుదినము కేశవుం డా, వనరాశిగృహంబునకును వచ్చుచునుండున్
మునులార! వినుఁడు తద్గృహ, మనుపమఘనాశకంబు నతిపుణ్యదమున్. 395

క. హరికిం గ్రీడాయోగ్యము, పరమంబును నౌట దానిఁ బరికింప నఘో
త్కరమెల్లఁ బాయు మౌనీశ్వరులారా! యవలి కథను జక్కఁగ వినుఁడీ. 396

క. నరుఁ డంత వారిఁ దోడ్కొని, యరుగుచుఁ బంచనద మనఁగ నలరారుచు ధా
న్యరమాన్వితమయి యొప్పెడు, నిరుపమమౌ క్షేత్రమందు నిల్చె జనులతోన్.

చోరులు కృష్ణపత్నులసొమ్ము లపహరింప నర్జునుఁడు ఖిన్నుఁ డగుట.

సీ. అచ్చటనున్న చోరాళి నాయకుఁగూడి యొక్కపార్థుఁడు ధనువూని యున్న
వాఁడు స్త్రీసంఘము బహుళంబుగా నున్న దితఁడే తోడ్కొని యేగుచున్న
వాఁడని తోఁచెడి వారిజాక్షులదేహములు రత్నభూషితంబులుగ నున్న
విన్వి హరించిన నిఁక మీఁద దారిద్ర్య ముండ దంచని యెంచి యురుతరాఘ
ఆ. కర్మరతులుగానఁ గడు లోభపరవశస్వాంతులగుచు నొక్క సరణిఁ గూడి
మదముపేర్మి ధర్మమార్గ మెఱుంగక, పలికి రిట్లు క్రూరభాషణముల. 398
చ. ఇతఁ డొకఁడే ధనుర్ధరుఁ డహీనబలాఢ్యుఁడువోలెఁ గామినీ
వితతిని దోడుకొంచు బలువింతగఁ బోయెడి నంచుఁ దోఁచెడిన్
బతిరహితంబుగా నిపుడు వారిజనేత్రలసంఘ మొప్పె నీ
వితమున నీతఁ డొక్కరుఁడె వీరుఁడుగా మనలన్ హసించుచున్. 399
చ. అరుగఁ దలంచె నీ! కనఁగ నస్మదుదారబలంబు గాల్పనే
నరుఁ డితఁడౌను వీఁడు సురనాథునిపుత్త్రుఁడ నంచు గర్వవి
స్ఫురణము మీఱ భీష్మ రవిసూనుని ద్రోణ జయద్రథాదులన్
దురమున గెల్చి పౌరుషముతో నెఱుఁగండు పరప్రతాపమున్. 400
తే. గ్రామవాసులబలము లెక్కగొనఁ డీతఁ
డింతయేగాక బలముల వింతపౌరు
షముల గ్రామ్యులు మింతురు క్ష్మాతలమున
నంచుఁ దలఁపక యపమతి నొంచు నొరుల. 401
క. మన మిందఱ ముండియునే, పనిగల దీజగతి నంచుఁ బలుకుచు లోష్ఠా
ళిని యష్టుల నాయుధములు, గనుగొని చెలరేఁగి గుంపుగా నొకప్రాన్కన్.
క. వనితాసంఘము నొంపం, జని రార్చుచు వేలకొలఁది సరభసముగ నం
త నరుఁడు నవ్వుచు నాభీరనివహముం గాంచి భయదరవమునఁ బల్కెన్.
చ. మరణము నొందఁ గోరకుఁడు మార్గముదప్పి చరింపకుండుఁ డీ
గురువని దైవమంచు నెఱుఁగుండు దురాత్మకులార! యింక మీ
రరుగుఁడు చాలుఁ జాలు ననునాపలుకుల్ చెవి సోఁకుచుండ భీ
కరగతిఁ జుట్టుముట్టి ధనకాండముఁ గైకొని రేపు మీఱఁగన్. 404
ఆ. అర్జునుండు చూడ నాహరిపత్నుల, బలిమిఁ గొనిరి వారి విలయ మొందఁ
జేయ నరుఁడు విజయసిద్ధిని గూర్చెడు, దివ్యగాండివంబు దీవ్రగతిని. 405
సీ. కరమున నవలీలఁ గైకొని జ్యాలత దానికింగూర్పంగఁ దలఁచె యత్న
మెంతచేసిన వీర్యమెల్లఁ జూపిన నది సమకూరదయ్యె నాశతమఖాత్మ

జొండ దెట్టులో కూర్చె వెండియు జ్యాలత శిథిలతఁగాంచెను జిత్తమందు
నెంత యూహించిన నేమహాస్త్రంబైనఁ దోఁపదయ్యెను వగతో నతండు

తే. ప్రకృతిబాణంబులన్ వైచి పౌరుషంబు,చూపెనేగాని యవి వారి మాపఁ జాల
వయ్యె భేదింపనుం జాలవయ్యె వహ్ని,యిచ్చినట్టి తూణీరముల్ హితమువదలి.

క. శరశూన్యము లయ్యెను ని,ర్భరబాణము లక్షయములు భాసిలునవియై
పరఁగుచునుండియు దైవము, పరుఁడై వేఱొక్కచూపు పర్వం జేయన్. 407

ఆ. గోపకులును వారి నోపినభంగిగా, నిల్వరింపఁ బూని నియతిలేక
యూరకుండి రిట్టు లుద్ధతులై చోరు,లెల్ల విత్తరాశి నిట్లు గొనఁగ. 408

చ. తనమది నెంచె నర్జునుఁడు ధాత్రిపతిప్రకరంబు నోర్చి నే
ఘనుఁడ నటంచు నెంచితిని గాని బలం బది కృష్ణదత్తమే
యనఁదగు నాతఁ డేగ బల మాతనిఁగూడియె పోయె నన్ను నొ
క్కని మిషగా నొనర్చి హరి క్ష్మాపతివర్యులఁ జంపె దుష్టులన్. 409

ఉ. అంతియ కాని నాదయిన యద్భుతశక్తి యొకింతగాని లే
దింతట నేమిచేయఁదగు నెవ్విధిఁ గాంతల వీరిఁ బ్రోవనోఁ
జింతలపాలుగాఁదగిన చిత్తము నాకిపు డొప్పె నక్కటా!
యింతియెగాదె శ్రీహరి యహీనకటాక్ష మొకింత తప్పినన్. 410

క. *అనుచుం జింతించుచు నుం,డ నటం జోరాళి కృష్ణనారీమణులన్
మనసిజుఁ డేచఁగ నీడ్చిరి, ధనమును గొని రందు లోభిదస్యులు పూన్కిన్.

చ. శరములు తూణయుగ్మమున సంక్షయమందినఁ జాపకోటిచేఁ
బరులను గొట్టుచుండె నిటు పాండునృపాలుసుతుండు కొట్టి భీ
కరబలులైన చోరు లొగిఁ గాంచి ప్రహాసముచేసి; రంత నా
నరుఁడు కనుంగొనంగఁ బటునాదము లొప్పఁగ మ్లేచ్ఛనాయకుల్. 412

తే. వృష్ణికాంతల నంధకవీరవనిత,లను గ్రమంబున నీడ్చుకొంచును జనంగఁ
గాంచి పార్థుఁడు తాఁజేయఁ గల్గుకార్య,మింక లేదని యోజించియెంతయువగ.

సీ. ఇది కష్ట మిదికష్ట మెంతయుఃగష్టమా ననుచు దుఃఖించె శ్రీహరియె నన్ను
విడనాడిపోయె నీపుడమి నే నెట్లుందు నదియె గాండీవమా నవియె శరము
లదియె స్యందనవర్య మవ్వియే వాజులు నివ్వియన్నియునుండి యేమిఫలము
గల్గెను శ్రీహరికరుణ యొక్కటిలేమి నశ్రోత్రియున కిడునట్టిదాన

తే. మట్లు నిష్ఫలమయ్యెనే యహార! దైవ,బలమె బలవత్తమంబు శ్రీవాసుదేవు
డొక్కఁడే లేమి నన్నియునుండి ఫలము, లేదుగద నేను శ్రీహరిలేని కతన.

క. బలహీనుఁడనై యతినీ,చులచేఁ బరిభూతుఁడనయి క్షోణి మృతునియ

* అపాకృష్యంత చాభీరైః కామాచ్ఛాన్యాః ప్రవవ్రజుః = అని మూలము.

ట్టులె యున్నవాఁడ; నాచేతు లవే యదె ముష్టి వేఱుతోఁపదు తలఁపన్.415
క. మునుపటి యర్జునుఁడనె యే,ననఁగాఁ బ్రాభవ్య మెడల నన్నియు వమ్మై
య్యెను నాయం దర్జునతను, వనజాక్షుం డిడినయదియె వల దనఁ జెడియెన్.416
ఆ. భీమునందు నిడియె భీమత్వ మాతఁడే, యిద్ది ధ్రువము హరియు నిలను వీడి
యరుగ మ్లేచ్ఛజనులు దురమున నను గెల్చి,రిదె యుదాహరణమునిప్పుడయ్యె.
క. అని తలపోయుచుఁ దనపుర,మునకుం జని వజ్రనాము భూపాలునిగా
నొనరించె యాదవులకున్, వనజాక్షునియాజ్ఞ నంత వనముల కరిగెన్. 418
చ. చనియట నాశ్రమంబున నచంచలచిత్తసమృద్ధిగల్గి మౌ
నినికరసంయుతుం డగుచు నిర్మలయోగసమాధి నొప్పు వ్యా
సుని గని పద్యుగంబు తలసోఁకఁగ మ్రొక్కి వచించె నిట్లుగా
వినయమునన్; మునీంద్రుఁడును విస్మితుఁడై నరుఁ గాంచె నొయ్యనన్. 419
క. చరణములపైన వ్రాలిన,నరుఁ గాంచి వ్యథాకులత మనంబు వెలయ నా
తురుఁ డగుట నెఱింగెను ముని,వరుఁ డంతట నిట్లు పల్కెఁ బరమకరుణతోన్.
చ. మనుజవరేణ్య! కాంతి యణుమాత్రము మోమున లేనియట్లు దోఁ
చెను గత మేమి? గోత్రియులు చెందెడు వేడుకఁ బోవ రేఁగు దు
ష్మును జొరఁ బాఱ లేదుకద భూసురుఁ జంపఁగ లేదు కాదె శ
త్రునికరమున్ జయింపఁ జని తోడనె యోటమి గాంచ లేదుగా. 421
సీ. ఏలొకో తెలియంగఁ జాల నీముఖకాంతి తగ్గియున్నయది సాంతానికాదు
లును నిన్ను యాచించి మనుజవర్యులు నిరాశలఁ బోవలేదుగా సాధ్వి నెవతు
కను గోరి పాపంబుఁ గాంచలేదుగద యద్దాననే ముఖకాంతితగ్గు విజయ!
విప్రుల కిడక యవిహితమ్ముగ భుజింపవుగద మిష్ట మొకండవుగను దినవు
తే. *గాదె కృపణులవిత్తంబు ఖలతఁ గొనవు,గాదెసూర్య వాతమునకుఁ గానఁబడవు
కద యొకప్పుడు; దుర్జనేక్షణహతుఁడవు,కావుగద యేల యిట్టులు కాంతిమాసె.
తే. కుండలోనున్న నీటిని గోటమీటు,చుండ నాతుంపురులు మేన నొయ్యనఁబడ
లేదుగద నీచశత్రువుల్ లీల నిన్ను,నని జయింపఁగ లేదుగద నర! చెపుము.423
క. ఇక్కజగాములలోపల, నొక్కఁడు నీకొక్కరీతి నొదవెనొ లేదే
నిక్కరణిఁ గాంతిమాయదు, నిక్కము వచియింపు మని మునినృపతి ప్రీతిన్.
క. అన నిట్టూర్పులు పుచ్చుచు, ధనంజయుం డిట్లు పల్కెఁ దన్మునివరునిం
గని వినుమో భగవంతా!, వినిపించెద నాదుదైన్యవృత్తి సకలమున్. 425
చ. ఎవఁడు బలంబొ తేజ మన నెవ్వఁడొ వీర్యము విక్రమంబు నా
నెవఁడొ తలంప శ్రీయనఁగ నెవ్వఁడొ ఛాయ యనంగ నెవ్వఁడో

*కచ్చిన్న సూర్యవాతస్య గోచరత్వం గతోఽర్జున = అని మూలము...

ప్రవిమలపుణ్యమూర్తి హరి పద్మదళాక్షుఁ డతండు మమ్ము నీ
యవనిఁ ద్యజించి పోయెను మహాత్ముని వెంటనె పోయె నన్నియున్. 426

క. స్మితపూర్వభాషణుం డగు, నతనిన్ విడనాడి మేము హతసత్త్వులమై
క్షితి స్థాణురూపులమె యయి, యితరులచే విజితులమయి యిటులుందు మిలన్.

చ. శరముల కస్త్రసంతతికిఁ జాపవరంబునకున్ దలంప నే
పరముఁడు సారభూతుఁడయి భాసిలుచుండెనొ యట్టిసత్కృపా
శరనిధి వాసుదేవుఁడు విశాలరుచుల్ దగుదేవదేవుఁ డు
ర్వర మము వీడిపోయె మునివర్య యిఁకేమని పల్కఁ జాలుదున్. 428

తే. ఎవనియవలోకనమున భార్గవియు జయము
సంపదున్నతి మము వరియింప నెంచు
నట్టి భగవంతుఁ డాకృష్ణుఁ డరిగె మమ్ము
వదలి యన్నియు మమ్మును వదలి పోయె. 429

చ. అనిమొన ద్రోణభీష్ములును నంగమహీపతియున్ సుయోధనా
ది నిఖిలకౌరవుల్ విమలదీప్తు లదెవ్వని సుప్రభావదృ
ష్టిని దహియింపఁగాఁ బడిరొ శ్రీపతి యాహరి భూమి దీనిఁ బా
సి నిజపదంబుఁ జేరఁజనెఁ జెప్పుదు నేమని మౌనిధూర్జటీ. 430

చ. విరహము చక్రితోఁ గనినవీఁకఁడి నే నొకరుండఁగాను మ
ద్ధరణియు యావనం బెడలఁ దగ్ధయు శ్రీతొలఁగంగ ఛాయయున్
ద్వరపడిపోవ వర్థిలక తా బహుళార్తిని బ్రుంగియున్న దీ
తరుణమునందు నాదయిన దైన్యముఁ జూచితి గాదె మౌనిపా. 431

తే. ఎవని యనుభావమున శాంతనవుఁడు లోను,గాఁగ నొప్పిన వీరులఁ గడఁగి పోరు
మాగ్ని శలభాకృతులుగాఁగ నాచరించి,నట్టినే నిప్డు శ్రీహరి యరుగ భీతి. 432

క. గోపాలబాలకులచే, నేపు విసర్జించి యోడి యిటు లున్నాఁడన్
శ్రీపతికృప యుండినతఱి, దీపించెను గాండివంబు త్రిజగము లందున్. 433

క. హరికరుణలేని యిత్తఱి, నరణ్యమున దుష్టలుబ్ధకావళి లగుడో
త్కరములఁ దిరస్కృతంబయి, సురుచిరకాంతులు నశింపఁ జూడఁదగదు సూ.

చ. వనితల వేలసంఖ్యలను బాహుబలంబునఁ గాచువాఁడ నే
ననుచు ననాథలం గొనుచు నయ్యటవిం జొర నంతలోన ద,
స్యునిచయముల్ దురాత్మలను జూడఁ దరంబులుగాని లోష్టకా
ష్ఠనికరమున్ ధరించి కడు సాహసమొప్పఁగ నీడ్చె నింతులన్. 435

ఉ. అంతియెగాదు మౌనివర యాహరిపత్నుల దస్యువర్గ మే
చింతయులేక యష్టులను జేడ్పడఁదన్ని మదీయశౌర్య మొ

క్కింతయు లెక్కగాఁ గొనక యేపుతగం గొనిపోయె నిద్దియే
వంతలఁ గూర్పఁజాలెడిని వాక్కున నేమనిపల్కఁ జాలుదున్. 436

క. నాదగు నిశ్శ్రీకత యా, శ్రీదయితుం డరుగఁ జెడుట చిత్ర మదెట్టుల్
కాదు మతేమన జీవము, లీదేహము వదలకుంటయే యద్భుత మా. 437

తే. నీచు లవమాన మొందింప నే నవమతి,సంకసంకలితుండనై శంక లజ్జ
యును రవంతైన లేకయే యున్నవాఁడ, జీవముల నున్నశవమనఁ జెల్లు నన్ను.

చ. అన విని నేను నిట్లనితి నర్జును దుఃఖితుఁ బొండవాత్మజున్
గనుఁగొని మానులార! సురకాంతకుమారక! చాలు దుఃఖ మిం
కను గడు లజ్జఁబూనుటయుఁ గాంతిని వీడుటయున్ దలంప నిం
కనయిన మానఁగాఁ దగును గాలము భూతగణంబులందు ని
ట్లనువుగ నొప్పు దానిగతి నారయఁగాఁ దగ రెట్టివారికిన్. 439

క. కాలము సృజించుఁ బ్రాణులఁ, గాలమె యవ్వాని ద్రుంచుఁ గావున జగముల్
కాలమె మూలముగాఁగల,వోలి నటం చెఱిఁగి స్థిరత నొందుము మదిలోన్.

సీ. సాగరములు నదుల్ క్ష్మాధరంబులు సర్వధరణియు దేవతల్ నరులు పశువు
లవనీరుహంబులు నహిగణంబులు కాలసృష్టముల్ వీనిని నెఱిఁగి కాల
మే మృతిఁ బొందించు నీవిశ్వ మెల్లఁ గాలాత్మక మని మదియందు నెఱిఁగి
శమము మనంబున నమరింపుమూ; కృష్ణమాహాత్మ్యమును నీవు మరలమరలఁ

తే. దెలిపితివిగాదె యదియట్లె వెలయు భూమి
భార మడఁపంగ హరి యవతార మందె
ధరణి ము న్నతిభారసాధ్వసముఁ దాల్చి
సురల సన్నిధికిం బోయి శోక మడర. 441

క. తనదుఃఖము తెలిపెను మే,దిని దోడ్కొని విష్ణుఁజేరి తెల్పిరి తత్కా
ర్తిని దానిదీర్పఁ బుట్టెను, వనజాక్షుఁడు కామరూపవైభవ మలరన్. 442

చ. ధరణిపతుల్ దురాత్ములు మృథంబునఁ జచ్చిరి కార్య మెన్న భూ
తరుణి వ్యథానిరాసమెకదా యది చేకురె వృష్ణివంశముల్
వరుస నడంగె నింక ధర వర్తిలి చేయఁగలట్టి కార్యముల్
హరికిఁ గనంగరావు విజయా! కనుకన్ గృతకృత్యుఁ డై కడున్. 443

క. తనలోకంబున కరిగెను, బనియున్న సృజించు దానిఁ బరిపాలించున్
గనుఁగొని కాలము రా దా,నిని సంహృతిఁజేయుఁ దానె నేర్పఱియగుటన్.

ఉ. కావునఁ బార్థ! నీమది వగం గన లాభము లేదు కానలో
నీవు పరాభవంబుఁ గని నేఁటికి నిందు మహావమాన మి
ట్లీవిధి గల్గెనే యనుచు నెంచి ఫలంబును గాంచలేవు సూ
భావమునం దలంప నరుపౌరుషముల్ ఫలియించు నొక్కచోన్. 445

సీ. భీష్ముఁడు ద్రోణుఁడు వీరుఁడౌకర్ణుఁడు లోనగుశూరులు మాననీయ
చరితులు నయియొక్క జనుఁడగు నీచేత వధియింపఁబడిరిగా వారిపౌరు
షము తక్కువే యనఁజనదు కాలోత్థమా విలయ మయ్యది నీదువిక్రమంబు
గాదు కావున నీకుఁ గల్గినయవమతిఁ జింతింపఁదగినది సుంతయేని
తే. కాదు భీష్మాదులకు నని గల్గినట్టి, యప్పరాభవ మీశ్వరు నాత్మభావ
మునవె కల్గెను నీదుశక్తి నది కాదు, నీకు నట్టులె కల్గెను నియతి నిపుడు. 446
క. చోరభవం బగునవమతి, కీరీటిఁ వగవనేల? యీశ్వరుఁ డగునా
శ్రీరమణుఁ డన్యతనువులఁ, జేరియె భూతాళిఁ గూల్చు సిద్ధం బిది యా. 447
క. భవుఁ డుద్భవించుతఱి నీ,దువంక సాయంబు గోరెఁ దోడనె కార్యం
బవితథముగ సాగెను దుది, నవలోకించెను భవత్ప్రహర్తల రిపులన్. 448
ఆ. అతనియాజ్ఞ నీకు నవమతి గల్గఁగాఁ
జేసి రరులు దీని చేత నేమి
తలఁపఁ జనునొ యట్లె తలఁపుము విను మొక్క
పలుకు భీష్ముఁ డనఁగ బాలిశుండె. 449
చ. సురనదిసూను నీవనిని శూరత నొంచితి వన్నమాట నే
పురుషుఁడు నమ్ముఁ గౌరవసమూహము నీవు జయింపఁ జాలుదే
పరులగు కానవాలయులు పార్థుని నొంచి రనంగ నమ్మున
ప్పురుషులు ధాత్రిపైఁ గలరె భూతగణేశ్వరులీల యిద్ది యా. 450
క. హరిలీలాచేష్టిత మిా, వరుసనె కనుపట్టుచుండు బలవంతులుగాఁ
బరఁగెడు కౌరవులను సాం,పరాయికంబందు నీవు పౌరుష మలరన్. 451
క. ఓడించుట యన నెట్టిదొ, ప్రోడతనంబూని నీవు పాలఁతులఁ గావం
గూడం బొలుచు స్తేనులు, చూడఁగ నీచెంతనున్న సుందరుల వనిన్. 452
క. కొనిపోవుట యన నట్టిదె, యనఁదగుఁ గావున వచింతు నంతయు నున్న
ట్లు నరా! యష్టావక్రుం, డనుముని మును నీటమున్గు నంగము తగఁగన్. 453
క. మనమున సనాతనుండగు, వనజాక్షుని నిల్పి తప మవార్యనియతిమై
నొనరించుచుండె నయ్యెద,నున రాక్షసులను జయించి నూత్నవిభూతిన్. 454
క. సురలెల్ల మేరుపృష్ఠము, నరుదుగఁ జేరంగఁ బోయి యం దుత్సవముల్
జరపుచునుండిరి దానిం బరికించెడువేడ్క దేవభామిను లెల్లన్. 455
క. జనుచుండి యమ్మునీశ్వరుఁ, గనుఁగొని రవ్వారిలోని కామరుచిరతన్
దనరు తిలోత్తమ రంభయు, నను వారలు నింకఁగల్గు నన్నులమిన్నల్. 456
చ. మునిపతి సన్నుతించిరి సమూహముగా బహుభంగులన్ జలం
బున గళమంతదాఁకఁ గడు మున్గ జటావళి గూడియున్న న
మ్మునికిఁ బ్రదక్షిణంపుఁగ్రమముల్ దగ మ్రొక్కిరి స్తోత్రరాజిచేఁ

దనిపిరి సుప్రసన్నముఖతామరసుండుగఁ దోఁచునాతనిన్. 457

తే. మఱియు సన్నుతిఁజేసిరి త్ర్యాసురేంద్ర!
యనుచుఁ బిల్చిరి; తరువాత నమ్మునీంద్రుఁ
డతివలారా! ప్రసన్నుఁడనైతి నేమి
వరము గోరుదురో యిచ్చువాఁడ దాని. 458

క. అది దుర్లభమే యైనను, మదిఁ గలసంప్రీతి గల్గుమాడ్కి నొనర్తున్
మదిరాక్షులార! నా విని, ముదమున రంభాదులెల్లఁ బొంగుచు మునితోన్.

తే. సుప్రసన్నుఁడవైతి వోశుభగుణాఢ్య!
యింక ఫలియింపఁ దగని దదేమియుండు?
ననుచు రంభాదు లనినవాక్కును విని తది
తరవనిత లిట్లు పల్కె రత్తపసితోడ. 460

క. మునివర ప్రసన్నుఁడవె యైన నొక్కవర మిమ్ము మాకు నాథుఁడు హరిగాఁ
దనరారవలయు నావిష్ణుని భర్తగఁ గోరుదుము మనోవృత్తులచేన్. 461

చ. అనుచు మనఃప్రమోదమున నంగన లాడిన నాలకించి యా
మునిపతి యట్లె యౌ ననుచు మోమున సుస్మిత మొప్పఁ బల్కి జీ
వనములనుండి లేచె; మునివర్యునిదేహము చూడ నష్టథా
వినిహతి నొందె వక్రతను వింతగఁ గాంచిరి వార లాతనిన్. 462

మ. తనువక్రత్వము కానరాఁగ స్మితముల్ తద్వక్త్రమార్గంబు లో
య్యనఁ బాయం దలపోసి సంస్ఫుటములై యత్యంతముగ్ బాహ్యసీ
మను జేరం గని మౌని యాగ్రహమునన్ మన్నింప కిట్లాడె నో
వనితారత్నములార! మామకతనూవక్రత్వముం గాంచుచున్. 463

తే. హాసరూపావమతి నన్ను నాదరించి
తిరిగదా దానికొఱకుఁ బ్రతిఫల మిదిగో
కొనుఁ డొసంగెద నాదుకృపను హరిఁ బతిఁ
బడసియును నాదుభూరిశాపహతి మీరు. 464

తే. దస్యుహస్తములం జిక్కి తత్తఱమున, వగలఁ బొగులుఁడు నా విని వనితలెల్ల
మునిఁ బ్రసన్నునిగాఁ జేయఁ దనిసి లుబ్ధహస్తగతులయ్యుఁ జేరుదు రమరపురికి.

చ అని ముని పల్కెఁ గావున మహామునిదౌ వరయుక్తి శ్రీనివా
సునిఁ బతిఁ గాంచి శాపమున సొక్కుట దస్యువశంగతత్వముం
గనిరి వరాంగనల్ గనుకఁ గాంతలకై వగ పొందనేల య
ర్జున! పరమేశ్వరుం డతఁడె సూ సకలంబున కీశుఁడై తగున్. 466

ఉ. ఆపరమేశ్వరుండె జగమంతయు నిండి సమస్తకార్యముల్
దీపితశక్తిఁ జేయును మృతిం దగఁగూర్చును సృష్టికిన్ మనో

వ్యాపృతి నెట్టికార్యముల నయ్యయి మార్గములం బొసంగ నా
శ్రీపతియే యొనర్చు నిటఁ జిత్తమునన్ మిముఁ జంపుపూనికన్. 467

క. బలమును వీర్యమహత్త్వం,బుల లయముం బొందఁజేసెఁ బుట్టినయవియున్
విలయంబుఁ గాంచు సత్యము, గలిగెడుఁ బతనంబు వృద్ధిగలదాని కిలన్. 468

సీ. సంయోగ మనునది చను విప్రయోగావసానమై క్షయమగు సంచయమ్ము
నని యెఱింగియు పెద్ద లాత్మ శోకింపరు కలుగుచో హర్షంబుఁ గనరు నిజము
సజ్జనులకుఁగూడ స్వకృతకర్మములకు శిక్షాంతమగును బోచితము కాన
నర్జునా! యీవిషయము చక్క యోజించి భ్రాతలంగూడియు రాజ్య మెల్ల
తే. వదలి తపమున కేగుము వైళమ చని, నాదు వాక్కుగ ధర్మజునకును దీనిఁ
దెలిపి నేఁటికి మూఁడవ దినమునందె, యందఱంగూడి పొమ్ము ప్రయత్న మలర.

చ. అని వచియింప వ్యాసమునియానతి నొదలఁ దాల్చి ధర్మరా
జునకును భీమసేనునకు నోయగ మే ఘనభూషణంబుగాఁ
దనరెడు జంటతమ్ములకుఁ దాఁ గనినట్టి మహాద్భుతంబునున్
వినినది యెల్లఁ జెప్పెఁ బృథివీపతిముఖ్యులు వ్యాసునానతిన్. 470

క. అనుజునివంకన్ విని య, ర్జునుపౌత్త్రుని రాజ్యమునకు శోభం గూర్పం
గనుజాలు పరీక్షిత్తును, మనుజేంద్రునిగా నొనర్చి మాన్యనియతిచేన్. 471

చ. హరి తమువీడి స్వాలయమునందుట యర్జునశక్తి హీనతం
బరఁగుట దస్యుసంతతులు వారనిపూనికఁ గృష్ణుపత్నులన్
గరములఁ బట్టి యీడ్చుట నికామము దుర్గతు లెన్నొ తోఁచుటల్
సరిగఁ దలంచి వ్యాసముని సాధువచస్స్థితిభావ మంతయున్. 472

క. మనములఁ దలపోయుచుఁ జిం,తను బాసి తపోవనంబునన్ నియతిన్ వాం
ఛను దీర్చుకొనఁగ నెంచుచు, జనిరి తపం బొప్పఁజేయు సద్విధిఁ బూనన్. 473

క. వినిపించినాఁడ వనజా,క్షుని పుట్టుక యతఁడు పూన్కి క్షోణీస్థలిలో
నొనరించినకృత్యంబుల, మునివరులారా! మఱేమి మోదము మీకున్. 474

---

## నూటనాల్గవయధ్యాయము.

భగవదవతారదశక సంక్షేపవర్ణనము.

చ. అనియిటు లాపరాశరునియాత్మజుఁ డాడిన నాలకించి యా
మునివరు లిట్లుపల్కిరి ప్రమోదరసం బెడఁ బొంగుచుండ నో
యనఘ! త్రిలోకనాయకుని యద్భుతజన్మవిచేష్టితంబు రా
మునిచరితంబు దుర్లభము ముక్తిదమున్ వినినార మాదృతిన్. 475

ఉ. సారసనేత్రుసత్కథలఁ జాలఁగ వింటిమి గాని తృప్తి చే
కూరదు సుంతయే నిఁకను గోరెదుఁ బ్రీతి వినంగఁ గాన నో
కారుణికోత్తమా! మఱి జగత్పతిపుట్టుక లెల్లఁ జెప్పుమా
శ్రీరమణుం దలంచుచు విశృంఖలవృత్తిని విందు మిత్తఱిన్. 476

సీ. అమితతేజస్కుఁడౌ నావిష్ణుకథ లెల్ల సత్పురాణములందు సాధుమాని
పరికీర్తితములయి పరఁగుచుండును వాని వినిపింపుమా యని వేఁడి మఱియుఁ
బలికిరి సాధువుల్ పలుకంగ మును వింటి మాదివరాహమై యవనిఁ దెల్పె
నని తచ్చరిత మెల్ల నవ్విధు లెల్లను గర్మము గుణమును నిర్మలమగు
తే. భావము నభీష్ట మనలేని భవనిదాన
మును వచింపు తదాత్మక మనఁగ నెదియొ
మూర్తి యెద్దియొ దానికి మూలదేవ
త యన నెట్టిదొ తన్మహత్త్వ మది యెదియొ. 477

క. ఆయవతారంబున హరి, యేయే కార్యములఁ జేసె నిట యజ్ఞార్థం
బీయవనీసురవరులు, పాయక వినఁగోరువారు పరమమునీంద్రా. 478

క. కావున మహావరాహము, పావనచరితంబు లోకపటలసుఖదమౌ
నేవడువున నారాయణుఁ, డావారాహాంగ మూనె నవ్విధ మెల్లన్. 479

చ. అరిజనమర్దనుండయిన యాదివరాహతనూధరుండు శ్రీ
హరి నిజదంష్ట్రచే జలధియందు మునింగెడుభూమి నెట్లు తే
ల్చె రయముమీఱ కృత్యములఁ జేసెనొ వేనిని వానినిన్ మునీ
శ్వర! వచియింపుమా వినఁగ సంతస మయ్యెడుఁ గృష్ణుఁగాథలన్. 480

తే. ఆనుపూర్విగఁ గర్మము లామహాత్ము, నుద్భవము తత్ప్రకృతియును నొగి వచింపఁ
దగిన వవ్వానిఁ దెల్పి సంతసముఁ గూర్పు,మనిన వ్యాసమహర్షి యిట్లనియె బ్రీతి.

చ. అరుదగుప్రశ్నభార మిటు లాదృతి నాపయిఁ బెట్టినార లో
పరమమునీంద్రులార! కడు భారమె యైనను విష్ణుమూర్తి దౌ
చరితము శక్తికిం దగినచందమునన్ వచియింతు దాని నా
దరణమునన్ వినంగఁదగు ధన్యత మీ కమరెన్ గడుంగడున్. 482

క. వినిపింతు విష్ణుజననం, బును బాదము లొక్కవేయి ముఖములు దృష్టుల్
గన నొక్కవేయి యెవ్వని,కిని గల్గునొ యట్టివానిఁ గీర్తింతుఁ దగన్. 483

సీ. అవ్యయాత్ముని సహస్రాక్షుని దీవ్యత్సహస్రజిహ్వామకుటాంఘ్రిబాహు
శోభితు హవనంబు శుభసవనంబును దానయై తగునట్టివాని హవ్య
మును హోతయును నయి తనరారువానిని బాత్రపవిత్రస్రువములు సమిధ
లును వేదియును దీక్షయును స్రుక్కుసోమముముసలశూర్పంబులుప్రోక్షణియును

ఆ. దక్షిణాయనంబు దానరై తగువాని, సామగుఁడు సదస్యసదనములును
సదసు తానె యనఁగఁ జాలి యధ్వర్యుఁడు, తానె యగుచు ఖ్యాతిఁ దగినవాని.

వ. యూపము, చక్రము, దర్వియుఁ, జరువు, నులూఖలంబు, ప్రాగ్వంశము, యజ్ఞ
భూమియు, హోతయు, హ్రస్వము, నతిప్రమాణము, చరములు, స్థావరములు,
ప్రాయశ్చిత్తము, నర్ఘ్యము, స్థండిలము, దర్భలు, మంత్రయజ్ఞవహుం డగు
వహ్నియు, భాగము, భాగవహుండు, నగ్రాసియు, సోమభుజుండు నెవ్వండని
వేదవేత్తలు వచియింతురో, యట్టి శాశ్వతుని, బ్రభువును, శ్రీవత్సాంకుని,
శ్రీమహావిష్ణుని వినుతింతు. ఎవ్వని ప్రాదుర్భావము లసంఖ్యాకంబులు గతించెనో
యింకను రానున్నవో అట్టిమహాత్మునిగాథను దెలుపవలయు నని ప్రశ్నించితిరి.
ప్రాదుర్భావరూపంబై సర్వపాపహారంబై పరమశుభప్రదంబై యలరుతత్క
థను వివరించెద. తద్గతాంతరాత్ముఁడనై వాసుదేవుని మాహాత్మ్యమును దివ్య
గుణాన్వితమును, బవిత్రతమంబును వచియించెద నాలకింపుఁ డనిధ్యాన
నియతిఁ దాల్చి మరల వ్యాసమహర్షి యిట్లనియె 485

క. హరి వేయిదివ్యయుగములు, నిరుపమతేజంబు డాచి నిద్రంగని కా
ర్యరతిన్ మేల్కొను యుగములు, పరిపూర్ణములైనలోకపటలి సృజింపన్. 486

సీ. బ్రహ్మాయుఁ గపిలుండు పరమేశ్వరుఁడు దేవతలు వారినాయకుల్ దైవతమును
లక్ష్మి సప్తర్షులు నహిగణం బచ్చరమిన్నలు మహిమము మెఱయనొప్పు
నట్టి మహాత్ముఁడౌ నల్లసనత్కుమారుఁడు మనుప్రభృతులు గడఁగి సాయ
పడఁగఁ బురాణదేవుఁడు పురంబుల నెల్ల సృజియించె వైశ్వానరేంద్ర తేజ

తే. మలరుచుండఁగ నేమాన్యుఁ డర్ణవాంత
రమున నుండి చరంబచరం బనంగఁ
దనరు లోకంబు నశియింప దైత్యవిబుధ
సమితి లయమంద నురగరాక్షసులు పోవ. 487

క. తా నొక్కఁడుండె నయ్యెడ, దానవు లిర్వురు మదంబు దళుకొత్తఁగఁ బెం
పూనిన మధుకైటభు లన,గా నెగడినవారు ఘోరకలహముఁ గోరన్. 488

క. వారల కభీష్టవరములఁ, గోరిక మీఱంగ నిచ్చి కూల్చెన్ వారిన్
జేరిరి వారలు విష్ణుని, నీరీతిం గేళిసల్పె నెంతయు వేడ్కన్. 489

క. మును కమలనాభుఁ డంబుధి,వనముల శయనింప దేవవరులు మునివరుల్
జనియించిరి పుష్కరమున, వనజాక్షునివలన నదియుఁ బౌష్కరక మనన్. 490

చ. పరఁగు మురారిసంభవము ప్రాథమికం బదియౌ; సురర్షు లా
దరమున వేదసంతతుల దానవహంతృపరాక్రమంబులన్
నిరతము పాడుచుందు రతినిర్మలవాక్కుల నందునొప్పు సౌ

కరము శ్రుతిప్రకీర్తితము గావున నయ్యది యే ద్వితీయ మౌ. 491

తే. ఎందు హరి సూకరాకృతి నొంది వెలసె, నట్టిసంభవమే వరాహావతార
వినుతి గాంచెను దానఁ బృథ్విని సముద్ర,పరిగతంబును విపినసాగరయుతముగ

క. ఏకార్ణవజలమగ్నము, నేకార్ణవజలగతుఁ డయియే దంష్ట్రాగ్ర
ప్రాకటపదమున నెత్తెను, లోకంబుల హితముగోరి లోకాత్ముం డై. 493

క. ఆతఁడె సహస్రశీర్షుం, డాతండే లోకపతియు యజ్ఞవరాహం
బై తగ లోకోపకృతిం, జేతంబునఁ గోరి యెత్తె క్షితి జలధియుతిన్.  494

ఆ. ఇదె వరాహజన్మ మిద్దాని వినప నే, నారసింహ మగును ఘోరసింహ
శిరము మనుజతనువుఁ బొందినరూపంబుఁ, గాంచి యాహిరణ్యకశిపుఁ ద్రుంచె.

క. కృతయుగమున బలదర్పిత, దితిజన్ముఁ డొకండు మేటిదితిజన్ముల సం
తతియందుఁ బ్రథమగణ్యుఁడు, శతధృతి మది నిల్పి చేసె సత్తప మొకటన్.

ఆ. పదునొకండువేల పై నైదుశతములు, జపము సంతతంబు నుపవసించి
చేయఁ దొడఁగె వ్రతము సిద్ధింపవలెనన్న,వాంఛ మిగుల ఘోరభంగి నతఁడు.

ఆ. శమము దమము బ్రహ్మచర్యయు నొప్పారఁ
దపముచేయ బ్రహ్మ తా ముదంబు
నంది నియమమునకు నాదృతిఁ గని యంత
నాస్వయంభువును దదాశ్రమంబు. 498

చ. ఖరకరుతేజముం దెగడి కామగమై తగు వ్యోమయానమున్
గర మురుదార శ్వేతఖగకాండము లొప్పెడుదాని నెక్కి ని
ర్జర మరు దర్క రుద్ర వసు రాక్షస యక్ష పిశాచ సంఘ కి
న్నరులును సాగరంబులు క్షణంబులు దిగ్విదిశల్ ముహూర్తముల్. 499

క. తారలు గ్రహములు ఖేచర,వారంబులు దేవమానివర్యులు సిద్ధుల్
భూరమణర్షులు నచ్చర, లారయ గంధర్వముఖ్యు లందఱుఁ గొలువన్. 500

క. చరభూతాచరభూతా, త్కరములకున్ గురువు తానె కావున దయతోఁ
బరికించి యిట్లు పలికెన్, నిరుపమసద్వ్రతమునందు నిరతుఁడ వగుటన్. 501

క. నీయందుఁ బ్రీతిఁ గాంచితి,నోయనఘా! యీతపం బోహో యనఁదగి న
న్నే యెమరు వరముఁ గోరుము, నీయాత్మం దలఁచి దేన హితము లలరునో. 502

క. అనినన్ హిరణ్యకశిపుం, డను నోపరమేష్ఠి నిర్జరాసురగంధ
ర్వనికరయక్షోరగులున్, దనుజులు రాక్షసులు మునులు దర్పతపములన్. 503

చ. అనిమొనఁగాని యేవిషయమందునుగాని నసున్ శరాస్త్రశా
పనియతి బాధఁ గూర్పఁగను బొల్పడకుండ వరంబు నీయవే
మునులు సురాభిమానమున మోములఁ గ్రోధరసంబు పొంగ న

న్గనుఁగొని శాప మీయఁగనుగాంక్షలఁ బూనుదు రట్లు కావునన్. 504

క. వర మిమ్ము నాకు నెవ్విధి, నరసిన బాధయె చెలంగ కాత్మసుఖ మదే
వరుసను గల్గునొ యట్టులె, వర మిమ్మా శస్త్రములను బహుళాస్త్రములన్. 505

చ. తరువులఁ బర్వతంబులను దారుణశుష్కపదార్థయుక్తి భీ
కరమగు నార్ద్రవస్తుతతిఁ గాఱియ పెట్టక యుండఁ గా వర
స్మరుదుగ నిమ్ము క్రిందఁ బయి నారయ నేవిధిఁగాని మృత్యు వా
తురపడకుండఁగా వరము తోరపు నెమ్మి నొసంగుమా ప్రభూ. 506

క. పరిజనవాహనములతో, దురమున నే బాధ గనక ధూర్తుల నెల్లన్
బొరిపుచ్చుశక్తి గల్గఁగ, వర మిమ్మా; నన్ను నెవఁడు బవరమునందున్. 507

తే. చంపఁ దలఁచునొ వాని నేఁ జంపవలయు
ననెడు కోరికకలదు నాయాత్మయందు,
మృత్యు వొక్కరూపంబున నెసఁగవలయు
నట్టికాలము రాఁదగు నట్టు లిమ్ము. 508

సీ. *అర్కసోములు వాయు వగ్నియు సలిలంబు నంతరిక్షం బల్లె యాకసంబు
నేనె కావలయును నేనె కామము క్రోధ మప్పతి వాసవ యములు ధనద
యక్ష కింపురుషనాయకులు ధనాఢ్యతముఁడును నేనె యగునట్లు ఘనకృప వర
మిమ్ము; నావిని బ్రహ్మ యిట్లు పల్కెను దానవాధిపా వరము లీయవి తలంప

తే. నద్భుతంబులు దివ్యంబులై చెలంగు, వీని నిచ్చితిఁ గామాళి మానసమున
నెట్లు కోరిన నట్టులే యివి యొసంగు, సంశయము లేదు నీ కని శతధృతియును.

చ. వరము లొసంగి స్వీయపరివారము గొల్వఁగఁ బోయె స్వీయమా
పరమనివాసముం గనఁగ భవ్యతమంబయి యద్ది చూడనై
విరజ యనంగ నొప్పు నదివింతగఁ జెంతను బాఱ బ్రహ్మమా
ని రమణులెల్లఁ గొల్వ శ్రుతినిర్మలనాదము లొప్పఁగాఁ దగున్. 510

ఉ. ఆవల దేవతల్ భుజగు లాదిగనున్న యమర్త్యభేదముల్
పావనమానులం గలిసి బ్రహ్మ యొసంగిన యవ్వరంబులన్
వే విని బ్రహ్మఁ జూడఁజని విహ్వలచిత్తము లొప్పఁ బల్కి రో
భావవిదుత్తమా! దనుజవర్యుఁడు మీవర రాజిచేఁ గడున్. 511

చ. మదమున నొం డెఱుంగకయె మమ్మొగి బాధల నందఁజేయు నె
మ్మది గనఁజాల మింకఁ గృప మానససీమఁ జెలంగఁ దద్వధం
బొదవునుపాయ మారయు మదొప్పును జేయఁగ, లేకయున్న ఘో
రదనుజు బాధ యోర్వఁగను రాదు మహాత్మక భూతనాయకా! 512

*సలిలం చాంతరిక్షం చ ఆకాశం చైవ సర్వశః = అని మూలము.

తే. సృష్టికర్తవు నీవు నీచిత్తమందుఁ
దలఁచుకార్యంబు ఫలియించుఁ దప్ప దద్ది
హవ్యకవ్యములకు నీవ యాదికర్త
వౌట నవి యెట్లు నిలుచునో యరయుము మది. 513

చ. అనవిని బ్రహ్మ లోకహితమై తగువారల వాక్యజాలముల్
విని సకలప్రపంచముల వేడుక మీఱఁగ సృష్టిచేయునే
ర్పునఁ దగువాఁడుగాన సురపుంగవులం గని యిట్లు పల్కె నా
దనుజుఁడు సత్తపగఫలముఁ దప్పక తాను గనంగ నోఁ జుఁడీ. 514

తే. తపమునకుఁ బొందఁ దగినయుత్తమఫలంబు
గుడిచి యవ్వల దనుజుఁడు కూలుఁ జక్రి
చేతఁ దప్పక యన విని సిద్ధమౌని
సురులు పంకజసంభవు స్తుతులఁ దనిపి. 515

క. అరిగిరి తమతమగృహముల, కురుతరపీడాకరమయి యొప్పెడుకాలం
బరయంగ రాఁ గల దనుచుఁ, బొరిఁబొరి భీతిల్లి ముక్తిఁ బొందుదు మెట్లో.

క. అనుచుం దృప్తిం గాంచుచు, జని రంత హిరణ్యకశిపుసంగతిఁ గని యా
దనుజులు భీకరమూర్తుల, జనులను బాధించి రొక్కసరణి నిరతమున్. 517

మ. వరదానంబున దర్పమొప్ప దనుజవ్రాతంబులం గూడి యా
శరవర్యుండు పవిత్రమౌనిపనివాసంబుల్ తగం జొచ్చి భీ
కరశబ్దంబుల శంసితవ్రతుల నిక్కంబె వచింపంగ ఘు
ద్విరహంబుం గన నేర్చి దాంతులయి సంపీతాశులై మించుచున్. 518

ఆ. ధర్మనిరతులగుచుఁ దనరునమ్మౌనుల, బెదఱఁ జేసె;స్వర్గసదనులైన
సురల నోడఁగొట్టి సురపతిత్వముఁ గొని, యందెయుండె విక్రమాధికుఁడయి

క. వరదానగర్వితుండయి, సురవైరి చరించి యెల్లచోటుల దనుజో
త్కరముల యజ్ఞార్హంబుల, సురల నయజ్ఞార్హులుగను శూరతఁ జేసెన్. 520

సీ. ఆదిత్యవసుసిద్ధు లనిలవిశ్వేదేవు లాదియౌ దివిజు లత్యంతభీతు
లయి మహాబలు విష్ణు నాశ్రయించిరి రక్షకుఁడవు నీవే యని తడవుసేయఁ
జనదని సదమలజ్ఞానరూపుఁడ వని యజ్ఞంబు నీవని యాదిమూర్తి
వని భూతమెల్ల భవ్యంబు భవిష్యంబు నెల్లనీవే యని యెల్లసుజన

తే. వంద్యుఁడవు లోకపతివి దేవతలకెల్ల
దేవుఁడవు సర్వరక్షక స్థిరపరాక్ర
ముఁడవు నీవే యటంచును మ్రొక్కి నిలిచి
మఱియు నిట్లని పల్కి రమర్త్యు లపుడు. 521

క. సురవర! హిరణ్యకశిపుని, గురుభయముననుండి మమ్ముఁ గుతుకము మీఱన్
బరిరక్షింపుము నీవే, శరణంబవు దేశికుఁడవు. సత్ప్రభుఁడవు సూ. 522

క పరమేష్ఠి వనఁగ నీవే, పరమేష్ఠిప్రభృతులకును బర మవు నీవే
సరసిజదళలోచన! యో, పరజనపక్షప్రహర్త పరమకృపాబ్ధీ. 523

క. దనుజుని క్షయముం గోరుచు, నిను దిక్కని నమ్మినాము నెమ్మిని మనుఁ గా
వను జను నా విని సంతసమున హరి యిట్లనుచుఁ బల్కెఁ బొగు లడఁగంగన్.

చ. సురవరులార! భీతిఁగని చొక్కి వడంకకుఁడీ భయంబునుం
ద్వరగ నడంతు మీ కభయదానము చేసెద సర్గముం దగన్
మరలను బొందఁగాఁ గలరు మాటలు పెక్కఁక నేల? దైత్యునిన్
వరబలగర్వితున్ దునుము వాఁడను భూరిపరాక్రమంబునన్. 525

చ. అని విబుధార్తి వాపి చనుఁ డంచును వారలఁ బంపి చక్రి యా
దనుజునిచెంత కేగె గురుదర్పము పొంగఁగ మానుషార్ధమా
తనువు మృగేంద్రమూర్ధమును దాలిచి యప్డు నృసింహమూర్తియుం
గనఁబడఁ జేతఁ జేయినిడి గాఢరవంబును బుట్టఁజేయుచున్. 726

సీ. వృష్టికాలికమేఘ విపులదీప్తులు తగ వారిదధ్వని సమధ్వని చెలంగ
జీమూతవేగంబు చెలఁగ జీమూత మట్లావరించెడుశక్తి యలరుచుండ
దృప్తశార్దూలంబు తెఱఁగున దర్పంబు కనఁబడ నతిబలుఁ గడు దురాత్ము
నాహిరణ్యకశిపు నతిదృప్త దైతేయగుణయుక్తునిం జేరి గోరి హస్త

ఆ. మునను తిగిచి చంపె మునులార! నరసింహ, చరిత మిదియె యవలి చక్రిచరిత
మాలకింపుఁ డంత హరి వామనాకృతిఁ, దాల్చె దైత్యవధముఁ దానుగోరి.527

చ బలవంతుం డగు దైత్యనాయకుఁడు దోర్వ్యాపారపారీణతల్
చెలఁగన్ స్వర్గము నాక్రమించి బలి సంసిద్ధక్రియాలోలుఁడై
కలుషధ్వాంతదివాకరాభ మఖముం గావింపఁగాఁ బూన నా
జలజాక్షుండు త్రివిక్రమంబులను రక్షఃకాంతులఁ జెండుచున్. 528

వ. పరాక్రమించె. అత్తఱి విప్రచిత్తి, శివ, శంకురయ, శంక్వయశ్శిరోఽశ్వశిరో, హయగ్రీవ, వేగవ, త్కేతుమంతులు, నుగ్రో, గ్రవ్యగ్ర, పుష్కర, పుష్కలా, శ్వపతి, ప్రహ్లా, దాశ్వపతి, కుంభ, సంహ్రాద,గమనప్రియా,నుహ్లాద, హరిహయ, వారాహ, సంహార, శరభ, శలభ, కుపథ, క్రోధన, క్రథ, బృహత్కీర్తి,మహా జిహ్వా, శంకుకర్ణ, మహాస్తన, దీప్తజిహ్వార్కనయన, మృగపాద, మృగప్రియ, వాయు,గరిష్ఠ, నముచి, శంబర, వికర,చంద్రహంతృ,క్రోధహంతృ, క్రోధవర్ధన, కాలక, కాలకోప, వృత్ర, క్రోధ, విరోచన, గరిష్ఠ, వరిష్ఠ, ప్రలంబ, నరకేంద్ర తాప, నవాతపి, కేతుమ, ద్బలదర్పి, తాసిలోమ, పులోమ, బాష్కల, ప్రమద

మదస్వామిశ్రకాలవదన కరాళ కేశినామకులు, నేకాక్ష చంద్రమో రాహు
సంహ్రాద శబరస్వను లనురక్షోవీరులు, శతఘ్నీచక్రముసలాయుధంబులందాల్చి
యు నశ్వయంత్రాయుధోపేతు లయ్యు, బిండివాలంబులం బూనియు, శూలో
లూఖంబులంబూనియుఁ, బరశ్వధంబుల ధరించియుఁ, బాశముద్గరంబులఁ గరం
బులంబట్టియుఁ, బరిఘుమహాశిలాప్రహారణంబులు చేయ నాయత్తులయియు మఱి
యు ననేకాయుధపాణులై భగవంతుం దలఁపడిరి. కూర్మ కుక్కుటశశోలూక
ఖరోష్ట్రవరాహ మార్జారశిఖి వక్త్రంబులు గలిగియు, మహావక్త్రంబులు గలిగి
యును, నక్రమేషగోజావిమహిషగోధాసల్లకిక్రోష్ట్వాఖు దర్దుర వృక మకర
క్రౌంచగరుడ వదనంబులు గలిగియు, గజేంద్రచర్మవసనంబులు గలిగియుఁ గృష్ణా
జినాంబరంబు గలిగియుఁ, జీరసంవృతగాత్రంబులు గలిగియు, నీలవసనంబుల
ధరించియుఁ గిరీటకుండలోష్ణీషధారులయియు, లంబశిఖులు, కంబుగ్రీవులు,
నానావేషధరులు, నానామాల్యానులేపనులు నయియుఁ దగు రాక్షసవీరులు
తమతమయాయుధంబులం బూని జగంబుల నాక్రమించు భగవంతుం జుట్టు
ముట్టి రంత. 529

చ. హరియుఁ ద్రివిక్రమాకృతిని నాతతహస్తతలాంఘ్రిసంహతిన్
సురరిపులన్ మథించి కనఁ జోద్యము భీమతరంబుగాఁ గళే
బరమును బెంచి కైకొనియె స్వర్గమహత్తర రాజ్య మెల్ల నా
వరుసను బెంచు దేహమున భానుశశాంకు లురస్సమంబుగా. 530

చ. కనఁబడి రవ్వలం బెరుగఁగాఁ గనుపట్టిరి నాభితుల్యులై
వనజదళాక్షుఁ డింకఁ దన వర్ష్మముఁ బెంచిన జానుదేశమం
దు నిలిచినట్టు లెల్లరకుఁ దోఁచిరి; శ్రీహరివిక్రమంబు నే
మని కొనియాడువాఁడను మహత్తర మయ్యది దివ్యమై తగున్. 531

చ. దనుజుల నిట్లునొంచి వసుధాతల మెల్లను నావరించి మా
ర్కొనిన మహాసురావళిని గూలఁగ నొయ్యన విక్రమించి మే
దిని సురనాథుఁ డేలునటు తెంపునఁ జేసి స్వకీయరూపమున్
గనఁబడకుండఁ జేసె నిదె కంజవిలోచను వామనత్వదేమహా. 532

క ఇదె వామనచరితము శ్రీసదనుని ప్రాదుర్భవంబు సద్ద్విజవినుతం
బు దగంజెప్పితి భక్తులు, ముదమారఁగ విష్ణుయశముం గీర్తింపన్. 533

క. వినియున్నవాఁడ; నింకను, మునివరులారా వినుండు మురహరుఁ డవలన్
జనియించె భూతలంబునఁ, గనఁ దత్తాత్రేయుఁ డనఁగఁ గమ్రాకృతిమై. 534

క. క్షమ యన నిట్లుండందగు, క్షమయం దని చూపె తీక్ష్ణకల్పము లగు వే
దములను బ్రక్రియలను యజ్ఞములన్ గడు నిల్పెఁ దనదుశక్తి నసముండై.

ఆ. నాల్గువర్ణములును నష్టధర్మంబుల, నుండ వాని నిల్పి నొప్పునట్టు
లతఁడు పుట్టఁ బూను నష్టు డధర్మంబు, వృద్ధినొందియుండె వేయుగతుల. 536

క. ఋతము నశించె ననృత మొప్పు తగన్ విహరించుచుండె భూమిఁ బ్రజాసం
తతియందు ధర్మపద్ధతి, చ్యుతిగాంచియె యుండె మునులు శోషిల్లి రొగిన్. 537

చ. మతివిభవంబు పేర్మి శ్రుతిమండల మెప్పటియట్ల ప్రక్రియా
ప్రతతుల యజ్ఞసంతతుల భాసిలునట్టు లొనర్చి వర్ణసం
తతి మును పొప్పునట్లుగను ధర్మయుతిం గను నట్లుగాఁగ నే
ర్పుతగ నొనర్చె హైహయవిభుం డగునాకృతవీర్యనందనున్. 538

క. వరదానంబునఁ బ్రోచెను; మరలం దత్కార్తవీర్యమహీంద్రుం గని నీ
కరయుగము మదారాధన,పరతంత్రం బయ్యెఁ గాన భవ్యమనీషా. 539

క. శతదశకంబుగ నొప్పును, క్షితి సామ్యము లేక నీదుకీర్తి వెలయు నే
క్షితియుం గల్గదు నీ కని, కృతకృత్యుని జేసె నమ్మునీంద్రుఁడు దయతో. 540

చ. ధరణిని ద్వీపవర్యసముదాయముతోడను ధర్మరీతిఁగా
నరవర! ప్రోవఁగాఁ గలవు నాదయఁ గాంచుట శత్రురాజి సం
గరముల నిన్నుఁ జూడఁగను గాని దురం బొనరింపఁగాని యే
వరుస నశక్తులౌదురు ప్రభావము నీయది వర్ణనీయమా. 541

క. అని దత్తాత్రేయుఁడు చె,ప్పెను రాజుం జూచి యిదియె పీతాంబరుసం
జననంబు చిత్రతరమా, వినుఁ డవ్వలి హరిజననము విశ్రుతతరమున్. 542

ఆ. జామదగ్న్యుఁ డనఁగ జనియించె నామహా,మహుఁడు కార్తవీర్య మహితవీర్యుఁ
గరసహస్రయుతుని ఖండించె సేనాస,మన్వితునిగ సంగరాంగణమున. 543

చ. అరదమునందునున్న నృపు నాయతబాహువుఁ గాంచి రాముఁడు
ర్వరఁ బడఁద్రోసి పౌరుషముభాసిల నేమిర మాని నంటి సం
గరమున నీదుశక్తి యనఁగా నరిభేద్యము గాకయుండె ని
త్తరుణమునందు మానెఁగద దర్ప మడంగెఁగదా యటం చనిన్. 544

క. ఘనఘోష మనఁగ నార్చెడు, జననాయకు దీర్ఘబాహుసముదాయముఁ జెం
డెను బరశుధార జ్ఞాతులు, కనుచుండిరి చేయ నించుకయుఁ దోఁపమిచేన్.

చ. జనపతికోటులం దనరి క్ష్మాధరవర్యతతిం జెలంగు మే
దినిపయి క్షత్రియప్రతతి ద్రిమ్మరకుండఁగ నిర్వవొక్కమా
అనితరవిక్రమంబున మహత్తరశక్తిఁ జరించి చంపె నే
మనుదు మహర్షులార! రస యత్తఱి భూపవిహీనయై తగెన్. 546

మ. ధరణిన్ క్షత్రియహీనయై వెలయ దోర్దర్పంబునం జేసి కీ
ర్తిరమం బొల్చి సమస్తపాపగిరులం దీవ్రంబుగాఁ గూల్చ శ్రీ

హరిఁ బూజించెను వాజిమేధమున నాయజ్ఞంబునన్ రాముఁ డీ
ధరణిన్ దక్షిణగాఁగఁ గశ్యపునకుం దా నిచ్చె సంప్రీతుఁ డై. 547

సీ. వాజిమేధమున నాభార్గవరాముండు వారణంబుల సాధువాహనముల
స్యందనవరములఁ జామీకరౌఘంబు గోవుల భూషితకుంజరేంద్ర
ముల నెల్లరకు నిచ్చె లలితయశం బొప్ప నిప్పటికిని రాముఁ డెల్లలోక
ముల హితంబునె కోరి భూరితపంబును బొనరించుచున్నాఁడు భూధ్రవర్య

ఆ. మగు మహేంద్రమందు నారాముఁ డవ్యయుఁడయిన విష్ణునంశ మగును నిదియె
జామదగ్న్యజన్మచరితంబు పావనతమము లోకపాపతతి నడంచు. 548

— శ్రీరామచరిత్రము. —

క. ఇరువదినాల్గవ యుగమున, హరి విశ్వామిత్రుఁగూడి యైక్ష్వాకుండై
పరఁగెడు దశరథుఁడను భూ,వరునకుఁ బుత్త్రుం డనంగ భాసిల్లె ధరన్. 549

క. తనయాకృతి నాల్గుగ నే, యొనరిచి శ్రీహరియె తేజ ముజ్జ్వలమయి భా
నునిమించ రాముఁ డనఁగా, ఘనయశముం గాంచె మహానికాండములారా! 550

చ. జగమును గావ రాక్షసులఁ జంపఁగ ధర్మము నిల్పఁ గీర్తిపెం
పుగనఁగ జన్మమెత్తె నృపపుంగవుగా మనుజేంద్రుఁగాఁగ భూ
తగణహితాత్ముగాఁగ మునితల్లజు లెల్ల నుతింతు రాతనిన్
దగ నతఁడే సమస్తహితధర్మవిదుత్తముఁ డై వనంబులన్. 551

క. పదునాల్గు వత్సరంబులు, గొదువ పడకయుండ నిల్చెఁ గూర్మిసహాయుఁడై
ముదమారఁ గొల్చు లక్ష్మణుఁడు దనకు సాయముగ విహితుఁడుగ నుండంగన్.

క. భూతహితరతుండై తప, మాతతముగఁ జేసె వనిని హాయనములు పె
క్కౌ-తనిభార్యయు సీతా, ఖ్యాతిం గను శ్రీపరాంబ యగు మునులారా! 553

క. మును పే జనించి శ్రీరా,ముని రాకను గోరుచుండె భూపుత్త్రి యనం
గను బేరుఁగాంచి లక్ష్మియె, దనుజులనాశంబు గోరి ధాత్రిన్ వెలసెన్. 554

క. పతి ననుసరించి యుండెను, దితిజులు దండకవనంబుఁ దెంపున మనుజ
ప్రతతివిహీనము చేయని,యతిఁ బూనిరి వార్తదాని నారఘుపతియున్. 555

తే. విని జనస్థానముననుండి విమతహరణ,నియతిఁ బూని చెలంగెను నిర్జరవరు
లాతనిం బులికొల్పి రయ్యాతుధాన,పతి దశాననుఁ డారఘుపతి కపకృతి. 556

సీ. ఒనరింప భూపుత్త్రి నొయ్యనఁ గొనిపోయెఁ దత్పద మరయుచు దైవతములు
యక్షరాక్షసులు మహాహులు సంగరమందు నిర్జింపశక్యంబు గామి
వెఱగంది యుండి రా వీరు రాక్షసకోటిపరివృతు నంజనపటలదేహు
లోకత్రయమునకు నేకరణిని భీతి నిచ్చుపాపాత్ముని నెల్లదనుజ

తే. వంశముల కధినాథు రావణునిఁ గ్రూరు, దుర్జయుని దృప్తు భూరిశార్దూలవిక్ర
మునిని దుర్ధరు దుర్నిరీక్ష్యుని విరించి, వరవితతిగర్వితుని గూల్చె వసుధయలర.

క. ఆతనిమంత్రులు సేనా, వ్రాతం బాత్మజులు బంధువర్యులు రామ
క్ష్మాతలపతిచే హతులయి, శాతఱి రావణునిదేహ మతులాభ్రముగన్. 558

క. కనఁబడియె వానిబల మా, ర్తిని గూర్చెడు నద్దియయ్యు ధీరుండగు రా
మునిశక్తిఁ దూలె శ్రీరా, మునితేజ మవార్య మెయగు మునివరులారా. 559

క. రాముఁడు సుగ్రీవునికై, భీమబలుండైన వాలి వెసఁ గూల్చెను ద
ద్భూమికి సుగ్రీవుఁడె విభుఁ, డై మనిచెన్; మఱియు లవణుఁ డనుదనుజుండిలన్.

సీ. దర్పసమగ్రుఁడై ధరణిఁ బీడింపఁగ నమ్మధుపుత్త్రుని నని వధించె
మధువనంబునయందు మహీపతివరము వ మత్తుఁడై యుండు నున్మత్తుభంగి
నాలవణాసురుం డట్టివానిం జంపె; రఘురాముఁ డిఁక నధ్వరములఁ జెఱచు
మునిబాధకుల సుబాహునిని మారీచుని బలయుతులను జంపె బవరమందు

ఆ. యుద్ధశౌండుఁ డగుచు నొప్పు నా రాముచే, నని విరాధదనుజుఁ డాకబంధుఁ
డాదియైన క్రూరు లల్లె చంపంబడి, రో మునీంద్రులార రాముఁడె హరి. 561

వ. శాపమోహితులగు గంధర్వుల నిర్వైరం జంపె శ్రీరాముని బాణంబులు హుతా
శన భాస్కరతటిద్గణప్రకాశంబులు. ప్రతప్తజాంబూనద చిత్రపుంఖములు, మ
హేంద్రవజ్రాశనితుల్యసారములు నగు వానికింబలిగాని రాక్షసుండు కలఁడే.
విశ్వామిత్రుఁ డా రామునకు శస్త్రాస్త్రంబుల నొసంగె వానిచే దుర్ధర్షులగు దేవ
శత్రుల నా రాముండు వధించె మఱియును. 562

చ. జనకునియధ్వరంబు విధిసన్నుతమై యలరారుచుండఁ ద
మ్ముని గుశికాన్వవాయమునిమూర్ధను గూడియె పోయి శాంకరం
బనఁ జనుచాపమున్ విఱిచె హర్షము పొంగఁగ లీలవోలె ని
ప్పను లొనరించి మానిజనభవ్యసురద్రుమమై చెలంగుచున్. 563

క. దశఘోటకమేధంబులు, విశదవిధిం జేసి లోకవీరుం డగుచున్
యశమెల్ల భూమినిండఁగ, దశరథతనయుం డొనర్చి ధరణిం బ్రోచెన్. 564

సీ. అశుభవాక్కును బల్కఁ డా రామచంద్రుఁడు సత్యపరాక్రమశాలి యగుచు
ధరణిఁ గావఁగ మరుత్తతి యనాకులముగ వీవంగసాగె నే వేళయందుఁ
బరధనాపహరణపటుతర పాటచ్చరులు కనఁబడకుండి రిల నదెందు
భర్తృవిహీనలౌ ప్రమదలు కనరాకయుండి రనర్థము లొప్పకుండె

తే. నెల్లకార్యంబులును శుభ ముల్లసిల్ల, సాగుచుండెను శ్రీరామచంద్రుఁ డవనిఁ
బాలనము చేయునప్పుడు ప్రాణితతికి, ననిలజలవహ్నిభయము లేదరయ నెపుడు.

క. బాలకులకు వృద్ధులు పితృ, జాలము తృప్తింగనంగ నల్పెడుక్రియ లే

వేళను జేయుదు రామునికి, కాలంబున ధర్మవృత్తి కల్గుటకతనన్. 566

క. నరపతులు భూసురహితా, చరణులు క్షత్రియహితాత్మచర్యులు వైశ్యుల్
చరణజులు త్రివర్ణహితా, చరణపరుల్ గర్వరహితసద్వృత్తు లటన్. 567

చ. తరుణులు భర్తృ నానతిని దాఁటరు సుంతయు భర్తలున్ స్వకీ
యరమణులన్ బ్రియాచరణహారితరోక్తులఁ దేల్చుచుండ్రు భా
స్కరకులరత్న మూర్విఁ జిరకాలము ప్రోవఁగ ధర్మరీతి ని
వ్వరుసఁ బ్రజాతతుల్ చెలఁగి భద్రములం గనుచుండె నెంతయున్. 568

క. చోరులు గనరా కుండిరి, శ్రీరాముని కాలమందు శ్రీవర్ధిల్లెన్
ధారుణి భాగము దాంతం, బై రాజిలె ధర్మవృత్తి నప్పు డుండె లలిన్. 569

సీ. రాముఁ డొక్కఁడె ధరారమణుండు రాముఁడే పాలింపఁదగువాఁడు పరమధర్మ
పద్ధతి నొకవేయి వత్సరంబులయాయు వందఱకుం గల్గె నాత్మజన్మ
లధికసంఖ్యాకులై యన్వయవృద్ధిని జేయుచుండిరి రోగ మేయెడలను
బ్రాణుల బాధింపఁ బాలుపడక యుండె సురలు మానీశ్వరుల్ నరులు గూడి

తే. యుండి రారాముఁ డిల నేలుచుండు నపుడు
గాథ నొకదాని వచియింత్రు కడఁగి సత్పు
రాణవిదులైన సుజనులు; రామునందు
సన్నిబద్ధతత్త్వార్థులై సకలజనులు. 570

క. మతిమంతుఁడు గురుమహిమా, న్వితుఁడు వయస్స్ఫురితుఁ డరుణనేత్రుఁడు మిగులన్
మితభాషణుండు సురుచిర, శతపత్త్రవిరోధిబింబసమవక్త్రుండున్. 571

సీ. ఆజానుబాహువు హరివరస్కంధుఁడు సుముఖుండు గురుభుజశోభితుండు
దశసహస్రాబ్దముల్ ధరణిఁ బాలించెను రామచంద్రుఁడు ధర్మభూమిగాఁగఁ
బుగ్యజుస్సామైకరీతులఁ బఠియించు నిస్వనములు చాపనిస్వనములు
విరతిఁ బొందక ధాత్రి వెలసె రాష్ట్రంబున నీయుఁడు భుజియింపుఁ డీయెడలను

ఆ. ననుచు జనులుపలుకు నారవంబులు గల్గి, యుండె రామచంద్రుఁ డురుబలాఢ్యుఁ
డమలగుణపయోధి యధికప్రకాశుండు, స్వీయతేజమునను చెలఁగుచుండు. 572

క. శీతరుచిన్ భాస్కరుని ర, దేతఱినే మించుచుండు నిద్ధప్రభలన్
ఖ్యాతిన్ సమాప్తదక్షిణ, లై తగఁ గ్రతుశతములను సురావళిఁ గొల్చెన్.

క. పురవరమైన యయోధ్యను, బరిత్యజించియె దివంబుఁ బ్రాపించెను దా
శరథి మహాబలుఁ డిదియే, పరమాత్మునిచరిత మనుచుఁ బలికి మఱియునున్.

క. హరి యిక్ష్వాకుకులోద్భవుఁ, డురుతరబలశాలి దానవోత్తము దశకం
ధరుని సబాంధవుఁ జంపియె, యరిగెన్ వైకుంఠమునకు నాత్మవసతికిన్. 575

శ్రీకృష్ణచరిత్ర సంగ్రహము.

క. వినుఁ డింకొక కేశవుదౌ, జననము విఖ్యాతి నొందఁ జాలినదానిన్

వినిపింతు మాధురం బనఁ, జనునది లోకార్తిఁ బాప సాధులఁ బ్రోవన్. 576

సీ. ఏయవతారమం దేచినవిక్రమమున శాల్వుఁ జైద్యుఁ గంసుని ద్వివిదుని
నాయరిష్టుని వృషభాఖ్యుని గేశిని బూతనయనఁ జను భూరిభయద
రాక్షసి నా ఫణిరాజంబుఁ గువలయాపీడగజంబును భీతినించు
చాణూరు ముష్టికు సాధుబాధకులైన రక్షస్సులను శక్తి మ్రందఁ జేసె

తే. నద్భుతపరాక్రముండయి యలరుబాణు, వేయిబాహువులం ద్రుంచె విక్రమాఢ్యు
నరకు యవనుని గూల్చె భూనాథరత్న, హారకుల దుష్టభూపుల నడఁచెఁ గడఁక.

క. ఇదె లోకహితార్థము హరి, యుదయించిన దివ్యగాథ యొప్పును ఘనమై
పొదలెడు వేడుకఁ గల్కి య, నఁ దగిననామమునఁ బుట్టె నారాయణుఁడే. 578

తే. శంభళగ్రామ వాసియై క్షమను మించు, విష్ణుయశుఁడను వానికి విష్ణుమూర్తి
సకలలోకహితార్థమై సంభవించెఁ, దనదు సద్యశ మెల్లెడఁ దనరఁ జేయ. 579

చ. ఇవియును వీనికంటె గణియింపఁగ నొప్పెడు నవ్వియున్ మహా
దివిజసమీహితంబులగు దేవవిభూత్తమజన్మముల్ పురా
ణవరములందు బ్రహ్మమునినాథులు పేర్కొన నొప్పుచుండు; శ్రీ
ధవు జననంబులం బొగడఁ దా రమరుల్ వెఱఁగందుచుండ్రుగా. 580

క. హరిజననము దెల్పెడు సత్పురాణ మది యెందు వేదపూగనుతము చె
ల్వారునొ యయ్యది పుణ్యద, మై రాజిలుచుండు నో మహామునులారా. 581

క. వినుతింపంగాఁ దగి లోకనికాయము నేలుచున్న కాంచనమయచే
లుని కీర్తనంబునను దజ్జనకీర్తనమునను బితృవిసరము తమి గనున్. 582

సీ. శ్రీమహావిష్ణువు క్షితి జనించినకథఁ గరములు మోడ్చి యేనరుఁడు వినునొ
యోగీశ్వరునిదగు యోగమాయలు పరికీర్తించునో వారు కీర్తిఁ గాంత్రు
సర్వపాపంబులు సమయు సమృద్ధియు భోగభాగ్యంబులు పొదలుచుండు
భగవత్ప్రసాదంబు తగ జవంబునఁ గల్గు మునులార! యమితతేజుని గుణాను

ఆ. కీర్తనంబు నేను గీర్తింప వింటిరి, గాథ లివ్వి పాపగణము నడఁచు
సకలవాంఛితముల సమకూర్చు నిఁక నేమి, వినఁగఁ గోరువారొ వేగ చెప్పుఁడ.

---

## నూటయైదవయధ్యాయము.

### నరకానుభవప్రకారము.

తే. పుణ్యధర్మామృతమునకు భూరితృప్తి, గనఁగఁ జాలము మఱియును మునివరేణ్య
త్వన్ముఖామలకీర్తితవాసుదేవ, గాథలన్ వినఁ గుతుకంబు గలుగు మాకు. 584

క. భూతములకుఁ గల కర్మవ్రాతంబుల పుట్టుకయును బ్రలయము గతిసం
జాతవిశేషంబులు నీవే తగఁ దవు దెలిసికొనఁగ నీభూస్థలిలోన్. 585

చ. వినఁబడుఁ బ్రేతలోకగతి విశ్రుతమార్గము దుర్గమం బటం
చును మఱిదుఃఖసంతతులఁ జోద్యముగాఁ గలిగించునంచుఁ గ్లే
శనికరదాయకం బనుచు సన్మునివర్య! యెఱుంగు దీవు కా
వున నినుఁ బ్రశ్న చేయుదుము భూరిదయన్ వచియింపు మీతఱిన్. 586

క. నరు లెట్లు నిరుపమము దు,స్తరమును నౌతత్పథమునఁ జనజాలుదురో
పరమమునీ! తన్మార్గము, పరిమితి నెఱిఁగింపవయ్య పరమకృపాళూ. 587

ఆ. సర్వవిదుఁడ వీవు జను లెట్లు నరకదుః,ఖములయనుభవంబు గనకయుండఁ
గలరొ? దానధర్మముల వేనిఁ జేసిన, నియమ మెద్ధిపూన నిర్మలగతి. 588

క. దొరకునొ వచియింపుము మఱి, నరయమలోకంబులకుఁ గనంబడునో యం
తర మెంతయో? మనుష్యులు, సురలోకము యామ్యపదము జొర నేవిధియో.

క. సురపురస్థానము లెన్నియొ, నరకస్థానంబు లెన్ని నానావిధపు
ణ్యరతిం బొల్చినవా రె,క్కరణిన్ సురపురికి నేగఁ గలరో చెప్పుమా. 590

ఆ. పాపగతుల మఱఁగు బాలిశుల్ నరకాళి, కెట్లు పోవువారొ యెట్టిరూప
మేప్రమాణ మల్లె యెట్టివర్ణము వారి, కమరు నిర్వ్వరకును నంతమందు. 591

క. అంతకలోకమ్మునకుం, బంతము మీఱంగ నీడ్వఁబడు జీవులకున్
సంతసము లేనితఱి నెటు, లింతయుఁ గన్పట్టు మాకు నెఱిఁగింపు మనన్. 592

క. విని వ్యాసమౌని యిట్లను, మునివరులారా వినుండు మును కొను వేడ్కం
గొని యీసంసృతిచక్రం, బనునది యజరంబు స్థైర్య మనునది లేమిన్. 593

క. సురయమమార్గంబు లవే, వరుసం గన్పట్టునొక్కొ వానివిధంబున్
మరణాదిగ సర్వంబు వి,వరింతు నొక్కింతయైన వదలక మీకున్. 594

తే. మార్గము తెఱంగు మీరు నన్ దుర్గమ మని
దేని నడిగితిరో దానితెఱఁగు మీకు
వివరముగఁ జెప్పువాఁడను వినుఁడు యమమ
నుష్యలోకాంతరమితమును దగ నిపుడు. 595

తే. అద్ది యెనుబదియాఱువే లైనయోజ
నములయంతయె యంతర మమర వెలయు
మార్గమం దొప్పుఁ దప్తతామ్రమునుబోలి
తాపకరమయి చూడంగఁ దరముగాక. 596

క. అవి తప్పక జీవులనం,గఁ దగిన ప్రాణులకుఁ బోవఁగాఁ దగి యుండున్
సదమలసుకృతము లొనరుచు,ముదితాత్ములు పోవువారు పూతాధ్వములన్.

క. నరకమునకుఁ బాపాత్మకు, లరుగుదు; రానరకవితతి యమవిషయమునన్
బరఁగెడు నిరువది రెండుగ, దురితాత్మకు లందుఁ బూన్కి ద్రోయంబడుచున్.

వ. బాధ లనుభవించు చుందురు. రౌరవ, రౌద్ర, సూకర, తాల, కుంభీపాక, శాల్మల, విమోహన, కీటాద, కృమిభక్ష, లాలాభక్ష, భ్రమనామంబులు కనంబడు. దుర్గంధ భూయిష్ఠంబులగు ప్రవాహంబు లందుఁ గలవు. ఆనదులయందు రుధిరాంభస్సు ప్రవహించు చుండు. అగ్నిజ్వాల, మహాఘోర, సందంశ*శున భోజన, నామకంబులగు నరకంబులు గలవు. వైతరణియనునది భయంకరాకృతి నందుఁగనంబడు. అసిపత్రవనంబను నరకంబతికష్టదాయకంబు. అందు వృక్షచ్ఛాయకనంబడదు. తడాగములుకాని, సరస్సులుగాని, వాపికలుగాని, దీర్ఘికలుగాని, కూపములుగాని, ప్రపలుగాని, సభలుగాని, మండపములుగాని, యాయతనములుగాని, నదులుగాని, పర్వతములుగాని, కొంచెమువిశ్రాంతినిగల్గించునేస్థానవిశేషముగాని యుండుజాడ కనంబడదు. యమలోకంబునకునందఱుపోవలయును. మృతికాలంబు రాఁగా సుహృద్బంధుధనాదుల వదలి జరాయుజాండజస్వేదజోద్భిజ్జములును జంగమాజంగమంబు లనంబడుప్రాణికోటు లన్నియు నామహాపథంబుననే పోవవలయు. దేవాసురమనుష్యు లందఱు వైవస్వతవశంగతులై స్త్రీపున్నపుంసకభేదంబుల భూలోకంబునఁ బుట్టిన జంతువులన్నియుఁ బూర్వాహ్ణాపరాహ్ణమధ్యాహ్నసంధ్యాకాలార్ధరాత్రప్రత్యూషములయం దెప్పుడు కాలము సమీపించునో యప్పుడే తనువ్వుల వదలి పోవలయు. వృద్ధులు, మధ్యములు, యౌవనవంతులు, గర్భమునఁనున్నవారు, బాలకులుంగూడఁ దరుణము రాఁగా మృతిగాంచి యమలోకంబున కరుగవలయును. ప్రవాసమునందున్నను, గృహములయందున్నను, వనములందున్నను, నేస్థలమందున్నను, క్షేత్రములయందున్నను, జలములయందున్నను, గృహమధ్యభాగములయందున్నను, బండుకొనియున్నను, నిలువఁబడియున్నను, గూరుచుండియున్నను, జాగ్రత్స్వప్నములయందున్న నామహాపథంబు తప్పక పొందఁ దగియేయుండు. మఱియు. 599

క. పరమేష్ఠియిడిన యాయుఃపరిమితి నిం దఖిలఫలనివహములఁ గని త
స్మరణసమయ మరుదేరన్, శరీరముం బాసి పోవఁ జను నాత్రోవన్. 600

సీ. జల మగ్ని విషమును శస్త్రము క్షుద్వ్యాధులను వీనిచేతఁ బతనము గలుగుఁ
బర్వతంబున నుండి పడుటయో మఱియొక కారణం బేదియో గల్గ దాని
వంక మృత్యువుగల్గుఁ బ్రాణులకెల్లను దానిని దప్పింపఁ దరముకాదు
స్వీయకర్మంబు లవేయొడఁ బోయినఁ బోనీక ఫలములఁ బొందఁ జేయుఁ

తే. బాంచభౌతికమైన యుపఘున మెట్లొ
వదలి యన్యశరీరంబు బరమకష్ట
ములను గుడువంగఁదగుదాని భూరికర్మ
వశమునన్ దృఢమగుదానిఁ బడసి నరుఁడు. 601

*సందంశశ్శునభోజనః = అని మూలము.

క. తనచేసిన కర్మమునకు, ననురూపంబైన సుఖమునైనను దుఃఖం
బునునైనఁ బొందఁగాఁ దగుఁ, దనువద్దానిని ధరించి తాఁ గను ఫలముల్. 602
తే. దుష్టకర్మములను జేయఁ దోఁచు నరక, మమలకర్మములను జేయ నర్హమైన
సుఖనిధానముఁ బొందును సూర్యసుతుని, పత్తనంబునఁ దప్ప దెప్పట్టున నిది.
చ. తనువునఁ బుట్టునూష్మ మొగి దారుణవాయుసమీరితంబుగాఁ
దనరుచు మర్మముల్ వెలయు స్థానములన్ గడు సుప్రకాశతన్
గొనకొని బ్రద్దలౌ నటులఁ గ్రోధ మెలర్పఁగఁజేయు దాని కిం
ధనములతోడ నేపనియు ధాత్రిని గానఁగరాదు చూచినన్. 604
సీ. పంచవాయువులందుఁ బవనోత్తమంబగు నట్టియుదానాహ్వయమ్ము మీఁదు
గాఁ బ్రవర్తించుచుఁ గడఁగి భుక్తపదార్థముల నంబువులను మిక్కిలి జతనము
మీఱ నధోగతి మేదినిబడకుండఁ గా నిరోధించును; దానిచేతఁ
జేయఁగాఁ బడుమున్ను చేసిన జలదానములును నోదనరసములుగ మఱియు
ఆ. నెవనిచేత నన్నమిడఁబడునో శ్రద్ధ, గలిగినట్టి మదిని లలితగుణుఁ డ
తండు తృప్తినొందుఁ దా నన్నముం దిన,కున్నఁ దత్ప్రభావ మున్నతంబు. 605
వ. ఎవ్వం డనృతములు పలుకక యొండొరులకుఁ బ్రీతిభేద మొనరింపక యుండు
నో వాఁడాస్తికుఁడై శ్రద్ధధానుండై యంతమున సుఖమృత్యువుం గాంచు.
దేవబ్రాహ్మణపూజలయం దెవ్వ రాదృతులై యసూయావిరహితులై పరిశు
ద్ధులై, వదాన్యులై హ్రీమంతులై యుందురో వారెల్ల సుఖమృత్యువుం గాం
తురు. ఎవ్వఁడు కామముననొండె సంరంభముననొండె ద్వేషముననొండె ధర్మ
మును వదలకుండునో వాఁడు సౌమ్యుఁడై సుఖమృత్యువు నొందును. దప్పి
గొన్నవారికి జలమిడి క్షుధితుల కన్నదాన మొసఁగి యెవరు ధర్మపరు లగుదురో
వారు కాలంబు రా సుఖమృతిం గాంతురు. 606
సీ. ధనదాన మొసఁగ శీతంబు జయింతురు చందనదాతలు సతతతాప
మును బొందకుందురు మునుకొని యొరుల కుద్వేగముగల్పించువిషమబుద్ధు
లతిశయవేదన నతికష్టములఁ గాంతు రజ్ఞానులకు జ్ఞాన మరసి యొసఁగి
నట్టివారలు దీప మాదృతి దానంబు చేయునవ్వారలు సిరి చెలంగఁ
తే. దమముఁ బాయుదు రెవ్వారు తప్పుసాక్ష్య
మిత్తురో యనృతముపల్కి యెవరు మేల
టంచుఁ దలఁపోయుదురొ శక్తిమించ నెవరు
ప్రాణములఁ దీయుదురొ వారు పలువిధముల. 607
క. అనుపమకష్టంబులఁ గని, కనుదురు దుర్మృతిని; వేదగణనిందకు లా
జను లొగి భయదాకృతులం, గని దుర్గంధమున నిండి కడు భీషణమై. 608

క. పరమనికృష్టంబై చను, నరకమునం బడుచుఁ గష్టనాశంబును గాం
చరు వారికొఱకు దూతలు, పరుగిడుదురు ముద్గరములఁ బట్టి జవమునన్. 609

వ. వారిదర్శనంబునఁ బాపాత్ములకుఁ గంపంబు గలుగు౦ అపుడు భ్రాతృమాతృపిత
రులం దలంచి యాక్రందింతురు. అత్తఱి వారివాక్కు స్ఫుటంబుగాక యేక
వర్ణంబై వినంబడు. దృష్టి చలించు భయంబున నుచ్ఛ్వాసము భయంకరంబై
కానంబడు అత్తఱి వేదనావిష్టమగు శరీరమును దానివదలు. బాహ్యప్రసారి
యగు తద్వాత్రిపదేహ మొక్కండు తోఁచు. అయ్యది కర్మముల ననుభవించు
టకు మాత్రము తగియుండు మాతృపితృసంభవ మగుశరీర మది కాదని
యెఱుంగునది. తత్ప్రమాణవయోవస్థలు కలుగుచుండు. అప్పుడు దూతలు
దారుణ యమపాశముల బంధించి కొనిపోవుదురు. ప్రాణికి మృతికాలము రాఁగా
యాతన సంభవించు. యమదూతలు పాశములం దగిలించి లాగుచుండఁ బ్రాణ
వాయువులు కంఠగతంబులగుచుండ శరీరమును వదలి జీవుఁడువిధిలేక పోవు.
వాయుభూతుండై షాట్కౌశిక కళేబరుండై సకలబంధువుల వదలిపోవు.
వానింగాంచి బంధువులెల్ల రోదనము చేయుదురు. స్వశరీరమును వదలి వాయు
భూతుఁడై యిట్లు జీవుండుపోవు మఱియు. 610

ఆ. *అంధకారమయము నరయ దుష్పారంబు, నధికభీతిదంబు నంధకార
బంధురంబు నగుచుఁ బరఁగు నామార్గంబు, పాపకర్ములకు నపార మద్ది. 611

క. సుకృతాత్ములకు సుగమ్యము, వికటములగు కర్మముల నవిధి నొనరిచి దు
ష్కృతు లనఁబడు వారికిఁ ద, ప్పక బాధాకరము నగుచుఁ గనఁబడునదియున్.

సీ. దుస్సహంబయి మఱి దుర్నిరీక్ష్యము దురంతంబునునయి యది దాఁటరాక
యతిదుర్గమమునయి యతిసంకటంబయి యహితమై తగియుండు నాపథంబు
యమదూత లొక్కట నతిభయంకరపాశతతులచే నీడ్వఁగఁ దారు దుఃఖ
ములను బొందుచు మఱి ముద్గరసంహతులనునొచ్చుచున్ దూతలను నితాంత

తే. దారుణాకారులను గాంచి తత్తఱిలుచు
నమ్మహాపథమందె మహారవంబు
చెలఁగ బోవుదు; రెవ్వరు క్షితిని క్షీణ
మైన యాయువుగలవారొ యరసి వారి 613

క. సమయమిదె వచ్చె మీకని, యమునానతిఁ దెల్పి వారినంతకుకడకున్
క్షమ వదలి రండు రండని, యముదూతలు భీకరంబులగునాకృతులన్. 614

క. కనఁబడి కొనిపోవుదు రా, పనిఁబూనిన యపుడు వారిభావంబులు మె
త్తనగాక దారుణములుగఁ, గనఁబడుఁ గార్యంబురీతి గట్టిదియగుటన్. 615

---

* అంధకారమపారం చ మహాఘోరం తమోవృతమ్ = అని మూలము.

వ. ఋక్షవ్యాఘ్రఖరోష్ట్రవానరవృశ్చికవృకోలూకసర్పమార్జారగృధ్రశ్యేనసృగాలసరఘుకంకవరాహపశుబేతాళమహిషవాహనంబుల నెక్కి యమునానతి దూతలు కనంబడుదురు. మఱియు వికారనానారూపంబులఁ దాల్చి సర్వప్రాణిభయంకరులై దీర్ఘాననంబులు గలిగి కరాళవదనంబు లొప్పార వక్రనాసికలు కనంబడ వికృతనయనంబులు చూపట్ట మహాహనుకపోలంబులు తగియుండఁ బ్రలంబమానదశనంబులు కనఁబడుచుండ మఱియు దశనంబులువదనంబునుమీఱి వికారంబుగ వెలుపలఁజూపట్ట మాంసశోణితదిగ్ధాంగులై యుల్బణదంష్ట్రులై పాతాళసదృశముఖంబులఁ గనఁబఱచుచు జ్వలించునట్లున్న జిహ్వలం జూడఁ దరంబుగాక జ్వలించుచుఁ బింగళవర్ణంబులై చంచలంబులై తగు నయనంబులు చూచువారికిఁ బ్రాణోపద్రవంబు కల్పింప మార్జారోలూక ఖద్యోత శక్రగోపంబులవలెఁ జూడంబడుచు సంకులచికురంబులఁ దోఁపఁజేయుచు నయనాగ్నిజ్వాలలఁ గ్రక్కుచు నతిభయప్రదాభరణంబుల ధరించి యవి భీమసర్పంబుల భంగిఁ గనంబడ ముండమాల లురంబులఁ గన్పడఁ గంఠంబుల మహాభుజంగంబులు కఱవ నుంకించుచున్నట్లు కనంబడ ఘూత్కారధ్వనులు వినంబడఁ గేశంబులనుండి వహ్నిజ్వాలలు వెడల బభ్రుపింగళ రోమరాజి యొప్పఁ బ్రలంబమానపరిఘోపమబాహుదండంబులు చూచినంతనె భయంబు నింపుచుండ యమదూతలు చనుదెంతురు. అందుఁ గొందఱు ద్విభుజులు. కొందఱుచతుర్భుజులు. మఱికొంద ఱష్టబాహువులు మఱియుఁగొందఱు షోడశభుజులు. ఇంకనుం గొందఱు త్రింశద్భుజులు. కొంద ఱసంఖ్యాతభుజులు. కొందఱు సహస్రభుజులు. వారియాయుధములు ప్రజ్వలజ్జ్వలనాకారంబులు భయానకంబులు నై యుండు. అందు శక్తితోమరచక్రాదులు ప్రధానంబులు. వారు పాశశృంఖలదండంబుల భయపెట్టుచు మహారౌద్రాకారంబుల మానవుల యాయువు నశింపఁ జనుదెంతురు. యమాజ్ఞ శిరంబులందాల్చి ప్రాణులం గొనిపోవఁ బరుగిడుదురు. ఏదికర్మఫలంబుల ననుభవింప యాతనీయశరీర మలవడునో దానిం గొనిపోవుదురు కాలపాశంబుల బంధించి వజ్రశృంఖలనిగడంబులఁ దగిలించి క్రోధంబులఁ దాడనంబుల నలయించుచు యమకింకరులు ప్రాణు లాతురంపడుచు నేడ్చుచు నాక్రోశించుచుఁ దాతలఁ దల్లులం బుత్త్రులం దలంచుకొని దుఃఖించు ప్రాణంబుల వివిధాయుధంబులం బ్రహరించుచుఁ దర్జించుచు భయంకరధ్వనుల నదలించుచుఁ బెక్కండ్రుగాఁ జుట్టుముట్టి కొట్టుచు దిట్టుచుఁ గొనిపోవుచుండ నాప్రాణి పరితపించుచు ఘోరమార్గంబునఁ గింకరులీడ్వఁ బోవు. ఆమార్గంబు కంటక పాషాణాది విషమవస్తు నీరంధ్రంబుగా నుండు. మఱియుఁ బాపాత్ములు ఘోరవజ్రశతంబుల నుత్కటంబై ప్రదీప్తజ్వలనంబై సూర్యకిరణంబులఁ దపింపఁజేయఁబడు మార్గంబునఁ బోవుదురు.

కింకరుల కంఠరవంబులు శివారుతంబులం బోలి యుండు. పాపాత్ముల జంబుకం
బులు భక్షించు. నక్కలు వేఁకాకలిం బట్టి యీడ్చుచుండ దక్షిణమార్గంబునఁ
బాపాత్ములు పోవుదురు. ఒక్కచో భీతిల్లుచు, వేఱొక్కతావునఁ గంపించుచు,
నింకొక్కచోట స్ఖలద్గతి నొందుచు దుఃఖంబున నాక్రందించుచు నందుఁ బోవు
దురు. మఱియు. 616

క. దూతలు బెదరింపఁగఁ బెను, భీతిం బాఱుచును వగల వెల్లువలన్ సం
జాతోద్విగ్నమతుల్ తగ, నేతఱినేఁ బోవవలయు. నీమార్గమునన్. 617

సీ. దానముల్ చేయని మానవుల్ కంటకసాంద్రంబులై మఱి సతతతప్త
సికతాళియై సరసీరుహామిత్రుని కరసహస్రంబులఁ గాల్పఁబడుచు
భయదంబుగా నుండు పథమునఁ బోవుదు రల్లి జంతువులకు హానిఁ గూర్చు
వారలు శోణితఘోరమై దుర్గంధమై విష్ఠమూత్రంబునందు మిగులఁ

తే. గానఁబడ దగ్ధచర్మనికాయ మొప్పఁ
దగినపథమునఁ బోదురు దారుణముగ
నేడ్చుచున్ ధ్వనిసేయుచు నెంతొ యార్తిఁ
గనుచుఁ బ్రేతలు తగుత్రోవఁ జనఁగ వలయు. 618

క. శరశక్తిభిండివాలో, త్కరతోమరశూలపరిఘఖడ్గహతుల భీ
కరగతి ఛేదింపం బడి, యరుగుదు రాత్రోవ జంతుహంతలు వగలన్. 619

క. శ్వానములు వ్యాఘ్రవృకసం, తానంబులు కంకములును దనువులు తినఁగా
స్వానములు చేయుచున్ దుడి, గానవిగ ఱాలత్రోవఁ గడఁగి జవమునన్. 620

క. మొనగల క్రకచంబులచే, తను గోయంబడుచుఁ బశువితానము మాంసం
బును దినఁగోరెడు జను లో, య్యనఁ బోవందగుదు రామహామార్గములన్. 621

తే. మహిష వృషభ శృంగమండల నిహతుల
భిద్యమానులగుచు భీతి మిగులఁ
బోవుచుందు రందు భూరిమార్గంబుల
మాంసఖాదులైన మనుజు లెల్ల. 622

వ. సూచీభ్రమర కాకోల మక్షికాది భుజ్యమాన శరీరులై మధుఘాతుకులగు
మానవులు పోవుదురు మఱియు. 623

సీ. తన్ను నమ్మినయట్టి తరుణిని మిత్రుని స్వామిని హింసించుజనులు దూత
లఖిల శస్త్రంబుల నట్టె గట్టిగ మోఁద నాతురలగుచు నత్యంతకఠిన
మైన యాపథమున నరుగుదు రెవ్వరు ననపరాధములగు నట్టిజంతు
వులఁ గొట్టువారలు; లలనలఁ బతిభక్తిగలవారి వంచించి కమ్రభూష

తే. ణాంబరంబుల దొంగిలి హర్ష మొందు
వారు రాక్షసు లెల్లరు వరుసఁగూడి

తమ్ముఁ దినుచుండఁ యామ్యపథమ్మునందు
నరుగుచుందురు దురవస్థ లలముకొనఁగ. 624

క. కనకము ధాన్యము వస్త్రభ,వనముల క్షేత్రంబు బలిమి వంచించియె కై
కొనువారు విగతవస్త్రులు,గను జనుదురు ప్రేతలగుచుఁ గాలువసతికిన్. 625

క. వారలు పాపాత్ము లనం, బేరును గని పాపకర్మవిశ్వాసములన్
భూరిశిలాలగుడహతిన్, దా రలయుచుఁ బోవుచుంద్రు ధర్మవసతికిన్. 626

సీ. భూరిశోణితమును మోముననుండి క్రక్కుచు యమసదనము ఘోరరూప
మున నొప్పదానిని బొందఁబోవఁగఁ దగు బ్రహ్మస్వమును గొని రమణఁ గుడుచు
వారలు విప్రులఁ గోరి కొట్టెడువార లామార్గమునయందు నార్చుచుఁ జను
చుందురు కంఠంబు శుష్కమైయుండ విచ్ఛిన్నకర్ణాక్షినాసికు లగుచును

తే. బూయశోణిత దిగ్ధాంగులై యమాజ్ఞఁ
గాలగృధ్రంబులును జంబుకంబులుతము
దినుచునుండంగఁ గింకరుల్ ఘనరవములఁ
గొట్టుచుండంగ నేడ్చుచు మిట్టిపడుచు. 662

క. అరుగుదు రాయనుమందిర, పరిసరమున కీవిధమునఁ బరమార్తిని భీ
కరకింకరతాడనముల, దురపిల్లుచు దహనురీతిఁ దోఁచుపథములన్. 628

వ. పోవుచుందురు. రౌరవంబు మానవులకు దుర్గమంబు విషంబునగు. ప్రతప్తతా
మ్రవర్ణాభంబు వహ్నిజ్వాలాస్ఫులింగకంబు. కురంటకంటకాకీర్ణంబు.వికట స్ఫుట
తాడనములు గలశక్తివజ్రములతో నిండియుండు. తీవ్రకంటకంబు లద్దాని
నిండియుండు. అంగారవాలుకామిశ్రంబై వహ్నికీటకదుర్గమంబై, జ్వాలామా
లాకులంబై రౌద్రంబై సూర్యరశ్మిప్రతప్తం బై యామార్గంబు నరకమునకుఁ
గొంపోవు. దేహియామార్గంబుల గొనిపోవంబడుచుండు. ఆత్రోవలఁ బోవుచు
దుఃఖార్తుఁడై వాపోవుచుఁ బడుచు లేచుచుఁ బోవుచుండు.అట్టితావులఁ బోవు
నపుడు దుఃఖించుచున్న జీవుని యమకింకరు లతినిష్ఠురాయుధంబులఁ గొట్టుదురు.
ఇట్లు తాడ్యమానుఁడై యాజీవుఁడు తా నొనరించిన పాపంబులఁ దలంచు
కొనుచు నవశుండై నిష్కరుణు లగుయమదూత లీడ్చుచుండఁ బోవుచుండు.
ఈమార్గంబున నెల్లపాపులు పోవక తప్పదని యెఱుంగవలయు. దూత లీప్రేతల
నగౌరవముగాఁ జూచుచుఁ గొనిపోవుదురు. ఆపురం బీప్రేతలకు భయంకర
తామ్రాయసమయంబుగాఁ దోఁచుచుండు లక్షయోజనాయామంబు గలిగి చతు
రస్రమై చతుర్ద్వారయుతం బై కాంచనమయప్రాకారవిపులం బై, యింద్రనీల
మహానీలపద్మరాగోజ్జ్వశోభితం బై యలరారు. మఱియునందు ఘోరరూపంబుల
నుండునరకంబులఁ బడియుండు జీవు లుందురు. దేవదానవయక్షరాక్షసాదులు
నందు వసించియుందురు. మఱియు. 629

సీ. యమపత్తనంబున నలరుఁబూర్వద్వార మతిమనోహరపతాకాన్వితంబు
వజ్రేంద్రనీలసద్వైడూర్యముక్తాఫలాభిమండితమునై యమలగీత
నర్తనంబులను గంధర్వులు నచ్చరల్ నిండియుండఁగ నొప్పుచుండు నందు
నమరులు మానులు నమలయోగులు సిద్ధగంధర్వముఖులు నికామమోద
తే. మంది విహరించుచుందు; రాయమలపథము, నిర్జరాదులకే పోవనిర్మితంబు
నయ్యె నుత్తరమున నున్నయట్టి ద్వార, మలరుఘంటారవంబుల ననవరతము.
క. చామరభూషితమును నై, శ్రీమెఱయుచు రత్నసారసిద్ధిం దగుచుౝ
గామినులు వీణియలతోఁ, నేమమ్మునఁ దన్నుఁ గొల్వ నిత్యం బలరుౝ. 631
క. గీతమ్ములు వాదిత్రము, లేతఱినే మానకుండ నెసఁగుచు నుండుౝ
శ్రీతరుణి యందె నిల్చెడు,ఖ్యాతిం గన్పడును శ్రుతిరవములం డెసఁగుౝ. 632
క. మునివితతు లందు నుందురు, వినుతింపం దగినధర్మబృంద మెఱిఁగి స
త్యనియతిఁ దగువారలు దా,నిన లోనికిఁ బోవుదురు;మునిప్రభులారా. 633
సీ. గ్రీష్మకాలంబునఁ గీర్తనీయశ్రద్ధ సలిల మిచ్చెడుపుణ్యసత్తముండు
శీతకాలంబున వీతిహోత్రు నొసంగు నతఁడు మార్గశ్రమమంది యున్న
యతిథులకుం బ్రీతి నంఘ్రిసంవాహన మొనరించునాతఁడు మనసునకుఁ బ్రి
యంబుగా మాటాడునాతఁడు దానము చేయునాతఁడు శూరుఁడై యొసంగు
తే. నతఁడు తలిదండ్రులందుఁ బ్రియంబు నునుచు
నతఁడు ద్విజసేవచేయుమహాత్ముఁ డతిథి
పూజకుఁడు ద్వారమం దందుఁ బోవువారు
దానిమహిమంబు వర్ణింపఁ దరముగాదు. 634
క. శమనునిపురి దక్షిణభా,గమునం గలద్వారవరము కమ్రమణిసమూ
హమునఁ గడుమించి సోపా,నము లెల్లను మణిగణంబునం దగియుండౝ. 635
క. తోమరముల నలరుచు భే,రీమర్దళనాదములఁ బరీతం బగుచుౝ
గోమలకాహళశంఖర,వామండిత మగుచు నద్ది యలరు నసమతౝ. 636
సీ. సిద్ధసంఘంబులు చెలఁగుచుండును దాన శివభక్తితత్పరుల్ సువిహితముగఁ
గర్మములను జేయుఘనులు దానిం జొత్తు రఖిలతీర్థంబులయందుఁ గ్రుంకు
వారు పంచాగ్నేయులై రహిఁ గనువారు వ్రతమూని మార్గంబువట్టి పోవు
చునె మృతినొందినఘనులు కాలంజరపర్వతంబున మృతిఁ బడయువారు
తే. హుతవహునియందుఁ ద్రెళ్లుచు మృతిని గాంచు
వారు చ్యుతిలేనిఫలము లవ్వారిగాఁగఁ
గడఁగి సాధించువారు సఖప్రభుజన
ధేనుహితమును గోరి మృతిం గని తగ. 637.
క. పరులకు నుపకృతి చేయం, బరాయణత్వము వహించుభవ్యాత్మకు లా

పురిఁ బడమటిద్వారంబున, నరుగుదు రభ్యంతరంబునందు వసింపన్. 638

వ. ఆపురంబున దక్షిణద్వారంబు మహాభయంకరంబు సర్వసత్త్వంబులకు నందు భీతి గలుగుచుండు. హాహాకారసమావిష్టంబు నగు. అం దంధకారము నిండి యుండు. తీక్ష్ణవిషాణసమన్వితంబై యుండు. కంటకవృశ్చికమహాఫణివజ్రకీటవృక వ్యాఘ్ర భల్లూకసింహజంబుక శ్వానమార్జారగృధ్రంబులు మోములనుండి మహాజ్వాలలు గ్రక్కుచు నందు నుండు. పాపాత్ము లాద్వారంబునఁ బ్రవేశింపవలయు. విప్రగోబాలవృద్ధాతురులను హింసించు పాపాత్ములు, శరణాగతులను నమ్మిన వారిని స్త్రీలను మిత్రులను నిరాయుధులను హింసించు వారు నగమ్యాగమనము చేయుమూర్ఖులును, బరద్రవ్యాపహారకులును, నిక్షేపాపహర్తలును, విషవహ్ని ప్రదాయకులును, బరభూమిగృహశయ్యావస్త్రాలంకారహరులును, రంధ్రాన్వేషణతత్పరులు, నసత్యవాదులు, గ్రామరాష్ట్రపురస్థానములకు దుఃఖము గలుగఁ జేయువారును, కూటసాక్షిప్రదులును, గన్యావిక్రయకారకులు, నభక్ష్యభక్షణరతులు,సుతాస్నుషాగామములును, మాతృపితృదుఃఖఉప్రదవాక్కులును, మఱియు నితర మహాపాతకకారకులు నగువారెల్ల నీదక్షిణద్వారంబునఁ బ్రవేశింపవలయు నని పలికిన మును లిట్లనిరి. 639

## నూటయాఱవయధ్యాయము.

నానావిధపాతకవర్ణనము.

క. మునివర! యెట్టులు యమపుర,మున దక్షిణమార్గమందుఁ బోలుచు మహాద్వా
రనియతరూపంబునఁ బా,పినికరములు పోవ మిగుల భీతికరంబై. 640

క. అన విని వ్యాసుం డిట్లను, మునులార! వినుండు పాపిపుంజములకుఁ బో
వనుదగి ఘోరతమంబై, కనఁబడు ద్వారంబు దానికథ వివరింతున్. 641

సీ. బహువిధ శ్వాపద నివహసమాకీర్ణమై జంబుకశతనాదితంబు నగుచు
ఫేత్కార నాదైక భీషణంబునునయి గగురుపాటుం గూర్పఁగల్గి మఱి య
గమ్యమై ప్రేతనికర భూత ఢాకినీసంవృతంబయి రాక్షసగణయుతము
నై మహాఘోరమై యమరు ద్వారంబును దుష్కృతంబులఁ జేయుదోషు లెల్లఁ

తే. జొత్తు రావేళ మూర్ఛిల్లి సోలుచుందు
రార్తి బ్రుంగుచు నేడ్తు రాయమభటు లాగి
వారి శృంఖలరూపత వఱలుపాశ
తతుల నీడ్తురు సుంతయే దయయు లేక. 642

క. కట్టుదు రట భూజములకుఁ, గొట్టుదు రతిదీర్ఘదండకూటంబులతోఁ
దిట్టుదురు మాటిమాటికిఁ, గట్టలుకం బూనినట్లుగా శమనుభటుల్. 643

క. ప్రేతలు సంజ్ఞం గనుచున్, వేతోరఁ గెడు రక్తపూరవిషధి మునుఁగుచున్.

యాతనలఁ గుడువ దక్కిన, మైతగు ద్వారమునఁ జనుదు రట వడిఁ బడుచున్.

సీ. తీవ్రకంటకవితతినిఁగూడి శర్కరానిచితమై పాషాణనిచయయుక్త
మై క్షురధారానిభాయసశంకుసంయుతమయి యామార్గ మొప్పు నొకట
భూబిలంబులు చూడఁ బోలనియట్లుండు నం దొక్కచోట లోహంపుసూచి
కలతెఱంగున దంతముల శకలంబులు పడియుండు నెత్తైనపర్వతములు

తే. విటపిజాలసంకీర్ణములు తటవిషమము,లును బ్రదీప్తాగ్నికణములుతనరమార్గ
మదిమహాభీతికరముగ నగపడునటఁ, జనుదు రార్తిమునుంగుచుజనులధములు.

వ. మఱియు నామార్గంబు కొన్నితావుల విషమగర్తంబులచేతను సుపిచ్ఛలలో
ష్టంబులచేతను, బరితప్తవాలుకారాశిచేతను, దీక్ష్ణశంకువులచేతను, దప్తాయ
శ్శృంగాటకంబులచేతను, దావాగ్నిచేతను, బ్రతప్తశిలావళిచేతను, హిమంబు
చేతను, దుష్టాంబువులచేతను, వ్యాప్తం బయియుండు. మఱియు నొక్కొక్క
తావున సింహవృకవ్యాఘ్రదశకీట మహాజలౌకో మక్షికా విషోల్బణ సర్ప
దుష్టగజంబులచే నావృతంబై యుండు. వేఱొక్కతావుల మహాశృంగమహి
షంబులచే వ్యాప్తంబై భయంకరం బైయుండు. ఇంక నొక్కతావున రౌద్ర
డాకినీ కరాళరాక్షస మహాభీషణవ్యాధిశతంబులఁ బీడ్యమానంబై యుండు.
అందెల్లయెడల మహత్తరధూళివిమిశ్రప్రచండవాయువులు చెలరేఁగి పాషాణ
వృష్టిఁ గురియించుచుండ దానిచేఁ గొట్టఁబడుచు నిరాశ్రయులై ప్రేతలు
పోవుచుందురు. వజ్రంబు లందెప్పుడు పడుచుండు. భయంకరోల్కలు రాలు
చుండు. ప్రదీప్తాంగారవృష్టిచే దహింపఁబడుచు నందుఁ బ్రవేశింతురు. ఒక్కొ
క్కవేళఁ బరాగవర్షంబు పైఁగ్రమ్మ నేడ్చుచుందురు. దారుణమేఘధ్వనులు
పలుమాఱులు వినంబడ భయంపడుచుందురు. శరవృష్టి యవయవంబులఁ
జూర్ణము గావింపఁ బరితపింతురు. మహాక్షారాంబుధారలచే వ్రణంబులు
దడుపఁబడఁగాఁ బలవించుచుఁ బోవుచుందురు. మహాశీతవాతంబులచే నవ
యవంబులు ఛేదింపఁబడ వణఁకుచు వంగుచుఁ బోవుచుందురు. 646

క. పురుషులు పాపాత్ములు త,త్పరుషతరాధ్వంబునందుఁ బాథేయము లే
క రయమునఁ బోవ దూతని,కరములు బెదరింప వగపు గ్రమ్ముకొనంగన్. 647

క. జలరహితంబయి దుర్గమ, మలఘుతరం బాశ్రయంబె యనలేక శ్రమం
బుల కాధారంబై తగు, విలయకరాధ్వమునఁ బోవ విహ్వలమతులై. 648

తే. చాలకాలము నడచి పాపాళికిఁ దగు
నరకములఁ బొంది యమదూత లురుభయంక
రాకృతుల నాజ్ఞ చేయఁ దదాజ్ఞరీతి
మెలఁగుచుందురు గతియేదొ తెలియరామి. 649

క. పరవశులై యొంటరిగాఁ, జరియించుచు మిత్రబంధుసంగతి లేమిఁ

దురపిల్లుచుఁ బ్రాగ్జనికృత,దురితంబులఁ దలఁచుకొనుచు దుఃఖ మొలయఁగన్.
క. విలపింతురు పలుసారులు, విలయేశ్వరుదూత లొక్కవిధమున భీతిం
గలిగింప నోష్ఠకంఠం,బులు తాలువు లెండిపోవఁ బొక్కుదురు కడున్. 651
సీ. తనువులు కృశియింప మనముభీతి నశింప నాఁకలియనువహ్ని యడరి కాల్ప
శృంఖలమ్ములు కేల నెట్టులో బంధింప నుత్తానపాదంబు లొప్పుగాల్ప
వగచుచు నొకవంక వైరమూనియె యంతకునిదూత లీడ్వంగ మనుజులు తల
క్రిందుగాఁ దొర్లుచుఁ గీడ్పడుచుందురు; క్షుత్పిపాసలు తముఁ జొక్కఁజేయ
తే. నన్నపానీయములు లేక యవ్వి యడుగు
చును మహార్తిని నశ్రువుల్ కనులనిండి
యుండఁ గద్గదవాక్కుల బెండుపడుచు
నడుగుచుందురు నందఱ నన్న మిడఁగ. 652
క. పరిసరముల మేలగు విధి, నురుభక్ష్యములం దినంగ నొగిఁ గాంచుచు భీ
కరముగ క్షుచ్ఛుచి గాల్పఁగ, భరింపఁగాలేక దీనభాష నడుగుచున్. 653
చ. పరిమళచందనంబునను వర్ష్మము లెంతయు నొప్పుమీఱ సౌ
ఖ్యరతినిమించు వారిగని యర్థులమై తగుమాకు భుక్తి కే
వరుసనొ యింతపెట్టుఁడని వారక కోరుచు నేయి క్షీరముల్
పెరుఁగును శాల్య మన్నమును బ్రీతిని జూచుచు మెక్కునాశలన్. 654
తే. వేసరుచు నుందు రింకను విమలపాన
జలముల సుగంధయుతములఁ జల్లనైన
వానిఁ ద్రావఁగఁ గాంచుచు వారి నడుగు
చును దిరస్కృతిఁ గాంచుచు వనట నుంద్రు. 655
క. పరుషములగు వాక్కులఁ గ్రో,ధరతింగని వారుపలుక దత్క్రోధాగ్నిం
బరితప్తులగుచు నుంద్రా, తరుణంబున దూత లిట్లు తా రనుదు రొగిన్. 656
సీ. కాలము తప్పక కడుభక్తి నగ్నిలో వేల్వంగనేలేదు విప్రుల కిసు
మంతయే నీయలే దన్యు లిచ్చుచునుండ వలదని మీరలు పలికినారు
తత్పాపఫలము నీతఱిఁ బొందఁగాఁదగు నోనీచమతులార హుతవహుండు
కాల్పఁడు జలములు కడువడి ముంపవు నృపతస్కరులు గ్రహియింపఁబోన
తే. దైనమీపాపమున సమయమున నిందు, నెట్టు లాహార మొనఁగూడు నింక మీకు
దొరకుటనున దసంభవ మరయ ననుచు,వారు పలుకంగఁ బ్రేతలు వగచుచుంద్రు.
క. అనిశము సాత్త్వికదానం,బును సాధువితతికిఁ జేసి పాల్పడుధర్మా
త్మనికరముకొఱకుఁ గల్పిం,పనుబడియెడు నన్నరాశి పరికింపుఁ డిటన్. 658
వ. ఈయన్నరాశి పర్వతాకారంబున నున్నది. ఇవియే భక్ష్యములు భోజ్యములు
సుందరంబుగా నున్నవని మఱియు. 659

తే. పానజలములు లేహ్యముల్ పరమచోష్య,ములును గన్పడుచున్న విప్రుల నివెల్ల
దాతలకుఁగాని మీవంటిదారుణదురి,తాత్ములకుఁగాదు మీరీయ నరయ రెపుడు.

క. ధన మించుకయైనను స,జ్జనులకు సేవరుసనైనఁ జాల సుకృత మం
చును దలఁచి యిచ్చినార లె,జనుఁ డెవ్వఁడు యాచకులకు స్వాంత మలరఁగన్.

ఆ. తోఁచినంతయేని యాచించినంతన, యిచ్చి యగ్నిహోత్రుఁ దృప్తిచేసి
యవనిసురులఁ బూజ నలవరించునో వాని,కన్న మిడుదు రెపుడు యమునియాజ్ఞ.

క. నారకులారా పరధన, మేరీతి నొసంగనౌనొ యిట మీకు నటం
చారసి యమదూత లసం,గా రమణన్ వీడి యాశ కడచన నార్తిన్. 663

ఆ. పొగులుచుండి దూతపుంజముల్ దారుణా
స్త్రముల లోహముద్గరముల శక్తి
పట్టిసములఁ దీవ్రపరిఘతోమరములఁ
బరశుభిండివాల శరవితతుల. 664

క. వెనుకం జేరియె నిష్కరు,ణను గొట్టఁగ ముందుగ మృగనాథ వ్యాఘ్రా
ళిని గని భీతిల్లుచు నవి, తినఁ బూనఁగ నేడ్చువారు దీనత తోఁపన్. 665

తే. వెడలి రాఁగఁ బ్రవేశింప వీలుపడక, వగలఁ బొగులుచుఁ దమకర్మవశత నేడ్చు
చుండు రాపీడలకుఁ దాళు నోర్పులేమిఁ, బ్రేత లెల్లను దీనతఁ బ్రేతపురి. 666

క. దూతగణంబులు నదయతఁ, బ్రేతల నీరీతి నేఁచి భీతివడఁకు నా
పాతకుల యమునిచెంతకు, నేతఱినో కొనుచుఁబోవ నెంతురు కడఁకన్. 667

తే. ధర్మమతి ధర్మకర్తయు ధర్మవేత్త, యైన యముఁ డుండుధర్మాసనాగ్రసీమ
నిట్లు త్రోవలఁ గష్టంబు లెల్లఁ గుడిచి, దూతకృతతాడనంబులచేతఁ బడలి. 668

క. తరువాతఁ బాపకర్మో,త్కరముల నొనరించియున్న కడుఁ జెడినమతుల్
హరితనయు భయప్రదు భీ,కరనేత్రుని దంష్ట్రలొప్పఁగాఁ దగువానిన్. 669

సీ. భ్రూభంగకుటిలాక్షుఁ బొలుచుశ్మశ్రువు లొప్పువానిఁ జలాధరు మానితోర్ధ్వ
కేశు నష్టాదశపాశయుగ్బాహునిఁ గోపపరీతాత్ముఁ దాపసజన
రూపు నీలాంజనస్వోపము సర్వాయుధోద్యతహస్తు మహోగ్రదండ
సంయుతు నురుమహిషప్రభువాహను దీప్తాగ్నితుల్యాక్షుఁ దీవ్రరక్త
ఆ మాల్యవస్త్రధరుని మహితాంబురాశిని, బ్రావనెంచువానిఁ బ్రళయమేఘ
ఘోషతుల్యకంఠఘోషుని లోకత్రయంబు మ్రింగ నెంచునట్టియముని. 670

క. అనలుని గ్రక్కెడు నట్లుగఁ, గనఁబడువానిం బరేతకాంతు నతని చెం
తనెయున్న మృత్యువును; వహ్నినిబోలివెలుంగుదాని నెదుటం గనుచున్.

ఆ. ప్రళయకాలవహ్నిపగిది భయానక,తనువు వెలయనొప్పు దారుణాకృ
తుని గృతాంతుఁ గాంతు రనయము బాధింప, నరయు నుగ్రమారి యనెడుదాని.

సీ. మఱియు మహామారి నెఱి భూతములఁ ద్రుంచు కాళరాత్రిని బహుకాండశక్తి
శూలపాశాంకుశ శుంభత్కరౌఘను గనుదురు వెండియు ఖడ్గచక్ర
వజ్రదండంబుల వరుస ధరించుచు క్షురతూణకోదండకూటములను
ధరియించి ప్రజలకు దారుణాకృతిఁ గనఁబడుచుండు యమదూతపటలములను
తే. గనుదురీపరివారముల్ తనను గొలువ, నలరుచున్న యముండు పాపులకుఁదోఁచు
నతనియంతికముననె భయంబు గల్గఁ, జేయు నా చిత్రగుప్తుండు చెలఁగుచుండు.

క. శమనుఁడు పాపాత్ముల కర్మములను దలపోసి క్రోధమానసుఁ డగుచున్
శమియించుక లేకయె తీవ్రముగా దండించు భయదవాక్కులఁ బలుచున్. 674

తే. చిత్రగుప్తుఁడు ధర్మైకసిద్ధిఁ గోరి, యముల వాక్కుల నీవిధి నపుడు పల్కుఁ
బాపకర్మములను జేయఁబాలుపడిన, మీ యఘమ్ములఁ దెల్పెద న్యాయరీతి. 675

సీ. పరధనంబులఁగొని పరదారలను బొంది చక్కఁదనంబున సాంద్రయౌవ
నమ్మున గర్వించి నరకకూపంబులఁ బడఁగోరి చేయు పాపంపుఁగర్మ
ములకు ఫలం బిప్డు కలిగెను బొందక తప్పునే; యాత్మఘాతము నె కోరి
యొనరించు దుష్కృతమునకు నేడ్చిన నేమి ఫలము? కింకరులు మి మ్మలయునట్లు
తే. కొట్టఁగా నేడ్వ నేమగు? నిట్టు లఘము, జేసినారలు దీనికి గాసిలంగ
నోరులఁ దిట్టంగ ఫలము లే దరయ దీని, కెల్ల హేతువు మీ కర్మమే యగుఁజూఁడి.

వ. ఈవచ్చిన రాజులం గనుంగొనుఁడు. ఘోరకర్మంబుల నొనరించి దుర్మతులై బల
గర్వితులై యున్నవారు. రాజులారా! దురాచారులారా! మీరు ప్రజావిధ్వంస
కారకులు. స్వల్పకాల రాజ్యమునకై దుష్కృతంబుల నొనరించితిరి. రాజ్యలోభం
బున మోహంబున బలమున విజ్జృంభించుచు నన్యాయమార్గంబునఁ బ్రజల బాధిం
చితిరి. తత్ఫలం బనుభవింపుఁడు. ఎందులకయి దుష్కృతము లొనరించితిరో
యా రాజ్యము కళత్రము నిపు డెచ్చట నున్నది? వారిని వదలి మీ రిపు డొంట
రిగా నున్నవారలు కదా! ఏ బలమును నమ్మి ప్రజల దండించితిరో ఆబల మిపు
డెక్కడ నున్నది? యమదూతలు పీడింప నిపుడీ దుష్ఫలము ననుభవింపుఁడు.

క. అని బహువిధ వాక్యంబుల, మనుజుల రాజులను నాశమనుఁడు నతని చెం
తనె యున్న చిత్రగుప్తుఁడు, మనమున నేశంక లేక మఱిమఱి పలుకన్. 678

క. విని వగతురు యముఁ డంతట, మనుజేంద్రులఁ గాంచి పాపమండలమును జె
ప్పను గోరి యిట్లు పలుకును, జనపతులారా! వినుండు స్వస్వచరితమున్. 679

తే. చండుఁడు ప్రచండుఁడును మహాచండుఁ డనెడు
దూత లీమిమ్ముఁ గొనిపోయి పాతకాను
రూప నారకమయ మహాకూపవాసు
లనుగ నొనరింత్రు వరుసగా ననుచుఁ బలుకు. 680

సీ. యమునాజ్ఞయైనంత నాతనిదూతలు జనపతులను బిల్చుకొని జవమునఁ
జనుఁడని బెదరించుచును గిరగిరఁ ద్రిప్పుచును మఱి యఘతుల్యఘనశిలాత
లమునందు వైచుచు యమునాజ్ఞఁ దెల్పుచు బాధింతు రెంతయుఁ బట్టుదలల
నంత వారలనుండి వింతరక్తము స్రవించును దాన సంజ్ఞ దప్పును దనంత

తే. దేహి నిశ్చేష్టుఁడై పడుఁ దివిరి వాయు, వల్లనఁ వీవఁగా లేచు నాశరీరి
యతని పాపవిశుద్ధ్యర్థ మతిభయంకరమగు నరకాబ్ధి ముంతురు సమయ మెఱిఁగి.

వ. ఇట్లు దూతలందఱు పాపాత్ముల నందఱం జేయుచుందురు. వారివారిపాపంబు
లను దదనురూపనరకంబులను బడఁద్రోయుటయు యమునకు నివేదింతురు.
యమునిం గాంచి పాపులు బిట్టు దుఃఖించుచుందురు. అప్పుడు యమునిం గాంచి
దూత లిట్లందురు. 682

క. జను నితని దేవ! నీయాజ్ఞను నారకమందు వైచి చక్కఁగఁ బాపం
బును గుడువఁ జేసినారము, విను మీతఁడు ధర్మమార్గవిముఖుఁడు సుమ్మీ. 683

సీ. అనిశము పాపాత్ముఁడగు వీఁడు లుబ్ధుఁడు భూరిపాతకయుక్తిఁ బొదలుచుండు
మఱియు దురాచారమానసుండగు నుపపాతకకర్తయు నేతఱి శుచి
యును గాక హింసారతిని మించు మఱియగమ్యాగమనుఁడు పరార్థాపహార
కుండును గన్యలఁ గోరి యమ్మును మఱి కూటసాక్షియు వంచకుఁడు కృతఘ్నుఁ

తే. డునగు మదమత్తుఁడైన వీఁడును సతంబు
ధర్మనాశన మొనరింపఁ దలఁచుచుండుఁ
బాపకర్మములను జేయఁ బాటుపడును
గాన వీనికిఁ దగినశిక్షను విధింపు. 684

క. పని దీని నిర్ణయింపం, గను ప్రభువవు మమ్ము శత్రుకల్పులఁగానే
మనమున నెంతురు ప్రేతలు, వినుమని దూతలు తమంత వినయముతోఁపఁ.

ఆ. ఇట్లు మనవిచేసి యెల్లపాపుల యము, నెదుట నిల్పి నిరయ మెంతసంఖ్య
నమరియుండు నందు నవ్వారిఁ బడఁద్రోయ, నాజ్ఞఁ గోరియుందు రందు మిగుల.

క. కింకరు లింకం గొందఱు, సంకటములఁ బాపులకును సమకూర్పఁగ నా
వంకను జనుదురు పాపుల, నింకం గలవారి యముని నెదుటికిఁ జేర్పఁ. 687

క. కొనిపోవ నరకములకుం, జనుచుందురు పాపులను విశాలదృగవలో
కనములఁ జూచుచుఁ దగుశిక్షను వారికిఁ జెప్పుచుండుఁ గడు ధర్మమునఁ 688

సీ. యముని చెంతనెయుండు నావసిష్ఠాదులు ధర్మపద్ధతి నెల్ల ధర్మునకును
దెలుపుచునుందు రాతీరున నాతండు విధియించు శిక్షను వినుచుఁ గింక
రులు వారిఁ గొనిపోయి రూక్షనారకములఁ బడఁద్రోయుచుందు రీపగిదిఁ బాపు
లను గొనిపోవుచు ఘనతరాంకుశముల దండముద్గరశక్తిదారుణక్ర

తే. కచములను దోమరంబుల ఖడ్గశూల, ముఖమహాయుధములఁ గొని భూరికోప

మూని దండించుచుందురు గాన నరకకూపములఁ జేరఁ బోరాదు క్రూరములవి.

క. కాలుని కింకరు లొక్కట, నోలిం బాపాత్ములఁ గొని యొక్కొక్కని దు
శ్శీలముల కనుగుణములయి, పోలం దలపోయ భీతిఁ బుట్టించి కడున్. 690

క. మనమునకు విసుఁగు గూర్చెడు, ఘనరూపములైన నారకంబులఁ ద్రోయం
గను విలపించుచు నుందురు, వినుఁడీ నరకస్వరూపవృత్తాంతంబుల్. 691

తే. వాని నామప్రమాణముల్ వరుసఁ దెలుపు
వాఁడ నేమార్గమున మానవప్రకాండ
మేనరక మొందు దానిని నెఱుకపఱతు
వినుఁడు లోకహితార్థమై విమలులార. 692

వ మహావీచి యను నరకంబు గలదు. అద్ది శోణితాప్లుతంబు. వజ్రకంటకసమ్మిశ్రమై యోజనాయుతవిస్తృతంబై యుండు. అందుఁ బడినవారు వజ్రకంటకపీడితులై యనేకసంవత్సరము లుందురు. గోవుల హింసించువా రందుఁ బ్రవేశింతురు. కుంభీపాక నిరయంబు శతలక్షయోజనావృతంబై దారుణరీతి గనంబడు. అందు వాలుకాంగారసంవృతయై తామ్రకుంభావతి యనునది ప్రవహించుచుండు. ఆనరకంబున బ్రహ్మహత్యచేసినవారును, భూమిహర్తలును, నిక్షేపాపహారకులును బడియుండి యాయిసుకయందలి యగ్నిజ్వాలలచే దహింపఁబడుదురు. ఆపాపానుభవమున కంతము కానరాకయుండు. రౌరవంబను నారకం బొక్కండుండు. ప్రజ్వలించు వజ్రనారాచము లందుం బడియుండు. దాని యాయామవిస్తృతులు లెక్కింప నలవిగాక యుండు. అందుఁ బ్రవేశించు పాపుల నామందుబాణములు బాధించుచుండు కూటసాక్షులు చెఱకుపాలవలెఁ దపింపఁబడ్డుదురు. మంజూషనామక నిరయం బొక్కఁడుగలదు. అది ప్రజ్వలదయోమయంబు. బలవంతముగాఁ గారాగారమందుంచి మానవుల బాధించువారందు దహింపఁబడుచుందురు. అప్రతిష్ఠాహ్వాయ దుర్గతి వేఱొకండు పొడసూపు. అది పూయమూత్రపురీషాన్వితంబు. బ్రాహ్మణపీడచేయువా డం దధోముఖుంబుగాఁ బడును. విలేపకనరకంబు గలదు. అది లాక్షాప్రజ్వలితంబై ఘోరంబై యుండు. మద్యపానముచేయు బ్రాహ్మణు లందుఁబడి దహింపఁబడుదురు. మహాప్రభ యనుపేరుగల నరకం బింకొక్కటి కలదు దీప్తశూలంబులందు నాటఁబడియుండు. భార్యాభర్తలకు భేదముకల్పించువా రందు శూలపీడితు లగుదురు. జయంతియను నదికలదు. అందాయసీశిల కనంబడు. పరదారలఁ గామించువాఁడందుఁ బడవేయఁబడు. శాల్మలంబనఁబరఁగు నిరయము పొడసూపు. అందు గట్టిముండ్లు మండుచుండు. పెక్కుపురుషులం గూడఁగోరు నారి యాశాల్మలీతరువును గౌఁగిలించుకొనవలయు. మఱియు నిరంతర మనృతము వచించువారును, పరమర్మముల బాధించువారును, తన్నరకంబునఁ ద్రోయంబడి నాలుక

ఛేదింపఁబడుచుండ నుందురు. ఎవరు రాగకటాక్షములఁ బరదారలం జూతురో
వారు నందుఁ బడఁద్రోయంబడి నారాచసంపీడితనేత్రు లగుచుందురు. మాతృ
భగినీదుహితృస్నుషలఁ గామించువారును, స్త్రీబాలవృద్ధహంతలును దన్నర
కంబునఁ జిరకాలముండి బాధలం గుడుచుచుందురు. మఱియు. 693

సీ. రౌద్రమై యొకమహారౌరవనరకంబు
కలదు జ్వాలామాలికలఁ బెనఁగుచుఁ
బెక్కు వేలామడల్ వెలయు దానిప్రమాణ
మందుఁ బురంబు గృహంబు క్షేత్ర
మును గ్రామమును గాల్చు మనుజులు చొత్తురు
నరకంబునం దందుఁ జిరసమయము
దహియింపఁబడుచు నుద్ధతిమీఱఁ గింకరుల్
బాధింప నుందురు పరమభయద

తే. మైన తామిస్రనరకమందమరియుండు, దాని విస్తృతి లెక్కింపఁ దరము గాదు
ఖడ్గపట్టిస భూరిముద్గరకరులయి, కింకరులు ప్రేతలను బట్టి బింక మలర. 694

క. త్వరపడి త్రోయుదు రటఁ దస్కరులే చొరఁబాఱువారు ఖడ్గాదుల భీ
కరగతిఁ గింకరు లతిశయ, దురితాత్ముల వారిఁ గొట్టుదురు నిరతంబుఁ. 695

క. తామిస్రద్విగుణం బా, యామము తగ నుండు నొక్కఁ డట నద్ది మహా
తామిస్ర నామకంబౌ, భీమం బది సర్పజాలవివృతము నుండీ. 696

వ. ఆనరకంబునందు మాతృపితృహంతలును, మిత్రవిస్రంభఘాతకులును నివసిం
తురు. తత్కాలపరిమాణ మనంతంబ యని యెఱుంగ నగు. అసిపత్రవనం బను
నరకంబు గలదు. అది ఘోరతరంబు.బహుదుఃఖప్రదంబు. పెక్కుయోజనముల
పర్యంత మయ్యది వ్యాపించియుండు. ప్రజ్వలత్ఖడ్గంబు లందు వెలయుచుండు.
వాని లెక్కింపఁ దరంబుగాదు. మిత్రులకు ద్రోహ మొనరించిన వారెల్ల నందు
వసింతురు. కరంభవాలుకానరకంబు గలదు. యోజనాయుతపరిమితదూరంబు
వ్యాపించియుండు. వాలుకాంగారకంటకంబులు వ్యాపింప నది కూపాకారం
బుగఁ గనంబడు. అందుండు పాపులను గింకరులు కాల్చుచు నవయవంబులఁ
జీల్తురు. ఆయనుభవంబు చిరకాలం బుండు. భయంకర మిథ్యోపాయంబులఁ
బరులఁ బీడించువాఁ డం దుండు. కాకోలనరకం బొక్కండు కలదు. కృమిపూ
యపదిప్లుతంబు. మృష్టపదార్థంబుల నొంటిరిగా భుజించు దుష్టాత్ముఁ డందుఁ
బడియుండు. కుడ్మలనామకనిరయంబు విణ్మూత్రశోణితపూర్ణంబుగ నుండు.
అందుఁ బంచయజ్ఞక్రియాహీనులు పడియుందురు. సుదుర్గంధనామక నారకంబు
కలదు. మహాభీషణంబై మాంసశోణితసంకులంబై యది కనంబడు. అభక్ష్యా
న్నాసక్తు లందుఁ బడియుందురు. మహావటం బనునిరయం బందుఁ గలదు

క్రిమికీటసమాకీర్ణంబు. శవాకులంబును నగు. కన్యావిక్రయ మొనరించు పాపాత్ముఁ డధోముఖంబుగా నందుఁ బడు. తిలపాకనామక దుర్గతి యొండు కలదు. అది మిగుల భయంకరంబు. పరపీడాసక్తు లందుఁ దిలలవలెఁ జీల్పఁ బడుచుందురు. తైలపాకనరకంబు గలదు. జ్వలత్తైల మందుఁ బొదలుచుండు. మిత్రఘ్నుఁ డా తైలకటాహంబునఁ బడఁద్రోయంబడు. శరణాగతహంతయు నందుండు మఱియు. 697

ఆ వజ్రశృంఖలముల వజ్రకపాటనా,మమునఁ బరఁగు నరక మమరు నందు
దయయొ లేక పాలఁ దగ నమ్మి జీవించు, వార లుందురందు ఘోరభంగి. 698

సీ. కలదు నిరుచ్ఛ్వాసకం బనునరకంబు తమమున నంధమై. తగ నవాత
మగుచుఁ జూడఁగ నశక్యంబుగ నందు విప్రులకు దానం బీయఁ దలఁప వలవ
దని పల్కునాతఁడు హతుఁడయి పడు నందు దీప్తాగ్నికణసముదీర్ణ వమగుచుఁ
జాలు నంగారరాశిచయనామనరకంబు బాడబులకు నీయఁ బలికినట్టి
తే. ధనమునీయని వారందుఁ జనుదురు వగ,ననుభవింపఁగ మఱియు శమనుపురమున
గనఁబడునొకమహాపాయియనెడు నరక,మద్ది నియుతయోజనముల యంతదవ్వు.

క. వ్యాపించియుండు నసృతం, బేపట్టుననేని పలుకుహీనులు తలక్రిం
ద్రై పడుదురు ఘోరముగా, దీపించుచునుండు నగ్ని తీక్ష్ణరుచులచేఁ. 700

వ. మహాజ్వాలానరకంబు చూపట్టు. అది సార్థకనామధేయంబు. పాపకార్యము లొనరించుబుద్ధిగలవా రందు బడవలయు. వారి నాయగ్నిజ్వాలలు బాధించుచుండు. క్రకచనిరయం బొక్కండు కలదు. అగమ్యాగమన మొనరించినవారు వజ్రధారాతీవ్రంబులగు క్రకచధారల బాధితు లగుచుందురు. గుడపాకానరకం బొక్కండు గలదు. వర్ణసంకరకారకు లందుఁబడి తపించుచుందురు. క్షురధారానరకంబు కనంబడు. అందుఁ దీక్ష్ణక్షురనికరము లుండు. విప్రభూమిని హరించినవాఁ డందుఁబడి చిరకాలం బవయవంబులు క్రోయఁబడుచుండ వెతఁగుడుచుచుండు. అంబరీషనరక మొక్కండు కలదు. ప్రళయానలజ్వాల లందు నిరంతర మెసంగుచుండు. స్వర్ణహారకు లందుఁ గల్పవితతు లుందురు. వజ్రకుఠారనరకము గలదు. వజ్రసంకులంబగు నద్దానియందు ద్రుమచ్ఛత్రచ్ఛేత్తలు పడియుందురు. పరితాపనరకంబు పొడసూపు. విషదాతయు మధుహర్తయు నందుఁ బడియుండుదురు. కాలసూత్రనరకంబు వజ్రసూత్రవినిర్మితంబై యుండు. పరక్షేత్రగతసస్యంబులఁ గోయువా రందుఁ దపింపఁబడుదురు. కశ్మలంబను నిరయంబు కలదు. మద్యమాద్యనిరతుం డందుఁ బడి పీడింపఁబడుచుండు. ఉగ్రగంధనిరయంబు లాలామూత్రపురీషావృతంబు కలదు. పితరులకుఁ బిండదానము చేయని వా రందుండవలయు. దుర్ధరనరకంబు చూపట్టు, అందు జలౌకంబులు వృశ్చికంబులు నిండియుండు. ఉత్కోచభక్షకు లట నుందురు వజ్రమహాపీడన

మనునది యింకొక్కటి యందుఁ గానంబడు. పరకీయధనధాన్యహిరణ్యంబుల హరించువా రందు నివసించి బాధితులగు చుందురు. వారియంగంబులను యమకింకరులు తిలప్రమాణములుగాఁ గోయుచుందురు అంతియగాక పరు లను వధించుచు సంతసించువారు కాకగృధ్రంబులంబోలి యందుండవలయు. మఱియును- 701

సీ. ఆసనశయనంబు లంబరంబును బరకీయమ్ము దొంగిలి న్యాయ మెడలి
వర్తించువార లీబాధలనందుచు నిత్యదండమువలె నెంతొ పీడ
నందుచుఁ గృత్రిమ మైనసాక్ష్యముచెప్పునాతనింగూడి యత్యంతభీమ
ముగఁ గనంబడుచోట మోహ మందుచునుండ్రు; జ్వలితాయసంబయి చాలభీక
తే. రముగఁ గన్పడు నట్టినరక మొకండు
తగు నయోముఖమను పేర ధర్మపురిని
బలిమిఁ జెరయందుఁ నుంచిన బహుదురాత్ము
లందుఁ బడవైవఁబడుదు రాయమునియాజ్ఞ. 702

వ. పూయమూత్రపురీషము లందు నిండియుండు. శ్రుతిస్మృతినిందకులు దధోము ఖంబుగఁ బడుచుందురు. పారిలుంపనరకం బింక నొకండు కనంబడు. శ్వగృధ్రవృ కావళి యందుండు. బాలవృద్ధజనాపహారకు లందుఁ దపింపఁజేయఁబడు చుందు రు. కరాళనిరయం బొక్కం డందుఁ గానంబడు. కరాళంబై ప్రేతసంకులంబైయ ది భీతిని గల్గించుచుండు. బ్రాహ్మణోపపీడకు లందు రాక్షసులు భక్షింపఁబడి తపించు చుందురు. విలేపన నరకంబు చూపట్టు. అది లాక్షాప్రజ్వలితంబు. మద్య పానము చేయువా రందుఁ బాపఫలంబు లనుభవింతురు. మహాప్రేతాఖ్య నర కం బింక నొకండు చూడంబడు. దీప్తశూలంబై మహాచ్ఛ్రియంబై యుండు. భార్యాభర్తృభేదకు లందు శూలాగ్రపీడితులగు చుందురు. ఆయసీ శిలాన్విత జ్వలంతీనామక నరకంబు పొడకట్టు. పరదారోపసేవకుం డందుండందగు. శాల్మ లీనామనిరయంబు గలదు. ప్రదీప్తదృఢకంటకి భయాయిష్ఠంబు. పరచ్ఛిద్రంబుల నన్వేషించువార లందుందురు. ఆకంటకంబు నాలింగనము చేసికొనుచు వగతురు. సత్యం బనృతంబని వారించుచుఁ బరులకు బాధ కల్పించువారుంగూడ నందుం దురు. వారిజిహ్వలు యమకింకరులచే రెండుగాఁ గోయఁబడుచుండు. ఇంకఁ బాపానుభవముల నెఱింగించెద వినుండు. మాతృభగినీకన్యకల ననుగమించు వాఁడు వహ్నిరాశియందుఁ ద్రోయంబడు. పరకీయధర్మ గృహహిరణ్యముల హరించువారు శూలశక్తితోమరనికృంతగాత్రు లగుచుందురు. ఫలపత్రంబులఁ బరకీయంబుల హరించువారు తృణవహ్నులచే బాధితులగుదురు. పరధనకళ త్రంబుల సదా యభిలషించువారు మండుశూలంబుల హృదయంబునందునుపఁ బడి తపించుచుందురు. మనోవాక్కర్మంబుల ధర్మవిముఖులగువారు యమలో

కంబున గురుయాతనలఁ గుడుచుచుందురు. ఇట్లు నరకంబు లసంఖ్యలు గలవు. పాపాత్ము లాయాయినరకంబులఁ బడియుందురు. ఈలోకమందు నించుకయైనను శుభాత్మకకర్మంబు నొనరింపక పాపకర్మములను జేయువారు నరకంబులఁ బడి పరితపించు చుందురు. ధర్మప్రకీర్తితం బగుపద్ధతుల వినని పాపాత్ములును, నరకంబులున్నవని నీకెట్లు తెలియునని ప్రశ్నించువారును, నహోరాత్రములు పాపకర్మములనే యొనరించువారును, ధర్మము నించుకయే నాచరింపఁ దలంపని వారును, కర్మఫలానుభవము పరలోకమున లేదనువారును, మహాఘోరనరకంబులం బడి స్వస్వదుష్కృతానుసారిఫలంబుల ననుభవించుచుఁ దమదుష్కృతంబులం దలంచుకొని వగచుచు నుందురు. నరకవాసంబు దారుణంబై యుండు. స్వర్గవాసము సుఖావహంబై యుండు. అశుభకర్మములకు నరకప్రాప్తియు, శుభకర్మములకు స్వర్గప్రాప్తియుఁ గలుగునని తెలియవలయు నని వ్యాసమహర్షి తెలుపుటయు మహర్షు లిట్లనిరి. 703

## నూటయేడవయధ్యాయము.

### నరకదుఃఖనివారణోపాయము.

క. విన ఘోరం బతిదుఃఖద, మనుగా యమమార్గము నఘమూలముగాఁగన్
వినిపించితివో మునివర, గన నట నరకాళి భీతికరముంగాఁగన్. 704
క. తెలిపితివి యామ్యపద్ధతి, విలయంబును గల్గఁజేయు విన్నంతనె యా
యలఘుతర దుఃఖదముగా, వెలసెడు విధి దాట నెట్టివిధి గలుగదొకో. 705
తే. ఏయుపాయంబుచే దాని నెట్టులేని, దాఁట నగునో భయంకరదావపావ
కుని మహాజ్వాలలంబడి కుందకుండ, సులభముగయముఁ జేరెడుచొప్పుఁ దెలుపు.
చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నార్యమహాశయులార! యీజగం
బున గురుధర్మపద్ధతులఁ బూనికమీఱఁగ నాచరించుచున్
వినయము భూతవత్సలత విప్రసురార్చనలోలుపత్వమున్
గని గురుసేవ చేయుటకుఁగాఁ బనిపూనినమానవోత్తముల్. 707
చ. తనయుల భార్యలం గలిసి తద్దయు ధర్మము లాచరించు నా
మనుజులు ప్రేతనాయకునిమార్గము దాఁటుదు రక్రమంబునన్
వినఁదగు దానిపద్ధతుల వేడుకఁ దెల్పెద మానులార! యే
మనుజులు బ్రాహ్మణోత్తముల మానితపూజలఁ దన్పి విత్తముల్. 708
క. నానారూపమ్ములుగా, దానంబులఁ దన్పువారొ ధర్మమతులు త
న్మానవులు వ్యోమయానము, లానిర్మలకాంతియుక్తి నలరెడు వానిన్. 709
సీ. రత్నకాంతులను విరాజిల్లునవ్వాని నెక్కి మార్గమ్మున నెట్టికష్ట
ములు లేక సుఖముగఁ బోవుదు రంతకుపురమునకును మఱి భూసురులకు

శ్రోత్రియులకు భక్తి శోభిల్ల నన్నంబు పెట్టువారలు త్రోవ నెట్టికష్ట
ములను గాంచక భార్య లలరుచునుండఁగ ధర్మరాజుపురికిఁ దవ్వరగ నేగు
తే. దురు విమానంబులను నెక్కి పరమసుఖము
లనుభవించుచు వినుఁ డిట్టు లనుపమాన
సుఖముగాఁ బోవుపుణ్యుల శుభచరితము
సత్యమునె పల్కువారలు సాధుమతులు. 710

క. అనుపమ నిర్మల మార్గం,బున విహరించెదు నితాంతపుణ్యులు దివిజా
లినిబోలి యమునిమందిర,మునకుం బోవుదురు శర్మమును గనుచు వడిన్. 711

చ. హరిపయిఁ గల్గుభక్తిని మహాత్ములు నిస్వులునైన యట్టిభూ
సురులకు సాధుగోవులను జొక్కపుభక్తి నొసంగువారు భా
స్కరసుతుమందిరంబునకుఁ జక్కఁగఁబోవుదు రప్సరోవ్రజం
బరుదుగఁ గొల్వ నొప్పు సుఖయానములన్ మరియాదమీఱఁగన్. 712

సీ. పావలు ఛత్రము పరమాసనము శయ్య వస్త్రభూషణములు భక్తిమెఱయ
దాన మిచ్చెడుమహాధర్మాత్ములరుగుదు రాయమపురమున కశ్వదంతి
రథములపై నెక్కి రమ్యపథంబున భక్తిమీఱఁగ గుడపానకంబు
నోదనమును బ్రాహ్మణోత్తములకుఁ బరిశుద్ధాంతరంగులై శుభదనియతి
తే. దానమిచ్చినఁ గాంచనయానములను, యమపురంబున కేగుదు రాదరమునఁ
వారి సేవింప వత్తురు వారవనిత, లాయముని యాజ్ఞ నృత్తగీతాదులమర.713

వ. క్షీర ఘృత దధి గుడ మధువులను విప్రవర్యులకుఁ బ్రయత్నంబునఁ బరిశుద్ధ చిత్తంబున నొసంగువారు చక్రవాక వాహ్యంబులగు హిరణ్మయవిమానంబుల నెక్కి గంధర్వవాదిత్రంబులతో యమాలయంబున కరుగుదురు. ఫలంబులను సురభిపుష్పంబులను దాన మిచ్చువారు హంసప్రయుక్త యానంబులపైఁ గూరుచుండి యమనగరంబునకుఁ బోవుదురు. తిలలు తిలధేనువులు ఘృతధేనువులు శ్రోత్రియులగు విప్రులకు శ్రద్ధచే దాన మిచ్చువారు సోమమండలసంకాశవాహ్యమయానంబుల నెక్కి గంధర్వులు పాడుచుండ యమమందిరంబున కరుగుదురు. ఎవ్వరు వాపీకూపతటాక సరోదీర్ఘికాపుష్కరిణులను శీతలజలాశయంబులను నిర్మించి యిత్తురో వారు హేమచంద్రాభదివ్యఘంటానినాద ముఖరిత వాహ్యచు యానంబులపైఁ గూరిచుండి వ్యజనతాళవృంతములం గొని యచ్చరమిన్నలు సేవింపఁగాఁ బోయి యమపురంబున సుఖ ముందురు. ఎవ్వరు దేవాలయంబులఁ గట్టించి విచిత్రతరాయతనంబుల నిర్మించి యందఱ కుపకరింతురో వారు లోకపాలకవిమానంబుల నెక్కి నానాపుణ్యజన సమాశ్రయం బగుయమనగరంబున కరుగుదురు. మఱియును. 714

సీ. సర్వభూతములకుఁ జాలఁగా నుపకార మొనరించి పానీయమును నొసంగు
ధన్యాత్మకులు తృష్ణ తమ్మెడఁబాయంగ వ్యోమయానంబుల నురుముదముల
నరుగుదు రాధర్మపురమున కెవ్వరు కాష్ఠపాదుకపీఠకముల నాస
నముల యానంబుల విమలాత్ములకునిత్తు రాపూతమతులు సౌఖ్యముగఁ జనుదు
తే. రాపురంబునకవ్వారి యంఘ్రు లుండుఁ, గనకపీఠంబులందు నిక్కముగ నచ్చ
రలును సేవింతు రట్టియాత్రను ముదమున, వారిపుణ్యంబు వర్ణింప వశముగాదు.

వ. విచిత్రారామంబుల నిర్మించి యందుఁ బుష్పవృక్షలతలనుండ నేర్పఱచు మానవులును ఫలవృక్షంబుల మార్గంబున నియతిమీఱ వేయుధన్యాత్ములును శీతలవృక్షచ్ఛాయల విశ్రమించుచు నలంకృతులై వారకాంతాసేవితులై చనుదురు. సువర్ణరజత విద్రుమమౌక్తికంబుల నిచ్చువారు విమానారూఢులై చనుదురు. భూదానముచేయుపుణ్యాత్ములు సర్వకామతర్పితులై పోవుదురు. కన్యాదానము చేయువారు దివ్యకన్యావృతులై యమపురంబున కరుగుదురు. సుగంధాగరు కర్పూర పుష్పధూపముల నిచ్చువారు పరమప్రమదాన్వితులై సురుచిరవేషంబులం దాల్చి వియద్గమనంబునఁ జనుదురు. దీపదానము చేయువారును, గృహదానము చేయువారును బాలార్కనిభయానంబుల దశదిశల వెలిఁగించుచుం బోవుదురు. జలభాజనంబుల సజ్జనుల కొసంగువారును, కుండికాకరకప్రదాతలును, వియచ్చర భామినీసంయుతులై ధర్మపురంబున కేగుదురు. పాదాభ్యంగ శిరోభ్యంగ స్నాన పానోదకంబుల నిచ్చువారు విచిత్రయానంబుల నెక్కి పోవుదురు. మార్గాయాసంబుల బడలినవారికి విశ్రాంతి నొసంగి సత్కరించు మాన్యులు చక్రవాకప్రయుక్త యానంబులఁ బోవుదురు. స్వాగతోక్తి సత్కారంబున నే విప్రోత్తము నెవఁ డర్చించునో వాఁ డామార్గంబున సుఖముగాఁ బోవును. వెండియు. 716

తే. నతులు బ్రహ్మణ్యదేవున కతిశయకృప, గల్గువానికి నని హరిఁ గరము భక్తిఁ
బూజచేసెడు పావనబుద్ధు లేగు, వారు యమపురికిఁ మోదసారు లగుచు.
తే. పాపములఁ జెందు గో వని పరమభక్తి, దాని నర్చించువారలు యానములను
సుఖముగాఁ బోవుదురు సురల్ చోద్యమంద, ధర్మరాజుపురంబున కర్మిలిదగ.
సీ. దంభానృతంబులఁ దద్దయు విడనాడి
యాయనంతుని బూజ నలరఁజేయు
వారు సారసయుక్త భూరిమయవ్యోమ
యానంబు లెక్కి సంయమనిపురికి
నరుగుదు రెంతో శాఠ్యము దంభమును వీడి
యేకభక్తము చేసి యీశుఁ గొల్చు
వారు హంసలచేత వహియింపఁబడుయాన
ములఁ బోవుదురు వేడ్కలొలయుచుండ

తే. నాల్గుదినముల కొక్కదినంబునందు
నేకభక్తము చేయుచు నిద్ధరీతి
నింద్రియంబులను జయించి యొసఁగువారు
విప్రవాహ్యయానంబుల వేడ్కనెక్కి. 719

క. చనుదురు ధర్మునిపత్తన,మును జేరఁగమూఁడుదివసముల కొక్కట నీ
తిని బూనిన వ్రతములఁ జే,యను బూని భుజించునతఁడు హస్తి రథములన్.

క. మనమలర నెక్కి పోయెడు, ననుదినభోజనము మాని యాఱుదినములం
దు నొకట నన్నము భక్షిం,చిననరుఁడు జితేంద్రియుఁడయి చెందినవేడ్కన్.

క. ద్విరదమ్ము నెక్కి హరిహయు,కరణిన్ యమపత్తనమునఁ గ్రాలుచునుండున్
బురమది యాతనిరాకకుఁ, బరమానందమును గాంచుపగిది నెసంగున్. 722

సీ. పక్షోపవాసంబు పాటించుమానవుల్ శార్దూలయోజితస్యందనముల
పై నెక్కి ధర్మునిపత్తనమ్మున కమరాళి గొల్వఁగ వేడ్క నరుగువారు
మాసోపవాస సమ్మతసద్వ్రతము పూనుసంయతేంద్రియులు భాస్కరకరాళి
భంగి దీపించెడు భాసురయానంబు లెక్కి యముం గాన నేగువారు

ఆ. మఱి దృఢవ్రతముల మన్నించుచున్ మహా, చ్ఛబ్దపూర్వకమయి సాధువినుత
మగుచు నలరుచున్న యట్టిప్రస్థానంబు, నాదరించువారు హరిగతుల. 723

క. సురగంధర్వులు కొల్వఁగ, ఖరకరు దీప్తులను బోలి క్రాలురుచులతో
నరుగుదురు యమునిపత్తన,వరమునకుం బ్రీతిమీఱ భవ్యపథమునన్. 724

క. హరిభక్తి గల్గుచిత్తం, బరుదుగ నొప్పారుచుండ నాత్మాంగము సు
స్థిరయోగమ్మున వశమై, పరఁగం జేసెడునతండు భాసురరథమున్. 725

తే. ఎక్కిపోవును ధర్ముఁడున్నెడకు వేగ, యగ్నిలోన నారాయణు నాత్మ నునిచి,
చొచ్చు నాతండు వహ్నినా శోభిలురథ, మెక్కి యమపత్తనంబున కేగుఁజుండి.

క. అనశనుఁడై విష్ణువు మన,మునఁ దలఁచుచుఁ బ్రాణవర్గమును వదలెడు స
జ్జనుఁ డర్కుఁబోలు రథవర,మునఁ బోవును ధర్మనగరమునకుం బ్రీతిన్. 727

క. జలముల నడుమం జొచ్చి య,చలభక్తిన్ దేవదేవుఁ జక్రాయుధునిం
దలఁచుచుఁ బ్రాణంబులను వ,దలు నాతఁడు సోమసమరథము నెక్కి వడిన్.

క. యమునగరికిఁ బోవును స్వాం,గము నెవ్వఁడు గృధ్రములకుఁ గమలాక్షుని చి
త్తమునఁ దలంచుచు నిచ్చిన,యమునింటికి రథము నెక్కి యరుగు ముదమునన్.

సీ. వనిత బల్మిని బట్టు.కొనుసమయంబున గోవును దొంగలు గొనిచనుతఱి
సాయ మొనర్చుచుఁ జచ్చిన సంగరమందుఁ జచ్చినఁ ద్రిదశాంగనాభి
సేవితుఁడై యముసద్మమునకుఁ బోవు వైష్ణవుఁడై తీర్థవర్యములను
దర్శింపఁ జని విజితస్వాంతుఁడై యుండునతఁడు ఘోరపథంబునందు సుఖము

తే. గాఁ జనున్ భూరిదక్షిణాక్రతువితతిని, సురల నర్చించుసాధుద్విజాలును దత్త

హాటకప్రతిమానసద్యానములను, సుఖముగాఁ బోవుచుందు రాశుగమనమున.
క. పరపీడ నాచరింపక, భరించు నెవ్వాఁడు భృత్యవారంబును వాఁ
డరుగును గనకోజ్జ్వలసుం,దరయానము లెక్కి వేడ్క ధర్మనగరికిన్. 731
ఆ. ఎవరు భూతవితతి నెంతయుఁ బ్రేమింతు, రఖిల జీవకోటి నాదరింతు
రింద్రియములనెల్ల నిద్ధశక్తి జయింతు, రాగ్రహంబు మోహ మంటకుండ. 732
క. గతమదులై వర్తింతురు, ప్రతిలేనివిమాన మెక్కి ప్రభలు వెలయ న
ర్కతనయుపురికిం జనుదురు, గతివైచిత్ర్యంబు మీఱఁగా మునులారా. 733
సీ. ఏకభావమున రమేశుని బ్రహ్మను శంకరుఁ బూజించు సాధుమతులు
పరిశుద్ధులై ధర్మపత్తనమున కేగుదురు మాంసమును దిననిరతిఁ గొనక
యుండువాఁడును శౌచ మురుదయయును గల్గువాఁడు నీయిద్దఱు వరరథముల
నెక్కి ధర్మునిపురి కేగుదు రరయ మాంసముకంటెఁ దినఁగ మిష్టతరవస్తు
ఆ. విలను లేదుగాన నెలమిఁ దన్మాంసంబు, వదలవలయు మిష్టవస్తువితతి
వలనఁగలుగు సుఖము వారక గోసహస్రముల దానమిచ్చుసజ్జనుండు. 734
క. తినుచుండి మాంసమును మానినవాఁడును దుల్యులనుచు నీరజగర్భుం
డనఘుండు వేదవిదులం,దు నుత్తముఁడు పల్కె సభను దోరపువేడ్కన్. 735
ఆ. సకలతీర్థములను స్నానంబుచేసిన, సర్వయజ్ఞములను సమధికమగు
భక్తిఁజేయఁ గలుగు ఫలమేదియో యది,మాంసములను దినుచుమానఁగలుగు.
సీ. ఈరీతి ధార్మికుఁ లెల్లరు యమలోకమునకుఁ బోదురు యానముల వసించి
ధర్ముని గానఁగా ధార్మికులన్ వారిఁ గని తానె మర్యాదలను నెఱింగి
గారవించును సుఖాగమనాసనాదులఁ బాద్యార్ఘ్యములఁ బ్రియభాషణముల
మీరెల్ల ధన్యులు కోరి పరోపకారము చేయుమాన్యులు రమ్యచిత్తు
తే. లెల్లసుఖములఁ గోరియే యిట్టి పుణ్య,కార్యములఁ జేసితి రిదియే కమ్రరథము
దీనినెక్కి సురాంగనల్ దివిరి కొలువ, స్వర్గమున కేగుఁ డచ్చట సౌఖ్యమలరు.
క. చిరకాల మొంది సుకృతము, పరిక్షయంబైన సుంత పాపము మిగులన్
ధరఁ దదనుభవమునుం గను, నరుఁడంచునెఱుంగవలయు న్యాయమిదనుచున్.
క. మనుజోత్తముఁ డెవ్వఁడు రవి,తనయుని సౌమ్యాత్ముగాఁగఁ దండ్రిగ మదిలో
ననిశము తలఁచునో వానికి, ననుపమసంపదలు పొలయు నాశ్చర్యముగన్. 739
క. ముక్తిఫలము నిచ్చు భూతసంహారుఁ డా, ధర్మరాజు సేవ తద్దయుఁ దమి,
సలుపవలయు నతనిసత్కృప సిరి యబ్బు, ధర్మ మతఁడు కాఁడె తథ్య మెన్న. 740
సీ. కామమొసంగు మోక్షము నిచ్చు మఱియును ధర్మమే తల్లియును దండ్రియు నగు
భ్రాతయు నాథుఁడు పరమమిత్రుఁడు స్వామి రక్షకుండును ధాత యాక్షయఫల
దానదక్షుఁడు నగు ధర్మముననె యర్థ మద్దానఁ గామము నందువలన
భోగములును ధర్మమున మహైశ్వర్యము స్వర్గము లభియించు సరసులార,

తే. తన్ను సేవించువారల ధర్మమెట్టి, భయమునుండియుఁ గాచు దేవత్వమిచ్చు
ద్విజత గల్గించు సత్ఫలవితతి నొసఁగు, నరులప్రాక్పాప మెప్పుడు నాశమొందు.
క. ఆతరుణంబున వారికిఁ, జేతము చక్కఁగ స్ఫురించుఁ జెందును ధర్మం
బీతతిఁ జేయందగును స,నాతనపథ మానఁదగు ననందగు నూహల్. 742
క. భవములు సహస్రములుగా, నవనిన్ జనియించి పొంద ననువుపడని మా
నవతం గనియును ధర్మం, బెవఁ డాదృతిఁ జేయకుండు నెన్నక మదిలోన్. 743
క. అతఁడును వంచితుఁడే యగు, నతికుత్సితుఁ డయియొ నిస్వుఁడయియో కడువ్యా
ధితుఁడయియొ మూర్ఖుఁడయియో, క్షితి సేవకుఁడయియొ జనిని జెందును జుండీ.
సీ. ఎవరు దీర్ఘాయుష్యమేపార శూరులై పండితులై భోగపరతఁ గనుచు
నారోగ్యవంతులై యతిరూపవంతులై యుందురో వార లీ యుర్వి ధర్మ
మాచరించినవార లంచుఁ దలంపుఁడీ యట్టిధర్మాత్ము లీయమునిపురికి
నుత్తమమార్గమున్ దొప్పుగా యానంబు లెక్కి పోవఁగ నేర్తు రిఁక నధర్మ
ఆ. మాచరించు వారలవనిఁ దిర్యగ్యోనిఁ
బుట్టుచుందు రెవరు భూరినరక
మడఁచు వాసుదేవు నాశ్రయింతురో వారి
స్వప్నమునను యముఁడు జంకుఁ గనఁగ. 745
క. జనిమృతులాదియు లేకయె, తనరుచు దైత్యాంతకుఁడయి దర్పంబునఁ బొ
ల్చినవాసుదేవు ధ్యానిం,చినవారిని యముఁడు చూడఁ జింతింపఁ డెదన్. 746
క. మనసున వాక్కునఁ గర్మం,బున నెవ్వరు కమలనయను భూరికృపావా
రినిధిన్ శరణముఁ గోరిన, వనజాప్తుని సుతుఁడు కనఁడు వానిన్ భీతిన్. 747
ఆ. వారు ముక్తిఫలముఁ బడయువారలు జను, లెవరు లోకనాథు నిద్ధమూర్తి
సతము వందనముల సమధికభక్తిఁ బూ,జింతు రట్టివారు శ్రీశుపదము. 748
క. కనఁబోదు రొండుచోటికిఁ, జన రేభీతియును లేక సతముందురు వా
రనఘులు గావున దూతల, వనరుహమిత్రాత్మజన్ము వానిపురంబున్. 749
తే. దానిమార్గంబునుం గానఁగా నరుగరు
వెన్నుఁ బూజించు భక్తులు వితతనరక
ములను గాంతురె మునులార వినుఁడు పాప
ముల నొనర్చియు నతిమోహమును గనియును. 750
క. హరిఁ బాపతూలహుతవహుఁ, బరమాత్ముని గొలిచినట్టి భవ్యాత్ములు పో
వరు నరకమార్గమున నే, పురుషులు శాఠ్యముననైనఁ బురుషోత్తమునిన్. 751
క. స్మరియింతురొ సంతత మా, నరులంగము వదలి లోకనాథునిపదమున్
సురుచిరమును గనఁబోదురు, నిరతము గాకున్న నొక్కనిముసం బైనన్. 752
క దనుజాంతకుఁ గీర్తించిన, మన మెప్పుడు క్రోధయుతి విమానితమైనన్
గనుదురు భగవన్మహిమం,బున ముక్తిపదంబుఁ జేదిభూపతిపోల్కిన్. 753

## నూటయొనిమిదవ యధ్యాయము.

### ధర్మము సర్వోత్కృష్టము.

చ. అనవిని మౌను లిట్లు యమయాతన లెల్ల వచించు వ్యాసవా
క్కును విని సంశయం బమరఁ గొబ్బునఁ బ్రశ్న మొనర్చి రిట్లు ధ
ర్మనిచయవేత్త వీవు బహుమాన్యుఁడ వౌదువు కానఁ జెప్పుమా
మనుజున కెన్నఁ దండ్రియును మాత గురుండును బూజ్యు లౌటచేన్. 754

తే. ఎట్టి సాయముచేయుదు రెన్న జ్ఞాతి, బంధువర్గము మిత్రనివహ మదెట్టి
సాయ మొనరించు?గృహము వర్ష్మములోష్ట,కాష్ఠసమమనివిడనాడి కదు వగలను.

క. అరిగెడుజనముల నేయే, నరు లరిగెద రనుసరించు నయముగఁ జెప్పుమా
వరమునిచంద్రా! యన నా,దరణముమీఱంగ మౌనితల్లజుఁ డనియెన్. 756

క. ఒక్కఁడె జన్మించును ధర, నొక్కఁడె మరణించు మఱియు నొక్కఁడె దాఁటున్
జక్కని మార్గము దొరకని, యక్కజమగు లోకములను నతిశయశక్తిన్. 757

క. సుకరముగాఁ దరియించును, నొకఁడే దుర్గతికిఁ బోవు నొక్కఁడె యా వే
ఱొకఁడును దోడ్పడఁ జాలఁడు, సకలమునకుఁ దానె కర్త సంయములారా.

సీ. అసహాయుఁ డగుఁజుండి యతనికి నెవ్వరు సాయము చేయంగఁ జాల రవనిఁ
దల్లిదండ్రులు నన్నదమ్ములు తనయులు గురువులు జ్ఞాతులకూటములును
సఖులును జచ్చినజంతువు విడనాఁడి కాష్ఠలోష్టసమంబుగాఁ దలఁచుచు
క్షణకాల మేడ్చి నిక్కపుఁబ్రీతిలేమిని బోదు రిండ్లకుఁ బరాఙ్ముఖులు నగుచు

తే. నాశరీరము నశియించు నాత్మకృతము,ధర్మ మొక్కఁడె వెనువెంటఁ దగిలియుండు
గాన సాయపడంగోర్కి గల్గునేని, ధర్మమును గొల్వవలయు సతంబు జనులు.

క. ఏనరుఁడైనను ధర్మముఁ, బూనిక సేవించునేని పూజ్యతమంబై
మానిత మగుస్వర్గంబును, గానంగాఁ జనును లేవుగా సంశయముల్. 760

క. ఆరీతిగా నధర్మము, గారవముగ సంగ్రహింపఁగా దుర్గతికిన్
జేరును గావునఁ బాప,ప్రారంభములందు విముఖు లగుదురు సుజనుల్.. 761

క. మనుజులకు ధర్మ మొక్కఁడె, తనరెడు సాయం బటంచుఁ దత్త్వజ్ఞులు ప
ల్కినజాడ కానఁబడియెడు, మునులారా!లోభమోహముల భీతిమెయిన్.762

తే. మఱి యనుక్రోశమున నైన మాన్యుఁ డెపు డ
కార్యములఁ జేయరాదు నిక్కము పరార్థ
ములను గొనరాదు ధర్మార్థములును గామ
మనెడు నీమూఁడు జీవితమునకు ఫలము. 763

క. కనుక నధర్మముచే రని, యనువున నిమ్మూఁటిఁ గొనఁగ నార్యుఁడు యత్నం
బును బూనవలయు నా విని, మునివరు లిట్లనిరి వ్యాసమునిపతితోడన్. 764

క. భగవంతా! నీవలనన్, దగ వింటిమి పరము హితము ధర్మయుతముగాఁ
గ గణనముగన్న వాక్యం,బుగ దాని నెఱింగితిమి విమోహము వాసెన్. 765
క. తనునిచయము వినఁ గోరిక, మనముల జనియించెఁ దనువు మనుజుఁడు చావం
గనె సూక్ష్మమగుచుఁ దగఁ గాం,చును నవ్యక్తతను సాధుశుభగుణనిలయా.
క. కనులకుఁ గనరాకుండును, గనుకనె యద్దాని నెట్లుగా ధర్మ మ్మెు
య్యనఁగూడి పోవఁజాలును, వినిపింపుము సంశయములు విడనాడంగన్. 767
వ. అనుటయు వ్యాసుం డిట్లనియె. 768
క. ధరణియు జలవాయువు లం, బర మగ్నియు మనసు బుద్ధి పరమంబగుచుం
బరఁగెడు నాత్మయు ధర్మముఁ, బరికించుచునుండు నెల్లభంగుల నెపుడున్. 769
క. ఇవియే ప్రాణుల కెల్లను, దివానిశము సాక్షులగుచుఁ దెల్లంబుగ నె
ల్లవిధముల ధర్మమును గాం,చు విలోలముగాని దృష్టి శోభిలుచుండన్. 770
సీ. త్వక్కు మాంసం బస్థితతులు శోణితము శుక్లంబు నాఁజనునివి కాయమునువ
దలఁ బ్రాణములు పోవ ధర్మసహాయుఁడై యంత జీవుఁడు సుఖ మనుభవించు
నిహపరములయందు నిది ధర్మచరితంబు వినఁగఁ గోరుదురేమొ వేగ చెపుఁడ
నావిని యమ్మునినాయకు లిట్లని రిద్ధధర్మచరిత్ర మిపుడు వింటి
తే. మెట్లు రేతస్సు వర్తిల్లు నెఱుఁగవలయుఁ
దద్విధం బంచుఁ జిత్తముల్ త్వరపడియెడుఁ
దెలుపుమా యన్న వ్యాసుఁడు తెలిపె నిట్ల
తనువునందున్న యేసుధాశనులు సతము. 771
క. తినుదురో యన్నముఁ బృథ్వియు, ననిలుఁడు ననలుండు సలిల మంబరమును జ
క్కనిమనసు దృష్టినొందును వినుఁ డివియే పంచభూతవితతులు నుండీ. 772
తే. మనసు నాఱవదగు నంత ఘనతరాత్మ, శుద్ధమగు నప్పు డొదవును శుద్ధమైన
యట్టి రేతస్సు గర్భంబు నదియె గల్గఁ, జేయు శ్లేష్మముతోఁగూడి. చిత్రరీతి. 773
వ. స్త్రీపురుషుల శోణితశుక్లసంయోగమే గర్భ మనంబడు. ఇదియె రేతోమహత్త్వం
బు ఇంకనేమి వినఁగోరుదు రన విని మహాత్మా గర్భోత్పత్తివిధంబు వింటిమి.
పురుషోత్పత్తి వినఁగోరుదు మన వ్యాసుం డిట్లనియె. పంచమహాభూతంబు
లెవనికభిముఖములు గాకయుండునో వాఁడు దుర్గతినొందు. భూతసమాయుక్తుఁ
డయ్యెనేని జీవితమును గాంచు. అత్తఱి దేవతాపురుషుని శుభాశుభకర్మము
నవలోకింతురు. పంచభూతాంతర్గతులగు దేవతలే కనఁజాలుదు రని తెలియ
వలయు నావిని మును లిట్లనిరి. 774
తే. చర్మమును ద్వక్కు నస్థి మాంసంబు వదలి, భూతపంచకమును వీడిపోయి జీవుఁ
డెందునివసించి సుఖమును డెంద మలర, ననుభవించునుదుఃఖంబు నెట్లు గుడుచు.

సీ. అని ప్రశ్న మొనరింప విని వ్యాసుఁడిట్లను గర్భముఁగూడి నిక్కముగ జీవుఁ
డొందు రేతోయుక్తి నిందుబింబాస్యగర్భమునందుఁ బుష్పంబు భాసురమగు
దానిఁబొందును మఱి తరుణము రాఁగ ధర్మనిదూతవితతిచే ఘనతరమగు
కష్టపరంపర గలుగ దుఃఖించుచును వారివంకనె తాను వధము గాంచు
తే. ఘోరసంసారచక్రమే క్రూరదుఃఖ
జలధియందు మునింగి క్లేశప్రకార
మిదికదా యంచు నాజీవుఁ డెఱుఁగు నిలను
బ్రాణి యాతఁడు జని దొట్టి వరసుకృతము 776
క. తనకుం దోడ్పడ ధర్మం,బునఁ గల్గెడుసత్ఫలములఁ బొందును జన్మం
బునుదొట్టి ధర్మమునె తా, నొనరించిన నిత్యసుఖము నొందును సతమున్. 777
తే. నడుమనడుమ నధర్మంబుఁ గడఁగి చేయు
చుండునే నాది సుఖముల నొంది యవలఁ
గుడుచు దుఃఖములను మఱి క్రూరకర్మ
ముల నధర్మయుతిం జేయుమూర్ఖుఁ డిలను. 778
క. చిరకాలముండి మృతి గని, ఖరకరసుతుపురికిఁ బోయి గాఢతరముగాఁ
బరఁగెడు దుఃఖములంగని, ధరఁ దిర్యగ్యోనులందుఁ దా జనియించున్. 779
క. ఏయేకర్మము లొనరిచి, యేయోనులఁ బుట్టుచుండు నిల జీవుం డా
యాయిప్రకారమ్ముల నవి, యీయెడ నెఱిఁగింతు మీకు నేర్పడ వినుఁడీ. 780
వ. శాస్త్రంబు లితిహాసంబులు వేదంబులు ఘోరము యమనగరంబని వర్ణించుఁ
గదా యది మర్త్యలోకంబునందె యని యెఱుంగవలయు. యమలోకంబునఁ
బరమపావనంబులగు స్థానములు దేవలోకతుల్యములు గలవు. తిర్యగ్యోని
వ్యతిరిక్తంబులై యవి యుండు. సద్గతిమంతంబులగు. మఱియు బ్రహ్మలోకసమ
మగుయమునునిభవనంబునందు నియతకర్మబద్ధుఁడై జంతువు దుఃఖంబు ననుభ
వించు. ఏయేభావంబున నేయేకర్మమున గతినొందు నాతఁడు పొందుఘోరనర
కంబు నెఱింగించెద వినుండు. 781
చ. శ్రుతితతులం బఠించియును క్షోణిసురుం డతిమోహపాశసం
యుతిఁ గనుచిత్త మొప్పఁ గుల మొయ్యన వీడినపాపచిత్తుఁ డా
దృతి ధనమీయఁ బుచ్చుకొను నేని యతండును గార్ధభాంగసం
గతిఁ గను దానియాయు వగు క్ష్మాస్థలిపైఁ బదునైదువర్షముల్. 782
క. ఖర మది మృతిగని వృషభత, ధర సప్తాబ్దములు బ్రదికి ధర్మనగరికిన్
ద్వరఁ జని క్షితి జనిఁగని బ్రహ్మరాక్షసుండై చెలంగి యతిరభసమునన్. 783
క. తిరుగుచు మాసత్రయ మీ, ధరపై వసియించి చచ్చి ధాత్రీసురుఁడై
పరిపూతుం డగు మఱి యే, నరుఁ డెత్తఱిఁ బతితుఁడైన నరునాదృతిచేన్. 784

సీ. యజ్ఞము చేయఁగా నగు సత్ఫలంబని పురికొల్పి యాజకుం డురుధనంబు
గాంచు నంచను సూహగలిగి తాయాజకుండగునో యాదుష్టుఁడీయవనిగృముల
జాతియందును బుట్టు సరిగ జీవించును బదునైదుసంఖ్య సంవత్సరములు
తరువాత మృతిఁగని ఖరజాతి జన్మించి పంచాబ్దములు పుచ్చి పంది యగుచు
తే. నన్నియే వత్సరములుండి యవలఁ గుక్కు-
టమయి పంచాబ్దములు జీవితమునఁ గడపి
జంబుకంబయి జన్మించి సమలు పంచ
సంఖ్యలను బుచ్చి శ్వజని వర్షంబొకండు. 785

క. ఇలఁ బుచ్చి మానవుండై, పలుభంగుల నోర్పులేక పరమార్తుం డై
కలఁగుచు మృతిఁగని మఱి దేవలుఁడై జన్మించుఁ బాపవర్తనుఁ డగుచున్. 786

తే. అందు విశ్వాసహర్తయై యంత మత్స్య
జన్మ మెత్తును దుర్మతి క్షమ నెనిమిది
వత్సరము లుండి జింకయై వరుస నాల్గు
నెలలు గడపుచు ఛాగమై కలఁగుచుండి. 787

ఆ. ఒక్కవర్ష ముండి చిక్కులఁబడి మఱి, కీటమై జనించి పాటవమున
యవలు తిలలు మినుము లల్లి కుళుత్థముల్, చణకములు పెసలును సస్యజాతి.

వ. మఱియుఁ బెక్కునామంబులం బరఁగుధాన్యంబుల నపహరించుచు మూషికంబై
జనించి లజ్జలేక తిరుగుచుఁ జచ్చి సూకరంబై పుట్టి యప్పుడే రోగంబునం జచ్చి
శునకజన్మంబుగాంచి మరల మానుషుండై పుట్టి యందు మూఁగయై యైదేండ్లు
నివసించి మృతుండై మరల మానవుండై జనించు. పరదారాభిమర్శదోషంబున
వృషకజన్మంబు గాంచు వరుసఁగా సృగాల గృధ్ర వ్యాళకంకబకజన్మంబు లెత్తు.
మఱియును. 789

క. నరుఁ డెవఁడు భ్రాతృదారను, బరికింపక మోహితుఁడయి పాప మనీషన్
బరమాదృతి గ్రహియించునో, త్వరఁ బుంస్కోకిలత నొందు వర్షం బొకటన్.

సీ. సఖి గురు భూపాల సారసాత్ముల గామమత్తుఁడై గ్రహియించు మానవుండు
పందియై పుట్టును బంచవర్షములు తదాకృతిమై నుండి యంత బకము
గాఁబుట్టి పదియేండ్లు గడపి పిపీలికయై మూఁడుమాసమ్ము లవని బ్రదికి
మాస మొక్కఁడు కీటమై సముధికదుఃఖముల నొందికృమి యోనిఁ బుట్టి యందుఁ
తే. బదియు నాలుగు మాసముల్ పరమకష్ట
ములను గుడుచుచు గడపి యఘులయి మగుట
మనుజతం బొందు నిట్టు లీఘునతరాఘు
ములకుఁ గల్గును ఫలమ్ములు వినుఁడు పిదప. 791

చ. ఒకనికిఁ గన్య నిత్తునని యొప్పుగఁ బల్కి మనస్సు మాఱి వే
ఱొకనికి నాకుమారికనె యుద్యమ మొప్పఁగ నీయఁబూను పా
పికిని గుబుద్ధియై గురునిఁ బీడితుఁగాఁగ నొనర్చు శిష్యరా
శికిని ద్రిజన్మముల్ గలుగుఁ జెప్పెద వానిఁ గ్రమంబు మీఱఁగన్. 792

క. తొలిపుట్టువు శునకమ్ము, వ్వలిపుట్టువు జంబుకం బవలిజన్మం బీ
యిల ఖరము నగును మఱి యా, ఖలు లిద్దఱు విప్రజనిని గాంతురు గాదే. 793

సీ. మనసున నే గురుమానినిఁ గామించునట్టిశిష్యునకుఁ బాపాత్మకునకుఁ
దత్పాపఫలముగాఁ దగుజన్మములు వినుఁ డాది శ్వయోనియం దట్టై పుట్టి
మూఁడువర్షము లుండి పీడలఁ గుడుచుచు మృతినంది యంతటఁ గృమిజనిఁ గని
యొకవత్సరమ్మట్లొ యుండి మృతింగని బ్రహ్మయోనిం బుట్టుఁ బరమపాను
తే. లార పుత్త్రిసమానుఁ డంచారయఁ దగు, శిష్యు నిష్కారణము ధనసిద్ధిఁ గోరి
చంపు గురువు జనించు హింసాప్రధాన, జాతియం దని యెఱుఁగుఁడీ సత్యమిద్ది.

చ. జననిని దండ్రి నేసుతుఁడు జాల్మత గౌరవ మొప్పఁ జూడ కా
ర్తిని గుదియింపఁ జూచు నతిధీరత నాసుతుఁ డంతఁ జచ్చి తా
జననముఁ గాంచుజుండి ఖరజాతి దశాబ్దము వేగ నక్రజా
తిని జనియించి వత్సర మతిస్థిరకష్టము లొంది యవ్వలన్. 795

వ. మానవుండై పుట్టు. ఎవ్వనితల్లిదండ్రులు రోషముగలవారుగఁ జేయఁబడు దురో యాతనయుండును ఖరయోనిం బుట్టి పైయట్ల పాపం బనుభవించు. అంతియకాక రెండవజన్మమున బిడాలంబై యేడునెలలు బ్రదుకు. పిదప మానవుండై పుట్టు. ఎవ్వఁడు మాతాపితల దూషించు నాతండు *సారికంబై పుట్టి పాపంబనుభవించు. ఏతనయుఁడు తల్లిదండ్రులం గొట్టు నాపాపాత్ముండు కచ్ఛపంబై జనించి పదివత్సరంబు లుండి శల్యకంబై పుట్టి మూఁడేండ్లు గడపి వ్యాళంబై యాఱుమాసములు జీవించి మానవుండై పుట్టువుం గాంచు. ఏమానవుఁడు తనయధిపతి యాహారంబుఁదిను రాజద్వేషుల సేవించు నాతఁడు జ్ఞానశూన్యుఁడై చచ్చి వానరంబై పదియేండ్లు బ్రదికి మూషికంబై సప్తవత్సరములు జీవించి శునకమై యాఱునెలలు పుచ్చి పిదప మానవుండగు దాచనిచ్చిన వస్తువును హరించు పాపమతి మృతుండై యమనగరంబునకుం జని మరలి శతజన్మంబుల నానాయోనులం బుట్టి కృమి యగు. అందుఁ బదునైదువత్సరంబులు పుచ్చు. పాపక్షయము కాఁగా మానవుండై పుట్టు. 796

క. సురకార్యమ్మొనరింపక, త్వరపడి పితృకార్యనిరతిఁ బాటింపక యా
సురపితృదేవతలకు భ, క్తిరతిని దర్పణము చేయఁ డివురక స్వేచ్ఛన్. 797

క. చరియించునో యామనుజుఁడు, మరణముగని వాయసమయి మహిఁ బుట్టును వ

* సారీకస్సంప్రజాయతే—అనిమూలము.

త్సరములు నూఱుండును తీఱి,దరువాతం గుక్కుట మగుఁదదఘము గుడువన్.

తే. మరల వ్యాళంబుగాఁ బుట్టి మాస ముండి
మనుజుఁడై పుట్టు జనకసమాను జ్యేష్ఠు
నవమతిం గూర్చు నెవ్వఁ డాయధముఁడు మృతిఁ
గాంచి క్రౌంచంబుగాఁ బుట్టఁగలఁడు మహిని. 799

సీ. అందుఁ బదేండ్లుండు నవల జీవక మగుఁ దరువాత మనుజుఁడై ధాత్రిఁ బుట్టు
వృషలుఁడు బ్రాహ్మణి నెంచక కూడినఁ గ్రిమియోనిఁ బట్టును మృతిఁగని తరు
వాత సూకర మగు వ్యాధిచే మృతిగని శునకమై జన్మించి తనయఘఫల
మనుభవించుచు మఱి యవని మానవుఁడయి జన్మించునందును సంతతిఁగని

తే. చచ్చి మూషికమై పుట్టు జన్మము లిటు
లెత్తి యెత్తి యఘంబెల్ల నెంతొ వగల
ననుభవించుఁ గృతఘ్నుఁడు యమనగరికిఁ
బోయి క్రూరాత్ములై భటుల్ భూరిరుషను. 800

క. తను వేదనఁ బొందింపఁగ, వనటంబొందుచును బెక్కుభంగులుగాఁగం
గనఁబడునరకంబులఁ బడి, జనియించును భూతలమున జలకీటంబై. 801

వ. దండక ముద్గర శూలాగ్నికుండ దారుణాసిపత్త్రవన వాలుకాకూట శాల్మలీ
ప్రముఖనరకంబులను బడియుండునని యెఱుంగవలయు. జలకీటంబై పంచదశ
వత్సరములుండి గర్భముదాల్చి యశ్లే మరణించి పెక్కు క్షుద్రజన్మంబు లెత్తి
మరలఁ దిర్యగ్జంతుజన్మంబు లెత్తి కూర్మమై పుట్టియుండు. 802

సీ. దధిని దొంగిలు నయ్యధముఁడు బకంబొ భేకంబొ యైపుట్టును గడు నసంస్కృ
తములగు చేఁపలఁ దస్కరించినవాఁడు మధుదంశమై పుట్టు మహిని మఱియు
ఫలములనున్ మూలముల దొంగిలించినయతఁడు పిపీలికయై జనించుఁ
బాయసంబు హరించుపాపచిత్తుఁడు పుట్టుఁ దిత్తిరియై మఱి తెంపుచేతఁ.

తే. బిష్టమయభక్ష్యములఁ గ్రూరవృత్తి నపహ
రించునతఁడు నులూకమై మించు జలముఁ
గైకొనిన వాయసం బగుఁ గాంస్యహార
కుఁడును హారీతమై పుట్టుఁ గుతలమందు. 803

క. రాజతభాజనహరకుఁ, డీజగతిఁ గపోతజన్మ మెత్తును మఱియున్
భాజనముఁ గాంచనమయము, నేజడుఁడు హరించు నతఁడు కృమికులజుఁడగున్.

వ. పట్టువస్త్రముల నపహరించినఁ గురరంబగు. చెఱకు దొంగిలిన నర్తకుం డగు.
వస్త్రహారకుఁడు శుకంబయి జన్మించు. దుకూలాంబరముల హరించువాఁడు
హంసంబై పుట్టు. కార్పాసవస్త్రహారకుఁడు క్రౌంచం బగు. పట్టంబు నావికంబును
హరించిన శశకం బగు. కర్పూరచూర్ణంబు దొంగిలునాతఁడు మయూరం బగు.

రక్తవస్త్రముల హరించుమానవుఁడు జీవంజీవకంబై పుట్టు. చిత్రవస్తువులను గంధద్రవ్యముల నపహరించిన నెలుకయై పుట్టు. ఆజన్మంబునఁ బంచదశాబ్దము లుండు. క్షీరహారకుఁడు బలాకాజనిం గాంచు. మోహాసమన్వితుండై తైలంబు హరించినఁ దైలపానముచేయు కీటకమై జనించు. ఆయుధధారియై శస్త్రహీనుఁడగు పురుషుని వధించి ద్రవ్యముం గొనిన గార్దభంబై పుట్టువుం గాంచు. ఆజన్మంబున వర్షద్వయంబు పుచ్చి శస్త్రహతిం గాంచి మృగయోనిం బుట్టి నిరంతరోద్విగ్నమానసంబున నుండు. అట్లు వత్సరంబుం బుచ్చి శస్త్రమృతినొంది మీనంబై జాలబద్ధ్యంబై నాల్గవమాసమందె మృతినొంది శ్వాపదంబై జనించి వత్సరంబులు పదిగడపి వ్యాఘ్రజన్మంబున నైదువత్సరము లుండి క్రమంబుగఁ బాపంబు నశింప మానవుండై పుట్టు వాద్యముల హరించి లోమశజంతు వగు. పిణ్యాకసమ్మిశ్రాన్నమును దొంగిలిన ముంగిస యగు. ఘృతమును హరించినఁ గాకమద్గుజన్మంబులం దొక్కఁడు సిద్ధించు. మత్స్యమాంసము దొంగిలిన వాయసంబగు. లవణహారకుఁడు చిరికాకంబై పుట్టు. విశ్వాసంబున దాఁచఁబెట్టిన ద్రవ్యంబును హరించువాఁడు మత్స్యయోనిం బడు. మరల మనుజుండై పుట్టి యల్పాయువొంది పాపము లొనరించి తిర్యగ్యోనిం బుట్టు. ధర్మము ప్రమాణమని తలంపని మానవులు పాపంబు లొనరింతురు. వారొనరించు వ్రతంబులు నిష్ఫలంబు లగు. సుఖదుఃఖయుతులై వ్యాధిబాధితులై మ్లేచ్ఛులై పుట్టుదురు. ఎవరు జననాదిగఁ బాపముల వర్జింతురో వారరోగులై రూపవంతులై ధనసంపన్నులై యుందురు. స్త్రీలు నీపాపముల నొనరించిన నిట్టిఫలంబుల నొందుదురు. ఇట్టి పాపము లొనరించినవారికి భార్యలై పుట్టుదురు. అపహరించుట దోషంబని పరికీర్తితంబు. మునులారా! మీప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చితిని. ఈవిషయము మున్ను దేవర్షులకొఱకు బ్రహ్మ చెప్పుచుండఁగా విన్నవాఁడను. ఆ విధంబంతయు మీకు నెఱింగించితిని. మీరీగాథ విని ధర్మంబునందె బుద్ధి నిలుపుఁడని వ్యాసుండు పలుకుటయు. 805

---

## నూటతొమ్మిదవ యధ్యాయము.

### శుభప్రాప్తిప్రశ్నము.

చ. అనఘ! యధర్మరూపగతు లన్నియుఁ జెప్పితి వింక ధర్మమా
ర్గనిచయముల్ వినంగఁ గడుఁ గౌతుకమయ్యెడి వక్త్రసంతతిన్
ఘనుఁడవు నీవు పాపయుతకర్మములం బొనరించి మేలు నీ
యనిగతి కేగువా రటులె యర్హములై తగుకర్మసంతతిన్. 806

క. ఒనరించి శుభగతిం గనఁ, జనుదురుగద వానివిధులఁ జక్కఁగఁ జెపుమా
విన వేడుకయ్యె నెట్టివొ, మునివర శుభపాపకర్మములు తద్విధులున్. 807

చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నత్తఱిఁ గెల్ల వచింతుఁ బాపముల్
మనమునఁ గోరి చేయుచును మానము వీడి యధర్మభూతముల్
దను బరికింపఁ దద్వశతఁ దాఁ గను మానవుఁ డందునన్ మనం
బున కసుఖంబుఁ గూర్చుసలముం గన నారక మొందుఁ జయ్యనన్. 808

సీ. ఎవఁడు మోహంబున నెఱుఁగ కధర్మంబు నాచరించియు నాత్మయందుఁ జింతఁ
బూని సంతాపంబుఁ బొడఁగని చిత్తసమాధిని గైకొని మరలఁ బాప
కార్యములను జేయకయ యుండునో మఱి తచ్చిత్త మెంత యధర్మకృత్య
ములయెడ నేవగింపును బొందునో వానితను వధర్మవిముక్తిఁ గనుచునుండు
ఆ. నంత కంతకున్ మహాత్ములై ధర్మజ్ఞు, లైన విప్రవరుల నరసి వారి
కెఱుఁగఁ బలుకవలయు నిది యధర్మపథంబు,నాశ్రయించితి ముని పార్యులార.

క. దాని నిఁక నాశ్రయింపను, మానసమునఁ దెల్వి దోఁచె మన్నింపుఁ డటం
చూనిన తెల్విని వేఁడిన, మానును బాపంబు బ్రహ్మమానులకరుణన్. 810

క. తనమదిఁ గుత్సించు చధ,ర్మనియతకార్యంబు సాధుమండలమున కె
ల్లను దెల్పుకొలఁది నయ్యది, వినాశముం బొందుచుండు వేగము మీఱన్. 811

చ. ధరణిసురోత్తమాళిఁ గని దానములం బరితృప్తి నొందఁగా
వరుస నొసంగి పాపములఁ బాఱఁగఁదోలి సుఖించు నిచ్చమై
నురగము ప్రాఁతదౌ కుబుస మొయ్యన వీడి చరించునట్లు సు
స్థిరమగు హృత్సమాధి గని దివ్యపదంబును గాంచు వేగమే. 812

చ. వినుఁడు వచింతు దానముల వేని నొసంగిన దుష్కృతంబు లొ
య్యనఁ బరువెత్తు దూరముగ నంతట ధర్మము సుస్థితిం గనున్
మనమున నింక దానములమండలమందుఁ బ్రధాన మేదియో
యనునది గొప్పప్రశ్న మగు నావిధిఁ దెల్పెద నాలకింపుఁడీ. 813

తే. అన్నిదానంబులందును నన్నదాన, మెక్కుడగుఁ గాన ధర్మంబు నెఱిఁగినట్టి
యతఁడు సంప్రీతి నతిథుల కన్న మిడగ,వలయు నన్న మెల్లరకును బ్రాణ మగును.

క. దానిన జంతువు పుట్టును, దానన్ లోకంబు లెల్లఁ దనరుఁ బ్రతిష్ఠం
బూని యటుగాన నన్నమె, యా నిలనుత్తమము చూడ నన్నిఁటియందున్.

చ. సురపితృ మానవులు క్షోణిని నన్నమునే ప్రశస్తమం
దురు మఱి యన్నదానమునఁ దోఁచును స్వర్గము ముందు న్యాయవి
స్తరణము మీఱఁ గూర్చిన నితాంతశుభప్రదమైన యన్నమున్
ధరణిసురేజ్యసంతతికి దానము చేయఁదగున్ విధిన్ దమిన్. 816

చ. శ్రుతులను నేర్చి యోగమున సూనృతవాక్కులఁ బేరుఁగాంచి శాం
తత నలరారు సద్ద్విజులఁ దద్దయు భక్తియుఁ బ్రీతియుం దగన్

హితమగు నన్నదానమున నెంతయుఁ బ్రీతులఁ జేయఁ దత్ఫలం
బతులిత మంచుఁ జెప్పఁదగు నాతనికిం దగు నేది కోరినన్. 817

క. ఒకపరి క్ష్మాదివిజేంద్రద,శక మొక్కనియింట సాధుశాకోపేతం
బకలంకము నౌనన్నమె, సకమెసకఁగఁ దినిన నది యొసంగదె ముక్తిన్. 818

క. మన సెంతో శాంతమై యుం,డినఁ జేసిన యన్నదాననియతఫలము గ
ల్గును దిర్యగ్గతి యుండదు, వినుఁడీ పదివేవురైన విప్రులు ప్రీతిన్. 819

తే. ఎవనియింట భుజింతురో యెల్లపాప,ములు నశింపఁగ నాతఁడు ముక్తి కేగు
వేదవేత్త మహీసురవృత్రహరుఁడు, బిచ్చమెత్తినయన్నము ద్విజవరునకు. 820

క. పరమాదృతి నొసఁగినచో, దురితంబులు తొలఁగి సుఖము తోడనె కల్గున్
ధరణీసురవిత్తంబుల, హరియింపక వానిఁ గాచి న్యాయపథమునన్. 821

క. సమకూడిన విత్తంబున, నమలమహీదివిజవరుల కామ్నాయసమూ
హము నేర్చినవారికి న,న్నము పెట్టిన దుష్కృతములు నశియించు వడిన్. 822

సీ. షడ్భాగశుద్ధమౌ సాధుకృష్యంశంబు విద్వన్మహీసురవితతి కొసఁగు
వైశ్యుఁడు పాపౌఘవర్జితుం డగుమఱి ప్రాణసందేహమ్ము ప్రాప్తమైన
తఱి నొడల్ దాఁపక దస్యులఁ బోఁదోలి గోబ్రాహ్మణులఁ గాచి కోరకుండఁ
దనకు లభించిన ద్రవ్యంబునన్ ద్విజవరుల కేశూద్రుఁడు వరుస నన్న

తే. దానమును జేయునతని యుద్దామపాప,ములు నశించును దనుబలమున సహింస
చేత నార్జించినధనంబుఁ బ్రీతిమీఱ, ధరణిసురులకు నిచ్చినఁ దలఁగు నఘము.

క. న్యాయసమార్జిత మగుధన, మేయనువునవైన వేద మెఱిఁగినద్విజులన్
బాయనిభక్తిని బిలిచి మ,హాయత్నముమీఱ నీయ నఘము లడంగున్. 824

వ. అన్నమూర్జస్కరంబుగావున నాయన్నదానమున నూర్జస్వియగు. మఱియు 825

ఆ. సాధుజనులు పూనుసరణి నాశ్రయ మంచుఁ, దలఁచువారు పాపతతులఁ బాసి
సుకృతములను గాంత్రు సొరిది దానంబుల, విధ మెఱింగి యనిరి విబుధు లిట్లు.

క. దానము లందుత్తమ మగు, దానంబన నన్న మిడుట ధర్మం బనఁగా
మౌనివరులార! యదియే, సూనృతపథ మౌన దాని చొప్పెఱుఁగనగున్. 827

ఆ. న్యాయపథముచేత నార్జింపఁబడిన ధ,నంబుచేత నోదనంబు తగిన
వారి కిడుట ముక్తిఁ గూరుచునది యందు, రార్యవర్యు లదియె యనుపమగతి.

క. జనులకు నన్నమె సద్గతి, గనుకన్ దానోత్తమంబుగాఁ జెప్పఁబడున్
మునులార! యన్నదానమె, యనుపమగతి నిచ్చు నంత్యమం దగుసుఖమున్.

క. ఈరీతిం బుణ్యాత్మకు, లారసి తద్దాన మొసఁగి యఘముల విడిపెం
పారువిముక్తిం గాంతురు, సారన్యాయార్జితంబు సతము ఫలమిడున్. 830

వ. ప్రాణాహుతీపూర్వకంబుగా నన్నంబు భుజింపందగు. అన్నదానం బొసంగిన దినం
బవంధ్యంబు. వేదవేత్తలశతంబున కన్నదానము నిత్యము చేయునరుఁడు నరక

ములఁ గాంచఁడు. మఱియు న్యాయ మెఱింగినధర్మాత్ములకును సకలేతిహాస ముల నెఱింగినవారికి నన్నదానము చేయఁ బాపంబులు నశించు. పునర్జన్మంబు గలుగదు. అన్నదాననిరతుఁడు రూపవంతుఁడు కీర్తిమంతుఁడు ధనవంతుఁడునై జన్మించు. ఈయన్నదానంబు సర్వధర్మమూలభూతం బని యెఱుంగఁదగునని పారాశర్యుండు పలుకుటయు. 831

నూటపదియవయధ్యాయము.

శ్రాద్ధవిధినిరూపణము.

క. పరలోకమునకుఁ జని పుణ్యారతిందగు స్థానములను పోయి గనెడు స త్పురుషులకు శ్రాద్ధమది యొక్కరణిం దత్సుతులు చేయఁగాఁదగుఁ జెప్పుమా.
చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నాదివరాహశరీర మొప్పఁ దా
ల్చిన జగదీశమాన్యునకుఁ జేతులు మోడ్చి వచింతు శ్రాద్ధరీ
తిని బరమర్షు లాదృతిని దెల్పినపద్ధతిఁ బూర్వకాలమం
దు నియతిఁ గోకనాఁ బరఁగు నూత్ననదీజలమందు దీనులై. 833
క. మునిఁగి తపించెడు పితరుల, వనజాక్షుం డుద్ధరించె వరుస దివిజు ల
ప్పనికై శ్రాద్ధ మొనర్చిరి, వినుఁ డావృత్తాంత మెల్ల వినిపింతుఁ దమిన్. 834
క. అన మాను లిట్లు పల్కిరి, మునిపా! కోకాంబువులను మునుఁగఁగ నేలా
ఘనమతులు పితరు లవ్వారిని వారాహుం డదెట్టిరీతిం దేల్చెన్. 835
సీ. కోకామహాతీర్థ మేకాంతసుఖదంబు భుక్తిము క్తిదము నోఁ బూనికి దాని
చరిత మంతయు విని స్వాంతము లలరారె నన వ్యాసుఁ డిట్లను నార్యులార
వినుఁడు త్రేతాయుగమునకును ద్వాపరయుగమునకును సంధి యొప్పునపుడు
కాంచనభూధరకమ్రపృష్ఠంబునఁ బితరులు దేవతావితతు లోకట
తే. గూడియుండిరి చక్కనిగోష్ఠి సాగు,చుండె సోమసంభవయగు నొక్కకన్య
కాంతిమతి దివ్యరూపసంకలిత చేతు, లొగ్గి పితరులముందట నుండె భక్తి. 836
క. ఆనారీతిలకముఁ గని, మానస మలరంగఁ బితృసమానులు పితరుల్
దీనావనులగు దేవత, లానా నన నిట్లు పల్కి రాదృతితోఁ బన్. 837
క. శుభమూర్తి యెవతవు? నీ, ప్రభుఁ డెవ్వఁడు భీతిమాని పలుకుము నా నా
యిభరాజగమన యిట్లను, సభవారెల్లరు వినంగ సాధుభణితిమై. 838
వ. శీతాంశుకళ నగుదు. మీప్రభుత్వమునందు నేనొక్కకోరికం గోరుదు. మీ యాజ్ఞయే యని మఱియు నిట్లనియె. తొలుత నూర్జయను పేరు పరఁగె. పిదప స్వధానామంబు తగె. ఇపుడు కోకాహ్వయంబు మీచేత నిరూపింపఁ బడియె. అనుచుండునంత నాపితరు లాసుందరీముఖంబుఁ గాంచుచుఁ దృప్తినొంద కుండిరి. ఆవిధ మెఱింగి విశ్వేదేవతలు కన్యాముఖనిరీక్షకులగు వీరిచెంతనుండుట పాడి

గాదనియు వీరు యోగనిర్ముక్తులనియు భావించి వారిని వదలి స్వర్గమునకుం జనిరి. శీతాంశుఁ డాత్మజాతయగు నూర్జను జూడక యామె యెందుఁ బోయె నని చింతాకులమానసుం డయ్యె. అంత. దివ్యజ్ఞానంబున నాసోముండు తన కొమరిత కామంబునఁ బితరులచెంత కరిగె నని యెఱింగి వా రామెను బ్రీతితోఁ గాంచుటయుఁ దపోబలమున స్వీకరించుటయుఁ దెలిసికొని కోపపరీతాత్ముఁడై పితరుల శపింపం దలంచి పితరులారా! మీ రెల్ల యోగభ్రష్టులై విచేతనులై పతనంబుఁ గాంచుఁడు. అదత్తయగు నాకన్యకను బాలిశులై కామించితిరి. ఈకన్య పితృమతి. వ్రతనియతయు నగు. అట్టిదయ్యు స్వాతంత్ర్య మూని మిమ్ముఁ గామించెఁ గావున నదీరూపిణి కావలయును. కోకయనం బ్రసిద్ధిఁ గాంచఁదగు. హిమాలయప్రాంతమున నుండవలయు. 839

చ. అని హిమరశ్మి శాపమిడ నప్పితరుల్ వరయోగవిచ్యుతిం
గని తుహినాద్రిపాదమునఁ గ్రన్నన ద్రెళ్లిరి దుఃఖితాత్ములై
వనితయు నాహిమాద్రిపయి వారక త్రెళ్లి సముద్రసప్తకం
బునఁ గలవారి గల్గి యఘపుంజముఁ దోలఁగఁజాలి యెంతయున్. 840

క. కోకాఖ్యఁ దాల్చి తీర్థశతాకులయై వేగయుక్తి నలరి మహీధ్ర
ప్రాకటశృంగవ్రజమును, జేకొని ముంచుచుఁ బ్రసిద్ధి జెంది యసమయై. 841

క. ధరణిం బ్రవహించెను బితృవరులెల్లఁ దదీయశీతవారిం గని యో
గరతిన్ విడి తన్నదియే, తరుణియొ మును తద్విధంబుఁ దలఁపఁగలేమిన్. 842

ఆ. దానిచెంతనుండఁ దాఁ గని తుహినాద్రి, తత్క్షుధార్తి నెఱిఁగి దయను బదరి
యనెడు ధేనువరము నత్తఱిఁ బిలిచి రుచ్యమగుపయసు మధువు సంతతంబు.

సీ. వీరికి నొసఁగుమా చారుతరములైన బదరీఫలంబుల భవ్యములగు
కోకాజలంబులఁ గొమరొప్పఁదిని త్రావి పయసును మధువును బ్రత్యహంబు
గైకొనుచును నుండఁగాఁ జను నంచనె నాశైవ విని నియతాంతరంగ
యగుచు నుండఁగ నయుతాబ్దముల్ గడచె నహోరాత్రమట్టు లోహో యనంగ
తే. జగమునం దిట్లు పితృకర్మసంతతి చెడ, దైత్యు లసురులు రాక్షసుల్ దర్పభయదు
లగుచు రాక్షసులం గూడి యప్పితరులు, నిస్సహాయులుగా నుంట నెఱి యెఱింగి.

వ. విశ్వేదేవవివర్జితులుగావున నీపితరులు దుర్బలు లని తలంచి వారిం దఱుమఁ జనిరి. వారి రాక నెఱింగి పితృదేవతలు కోకానదీతీరమునందున్న గండోపలంబు నాగ్రహంబునం గైకొనిరి. ఆవిధముఁ దెలిసికొని కోకానది వేగవతి గావున నాత్మజలంబుల వారిని ముంచి కనఁబడకుండఁ జేసె. ఉత్తుంగతరంబులఁ దుహినాచలపాదంబు నావరించె. అంతర్హితులగు పితురుల నెఱింగి దైతేయరాక్షసులు విభీతకవృక్షంబు నారోహించి నిరాహారులై యుండిరి. కడుశీతలసలిలంబుల

మునింగియున్న పితరు లాకట నకనకంపడుచుఁ దమకష్టపరంపరలం దలంచుకొని
శ్రీజనార్దను శరణువేఁడం బూని. 845

సీ. జయజయ గోవింద జయ సర్వలోకేశ తావకమా ప్రసాదమున మాకు
విజయమయ్యెడుఁగాక విశ్వమోహనరూప! విషమజలంబుల వెసమునింగి
నీకు దాసులమయి నెగడుమ మ్ముద్ధరింపఁగ న్యాయమగు సుప్రభావ! దేవ
యిదె నిశాచరవరు లెల్ల మమ్మేఁచఁగ భయదరూపంబులఁ బ్రబలి తటము

ఆ. నందు నున్నవార లచ్యుతా వైకుంఠ, యోవరేణ్య యీశ! యోవరాహ
రూపధరణ! భీతి నీపాథసులఁ బడి, యున్న మమ్ముఁ గావు మురుతరకృప. 846

చ. హరిహయసోదరా! నిరుపమాకృతులొప్పఁగ నాదిమాసురుల్
త్వర మధుకైటభుల్ ప్రబల వారిని జంపినవిక్రమంబునం
బరఁగుదు వీవు భక్తజనవాంఛలఁ దీర్చెదు ప్రోడ వీవు శ్రీ
దరవరశార్ఙ్గచక్రమృదుతామరసంబులఁ గేలఁదాల్చుచున్. 847

క. తనరుదు వనుపమశక్తిని, వనరుహనేత్రా! నితాంతభయమునఁ దగు మ
మ్మును దానవు లేఁచక యుండను గావుము లోక మిది విడంబన గాదే. 848

చ. జనకుఁడ వీవు లోకములజాలము గావఁగ నట్టి నిన్నదే
దనుజులు నేఁచఁజాలరు నితాంతభయంకరరూపులైన యీ
దనుజులనుండి మమ్మిపుడు తప్పక కావుము నీదునామకీ
ర్తనమున రాక్షసుల్ వెత లెదం గుదియింపఁగఁ జాలువా రొగిన్. 849

క. భూతంబులు వైరులు వెను, భీతిం బరుగిడుదు రిపుడు పృథ్వీస్థలిపై
నాతతధర్మము స్థిరమగుఁ, జూ తగ నది ప్రియముగాదె శుభరూపహరీ. 850

చ. అనియిటు సన్నుతించుచు నహర్నిశముల్ వెనుభీతిఁ గాంచు పా
వనపితృసంఘముం గనుచు వారిజనేత్రుఁడు సూకరాకృతిం
గనిన జగన్నివాసుఁడు నికామము తృప్తిని గాంచి కోక నాఁ
జను నదియందు మున్గి వగఁ జాలఁగఁ దూలినవారి నార్తులన్. 851

క. శిరసుల గండోపలమును, ధరియించినవారిఁ గావఁ దలఁచి మదిని భీ
కరతాప మేను మాన్చెదఁ, దరుణంబున నిప్డె యనుచుఁ దద్దయుఁ బూనిక్రిన్.

క. ఘనదంష్ట్రాగ్రంబున నా, వెనుశిలఁ జాఱంగఁ జిమ్మి పృథుశక్తిని వా
రిని గైకొని కాచెను నా, వనజాక్షుని స్పర్శమున సువర్ణద్యుతులన్. 853

క. అలరారుచుఁ గోకాథుని, జలములనుండియె తటంబు సరభసముగఁ జెం
ది లలిన్ భీతిని బాయుచు, వెలసిరి శాపంబు పోయె విధునిదియనుచున్. 854

వ. వరాహమూర్తియుఁ బితృదేవతల నుద్ధరించి లోహార్గళంబున జలం బొసంగి
స్వరోమసంభవములగు కుశల సంగ్రహించి స్వేదోద్భవములగు దిలలనుగా

నొనరించి సూర్యప్రభను జ్యోతిస్సుగా నొనరించి కోటివటాధోభాగంబున నిలిచి తుంగకూటంబునుండి యజ్ఞీయములగు నోషధివరంబులను గైకొని మధుక్షీరరసములఁ గంధంబులఁ బుష్పంబుల ధూపదీపంబుల నిర్మించి సరస్సు నుండి ధేనువును సముద్రమునుండి రత్నములను జేకొని దంష్ట్రచే లిఖించి ఘర్మోద్భవములగు జలంబుల భూమిని బ్రోక్షించి కుశలచేఁ దుడిచి ప్రాగ గ్రములై లోమకూపాంతరస్థములగు కుశలను గ్రహించి ఋషుల నాహ్వానించి పితృతర్పణం బొనరించెద నని పలికిన వారు నట్లే యొనర్పుమన నామహాత్ముఁడు విశ్వేదేవతల రావించి మంత్రయుక్తముగ వారికి విష్టరముల నొసంగె. మఱియు నక్షతలచే దేవతారక్షణము నొనరించె. ఆయక్షతలు యవౌషధి సంభవమ్ము లగు. అవి సర్వదిక్కుల రక్షింప నిర్మింపఁబడియె. మఱియు. 855

తే. దేవదానవయక్షపైతేయరాక్షసాళియందొక్కఁడైన నాయక్షతలను
నాశమొందింపఁ జాలఁడు నాశమొంద, నవియె గావున నక్షతలయ్యె నవియు.

క. మును వాని దేవతలఁ గా,వను విష్ణువు నియతిఁ జేసెఁ బద్మదళాక్షుం
డును గుశలగంధయవలను, ఘనసుమముల నర్ఘ్య మిడియెఁ గడు విధిమీఱన్.

వ. "విశ్వేదేవేభ్య" యనుమంత్రంబున వారి నర్చించె. ఎవరు దివ్యులో యెవరు మానుషులో వారి నాహ్వానించెద నన విశ్వేదేవత లావాహనము చేయు మనిరి. వేదవేత్తయగు నావారాహమూర్తి శ్లిష్టమూలాగ్రదర్భలను సతిలలను గా హస్తమునుజానువునం దారోపించి సవ్యముగా నాసనంబు కల్పించె. అట్లే యొకకరంబున నాపితరుల నాహ్వానించె. అపహతమంత్ర ముచ్చరించి యపసవ్యముగా రక్షణంబు కల్పించె నామగోత్రములుచ్చరించియావాహనంబు గావించె. సమంత్రకముగా నర్ఘ్యంబును "యస్మే పితామహ" యనుమంత్రంబునఁ బితామహునకును, "యస్మే ప్రపితామహ" యనుమంత్రంబునఁ బ్రపితామహునకు నర్ఘ్యం బిచ్చె. కుశగంధతిలపుష్పమిశ్రముగా మాతామహులకు నర్ఘ్యం బిచ్చె. ధూపంబుభక్తిమై నొసంగి "యాదిత్యావసవోరుద్రా"యను మంత్రంబున సర్పిస్తిలకుశాకులమగు నన్నంబు దెచ్చి సుసంస్కృతపాత్రంబున నునిచి మునులం గాంచి యగ్నియందు హోమము చేసెద నని యడిగి వారట్లే యని పలుక నాహుతిత్రితయంబు సోమాగ్నియములకొఱకు నిచ్చి "యేమామక" యనుమంత్రంబు నేడుపర్యాయములు జపించి హుతావశిష్టాన్నమును బితరుల నొక్కొక్కనికి మూఁడేసి పర్యాయము లొసంగి తదవశిష్టాన్నమును బిండపాత్రమున నునిచి పిదప సరసమై స్వాదువై పాయసపూర్వకమునగు నన్నము నపర్యుషితమును, అల్పశాకమై బహుఫలంబై షడ్రసంబై యమృతోపమంబు నైనదాని బ్రాహ్మణులకొఱకు సమర్పించె. పితృదేవతలకు దేవపూర్వకంబుగా నన్నమిడియె. పృథివీపాత్రమందు "మధువాతా" యనుమంత్రమును

మంత్రించి యొసంగె వారు భుజించుచుండ మంత్రపంచకంబు జపించె. త్రిమధు త్రిసుపర్ణ బృహదారణ్యక సౌరసూక్త పురుషసూక్తములే మంత్రపంచకంబని యెఱుంగవలయు. 858

తే. వీనిలోపల జాప్యమై వెలయుపురుష, సూక్తసౌరములను నిష్ఠ శోభిలంగ
నెమ్మి జపియించె నాభూమినిర్జరవరు, లొగి భుజింపఁగ సంతృప్తి నొందినట్లు.

సీ. ప్రశ్నించె వారుత్తరం బల్లె యనిపల్కు జలముల విడిచి నిర్మలమనీష
మౌనము వదలి సమానచిత్తముతోడఁ బిండపాత్రముఁగొని చండకిరణు
నాతపమొలయని యట్టితావున నుంచె నాయన్నమును ద్వివిధాకృతిఁ గను
నట్లు విభాగించి యంత నొక్కొక్కటి మూఁడుభాగములుగఁ బొందుపఱచి

తే. భూమిఁ బరిశుద్ధమగునట్లు ప్రోక్షణార్ణ, మంత్రములఁజేసి కుశలచే మహిని గప్పి
యాకుశలు దక్షిణాగ్రంబులై తనరఁగ,నొనరిచి తదూర్ధ్వభాగంబునను నియతిని.

వ. ఆసనంబుఁ గల్పించుకొని మూలతిలసహితదర్భలయందుఁ గూరుచుండి గంధపుష్పాదుల నొసంగి భక్తిపూర్వకంబుగా మంత్రయుతంబుగా నాపిండంబును బితృదేవతల కొసంగె. పితామహప్రపితామహుల కల్లె యొసంగె. మఱియు నావారాహమూర్తి మాతామహత్రయంబునకుఁ బూర్వోక్తప్రకారంబున నిచ్చె. పిండనిర్వాపణోచ్ఛిష్టాన్నమును లేపభుజుల కొసంగె. "ఏతద్వః పితరి" నామకమంత్రమునుచ్చరించి వస్త్రంబుల నొసంగె. అవి ద్వ్యంగుళప్రమాణమున నలరి శుక్లంబులు ధౌతంబులునై యభినవంబులై యొప్పారె. పిదప గంధపుష్పాదికంబు లొసంగి వానికిఁ బ్రదక్షిణంబుచేసి యాచమనముచేసి విప్రుల నాచమింపఁ బ్రార్థించి తొలుతఁ బితరులను, దర్వాత దేవతలను బ్రార్థించి యాభూమిని జలంబులఁ బ్రోక్షించి యక్షతపుష్పంబులం జల్లి సతిలజలంబులఁ బితృసురలకు నొసంగి మంత్రం బుచ్చరించి పితరులు సంప్రీతు లగుదురుగాక యని ప్రార్థించి యఘమర్షణమంత్రంబులఁ ద్రివారంబు లుచ్చరించి "యస్మేనామ ఇతీరిత" మ్మనుమంత్రమును జపించి ధనధాన్యసమన్వితములగు గృహముల నాకొసంగుఁ డని కోరి యర్ఘ్యపాత్రముల సపవిత్రకంబులఁ బిండాంతరంబున నునిచి "ఊర్జంవహంతి" యనుమంత్రంబును జపించి కోకానదీతోయంబులఁ బ్రోక్షించె. హిమక్షీరమును మధుతిలలను బితరులకుఁ దృప్తిగా నొసంగె. అంత నాద్విజులు స్వస్తివాక్యంబులు పలుక రజతమును దక్షిణగా నొసంగి యాగదాధరుండు మనుష్యులకొఱకిట్టి సంవిభాగక్రియ నొనరించె. బ్రాహ్మణు లత్తఱి "సర్వం సంపన్న" మ్మని యుచ్చరింపఁజను నని విధించె. వారిసమ్మతినొంది శిష్టాన్నము నిష్టుల కొసంగె. మఱియు నావిప్రులం గాంచి "యభిరమ్యతా" మ్మన వా"రభిరతాస్మ" యని యుచ్చరించిరి అంత విప్రప్రవరుల కరంబులం బట్టుకొని కొన్ని యడుగులు నడిచి "వాజేవాజే"యనుమంత్ర ముచ్చరించుచు సాగసంపుటయు వా రాశీ

ర్వదింప వందనంబుచేసి వారి వీడ్కొని మరలి వచ్చి మధ్యమపిండమును గ్ర
హించిఛాయామయియగు భూమియనుపత్నికి వరాహరూపధారియగు ననంతుఁ
డు పిండంబు నొసంగె. ఆమెయు దానిం బరిగ్రహించె. ఇతరపిండమును బట్టు
కొని విప్రులకెల్ల నమస్కరించె. అంతఁ గోకానదియు స్వార్థకరంబగు వాక్యము
నఁ భగవంతుం బ్రార్థించె. పితరులారా! మీరు మున్ను శశిచే శపింపఁబడి యోగ
భ్రష్టులై స్వర్గచ్యుతిం గాంచితిరి. మిమ్ము మరల నీవిశ్వేదేవతలు రక్షింతురు
గాక. వారాహమూర్తీ! యీపితరులు నీయనుగ్రహమును వీరు నేనును
యథాపూర్వరూపంబులం గాంతుము. మాకు సోముం డధిదైవతమగుం గాక.
దివంబునను భూమిని యోగబలంబున మాకు నివాసంబు గావలయు. కొందఱ
కంతరిక్షంబున నొకమాసంబు పుష్టి గలుగవలయు. అనఁ బితరు లిట్లనిరి. 861

క. కిరివర! యీయూర్జయు మా, తరుణియ యగు స్వధ యనంగ ధాత్రీస్థలిపైఁ
బరఁగం దగు యోగిని ఖేచరియుఁ మఱి యోగమాత చారుమతియు నై.

క. వరయశమున నీశా! నీకరుణం బెంపొందవలయుఁ గామితదా! యం
చురుభక్తిఁ బితరు లడుగం, గరుణించి వరాహరూపకలితుఁడు హరియుఁ. 863

క. పితరులఁ గోకానది నా, దృతిఁగని యిట్లనియె మీర లేవాంఛను గో
రితి రద్ది యల్లియగు యముఁ, డతిశయధర్మాత్ముఁ డౌట నధిపతి మీకౌ. 864

వ. సోముఁడు స్వాధ్యాయంబగు. అగ్ని యధియజ్ఞంబగు. ఇది నాకల్పితంబు.
అగ్నివాయుసూర్యులు మీకు నివాసస్థానంబులు. బ్రహ్మవిష్ణురుద్రులు మీకధి
పూరుషులు. ఆదిత్యులు వసురుద్రులు మీకు మూర్తులు. యోగులు యోగదే
హులు యోగాధారులు సువ్రతులునై స్వేచ్ఛఁగఁజరించుచు సకలప్రాణులకు
ఫలంబు లొసంగుచు స్వర్గనరకభోగగతులగు చరాచరజంతువుల నిజయోగ
బలంబున నాప్యాయితములఁజేయుచు నుండుఁడు. చంద్రపుత్రికయగు నీయూర్జా
దేవియుఁ గీలాలమధువిగ్రహయై దక్షపుత్రికయునై స్వధానామంబునఁ బ్రసి
ద్ధిఁ గాంచఁగలదు. గిరిరాజసమాశ్రితయునై విఖ్యాతిం జెందు. తీర్థకోటిమహా
పుణ్యప్రదాత్రియై మద్భూమిపరిపాలితయునై పరిఢవిల్లఁగలదు. ఇది మొదలీనది
యందు సర్వాఘనాశకరుఁడనై నివసించెద. వారాహమూర్తినగు నాదర్శనం
బును బూజనంబును భుక్తిముక్తిప్రదంబు కోకానదీసలిలపానంబు సర్వాఘనాశ
కంబు ఈనదియందు మునింగిన సకలపుణ్యంబులు చేకూరు. ఈనదితీరంబున నుప
వసించిన స్వర్గం బొడఁగూడు. దానం బక్షయఫలప్రదంబు. జరామృత్యుభయాప
హారకంబు మఱియు. 865

సీ. మాసోత్తమంబగు మాఘంబునఁ శుక్లపక్షమ్మునఁ శీతభానుఁ డుదయ
మందని తిథియగు నవమవసయందుఁ గోకానదియొద్దనఁ గరుణమీఱ

మీ రుండవలయు నాతీరునఁ దినపంచకము నిల్వఁదగు నట్టి కాలమందు
శ్రాద్ధ మెవ్వఁడు చేయు శ్రద్ధచేఁ బితరులకును దిలతర్పణమును బొనర్చు
తే. నతఁడు ప్రాగుక్తఫలముల నందు శంక
యించుకయు లేదు మఱియు నే నెలమి నుందు
నందు నేకాదశీతిథి నట్లె ద్వాద
శిని గ్రమంబునఁ బుత్తుఁ గావున నెవండు. 866
క. ననుఁ గొల్వ నుపవసించునొ, ఘనుఁ డాతఁడు ప్రాగ్విహితసుఖంబులఁ బడయుం
గనుక నిఁకం బొందు సుఖం, బున నుండుఁడు స్వేచ్ఛ ననుచు భూతేశ్వరుఁడున్.
క. సూనృతవాక్యులు పల్కుచుఁ, గానంబడ కట్టె యాత్మకమ్రవసతి శ్రీ
జాని గనం బోయెను బిత్రు, మౌనులు కోకానదిన్ సమానవిధులచేన్. 868
వ. ఆమంత్రణంబు చేసి పయనంబు సాగించిరి. కోకాతరంగిణియుఁ దీర్ఘసహితయై గిరిరాజనికటంబున వసించె. మహీమయియగు ఛాయయుఁ గ్రోడియై పిండప్రాశనబృంహితయై గర్భంబు దాల్చి నరకాసురుం గనియె. వాఁడు భూపుత్త్రుం డనఁ బ్రఖ్యాతి వహియించె. విష్ణు వాతనికిఁ బ్రాగ్జ్యోతిషం బను నగరంబు నొసంగె. మునులారా! భగవంతుని వరాహరూపంబును గోకానదీవృత్తాంతంబు నెఱింగించితి. దీని వినిన నరుండు పాపజాల వినిర్ముక్తుఁడై పుణ్యఫలంబులం బొందు ననవిని మౌను లిట్లనిరి. 869

## నూటపదునొకండవయధ్యాయము.

### శ్రాద్ధఫలనిరూపణము.

చ. మునివర! యింకనుం జెపుము పూజ్యము శ్రాద్ధసుకల్ప మెట్టు లె
వ్వని విషయంబునం దెపు డెవం డొనరింపఁగ నౌనొ నాఁగ న
మ్మునితతి చేయుప్రశ్నమును మోదమునన్ విని వ్యాసమౌని యి
ట్లనియె మహర్షులార! వినుఁ డత్తెఱఁగెల్ల వచింతుఁ జక్కఁగన్. 870
సీ. ఏస్థలంబున నెప్పు డెవ్వరియందు నెవ్వనిచేత నేయేసువస్తువులను
శ్రాద్ధ మొనర్పనౌ సాధుమార్గంబున నవ్విధ మెఱిఁగింతు నవనిసురులు
క్షత్త్రియుల్ వైశ్యులు స్వస్వవర్ణోక్తప్రకారంబునన్ ధర్మకలితమార్గ
మనుసరించుచు మంత్రమును జెప్పి శ్రాద్ధంబు చేయంగనౌ మఱి స్త్రీలు చరణ
తే. భవులు విప్రానుశాసనపద్ధతిఁ గొని, మంత్రవిరహితముగ విధిఁ దంత్రయుక్తి
వహ్ని యాగము లేనట్లు భక్తి దానిఁ, జేయఁగాఁ దగు నేలాటిచింత లేక. 871
చ. నిరుపమపుష్కరాదికవినిర్మలతీర్థములందు దేవతో
త్కరసదనంబులన్ శిఖరితల్లజకూటములందుఁ బూతమౌ

ధరణివిభాగమందు జలధారలు పర్వేడుచోటులందు స
త్సరసులఁ బుణ్యతోయములదాపున ప్రోదినులన్ నదంబులన్. 872

సీ. నదులసంగమమందు నుదధిస ప్తకమందు స్వనులి ప్తగృహముల మనసునకును
మంచి దియదియని యెంచఁగాఁదగుచోట్లఁ బెద్దలాజ్ఞాపించుపృథ్విభాగ
మందును దివ్యవృక్షాంతికమందును యజ్ఞార్హములగు నాహ్రదములందు
శ్రాద్ధంబు చేయనౌ సాధుమార్గంబున దాని కనర్హమౌ స్థలవితతిని

తే. దెలుపువాఁడఁ గిరాతాఖ్యదేశములును
గొంకణ కళింగ కృమి దేశకూటమందు
మఱి దశార్ణంబులందుఁ గుమారికాఖ్య
జనపదంబులఁ దంగణజనపదముల. 873

వ. సింధునద్యుత్తరకూలంబులందును, నర్మదాదక్షిణభాగంబులందును, గరతోయా నదీపూర్వభాగంబులందును, శ్రాద్ధంబుచేయ నిష్ఫలం బగు. ఇఁక శ్రాద్ధకాలంబు లెఱింగించెద. ప్రతిమాసంబున నమావాస్యయందును, బూర్ణిమయందును జేయ మహాఫలంబు. నిత్యశ్రాద్ధ మదైవంబని కీర్తింపబడుచుండు. నైమిత్తికంబు దేవ సహితంబుగా నొనరింపఁ దగు. ఇతరకామ్యశ్రాద్ధంబులు ప్రతివత్సరంబు నొనర్పం దగు. జాతకర్మాదికంబులందు వృద్ధిశ్రాద్ధం బొనర్పందగు. అందు బ్రాహ్మణద్వయంబు విధివిహితంబు. మాతృపూర్వకంబు నగు. కన్యారాశియందు భాస్కరుఁడు ప్రవేశించిన దాదిగాఁ బదునైదుదినంబులు పూర్వోక్తప్రకారంబున శ్రాద్ధంబు చేయ మహాఫలంబు లొనఁగూడు. మఱియు నందుఁ బ్రతితిథి యందును శ్రాద్ధంబు చేయఁ బడయఁదగుఫలంబులం జెప్పెద. 874

సీ. ప్రతిపత్తునన్ ధనప్రతతి ద్వితీయను బశులాభ మవ్వలఁ బరఁగుతిథిని
బుత్త్రలాభంబును శత్త్రుహాని చతుర్థియందును బంచమియందు సిరియు
షష్ఠిని బూజ్యత సప్తమీతిథియందు నగును గణాధిపత్యంబు మఱియు
నష్టమి నత్యుత్తమాభివృద్ధియు నవమిని జేయ స్త్రీలాభమును గనంగ

ఆ. నగును దశమియందు నభిమతవాంఛలఁ, బడయ నగును బిదప బరగుతిథిని
శ్రుతిగణంబుఁబడయు చొప్పుగల్గును ద్వాదశిని జయంబుగల్గు ననఘులార 875

వ. త్రయోదశియందు శ్రాద్ధం బొనర్పఁ బ్రజావృద్ధియుఁ బశువృద్ధియు మేధాలాభంబును స్వాతంత్త్ర్యంబును బుష్టియు దీర్ఘాయువు నొనఁగూడు. శ్రద్ధాసమన్వితుండై పితృపూజచేసినవానికే పూర్వోక్తఫలంబులు గలుగు. యౌవనవంతులగు నెవ్వనిపితరులు శస్త్రహతు లగుదురో వారి నుద్దేశించి చతుర్దశియందు శ్రాద్ధం బొనర్పందగు. దాన వారు తృప్తు లగుదురు. అమావాస్యయందు జేయుశ్రాద్ధంబు సర్వకామఫలప్రదంబు. స్వర్గంబు పొందించిపిదప స్థిరతరసుఖానుభవార్హపదంబునకుఁ జేర్చు. మఱియుఁ బితరుల కేయేపదార్థంబుల నెంతకా

లము తృప్తికలిగియుండునో దానిం జెప్పెద వినుండని వ్యాసుం డిట్లనియె 876

సీ. పితృదేవతలకుఁ దృప్తిని జేయునొకమాస మలరి హవిష్యాన్న మాదృతి నిడ
మత్స్యమాంసము రెండుమాసముల్ హారిణ మట్టులె మాసత్రయంబు నాల్గు
మాసముల్ శశముదౌమాంసంబు శాకునం బైదుమాసంబులు నలరఁజేయు
సూకరమాంసంబు నారిది షణ్మాసముల్ ఛాగసంబంధిమాంసంబు సప్త

తే. మాసములు తృప్తినొందించు మహితమగుచు
నలరు నైణేయమాంసంబు నెల లెనిమిది
తృప్తిఁ జేయును బితరుల కెలమి మాస
నవక మారురుమాంసంబు ప్రవిమలంబు. 877

క. కలిగించును సంతృప్తి వి,మలగవ్యపలాల మల్లె మాసదశక మి
మ్ముల నిచ్చుఁ దృప్తిఁ బితృగణ,ములకును నౌరభ్రమాంసమును బ్రమదంబుగ్.

క. ఏకాదశమాసంబులు, ప్రాకటతృప్తిం జెలంగుభంగిం గూర్చుగ్
శ్రీకలితగవ్యపయసులు, నాకటఁ గుందకయె యుండునట్లొనరించుగ్. 879

వ. సంవత్సరమాత్రం బద్ది యట్టిశక్తి కలదగు. వార్ధ్రీణమాంసంబు సల్లోహంబు కాలశాకంబు మధువు రోహితామిషాన్నంబు ననునివి సర్వకాలసంతృప్తి నొడఁగూర్పఁ జాలియుండు. గయాశ్రాద్ధ మనంతకాలతృప్తిదంబగుట నిస్సంశయంబు. ఏనరుండు భక్తియోగంబున గుడసమ్మిశ్రతిలలనుగాని మధువునుగాని మధుమిశ్రాహ్వపదార్థముగాని శ్రాద్ధకర్మమునఁ బితరుల కొసంగిన నక్షయఫలంబుల నాతని కీయఁజాలియుండు. మాకులంబున నెవ్వఁడేని శ్రద్ధానిరతుండు పుట్టునా, జలాంజలి నొసంగునా, మాఘాదిమాసంబులయందు మధుసంయుక్త పాయసంబు నొసంగునా, యని పితరులు కోరుచుందురు. పెక్కండ్రు మావంశంబునఁ గలుగవలయును. అందొక్కఁడేని గయకుంబోవు. గౌరీసంజ్ఞఁ గలకన్యను వివాహమాడు. నీలవృషంబును మాకై వదలు. అని యిట్లు పితృదేవత లాశపడుచుందురు. కృత్తికలయందుఁ బితరుల నారాధించిన స్వర్గంబు కరతలామలకంబు. సంతానకాముఁడు రోహిణీనక్షత్రమందుఁ బితృపూజ చేయవలయు. ఆర్ద్రియందుఁ జేసిన శౌర్యంబుగలుగు. పునర్వసువునందుఁ జేయుపూజ క్షేత్రంబులఁ గలిగించు. పుష్యమియందు నక్షయధనము గల్గు- ఆశ్లేషమందు నాయువును, మఘానక్షత్రమందుఁ బుష్టిని, బూర్వఫల్గునులందుఁ బుష్టిని, నుత్తరఫల్గునులయందు శాస్త్రపాండిత్యమును, హస్తనక్షత్రమునందు స్వాధ్యాయలాభంబును, జిత్రయందుఁ దేజోరూపంబులును, సంతానలాభంబును, స్వాతీనక్షత్రమందు వాణిజ్యలాభంబును, విశాఖానక్షత్రమందుఁ బుత్త్రప్రాప్తియు, ననూరాధానక్షత్రమునందు మహారాజ్యలాభంబును, జ్యేష్ఠానక్షత్రమున నాధిపత్యప్రాప్తియు, మూలక్షమున నారోగ్యలాభంబును, బూర్వాషాఢాతారయందు

యశోలాభంబు, నుత్తరాషాఢయందు, విశేషకీర్తిలాభంబును, శ్రవణభంబున
సర్వకామలాభంబును, ధనిష్ఠయందు మహాధనప్రాప్తియు, నభిజిన్నక్షత్రమందు
వేదవిత్త్వమును, శతభిషమున భిషక్సిద్ధియుఁ బూర్వాభాద్రనక్షత్రమున నజావిక
లాభంబు, నుత్తరాభాద్రనక్షత్రమునందు గోలాభంబును, రేవతియందు ధన
ప్రాప్తియు, నశ్వినియందుఁ దురంగమలాభంబును, భరణియందాయుష్యంబును
శ్రాద్ధంబొనరించినవారికిం గలుగు. 880

క. తురగముఖతారకలఁ బితృవరులకు శ్రాద్ధంబుచేత భవ్యముదము గ
ల్గ రమణఁ జేయు నరుండీ, వరఫలములఁ బొందుఁ జెక్కువాక్కు లిఁకేలా. 881

క. కనుకఁ గామ్యశ్రాద్ధంబును విధిగాఁ జేయ నరుఁడు పూనం దగు నా
వనరుహమిత్రుఁడు కన్యాఖ్యనుదగు రాశింగనంగ నరిగెడుతఱినిన్. 882

సీ. ఏయేఫలంబుల నెల్లెట్లు పొందఁగఁ గోరుదురో యట్టివారు రవియు
గన్యాఖ్యరాశిసంగతుఁడైన యప్పుడు శ్రాద్ధంబుచేయ నాసత్ఫలములు
తప్పక పొందుదు రప్పుడు నాందీముఖశ్రాద్ధములఁ జేయఁ గడఁగవలయు
నవ్వియు వాంఛల నందగాఁ జేయును, బూర్ణిమయందు విభూతియున్న

తే. యంతలో శ్రాద్ధమొనరింపనమరుఫలము, లనుచు వారాహవచనంబు వినఁగఁబడెడు
దివ్యభౌమాంతరిక్షసంస్థితిఁ జెలంగు, స్థావరములు చరంబులు శ్రాద్ధములను.

క. పితరులవలెఁ బిండంబుల, నతిముదమునఁ గోరుచుండు నర్కుఁడు కన్యా
స్థితిగనషోడశదినములఁ, గ్రతునిభములు శ్రాద్ధము లవు కాలమహిమచేన్. 884

క. అని నారాయణమూర్తియె, వినిపించెను రాజసూయవీతిమఖములం
బొనరించి దుర్లభఫలంబును గోరు నెవండు వాఁడుపూజ్యనియతిమై. 885

క. జలమూలములను శాకంబులఁ గన్యారాశి రవియుఁ బొందినకాలం
బులయందుఁ బితరులకు నిర్మలమతిచేఁ దృప్తిచేయ మహిఁ బొందుఁ జూడీ.

తే. ఉత్తరాహస్తనక్షత్రయుగ్మమందు, భాస్కరుండుండఁ బితరులఁ బరమభక్తిఁ
దృప్తిచేసిన స్వర్గమం దెంతొకాల, మునికి గల్గును సంశయం బనఁగలేదు. 887

వ. పితృనగరంబు వృశ్చికరాశియందు సూర్యుఁడు ప్రవేశించునంతదనుక శూన్యమై
యుండు. వృశ్చికరాశినతిక్రమింపఁ బితరులు దేవతలం గూడి నిట్టూర్పులు పుచ్చుచుఁ
దమనగరంబున కరుగుదురు. తృప్తిసేయని యలసులకు శాపంబొసంగుదురు. మఱి
యష్టకాఖ్యపర్వంబులందును మన్వంతరములందును నన్వష్టకలయందును శ్రాద్ధ
మొనర్పందగు. అది మాతృపూర్వంబుగా నుండఁదగు. గ్రహణవ్యతీపాతరవిచంద్ర
సమాగమ జన్మనక్షత్రగ్రహపీడలయందు శ్రాద్ధంబు పార్వణంబగు. అయనవిషువ
ద్ద్వయమునందు సంక్రాంతులయందు విధిమంతముగా శ్రాద్ధంబు చేయం దగు.
వీనియందుఁ బిండనిర్వాపణవిహీనంబుగా శ్రాద్ధమొనర్పవలయు. వైశాఖతృతీయా
తిథియందును, గార్తికనవమియందును సంక్రాంతిశ్రాద్ధనియమంబు ననుసరించి

పితృకల్ప మొనర్పందగు. భాద్రపదత్రయోదశియందుమాఘామావాస్యయందు ను,దక్షిణాయనవిధి ననుసరించి పాయసంబున నొనర్పందగు. వేదవేత్తయు నగ్ని కార్యనిరతుండు నగుశ్రోత్రియుం డింటికరుగుదెంచినంతనే విధియుతంబుగానొ క్కనిం బ్రతిగ్రహించియే శ్రాద్ధ మొనర్పందగు. శ్రాద్ధార్హవస్తుసంప్రాప్తియుసాధు సమాగమంబు నెప్పుడగునో యప్పుడే ద్విజోత్తములు శ్రాద్ధంబుచేయందగు. ప్రతిసంవత్సరమందును మాతాపితరుల మృతతిథియందు శ్రాద్ధము చేయవల యు. పుత్త్రహీనుఁ డగుపితృసోదరునకును జ్యేష్ఠభ్రాతకును దేవపూర్వంబుగాఁ బార్వణశ్రాద్ధంబును దైవవిహీనంబుగా నేకోద్దిష్టంబును జేయందగు. దేవకార్యం బున నిద్దఱును, బితృకార్యంబున ముగ్గురును, నీరెంటియం దొక్కరొక్కరు గాని విప్రులు నిమంత్రితులు గావలయు. మాతామహులకునిట్లే యొనర్పందగు. ప్రేతీభూతునకు భూమియందుఁ బిండజలంబుల నునుపందగు తర్పణోదకము సకుశముగా జలసమీపమున బహిర్భాగమున వదలవలయు. తృతీయదినమున 'నస్థిసంచయన మొనర్పందగు. దశమదినంబున బ్రాహ్మణులకును, ద్వాదశదినంబున క్షత్త్రియులకుఁ బంచదశదినంబున వైశ్యులకు, మాసంబున శూద్రులకు నాశౌచ శుద్ధియగు. సూతకాంతమున గృహమునం దేకోద్దిష్ట మొనర్పం దగును. పిదపఁ బ్రతిమాసమందును బితృపూజ సంవత్సరమునిండ నవ్వల సపిండీకరణము చేయ వలయు. సపిండీకరణానంతరము పార్వణశ్రాద్ధ మొనర్పవలయు. అంత నాపిత రులు శుద్ధులై పితృగణమునఁ గలియుదురు. పితరు లమూర్తులు సమూర్తులు నని రెండువిధములుగ నుందురు. నాందీముఖపితరులు. సమూర్తులుపార్వణపిత రు లమూర్తులని యెఱుంగ నగు. ఏకోద్దిష్టాశనులగువారు సమూర్తులే యని పితరులు త్రివిధకల్పంబులఁ దృప్తినొందుదు రని తెలియుండని పలుకుటయు.

---

## నూటపండ్రెండవయధ్యాయము.

### సపిండీకరణనిర్ణయము.

క. అనవిని మును లావ్యాసుని, గని యిట్లని రోమహాత్మకా ప్రేతీభూ
తునకు సపిండీకరణం,బును జేయుతెఱంగుఁ దెల్పుము దయ మెఱయఁగన్.

చ. మునులిటు ప్రశ్న మర్హవిధిఁ బోల నొనర్పఁగ వ్యాసమౌని యి
ట్లనియె వినుండు తద్విధము నయ్యది దైవతశూన్య మొక్క య
ర్ఘ్యనియతి నొప్పు నందును నొకండె పవిత్రము వహ్నిహోమముల్
కనఁబడకుండు నాపితృనికాయము పిల్వఁగ రా దొకప్పుడున్. 890

వ. ఆవాహన వివర్జితంబగుట నపసవ్యవిధి నొప్పారు. విషమసంఖ్య విప్రులు భుజిం పందగు. మఱియం దొక్కవిశేషంబు గలదు. ప్రతిమాసక్రియాదికము వివరిం తు. సావధానచిత్తంబుల వినుండు. తిలగంధోదకయుతంబగు పాత్రచతుష్ట

యంబు గలదు. పితరులకుఁ బాత్రత్రయంబును, ప్రేతకొక్కటియు నని యెఱుంగుఁడు. ప్రేతపాత్రమునుండి పితృపాత్రత్రయంబున నర్ఘ్యంబు విడువ నగు. "యే సమానా" యనుమంత్రంబు జపించుచుఁ బూర్వోక్తవిధానంబున శేషక్రియాకలాపం బాచరింప వలయు. ఏకోద్దిష్టవిధియందు స్త్రీలకు నిష్లే యని యెఱుంగుఁడు. స్త్రీలకుఁ బుత్త్రాభావంబున నొప్పదనుట మునిసమ్మతంబు. ప్రతివత్సరంబును స్త్రీలంగూర్చి యేకోద్దిష్టము చేయవలయు. మృతాహామునందుఁ బితరుల కది యొనర్పనొప్పు. పుత్త్రాభావంబున సపిండులును దదభావంబున సహోదరులును జేయవలయు. సహోదరులు లేనిచోఁ బౌత్త్రులు చేయందగు. మాతామహులకుఁ బుత్త్రికాతనయులు చేయవలయు. ద్వ్యాముష్యాయణసంజ్ఞు లన్నవో మాతామహ పితామహులను యథాన్యాయముగా నైమిత్తికశ్రాద్ధములందుఁ బూజింతురు. వీ రెవ్వరు లేనిచో స్త్రీలే తమ తోఁబుట్టువులకు నమంత్రకముగా నొనరింతురు. వారును లేనిచో రాజు చేయింప వలయు. తజ్జాతీయులే శవోత్సర్జనాదిక్రియల నన్నింటిని జేయ వలయును. సకలవర్ణములవారికిని నృపతి బంధు వనంబరఁగు. మునులారా! నిత్యనైమిత్తికక్రియల విధాన మెఱింగించితిని. శ్రాద్ధాశ్రయమగు నిత్యనైమిత్తిక క్రియలను మఱికొన్నింటి నెఱుకపఱతు. 891

సీ. ఇందూదయము లేకయే యుండు నమవస నిత్యమా పితృగణనియతి కరయ
నట్టికాలంబున నాచరింపందగుఁ బితృతృప్తిఁ మఱియు నాపితృవరులకుఁ
బ్రాకటముగఁ జేయఁబడు సపిండీకరణానంతరము తండ్రి కవలఁ బూజ్యుఁ
డగు ప్రపితామహుం డమల పద్ధతిమీఱఁ బితృపిండమును దగ వీడి లేప
ఆ. భుజుఁడనంగ బరఁగుఁ బూజ్యులో పితరుల, కవల నుండునట్టి యతఁడ లేప
భుజుఁడు నాఁదనర్చుఁ బూజ్యుఁ డయ్యు నతండు, పిండసంగతిని దవిలినదాన.

వ. బంధుత్వము ననుభవింపఁదగు నుపభోగమునుమాత్ర మొందఁజాలు. పితృపితామహ ప్రపితామహులను నీముగ్గురే పిండసంబంధము గలవారలు. పితామహునకుఁ బితామహునినుండి యవ్వలివారెల్ల లేపసంబంధము గలవారు అట్టివారు ముగ్గురే యనియెఱుంగఁ దగు. యజమానుఁడు సప్తముఁడగు. ఇదిముని ప్రోక్తమగు సాప్తపౌరుషసంబంధము యజమానుఁడు మొదలు సప్తపురుషుల దనుక నుండువా రను లేపభుజు లనంబడుదురు. వారికిం బూర్వులు నంతకు ముందటివారిలో నరకవాసులును, నందును దిర్యగ్యోనియం దుద్భవించినవారును భూతాళియందుఁ జేరినవారును యజమానకృతశ్రాద్ధంబున ముక్తులగుదురు మఱియు వికిరాన్నమున నొందరు తృప్తులగుదురు. పిశాచత్వము నొందిన వారు నీవికిరాన్నమును భూమియందుంచినఁ దృప్తులగుదురు. స్నానము చేయు

నపుడు వస్త్రమునుండి భూమిపైఁ బడినజలముల నేయేపితరులు పాపవశంబున
వృక్షరూపంబుల నుందురో వారికిఁ దృప్తియగును. మఱియు. 893

సీ. గంధంబుదీయు నక్కాలంబునం గ్రిందఁబడునుదకంబుల బాపవశత
భూతంబులై యుండిపోక్కెడుపితరులు సంతృప్తులగుదు రాక్షణమునందె
పిండంబులెత్తెడు కాండంబునం గ్రిందఁబడు జలబిందునివహామువలనఁ
బితరు లెవ్వరు పశువితతిఁ బుట్టియఘంబు ననుభవించుచునుందు రట్టివారు

తే. తృప్తినొందుదు రిట్టులె యెవరు దంత,ములు చెలంగకమును పె సత్కులజులేమి
కారణంబుననో బహిష్కారమునకుఁ, బాత్రులుగఁ జేయఁబడుచు విపన్నత గని

క. నరకములఁ గుడుచుచుందురొ, పరమాద్భుతరీతి నట్టిబాలకులే శ్రా
ద్ధరతింగను యజమానుల, కరసమ్మార్జితజలౌఘకణములవలనన్. 895

వ. మఱియు బ్రాహ్మణోత్తములు భుజించి యాచమనము నేయుతఱిఁ గ్రిందఁబడిన
జలంబులచేతను, బాదప్రక్షాళనోదకంబులచేతను దృప్తు లగుదురు. ఇట్లు యజ
మాన నిమంత్రితబ్రాహ్మణజలాన్న విక్షేపమునఁ బాపంబు లనుభవించుపితరులు
తృప్తులై యఘనిర్ముక్తు లగుదురు. 896

తే. న్యాయవిరహితపథమున నర్థరాశి
సేకరించుచు శ్రాద్ధంబుచేయ దానఁ
దృప్తి చాండాలపుల్కసు లెలమిఁ గనుదు
రాత్మపితరుల కెక్క దాయాస మొకఁడె. 897

సీ. కావునఁ బితరుల కేవగనైనను సంతృప్తిచేయంగఁ జాల సుకృత
మబ్బునంచును గోరునవ్వారు భక్తిచే శోకంబుమాని యస్తోకనియతి
శ్రాద్ధమొనర్పఁగాఁ జను నట్లుగాకున్న నద్దానఁ దృప్తియే యమర దెవరి
కైనను మునులార యందు బ్రాహ్మణులెట్టి వారు గావలయునో వరుస వినుఁడు

ఆ. సంయతేంద్రియులును సంతతజ్వలనార్చ,కులును నిర్మలాత్మకులును బండి
తులును శ్రోత్రియులును జ్వలనాభ తేజులు, శ్రాద్ధకర్మమునకుఁ జాలువారు. 898

## శ్రాద్ధార్హబ్రాహ్మణులు.

వ. త్రిణాచికేతులు, త్రిమధువులు, త్రిసుపర్ణులు, షడంగవేత్తలు, శ్రాద్ధభోజనా
ర్హులు. మాతృపితృసేవానిరతులు, స్వస్త్రీయుఁడు, సామవేదవిదుఁడు, ఋత్విజుఁడు,
పురోహితుఁ, డాచార్యుఁ, డుపాధ్యాయుఁడు భోజనార్హులు. మేనమామ
యు, మామయు, శ్యాలకుఁడు బంధురబంధువు, ద్రోణపాఠకుఁడు మండలబ్రాహ్మ
ణుఁడు, పురాణార్థవిశారదుఁడు, నకల్పుఁడు, కల్పసంతుష్టుఁడు, ప్రతిగ్రహ
వివర్జితుఁడు, ననువీరు శ్రాద్ధభోజనమునకు నియోగింపఁదగుదురు. వీరెల్లఁ
బంక్తిపావను లనందగుదురు. 899

క. మును నేఁజెప్పినవిప్రులఁ, గనఁజని తొలిదినమునందె కార్యంబిది పే
ర్కొనఁజాలు నిందు భోజన, మొనరింపఁగ నొప్పుకొనఁగ నొగిఁదగు ననుచున్.
తే. ప్రార్థనముచేయవలయు నాప్రార్థనంబు
వార లంగీకరించినవైఖరి గని
వారిఁ దోడ్కొని కర్తయు వరుస నియతి
శ్రాద్ధ మొనరింపఁ దగుఁ బితృసమితిఁ గూర్చి. 901
సీ. శ్రాద్ధము చేయుకర్తయు భోక్తలును గ్రామ్యధర్మము చేసినఁ దత్పితరులు
మాస మొక్కఁడు దురాత్మకుని రేతస్సునఁ బడియుండుదురు తనవనిత నొకఁడు
శ్రాద్ధభుక్తికిఁ దాను సమ్మతిఁ గైకొని సంగమించునొ యట్లు శ్రాద్ధభోజ
నము చేసి యట్టికార్యము చేయునో తత్పితరులును వాని రేతస్సుచేత
తే. మూత్రమునఁ జేయఁబడినట్టి భుక్తిచేత
మాస మొక్కఁడు జీవింత్రు మానసముల
జింతఁ గదురంగఁ గావునఁ జిత్తశుద్ధి
గలుగు ప్రాజ్ఞుల భుక్తికిఁ బిలువవలయు. 902
క. ధరణీదేవత లత్తఱి, దొరకనిచో మానుటొప్పు దుష్టద్విజులం
దరుణీసంగతిఁ జనువా, రరువిద్యానిపుణులైన నొప్పదు చెప్పన్. 903
క. సరియగు తరుణంబుననే, యరుదెంచిన భిక్షుకుల నియతచిత్తుల నా
దరణమునఁ బిల్చి యన్నము, పరికరయుతముగను బెట్టి ప్రణిపాతములన్. 904
క. అలరింపఁజేయఁదగు యోగులు శ్రాద్ధమునందు భుక్తిఁగొన నర్హులు ప్రా
జ్ఞులు నట్టివారె యగుదురు, తలపోయఁగ నియత యోగధారులు పితరుల్.
క. కనుకన్ యోగుల భుక్తికి, మునుకొని ప్రార్థింపవలయు భూమీదివిజుల్
గనవేయిసంఖ్యయొకచో, టనునిల్చిన యోగి యొక్కటన్ నిల్చినచోన్. 906
తే. యోగి వారలఁ గర్తను నుదధి నౌక, జనులఁ దరియింపఁ జేసెడుచందమునను
దాను దరియింపఁ జేయుఁ బితరుల గాథ, లొగిని గీర్తింపఁబడును బ్రాజ్ఞగణమునను.
వ. పూర్వ మైలునికాలంబునఁ బితరు లొక్కతఱి "మాసంతతియందెవ్వనికే
నొక్కకొడు కుదయించి యోగులశ్రాద్ధభుక్తికి నియమించి పిండప్రదానంబుచేసి
యోగిభుక్తశేషాన్నమును భుజించునో, గయయందుఁగాని మఱియొక్కపిత్రు
యోగ్యస్థలంబునంగాని ఖడ్గమాంసంబుచే నొండె, హవిస్సుచే నొండె, కాలశాక
తిలాజ్యంబులచే నొండె, కృసరంబుచే నొండెఁ బిండప్రదానంబుచేయునో వాని
వంశం బభివృద్ధినొంద నాశీర్వదింతు" మని పలికిరి. కావునఁ దదుక్తప్రకార
మొనర్చువారి కాపితరు లాశిషంబు లిడుదురు ఖడ్గమాంసము హవిస్సు ననునీ
రెండు నుత్తరోత్తరబలవత్తరంబులు. త్రయోదశియందును మఘానక్షత్రమం
దును విధివిహితముగా శ్రాద్ధ మొనరింపఁదగు. మధుసర్పిస్సమాయుక్తంబుగాఁ

బాయసమును దక్షిణాయనంబునఁ బితరులకు సమర్పింపవలయును. ఇట్లు చేయువారు పాపనిర్ముక్తులై సర్వకామముల నొందుదురు. పితరులు తృప్తులైన వసురుద్రాదిత్యనక్షత్రగ్రహతారకలు సంతృప్తినొందు. ఆయుఃప్రజాధనవిద్యాస్వర్గమోక్షసుఖంబులును రాజ్యంబును శ్రాద్ధతర్పితులగు పితరు లనుగ్రహింతురు. పూర్వాహ్ణమునకంటె నపరాహ్ణము పితృక్రియల కత్యుత్తమంబు. మఱియు. 908

క. తనయింటికివచ్చిన భూ, మినిర్జరేంద్రులను భక్తిమిగులం బూజిం
చి నియతిఁ బవిత్రకరుఁడై, మనము శుచిత్వంబు గనఁగ మంజులభణితిన్. 909

తే. ఆదరించి మనంబున నధికమోద, మొసఁగు నాసనములయందు నుండఁజేసి
శ్రాద్ధకల్పంబుఁ జక్కఁగా సాగఁజేసి, వారి భుక్తిని దన్పుచుఁ బనుపవలయు.

క. పనిపెడుతఱి వందనములఁ, దనుపందగు ద్వారసీమదనుకం దాఁ బో
యి నిలిచి వారలయాజ్ఞను, జనఁదగు నంతర్గృహంబు చక్కటి కెలమిన్. 911

తే. చేయఁదగు కృత్యములను దీర్చియె భుజింప
వలయుఁ బితరులకే సల్పవలయు నిత్య
కృత్యము లటంచుఁ గొంద ఱహీనమతులు
పల్కుదురు కొంద ఱద్దానిఁ బాటి గొనరు. 912

సీ. నిత్యంబులైనట్టి కృత్యంబు లవియేవి యని కొందఱందు రెట్లనిన నేమి
యన్నియుఁ బెద్దలయాచారమున నుదాహరణంబులై యొప్పు ననఘులార
శ్రాద్ధాన్నశేషంబు సకలబంధువులను గలిసి భుజింపఁగా వలయు నిట్లు
సంయతాత్ముండయి శ్రాద్ధంబు పితరుల సంతృప్తికై ధర్మసంగతిఁ గొని

తే. చేయఁగాఁదగు నేవిధిఁ జేయ విప్రవరులు సంతృప్తులౌదు రావరుస దాని
జరపనౌ నింక శ్రాద్ధభోజనము సేయఁ, బనికిరాని ద్విజాతుల వినుఁడు తెలియ.

## శ్రాద్ధానర్హబ్రాహ్మణులు.

క. తనమిత్రున కపకారము, బొనరించినయతఁడు కునఖముల నొప్పునతం
డును క్లీబుఁడు క్షయరోగం,బునుగలయాతండు శ్విత్రి పూజానర్హుల్. 914

సీ. వాణిజ్యవృత్తిని వర్తించునాతఁడు శ్యావదంతుఁడు బధిరాంధకులును
ఖల్వాటుఁడును గాయకంటివాఁడును జడుఁ డక్లిమూఁగయుఁ బంగువంతరమున
షండత నొప్పెడుజనుఁడు దుశ్చర్ముఁడు కరము లల్పములయి కానఁబడెడు
నతఁడును మఱి వికలాంగుఁడు నటు మెల్లకంటివాఁడును నెట్టికనులవాఁడు

తే. కుష్ఠరోగంబు బాధింపఁగుందునతఁడు, కుబ్జుఁడును వామనుఁడుదుష్టకులజనితుఁడు
వికటుఁ డలసుఁడు మిత్రులవిడిచి వారి, కపకృతిని జేయునాతఁడు నర్హులెట్లు.

సీ. పశుపాలనంబున బ్రదుకువాఁడును నిరాకృతియును బరివిత్తి యెన్నిచూడఁ
బరివేత్తయగునట్టివాఁడును మఱి పరివేదని కానూతి వృషలిసుతుఁడు

తత్తనూజుండు శ్రాద్ధమున భుజింప ననర్హులు వృషలీతనయునివలన [చును
సంస్కారమును బొందుజనుఁడు ననూఢుండు దిధిషూపతియును భృతిని గొను

ఆ. జదువుచెప్పువాఁడు చదువ జీతం బిచ్చు, వాఁడు సూతకాన్నభక్షకుండు
వేఁటకాఁడు సోమవిక్రయ మొనరించు,పాతకుఁడును శ్రాద్ధపంక్తికరులు. 916

క. పరవనితాసంగతిముఖ,గురుతరదోషముల నెన్ని కుందఁగఁ జేయన్
బరిభూతినొందువాఁడును, బరధనహరణమున నిందపాలగునతఁడున్. 917

క. పతితుఁడు వృద్ధింగొని జీ,వితమును సాగంగఁజేయువిధము గనెడుదు
ర్మతియును శఠుఁడునుబిశునుఁడు,శ్రుతులఁ ద్యజించినయతండుశ్రుతినిందకులున్.

క. దానాగ్నిత్యాగంబున, మానసము దురంతపాపమండిత మగుటన్
జ్ఞానవిహీనుండగు నా, త్మానిర్జరుఁ డర్హు లెన్నఁగాఁ గారు చుఁడీ. 919

క. ధరణిపభృత్యపురోహితు, లరయన్ మత్సరియు విద్య యమరనియతఁడున్
జర గదురునతఁడు మఱి దు,ర్ధరుఁడును వైరియును గ్రూరతం దగునతఁడున్.

సీ. దేవలకుండు బుద్ధివిహీనుఁ డట్లె నక్షత్రసూచకుఁడును గర్హితుండు
పర్వకారుఁడు యోగ్యపద్ధతి లేనట్టియర్థముల యజ్ఞార్థ మర్థ మడుగు
నతఁడు నీమొదలగు నధముల శ్రాద్ధాన్నభోక్తలుగాఁ జెప్పఁ బోల రెపుడు
వీరుచూచిన భుక్తి విగతఫలంబగుఁ బంక్తిదూషకు లనఁబరఁగుచుంద్రు

తే. సాధుపరిభవ మట్లె యసత్పరిగ్రహము నొనర్చెడువారికి నతిభయంక
రమగు దండము దైవకృతము హఠాత్తు, గా వడింబడుఁ బయిని శంక లిట లేవు.

క. పరిశుద్ధమతిని విప్రుని, బరిత్యజించియె యెవండు బాలిశుఁ గుడువన్
బరికించి పిలుచు నాతఁడు, ధర వంశమునిల్పుకొనఁగఁ దగఁడు ధ్రువముగన్.

క. తనునాశ్రయించి తగుయో,గ్యుని వదలి మఱొక్కబ్రాహ్మణోత్తము శ్రాద్ధం
బునఁ భోక్తగఁ బిల్చునొయా,మనుజుఁడు తత్కోపవహ్ని వ్రందును జుండీ.

తే. వస్త్రదానంబుచేయని వైదికవిధి, యజ్ఞములు లేవు తపమొప్ప దట్లుగాన
శ్రాద్ధకాలంబునందు వస్త్రముల నీయ, వలయు విప్రోత్తముల కిది లలితపథము.

సీ. కౌశేయక క్షౌమ కార్పాసములు దుకూలాంబరంబును నూత్నమైనదాని
యొండేదియే శక్తి కనుకూలముగ నీయ నఖిలకామంబుల నతఁడు పొందు
నావు లెన్నియొ యుండ నాత్మమాతను వత్స మరయువిధంబున నన్నదాన
మాతని పితరుల కమలతృప్తిం జేయు వెదకి యందఱిలోన విప్రవర్యుఁ

తే. గుడువఁ బిలువంగఁదగుఁ బేరు గోత్ర మమల
మంత్రములు ననునివి కర్త మహితగతిని
బొందఁగాఁ జేయుఁ దత్కాలమందు నెవరు
మృతినిగాంచిరొ వారికిఁ దృప్తినొసఁగు. 925

క. సురలకుఁ బితృవరులకు ని,ర్భరయోగసమాధి నొప్పువారికి స్వాహా
తరుణికి స్వధయను దేవికి, నిరతమ్ము నమస్తతులను నే నొనరింతున్. 926

క. అను నీమంత్రము శ్రాద్ధం,బునకుం దుదిభాగమందు ముమ్మాఱులు శ్రీ
తిని జపియింపంజనుఁ బిం,డనికరనిర్వాపణమ్మునందు నుడువ నౌ. 927

తే. మనసు నిలుకడఁ జేసి యీమంత్రజపము
సలుప వేగంబ వత్తురు సకలసురులు
రక్కసులు నిల్వఁజాలక రయము మీఱఁ
బాఱుదురు భీతి మదియందుఁ బర్వఁగాన. 928

క. మునులార! మంత్ర మిది భవ,వననిధినుండియె తరింపవచ్చుపథంబున్
గనఁబఱచు మూఁడుజగముల, గనఁ జేయుం దృప్తి పలుకఁగా నేల యికన్. 929

తే. క్షౌమసూతము నవ్యంబు నేమ మలర, శాణకార్పాసికంబుల క్ష్మాసురులకు
బట్టిసూత్రపత్రోర్ణముల్ వదలి యితర,యోగ్యవస్తువులను నీయనొప్పు శుభము.

వ. శ్రాద్ధానర్హవస్తువుల నొసంగినఁ బితరు లసంతృప్తులై యరుగుదురుగాన నట్టి వస్తుదానము వర్జింపఁదగు. పిండంబులఁ బితరులకు నివేదింపఁ జనదు. ఇష్టపదార్థంబుల యథావిధి నిడవలయు. అగ్నియందుఁ బిండమునుంచఁదగు. సంతానార్థియగుభార్యకుఁ బిండము నీయవలయు. అందును మంత్రపూర్వకముగా మధ్యమపిండమునే యీయవలయు. ఇతరపిండంబుల గోవుల కొసఁగుటొప్పు. జలంబుల వైచినఁ బ్రజ్ఞయు యశస్సును గలుగు. దీర్ఘాయువునుగోరిన వాయసంబుకుఁ బెట్టందగు. కుమారులను గృహంబులను గోరినఁ గుక్కుటంబుల కిడవలయు. కొందఱు పిండోద్ధరణము విప్రానుజ్ఞచే నిష్టానుసారముగఁ జేయవచ్చు నందురు. కావున శ్రాద్ధము మునిప్రోక్తమార్గంబునఁ జేయం దగు. లేకున్న దోషంబు వాటిల్లు. పితరులు విముఖులై యరుగుదురు. యవ, వ్రీహి, తిల,మాష, గోధూమ,చణక, ముద్గ, శ్యామాక, సర్షపద్రవంబులఁ బితృసంతృప్తి చేయవలయు. నీవారములు హస్తిశ్యామాకంబులు ప్రియంగువులు పితృప్రీతిదాయకంబులు. ఆమ్ర, మామ్రాతక, బిల్వదాడిమబీజపూరక ప్రాచీనామలకములు క్షీరము, నారికేళ పరూషక వత్సక ఖర్జూర ద్రాక్షా నీలకపిత్థ ఫలంబులు పితృయోగ్యంబులు. పటోల ప్రియాల కర్కంధూ బదర వైకంకత నారింగ బీజపూరఫలములు శ్రాద్ధార్హంబులు. గుడశర్కమత్స్యండినామకములును గవ్యపయస్సును, గవ్యమగు దధిఘృతములు, తైలము సాగరజనితలవణంబును, సారసలవణంబును, నివేదింపం దగు. చందనాగురుకుంకుమములు పితృప్రీతిదంబులు. కాలశాకంబు తండులీయ వాస్తుక మూలకములు నారణ్యశాకంబులు పితృప్రమోదప్రదంబులు. జాతీ చంపక లోధ్ర మల్లికా బాణబదరీ వృంతాశోకాటరూప తులసీతిలక పావంతీ శతపత్రా గంధశేఫాలికాదిపుష్పంబులు సమ

ర్పించుట ఫలప్రదంబు. మఱియుఁ గుబ్జక తగర వనకేతకీ పుష్పంబులు యూథికాతిముక్తములు శ్రాద్ధయోగ్యములు. కమల కుముద పద్మపుండరీకంబులు నిందీవర కోకనద కహ్లారంబులు పితృయోగ్యంబులని యెఱుంగవలయు. కుష్ఠంబు, మాంసియు బాలకంబు కుక్కుటీజాతిపత్త్రకంబు లర్హంబులు. నీలికోశీరముస్తములు గ్రంథిపర్ణియు లోనగునవి గంధయోగ్యంబులగుటఁ బితృదేవతార్హంబులు. మఱియును- 931

సీ. అగురు చందనములు నల్లి గుగ్గులువనువస్తువు శ్రీవాసవర్ణ్యధూప
యోగ్యవస్తువులు భక్త్యుత్కటప్రీతిచే సేకరింపం దగు సిద్ధఫలద
ములు ఋషిగుగ్గులు వలరు ధూపార్హమం చనిరి మౌనులు వీనినరసి తెచ్చి
ధూపమువేయ సంతుష్టినొందుదు రెల్ల పితృదేవతలు సదా ప్రీతమతులు.

తే. చణకములు కోరదూషకసంజ్ఞికములు
రాజమాషము లామసూరములు విప్రు
షములు మర్కట కోద్రవసంజ్ఞికములు
నైన ధాన్యము లర్హము లనఁగరాదు. 932

వ. మాహిషంబు చామరంబు, మార్గంబావికం బేకశఫోద్భవంబు స్త్రైణంబౌష్ట్రంబు నగుదధిక్షీరములు ఘృతంబును వర్జ్యంబులు. తాల వరుణ కాకోల బహుపత్త్రార్జునీఫల జంబీరరక్తబిల్వ సాలఫలంబులు పితృయోగ్యంబులుగావు. మత్స్యసూకరకూర్మ ప్రముఖజంతుమాంసంబులు పనికిరావు. పూతికమృగనాభి రోచనా పద్మచందన కాలేయకోగ్రగంధ తురుష్కంబులు వర్జ్యంబులు. పలాండుకుమారీ కిరాతపిండమూలక గృంజన చుక్రికా చక్ర జీవశతపుష్పా నీలికా గంధసూకర హాలభృత్య సర్షప లశునములఁ బరిత్యజింప వలయును. మానస్కంద విషస్కంద వజ్రకంద గదాస్థిక, పురుషాల్పములు శ్రాద్ధానర్హంబులు. అలాబువు, తిక్తపర్ణయుఁ, గూశ్మాండకటుకత్రయవార్తాక శివ జాత లోమశ వట కాలీయ రక్తవర్ణ బలాకా, లకుచవిభీతక ఫలంబులు పితృయోగ్యములు కావు. ఆరనాళము, శుక్త, శీర్ణ, పర్యుషితములు పనికిరావు. ఉగ్రగంధ మగుపదార్థము శ్రాద్ధంబున నుపయోగింపరాదు. కోవిదారక శిగ్రుకములు ననర్హములు. అత్యమ్లవస్తువు, పిచ్ఛిలమగునది, రూక్షమగునది యామమునకుఁ బూర్వము పక్వము చేయఁబడినదియుఁ బనికిరాదు. గతరసపదార్థము నుపయోగింప రాదు. మద్య గంధముగల వస్తువులు త్యజింపఁ దగినవి. హింగు వుగ్రగంధంబుగాన నదియుఁ ద్యాజ్యమే. ఫణిశ భూనింబ, నింబ,రాజికకస్తుంబురు కలింగోత్థామ్లవేతసముల వదలవలయు. దాడిమంబు, మాగధియు, నాగ, రార్ద్రిక, తిత్తిడులు, నామ్రాతకంబు, జీవక, తుంబురువస్తువు లర్హంబులు. శాల్మలీముద్గమోదకాదిపదార్థముల భక్తిపూర్వకంబుగ నొసంగ వలయు. పానకంబు రసాలగోక్షీరముల నివేదించు టొప్పు.

స్వాదువులై స్నిగ్ధంబులై భోజ్యములై యీషదమ్లకటువులై యుండుపదార్థంబులు శ్రాద్ధకర్మంబునందు యోగ్యంబు లని యెఱుంగందగు. అత్యమ్లమతిలవణం బతితిక్తం బతికటువు నాసురంబునగు పదార్థంబు నివేదింప రాదు. మిష్టంబై స్నిగ్ధంబై యీషత్కట్వమ్లకంబై స్వాదువై దేవభోజ్యంబై తగు వస్తువు నివేదింపం జను. ఛాగమాంసము వార్తికంబు తైత్తిరంబు శశకామిషంబు, శివా, లావక, రాజీవమాంసంబు శ్రాద్ధార్హంబగు. వార్ధ్రీణసంబు. రక్తశివంబు, లోహంబు సింహతుండంబు ఖడ్గంబునగుమాంసం బుత్తమంబు. మనుప్రోక్తంబైనను రోహితమత్స్యమాంసంబు నివేదింపంజనదు. వరాహావలోకితం బెంతపవిత్రవస్తువైనఁ ద్యాజ్యంబని యెఱుంగందగు. ఆవస్తు వొసంగిన రౌరవనరకంబగు. పూర్వోక్తనిషిద్ధపదార్థంబులు వారాహమూర్తిచేఁ బ్రోక్తంబులయ్యె. విప్రుల కభక్ష్యంబులగు నవి పితృయోగ్యములు గావు. రోహితసూకర కూర్మ గోధా హంసమాంసంబులు పనికిరావు. చక్రవాక మద్గు శల్కమత్స్య కురరనిరస్థివాసహారికుక్కుట కలవింక మయూర భారద్వాజ శార్ఙ్గకనకులోలూకమార్జార ప్రముఖ జంతువులు శ్రాద్ధనిషిద్ధంబులు. టిట్టిభంబు జంబూకంబువ్యాఘ్ర భల్లూక తరక్షుప్ర ఖఘోరమృగంబుల శ్రాద్ధదినంబున దర్శింపరాదు వీనిమాంసంబుల భక్షించిన రౌరవాదినరకంబులు గలుగు. గర్హితముల నీజంతుమాంసములఁ బితరుల కేదుష్టమతి నివేదించునో యతం డాత్మపితరులను గూడ స్వర్గభ్రష్టులనుగా నొనరించు. కుసుంభశాకంబు, జంబీరంబు, శిగ్రుకంబు, కోవిదారకంబు, పిణ్యాకంబు, విప్రుషంబు, మసూరగృంజన శణకోద్రవ కోకిలాక్ష చుక్ర కంబుక పద్మక శాకంబులు, చకోర శ్యేనమాంసంబు, వర్తులాలాబుతాళినీ తాళతరుఫలంబులు భుజింప నరకనివాసంబు గలుగు. కావున జాగరూకుఁడై పదార్థముల నివేదింపవలయు. శ్రీమద్వారాహమూర్తియగు మహావిష్ణువు పితృయోగ్యపదార్థముల నెఱింగించె. నిషిద్ధమాంస భక్షణంబుకంటె నాత్మమాంసభక్షణంబు మేలని తెలియం దగు. ప్రమాదవశంబున నొండె నజ్ఞానముననొండె నభక్ష్యపదార్థంబులం దినినఁ బ్రాయశ్చిత్తంబు చేయుటొప్పు. ఫలమూలదధిక్షీర గోమూత్ర యావకంబులతోఁ గలిపి యభోజ్యవస్తువుల భుజించిన నొక్కొక్కదానికి దినసప్తకం బుపవాసంబు చెప్పంబడియె. ఇట్లు ప్రాయశ్చిత్తంబున దేహము పరిశుద్ధం బగు. ఇట్లు వర్జ్యవస్తువుల వదలి విధిమంతంబుగా శ్రాద్ధంబు చేయందగు. విభవోచితంబుగ శ్రాద్ధంబు భక్తిమై నొనరించిన జగంబులఁ దృప్తినొందించు ననవిని మును లిట్లనిరి. 993

క. జనకుం డుండఁగ నాతని, జనకుఁడు తజ్జనకుఁడు యమసద్మముఁ జేరం
జన వారికి శ్రాద్ధం బెటు, లొనరింపం దగునొ చెప్పుమ యురుతరరీతిన్. 934

చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నర్హవిధిన్ జనకుండు శ్రాద్ధమె
వ్వనికొఱ కాచరించు నెటు వారక యట్టులె తత్తనూజుఁ డ
ప్పని నొనరింపనొను బరిపాటి యిదొగద ధర్మసంతతిన్
జనసుతిఁ గాంచు లౌకికము శ్రౌతమునంచు నెఱుంగఁ గాఁదగున్. 935

సీ. అనవిని మౌను లిట్లని రదెవ్వని తండ్రి మృతినొంద నాతనిపిత సజీవుఁ
డై యుండ శ్రాద్ధ మెట్లాచరింపఁగ నగు ననవుడు వ్యాసుఁ డిట్లనియె మౌని
వరులార వినుఁడు తత్సరణి వచించెదఁ దండ్రికిఁ బిండంబుఁ దనయుఁ డిడుచుఁ
దాఁ బితామహునకుఁ దగుభక్తి భోజన మిడి వానితండ్రికి నిడఁగఁ దగును

ఆ. బిండ మిద్ది యెల్లవిధు లందుఁ దగియుండు, మృతులకెల్లఁ బిండ మిడఁగ వలయు
బ్రదికియున్నయట్టివారికెల్లను భుక్తి, నిడఁగవలయు శాస్త్రహిత మిది యగు.

వ. అట్టితఱి సపిండీకరణము లేదు పార్వణశ్రాద్ధ మొనర్ప రాదు. ఎవండు పితృ
మేధాశ్రితంబగు నాచారమును నడుపు నాతఁడు ధనధాన్యాయుర్సుఖంబుల
వెలయు. ఇందులకు సంశయంబు లేదు పితృమేధామృతమనంబడు నీవిష
యంబు నెవ్వఁడు శ్రాద్ధకాలమునఁ బఠించు నాయన్నమును బరమాదరంబునఁ
బితృదేవతలు భుజింతురు. మునులారా! పితృమేధకల్పము చెప్పితిని. ఇది పాప
హరంబు. పుణ్యవివర్ధనంబు నగు. ప్రయత్నపూర్వకంబుగ దీనిం బఠింపవలయు
ననిపలికి వ్యాసమహాముని మఱియు నిట్లనియె. 937

---

## నూటపదుమూఁడవయధ్యాయము.

### సదాచారప్రశంస.

క. మునులార! గృహస్థువు విధి, కనుసరణముగాఁగ దేవతాళిఁ బితృగణం
బును బూజచేయ వలయును, దనయింటికి వచ్చినట్టిధర్మాత్ములకున్. 938

క. అతిథులకును భోజన మిడి, జతనంబుగఁ దృప్తిసేయఁజను బాంధవులం
గృతకృత్యులఁ జేయం జను, భృతిగొను సేవకులకెల్లహిత మొనరుపనౌ. 939

క. భూతములకుఁ బశుపక్షుల, కాతతముగ బలులఁ దృప్తి నమరుప నగుఁద
న్నేతఱి భిక్షుకు లార్త, వ్రాతము మార్గస్థు లేమి వలసియడిగినన్. 940

సీ. సాధుమార్గంబునఁ జన నెంచెడుగృహస్థు వాత్మశక్తికిఁ దగినట్లు వారి
కుపకార మొనరించు టొప్పు వారలఁగని ధిక్కరించినయట్టి యొక్కరినున
కెల్లపాపంబులు తల్లడిల్లఁగఁ జేయునాధులు వ్యాధులు నగు మఱియును
వాఁడొనరించు సత్క్రియల్ వ్యర్థంబులయి పోవుననుమాట లాలకించి

ఆ. మునులు పల్కిరిట్లు వినిపించితివి నిత్య, కృత్యముల నిమిత్తమన్ని చేయు
నట్టికార్యములను వ్యాసమునీ నరుఁ, డెన్ని చేయఁదగిన వన్ని వినఁగ. 941

క. కోరిక పొడమెడుఁ గర్మం, బారయఁ ద్రివిధంబుగాఁగ నమరును నిత్యం
బై రహిఁ నైమిత్తికమై, యారీతిం గామ్య మగుచు నలరుంగాదే. 942

క. వినఁగోరుదు మద్దానిన్, మునిరాజ! సదాచరణము మునివినుతంబై
చనుఁగద దానిం జెప్పుము, మనుజుండెద్దానిఁ బూన మహి సుఖ మబ్బున్. 943

క. పరలోకంబున సుఖమున్, బరమాద్భుతమైనదానిఁ బడయఁగ వచ్చున్
గరుణించి యట్టి పరమా,చరణము వినిపింపవయ్య సన్నుతభణితిన్. 944

క. అన వ్యాసుఁ డిట్టులను వినుఁ, డనయం బాచారరక్షణాదృతిఁ బూనం
జనును గృహస్థువు దానిని, గొనకున్న శుభంబు లొందఁగూడు నదెట్టుల్. 945

సీ. నరుఁడు సదాచారపరిరక్షణము చేయకయె యజ్ఞతపము లక్కరణి దాన
ములు సేయ సత్ఫలంబులఁ బొంద నగునెట్లు దీక్షాయు వాతఁ డెత్తెఱఁగునఁ గను
జ్ఞాన మెవ్విధిఁ గాంచుఁ? గాన సదాచార మనునదియే ధర్మ మనఁగఁ బరఁగుఁ
దత్స్వరూపంబు నిత్తఱిఁ దెల్పువాఁడ సదాచార మేకాగ్రమైనమతిని
ఆ. గావఁ బూనవలయు గార్హస్థ్యధర్మ మీ, వరుస నుండు మఱి త్రివర్గసాధ
నమున యత్నమూనుటమలపద్ధతి గృహ,స్థువున కనుచు మీమదుల నెఱుఁగుఁడు.

వ. ఆచారంబు నేకాగ్రమతిం బూని యత్నై రక్షింపవలయు. అది సిద్ధించిన నిహపర సుఖంబులు గలుగు. పాదమాత్రము సదాచారంబు నాశ్రయించిన శ్రేయస్సు గలుగు. అర్ధమాత్ర మాశ్రయించిన నిత్యనైమిత్తికక్రియాసిద్ధి గలుగు. కావున దానిం బరిపాలింపఁ బూను టత్యుత్తమంబు. అట్లే పాపనిర్మూలనార్థము ధర్మము నాచరింపవలయు. అర్థకామము లిహఫలప్రదంబులగు. ధర్మాచరణంబు లుగలవాని కీ యర్థకామములు ఫలించు అర్థంబు పరలోకసహాయార్థ మిహ లోకసుఖార్థ మాశ్రయింపం దగు. కామంబు ద్వివిధంబు అది త్రివర్గావిరోధం బుగ సమాశ్రయింపం దగియుండు. ధర్మార్థకామము లనునీ త్రివర్గములు పర స్పరాశ్రయము గలవని తెలియం దగు. విపరీతానుబంధంబు గలవనియు నెఱుం గుట సమంచితంబు. మఱియును. 947

సీ. ధర్మానుబంధ మర్థంబుగాఁదగు నద్ది ధర్మ మనంబడు ద్రవ్య మిపుడు
స్వప్రయోజనపరత్వముగ నార్జింపఁగఁ దగ దట్టు లార్జించు ద్రవ్య మెన్న
ధర్మార్జనమునకుఁ దగకుండు నట్టివౌ ద్రవ్యధర్మంబులు తగినరీతిఁ
గామోపయుక్తత గ్రాలు నా కామంబు తద్ద్వయార్జనమునఁ దా ఫలించు
తే. నివ్వి మూఁడు పరస్పర మెన్న సాధ,కములు గానుండు నివె త్రివర్గములు నాఁగఁ
బ్రథితములు నగుచుండును బృథివియందు, నింక వినుఁడు సదాచార మేదొ మీరు.

చ. మనుజుఁడు బ్రాహ్మమంచు క్షితిమండలిఁ గీర్తిని గన్న కాలమం
దున నిదురింపఁగూడ దది దోఁచినయంతనె మేలుకాంచి దై

వనియతి లోఁదలంచి కడు భక్తిని ధర్మము నర్థమున్ మనం
బునఁబరిచింతనంబునకుఁ బూనఁగఁజేయఁ దగున్ మహోదృతిన్. 949

ఆ. ఆముహూర్త మిట్టు లాలోచనము చేసి, శయ్యనుండి లేచి సాధుపద్ధ
తిఁ దగ నాచమించి పాదలు శ్రద్ధను శుచి, యగుచు స్నానమాడి యాత్మనియతి.

క. తొలిసంధ్య నుపాసింపఁగ, నెలమిం గనవలయు దాని కేకాలము ని
ర్మలశాస్త్రవిహితమో నేఁ, దెలిపెద మునివర్యులార తెలియుఁడు దానిన్. 951

సీ. తారకలుండంగఁ దాఁ బూర్వసంధ్యను భాస్కరరశ్ములు పరఁగుచుండఁ
బశ్చిమసంధ్యను బర్యుపాసింపనౌ ముఖ్యకాలము లివ్వి భూరిఫలద
ములు గాన నెట్టివేతలు లేకయుండఁగా వీని మానఁగరాదు మానవుండు
సంధ్యాద్వయంబు నిశ్చలభక్తితో నుపాసించి యసత్యంబుఁ జెవులకింపు

ఆ. గాని యట్టిపలుకు మాని యసచ్ఛాస్త్ర,వాదములను వీడి భవ్యవృత్తి
లేనివారిపొందు లేకుండఁ గాలంబుఁ, బుచ్చవలయు ధర్మబుద్ధి గలిగి. 952

క. ప్రాతస్సాయంతనముల, నీతిన్ హోమంబు చేసి నిర్మలమతియై
యేతప్పు చేయకుండుదు, నేతఱినే ననుచు నాత్మ నెన్నఁగవలయున్. 953

ఆ. ఉదయకాలమందు నుదధిఁ గ్రుంకెడువేళ, భానుఁ జూడఁ దగదు మానవుండు
దర్పణంబు గనుట దంతధావన మంజనము శిఖాప్రసాదనమును నివ్వి. 954

సీ. పూర్వాహ్ణమునఁ జేయఁ బూనఁగాఁదగు దేవతర్పణంబును జేయఁదగును నపుడె
గ్రామగృహక్షేత్రకమ్రతీర్థాధ్వములందు విణ్మూత్రంబు లాతురపడి
విడువ దోషం బబ్బుఁ బుడమి సస్యము పెట్టు దున్నిన నచ్చోట దోష మవ్వి
వదలిన మఱియు గోవ్రజము పవిత్రంబు గాన నాపని చేయఁ గలుష మబ్బు

ఆ. వస్త్రహీనయైన వామాక్షిఁ బరభార్య, గనఁగరాదు దోషగణము దానఁ
గలుగుఁ దనపురీషకముఁ జూడరా దద్ది, యాయువును హరించు నార్యులార.

క. ఋతుమతియగు నాతిం గను, టతిపాపము తాఁకుటయును నట్టిదె యగు నా
సతితో సంభాషించుట, పతితునిగాఁ జేయుఁ బెక్కుపల్కు లిఁకేలా. 956

క. జలములఁ బురీషమూత్రం,బుల విడువన్ రాదు కామమున నందు సతిం
గలయిక నలరించుట తగ, దలఘుతరంబైన పాపమబ్బును దానన్. 957

వ. శకృన్మూత్రకేశకపాలములపై నిలువరాదు. తుషాంగార రజ్జువస్త్రంబులపై
గూడ నిలుచుండ రాదు. మార్గమధ్యంబునఁ గూరుచుండ రాదు. వస్త్రంబుల
నందుంచ రాదు. మఱియు. 958

క. పితృదేవమర్త్యభూత,ప్రతతులఁ బూజింపవలయు భక్తిగ విభవం
బు తగునో యెంతగ దానికి, హితమగుపద్ధతిని బిదప గృహి సన్మతియై. 95

ఆ. తా భుజింపవలయుఁ దనవాక్కు నియతిని, గాంచియుండఁ జిత్తకలితశుద్ధి

బ్రాగుదఙ్ముఖములు పరిశుద్ధిదములు భోజనము చేయుటకును శాస్త్రవిధిని.

సీ. భుజియించునప్పుడు బుద్ధి యన్నాయత్తమయి యుండవలయు నాయన్నమె పర
మాత్మయంచుఁ దలంప నగు దాన మేలగు జాన్వంతరముల హస్తంబు లుండఁ
దగు నిది భోజనధర్మంబు దోష మేదైన లేకుండ నాయన్నముఁ దిని
కొంతభాగము మానఁగూడదు ప్రత్యక్షలవణంబుఁ బాత్రస్థలమున నెందు

ఆ. నేని యునుపరాదు మానవో నుచ్ఛిష్ట, మైనయన్నమును మహాతురమున
దారి నడచుచుండి తగదు భుజింపఁగ, నిలువఁబడియు గుడువ వలనుపడదు.

వ. పయనంబుచేయునపుడు నిలుచుండియు విణ్మూత్రముల విడువరాదని శాస్త్ర
సమ్మతంబు ఎట్టియిక్కట్టులందు నుచ్ఛిష్టంబును భుజింపరాదు. అపరిశుద్ధుఁడై
మాటలాడరాదు. వేదంబుఁ బఠింపరాదని వేఱుగఁ జెప్పనేల?. 962

క. పనియేదిలేక స్వేచ్ఛగఁ, గనరాదు రవీందుతారకానిచయం బా
సనము విభిన్నము కాఁగాఁ, జనదటఁ గూర్చుండి నియతి సల్పఁగ నెపుడే. 963

తే. శయ్య భోజనపాత్రంబుఁ జక్క నమరి, యుండవలయును భిన్నత నొందరాదు
భిన్నములెయైనవదలుట విధివిహితము,గురువు లరుదేరఁ దా నెదుర్కొని సభక్తి.

క. కొనివచ్చి యాసనవరం,బునఁ గూర్చుండంగఁ జేయఁబూనఁగ వలయుక్
మనమున కనుకూలించెడు, ననువున భాషింపవలయు నభిముఖుఁ డగుచున్.

క. గురువు ప్రయాణము చేసెడు, తరుణంబున వెంటఁబోవఁ దగు విప్రియ మే
వరుస నొనరింపఁ గూడదు, పరమార్థము దానఁ జెడును బల్కు లిఁకేలా. 966

సీ. ఏకవస్త్రుండయి యెపుడు భుజింపరా దమరార్చనముచేయ ననువుపడదు
బ్రాహ్మణావాహన వహ్నిహోమాదుల నేకవస్త్రుండయి యెపుడు చేయ
రాదు; నగ్నుండయి రమ్యోదకంబుల నలరుసరస్సునం దైనఁగాని
స్నానంబుచేయఁగాఁ జనదు పరుండరా దట్టులె కండూతి యంగమందుఁ

తే. గలుగ రెండుచేతుల గీఱఁగా నఘంబు, గలుగు శిరము నట్టులె గీఱగాఁజనదని
శాస్త్రమర్యాదగలదు నిష్కారణముగ, శిరము దడుపంగరాదు తోఁచినపుడెల్ల.

వ. శిరస్స్నానంబు తైలంబునఁ జేయవలయును. నిష్కారణంబుగా నవయవములఁ
దుడుచుకొనరాదు. సర్వానధ్యాయంబుల వేదపఠనంబు విడువవలయు. బ్రాహ్మ
ణుల, నగ్నిహోత్రంబును, ధేనువుల, సూర్యు, నొకప్పుడే నవమానింపరాదు.
రాత్రియం దుదఙ్ముఖుండై పగట దక్షిణాభిముఖుండై పురీషంబు విడువవలయు.
ఎవరికిబాధ గలుగనిచోట మూత్రపురీషంబుల విడువం దగు. గురువొనరించు
దుష్కృతంబులఁ దడువరాదు. క్రుద్ధుఁడై యున్నగురువు ననుగ్రహింపు మని
ప్రార్థింప వలయు. ఇతరులు గురువును దూషించుచున్నఁ దా వినరాదు దారిఁ
బోవునపుడు బ్రాహ్మణుఁడు, రాజు, దుఃఖాతురుం డెదురుపడినఁ దాను దొలంగి

వారికిం ద్రోవ విడువవలయు. విద్యాధికునకు గర్భిణియగు వనితకు రోగార్త
నకు మహాత్మునకు మూకాంధబధిరమత్తోన్మత్తులకు మార్గంబు వదలవలయు.
మఱియును. 968

క. అమరనివాసము చైత్యము, సుమహితవిద్యాధికుండు శుభమార్గము చో
ప్పమరం దెల్పు గురుండు వ్రతము జను లొగి నడుచునాపథముఁ గనఁబడఁగన్.

క. వలగొనిన పిదపఁ బోవఁగ, వలయున్ సుమదామములును వస్త్రమ్ములు చె
ప్పులులోనగు నవి యొరులి, మ్ముల నొందఁగ వానిఁ దాను బూన నఘంబౌ.

సీ. అమవసయందుఁ బున్నమయందు నష్టమియందుఁ జతుర్దశియందు మఱియుఁ
బర్వమ్ములందు నవయవసంతృప్తిని గల్గించు నభ్యంగకము లలనల
తోడి పొందును గూడదు మతిమంతుఁడు బాహువుల నెత్తి జంఘులఁబోలఁ బైకిఁ
జాఁపియందఱుఁ జూడఁజతురత గన్పడ నిలుచుండ రాదు కావలయుననుచుఁ

ఆ. బాదముల విదుర్ప రాదు పాదముపైనఁ, బాద మునుపరాదు బాలుఁ బతితు
నసతియందుఁ దమిని నాదృతిఁగని దాని, పనులఁ దీర్చువాని మన మలరఁగ.

క. కలసి మెలంగుట యనుచిత, మెలమిం బరుమర్మములకు నెవ్విధి బాధల్
గలుగు నటు కొట్టఁ జన దన్యుల కపకారంబుసేయు టొప్పదొకతఱిన్. 972

తే. హాసమునకేని విలపించుటనుచితంబు, దంభమగునభిమానంబుఁ దైక్ష్ణ్యమొక్క
తఱిని బూనఁగరాదు విద్వద్వరుండు వ్యసనమునఁ గుందువారిని నంగహీను.

సీ. మూర్ఖు నున్మత్తుని మూఁగను న్యూనాంగు ద్రవ్యవిహీనుని దాను గాంచి
పరిహాసవాక్యముల్ పలుకుట కొఱగాదు శిష్యుఁ బుత్త్రకుని శిక్షింపనొరుల
దండంబుఁ గొనరాదు తనపాదమున నాసనము లాగికొనిముదం బమరదాని
పైని గూర్చుండఁ బాపముగల్గు సంయావ కృశరమాంసంబుల నశనమునకుఁ

తే. దనకుఁగా నేకరింపరా దనిరి మునులు, పగలు రాతిరి యతిథిపూజ గడియించి
తా భుజింపఁగఁ దగు ననితత్త్వవిదులు,పలికి రాచారతత్త్వంబుఁ దెలియుకొఱకు.

ఆ. దంతధావనంబు తగుఁ జేయఁ బ్రాగుద,ఙ్ముఖుఁడెయగుచు వాక్కుపొదల నియతి
శాస్త్రనియతిఁ గనని క్ష్మారుహాలతలను, దంతములను దోమఁ దగదు నిజము.

క. *నరుఁ డుత్తరముగనేఁ బడ,మరగానేఁ దలనిడి విధిమర్యాద నెదం
బరికింపక శయనింపన్, దురితంబులె కాక యపకృతులు వే తోఁచున్. 976

క. శతముఖుదిక్కుగఁ దలనిడి, మతిమంతుఁడు నిద్రవోవ మంచిగలుగు సూ
ర్యతనయుదిక్కుగఁ దలనిడి, కృతశయనుండైనఁ గల్గు నెల్లశుభంబుల్. 977

క. తొలిజామునఁ బరిమళయు, గ్జలముల స్నానంబుచేయఁ జన దుపరాగం
బులఁ దప్పఁ ద్రియామను మ, ర్త్యులు స్నానముచేయరాదు దుష్ఫలమగుటన్.

క. దినమే స్నానార్హం బౌ, నని మౌనులు పల్కి రల్లె హస్తతలమునం

* నోదక్శిరాః స్వపేజ్జాతున చ ప్రత్యక్శిరా నరః. ౪౯. అని మూలము.

దున వస్త్రమునిచి యంగంబును దుడువక రాదు కేశములఁ జేతులచేత. 979
సీ. విదలింపఁగా రాదు వెస వస్త్రముల హస్తతలముల నుదుకంగఁదగదు స్నాన
మునకు ముందుగ గంధమును బూసికొనరాదు నరుణవస్త్రముల నేయదనునందుఁ
గట్టఁగారాదు చక్కనిరంగునక మించు వసనంబులక నీలవసనములను
ధరియింపరాదు వస్త్రము మాయఁగాఁ ద్రిప్పి కట్టరా దంచులుగల్గనట్టి
ఆ. యంబరమును బ్రాఁతదగువస్త్రమును గట్టఁ, జనదటంచుఁ బలుకు శాస్త్రవితతి
కీటదూషితంబు కేశావపన్నంబు, శ్వానముఖ లోఁగి ముట్టఁ జాలినదియు. 980
వ. శునకవీక్షితంబును, సారతరభాగంబు తీయ మిగిలినదియుఁ, బృష్ఠభాగమందుండు నదియు నవిహితంబు నగు మాసంబుఁ దినరాదని శాస్త్రమర్యాద యని యెఱుంగవలయు. ప్రత్యక్షలవణంబునెత్తఱినే భుజియింపరాదు. చిరకాల కృతంబును శుష్కంబును బర్యుషితంబు నగుపదార్థము భుజియింపంజనదు. ఆ వస్తువులు పిష్టశాకేక్షుపయఃకృతంబు లైనచో భుజింపవచ్చునని యెఱుంగ వలయు మాంసవికారముల నన్నే వదలఁదగదు. 981
క. భానుం డుదయించెడుతఱి, నేనియు నస్తాద్రి కేగు నెపు డట్టితఱిన్
మానవుఁడు శయనమును విడఁగానగు నిద్రింపరాదు కలుషమొదవుటన్.
సీ. స్నానమొనర్పక సంవిష్టుఁడునుగాక స్థిరచిత్తుఁడునుగాక క్షితిని గూరు
చుండియు శయ్యపైనుండియు భుజియింపఁ జనదని రార్యులు శబ్ద మొనరఁ
జేయుచు భుజియింపఁ జెందు దోషము లందు సేవకులకుఁ దృప్తిసేయకుండ
భుజియింప రా దొకప్పుడును సుస్నాతుఁడై రెండువేళల దిన నిండుసుఖము
ఆ. కోవిదుండు పరునికోమలిఁ గోరరా, దట్లుకోర నిహము నవలఁ బరముఁ
బాడుసేయు నద్ది పరఁగ నిష్టాపూర్తికములఁ జెఱచు దోషగణముఁ గూర్చు.
క. పరదారగమనవాంఛయె, దురితాకర మంతెకాక తొలఁగించుఁజుండీ
గురుతరమగు నాయుష్యము, పరికింపం దీనిఁబోలు పాపము గలదే. 984
ఉ. కావున భావమందుఁ బరకాంతను దల్లిగ నెంచఁగాఁ దగున్
దేవ ధనంజయ ప్రణతి తృప్తిని బొందఁగ వారి హోమపూ
జావిధులం బొనర్చుటయు సద్గురువందన మాచరించుటల్
కావలె ముందుగా నవలఁ గాఁదగు భోజన మద్ది యొప్పెడున్. 985
ఉ. ఫేనము శబ్దగంధములు ప్రీతి హరించు పరాగముల్ గనం
గానఁ బడంగఁ గూడ దుదకంబుల వానినె యాచమింపఁగా
నౌ నవి నిర్మలంబులయి హారిరుచిం దగియుండఁగావలెన్
మానవుఁ డుత్తరాస్యుఁడయి మానసశుద్ధిని నాచమింపనౌ. 986
ఉ. తూరుపుమోముగా నయిన దోషహరంబగు నాచమింపఁగా
నీరములోని మృత్తికయు నిర్మలవస్తువివర్జితంబునౌ

ధారణి నున్నమృత్తికయు ధామగతంబగుమట్టిపుట్టలోఁ
జెరినమన్ను శుద్ధికయి చేకొనరాదని కార్యమానిపుల్. 987

క. ఒకఁ డుపయోగించినమృ, త్తిక గైకొనఁగూడ దైదు తెఱఁగులఁ దగుమృ
త్తిక లివ్వి యయోగ్యము లని, సకలవిదుల్ పల్కి రెల్లశాస్త్రవిధులుగా. 988

వ. కరపాదప్రక్షాళనం బొనర్చి తుడిచికొని సమాహితాత్ముండై యంతర్జాను
హస్తుండై త్రిచతుర్వారంబు లాచమనంబు చేయవలయు. రెండుపర్యాయ
ములు స్వావయవంబుల మూర్ధంబును జలకణంబులం దడుపందగు. అదియే
పరిమార్జనం బనంబడు. ఆచమనము చేసినపిదపఁ గార్యారంభ మొనరింపవలయు.
తుమ్మినను జంతు వేదియేని తన్ను నాకినను వాయువు తీవ్రగతి వీచినను నిష్ఠీవ
నాదు లొనరించినను శుచితం గాంచ నాచమింపవలయు. అస్పృష్టస్పర్శనంబున
నాచమనంబును భాస్కరదర్శనంబును యోగ్యంబు లగు ఇందు యథాసంభవ
ముగా నాచరించునది. లేకున్న దక్షిణశ్రవణము తాఁకినను శుద్ధియగు. ఇందు
మొదటిది లేకున్న రెండవదియు నది లేకున్న మూఁడవదియుఁ జేయం దగినవి.
ప్రథమవిధి లభించు నవకాశం బుండఁగా రెండవమూఁడవవిధుల నాశ్ర
యించు టుచితంబుగాదు. 989

క. పనిమాని దంతసంఘం, బును సంఘర్షణవిధానమున శబ్దింపం
గను జేయరాదు తనతను, వునఁ దాడన మొనరుపంగఁ బోల దొకపుడున్. 990

క. ధ్యానించునపుడు నిద్రం, బూనెడుతరుణంబునందు భుజియించుతఱిన్
భూనిర్జరుండు వేదముఁ, దా నించుకయైనఁ జదువఁదగ దనిరి బుధుల్. 991

సీ. ఇరుసంధ్యలందును దరుణిఁ గూడఁగరాదు పయనంబుచేయుట పాడిగాదు
శ్రద్ధమై స్వపితృతర్పణ మపరాహ్ణంబునం దొనర్పం జను నమరపితృవి
ధులను శిరస్స్నాన మెలమిఁ జేయంజనుఁ బ్రాగుదఙ్ముఖుఁ డయి పరఁగునియతి
శ్మశ్రుకర్మ మొనర్పఁ జను నిజకులమునఁ బుట్టినదైనను బూవుఁబోఁడి
ఆ. యంగహీనయైన నంగీకరింప రా, దామె రోగహీనయైన వదల
వలయు స్వీయజననివంశంబునం దైద, వదగు కన్యయైననదవిధిగద. 992

క. జనకునిపార్శ్వంబునఁ బు, ట్టిన యేడవకన్యకను గడిందివిచారం
బునుమాని గ్రహింపం దగ, దనిరి త్రికాలజ్ఞులైనయట్టిమునీంద్రుల్. 993

క. తనభార్య నెంతొ యత్నం, బునఁ గావందగును నీర్ష్యఁబూనఁదగ దహం
బున శయనమైథునంబులఁ, బనిపూనియె వదలవలయుఁ బాపభయమునన్. 994

సీ. పరజనసంతాపకర మగుకర్మంబుఁ జేయుట జంతువుల్ చేరియుండ
వానిఁ బీడించుట మానఁగాఁ దగునండ్రు సర్వవర్ణంబుల చానలను ర
జస్వలలన్ మానఁ జను నాల్గురాత్రులు కన్యక జనియించు కారణమున
నైదవరేయి భార్యనుగూడఁగాఁజన దాఱవదగుదిన మాదియైన.

ఆ. యుగ్మతిథులయందె యువిదను గూడనొ, సరిదినములయందు సంగమింపఁ
దనయు లొదవుదు రని తనయులు జేసిది,నములఁ గూడ ననిరి విమలమతులు.

వ. పర్వంబులందు దారసంగమంబున ధర్మశూన్యులును సంధ్యాకాలసంగమంబున షండులును దనయులు గలుగుదురని శాస్త్రమర్యాద గలదు. క్షురకర్మమునందు రిక్తతిథుల వదలవలయు. అవినీతులు వచించువాక్యముల వినరాదు. హీనున కాదరంబున నుత్కృష్టాసనంబు నీయరాదు. క్షురకర్మమందును, వాంతియైనతఱిని, వనితం గలసినయప్పుడును, బ్రాహ్మణుఁడు సచేలస్నానము చేయవలయును. శ్మశానభూమిని ద్రొక్కినపుడు నట్లే చేయందగు. దేవవేదద్విజాతులు సాధువులు సత్యనిరతులు గురువులు పతివ్రతలు బ్రహ్మవేత్తలు యజ్ఞకర్తలు తపస్వులు కనఁబడిన నిందించుట పరిహసించుట చేయందగు కృత్యములు గావు. గృహస్థువు ధవళాంబరములఁ దాల్చి శ్వేతపుష్పమాలికల ధరించి సతతము మాంగల్యవేషమున నుండవలయుఁగాని యమంగళవేషంబున నుండరాదు. ఉద్ధతోన్మత్తమూఢావినీతులం గూడి పండితుఁడు పయనంబు చేయం జనదు. దుశ్శీలుని వయోజాతిదూషితుని మిత్రునిగా గ్రహింపఁగూడదు. అతివ్యయశీలురను వైరులను గలిసి యేపనియుఁ జేయరాదు. కార్యదక్షులు కానివారిని, సజ్జననిందితులను, విటసంగతిగలవారిని, దరిద్రులను, వాదైకపరులను, నీచులను గూడియుండరాదు సుహృద్దీక్షిత భూపాల స్నాతక శ్వశురులు తనయింటికిరాఁగా నెదురు చని విభవానుసారము వారి నర్చింపవలయును. యథావిభవంబుగఁ బ్రతివత్సరమందును వీరి నర్చింపవలయును. వారిసాగనంపి కృతకృత్యుండు గావలయు నని పలికి వ్యాసముని మఱియు నిట్లనియె.　　995

చ. అనలునిఁ బూజలం దనిపి యాహుతులం బరితృప్తుఁ జేసి యం
దును దొలి యాహుతిన్ విధికిఁ దోరపుభక్తి నొసంగి యవ్వలన్
గనఁబడునాహుతిన్ బ్రజలఁ గాంచిన తక్కినబ్రహ్మసంజ్ఞులం
దనిపి తృతీయహోమమున ధామసుధాశనులం గ్రమంబునన్.　　997

క. తనుపం దగునాల్గవపరి, నొనరుచు నాహుతిని గశ్యపోర్వీసురమా
నిని దృప్తిఁజేయ నొప్పును, బనివడి యనుమతికి నాల్గవది యగుదానిన్.　　998

సీ. ఒసఁగి తృప్తునిజేయుటొప్పును గృహబలి యొనరింపఁదగు నవ్వలను గ్రమమున
నిత్యమా క్రమవిధిని మును చెప్పితిఁగానొ యారీతిఁ దప్పక యాచరింపఁ
నగు వైశ్వదేవంబు నవలఁజేయందగు వచియింతుఁ దద్విధి వరుస మీఱ
దాన నేయేచోట్ల దైవతములఁగూర్చి యాహుతి నీయఁగా నౌను యట్టి

తే. తావులనెవాని నునుపంగఁ దగును వేఱు, వేఱుగను దోషమబ్బునా విధి నొనర్ప
మున్నుఁ బర్జన్యునకు నట్లె యుదకమునకు, ధాత్రికిని బలి నీయుంగఁ దగునుజాండి.

వ. ఆయాహుతులు మూఁడును మృత్పాత్రంబున నునుపందగు. వాయువునకును బ్రతిదిక్పాలకునకును, బ్రహ్మకు నంతరిక్షాధిదేవతకు సూర్యునకు విశ్వేదేవత

లకు విశ్వభూతులకు నుషఃకాలమునకు భూతపతికి నుత్తరదిక్కున నునుపవల
యు. "స్వధానమ" యనుమంత్ర ముచ్చరించి పితరులకు దక్షిణభాగంబున
నుంచవలయు. అపసవ్యంబుగా నవి యిడవలయునని శాస్త్రమర్యాద గలదు. వా
యవ్యంబున నాహుతి నిడుతఱి "యత్తైతత్తే" యనుమంత్రం బుచ్చరింపందగు.
ఆయాహుతులపై నన్నావశేషమిశ్రంబుగా జలంబులఁ బోయవలయు. దేవత
లకు భూదేవతలకు నమస్కరణం బవ్వల నొనర్చుటొప్పు. పాణిదక్షిణ భాగం
బున నంగుష్ఠోత్తరభాగంబునఁ గలరేఖ బ్రాహ్మతీర్థ మనంబడు. అది యాచమనా
ర్హంబు. తర్జన్యంగుష్ఠమధ్యభాగంబు పితృతీర్థం బనంబడు. నాందీముఖంబునం
దప్పఁ దక్కినకాలంబులఁ బితరుల కాతీర్థంబుననె తృప్తి చేయందగు. అంగు
ళ్యగ్రంబు దైవతీర్థ మనంబడు. దేవక్రియ లద్దానిచే నొనర్పఁ దృప్తియగు. కని
ష్ఠికామూలంబు బ్రహ్మతీర్థ మనంబడు. అందుఁ బ్రజాపతిదైవమును దృప్తుని
జేయు టొప్పు. ఈతీర్థంబుల నాయాయిదేవతలకుఁ దృప్తి చేయవలయునని విధి
విధించు. ఇందు భేదంబు చేయరాదు బ్రాహ్మతీర్థంబున నాచమనంబు ప్రశస్తంబు.
పితృతీర్థంబునఁ బితృకార్యములును, దైవతీర్థమున దేవతాక్రియలు నొనర్ప
వలయు. ప్రాజాపత్యంబున బ్రహ్మపూజ చేయవలయు. నాందీముఖంబున బిండో
దకక్రియ యవశ్యకంబు. జలాగ్నుల కేకకాలంబున సంబంధంబుఁ గూర్పరాదు.
మఱియు. 1000

క. గురుదేవపితరులును భూ,సురులును గన్పడగ వారిశుభసన్నిధినిన్
జరణము లగపడఁ జేయుట, దురితంబని పెద్దలంద్రు దోష మెఱుఁగుటన్. 1001

ఆ. పాలుత్రాగుచున్ననాల నింకొకరికిఁ, జూపరాదు శౌచ మేపగిదిని
నల్ప మధికమైన నాచారపద్ధతి, మానరా దటంద్రు మౌను లెలమి. 1002

క. మతిమంతుఁడు వదనానిల,హాతి ననలుని మండఁజేయ నఘమగు వెజ్జు
శ్రుతియెఱిఁగిన విప్రుఁడు స, మ్మతి బుణమిచ్చెడు కృపైకమహితాత్ముండున్.

క. జలముల నొప్పెడునదియును, వెలసిన యచ్చోటనుంట వితతసుఖం బీ
యిల నీనాలుగువిధములు, చెలఁగనిచో నుండరాదు చేటొదవుఁ జూఁడీ. 1004

సీ. స్వాధీనభృత్యుఁ డౌ నవనీశ్వరుఁడు ధర్మతత్పరుం డుండునాస్థలమునందు
నివసింపఁగాఁ దగు నృపుఁ డధర్మాత్ముఁడె యైనచో నచ్చోట నలరు నెట్లు
సుఖములు మఱియును శుభచిత్తులై యైకమత్యము వెలయ ధర్మమగురీతి
వర్తించుపౌరు లేవసతి నుండరొ యందుఁ బ్రాజ్ఞుఁడు నివసింప నర్హమగును

తే. మచ్చరము పూనకుండిన మనుజు లుండు
తావున వసింపఁగాఁదగు దాన సుఖము
గలుగు గర్వవిహీనులౌ కర్షకు లెటఁ
దఱచు వసియింతు రచ్చోటఁ దగు వసింప. 1005

చ. వలసినయప్పు డౌషధసువస్తువు లన్నియు నెందునుండు నా
స్థలము వసింప నర్హ మని సాధువు లండ్రివి మూఁడు లేనిభూ
ముల వసియింప రాదు మఱి పూర్వవిరోధియు సంతతోత్సవం
బులును జిగీషువౌనృపుఁడు మూఁడివి యెందుఁ జెలంగు నాధరణ్. 1006

క. మతిమంతుఁడు వసియింపఁగ, నతిశయదుఃఖంబు లొదవు నట్లౌట శుచి
వ్రతులు సదాచారులు నొ,త్రీతిసురు లున్నట్టిభూమిఁ జేరుట యనువౌ. 1007

క. పరులను దిరస్కరించెడు, ధరణీపతి సస్యముల సతంబొసఁగు మహ
త్తరకేదారము లుండెడు, ధరయును వాసార్హ మనిరి ధర్మవిదగ్ర్యుల్. 1008

చ. మునివరులార! మీకు హితముగ్ మదిఁగోరి వచించినాఁడ ధ
ర్మనిచయ మింకఁ బల్కెదను మానవు లెట్టిపదార్థరాజినిం
దినఁదగు వేనినిం దినఁగఁ దృప్తిని బొందక పాపరాశినిం
గనుదురొ తద్విధంబు వినఁగాఁ దగియుండును శ్రద్ధ మీఱఁగన్. 1009

క. అన్నము పర్యుషితంబై, యున్నను స్నేహాక్తమగుచు నొప్పినచో సం
పన్నమె యగుఁ జిరసంభృత, మన్నమఘుం బందు లేదు హరిఫలదమౌ. 1010

సీ. యవలు గోధుమలు నానలరుధాన్యంబులఁ జేయఁగాఁ బడినవి సిద్ధధేను
పయసుచే నిర్మింపఁబడినవియు నగుసద్వస్తువుల్ స్నేహసంభరితములుగ
నుండకున్నను దోష మొప్పదు భుజియింప శశకంబు నుడుము కచ్ఛపవరాహ
ములు నేదుపంది చేఁపలును భక్ష్యంబులౌ గ్రామసూకరము భక్ష్యంబు గాదు
తే. తామ్రచూడ మభక్ష్యము దైవతములఁ,బితరులం దృప్తిసేయఁగ విధి నిడి మఱి
దాని బ్రాహ్మణతృప్తికై తగును గొనఁగఁ, బ్రోక్షితం బెట్టి దైనను బోలుఁ దినఁగ.

వ. ఔషధార్థము పూర్వోక్తమాంసంబు దినఁదగు. శంఖ పాషాణ సువర్ణ రజత రజ్జు వస్త్రములకును, శాకమూలఫలంబులకును, విదలచర్మములకును, మణిప్రవాళ మౌక్తిక నిర్మితపాత్రములకును, జరుసనామకయజ్ఞపాత్రమునకును, జలప్రోక్షణంబున శుద్ధి యగు పాషాణనిర్మిత పాత్రంబులకు జలప్రోక్షణంబును బరస్పర పాత్రసంఘర్షణంబును బరిశుద్ధిం గల్పించు. సస్నేహపాత్రములకు నుష్ణోదకక్షాళనంబు శుద్ధికరంబు. చేఁటలకు జింకచర్మములకు ముసలోలూఖలములకు మడతగానున్న వస్త్రములకు జలప్రోక్షణంబు శుద్ధిని గల్పించు. వల్కలములకన్నింటికి జలప్రోక్షణము మృత్తికాసేచనంబు ననునీ రెండుపద్ధతులు శుచితం జేసురఁ జేయు గొఱ్ఱెలరోమముల నిర్మింపఁబడిన సకలవస్తువులకును గేశములకు నిట్లే శుద్ధి యని యెఱుంగ నగు. ఆవాలకుఁ గల్కము తిలకల్కము ననునీ రెండును బావనతఁ గల్పించు. ఉపఘాతముగల పదార్థములకు శోధనంబె శుద్ధి యగు. కార్పాసికములకు జలభస్మము శుద్ధికరంబు. దారుదంతాస్థిశృంగములకుఁ జెక్కుటయె శుద్ధియగు. మట్టిపాత్రములకుఁ బునఃపాకమున శుద్ధియగు. భైక్షంబు

కారుహస్తంబు పణ్యవస్తువు యోషిన్ముఖంబు శుద్ధంబె యగుననియు దానికి
శుద్ధ్యంతరంబు లేదనియు మునుల మతము. యోషిద్వక్షోజద్వంద్వంబు పరిశు
ద్ధంబని యెఱుంగవలయు. దాసవర్గసంస్కృతపదార్థంబు శుద్ధంబు. చిరాతీతంబు
యోగ్యంబగునని మునులు వచించిరి. మఱియు. 1012

సీ. ప్రవహించుచుఁ గంధరహితములై యున్న జలములు శుద్ధమ్ము లిలయుఁ గొంత
కాలముసాఁగఁగాఁ గడు శుద్ధినిం గాంచుఁ గాల్చినను ధేనుగణము త్రొక్కి-
నను శుద్ధియగునని మును లొప్పఁజెప్పిరి; జలమార్జనమ్మున నలుకుట మఱి
గోమయోదకమును గోరి చల్లుట దర్భసమ్మార్జనమునను సరగ శుద్ధ
తే. మగును గోమూత్రమునఁ గేశములను గీట
కముల మక్షికముల నశుద్ధమగు నన్న
మున మృదంబువులును భస్మమును జిలికిన
భోజ్యమగు నంచుఁ బలికిరి మునులు ఘనులు. 1013

వ. ఔదుంబరపాత్రము లమ్లముచే శుద్ధములగు. త్రపుసీసములకు జలంబె శుద్ధిక
రంబు కంచుపాత్రములకు భస్మోదకము పరిశుద్ధిం గల్పించు. ద్రవపదార్థములు
తడిపిన శుద్ధంబులగు. అశుద్ధపదార్థయుతంబులగు వస్తువులకెల్ల మృత్తోయ
ములు శుద్ధికరంబులు. ఆదుర్వాసన పోవునంతకుఁ దాఁక రాదు. ఆవల శుద్ధం
బులె యగు. ఇతరద్రవ్యములు వర్ణగంధములఁ దొలఁగించినంత శుద్ధియగునని
ప్రాచీనసదాచారము. చాండాలక్రవ్యాద వినిపాతితంబగు మాంసంబు
శుద్ధంబు రథ్యాగతంబగు తైలాదికంబు శుద్ధంబని యెఱుంగందగు. గోతృప్తి
నొసంగుజలంబు పావనంబని యెన్నంబడు. రజస్సు వహ్నియు నశ్వగోచ్ఛాయా
రశ్ములు పవనుఁడు. భూమియు జలశీకరంబులు మక్షికాదులు దుష్టసంబంధంబున
నపరిశుద్ధిం గాంచవు. అజాశ్వములు ముఖమువలనఁ బరిశుద్ధము లగు. గోవత్సము
లయాననములు శుద్ధములు గావు. తల్లి స్వేదము శుద్ధము. ఫలపాతనంబున బక్షి
శుద్ధిం గాంచు. మఱియు. 1014

సీ. ఆసనశయనముల్ యానంబు నదియిరుదరులనుండుతృణంబు తరణిచంద్ర
రశ్ములు మఱిజగత్ప్రాణసంస్పర్శతఁ బరిశుద్ధి గాంచును బణ్యవస్తు
వులు నల్లె యనుచును దెలియంగఁదగియుండు; మార్గమునడుచుసమయమునందు
స్నానంబునందు క్షుత్పానంబులందు నాచమనము చేయుట సాధుమతము
తే. వస్త్రధారణమందు నావరుస నాచమింపఁగాఁదగు; మఱి స్పృశియింపఁ దగిన
వారిసంస్పర్శమునను ద్రోవలఁగలియునప్పుడును గర్దమజలములఁ బొదలు శుద్ధి.

వ. పక్వేష్టకచితలకు వాయుస్పర్శమె శుద్ధికారణంబు. ప్రభూతోపహతంబగు
నన్నమునఁ బైభాగము వదలిజలంబులు ప్రోక్షించిన శుద్ధియగు. ఆచమనంబు

చేసి మృజ్జలంబులఁ జల్లఁదగునని మహాత్ములు వచించిరి. దుష్టాన్నభోజనం
బునఁ ద్రిరాత్రంబు లుపవసింపవలయు. 1016

క. తెలియక చేసినపాపం,బులకుం బ్రాచితము ప్రోక్తముగదా చక్కం
దెలిసియె యొనరించిన యఘ,ములకుం బ్రాచితము లేదు మునివరులారా. 1017

సీ. ఋతుమతియైయున్న యతివ వివస్త్రయైయాతపస్వంగి సూతికఁ దాఁక శుచితఁ
గోరిన స్నానంబుగూడు నందురు శవహారుని స్పృశియింప నక్లి స్నాన
మర్హంబు మనుజునియస్థి సస్నేహంబుఁ దాఁకిన స్నానంబు తగు శుచితకు
స్నేహశూన్యాస్థిని స్పృశియింప నాచమనమున శుద్ధుండగు నరుఁడు ధేను

ఆ. దర్శనమును జేయఁదగు శుద్ధి రవిదర్శ,నమున శుద్ధి యగును విమలమతిని
బైని జెప్పినట్టి ప్రాచితముల దేని, నైనఁ జేయవచ్చు నర్హమగుట. 1018

క. మలమును నుద్వర్తనమును, విలంఘనము చేయరాదు వేశ్మమ్మున న
మ్మలమూత్రోచ్ఛిష్టమ్ములఁ, గలిగింపఁగరాదు పాపకార్యము గానన్. 1019

ఆ. ఐదుపిడికిళులకు ననువగు మృత్తికఁ, దీసి వెలికి వైచి తృప్తిమీఱఁ
బరనిజలములందుఁ బరమాత్ముఁ దలఁచుచు, స్నాన మాచరింపఁ జను నరుండు.

ఉ. ప్రాదినులన్ స్వభావముగ రాజిలు మద్దులయందు గంగయం
దాదిసరస్సులందు నియతాత్మకుఁడై మునుఁగంగ నొప్పు స
మ్మోదముమీఱఁగాఁ దరుసమూహముఁ దీఁగలఁ బెంచి తత్ఫలం
బాదటఁ గోరి రక్షణము నాదృతిఁ జేయువనంబులం దొగిన్. 1021

ఉ. కాలముగాని కాలమునఁ గారణ మెయ్యదియున్న నిల్వఁగాఁ
జాల వగల్ జనించు మనుజప్రతతిన్ వగపాలు చేయు గీ
తాళిని బాడరాదు పరునంగనతోఁ బలుకంగరా దదే
వేళను దేవతాసవనబృందము నిందయొనర్చువారితోన్. 1222

క. పితరుల శాస్త్రంబులనున్, యతులను యజ్వలను దిట్టునట్టి కుమతిసం
తతితోఁ గలిసిమెలంగుట, హితమే కాదనిరి ప్రాజ్ఞులెల్లఁ గడంకన్. 1023

క. వారిస్పృశించుట పల్కుట, గారాని దటంద్రు, దానిఁ గావించినచో
సారసమిత్రుని జూచుట, ఘోరాఘహరం బటండ్రు కోవిదులెల్లన్. 1024

సీ. ముట్టుదోషముగలముగుదను గాంచినఁ బతితుని శవముఁ బుంస్త్వంబులేని
మనుజు విధర్ముని మరణంబునందున్నవాని సూతికను శవంబు మోయు
వారలఁ బరదారవాంఛకులను గన్న భాస్కరుదర్శింపవలయు దాన
సంశుద్ధి గల్గు భోజ్యంబు గానట్టివస్తువులను షండభిక్షుకులఁ బిల్లిఁ

తే. గుక్కుటంబును ఖరమును సూకరు శ్వపచు
నక్లి యపవిద్ధ మృతహారకాదులను స్పృ
శించినన్ స్నాన మొనరింపఁ జేకురుఁ బరి
శుద్ధి యనిపల్కి రార్యులు శ్రుతుల నరసి. 1250

క. ఋతుమతిని గ్రామకోలము, మతినెఱుఁగకఁ దాఁకస్నానమాత్రమె యను చుఁ
స్మృతిమతము సూతికాశౌచత దూషితులైన నరులసంస్పర్శమునన్. 1026

క. కలుగు నఘమల్లె విధిగా, జలముల మునుఁగంగఁ బాయు సత్కర్మము లే
ఖలునిగృహంబుననిత్యము, విలయముగను చుండునట్టివిమతునిదాఁకన్. 1027

తే. తాఁకినంతన స్నానంబు దగు నొనర్ప, బ్రాహ్మణత్యక్తుఁడగు వాని బాపకారి
వస్తుభక్షకు స్పృశియింపవచ్చుఁ బాప,మదియు స్నానంబునం బోవు ననిరి మునులు.

చ. కనుకనె నిత్యకర్మము లఖండవిధిం బొనరింప నొప్పు వా
నిని విడువంగఁ గల్గెడును నీచత నిత్యములైన కర్మముల్
పొనరుపనట్టివాని కగు భూరితరంబగు పాప మెట్టిదో
వినుఁ డెఱిఁగింతు సద్ద్విజుఁడు విచ్యుతదానజపాగ్నిహోత్రుఁడై. 1029

క. పదిదినము లుండెనేనియు, మది నించుక శంక లేక క్ష్మాపతి రెండున్
బదియుదినంబులు వైశ్యుఁడు, పదునైదుదినంబు లల్లె పరవశమతియై. 1030

ఆ. కర్మహీనుఁడగుచుఁ గాలంబుఁ గడపిన, శూద్రుఁ డొక్కనెలయు శుభతమస్వ
కీయవిధులమాని కేవలేంద్రియలోలుఁ, డగుచునున్నఁ బాప మలరు దాన. 1031

సీ. జాతంబు మృత మనఁ జనెడునాశౌచంబునందుఁ గర్మముల నెల్లను మాని
ప్రాగుక్తదినముల నేగతినో పుచ్ఛ నఘము లేదండ్రు మహాత్ము లరసి
తరువాతఁ గర్మసంతతి యథార్థంబుగా నొనరింపదగు వంశమున జనించి
నట్టి యాతఁడు మృతినంద గోత్రజులెల్ల బాహ్యస్థలమునందుఁ బరమనియతి

ఆ. సలిల మిడఁగఁదగును జచ్చినవానికి, నస్థిసంచయ మనునట్టికర్మ
మాదిదినమునందు నైన నాల్గవదిన,మందు నేడవదినమందు నైన. 1032

క. నవమదినంబున నైనను, సవిధి నొనర్పంగఁదగును స్వకులజునకు నా
ల్గవదినమందే యొనరుపఁ,గవలయునని పల్కి రార్యగణహితచర్యుల్. 1033

వ. అస్థిసంచయనానంతరము తదంగస్పర్శము పాపప్రదంబుగాదు. పిదపఁ బ్రేతము నుద్దేశించి యన్నికర్మము లాచరింపం దగు. మృతదినమందు సపిండులను స్పృశించిన దోషంబు లేదు. సగోత్రసపిండులకుఁ బరస్పరస్పర్శం బల్లె యెఱుంగందగు. శస్త్ర రజ్జు బంధన వహ్ని విషజనితమృతుల విషయంబున నీనియమంబు లేదు. వారిజ్ఞాతుల స్పృశించు టొప్పు. బాలుండు దేశాంతరస్థుండు, ప్రవ్రజితుండు మరణించినవంశ్యులకు మూఁడుదినంబు లాశౌచంబు. బంధువుల కాశౌచంబు స్నానపర్యంతంబె యని యెఱుంగవలయు. సపిండులకు సంపిడమృతియందిల్లె యాశౌచంబు జననాశౌచమం దీవిధియేయని తెలియవలయు. సమానోదకుల యందు సమానోదకులకు నీవిధంబె యారోపింపవలయు. 1034

క. తనరు సచేలస్నానము, తనయుం డుదయించినంతఁ దండ్రికి మఱి యా
జనకుం డెచ్చటనుండియో, చను దెంచిన నపుడె చేయఁ జను స్నానంబున్. 1035

క. తనయుం డవ్వల నొక్కఁడు, జనియించునయేని తొలుత జన్మించినయా
తనయునినుండియె లెక్కిం,పనుజను గవలందు నిదియె సరణి తెలియుఁడీ 1036
సీ. వరుసగా బ్రాహ్మణబాహుజోరుజ పాదభవులకుఁ బదియును ద్వాదశదిన
ములు పదునైదును ముప్పదిదినములు జననినిమిత్తకాశౌచ మలరు
నవ్వల స్వస్వకర్మావళి చేయఁగా యోగ్యులౌదురు శాస్త్ర మొప్పఁజెప్పె
నిట్లు ప్రేతముఁగూర్చియే యొనర్పందగు సవిధి నేకోద్దిష్టసంజ్ఞ నలరు
ఆ. శ్రాద్ధ మర్హులైన శ్మాదివిజులఁ బిల్చి, దాన మీయవలయు దేనిఁ బ్రేత
మనుభవింపఁగోరు నాత్మగృహంబునఁ, గలదొ యేది దాని గౌరవమున. 1037
ఉ. దానముఁబట్ట నర్హుఁడగు ధారణిదేవుని బిల్చి భక్తిమై
దీని గ్రహింపుమీ యనుచుఁ దృప్తిగ నీఁదగు నద్ది సత్ఫలం
బీ నను మోద మొందు నదియెప్పుడు నాశము నొందకుండు నో
మౌనివరేణ్యులార విధిమంతముగా నొనరించుకర్మముల్. 1038
వ. సత్ఫలంబుల నొసంగు. ఆశౌచదినంబులు పూర్ణంబులుకాఁగా జలస్పర్శనంబుచేసి వాహనాయుధంబుఁ దాఁకవలయు. పిండోదకప్రదానకాలమందు వాహనాయుధంబుల వర్ణానుసారంబుగా నీయందగు. సమగ్రవిధివిహితకర్మంబు లిహపరంబుల సమగ్రఫలంబుల నిచ్చు మఱియు. 1039
క. అనుదినము వేదపాఠం, బొనరించుట మేలు దాన నొడఁగూడును బా
వనతేజము ధర్మంబున, ధన మార్జింపంగవలయుఁ దగు నియమమునన్. 1040
చ. క్రతువు లొనర్చి దేవత లఖండముదంబును బొందఁజేయఁగా
హితమగు దేన నాత్మ క్రుధ యేఁచఁ దపింపదొ దేన నేవగిం
పు తెగ జనింపదో యదియె పోలు నొనర్పఁగ శంకమాని స
న్మతులు రహస్య మంచు ననుమానముమాని వచింతురో యదే. 1041
ఆ. చేయరానిదంచు శిష్టులు పల్కిరి, మంచియాచరణము మహిని నిదియె
ధర్మ మర్థ కామతతుల నీయాలోక,ములను బొందఁ జేయఁ గలుగు నివియె.
సీ. ఈచెప్పినట్టి సత్కృత్యంబులే చేయ నాయుష్యమొదవును హర్ష మలరు
బుద్ధియు వికసించుఁ బోవుఁ బాపములు సుకృతంబు లబ్బును సుఖము లమరు
యశము కీర్తియుఁ గల్గు నమరు బలంబుఁ దేజంబును బుష్టియు సాధుగుణము
లభియించుఁ గాన నలఘుమతు లీరీతి నాచరింపం దగు నమరనగర
తే. వాస మిద్దానఁ గల్గును బ్రాహ్మణాది,వర్ణములు దీని వినఁదగు భక్తిఁజేయఁ
దగును వినినంతనే మేలు దక్షణంబ, కలుగ దారీతినొనరింపఁ గలుగు ఫలము.
చ. వినినది నెమ్మదిన్ నిలువ వింతగఁ జేయనగుం బ్రయత్న మా
పని కొనసాగునేని గురుపాపములెల్ల నశించు స్వర్గలో
కనిరతవాస మబ్బు నెఱుఁగం దగు నీయది సారభూతమై
మునినుతమై చెలంగుటను మూర్ఖులచెంగటఁ జెప్పవచ్చునే. 1044

తే. నాస్తికునకును దుష్టమనంబుగలుగు, వానికిఁ దాంభికునకు దుర్వర్తనమునఁ
దిరుగువానికిఁ గుత్సితధిషణునకును, జెప్పఁగారాదు దానిచేఁ జేటొదవును.

## నూటపదునాల్గవయధ్యాయము.

### వర్ణాశ్రమధర్మములు.

క. ఈరీతి వ్యాసముని శ్రాద్ధారంభము లోనుగాఁగ నమలవిధుల వి
స్తారముగ వచించిన మును, లాదీతుల నాలకించి యతిశయభక్తిన్. 10,6
క. పలికిరి మునీంద్ర వర్ణం,బుల కాశ్రమములకు ధర్మములు వేర్వేఱం
బొలుపారఁగాదె నాల్గు వి,ధులఁదగు నవ్వాని వినఁగఁ దోఁచెడునూహల్.
క. వినిపింపవయ్య నా విని, మునులకు నిట్లనుచుఁ జెప్పె భూసురభూమీ
శనికరములకున్ వైశ్యుల,కును శూద్రుల కొనరుపఁగఁ దగున్ ధర్మంబుల్.
క. వానిం దెలియం బల్కెద, మానీశ్వరులార! వినుఁడు క్ష్మాదివిజులకున్
దానము దయయుఁ దపంబును, మానసశుద్ధియును వేదమంత్రపఠనమున్.
క. సురతృప్తి నొనర్పఁగ న,ధ్వరములఁ జేయుటయు హవ్యవహుఁ గొల్చుటయున్
నిరతము జలములుగల యా, ధరణి వసించుటయు నొప్పు ధర్మములగుటన్.
సీ. జీవనమునుగోరి చేరి సద్ద్విజులచే యజ్ఞము చేయించుటదియు ధర్మ
మధ్యాపనము న్యాయ్యమైన దానముగొంట యజ్ఞార్థమగునేని యదియు ధర్మ
మగు లోకహిత మగునట్టికార్యము చేయఁ దగు నహితంబగు దానిఁజేయఁ
జన దదెప్పటికిని సకలభూతములందు మైత్రియుఁ దగునదె మహితధనము
తే. గోవునందు రత్నమునందుఁ గోర్కి సమము
గాఁగ నుండఁగఁ దగుఁ బరకనకదార
లందు నేమాత్ర మాశ చేయంగరాదు
స్వాంగనారతి ఋతుసమయంబునఁ దగు. 1051
చ. నరపతి స్వేచ్ఛ క్ష్మాదివిజనాథుల కాదృతి దాన మీయనౌ
సురలను యజ్ఞకర్మముల శుభ్రతరాత్ములఁ జేయనౌను ని
ర్జరులకుఁ దృప్తి యజ్ఞముల సంతతముం దగుచుండు వేదపా
ఠరతియు రాజవర్యులకు డంబముగాని విధానమే యగున్. 1052
తే. శస్త్రజీవిక భూమిరక్షణము నివ్వి
జీవికలయందు నుత్తమజీవిక లని
తెలియఁగాఁదగు నందుఁ బృథ్వీప్రపాల
నము ప్రధానంబు దానినె యమరు ముక్తి. 1053
క. ధరణీపాలనముననే, నరపతులు కృతార్థులగుట న్యాయము మఱి య
ధ్వరముల కభిభూతము భూ,వరరక్షయె లేకయున్న వర్ధిలుగాదే. 1054

చ. కుమతులకెల్ల సాధ్వసముఁ గూర్చి మహాత్ముల కెల్ల వేళలం
బ్రమదము గల్గఁజేసి ధరఁ బాలన మొప్పఁగఁజేయు రాజు మో
దముఁ గని యూర్ధ్వలోకములఁ దప్పక పొంది సుఖించు నందు వ
ర్ణములకు రక్షకుం డతఁడె న్యాయము తత్పరిపాలితం బె యగా. 1055

సీ. పాశుపాల్యము కృషి పరమధర్మంబున వాణిజ్యమునను బ్రవర్తనంబు
చేయుట వైశ్యుల న్యాయధర్మంబులు వీనిచే జీవనమౌను వారి
కని పితామహుఁడు బ్రహ్మాయు నన భాసిల్లు సృష్టికర్తయె విధిఁ జేసె మున్ను
వారి కధ్యయనసవములు దానంబును శస్త్రకర్మము లగు సంతతంబు

తే. నిత్యనైమిత్తికము లన నెగడు కర్మ
ముల నొనర్పంగఁ దగును ద్విజులనె యాశ్ర
యించి కర్మము లున్నవి యెలమి వానిఁ
గాచుటయె ధర్మ మనఁ దగుఁ గాదె యెందు. 1056

వ. క్రయవిక్రయలబ్ధ ధనంబులచేఁగాని శిల్పలబ్ధద్రవ్యంబులచేఁగాని శూద్రుండు దానము చేయందగు. పాకయజ్ఞమె యాతనికి యజ్ఞం బగు. పిత్ర్యాది కర్మములు పాకయజ్ఞంబుచేఁ జేయం జను. అన్నిజాతులకు భృత్యాదిపోషణార్థమే పరిగ్రహ ముక్తం బయ్యె. విశేషించి ద్విజులకు ఋతుకాలదారగమనంబును, సర్వభూతదయయుఁ దితీక్షయు నభిమానశూన్యతయు సత్యశౌచప్రియవాదిత్వములు మైత్రియు నస్పృహయు నకార్పణ్యము ననసూయయు నునివి సామాన్యగుణంబులగు ధర్మంబు లని యెఱుంగందగు ఈ చెప్పిన వన్నియుఁ జతురాశ్రమములకు సామాన్యలక్షణంబు లగు. ఇఁక నుపధర్మంబుల వచించెద. 1057

చ. ధరణిసురుండు క్షాత్రమగు ధర్మము నాపదయందుఁ బూననౌ
సరణిని దానిఁ బూనినను జక్కఁగ వృత్తి పొసంగదేని నె
వ్వరుసనొ వైశ్యధర్మమున వర్తిల వచ్చును; వైశ్యశూద్రధ
ర్మరతిని బూని క్షత్త్రియుఁడు మానము తూలకయుండఁగాఁ జనుఁ. 1058

తే. దాన జీవింపఁ జాలరయేని వాని, వదలఁగా వచ్చు నివ్వి సద్వర్తనములు
కాక యాపన్నివృత్తికిఁ గా వచింపఁబడియె నేవిధినైన సద్వర్తనమున. 1059

సీ. సంసారయాత్రను సాగింపఁగాఁ జనుఁ గర్మసాంకర్య మేకరణినైన
నొనరింపఁ గూడదు; మునులార వర్ణధర్మము లిట్లు శాస్త్రసమ్మతము గాఁగఁ
జెప్పితి నాశ్రమసిద్ధధర్మంబుల వివరించెదను వాని వేడ్క వినుఁడు
బాలకుం డుపనీతుఁడై లలి వేదంబు నభ్యసింపఁగఁ బూనవగును గురుని

తే. గృహమునందుండి నియతుఁడై యెపుడు శుచిత
నంది యాచారవంతుఁడై యాదరమున

గురుని శుశ్రూషలం దన్పి కోరి వేద
సంగ్రహము చేయఁగాఁజను సద్వ్రతుఁడయి. 1060

క. ఇరుసంధ్యలయందును భాస్కరు నగ్నిని గొల్వవలయు సద్గురువునకున్
బరమంబగు భక్తి నమస్కరణము చేయంగవలయు సాధ్వభిముఖతన్. 1061

చ. గురువొకచోట నిల్వఁబడఁ గోరిక శిష్యుఁడు నిల్వనా స్థలాం
తరమున కేగఁ బోవఁదగు ధారణి నాతఁడు గూరుచుండఁ ద
ద్గురుసమధాత్రి శిష్యుఁడునుగూడ వసింపఁగరాదు నీచమా
ధరణిని గూరుచుండఁ జనుఁ ద్యాజ్యము లోఁ బ్రతికూలకృత్యముల్. 1062

చ. గురువు వచింప వేదము నకుంఠితభక్తిఁ బఠింపనౌఁ బురో
ధరణి వసించి యాదరము తప్పని యానతి భిక్ష మెత్తి శ్రీ
హరిమయ మంచు నన్నము జపాంతమునం గుడవంగనౌ నదీ
పరిసరమందు మూత్రమును బర్వఁగఁజేయఁగరా దదెప్పుడున్. 1063

క. తొలుతను దేశికుఁ డానది,జలముల మునుగంగ నంత ఛాత్రుండు విధిన్
సలుపందగు స్నానము దర్భలు సమిధలు శుద్ధజలము పరిపాటి మెయిన్. 1064

క. ఒనఁగూర్పఁ దగును శిష్యుఁడు, పనివడి కాలోచితముగ బ్రహ్మపఠన మొ
య్యనఁ జేయుచు నది మునిగిన, మన మలరఁగ దేశికానుమతి నంది త్వరన్.

క. గురువునకు శక్తికొలఁదిగఁ, బరమేశార్పణమటంచు భావించి ప్రయ
త్నరతి సమార్జించిన వసు,వురుభక్తి నొసంగఁ దృప్తినొంది యతండున్. 1066

సీ. అనుమతి సేయ గార్హస్థ్య మొందఁగఁ దగు ననురూపయగుపురంధ్రిని వరించి
స్వీయకర్మమున నార్జించినవిత్తముఁ దనయాశ్రమమునకుఁ దగినయట్లు
వ్యయ మొనర్చుచు శక్తియంతవట్టును విధిఁ బాయక కర్మాళి వరుసఁజేయ
వలయుఁ దర్పణమును వాంఛించుపితరుల యజ్ఞంబుఁ గాంక్షించు నమరవరుల

తే. నన్నమును గోరుచున్నట్టి యతిథిగణము, నాదృతిం దన్పఁగాఁదగు నట్లె వేద
పఠనమున మౌనివరుల నపత్యలబ్ధి,చేఁ బ్రజాపతిఁ దృప్తులఁ జేయవలయు.

క. బలికర్మ్మున భూతంబుల సత్యముచేత నిఖిలభువనంబును ని
మ్ములఁ దృప్తిఁ జేయనగుఁ దత్ఫలమునఁ బరలోకసుఖముఁ బడయు నతండున్.

క. భిక్షాన్నము నార్జించియొ, భక్షింపం దగునుజొండి వటువులు మఱియున్
భిక్షులు వారల కెల్లను, గుక్షిమహాతృప్తి నొకటఁ గూర్చుట చేతన్. 1069

తే. అనుపమానంబు గార్హస్థ్య మనఁగఁబడును
వేదసంగ్రహమునకుఁ బవిత్రతీర్థ
ములను స్నానంబు చేయంగ భూప్రదక్షి
ణము నొనర్పంగఁ జరియింతు రమలమతులు. 1070

సీ. ఆహారమునుగోరి యనికేతనులయి సాయంకాలమునకు గృహస్థుఁ డున్న
చక్కటికిన్ రాఁగ సత్కరింపందగు వారి గృహస్థుండె భక్తిమీఱ

నట్లుగావునని గృహస్థు డాధారమా నెల్లరకని చెప్పి రెల్లమునులు;
తనయింటి కతిథి రాఁ దాను స్వాగతమును బల్కి యాసన మిడి వైభవంబు
తే. కొలఁది భోజనమిడి శయ్యఁ గూర్పవలయు
నతిథి భగ్నాశుఁడై పోవ నతనిపాప
ములు గృహస్థుని బొందుచుఁ బుణ్యములను
నతిథికిం జేర్చుఁ గావున నాదరమున. 1071
క. అలరింపవలయు నతిథులఁ, దులువతనంబూని వారిఁ దోలుట గరువం
బులఁ దెలుపు మాటలాడుట, గలఁగెడునటు దూఱుట యుపఘాతకరణముల్.
క పరుషంబులు పలుకుటయును, దురితంబును గల్గఁజేయు ధూర్తు లతిథులం
బరులనుగా భావింతురు, బరమేశులఁగాఁ దలంపవలయుం జుండీ. 1073
క. నిరుపమమగు నీవిధి నే,పురుషుఁడు చక్కఁగఁ జేయఁ బూను నతఁడు సం
సరణమయబంధముక్తుఁడు, బరమపదార్థుండు నౌచుఁ బరఁగు ధ్రువముగన్.
సీ. వయసు చెల్లినయంత భక్తుఁడైన గృహస్థు డాత్మకృత్యంబెల్ల నర్హరీతిఁ
గొనసాగుటం జేసి యనుపమానందంబుఁ గను మునులార! సత్తనయులందు
భార్య రక్షించెడుభారంబు మోపంగఁ జను నామె వదలక వనముఁ జొరఁగఁ
దలఁచినఁ దనతోడ దారను గొనిపోవఁ జనును వానప్రస్థ మనఁగ నదియె
తే. బర్ణములు మూలసంతతి ఫలములు నను
వాని నాహారముగఁ గొనవలయు నందు
జటలుధరియించి చికురముల్ శ్మశ్రువులును
వెలయ భూమిని శయనించి విమలవృత్తి. 1075
క. మునియై సర్వాతిథియై, తనకాయము వల్కలములఁ దగు చర్మమునన్
గనఁబడకుండఁగఁ గప్పం, జనుఁ గాశకుశలనునైనఁ జనుఁ గప్పంగన్. 1076
క. పరిధాన ముత్తరీయము, నరయంగా నివియె త్రిషవణాఖ్యస్నానం
బు రహింజేయుచు విధి ని,ర్జరపూజ నొనర్పవలయు సంతతనియతిన్. 1077
చ. హుతవహునందు శాస్త్రవిధి హోమము చేయుచు వచ్చినట్టి యే
యతిథులనైనఁ బొమ్మనక యాదృతిఁ బూజలఁ దన్పుచున్ బలిన్
జతనము మీఱ భూతముల సంతసమందఁగఁ జేయుచున్ముని
ప్రతతిని గూడి వర్తిలుట భద్రమటంచు నెఱుంగఁగాఁ దగున్. 1078
క. వనతరుసంభవతైలం, బున నభ్యంగంబు చేయఁబోలును ద్వంద్వా
ళిని నోర్చుటయే తపమగు, మునులారా! ధర్మములివె ముఖ్యమ్ములగున్. 1079
క. వానప్రస్థుం డీగతి, దా నియతింగూడి యున్న దహియించును బా
పాఘోన కాననంబుల, శ్రీనిర్మలలోకములను జేకొనుఁ గడఁకన్. 1080
క. వినుఁడు చతుర్థాశ్రమ మనఁ, గను బేరొందినది మోక్షకలితుని గాఁ జే

యునదియు నగు సన్న్యాసం, బనునదియే తద్విధులను నాదరమొప్పన్. 1081

ఉ. నాలవయాశ్రమంబును గొనంగఁ బ్రయత్నము చేయువాఁడు పు
త్రాళిఁ గళత్రమందు ధనమందు నెసంగెడు వాంఛ మానఁగాఁ
బోలును ధూతమత్సరుఁడు మోహవియుక్తుఁడునై కృపారసం
బొలి సమస్తభూతతతి నొప్పుగఁ బర్వఁగఁ జేయఁగాఁ దగున్. 1082

సీ. త్రైవర్ణికోచితధర్మంబులన్ మానఁ దగుఁ దదారంభసంత్యాగమందు
నిరతుండు కాఁదగు నెయ్యురయం దరివర్గంబునం దొక్కవరుస మైత్రి
నిల్పఁగాఁదగు జంతునికరమం దొకరీతి భావ ముంపం దగు వాక్కుచేత
మనసుచేతను గర్మమున నండజజరాయుజాదులయందుఁ బ్రియంబు నెఱపఁ

తే. గాఁదగు నొకప్పుడేని నిష్కరుణఁ బూనఁ
గూడ దెల్లసంగంబుల వీడవలయు
గ్రామమం దేకరాత్రంబె గడప వలయుఁ
బురమునం బంచరాత్రముల్ పుచ్చవలయు. 1083

క. మనసునఁ దిర్యక్కులయం,దును బ్రీతియు ద్వేషమును విదూరంబుగఁ దో
లనుదగు నొకప్పుడే నది, దనమదిఁ బొడచూపకుండఁ దా నియతుండై. 1084

తే. కాలమును బుచ్చఁగాఁదగు గ్రామమునకొ
పురమునకొ ప్రాణయాత్రకై పోయినపుడు
గృహములం దగ్ని చల్లారి యెల్లరును భు
జించియుండఁగ భిక్షార్థ మేగవలయు. 1085

క. దొరకినచో మోదంబును, దొరకనిచోఁ జింతయు మదిఁ దోఁపకయుండన్
దిరుగన్ వలయున్ భుక్తియు, శరీరభరణార్థమె యని స్వాంతమునందున్. 1086

వ. తలంపవలయు. మాత్రాసంగవర్జితుండై పూజాలాభమునకు హర్షింపక తదలాభమున నేవగింపక యుండవలయు. అతిపూజితలాభములచే యతి ముక్తుండయ్యు మరల బద్ధుండగు. కామక్రోధదర్పలోభమోహాదులు దోషజనకంబులగుట వానిన్ వదలి పరివ్రాట్టు నిర్మముండై యుండవలయు. సర్వభూతంబులకభయం బిచ్చి మెలఁగు పరివ్రాట్టు పరలోకంబున కరిగినను దద్దేహదర్శనంబు భయజనకంబుగాదు. తనశరీరమం దున్నయగ్నిని బూజించి స్వముఖంబునందు హోమ మొనర్చి కృతకృత్యుండు కావలయు. భిక్షోపగతహవిస్సులచే జితాగ్నిని దృప్తి నొందించి శరీరంబు వదలి ముక్తిపదంబు నొందు. మోక్షాశ్రమంబనంబడు నీసన్న్యాసంబు ధర్మంబు దప్పక యనుష్ఠానంబునఁ బొంది సంకల్పితబుద్ధియుక్తుండై యనింధనంబగు జ్యోతివలె ద్విజాతియతి బ్రహ్మపదంబున కరుగునని తెల్పిన మునులిట్లనిరి. 1087

## నూటపదునైదవ యధ్యాయము.

అనాచారస్వరూపఫలములు.

క. మునినాథా సర్వజ్ఞుఁడ, వన భూతహితుండ వనఁగ నమలాత్ముఁడ వం
చును విఖ్యాతిని భువిఁ గాం,చినకాలత్రయ మెఱుంగు సిద్ధమతివి సూ. 1088

తే. నీవెఱుంగని దిల లేదు నిశ్చయంబు, వర్ణముల కెల్ల నేకర్మవశత నధమ
గతి ప్రవర్తిల్లు నెట్టిదొ కర్మవశత, నుత్తమంబయితగుగతి యొప్పుచుండు.

క దాని నెఱిఁగింపు శూద్రుఁడు, దేనిం బూనంగ బ్రహ్మతేజోయుతుఁడౌ
మౌనివరా! వినఁ గోరిక, మానసములఁ బొదలె దేవ క్ష్మాదివిజుండున్. 1090

క. చరణభవుండయి పృథ్విం, బరఁగును వచియింపు మనఁగ వ్యాసుం డనుభూ
ధరవర్య మనఁగ యశమును, ధరియించినతుహినశిఖరి దాత్రిన్ వెలయున్.

సీ. భూరిధాతువ్రాత భూషితంబయి ద్రుమవ్రతతీప్రకీర్ణమై వర్ణనీయ
వస్తువారంబుల భాసిల్లి యాకొండ తేఁడు చెలంగును బోడిమిదగఁ
దచ్ఛిఖరంబున దహనశీతాంశుతీక్ష్ణాంశునేత్రుండయి యఖిలదుష్ట
సూదనుండయి ఫణిశోభితహారుఁడై తా మహాదేవుఁడన్ నామమూని

ఆ. శంకరుండు వెలయు శైలజ తత్పత్ని, యసమరూపమహిమ నలరు సాధ్వి
యొక్కనాఁడు శంభు నురుతరయోగీంద్ర, సేవితాంఘ్రిజలజుఁ జేరి మ్రొక్కి.

చ. తనదు మనోహరాంబకనితాంతరుచుల్ శివుదివ్యపద్ద్వయం
బునఁ బొలయంగ లేచి గిరిపుత్త్రిక యిట్లువచించె నవ్విధం
బును వినిపింతు సాధుమునిభూపతులార వినుండు శంకరా
యని కయి మోడ్చి నీవు దనుజారివి దుష్టులఁ ద్రుంతు వెప్పుడున్. 1093

చ. కుమతి యొనర్చు నామఖముఁ గూడవటంచుఁ దలంచి భూరివి
ఘ్నము గలిగించినాఁడవు జగంబున నాలుగువర్ణముల్ నితాం
తము వెలయంగఁజేసెను విధాతయు నందును వైశ్యుఁ డెట్టిక
ర్మము నొనరింప శూద్రతను క్ష్మాపతి దేని నొనర్ప వైశ్యతన్. 1094

చ. ధరణిసురుండు భూమివిభుతన్ గనువారొ యెఱుంగఁ జెప్పు ము
ర్వరఁ బ్రతిలోమజాతులకుఁ బాయక చేయఁగ నైనధర్మ మె
క్కరణిఁ జెలంగు నెట్టిదగుకర్మము చేసిన భూసురుం డొగిం
జరణజజాతిఁ బుట్టు నటు క్ష్మాపతి పుట్టును నందె తెల్పుమా. 1095

చ. ఇదె యొకసంశయంబు మది నెప్పుడు తోఁచును దీనిఁ దీర్చిప
ష్మద మొదవంగఁజేయుము క్షమాసురతం గనువారొ క్షత్త్రియుల్
మొదలగువారు నావిని ప్రమోదమునన్ హరుఁ డిట్లుపల్కె నో
సుదతిరొ బ్రాహ్మణత్వ మది చొప్పడు నే యరుదౌఁ దలంపఁగన్. 1096

సీ. బ్రాహ్మణుల్ సాధుస్వభావంబునన్ శుద్ధులట్లు క్షత్రియవైశ్యు లంఘ్రిభవులు
నను వీరలు స్వభావముననె సంశుద్ధులు దుష్కర్మమున ద్విజుల్ తొలఁగువారు
స్వస్థానముననుండి సమధికబ్రాహ్మణజాతిధర్మంబు లౌ సత్యవేద
పఠనాదులను జేసి పరమమతిం గూడి బ్రాహ్మణత్వము నొందువారు క్షత్రి
తే. యాదు లనుచు నెఱుంగు మో యబ్జనేత్ర
క్షత్రియార్యులు ద్విజులౌట క్ష్మాసురత్వ
మిట్లు గాంతురు భువి విప్రుఁ డెవఁడు విప్ర
ధర్మమును బాసి క్షత్రియధర్మ మూని. 1097
క. పరివర్తించునొ వాఁ డీ,ధరణిన్ విభ్రష్టుఁ డగుచు ధాత్రీశుండై
పరికింపఁ దదర్హములగు, పురుషార్థములందు బుద్ధి పుట్టఁగనుండున్. 1098
తే. మోహలోభాదిదుర్గుణపుంజములను, బొందినట్టి మహీసురుఁ డొందు వైశ్య
జాతిజన్మము స్వకులార్హ సాధుధర్మ,ములను వీడినకతమునఁ గను నధమత.
తే. వైశ్యుఁ డీరీతి శూద్రసంభవముఁ గాంచుఁ, దదుచితంబగు ధర్మంబు దానుగనుట
విప్రుఁడైన స్వధర్మంబు విఫలమనుచుఁ, బాయ శూద్రత నొందును బలుకు లేల.
చ. ధరణిసురుం డెవండు తనధర్మముఁ బాసి జఘన్యజోక్తధ
ర్మరతిని బూను దుర్గతికి మానము దూలి యతండు పోయి భీ
కరతరబాధలం గుడిచి క్రమ్మఱ భూమిని శూద్రయోనియం
దరుదుగఁ బుట్టు స్వీయమగునట్టి కులంబును బాయు టర్హమే. 1101
చ. క్షితిపతి యేని శూద్రులకుఁ జెప్పినధర్మము నాచరించి దు
ర్గతిఁ గను వైశ్యుఁ డట్లయగుఁ గావున నాపదయందుఁ దక్క సం
తతిఁ దగుధర్మముల్ వదలఁ దప్పదు నారక మంత శూద్రసం
తతి జననంబు నట్లగుట ధర్మముఁ దప్పఁగరాదు సుంతయున్. 1102
చ. చరణభవుం డెవండు విధిసమ్మతమౌ నిజవంశధర్మమున్
వరుసఁ ద్యజింప కాదృతిని వానినె యాచరణంబు చేయు స
త్వరముగ వాఁడు జ్ఞానియయి ధర్మవిదుం డయి సత్ఫలంబులన్
బరమశుభంబులం గనును బ్రహ్మ వచించెను మున్ను దీనినే. 1103
ఆ. ధర్మకాములగుచుఁ దగువారు నైష్ఠికు, లగుచు యోగవిద్య నభ్యసించి
ముక్తులగుదు రనుచు మును బ్రహ్మ శాసించె, వినుము గర్హితాన్న విషయ మింక.
సీ. ఉగ్రచిత్తుండయి యొప్పు పాపాత్ముని యన్నంబు శ్రాద్ధాన్న మట్లె సూత
కాన్నగణాన్నమ్ము లతినింద్యములగు ఘుష్టాన్నమ్ము భుజియింప నఘము గలుగు
శూద్రాన్నమును నొకచోట నెవ్విధినైన భుజియింపరా దది భూతహితము
గాకుంట దేవయోగ్యము గాకయుండుట భక్షింపరా దని పలుకుదు రొగి

తే. సమరు లంఘ్రిభవాన్న మే యగ్రజన్ము
కుక్షి జీర్ణింపకుండ నాక్రూరుఁ డంత
మొందు నాతండు యజ్వయైయున్న శూద్ర
గతికిఁ బోవును నిక్క మోకమలనయన. 1105

క. చరణభవునన్న శేషం, బురుతరమౌ బ్రహ్మపదమునుండి ద్విజుల స
త్వరముగ లాగును శూద్రతఁ, ద్వరఁ గనఁగాఁ జేయు నిద్ది తథ్యము తరుణీ.

వ. ఏజాతియన్నంబు కుక్షినుండ మరణించునో యాజాతిధర్మములతని నాశ్రయించునని యెఱుంగవలయు. బ్రాహ్మణత్వమును సుఖముగాఁ బొంది దుర్లభమగు దాని నెవం డవమానదృష్టిం బరికించునో యభోజ్యాన్నముల నెవండు భక్షించునో వాఁడు బ్రాహ్మణ్యహీనుండగు. సురాపానము చేయువాఁడును, బ్రహ్మహత్యయొనరించువాఁడును, సువర్ణచోరుఁడును, భగ్నవ్రతుఁడు, దొంగయు, నశుచియు, స్వాధ్యాయవర్జితుఁడును, పాపుఁడును, లుబ్ధశఠనైకృతికులును, వ్రతహీనుండును, వృషలీభర్తయుఁ, గుండాశియు, సోమవిక్రయము చేయువాఁడును, హీనసేవకుండును నగువిప్రుఁడు విప్రతను విడనాడి శూద్రయోనిం బుట్టువుం గాంచు. గురుతల్పగుండును, గురుద్వేషియు, గురుకుత్సారతియు, బ్రహ్మద్వేషియు నగువిప్రుఁడు బ్రహ్మత్వహీనుఁ డగు పూర్వోక్తకర్మముల మాని శుభకర్మము లాచరించిన శూద్రుఁడు విప్రతం గాంచు. వైశ్యుఁడు క్షత్రియతఁ బొందు. శూద్రుఁడు సకలకర్మముల యథాన్యాయమ్ముగ యథావిధిగ నాచరించుచు విప్రగృహంబున నతిథిభుక్తశేషాన్నమును భుజించుచు నగ్రిమవర్ణంబులకుఁ బరిచర్య చేయుచు నిర్మలచిత్తుఁడై తన్మార్గంబునఁ జరింపఁజాలు మఱియు.

### శూద్రజాతిధర్మవిశేషములు.

సీ. దేవద్విజాత్యర్థపావనకర్మము లాచరించుచుఁ బ్రీతి నతిథిహితముఁ
గూర్చుచు సవిధిగాఁ గోమలిఁ గూడుచు నియతిఁ గైకొనుచును నియతభోజ
నము చేయుచును సజ్జనవ్రజమును గాంచఁ గాంక్షించుచున్ శిష్టగణము తినఁగ
మిగిలినయన్నంబు మేలని భుజియించుచును వ్యర్థముగ మాంసమును భుజింప
తే. కయొ చరించెడు శూద్రుండు గాంచు వైశ్య,తను మహామునులార సత్యంబె పలికి
గర్వమునువీడి ద్వంద్వసంకలన మెడలి, సామవేదంబుఁ బఠియించి సాధునియతి.

చ. అనవరతంబు యజ్ఞముల నయ్యమరావళిఁ దృప్తి చేయుచున్
మనము పవిత్రమై తగ సమస్తవిధంబులఁ బూజ్యమైన వే
దనికరముం బఠించుచును దాంతి నెసంగుచు బ్రాహ్మణాళిఁ బూ
జనములఁ దన్పుచున్ సకలజాతులయం దనసూయకుండునై. 1109

వ. గృహస్థవ్రత మాదృతి సాగించుచు రెండుకాలములు భుజించుచు శిష్టభోజనుండై నిష్కాముఁ డగుచు నిరహంకారుఁడై యగ్నిహోత్రు నారాధించుచు

నతిథిపూజకుఁడై చరించువైశ్యుండు క్షత్రియజాతి జనించి యందు జన్మ
ప్రభృతి సంస్కారముల నొంది యుపనీతుఁడై వ్రతపరుండై విప్రజాతిఁ బ్రభ
వించు. మఱియు. 1110

సీ. యజ్ఞంబు లొనరించి యధికదక్షిణ లిచ్చి శ్రుతులను బఠియించి సురపురంబు
గనువాంఛలను బొంది యనవరతాగ్నిహోత్రమ్ముఁ బూజించుచు సమ్మదమున
జనులఁ బాలించుచు వినయంబు గాంచుచు నార్తరిహస్తప్రదుండై బుతంఁబు
వచియించుచుఁ ఘనభాసురధర్మమున్ దండంబునన్ దుష్టతతి హరించి
తే. ధర్మకామార్థములకు సాధకుఁడయి మఱి
కార్యకరణయంత్రితుఁడయి కరముఁ బ్రజల
నుండి యాజవభాగంబు నొగి గ్రహించు
చును విషయసుఖములఁ గోరక నియతుఁ డయి. 1111

వ. స్వచ్ఛందధర్మప్రవర్తనంబుగలిగి యుచితకాలంబునఁబత్నిం గూడుచు సదోపవాస
నియమంబు గలిగి వేదపాఠననిరతుఁడై త్రివర్గంబుల నుపాసించుచు నన్నకా
ములగు శూద్రులకు నన్న మిడుచు స్వకార్యసుఖంబుల నాదరంబు గాంచక
పితృదేవాతిథులకొఱకుఁ బదార్థంబుల సంగ్రహించుచు స్వగృహమునందే
భుజించుచు ద్వికాలములయం దగ్నిహోత్రు నారాధించుచు గోబ్రాహ్మణా
ర్థమై యుద్ధమునఁ బ్రాణములనైన విడువ నుద్యమించుచు బ్రాహ్మణుం డగు.
మఱియు. 1112

తే. జ్ఞానవిజ్ఞాన సంపన్నుఁడై నితాంత, వేదపారగుఁడై ధర్మవిహితబుద్ధి
యైన వైశ్యుఁడు స్వీయకర్మాతిశయత,క్షత్రియుండయి విఖ్యాతిఁ గాంచఁ గలఁడు.
క. మును చెప్పినసత్కర్మము,లను దక్కువయైన యక్కులంబున,జననం
బును గాంచినశూద్రుఁడు ద్విజుఁ,డనఁబడు నాగమముఁ జదువ నర్హుండునగున్.
చ. ధరణిసురుండు శీలమును దప్పి కువృత్తుల నాశ్రయించి యొ
వ్వరుసనొ భుక్తినిం గొనుచు బ్రాహ్మణతం బెడఁబాసి శూద్రుఁడై
ధరఁ జరియించు శాస్త్రవిహితంబులు గాఁదగు కర్మముల్ పొన
ర్చి రహితపాపుఁడై ద్విజతఁ జెందును శూద్రుఁడు నైనఁ జక్కఁగన్. 1115
తే. ఇంద్రియంబుల నిర్జించి హృదయశుద్ధి
నొందుటే ముఖ్యతమ మని యూహచేయ
వలయు నవిగల్గు శూద్రుఁడు బ్రాహ్మణువలె
సేవ్యుఁ డగునని మును బ్రహ్మ చెప్పెఁగాదె. 1116
క. తనకులకర్మములఁ దప్పనిశూద్రుఁడు శుద్ధుఁడనుచు బ్రాహ్మణముఖ్యుల్
మనమున నెంచఁగఁదగు నని, వనజాక్షీ! మదీయసాధుభావ మ్మిదియే. 1117
క. జననము సంస్కారము శ్రుతి,యును సంతతి హేతువు లనుటొప్పదు ద్విజతం

గనుటకువృత్తమె ముఖ్యం,బని యెఱుఁగుము సుందరాక్షి యాత్మ ధ్రువముగన్.
క. ధర బ్రాహ్మణుఁ డధికుం డని, పరమేష్ఠి విధించె మున్ను భవ్యం బగువృ
త్తరతిం గాంచియె యదిగల, చరణభవుం డేనియుఁ ద్విజతఁ గాంచుఁ జుమీ.
ఆ. సర్వసమత యొకఁడె సాధువిప్రస్వభా,వమని నాదుమతము వారిజాక్షి!
నిర్గుణంబు మఱియు నిర్మలంబగు బ్రహ్మ, మాత్మ నెవనికుండు నతఁడె ద్విజుఁడు.
సీ. పరదేవి! యివ్వె స్వభావసుస్థాననిదర్శకంబు లటంచు ధాత సృష్టి
కాలంబునం దెల్పె నీలోకమున బ్రాహ్మణుఁడె గురుక్షేత్రంబు పుడమిఁ బొద
మట్లు చరించు నాయమలమా క్షేత్రంబునందు బీజావాప మనెడు కర్మ
మునుఁ జేయఁగాఁదగు నని యెఱుంగుము దేవి యద్దియే కృషియన నూర్ధ్వమార్గ
తే. మునకు సాయము చేయును మనసుతుష్టి,నొందసత్పథమూని యోగ్యోర్వియందు
నాటు బీజమువలె బ్రాహ్మణప్రవరుని, యాత్మ నిడినట్టి దానంబె యధికతపము.
తే. బ్రాహ్మమార్గంబె తనకునాశ్రయమటంచు, వర్తనము చేయఁగానగు బ్రహ్మపథన
మందు నాదృతి గనెడుగృహస్థునకును, నొసఁగు దానముసత్ఫలమొసఁగుఁజుమ్ము.
సీ. వేదము చేత జీవించువానికి నీయఁగారాదు స్వాధ్యాయకలితమతికి
నీయఁగాఁ దగు నిట్టిహితధర్మ మూనియె యాహితాగ్నియునయి యమలవృత్తి
నలరు విప్రుండు వేదాత్మకుం డనఁ జను నట్టిబ్రాహ్మణ్యంబు నంది దానిఁ
జక్కఁగా రక్షింపఁ జను దానమును బ్రతిగ్రహమునీ రెండు సత్కర్మరతుని
తే. విషయమునఁ దగుఁ బార్వతీ! విస్తరించి
చెప్పినాఁడను జాతిసంసిద్ధధర్మ
ములను విప్రుఁడు శూద్రుఁడౌ భూమిసురుఁడు
గాఁగ మాఱును శూద్రుఁ డిక్కరణిఁ జువ్వె. 1123

## నూటపదాఱవయధ్యాయము.

### సదాచారప్రశంస.

చ. అనవిని పర్వతేంద్రతనయామణి భూతగణేశ! దేవతా
దనుసుతవందితా! నరులు ధర్మ మధర్మము నెట్టు లెంచి చే
యను విడనాడనుం దగునొ యావిధ మెల్ల నెఱుంగఁ జెప్పుమా
మనమున నొప్పుసంశయము మానెడునట్లొనరింపవే దయన్. 1124
క. మనమున వాక్కునఁ గర్మం,బున వేనిం జేయ బంధముగఁ దోఁచునొ వే
నిని జేయ నవ్వి వదలునొ, వినిపింపుము దేవవర్య వినుతపదాబ్జా! 1125
తే. ఎట్టి శీలంబునన్ దేవ! యెట్టికర్మ,మున నదెట్టిసదాచారమున నదెట్టి
సద్గుణంబుల మానవుల్ స్వర్గమునకుఁ, జేరుదురొ యావిధంబును జెప్పవయ్య.

మ అని ప్రశ్నింప సదాశివుండు మదిలో హర్షంబు పొల్పార ని
ట్లను ధర్మంబు నధర్మముం దెలిసి ధర్మాత్యంతనిష్ఠం జెలం
గిన యోపార్వతి! బుద్ధివృద్ధియగు నేగింబాపు నేపద్ధతిం
వినినం దాని నెఱుంగఁజెప్పెదను సద్వృత్తంబు నాలింపుమా. 1127
సీ. సత్యధర్మంబుల సరణి నెఱింగి సుశాంతులై దాంతులై సర్వలింగ
వర్జితులై తగువా రధర్మంబున ధర్మంబునం దారు దగులు కొనరు
ఛిన్నసంశయులయి చెలఁగుచుందురు వార; లుత్పత్తివిలయంబు లొందవు నెట్లొ
యవ్విధం బెఱిఁగి రాగాదుల విడనాడి సర్వదర్శనులయి సర్వవేత్త
తే. లగుచుఁ బొలుపారు పూరుషు లఖిలకర్మ,బంధనంబులచేఁ జిక్కు పడరు కర్మ
వాఙ్మనస్సుల హింస నెవ్వారుచేయ, రట్టివారలు కర్మబంధాళిఁ గొనరు. 1128
సీ ప్రాణాతిపాతవి రహితులై శీలంబు గలిగి దయాగుణకలితు లగుచుఁ
బ్రియులు ద్వేష్యులు సములయితగుచుండఁగ దాంతులైవర్తించు తత్త్వవిదులు
కర్మబంధముల నిక్కముగ బద్ధులు కారు; సర్వభూతములపై సాధుకరుణ
వెలయ విశ్వాసపాత్రులయి సమస్తజంతువులకుఁ గుశలంబు సవిధిఁ జేయఁ
తే. దలఁచి హింస నొనర్పంగ దలఁపకుండు, వారు స్వర్గంబు చేరెదువారటంచు
నెఱుఁగఁగాఁ దగు; బరవిత్త మేవగించి పరులదారలఁ గోరక భక్తులగుచు.
క. తమకుం ధర్మంబుగఁ ల,బ్ధము గాఁగఁ జెలంగునట్టి ద్రవ్యంబునఁ గా
లము పుచ్చుచుఁ దగునరులే, యమరపురిం జేర నర్హులనుచుఁ దెలియుమా.
క. జననియని సోదరీమణి, యని పుత్త్రికయు నని యొవనియాత్మ పరస్త్రీ
లనుగూర్చి చింతచేయునొ, జను లవ్వారలు సురేంద్రసద్మార్హు లనం. 1131
క. తనజాయయందు రతుఁ డ,య్యును విధిహితకాలనియతి యొప్పఁగ గ్రామ్యం
బనఁబడు సుఖమునె కోరక, తనరారెడు జనులు స్వర్గధామార్హు లిలం. 1132
క. ధనచౌర్యవిరహితులుగా, ననవరతము తృప్తిస్వీయమగువిత్తముచేఁ
గనుచుం గలిగినవిత్తం,బున సుఖముం గాంచునరులె పో స్వర్గార్హుల్. 1133
క. పరదార సాధుసన్నుత, చరితావృతనయను లగుచు సచ్ఛీలమునం
బరఁగుచు జితేంద్రియులు నగు,నరులే స్వర్గంబునకుఁ జనంగా నర్హుల్. 1134
క. తరుణీ! దైవకృతం బగు, సురుచిరపథ మిదియె దీని సుజనులు గొల్వం
దరమగు నకషాయకృతం,బురుతరమును నొపథంబె యొగి సేవ్యంబొ. 1135
క. ఊరకయే యొరులకు నప,కారము చేయంగరాని కష్టపథమె యా
ధీరులకుం సేవ్యము క, ర్మారాధన మర్హదాన మమలతపంబుం. 1136
క. శీలము దయయును శౌచముఁ, జాలంగా నాశ్రయించుజనులే స్వర్గం
బాలస్యములేకయె చొరఁ,జాలుదు రితరాశ్రయమునఁ జాలరు సుమ్మీ. 1137
క. అన విని యుమ యిట్లనియెం, మనుజులకుం వాక్కుచేత మహి బంధింపం

గనుఁజాలునదియు ము_క్తిని, గనఁజేయంజాలునదియుఁ గర్మము గానన్. 1138
క. దానిస్వరూపముఁ దెలియం,గా నెఱిఁగింపంగఁదగును గరళగళా! యం
చానెలఁతమిన్న ప్రశ్నం, బీనియతిం జేయ శంభుఁ డిట్లని పల్కెన్. 1139
క. తనకై యొండొరులకునై, మనమున శంకింపకయె కుమార్గంబున ధ
ర్మనిరతి వీడి యనృతవా,క్కును బల్కరో దివము నరులకున్ వారి కగున్.
తే. జీవనమునకొ ధర్మసంసిద్ధికొఱకొ, కామసంసిద్ధికో మృషాకలితవాక్కు
వల్క కున్నట్టి సుకృతులు స్వర్గపురికిఁ, జేర నర్హులుసుమ సరసీరుహాక్షి. 1141
ఆ. అమలవర్ణములను హారితరంబయి, మధురమునగుపల్కు మఱియుఁ బాప
వర్జితమును బలుకువారును సురపురి, కరుగువారలంచు నరయఁ దగును.
క. పరుషము కటుకము మఱి నిష్ఠురమును నగుపల్కు పలుకఁజూడక భూతో
త్కరమును బాధింపక తగు,పురుషులు స్వర్గంబునకును బోవుదురు సతీ. 1143
సీ. పరులకు హింసను బాటించుమాటను బలుకక ప్రియమిత్రములకు భేద
మును గల్గఁజేయుమాటను జెప్ప కొరులకు బాధలఁ గల్గించుపనికిఁ బోవ
కుందు రెవ్వారొ యాయుత్తముల్ స్వర్గంబుఁ జేరువారలు సరసీరుహాక్షి;
చిత్తపారుష్యంబుఁ జెందక పరబాధ గల్గించుపనికిఁ దాఁ గాలుద్రవ్వ
ఆ. కెల్లభూతములను నెలమిఁ గాంచెడు శాంత,మతులు స్వర్గధామ మతిజవమునఁ
జొరఁగ నర్హతములు శుభమునే కోరుచు, శఠదురుక్తిఁ బాసి శాంతమూని.
క. పరబాధలఁ గల్గించెడు, నిరతింబూనకయె సాధునిశ్చితపథ మా
దరణమున నాశ్రయించుచుఁ, బురుషులు స్వర్గంబునకును బోవఁగ నర్హుల్.
ఆ. కోపమూని పలుకఁగూడదు శఠవాక్కు, హృదయభేదనమ్ము నది యొనరుచు
శాంతకోపులైన సాధువులే స్వర్గ,మునకుఁ బోవ నర్హు లని యెఱుఁగుము. 1146
క. ఇదియే ధర్మస్థితి నీకు దగన్ వివరించినాఁడఁ గోపులి శుభస
త్వదయాద్యమలగుణంబులఁ, బదిలముగా నెఱిఁగి కొల్వవలయున్ వానిన్.
క. పరివర్జింపందగు మృష,పురుషులచే శ్రద్ధమీఱఁ బూఁబోఁడిరో! నా
గిరిజయు నిట్లనియెన్ శం,కర! యేకర్మమున నరుఁడు కట్టుపడియెడున్. 1148
క. మనసున బద్ధుండగు దా,నిని జెప్పుము తద్విధంబు నే నెఱుఁగం గో
రినదాన ననిన శంకరుఁ, డనియెన్ మానసికధర్మ మనునది యొన్నన్. 1149
క. ఘనమగుఁ దత్సంయోగం,బునఁ బూరుషు లుంద్రు దేనిఁ బూనిన స్వర్గం
బున కేగువారొ దానిని, వినిపించెదఁ జక్క నీవు వినుమా తన్వీ. 1150
క. దురపకృతిన్ దుర్ణయమున, దురితాకృతి దుర్మనమునఁ దోడనె జగతిం
బురుషుఁడు బద్ధుం డగుఁ జూ,తరుణీమణి వినుము శ్రద్ధఁ దద్విధమెల్లన్. 1151
మ. జనశూన్యంబగు కాననంబునఁ బరస్వంబుం దగం గాంచి నె
మ్మనముం దానిఁ గొనంగఁబూననటు లేమాన్యుండు స్వాధీనమం

దునఁ జిత్తంబును నిల్పఁజాలునో సుమంత్రుం డాతఁడే దేవలో
కనివాసంబున కర్హుఁ డంచెఱుఁగుమా కంజాక్షి! సత్యంబుగన్. 1152

క. గ్రామంబున గేహంబున, నేమానవు లుండనట్టిదే యగునడవిన్
హేమమునుఁ బరకీయమునుఁ గని,యేమనుజుఁడు గొనఁదలఁపఁడో యేగునుదివికిన్.

క. పరదారలఁ గామంబునఁ, బరికించి రహస్యరీతి స్వాంతంబున నే
పురుషుఁడు కోరఁడో యాతఁడె, సురపురికిం బోవఁజాలు శుభగుణనిలయా.

క. అరిమిత్రులఁ దుల్యగతిన్, నరు లెవ్వరు కాంతురో మనంబున మైత్రిం
బరమాదృతిఁ జూపుదురో, పురుషులు వారలె దివంబుఁ బొందఁగ నర్హుల్.

చ. శ్రుతులఁ బఠించి భూతదయశోభిల నాచరణంబు చక్కనై
స్మృతిహితమై తగంగ నతతేష్టము సత్యముపైఁ జెలంగ స
మ్మతిఁ దనవిత్తమే తనకు మానసతృప్తిద మౌచునుండ స
త్కృతియయి పొల్చుమానవుఁడె యేగును స్వర్గముఁజేరఁ బార్వతీ. 1156

సీ. ఆయాసమే లేక యపగతవైరులై మైత్రమానసులయి మఱియు సర్వ
భూతదయోపేతులై తగుమానవుల్ స్వర్గంబుఁ జేరంగఁ జాలువారు
జ్ఞానులై సత్క్రియల్ మానక చేయుచు క్షమగల్గి సజ్జనసమితికి హితు
లై ధర్మమిది యని యగు నిర్దయయధర్మమని యెఱుంగుచునుండు మనుజులుదివి

తే. కరుగ నర్హులు శుభకర్మమందు నశుభ,కర్మమందును ఫలమునఁ గాంక్షసేయ
కర్హరీతిని వానిఁ జేయంగఁ దలఁచు,మానవులు స్వర్గగాము లోమంజులాంగి.

తే. పాపసంకల్పములు మాని బ్రాహ్మణామ,రప్రియంబునఁ దగి దయ రాజిలంగ
నలరుచుం డెడుమానవు లమరపదము,నందు నివసింపనర్హు లోయబ్జనేత్ర.

క. వినిపించితి శుభకర్మము,లను వానిఫలంబులను జలరుహానయనరో
విన దలఁతువొ యింక దేనిని, ననుశంకరుఁ గాంచి యుమయు నడిగెం బ్రీతిన్.

క. నరులం గూర్చిన శంకో,త్కర మొలసెను నామనమునఁ గావునఁ దానిం
దరుమం జాలినపద్ధతిఁ, గరుణించి వచింపవయ్య క్రమ్మఱ నాకున్. 1160

చ. మనుజు లదెట్టికర్మమును మానక చేసిన దీర్ఘకాలజీ
వనమును గాంతురో భువిని వర్ణ్యతపస్సును దేనిఁ జేసినం
గనుదురో చాల నాయువును గర్మము దేని నొనర్ప నల్పమై
కనఁబడునాయు వవ్విధముఁ గర్మవిపాకమునున్ వచింపుమా. 1161

తే. మందభాగ్యులు కొంద ఱమందభాగ్య
లొక్కకొందఱు నకులీను లొక్కకొంద
రమలకులవంతు లొకకొంద ఱవని గలుగఁ
గారణం బేమియో విన గాంక్ష కలదు. 1162

క. ధరఁ గొందఱు దుర్ధర్ములు, తరుమయులంబోలి కానఁదగుదురు మఱియుం

బరికింప వేడ్కఁ గొలిపెడు, పురుషులు కొందఱు చెలంగఁ బొడఁగననగుఁజూ

క. దానికి హేతువ దేమో, మానసవిజ్ఞానహీనమనుజులు తగ నే
మానో హేతువు పండితు, లౌనరు లోకకొంద ఱుండ నగుహేతువెదో.

తే. జ్ఞానవిజ్ఞానభావులై మానసబల, మలరఁ బ్రాజ్ఞవరేణ్యులై యవనిఁ గొంద
ఱుండఁగల హేతువేదొ నా కొప్పునట్లు, చెప్పవయ్య కృపాకర! శ్రీనివాస.

తే. అల్పవాక్కులు కొంద ఱత్యధికవాక్కు
లొక్కకొందఱు కనఁబడుచుందు రవనిఁ
గారణం బేమొ దీనివ్యాఖ్యానసరణిఁ
బలుకవయ్య మహాదేవ పరమకరుణ. 1166

చ. అనవిని దేవి! కర్మఫల మన్న నదెట్టిదొ నీకుఁ దెల్పెదన్
మనుజులు దానిఁబొందనగుమార్గము విస్మృతిమీఱునట్లు తె
ల్పిన మదిసంశయం బెడలు భీతమృగాయతనేత్ర! యోగుల
య్యును క్షణమాత్రజీవితులు నొప్పుదొలంగిన వారలయ్యనున్. 1167

చ. కరమున దండముం గొనినఁగాని చరింపఁగ లేకయుండియున్
నిరతము శస్త్రధారణము నెమ్మి నొనర్చుచు మానవుల్ మనో
హరమగు భూతసంఘము మహత్తరయత్నముమీఱునట్లుగాఁ
బొరిగొనుచుందు రించుకయుఁ బూనరుసుమ్ము కృపం దలోదరీ. 1168

క. భూతానుకంప లేకయె, చేతస్సున భూతహింస చేయఁ దలఁచుచున్
భీతికరయత్నులయి నరు, లేతఱిఁ జరియించువార లిందునిభాస్యా! 1169

క. కృమికీటకములకైనను, దమి రక్షకుఁ డెపుడుగాక దయమాలి చరిం
చుమనుజుఁడు ఘోరతరనిర,యము నొందును సత్యమిద్ది యంభోజాక్షీ. 1170

క. దీనికి విపరీతంబుగఁ, గానంబడు ధర్మమూని క్షమఁ బుట్టిన యా
మానవుఁడు స్వర్గపురమున, దా నివసింపంగఁ బోవుఁ దథ్యము సాధ్వీ. 1171

క. నిరయము హింసాత్ముఁడు నిర్జరపురము నహింసకుండు సత్వరమే కాం
తురు నారకమున యాతన, లురుతరముగఁ బొందుచుండు నుజ్జ్వలగాత్రీ.

క. సురపురమునను సుఖంబులు, పరమాద్భుతములుగఁదోఁచుఁ బార్వతి! యొకఁడో
యిరువురొ వేయింటికి నా, నిరయంబుఁ దరించువారు నిశ్చయ మతివా. 1173

చ. నరకమునుండి యెవ్విధినొ నైజమహాసుకృతంబుచేత భీ
కరతరపాపముల్ గుడిచి క్ష్మాస్థలిఁ బుట్టినవాఁడు స్వల్పభా
గ్యరతిఁ జెలంగి యల్పమగునాయువుగల్గి చరించుఁ బాపముల్
దొరకొని చేయుమర్త్యునకుఁ దోఁచును హింసయొనర్చుబుద్ధియున్.

చ. జననము పాపమూలమయి క్ష్మాస్థలిఁ గల్గినభూతరాశి కొ
య్యన నహితుండుగానగుచు నల్పతరాయువు గాంచియుండు నా

జననము పుణ్యమూలమయి సాధుహితం బగు నేని భూతహిం
సను మదిఁ జేయఁ గోరఁడు విశిష్టుఁడు నాఁ గృపగల్గి వర్తిలున్. 1175
క. దండింపఁ దొరులఁ బ్రాణుల, ఖండింపం డంతెకాక ఘాత మొరుల కు
ద్దండగతిఁ జేయఁ బూనఁడు, దండించినవానినైన దయఁ గను సతివా. 1176
క. తనయందుఁ బ్రీతి యెట్టిదొ, జనులందఱియందుఁ బ్రాణిసంచయముపయిన్
దనప్రీతి ననుచు సజ్జనుఁ, డని యెఱుఁగుము స్వాంతమందు నద్రికుమారీ. 1177
ఉ. పూరుషుఁ డిట్టివాఁడు కనుఁ బో యమరత్వము సౌఖ్యజాలమున్
గోరినయట్టి వాంఛలనుగూడ గిరీంద్రకుమారి! యిట్టిఁడౌ
పూరుషుఁ డొక్కఁడేఁ గలుగ భూస్థలి దీర్ఘతరాయు వొందు నీ
దారియె నీదుసంశయవిదారణదక్షమటంచు నెన్నుమా. 1178
తే. ప్రాణిహింసావిమోక్షణపరత నజుఁడు
సదుపదేశ మొనర్చె నోసాధ్వి! యిట్టి
మార్గమును బూను నెవ్వండు మానవుండు
వాఁడు సుఖవృద్ధిఁ గాంచు ధ్రువంబు ధ్రువము. 1179

## నూటపదునేడవయధ్యాయము.

### స్వర్గప్రాప్తి నరకప్రాప్తికారణములు.

చ. అనుటయు గౌరి లోకహిత మాత్మఁ దలంచి మహాత్మ యెట్టివ
ర్తనమున నెట్టి యాచరణతత్పరతన్ మఱి యెట్టికర్మముల్
పొనరిచినంతమాత్రమునఁ బూరుషుఁ డాయమరాలయంబునం
దున నివసింపఁజాలుఁ దమితో నది యెట్టిది దాన మిచ్చినన్. 1180
క. సురపురిఁ బొందఁగఁజాలును, బరమేశ! వచింపు వినఁగ వాంఛ గలదు నా
హరుఁ డిట్లను దాతయు భూసురసత్కారాదరుండు సురుచిరమతియున్. 1181
సీ. దీనార్తులఁగృపణాదినిఖిలజీవుల కెలమి భక్ష్యములను నెవ్వఁ డొసఁగి
సత్కరించునొ వాఁడు చలిచేత బాధింపఁబడువాని కాదృతి వస్త్ర మొసఁగి
మన్నించువాఁడును మఱి యుండ నీడను జలిపందిరుల జలాశయముల సర
సులను నిర్మించెడు శుభగుణాఢ్యుఁడు నిత్యకర్మములనుభక్తిగలిగి శుచిత
ఆ. నొనరఁ జేయునాతఁడును శయనాసన,యానగృహములను ధనాదికముల
నుర్వరను గుణాళి నొప్పుకన్యక యోగ్య,నరున కిచ్చునతఁడు స్వర్గసుఖులు.
చ. అమరపురిన్ వసించి తగునట్టిసుఖంబుల నందుఁ గాంచుచున్
సమయము చాలఁగాఁ గడపి సంతస మిచ్చెడునందనాదులం
దమరసరోజనేత్రులసహాయమునన్ జరియించి మర్త్యలో
కమున జనించు సాధుగుణకల్పితమూర్తిని సత్కులంబునన్. 1183

సీ. ధనధాన్యములుగల్గి తనరుసుఖంబులఁ గాంచును సత్కార్యగణ మొనర్చు
సకలభోగంబులఁ జక్కఁగాఁ బొందును దానశీలత నొప్పుమానవులకు
నబ్జజుం డీగతి నమరలోకప్రాప్తి సాధించె నీరీతి జనులుచేయఁ
బ్రియదర్శనులునయి వెలయుచుందురు దేవి! దానమీయఁగలేని మానవు లొగి
తే. నధమగతి కష్టులగుదు రేయధమమనుజు, లన్నదానము చేయఁగనర్హులయ్యు
దానిఁజేయక కుమతులై దీనబధిర,కృపణులను నంధులం గని కృపను మాని.
క. అతిథులను భిక్షులను స, మ్మతిఁ గాంచక వార లడుగమాటాడక లో
భత నొంది ద్రవ్యముండియు, నితరులకుఁ సాయపడక యెలమిఁగుడుచుచుఁ.
వ. వస్త్రదానంబుచేయక స్వసుఖమునే కోరుచు గోదానం బొసరింపక పరమా
న్నము నితరులకుం బెట్టక యొక్కఁడె భక్షించుచు నుండువారు నిరయంబు
నొందుదురు. దానవర్జితులకు నిరయంబు గల్గినట్లు నాస్తికులకుం గల్గును. నరక
యాతనల ననుభవించి మరల మనుజలోకంబునందు క్షుత్పిపాసాపరీతాత్ములై
సర్వజనబహిష్కృతులై సర్వభోగనిరాశులై యధమజీవనులై పుట్టువుంగాంచి
దుఃఖించుచుందురు. హీనకులప్రసూతియే కలుగు. అల్పభోగనిరతి వారికిం
గల్గు. మఱియు. 1186
క. కొందఱు దాంభికు లగుదురు, కొందఱు గర్వంబుగల్గి కొఱమాలినరీ
తిం దగుకార్యము లొనరుచు,చుందురు తమపాపఫలము లొందుటఁ దన్వీ.
సీ. ఆసనార్హునకు సదాసన మీయనివాఁడును దుష్టమాస్వాంతమొప్ప
మార్గమీయఁగఁ దగుమనుజునకుఁ మార్గ మీయని దుర్మతి యెలమివిధులఁ
బూజింప నర్హుఁడౌపురుషుని బూజింపనట్టినీచుండు పాద్యాదు లీయఁ
దగినవారికి వానిఁ బొగరునఁ గూర్పనివాఁడును బ్రీతిచే భక్తిచేత
తే. గురువు సంతుష్టుఁ జేయనికుమతి గర్వ
యోగమున లోభమునఁ బూజలొప్పఁ జేయ
నర్హులను గౌరవింపనియట్టివాఁడు
వృద్ధులను నిందచేసెడువిమతుఁ డవని. 1188
క. అతికష్టంబుల నొందుచు, నతివా! మృతిఁగాంచి నిరయమం దుందురు దు
ర్గతిఁ జాలకాలమును గాం,చి తగఁ నీచాన్వయమునఁ జెందుదురు జనిఁ.
క. ధరణిఁ నీచులుగాఁగం, బరిగణితులునౌ శ్వపాకవంశంబుల దు
ర్భరపాపవశంబున నీ,చరతిం గని పుట్టుచుంద్రు సారసనేత్రా. 1190
క. గురువుల వృద్ధుల నిక్కలి, పరిభవముం గనఁగఁజేయుపాపాత్ములు జా
తిరహితులయిండ్లఁ బుట్టుదు, రరయుము విషయంబు దీని నంబుజనేత్రా. 1191
తే. దాంభికుఁడుగాక యభిమానధనుఁడుగాక, దేవతాపూజకుండు నతిథులనెల్ల
గౌరవించునతండు జగంబునందుఁ,గల్గుపూజ్యులఁ బూజింపఁ గల్గునతఁడు. 1192

సీ. ప్రియవాక్కులం బల్కు నయయుక్తిఁ జరియించునతఁడును సర్వకర్మాభివాంఛ
వెలయఁగా నుండెడువిమలాత్ముఁడును సర్వభూతంబులందుఁబ్రమోద మునుచు
ఘనుఁడును ద్వేషంబు గననిమాన్యుండునుసుముఖుఁడుశ్లక్ష్ణుఁడుశుభవచనుఁడు
స్వాగతంబున భూతపూగంబునకుఁ గారవంబు గనంజేయువాఁ డహింస
ఆ కుఁడును సత్యవాది గురుపూజకుఁడు సాధు
మార్గదాత యతిథిమండలంబుఁ
గొలుచునతఁడు మఱియుఁ గూడినకార్యముల్
చేయువాఁడు దివముఁ జేరఁగలఁడు. 1193

చ సురపురినిన్ వసించి సురసుందరులం దమిఁగూడి సౌఖ్యముల్
నిరతముఁ గాంచుచున్ ధర జనింపఁగ వచ్చి విశిష్టవంశమం
దురుగుణయుక్తిఁ బుట్టి సుఖయోగము నొంది కుబేరతుల్యుఁడై
గురువులఁ గొల్చి సజ్జనులకున్ ధనమీయఁగఁజాలి హృష్టుఁడై. 1194
ఆ. సర్వభూతములకు సమ్మతుండయి లోక,వంద్యుఁ డగుచు నలరి స్వకృతకర్మ
ఫలము నొందుఁ జుమ్ము పార్వతీ! విధిహిత,ధర్మతత్త్వ మిదియె ధాత్రియందు.
సీ. భయకృదాచారుఁడై భయము భూతాళికిఁ గలుగఁజేయుచుఁ గరంబులఁ బద
దండరజ్జువులచే స్తంభలోష్ఠంబుల జంతువులకు సాధ్వసంబు గలుగఁ [ముల
జేయువారలు హింసచేయ నూహించెడువార లుద్వేగంబు వాని కెట్లొ
గలుగంగఁజేయువారలు జంతువులఁ దోలి పట్టుకొనంజూచువారు నిరయ
ఆ. ములను బడుదు రందుఁ గలుగుకష్టంబులఁ, జాల ననుభవించి చాలకాల
మునకు మనుజయోనిఁ బుట్టుదు రధమవం,శమున వివిధకష్టదమున నతివ.

క. తనదుష్కర్మవశంబున, మనుజులకుం గొఱయె గాక మానవగణమం
దును నీచుఁ డనఁగ బేరుం, గనుచుండును నిదియె దుష్టకర్మవిధమ్ముల్. 1197
ఉ. భూతములం గృపంగనుచుఁ బొంకముగాఁ గృపఁ బెంచుదృష్టితో
నేతఱినే విరోధము నదెవ్వరితోడను గాంచ కింద్రియ
వ్రాతమునున్ జయించి క్షితిఁ బ్రాణులకెల్ల భయంబుఁ గూర్పకే
చేతమునందు హింసలను జింతనచేయక సాధువృత్తియై. 1198
క. మంగళకరకర్మంబుల, సంగతిఁ గాంచుచుఁ జెలంగుసాధులు సౌఖ్యం
బుం గనుచు స్వర్గమున సుర,పుంగవసము లగుచు నుండ్రు హో మృగనేత్రా.
చ. సురపురిఁ బాసి పుట్టువును క్షోణిని బొందెడువేళయందు నే
వరుసను గష్టముం గనక భవ్యతమాన్వయజన్మ మొంది సౌ
ఖ్యరతిని గాంచు వానిఁగని కాంతరో! భూతము లెవ్వియేని భీ
కరుఁడని యెంచకుండ దయగల్గుట భూషణ మెల్లవారికిన్. 1200
క. ఇదియే సాధుజనంబుల,కుఁ దగినమార్గంబు బాధ కూడదు దానన్

సదమలచారిత్రా! యన, ముదితయు శంకరుని గాంచి భూతహితంబుగ. 1201
క. తనమదిఁ గోరుట మఱి యి,ట్లని ప్రశ్నముచేసె శంకరా! యుత్సాహం
బును గాంచి విశారదులై, యనుపమవిజ్ఞానసంప దధికాత్ములునై. 1202
సీ. జ్ఞానయుక్తిం దగి సమధికప్రజ్ఞచే నలరారి పాండిత్యములఁ జెలంగి
కొందఱు మానవులుందురు దుష్ప్రజ్ఞులై జ్ఞానవిజ్ఞానహాన్యమాన
చిత్తులై కొందఱు క్షితిఁ గానఁబడుచుందు రిది యెట్టికర్మమునఁ దగు దేనఁ
బ్రజ్ఞ లభించు దుష్ప్రజ్ఞ దేనం గల్గు నట్టికర్మమురీతి నభవ! దేవ
ఆ. పూజితాంఘ్రికమల! భూతేశ! తెలుపుమా, సంశయమ్ముఁ దొలఁగుసరణి సకల
ధర్మముల నెఱుంగఁదగుదీవు జనుపాంధు,లగుచు రోగకర్శితాంగులగుచు.
క. నరులందు షండులై యుం,దురు గొందఱు కారణంబు తోఁపదు మది శం
కర! యట్టికర్మపద్ధతి, పరికించి యెఱుంగఁ జెప్పు భావం బలరన్. 1204
వ. అనుటయు మహాదేవుం డిట్లనియె. 1205

దుఃఖకారణము.

చ. నిగమములం బఠించి స్మృతినిర్మలధర్మగణం బెఱింగి సి
ద్ధిగతుల మర్మముల్ తెలిసి ధీమహిమంబునఁ జాల మించు వి
ప్రగణము నిత్యముగ గుశలపద్ధతి దానివిరుద్ధపద్ధతిన్
దగ నడుగంగఁ గోరుదు రుదారపదంబును బొందుసజ్జనుల్. 1206
ఆ. అశుభకర్మజాల మాచరింపక శుభ,కర్మములను జేయఁ గడగి యలరు
వారు స్వర్గలోకవాసార్హు లగుదురు, ధరణిసుఖము లొందఁ దగుదురతివ.
చ. అమరపదంబునందున మహత్తరశర్మము లొంది భూమి జ
న్మము గనువారు బుద్ధిమహిమంబున నొప్పుచు యజ్ఞరాజిచే
నమరులఁ దృప్తిచేయఁ దగినట్టి సదాచరణంబు గల్గి శ
ర్మములను గాంచఁ జాలుదురు రాజముఖీ! విను మింకఁ జెప్పెదన్. 1208
క. పరదారలను గుదృష్టిం, బరికించెడు దుర్జనస్వభావముగలవా
రరుపాపత జాత్యంధులు, దురితాత్ములునగుదు రిలను దోయరుహాక్షీ. 1209
క. మనసు ప్రదుష్టంబగుటన్, వనితల నంబరవిహీనవర్ష్మలఁ గనఁ గో
రునరులు రోగార్తులు పాపనియతఫలభాక్కులునయి పరఁగుదురు సతీ. 1210
సీ. మూఢులై దుష్టసముదయసమ్మతదురాచారులై ధరణి నెవ్వారు కాను
వశత వియోనివ్యవాయంబు గోరుదు రట్టిదుష్టప్రజ్ఞులైనపురుషు
లిల నపుంసకులయియే పుట్టుదురుసుమ్ము పశువుల బంధించు పాపమతులు
గురుతల్పగులయినక్రూరులు మఱి ప్రకీర్ణగ్రామ్యధర్ములౌనరులు క్లీబు
ఆ. లగుదు రనిన సుమయు నభవుతో మఱియును, బ్రశ్న మిట్లు చేసెఁ బాపకర్మ
మనఁగ నెద్ది యెట్టి దనవద్యకర్మమా, దేనిఁ జేయ సుకృతి మానవుఁ డగు.

చ. నరుఁడు శుభంబు గాంచెడుమనంబున సద్గతిఁ బ్రశ్నచేయు భూ
సురులను ధర్మతత్త్వపరిశోభితకర్మముఁ దా నెఱుంగఁగా
నిరతము గోరుచుండు మది నిర్మలమౌ గుణరాజి నొందు నా
తురుఁ డగునట్టివాఁడు గనుఁ దోయరుహాసన స్వర్గవాసమున్. 1212

ఉ. ఆతఁడు పుణ్యసంక్షయత నంది ధరన్ జనియింపఁగోరుచోఁ
జేతము సాధుమార్గమునఁ జేరుట ధారణచేయుశక్తినిం
బ్రీతిగఁ గాంచు నెంతయును వింతగ నొప్పుట సంభవించు వి
ఖ్యాతకులంబు గల్గు మదిరాక్షిరో సజ్జనమార్గ మిట్టిదౌ. 1213

ఆ. ధర్మమార్గ మిదియె తగు భూతికరమయి, నరుల హితముఁ గోరినాఁడఁ గాన
నిర్ణయించినాఁడ నీకుఁ దెల్పితి దీని! మఱియు దేని విన నుము! మది గలవౌ.

చ. అనవిని యద్రిపుత్త్రియు మహాత్మునితో నిటు ప్రశ్నచేసెఁ దె
ల్వోని నిసుమంత గాంచి యవలీలఁగ ధర్మము వీటిఁబుచ్చి వే
దనికరవేత్తలం గనుముదంబును గాంచక కొందఱుండ నే
లని మది సంశయం బొదవె నయ్యది తీర్పఁదగున్ మహేశ్వరా. 1215

చ. వ్రతములఁ జేయుకోర్కె తగ భక్తియు నింద్రియనిగ్రహంబు ను
న్నతమగు శ్రద్ధయుం గలిగి నైజము చక్కనిదై చెలంగ నీ
క్షితిపయిఁ గొంద ఱుందురు విశిష్టతరవ్రతయుక్తి లేకయే
దితిసుతతుల్యులౌచు నియతిం బెడఁబాసియె కొంద ఱుంద్రుసూ. 1216

ఉ. కొందఱు యజ్ఞజాలములఁ గూర్మి నొనర్తురు వీతమోహులై
యుందురు కొంద ఱిట్లగుట కోభవనాశక! కారణంబు భూ
మిం దగు నేమొ తెల్పు మన మించెడువేడుక నీశ్వరుండు దే
విం దమిఁ గాంచి యిట్లనియె వీనులవిందుగ నాలకింపుమా. 1217

తే. ఆగమాలోకధర్మమర్యాద లెల్లఁ, బూర్వనిర్మితములు వానిఁ బూన్కి నెన్ని
యనుసరింతురు సజ్జను లట్టివారె, పార్వతి! దృఢవ్రతులనఁగఁ బరఁగుచుండ్రు.

క. ఎవ రిల నధర్మమును ధ, ర్మవత్సలతఁ గాంచుచున్ బ్రమదమునఁ దగువా
రౌ వరుసఁ గర్మభ్రష్టులు, సువిమలమర్యాద లేని సుభగమ్మన్యుల్. 1219

అ. బ్రహ్మరాక్షసులనఁ బరఁగుదు రవ్వారె, నరకముక్తి గాంచి ధరణి బుట్టు
వును గనంగఁ జాలి యనుపమదయ లేక, యజ్ఞముల నొనర్ప నాశగొనక. 1220

క. నరులం దధములుగా నే, పరిగణనము చేయఁబడుచు వైశసక్రూరా
చరణులుగాఁ దగియుందురు పరదేవి!, వచించినాఁడఁ బద్ధతి దీనిన్. 1221

వ. ధర్మపద్ధతి యిట్టిదై యుండు. దీనికి విరుద్ధం బధర్మపద్ధతి యనంజను. అని పార్వ
తీ పరమేశ్వరసంవాదంబుఁ దెలిపి వ్యాసుండు మహర్షులం గాంచి మఱియు
నిట్లనియె 1222

## నూటపదునెనిమిదవయధ్యాయము.

### వాసుదేవమాహాత్మ్యము.

చ. జగములతల్లి గౌరి యిటు శంకరుఁ డాదృతిఁ బల్కినట్టి ధ
ర్మగణము వీనులార విని మానసతృప్తిని విస్మయంబు నెం
తో గనియెఁ దీర్థయాత్రలకు నుద్యమ మొప్పఁగఁ బోవునట్టి మౌ
నిగణము తద్గిరీంద్రమున నిల్చి మహేశుని జూచుకోరికన్. 1223

తే. వచ్చియుండినవారౌట వాసుదేవు,సూక్తులన్ విని మోదంబు నొంది హరుని
వందనంబుల నలరించి వర్ణనములఁ, దనిపి పూజించి లోకహితంబుఁ గోరి. 1224

క. హరునిం బ్రశ్నించిరి శం,కర దక్షక్రతువినాశకర! నీకు నమ
స్కరణ మొనర్తుము శంకో,త్కరమును దొలఁగించుకొనెడు కాంక్షపాదలుటన్.

క. ఒకప్రశ్న మొనర్తుము దా,నికిఁ దగు నుత్తరముఁ గృపను నీరధి వగుటన్
సకలేశ! యిమ్ము బహుభీ,తికరము భవసాగరంబు తీక్ష్ణమ్ము నగున్. 1226

క. తలఁచిన యంత గగుర్పా,టులఁ గల్గఁగఁ జేయుఁ గద కడుం గాలము స్వ
ల్పులు మానవు లం దుందురు, కలదే మోక్షంబు కుభవకంధికి నెపుడేన్.1227

తే. ఏయుపాయంబుచే దాని నీఁదఁ గలరొ,
యల్పమతులగు మానవు లమరవంద్య!
దాని వినఁగోరుదుము కాంక్ష మానసముల,
నెలకొనియె నాఁగ శివుఁ డిట్లు పలికెఁ గరుణ. 1228

సీ. మునులార! వినుఁడు దుఃఖనికరభాక్కులై కర్మపాశౌఘసంకలితులైన
మనుజులు సంసారవననిధి దాఁటంగ వాసుదేవునిని గొల్వంగఁ బూను
టొక్కటియే మార్గ మున్నది వేఱొక్కపథము గానఁగరాదు వాఙ్మనసుల
గర్మము నను నీత్రికరణసంశుద్ధిని శంఖచక్రగదాంబుజాతహస్తు

తే. వాసుదేవుని భజియించువారు పరము, పదముఁ గాంతురు దానిని వదలువారు
పశుసమానులు వారలబ్రదుకు రోఁత, వారిచిత్తము దుష్టమేవరుసనైన 1229

క. అనుటయు నామౌనులు శం,భుని గాంచి వచించి రిట్లు భూతేశ! జగ
ద్వినుత భగనేత్రహరణా, వినఁ గోరెద మామహాత్మ్యవిమలచరితమున్. 1230

క. అని యడిగిన శంకరుఁ డి,ట్లనియెఁ బితామహునికంటె నధికుఁడు హరి నా
శనరహితుఁడు పురుషోత్తముఁ, డనఁబడుఁ గృష్ణుం డనంగ ఖ్యాతిం గాంచున్.

సీ. కనకసమానకాంతిని గల్గి యంబరమందు సూర్యునివలె నఖిలభువన
కాంతిప్రదుండయి కమనీయతేజంబు వెలయంగ దశబాహువులు చెలంగ
దనుజాళిహంతయై వినుతి దేవాళిచేఁ గాంచుచు శ్రీవత్సకలితుఁ డగుచు
సర్వదేవేశుఁడై సర్వలోకేశుఁడై వాసుదేవుఁడు పొల్చు బ్రహ్మ యతని

తే. యుదరభవుఁ డగు నేనన్న నుత్తమాంగ,భవుఁడనగుదును గేశాళివలనఁబుట్టు

నెల్ల జ్యోతిస్సు లమరులు నెల్లయసుర,లతనిరోమాళినుండియె యవతరింత్రు.
క. తనుసంభూతులె ఋషు లా,య్యన లోకములెల్ల నట్టి యగు బ్రహ్మగృహం
బన సర్వదేవగృహమనఁ, గను నతఁడే యంచుఁ దలఁపఁగాఁ జనుమీరల్. 1233
క. ఆమహనీయుఁడె సర్వ,క్ష్మామండలి సృష్టిచేసె సర్వేశ్వరుఁడై
నీమమున విలయకరుఁడౌ, నోమానివరేణ్యులార! యురుశక్తిమెయిన్. 1234
క. సురవరుఁ డాతఁడె దేవో,త్కరవిభుఁ డాతండె సర్వధర్మవిదుఁడు నాఁ
బరముఁడు నా సర్వగుఁడనఁ, బరఁగు మహాత్ముం డతండె వరమునులారా. 1235
సీ. సర్వతోముఖుఁడయి సర్వకర్తయునయి యొప్పారు నాపురుషోత్తముండు
వాసుదేవునికంటెఁ బరముండు లేఁడెన్న నెల్లలోకంబుల నెందుఁ గనిన
శాశ్వతుం డన మహాసంపన్నుఁడన వెల్గు గోవిందుఁ డనఁగఁ దగున్ సమస్త
ధరణీశ్వరులను యుద్ధంబునఁ బొలియించు దేవకార్యమును సాధించుపొంటె
ఆ. మనుజతనువుఁ దాల్చు మానాథుసాయము, గనకయున్న దేవగణము లెల్లఁ
గార్యసాధనమునఁ గారు శక్తులు సర్వ, విభుఁ డతండె దేవవిభుఁ డతండె. 1236
క. భూతౌఘవందితుఁడు సుర,భీతిహరుఁడు జ్ఞానరూపవిలసితుఁడు ముని
వ్రాతశరణ్యుఁడు శతధృతి, యాతని నాభిస్థితుండె యగు మునులారా. 1237
క. తనువున నే నుండుదుఁ ద,త్తనువున వసియించి సుఖము తగ నుంద్రు సురల్
వనజాక్షుఁ డతఁడు శ్రీయుతిఁ గనుపట్టును శార్ఙ్గచక్రగద లొప్పారన్. 1238
క. నందక మనియెడుఖడ్గము, సుందరతత్కరమునందు శోభిలు గరుడుం
డొందును ధ్వజమున సుస్థితి, బృందారకులెల్లఁ గొలువ వెలయు నసముఁడై.
సీ. సాధుశీలంబున శౌచదమంబుల భూరిపరాక్రమంబునను వీర్య
మున శరీరమున దర్శనమున నారోహణప్రమాణమున ననంతశక్తి
నార్జవసంపద నానృశంస్యమ్మున బలమున రూపసంపదను దివ్య
ములు నద్భుతములునై వెలయునస్త్రంబులఁ జెలువారి శ్రీహరి స్వీయయోగ
ఆ. మాయఁ గూడి సాధుమతి యలరార స,హస్రనేత్రుఁ డగుచు నాత్మహితుల
మెచ్చుకొనుచు బంధుమిత్రుల కుపకార,ములనొనర్చుచున్ విభూతిఁ బొలయు.
క. క్షమయన నాతనియందే, యమలగతిన్ వెలయు జ్ఞాన మాదృతి నిచ్చున్
గమలాక్షుఁడె భయహరుఁ డన, క్షమ వెలయును బ్రహ్మమానిసత్తములారా.
వ. సర్వభూతశరణ్యుండును, దీనపాలనాదరుండును, వేదవిద్వరుండును, సర్వభూతనమస్కృతుండు నాశ్రితోపకారకరణపరాయణుండు, నరిభయదుండు, నీతిజ్ఞుండును, నీతిసంపన్నుండును, బ్రహ్మవాదియు, జితేంద్రియుఁడును దేవతాభివృద్ధిని బరమార్థముగా భావించువాఁడునై మానవధర్మమార్గస్థాపనార్థ మీయవని నవతరించుచుండు. మనువంశమున గోవిందుఁ డవతారంబు నొందు. మనుపుత్త్రుం డంశుఁ డనఁ దగు. పిదప నంతర్ధాముం డనఁ బుట్టు. వానికొడుకు

హావిర్ధాముండు. తత్తనయుండు ప్రాచీనబర్హి యగు. వానికిఁ బ్రచేతఃప్రముఖులు పుట్టుదురు ప్రచేతసునకు దక్షుఁడు గలుగు. అతఁడు ప్రజాపతియగు. వాని కాదిత్యుఁడు కొడుకు. వానిపుత్త్రుఁడుమనువు వాని కిలుండు. వానికి సుద్యుమ్నుఁడు బుధునకుఁ బురూరవసుండు, వాని కాయువు, వానికి నహుషుండు, వానికి యయాతియు, వానికి యదువు, వానికిఁ గ్రోష్టువు, వానికి వృజినీవంతుండును, వానికి నుషంగురుండును, వానికి శూరుఁడగు చిత్రరథుండును, వానికిఁ జిన్ని కుమారుఁడుగ శూరుండును గలుగుదురు. చరిత్రగుణశాలురగు వారి వంశంబున యజ్ఞంబులు విస్తరిల్లు. క్షత్రియశ్రేష్ఠుఁడగు నాశూరుండు విఖ్యాతిం గాంచి మహామతియై స్వవంశోద్ధారకుం డగుతనయుని వసుదేవ నాముని గాంచు. ఆనకదుందుభియను పేరాతనికిం జెల్లు. ఆతనికుమారుఁడు శ్రీమహావిష్ణువు వాసుదేవుఁడనం బ్రభవిల్లు. దాతయు బ్రాహ్మణసత్కర్తయు బ్రహ్మభూతుండునై యా మహాత్ముఁడు వెలయు. వృద్ధులగు రాజులకు మోక్షమును గల్పించు. మఱియు.

క. గిరిగహ్వరమున శ్రీహరి, జరచే సంధింపఁబడిన శౌర్యగుణాఢ్యున్
దురమున జయించి భూవర, వరరత్నాఢ్యుఁడగుఁ జూండి వరమునులారా!

క. *క్షితి వాసుదేవుఁ డప్రతిహతవీర్యుండౌచు విక్రమాఢ్యుండయి భూ
పతిభూపతి యనయశమున, నతిశయవిఖ్యాతిఁగాంచు నాహరిమఱియున్. 1244

ఉ. ద్వారకయందు నుండి వసుధావిభులందుఁ గువృత్తులన్ దురా
చారులఁ జెండి దీనతను సంతతముం జెలువారకున్న యీ
ధారుణిఁ గాచు నట్టిపరదైవమునుం గనఁబోయి భక్తిచె
ల్వారఁగఁ బూజచేసి వివిధాగమసూక్తుల సంస్తుతించుచున్. 1245

క. ఆరాధింపుఁడు శాశ్వతు, సారసభవుఁ బూజచేయుచందంబున నన్
వారిజసూతిని గనుఁగొనఁ, గోరెడు మీరెల్లఁ బొందు గోవిందుఁ గనన్. 1246

క. పరు వాసుదేవుఁ గాంచిన, సరసిజభవు నన్నుఁ గన్నసత్ఫల మబ్బున్
బరికింప శంకలేదా, పురుషోత్తముఁ జూడఁ జనుట పోలును మీకున్. 1247

తే. ఓతపోధనులార! పద్మోద్భవుని బితామహుని గాఁగ శ్రీకృష్ణుఁ దలఁపవలయుఁ
బుండరీకాక్షుఁ డనుకంప పొలయ నెవనిఁ,గాంచుఁ బ్రీతిని గను దేవగణము వాని.

క. పరమేష్ఠి యట్టివానిం, బరికించు మహాదరణము వర్ధిలుచూడ్కిన్
నరుఁ డెవఁడు కేశవునిపరి,సరమును జేరంగఁ గోరి సంసేవించున్. 1249

క. వానికి యశమును గీర్తియు, మానసిసుఖ మబ్బు నయ్యమర్త్యపురియు శ్రీ
జాని కృపన్ లభియించును, మానియగున్ వాఁడు ధర్మమహితుండు నగున్.

తే. ధర్మవేత్తలచేత సదానమస్కృతుఁడగు నాదేవదేవేశ్వరుఁడు నిరంజ [నిజము.
నుఁడు పరంధాముఁ డీడ్యచిత్తుఁడు రమేశుఁ, డతనిఁ బూజించుటయెధర్మమనఁగ

*పృథివ్యామప్రతిహతో వీర్యేణాపి భవిష్యతి, విక్రమేణ చ సంపన్నః = అని మూలము.

సీ. ఆదేవదేవుఁ డీయవనిఁ బ్రజాహితమును బెంపునొందించుమనసుతోడ
ధర్మరక్షణమును దమిఁ జేయుమునులను బుట్టించెఁ బెక్కండ్ర భూధరేంద్ర
మనఁదగు గంధమాదనమునఁ దపమొప్పునట్లు సనత్కుమారాదులైన
మహనీయు లున్నారు మానసులారా! యట్లు గావున వాగ్మియు భావితాత్ముఁ
ఆ. డఖిలధర్మవేత్త యగువాసుదేవుఁడు, తనను గొలుచువారిఁ దాఁ గృపార్ద్ర
దృష్టిఁ గాంచుఁ దన్ను నెంచువారిని గారవించుఁ దన్ను నాశ్రయించు జనుని.
క. తా నాశ్రయించి యుండును, మానవుఁడెవ్వాఁడు భక్తిమహితుండయి స
మ్మానించుఁ దన్ను వానిన్, శ్రీనియతుం జేయు వానిఁ జేరి వసించున్. 1253
క. ఈరీతి వాసుదేవుని, భూరికృపారాశిఁ గొలువఁ బూనుసతఁడు పెం
పారుతపం బొనరించిన, సారఫలం బబ్బుఁ దద్భజనమున వినుఁడీ 1254
క. సుజనులు శ్రీపరమేశ్వరు,ని జగన్నాథుని మహాత్ము నిచ్చలు దేవ
వ్రజపూజితుని దురాసదు, భజించుటే యుత్తమంబు వరమునులారా. 1255
క. మనసున వాక్కునఁ గర్మం,బున వందన మొప్పఁజేయుఁ బోలును హరి కే
శుని వాసుదేవు యత్నం,బునఁ గొల్వం దగును బూర్వపుణ్యం బున్నన్. 1256
చ. ఇదియె భవార్ణవంబుఁ దరియించెడుమార్గము దేవకీసుతున్
ముదమునఁ గొల్చువారు సురమూర్తులఁ గాంత్రు మహావరాహమై
త్రిదశులఁ బ్రోవఁ బూనినపతిన్ హరి లోకపితామహున్ సదా
మదిని దలంచి మ్రొక్కుదును మానినృపోత్తములార! భక్తిమై. 1257
క. ఆతనితనువున లోక,వ్రాతము చూడంగనౌను వసియింతుము సం
ప్రీతిని గనుచుఁ దదంగ,స్థితావాసమున నిద్ధి సిద్ధము చుండీ 1258
చ. అతనికి జ్యేష్ఠుఁడై హిమవదద్రిని దేహరుచిన్ గలంచుచున్
క్షితి బలదేవనామము ప్రసిద్ధముగాఁ దగియుండఁగా హలం
బతులమహాయుధంబుగ స్వహస్తమునన్ ధరియించి మించి యీ
క్షితి జనియింపఁగాఁ గలఁడు సిద్ధముగా మునులార! కావునన్. 1259
క. శిరములు మూఁ డాహలికిన్, బరమేశునకుం జెలంగు ఫణిపతి యనుపే
ర రహిం దగిన యనంతుఁడె, ధరఁ బుట్టె నటంచు మీరు తలఁపుం డెదలన్.
ఆ. కశ్యపాత్మజుఁడగు గరుడుఁడు బలవంతుఁ, డయ్యు నెవనిశక్తి నరయఁ జాలఁ
డయ్యనంతుఁ డవని నాత్మభోగంబున, నావరించి యుండు ననవరతము. 1261
తే. విష్ణు వీతండె భూభారవిరతికొఱకుఁ, బుట్టె రామహృషీకేశ పూర్వపురుష
కేశవాదినామంబులఁ గీర్తనీయుఁ, డగును బలకృష్ణు లీరీతి నలరుచుండ్రు. 1262
క. అనుపమరూపంబులతోఁ, గనుపట్టుదు రట్టిమూర్తికలితుల దర్శిం
పనుఁ జనుఁ దద్దివ్యకథన్, వినిపించితిఁ గొలువుఁ డట్టివిష్ణున్ జిష్ణున్. 1263

## నూటపందొమ్మిదవ యధ్యాయము.

### శ్రీకృష్ణపూజాఫలము.

చ. అని యిటు వ్యాసమౌనివర్యు మహాత్ముఁడు శంభుఁడు విప్రమౌనులం
గని వచియించినట్టి హరికమ్రకథానిధిఁ దెల్ప మౌను లా
తని నిటు ప్రశ్న చేసిరి ముదంబును గూర్పఁగఁజాలి చిత్రమై
ఘనతరముక్తిదంబు నగు కాంచనచేలునిసచ్చరిత్రముల్. 1264

తే. అఘహరము పుణ్యదంబు ధన్యము నపార, భవమహాంబుధితారకపటుతరంబు
నైనదానిని వింటిమి మౌనివర్య, వాసుదేవుని బూజించువార లెలమి.

సీ. ఏగతిఁ బ్రాపింతు రిద్ధమునీడ్యమౌ ముక్తిని గాంతురే భూరిసుఖము
లనొసంగఁ జాలుస్వర్గలలితపదంబును గాంతురే యట్టులు గాక వీని
రెంటిని గాంతురే శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడవు గాన నీశంకల వదలింపు
జగమున నీకన్న సత్తముఁ డెవ్వఁడు గలఁడు నావిని వ్యాసుఁ డెలమి వారిఁ

ఆ. గాంచి పలికె నిట్లు మంచిప్రశ్నము చేసి,తిరి మునీంద్రులార! దివ్యకథను
విష్ణుభక్తిఁ జాల వెలయించుదానిని, సర్వసుఖదమనఁగఁ జాలుదాని. 1266

క. హరి దేవకీతనూజునిఁ, బరమేశ్వరుఁ గొలువ దీక్షఁ బట్టినయంతన్
నిరుపమముక్తి లభించును, నిరతము పూజింప ముక్తినిం గను టరుదే. 1267

క. వారికి స్వర్గము మోక్ష,ద్వారప్రాప్తియును దుర్లభంబులు గావో
ధారణిసురలారా! హరిఁ, గోరి తమిం గొల్చుజనులకుం గామితముల్. 1268

క. అన్నియు ఫలియించును ర,త్నోన్నతభూధ్రంబు నెక్కి యూహకుఁ దగువా
ని న్నెఱి గ్రహించు నటు సుర,సన్నుతుఁ డగు కృష్ణువలన సకలార్థంబుల్.

ఆ. కొదువలేక యుండ నొదవును మునులార, కల్పవృక్ష మెక్కి కాంక్షితమ్ము
లగు ఫలములఁ గొనెడునట్లు శ్రీకృష్ణునిఁ, గొలువ నభిమతములు కొదువపడవు.

క. అనిశము శ్రద్ధంగొని కృష్ణుని విధిగాఁ బూజచేయ సులభంబుగఁ బొం
దును నరుఁడు ధర్మ మర్థ,మ్మును గామము మోక్షపదము మునులార! త్వరన్.

క. జగదీశునిఁ బరిశుద్ధం,బగుచిత్తముతోడ విధిగ నారాధింపం
గఁ గలుగు సురదుర్లభము ల,నఁగఁ దగుసత్ఫలము లెన్నినం జిత్రంబా. 1272

క. నరు లెవరు వాసుదేవునిఁ, బరాత్పరున్ లయములేక భాసిలు పరమే
శ్వరు నర్చింతురొ లోకో,త్కరమున దుర్లభ మనంగఁ గలదె తలంపన్. 1273

క. పురుషులు వారలె ధన్యులు, హరి నెవ్వరు పూజనముల నలరింతురొ పా
పరహితులు వారె కోర్కులఁ, బరిమితి మించంగఁ బొందువారలు వారే.

క. ధరణీదివిజులు బాహుజ,వరు లర్యులు శూద్రులట్లె వనితలు శ్వపచుల్
హరి దేవేజ్యుని విధిమెయిఁ, బరిపూజితుఁ జేయఁ గల్గఁ బరమగతి త్వరన్.

క. కనుక మునీశ్వరులారా, వినుఁడీ మీరెల్లఁ బ్రశ్నవిధి నడిగిన యా

మనుజునకు మహాత్మునకుం, గననగు సద్గతుల శాస్త్రగణనార్హములన్. 1276

సీ. మనుజదేహము రోగమున కాలయం బశాశ్వతము జరామృతియుతము సలిల
బుద్బుదసంకాశమును మాంసశోణితపూతిగంధాన్వితము మఱి మూత్ర
విష్ఠాన్వితం బస్థివితతియు నపవిత్రమును స్నాయువులు చర్మమును శిరలును
కలుగ నసహ్యమై కనఁబడునదియును నగుఁగాన నద్దాని నవని విడిచి

తే. కామగతి యావిమానమ్ముఁ గమ్రగంధ, యుతము గంధర్వగీతసంయుతముఁదరుణ
తరణివర్ణాన్వితము మనోహర ములైన, క్షుద్రకింకిణు లొప్పంగ సొంపుగులుక

క. తనరారుదాని నెక్కియె, వనితారత్నములు త్రిదశవరులును గంధ
ర్వనికరములు గొలువఁగ లోకనికరపతిసద్మములకుఁ గమ్రవిభూతిన్. 1278

క. అలరుచుఁ బ్రత్యేకంబుగఁ, బొలుపొందెడు వేడ్కమీఱఁ బోయి సుఖంబుల్
చెలఁగఁగ బహుమన్వంతర,ములకాలం బుండు వారు పూజలఁగనుచున్. 1279

చ. అనుపమరమ్యగేహములయందు నలంకృతిఁ బొల్చి యంబరం
బునఁ దగి సౌఖ్యదం బగుచుఁ బొల్చెడు లోకముఁ జేరి యందు హా
యిని గనుచున్ మనూక్తమగు నేయదికాలమొ తద్దశాయతం
బును నగుదానిఁ బుచ్చి సురపుంగవు లౌననఁ బూజ్యమానుఁడై. 1280

తే. వినుతగంధర్వలోకంబు వేడ్క నొంది
యిరువదొక్కండ్రు మనువుల దెంతకాల
మంతకాలంబు వసియించు నందుఁ బెక్కు
సుఖములం బొంది పోవును సూర్యగతికి. 1281

వ. అందుఁ ద్రింశన్మన్వంతరానంతరముండి బ్రహ్మలోకంబునకుం బయనంబుచేసి నలువదిమన్వంతరంబులకాలం బందు నివసించి జరామరణవర్జితులకుం గలుగు భోగంబులం బొంది విమానంబున నక్షత్రలోకంబున కేగి యేఁబదిమన్వంతరంబులకాలం బందు నివసించి దేవలోకంబున కరిగి యఱువదిమన్వంతరంబు లటఁ బుచ్చి శక్రలోకంబునకు మరలం జని డెబ్బదిమన్వంతరంబులు నివాసము చేసి యటనుండి యత్యుత్తమప్రాజాపత్యలోకంబుఁ జేరి యెనుబదిమన్వంతరంబులు గడపి పితామహలోకంబు నొంది తొంబదిమన్వంతరంబు లటఁ బుచ్చి పిదప భూలోకంబున కేతెంచి పవిత్రవిప్రప్రవరకులంబున జన్మించి వేదవేదాంతశాస్త్రపారగుండై సుఖానుభవంబునఁ దృప్తుండై లోకాంతరంబునకుంబోవు. ఇట్టి జన్మములు పదికాఁగా శ్రీహరిలోకంబుఁ బొందఁజాలు. అందక్షయ భోగంబు లనుభవించి శతమన్వంతరకాలతుల్యసమయంబు గడపి వారాహ భువనంబు నొందఁజాలు నందు. 1282

చ. సురుచిరదేహముల్ వెలయ సొంపగుకుండలముల్ తగన్ మనో
హారతరవేషముల్ పొలయ నల్లె చతుర్భుజముల్ చెలంగ శ్రీ

హరివలె నొప్పుచుండుజను లందఱు నం దిటులే చెలంగు వా
రరయఁగ భోగితల్పునకు నన్నివిధంబులఁ దుల్యులే సుఁడీ. 1283

సీ. పదికోట్లవేల సంవత్సరంబులు దేవవందితులై యందు వఱలుచుండి
యటనుండి నరసింహునాలయంబునకేగు వర్షకోట్యయుతముల్ వరుససుఖము
లనుభవించుచు నందు హరి సేవచేయుచు నివసించి యవ్వల నిర్మలతమ
వైష్ణవపదమున వసియింపఁగాఁ బోవు సిద్ధసంఘంబులు చెలఁగు నందు
తే. నయుతవర్షంబు లుండి బ్రహ్మపదవరము
మరల నొందును నట బహుమాన మొప్పఁ
బెక్కువర్షంబు లుండు నావిమలపదము
నుండి నారాయణపురంబు నొందు నతఁడు. 1284

క. చిరకాల మందు భోగోత్కరములఁ బొందుచు వసించి కదలి మృదుమనో
హరతనువున ననిరుద్ధునగరమునకుం బోవు దేవగణవినుతుండై. 1285

క. పదునాల్గువేల కోట్లుగఁ, గుదిరిన సంవత్సరములు కూరిమి నందుం
బొదలెడుసుఖములఁగనుచుండుఁ,దమిజరమృతియుఁజొరఁబడునెయచ్చోటన్.

వ. అందు సుఖంబులఁ దృప్తుండై ప్రద్యుమ్నలోకంబునకుం బోయి విగతజ్వ
రుండై లక్షకోటిశతత్రయవత్సరంబులు స్వచ్ఛందగమనంబునఁ దిరుగుచు బల
శక్తిసమన్వితుండై యటనుండి సంకర్షణలోకంబునకుం బోయి చిరకాలంబుండి
యిష్టోపభోగంబులఁ బరితృప్తినొంది వాసుదేవునందుఁ జేరు. ఆపరతత్త్వంబు
నొందిన జరామరణభీతియనునది తోఁపకయుండు. అందుండి మరలుట సంభవిం
పదు. ఈరీతిగా బుద్ధిమంతుఁడు కర్మఫలముల ననుభవించు. వాసుదేవార్చనం
బున ముక్తియుఁ గలుగు సంశయంబు లేదని పలికి మఱియు మహామునులకు
వ్యాసుం డిట్లనియె. 1287

ఆశ్వాసాంతము.

క. పరిశుద్ధాంతఃకరణా, భరణా సుకృతైకగమ్య భవ్యశరీరా
నిరుపమ మహిమోద్ధామా, నిరంజనా నిర్వికల్ప నిత్యైశ్వర్యా.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్త గీర్వాణాంధ్రకవితా ప్రాభవ
కాశ్యపాన్వయప్రభవ శ్రీజనమంచివంశాంబురాశికుముదినీమిత్రసుబ్రహ్మణ్యమ
నీషిపుత్త్రి తాండవ కృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయవినిర్మితంబైన
తెలుఁగుబ్రహ్మపురాణంబునఁ జతుర్థాశ్వాసము

శ్రీః

# తెలుఁగు బ్రహ్మపురాణము

## పంచమాశ్వాసము.

### నూటయిరువదవ యధ్యాయము.



పర్వతజా వాణీ
రూపాయిత సత్త్వముఖ్య రూఢగుణా హృ
త్తాపహరా త్రిదశేంద్ర
వ్యాపారాధార వేంకటాచలనాథా. 1

వ. మహాప్రభూ! యనంతరవృత్తాంత మాకర్ణింపుము. 2

ఏకాదశీమాహాత్మ్యము.

క. మునులార! వాసుదేవా,ర్చన మేతిథియందు భూరిసత్ఫలముల ని
చ్చునో దానిఁ జెప్పువాఁడను, వినుఁ డేకాదశి యనంగ వెలయుం గాదే. 3

క. ఇరుపక్షంబుల నాతిథి, పరమోత్తమ మనుచుఁ బొగడఁబడు నుపవాసం
బరయఁగ సత్ఫలదం బగుఁ, బురుషోత్తముఁ డలరు దానిఁ బొగడం దరమే. 4

సీ. నిశ్చలస్వాంతుఁడై నిర్జితేంద్రియుఁడయి స్నానంబుచేసి శాస్త్రహితసరణి
ధౌతవస్త్రంబులు ధరియించి విష్ణుని బూజించి శ్రద్ధయు భూరిభక్తి
వెలయుచు నుండఁగ లలితపుష్పంబులఁ బరిమిళగంధధూపముల దీప
ములఁ జారునైవేద్యముల నుపహారమ్ములను జపహోమములను బ్రదక్షి

తే. ణముల స్తోత్రంబులను మనోహరము లనఁగఁ
బొగడఁబడుగానముల మ్రొక్కులును మొదలగు
విధుల శ్రీహరిఁ బూజించి విష్ణుకథల
సంస్మరించుచు దివముఁ బుచ్చంగవలయు. 5

క. రాతిరి ప్రజాగరంబున, గీతికలను విష్ణుకథలఁ గీర్తించుటచేఁ
జేతోభక్తిం బుచ్చిన, శ్రీతరుణీపతిపదంబుఁ జేరు ధ్రువముగన్. 6

క. అన విని మునులు ప్రజాగర,మున గీతంబునను గల్గుపుణ్యము మాకున్
వినిపింపు లోకహితముగ, వినుదుము శ్రీవిష్ణుభక్తి వృద్ధిం గనఁగన్. 7

క. అన విని వ్యాసుం డిట్లని,యెను వినుఁడీ మానులార యెఱిఁగింతును శ్రీ
శుని గీతికాఫలంబును, ననుపమజాగరమునందు నగుఫలమెల్లన్. 8

చ. కలదు పురీవతంసము నికామమనోజ్ఞ మవంతినాఁగ భూ
స్థలమున విశ్రుతిం గనుచుఁ జక్రగదాదరధారియై మనో
జ్ఞలలితదేహ మొప్పుహరి చక్కని తేజము వెల్గఁజేయ ని
స్తులమహిమోన్నతిం దెలుపుచున్ సుకృతాకృతి చెన్ను మీఱఁగన్. 9

ఉ. ఆపురిచెంత గీతికలయందుఁ జమత్కృతి గల్గి యెంతయున్
శ్రీపతిభక్తి పెంపెసఁగ సిద్ధగుణుండగు పుల్కసుం డొకం
డోపిక సాధువృత్తిఁ గొని యుత్తమరీతి ధనంబుఁగూర్చి యే
పాప మొనర్పఁబూనక కృపామతి భృత్యుల నెల్లఁ బ్రోచుచున్. 10

చ. హరిపయి గల్గుభక్త్యతిశయంబున శ్రీహరివాసరంబునన్
బరమదృఢవ్రతంబు నుపవాసవిధిన్ జరపంగఁ బూని శ్రీ
వరు వరదానదక్షుని గృపానిధి గీతికలన్ నుతించుచున్
నిరుపమవిష్ణునామముల నేర్పున నించి మనోజ్ఞభంగిగన్. 11

క. అదియే భగవత్పూజగ, మదినెంచుచు నాపరేశు మాధవు నభవున్
సదయుని నెదుటం గాంచిన, హృదయము ముద మొందునట్టు లెంచుచు నుండున్.

సీ. షడ్జ గాంధార నైషాద పంచమ ధైవతస్వరంబులను గీతములఁ జక్కఁ
బాడుచు శ్రీహరిపరతంత్రుఁడై గాథలను స్మరించుచును రాత్రిని విధియుత
జాగరణంబునఁ జనఁ జేయుచుండుఁ బ్రభాతంబునన్ లేచి పద్మనేత్రు
నకు వందనము చేసి సకలబంధులఁగూడి ద్వాదశి స్వీయసద్మమునఁ గన్య

ఆ. కలును దాను భుక్తి సలుపును ముందుగా
నెల్లవారి కన్నమిడి యనంత
రమునఁ దానుఁ గుడుచు సమయ మావిధిఁ బుచ్చు
హరిని ముదితుఁ జేయు ననవరతము. 13

క. హరినామచిహ్నగీతో,త్కరమును బాడుచును బ్రీతిఁ గాలంబును భ
క్తిరతిం బుచ్చుఁగఁ గాలము, చిరతరముగ నేగెఁ గీర్తి చెలఁగుచు నుండన్. 14

చ. ఒకపరి చైత్రమాసమున నొప్పెను రెండవపక్షమందు శ్రీ
శుకరుణ నొంద మార్గ మన శోభిలు శ్రీహరివాసరంబునన్
సకలవిదున్ బరాత్పరుని జక్కఁగఁ గొల్వఁగఁ బుల్కసుండు మి
త్రకలితుఁడై వనంబునకుఁ దాఁ జనె భక్తిరసంబు పొంగఁగన్. 15

చ. వనమునఁ గల్గుపుష్పములఁ బంకజనాభుని బూజచేయఁ దేఁ
జని యట క్షిప్ర నాఁగ సుయశంబున మించిన సత్తరంగిణిం
గని తదుపాంతకాననముఁ గాంచి విభీతకభూరుహంబు క్రిం
దను వసియించు ఘోరతరదానవు నొక్కనిఁ గాంచె నంతటన్. 16

సీ. దానవుం డాతని గానసంబునఁ గని భక్షించుకోరికఁ బట్టుకొనియె

నపుడు చండాలుఁ డిట్లనియె నన్నుం దిన సమయ మీయది గాదు విమలచిత్త
రే పుదయంబునఁ బ్రీతి భక్షింపుము తప్పక వచ్చెదఁ దరలి యిచటి
కీదినంబునఁ గల దేను జేయందగు గొప్పకార్యము దానికొఱకు నన్ను
తే. వదలు మేఁ దప్ప కిచటికి వత్తు రేపు
విష్ణుశుశ్రూష నొనరింప విధిని రేయిఁ
జేయఁదగు జాగరణమును జేయఁగూడ
దిట్లు వ్రతవిఘ్నమును రాక్షసేశ యనిన. 17
క. దనుజుం డాతనిఁ గని యి, ట్లనియెం బదిదినము లాయె నాహారమ్ముం
గొనఁ జిక్కదు నేఁ డబ్బెను, దినువాఁడను నిన్ను క్షుత్తుదీఱఁగ శ్వపచా. 18
క. వదలను నిన్నిఁక నాఁకలి, గుదియించెడు నన్నుఁ దాళఁగూడునే దీనిన్
బదులిడకు మనెడు పుల్కసు, నదయునిఁ గని సాధువాక్కు లలరఁ బలుకుచున్.
క. మృదువాక్యముల ఫలంబా, యదయునకుం దెల్పుచున్ బ్రహర్షంబున నో
సదయాంతఃకరణా! వచ్చెద రే పని సత్యవాక్కు చెప్పితిఁ గాదే. 20
క. శపథ మొనర్తును సూనృత, మె పరమదైవం బటంచు నెన్ని మఱియు రా
త్రి పతియు సూర్యుఁడు వాయువు, కృపీటయోనియును జలము క్షితియు నభంబున్.
క. మనసు నహోరాత్రంబులు, వనజాప్తసుతుండు దైవభావంబున నొ
ప్పిన రెండు సంధ్యలును గను, మనుజుని చేష్టితము లెల్ల మానక నియతిన్. 22
క. పరదారగమనమున నే, గురుతరపాపంబు గల్గుఁ గోరి కుటిలతం
బరధనము హరించిన నిష్ఠురదోషం బెద్ది గల్గు సుర ద్రావిన చోన్. 23
క. కలుగు నదే పాపము విప్రులఁ జంపిన నేయఘంబు పొందునొ గురుదా
రలఁ గూడ నెట్టి కిల్బిష, మొలయునొ వంధ్యాపతికి నెదొప్పునొ యఘమున్.
క. వృషలీపతి కబ్బెడు కిల్బిష మెట్టిదొ దేవలునకు వృజినం బేదొ
విషమాహారముఁ గొనినన్, ఝషమాంసముఁ గొనినఁ గలుగఁ జాలు నఘంబుల్.
సీ. క్రోడమాంసాశికిఁ గూర్మమాంసము దినువానికి నూరక మానసేష్ట
మున మాంసమును దిను మనుజునకున్ బృష్ఠమాంసము భక్షించు మానవునకు
సఖులకు హానిని సలుపువానికిఁ గృతఘ్నునకు రెండవ పెండ్లిఁ గోరు వనిత
వరియించువానికి నిరతము పాపకర్మములఁ జేయుచునుండు మర్త్యునకును
తే. సూతకాన్నంబు దినువాని కేతఱిఁ గృప
ణుఁడగు వానికి వంధ్యకునున్ సతంబు
పరునియన్నము గోరెడు నరున కెట్టి
పాప మబ్బునొ పొందు నప్పాపము నను. 26
క. అమవసయందును షష్ఠ్యష్టములందుఁ జతుర్దశులను సంగమ మొనరిం
చు మనుజునకుఁ గల్గెడు పాపము నాకుం గల్గు మాటఁ బాసితి నేనిన్. 27

క. ఋతుమతియగు సుందరిఁ గా,మతఁ బూనుచుఁ జిత్త మేచ మ్రాన్పడి శ్రద్ధం
బితరులకు శ్రాద్ధ మొనరిచి, జతనమునం గూడఁ గలుగఁజాలు నఘ మగున్. 28

వ. సర్వస్వ స్నాతకభోజన జనితపాపంబును, మలభోజనజనితాఘంబును, మిత్ర భార్యాగమన, పిశున, దంభ, మాయానురక్త, మధుఘాతుక, బ్రాహ్మణవాగ్దానా కరణ, కన్యకానృత, గోశ్వేతరానృత, స్త్రీబాలఘాతుక, మిథ్యాభిభాషి, దేవ వేద ద్విజ నృప పుత్త్రి మిత్ర సాధ్వీఘాతుక గురుమిథ్యాపచార గ్రామ దాహక, గృహదాహక, వనదాహక, గోహననక, పరివిత్తి, పరివేది, తత్కన్యా దాతృ, ప్రతిగృహీతృ భ్రూణహత్యాకర్తృ ప్రముఖులకుం గలుగుపాపంబులు నాకుం గలుగు. పెక్కుమాట లేల? రాక్షసా! భీమంబు దుర్వాచ్యంబునగు శపథంబు నొనరింతు వినుమని యిట్లనియె. 29

చ. తనసుత వంక జీవనము తానె యొనర్చెడు దుష్టకర్ముఁడున్
ధనమును గోరి సూనృతము తప్పియె సాక్ష్యము పల్కుక్రూరుఁడున్
జనులు తిరస్కరింప నొకచందమునం దగకున్నవాని య
జ్ఞనిరతుఁ జేయుయాజకుఁడు షండుఁడు నొందునఘంబు నాకగున్. 30

తే. నీచభాషలు వినువాఁడు నీతిమాలి
సన్న్యసించి జవంబున సంత్యజించు
వాఁడును బ్రహ్మచర్యంబు వదలువాఁడు
కాముకుఁడు పొందుపాపంబు గలుగు నాకు. 31

క. వినుమా రాక్షస! రాన్నై,తినయేని మదుక్తపాపతిమిరము నను ముం
చునుగాక యనెడు శ్వపచు వ,చనములు విని విస్మయంబు సరగునఁ దోఁపన్.

క. దనుజుం డిట్లనుఁ బొమ్మా, మునిసుతమా సత్యసమయమును గావుము నా
విని చాండాలుఁడు పూవులఁ, గొని శ్రీవిష్ణ్వాలయమునకుం జనుదెంచెన్. 33

క. ధరణీసురున కొసంగినఁ, బరమాత్ముని శుద్ధవారిఁ బ్రక్షాళితుఁ జే
సి రహిం బూజించెను నీ, వరుసం బూజావిధానపరనియమంబున్. 34

తే. పూర్తి నొందించి యింటికిఁ బోయి యుపవ
సించి యారేయి మేల్కని శ్రీహరి మది
నునుచుకొని వాద్యములతోడ వినుతగీతి
కలను బాడుచు సద్భక్తిఁ గడపె నంత. 35

క. తెలతెలవాఱిన శ్వపచుఁడు, జలజాక్షుఁ గావవయ్య చండాలుని న
న్నెలమి నని మ్రొక్కి తా మును,పలికిన సమయంబుఁ దీర్పఁ బయనం బయ్యెన్.

చ. దనుజుఁడు తన్నుఁ గాంచిన సుదారుణకాననభూమి కేగుచో
మనుజుఁ డొకండు తన్నుఁ గని మానితశీల! యదెట్టిచోటికిం
జనియెదవో యటన్నఁ దనసత్యము చెప్పిన నాతఁ డాదృతిం

గని మఱియున్ వచించె వినుఁ గర్మముపద్ధతి శ్రద్ధమీఱఁగన్. 37
క. ధర్మార్థకామముక్తులు, నిర్మలపురుషార్థము లన నెగడును వానిన్
పేర్మిని సాధింపఁగఁ దను, వర్మిలిఁ గాపాడవలయు నందురు మౌనుల్. 38
తే. ఎంతొ యత్నంబొనర్చియో యీశరీర
మును దగం గాచికొందురు మునులు బ్రదికి
ధర్మధనశర్మములఁ గనుఁ దదుపరి నప
వర్గమును గాంచు నయ్యదె వరము గాన. 39
క. బ్రతికినఁ గీర్తిం గాంచును, మృతినొందినఁ గల్గు నద్ధియేమో తెలుపన్
శ్రుతిఁ గలవారికి శక్యమె, హిత మెన్ను మటన్న శ్వపచుఁ డిట్లని పలికెన్. 40
క. వినవయ్య సాధుచిత్తా, మునినుతమౌ సత్యమార్గమును నమ్మి వనం
బున శపథంబులు చేసితి, నన నాతం డిట్లు పల్కె నాశ్వపచునితోన్. 41
తే. మూఢమతిఁ బూనితివి ధర్మములను వినవు
మనువు పల్కెనయాధర్మమార్గ మెఱుఁగ
వాక్కొ గోస్త్రీద్విజాతుల నొగిని గావఁ
బెండ్లితఱి మిత్రభాషణవేళలందు. 42
క. ధనమెల్ల నపహృతంబయి, చనునప్పుడు ప్రాణహరణసమయంబున నొ
ప్పు నసత్యభాషణ మ్మది,యును బాపము గూర్పఁ జాల దోసాధుమతీ. 43
తే. ధర్మవాక్య ముద్వాహంపుఁదరుణమందు
వనితలందును రిపులందు వంచనమ్ము
చేయుతఱి ద్రవ్యహానియుఁ జేకురుతఱి
నాత్మనాశము చేకురునపుడు తగదు. 44
క. అనువాక్యమువిని శ్వపచుం, డనియెన్ మహితాత్మ యిట్టు లనఁదగునే నీ
కును భద్రమగునుగాతన్, జనపూజ్యము సత్య మగును క్ష్మాస్థలి నెపుడున్. 45
క. ఋతముననే సుఖ మబ్బును, శ్రుతితలమున నన్నమాట చెవిఁ బడదో సూ
నృతముననే సూర్యుండును, బ్రతాపమును దాల్చువాఁడు పరమేశుకృపన్.
సీ. జలము రసాత్మక మలరు సత్యంబున నగ్నియు జ్వలియించు ననిలుఁ డట్లె
వీచుచుండును సత్యవిరహితునకు ధర్మ మర్థకామములు మోక్షాఖ్యపదము
సత్యహీనుండగు జనునకు లభియింప వద్దాని నూనిన నవ్వి గలుగుఁ
గావున సత్యవాక్యము విడనాడఁగఁ దగునె పరబ్రహ్మతత్త్వ మనఁగ
తే. సత్యమేగద సత్యమే సర్వయజ్ఞ
మయము స్వర్గసుఖంబన మహిని సూనృ
తమెకదా దాని విడనాడఁ దగదు సుమ్మి
యనుచు మాతంగుఁ డానరు నట్టె వదలి. 47

క. చనియెఁ బ్రాణులఁ జంపెడు, దనుజుం డున్నెడకు మాటతప్పక చనుదెం
చిన శ్వపచు బ్రహ్మరాక్షసుఁ, డనూనదృష్టిని దగంగ నటఁ గని మదిలోన్. 48
తే. విస్మయోత్ఫుల్లనయనుఁడై వివిధగతుల
మస్తకంబును ద్రిప్పి యిమ్మాడ్కిఁ బలికె
సాధు సాధు మహాభాగ సత్యవాక్య
పాలకా! నిన్నుఁ దలఁపను బ్లవునిగాఁగ. 49
క. సూనృతలక్షణు నిన్నే, మానసమునఁ దలఁతుఁ జుమ్ము మానుసవర్యుం
గా నీకర్మము చేతనె, మానసపరిశుద్ధి గల్గె మాట లిఁకేలా. 50
తే. సకలకల్యాణలక్షణు సత్యమార్గు
నిన్ను నడిగెద నొకమాట యన్న! ధర్మ
సంశ్రయా రాత్రియందు శ్రీశగృహమందు
నేమి చేసితివో తెల్పు మో మహాత్మ! 51
చ. అని దనుజుండు ప్రశ్నము మహావినయంబున నిట్లు చేయఁగా
విని శ్వపచుండు పల్కె విను విష్ణుగృహంబున రాత్రి నేనొన
ర్చినపని సత్యముం బలికి చెందఁగఁ జేయుదుఁ బుణ్య మిప్డు నేఁ
జని పరమేశు మందిరము సన్నిధిఁ గ్రింద వసించి భక్తితోన్. 52
చ. శిరమును వంచి జాగరము చేసితి విష్ణుమహత్త్వగీతికా
స్మరణసుఖంబుఁ గాంచుచు నిశాసమయం బిటుపుచ్చినాఁడ నా
చరిత మిదే యటన్న విని చయ్యన నాతఁడు వేఁడె సాధుస
చ్చరిత యదెంతకాలముఁ బ్రజాగరణంబునఁ బుచ్చినాఁడవో. 53
ఆ. భక్తి యలర విష్ణు భవ్యమందిరసీమ, నున్నవాఁడ వనిన సన్నతి దగ
నతఁడు పలికె సుస్మితాస్యుఁడై యిర్వది, వత్సరములు విష్ణువస్త్యసీమ. 54
క. ప్రతిమాసైకాదసులం, దతిభక్తిని జాగరణము నధికనియతి స
ల్పితి నాఁగ బ్రహ్మరాక్షసుఁ, డతివిస్మయ మొదవ నిట్లు లడిగెన్ మరలన్. 55
క. మతిమంతా! నేఁ జెప్పిన, గతిఁ జేయం దగును లక్ష్మీకాంతుని మది స
మ్మతిఁ గూర్ప నొక్కరాత్రి ని,యతిఁ జేసిన జాగరణమహాఫల మిమ్మా. 56
క. నిను వదలెద లేకున్నన్, నినుఁ బట్టి భుజింతు నమ్ము నిజ మిది నిజమా
నన్నృతంబు గాదు సుమ్మీ, యని యాఁగకయుండె శ్వపచుఁ డపు డిట్లనియెన్.
చ. దనుజవరేణ్య! స్వేచ్ఛమెయి దారుణమై తగుతుత్తు నాపఁగా
ననుఁ దినవయ్య నిన్నటిదినంబున నేవచియించినాఁడఁ జు
మ్మన విని రాక్షసుం డనియె యామయుగప్రకృతప్రజాగరం
బునఁ దగుపుణ్యమిమ్ము కృపఁ బూనుము నాయెడ నింతయేనియున్. 58
క. హరిగీతికాయుతంబయి, పరమం బగు నద్ది దానఁ బావనమతి నై

ధర మనియెద నన శ్వపచుఁడు, మరలం బలికెన్ గతప్రమదమున నిట్టుల్. 59

క. ఏల యసంబద్ధవచో, జాలము పలుకంగ నన్ను సరగునఁ దినుమా
లోలతఁ గోరకు పుణ్యం, బేలిల నొసంగఁ జాల నిద్ధఫలంబున్. 60

మ. అనుమాతంగుని గాంచి యాయసురుఁ డార్యా! యేదురాత్ముండు నిన్
గనఁగాఁ జాలును? బాధఁగూర్పఁ దలఁచున్? గాంక్షం దినం బూను? ని
న్ననిశం బుత్తమధర్మకర్మపరిరక్షాత్మున్ గనం బాపముల్
చను దూరంబుగ నొక్కమాట వినుమా సాధూత్తమా యాదృతిన్. 61

సీ. పాపాత్ముఁడై దీనుఁడై పాపవిషయాళి మోహితుఁడయి మఱి మూఢుఁడు నయి
నరకార్తుఁడయి తగునరువిషయంబున సాధువుల్ కృపఁబూనఁ జాలి యుంద్రు;
కావున నాపయిఁ గరుణను బూనియే యామైకకాలంబు హరిభవనము
నందుఁ బ్రజాగర మతిభక్తి నొనరించినట్టిపుణ్యము నిమ్ము హర్ష మొదవ

తే. గృహమునకుఁ బొమ్ము నావిని యేను బోవ
నొల్ల నింటికి జాగర మొనరుపంగఁ
గల్గుపుణ్యంబు నియ్యంగఁ గాంక్ష గొనను
దినుము నామేను నను శ్వపచునిని గాంచి. 62

క. పక్కన నవ్వుచు రాక్షసుఁ, డిక్కరణిం బల్కె రాత్రి యేగెడుతఱి నీ
వక్కడఁ బాడిన గీతిక, నొక్కం డిడుఫలము నాకు నొసఁగుము చాలున్. 63

తే. పాపపంకంబునుండి కృపం దరింపఁ
జేయవయ్య యటంచని చేతు లొగ్గి
వేఁడు రాక్షసుఁ గని కృపగూడ శ్వపచుఁ
డనియె నో రాక్షసా! తొలి జననమందు. 64

క. ఒనరించితివో సత్కర్మనికరమును వికృతముగ సమస్తవిధములన్
గనినన్ దోష మొనర్చుట, జననంబిది బ్రహ్మరాక్షసము తగె నీకున్. 65

చ. అనుటయు బ్రహ్మరాక్షసుఁ డహంకృతిమాని వినీతుఁడై మనం
బునఁ దలపోసెఁ బూర్వభవముం దనచేసిన కర్మజాలమున్;
గనఁబడె నవ్వి స్పష్టముగఁ గావున నిట్లని చెప్పె నార్య వే
వినుము మదీయపూర్వజనివృత్తము మత్కృతకర్మరీతియున్. 66

తే. దేనిచే నాకు నిట్టినిందింపఁ దగిన, రూప మబ్బెనొ యతితరక్రూరరాక్ష
సాఖ్య మేఁ దొలిజననంబునందు సోమ, శర్మ యను బ్రాహ్మణుండను సాధువర్య. 67

చ. శ్రుతులఁ బఠించి వృత్తి గుణశోభితుఁడై తగు దేవశర్మ కే
సుతుఁడను సోమయాజియయి సూనృతవాదియునై చెలంగె నా
పితయు నొకప్పు డొక్కనృపవీరుఁడు యజ్ఞముచేయఁ బూనె నా
క్షితిపతి యజ్ఞకర్మమున సిద్ధిగనం దగఁ డెల్లభంగులన్. 68

వ. సూత్రమంత్రబహిష్కృతుండగు నాతనికిఁ గర్మాసక్తి జనించె. నాతండ్రి లోభమోహసమన్వితుం డగుట నాయధ్వరంబున నాగ్నీధ్రుండను ఋత్విజుండయ్యె. ఆయజ్ఞంబు సమాప్తంబయ్యె. నేను మౌర్ఖ్య మూని దంభసమన్వితుఁడనై ద్వాదశదినకరణీయమహాక్రతువు నొనర్పం బూనితి. దానియందు నాకుఁ గుక్షిశూల యొదవె. పదిదినములు గడచె రాక్షసముహూర్తంబున విరూపాక్షునకు నాహుతి నిచ్చుచుండ మృతి నొందితి. ఆదోషంబున బ్రహ్మరాక్షసుండ నైతి తెలివిమాలి మంత్రసూత్రస్వరవివర్జితంబుగా హోమము చేసితిని. యజ్ఞవిద్య నెఱుంగుట ముఖ్యంబు. అట్టిదానిఁ దెలియఁ జాలనైతి. ఆకర్మవిపాకంబున బ్రహ్మరాక్షసుండ నైతిని. పాపమహాసముద్రంబున మునింగిన యీనన్ను నీవు ద్ధరింపుము. జాగరణకరణగీతికాపఠన యామమాత్ర లబ్ధఫలంబు నాకొసంగుము. నావుడుఁ జాండాలుం డాతనిం గాంచి యిట్లనియె. 69

ఆ. ప్రాణివధభయంబుఁ బాపు నేగీతిక, కడపటిదగు యామకమ్రగీతి
కాఫలంబు నీకుఁ గడఁగి యొసంగెద, ననిన నిమ్మనంగ నాతఁ డొసఁగె. 70

సీ. శ్వపచుఁ డంతట నాత్మసాధుగీతఫలంబుఁ దలఁచి ముహూర్తార్ధలలితజాగ
రణఫలంబును గూర్చిరాక్షసత్వముపాయుఁగాకయం చొసఁగె రాక్షసుఁడుదాని
గ్రహియించి తత్పాదకమలంబులకు మ్రొక్కి హృష్టుఁడై యప్పుడె యేఁగెభక్తి
వెలయఁ బృథూదక విఖ్యాతతీర్థంబునకు నందు లఘుభోజనంబుఁ గూడ

ఆ. మాని తప మొనర్చి మానె శరీరంబు, నపుడె రాక్షసత్వ మంతరించె
గీతికాపృథూదకాతతతీర్థ స,త్ఫలమునఁ జనె నతఁడు బ్రహ్మకడకు. 71

క. ఆపదము దుర్లభంబై, దీపించు నటఁ గ్వసించె దివ్యతనువు తఁ
బ్రాపింప లక్షవర్షము, లోపిక శర్మానుభవము నొంద నతండుఁ. 72

క. ధరణిఁ బ్రాహ్మణకులమునఁ, బరమాద్భుతనీతి శాస్త్రపండితుఁడై పు
ట్టె రహిఁ దద్బ్రాహ్మసురవరు,చరితము వచియింతు మరల సన్మునులారా. 73

క. మాతంగుశిష్టచరితం, బీతఱి వచియింతు వినుఁ డహీనతరం బౌ
ప్రీతిని రాక్షసుఁ డీగతిఁ, జేతగ్ర్రమదమునఁ బోవ శ్రీశుఁ దలఁచుచుఁ. 74

తే. ఇంటి కేతెంచి జ్ఞానం బదెంతొ వృద్ధి
నొంద నియతేంద్రియుండయి యుర్విసురుని
చరితముఁ లోఁ దలంచి విషణ్ణుఁ డగుచుఁ
బరమశుచి గాన సుతులకు భాగ్యఁ జూపి. 75

క. జననిని గాపాడం జనుఁ, జనియెద శ్రీహరిని గొల్వ సత్సుతులారా
యని భూమికి వందన మిడి, చనియెం గోకాముఖాఖ్యసత్పదము గనఁ. 76

వ. అది మొదలు స్కందవసతివఱకుం జని యందు స్కందుని దర్శించి ధారాచక్రంబునకుఁ బ్రదక్షిణ మాచరించి యటనుండి కదలి పరమోచ్ఛశిలావిరా

జితంబగు వింధ్యధరణీధ్రంబునకుం బోయి పాపప్రమోచనతీర్థంబునకుం జనియె. చాండాలవంశజుండగు నాతం డందు స్నాన మాచరించి విముక్తపాపశేషుండై తనపూర్వజన్మజాతుల స్మరించె. అందొక్కజన్మంబున నతండు వేదవేదాంగ పారగుండు, మతిమంతుఁడు నగు భిక్షువై యుండె. ఒక్కదినంబునఁ దస్కరులు రాత్రియందు గోవుల దొంగతనంబునఁ దోలుకొనిపోవుతఱి భిక్షుం డాతండు వాని విడిపింప సమర్థుండయ్యు నూరకుండె. ఆయధర్మదోషంబునఁ జాండాల జాతి జనించె. పాపప్రమోచనతీర్థంబున స్నానముచేసి నర్మదాతీరంబున మృతుం డయ్యె. రెండవజన్మంబున మూర్ఖుఁడగు బ్రాహ్మణుండై కాశీనగరంబున జనించె. అందు ముప్పదివత్సరంబులు నివసించె. వికృతాకారంబునఁ దిరుగుచు యోగమాయాబలాన్వితుఁడై యున్నమహాత్ము నొక్కనిం గాంచి పరిహాసార్థ మాతనికి నమస్కరించి సిద్ధపూరుషా నీకుం గుశలంబెకదా. యెందుండి వచ్చితివి. నా విని యాతఁ డంతర్దృష్టి నంతయు నెఱింగి స్వర్గలోకంబునుండి వచ్చితినని యుత్తరంబు చెప్పె. అదివిని చండాలుఁ డాస్వర్గంబున నారాయణోరు ప్రభవ యగు నూర్వశి నెఱుంగుదువే యని ప్రశ్నించె నంత. 77

ఆ. సిద్ధుఁడిట్లు పలికెఁ జేడియమిన్నను, శక్రచామరమును సరగఁ దాల్చి
యుండుదానిఁ గంటి నూర్వశి స్వర్గాభ,రణము సాధుజన్మ రాజితాంగి. 78

క. అనవిని సన్మార్గంబును, మనమునఁ దలపోయ కిట్లు మఱియుం బ్రశ్నిం
చెను మిత్రవర్య నావా,ర్తను దానికిఁ జెప్పఁగలవె తద్వాక్యంబుల్. 79

ఆ. మరల నాకుఁదెల్ప మది నెంతు వే యన, నట్లె చేయువాఁడ ననియె నతఁడు;
దాన మోదమందెఁ దత్సిద్ధుఁ డంతట, మేరుగిరికిఁ బోయె సారనియతి. 80

సీ. మరలఁబోయెను సురపురి కందు నూర్వశి కనఁబడఁగా విప్రుఁ డనినయట్లె
తెలిపిన నూర్వశి పలికెఁ గాశీపురిఁ గలవిప్రు నెఱుఁగను బలికిన దిది
సత్యమం చెఱుఁగుముసాధుయోగీంద్ర నా విని యామహాత్ముఁడు స్వేచ్ఛఁదిరుగు
చుండి యొక్కెడఁ గాశి సురపుణ్యరాశిని గనఁగోరి యటఁ జేరి కమ్రమూర్తి

ఆ. విశ్వనాథుఁ గొల్చి వేడుకఁ బోవుచు, నాద్విజాధముని మహాపరాధుఁ
గనియె నొక్కనాఁడు కడుఁ బూన్కి నతఁడిట్లు, ప్రశ్నచేసె నేమి పలికె నాతి.

ఆ. ఏమిచెప్పు మనియె నాముని యూర్వశి, నిన్నెఱుంగ ననియె నేమొ కాని
యనఁగవిప్రుఁ డాగ్రహమున నోష్ఠములాడ, మరల నడుగవయ్య మామకోక్తి.

క. నిను నెటులెఱిఁగెను విప్రుఁడు, వనితా యని యద్ది యేమి వలుకునొ దానిం
గొనివచ్చి నాకుఁ జెప్పుము, యనవిని యట్లేయటంచు నతఁ డాకతఱినిన్. 83

క. సురపురి కరిగి మహేంద్రున,గరిసుండియె వచ్చుదానిఁ గాంతామణి నాఁ
బరఁగెడు నూర్వశిఁగని భూ,సురవాక్యముఁ దెల్పెనదియుఁ జోద్యంపడుచున్.

సీ. మహితాత్మ! యొకనియమము నీవు దెల్పుము దేన నాద్విజవర్య నేనెఱుంగఁ

జాలుదునో యట్లు సలుపకున్న నెఱుంగఁజాల నావిని యట్లు సలుపువాఁడఁ
గోమలీ!యని సిద్ధుఁ డీమహి కేతెంచి ద్విజునకుం దెల్పెఁడు ద్విజుఁడు సిద్ధుఁ
గని పల్కె నీయెదుటనె శపథము చేయువాఁడను శకటంబు వీడువాఁడ
తే. నిఁక భుజింపను దెల్పుచూ యిప్పలు కన,సిద్ధుఁ డొకపరి సురపురిఁ జేరి యూర్వ
శిని గనుంగొని తద్వాక్యమును వచించె, దాని వినిపల్కె నూర్వశి మానివర్య.
తే. ఇప్పు డెఱిఁగితి న వ్వాని నీనియమము
తెలుపుటకె మూర్ఖుఁ డాతండు ద్విజుఁడు నయ్యు
సతతపరిహాసకుఁడు సుమ్ము చాలు నింక
ననుచు నిజగేహమునకు నేగెను మునియును. 86
క. తనయిచ్ఛకొలఁది భూమిన్, గనుచుం జరియించుచుండెఁ గామిని స్వర్గం
బునుండి కాశికిం జని, తనమదిఁగల కోర్కెలెల్లఁ దత్సమయమునన్. 87
సీ. ఫలియింపఁ జేయంగఁ బటువగు మత్స్యోదరీతీర్థజలములఁ బ్రీతి మున్గి
యతిభవ్యరూపంబు నందియుండఁగ నప్పుమూర్ఖుఁడాతఁడు కాంతమునుఁగుచున్న
యాతీర్థమున కేగి యచ్చరమిన్నను గనుఁగొనియెను దానిఁ గాంచినంత
స్మరవీరుఁ డాతని స్వాంతముఁ గలవిలపాటు నొందఁగఁ జేసె బలముకొలఁది
ఆ. దాని కార్తినొంది తగినచేష్టలఁ జూప, నూర్వశియు నెఱింగి యోగిపల్కె
నట్టివాఁడు వీఁడె యని సస్మితాస్యయై, పలికె నిట్టు లతని భావమలర. 88
క. మతిమంతా! నావలనన్, హితఫల మెద్దానిఁ బొంద నెంచితొ చెపుమా
మతినెన్ని దాని నొనరుతు, నితరము వచియింప నమ్ము మీ యానుడినిన్. 89
చ. అనవిని మూర్ఖవిప్రుఁ డను నాత్మహితంబును గోరి నాయెడం
గినుక వహింప కెంతయును గీర్తిని గాంచుము ప్రాణరక్షణం
బున నన నాలకించి సురపుంగవు మన్ననగాంచు నాతి యి
ట్లనియెను నేమముం గనుచు నార్య! క్షణంబిట నిల్వు మాదృతిన్. 90
క. నా రాక నిరీక్షింపుము, నా రమణీవాక్యమున ననంగవశుం డౌ
ధారణిసురుఁ డాతఁడు త,న్నారీమణి రాకఁ గోరి నవయుచు నుండెన్. 91
క. సురనారియు స్వర్గమునకు, నరిగెన్ మఱి మాసమునకు నట కేతెంచెన్
బరికించెఁ గృశునిఁ నాభూ,సురు మూర్ఖుని దీర్ఘవర్య శుభతీరగతున్. 92
ఆ. భోజనంబు మాని పోగులువానిం గాంచి, వృద్ధవేష మూని వెలఁదిమిన్న
యానదీతటంబునందు శర్కరచేత, శకటమును రచించి స్వాదుఘృతము. 93
క. తేనెయు నందుం గూరిచి, యానెలఁత జలంబునందు నవగాహము స
మ్మానమునఁ జేసి విప్రుని,దా నెలమిం బిల్చి పల్కెఁ దరళాక్షి తగన్. 94
క. ధరణీసుర! తీవ్రంబగు, పరమంబగు నొక్కవ్రతముఁ బట్టితి సౌభా
గ్యరతియె దానికి హేతువు, నిరుపమవిధి దాని నేను నెఱవేర్చితిఁ జూ. 95

క. వ్రతము తుదిన్ నేనా నిష్కృతి నీకు నొసంగుదానఁ జెచ్చెఱ దానిన్
క్షితిసుర! పరిగ్రహింపుము, వితతంబగు తత్ఫలంబు వే విదితం బౌ. 96

సీ. అనుటయు నాబ్రాహ్మణాధముఁ డిట్లను శర్కరావృత మిద్ది క్షమ నొసంగఁ
దగునె యాఁకటిచిచ్చు దహియించు నాకుక్షినడిగెదఁ బల్కుమా యవ్విధంబు
నావిని దేవతానళినాక్షి శర్కరాపిష్టసంయుతమయి పెంపుఁగాంచు
శకట మీయవి దీని సంగ్రహింపుము మఱి ప్రాణాళి సంతృప్తిఁ బరఁగఁజేయు

ఆ. మొక్కకొంతకాల మోవిప్ర యనవిని, దాని సంస్మరించి దారుణ మగు
నాకలి తను నెంత యార్తినొందించుచు, నున్న నిట్లు పల్కె నుదతిమిన్న. 97

క. వినుమా! పరిగ్రహింపం, గనుజాలను నియమ మే నొకటఁ బూనితి సి
ద్ధుని చెంతఁ గాన శకటం, బును దిన నూర్వశిని దెలియు పోలికకొఱకై. 98

క. పలికితి నట్టులు గావున, నిల నెవ్వరికే నొసంగు మిద్దాని ననన్
నలినాక్షి విప్ర! నీచేఁ, బలుకంబడు శకట మద్ది భక్ష్యం బెటులౌ. 99

క. తరుమయముగ నిర్మితమై, ధరణిం దగుఁగాదె యిదియుఁ దలఁపు మటులు గా
దరయుము క్షుధ నిన్నేఁచెడుఁ, ద్వరగా భక్షింపవయ్య ధాత్రీదివిజా. 100

చ. అనవిని విప్రుఁ డిట్లనియె నయ్యమరాంగనతోడ నట్టిభే
దనియతిఁ బొల్చి నేఁ బలుకఁ దత్సమయంబునఁ గానఁ గైకొనన్
మనమునఁ గోర్కెపుట్ట దన మానిని యిట్లను భక్షణంబుచే
యను మది గొల్పదేని కొని యాలయసీమకుఁ బొమ్ము బ్రాహ్మణా. 101

తే నీకుటుంబము భక్షించు నిర్మలమగు, దీని నా విని నేను మందిరము చేరఁ
బోవ నొల్లను దివినుండి పొలఁతియోర్తు, త్రిజగదుత్తమరూప యేతెంచె నిటకు.

క. మదనార్తుఁడ నగునా కా, సుదతీమణి గానఁబడియె సోయగము మదిం
గుదియింప వేఁడితిని నన్ను దయం గడుఁ దేర్చె మఱియును నిల్వు మిటన్.

క. త్వరపడి వత్తు నటంచుం, బరమాదృతిఁ బల్కె నీవు వచ్చెడుదాఁకన్
స్థిరచిత్తుఁడనై యుండెన, దరుణీమణి యంటి మున్ను తన్వియు నరిగెన్. 104

క. చనియెన్ మాసం బొకఁ డా, వనితామణిఁ బొందువేడ్క వర్ధిలఁగా స
త్యని యతిమై వ్రతమూనితి, నన నూర్వశి స్వీయరూప మపుడు గ్రహించెన్.

తే. భావగంభీరవాక్కును బల్కె నిట్లు, సాధుసాధు మహీదేవ సత్యనిష్ఠ
వ్రతముఁ బూనితి హితమున వసుధ నన్నుఁ, గాంచుకోరిక నూర్వశీకాంత నేన.

క. నీమదిఁ గలభావంబును, నేమమ్ముఁ బరీక్షచేయు నెపమున నదియే
యీమాడ్కిఁ జెల్లె నిశ్చిత, మౌ మానస మనుచుఁ దెల్లమయ్యెన్ నాకున్.

క. ఋతతపుఁడవైన మునివై, క్షితి నొప్పితి వింక నీవు సిద్ధిం గనఁగో
రితివేని వేగ పొమ్మా, జతనంబున నేను బల్కుచందమునఁ దమిన్. 108

వ. సూకరవోద్దేశంబు గనంజను అద్ది రూపతీర్థాభిధానంబున నలరు అందు నీ తపంబు సిద్ధించు. నన్నుఁ బడయంగలవు. అని పలికి వియద్గమనంబున నూర్వశి స్వర్గంబునకుం బోయె. సత్యతపుం డగునాబ్రాహ్మణుండు రూపతీర్థంబునకుం బోయి యందు శాంతిపరుండై నియమవ్రతుండై పరిశుద్ధచిత్తుండై దేహంబు త్యజించి గంధర్వలోకంబున కరిగె. అందు మన్వంతరశతపరిమిత కాలంబు సుఖం బుండి మరల ధరణి సత్కులంబునం బుట్టి ప్రజారంజనతత్పరుండగు రాజయ్యె. ఆతండు సంపూర్ణదక్షిణ లొసంగి బహువిధయజ్ఞంబు లొనరించి పుత్త్రులం బడసి వారిపై రాజ్యభారం బునిచి శౌకరవదేశంబునకు మరలంబోయి రూపతీర్థంబున నియతుండై మృతిం బొంది శక్రలోకంబునకుం జని యం దనంతకాలంబు సకలసుఖంబు లనుభవించి పుణ్యశేషంబునఁ బ్రతిష్ఠానపురం బున బుధపుత్త్రుం డగుపురూరవసుండై పుట్టి యూర్వశింగూడి యుండె. ఇట్లు సత్యతపుండు రూపతీర్థంబు సేవించి భగవంతుఁ డగువిష్ణు నారాధించి కడపట ముక్తి నొందె ననుటయు మహర్షు లిట్లనిరి. 109

---

### నూటయిరువదొకఁడవయధ్యాయము.

భాస్కరాదిదేవతారాధనక్రమము.

చ. మునివర కృష్ణమూర్తి దగుభూరిమహత్త్వముఁ దెల్పునట్టి గీ
తనికరసుప్రభావము నితాంతఫలప్రదజాగరంబురీ
తిని విని మోద మందితిమి దివ్యతరస్తుతిచే జనంగముం
డనుపమముక్తి నొందెఁగద యాపురుషోత్తముభక్తి యేవిధిన్. 110

క. స్థిరముగఁ గుదురునొ దానికి, నురవగు కర్మం బదేవొ యున్నతతప మే
కరణి నొనర్పం దగునో, పరమాదృతిఁ బల్కవయ్య బ్రహ్మమునీంద్రా. 111

చ. అనవిని వ్యాసమౌని పరమాత్మునిచిత్రచరిత్ర మాదృతిన్
వినుఁ డిదె తెల్పువాఁడ విధివిస్తృతిఁ గాంచెదునట్లు విష్ణునం
దనితరసాధ్యభక్తి సుమహత్తరమౌ ఫలమిచ్చునద్ది యె
ట్లు నిలుచుఁ దత్ప్రకారము కడుం దెలియం దగుఁగాదె యేరికిన్. 112

చ. కులిశముఖాతిఁ దీవ్రమయి కుందఁగఁజేయుచు సర్వభూతముల్
గలవిలపాటు నొందునటు గా నొనరించుచు దుస్తరంబుగాఁ
జెలఁగుచు దుఃఖదంబునయి చెల్లుభవార్ణవముం దరించుకో
ర్కులు ధర నెల్లమానవులకున్ దగుఁగాదె తలంచి చూచినన్. 113

తే. పశువులును బతు లాదియౌపరమనీచజాతులం బలుమాఱును జన్మ మంది
యెట్టులో మర్త్యజాతిని బుట్టువుఁ గను, నందు విప్రత్వ మొందట యబ్బురంబు.

సీ. అందు వివేకిరై యలరుట చిత్రంబు ధర్మబుద్ధియు నందుఁ దారసిలుట
యత్యద్భుతం బగు నందు శ్రేయస్సమార్జవబుద్ధి గల్గుట సమధికంబు
పాపక్షయం బగుపర్యంత మివ్వియుఁ గలుగ వంచెఱుఁగనొఁ గమలనేత్రుఁ
డగు వాసుదేవునియందు జగన్మయునందు భక్తియుఁ గల్గ దఘము లెల్లఁ
తే. బొలిసినం గాని యట్టి శ్రీజలజనయను,నందు భక్తి యదెవ్విధి నమరు నట్టి
పద్ధతిం దెల్పువాఁడ నోపరమమౌను,లార వినుఁ డంచుఁ బలికె గంభీరభణితి.

క. పురుషున కెవనికి నితరా, మరులందుం గల్గుభక్తి మానసకర్మో
త్కరముల వాక్కును జక్కఁగఁ, బరిశుద్ధంబులుగఁ జేయుఁ బావనులారా. 116

క. దానన్ శ్రీకృష్ణునిపై, మానస మలరారు నట్టిమాన్యుఁడు పిదపన్
మానక హుతవహుఁ గొల్చును, దానన్ భాస్కరునియందుఁ దగు భక్తిరతుల్.

సీ. అవ్వల ననుదిన మాదిత్యుఁ బూజించు భాస్కరుం డెప్పుడు ప్రముదితాంత
రంగుం డగునొ శంకరప్రభుపాదాబ్జములపయిఁ గుదురును భూరిభక్తి
యప్పుడు సవిధిగా హరుని బూజించును యత్నంబుమీఱ నాహరుఁడు తృప్తుఁ
డైనచోఁ గేశవునందు భక్తి చెలంగు నవ్యయుండయి సకలాధిపుఁ డగు
తే. వాసుదేవుని బూజించు వరుస దాన, భుక్తిముక్తులు ప్రాప్తించు మునివరేణ్యు
లార యన విని పల్కిరి వారు వ్యాస,మౌనివరుఁ గని సంశయమానసముల.

క. పలికిరి మునివర్యా! భూ,తలమందున వైష్ణవులుగఁ దగుదురు గద మ
ర్త్యులు కొంద ఱేల వారలు, జలజాక్షుని భక్తిఁ బూజ సల్పరు చెపుమా. 119

చ. అనుటయు వ్యాసుఁ డిట్టులను నాదిని భూతములన్ సృజింపఁ బూ
నినపరమేష్ఠియున్ ద్వివిధనిర్మితిఁ గాంచఁగఁ జేసె; నాసురం
బనియును దైవతంబనియు నయ్యది పొల్చు ధరిత్రియందు దై
వనియతమౌ స్వభావమునఁ బర్వెడు భూతగణంబు చక్రినిన్. 120

క. పూజింతురు మఱి యాసుర,తేజంబున నొప్పునద్ది దితిజాంతకుఁడౌ
శ్రీజానిని దూషించెదు, నీజగతి నటంచు నెఱుఁగుఁ డింకన్ వినుఁడీ. 121

క. మనుజాధము లొకకొందఱు, వనజాక్షుని మాయచేత భవసాగరమం
దునఁ ద్రోయంబడి జ్ఞానము, చనఁగా హరి నెఱుఁగ సుంత చాల కలసులై.
ఆ. అధమగతికిఁ బోదు రచ్యుతుమాయ గ,హ్వరియౌ గాన నిర్జరాసురాళి
చేత నెఱుఁగఁబడక చిత్రమోహనకరి, యగును దుస్తరంబె యగు నరులకు.

క. విని మునివర్యులు వ్యాసునిఁ, గని యిట్లని పల్కి రార్య కంజాక్షునిమా
యను దుస్తరంబుఁ దెల్పుము, వినఁగాఁ గౌతూహలంబు వెలసెన్ మాకున్.

చ. మునివరు లిట్లు ప్రశ్నము విభూతికరంబును జేయ వ్యాసుఁ డి
ట్లని వచియించె స్వప్నగతమై తగుఁ గాదొకొ యింద్రజాల మో

మునిపతులార! యట్టిదియ పోల్పఁగ మాయ జగంబులం దనం
తన గురుశక్తి లాగుఁగద దానిఁ బరాత్పరుమాయ నెవ్వఁడే. 125

క. తెలియంజాలఁడు దానిని, దెలియఁగ నొకకేశవుండె ధీరుఁడు మఱి య
న్యులు లేరు తెలియఁ దగువా, రలు భూమిని నిజము మౌనిరత్నములారా. 126

క. మును నారదుఁ డనువిప్రున, కు నెద్ది బోధింపఁబడెనొ గుప్తము మాయం
గను తెలుఁగు దానిఁ జెప్పెద, వినుఁ డద్ది విడంబనముగ వెలయుం జోండీ. 127

## ఆగ్నీధ్రరాజవృత్తాంతము.

క. మును పాగ్నీధ్రుం డను మే, దినిపాలుఁడు విశ్రుతుండు దీప్తయశస్స్ఫూ
ర్తిని నొప్పెఁ గామదమనుం, డనుతనయుఁడు గల్గె శుచిత నలరె సతండున్.

సీ. క్షమ భూషణంబుగ జనకశుశ్రూషయె కృత్యంబుగా ధర్మనిత్యత యను
గుణమలంకృతిగాఁగఁ గొమరారు నాసుతుఁ డఖిలజనులను నెయ్యమునఁ బ్రోచు
శ్రుతిశాస్త్రములయందుఁగృతపరిశ్రముఁడయియవనియశస్స్ఫూర్తినతఁడుమించె;
దజ్జనకుఁడు ప్రీతిఁ దనయున కుద్వాహమును జేయఁ బూనఁగఁ దనయుఁ డొప్పఁ

తే. డయ్యె దారను గ్రహియింప కియ్యెడ నిటు
వలదనుట కేమి హేతువో పలుకు మెల్ల
వారు సుఖసంపదం గోరి దారసంగ్ర
హము నొనర్తురు సుఖమూల యగుఁ గద సతి 129

క. కనుకనె నీవును దానిం, గొనఁ దగు నని తండ్రి యడుఁగఁ గొడు కతనిపయిం
గనుపట్టు గౌరవంబునఁ, దనభావముఁ దెల్పకుండె ధైర్యవిభూతిన్. 130

క. క్షమ సుంతగాంచి తనయుని, మమతం గని పల్కెఁ దండ్రి మరలన్ దానం
గొమరుఁడు ప్రోత్సాహితుఁడై, సుమహితచిత్తా మదుక్తి సొరిదిన్ వినుమా,

తే. నాదునామానురూపత నమరు మాయ, వైష్ణవిని బరిపాలిని భాసమాన
నాశ్రయించితి నా విని యాత్మజన్ముఁ, జేరఁగా బిల్చి యిట్లని చెప్పెఁ బ్రీతి. 132

క. ఇది ధర్మము గా దివ్విధిఁ, బొదలినఁ బురుషార్థసిద్ధి పొందునె నిన్నున్
మది నిల్పఁగూడ దీవిధి,ని దనయ పండితుఁడు దీనినిన్ మెచ్చఁడుసూ. 133

క. నావాక్యము సార్థకముగ, గావింపుము తండ్రి నీకుఁ గానఁ బ్రభుఁడనై
యీవిధి శాసించితి మన, పావనవంశంబు నిట్టి పట్టుదలలచేన్. 134

క. తనయాభావంబున ఘో,రనరకపాథోధి ముంపరాదుకదా య
ట్టి నియతిఁ బూనకుమా యన, జనకాజ్ఞల నాలకించి సంతతవశుఁడై. 135

క. అలరారు తనయుఁ డీగతిఁ, బలికెన్ సంసారవిషయవార్తన్ మిగులం
దెలిపెడు పురాణగాథను, దలపోయుచు భక్తిభావతన్ బ్రౌఢోక్తిన్. 136

సీ. జనక! నా వాక్యము సకలవిధంబుల హేతుయుక్తంబయి యొసఁగియుండుఁ
గావున నాలింపఁగాఁ దగునీచేత; నామానురూపమై యీమహిఁ దగు

సత్యమ్ము సల్పంగఁ జను మహారాజ! జరామరణంబుల నీమ మెడల
నట్టి జన్మములు సహస్రముల్ పొందితి నింతకు మున్ను నే నెన్నిమాఱు
తే. లో కళత్రము లొందితిఁ బ్రాకటసుఖ
ములను బొందితి వారలు విలయ మొంద
వగలఁ బొగిలితి మఱియొక్కవాక్కు వినుము
తృణము గుల్మము లత వల్లి దివ్యతరువు 137

క. కాకోదరమృగతతులు న,గౌకములు పశుప్రకాండ మువిద పురుషుఁడన్
లోకప్రసిద్ధజీవ, స్తోకము గా నవతరించి క్షోణిన్ మనితిన్. 138

క. శతపర్యాయము లీగతి, క్షితిఁ బుట్టితి మఱి సుకృతవిశేషంబున దే
వతతిం జేర్వడసిన సం,తతులన్ జన్మించియుంటిఁ దత్త్వమ్మిది యా. 139

వ. కిన్నరకింపురుష విద్యాధర మహోరగ యక్షగుహ్యక రక్షోదాన వాప్సరఃకులంబులం బుట్టితి. ప్రవహించుచుండు నదీరూపంబులం దాల్చితి. పెక్కుజన్మంబులెత్తితి. పెక్కుమాఱులు మృతిం గాంచితి. దారసంయోగశీలుండ నగునా జన్మవిడంబన యిట్లు చెల్లె. దీనికి ముందటిదగు మూఁడవజన్మంబున సాగినచరిత్రంబాలకింపుము. అది తీర్థమాహాత్మ్యసంభవంబు. మనుష్యనిర్జర గంధర్వ మహోరగ విద్యాధరకిన్నరాది జాతులం బుట్టి యొక మహర్షి వంశంబునం బుట్టితి. సుతపుఁడనునామంబు నా కత్తఱిఁ జెల్లె. 140

చ. మురహరుఁడై మధుఘ్నుఁ డనఁబొల్చు జనార్దనునందు నాకు సు
స్థిరతరభక్తి చేకుఱె నతిప్రియచిత్తముతోడ సద్వ్రతో
త్కర ముపవాసముల్ సలిపి కాంచనచేలునిఁ జక్రి నందకా
భరణుని బద్ధహస్తు విధిభంగులఁ బ్రీతుని జేసితిం గడున్. 141

చ. గరుడుని నెక్కి చక్రి ననుఁ గమ్రదయన్ బరితుష్టుఁ జేయునా
దరమున వచ్చె భక్తవరదానసమర్థుఁ డనంగనొప్పు నా
పరమపురాణపూరుషుఁడు భవ్యతరస్ఫుటనాద మొప్పఁగా
వరములఁ గోరుమా యనుచు! వాని నొసంగెద నంచుఁ బల్కినన్. 142

చ. మనము ముదంబు రాశిఁ గదు మజ్జనకృత్యము సల్ప శ్రీహరిం
గని పురుషోత్తమా నను నికామదయన్ వరదానయుక్తి నో
య్యనఁ బరితుష్టుఁజేయ మది నాదృతిఁ బూనితివేని వాంఛ చొ
ప్పున వరమేను వేఁడెదను భూతపతీ! పరమేశ్వరా! హరీ. 143

క. ఎది యనుపమానగతి నొ,ప్పి దగన్ దుస్తరము నాఁగఁ బృథ్వి వెలయు నీ
యది మాయ దాని నెఱుఁగన్, మదిఁగోరెద వాసుదేవ మాధవ యంటిన్.

చ. అనవిని శౌరి యిట్లనియె నార్య! యదేటికొ మాయ యెట్టిదో
కనుఁగొనఁ గోరినాఁడవొ జగంబున నెవ్వరు కోరలేదు దీ

నిని వరధర్మకామముల నీకు నొసంగెదఁ బుత్త్రపౌత్త్రులన్
దనువున రోగమంటనివిధంబు నొసంగెద నంచుఁ బల్కినన్. 145

సీ. మరల నమ్మాధవు మహితాత్ముఁ దమిఁగాంచి ప్రార్థించితిని దేవ యవని ధర్మ
కామార్థముల గెల్వఁ గలదద్దియే యగు నట్టి నీదగుమాయ నరయ వేఁడి
తిని గాన దాని విధిం దెల్పి కరుణింపు మనుటయు నాప్రభు వవ్యయుండు
మద్వాక్య మాలించి మాయను నస్మదీయను లోకమున నెవ్వఁడైన నెఱుఁగ

తే. జాలఁ డద్దాని నెఱిఁగిన జనుఁడు లేఁడు
పూర్వ మొకసారి నారదముని యనంగ
బ్రహ్మతనయుండు నాయందు భక్తిరతిని
మించువాఁ డెంతొ వేఁడుక మిగుల నన్ను. 146

క. నీవలెనే భక్తిరతిన్, భావించి కృపాంతరంగు వాంఛాప్రదునిం
గా వఱలఁ జేసె నెంతయు, నావిధమున భక్తిసలుప నాతనికడకున్. 147

క. వర మీయఁ బోయినాఁడను, వర మిట్టులె యాతఁ డడిగె వల దీవర మో
నిరుపమభక్తిధనాఢ్యా, పరమర్షి యంటిఁ గాని పట్టుదలమెయిన్. 148

తే. ఇద్దియే నాదుకోరిక హితము దీని, నాకు నెఱిఁగింపు మనికోరె నారదుండు
నంత నోమౌనివర! నీటియందు మున్గి, యుండినట్లైన నెఱుఁగుదు వాక్కరీతి.

క. అనినంత నతఁడు జలముల, మునిఁగెను దత్కాలమందె ముదితగ మారెన్
వనజాక్షి కాశిపతికిం, దనయయు నయ్యెను సుశీలతం దగి యుండెన్. 150

చ. నిరుపమయౌవనాఢ్యయయి నిర్మలశీలమునం జెలంగు నా
తరుణిని జారుధర్మరతి ధారణి మించి విదర్భదేశభూ
వరసుతుఁడౌ సుధర్మునకు వాంఛలు పొంగ నొసంగె భార్యగా
నరపతిపుత్త్రుఁ గూడి యలనారియు సౌఖ్యమహాబ్ధిఁ దేలుచున్. 151

చ. జరపుచునుండెఁ గాలమును స్వర్గపురంబు నలంకరించు కో
ర్కి రహితపాపుఁడై తగుధరిత్రివిభుండు చనంగఁ బుత్త్రుఁ డా
దరమున రాజ్యమేలెఁ దనతండ్రి పితామహులాదియైన భూ
వరు లాగి నేలినట్టి నయభవ్యపథంబున మర్త్య లుబ్బఁగన్. 152

చ. తనయులు తత్కుమారులు నితాంతము వృద్ధిగనంగ సాధ్వియా
వనరుహనేత్ర తోడయి యభంగురవృత్తిని దెల్పుచుండఁగా
వినయము తోడునీడవలె వింతగ నొప్పఁగఁ జాలకాల ము
ర్వ్విని బరభీతిఁ గాననిప్రవృద్ధిని బొల్పెసలారు నట్లుగన్. 153

క. పరిపాలించెం దదనం,తరమున దుర్దైవవశత దారుణమౌ సం
గర మయ్యె మామతోడనె, సురలకునేఁ జేయఁదగని చొప్పున నందున్. 154

క. తనయులతోఁ బౌత్త్రులతో, జనపతి కాతనికిఁగల్గె సంగరమృతి యా
తనిబలములు మృతి నొందెను, మనుజేశుఁడు కాశిపతియు మ్రందె సబలుఁడై.

తే. అతనితనయులు పౌత్త్రులు నందుఁ బడిరి
వార్త యయ్యది చెవిసోఁక వారిజాక్షి
యాసుధర్మునిపత్ని పుత్త్రాన్వితముగఁ
బతియు జనకుండు రణమునఁ బడుట కడలి. 156

చ. పురమును వీడి యాసమరభూమికిఁ బోయి మహాత్తరంబుగా
జరగిన సంగరంబుఁ గని సంతతితోడ బలంబుతోడ ని
ర్జరపురి కేగియున్నపతి రాణువఁ దండ్రిని దత్సుతావళిం
దురగముఖంబులం గనుచుఁ దోడనె భూమిని వ్రాలె నార్తయై 157

క. స్మృతి యించుక రాఁగా దు,ర్మతులై యిట్లాహవమున మ్రందిరి గాదే
పతియుం బితయుం దత్సం,తతియుఁ బలయుక్తి ననుచు దైన్యముతోఁపన్.

క. విలపించి తత్కళేబర,ములఁ గైకొని రాఁగఁబంచి మునుకొనుచింతం
గలఁగుచు జననీసన్నిధి, కలఘుగతిం బోయి యామె యార్తిం గనుచున్. 159

సీ. కాశీపురంబునఁ గల్గుమహాశ్మశానంబున భ్రాతృగణంబు తత్త
నయుల స్వాత్మజులను నాథుని దండ్రిని జితులపైకిం జేర్చి శిఖిని దానె
తగిలించి హుతవహుఁ డగణితజ్వాలల మిన్నందునత్తఱి మెలఁత యట్టె
హాకుమారక మనోహరరూప హానాథ హాతండ్రి యనుచు నత్యంతదుఃఖ

ఆ. వివశచిత్తయగుచు జవమున హుతవహుఁ, జొచ్చె నంత నచట నచ్చెరువుగ
నారదుండె యయ్యె నారీమణియె వహ్ని, స్ఫటికనిర్మలప్రభల వెలింగె. 160

క. ధరయది పూర్ణజలంబుల, సరోవరం బయ్యె దానిసన్నిధియందే
హరియుఁ జతుర్బాహుండై, దరగదలు సుదర్శనంబు దాల్చి కరములన్. 161

చ. పకపక నవ్వి నారదుని బల్కె మహర్షివరా! త్వదాత్మజుం
డకలుషచిత్తుఁ డెచ్చట? మహార్తి మునింగెదవేల? వానికై
సకలమెఱుంగుబుద్ధి యది చయ్యనఁ బాఱెనొ యంచుఁ బల్కసి
గ్గు కడఁగి తన్ను ముంపఁ గడుఁ గుందుచునుండె నదేమి పల్కకే. 162

చ. మరల రమాధవుం డనియె మామకమాయ యనంగ నెట్టిదో
సురమునిచంద్ర! యిప్పటికిఁ జొప్పడెనే యిటువంటి దంచు నా
సరసిజగర్భముఖ్యులకు శక్యముగా దెఱుఁగంగ రుద్రని
ర్జరపతులే యెఱుంగమని సత్యము పల్కుదు రట్టిమాయనున్. 163

క. నీ వేమెఱుఁగం జాలుదు, వీవిధిఁ గుమతిం జెలంగి తీయెడ ననఁగా
నా వాక్కులు విని గర్వము, పోవఁగ దేవాదిదేవ! భూతగణేశా. 164

చ. తెలియఁగఁ జాల నీదయిన దివ్యమహత్త్వము బాలిశుండ నో
జలరుహనాభ! నీదుపదసారసభక్తియు నంతకాల మి
మ్ములఁ జనుదేర నీస్మరణమున్ గడుఁ జేసెడునట్టి తెల్వియున్
గలుషము లేమిచేయనటు గ్రాలెడు చిత్తము నా కొసంగుమా. 165

క. ఎచ్చోట నార్తి గూర్చెదు, నచ్చితి నాకేర్పడియెనొ యాస్థలమున నో
సచ్చరితా! తీర్థం బొకఁ, డుచ్చతరఖ్యాతి జగతి నొందఁగ వలయున్. 166

ఆ. సకలపాపములను క్షయత నొందఁగఁ జేయ, వలయు నద్ది యిట్టి వరము నాకుఁ
గరుణనిమ్ము, మఱియుఁ గాంచనగర్భుని, గూడి నీవు నందుఁ గూర్మి తనర. 167

క. నిలువంగ వలయు నని ముని, పలికిన హరి యీవిధమున భాషించెను; న
ట్లలరు సితోదకతీర్థం, బిల నీచితి యున్నచోటనే మునివర్యా. 168

చ. అనవరతంబు నే నిచట నాదృతి నిల్చెద శంకరుం డుదీ
చిని నిలుచున్ విరించి దగు శీర్షము రుద్రుఁ డదెప్డు త్రుంచుఁ బా
పనికర మద్ది యుగ్రతరభంగిని నేఁచఁ గపాలమోచనం
బునకుఁ ద్వితీయతీర్థవరముం గనవచ్చును బో మునీశ్వరా. 169

చ. జలముల నిందు భక్తిమెయి స్నానము చేయఁగలందు దాన భూ
స్థలిఁ బడునాపురాంతకుని శంకరహస్తమునుండి భీతినిం
గలుగఁగఁ జేయుచున్న శ్రుతికాంతుకపాలము, నాటినుండి యు
జ్జ్వలయశ మొందు నీయది కపాలవిమోచనతీర్థ మంచోగిన్. 170

వ. అది మొదలీతీర్థవర్యము నంబుదవాహనుండు విడువకయుండు. బ్రహ్మవధ మిందు జరగె నన్నయపఖ్యాతి దీనిం బాయు. విశేషించి సకలతీర్థస్నానపుణ్యదంబగు నీతీర్థంబును విడువక రాక్షసాంతకుఁ డుండుట నిది యవిముక్తమనం బ్రఖ్యాతింగను. అవ్యయంబనియు వినుతింతురు సకలపాపముల నొనరించిననీచుఁ డిందుఁ బ్రవేశింపఁ బాపనిర్ముక్తుఁ డగు. అప్పుడు నన్ను స్మరించిన శుద్ధమానసుం డగు. భగవదనుగ్రహపాత్రునకు ముక్తి దొరకుట శ్రమంబు కాదుకదా. ఎవండు రుద్రపిశాచసంజ్ఞం గాంచి యోన్యంతరంబునఁ బుట్టునో యతం డిందు స్నాన మొనరించిన విముక్తపాపుండై విప్రగేహంబునఁ బుట్టువుం గాంచు. ఆతండు మృతినొందుకాలంబున రుద్రుండు తారకమంత్రం బుపదేశించును కావున నీక్షేత్రంబున మృతిగల్గుట సుకృతవిశేషంబున ననవలయు. అనిపలికి శ్రీహరి పయోరాశికిం జనియె. ఆవిప్రుండు సురలోకంబున కరిగి గంధర్వరాజపూజితుండై యుండె. ఇది నీకుం దెలిపితిని. రహస్యంబు దెలిపెద. మదీయమాయ తెలియ శక్యము కాకయుండు. దాని నెఱుంగఁ గోరితివేని జలంబుల మునుంగుము. అని హరి తెలుప నాతండు భావ్యర్థయోగంబున నందు మునింగె. అంత నా ద్విజుండు కోకాముఖంబునఁ జండాలగేహంబున జన్మించె. ఆజన్మంబునఁ గన్యా

రూపం బలవడిగెను ఆకన్య రూపవతియు శీలగుణోపపన్నయు నై నిండుజవ్వనంబు నొందె. ఆమెను జాండాలపుత్త్రుఁడగు సుబాహువు పెండ్లియాడె. ఆతండు కురూపుఁడగుట నామె కభిమతపతి కాకయుండె. ఆతని కాయువతి యభిమత భార్యగఁ దోఁచె ఆదంపతుల కిర్వురుకొడుకులు నేత్రవిహీనులు గల్గిరి. పిదప బధిరయగు నొకపుత్త్రికయు జనించె. ఆయువతి తనభర్త దరిద్రుఁడు కురూపుఁడు నగుటయుఁ దా ముగ్ధయగుటం దలంచుకొనుచుఁ బ్రతిదినంబు శోకించుచుండి దైవవశంబున నొక్కనాఁడు కలశహస్తయై జలాహరణార్థ మాసరస్సున కరిగి యంతర్జలంబులం బ్రవేశించె నంత. 171

చ. మరల ధరామరాకృతిగ నూతె సుశీలత యొప్పె సత్క్రియో
త్కరరతి యబ్బె నచ్చెరువుగల్గె నిదేమని; యంతలోనఁ ద
త్తరుణిని గాన కామెపతి దగ్గఱనున్న జలాశయంబునం
జిరసమయంబు పుచ్చుటకుఁ జింతిలి చూడఁగఁ బోయె నార్తుఁడై. 172

చ. ధునితటమందుఁ గుండయును దోఁచెను దానిసమీపమందు న
వ్వనితయుఁ దోఁపదయ్యె వగఁ బైకొన నాతఁడు కంఠమెత్తి యే
డ్చెను గళనాద మక్కటివిని చెచ్చెఱ నంధకుమారయుగ్మ మొ
య్యనఁ జనుదెంచెఁ గూఁతురును నార్తి మునుంగుచు వచ్చె నంతటన్. 173

చ. పిత విలపించుచుంటఁ గని పెల్లుగ నేడ్చిరి వార లంత నా
యతివను గూర్చి తత్పతియు నచ్చటివిప్రులఁ గాంచి యోమహా
మతిధనులార యొక్కసతి మద్గృహసీమకు నీళ్లు దేర నీ
క్షితి కరుదెంచెఁ దా మరలఁ జేరదు గేహ మదేమి హేతువో. 174

చ. అనవిని వార లిట్టులని రాసుదతీమణి యీనదిం జొరం
గనితిమి కాని యీతటముఁ గ్రమ్మఱఁ జేరినజాడఁ జూడలే
దని తమ రెంత చూచిరో యదంతయుఁ దెల్పిన నీటఁజచ్చెఁ గా
మిని యని యశ్రుపూరముల ముంచినఁజూడ్కుల నేడ్చె దీనుఁడై. 175

చ. తనయులఁ బుత్త్రికం గలిసి దారుణదుఃఖము నొందునాతనిం
గనుఁగొని భూమిదేవుఁడుగఁ గ్రమ్మఱమాఱిన యామె యార్తయై
తనదగు పుల్కసత్వమును దాఁ దలపోసి శ్వపాకుఁ గాంచి యి
ట్లనియె నిదేల యేడ్చెదవొ యంగన యెవ్వతె? నీ వెవండవో. 176

క. వగచిన లాభం బింతుక,యుఁ గల్గునె మాక్ష్యమేల యుడుగు మనఁగ ని
ట్లుగఁ బల్కె నంధు లీసుతు, లగుదురు వినఁజాల దీమదాత్మజ సుమ్మీ. 177

క. ధరణీసుర! వీరల నె,వ్వరుసను రక్షింపఁజాలువాఁడను వగ పె
క్కరణిని శాయంజేయుదుఁ, దరమే భరియింప వీరిఁ దథ్యము చెప్పుమా. 178

చ. అని వచియించి పూత్కృతుల నట్టె యొసర్చుచుఁ బుత్రసంయుతిక్
వనటఁ గృశించి యేడ్చె నిటువంటి మహార్తుని గాంచి యాద్విజుం
డనుపమమౌ కృపం గనుచు నార్తిని బాపి స్వవంశవృత్త మె
య్యన నెఱిఁగించె నాశ్వపచుఁ డావిధమెల్ల నెఱింగి హృష్టుఁడై. 179

క. తనదగు కోకాముఖమును, గనఁబోయి మునింగె నందుఁ గ్రమ్మ జలములం
దును మున్గినంతమాత్రం,బున దానిమహామహత్త్వమున నసఘుం డై. 180

సీ. వ్యోమయానం బెక్కి యుర్విసురేజ్యుండు కనుచుండ స్వర్గంబుఁ గానఁబోయె;
నాజలంబుల మున్గి యతివ మృతింగనె నంచు మోహంబున నాతఁ డెంచెఁ
గాని యందుం జొరఁగా విమానం బెక్కి సురపురి సుఖియింప నరిగెఁ గాదె;
మునివర్య! యీవిధంబునఁ బుట్టువులఁ గని ధరణీసురత్వంబుఁ దాల్చియున్న

ఆ. నేను మరల నార్తి నూనినమది వైశ్య,జాతియందుఁ బుట్టి సాధుతీర్థ
వరమహత్త్వముననె వంశస్మృతిం గల్గి, కోకయనెడు నదికిఁ గూర్మి మెఱయ. 181

క. చనినాఁడ నియతవాక్కును, మనసునుగలవాఁడ నగుచు మహితవ్రతముం
గని నాకళేబరంబును, వనటం గుందించి శుష్కభావము గనఁగన్. 182

క. ఒనరించి దివముఁ బొందితిఁ, గనినాఁడ సుఖంబు లందుఁ గ్రమ్మఱ నీయిం
టను బుట్టితి హరికృపచే,తను జాతిస్మృతియుఁ గల్గెఁ దథ్యం బనఘా. 183

సీ. అట్టినే నతిభక్తి హరిని నారాధించి కోకాముఖంబునఁ గూరుచుండి
త్యక్తశుభాశుభోద్దాముఫలుండనై యున్నాఁడ ననియిట్టు లొప్పఁ బలికి
తండ్రికిఁ బ్రణమిల్లి తత్క్షణంబున నామహానదికిం బోయి హరిని విష్ణు
వారాహమూర్తిని భక్తి నారాధించి సిద్ధినొందెను మఱి శ్రీప్రదమయి

ఆ. తీర్థవర్యము నగు దివ్యకోకానదీ,ముఖమునందుఁ బుత్రముఖ్యయుతిని
దనువు వదలి దోషతతులెల్ల విడిపోవ, స్వర్గపురము నొందఁజాలెఁ బ్రీతి. 184

వ. అని యిట్లు పరమేశ్వరుమాయ సురలకుంగూడ దుర్విచింత్యయనియు, స్వప్నేం
ద్రజాలప్రతిమయనియు నెఱింగించి యమ్మాయచే జగంబులు విమోహితంబు
లగునని వ్యాసుండు మునులకుం దెల్పిన విని మౌను లిట్లనిరి. 185

నూటయిరువదిరెండవ యధ్యాయము.

మహాప్రళయవర్ణనము.

చ. మునిగణనాథ త్వద్వచనమూలమునన్ జలజాక్షుమాయ దే
వనికరమే నెఱుంగనటు భాసిలునంచును దన్మహత్త్వముల్
మననము చేయఁగాఁ దగును మౌనుల కంచు నెఱింగినార మిం
కను వినఁ గోర్కిపుట్టెడిని మాయ యడంగుట యెట్టులో కదే. 186

తే. అని యడంగ మహాప్రళయం బటన్న
వేరుగాంచును గాల మంచేరొ పలుక
వింటి మావిధ మెల్లను వినఁగ నెంతు
మంతయుం దెల్పు కల్పాంత మనఁగ నెదియొ. 187

మ. అని ప్రశ్నింపఁగ వ్యాసమౌనివరుఁ డౌరా! ప్రశ్న మత్యుత్తమం
బనఁ జెల్లుం గద యుత్తరంబు వినుఁడీ యమ్మాయ యెట్లంతముం
గనునట్లుండునొ ప్రాకృతంబయిన యీకల్పాంతమందే లయం
బన నేలాగు ఘటించు నవ్విధము యోగారూఢశక్త్యున్నతిన్. 188

క. కనుఁగొందుఁ గానఁ దెలిపెద, వినుఁడీ మునులార! నాల్గువిధములఁ దగు కా
లనియతి యుగసంజ్ఞం దగు, వనజజునకు నవ్వి వేయిభంగులఁ జనినన్. 189

తే. ఒక్కపగ లగుఁ గృత మన నొప్పు యుగము
మొదటిదౌఁ ద్రేతయన రెండవదగు ద్వాప
రంబు మూఁడవదగుఁ జతుర్థంబు కలి య
నంగఁదగు నివ్వి కీర్తి యొసంగ వెలయు. 190

వ. దైవవర్షద్వాదశసహస్రంబులు యుగప్రమాణంబు లగు. స్వరూపంబువలన నన్నియు సమానంబులు. అందుఁ గృతయుగ కలియుగంబు లాద్యంతంబులని పరిగణింపఁబడు. మొదటిదగు కృతయుగంబున సృష్టి బ్రహ్మచేఁ జేయంబడు. కలియుగంబున నుపసంహారంబును జేయంబడు నన విని మును లిట్లనిరి. 191

## కలిస్వరూప వివరణము.

ఆ. కలియుగస్వరూప మెలమి వచింపుమా
విస్తరించి వేదవిహితరీతి
నాల్గుపాదములను వెల్గుధర్మము దేని
యందుఁ గొఱఁత గాంచి యార్తిఁ గనునొ. 192

సీ. మును లిట్లు ప్రశ్నింప విని వ్యాసుఁ డిట్లనుఁ బ్రశ్నమియ్యది చాల రమ్యమగును
విస్తరించెద దానివిధము దెల్పెదఁ; గలికాలంబునందు నెక్కరణిఁ గనిన
వర్ణాశ్రమాచారవరధర్మములు గల్గ వాదుష్టకలికాలమందు మఱియు
వేదచతుష్టయవిహితధర్మంబులే వర్ణాశ్రమాచారభవ్యవిధులు
ఆ. గాన నవ్వి చెల్లఁగాఁజాల వింకను, ధర్మములు వివాహకర్మములును
సాగ వందు శిష్యసమితియు గురుభక్తి, నందకుండి యతని నిందచేయు. 193

చ. తనయులు భక్తిఁ బ్రీతిఁ దలిదండ్రులఁ గొల్వరు ధార్మికుల్ కనుం
గొనఁ గనరారు, హవ్యవహుఁ గూర్చినసత్క్రియ లొప్పకుండు, జా
తిని మరియాదఁ గాంచనిగతిం జెలరేఁగి దురాత్మసంగతిం
గను బలవంతుఁ డుర్వర నికామవిభుత్వముఁ గాంచుచుండెడిన్. 194

శా. ఏవర్ణంబులనుండియేని ధనము న్దిష్టంబు పైకొంట క
న్యావారంబును సంగ్రహించి సుగుణానల్పుండుగాకుండ దు
ష్ప్రావీణ్యంబును గన్న పూరుషునకున్ ద్రవ్యార్థమై యమ్మియే
జీవింపం దలపోయుచుండునరులే చేల్వారుచుం ద్రాకలిన్. 195

ఆ. పాత్రమనక యెవఁడు ధర్మం బొసంగిన, దానికై మఖంబు దాను జేయు
భూసురుండు; పాపపూగంబును హరింపఁ, బొచితంబు చేయు వలసినట్లు. 196

చ. ఎవనికి నేదితోఁచిన నదే యగు శాస్త్రము పండితోక్తి య
న్నవిధము గానరాదు సురనాయకతుల్యులె యెల్లవారలం
చెవరి నదెవ్వఁడే కొనఁ డదెంతటి కార్యమునందునైన దు
ష్టవిషయ మంచు నెన్నకయె సర్వవిధంబుల విత్తకాంక్షచేన్. 197

ఆ. ఎవరినైన నాశ్రయింతురు మఱి యుప,వాసమేల దాన వచ్చునట్టి
ఫల మదేమి? శ్రమమె ఫలమని పలుకుదు, రలసు లగుచు మనుజులక్కలిఁ దగ.

క. ధనముల్ వీడుట కించుక, మన సొప్పకయుండ్రు వసుధ మనుజు లెవరు దే
నిని జేయఁ బూనుదురొ దా,నిని ధర్మమటంచు నెంత్రు నియతి నశించున్. 199

క. ధన మించుకయేఁ గల్గిన, మనుజుఁడు గర్వాంధుఁ డగును మానినులకుఁ గే
శనికరమే రూపమదం,బును గల్గం జేయుఁ గలి విభూతిం గనుఁడీ. 200

చ. ధనములు రత్నవస్త్రసముదాయములున్ నశియింపఁగాఁ గలిన్
వనితలు కేశభూషితలు వర్థిలుచుందురు భర్త నిర్ధనుం
గని త్యజియించి విత్తఘనుఁ గ్రన్ననఁ గూడుదు రంగనల్ తమం
తన ధనవంతుఁ డెందఱికొ తా ధవుఁడై చెలువారుచుండెడున్. 201

క. ధన మెవ్వఁ డధికముగ ని,చ్చునొ వాఁడె కులీనుఁ డంచు సోయగమున నొ
ప్పిన వాఁడంచును భర్తగ, వనితలు కామింత్రు కులము వాసి యడఁగెడున్.

మ. ధన మొప్పంగఁ బ్రభుత్వ మబ్బు నదియే తథ్యంబుగా సత్కులం
బును గూర్పంగను జాలియుండు ధనముల్ పోవున్ గృహాంతంబులై
ధనమే పోయిన సన్మతుల్ చెడును విత్తం బెల్ల భోగాంతమై
కన రాకుండుఁ బరోపకారమున కొక్కండైనఁ బూనం డిలన్. 203

చ. తరుణులు స్వేచ్ఛ వర్తిలుచుఁ దమ్మెవరైన నదల్తు రన్నయా
తురమును మాని స్వైరిణులతోఁ జెలిమింగొని యట్లె తారును
దిరుగుచు న్యాయహీనపుగతిన్ గణియించిన విత్త మొప్పునా
పురుషులఁ గోరి యన్వహము పొల్తురు గర్వయుతిన్ వసుంధరన్. 204

తే. సుహృదుఁ డర్థించినన్ మనుష్యుఁడు ధనంబు
సుంతయే నీయకుండును శుభదపథము

మాని యెల్లప్డు పౌరుష మూని యుండుఁ
చిత్త మెల్లరకును గలిచిత్ర మిదియె. 205

క. పాలిచ్చినంత దనుకనె, యాలపయిన్ గౌరవంబు హర్షంబును ద
త్కాలంబున నుండును దగు, కాలంబున వృష్టియుంట కల్లదు క్షితిపై. 206

క. జనులు నిరంతర మాఁకలి,కిని భీతిలి యుంద్రు దృష్టిఁ గీలించి నభం
బున వృష్టి గురియు నెప్పుడొ, యని చింతిలుచుంద్రు పల్కు లవియేల యిఁకన్.

సీ. పర్ణముల్ మూలముల్ ఫలము లాహారమౌ మానవులకు సస్యహాని యగుట
నియతి యొక్కఁడు తప్ప నిర్మలతప మొందుఁ దక్కఁ దాపసులకు నిక్క మరయ
మానవులకు భేద మూన దించుకయును; వర్షంబులేమి నెవ్వగలఁ బొగిలి
తమ్ముఁ జంపుకొనంగఁ దలఁతురు దుర్భిక్ష మనవరతము సాగు నవనియందు

తే. కష్టములె యెల్ల కాలంబు గలుగుచుండుఁ
బరవశులునయి మర్త్యులు తిరుగుచుంద్రు
సుఖము కలలోనివార్తగ క్షోణి నొప్పు
నెల్లయెడలఁ బ్రమాదంబె యొసఁగుచుండు. 208

చ. మనుజులు స్నానకృత్యమును మాని భుజింతురు దేవతాగ్నిపూ
జనములు నాతిథేయములు సాగవు శ్రాద్ధము లేలయంచు న
మ్మనుజులు పల్కుచుంద్రు తనుమానము హ్రస్వ మగున్ నిరంతరం
బును ధనకాంక్షయే కలుగుఁ బుత్త్రులు పెక్కురు భాగ్యమల్పమౌ. 209

చ. దొరకినయన్నముం దినుచుఁ దోఁచినరీతి మెలంగుచుందు రా
నరులు కులప్రసంగములు నాశమగున్ వనితల్ తమంతనే
తిరుగుచునుంద్రు స్వేచ్ఛమెయి స్త్రీప్రజఁ గాంచుచు నుత్తమాంగమున్
గరములరెంటఁ గోఁకికొనఁగాఁ దగువాడుక వారి కొప్పెడున్. 210

చ. పతియును దేశికుండు నొకపద్ధతిఁ దెల్పిన దానిమీఱియే
యతివ లనావృతాంగముల నమ్మరుకేళిని దేలుచుంద్రు సం
తతము స్వపోషణాదృతిని దాల్చి దురాగ్రహ మూని దేహసం
స్కృతి కనుమోదముం గనక సీత్కృతిఁ బల్కుచు దబ్బఱాడుచున్. 211

సీ. మఱియు దుశ్శీలలై మానినుల్ దుశ్శీలతం దగుపురుషులఁ దవిలియుంద్రు
కులకాంతలును బురుషులయందుఁ దమిమాని సద్వృత్తిశూన్యలై క్షమజెలంగు
చుందురు బ్రాహ్మణు లొగి వేదపాఠనమును మాని వ్రతములఁ బోల విడిచి
హాయిగ నుంద్రు గృహస్థులు హోమాదికృత్యముల్ మానుచు నిత్యదాన

తే. ములను మానుచు వనవాసముల నొనర్ప, నిష్టపడి నీచవస్తువు లెలమిఁ దినుచు
బిచ్చ మెత్తుచునుందురు పితృహితంబు, చేయఁగాఁ బూనరాత్మజుల్ క్షితినిగలిని.

వ. మఱియుఁ బుత్త్రులు స్నేహసంబంధయంత్రితు లగుదురు. రాజులు ప్రజారక్షణంబు మాని ద్రవ్యాపహర్తలై శుల్కవ్యాజంబును బన్నుచు జనుల నెవ్విధంబుననైన వంచించు చుందురు గజాశ్వరథవంతుఁ డెవ్వండగు నాతండె రా జగుచుండు. రాజకులోత్పన్నుండైన నతండు దుర్బలుండైన భృత్యుం డగు. వైశ్యులు కృషివాణిజ్యములు మాని శూద్రవృత్తి జీవింపఁ గోరుదురు శిల్పికర్మమే వారికి జీవనోపాయం బగు. శూద్రులు భైక్ష్యజీవితులయి ప్రవ్రజ్యాచిహ్నితులై యధమప్రవృత్తు లగుదురు. మఱియుఁ బాషండసంశ్రయవృత్తి నాశ్రయించి యసంస్కృతులై నీచులై వర్తింతురు. మఱియు 213

సీ. పన్నులవలనఁ జొప్పడుబాధ లోకవంక దుర్భిక్షములనుండి తోఁచుబాధ
లోకవంక బాధింప సకలజనుల్ కుందుచుందురు గోధుమ లొప్పు నెచట
యవలుపండునో యెందు నచటికాహారార్థ మరుగుచుందురు జను లార్తులగుచు
వేదమార్గము చెడ విపులఁ బాషండమతము వృద్ధినొంద నధర్మ మట్టె
ఆ. తలను నిక్కఁబెట్టఁ దగినంత యాయువు, జనుల కుండ కల్పజంతువులకు
వలెనె యల్ప మగుచు నొలయఁగా శీఘ్రంబ, మ్రందు చుంద్రు కలినిమానులార

చ. అరయక శాస్త్రమార్గముల నాత్మకుఁ దోఁచినరీతిగా భయం
కరతప మాచరింతు రటుగావున భూపతిదోషయుక్తిచే
నరులకు బాల్యమందె మరణంబు గనంబడుచుండు నక్కటా
తరుణుల కేడువర్షములు దాఁటకముందె ప్రసూతి యొప్పెడున్. 215

క. పురుషుల కెనిమిది తొమ్మిది, పరికింపఁగఁ బదియునైన వత్సరము లవే
పరమావధిగా సంతతి, పఱఁగును గలికాలమందుఁ బల్కు లిఁకేలా 216

తే. వినుఁడు ద్వాదశవర్షముల్ వెడలకుండఁ, బలితకేశులు నగుదురు వత్సరంబు
లిరువ దెవ్వరికైనను ధరణిఁ బుచ్చు, శక్య మెవ్విధిఁ గాకుండు సాధులార. 217

సీ. ప్రజ యల్పమగును వ్యర్థపుఁజిహ్నములు గల్గి దుష్టాంతరంగులై శిష్టహాని
నొనరించుచు నదెట్టులో కాలవశమున మృతి నొందుచుందురు హీనగతిఁ;
బాషండవృత్తియే పనుపడు నందందు నెప్పు డెప్పుడు కలి యప్పుడప్పు
డభివృద్ధి నొందునం చారయుఁడీ విచక్షణులార! వేదమార్గమును నాశ్ర
ఆ. యించుసాధువులకు నెప్పుడు హానియౌ, నపుడె కలియు వృద్ధియైనయట్టు
లూహ చేయవలయు నుర్వి ధర్మాత్ముల, సత్కృతులును వరుస సాగకుండ. 218

క. ఎపుడు నశించునొ యక్కలి, యపుడే యభివృద్ధినొందు నని యూహింపన్
విపులాత్ములకున్ జను; క్షితి, నెపు డధ్వరనాయకుఁడయి యొపఁగెడు హరినిన్.

క. క్రతువులమూలంబునఁ బూజితుఁ జేయక మానుదురో విజృంభించెఁ గలి
క్షితిపతి యని తలఁపం జను, మతిమంతుల కివియె తత్సమయ మెఱుఁగుగతుల్.

సీ. వేదవాదములందు విముఖత పాషండవాదంబులందుఁ బ్రమోద మలరు
నేకాలమున నా యహీనబలంబునఁ గలియున్న దనుచును దలఁపఁజనును
మఱియొక్కఁ డుచితమౌ మాట నాలింపుఁడు కలియుగంబునను జగద్విభుండు
సర్వకర్తయు మహేశ్వరుఁడు నౌవిష్ణువు నర్చింపకుండుదు రాదరమున
తే. భూరిపాషండమతహతబుద్ధు లగుచు, వేదములచేత దేవతాద్విజులచేత
జలములను జేయుశుచితచే ఫల మదేమి, యనుచు నీరీతి దుర్బుద్ధు లగుచు నరులు.
క. మనములు పాషండమతం,బున నుపహతినొంది చెడఁగఁ బోలని గతిఁ దోఁ
చినఁ బల్కుచుంద్రు వర్షం,బన నల్పము సస్యఫలము లల్పమ్ము లగున్. 222
తే. ఫలము లల్పసారంబులై పరఁగు వస్త్ర
ము లొగి జానువులంతలో ముగియు వృక్ష
ములు శమీప్రాయములు వర్ణములు తలంప
శూద్రతుల్యాచరణములై క్షోణి వెలయు. 223
సీ. అణుసమానములు ధాన్యంబులౌ క్షీరమ్ము లజభవంబులె యగు నావుపాలు
దొరకవు మానవుల్ దోఁచినతఱి వట్టివేరులగంధంబుఁ జారులేప
నముగఁ జేయుచును సంతసముఁ గాంతురు మఱియత్తమామలె యింటియందు గురువు
లై యుంద్రు భార్యయు నామె సోదరులును మిత్రులై యుందురు మేదినిఁ గలి
ఆ. కాలమందు మౌనికాంతులార వినుఁడు, తల్లి యెవతె యెవఁడు తండ్రి యనఁగఁ
దనయుఁ డనఁగ నెవ్వఁడని కర్మబద్ధులై, భార్యవంకవారి పలుకులు విని. 224
చ. ఇతరుల లెక్కసేయక యె హీనమతుల్ దగఁ బల్కుచుందు రీ
వితమున నంగవాక్కులను వింతగఁ జిత్తమునుండి కల్లు దో
షతతుల కట్టె చిక్కి యఘసంతతినే యొనరించుచుంద్రు వా
రితలఁపు క్రూరమై వివిధరీతులఁ బర్వుచు నుండు దుష్టమై. 225
ఉ. సూనృతముం ద్యజించి పరిశుద్ధతఁ బాసి రవంతయైన హ్రీ
మానక స్వేచ్ఛమైఁ దిరుగ నూహలు చేయు దురాత్ములైన యా
మానవకోటి కారయ సమస్తము దుఃఖకరంబు నై తగున్
మౌనివరేణ్యులార! శుచి మానసు లుండరు పోలఁ జూచినన్. 226
తే. వేదతపసులు పితృదేవవిబుధకార్య,ములు చెలంగక విప్రవర్యులు కనంగ
రాకయుం డెడునక్కలి నేకడనొ యొ,కండు సుకృతంబు సుంతయక్కజముగాఁగ.
క. ఒనరుప నది సత్యయుగం,బున విధిమంతముగఁ జేయుపుణ్యంబును బో
లును నా విని మునివరు లి,ట్లని రోమునివర్య సంశయం బొకఁ డొదవెన్.
ఆ. ఎట్టికాలమందు నేచోట నెంత య,ల్పమగు ధర్మ మొనరుపంగ ననంత
ఫల మొసంగు దానిఁ బలుకుము విన వేడ్క,కయ్యె ననఁగ వ్యాసుఁ డిట్లు పలికె.

సీ. అల్పశ్రమంబుల నధికఫలం బిచ్చు కలికాలమనునది ఘనముగాదె
మఱియు విశేషించి మానినుల్ శూద్రులు కొంతధర్మంబు కడఁగి చేయ
ధన్యులై యగుదురు; తరువాతి వార్తను వినుఁడు సత్యయుగంబునను నరుండు
ద్వాదశాబ్దంబులు ధర్మకార్యము చేయఁ గలుగు నెట్టిఫలంబు కడఁగి త్రేత
ఆ. యందు వర్షమొక్కఁ డకార్యమునఁ బుచ్చఁ, గలుగు నంతఫలము లలితభక్తి
ద్వాపరమునఁ బూని తద్ధర్మ మొకమాస,మం దొనర్పఁ గలుగు నంతఫలము.
క. కలియం దొకదినదినమునే, కలుగుం దత్ఫలము ధర్మకార్య మొనరుపన్
దలఁపఁ దపోజపదానం,బులు మఱియున్ బ్రహ్మచర్యముఖ్యములఁ దమిన్. 231
క. ఒనరుపఁ బూరోక్తఫలం, బొనఁగూడును వినుఁడు మఱియు నుత్తమధర్మా
ళిని దెల్పెద ధ్యానము కృత,మున యజ్ఞము త్రేతయందు ముఖ్యంబు లగున్.
తే. ద్వాపరంబున నర్చన మోపిక నొన,రుపఁగ నేఫల మబ్బునో యూఢిఁ గలిని
శ్రీశనామకీర్తనమునం జెలఁగునద్ది, యనుచుఁ దలపోయుఁడీ! మీర లాత్మలందు.
క స్వల్పాయాసంబుననే య,నల్పఫలం బబ్బు నందునన్ గలియందే
యల్పము ధర్మము చేయఁగఁ, గల్పాంతముఁ దానఁ గలసుఖం బొనఁగూడున్.
క. కనుకనె కలియుగకాలం,బునఁ దృప్తిగ నున్నవాఁడ మునులార! ఫలం
బును గోరి యల్పధర్మం,బును జేయ మహాఫలంబుఁ బొందు నరుండున్. 235
సీ. వ్రతచర్యలను మించుబ్రాహ్మణుల్ వేదంబుఁ బఠియింపఁ దగుమఱి పరమధర్మ
పరులగు విప్రులు పరమధనంబుల యజ్ఞంబు లొనరుప నగును విధిని
గావున వ్యర్థముల్ గావె యవ్వియు ధన మదియేల విప్రుల కల్పసుఖము
నొసఁగెడు గద యది యొసఁగుఁ గోరికగల్గ నరకంబునం బడు నరసిచూడ
ఆ. నదియె తుచ్ఛతరమ యనఁదగు నియతుల, కంతె కాక యవిధి నది వ్యయింప
దోష మబ్బుఁగాన దుష్టముల్ వస్తువు, లవ్వి సాయపడఁగ నగు నదేల. 236
వ. ధనవస్తుసహాయమునఁ జేయఁదగు ధర్మంబులందుఁ బారతంత్రము పొడసూపు. కావున వాని నాశ్రయింపనేల? మహాక్లేశంబున లోకమును దృప్తిపఱచు యజ్ఞంబుల నాచరింప లేవనుకొ అంత యేల? ద్విజశుశ్రూషణముచేతనే శూద్రుఁడు పాకయజ్ఞాధికారము కలవాఁడగు. అంతియకాక తనలోకమును జయించిన వాఁడగు. కావునఁ గ్లేశార్జితధర్మకర్తలగు ద్విజాతులకంటె శూద్రుండు శుశ్రూషణంబున నుత్తముఁ డనంబరఁగు. భక్ష్యాభక్ష్యదోషంబును వారికి లేదు. కావున ద్విజాతిశుశ్రూషణ ముత్తమం బని చెప్పంబడియె. మఱియు మానవులు స్వధర్మావిరోధంబుగ ధన మార్జింపవలయు. తద్ధనంబు పాత్రముల యందు వినియోగింపందగు. యథావిధి దేవతలనారాధింపంజను ధనమార్జించునపుడు మహాక్లేశంబు గలుగు. తత్పాలనమున నంతకంటె శ్రమంబు గలుగు. దానిని సత్పాత్రములం గాంచి వినియోగించునపు డంతకంటె గష్టంబు గలుగు.

కావున ధనజనితఫలంబు గహనంబని పెద్దలు వచింతురు. ఈమొదలగు కష్టంబులకుఁ బాలయి ద్విజులు నిజలోకముల జయింపవలయు. జపతపములు లోనగువానిం జేసియుఁ బుణ్యలోకంబుల సాధింపంజను. 237

ఉ. కాంతయు వాఙ్మనంబులను గర్మమునన్ బతిసేవచేసి తా
నెంతయుఁ బుణ్యలోకముల నిచ్చను గోరినవానిఁ బొందెడిం
గాంతునిగూడి; భూరితర కష్టమునం బురుషుండు చేయ కొ
క్కింతయుఁ గాంచలేఁడు మది నెంచిన స్త్రీల కిదే యొనర్ప నా. 238

క కనుకనె రెండవమార్గం, బనునది కాంతలకుఁ గాననగు నే వచియిం
చినవాఁడ మీరు కోరిన, ఘనతరవిషయంబు నింకఁ గాంచుఁడు దేనిన్. 239

క. వినఁగల్గునొ దానిని నే, వినిపించెదఁ గలియుగమున విపులశ్రమ మొం
దని లఘుమార్గంబున ఫల,మును గాంతురు మానవు లొగి భూలోకమునన్.

ఆ. ఆత్మసుగుణసాగరాంభస్స్నలం దము, పాపపంకములను బరమయత్న
మునను గడిగికొనినపురుషులు పుణ్యప,దమును గాంచఁగలరు తథ్యమిద్ది. 241

వ. ద్విజశుశ్రూషణంబున శూద్రులును బతిసేవచే భామినులు ననాయాసంబునఁ బుణ్యలోకంబులం గాంతురు. కావున నీపూర్వోక్తత్రితయంబు ధర్మసంరాధనంబున నాకుం బరమసమ్మతంబు. కలియుగాంతంబున స్వల్పతపస్సున మహాఫలంబు లభించు ధన్యులగువారు పరమనిష్ఠ ధర్మంబు లాచరింతురు. మీరడిగిన ప్రశ్నంబులకు నుత్తరం బిచ్చితి. ప్రశ్నింపనివిషయంబులంగూడ సంబంధంబు నాశ్రయించి వచియించితి. ఇఁక నే నేమిచేయవలయు నానతీయుం డని వ్యాస మహర్షి ప్రశ్నించిన మును లిట్లనిరి. 242

## నూటయిరువదిమూఁడవయధ్యాయము.

యుగాంతస్వరూపనిరూపణము.

క. *మునివర! యాసన్నమె చెం,తను లేక సుదూరమందె తగునో కాలం
బును ద్వాపరవిధ్వంసన,మును గోరుదు మెఱుఁగఁ దెల్పుముందుగ దానిన్. 243

తే. అది యుగాంతముగద దానియందు మేము
ధర్మతృష్ణను వీనినే దవిలి పరమ
సుఖము నల్పకర్మంబునఁ జూరఁగొనఁగఁ
దలఁచుచున్నాము కాలము దారుణముగ. 244

క. జనులకు నుద్వేగము భీ,తిని గల్గంజేయునట్టి తెఱంగున రాఁగాఁ
గని పెట్టియుగాంతాహ్వా,యము,మునునున్న దిధర్మహానిముందుగఁ జేయున్. 245

* ద్వాపరవిధ్వంసనము=సందేహనిరాకరణము.

క. తలఁచుచునున్నది కారణ,ములతో నద్దానిఁ దెలుపుము మునివతంసా
కలఁగెడుమామనములు నా, బలికెన్ వ్యాసుండు మూఁడవదగు యుగమునన్.

చ. ధరణిపతుల్ ప్రజావనవిధానమునం దసమర్థులై నిరం
తరము స్వరక్షణాదృతిని దత్పరులై కరముల్ గ్రహించునా
తురమునఁ బొల్చియుండురు విధూతపరాక్రములౌచు విప్రులున్
జరణభవైకవృత్తిఁ గొని సల్పుచునుందురు జీవనం బెటో. 247

సీ. శూద్రులు తమవృత్తి క్షోణీసురుల కిచ్చి బ్రాహ్మణవృత్తియుఁ బరమమైన
వారియాచారముం బాటించుచుందురు; శ్రోత్రియుల్ కాండపృష్ఠులును గర్మ
రహితులై మఱి యధ్వరముల నొనర్పక యొకపంక్తిగాఁ గూరుచుండి యన్న
మును దినుచుందురు భూరిశిష్టాచారములు గానఁబడకుండు ముఖ్యధర్మ
తే. మర్థసంగ్రహణంబెయై యమరియుండు,మద్యమాంసప్రియంబె యమ్మానవులకు
సంతతము గల్గియుండును సఖులదార,లను గ్రహింపఁగఁ జూతు రమ్మనుజులాత్మ.

క. పురుషాధములన వారలు, పరఁగుదు రక్కాలమందు బాహుజవృత్తిన్
ధర నొప్పిచోరు లుందురు, ధరణీశులు చోరవృత్తిఁ దగిలి సతంబున్. 249

క. తిరుగుచునుందురు గౌరవ,పరిహీనత భృత్యులెల్లఁ బ్రభునాజ్ఞలనే,
పరిపాటింపక ద్రవ్యా,హరణంబునఁ బొదలుచుంద్రు హర్షము మిగులన్. 250

చ. ధనములె గౌరవింపఁబడు ధర్మరతిం గనుసాధువృత్తమే
మనుజులచెంతనైన బహుమానము నొంద కడంగు హీనవృ
త్తిని దెగనాడువారలు క్షితిం గనరారు యుగాంతమందు నిం
కను వినుఁ డందుఁ బూరుషులు కన్పడుచుంద్రు వినాసులై కడున్. 251

ఆ. వెంద్రుకలను ముడిగవేయక విడిచియు, తిరుగుచుంద్రు సన్మతిం ద్యజించి
పదియుఁ బైననాఱు వత్సరములు దాఁట, కుండఁ దనయులఁ దగుచుంద్రు స్త్రీలు.

సీ. చూడంగఁబడు *నట్టిశూలములుగజనపదములు మఱిచతుష్పథము లెల్ల
శివశూలములుగాఁగఁ జెలఁగుచుండును గేశశూలలై స్త్రీ లెల్లఁ జూడఁబడుదు
రయ్యుగాంతంబున నందఱు బ్రహ్మముఁ దెలుపుచుందురు చాలఁ దెలిసినట్లు
వాజసనేయికబ్రాహ్మణులే యుందు రంఘ్రిజప్రతిములై యనుదినంబు
ఆ. వాదతత్పరులయి వసుధపైఁ జండాల, సమతఁ గాంచుచుం గషాయవర్ణ
వస్త్రధారులునయి వరనియమంబులఁ, బాసి ముండు లగుచు వాసి విడిచి. 253

క. పలువరుస శుక్లవర్ణము, గలిగివెలయు భిక్షుకులయి క్షమఁ దిరుగుదు రు
జ్జ్వలమూర్తులగుచు; శూద్రులు, తెలుపుదు రాధర్మపద్ధతిన్ మునులారా. 254

ఆ. శాఠ్యబుద్ధిగల్గి సతతంబు జీవింతు, రంఘ్రిభవులు ద్రవ్యమధికశక్తి

* అట్టిశూలములు = అన్నవిక్రయము చేయునవి.

నార్జవంబుచేసి యంతట శ్వాపద,ములె కనంబడియెడుఁ బలువిధముల. 255

క. గోవులకు క్షయత వాటిలు, నావిధమున సాధువులకు నగు సంత్యజు లిం
పావహిలన్ మధ్యములుగ, నావారలె యంత్యజులుగ నగుదురు మఱియున్.

తే. లజ్జయనుమాట తోఁప దెల్లరకు యుగము, చనెడువేళను దపము యజ్ఞంబుచేసి
వానిఫలముల నమ్ముదు రూనువేడ్క, బ్రాహ్మణులు పెక్కుమాటలు పలుకనేల.

క. ఋతువులు విపరీతంబుగ, క్షితిఁ దగు రెండేండ్లవయసు చెలఁగు వృషభముల్
మతివిభవంబున లాంగల, మతిశయభారంబుఁ దాల్ప నర్హంబు లగున్. 258

ఆ. చిత్రవృష్టిఁగురియు క్షితిపైని బర్జన్యుఁ, డెల్లవారు శౌర్య ముల్లసిల్ల
భూమినేలఁ జాలి పొలుతురు సత్కుల,జులుగ నీచవంశజులుఁగఁ దగియు. 259

క. పితృకృత్యంబులు చేసిన,వితమున భావింత్రుసుతులువింతగయుగమున్
జ్యోతిగాంచు వేళధర్మము, చ్యుతినే కాంచునుదలంపఁజోద్యము కాదే. 260

సీ. ఊషరక్షేత్రంబు లొప్పారునెల్లెడ మార్గముల్ తస్కరమండలాన్వి
తములగు నెల్లరు ధనము వాణిజ్యమూలముననె గ్రహియింత్రు మఱుతఁబూని
తండ్రికై యిచ్చినధనము పంచుకొనంగఁ దలఁతురు లోభతఁ దనయు లొగిని
నపహరింపఁగ నెప్పు డాలోచనముచేయుచుందు రెల్లరును లోభోపహతము

తే. లైన చిత్తంబులను బగఁ బూనుచుందు, రొక్కరొక్కని నోర్వంగ నూహగొనరు
సౌకుమార్యముఁ రూపము చారురత్న,తతియునశియించు నాయుగాంతమ్మునందు.

క. వనితలు కేశాలంకృతు,లను బూని చరింతు రతివిలాసంబు మెయిన్
మనుజులు నిర్వీర్యులునై, కనఁబడుదురు పౌరుషంబు కడచన నందున్. 262

క. పరభార్యలనే కోరుచుఁ, బురుషులు వర్తింత్రు మఱియుఁ బూతాచారో
త్కరము నశించు ననార్యులె, ధర నిండి చెలంగుచుంద్రు తత్కాలమునన్.

క. ఉపయోగింపని రూపము, లపరిమితము లౌచుఁ గాననగుఁ బురుషాల్పం
బు పరినిబిడాంగనాతతి, విపులాస్థల మౌను జిహ్వావితతు లన నివే. 264

ఆ. యాచకులె ధరిత్రియందుఁ గనంబడు,చుంద్రుగాని యీయ నూహచేయు
వారు గానఁబడరు వసుధేశ చోరాగ్ని,దండనముల భీతి దగుఁ బ్రజలకు. 265

సీ. సస్యముల్ ఫలము నీఁజాలక యుండును బ్రాయమునందుండువారు వృద్ధ
లక్షణములతో వెలయుదురు శీలము నశియించు సుఖమె సంతతము కోరఁ
బడుచుండు; మఱియును వర్షముల్ తగువేళఁ బరుషవాతములు వీవంగ శీక
రములఁ బోలిన చిన్కు లమరును వృష్టిగాఁ బరలోకవార్త నెవ్వరికినైన

తే. సందియంబుగ నుండు వైశ్యప్రకాండ,వర్తనం బూని రాజులు వరుస ధాన్య
మమ్మి ధనము సమార్జింప నాత్మఁ గోరు, వారు బాంధవు లిలఁ గానఁ బడకయుంద్రు.

ఉ. చెప్పినమాట సార్థకము చేయఁదలంపక యుంటకాక నేఁ
జెప్పఁగ లేదటంద్రు మఱి చెల్లవుగా శపథంబు లుర్వియం
దప్పఁగొనంగ డానిమరియాదను నిచ్చు టనంగ శూన్యమా
జెప్పఁ దరంబుగాదు కనఁ జిత్రముగాఁ దగుఁ గాల మద్దిరే. 267

క. సంతోషించిన దానికి, సుంతయు ఫల మబ్బకుండుఁ జూడఁబడు ఫలం
బెంతయుఁ ద్వరఁ గ్రోధంబున, కంతటిదుష్కాల మగు యుగాంతంబునఁగన్.

సీ. *మేకలు పాలకై మేటికష్టంబుల పాలుసేయంబడుఁ బాప మనక
యవిధియుంతములుగ యజ్ఞముల్ సాగును బండితమ్మన్యులై పరమసత్య
మును వీడి శపథంబులను జేయుచుందురు మనుజులు శాస్త్రోక్తమనఁగ నిదియొ
యంచుఁ జెప్పెడువార లత్తఱిఁ గనఁబడకుందురు భూమియం దొక్కరొకరు

ఆ. సర్వవేత్తలగుచు సాధువులం దూల,నాడుచుందు రెల్లనరులు కవులె
కాని యొక్కఁడైనఁ గవికానివాఁ డుండఁ, డాయుగాంతకాలమందు నెచట.

క. తారలు వియోగతం గను, ధారణి సురలెల్లఁ గర్మతత్పరులే గా
రారయ రాజులు నిరతము, చోరులుగా నుంద్రు మిగులఁ జోద్యముకాదే.

క. జలకుండలికం దాలిచి, ఖలవృత్తిం బూని హింస కడఁగి యొసరుపం
దలఁచుచు సురఁ ద్రావుచు వి,చ్చలవిడి బ్రహ్మమును దెల్పఁ జాలుదు రల్పుల్.

తే. అశ్వమేధంబు చేయుదు రాయుగాంత
మందు ద్విజసత్తములు నయోగ్యజనులకును
యాజకులునయి బ్రాహ్మణుల్ యజ్ఞకర్మ
ములను జేయింత్రు ద్రవ్యాశఁ బూని యపుడు 272

వ. అభక్ష్యభక్షణంబు సామాన్యధర్మం బగు. బ్రాహ్మణులు ధనతృష్ణార్తులయి యుం దురు. భోశ్శబ్దంబుఁ బఠించి సకలకార్యంబులు నడపుచుందురు. నారీమణులు నక్షత్రములు వివర్ణంబులగు. దశదిక్కులు విపరీతములుగఁ దోఁచుచుండు. సంధ్యారాగము విదగ్ధాంగంబై కానంబడు. కొడుకులు తండ్రులకుం బని చెప్పుదురు. కోడం డ్రత్తలకు మరియాద నేర్పుదురు ఆయుగాంతకాలమందుఁ బ్రమదలు పురుషులు నిట్టియాచారంబులం బూనియుందురు. దేవతాతృప్తి చేయక యగ్నుల వేల్వక ద్విజులు భుజింతురు. భిక్షమును బలిని మాని పురుషులు భుజింతురు. మఱియు. 273

క. పతులు శయనింపఁగాఁ గని, యతివలు వంచించి వారి నన్యులకడకున్
మతివిభవంబునఁ బోవుదు, రతికష్టములౌర! యాయుగాంతపుసరణుల్. 274

ఆ. వ్యాధిబాధలేక యతిరూపవంతులై, యున్నపతుల విడుతు రువిద లప్పు

* న కశ్చిదకవిర్నామ యుగాంతే సముపస్థితే అనిమూలము.

డోర్వ లేనికతన నుద్ధతి గాంతురు, తలఁప రన్నదానతత్త్వ మాత్మ. 275
క. ఉపకారము చేసినఁ బ్రత్యుపకారము చేయఁ బూన రొక్కరు కాలం
బు పరీక్షింపఁగ దుష్టము, సపాపభూయిష్ఠమాట సాధువులారా. 276
చ. అనవిని మౌను లిట్టులని రట్టియుగాంతమునందు ధర్మమూ
ర్తిని గని డింద దండుగలు తెమ్మని రాజులు తమ్ము నేఁచ మే
దినిపయి నేప్రదేశమున దీనత మానవు లుందు రేపదా
ర్థనిచయ మాదృతిం దినుచు రమ్యగతిం జరియింతురో కదే. 277
క. ఏకర్మంబుల నొనరుప, నాకాంక్షింతురొ తలంపులన నెట్టివిధమై
యాకాలంబునఁ గల్గునొ,కో కాయము లెంత వగుచు నొప్పునొ చెపుమా. 278
క. ఆయు వననెంత యుండునొ, యేయాశ్రయమున నదెట్లు కృతయుగము దగన్
న్యాయాధారముఁ గందురొ,యోయార్య! తెలుపవయ్య యొప్పుగ ననినన్.
క. అని ప్రశ్నించిన వారలఁ, గని యిట్లు వచించె మౌనికాంతుఁడు వ్యాసుం
డనుమానమేగఁ దెల్పెద, వినుఁడీ ధర్మంబు వరుస విచ్యుతి గనినన్. 280
చ. మనుజులు సద్గుణావళుల మాని సుశీలము క్షీణమొంద నొ
ప్పనిపను లాచరించుచు నభవ్యతరాంగము లొప్ప నాయువొ,
య్యనఁ గృశతం గనంగ బలహానియు దానఁ జెలంగ దానిచేఁ,
దనురుచి పొల్లువోవ మఱి దానిన వ్యాధులు తమ్ముఁ బైకొనన్. 281
క. దానన్ నిర్వేదము తగ, దానిన యాత్మావబోధతం గని దానం
గానఁబడ ధర్మశీలతఁ, బూనిరె కృతయుగముఁ గంద్రు మునివరులారా. 282
సీ. ధర్మశీలతయుఁ గొందఱకు నుద్దేశమాత్రముగల్గు మధ్యస్థత నదిగల్గి
యుండుఁ గొందఱకు నదొప్పు నించుకగాఁగఁ గొందఱకున్ మఱి కొందఱ కది
కుతుకమాత్రంబుగ జతపడియుండును బ్రత్యక్షమును మదిఁ బరమగు ప్ర
మాణముగాఁ గొంద్రు మనుజులుమఱికొంద ఱనుమానమే ప్రమాణనియమమని
తే. తలఁతు రొకకొంద ఱీరెండు తగ వటంద్రు,కొంద ఱాదృతినాస్తిక కూటమందుఁ
గలుగఁ గొందఱు ధర్మంబు విలయమొందఁ, జేయుచుందురు విజ్ఞాన సిద్ధి లేమి.
క. మేమే పండితులము మఱి, మేమే సర్వజ్ఞుల మని మించుగరువముం
దా మూని ద్విజులు మూర్ఖులు, నై మహిని సంచరింతు రాకాలమునన్. 284
క. తమమదులకుఁ దోఁచిన విషయమునందే శ్రద్ధగలిగి యఖిలస్మృతిశా
స్త్రములన్ బహిష్కరింపుచు, నమలజ్ఞానంబు లేమి నతిదాంభికు లై. 285
క. నరు లక్కాలంబున నుందురు; వరుసగ ధర్మమిట్లు దొసఁగుం గన సా
దురతిం గని శుభకర్మముఁ, బరంపరగ నాచరింపఁ బనుపడుదు రిలన్. 286
క. దానము శీలము వరుసగ, మానవులకు నెఱుగవచ్చు మఱి దోషములం

దానొనరిచి దాఁచును గని, మానవు లేమైన ననక మాన రటంచుఁ. 237

ఆ. సర్వభక్షుఁడగుచు స్వీకృతపాపంబుల
దాఁచుకొనుచుఁ గరుణఁ దలఁపకుండు
నిగ్గుమాలి యిదియె చిహ్న మాయుగము తు
దను గనుఁగొనఁగఁగల దని యెఱుఁగుఁడు. 238

సీ. అద్దియే తగుఁ గషాయంబగు కాలము చరయుఁడు జ్ఞాననిష్ఠాంత మద్ది
తత్కాలమున నల్పధర్మకార్యంబున సిద్ధించు ఫలములు చెప్పనేల?
యేకాలమున జాతులెల్ల విప్రులకు శాశ్వతవృత్తి కల్పింపఁజాలి యుండు
నాకాలము కషాయ మన నొప్పు మఱియు మహాయుద్ధవాతవృష్ట్యాతపములు

తే. గలుగునేకాలమున నది యిలఁ గషాయ, మనఁగ నొప్పును రక్షస్సు లపుడు విప్ర
వేషములనుంద్రు రాజులు విషమబుద్ధు, లగుచు నల్పులపల్కుల నాదరింత్రు.

సీ. వేదపాఠంబులు వినబడకయె యుండు యజ్ఞకర్మంబులు నశ్లి యడఁగు
రాజులు కుమతులై తేజంబు దూలంగ నుందురు గర్వులై యుంద్రు ప్రజలు
క్రవ్యాదు లెల్లెడ బ్రహ్మరూపంబున సర్వపదార్థభక్షకులుగాఁగ
వెలసి వృథావ్రతములు చేయుచుందురు మూర్ఖులై విత్త మెప్పుడుతలంపు

ఆ. లకును రాఁగ లుబ్ధులవలె శూద్రులు శూద్ర, వేషభాషణులుగ విప్రులయందు
మనుజు లుంద్రు ధర్మమునసుండి చ్యుతిఁగని, సాధువృత్తి మాని చంచలులయి

మ. పరవిత్తంబుల దొంగిలింపఁగ నెదం బాటించుచుఁ సాధ్వులౌ
పరభార్యామణులం బ్రధర్షణవచోవారంబులఁ భీతలై
దురపిల్లంగ నొనర్చుచుఁ గపటమై దుర్వృత్తమై బాంధవో
త్కరమిత్రాళిని మోసపుచ్చుచుఁ బ్రజాకాండం బదొప్పుఁ ధరఁ. 291

చ. జను లిల నిట్టి మార్గములు సాధువులంచుఁ దలంచుచుండఁగా
మునులు బహుస్వరూపముల భూమిని గన్పడకే చరింపఁగా
ధనమద మూని యెప్పుడు ప్రధానుల నెల్లరు గారవింత్రు వ
ర్తనము గణింప రానిదగు ద్రవ్యమె పూజ్యముగుఁ ధ్రువంబుగఁ. 292

సీ. సత్యంబు దొంగిలి సాధువులగువారు వస్త్రముల్ దొంగిలువారు భక్ష్య
భోజ్యకరండౌఘముల దొంగిలెడువారు చోరులవిత్తరాసులను దొంగి
లించెడువారును ద్రుంచువారలతలల్ త్రుంచువారును నయి దుష్టులగుచు
నాయుగాంతంబున నవనిజనుల్ పొల్తు రిట్లు చోరులచేతనే సతంబు

తే. తస్కరులు చంపఁగాఁబడ ధాత్రిఁ గృతయు
గమున కొంతయొ మేలు గల్గంగఁ గలదు;
సారహీనంబు సత్క్రియాసరణి శూన్య
మగుచుఁ గాలంబు క్షుభితమై యమరియుండు. 293

చ. నరు లపు డార్తులై గురువనంబులఁ జేరుదు రిండ్లనున్న భూ
వరకరబాధ పెంపడఁచుఁ బ్రాభవమెల్ల నడంగు నంచు నా
తురమున గ్రామముల్ వదలి తూర్ణము పోవుదు రెందునైన ని
ష్పురుసున బాధలేక యెటో వర్ధిలవచ్చు నటన్న యూహలన్. 294

క. క్రతుకర్మములు నశింపఁగ, దితిజులు శ్వాపదము లెల్లదెసల నెసఁగ స
ర్పతతియును మూషికంబులు, ఈతి వర్ధిలి నరుల భీతిఁ జెందఁగఁ జేయన్. 295

క. ఆరోగ్యము క్షేమము ఘన,వారము సద్వృష్టినిడుట బంధుకుశల మీ
ధారణి నుద్దేశంబుల, నే రంజిల మనుజు లుందు రెట్టులో భీతిన్. 296

సీ. ఆయుగాంతంబునయందు మనుష్యులు తమకుఁ దారే నృపుల్ తమకుఁ దమరె
చోరులు నయి గడు సులుగాఁగఁ జెలఁగుచు గుంపులుగాఁగూడి క్షోణినెల్ల
కడల నుందురు; బంధుగణముల నెడఁబాసి తమదేశములఁ బాసి యమలవృత్తి
వదలి నిస్సారులై భయదయుగాంతకాలమున నుందురు; పుత్త్రులఁ గొనికౌశి

తే. కిని దరించి భయంబునఁ జనుదు రెటకొ;కొంద ఱాకలిబాధచేఁ గుంది యిట్టు
లంగవంగకళింగసమాహ్వయముల, నక్లై కాశ్మీరకోసలాఖ్యముల మఱియు

వ. ఋషికాంతగిరిద్రోణుల నాశ్రయించి మానవు లుందురు. కొందఱు హిమవత్పార్శ్వంబును గొందఱు లవణార్ణవకూలంబును సమాశ్రయింతురు. జీర్ణపత్రంబులను వస్త్రంబులుగాఁ గొందఱు ధరింపఁ గొందఱు వల్కలాజినంబుల ధరింతురు. అరణ్యంబుల మ్లేచ్ఛగణంబులం గూడి కొంద ఱుందురు. జనశూన్యంబుగాక యరణ్యభూయిష్ఠంబుగాక భూభాగం బుండు. రాజులు ప్రజలఁ గావఁ జాలనివారయ్యు రక్షకులవలె నుందురు. మృగమత్స్యవిహంగశ్వాపదసర్పకీటక మధుశాక ఫలమూలంబులె యాహారంబుగా మానవులు జీవింతురు. జీర్ణపర్ణఫలంబులం దినుచు వల్కలాజినంబులం గట్టి మునిజనులచందంబున నిర్వృత్తులై నివసింతురు. బీజములు స్నేహవర్జితంబులై యుండు. కాష్ఠశంకువులచే నాహతంబులైనను స్నేహ మొదవక యుండు. అజైడకఖరోష్ట్రంబులఁ బరిపాలింప జను లాసక్తులగుదురు. 298

చ. మనుజులు భుక్తిలేమికిని మాటికిమాటికి భ్రాంతచిత్తులై
వనములయందు నుండియు స్రవంతులకూలములందుఁ జేరి పా
వనజలపూరమున్ బలిమి వారనిపూనిక నడ్డరింత్రు దా
నిన జల మబ్బు సస్యములు నిండుగఁ బండునటన్న యాశచేన్. 299

వ. మఱియు ననియమంబుగ నంకురించిన తనూరుహంబులు సమలాంతరంబులై నిండి యుండ బహ్వపత్యులై కొందఱును బ్రజాహీనులై కొందఱును గులశీలవివర్జితులై యుందురు. ఇట్టులా కాలంబున నధర్మజీవను లై యుందురు. హీనులు వృద్ధి నొందుదురు. ధర్మంబు హీనతం గాంచు. 300

సీ. ముప్పదిరేండ్లయి యొప్పును బరమాయు వాకాలమునఁ దగు నందఱకును
బలహీనులై దేశముల గ్లాని గాంచుచు జరయు శోకంబును సంతతార్తిఁ
దమ్ము ముంపఁగ జీవన మ్మెట్లొ జరపుచు నుందురు రోగాళులొలయ నవయ
వములు క్షీణత నొందుఁ బరమాయు వల్పమగు భావనచే విషయావలోడ

తే. నము నశించును గొంతకాల మిటు సాగ, సాధువులఁ జూచు వేడుక సాధుసేవ
లొప్పఁజేయంగఁ గోరిక లప్పు డెల్ల, జనులకుం బుట్టు రానున్న సత్యశక్తి. 301

క. వ్యవహారంబులు క్షీణము, లవుఁ గామములెల్ల సిద్ధి నందనికతనన్
జవ మలర ధర్మశీలత, నవధానము సాధుగోష్ఠినందఁగఁ దనరున్. 302

క. క్షయపీడితు లౌవారల, కయశంబునఁ జింతపుట్టు నత్తరుణమునన్
స్వయముగ సంస్కారములు వ,లయు ననుమూహలుకడుం జెలంగు ననువుగన్.

చ. వరుసగ సాధుసత్తముల భక్తిని గొల్వఁగ దాన మీయ స
త్యరతిని గాంచఁ బ్రాణితతి నాదృతిఁ బ్రోవఁగ బుద్ధి గల్గుఁ దాఁ
జరణము ధర్మ మున్న వరుసన్ దగు శ్రేయము నొందుచింత; యీ
కరణి గుణాభిమానము తగంగ మనోహరవృత్తి చొప్పడున్. 304

క. అనుమానంబున ధర్మమె, ఘనమగు నద్దాని నొందఁగాఁ దగు ననుచిం
తను బూనుదు రత్తఱిఁ గా,వున ధర్మము వృద్ధినొందఁ బూనుం ద్వరగన్.

క. ఏయేమార్గంబుల ధ,ర్మాయత్తక్రియలు తగ్గె నట్లే మరలన్
న్యాయము తలయెత్తుట ధర, నాయారీతులను వృద్ధినందుం ద్వరఁగన్. 306

చ. కృతయుగ మప్పుడే జనులదృగ్గతమౌ నపు డెల్లసాధువృ
త్తితతులు చెన్నుమీఱు మఱి తృప్తియు నెల్లరకుండుఁ బాప మే
వితమున వృద్ధినొందు నటువృద్ధిని గాంచుఁ గషాయకాల మీ
క్షితినని మీఱెఱుంగఁ దగు శ్రీపతిభక్తియె ధర్మచిహ్నమౌ. 307

తే. కాలమొక్కండె శీతాంశుఁ డోలి వృద్ధి
క్షయము గల్గినయటు తోఁచుకరణి ధర్మ
వృద్ధిహానులు కృతయుగ మిద్ది యనుచు
దుష్టకాలం బిదంచును దోఁపఁ జేయు. 308

క. తమసునఁ గప్పంబడు నా, యమృతాంశునికిరణిఁ దుర్యమౌ యుగ మొప్పున్
దమ మెడఁబాసినఁ గన్పడు, నమృతాంశునిభంగి సత్యమనుయుగ మలరున్.

సీ. కలియుగంబున జనంబులు పరబ్రహ్మము వేదార్థములు హేతువిస్తృతముగ
నరయఁగాఁబడి వానియందు విశ్వాసము గలవారు గాకుంద్రు లలితసత్య
యుగమందు బ్రహ్మము తగనెఱుంగఁగరాని దని తలఁపంబడు ఘనతపంబె
చేయఁగాఁదగు నని న్యాయ ముత్తమ మని యిష్టవాదంబులె యొసఁగుచుండుఁ

తే. దపము సర్వోత్తమంబని తత్త్వదృష్టి
స్థిరముగా నెన్నఁబడు గుణోత్కరము కర్మ
సిద్ధిఁ దగునని గుణములచేతఁ గర్మ
ము లొగి శుద్ధంబులగు నని తలఁపఁబడును. 310

చ. పురుషులఁ గాంచి దేశమును బోలఁ దలంచుచుఁ గాలలక్షణం
బరసి మహర్షు లట్టితఱి నాయుపద్ధతులన్ హితంబు లా
సరణుల నొప్పఁ జేసిరి విచారము నొందకయుండ నాలుగై
పరఁగెడు ధర్మముఖ్యముల పద్ధతు లివ్వని తెల్పి రాదృతిన్. 311

తే. ధర్మ మర్థకామమ్ము లుత్తమతమ మగు, నట్టిముక్తిని సురసమూహప్రతిక్రి
యలును దెల్పిరి చేయంగ వలసినట్లు, మఱియు నాశీర్వదించిరి మంచిగలుగ. 312

క. ప్రతియుగమందును నాయు,ర్మితియును యుగమానములను మించెడువృత్తి
ప్రతతిని దానిస్వభావము, నతిశయకృప నిర్ణయించి రార్యులు మున్నే. 313

క. జననము మరణము ననుపీ,నిని గూడి ధరాతలమున నిల్వఁగలేమిన్
జనుచుండుఁ బుట్టుచుండును, గనజాలదు స్థిరతఁ బ్రాణికాండము ధ్రువమా. 314

క. తిరుగుచుఁ గర్మవశంబున, మరణంబును గాంచి మరల మహిఁ బుట్టుచు నీ
కరణిం బరిభ్రమించును, స్థిరతం గనఁగలదె సుంత స్వేచ్ఛయుఁ గలదే. 315

---

## నూటయిరువదినాల్గవయధ్యాయము.

### ప్రాకృతప్రతిసంచరకథనము.

చ అని మఱియున్ వచించెను మహర్షివతంసుఁడు వ్యాసుఁ డో మహా
మునివరులార! భూతములప్రాగముఁ గాంచిన మూఁడుభంగులై
చను ప్రతిసంచరంబులను శాస్త్రవిపర్తిలు నంచుఁ దోఁచెడున్
వినుఁ డలవానిపద్ధతుల వేడ్కఁ జనించెడు విన్నయంతనే 316

తే. పరఁగునవ్వి నైమిత్తిక ప్రాకృతికము
లనియు నాత్యంతికంబని యందు బ్రాహ్మ
మనఁబడును ధాత్రి నైమిత్తికాఖ్య నద్ది
తుదను బ్రతిసంచరంబని మదినెఱుఁగుఁడు. 317

వ. ఆత్యంతికంబు మోక్షం బనంబడు. ద్విపరార్ధకంబు ప్రాకృతం బనంజను. నా
విని పరార్ధసంఖ్య యెట్టిదో తెలుపుము ప్రాకృతప్రతిసంచరంబు ద్విగుణీ
కృతంబుగా నేల? విస్తరించి వచింపుమని మునులు ప్రార్థింప వ్యాసుం డిట్టులను.
స్థానమునుండి స్థానంబొక్కటొక్కటియు దశగుణం బనియెఱుంగంజను అందుఁ
బదునెనిమిదవభాగంబు పరార్ధంబను పేరం బరఁగు. ఆపరార్ధంబు ద్విగుణంబైన

నదియె ప్రాకృతలయం బననొప్పు. అవ్యక్తంబునందు సకలంబు వ్యక్తంబగు. ఆదికారణంబునందె లయంబునొందు. మానుషనిమేషకాలంబు మాత్రా మాత్రప్రమాణంబువలన లెక్కింప నాదికాలం బగు. నిమేషంబులు పదునైదు కాష్ఠాసంజ్ఞఁ దనరు. అవ్వి ముప్పదియైనఁ గలయనం దగు. పదునైదుకలలు నాడికాసంజ్ఞఁ జెప్పంబడు జలపతనప్రమాణంబునం జూచిన నవి సార్ధత్రయో దశసంఖ్యకు సమానంబు లగు. చతురంగుళంబులగు హేమమాషంబులు నాల్గింట ఛిద్రంబుచేసిన నది మాగధప్రమాణంబున జలప్రస్థమునంబడు. రెండు నాడిక లొకముహూర్తం బనియు, నవి ముప్పదియైన నహోరాత్రంబనియు, నవి ముప్పది యగునేని మాసం బనియు, నవి పండ్రెండు గూడిన సంవత్సరం బనియు, నాసంవత్సరంబె దేవలోకంబున నహోరాత్రం బనంబడునంతటికాలం బనియు నెఱుంగం దగు మనుష్యమానంబున మున్నూటయఱువది వర్షంబు లైన దేవతలకు సంవత్సరం బగు. అవ్వి పండ్రెండువేలైనఁ జతుర్యుగంబులగు. చతుర్యుగంబులు వేయియైన బ్రహ్మలోకంబున నొక్కపగ లగుననియెఱుంగుఁడు. అదియె కల్పంబు అందుఁ బదునలువురు మనువులు పరిభ్రమింతురు. ఆకల్పాంతము బ్రహ్మనైమిత్తికలయం బనుపేరం బరఁగు. తత్స్వరూపం బత్యుగ్రంబు. దాని నెఱింగించెద. ముందు ప్రాకృతలయస్వరూపం బెఱింగించెద నని వ్యాసుం డిట్లనియె. 318

సీ. యుగచతుష్టయము వేయుగ సాగ భూతలమెల్ల క్షీణప్రాయమే యయి తగు
నప్పు డనావృష్టి యత్యుగ్రమై నూఱువత్సరంబులదాఁకఁ బరఁగు నప్పు
డల్పసారములగు నట్టిజంతువులును మృతినొందు బాధలు మితికి మించ
న త్తఱి శ్రీకృష్ణుఁ డాహరరూపంబు నంది లయంబు సేయంగఁ బూను
తే. భూతగణములు తనకుఁ బోదలు నవ్వ్యయైన లయకాలకృత్యంబు నరసి చేయఁ
దలఁచి రవిసప్తరశ్మల వెలసి తానె, జలములను బీల్చు నిశ్శేషములుగ శక్తి.

చ. జలములనెల్లఁ బీల్చి మఱి జంతుసమూహమునందుఁ బ్రాణరూ
పలలితమౌ రసంబు నొకభంగిని బీల్చును దాన శోషితం
గలఁగు సమస్తభూతలము కంధితరంగిణు లద్రు లద్రిజం
బు లగునదుల్ రసాతలము మూలమునం గల తోయరాశియున్. 320

తే. క్షణముననె విలయంబును గాంచు నంత
జలము గన్పడకుంట భాస్కరుసహస్ర
కిరణములు సప్తవిధములై పరఁగు నందు
భాస్కరులు సప్తసంఖ్యలఁ బ్రబలుదు రిటు. 321

సీ. తపనురశ్మలును గ్రిందను మీఁద వ్యాపించి దహియించు జగములఁ దక్షిణంబ
భాస్కరురశ్మ లీవరుస మండుచు ముజ్జగంబులఁ గాల్ప సర్వంబు స్నేహ

విరహితమై మండి విలయ మొందును భూమి కూర్మపృష్ఠసమత గొనఁగఁ దగ్ధ యట్లుండు నిర్వృతమై; యంతఁ గాలాగ్ని రుద్రుండు భీతికరుండు నగుచు

తే. శేషఫణివరఫూత్కార చిత్రభాను
సంతతానంతతాపాతిశయమువలన
వేగ దహియించుఁ బాతాళవితతి నవల
ధరణి కెగఁబ్రాకి దహియించు దారుణగతి. 322

వ. అంత నిలువక స్వర్గలోకంబు దహియించి జ్వాలామాలాభీకరుం డై యెల్లెడ వ్యాపించియుండు. అత్తఱి సర్వబ్రహ్మాండంబు లంబరతుల్యంబులై యుండు. పిదప నాసంవర్తాగ్ని చల్లారు. లోకద్వయనివాసు లాతాపభరంబు సహింపనోపక నిలువ నవకాశంబు లేక మహర్లోకంబునకుం బోవుదురు. అందును మహాతాపతప్తులై జనలోకంబుఁ జేరుదురు. ఇట్లు సర్వంబును దహియించి రుద్రరూపియగు జనార్దనుండు ముఖనిశ్వాసవాయువులనుండి మేఘంబులం బుట్టించు. ఆమేఘంబులు గజకులప్రఖ్యంబులై తటిద్వంతంబులై గర్జాయుతంబులై సంవర్తకాదినామంబుల ఘోరాకారంబులై యంబరంబున వ్యాపించు. అందుఁ గొన్ని యంజనవర్ణంబులు. కొన్ని కుముదాభంబులు. కొన్ని ధూమ్రవర్ణంబులు. మఱికొన్ని పీతవర్ణంబులు. ఇంకఁ గొన్ని హారిద్రవర్ణంబులు. మఱియుఁ గొన్ని లాక్షారసనిభంబులు. ఇంకను గొన్ని వైడూర్యమణిచ్ఛాయంబులు. ఇట్లు మహేంద్రనీలశంఖకుందజాతీంద్రగోపమనశ్శిలాపద్మపత్రవర్ణంబులం జెలువారి యంబరంబున వెలసి ఘనాఘనంబులను విఖ్యాతి నలరి యుండు. మఱియు నొక్కొక్కప్పుడు పురవరాకృతిం దాల్చుచు, భూమిధరసన్నిభంబు లగుచుఁ గూటాగారనిభంబు లగుచు, స్థలంబులట్లు వెలయుచు, మహాకాయంబులం గనుపట్టుచు మహత్తరధ్వనుల దిక్కుల నించుచు, నభస్స్థలం బెల్ల క్షణమాత్రంబున నావరింపఁ జాలి వృష్టిధారల నాయగ్నిని జల్లార్చు. ఇట్టులా మేఘంబులు త్రైలోక్యాంతరమున వ్యాపించిన సంవర్తానలంబు శాంతింపం జేయు. ఇవ్విధంబున నమ్మహానలంబు శాంతించిన శతవర్షంబు లామేఘంబులు జగంబుల నీట మునుంగం జేయుచు వర్షించు. సంతతవృష్టిధారల లోకంబుల ముంచుచుఁ ద్రిలోకంబులు జలమయంబులుగా నొనరించు. మఱియు. 323

క. తమ మావరింపఁగా జంగమములు స్థావరము లెల్లఁ గడచనఁగా మే
ఘము లొక్కరీతి శతవర్షములు మహాంభస్సులను నెసంగం జేయున్. 324

వ. ఇట్లు నిరంతరవర్షధారల యథాపూర్వంబుగా జలంబుల వ్యాపింపం జేయ సృష్టి యంతయు జలస్వరూపంబై యుండునని యెఱుంగ వలయు నని పలికి పారాశర్యుండు మహర్షులం గాంచి మఱియు నిట్లనియె. 325

సీ. మునిసప్తకస్థానమును నాక్రమించి మేఘంబులు వర్షింపఁగా జలముల
జగమెల్ల లీనమై సమయంగ నేకార్ణవాకృతినుండు శ్రీహరియు స్వీయ
నిశ్వాసమున నుండి నిర్భరగతిమీఱు వాయువుఁ గల్పించు వాత మదియు
జలదంబులను వినాశమునొందఁగాఁజేయు శతవత్సరంబుల సమయమందు
ఆ. నపుడు భూతమయుఁడు హరి భూతభావనుఁ
డప్రమేయమహిముఁ డాది తుదయు
లేని దేవదేవుఁ డానిర్భరానిల
మొక్కత్రుటిని బీల్చి యుక్కడంచు. 326

క. ఏకార్ణవరూపంబున, నేకనఁబడు నీజగమున నీశుఁ డనంత
ప్రాకట ఫణివరశయ్యన్, శ్రీకలితుండై పరుండుఁ జిత్రమహిముఁడై. 327

క. జనలోకవాసులై తగు, సనకాదులు సిద్ధవరులు సామోక్షులఁ ద
న్ననిశము నుతించుచుండఁగ, వనజాసనలోకమందు వసియించు ఘనుల్. 328

ఆ. మోక్షకాంక్షఁ దన్ను ముక్తిప్రదునిఁగాఁగఁ, దలఁచుచుండఁదా సలిలములందుఁ
బవ్వళించి చాలఁ బ్రఖ్యాతిగని యాత్మ, మాయ యనఁగ నెగడిమాన్యయగుచు.

క. అలరారు యోగనిద్రను, విలాసముగ నొందితనదు విమలాత్మను ను
జ్జ్వలవాసుదేవనామముఁ, దలపోయుచునుండు వేఱు తలఁపన లేమిన్. 330

క. ఇదె నైమిత్తికమని చె, ప్పఁదగిన ప్రతిసంచరంబు బ్రహ్మాకృతిచే
తఁ దనరి హరి శయనించుట, కద యిందునిమిత్తమౌను గథ నిఁక వినుఁడీ

సీ. సర్వాత్మయగు హరి సంచరించిన జగమెల్లఁ జరించు సర్వేశుఁ డెపుడు
కనులు మూయునో యప్డె కడువడినశియించు మాయామయాకృతి మహితమైన
శయ్యనుండుటె నేత్రజలజముల్ మూయుట వినుఁ డింకఁగాలప్రవృత్తిమీఱు
పద్మసంభవునకుఁ బగలన నాల్గుయుగంబులు వేయి వారంబులు చన
తే. నగుఁగదా జలమయముగ నలరుజగము
లెప్పు డదిరాత్రి పగలంతయే యయితగు;
దానితుద మేలుకాంచి మాధవుఁడు సృష్టి
కృత్యమందుఁ బ్రవర్తించు నిత్య మిదియు. 332

క. వనజభవుని రూపంబును, గొని సృష్టి నొనర్చుననుచుఁ గోరిక మున్నే
వినిపించినాఁడనుగదా, మునులారా! ప్రళయనామమునఁ దగు దీనిన్. 333

తే. అంతరప్రళయంబను నాఖ్యవెలయు
నంచు నెఱుఁగుఁడు నైమిత్తికాఖ్య లయముఁ
దెలిపితిని బ్రాకృతంబని వెలయునట్టి
దానిఁ బ్రతిసంచరము వినఁదగును మీరు. 334

వ. వృష్ట్యభావ మహావృష్టి వాయుప్రసారప్రముఖుంబుల నూర్ధ్వమధ్యమాధో లోకంబు లన్నియు నడంగ మహదాదివికారంబగు విశేషసృష్టియు నశింప శ్రీకృష్ణేచ్ఛాకారితంబగు ప్రతిసంచరంబు ప్రవర్తించు. 335

సీ. భూమిగంధాదికంబును నీరు గ్రసియించు నాత్తగంధంబగు నవని యవలఁ
బ్రళయార్ద్రయయి యుండుఁ బోఁగ గంధతన్మాత్రము నశియింప క్ష్మాస్థలంబు
జలమయంబయి యుండఁ గలదు; జలంబులు జవమొప్ప భూరినిఃస్వనము గల్గి
ప్రవహించి సర్వప్రపంచంబుఁ బూరించి నిలుచును బ్రవహించు వలసినట్లు

తే. జగము లానీటియందు మజ్జనముసల్పు, నట్టు లుండును జలగుణంబై తనర్చు
నట్టి యారసతన్మాత్ర మంతరింపఁ, జేయు జ్యోతిస్సు మించెడు స్వీయశక్తి 336

క. సమయమున నప్పు సంతప్తములై తోయంబులు రసతన్మాత్రవినా
శమునన్ నిస్సారములై,నమ్మృతము జ్యోతిస్సునందు నణఁగుం జుండీ. 337

చ. జలములు తేజమం దిమిడి శాంతరసంబులుగాఁగ నగ్నియున్
వెలయుచు నాజలంబులను వేగమ పీల్చి జగంబు నిండి వ
ర్తిలు నపు డగ్నిరశ్ములను దివ్యపథంబును దక్కులోకముల్
గలఁగుచు నుండు;నాజ్వలనగాఢతరం బగు తేజ మొయ్యనన్. 338

క. అనిలుఁడు దిగమ్రింగును నం,తని లోకము లనిలునందుఁ దగియుండుఁ జుఁడీ
యనిలుఁడు నిస్సారుండయి, కనఁబడు నేవేళ నట్టి కాలంబందున్. 339

వ. రూపతన్మాత్రంబు వాయ్వంతర్భూతం బగు నప్పు డావాయు వెల్లెడల వ్యాపించి యవార్యగతిం జరించుచుండు. జగంబులు వాయ్వంతర్భూతంబులై కనఁబడకయుండు వాయువు తిర్యగూర్ధ్వాధోభాగంబుల వ్యాపించియుండఁ దద్గుణంబగుస్పర్శతన్మాత్రంబు నాకాశంబు గ్రసియించు. అంత వాయువు నశించి నట్లుండు. ఆయాకాశం బరూపం బరసం బస్పర్శం బగంధం బమూర్తిమంతం బయి యెల్లెడల నావరించి యుండు. ఆయాకాశంబు శబ్దలక్షణంబు శబ్దమాత్రంబె యాకాశంబని యెఱుంగవలయు. సర్వంబు నావరించి యుండునది యనుట శాశ్వతప్రతీతిగదా. అంత నాశబ్దగుణంబును భూతాది గ్రసియించు. భూతేంద్రియంబులు భూతాదియందు లీనంబు లగు. ఈభూతాది యభిమానాత్మకంబై తామసం బనంబడు. మహాబుద్ధివిచక్షణయగు భూతాది సప్తప్రకృతులలో నొక్కటియని యెఱుంగవలయు. ఇవి యొక్కటొక్కటి యొక్కొక్కదానియం దంతర్భూతంబగు చుఁడు బ్రహ్మాండము నావరించి యున్నజలంబుల నన్నియు నంతర్భూతంబు లగు. సప్తద్వీపసముద్రములు గలిగి సపర్వతకాననంబై యున్న యుదకావరణంబును దేజస్తత్త్వంబు గ్రసియింపఁ జాలియుండు. ఆజ్యోతిస్సు వాయువును, దానినాకాశంబును, దానిని భూతాదియు, దానిని మహాతత్త్వం

బును దానిం బ్రకృతియు గ్రసింపఁజాలియుండు. సర్వంబునకుఁ బ్రకృతి
హేతువు. ప్రధానంబు పరమకారణంబు. మఱియును. 340

క. మునులార! ప్రకృతి వ్యక్తం, బని యవ్యక్తం బటంచు ఖ్యాతింగను దా
నిని వ్యక్తంబును గ్రసియిం,చును నవ్యక్తంబు దీని చొప్పెఱుఁగనగున్. 341

ఆ. శుద్ధ మక్షరంబు శోభాకరంబు ని,త్యంబు నేకమునయి యఖిలతత్త్వ
ములను గలిసియుండి పోలుచు నవ్యక్తంబు, భూతతతి తదంశముననె వెలయు.

క. పరమాత్మ యనఁగ నయ్యదె, పరిపూర్ణం బనఁగ నదియె పరతత్త్వము నాఁ
బరఁగెడునది యదియే యీ,శ్వరనామం బదియె తాల్పఁజాలును జుండీ 343

సీ. నామజాత్యాదిక నానాప్రకారకల్పన దానియందు నాశనము గాంచు
నదియె సత్తామాత్ర మనఁగ జ్ఞానాత్మకమనఁ బరమాత్మ నాఁగను జెలంగుఁ
బరమధామం బన బ్రహ్మంబనంగను బరమేశ్వరుండన భవ్య మనఁగ
నాధారభూతమై యలరుతత్త్వంబన విష్ణువనంగను వేదవేద్య

ఆ. మనఁగ నన్నివిధములను వినుతింప నొ
గర్మమెల్ల రెండుగాఁ బొసంగు
చుండు నటఁ బ్రవృత్త మొప్పునాద్యము నివృ
త్తము ద్వితీయ మనుచు దలఁపుఁ డింక. 344

క. ద్వివిధంబగు కర్మంబున, సవమూర్తి యజింపఁబడును సాధుజనులచేఁ
బ్రవిమలవేదత్రితయో,క్తవిధిని నదియే ప్రవృత్తకర్మం బనఁగన్. 345

ఆ. యజ్ఞపురుషుఁ డనియు యజ్ఞేశ్వరుండని, యట్టికర్మమందు నాఖ్యకలుగు
జ్ఞానయోగకలన జ్ఞానమూర్తియటంచుఁ,బూజితుఁ డగుచుండుఁ బురుషవరుఁడు.

సీ అవియే నివృత్తకర్మాహ్వయంబునఁ దగుఁ దన్మార్గమున విష్ణు ధర్మమూర్తి
ముక్తిఫలప్రదుఁ బూన్కిఁ బూజింతురు హ్రస్వదీర్ఘప్లుతాఖ్యల ధరించు
వస్తు వుర్విని నది వాగుక్తమే యగుఁ దత్త్వ మాలోచింప సత్త్వమూర్తి
పరమాత్మ సకలకల్పనలకుఁ దగువాఁడు వాగవిషయుఁ డన వఱలువాఁడు

ఆ. వ్యక్తమనుచుఁ జెప్పఁబడుచు నవ్యక్తనా,మమునఁ జెలఁగి యవ్యయమనుపేర
నలరియుతఁడె వెలసి యాధారభూతుఁడై, విశ్వమూర్తి శివుఁడు విష్ణువు నగు.

క. పరమేశుఁ డతఁడె నిత్యుఁడు, పరమాత్మను ననుచుఁ జెప్పఁబడువాఁ డతఁడే
స్థిరుఁ డతఁడె యతనియందే, పరమేశ్వరి ప్రకృతి కలిసి భాసిలు నొకటన్. 348

వ. ప్రకృతిపురుషు లనుపేరఁ బరఁగువారిలో నాదియగుప్రకృతి పురుషునియందు
ను, బురుషుం డవ్యాకృతాత్మయందును గలిసిపోవుదురు. మునులారా! ద్విప
రార్ధాత్మకంబు కాలం బని చెప్పఁబడియెఁగదా యందుఁ దొలిభాగంబు పగలని
రెండవభాగంబు రాత్రియని యెఱుంగుఁడు. ప్రకృతి యెప్పుడు పురుషుని

యందు లీనతం గాంచునో యపుడు రాత్రి ప్రవర్తించు. పగటియంతకాలంబు రాత్రియు నుండు. శాశ్వతుండగు పరమాత్మకు నహోరాత్రంబులు లేవు. ఉపచారముగాఁ గల్పింపంబడియె. ఇదియె ప్రాకృతలయస్వరూపంబు. తరువాతి వృత్తాంతంబు వినుండని వ్యాసుం డిట్లనియె 349

## నూటయిరువదేనవ యధ్యాయము.

### ఆధ్యాత్మికతాపస్వరూపము.

క. వినుఁ డాధ్యాత్మికముఖములఁ, జనుతాపంబులను దెలిసి సాధువు స్వాంతం
బునఁ దోఁచుజ్ఞానవైరా, గ్యనియతి నాత్యంతికమన నగులయు మొందుఁ.

క. శారీరము మానస మను, పేరున నాధ్యాత్మికము ద్వివిధమై తోఁచుఁ,
శారీరము బహుభేదము, గా రహి వర్ణింపఁబడెడుఁ గద మునులారా. 351

సీ. జ్వర శూల శీర్షసంభవరోగములు ప్రతిశ్యాయ భగంధరార్శములు గుల్మ
మతిశయశ్వాసశ్వయథురోగములు ఛర్దిముఖములు బహుభేదములుగ నలరు
నక్షిరోగంబులు నతిసార మనునది కుష్ఠాంగ మనునది క్రూరమైన
యామయం బనునిట్టివగు రోగములచేత గాత్రసంతాపంబు కలుగుచుండు

తే. మానసం బన నెట్టిదో మానులార
వినుఁడు కామము క్రోధము ద్వేషలోభ
భయములుఁ మోహము వివాదభవము శోక
మ ట్లసూయయు నీర్ష్యయు నవమతియును. 352

క. మచ్చరము ననెడురీతుల, బెచ్చుపెరిగి మానసములు విషమార్తులు దే
హెచ్చసుఖంబును జెఱచును, హెచ్చుగఁ దాపంబుఁగూర్చు నెన్నిగతులనో.

తే. ఆధిభౌతిక మనుదాని ననువదింతుఁ,
బక్షిమృగమానుషపిశాచ రాక్షసోర
గముఖములఁ గల్గుబాధలు క్షమఁ బ్రథఁ గను
నాధిభౌతికములు నాఁగ నవనియందు. 354

వ. మఱియు ననిలవర్షములనుండియు శీతోష్ణవిద్యుత్సమూహములనుండియు ననేకవిధంబులుగాఁ బొడసూపుచుండు మఱియు. 355

క. కలిగెడు ఘనసంతాపం, బులు చెప్పఁగఁబడును సాధుముఖ్యులచే నీ
యిల నాధిదైవికము లని, బలుబాములఁ బెట్టు నివ్వి పలుకఁగ నేలా. 356

వ. గర్భజన్మజరా జ్ఞానమృత్యు నారకసంభవం బగుదుఃఖంబు సహస్రధా బాధించుచుండు. బహుమలావృతంబగు సుకుమారగర్భంబునందు నుల్బసంవేష్టితంబై జంతువు భగ్నపృష్ఠగ్రీవాస్థిసంహతి యై యత్యమ్లకటుతీక్ష్ణోష్ణలవణంబు లగు

మాతృభోజనపదార్థంబు లతిశయతాపంబు గల్పింప బాధల ననుభవించుచు దుఃఖించుచుఁ, బ్రసారణాకుంచనాదులఁ దనదేహమునకుఁ దా నధిపతియుఁ గూడఁ గాక శకృన్మూత్రమహాపంకంబుల శయనించి సర్వప్రకారంబులఁ బీడింపఁబడుచు నిరుచ్ఛ్వాసంబై సచేతనంబై చరించుచు జన్మశతంబుల స్మరించుచు, మహాత్తరదుఃఖంబు ననుభవించుచు నిజకర్మనిబంధనంబున నుండు. పురీషాసృఙ్మూత్రశుక్లావిలాననుండై ప్రాజాపత్యనామక వాయువిశేషంబునఁ బీడ్యమానాస్థిబంధనుండై సూతిమారుతంబు లధోముఖంబుగఁ దన్నుండఁ జేయఁ గ్లేశంబులం గుడుచుచు మాతృజఠరంబునుండి నిష్క్రాంతి నొందు. మూర్ఛ నతిశయంబుగఁ బొంది బ్రహ్మవాయువు తన్ను స్పృశింప విజ్ఞానభ్రంశంబు నొందు. పుట్టినపిదపనే యాజ్ఞానంబు నశియించు నని యెఱుంగుఁడు. కంటకంబులఁ గ్రుచ్చఁబడినయట్లును, గ్రకచంబులఁ గోయఁబడినట్లును, బూతివ్రణంబులు బాధింపఁ గృమివలె నాతురుండై ధరణిం బడు. అట్టితఱి నాపురుషుండు కండూయనంబునందు నశక్తుండై పరిభ్రమించు. స్తనపానాదికాహారంబును బరేచ్ఛచేఁ గొనుచుండు. అశుచియై శయనించు. కీటదంశంబులు పొడువ నేడ్చుచుండు. కీటాదికంబు లెంత బాధించినను దాని నాపుకొన సమర్థుండు గాక ప్రాగ్జన్మకృతపాపఫలంబులగు దుఃఖంబుల బహువిధంబుల ననుభవించుచుండు. మఱియు.

చ. అనుపమజన్మదుఃఖముల నందియు బేలతనంబుచేతఁ దోఁ
చినయుల యాధిభౌతికవిచిత్రమహాత్తరదుఃఖజాలముల్
మనమున నెంచఁజాలఁడు సమస్తవిధంబుల మూఢుఁడౌచుఁ జే
తనము మలావిలంబుగ నితాంతము గన్పడుచుంట దీనుఁడై. 358

సీ. నేనెవండను? బోవఁగా నైన చో టెద్ది? యెందున్నవాఁడ? నాయందుఁ గల్గు
నాత్మ యెయ్యది? యెట్టిదగు బంధనమ్మున బద్ధుండనై యున్నవాఁడఁ? గార
ణం బన్నను నకారణం బన్న నెట్టిది? కార్యకారణముల క్రమ మదెద్ది?
వచియింపఁ దగు నెద్ది? వచియింపఁగా రాని దెయ్యది? యిట ధర్మ మెన్న నెద్ది?

ఆ. యెది యధర్మ మనఁగ? నెందువర్తింపనౌఁ, జేయఁదగిన దెద్ది? చేయరాని
దెద్ది? గుణ మనంగ నెయ్యది? దోషంబ, దెద్ది? యని విచార మింత గొనక. 359

క నిరతము పశుసములగు న,ప్పురుషులతోఁ జెలిమిచేసి పూజ్యపథంబుల్
బరికింపలేక శిశ్నో,దరతృప్తిని జేయుచును వెతల్ కనుచుండున్. 360

క. తామసభావమె యజ్ఞత, తా మనుజుఁడు దానిఁ బొంది తగఁ గార్యంబుల్
నేమ మెడలి చేయును మఱి, యేమా దుష్కర్మఫల మదేకద చూడన్. 361

క. మునివరులు కర్మలోకం,బునకుఁ ఫలమౌను నరకము ధరణిఁ గలయ
మ్మనుజులకని సిద్ధాంతం,బును జేసిరి కాన మూర్ఖపూగంబునకున్. 362

క. నిరతంబు దుఃఖమే యగుఁ, బరలోకమునందు నిందుఁ బరికింపంగా;

జరతాకున నంగము జర్జరమై యవయవములును నశక్తము లగుచున్. 363

క. చలియించి దంతపంక్తి శిథిలతం గన నరములెల్లఁ దీరు వదలి సం
కులతం గాంచఁగ దూరస్థలమునఁగల దానిఁ గాంచఁజాలక దృష్టుల్. 364

సీ. చలియించుచుండఁ దారలు గానఁబడకుండ నాసికావివరంబునం జెలంగి
రోమపుంజములు విరూపత వెలువడ వపువు చలింపఁగఁ బ్రకటములయి
యస్థులు కనఁబడ నవనతపృష్ఠాస్థిసంహతి యొప్పంగ జఠరదహనుఁ
డతిశయతన్ వెల్గ నాహార మల్పమై చేష్ట లల్పములయి చిత్రరీతిఁ

ఆ. గనఁబడంగఁ గృచ్ఛ్రగతి చంక్రమణశయ్య, నాసనాదికముల నంది మంద
తను జెలంగు శ్రుతినయనగళములఁ గూడి, లాల లందముఖపుఁ జాలఁదూలి.

క. తనకున్ లోఁబడ కంగము, లనయము బాధింప మృతికి నభిముఖుఁడై తా
ననుభవమున నెఱిఁగిన వస్తునికరముల నప్డు మఱచుచున్ విహ్వలుఁడై. 366

క. ఒకమాట పల్కి శ్రమమున, వికలత్వము గనుచు శ్వాసవేగము కాసా
దికరోగములను నిదురఁ గనక యొరులసహాయమును మనంబున సతమున్ 367

తే. కోరుచును లేవఁ గూర్చుండఁ గూడశక్తిఁ
గనక యన్యులసాయమే గోరుచు భృత్య
వితతిపుత్త్రకళత్రముల్; సతము దూఱ
నవమతిం గాంచుచున్ శుచిత వదలంగ. 368

సీ. ఆహారమునను విహారమునను గోర్కి యభివృద్ధి నొందఁగా నాత్మపరిజ
నములె హాస్యోక్తు లనంగ బాంధవు లెల్లఁ దనుఁ జేరరాక యంతటనె నిలువఁ
దనజన్మఫల మన్యజనిఁ బొందినట్లుండ యౌవనంబును దనయాత్మఁ దలఁచు
కొనుచు సంతాపంబుఁ గని యూర్పుపుచ్చుచు జరయందునిట్టి దుస్తరకుఫలము

తే. లను నిరంతర మొందుచు జనుఁడు కాల
గతిని బొందును వినుఁడు తత్కాలజనిత
దుఃఖములఁ దెల్పువాఁడను దోఁచు నవ్వి
భయదములుగాఁగ ననుభవాపటువులుగను. 369

వ. శ్లథదీర్ఘాంఘ్రిహస్తుండై కంపంబు నొందుచు ముహుర్ముహుర్లబ్ధగ్లాని యై
ముహుర్లబ్ధజ్ఞానబలాన్వితుండై హిరణ్యధాన్యతనయభార్యాభృత్యగృహాదుల
యం దత్యంతాసక్తి గలిగి మమతాకులుండై క్రకచంబులంబోలి మర్మచ్ఛేదన
చణంబులగు రోగంబులు బాధింప దారుణబాణంబులచేతం బలె ఛిద్యమానాస్థి
బంధనుండై దృష్టిచలింప హస్తపాదంబు లస్వతంత్రంబులై యుండ సంశుష్య
మాణతాల్వోష్ఠకంఠుండై ఘురఘురధ్వనిచేయుచు మాట వెడలకున్నను దాను
శ్వాసపీడితుండయి యున్నను మహాతాపంబు ననుభవించుచున్నను క్షుధాతు

రుండై యమకింకరులు తన్ను నేఁచుచుండ నతికష్టంబున నుత్క్రమించు. ఆవల నతిశ్రమంబున యాతనాశరీరంబుం గాంచు. ఇవియెగాక యింక ననేకకష్టంబులు భయంకరాకారంబులు మరణకాలంబునఁ బొడచూపు. ఇంక నరక దుఃఖంబుల వివరించెద నాకర్ణింపుఁ డని వ్యాసుం డిట్లనియె. 370

నరకదుఃఖములు.

క. యమకింకరపాశసమూ,హము గళమునఁ దగిలియుంట యమదండకఘా
తము యమదర్శన మత్యు,గ్రమార్గసందర్శనంబు క్రమముగఁ గలుగున్. 371

ఆ. వాలుకాకరంభవహ్నియంత్రంబుల, శస్త్రములను బాధ సలుపుచుండ
యాతనావిశేషమందుఁ జిక్కి నరుండు, పూర్వకృతము నెన్ని పొగులుచుండు.

సీ. క్రకచధారలఁ దమగాత్రముల్ గోయంగఁ గుయ్యోయటంచార్తిఁ గూయువారు
మూసలలోఁ జొన్పి గాసిలఁ దపియింపఁ జేయఁగా వేసట చెందువారు
భూరిభీతికరకుఠారధారలఁ జెండ నబ్బబ్బ తాళలే మనెడువారు
భూవివరంబులఁ బూడ్చుచుండఁగ నోర్వఁ జాలక వెతలచేఁ దూలువారు

తే. శూలముల వేయ వ్యాఘ్రవక్త్రాళిఁ ద్రోయ
గ్రద్ధ లంగంబులం దినఁ గడఁగి మూఁగ
జిఱుతపులు లంగముల నెల్లఁ జీల్పఁ గ్రమ్మఁ
దాళఁజాలకయుండు బాధలు గలంప. 373

చ. సలసలఁ గ్రాఁగుతైలమున సాధ్వసరూపులు కాలకింకరుల్
తొలఁగకుఁ డిందులోఁ బడుడు తోడనె యం చొగిఁ ద్రోయుచుండ నా
ర్తులఁ గనువారు ఘోరఘనయధూతసుఖాయతకర్దమంబునన్
బెలుచనె త్రోయ సందుఁబడి విహ్వలతం గనుచున్నవారలున్. 374

సీ. ఉన్నతస్థలములనుండి క్రిందికిఁ ద్రోయ క్షేపయంత్రకములఁ జిమ్మివేయ
బహువిధరూపపాపములకుఁ దగినట్టి భూరితాపంబులఁ బొందఁ జేయఁ
బ్రాణులు సంతాపపడుచుంద్రు నరకబాధల నెన్ని చెప్పంగఁ దరముగాదు.
మునులార నారకములయందె దుఃఖముల్ గలుగునంచుఁ దలంపవలదు మీరు

తే. స్వర్గమందును బాపకష్టముల ననుభ,వించుపద్ధతి గల దఘసంచయంబు
చేయువారికి నిర్వృతి చెందుమార్గ, మరయఁగా లేదు చెప్పెద నవనివార్త.

చ. జననము నొందఁ గోరుతఱి సాధ్వసదాయకమౌను గర్భమం
దును వసియించుకాల మది తొమ్మిదిమాసము లంతమాత్రమా
జని గని యస్తమించు మఱి జన్మము గాంచును మృత్యువొందు నే
మని వచియించువాఁడఁ గ్రమ మారయ నీవిధి సాగుచుండఁగన్. 376

వ. కొందఱుపుట్టువుం గాంచినంతనె మృతింగాంతురు కొందఱు బాల్యంబున, మఱి

కొందఱు యౌవనంబున స్మృతింగాంతురు. ఎయ్యది మనుజులకుఁ బ్రీతికరంబగు పదార్థంబో యదియే దుఃఖదాయకంబగుచుండు. దుఃఖబీజంబు నగుచుండు. కళత్రపుత్త్రమిత్త్రార్థగృహక్షేత్రంబుల సుఖంబుకల్పింపఁబడదు. నిరంతరదుఃఖంబె కల్పింపఁబడు. ఇట్లు సంసారదుఃఖభాస్కరతాపసంతాపితచేతస్కులకు విముక్తి పాదపచ్ఛాయ తప్ప సుఖప్రదంబు వేఱొండు లేదని యెఱుంగందగు. త్రివిధ దుఃఖంబుల ననుభవింపఁ బుట్టినవారికిని గర్భజన్మజరాదిస్థానంబుల నొందఁ బాత్రులగువారికిని సుఖంబుగలుగుమార్గంబు పండితు లనువదించిరి. అదెద్దియన సుఖభాగైకలక్షణంబై యతిశయాహ్లాదజనకంబై తగు భగవత్సేవయని యెఱుంగుఁడు. వేఱుమార్గంబు గానరాదు. కాఁబట్టి తత్ప్రాప్తికై ప్రయత్నంబు చేయవలయు. 377

సీ. భగవదంఘ్ర్యబ్జసంప్రాప్తికి హేతువుల్ జ్ఞానంబుఁ గర్మము శాస్త్రవితతి
యందుఁ బ్రోక్తంబుగ నమరు జ్ఞానంబది యాగమోక్తము వివేకాగతంబు
నని రెండుతెఱఁగుల నలరు నాగమభవం బనఁగ శబ్దబ్రహ్మ మని యెఱుఁగుఁడు
సద్వివేకమ్మున సంభవ మగునది పరమము బ్రహ్మము భవ్యము నగుఁ
తే. గాఱుచీకటి దీపంబుకరణి జ్ఞాన,భాను వజ్ఞానమను ధ్వాంతపటల మట్టె
తొలఁగఁ జేయును గర్మము క్షాలితపథము, దీపతుల్యముగాఁగ మదిందలఁపుఁడు.

క. వినుఁడు వివేకోత్థం బనఁ,జను జ్ఞానము సూర్యకోటిసంకాశము దీ
నిని వేదంబుల నారసి, మనువే వచియించె జ్ఞానముండనులారా. 379

క. కనుకనే యీవిషయంబున, ననువగు సంబంధ మెన్ని యాధృతి వచియిం
తును బ్రహ్మమ్ములు రెండుగ, మునిసమ్మతములుగ వెలయుఁ బూజ్యతరములై.

సీ అందు శబ్దబ్రహ్మమనియుఁ బరబ్రహ్మ మనియు నామంబులు తనరుచుండు
నందు శబ్దబ్రహ్మమందు నిష్ణాతుఁడు పరమాత్మ నొందంగఁ బరమయోగ్యుఁ
డని విధియించె శాస్త్రాళి విద్యలు రెండువిధములఁ దగునని వేదమునను
నాలవదనఁబడి క్రాలు నథర్వణ మనువదించెను వినుఁ డందుఁ దొలిది
తే. గాఁగ నొప్పుఁ బరావిద్యచేఁ గలుగును, నక్షరప్రాప్తి రెండవ దైనవిద్య
యొప్పు ఋగ్యజూరాదిగా నుర్వియందు, దానిఁ బఠియింప నుత్తమతమఫల మగు.

వ. అవ్యక్తమని, యజరంబని, యచింత్యంబని, యజంబని, యవ్యయంబని, యనిర్దేశ్యంబని, యరూపంబని, పాణిపాదాదివిహీనంబని యేది చెప్పంబడునో యద్ది సర్వగతంబై, భూతయోనియై, యకారణంబై, వ్యాప్యంబై, వ్యాప్తంబై యుండునట్లు జ్ఞానులు పరికింతురు. అదియె పరబ్రహ్మంబు. పరంధామము. ముముక్షుజనవేద్యము. శ్రుతివాక్యోదితంబు. సూక్ష్మంబు. విష్ణునామంబు. పరమపదంబు. జంతులవులయుత్పత్తిప్రళయంబుల, నగతిని, గతిని, విద్యావిద్యల నెఱుంగు. అదియే భగవంతుఁ డనియుఁ జెప్పంబడు. జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్యతేజంబులు

భగవచ్ఛబ్దవాచ్యంబులు. హేయగుణాదులు దానిచేఁ జెప్పంబడరాదు. ఆపర
మాత్మయందు సర్వభూతములు నివసించు. భూతాంతర్యామియై వాసుదేవుం
డన వర్ణింపఁబడువాఁ డాతండె యని యెఱుంగఁదగు. 382

క. ముని మునులు ప్రజాపతి ని, ట్లనువుగఁ బ్రశ్నింపఁ బలికె నతఁ డుత్తర మా
వనజాతునకు నచింత్యున,కునామమును వ్యాఖ్య చేయఁ గూరునె తలఁపన్. 383

క. వినుఁడీ యాతఁ డనంతుం, డనఁబరఁగున్ వాసుదేవుఁ డనఁగాఁ జెలఁగున్
మునులార భూతములయం,దు నివాసముచేయు నవియునుం దనలోనన్. 384

క. నివసింపఁగా భరించును, భువి దానన్ వాసుదేవపూజ్యాహ్వాయ మెం
తో వినుతిఁ గాంచెను సృష్టికి,ని విభుండు విధాతయు నగు నిర్మలుఁ డతఁడా.

సీ. అతఁడె భూతౌఘప్రకృతి యన నొప్పారు గుణదోషములనెల్లఁ గూడక తగు
సగుణుఁడై నిర్గుణుఁడుగనయి సర్వావరణములమీఱి సర్వమున కాత్మ
దానయై యలరారుఁ దద్వ్యాప్తంబగు భువనాంతరాళంబు వివిధబహుళ
కల్యాణగుణగణ కలితాత్ముఁ డగు నెల్ల సర్గములు తదీయశక్తిలేశ

తే. మునునె కల్గిన వనుచు నమ్ముఁడు మునీంద్రు
లార! స్వేచ్ఛగఁ గొనుమహాకారములను
జగములకు నెల్లవిధముల సాంద్రశుభముఁ
గూర్ప నెంచును దుఃఖాళిఁ గూర్పఁ కతఁడు. 386

వ. తేజోబలైశ్వర్యమహావరోధుం డై స్వవీర్యశక్తిప్రముఖగుణైకరాశి యై యు
త్కృష్టులలో నుత్కృష్టుండై యుండు. ఆతనికడఁ గ్లేశాదులు నిలువఁజాలవు.
వ్యష్టిసమష్టిరూపంబులనుండు భగవంతుం డతండె యగు. అవ్యక్తరూపుండు
వ్యక్తరూపుండు నగు. సర్వేశ్వరుండు, సర్వదృక్కు, సర్వవేత్త, సమస్తశక్తి
సంపన్నుఁడు, పరమేశ్వరుండు నతండే యని తలంపవలయు. నిర్దోషంబై పరిశు
ద్ధంబై నిర్మలంబై యేకరూపంబై తెలియందగు తత్త్వం బద్దియే. జ్ఞానైక
గమ్యంబై యజ్ఞానావేద్యంబై యుండు నని పలికిన మహర్షు లిట్లనిరి. 387

---

## నూటయిరువదియాఱవయధ్యాయము.

### యోగమాహాత్మ్యము.

తే. సకలదుఃఖసంయోగభేషజము యోగ
మనుచుఁ దెలియంగనయ్యె నవ్యయుని నజుని
బరుని బురుషోత్తముని దానివలన నెఱుఁగఁ
గోరువారము తెలుపుమీ కోర్కి మీఱ. 388

చ. అని తనుఁ బ్రశ్నసేసెడుమహామునులం గని యోగవిద్వరుం

డని ప్రథగన్న యోగినిధి వ్యాసుఁడు మిక్కిలి ప్రీతినొంది యి
ట్లనియె భవాబ్ధిబాడబ మటంచు నుతింగను యోగ మేను జె
ప్పను దలపోసితిన్ మఱియు బాగుగ దానిని యభ్యసించినం
తనె కడు దుర్లభంబను ప్రథంగను మోక్షము చేకురుంగదా. 389

సీ. యోగశాస్త్రంబుల నోగిఁ బఠించుచు భక్తి గురువు నారాధించి నిరుపమాన
ములగు పురాణావళుల నితిహాసాళి వేదంబులను జక్క విధిఁ బఠించి
యాహారమును యోగ మభ్యసించెడువేళ వదలఁగాఁ దగు దోషవారములను
దేశకాలంబుల తీరు నెఱుంగుచు నిర్ద్వంద్వుఁడై మఱి నిష్పరిగ్ర

ఆ హుఁడయి బుద్ధియొప్ప యోగంబు విధి నభ్య
సింపఁ బూనవలయుఁ జెలఁగి సక్తు
వును భుజింపవలయుఁ బూతఫలక్షీర
ములను గంజిఁ దక్రమూలములను. 390

క. యావకకణపిణ్యాకము, లే వరములు సిద్ధి నొసఁగు నివియే యోగ
ప్రావీణ్యంబు నొసంగెడు, నా వాక్కు చెలంగుఁ బండితాదృతిఁ గనుచున్. 391

ఆ మనసు వికలతఁగని ధ్మాతపై శ్రాంతమై, క్షుధితమగుచు నుండఁ గూడదంద్రు
యోగవిద్యనుమఱియునుద్వంద్వపద్ధతి, నున్నశీతలముగనున్నతఱిని. 392

సీ. అత్యుష్ణమేయైనయట్టికాలంబునఁ బెనుగాలివీచు నావేళయందు
శబ్దంబు వినఁబడుసమయంబునన్ జలాభ్యాశంబునన్ జీర్ణమైనగోష్ఠ
మందుఁ జతుష్పథమందు సరీసృకస్థానంబు చెంత శ్మశానమందు
నద్యంతమునను ధనంజయుసన్నిధిఁ జైత్యంబునం గూపసన్నిధాన

తే. మందు వల్మీకమందు భయంబు గల్గు,తఱిని నెండినయాకులతల్పమందు
యోగమును నభ్యసింపరా దొప్ప దద్ది,చేటు నెంతయుఁ జేకూరఁ జేయు నిజము.

క. ఈపల్కిన దేశంబులఁ, జేపట్టక మూఢతయును జెందనిమదితో
నోపిక యోగాభ్యాసము, నేపురుషుఁడు చేయు వానికే సిద్ధించున్. 394

ఆ. ఇట్టిదుస్థలముల నే యోగమును బూనఁ, గలుగు విఘ్నదోషముల వచింతు
జడతగలుగు స్మృతికిఁ జాలలోపం బబ్బు, బధిరతయు లభించుఁ బలుకు రాదు.

క. కను లంధంబులుగాఁ దగుఁ, దనుతాపము జ్వరభవంబుఁ దగియుండును గ
ల్గును జ్ఞానహాని యటుకావున యోగాభ్యాసనిరతిఁ బూను నతండున్. 396

తే. శ్రద్ధ వహించి దేహరక్షణము చేసి
కొనఁగవలయును దనువె సాధనము ధర్మ
ముఖ్యపురుషార్థములకు నిమ్ములఁ దలంప
విజనమగు నాశ్రమంబున విధిని గాంచి. 397

సీ. అతిరహస్యస్థలమందు నిశ్శబ్దముగా నుండుతఱిని యోగంబు నభ్య
సింపఁగవలయును శీతిథరంబున నిర్భయంబగుతావున యందు శూన్య
సద్మమునందును సంతతశుద్ధమై యని రమ్యనూత్నస్థలమందు దేవ
తాలయంబున రాత్రియందుఁ బశ్చిమయామమందునేఁ దొలియామమునందునేని
తే. సంయతావయవుండయి సాంద్రనిష్ఠ
నభ్యసింపఁగఁ దగును, బూర్వాహ్ణమధ్య
మాహ్ణములయందు యుక్తమౌనట్టియు మిత
మైన యాహారమును గొని యాదరమున. 398

చ. తనవగు నింద్రియంబుల మహత్తరనిష్ఠ జయించి యొప్పునా
సనమునఁ బ్రాఙ్ముఖుం డగుచు సాధకుఁ డెంతయుఁ బూన్కిమీఱఁగా
ననుదిన మొక్కరీతిగనె యభ్యసనంబు నొనర్పఁగాఁ దగుఁ
మనసునకుఁ సుఖం బొసఁగుమాడ్కిని నాసన మొప్పఁగాఁ దగున్. 399

సీ. కదలక యదియుండఁగాఁదగు నత్యుచ్ఛ్రితంబును మిగుల నీచంబునైన
యాసనమందుల కర్హంబు గాదండ్రు; నిస్పృహుండపగతాన్నతుఁడు శుద్ధ
మానసుండును యుక్తమౌ నిద్రగలిగి క్రోధంబు జయింపంగఁ దగిఁ శక్తి
తే. గలిగి యభ్యాసమును జేయఁ గడఁగవలయు, సర్వభూతహితంబును సమధి కాధ
రంబు ద్వంద్వసహిష్ణుత రమ్యదేశ,వసతి యనునివి యుండఁగా వలయు సతము.

వ. గాత్రంబు మస్తకంబు పాదంబులు సమంబులుగా నుండఁ గూరుచుండవలయు. హస్తద్వయంబు నాభియందుంచి శాంతుండై పద్మాసనంబున నలరుచు, నాసాగ్రమున దృష్టి నిలిపి వాఙ్నియతుండై ప్రాణాయామం బొనరింపవలయు. సాధకుండు స్వేంద్రియగ్రామంబు నియమితిం బొందఁగూర్చి మనస్సుచే హృదయంబునందు దీర్ఘంబుగాఁ బ్రణవంబుఁ దలంచుచు సంవృతాననుండై సునిశ్చలుండై తమోవ్యాపారంబును రజోగుణంబుచేతను, రజోవ్యాపారంబు సత్త్వగుణంబుచేతను నిరోధించి నిర్మలంబై శాంతంబై మనస్సు నిలువఁ గూరుచుండి సంవృతలోచనుండై సమాధిఁ బూనవలయు మఱియు. 401

సీ. సాధకుం డొగిని హృత్సరసిజకోటరమందు లీనంబయి యఖిలమందు
వ్యాపించి ముక్తిదుండయి నిరంజనుఁడయి పురుషోత్తముండనఁ బొలుచుతత్త్వ
మందుఁ జిత్తముఁ జేర్పవగుఁ గరణేంద్రియభూతంబులను దొలి పూన్కిమీఱ
క్షేత్రజ్ఞునందు న్యసింపఁగాఁ దగు మఱియట్టి క్షేత్రజ్ఞు మహాత్ముఁడైన
ఆ. పరమపురుషునందుఁ బరిగతుఁ డగునట్లు, కూర్పవలయు నిట్లుకూర్చి నిమితిఁ
భవ్యతేమము నగుచు వాలాగ్రశతతమ, భాగలక్షణముగు పరమపదము 402
పూని మనోదీపంబునఁ, గానంగా వలయు యోగకల్పంబున నీ
ధ్యానము ముఖ్యతమం బగు, మానుల కిది సాధ్యమయ్యగు మాట లిఁకేలా

వ. కూర్మం బంగంబులను బోలె నింద్రియముల లోఁబఱచుకొని చంచలంబగు మనస్సు పరమాత్మయందు లీనంబగు దనుక సాధింప వలయు. అట్టి శక్తికలిగిన తఱి యోగసిద్ధి యని తలంపఁ జను. విషయత్యాగంబు యోగసిద్ధిచిహ్నంబు. ఎప్పుడు చిత్తంబు నిర్విషయంబగు నప్పు డది పరమాత్మయందు విలీనంబగు. యోగికి సమాధి కుదిరినఁ బరమపదంబు లభించు. 404

తే. సర్వకర్మములం దసంసక్త మగుచు
చిత్త ముండునో యోగికి నత్తఱిఁ దగు
నవ్యయానంద మనునది యపుడె కలుగు
సాధునిర్వాణ మని చెప్పఁ జను ధ్రువముగ. 405

సీ. ధామత్రయాతీతు సామవేదస్తుతుఁ దుర్వ్యాఖ్యుని బరిశుద్ధుని ననంతుఁ
బురుషోత్తముని యోగమునఁ బొంది ముక్తుఁడౌ సంశయంబులు లేవు సాధులార
నిస్పృహుండయి కర్మనిచయంబులందును సర్వత్ర ప్రీతిదర్శనుఁడు నగుచు
సర్వంబునం దశాశ్వతబుద్ధి యలరంగ నొప్పియుండునయేని యోగిబంధ
తే. ముక్తుఁడౌ వేఱుమార్గంబు బుద్ధిఁ దలఁపఁ, గానరా దింద్రియంబులగుణము నెప్డు
గొలువఁగారాదు వైరాగ్యకలన దాని, నాత్మవశమున నుండున ట్లొనర్పు.

క. అది యభ్యాసబలంబునఁ, గుదురును వేఱొక్కత్రోవఁ గుదురదు యోగం
బది కేవలపద్మాసనము దగం గుదిరినను సిద్ధిఁ బూనదు చుండీ. 407

వ. నాసాగ్రనిరీక్షణంబు కుదిరనం జాలదు యోగం బనఁగా నింద్రియమానసంబు లొక్కరీతిం గూడుటయే యని యెఱుంగవలయు. ఈయోగంబె విముక్తిదం బని యెఱుంగవలయు సంసారమోక్షహేతు విదియే యని నిశ్చయింపుఁడు. అని వ్యాసుండు పలికి యింకేమి వినఁగోరుదురో తెలుపుం డనుటయు నామహర్షికృపకు సంతసించి మహర్షు లిట్లనిరి. 408

---

నూటయిరువదియేడవయధ్యాయము.

సాంఖ్యయోగనిరూపణము.

క. నీవచనాబ్ధిభవామృత, మేవిధమున నెంత గ్రోల నింకను గ్రోలం
గావలయు ననెడియాశయె, వేవిధములఁ గల్గె మాకు విబుధమునీంద్రా. 409

తే. కావునఁ ముక్తిదమగు యోగమును దాని
సాంఖ్యవిస్తృతిమీఱంగ శ్రవణతృప్తి
గాఁగ వచియింపుమా ప్రజ్ఞగలిగి శ్రోత్రి
యుఁడయి యజ్వయు ననసూయకుఁడును నగుచు. 410

సీ. సత్యధర్మనిరతస్వాంతుఁడై తగువాఁడు పరమపదంబు నేభంగిఁ గనునొ

తపముచేతనో బుద్ధిధర్మమైతగు మేధచేతనో త్యాగంబుచేతనో మఱి
సాంఖ్యంబుననో బ్రహ్మచర్యంబుననో యోగముననో మోక్షముగల్గుననువదింపు
మింద్రియములకును హృదయంబునకు నెట్టు లేకాగ్రత పొసంగు నేయుపాయ
తే. మునను బూరుషుఁ డీతత్త్వమును దెలియఁగ
శక్తుఁడౌ నీవిధంబును జక్కని విధి
మాకుఁ దెల్పుమ యని వేఁడ మౌనివర్యుఁ
డిట్లు యోగస్వరూపంబు నెఱుకపడఁగ.  411
క. పలుకంగఁబూని యిట్లను, గలుషముల నడంచు జ్ఞానకలన విడిచి ని
స్తులతపము విడిచి యింద్రియ,ముల నొంచుమహాప్రభావమును విడిచి ధరన్.
తే. సర్వసంత్యాగమును మాని శాశ్వత మగు
ముక్తిపదమును వేఱొక భూరిమార్గ
మునను బొందఁగ రాదని మనములందు
నెన్నుఁడీ నిశ్చితం బది యెంచిచూడ.  413
సీ. వినుఁడు మహాభూతవితతి ప్రాక్సృష్టియాఁ బరమేష్ఠికిని బ్రాణివర్గమందు
నాభూతము లె నిండియలరుచుండునుదద్విధమును దెల్పెదభూమితనువునొసఁగు
జలములు స్నేహంబుసమకూర్చు జ్యోతిస్సునయనంబుల నొసంగు న్యాయరీతిఁ
బ్రాణంబు మఱియు నపానంబు నను వాని నాశ్రయించినవాయు వఖిలదేహ
తే. ములను వెలయుఁ గోష్ఠాకాశముగ బలంబు
గాఁగ విష్ణువు కోష్ఠంబుగా మహేంద్రుఁ
డగ్నిభుక్తిచ్ఛగా నుండు ననుచు మీరు
తెలిసికొనుఁ డింకనున్ జక్కఁ దెలుపువాఁడ.  414
వ. సరస్వతివాక్కు నాశ్రయించియుండు కర్ణములు త్వక్చక్షువులుజిహ్వానాసికలు
ను నీయైదునాహారద్వారము లని యెఱుంగవలయు. శబ్దస్పర్శరూపరసగం
ధంబు లింద్రియార్థంబు లగు. ఇంద్రియములయందు మనస్సు నిలిచినఁ బ్రవృత్తి
గల వగు. అవి స్వతంత్రములు కావు. హృదయాశ్రితభూతాత్మ మనస్సునఁ
గలియు. ఇంద్రియములకెల్ల నధిపతి మన స్సగు. ఆమనస్సు నియమించుటకు
మార్పునొందించుటకు భూతాత్మ యధికారి యగు. ఇంద్రియములు. నింద్రి
యార్థములగుశబ్దస్పర్శాదులు చేతనయు మనస్సు ప్రాణాపానములు జీవుఁడు
దేహధారులకు దేహాశ్రితాధికారభూతము లగుచుండు సత్త్వమునకు నాశ్ర
యంబులేదు గుణశబ్దంబుచాలదు. చేతనయు దానికి లేదు. ఆసత్త్వము తేజ
స్సును సృజించు. గుణముల సృజింపదు. ఇట్లుసప్తదశవిభాగములుగలదేహము
షోడశగుణాత్మకం బగు పండితుఁడగువాఁడు మనస్సుచే నాత్మయం దాత్మను
జూచుచుండు.  415

సీ. పరమాత్మఁ జక్షుస్సు పరికింపఁజాలదు కనఁజాల దింద్రియగణము దానిఁ
బరమదీప్తంబుగ భాసిల్లు మనసుచేఁ బరమాత్మ వీక్షింపఁబడుచు నుండు
శబ్దంబు మఱియును స్పర్శంబు రూపరసములు గంధమును దేహమును లేక
యింద్రియంబులు లేక యొప్పఁగు నాపరమాత్మ స్వశరీరమున మనశ్శక్తిఁ జూడ
తే. వలయు నవ్యక్తమగుచు సర్వవపులందు
నర్చితం బగుచుండు నాయాత్మతత్త్వ
మెవ్వఁ డద్దాని గాంచునో యిల నతండె
ముక్తుఁడని యెంచఁదగు మౌనిముఖ్యులార. 416

క. వినయము విద్యయుఁ గలవి,ప్రుని యందును గోవునందుఁ బొలుచుద్విపమునం
దును గుక్కయందు దానిం, దినుమాలనియందుఁ దుల్యదృష్టులు విబుధుల్.

ఉ. ఆపరమాత్మ స్థావరములందును జంగమరాశియందు సం
దీపితతేజ మొప్ప నొకతీరున నొంటిగ నుండు నాతఁడే
భూపరిణామజంతువులఁ బుట్టఁగఁ జేయును గాచుఁ ద్రుంచుఁ ద
ద్వ్యాపృత మీజగత్తనుచు నాత్మఁ దలంపుఁడు సత్యమాతఁడే. 418

తే. ఆత్మ నెల్లభూతంబులయందు భూత
ములను నాత్మను యోగప్రభూతశక్తిఁ
గాంచునో యెవ్వఁ డాతం డఖండతేజుఁ
డైన పరమాత్మఁ గనఁజాలు నని యెఱుఁగుఁడు. 419

క. తనయందుఁ గల్గునాత్మను, గనఁ జాలుఁ బరాత్మయందు ఘనుఁ డాతండే
యనిశము గనుచుండిన ము,క్తిని గాంచు నటంచు మీరు తెలియుఁడు మదిలోన్.

తే. సర్వభూతాత్మభూతుఁడై సర్వహితుఁడు
నగుచు నలరారు పరమేశు నరయ సురలె
కోరుచుందురు దానినె కోరుచుంద్రు
ముక్తినిం గోరువార లాసక్తిసతము. 421

సీ. పక్షుల కాకాశపథమున మత్స్యమ్ములకుఁ బావనతమజలములయందు
గతి యెట్లుచూడ శక్యముగాదో జ్ఞానులగతి యట్లె తెలియ శక్యంబుగాదు
భూతజాలంబులఁ బూని యాత్మను నాత్మయందె కాలము పూర్వ నర్ణమగును
గాలము దేనియం దోలి భూతాళిని బరిపక్వములఁ జేయుఁ బొలుపడుచు
తే. నుండు నద్దాని దెలియ రాకుండు నెవరి,కైనఁ; బైనను గ్రిందఁ దిర్యక్ప్రదేశ
మందు నంతరమందు నేయది కల దని, దెలియ రాకుండునదె యాత్మ పలుకు లేల.

క. లోకము లివియెల్లను నం,దే కలిసి చెలంగు బాహ్య మెన్నఁగఁ గనరా
దేకరణిం బరికించిన, శ్రీకలితం బదియె యగుచుఁ జెలఁగు నసమతః, 423

వ. అది సర్వాగ్రస్థానం బై ప్రాణంబు లక్ష్యంబున నిమిడునట్లు సర్వంబుల లోఁగొని యుండు. ఏకారణంబునను దాని కంతంబు లేదు. మనోజవంబుగలిగి యుండు దానికంటె సూక్ష్మతరంబగు పదార్థంబు లేదు. స్థూలతరంబగునదియు లేదు సర్వవ్యాప్తపాణిపాదం బై సర్వస్థితచక్షుశ్శిరోముఖం బై సర్వగతశ్రోత్రం బై సర్వంబు నావరించి యాత్మత్వం బుండు. అది యణువులకంటె నణుతరంబు. మహత్తులకంటె మహత్తు. భూతాంతర్భాగంబున నది వ్యాపించి యుండు. ఆతత్త్వంబు క్షరంబని యక్షరంబని ద్వివిధంబుగఁ బరిగణింపఁబడు. క్షరంబు సర్వభూతంబులయందు నుండు. అక్షరం బమృతత్వమునకని కల్పింపఁబడియె. శరీరం బనుపురంబు నవద్వారములు గలదియగు దానియందు హంస నామంబున వశియై యుండు. చరాచరభూతంబులయం దిట్లై యుండునని యెఱుంగవలయు సర్వభూతంబులకు హానంబు సంచయంబుఁ గూర్చుట నజుఁ డగుపరమేశ్వరునకు హంసనామంబు సుప్రసిద్ధం బయ్యెనని పారదర్శులగు మహాత్ములు వచింతురు. 424

తే. హంసనామంబునం దగు నద్ది క్షరము
గాఁగఁ గూటస్థనామంబు గలది యక్ష
రముగ నెఱుఁగంగవలయు దీర్ఘమగు దృష్టి
గల్గువాఁ డక్షరమునొంది కనఁడు భవము. 425

చ. అని వచియించి వ్యాసముని యాదృతి మౌనులతోడ నిట్లనుఁ
విని తిరిగా దె సాంఖ్యమును విస్తృతిమీఱఁగ నేను దెల్ప నిం
కను వచియింతు యోగము నికామము శ్రద్ధతగంగ నాలకిం
పనుజను బుద్ధియుఁ మనసు బాగుగ నైక్యము నొందఁగాఁ దగున్. 426

తే. ఇంద్రియంబులు వానితో నేకతంగ
నవలయును దాదృశమగు జ్ఞానంబు నాత్మఁ
దృఢముగా నుండఁదగు నదియే యనుత్త
మమగు జ్ఞానం బటంచు శాస్త్రము వచించు. 427

సీ. అట్టిజ్ఞానమ్ము శాంతావలంబనమున నంతరింద్రియనిగ్రహమున మఱియు
నాధ్యాత్మచింతచే నాత్మయందే క్రీడసల్పు బుద్ధిని శాస్త్రసరణిఁ జేయు
సత్కర్మమునఁ గల్గు సమధికయోగదోషముల నైదింటిని సాధుకవులు
నిర్ణయించినవాని నెఱి గెల్వఁగాఁదగు దానఁ బూర్వోక్తమౌజ్ఞాన మొప్పు

తే. స్వప్నభయములు క్రోధలోభములు కామ
మివ్వియే పంచదోషంబు లెఱుఁగవలయు
వీనిని జయించుపద్ధతిఁ బూని వినుఁడు
శమముచేఁ గ్రోధమనెడు దోషము జయించి. 428

సీ. సంకల్పజాలవర్జనమునఁ గామంబు సత్త్వసంసేవనసరణి నిద్ర
ధృతిని శిశ్నోదరవితతదోషంబులఁ బాణిపాదకృతపాపముల నేత్ర
ములను జయింపఁగా వలయుఁ జక్షుశ్శ్రోత్రకృతపాపములఁ జాలఁజతనము దగ
మనసుచేతనె జయింపను దగువాగ్దోషములను సత్కార్యనిష్ఠల మఱియును
తే. భయము నప్రమాదమున దంభమును బూన్కిఁ
బ్రాజ్ఞసంసేవనమున నొయ్యన జయింప
వలయు నివ్విధి దోషావళుల జయించు
మార్గములు వేయిత్రోవలు మహిని లేవు. 429

క. అనుదిన మీదోషగణం,బు నిట్టి పద్ధతి జయింపఁ బోలును శుచివి
ప్రుని దేవతలను బూజలఁ, దనుపం దగు వారిగన్నఁ దగు వలగొనఁగన్. 430

చ. మనమున నేని హింసగలమాటను గర్వయుతంబుగాఁగఁ బ
ల్కను దగదంచు నార్యులు నికామము పల్కిరి బ్రహ్మతేజమే
గనఁదగు శుక్రరూపత జగంబుల కద్దియె జీవభూత మం
చు నెఱిఁగి దానిఁ గావఁ దగు శూరత యన్న నదే చుఁడీ ధరన్. 431

వ. ధ్యానాధ్యయన దాన సత్యంబులు నార్జవంబు లజ్జయు క్షమయు శౌచం బాత్మ
శుద్ధియు, నింద్రియనిగ్రహంబు ననువీనిచేఁ దేజంబభివృద్ధిఁగాంచు పాపంబులు
నశించు. సర్వభూతసముండై లభ్యాలభ్యంబులందు భేదబుద్ధిం బొరయక వర్తిం
చుచు లభించునాహారంబునఁ దృప్తిం గాంచుచు జితేంద్రియుండు నగు తేజస్వి
పాపంబుల దహియింపఁ జాలియుండు. కామక్రోధంబుల వశమున నుంచుకొని
బ్రహ్మపదంబు సేవింపవలయును. ఇంద్రియమనంబుల కైక్యముగల్గించినఁగాని
యందుల కర్హుండు కాఁడు. మఱియు. 432

క. తొలిరేయియందునే న్మిమ్ముల రాత్రి పరార్ధముననో పూనిక మనసుం
గలుపం దగు నాత్మను నిదె, సలలితయోగైకసిద్ధి సన్మార్గ మగున్. 433

సీ. పంచేంద్రియంబులఁ బరఁగుజంతువునకు నొకయింద్రియంబైన వికలమగున
యేని ప్రజ్ఞ నశించు నిధ్ధపర్వతపాదమువనుండి జలము లొయ్యన స్రవించు
నట్లు సాధకుఁ డింద్రియములను దొలుతనె వశముచేసికొనంగ వలయు నవల
మనసును ఝషహంత మత్స్యంబులకు మున్ను కూర్మాళిగ్రహియింపఁ గోరునట్లు
ఆ. పిదప శ్రోత్రములను బిమ్మటఁ జక్షుస్సులను ననంతరంబ తనదునాల్క
నవల ఘ్రాణము నిటు లారసి యోగియు, మనసుతోడఁ గూర్పఁ దనరు సిద్ధి.

క. తనసంకల్పంబుల నొ,య్యన మాని మనస్సు నాత్మయందు నిలుపఁగాఁ
జనుఁ బంచేంద్రియములనున్, మనసున నీరీతి యోగమార్గము చెలఁగున్. 435

ఆ. ఇంద్రియములు మనసు నెన్నుచు శ్రేష్ఠంబు, గాఁగ వెనుక నుండఁగా మనస్సు

నట్లై నాత్మ నిలువ నాపరమాత్మయుఁ, జక్క వెలుగఁ జాలు సాధులార. 436

చ. హృదయము నిర్మలంబగుడు నెంతయు ధూమము పోవ నగ్ని యె
ట్లుదితరుచుల్ వెలుంగఁ దనయుగ్రకరంబులు మేఘ మెట్లొ పో
వఁ దపనుఁ డొప్పునట్లుగ; నభంబున వైద్యుతమైనయగ్ని యొ
ప్పిద మగు నట్టు లాత్మయునువెల్గును యోగియు దానిఁ గాంచెడిన్. 437

ఆ. దానియందె సర్వమా నదె సర్వంబు, నందునుండు నట్టి యాత్మ వెలయ
గాఁ గనుంగొనంగఁ గలఁడు యోగియు నట్టి,తరుణమందు ననుచుఁ దలఁపవలయు.

తే. అట్టిపరమాత్మ హృదయంబునందు బ్రాహ్మ
ణోత్తములు జ్ఞానశక్తిచే నొప్పఁ గాంత్రు
ధృతియుఁ బ్రజ్ఞ భూతహితవృత్తి యెవరికిని
గలిగియుండునో వారె పో ఘనులు జగతి. 439

క. మునులార! యిట్లు కాలం,బు నెఱింగి వ్రతంబుఁ జక్కఁ బూని స్థిరముగా
మనసును నిల్పఁగఁ జాలిన, ఘనమతి యొంటరిగనుండి కడుఁ బూన్కితగన్.

ఆ. యోగ మభ్యసించి యొప్పిన తత్సిద్ధి, కలఘుఫలము గాఁగ నక్షరాఖ్య
మందుఁ గలియు వాని యాత్మయు మఱి జనిఁ,గాంచ దెన్ని చూడఁ గా వసుధను.

వ. ప్రమోహంబు భ్రమం బావర్తంబు ఘ్రాణశ్రవణదర్శనాద్భుతస్పర్శనశీతోష్ణ
మారుతంబులు లోనగువాని యోగబలంబున జయించి ద్వంద్వసముండై
యోగపరిచయంబలవరించుకొనినవాఁడు త్రిలోకంబులఁ జూడఁ గలండు.
గిరిశృంగంబు, చైత్యంబు, వృక్షమూలంబులు యోగాభ్యాసంబునకు నర్హ
స్థానంబులు. ఏకాగ్రచిత్తుండు కావలయు. యోగాభ్యాసంబునఁ జంచలంబగు
మనస్సు నియమింపఁగలండు. వేఱొండుపాయంబున దానినొంపఁజాలఁడు. లక్ష్య
మం దద్దాని జేర్చియుంచుట మంచిమార్గంబు. శూన్యాగారంబున నివసించుట
యోగికి యుక్తంబు. మనోవాక్కాయకర్మంబుల నియతుండై యుపేక్షాపరుండై
నియతాహారుండై లబ్ధాలబ్ధసముండై యుండుటయోగిలక్షణంబులు. మఱియు.

చ. తనకు నమస్కరించిన నితాంతము భక్తిని సన్నుతించినన్
మనసున మార్పునొందక సమంబుగఁ జూచుచు వారికిన్ శుభం
బును నశుభంబుఁ గల్గునటు బుద్ధిఁ దలంపక యుండుటే తగున్
ఘనుఁడగుయోగి కిట్టివె తగంగఁ బరీక్షలు శాస్త్రరీతిగన్. 443

తే. లాభములుగల్గునప్డు విలాసతఁ గన, కవ్వి తొలఁగిన యత్తఱి నార్తి గనక
సర్వభూతసమానుఁడై శ్వసనుఁ బోలి,యుండఁగాదగుమునులార యోగిసతము.

క. సమదర్శనుఁడై స్వస్థత, నమరెడి మన మొప్ప సాధువై యాఱునెలల్
సుమహితవృత్తిం దగునరు, క్షమ శబ్దబ్రహ్మ మెదుటఁ గన్పడి ప్రోచున్. 445

సీ. సమలోష్టకనకపాషాణుఁడై శ్రమ మొందు వారలఁ బరికించి వరుస యోగ
మభ్యసించుచు సారమనలేని సంసారమునుండి విరమించుకొనును యోగి;
యంతియె కాని మోహంబు నొందఁడు యోగమార్గమునన్ నీచ మనుజుఁ డేని
ధర్మకాంక్షిణియగు తరుణియేని విముక్తిఁ గాంచుఁ బురాణంబు క్షయము లేక
ఆ. తనరు నద్వియజము తగ సనాతనము నింద్రియములకును గోచరింపనిదియు
నగు విముక్తిపదము నందుదు రీయోగ, సిద్ధిఁ గనినవారు సిద్ధ మిద్ది. 446

## నూటయిరువది యెనిమిదవయధ్యాయము.

### మోక్షప్రాప్తిమార్గము.

క. అని యిట్లు వ్యాసముని చెప్పిన విని యమ్మౌను లెంతో ప్రీతి యలర ని
ట్లని రిట్లు వేదవచనము, జను లొగిఁ గర్మమ్ము వదలఁ జను నని పలుకన్. 447
తే. విద్యచే నేదిశను బొందు విమలచిత్తుఁ
డెట్టిగతిఁ గర్మమునఁ బొందు నిద్ది వినఁగఁ
గోరువారము మాదగు కోర్కిఁ దీర్ప
వలయు నీరెండు ప్రతికూలములుగఁ దగును. 448
క. ఒకదాని కొకటి వైరం, బెకదా యన్యోన్యమైత్రి యీ రెండిటి కిం
చుకయైనఁ గలదె యన విని, సకలజ్ఞుఁడు వ్యాసుఁ డనియె సన్మునులారా. 449
క. వినుఁ డీవ్యాఖ్యానము శ్రో, వను దెల్పెదఁ గర్మ మనఁగ వఱలెడుమార్గం
బును విద్య యనెడుమార్గం, బును జక్కఁగ శ్రద్ధమిగులఁ బొలయుచు నుండన్.
క. క్షరమని కర్మము మఱియ, క్షరమని విద్యయును జెప్పఁగాఁబడు రెంటన్
నరుఁ డొందుపదములను వి, స్తరముగ నెఱిఁగింతు గహనసామ్యము లివియా.
క. కల దనుచు నెవఁడు ధర్మము, పలుకునో యది యుక్తమగును భావింపఁగ లే
దిల ధర్మమనుచుఁ బల్కెడు, పలుకును జెవిఁబెట్టరాదు పండితుఁ డెపుడే 452
తే. యక్షసాదృశ్యమగు నిది యక్షుని దిదె, యన్నయట్టులు గానుండు సన్నుతింప
గలదనెడు మాటయే సత్యకలితమగును, నాస్తికోక్తుల నాలింపఁ డాస్తికుండు.
క. ఇరు తెఱఁగుల ధర్మం బిలఁ, బరఁగున్ వేదోక్తమయి ప్రవర్తనచిహ్నం
బరయఁగ నొకదానికగు ని, తరమునకు నివృత్తిలక్ష్మ తగియుండుఁ జుఁడీ. 454
సీ. కర్మము జంతువు కడఁగి బంధించును బంధనమ్మును విద్య వదలఁజేయు
నిట్టులౌటఁగదా ప్రవృత్తి కర్మం బగుఁ దన్నివృత్తియె విద్య తజ్జ్ఞులార
కావున శాస్త్రసంఘాతపారావారపారీణులై తగు పండితు లొగిఁ
గర్మములను జేయకయె యుందురు, కర్మముచేతనే కాదె చచ్చినసమస్త

తే. జంతువులు షోడశాత్మకాశాశ్వతతను, వును ధరించును విద్యచేతను స్థిరమయి
యక్షరాత్మకమైన దేహంబుగలుగు, నంచు నెఱుఁగంగ వలయు వేదార్థపరులు.

క. నరు లల్పమతులు కొందఱు, పరినుతిఁ గావింత్రు కర్మపద్ధతి వేదో
త్కారహిత మార్గంబున నాదరమున సేవించుచుంద్రు దాని సతంబుగ౯. 456

చ. పురుషుఁ డెవండు శ్రేష్ఠమగుబుద్ధిఁ జెలంగునొ ధర్మతత్త్వమా
ర్గరతిఁజెలంగునోఁ యతఁడు కర్మము నెన్నఁడు ప్రోదినీసుపు
ష్కరములఁ ద్రాగువాఁడు లఘుకల్పితకూపజలంబుఁ గ్రోల నా
దరణముఁ బూన నట్లనుచుఁ దత్త్వవిదుత్తములార యెంచుఁడీ. 457

సీ. కర్మఫలంబులుగా సుఖదుఃఖముల్ జనిమరణంబులు తనరుచుండు
విద్యకు ఫలముగా విమలపదం బొందు తగియుండు నటఁ జేర వగ యొనవదు
విమలపదం బొందు సనుహితపుణ్యుండు మరణంబు నొందఁడు మహిని బుట్టు
వును గాంచఁడుక్షయంబు గనఁడువృద్ధినిబొందఁడనియెబ్రహ్మంబునవ్యక్తమమృత

తే. మచలమును శాశ్వతంబు నౌనట్టిపదము
విద్యచేఁ బొందఁజాలును విమలయోగి
దానిఁగనఁ జాలు వికృతి నాఁదగదు దాని
నమృత మని చెప్పఁగాఁదగు నార్యులార. 458

చ. పరమపదంబు దానిఁ గను పండితుఁ లించుకయైన ద్వంద్వముల్
గురుతరపీడఁ గూర్పఁగను గుందరు మానసకర్మమైనఁ జే
యరుసతతంబు జంతువులయందు సమత్వము గల్గి మైత్రియుం
బరమహితంబు గోరుచును వర్ధిల్లుచుందురు లోకమం దొగి౯. 459

వ. విద్యామయుం డగుపురుషుఁ డొక్కఁ డుండుకర్మమయుండగువాఁ డొక్కఁడుం డు. జ్ఞాని చంద్రసమస్పర్శుండై సూక్ష్మకళ్యానితుండై మెలఁగుచుండు. ఈవిషయంబు మహర్షిపరిగీతంబు వర్ణింప నలవిగాక. యంబరంబునఁజక్రతంతువులుతిం పశక్యంబుగాని యట్లుండు. ఏకాదశవికారాత్మకుండై కళాసంభారసంభృతుండై కర్మగుణాత్మకమూర్తిమంతుండై కర్మరతుం డుండు నని యెఱుఁగవలయు. ఏవానియందు దేవుం డాశ్రయించి పుష్కరంబునఁ జంద్రునింబోలి యుం డునో యోగజితాత్మకుం డగునతని క్షేత్రజ్ఞుం డని యెఱుంగం జను సత్వరజ స్తమోగుణంబులు జీవగుణంబు లని యెన్నంబడు జీవం బాత్మగుణం బని యెన్నికఁ గాంచు ఆత్మ పరమాత్మగుణం బని చెప్పంబడు సచేతనంబు జీవగుణం బనియు సర్వత్ర యాజీవుండు సంచరించుననియుఁ దెలియం దగు. తదుత్కృష్ట నిగా క్షేత్రజ్ఞుని మహాత్ముం గర్తింతురు. సప్తభువనంబులు కల్పింపఁబడియె అని పలికి వ్యాసుండు మరల నిట్లనియె. 460

క. భువిలో క్షేత్రజ్ఞులె ప్రకృ, తివికారు లటంచు నన్నితెఱఁగులను సుధీ
నివహానుతిం గాతురు శ్రీ, శువిభూతి నెఱంగలేరు సుఁడి యవ్వారల్. 461

క. వారి నొకశక్తియుతులుగ, శ్రీరమణుఁ డెఱుంగఁ డాత్మఁ జెలఁగెడుశక్తిఁ
వారె ప్రపంచము నడుపుదు, రారయ లోకోపకారు లనవారెకదా. 462

తే. సాధుహాయములఁ గట్టినస్యందనంబుఁ, గడపుసారథివలెనెసర్గముఖకార్య
ములను వారలె యొనరింత్రులలితరీతి, మనసుతోఁగూడునింద్రియమండలమున.

సీ. ఇంద్రియంబులకంటె నెన్న నర్థంబులు శ్రేష్ఠంబు లగు మఱి చిత్త మరయ
వానికంటెను మిన్నగా నెన్నఁబడుచుండు మనసుకంటెను బుద్ధి వినుతిగాంచుఁ
బరమం బటంచును బండితవరులచే నద్దానికన్నను నాత్మ వరము
దానికంటె మహత్తు దానికన్ననుమిన్న యవ్యక్త మనునది యమృతతత్త్వ

తే. మంతకంటెను మిన్నయౌ నంతకంటె
మించునది లేదు పరగతి యెంచ నదియె
యదియె పరకాష్ఠ యనఁదగు నఖిలభూత
ములను గూఢాత్మయెంతయు వెలయుచుండు. 464

క. అది యెఱుఁగ నశక్యం బగుఁ, గద దానిఁ సూక్ష్మదృష్టి గలపెద్దలు నే
ర్పుదగఁ సుసూక్ష్మబుద్ధిని, సదమల మని తెలిసికొంద్రు సద్భక్తియుతిఁ. 465

వ. మేధాసహాయంబున నంతరాత్మయందు లీనంబగుతత్త్వంబును, మనస్సుతో షష్ఠంబులగు నింద్రియంబులచే నింద్రియార్థంబులను నెఱుంగుదురు. యోగనిష్ణాతుండు పరమధ్యానంబున విద్యాసంపాదితంబగు మనంబును నిలిపి భగవత్పరతంత్రుఁడై ప్రశాంతాత్ముఁడై పరమపదంబు నొందఁగలఁడు. సర్వేంద్రియములకువశ్యంబగునాత్మగలిగి చలితస్మృతియై యాత్మసంప్రదానంబున మర్త్యుండు మృత్యువు నొందు. 466

తే. సర్వసంకల్పముల మాని సత్త్వమందుఁ, జిత్తమును నిల్పి కాలంబుచేతఁజిక్కు-
పడక ముక్తిని బొందును బండితుండు, చిత్తము ప్రసన్నతంగాంచి చెలఁగుచుండ

క. యతియు శుభాశుభకర్మ, ప్రతతిని దత్ఫలముల దుదిఁ బాటింపకయే
సతతం బాత్మను గనుచు ని,హితసుఖమును గాంచఁజాలు నెన్న ఘనుండై. 468

సీ. స్వప్నంబునం దోఁచు శ్వశ్రేయసం బట్లు నిర్వాతమగుచోట నిశ్చలముగఁ
దనరుదీపంబుచందమునఁ బ్రసాదలక్షణము నెఱుంగఁగాఁ గలఁడు ధీరుఁ
డేపద్ధతిని యోగి యెప్పుడు పూర్వాపరములగు రాత్రిభాగముల నాత్మ
యం దాత్మ యోజించి యల్పమౌ నాహారమును గొని పరిశుద్ధముగఁ జెలంగు

ఆ. నాత్మ యలరుచుండ నాపరమాత్మను, గనును; సర్వవేదగతరహస్య
మసదృశం బనామయము పరమాత్మవి,జ్ఞానపదంబు నయినశాస్త్ర మిదియె. 469

క. దీనిని సచ్ఛిష్యులకుఁ, సూనులకుఁ దెలుపఁదగును శుభతమధర్మా
ఖ్యానంబుల మఱి సత్యా,ఖ్యానంబుల నగ్ర్య మిద్ది యగు మునులారా. 470

క. పదివేలవర్షములు ప,ట్టుదలఁ శాస్త్రాంబుధిం గడుఁ మతిబలమొ
ప్పఁ దగినయట్లు మథించిన, నొదవెను సారం బిదియె మహోన్నతము నగుఁ.

తే. ఇదియె దివ్యామృతం బగు నిద్ది దధిస,ముద్భవం బగునవనీత ముతరుతర
శాఖనుండి జనించిన జాతవేద, సునికణం బంచు నెఱుఁగుఁడు మనములందు.

సీ. విమలాంతరంగుల కమలమోక్షప్రాప్తికొఱకు శాస్త్రావళి గుప్తమైన
యర్థంబు దీని సమర్థించి రార్యులు స్నాతకులకు నిది శాస్త్రవర్య
ముపదేశ్యము నగు వా రొగిఁ బుత్త్రులకుఁ జెప్ప వలయును దీనిని బ్రబలశాంతుఁ
డగువానికే చెప్పఁదగు నశాంతునకు నదాంతునకు నదపోవంతునకును

ఆ. వేదవేత్తగాని విప్రున కనుగతుఁ, డయిచెలంగకుండు నట్టివాని
కీర్ష్యగలుగువాని కెన్నఁ జక్కనిమార్గ, మాశ్రయింపకున్నయతనికి మఱి. 473

క. గురు ననుమతిలేని మహ, త్తరకార్యముచేయునట్టి దంభునకు నిరం
తరచిత్తశుద్ధిహీనున, కరయఁగఁ దర్కంబు నెఱుఁగనట్టి జడునకున్. 474

ఆ పిశునవృత్తిగలుగువేదకునుం జెప్పఁ,దగదు శ్లాఘనీయుఁడుగఁ జెలంగి
శాంతచిత్తుఁ డగుచు సత్తపోవంతుఁడై, ప్రియుఁడునైనయట్టిపృథ్వీసురుని. 475

క. కనినంతన యుపదేశిం,పను జనుఁ దనమాట వినెడుపట్టికిఁ బ్రియశి
ష్యునకుఁ వినీతునకు నొ,య్యనఁ జెప్పఁ వలయు నిది రహస్యం బగుటన్.

క. ఇతరునకుం జెప్పం దగ, దతిశయపాపంబుగల్గు నట్లొనరిచినఁ
మతిగల్గ రత్నపూర్ణ,క్షితి నిచ్చిన నీయవచ్చుఁ జెచ్చెఱఁ బ్రీతిన్. 477

తే దీనిమాత్రము నుంతయుఁ దెలుపరాదు, సర్వవస్తువులందు శ్రేష్ఠంబె యగుట
గుహ్యతమమైన దీనిని గోర్కి మదిని, నిలుపుకొనఁదగు మునులార! పలుకులేల.

వ. ఇది మహర్షిసమ్మతంబు. వేదాంతపరిగీతంబు. మీరు ప్రశ్నింపఁ జెప్పితి. మీకుఁ
గలశంకలఁ దీర్చునదియు నామనంబునంగలదియు నగు దీనిని జక్కఁగా ధరిం
పుఁడు. ఇంక నేమి వినఁగోరుదు రన మహర్షు లిట్లనిరి. 479

తే. మరల నధ్యాత్మతత్త్వంబు మానివర్య, విస్తరించి వచింపుమా వినఁగ వేడు
కయ్యె మేమెట్లు సరి తెలియంగఁగలమొ,యవ్విధంబునఁ గరుణింపుమనిన నతఁడు.

చ. *మనమున సంతసం బలర మానుల కిట్లను శాంతచిత్తులై
యనఘులు నైనవారలకె యాపరతత్త్వముఁ దెల్పువిద్య చె
ప్పనువగు దానిఁ బూనుపులె పాఠము చేయఁగ నర్హు లేరు దా
నిని వచియింతు వ్యాఖ్యవలె నెమ్మి వినుండు విముక్తి చేకురున్. 481

* అధ్యాత్మం యదిదం విప్రాః పురుషస్యేహ పఠ్యతే. అని మూలము.

క. ధరణి జలంబులు జ్యోతియు, మరుత్తు వ్యోమంబు నివియె మహితంబులుగాఁ
బరిసుతిని మహాభూతము, లురుకార్యక్షమము లనుచు నొప్పఁగఁ గాంచున్.

తే. ఇవ్వి భూతావళులయందు నెసఁగి ప్రాణ
వంతములఁ జేయు నన విని భ్రాంతచిత్తు
లగుచు నస్మాను లిట్టని రాకృతి యెటు
వాని కగు నద్ది కనరానిభంగి యెట్లు. 483

సీ. ఆకాశ మెట్లు దేహములందు నుండును? దాని వర్ణింపుమా మానివర్య
యింద్రియగుణతతి యెద్ది యద్దాని నేవిధమునఁ గనవచ్చు విశదపఱుపు;
మన విని వ్యాసుఁ డిట్లనియె నీవిధ మెల్ల వర్ణింతు దానితత్త్వం బదెల్ల
మీరు సమాహితులై రమ్యతత్త్వంబు వినుఁడు శబ్దశ్రోత్రవిష్ణుపదము

తే. లనెడు నివి మూఁడు నాకాశమునకు లక్ష
ణములు చేష్టయు నట్లె స్పర్శమును బ్రాణ
ము నను నీ మూఁడు లక్షణము లగు వాయు
వునకు నని యెన్నఁబడుచుండు ఘనులచేత. 484

వ. రూపంబును జక్షు ర్విపాకంబు లనునీమూఁడును దేజోలక్షణములు. రస రసన
స్వేదంబు లనుమూఁడు నుదకలక్షణములు. ఘ్రేయఘ్రాణశరీరంబులు మూఁడును
భూమిలక్షణంబులు. ఈయింద్రియగ్రామంబు పాంచభౌతికం బని యెఱుంగఁ
దెల్పితి. మఱియు 485

సీ. అనిలునకుఁ స్పర్శ మనునది రసము జలమునకు గుణము తేజమున కెన్న
గనురూప, మంబరంబునకు శబ్దము గంధ ముర్వికి గుణమయి యొప్పుచుండు
మనసు నైజముబుద్ధి యనునివిమూఁడు స్వయోనిజంబులుగాఁగనొప్పుగుణము
లీగుణంబులజస్ర మేవిధినైనను నియమంబు దాఁటక నిర్మలగతి

ఆ. నలరుచుండు ననుచు నరయుఁడు కూర్మము
స్వేంద్రియములఁ జాఁచి యొలమి ముడుచు
కొనెడునట్లు బుద్ధి యనునది యింద్రియ
గ్రామమందు విభుతఁ గాంచి యుండు. 486

వ. పాదతలంబులకుఁ బైన వెనుకఁ గ్రిందును జూచుకృత్యంబునందు బుద్ధి యొప్పి
యుండు. గుణంబులచే బుద్ధియాడ్వఁబడు. బుద్ధిచేనింద్రియంబు లాకర్షింపఁబడు.
మనస్సుతో నాలుగునింద్రియములు బుద్ధికి లోఁబడినవియగు. బుద్ధ్యభావమున
గుణములుండవని యెఱుంగవలయు. పంచేంద్రియములు నాఱవదగుమనస్సు
షష్ఠేంద్రియము లనికీర్తింపఁబడు. బుద్ధి సప్తమ స్థానంబు నాక్రమించు. క్షేత్ర
జ్ఞుం డష్టముఁ డని కీర్తింగాంచు. చక్షురింద్రియంబు చూచుటకే యుపయుక్తంబు

మనంబు సంశయించు. బుద్ధియధ్యవసానార్థం బగు. క్షేత్రజ్ఞుండు స్వామియై
కార్యంబు సాధించు. సత్త్వరజస్తమోగుణంబులు మూఁడు స్వయోనిభవంబు
లని యెఱుంగుఁడు. సర్వభూతంబులయందు సమంబులై యుండు. వానిగుణం
బులం బరీక్షించుపద్ధతిని వినుండు. 487

ఆ. ఆత్మయందుఁ బ్రీతి యలరు నెత్తఱిఁ బ్రశాం
తము గనుండు నాత్మ యమల మగుచు
నదియె సత్త్వగుణముగఁ దగు నంచు నెఱుంగ
వలయుఁ జుండి మౌనివర్యులార. 488

క. తనువున మనసునఁ దాపము, గనుపట్టునొ యెట్టితఱిని గాఁదగును రజం
బునఁ గల్గుమారుపని మీ, మనముల నెంచంగ వలయు మాట లిఁకేలా. 489

తే. మనసు వ్యామోహయుక్తమై మఱియు విషమ
మగుచు నప్రతర్క్యము నయి యరయఁ జాల
కజ్ఞతం గని యుండుఁ గార్యంబులందు
నదియె యగును దమోగుణ మార్యులార. 490

సీ. ఆనందము ప్రియప్రహర్షముల్ స్వాస్థ్యము స్వస్థాత్మచిత్తత పరఁగనేని
కారణంబుననో యకారణంబుననో యవెల్ల సత్వగుణంబు లేయటంచు [హ
నరయఁగాఁ దగియుండు నభిమానము మృషావచనము లోభంబునక్షమయు మో
మెప్పుడు వృద్ధిం గాంచునట్టు లేయైనను రాజసగుణము లరమ్యములును

ఆ. గా నెఱుంగవలయు మానని మోహప్రమాదములును దంద్రి మఱియు నిద్ర
యప్రబోధితయును ననునివి కల్గినఁ, దామసగుణము లని తలఁప జనును. 491

క. మన మొక కార్యము చేయం, గను దలఁచును బుద్ధి దానిఁ గడుఁ జింతింపం
గను బూను హృదయమును బ్రియ, ముని యో కాదనియొ యెంచునట్లగుటతగన్.

తే. మూఁడువిధములుగాఁ గర్మము పురికొల్పుఁ
గార్య సాధన మప్పు డిక్కరణిమూడు
పనిని సాధించు; నింద్రియప్రతతికన్న
నర్థములు శ్రేష్ఠములు మనం బంతకంటె. 493

క. ఘనమగును దానికంటెన్, వినుతింగను బుద్ధి యాత్మ వేభంగులుగా
వినుతింపఁబడెడు నద్దానిని మించి యటంచును మదినిం దలఁపఁ జనున్. 494

క. మనుజునకు బుద్ధి యాత్మయుఁ, గనుపట్టుఁ బ్రధానములుగఁ గడఁగి తలఁప నం
దును బుద్ధి యాత్మ నాయిక, యనఁబడు నది వికృతినొంద నంతయు నట్లౌ. 495

క. మనసు చలించును నింద్రియ, మనిమిత్తము కలఁతనొందు నట్లౌటను బు
ద్ధిని బ్రభ్విగాఁ దలంపం, జను నని యార్యులు వచింత్రు చక్కని మతిచేన్.

సీ. బుద్ధి శ్రోత్రేంద్రియమును గూడనది వినుఁ ద్వగ్వృత్తిఁ గనునట్టితఱినిస్పర్శ
మగునట్టు లగును నయనములఁగూడిన నవి చూడఁగాఁజాలు నట్లె జిహ్వ
గలిసిన రుచి గాంచఁగాఁ జాలు రసనయు ఘ్రాణేంద్రియముగూడఁగా నదియును
వాసనచూచు నీవరుసఁగ బుద్ధి యేయింద్రియమును గూడు వృత్తినొందు

తే. నదియు లేకున్న శక్తిలే కద్ది యుండు;
బుద్ధిభావమునకుఁ దగుపోల్కిఁ బురుష
వృత్తి తగియుండు నొకతఱిఁ బ్రీతి నొందు
నొక్కతఱి శోకముం బొంది యుండుఁ జుండి. 497

క. కలకాలము సుఖములనే, గలిగి చెలంగుటయు దుఃఖకలితుండయి యే
విలపించుటయును లేది, వ్ముల బుద్ధివికారరీతిఁ బొలుచు మనుజుఁడుర్. 498

క. సరిదధిపతియగు జలనిధి, పరికింపఁగ వేలదాఁటి పరుగిడఁ డట్లే
పురుషుండు బుద్ధిభావము, సరిగాఁ గనుఁగొనుచు వృత్తిసరణిని గాంచుర్.499

వ. వాంఛలు పొడముతఱి మనస్సు బుద్ధి నాశ్రయించు. బుద్ధ్యధిష్ఠానమందు త్రిగుణంబులు బ్రవర్తించు నని యెఱుంగ వలయు. ఇంద్రియంబు లెల్ల మేధ్యంబు లనియే యెఱుంగవలయు. బుద్ధి యేయే వేళల నేదేది చేయుం దలంచు నాయా కార్యజాలం బింద్రియంబు లొనరించుచుండు. బుద్ధిభావము మనస్సునందలి భాగంబుగ వర్తించు. రజోగుణం బుద్రేకం బగుతఱి సత్త్వం బడంగియుండు. సత్వరజస్తమోగుణంబులు మూఁడును బుధ్యనుకూలప్రవృత్తిం దగియుండును వీనింగూడి బుద్ధియుఁ బ్రవర్తించు. చక్రభాగంబులు రథనేమిసరణిఁ బ్రవర్తించు చందంబున వీనిప్రవృత్తి సాగునని యెఱుంగుఁడు బుద్ధిప్రధానంబులగు నింద్రియంబులచేఁ బ్రదీపార్థము మనస్సు చెప్పంబడుచుండు. ఉదాసీనులచే యోగంబు స్వేచ్ఛగా నిశ్చయింపఁబడులాగున నింద్రియకార్యంబులు నిశ్చయింపఁబడియె. బుద్ధిమంతుఁ డీప్రవృత్తి యింద్రియస్వభావంబని మోస మొందఁడు. యోగి విగతమత్సరుండై శోకింపక సంతోషింపక ప్రవర్తించుచుండు. కామగోచరంబు లగునింద్రియంబులచే నాత్మకనుంగొన శక్యంబు గాకయుండు బహుమార్గంబుల నాశ్రయించి ప్రవర్తించుచు జితేంద్రియులుగాక కృతపుణ్యులుగాక యుండువారిచే నాత్మతత్త్వం బెఱుంగఁబడదు. ఎప్పుడు మనస్సు నిర్మలంబై తేజోవంతంబగు నట్టితఱి దీపదీప్తిచే నాకృతికనఁబడునట్లు పరమాత్మ కనంబడు. దీనికి యోగంబె ప్రధానసాధనంబు. తమస్సంవృతంబగుపదార్థంబు చూడ శక్యంబుగాక ప్రకాశంబు సాయపడఁ గనఁదగియుండునట్టు తమోగుణంబునఁ జూడశక్యంబుగాని యాత్మ యోగప్రదీప్తిచేఁ జూడశక్యంబగు నని నిశ్చయింపుఁడు జలములం దిరుగుపక్షి నీటఁ దడియక యుండునో విముక్తాత్మ యగుయోగి యట్లే గుణదోషంబుల బాధింపంబడక యుండు. అట్టివాఁడు

కృతప్రజ్ఞుం డనంబడు. వాఁడు విషయములసంచరించినను వానికి లోఁబడఁ
డని తెలియుఁడు. మఱియు. 500

క. ఏయోగికిఁ బరమాత్మను, నేయెడలం జూడఁగోర్కి యేర్పడునో సదా
యాయోగి కర్మముల రతిఁ, బాయును మోక్షంబు హస్తభవమై యుండున్.

తే. సర్వభూతాత్మభూతుని సంగతిఁ గన, ముక్తి యబ్బురమే గుణముల నతం డె
కలుగఁజేయును నవి యాత్మఁ గలఁతనొందఁ, జేయఁజాలవు సతతంబు సిద్ధమిద్ది.

సీ. ఆత్మను గుణవార మరయంగఁ జాలదు దాని నాపరమాత్మ తా నెఱుంగఁ
గలఁడు గుణంబుల లలి ధరియించును దానె ద్రష్టయు నయి తనరుగాన
క్షేత్రజ్ఞ సత్త్వంబు స్థిరమతి నూహించి వానియంతరము లీవరుస నెఱుఁగ
వలయును క్షేత్రజ్ఞుఁ డలఘుశక్తి గుణాళి సృజియించు సత్త్వంబు సృష్టిచేయఁ

తే. జాల దీరెండు వేఱైన సమయమందు, నొకటిగా నున్నఁజేయంగ నొప్పు మశక
మట్లుదుంబర మేకమై యలరు నట్టు,లనుచు యోజింపుఁడే మీర లన్వహంబు.

వ. ముంజంబున నిషిక యుండునట్లు వేఱుగనున్న యట్లు తోఁచి కలిసియే యుందురు.
ఒకదానియం దొక్కటి ప్రతిష్ఠితంబై యుండునని యెఱుంగుఁడని పలికిమహర్షు
లకు వ్యాసుండు మరల నిట్లనియె. 504

## నూటయిరువదితొమ్మిదవయధ్యాయము.

### విశిష్టధర్మవర్ణనము.

తే. వినుఁడు క్షేత్రజ్ఞుఁ డలరుచు విభుఁడయితగ, సత్త్వముఖలగుణంబుల సరగసృష్టి
చేయు నదియె వికారంబుఁ జెందుచుండు, నీశుఁ డెప్పు డుదాసీనుఁడే తలంప.

సీ. ఈగుణసృష్టియు నెన్న స్వభావమౌ సత్త్వంబునకును సూత్రంబు నూర్ణ
నాభి సృజించుచందమున సత్త్వము ప్రవర్తించుచునే యుండు నెంచ మరల
దని కొంద ఱందు రయ్యది నైజమందురు కొందఱు సత్త్వంబుకొలఁది నెఱిఁగి
సృజియించు విరమించు స్వేచ్ఛ నందురు కొంద ఱీయుభయంబును నెంచిరేది

తే. సాధుమార్గమొ దానిని జక్క నిర్ణ
యించుకొనఁదగియుండు నిశ్చించ నొక్క
సంశయముతోఁచు నది తీర్ప సాధ్యపడని
యట్టులుండును మునులార యరయుఁ డెలమి. 506

వ. ఆత్మయను తత్త్వం బనాదినిధనంబు. దీనినెఱింగి మనుజుఁడు చరింపందగు. కోప
మొందక ప్రహర్షంబు గాంచక నిత్యంబు విగతమత్సరుండై చరించు టొప్పు.
ఈసిద్ధాంతము మదినిల్పిన జగన్మిథ్యాజ్ఞానంబు కలుగు సంశయములు తొలంగు.
జలపూర్ణప్రవాహమును మనుజులు దాఁటునట్లు శాశ్వతంబుగాని భూలోకం

బు నీజ్ఞానంబుగలవాఁడు నిస్తరించు. విద్వాంసుండైన నీయజ్ఞానరూపసంసార సాగరంబున మునింగినఁ దరింపఁజాలఁడు. తత్త్వవేత్త యగువాఁ డీజలంబులకు దూరంబుగానుండును. కావున నీవిషయమును జక్క నాలోచించి కేవలజ్ఞానం బు నాశ్రయించి యాశాలతను ఛేదించి భూతముల కగతియగు గతి నాలోచించి యుత్తమంబగు శమంబు నొందవలయును. 507

సీ. ఇదె జన్మసామగ్ర్య మిద్దాని విప్రుండు పట్టుదలంబూని పరమనియతి
ననుసరింపందగు నద్ది యాత్మజ్ఞాన సన్నిభ స్నైహైక సత్ఫలంబు
దీని నెఱుంగు టే ధీమంతులకుఁ ఋణ మింతకంటె నెఱుంగ నేదికలదు
తత్త్వ మిద్దానిని దగనెఱింగినమనీషులు కృతకృత్యులై సుఖనివాస
తే. మైనసత్పద మొందుదు రాత్మవేత్తలకు మహాభయ మెందుఁగల్గదు విమూఢు
లైన వారికిఁ బరలోకమందు సాధ్వసము దురంతము గల్గు నిశ్చయముసతము.

క. దీని నెఱుంగుటఁ గల్గెడు, దానికి మించినది లోకతతి లేదనియే
మానసముల నెంచుఁడు సన్న్యాసులు మీఱౌట వేఱుమాట లిఁకేలా. 509

క. నరుఁ డిట్టి విమలవిజ్ఞానరతిం గనఁడే జగజ్జననిఁ జూడఁగ లేఁ
డురుతర తేజోమూర్తిని, బరమేశ్వరుఁ గానలేఁడు బాలిశుఁ డగుటన్. 510

క. సతతతము దుఃఖాకులుఁ డగు, గతి యాతని కిట్టి దగును గల్మషరహితం
బతులితమునైన జ్ఞానము, మతి నొప్పినచో లవంబుమాత్రపు వగయున్. 511

క. కలుగదు ప్రాగ్భవపాపావళి యాతని నొంపలేదు భవ్యపదమునం
గలకాల మామహాత్ముని, నిలుపుం బెక్కేల మౌనినిర్జరులారా. 512

వ. అనభిసంధిపూర్వకంబుగ నొనరించిన పురాకృతంబు జ్ఞానంబు దహియించు. ఏది ప్రియమో యేది యప్రియమో యీయుభయంబునం దేదియొనరించిన నదిఫలం బుం బ్రసవించు నని వ్యాసమహర్షి పల్కు మును లిట్లనిరి. 513

క. మునివర యేధర్మము మించినధర్మము లేదో యావిశిష్టసమాఖ్యం
దనరిన ధర్మముఁ దెలుపుము, మనుజుల కుపకార మగుట మహితం బగుటన్.

చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నాద్యమునిస్తుతమైన ధర్మమున్
వినఁదగు మీర లంచు నెద వేడుకగల్గియె యుండు నావిశి
ష్టనియతధర్మ ముత్తమము సత్ఫలదంబు వినుండు శ్రద్ధతో
మునివరులార! యింద్రియసమూహము వే మథియించుఁ జిత్తమున్. 515

ఉ. కావున వాని బుద్ధిని నికామము లోఁబడఁ జేసికొంచు నిం
పావిధి స్వేచ్ఛగాఁ దిరుగు నర్భకులన్ జనకుండువోలె స
ద్భావము నొందఁగూర్పఁదగు వానిమనస్సునఁ గూర్చు టొక్కఁడే
పావనమౌ తపం బదియె భవ్యతమంబగు ధర్మ మెంచినన్. 516

తే. సర్వధర్మంబులను మించఁజాలు నద్ది, పరమధర్మంబు నాఁబడు ధరణి నదియె
విద్యచే నింద్రియములను విమలమనసుతోడ నాఱింటినిం గూర్పఁజూడవలయు.
క. దానినె యాత్మయు దృష్టిన్, బూనంబగియుండు నెన్నిపోలిక లున్నన్
గానక వాని నిదొక్కటి,యే నిశ్చలవృత్తిమీఱ నేపధినైనన్. 518
తే. అభ్యసించిన జూలు గృహంబునందుఁ, గలుగువస్తువులెల్ల నిక్కముగఁ జెడును
గనఁబడెడువాని గనకుండఁ గాంతుమీఱ,నాత్మచే నాత్మఁ గనఁజాలు నతఁడునిష్ఠ.
క. అనలు విధూముని చందం,బున సర్వాత్ముని మహాత్ముఁ బూనికఁ జూడం
గనుజాలు వారె జ్ఞానం,బునఁదగు బ్రాహ్మణులు నాఁగఁ బొల్తురు ధాత్రిన్. 520
చ. సుమఫలభూరిశాఖలను శోభిలువాత్మమహాద్రుమంబు నే
త్రములను గానఁజాలదు నరవ్రజ మింక నదేటిపుణ్యమో
యమలఫలంబు గాంచుచెటో యంచుఁ దలంపుఁడు మానులార జ్ఞా
నమునఁ జిదాత్ముఁ జూచు మునినాథుఁడు వేఱొకఁ డేల చేయఁగన్ 521
వ. ఎవ్వఁడు సర్వంబునుం గాంచునో యామహాత్ముఁ డంతర్వర్తియై యుండు యోగి జ్ఞానదీప్తంబగు మనస్సున నాత్మచే నాత్మను గాంచఁజాలు. మీరు నాయాత్మను జూడ నభ్యసించి విరాగులరై యుండునది. సర్వపాపములు నశించు. విముక్తి చేకురు. కుబుసంబుపోవ నలరారు నురగంబు చందంబున మీరుందురు. దానికి నిరుపమబుద్ధి ప్రధానంబనం జను. అది చేకూరినఁ జింతాజ్వరములు పోవు. సర్వతస్సంవ్యాప్తప్రవాహంబై ఘోరాకారంబై లోకంబుల నెల్లముంచి వేయఁజాలి, పంచేంద్రియగ్రాహంబులు గలిగి మనస్సంకల్పరోధసంబై లోభమోహతృణచ్ఛన్నంబై కామక్రోధరూపసరీసృపంబై సత్యతీర్థానృతక్షోభంబై క్రోధమయపంకంబై యవ్యక్తప్రభవంబై శీఘ్రగమనంబు గలిగియుండు సంసారమహానదీవతంసమును బుద్ధితరణి సహాయంబునం దరింపుఁడు. అది యకృతాత్ములచే దుస్తరం బగు ఆమహానది సంసారసాగరాభిముఖంబుగఁ బాఱు. యోనిపాతాళదుస్తరం బని యెఱుంగవలయు. మఱియు నది యాత్మజన్మోద్భవంబు జిహ్వావర్త భీషణంబు దురాసదంబు ధృతిమంతు లగుమనీషులే దానిం దరింపఁగలరు. దానిం దరించినవారు సర్వతోముక్తులై విధూతపాపులై యాత్మజ్ఞానసంపన్నులై శుచిమంతు లగుదురు పరమోత్తమబుద్ధిసంపన్నులై బ్రహ్మపదప్రాప్తు లగుదురు.
తే. సర్వసంక్లేశములనుండి సత్వరముగ, విడుపఁబడి సుప్రసన్నైకవిమలబుద్ధి
యలరఁగా గతకల్మషుం డగుచు నెల్ల, తావులను గల్గుసర్వభూతముల సమత.
క. కనుఁగొనుచుఁ గోప ముండక, ఘనహర్షము గనక ఘాతుకత్వము విడి యా
త్మను గాంచఁజాలు నట్టిం, డని తెలియఁగనౌను మీర లాదృతిమీఱన్. 524
తే. ఇట్టిజ్ఞానము కుదురున యేని దాని
కంటె మించినధర్మంబు గలదె యొకఁడు

బుధులు తలపోయుదురు సర్వభూతహితము
దలఁచువారలుగావున ధాత్రియందు 525

సీ. ఇదియె ధర్మంబని యెల్లధర్మంబుల నెఱిఁగినమునులు సత్యేష్టమతులు
పల్కిరి దీనినే పరమపవిత్రధర్మంబుగా సుతులకు రమణఁ దెల్ప
వలయును దండ్రులు సులలితమతియయి ప్రయతుఁడై హితుఁడయి ప్రజ్ఞగలిగి
యనుగతుఁ డగువాని కాత్మవిజ్ఞానంబు సర్వగుహ్యతరంబు సాధుతమము

తే. నాత్మసాక్షికమును నయి యమరుదీని, దెలుపఁగాఁ దగు నిట్టినియతి జెలంగ
కున్న వనితకు నరునకు నెన్న షండునకును దెలుపంగరాదు జ్ఞానదము నగుట.

తే. బ్రహ్మ మనునది భూతభవ్యభవ మసుఖ, మట్లదుఃఖము నని చెప్ప నగును దీని
నాత్మ నెఱిఁగినపురుషులు నంగనలును, మరల జన్మంబు నొంద రీక్ష్మాతలమున.

క. *మతములు సర్వవిధంబుల, క్షితి ఖ్యాతిని గాంచిన వని చెప్పితి మీకున్
మతిమంతులార యవి శాశ్వతముగ నుండినను నుండు నమయు నొకతఱిన్.

చ. వినయముఖంబులై తనరు విశ్రుతసద్గుణరాజి నొప్పి ప్రీ
తిని దయఁబూని యున్న సుతు ధీయుతుఁ గాంచి ముదంబు మీఱఁగా
జనకుఁడు యుక్తమంచెఱిఁగి జ్ఞానము దీనిని దెల్పఁగాఁ దగున్
దనయుని వృద్ధిఁగోరి పరితాపముఁ బాపు నటన్న నమ్మికన్. 429

మోక్షోపాయము.

క. విని యిట్లుపలుకు వ్యాసవ,చనములఁ బ్రశ్నించి రిట్లు సాధుమునీ! ము
క్తిని బొందునుపాయంబును, వనజభవుం డొప్పురీతిఁ బల్కెను గాదే. 530

క ఆమార్గము నిరపాయం, బై మానితమునయి తనరు నట్టియుపాయం
బే మదుల నెఱుఁగఁ గోరుదు, మోమానివరేణ్యయనఁగ నురుమోదమునన్.

సీ. వ్యాసుండు వచియించె వర్ణ్య మీయది యగు నిపుణదర్శనము నెగడుచుండు
నేయుపాయమున సర్వేష్టదార్థంబులు వెదకంగఁబడు దాని వినుఁడు భక్త
పరులార! యిల ఘటోపకరణమందున్న బుద్ధి ఘటోత్పత్తిఁ బొదలకుండు
నట్లు ధర్మాద్యుపాయార్థమం దన్యధర్మములనిష్ఠయును గారణము గాదు

తే. తూర్పుసంద్రమునం బోవు త్రోవ యద్ధి
పశ్చిమాబ్ధికిఁ బోవదు పరమమార్గ
మొక్కటియె మోక్షమునుబొంద నొప్పియుండు
దానిఁ దెల్పెద వినుఁడు తత్త్వజ్ఞులార. 532

క. క్షమచేతఁ గ్రోధమును గా,మము సంకల్పంబు చేయమానుటచే స
త్త్వము సేవించుట నిద్ర జ,వమునన్ గెల్వంగవచ్చుఁ బ్రాజ్ఞుఁడు పూన్కిన్.

* యథా మతాని సర్వాణి తథైతాని యథాతథా, కథితాని మయా విప్రా భవంతి నభవంతి చ అసిమూలము.

సీ. భయము జయింపంగవలయుఁ బ్రమాదంబు బోరయనియునికిచేఁ బొలుచుజ్ఞాన
మున క్షేత్రమును గావఁబూనంగఁదగు ద్వేషమును నిచ్ఛఁ గామంబు మొద
గలుగువానిని ధైర్యకలన గెల్వందగు నిద్రను బ్రతిభను నిరతమమల[లుగాఁగఁ
విజ్ఞానమున గెల్వ విమలాత్ము లెంతు రుపద్రవంబుల యోగపరుఁడు నియత

తే. హితమితాశనముననె జయింపఁ గలుగు;
మోహలోభంబులను సదా మోదయుక్తిఁ
బాఱఁదోలంగఁ జనును దత్త్వంబు సతము
దలఁచుటఁ జె విషయంబుల గెలువఁ దగును. 534

క. మనమందు ననుక్రోశంబును బూని యధర్మముఁ గ్రమమున గెల్వఁగ వ
చ్చు నుపేక్ష ధర్మమును గెల్వను బోలునటంచు సాధువరు లందు రిలన్. 535

క. చిరకాలము కార్యంబును, జరపుటచే నాశ గెల్వఁ జను సంగంబుం
బరివర్జించుట తనదగు, నురుసామర్థ్యంబు గెల్వ నొప్పుం జుండీ. 536

సీ. నిరతంబు కూడక జరపుటచే స్నేహమును యోగశక్తి క్షుధను జయింప
వలయుఁ గారుణ్యసంకలితమానాత్మ చే నాత్మను గెల్వంగ నగును ధరను
బరితోషమునఁ దృష్ణఁ బాఱఁదోలందగుఁ దంద్ర నుత్థానసంధానముననె
గెలువవచ్చు వితర్కముల నిశ్చయంబున బహుభాషలను మౌనపరత శౌర్య

తే. మున భయంబును వాఙ్మనంబులను బుద్ధిచేత గెల్వంగవలయును సిద్ధమైన
జ్ఞానచక్షుస్సుచేతఁ జక్కఁగ నెఱిఁగి,యనుచుఁ బల్కిరి ప్రాజ్ఞు లోయార్యులార.

వ. ఆత్మ జ్ఞానమయంబు. శాంతి దానిఁ బొందింపవలయును. శాంతస్వాంతంబునఁ బరిశుద్ధకర్మంబునఁ బరిపక్వచిత్తుండు కావలయును. పంచసంఖ్యాకంబులని జ్ఞానులచేఁ బరిగణింపఁబడు యోగదోషంబుల వదలందగు. కామక్రోధలోభభయస్వప్నంబులు యోగదోషంబులు. వీనిని యోగసాధనంబున జయింప వలయుం గాని వేఱుసాధనంబున శక్యంబుగాదు. ధ్యానాధ్యయనదానసత్యలజ్జార్జవక్షమాశౌచాచారంబులు నింద్రియశుద్ధియు సంయమంబునను వీనిచేఁ దేజంబు వృద్ధి యగును. పాపంబులు నశించు. సకలసంకల్పంబులు సిద్ధించు. విజ్ఞానంబు క్రమక్రమంబుగ వృద్ధియగు. ఆతేజస్వి ధూతపాపుండై లఘ్వాహారుండై జితేంద్రియుండై కామక్రోధముల స్వవశంబున నుంచుకొని బ్రహ్మపదంబు నొందు. అమూఢత్వంబు నసంగిత్వంబు. కామక్రోధవర్జనంబు అదైన్యంబు ననుదీర్ణత్వంబు ననుద్వేగంబు ననునివి మోక్షంబు నొందుటకు మార్గంబులు. ముముక్షువు ప్రసన్నుండు విమలుండు శుచి వాక్కాయమనోనియతుండు కావలయునని వ్యాసుండు పలుక మహర్షు లిట్లనిరి. 538

## నూటముప్పదియవవయధ్యాయము.

### యోగసాంఖ్యమతజ్ఞానుల కాచరింపఁదగు ధర్మములు.

చ. మునివర! సాంఖ్యయోగములు భూస్థలి విస్తృతకీర్తిగాంచు నం
చనుట యథార్థ మాఁగద మహాత్తరభేదము వానికొప్పు నం
చని వినవయ్యె దాని కగునట్టి సుసంగతకారణంబునుఁ
వినవిన వేడుకయ్యె గురు,వేత్తవు నీవుకదా తలంచినఁ. 539

క. అనుటయు వ్యాసుం డిట్లను, మునులారా! సాంఖ్యశాస్త్రమును సాంఖ్యులు చ
క్కని కారణముల శ్రేష్ఠం, బనుదురు యోగముల యోగు లందు రటులుగా.

సీ. సర్వజ్ఞులౌ మునిచంద్రులనీశ్వరుం డెట్లు ముక్తుండగు నెన్న నగుచుఁ
దగిన కారణములఁ దత్త్వ మాలోచించి యోగంబు శ్రేష్ఠమై యొప్పు నంద్రు
సాధుద్విజాతులు సాంఖ్య ముత్తమమని కారణంబును దెల్పినారు మున్నె
గతులెల్ల నెఱిఁగి నిక్కము సర్వవిషయములందు విరక్తుఁడై యంతమందు

ఆ. విమలపదము నొందు విధిహితముగ నని,మోక్షదర్శనమయి పొలుచుసాంఖ్య
మును మనోజ్ఞతమముఁగను వచింతురు ప్రాజ్ఞు, లఖిలతత్త్వగతుల నరసి యరసి

వ. స్వపక్షంబునందు సమర్థంబై హితంబునగు కారణంబుఁ దెల్పువచనంబు
గ్రాహ్యంబు. ఇదియే మహామునుల మతంబు మీరును దీని కారణంబులం
బరీక్షించి యేది యుక్తమో దానిం గ్రహింపుఁడు. 542

క. యోగులు ప్రత్యక్షంబునె, బాగుగఁ గారణముచేత వాంఛింతురు సాం
ఖ్యాగమవేత్తలు శాస్త్రం, బేగతి యని యెంచువార లెల్లవిధములన్. 543

ఆ. ఇవ్వి రెండుఁ గలియ నెల్లరకుఁ సమ్మతములె యగును దీనిఁ దత్త్వవిధులు
శ్రేష్ఠములనియె తలఁచిరి వీని విధిగతి, ననుసరించి ముక్తినందు నరుఁడు. 544

సీ. సాంఖ్యయోగములందుసమముగాశౌచంబు భూతాఘములయందుఁ బూనఁదగిన
దయయును సువ్రతధారణంబును జెప్పఁబడియెనైనను దలంపంగ భేద
మరసినఁ గన్పడు; ననిన మౌనులు సంశయాత్ములై ప్రశ్నించి రాదరమున
వ్రతశౌచదయలు దర్శనముల నీరెంటి సమములె యైన భేద మది యెట్లు?

ఆ. కానఁబడునో తెల్పఁగాఁ దగు నన వ్యాసుఁ, డనియె నిట్లు; రాగ మల్ల మోహ
కామములును స్నేహ మామెయిఁ గ్రోధంబు,యోగమందు స్థిరత యొప్ప దేని.

వ. ఈదోషపంచకంబు గలుగునని యోగజ్ఞులు చెప్పుదురు. మత్స్యంబులు స్థూల
జాలమును భేదించి మరల జలంబులం బ్రవేశించుచందంబున యోగంబున
స్థిరతంగాంచి వీతకల్మషులై యుత్తమగతిం బ్రాపింతురు. బలవన్మృగంబులు
బంధనయంత్రమును జించివైచి స్వేచ్ఛగా గమ్యస్థలంబునకుం బోవునట్లు
యోగులు సర్వబంధవినిర్ముక్తులై నిర్మలమార్గంబు నాశ్రయింతురు. లోభభవంబు

లగు బంధనంబుల వదలించుకొని యోగబలాన్వితులై నిర్మలంబు శుభంబు నగుమార్గంబుం బడయం జాలుదురు. నిశ్చలంబులగు బంధములనుండి సంశయచ్ఛేదమున నిర్మలపదంబు నొంద యోగమార్గంబు వదలిన వేఱొకమార్గంబు గానరాదు. ఆవిలచిత్తు లాబంధనంబులం జిక్కి నశింతురు యోగబలహీనులు దుర్బలమత్స్యంబులు జాలంబును ఛేదింపఁజాలక యందె మ్రందుట్లు కర్మబంధంబులనుండి తప్పించుకొనం జాలక సంసారాంధువునఁ గూలుదురు. వారికి యోగంబులు దుర్లభంబులు దుర్బలశకుంతంబులు సూక్ష్మబంధంబులం జిక్కి విడిపించుకొను మార్గంబు నూహింపఁజాలక మ్రందునట్లు, బలవచ్ఛకుంతంబులు తప్పించుకొని పోవునట్లు యోగాశక్తులు పరితపింతురు. యోగబలాన్వితులు పరమపదంబుం బ్రాపింతురని యెఱుంగవలయు. 546

ఆ. కర్మబంధనములు కడఁగి బంధింపంగ, యోగబలములేని యుత్తములును
పరమపదము నొంద రురుయోగబలసిద్ధు, లతిసులభముగాఁగ నందుదు రొగి.

క. అనలుం డల్పుండయి బల, మునుసదియే లేక తానె యడఁగునటులు యో
గనియతబలహీనుఁడు బం,ధనముల విడిపించుకొనఁగఁ దా నర్హుఁ డెటొ. 548

క. ఉరుతరదారువులన్ శుచి, పరివృద్ధిఁ జెలంగుమాడ్కిఁ బావనయోగ
స్ఫురణమున బంధనంబులఁ, బరిమార్పం జాలు యోగి వరమునులారా. 549

చ. అనలుఁడు వృద్ధినొంది బలమార సమీరణుఁ గూడి భూస్థలం
బును దహియించునట్లుగఁ బ్రభూతమనోహరతేజమొప్పఁ ద
త్త్వనియతశాంతి చేకురఁగ భవ్యతమంబగు జ్ఞాన మొప్ప యో
గి నిఖిలకర్మబంధములఁ గీడ్పడ కున్నతి గాంచు ముక్తుఁడై. 550

క. తనదివ్యతేజమున లయ, మున భాస్కరునట్లు లోకమును క్షణమాత్రం
బున శోషిల్లం జేయం,గను జాలు నటంచు నెఱుఁగఁగాఁ దగు మీరల్. 551

క. బలహీనుఁడు స్రోతోజల,ముల నీడ్వంబడెడు భంగి భూరివిభేదం
బుల నొప్పుయోగమునదు,ర్బలుఁడున్ విషయాళినీడ్వఁబడుఁ బూన్కిమెయిన్.

క. ద్విరదము స్రోతోజలముల, బరుగిడకుండంగ నడ్డపడు లాగున సు
స్థిరయోగబలముగల్గిన, పురుషుఁడు విషయాళిఁ జిక్కి పొందఁడు కుగతిన్.

సీ. ఉరుయోగబలమున నొప్పెడుపురుషులు మనువుల బ్రహ్మల మఱియు భూత
ముల వేనినైన నిమ్ములఁ బ్రవేశింపంగఁజాలుదు రాతని శమనుఁడేని
యంతకుఁడేని క్రోధావిలచిత్తుఁడౌ మృత్యువేనియుఁ జంప నెంతమాత్ర
మైనఁ జాలరు; యోగమూని యమితతేజుఁడైన యామాన్యునియందు నంద
తే. యోగిఁ బ్రవేశింతు రట్టిఁడౌ యోగితన్నుఁ
బెక్కుభూతంబులను శక్తిపెంపు మెఱయ

ధరణినిం గూడఁజాలును దాల్ప ననుచు
నాత్మలం దెన్నుఁడీ మీఁర లన్వహంబు. 554

వ. ఒక్కతఱి యోగి విషయంబుల సేవించుంగాక మరల నుగ్రతరతపస్సొనరింపఁ జాలు.మరల దానిమాని చరింపఁజాలు సూర్యుండు తేజోగుణంబులఁ బ్రవేశించు నట్లు యోగిచర్య లొప్పునని తలంపఁజనునుమనోబలంబుగలవానికి యోగంబు వృద్ధిసాధనం బగు. యోగి ముక్తిప్రదాతయగు విష్ణునిం గాంచఁజాలు. యోగప్రోక్తబలంబుల వివరించితి. ఇంకఁ దన్నిదర్శనార్థము కొన్ని యోగవిషయంబులం దెల్పెద. ఆత్మసమాధానంబునందును ధారణను గూర్చియు సూక్ష్మములగు యోగనిదర్శనంబులం జెప్పెద నాకర్ణింపుఁడు. 555

ఆ. అప్రమత్తుఁడై నయట్టి ధానుష్కుండు, లక్ష్యభేదనమ్ము లలి నొనర్చు
నట్లు యోగివర్యుఁ డవ్యయపద మొందు, సంశయంబులేదు సాధులార. 556

సీ. స్నేహపాత్రంబయి చెలఁగి నిశ్చలమయి పూర్ణమై తగుమనంబున సమాహి
తాత్ముఁడై యోగి యెయ్యనముక్తిపద మొందుసోపానముల నెక్కు నోపికగను
వాఁడు సంయతుఁడయి వలసినట్టులు వాని దాఁటు చందంబునఁ దత్త్వవేత్త
నిశ్చలయోగంబు నెఱి నాశ్రయించును; దాన నాత్మను సుశుద్ధమగునట్టు

తే. లొగి నొనర్పఁగజాలు మహోగ్రదీప్తి, ధానుఁ డంధకారంబును బడలుపడఁగఁ
జేయుమాడ్కిని నియతుఁడై సింధుగతము,నౌకనుం గర్ణధారుండు నైజశక్తి.

క. దరిఁ జేర్చునట్టు లందలి, పురుషులు పత్తనము నొందుపోలిక యోగ
స్ఫురణంబున నిర్మలమై, పరఁగంగా నాత్మఁజేయుఁ బట్టుదల దగఁగ. 558

క. సులభంబుగాని ముక్తిస్థలమునకుం బోవుయోగి తనలఘుతను వీ
యిల డించి విగతకల్మషుఁ, దలఘూత్తమచిత్తుఁడగుచు నమరులు పొగడఁగ.

సీ. సాధువాహనముల సాయమునఁ బుద్ధిమంతుఁడౌ సారథి వింతదోఁప
నిష్టదేశమునకు నెంతయుఁ ద్వరమీఱ ధన్వియా పురుషసత్తముని జేర్చు
నట్లు ధారణములయందు సమాహితుండౌ యోగి లక్ష్యముక్తాంబకంబు
వలె శీఘ్రముగ మహాభవ్యపరంధామమును జేర్చు యోగంబునని యెఱుంగుఁ

ఆ. డాత్మయందు నాత్మ నావహింపఁగఁ జేసి
యెవ్వఁ డుండు నతఁడె యచలుఁ డనఁగ
నతఁడు బంధనములయందుఁ జిక్కక ఋష
మట్లు శాశ్వతపద మందు నిజము. 560

వ. నాభి మస్తక కుక్షి హృదయ వక్షః పార్శ్వ నేత్ర శ్రవణఘ్రాణంబులయందు మహావ్రతపరాయణుం డగు నేయోగి తనయాత్మచే సూక్ష్మమగు నాత్మను గాంచునో యామహాయోగి సత్వరంబు శుభాశుభకర్మముల దహించి విముక్తిపదంబు నొందు ననవిని మహర్షు లిట్లనిరి. 561

క. మునివర్య! యెట్టియాహా, రనియతి నెవ్వాని గెల్చి ప్రబలుండయి సా
ధునికరనుతుఁడై యోగియు, ననుపమపద మొందుఁ జెపుమ యాభావంబున్.

సీ. అన వ్యాసుఁ డిట్లను యావకంబును రూక్షమును ద్రావి చిరకాలము నిటు లేక
వస్తువాహారంబు వాసిగాఁ గైకొని ప్రబలుఁడై తగుయోగి పలుకులేల
పక్షమాసర్తువుల్ పయసుతోఁగూడిన జలములఁ ద్రావి గుహలఁ జరించు
యోగియుఁ బ్రబలుఁడై యొప్పారు; నొకనెల కొఱఁత లేకుండఁగఁ గోర్కి మీఱ

తే. నుపవసించి శుద్ధాత్ముఁడై యురుబలంబు
గలిగియుండును యోగి; నిక్కముగఁ గామ
మట్లె క్రోధంబును జయించి యధికశీత
మును మహోష్ణము వృష్టిని బోల గెల్చి. 563

క. బలశాలియగును యోగియు; గలవిలపాటొందఁ జేయు గాఢభయంబుల్
జ్వలనాభశోకపౌరుష,ముల స్వాపము విషయనివహముల గెల్చి తగన్. 564

క. అతిదుర్జయమ్ముగఁ దగున, రతి స్పర్శము నిద్రఁ దంద్రఁ బ్రబలశ్రద్ధన్
జతనముగ నూని గెల్చిన,మతిమంతులె యాత్మ మిగుల మహితముగాఁగన్.

క. ఒనరింపఁ జేయఁ జాలుదు, రనయము రాగాదులెల్ల నంతికమున ని
ల్వను లేక పాఱిపోవం,గను జేయంజాలుదురు నికామప్రజ్ఞన్. 566

క. దీనికి నధ్యయనంబును, ధ్యానంబు సహాయములగు ధరణీదివిజుల్
మానితచిత్తులు నియతులు, నైనన్ మార్గమిది దుర్గమనఁ దగియుండున్. 567

తే. అట్లుగావునఁ జేరంగ నసువుపడదు, ధరణిసురులందు నొక్కఁడేఁ దగినశ్రద్ధ
మార్గ మిద్దాని నూనిన మహితపదము, నందఁగాఁగల్గు నంచని యరయుఁడాత్మ.

సీ. బహుసరీసృపజాలబహుళంబు శ్వభ్రింబుభంగి నిస్తోయంబు భయదను మఱి
బహుకంటకంబు తీవ్రంబు నాహారవస్తువిహీన మెంతయు దుర్గమంబు
దావపావకదగ్ధ ధరణీరుహౌఘంబు తస్కరాకీర్ణంబు దారుణంబు
నగువనంబున నొక్కఁడైనఁ బ్రవేశించి దాఁటంగనోపు నాచందమున నె

తే. యోగమార్గంబుఁబట్టి బహుశ్రమముల
కోర్చి ముక్తిని బొందంగ నోపు నొకఁడు
మార్గ మెంతయు దుష్టమై మహిఁ జెలఁగిన
నవల మంచిస్థలంబున్న నములమె యగు. 569

క. అసిధారాతుల్యంబై, యెసఁగెడు ధారణ యనంగ నిది దుర్గంబై
యసదృశమైకన్పడుఁ బా,పిసముదయాసాధ్య మిద్ధి పెక్కుగతులచేన్. 570

క ధారణవిషమంబై తగు, ధారణ నూనిన నరుండు తా దుర్గతికిం
జేరఁడు దానిన్ విడిచిన, పూరుషుఁ డుత్తమపదంబుఁ బొందు టదెట్లో. 571

తే. కర్ణధారుఁడులేని నౌకవిధ మొప్పు, ధారణయులేని నరుగతి దలఁపనేల?
ధారణాదికయోగవితానవిష్ఠ, విధిగ నందిననరుఁడు పవిత్రతముఁడు 572
క. మరణాది జన్మదుఃఖో,త్కరమును గాంచఁడు సుఖంబె కను నిరతంబున్
బరమంబు బహువిధాగమ, పరినుతమున్ మౌనివర్యపరికీర్తితమున్. 573
తే. జ్ఞానిసేవితమును నగుదాని యోగ
మార్గమును నాశ్రయించునమ్మానవుండె
పరమపావనమూర్తి నాఁబడును ధ్రువము
యోగమిది విప్రులందె మహోత్తమంబు. 574
వ. ఈయోగంబు బ్రహ్మమయంబు. బ్రహ్మశంకరనారాయణులను ధర్మబ్రహ్మపుత్త్రులను యోగనిష్ఠులనుగాఁ దలంపంజను. తనున్ను కష్టంబనియు, రజోగుణం బహంకారజనకంబనియు, సత్త్వంబు శుద్ధంబనియుఁ జెప్పంబడు పరాత్పర యనంబడు ప్రకృతిని, వరుణపత్నియగు సిద్ధిని, సుమహాతేజంబును, ధైర్యంబును, శశాంకుని, నాకాశంబును, విశ్వేదేవతలను, బితరులను, సకలభూధరంబులను, సాగరంబులను, నదులను, నగనాగసాధ్యయక్షులను, దిక్కులను, గంధర్వసిద్ధులను, బురుషులను, స్త్రీలను, జూడంజాలి యోగి మహానుభావుండై యుండునని యెఱుంగవలయు. మహామునులారా! ఈయుపాఖ్యానము మహోత్తమంబు. యోగంబుల ననుభవించిననరులు నారాయణమూర్తి పదంబు నొందుదురు. ధ్రువంబని పలికిన మహామును లిట్లనిరి. 575

---

## నూటముప్పదొకఁడవయధ్యాయము.

### మోక్షము దుర్లభంబని వ్యాసుఁడు చెప్పుట.

క. పరమమునీంద్రా! సాధూ,త్కరసమ్మతయోగమార్గ కమ్రచరిత మా
దరమున వర్ణించితి రే,కరణిన్ శిష్యునకు గురువుకథ వర్ణించున్. 576
క. ఇపుడు దయామతి సాంఖ్యం,బు పరమ మని పల్కినట్లు పూజ్యనియమ మె
ట్లు పరీక్షింపందగుఁ ద,త్త్వపరత వర్ణింపవయ్య తద్ధర్మములన్. 577
తే. మూఁడులోకంబులన్ సాంఖ్యమును మహోత్త
మ మని వర్ణింతు రాదాని మహితధర్మ
ముల నెఱింగింపుమా యని మును లడిగిన
వ్యాసమునిపతి యీరీతిఁ బలికెఁ బ్రీతి. 578
సీ. వినుఁ డార్యమునులార! విదితాత్ములౌసాంఖ్యులను విహితంబులౌ ప్రకటధర్మ
ముల.యతుల్ వృద్ధులు మునిపతులౌ కపిలాదులు వర్ణించి రవ్వి యుత్త
మోత్తమంబులునయి యొప్పెడు బహుగుణలాభంబు దోషవిలయముద్దాన
గలుగు; జ్ఞానమున సకలదోషవిషయములను లెక్కపెట్టి నేర్పున జయింపఁ

తే. దగనిమానుషదోషసంతతిఁ బిశాచ,విషయముల నౌరగంబుల విధిని లెక్క-
పెట్టి గంధర్వపైతృకవిషయములను, బశువులాదిగఁ గలజంతుపటలిఁ గూర్చి.

క. తెలియందగువిషయంబులఁ, దెలిసి సుపర్ణునిగుఱించి తెలియందగువా
ని లలిన్ లెక్కించి మరుత్తులగూర్చిన విషయసంతతులనున్ మఱియున్. 780

వ. మహర్షి రాజర్షి విషయంబుల నాసురవిషయంబుల వైశ్వదేవవిషయంబుల దేవర్షివిషయంబుల యోగశాస్త్రవిషయంబుల నిస్పటివిరించివిషయంబులఁ దదాయుఃకాలంబులోకవార్తల నెఱింగి విషయాభిలాషుల కంతకాలంబునఁగలుగుదుఃఖవిషయంబు నెఱింగి తిర్యక్త్వంబునం బడువారును నరకంబులం బడువారును బొందు కష్టంబులం బరికించి, స్వర్గగుణంబులం దలంచి సర్వదోషంబులఁ బరీక్షించి వేదవాదదోషంబుల వైదికగుణంబుల జ్ఞానయోగదోషంబులఁ దద్గుణంబుల సాంఖ్యజ్ఞానదోషగుణంబులఁ జక్కం బరిశీలించి దశగుణంబగు సత్త్వంబును నవగుణంబగు రజస్సు నష్టగుణంబగు తమస్సును, సప్తగుణం బగు బుద్ధిని షడ్గుణంబగు నభంబును ద్రిగుణంబగు తమస్సును, ద్విగుణం బగు రజస్సును నేకగుణంబగు సత్త్వంబును మరల నెఱింగి ప్రళయమార్గంబును దత్త్వంబునం దలపోసి జ్ఞానవిజ్ఞానసంపన్నులు సూక్ష్మరేణువులు నభంబునొందునట్లు శుభంబగు మోక్షంబు నొందుదురు. మఱియు దృష్టిని రూపంబుతోడను, ఘ్రాణంబు గంధగుణంబుతోడను, శ్రోత్రమును శబ్దగుణంబుతోడను, జిహ్వను రసగుణంబుతోడను, చర్మమును స్పర్శగుణంబుతోడను, వాయువును దదాశ్రితునిగను గూర్పవలయు. మోహము తమోగుణయుక్తంబు. లోభము మోహసమాశ్రితంబు. విష్ణువునుగ్రాంతంబునందును, శతమఖుని బలమందును, జాతవేదుని గోష్ఠప్రదేశంబునందును, దేవినుదకంబులందును జలంబులను దేజస్సునందును, దేజస్సు వాయువునందును, వాయువు నాకాశంబునందును, నభంబు మహత్తునందు నున్నయట్లు తలంపవలయు. మహత్తునందుఁ దమస్సును, రజస్సు గూడ మహత్తునందును సత్త్వంబు నాత్మయందును, నాయాత్మ నీశ్వరునందును, నాదేవుని మోక్షంబునందు నున్నయట్లు ధ్యానింపవలయు. మోక్షంబు దేనియందు నున్నయట్లు కానంబడదు. దేహంబును సత్వసమావృతంబు షోడశగుణయుక్తంబును గా స్వభావంబును భావనను దెలిసికొని దాని దేహమాశ్రితంబె యని నిశ్చయించి యాత్మను మధ్యస్థితంబుగాఁ జింతించువానికిఁ బాపంబు లంటవు. విషయాభిలాషులకు ద్వితీయంబు కర్మంబు. ఇంద్రియంబుల నింద్రియార్థంబుల నాత్మసమాశ్రితంబులని యెఱింగి మోక్షంబు దుర్లభంబని శ్రుతిహితమార్గంబున నిశ్చయించి ప్రాణాపానవ్యానోదానసమానంబులను దత్త్వంబునఁ జింతించి యాద్యంబగు ననిలతత్త్వంబు భావించి రెండవయనిలుని మరలఁ బుట్టినవానినిగా ధ్యానించి యొక్కొక్కదానిని సప్తధా విభజించి ప్రజాపతులను, ఋషులను బహువిధసృష్టిభేదములను, బహు

సంఖ్యాకులుగ నుత్పత్తిగాంచిన సప్తర్షులను, రాజర్షులను, దేవర్షులను, మరుత్తులను,సూర్యతేజోభాస్వరులగుబ్రహ్మర్షులను నైశ్వర్యభ్రష్టులను దిలకించి మహాభూతసంఘంబుల నాశమును విని వాక్కులకుఁ బరిశుద్ధి గతి యిది యని తెలిసి కొన్ని పాపకర్ములకుఁ బూజార్హులను దలంచి యమలోకంబున వైతరిణియందుఁ బడువారలకుం గల్గు దుఃఖంబుల భావించి బహువిచిత్రజన్మములం గాంచుపాపకర్మరతభూతప్రతతుల సంభావించి శోణితోదకభాజనంబగు జఠరవాసంబు నాలోచించి మాతృజఠరంబును శ్లేష్మమూత్రపురీషతీవ్రపూతిగంధసమన్వితంబుగను, శుక్రశోణితసంఘాతంబుగను మజ్జాస్నాయుపరిగ్రహంబుగను శిరాశతసమాకీర్ణంబుగ నూహించి యది నవద్వారపురంబుననుండునని యాలోచించి తనహితంబును దలంచి వివిధయోగముల నభ్యసించి తామసరాజససాత్వికజంతువుల దుర్గతి సుగతుల నూహించి విదితాత్ములగు సాంఖ్యుల భావంబు వితర్కించి చంద్రతేజస్సునకుం గలుగునుపద్రవంబును శంకించి తారాగణపతనంబు గాంచి నక్షత్రంబుల మార్పుల నూహించి ద్వంద్వంబులకుం గలుగుకృపణంబగు విప్రయోగంబును గాంచుచు, భూతంబు లన్యోన్యంబు భక్షించు నశుభాచారంబును దిలకించుచు బాల్యమందె మోహప్రాదుర్భావంబును గని రాగమోహంబులయుత్పత్తి నెఱింగి యొకానొకచో సత్త్వసమాశ్రయత్వం బూహించి యనేకసహస్రంబుల నొక్కండు మోక్షంబు నిచ్ఛయించునని యెఱుంగ వలయు. 581

క. శ్రుతిపూర్వకముగ మోక్షం, బతిదుర్లభ మనెడుజ్ఞాన మలవడు మఱి సం
గతవిషయంబులగౌరవ, మతిసంగతవిషయములను మాధ్యస్థ్యంబుఁ. 582

తే. కలిగియుండుట యూహింపవలయు విషయ
ములను దౌరాత్మ్య మొలయుట తెలియవలయు
సత్వములు ప్రాణములఁ బాసి సరగ వేఱు
జంతుజన్మము లొందుట చనుఁ దలంప. 583

క. జననం బందినజంతువు, చనుఁగద యమసద్మమునకు శాశ్వత వాసం
బును గాంచ నేఱ దిల నెది, యనియుం దలఁపంగ నొప్పు నమలమనీషా. 584

సీ. సాత్వికజంతువుల్ సతతదుఃఖంబులఁ గనుటయు నూహింపఁ జను సుజనుఁడు
బ్రహ్మఘ్నులకు నెట్టిపాటు గల్గునొ దానిఁ బతితుల కతిఘోరగతి య దెట్లు
గలుగుచుండునొ దానిఁ గడుఁ బూన్కిఁ దలపోయవలయు; సురాపానవాంఛఁ
దురితాత్ములగు భూమిసురులదుర్గతియును గురుదారగమనసక్తులగుపాపు[బూను

తే. లకును జేకూరుదుర్గతులను జనులఁ
గాముకులగుచుఁ బ్రేమించుఖలులకుఁ దగు

దుర్గతుల నెంచవలయు సాధువులు మఱియు
మనుజు లెట్టిలోకంబులఁ గనఁదగుదురొ. 585

క. అనుచు నెఱుఁగంగాఁ జను, మునులారా! యట్టిజ్ఞానమున నశుభములై
తనరు మహాపాపంబుల, నొనరుచు వారలకుఁ గల్గు నుపదుర్గతులన్. 586

క. అరయుచుఁ దిర్యగ్యోనుల, నుపదుఃఖములం దలంచు టొప్పును జ్ఞాన
స్ఫురణంబున నీగతి వి, స్తరపాపులగతుల సుకృతిసరణుల నెల్లన్. 587

వ. విశేషించి యెఱుంగవలయు. వేదవాదంబులయు, విచిత్రర్తువులయుఁ బర్యాయంబులం బరికించి,సంవత్సర మాస పక్ష దివస క్షయంబులం బరిశీలించి చంద్ర వృద్ధిక్షయంబులం దలపోసి ప్రత్యక్షంబున వానిగతుల నరయుచు సాగరంబుల యుపచయాపచయంబులఁ బరికించుచు మేఘజాలంబున నభివృద్ధినాశంబులం దిలకించుచు విశేషించి యుగసంయోగంబుల లక్షించుచు, దనయహంకరణవైక్లబ్యంబులఁ దత్వదృష్టి నరయుచు నాత్మదోషంబుల శ్రద్ధ నెంచుచు, నాత్మగతంబులె సర్వంబు లని యెఱుంగుచు స్వదేహదుస్థితి దోషాశుభభావంబుల బరీక్షించుచు, యోగంబు సాధించి ముక్తినొందవలయు ననిపలికినమాను లిట్లనిరి. 588

దేహస్థితపంచదోషవివరణము.

క. మునివర! యుత్పాతంబుల, జనియించెడు నెట్టిదోషసంతతులం గాం
చినవాఁడవో వచింపుము, మనములఁగల సంశయములు మట్టుపడంగన్. 589

చ. అనవిని వ్యాసుఁ డిట్లనియె నార్యులు సాంఖ్యులు మార్గవేత్తలం
చని నుతిగాంచుచున్నకపిలాదులు దేహజపంచదోషముల్
గనఁదగునండ్రు వాని వినఁగాఁ దగు సంశయముల్ తొలంగునం
చని వచియింపఁబూనె వినుఁ డయ్యవి కామము క్రోధనిద్రలున్. 590

తే. భయము శ్వాసయు ననునివి ప్రతితనువునఁ
గానఁబడుదోషముల్ గాన క్షమను గ్రోధ
మును జయింపంగ వలయుఁ బావనమనీష
సేవచే నిద్ర నొంచుటయే విధంబు. 591

సీ. సంకల్పవితతివర్జనమునఁ గామంబు నప్రమాదమున భయంబు నల్ప
మైనయాహారంబుచే నిజశ్వాసంబు నడఁపంగవలయు గుణాలి గుణము
లను దోషములదోషమునుజక్క నెఱిఁగి హేతుశతంబులఁదగ హేతువు నెఱింగి
చిత్రంబులను బెక్కుచిత్రంబుల నెఱింగి జలఫేనతుల్య మీజగ మటంచు

తే. విష్ణుమాయాశతంబు లవివృతమంచుఁ
జిత్రభిత్త్యుపమానతఁ జెందు నంచు

మఱియుఁ దృణసార మంచు నేమాత్రమేని
యర్థమిందు లేశం చెద నరయవలయు. 592

క. తమమున సంభ్రమితము వర్షమునన్ బుద్బుదము లట్లు సారమ్ముగ నే
త్రములకుఁ గనఁబడు మఱి నాశముఁబొందినయట్టు లెన్నఁ జాలుఁ గవులచేన్.

తే. సుఖము గల్పించునట్లుండు సొరిది భయముఁ
గూర్చుచుండును మఱి రజోగుణమునందుఁ
దమమునందు నిమగ్నమై దంతిపంక
మగ్నమయి యున్నచాడ్పున మదికిఁ దోఁచు. 594

చ. కనుకనె సాంఖ్యులౌ ద్విజులు గాఢతరంబగు మోహ మొందకే
జనకృతమైన స్నేహమును సన్మతిఁ దుచ్ఛమటంచు నెంచి దా
నిని విడనాడఁజాతురు వినిర్మలమై తగుజ్ఞానయుక్తిచే
తనె తెలియంగ శక్యమగు ధాత్రిని సాంఖ్యము సర్వభంగులన్. 595

సీ. నిర్మలజ్ఞానసందీప్తి నెఱుంగఁగాఁ దగినది సాంఖ్యము ధరణియందు
నత్యుత్తమంబయి యనుపమానంబయి మునివినుతంబునై పొలుచు యోగి
జనము రాజసగుణంబునఁ బుట్టు దోషాళిఁ దామసదోషసంతతిని మఱియు
సాత్త్వికసుగుణసంజనితపుణ్యంబులఁ దనుభవస్పర్శగంధముల వదలి

తే. యాత్మవిజ్ఞానశస్త్రంబు నమలతీవ్ర
తపతపోదండమునను సాధనయుగంబు
నను మహాదోషములను నాశనము చేయ
వలయు మునులార! వినుఁ డింక లలితపథము. 596

వ. దుఃఖమయోదకంబును చింతాశోకమహాహ్రదంబును వ్యాధిమృత్యుమహాఘో
రంబును మహాభయంకరమహోరగంబును దమఃకూర్మంబును, రజోమీనంబును
నగుసంసారఘోరనదిని సాంఖ్యజనితప్రజ్ఞచేఁ దరింపవలయు. మఱియు నీలోకంబు
జరాదుర్గమంబు స్పర్శద్వీపంబు. కర్మాగాధంబు. సత్యతీరంబు హింసాశీఘ్రమహా
వేగంబు. నానారససమాకులంబు. నానాప్రీతిమహారత్నంబు. దుఃఖజ్వరసమీరి
తంబు. శోకతృష్ణామహావర్తంబు. తీక్ష్ణవ్యాధిమహారుజంబు. అస్థిసంఘాతసంఘ
ట్టంబు. శ్లేష్మయోగంబు. దానముక్తాకరంబు. ఘోరశోణితోదారవిద్రుమంబు.
నానాజ్ఞానసుదుష్కరంబు. రోదనాశ్రుమలక్షారంబు. సంయోగపరాయణంబునగు
ఇట్టిజన్మలోకంబు నొంది పుత్రబాంధవపత్తనం బహింసాసత్యమర్యాదంబు. బృం
దానుగామి. సర్వభూతపయోదధి. మోక్షదుర్లభవిషయంబు. బాడబాసుఖసాగ
రంబు. ననియెఱింగి యతులుసిద్ధులు ననఘులు నగుసాంఖ్యులు జ్ఞానయోగంబున
దుస్తరంబగుజన్మమును బాయఁజాలి విమలమగు నభంబుం బ్రవేశింతురు. 597

క. చనుదెంచుజ్ఞానసిద్ధులఁ, గనుఁగొని భాస్కరుఁడు రశ్మికరముల వారిం
దనచెంత నిల్పు బ్రవహం, బను వాయువు వారియందు నావేశించున్. 598

క. సరసిజతంతువు లట్టులు, మరుత్తు వారలను బొంది మర్యాదరుహా
దరమునఁ బొందం జేయును, బరిహృతరాగాధికులను బ్రాజ్ఞుల యతులన్. 599

క. తపమే ధనముగ వీర్యం, బపరిమితయశంబు గాఁగ నలరెడు వారిన్
సుపరిస్ఫుటగంధము సూ, క్ష్మపరమమున్ శీతలము సుఖస్పర్శంబున్. 600

క. కనఁగ మనోజ్ఞమునగు నా, యనిలము మారుతగణంబునం దుత్తమమై
యనుపమలోకంబులఁ జే, ర్పనుజాలును గాన వారిఁ బరమప్రీతిన్. 601

ఆ. నభమునందు నిల్వ నయముగఁ జేయును, వారినంత నభము చారుగతిని
దా వహించి రజముదాఁటినగతిఁ జేర్చు, రజము వారిఁ దాల్చి రయము మీఱ

క. నిరుపమసత్వగతిం గనఁ, బరమప్రమదమునఁ జేయుఁ బంతంబున నా
పరమాత్ముల సత్త్వంబును, ధరించి నారాయణాఖ్యదైవముఁ జేర్చున్. 603

క. పరమాత్మను జేర్పఁగ నా, పరమమునీంద్రులను దాల్చు బరమాత్మను గాం
చి రహితకల్మషులయి యన, వరతము బ్రమదంబు మీఱ వసియింతు రటన్.

క. అమృతత్వ మొందు వారలు, తమ మరలం బుట్టఁబోరు గతియును బరమం
బమలంబు నగుచు దగు ద్వం, ద్వము లందుం బీడఁ గూర్ప వాంఛింప వటన్.

ఆ. ఆర్జవమ్ము సత్య మనవరతముఁ గూర్పఁ, జాలువారికె యది సత్పదంబు
పొందఁజాలి యుండు భూతాళిపై దయ, గలుగువారలకది సులభమగును 606

చ. అనవిని మౌను లిట్టులని రప్పదముం బరమంబు నొంది పా
వనతము నవ్యయున్ గొలిచి భవ్యతరవ్రతసుస్థిరత్వముం
గని మరలన్ జనిన్ మృతిని గాంచక యందు వసించువారొ మే
దినిపయిఁ బుట్టివత్తురొ మతింగల సంశయముల్ తొలంగఁగన్. 607

తే. పలుకుమా సత్య మిందేది గలదొ దాని
నిన్ను వదలి యీన్యాయంబు నున్నదున్న
యట్లు పల్కఁగ నొక్కరుఁ డవనిఁ గలఁడె
యిదియెగద మోక్షదోషముం చెన్నఁబడును. 608

క. ఈమోక్షదోషముల విడి, యామౌనులు విష్ణులోకమందు నియతిజ్ఞా
నామలమానసులై స్థితి, నేమాడ్కిం గనిరొ తెల్పుమీ మునివర్యా. 609

క. వారల ప్రవృత్తి లక్షణ, మేరీతియొ ధర్మమార్గ మెట్టిదొ జ్ఞాన
స్ఫారాంబుధి మున్గిన ముని, ధీరులు దుఃఖాంతరంబు దీనులభంగిన్. 610

క. కనుదురొ పొందరొ చెప్పుమ, యన వ్యాసమునీంద్రుఁ డనియె న్యాయపథమునన్
వినిపింతుఁ బ్రశ్నమిది యు, త్యనుపమసంకటకరంబు నగు ధీరులకేన్. 611

ఆ. విన్నయంత మోహవిషరాశి ముంచును, బలుకు వాఁడఁ దగినపలుకు దాని
శంకదీర్చునట్టి సరసమార్గంబున, వినుఁడు దీని తత్త్వమును గడంగి. 612

సీ. కపిలాదిమునుల సంకల్ప మీవిషయమం
దరయఁగ నెటులుండు నద్ది తెల్పు
వాఁడ; నింద్రియములు వరుస దేహిశరీర
ము నెఱుంగు నింద్రియములనునాత్మ
కరణముల్ సూక్ష్మముల్ పరికించు నవ్వానిఁ
బరమేశ్వరుఁడు చూచుఁ బరముకృపకుఁ
బాత్రుఁ డెవ్వాఁ డగు వానిపాపంబులు
నశియించు నంబుధినాథు లీల

ఆ. విలయ మందుభంగి వెస మఱియును నింద్రియములతోడ సుప్తినందు దేహి
తనువునందు సూక్ష్మతరముగఁ జరియించు, నాత్మ నభమునందు ననిలుపోల్కి.

వ. ఆయాత్మ యథాన్యాయంబుగ స్మరించి వానిం దిలకించు యథాపూర్వంబుగ
నఖిలకర్మంబుల నెఱుంగు. తత్కాలంబున నింద్రియంబులు స్వస్వస్థానంబుల
ననీశంబు లగుట విషహతసర్పంబులంబోలి విలీనంబు లగు. ఇంద్రియంబులు
తమతమస్థానంబుల నడంగియుండ నందు నాత్మ వానిగతులం బ్రవేశించి
సూక్ష్మంబై చరించు. సంశయం బిందు లేదు. సత్వరజస్తమోగుణంబు లనుబుద్ధి
గుణంబుల మనోగుణంబుల నభోగుణంబుల వాయుగుణంబుల స్నేహజగుణం
బుల నాపోగుణంబులఁ బార్థివగుణంబుల మఱియు సర్వగుణంబుల వ్యాపించి
క్షేత్రజ్ఞులయం దాత్మ సంచరించు. క్షేత్రజ్ఞుండు కర్మవశంబున శుభాశుభం
బులం గనుచుండు. శిష్యులు మహాత్ముఁడగు గురువు నెఱింగినట్టు లింద్రియంబు
లాతనిం దెలియు. ప్రకృతి నతిక్రమించి శుద్ధంబు సూక్ష్మంబు పరాయణంబునగు
నారాయణతత్త్వంబు నిర్వికారంబు నిరంజనంబు పరాత్పరంబు సర్వపాపవిము
క్తంబు నని యెఱుంగవలయు. నిర్వికారంబునిర్గుణంబు నగునాతత్త్వంబునందు
మనస్సు నింద్రియంబులు శిష్యులు సద్గురువుసంతికంబు నొందుగతిఁ దదాజ్ఞా
ప్రకారము ప్రవర్తించు నట్లుండి చెప్పినచొప్పున జేయుచుండు మోక్షవిషయం
బున సాంఖ్యయోగప్రోక్తమార్గం బిదియ. మహాప్రాజ్ఞు లగుసాంఖ్యు లిట్లు
యోగంబు నాశ్రయించి పరమగతిం బొందుదురు మునీంద్రులారా! ఈజ్ఞానంబు
నకుఁ దుల్యంబగు జ్ఞానం బొండు లేదు ఇందు మీకు సందియం బుదయింపదని
విశ్వసించెద సాంఖ్యజ్ఞానం బత్యుత్తమంబు. మున్ను బ్రహ్మ మక్షరంబు సనాత
నంబు శాశ్వతంబు నని చెప్పంబడియెగదా. అనాదిమధ్యనిధనంబు నిర్ద్వంద్వంబు.
సర్వకర్తృకంబు. శాశ్వతంబు. కూటస్థంబు. నిత్యంబు నని శమాత్మకు
లగు మహాత్ములు దేనిం జెప్పుదురో సర్గస్థితిలయంబు లెద్దానియందుఁ బ్రవర్తి

ల్లునో దానినిబ్రహ్మంబని శాస్త్రంబులయందుఁ బ్రవక్తలగుమహర్షులువచింతురు.

సీ. సర్వవేదంబులు త్మాసురవర్యులు సామవిజ్ఞులును సకలవిదుని
బ్రహ్మణ్యుఁ బరము దైవంబు ననంతు నచ్యుతుఁ బరమాత్ముని సతము వేఁడు
చుందురు సాంద్రభక్త్యుద్దీపితస్వాంతు లగుచు యోగులును సాంఖ్యమతనిష్ఠు
లఖిలదర్శనులు పరాత్ము నమూర్తిని సాంఖ్యమూర్తి యటంచు సత్త్వనిష్ఠఁ

తే. దలఁచుచుండు రభిజ్ఞానములునతనికిఁ, గలవటంచువచింతు రుత్కంఠ మునులు
క్షమను ద్వివిధభూతంబు లగమ్యగమ్య, సంజ్ఞగలయవి గలవని చను దలంప.

క. వానిని జంగమ మనునది, దా నుత్తను మనుచుఁ గీర్తిఁ దగియుండును సు
జ్ఞానము గొప్పదిగాఁ దగు, బూనికఁ దలపోయ యోగమున సాంఖ్యమునన్.

క. శ్రుతులందుఁ బురాణములం, దతిశయముగ సాంఖ్యరీతి నలవడుజ్ఞానం
బతిలోక మండ్రు మానులు, క్షితిదానికి నీడు లేదు. చెప్పఁగ నెదియున్. 617

క. ఏమాత్రమేని జ్ఞానం, బీమహిలోఁ గల్గియున్న నిది సాంఖ్యగ మే
యేమాడ్కిఁ గనిన నని మది, నోమానివరేణ్యులార! యూహింపఁ దగున్.

సీ. ఇతరశాస్త్రంబుల నెఱుఁగంగఁ బడునదియును బలంబును జ్ఞానమును విముక్తి
తపము సూక్ష్మంబులౌధర్మముల్ మొదలగునవియెల్ల సాంఖ్యమం దర్హరీతి
నుక్తంబు లగునని యూహింపఁగాఁ దగుఁ దద్విపర్యయము సద్ధర్మ మనఁగఁ
దగదు సాంఖ్యులు సంతతంబు సుఖంబున హితఫలంబును గాంతు రిట్టి సాంఖ్య

ఆ. ధర్మముల నెఱింగి తగురీతి నాచరించుచు సుఖంబు గాంచి సురపదంబు
నుండి మరల భూమి నొంది విప్రాయతనములఁ బుట్టుచుందు రమలమతులు.

చ. తనువును బాసి సాంఖ్యులు నితాంతము యోగబలంబుచేత దే
వనికరసేవ్యమై మిగుల భాస్వరమై తగు ముక్తి నొందు వా
రనితరసాధ్యసద్గతుల నామహనీయులు పోవువారు లే
దెన యన వారి కెత్తఱిని నేర్పడ నంచు నెఱుంగుఁడీ తగన్. 620

వ. తిర్యగ్గమనంబు సాంఖ్యులయందుఁ గానంబడు. కావున సాంఖ్యమం దభిరుచి యెల్లరకు నుండవలయు. శిష్టసమ్మతంబగు మార్గ మయ్యదియని తలంపుఁడు. అధోగతి వారలకు లేదు పాపాత్ములకు నుండఁదగు తావుల వారు నివసింపరు. సాంఖ్యంబు విశాలరమణీయ పురాణ పరమమార్గంబు. మహార్ణవతుల్యం బగు. అట్టి మతంబు నాశ్రయించినపుణ్యాత్ములు నారాయణుం గాంతురు కావున నీపరమతత్త్వంబు మీకుం దెలిపితి శ్రీమన్నారాయణునం దీవిశ్వంబెల్ల నిమిడియుండు. సృష్టికాలంబున బహిర్గతంబుగాఁ జేసి సంహారకాలంబున హరించు. అట్టిమహాపురుషు నాశ్రయింపుఁ డని వ్యాసమహర్షి పలికిన మును లిట్లనిరి. 121

## నూటముప్పది రెండవ యధ్యాయము.

### వసిష్ఠకరాళజనక సంవాదము.

క. మునివర! యక్షరమను దా,నిని బల్కుచుఁ జెప్పితీవు నిత్యంబగు దా
నిని; క్షర మనునద్దానిని, వినవలతుము వానికున్న భేదముఁ జెపుమా. 622

మ. శ్రుతిపారంబును గాంచినా వని మునీంద్రుల్ నిన్ను మెచ్చంగ నా
దృతిఁ బ్రశ్నించితి మీ క్షరాక్షరవిధం బిద్దానితత్త్వంబు మా
నితతుల్ సద్వ్రతు లౌ ననంగఁ జెపుమీ నిత్యంబు సంతృప్తి నొం
ది తగన్ ధ్యానము చేయువార మన నుద్దీపించు మోదంబునన్. 623

మ. మునులం గాంచి వచించె వ్యాసముని యిప్పోల్కిన్ వినుం డొక్కగా
థను బూర్వంబున సాగినట్టిదియుఁ జిత్రం బిద్ది యం దెంచఁగా
ననువై నట్టిదియున్ సదుత్తర మిదౌనం చీరు మోదంబునుం
గనఁగా జేయునదై నదానిఁ బలుకంగా నెంచితిన్ బూన్కిమై. 624

ఆ. మును కరాళజనకమునిపాలకవసిష్ఠు,లకును సాగినట్టి సకలసంశ
యాపనోదక మగునట్టి సంవాదంబు,గలదు సంశయములఁ దోలఁచు నద్ది. 625

సీ. భాస్కరసంకాశ భాభాసమానుఁడై యుచితాసనంబున నొప్పుచున్న
సంయమీంద్రు వసిష్ఠు జ్ఞానంబు నై శ్రేయసంబు నెఱుంగఁగా జనకరాజ
చంద్రుఁ డిట్లనుచుఁ బ్రశ్నము చేసె నత్తఱి ముని పరమాత్మను మనసునందు
నిలిపి యధ్యాత్మగతులఁ బరికించుచు నుండె నత్తఱి నృపుం డొప్పుమీఱు
ఆ. భక్తి వందనములఁ బచరించి స్వచ్ఛంద, సుకృతఫలముగాఁగ శోభిలు మృదు
మధురవాక్కు లలర మహనీయతపమున, నలరు మౌనిచంద్ర కలదు శంక. 626

క. ఎందుం జన వారలు మరలం దగఁ బుట్టువును నీయిలాస్థలి గనరో
బృందారకవంద్యము ముని,మందారము బ్రహ్మము పరమము నగుఁగాదే. 627

క. మును లద్దానిం బొందిన, మనుజులు మఱి రారు పుట్టి క్ష్మాస్థలి కని నె
మ్మనములఁ దలంతు రక్షర, మని పల్కుదు రెల్లయెడల నదియె శివదమౌ. 628

తే. అదియె క్షర మనుచుం జెప్పనగును దాని
యందె జగ మెల్లను లయించు నట్లుగాన
నక్షరం బని క్షరమని యదియె చెప్ప
నగును దత్తత్త్వ మెట్టిదో యనఘ! చెపుమ. 629

సీ. అనవిని మౌనీంద్రుఁ డనియె రాజేంద్ర యీజగమెల్ల నెందుండి జాఱునొ యది
యెంత కాలము నిల్చి యిల నుండునో యదె ద్వాదశసాహస్రవర్షమితము
కల్పమం చనుచు యుగంబులు నాలుగు దానియంతరమునఁ దగిలి యుండు
ననుచుఁ జెప్పంబడు నద్ది శతావర్తనములఁ గాంచిన శతానందున కొక

తే. పగ లగునుగాదె రాత్రియుఁ బరిమితిని ద
దనుగుణంబె యటంచుఁ దదంతముననె
మరలఁ గల్గునటంచుఁ గర్మము లనంత
ములయి తగుటను సృజియించు భూతతతుల. 630

క. పరమేష్ఠి యిట్లు సృష్టిని, మరలం జేయంగ వెలయు మనుజాధిప! యె
వ్వరివంకఁ బుట్టు జగములు, పరమేశుం డెవఁడు మూలపద్ధతి తానౌ. 631

క. విను మద్దానిం దెల్పెద, జనకా! యణిమాఖ్య మనఁగఁ జని లఘిమాఖ్యం
గని ప్రాప్తి యనుచుఁ జెప్పం, జని యీశానాఖ్య మించి సర్వము తానై. 632

సీ. జ్యోతిస్స్వరూపమై శోభిల్లి సర్వతస్సంవ్యాప్తపాదహస్తంబె యగుచు
సర్వతశ్శీర్షలోచనవదనంబయి సర్వతశ్శ్రుతిమయి సర్వ మావ
రించి యుండును దీని నెంచువారలు కొంద ఱాదిహిరణ్యగర్భాఖ్య మనుచు
బుద్ధి యనంబడు భూతాది యనఁబడు ననుచుఁ గొందఱు యోగమున మహత్తు

తే. గాఁ గనంబడు ననియు నిక్కారణిఁ గొంద, ఱది విరించిసమాఖ్యను నలరు నందు
రొక్కకొందఱుసాంఖ్యులు పెక్కునామములను బరఁగునటంచును బలుకువారు.

క. అతిచిత్రరూపమును దాల్చి తగఁ విశ్వాత్ముఁడగుచుఁ జింతింపఁగనే
కతగల్గి యక్షరుం డని, యతఁడే చెప్పంగఁబడు మహాత్ములచేతన్. 634

క. ఆతఁడె త్రైలోక్యంబును, జేతశ్శక్తిని ధరించుఁ జిత్రంబుగ న
శ్లేష తనయాకృతి బహురూ, పాతతనామములఁ గాంచు నట్లుగఁ జేయున్. 635

ఆ. విశ్వరూపుఁ డనఁగ వెలయు నత్తఁడె మఱి, వికృతినొంది జగము వెలయఁ జేయు
నాత్మచేత నపుడె యాదియా ప్రకృతియు, నతనిగూడు సృష్టి యమరునపుడె.

క. నేనను భావము తోఁచిన,చో నప్పుడె వ్యక్తమె యగుచును బరమేశుం
డూనినశ్రద్ధ జగంబుల, వే నిర్మితి నొప్పఁజేయు వివిధగతులచేన్. 637

వ. అది యవిద్యాసర్గంబనియు మహత్తనియు నహంకారంబనియు జెప్పంబడును.
ఒకదానినుండియే చరంబని యచరంబనియు రెం డుద్భవించు. అవియె విద్యా
విద్యలను నామంబులఁ బ్రఖ్యాతిం గాంచు. శ్రుతిశాస్త్రానుచింతకులచే నీనామ
కరణంబు చేయంబడు. అహంకారమునుండి భూతసర్గంబు తృతీయంబని యొఱుం
గుము. అహంకారంబులందు వైకృతసర్గంబు చతుర్థం బనంబడు. జ్యోతిర్వా
యునభోజలపృథ్వులు శబ్దస్పర్శరూపరసగంధంబులు నను దశవర్గంబు యుగప
దుత్పన్నం బగు నర్థవద్భూతసర్గంబు పంచమం బని యొఱుంగుము శ్రోత్రత్వ
క్చక్షుర్ఘ్రాణ వాగ్ఘస్త పాద పాయు లిందములు బుద్ధీంద్రియములు కర్మేంద్రి
యములుయుగపత్కాలజనితంబులనియే నమ్ముము. ఇవి మనస్సుతోఁ గూడఁ గల్గి

నవి. ఈచతుర్వింశతితత్త్వములనుండి సర్వాకృతియుఁ బ్రవర్తిల్లు. ఆయాకృతిం గాంచి తత్త్వజ్ఞులగుబ్రాహ్మణులు శోకింపరు. జనకభూపాలా! యీత్రైలోక్యం బిట్లుత్పన్నంబయ్యె. సయక్షనాగగంధర్వకిన్నరమహోరగచారణపిశాచదేవర్షినిశాచరదంశకీటమశకంబై సపూతికృమిమూషికంబై సభషకశ్వపాకచండాలంబై సహస్త్యశ్వఖరశార్దూలంబై యుండు నరకార్ణవంబున సృష్టియంతయు నిమిడియుండు నని తలంపుము. జలభూమ్యాకాశంబుల దేహధారుల కెల్ల స్థానంబులు గలవని నిశ్చయింపుము. అవ్యక్తం బిట్లు త్రైలోక్యంబుగ మాఱిన ట్లెఱుంగుము. భూతాత్మయగుభగవంతుఁ డక్షరసంజ్ఞం జెలంగు. జగంబులాయక్షరంబునుండి జనించు టక్షరంబనియాతత్త్వంబునకు నామాంతరంబు గలదు. అవ్యక్తప్రభవం బగునీజగంబు మోహాత్మకంబు క్షరవివర్జనం బగునది యక్షరం బనంబడు అక్షరంబు నొందినదెల్ల మరలి రాదని యెఱుంగుము. పంచవింశతితత్త్వాత్మకంబైన తనువవ్యక్తంబునుండి యుదయించు. అదినిత్యంబు సత్త్వసంజ్ఞికంబు. సత్త్వసంశ్రయణంబున సత్త్వంబనంబడు. అమూర్తియగునది సృజించునపు డాసృష్టియంతయు మూర్తిమంతంబగు. చతుర్వింశతితమంబు మూర్తియగు. పంచవింశతితమం బమూర్తియగు. అదియే సర్వమూర్తివిశేషంబుల వ్యాపించియుండు. తా నమూర్తియయ్యు మూర్తిమద్భూతంబులకుఁ జేతనంబై చరింపఁ జేయుచుండు. సర్గప్రళయధర్మంబున నవియు సర్గప్రళయాత్మకంబగు. నిర్గుణంబైనను గుణసంజ్ఞితంబై కనఁబడుచుండు 638

క. పరతత్త్వం బీరీతిగ, వరుసన్ సర్గాంతము లను బహుకోటులు ని
ర్భరభక్తి నొనర్చుచుఁ బ్రకృతిరతిం గనియుండు నిట్టి తెఱఁ గెవ్వరికిన్. 639

క. తెలియఁగ నశక్యమే యగుఁ, బలుకులు వేయేల లోకపాలకుఁ డతఁడే
ఖలహరణుఁ డతఁడె త్రిగుణం, బులఁగూడి యనేక యోనిపుంజములందున్.

క. జననం బందుచు మృతినిం, గనుచుండు నటంచు జ్ఞానకణహీనులు దే
వుని నతనిఁగూర్చి పల్కుదు, రనఘుని తత్త్వం బెఱుంగ నలవియె తలఁపన్. 641

సీ. సహవాస సన్నివాసములనుబట్టి నే నన్యుండ నని యెన్న కందరవలె
సగుణుఁడై యుండునాసర్వేశ్వరుఁడు తమోగుణయుక్తుఁడై తమోగుణవికార
భావంబులన్ బహుభంగులఁ దగువానిఁ బొందుచుండును రజంబునను రాజ
సములగు భావవ్రజంబుల నొందును సత్త్వగుణంబున సాత్త్వికముల

తే. భావములనొందువరుస సత్త్వంబు రజము, తమము నను వీని బొందెడుతఱిని శుక్ల
మల్లె లోహితకృష్ణంబులయిన వర్ణ, ములు గలట్టిరూపంబులఁ బొందు నతఁడు.

క. మునులారా! యీరూపము, లను బ్రాకృతములుగ నెదఁ దలంపుఁడు వీనిం
గొను భూతములకుఁ గల్గెడు, ఘనఫలముల నాలకింపఁగాఁ దగు మీకున్. 643

క. నిరయముఁ దామసజంతూ, త్కరము గనున్ రాజసములు గాంచు మనుజతన్

బరికింప సాత్త్వికమ్ము ల,మరపదముం గాంచు సుఖమమరునందుఁ గడున్. 644

క. తమపాపంబునఁ దిర్య,క్త్వము గాంతురు పుణ్యపాపకలన మనుజజ
న్మముఁ గంద్రు పుణ్య మొనరుప, నమరతఁ గాంతురు నిజంబె యని నమ్ముం డెదన్.

తే. ఇదియె యవ్యక్తవిషయ మంచెన్ని మునులు
ముక్తిమార్గంబుఁ దెల్పిరి భూరితరము
గాఁగఁ బంచవింశతితమంబయి గ్రాలుదాని
జ్ఞానముననే గనందగు మౌనులార. 646

## నూటముప్పదిమూఁడవయధ్యాయము.

### నానావిధసంసారప్రాప్తిప్రకారము.

క. అని తెల్పి వసిష్ఠుం డి,ట్లను నప్రతిబుద్ధతను దనంతన బోధం
బును గాంచు నొక్కదేహం,బునుండి వేఱొక్కతనువుఁ బొందున్ వరుసన్.

తే. ఇంచుకంత భేదంబు లేకెల్ల దేహములను వర్తించుచుండుఁ బశులతనువులఁ
బశుశరీరంబులను గాంచు వరుస నొకట, దేవతాభేదతనువులఁ దేజరిల్లు. 648

క. తపమున సద్గుణములు తగుఁ, గపటము నశియించు సుగుణకాండంబున దో
షపరీతగుణము లడఁగును, సుపర్వలోకంబు సర్వశుభదము గలుగున్. 649

క. మనుజతఁ గాంచియె స్వర్గం,బున కేగంగల్గుఁ బ్రాణి పోలఁగఁ బాపం
బును జేయ నమరుఁ డొందును,మనుజత నని తెలియవలయు మతిమంతు లొగిన్.

సీ. మనుజతనుండియె ఘనపాపములచేత నరకాలయము నొందు నరుఁడు కోశ
కారమన్ కీటంబు కల్పితగృహమునఁ దన్ను బంధనములు తగులుకొనఁగఁ
జేసికొనంజూచు నేసరణిని దంతుగుణముల నిత్యంబు కోరియట్లె
యవగుణంబులచేత నములగుణంబులఁ దొలఁగించి నరకంబుఁ దూఱుఁ బ్రాణి

ఆ. *యని యెఱుంగవలయు నపగతద్వంద్వుండు
ద్వంద్వములకుఁ జిక్కఁ దదనురూప
యోనులందుఁ బుట్టు నొగి నట్టిమర్త్యుని
బహువిధముల రోగపటలమేఁచు 651

వ. శీర్షరోగం, బక్షిరోగంబు, దంతశూలంబు, గళగ్రహంబు, జలోదరం, బతిసారంబు, గండమాలా, విచర్చికా, చిత్రకుష్ఠంబు, లగ్నిపీడయు, సిధ్మాపస్మారంబులు, మఱియు నితరద్వంద్వంబులు శరీరప్రాకృతికరోగంబులు కర్మానుసారంబుగ నుప్పతిల్లు. వానినెల్ల ననుభవింపవలయు. అభిమానాతిమానంబుల సుకృతంబులు ఫలింపఁ జాలకుండు నేకవస్త్రుండును, జతుర్వస్త్రుండును, భూతలశయ

* ద్వంద్వమేతి చ నిర్ద్వంద్వాస్తాసు తాస్విహ యోనిషు. అని మూలము.

నుండును, మండూకశాయియు, వీరాసనస్థితుండును, నయి ప్రాక్తనపుణ్యవిశేష వశంబున సంచరించుచుండు. ఒక్కొక్కప్రాణి యాకాశంబున వీరాసనంబు కల్పించుకొను శయ్య యంబరంబున నమర్చుకొను. ఇష్టకాప్రస్తర చక్రక ప్రస్తర భస్మప్రస్తరంబుల శయనించు. భూమిశయ్యానులేపనుం డగు. వీర స్థానాంబుపాకంబుల శయనించు. ఫలకశయనుం డగు. ఫలగృహాన్విత వివిధ శయ్యలయందుఁ బరుండు. ఉద్యాన ఖల లగ్న త్వక్కృష్ణాజిన క్షౌమాన్వితుం డగు. మణివాలపరీధానుండగు. వ్యాఘ్రచర్మపరిచ్ఛదుం డగు. సింహచర్మపరీ ధానుం డగు. పట్టవస్త్రుం డగు. ఫలకపరిధానుండును, గటకవస్త్రధారియుఁ, గ్లైకవసనుండును, జీరవాసుండును, మఱియు ననేకవిధవస్త్రంబుల ధరించు వాఁడు నగు. మఱియును. 652

సీ. చిత్రతరాహార చిత్రరత్నంబుల ధరియించు నేకరాత్రంబు నడుము
గడువ భుజించు నొక్కండేకభోజనంబును జేయుచుఁ దినంబును గడపును
నాలుగు నెనిమిదినాఁడుల కొక్కట నాహారమును గొను నాఱుదినము
లకు నొక్కపర్యాయ మొకపూట భుజియించు నెనిమిదిఁగళల నెన్నియొక్క
తే. మాఱు దినుచుండు నిర్వ్వధి మాసమునకు
నొకట భుజియించు మూలమ్ము లోలిఁ దినును
ఫలములం దినుఁ బవమానభక్షణమున
జరపుఁ గాలంబుఁ బిణ్యాక మరసి తినును. 653

ఆ. పెరుఁగు గోమయంబుఁ బ్రియమున భక్షించు, గోవుమూత్ర మరసి గ్రోలుఁ గాశ
పుష్పములను దినును భూరిశైవాలంబు, నాసమై గ్రహించు నర్హరీతి. 654

తే. పండి రాలినయాకులఁ బరిణతఫల
ములను భక్షించుచుం గష్టముల నొసంగు
పాచితంబుల సిద్ధికై పరమనియతి,
నాచరింతురు కొంద ఱీయవనియందు. 655

సీ. చాంద్రాయణాదికసద్వ్రతంబుల యథావిధి నొనర్తురు కొంద ఱధికభక్తి
నాశ్రమమ్ములకెల్ల నర్హంబులైనట్టి కార్యంబులఁ ధర్మకలితముల న
ధర్మసంయుతములఁ దవిలియొనర్తురు మఱికొంద ఱుర్విధర్మంబు లేయని
పాషండమతహితపద్ధతులం గూడి తద్ధర్మములఁ జేయఁ దలఁచుచుండు
తే. రింకఁ గొందఱు మనుజు లెయ్యెడల లేని
శిలలఛాయల నివసింతు రెలమిఁ గొంద
ఱల్లిప్రస్రవణంబులయందు విజన
పులినతలముల నుందురు పూన్కి మెఱయ. 656

క. వనముల నుపవనముల ని, ర్జనములుగాఁ దలఁచి యుండఁ జనునంచు వసిం

పను బూనుదు రిఁకఁ గొందఱు, ఘనకాననములను శైలకందరతతులన్. 657

ఆ. ఆశ్రయించియుందు రట బహునియమమ్ము, లూనియుంద్రు కొందఱుగ్రతపము
చేయుచుంద్రు వివిధసిద్ధులఁ గోరుచు, యజ్ఞభేదముల సమాచరింత్రు. 658

చ. అనుపమవిద్యలం జదివి యార్తులకున్ మఱి వృద్ధివారికిన్
జననము దొట్టి బీదలయి స్వాంతము దూలఁగ నుండువారికిన్
ధనము నొసంగుచున్ ధరణి దైవత బాహుజ వైశ్య శూద్రులన్
గనికర మూని తోఁచినటుగా నుపకారము చేసి ప్రోచుచున్. 659

ఆ. ధరఁ బ్రసిద్ధులగుచుఁ దగువారి కొప్పునీ, సద్గుణమ్ములైన సత్త్వరజసు
లట్లె తమసు మఱియు నర్థధర్మంబులు, కామమాదిగాఁగఁ గల వవెల్ల. 660

ఆ. ఆత్మయందు వెలయు నట్లభ్యసించుచు, వేఱువేఱుగాఁగ విభజనంబు
చేయుచుంద్రు మఱియుఁ బాయనిభక్తిచే, నగ్నిహోమవిధుల నలరఁ జేసి. 661

సీ. యజ్ఞకృత్యంబుల నలరింత్రు మఱియు స్వధాకారముల సమస్తతులఁ గొంద
ఱలరింత్రు పితరుల యాజనాధ్యాపనముల మఱియున్ దానములఁ బ్రతిగ్ర
హమున యజ్ఞక్రియ నన్యసత్కార్యంబులను దేవతాప్రీతి నొనరుతు రొగి
గాని వారల కెల్లఁ గలవు జన్మభయంబు మృతిభయంబును వీని హితవిధులిల

తే. మాను లెల్ల సనాతనమా నిది తగఁ
గర్మజాలం బటందురు కమ్రరూప
మలరఁ బ్రకృతియె భయవిలయములఁ జేయు
విధిదినాంతంబునందానె విగుణయగును. 662

చ. ఖరకరుఁ డాత్మరశ్ముల నికామముఁ గాలము తప్పకుండ నే
వరుస జగంబులన్ వెలయుభంగి నొనర్చుఁ బరాత్పరుండు న
ప్పురుషున సర్వకార్యములఁ బద్ధతిమీఱ కొనర్చుచుండు నా
త్మరతిని సంతసం బలర ధర్మము మీఱక స్వేచ్ఛమీఱఁగన్. 663

చ. క్రియలఁ గ్రియాపథంబుననె కేవలసక్తుఁడునై యొనర్చుచున్
నియమముఁ బూని సత్త్వముఖనిర్మలసద్గుణనాథుఁ డౌచు న
వ్యయుఁ డపుడొప్పు; సత్పదమె యాతని కర్తఱి నొప్పు నందు రొ
క్కయెడ నదేమిలోపమును గన్పడ దాతనిశక్తి యెట్టిదో. 664

తే. ప్రకృతి యెల్లజగంబుల వఱలఁ జేసి, యపుడు వృద్ధివిగాఁ దగునట్లు చేయు
రజసు తమసును వ్యాపించి రహి ననేక, భంగులుగఁ దోఁచునట్లుగఁ బొంగి చేయు.

సీ. ఈరీతి ద్వంద్వంబు లెల్లను గడువంగ నావలననె యివ్వి నాశకాల
మందు లయించు నాయందె వసించు నీవానినెల్లను దాఁటవలయు ఘనుఁడు
వీని దాఁటినయంతగాని పుణ్యఫలంబులను బొంద సురలోకమునకుఁ బోవఁ
జాలఁ డిందే యుండి సకలసుఖంబుల ననుభవింపం దగ దనుపమాన

తే. సుఖములను నంచుఁదలఁచు నీక్షోణియందె
సాధుకృత్యంబులను జేయ స్వర్గమొందు
నెల్లజాతులయందు నాకెసఁగవలయు
శర్మ మనునూహ గలయట్టిజనుఁడు సతము. 666

వ. సత్కార్యంబుల నొనర్పవలయు. దాన దుఃఖంబులు గలుగదని సగుణబ్రహ్మంబు దలంచు. మహారాజా! మఱియు నాలకింపుము. మానవజన్మంబు దుఃఖబహుళంబు .నిరయంబునఁబడుటయె తద్ధర్మంబని తోఁచు నిరయంబునుండి మరల మానవజన్మంబు నేనొందితిని. దానినుండి దేవత్వము లభించె. మరల మానవత్వంబుగలిగె. దానినుండి నరకానుభవంబుగలిగె. దానినుండిపూర్వోక్తప్రకారంబున మరల మానవత్వదేవత్వములు గలిగె ద్విజాతుల కాత్మ యిట్లే గుణయుక్తంబై యుండు. దానిచే దేవమనుష్యులయందు నిరయంబు నొందునవకాశంబు గలుగు. మమత్వముం గూడి యందే పరిభ్రమించుచుండు, మరణాంతములగు దేహములందు సర్గకోటిసహస్రంబులు చెల్లుచుండు. ఎవ్వండు శుభాశుభఫలాత్మకంబగు కర్మమ్ము నొనరించు వాఁడు తదనుగుణఫలంబులం బొందఁజాలు. ముల్లోకములం దనుభవింపఁజాలు ఫలంబుల నాతం డనుభవించుచుండు. ప్రకృతి కామగతిం గర్మము లొనరించి తత్ఫలంబులం గుడుచు. తిర్యఙ్మనుష్యదేవమూర్తులం దాల్చి యాయాయిఫలంబుల నొందుచుండు. ప్రాకృతస్థానములు మూఁడని యెఱుంగుము. అలింగప్రకృతిత్వమువలన లింగముల చేతను నూహింపఁబడుచున్నది. అట్లే పౌరుషంబగులింగ మనుమానమువలన నెఱుంగంబడుచున్నది. మానవుఁడు లింగాంతరమునొంది యుత్తమప్రాకృతలింగము నొందును. అది యచ్యుతంబు. ప్రాణద్వారముల నధిష్ఠించి యాత్మయందుఁ గర్మములఁ దలంచు. శ్రోత్రాదులైదును గర్మేంద్రియంబు లనఁబడు. రాగాదులు గుణములతో గుణములయందుః బ్రవర్తించు. నేను వీనిని జేయువాఁడను. ఇవి నాయింద్రియములు. అని నిరింద్రియుఁడు తలంచు. అవ్రణుఁడు వ్రణవంతుఁడ నని తలంచినట్టు లీయూహకన్పడు. అలింగుఁడు తన్ను లింగిగాఁ దలంచునట్లు కాలశూన్యుఁడు తనకాలమును లెక్కించునట్లు,సత్త్వశూన్యుఁడు స్వసత్త్వము గణించునట్లు భవవిరహితుఁ డాత్మభవంబును జింతించునట్లు నమృతుఁడు మృతునిగాఁ దన్నుఁ జింతించుకరణి, నచరుఁడు తన్నుఁ జరించువానిగా నూహించుచందంబున నక్షేత్రుఁడు నాత్మ క్షేత్రమును గమనించు తేవ నసంగుఁ డాత్మసంగంబును బరికించులాగున నక్షరుఁడు తన్ను క్షరసహితుగా నెన్ను విధంబున నబుద్ధతవలన నిట్లు చింతించునని యెఱుంగుము. ప్రతిబుద్ధుఁడు కాకుండుటవలన నబుద్ధజనసేవనమువలనఁ బతనాంతములగు సర్గకోటిసహస్రముల నొందుచుండు. కుబుద్ధియుతుం డీలాగునఁ బరిభ్రమించుచుండుం గాని

ముక్తినొందం జాలఁడు. పంచదశీకల యోనియని చెప్పంబడు ప్రతిదినాభి వృద్ధి నొందుచు సోముండు పదాఱుకళలచే నిండియుండు. అబుద్ధిమంతుఁడు కళచే జనించుచుండు. ధీమంతుఁ డట్లు జనింపఁడు షోడశీకల సూక్ష్మమైనది. అదిసోమునిచే ధరింపఁబడు. దానిని మాత్రము దేవత లుపయోగింపరు. త్రిగుణాత్మికయగు ప్రకృతికి సగుణబ్రహ్మమే త్రిగుణాత్మకుఁ డగు నని యెఱుంగవలయు నని పలికిన జనకుం డిట్లనియె. 667

---

నూటముప్పదినాలుగవ యధ్యాయము.

అర్థజ్ఞానశూన్యులకు వైయర్థ్యము.

క. మునివర! క్షరమున కక్షర, మునకున్ సంబంధమున్న పోలిక యలరున్
వనితకుఁ బురుషునకును ని, ట్లనుబంధము గల్గుఁ బురుషుఁ డగు నున్నతిచేన్.

చ. పురుషుఁడు లేక గర్భమును బూనఁగఁజాలదు పుష్పగాత్రి యా
తరుణియె లేకయున్న యెడఁ దా బురుషుండు స్వవంశవర్ధనున్
బురుషుని బొందఁజాలఁడు విభూతియు వ్యర్థమె యాను గాఁ బర
స్పరసహవాససంశ్రయతఁ బొటిలు సంతతి జంతుసంతతిన్. 669

మ. రతికై యొండొరు లొక్కటం గలయికన్ రాజిల్లఁగా సద్గుణ
ప్రతతిన్ గూడగఁ గాలమందు నొకరూపం బేర్పడున్ దాని వి
స్తృతదృష్టాంతముతో వచింతు మునిసంఘేంద్రా! వినంబోలు నా
వితమున్ బూరుషునందు నెట్టిగుణముల్ బృందంబుగాఁ జొప్పడున్. 670

ఆ. జననియందు సుగుణసముదయ మింపొందు, నవ్విగలిగియుండు నాతనూజు
నందునంచు నెఱుఁగనగుఁగాదె యందును, స్నాయువితతి యస్థిసముదయంబు.

సీ. మజ్జయు నను నివి మానుగ జనకునివలనను దక్ర్గక్తములును మాంస
మనునివి గల్గును జననినుండి యటంచు వినుచున్న వారము వేదశాస్త్ర
ములయందు నీవిధి పలుకంగఁబడియెడు శ్రుతులందు మఱిశాస్త్రవితతియందు
నెదిప్రమాణంబని యెఱుఁగంగ నగునది సజ్జనాదృతమగుసరణి యిద్ధి

ఆ. యగు సనాతనంబు నవ్విధిఁ బ్రకృతియుఁ,బురుషుఁ డొప్పువారు మోక్షధర్మ
ములు చెలంగ నట్టిపోలికనుందునే, దెలుపవయ్య నాకుఁ దేటపడఁగ. 672

క. దీనితెఱం గెల్లను నిజ,మౌ నిది యీవిధి నటంచు నార్యవరా! మే
మో నియతము క్తికాముల,మై నెగడుదు మట్టిమాకు నర్హ విధమునన్. 673

ఆ ఎది యనామయంబొ యెది యజేయం బెది, యజర మెది యతీంద్రియంబొ యట్టి
దానితత్త్వ మెల్ల జ్ఞానధనా! తెల్పు, వయ్య తేటపడఁగ నెయ్య మలర. 674

చ. అన విని యవ్వసిష్ఠముని యాజనకావనిపాలుఁ గాంచి యి

ట్లనియోఁ దత్త్వదుక్తి వేదహితమై మఱి శాస్త్రనిదర్శనంబుగాఁ
దనరెడుఁ దత్త్వవేత్తవయి ధాత్రిఁ జెలంగుదు నీవు కావునన్
జనవర! యుత్తరం బిడుదుఁ జక్కఁగ దానిని నాలకింపుమా. 675

క. శ్రుతిశాస్త్రగ్రంథము స,మ్మతి నీవు నెఱుంగుదైన మాన్యజనసమా
హితమైన తదర్థము నో,క్షితిపా! వినిపింతు శ్రద్ధఁ జేర్పుము మదినిన్. 676

సీ. వేదాళియును శాస్త్రబృందముఁ బఠియించునాతఁడు చక్క గ్రంథార్థ మెల్ల
నెఱుఁగకపోయిన నెల్లప్రయాసము వ్యర్థమౌ; నర్థంబు నరయని యతఁ
డవ్వానిభారంబు నంతయు మోసెడువాఁడె యౌ; మఱియు నవ్వాని శ్రమము
నిష్ఫలం బే యగు నెఱి గ్రంథతాత్పర్య మస్మాదృశులనెల్ల నరసి యడుగ

తే. జెప్పియుండమె తత్త్వంబు చిత్తసీమ
నెఱుఁగు నెవ్వాఁడు తద్భావ మెఱుఁగఁజాలు
నతఁడు; స్థూలమనీషుఁడౌ నతఁడు తత్త్వ
దర్థ మెఱుగంగఁ గోరఁ డెట్టైన మదిని. 677

క. ఆమందమనీషుఁడు గ్రం,థామేయార్థమ్ము నెఱిఁగి యద్దానివిధం
బేమాడ్కి నిర్ణయింపం,దా మది నెంచంగఁజాలు ధాత్రీనాథా. 679

తే. గ్రంథతత్త్వంబు నెఱుఁగక కడఁగి వ్యాఖ్యఁ
జేయ నెవ్వఁడు పూనుఁ బాపాయతిమతి
దంభమున నొండె లోభతత్పరతనొండె
వాఁడు నిరయంబునకుఁ బోవువాఁడు సుమ్ము. 679

క. మనసు వినిశ్చలభావం,బును గాంచనియానరుండు పుజార్థంబుల్
గని నిర్ణయింపఁ జాలఁడు, గనుకన్ వాఁ డాత్మ నెఱుఁగఁగలఁడే చెపుమా. 680

చ. ధరణివరా! తదర్థమును దత్త్వవిదుత్తము లెట్లు తెల్పిరో
వరుస వచించెదన్ వినుము వర్ణ్యతమం బగుసాంఖ్యమందుఁ బా
మరజనదుర్గమం బగుచు మాన్యహితం బగుయోగమందు నే
గురుతరభావ మొప్పునది, కూర్మి వచింపఁగఁ బూనితిం గడున్. 681

సీ. యోగవిశేషంబు లొప్పుగఁ బరికింప సాంఖ్యపద్ధతి దానిఁ జక్కఁగూడి
యుండుఁ గావున సాంఖ్యయోగంబుల నెవండు చక్క నెఱుంగు నాజనుఁడెబుద్ధి
మంతుఁడౌ; జర్మంబు మాంసంబు రుధిరమేదస్సులు మజ్జ పిత్తంబు స్నాయు
వస్థిచయంబు నా నమరు నివన్నియుఁ గూడ నింద్రియములు కొమరుమిగులు

ఆ. నీవు నన్ను బ్రశ్న మీవిధమునఁ జేయఁ, జాలితివిగ దీని సారమెల్ల
నిట్టి యింద్రియములనెఱుఁగుటయద్రవ్య, మునకు ద్రవ్యమునకుఁగనుముభాతి.

క. తనువుననుండిరయె తనువును, జనియించున్ బీజ మొప్పఁజాలును బీజం

బునసుండి యిట్టు గావున, జనకము జన్యంబు ననెడు సరణి దెలియుమా. 683

వ. నిరింద్రియం బగుబీజంబునకు నిర్ద్రివ్య దేహికి గుణంబు లెట్లు ప్రవర్తిల్లు పరమేశ్వరుండు నిర్గుణుండు కదా. గుణములు గుణంబులయందుఁ బుట్టుచు నందే యడంగు చుండు. ఇట్లు ప్రకృతిజన్యగుణంబులు జనించుఁగాని ప్రకృతియం దడంగ కుండు. త్వఙ్మాంస రుధిర మేదఃపిత్త మజ్జాస్నాయువులను నీయొని మిదియుఁ బ్రాకృతంబగు శుక్రంబుతోఁగూడి పున్నపుసంక స్త్రీలింగ సంజ్ఞల నొందు. వాయువే పురుషుఁడనియు రసమనియుఁ జెప్పంబడు. అలింగప్రకృతి లింగంబులగు నాత్మజాల నొందు మూర్తంబునందుఁ బుష్పఫలంబులచే నమూర్తంబులగు నట్లే యనియెఱుంగుము. అనుమానంబున లింగ మెట్లు గలుగునని నిర్ణయించు టొప్పు. లింగంబులందుఁ బంచవింశతితత్త్వాత్మకంబు నియతాత్మకం బుండు. ఆపరమేశ్వరుండనాదినిధనుండు అనంతుఁడు. సర్వదర్శనుండు. కేవలుం డునగు అభిమానిత్వమువలన గుణములయందు గుణం బలరారు నని చెప్పంబడు. గుణవంతునకు గుణంబులు గలుగుంగాని నిర్గుణునకు గుణంబులు కల్గునే. గుణదర్శను లిట్లు తత్త్వంబు నెఱుంగుదురు. ఎప్పుడు ప్రాకృతగుణంబులివియని యెఱుంగునప్పు డాతఁడు గుణవంతుఁడె యగు. ఆతండె గుణభేదంబులంజూడ జాలు. మఱియు. 684

యోగప్రకారము.

తే. సాంఖ్యయోగం బతీతంబు స్వాంతమునకు
నందురు మహాత్ములైనట్టి యార్యవరులు;
బుధ్యమానంబుఁ జక్కఁగ బుద్ధి నెరుఁగఁ
జాలకుండియు నెఱిఁగిన సరణిఁ దలఁచు. 685

సీ. అట్టులే చక్కఁగ నరయజాలనివాని నవ్యక్తు నీశ్వరుం డనుచుఁ బిలుతు
రతనినే నిర్గుణుం డందు రధిష్ఠాత యనియు నిత్యుండని యంద్రు ప్రకృతి
వగుగుణములు నిర్వ దాపయినైదగు నని సాంఖ్యయోగంబు నందు గుశలు
వైపరమైషువు లగువారు పల్కుదు రెప్పు డవ్యక్తంబు నెఱిఁగియుండి

తే. యుఁ దదవస్థాపనమున నుద్యోగరశూన్యు, లగుదురో వారు తెలిసిన యట్టిదాని
భేదమును జూడఁజాలక భేదమె కను, చుందురంచు దలంపుమా యుర్వినాథ.

వ. బుద్ధ్యమానం బగువస్తువును రెండింటం వేఱుగాఁ దలంతురు. పరస్పరం బది క్షరాక్షరనిదర్శనంబు. ఏకత్వం బక్షరంబని, నానాత్వము క్షరంబని పలుకుదురు. ఇదిపంచవింశతినిష్ఠంబు. దీనికేకత్వదర్శనంబును. నానాత్వదర్శనంబును గలదు. తత్త్వవి త్తత్త్వములకు వేఱువేఱుగ నిదర్శనం బిదియే యగు. పంచవింశతి తత్త్వంబుగలది తత్త్వంబనియు, నిస్తత్త్వంబు పరంబనియుఁ జెప్పంబడు.

వర్జ్యంబునకు నాచారంబు వర్జ్యంబు. తత్త్వంబునకంటెఁ దత్త్వంబు సనాతనం బగునన విని జనకుం డిట్లనియె. 687

సీ. మౌనివరా! నీవు నానాత్వమనియు నేకత్వంబనియుఁ జెప్పఁగలిగె సంశ
యము వీనికి గలయట్టి భేదం బేమొ తెలియంగవలయు మీ వలన దీని;
బుద్ధం బనియును బ్రబుద్ధంబనియు బుధ్యమానం బనియు వింటి మందబుద్ధి
నగుట వీనికిఁ గల యాభేద మెఱుఁగంగఁ జాలక యున్నాఁడఁ దత్త్వ మెల్ల

ఆ. సంశయమ్ము వీడ సరగునఁ జెప్పుమా, యక్షరక్షరముల కైనకార
ణమును దెలియఁ జాల నమరుకృపం దెల్పు, మార్య బుద్ధిమాంద్య మంతరింప.

వ. నానాత్వైకత్వదర్శనంబు ద్వంద్వం బనిరుద్ధంబు బుధ్యమానంబు. మఱియు విద్యావిద్యలు నక్షరక్షరంబులు సాంఖ్యయోగంబులు చక్క వినవలతు. వచి యింపు మనుటయు వసిష్ఠుం డిట్లనియె. 689

క. వినవయ్యా రాజేంద్రా, ఘనమగు ప్రశ్నంబునైనఁ గల దుత్తర మిం
దునకు మఱి యోగకృత్యం, బును వేఱుగఁ జెప్పువాఁడ బుధవినుతముగన్. 690

సీ. యోగంబునకు ధ్యాన మొప్పు ముఖ్యంబయి యదియె దానికి బలమగునుజుమ్ము
విద్యల నెఱిఁగిన విద్వాంసు లద్దియు ద్వివిధ మందురు మనస్థితియు నొప్ప
వలయు నేకాగ్రతఁ బ్రాణసంయమనంబు నను నివి రెండును ధ్యానగతులు
వినుము ప్రాణాయామ మనునది నిర్గుణసగుణమానససంజ్ఞ క్షమఁ జెలంగు

ఆ. మూత్రమును బురీషమును వదలెడుతఱి, సగుణనిర్గుణముల సంజ్ఞ నలరు
భోజనమ్ము చేయఁ బూనునప్పుడు మాన, సమన నదియె చెల్లు క్ష్మాతలేంద్ర. 691

వ. అందు దొలి రెండింటి నొనరించి వెంట భుజింపరాదు. తక్కినపుడు భుజించు టొప్పు. ఇంద్రియములఇంద్రియార్థంబులవలన మనస్సు చేనివర్తింపఁజేయవలయు. దశవారంబులు గాని ద్వాదశవారంబులుగాని యిరువదినాలుగువారంబులు గాని ప్రాణాయామపద్ధతిం బూనవలయు. చోదనలచే నాత్మను మతిమంతుఁడు పురికొలుపవలయు. మనీషిబృందంబుచేఁ జెప్పంబడునట్లు నిశ్చలుండై యుండుపర మాత్మను ధ్యానింపవలయు. సతత మావిశ్వాత్మకు నెఱుంగుచుండ వలయు న ని వినుచున్నవారము. ధ్యానంబునకుఁ బ్రధానద్రవ్యంబు నిశ్చలమానసం బనుట నిశ్చయంబు. మఱియు. 692

చ. విరహితసర్వసంగుఁ డయి వీతచలత్వమునొంది యింద్రియో
త్కరమును జక్క గెల్చి హితకల్పిత భుక్తిని గొంచుఁ బ్రాగ్విభా
వరిఁ బరరాత్రమందు దృఢభక్తి మనంబు హృదంతరమ్మునన్
స్థిరమయి నిల్వఁ జేయ నగు సిద్ధి యిదే యగు యోగవిద్యకున్. 693

క. స్థిరముగ నింద్రియములనున్, వరుసన్ నిల్వంగఁజేసి వాని మనసుతో
సరికూర్చి మనసు బుద్ధియు, స్థిరముగఁ గూడంగఁ బూన్కిఁ జేయుచు నియతిన్.

తే. గ్రావమట్లు నిశ్చలుఁడయి కడఁగి స్థాణు
వట్లు కంపింపకుండి దార్వాకృతిఁ జల
నమును బొందకయుండి నిత్యమును బుద్ధి
విధివిధానజ్ఞుఁ డగునేని విమలుఁ డగును. 695

సీ. అట్టియోగాభ్యాస మనవరతము చేయునాతఁడు దేనినేనైన వినఁడు
వాసనచూడఁడు వస్తువు నెద్దానిఁ గనఁడు స్పర్శంబును మనసుచేత
నెఱుఁగఁడు సంకల్ప మెద్దాని జేయఁడు మదిని నూహింపఁ డిద్ధమును బోలి
సుంతయేనెఱుఁగఁడు సుజనుఁ డట్టిండెసూ ప్రకృతినిర్మలుఁడని పలుకుచుంద్రు

తే సజ్జనులు వాని నాతఁడే సాధుయోగ, నిరతుఁ డాతండె ధరణి నిర్మలుండు
యోగి యాతండె మనసును బాగుపఱుపఁ, జాలియుండుటమఱి చెప్ప నేలభూప.

క. దీపము దీప్తివిశిష్టం,బై పర్వను గ్రిందమీఁద నన్నిదిశల న
ట్లే పరమయోగి యెల్లెడఁ, జూపట్టును స్వీయదేహశోభల మిగులన్. 697

క. ఎందేఁ జన నెంచిన చో, నందుండును గతివిశేష మలరఁగ జనులె
ల్లం దారు చూచుచోటనె, పొందుగ నున్నట్లు చెప్పఁబూనుదు రధిపా. 698

క. హృదయస్థు నంతరాత్మను, సదమలతేజోభిరాము శాశ్వతు నట్లే
మదిఁ దలఁతురు మాబోంట్లు త,దుదితంబగు గతివిశేష మొప్పు నసమమై. 699

సీ. పొగలేనిసప్తార్చిపోలిక రశ్ముల నలరారునట్టి సప్తాశ్వుపగిది
వైద్యుతంబగు నగ్నివడువున నాత్మను బరమాత్మునిన్ యోగివరుఁడు గాంచు;
మహితాత్ములై ధృతిమంతులై జ్ఞానులై తగు పెద్ద లెవ్వనిఁ దమహృదంత
రమునఁ గాంతురొ యట్టిబ్రాహ్మణుల్ బ్రహ్మయోనిజు లమృతాత్మకునిగ నయోని

తే. జునిగ నాదేవుఁ దలఁపోయఁ జను నరేంద్ర
యట్టితత్త్వంబు యణువులం దణువు మఱి మ
హత్తులందు మహత్తర మనఁగఁ బడును;
సర్వభూతస్థమై కనఁజాలకుండు. 700

వ. బుద్ధిద్రవ్యంబుచేతను దృశ్యంబగు మనోదీపంబుచేతను లోకకర్తయగు నాపర మేశ్వరుండు మహత్తరంబగు తమఃపారముననుండియుఁ దామసుండు గాఁడని యెఱుంగుము వేదపారగులగు తత్త్వజ్ఞులు తమోదూరుండని పలుకుదురు. విమలుండు, విమతుండు, నిర్లింగుండు, నలింగసంజ్ఞకుండు, ననియు నామహాత్ముఁడే పొగడ్తం గాంచు. రాజేంద్రా! లోకంబున యోగంబె మహత్తరంబు. పరమాత్మను గనుఁగొనుటకన్న యోగలక్షణంబు వేఱొండు గలదే. ఇట్లు యోగి యోగనిష్ఠంజేసి యజరుం డగుపరమాత్మను గాంచు యోగదర్శనం బిట్టిదని నీకుం దెల్పితిని. ఇంక సాంఖ్యజ్ఞానంబు వివరించెద. అది పరిసంఖ్యా

నిదర్శనంబు. పరమాత్మ నవ్యక్తుండనియుఁ బ్రకృతిని బరాంబయనియు సాం
ఖ్యులు పలుకుదురు. దానినుండి మహత్తత్త్వం బుదయించు. అదియె ద్వితీ
యంబని యెఱుంగుము. 701

సీ. ఆమహత్తత్త్వంబునందుండియొకద యహంకారము జనించె నదె తృతీయ
మని వింటి మఱియు నహంకారమునునుండి పంచభూతంబులు ప్రభవమందె
ననిసాంఖ్యవిజ్ఞాను లనువదింతురు భూప యివెవసుప్రకృతులై యొసఁగువీని
యెనిమిదివికృతులు గను షోడశపదతఁ బంచవిశేషముల్ పంచసంఖ్య

ఆ. వెలయు నింద్రియములు గలిసి షడ్వింశతి, తత్త్వములనిసాంఖ్యధర్మవిదులు
పలుకుచుంద్రు; సాంఖ్యపద్ధతియిద్దాని, మూలమున నెనిలిచి పొలుచుచుండు.702

క. దేనికి నెది జనకంబగు, దానవె యయ్యది లయించు ధరణీశ్వర! పెం
పూనిన ప్రతిలోమంబులు, జూనే గ్రహియించు దివ్యతత్త్వ మ్మొకటఁ. 703

తే ఆనులోమ్యమునుండియె యవనిఁ బుట్టి
నవియుఁ బ్రతిలోమమునయందు నంతమొందు
గుణములందె గుణంబులు గ్రుంగుచుండు
సాగరంబుల నూర్ముల చందమునను. 704

సీ ప్రకృతివా సర్గంబు ప్రలయంబు నిట్టివే యగుఁజూమ్ము ప్రలయంబునందు నేక
తనుగాంచు సృష్టిని దగుబహుత్వంబున నంచు విజ్ఞానులై నట్టిఘనులు
తలపోయఁజను; దీని కలయంతరాత్మయే యగు నధిష్ఠాత సత్యమ్ము భూప
యేకత్వబహుతల కెల్లను బ్రకృతియె కారణంబగును నేకత్వ మరయఁ

తే. బ్రళయమునయందె మఱి బహుత్వము ప్రదర్శ
నార్థమగుసృష్టియందు నాయాత్మ ప్రసవ
ధర్మమున నొప్పుప్రకృతిని దగ సృజించు
బహువిధంబులఁ బొడసూపవలయు ననుచు. 705

వ. అదియె క్షేత్రంబు పంచవింశంబగు నాత్మ యం దలరు. అదియె యధిష్ఠాత
యని మునిసత్తములచేఁ బరికీర్తితం బగు. అధిష్ఠానమునుండియధిష్ఠాత క్షేత్రం
బులకగునని మున్ను విన్నవాఁడ. క్షేత్రంబు నెఱుంగుట క్షేత్రజ్ఞుండనంబడు.
అవ్యక్తికంబగు పురంబున నుండుటఁ బురుషుండనంబరఁగు. క్షేత్రంబన్యంబు.
క్షేత్రజ్ఞుండన్యుండు. క్షేత్రమవ్యక్త మనంబడు. పంచవింశకతత్త్వంబు జ్ఞాత
యనంబడు. అట్లే జ్ఞానంబన్యంబగు. జ్ఞేయం బన్యం బగు. జ్ఞానం బవ్యక్తసంజ్ఞం
దనరు. పంచవింశకతత్త్వంబు జ్ఞేయసంజ్ఞనొప్పు అవ్యక్తంబె క్షేత్రం బనియు
సత్వంబనియు నీశ్వరప్రధానం బనియుఁ జెప్పంబడు. అనీశ్వరం బతత్త్వంబు
పంచవింశకతత్త్వంబని చెప్పంబడు. సాంఖ్యదర్శనం బింతియ యనియెఱుంగం

దగు. ఏతద్విషయంబున నింతకంటె లెక్కింపఁ దరంబుగాకయుండు. సంఖ్య
చేయుటవలనఁ బ్రకృతి యనిపిలువంబడునందురు. నలువదియనియునిరువదినాలు
గనియుఁ దత్త్వంబుల లెక్కింతురు. సహస్రవిధంబుల లెక్కించినను గొఱంత
నొందకుండు. పంచవింశకంబు నిస్తత్త్వంబు ప్రబుద్ధాత్మయై బుధ్యమానమనియు
నదియె చెప్పంబడు. ఎత్తరుణమున నాత్మను దెలిసికొనునో యప్పుడు కేవలుం
డనంజను. జనకరాజేంద్రా! ఈదర్శనంబు చక్కఁగా వివరింపం బడియె. దీని
తత్త్వంబు నెఱింగినవారు సమత్వము నొందుదురు ప్రకృతిసర్గంబెల్లఁ బ్రత్య
క్షంబె యగు కావున సమ్యగ్జ్ఞానదర్శనంబనం జను. నిర్గుణునినుండి గుణవిశిష్ట
యగు ప్రకృతి యుదయించు. వీనికిఁ బునఃపునరావృత్తిని లెక్కింప నశక్యం
బైయుండు. క్షరభావంబు గానరాదు. పరస్పర మవ్యయం బనంజను. కుమ
తులు భిన్నభావంబు గాంతురు. సుమతు లభేదంబు గాంతురు కావున వారు
పరిశుద్ధపదంబును గాంతురు. కొంద ఱిద్దానితత్త్వంబు చక్క నెఱుంగఁజాలక
వ్యక్తిభూతు లగుదురు వ్యక్తంబునె యనువర్తించుట నష్టిఫలంబుగలుగు.
సర్వం బవ్యక్తంబనియె చెప్పంబడు అసర్వంబు పంచవిశకంబని యెఱుంగుము.
ఎవ్వరీవిషయంబు నెఱుంగుదురో వారు సంసారభయంబు నొంద రని తెలిపి
వసిష్ఠముని మఱియు నిట్లనియె. 706

---

నూటముప్పదియేనవయధ్యాయము.

విద్యావిద్యాస్వరూపకథనము.

చ. జనవర! సాంఖ్యతత్త్వమును జక్క వచించితి విద్యకవ్విధం
బుననె యవిద్యకుం గలుగుపోలిక భేదము నిర్వచింతు శ్ర
ద్ధను వినవయ్య! సృష్టిలయధర్మ మెఱింగినపెద్దలెల్ల నా
త్మను దలపోసి సూనృతవిధంబునఁ బల్కెదు రేదొ దానినిన్. 707

క. వినిపించెద నవ్యక్తంబు నభేద్యం బౌనటంద్రు మునులు మఱియు సృ
ష్టిని లయమును విద్యనవిద్యనుగాఁ బల్కుదురు వారియాశయ మెల్లన్. 708

వ. చక్క నెఱుంగం దగియుండు. సాంఖ్యమం దభినివేశనంబునఁ బల్కిన మహర్షుల
వచనంబులు సూనృతంబులుగాన వాని నెఱింగించెద. కర్మేంద్రియంబులకెల్ల విద్య
బుద్ధీంద్రియంబని చెప్పంబడు. బుద్ధీంద్రియములకెల్ల విశేషములు గలవని విని
యున్నవాఁడ. సర్వవిషయంబులకు మనస్సును విద్యనుగాఁ బలుకుదురు. మనస్సు
నకుఁ బంచభూతములు విద్యలని పల్కంబడు. పంచభూతంబులకు నహంకా
రంబు విద్యయని నిర్ణయింపం బడు. అహంకారము బుద్ధియు విద్యలని స్మరిం
పుము. బుద్ధిచేఁ బ్రకృతిని దానిచే నవ్యక్తము నెఱుంగందగు. తత్త్వములకుఁ

బరమేశ్వరుం డధినాథుం డగు. విద్యను జక్క నెఱుంగుట సముచితం బగు. తద్విధియు ముఖ్యం బెయగు. అవ్యక్తంబును విద్యయనియుఁ బంచవింశకతత్త్వం బనియుఁ జెప్పుదురు. జ్ఞేయజ్ఞానమునకు సర్వంబునకుఁ బారగం బవ్యక్తం బెయగు. జ్ఞాన మవ్యక్తంబనియుఁ బలుకుదురు. విజ్ఞాత పంచవింశకసంజ్ఞుండగు. జనకభూపాలా! విద్యావిద్యలరీతి నెఱింగించితిని. క్షరాక్షరభేదంబు నెఱింగించెద. 709

సీ. ఇవి రెండును క్షరంబులే యనిపల్కుదు రివి యనక్షరములె యవు నటం్రు
కారణం బెఱిఁగింతు జ్ఞానంబునుండియె జ్ఞానంబు గలుగును గాన దీని
విను మివ్వి రెండును విద్వద్వితతిచేత నాద్యంతములు లేని వనియె చెప్పఁ
బడు నివ్వి రెండు నీశ్వరసంజ్ఞ గలవని నిర్ణయింపంబడు నియతతత్త్వ

తే. సంజ్ఞికములంచు విమలవిజ్ఞానధనుల
చేతఁ జెప్పఁగఁబడు దీనిహేతు వేదొ
వినుము సర్గప్రళయములఁ జనుస్వభావ
మలవడుట నవ్యయం బె యవ్యక్తమగును. 710

వ. ఆయవ్యక్తంబు గుణసర్గంబుకొఱకుఁ బ్రవర్తించుట మహదాదిగుణంబులఁ బరస్పరసంయోగంబునం బుట్టం జేయు. అధిష్ఠానంబునె క్షేత్ర మందురు. అదియె పంచవింశకం బనంబడు. యదంతర్గుణజాలంబు గలదో యది యవ్యక్తాత్మయందుఁ జెందు. తద్గుణంబులచేఁ దదహంకారంబు పంచవింశకంబందుఁ బ్రలీనం బగు. గుణంబులు గుణంబులందు విలీనంబులగు. ప్రకృతి యొక్కండె మిగులు. అప్పుడు క్షేత్రజ్ఞుండు ప్రధానుండై యుండు. ఎప్పు డక్షరంబగు ప్రకృతి గుణసంజ్ఞితయై యెవ్వనిగూర్చి పోవునో యప్పుడు గుణంబులయందు నిర్గుణత్వం బలవడు. ఇట్లే క్షేత్రజ్ఞుండు క్షేత్రజ్ఞానపరిక్షయంబునఁ బ్రకృతితోడ నిర్గుణుం డనంబడునని పెద్దలుపలుక వింటిని. ఈక్షేత్రజ్ఞుం డెప్పుడు క్షరుండనంబడు నపుడు ప్రకృతి గుణవతియై గుణంబులు బ్రవర్తిల్లఁ జేయు. మఱియు నాత్మనిర్గుణత్వము ను బ్రకృతి నెపుడు తెలిసికొనునో యపుడు విశుద్ధుం డగు. ప్రకృతిపరివర్జనం బె యిందులకుం గారణంబగు. బుద్ధిమంతుఁ డెపుడు నేను వేఱు. వీఁడు వేఱని తలంచునో యపు డితఁ డవ్యథత్వము నొందు మిశ్రత్వము నొందఁడని యెఱుంగుము. ప్రకృతిచేతనే క్షేత్రజ్ఞుండు మిశ్రుండుగఁ జేయంబడు. ఎపుడు ప్రాకృతగుణజాలంబునుగూర్చి యేవగించునో యపుడు నిర్మలుండై సర్గప్రవృత్తి మాని యుండునని తలంపుము. ఇదేలనాచేఁ జేయంబడియె? నేనెవఁడను? గాలనిమజ్జనుండ నేల నైతిని? మత్స్య మజ్ఞానమువలనను దకంబునుండి తాను వేఱుగనున్నట్లు తలంచునో నేనునట్లే తెలియమినాత్మ నన్యంబుగఁ దెలియఁజాల కుంటిని. ఇట్టినన్ను నేనే నిందించుకొనఁ దగును. కుబుద్ధుఁడ నైతిని. ఈసర్గసంసారమున

మునింగితిని. చక్కఁగాఁ జింతింపని కారణమున మోహమునొంది యొకదాని కంటె నింకొకటి వేఱని జనునికంటె వేఱొకజనుఁడు భిన్నుఁడని తలంచితిని. వీఁడు నాకు బంధువు. వీనితోడ నాకు లయముగలదు. సామ్యము నేకత్వత నొందుటెట్లో యట్లున్నవాఁడను. నేనిపుడు తుల్యత్వమునే చూచుచున్నాఁడను. కాన వీనితోసమానుఁడను. ఇది విమలంబగు నవ్యక్తంబు. నేను నిట్టివాఁడనే యగుదును. ఆ నే నజ్ఞానసమ్మోహమునఁ దెలియఁజాలమి సంవృత్తుండనైతిని. సంసర్గాతిసంసర్గములవలన నింతకాల ముంటిని. అట్టినేను వశీభూతుఁడనై యిక్కాలము నెఱుంగఁజాలనైతిని. ఉత్తమాధమమధ్యములలో నెట్లు కాలము గడపితిని? సమానమాయతో నెట్లు సహవాస మొనరింతును? అబుద్ధభావముగలవాఁడ నగుట పోవుదును. ఇందే స్థిరముగానున్న నుందును. వంచనమువలన నీకాలమునుగూడి యుండను నిర్వికారుఁడనగునేను సవికారయగు నీప్రకృతిచే వంచింపఁబడితిని. ఇతరాపరాధములు నాకు లేవు. ఇదియొక్కటియ యపరాధము. నేనుసంసక్తుఁడనై పరాఙ్ముఖుఁడ నైతినో అందువలననే బహురూపుఁడనై మూర్తిమంతుఁడనైతిని అమూర్తిమంతుఁడనమూర్తాత్మనగు నేను మమత్వముచేఁ బ్రధర్షితుఁడ నైతిని. కావునఁ బ్రకృతిచే నాయాయియోనుల యందుఁ బడఁద్రోయఁబడుచు నిర్మముఁడనయ్యు మమత్వమున వికారమునొందింపఁబడితిని. బహుజన్మములం గాంచి నష్టసంజ్ఞుండనై నష్ట చేతస్కుండనై సమత గాంచఁజాలక యహంకారముసంగతిం గాంచితి. ఆయహంకార మాత్మను బహువిధంబుల వెలయించి నన్నుం గూడుచున్నది. ఇపు డిద్దాని నెఱింగితిని. నిర్మముఁడనై నిరహంకృతుఁడనైతిని. మనస్సుచే నిత్యమహంకారకృతాత్మకంబగు మమత్వంబు కల్పింపఁబడుచుండు. దీనిసంబంధము నింక వదలి నిరామయంబు నాశ్రయించెద. ఇంకదీనింగూడియుండ నోప. దీనిసంగతి నాకు క్షేమంబు లేదు అని యిట్లు చక్కనూహించి పంచవింశకంబగుతత్త్వం బక్షరత్వము నొందు. క్షరమును వదలు. మఱియు నవ్యక్తంబు వ్యక్తధర్మంబుగలదియగు. నిర్గుణంబు సగుణంబగు. నిర్గుణంబును దొలుతటిదిగా భావించిన విజ్ఞానంబుగలిగి భ్రాంతి తొలంగునని యెఱుంగుము. క్షరాక్షరభేదంబు సవిస్తరంబుగ వచించితిని. శ్రుతినిదర్శనంబువలన జ్ఞానసంపన్నంబగు నీరహస్యము నే నెట్లెఱింగితినో నిస్సందిగ్ధంబుగను సూక్ష్మంబుగను, విశుద్ధంబుగను నీకు నెఱింగించెద వినుమని వసిష్ఠుండు మరల నిట్లనియె. 711

## సాంఖ్యయోగాభేదత్వము.

తే. సాంఖ్యయోగంబుఁ దెలిపితి శాస్త్రవిహిత
మగు నిదర్శనమున సాంఖ్యమందుఁ జెప్పఁ
బడినయోగంబె యోగతత్త్వజ్ఞవిహిత

మనుచుఁ దెలియంగఁ దగు నరేంద్రాధినాథ. 712

సీ. సాంఖ్యశాస్త్రోక్తవిజ్ఞానము తలపోయఁగను బ్రబోధనపరం బనివచింత్రు
శిష్యహితార్థము చెప్పంగఁబడును విస్పష్టంబుగను నట్టిశాస్త్ర మెంతొ
విస్తృతిగలదని వివరింత్రు పెద్దలు;కనుక నీశాస్త్రమందునఁ బునర్భ
వపురస్సరముగఁ దత్త్వమ్ము లిర్వదియైదుగా నిర్ణయించిరి సూనృతాత్మ

తే. లట్టి సాంఖ్యతత్త్వంబు నెయ్యమున నిపుడు, వర్ణితంబయ్యె బుద్ధ మప్రతివిబుద్ధ
మట్లె బుద్ధ్యమానంబు నొనందు మూఁడ, వదగు బుద్ధత్వసంజ్ఞితం బిదియెరీతి.

## నూటముప్పదియాఱవయధ్యాయము.

అజునకు నానాత్వకథనము.

క. అని మఱియు వసిష్ఠుం డి,ట్లనియెను రాజేంద్ర వినుమ యవ్యక్తంబే
యనఁబడు గుణనిధియగు నని, మునితతిచే గుణయుతమయి భూతవితతులన్.

క. జనియింపఁజేయుఁ ద్రుంచును, జని లేనిదియయ్యె నది యజ మనెడుసంజ్ఞన్
గనియుండుఁ గ్రీడచే విక్రృతిని గాంచును గాని యది మదిం దలపోయన్.

ఆ. అవికృతంబెయగుఁ దనంతన యాత్మను
బహువిధములఁ బర్వి వఱలఁ జేసి
బహుతఁ గాంచుఁ దెలియఁబడకుండు నవికృత
మయ్యు వికృతిగాంచి యలరుచుండు. 716

క. తెలియనిచందంబుననే, వెలయుచు గుణియగుచు లోకవితతులఁ బెంచున్
విలయం బందఁగఁజేయును, గలిగిన యప్రతిమశక్తిఁ గడుఁ దా వెలయున్. 717

వ. అవ్యక్తబోధనంబువలన బుద్ధ్యమానంబని వచియింతురు. అవ్యక్తం బగు నాతత్త్వంబు సగుణంబని నిర్ణయింప వలనుపడదు. నిర్గుణంబనియుఁ జెప్ప శక్యంబుగాదు. కాలాంతరకారణాంతరంబుల నయ్యై పేరులం బరఁగుచుండు. ప్రపంచతత్త్వంబుం దలంచినతఱి నది యవ్యక్తం బనంబడు. బుద్ధ్యమానం బగునాతత్త్వము మహాత్మకసంజ్ఞ గలదగునని వేదసమ్మతంబు. అన్యోన్యప్రతిబుద్ధంబుచే నచ్యుతం బవ్యక్తం బనియు వచియింతురు పంచవింశకంబు మహాత్మము. దాని నెఱుంగ శక్యముగాదు. షడ్వింశకంబు విమలంబు బుద్ధం బప్రమేయంబు సనాతనంబు నగు. పంచవింశకతత్త్వం బట్టిద. చతుర్వింశకం బెఱుంగఁదగియుండు. తత్స్వభావంబు దృశ్యాదృశ్యంబుగ నుండునని మునీంద్రుల భావంబు. అవ్యక్తంబు బ్రహ్మమని యెఱుంగుము. ఇరువది నాలుగవదియు నిరువదైదవదియు నాత్మను గాంచుచుండు. ఆత్మయిట్టిదని యెఱింగినతఱిఁ దద్భిన్నంబ నేనగుదునని యవి రెండును దలంచు. అట్టియవస్థయం

డుఁ బరబ్రహ్మము ప్రకృతి విశిష్టతం గ్రాలుచుండునని యెఱుంగుము. షడ్వింశకతత్త్వంబు నెఱింగినమహాత్ముండు బుద్ధుండె యగు. అపరబ్రహ్మ మవ్యక్తంబు సర్గప్రళయధర్మముగలదిగా నెఱింగి దాని వదలు. నిర్గుణప్రకృతిని గుణయుక్తగ నచేతనగ నెఱుంగు. అట్టితఱిఁ గేవలధర్ముండగు నాపరమేశ్వరుం డవ్యక్తదర్శనంబున నిర్మలుండగుచు వెలుఁగు తాఁ దనయందె సర్వంబును గాంచుచుఁ గ్రీడించుచుండు నిదియె తత్త్వం బని పెద్దలందురు. 718

తే. తత్త్వసంశ్రవణంబునఁ దత్త్వవేత్త
యన జనుం డొప్పు; నిర్వికారియైనతత్త్వ
ములె యటందురు సాంఖ్యులు తలఁపఁ దత్త్వ
విదుఁడు సంసారమున మున్గి వెతలఁ బడఁడు. 919

క. ఎవరికిఁ దత్త్వజ్ఞానం, బవితథముగఁ దెలిసియుండు నట్టిండ్రే యీ
భవసాగరముఁ దరింతురు, సువిమలగతి నంచుఁ దెలియు క్షోణీశవరా. 720

క. ఇరువదియాఱవతత్త్వం, బరయఁగ నే నైతి ననుచు నాత్మఁ దెలియు నా
నరుఁ డజరామరుఁ డగునని, ధరణీంద్రా! తెలియుము సమతం గను నతఁడే. 721

వ. చేతనంబుతోఁగూడిన పంచవింశతికున కేకత్వంబు లభించు. అప్పు డతఁడు బుద్ధియందుఁ దత్త్వంబు నాలోచించుచుండు నని యెఱుంగందగు. బుధ్యమాన బుద్ధునిచే సమత నొందంబడు. ఇది సంగ ధర్మంబు. ఆత్మ నిస్సంగంబే యగు. నిస్సంగాత్మునిం గూడిన షడ్వింశంబు కర్మజం బనఁబడు నందురు. పరమాత్మ యెపు డవ్యక్తమును ద్యజించునో యపుడు నిర్మలాత్మతత్త్వంబు నెఱుంగు. షడ్వింశకప్రబోధమునఁ జతుర్వింశం బగాథంబగు. బుద్ధునిలక్షణంబు శ్రుతిని దర్శనము ననుసరించి తెల్పితిని. ఈబుధ్యమానప్రబుద్ధులకు మశకోదుంబరంబులకుఁగల సంబంధము గలదనవలయు. మత్స్యోదకములువలె నరి కన్యత్వము గూడ లభించు. రాజేంద్రా! నానాత్వైకత్వముల నిట్లే యెఱుంగం దగు. జ్ఞానవిజ్ఞానసంజ్ఞితంబగు మోక్షం బట్టిదని చెప్పంబడియె. పంచవింశతికుని దేహంబం దేదిప్రవర్తించుచుండునో యదియే ముక్తినొందింపందగినదని యూహింపుము. పెద్దలెల్ల నవ్యక్తదర్శనంబువలన నిట్లు సిద్ధాంత మొనరించిరి. పూర్వోక్తవస్తు విట్లే ముక్తినొందుననియు వేఱుమార్గంబు లేదనియు సిద్ధాంతంబు. ఇది యొండొకదానింగూడి పరధర్మము నాశ్రయించి యితరమనియుఁ జెప్పంబడు. విశుద్ధముంగూడి విశుద్ధధర్మము కలదగు. అశుద్ధప్రకృతింగూడి యశుద్ధం బగుచుండు. బుద్ధునింగూడి విశుద్ధ మనందగియుండు. శుచియనియు బలుకం దగు. విమలాత్మసంయోగమున విమలాత్మయు నగు. విమోక్షిం గూడి విమోక్షసంజ్ఞం బడయు. ఇట్లే సంయోగమున విమలాత్మయనియుఁ గేవలాత్మయనియు స్వతంత్రమనియుఁ బ్రఖ్యాతిం గాంచుచుండు. యథార్థ

తత్త్వం బింతదనుక వచించితిని. నీ వమత్సరుండవై బుద్ధిచే గ్రహించి సనా
తనంబు విశుద్ధంబు నాద్యంబునగు బ్రహ్మము నెఱుంగుము. 722

క. శ్రుతినిష్ఠలేని జనునకు, హితమని బోధింపఁబోకు మిద్ది యెఱిఁగినం
జ్యోతిలేని పదము గననగు,హితమంచుఁ దలంచి యెవ్వఁ డెఱుఁగఁ దలఁచునో.

క. వానికి నుపదేశింపుము, మానసమునఁ బొదలు శ్రద్ధ మహిఁబడి వినతిం
బూనినవానికిఁ జెప్పుము, దీనిన్ ధరణీంద్ర! యతఁడె తృప్తిఁగని వినున్. 724

సీ. అనృతమాడెడునట్టి యధమునకును శఠునకుఁ గ్లీబునకు వంచనమునొనర్చు
నలవాటుగలవాని కమలవిజ్ఞానికిఁ బండితునకు మఱి పరున కెలమి
బాధలఁగల్గించువానికి నీతత్త్వమును దెల్పఁబూనకు; మనుజునట్టి
వాని శిష్యునిగాఁగ భూనాథ! కొనకుము; శ్రద్ధగలట్టి సజ్జనున కమల

తే. గుణయుతునకు సకీర్తికిఁ గుందువాని, కమలయోగనిష్ఠునకు నెయ్యంబుమీఱఁ
బలుకుమా సాధుమతికి నిమ్ములఁ బ్రశాంతి, గలుగువానికి మది దయగల జనునకు.

చ. అనుపమశీల మొప్పెడు మహాత్మునకున్ విధిమీఱరాదు త
ప్పని తలపోయువానికి నహర్నిశముల్ కువివాద మట్టి చే
యని గుణరాశికిన్ బహువిధామలశాస్త్రపురాణవేత్తయౌ
జనునకు సాధువేషమునఁ జాలఁ బ్రియంబు గలట్టివానికిన్. 726

క. హేతువులం గోరకవిను, నాతనికిన్ దత్త్వమిద్ది యడిగినయంతన్
జేతఃప్రియమునఁ జెప్పుము, భూతలనాథా! రహస్యముగఁ దగుదీనిన్. 727

సీ. పూర్వోక్తగుణములఁ బొలుచువానికిఁ దప్ప నన్యుల కెలమినీయంగఁ దగదు
పరమము బ్రహ్మము నిరుపమానము విశుద్ధము గాన నెఱుఁగక తత్త్వమిద్ది
యొరులకుఁ దెల్పిన దోసఁగూడు నయశం బపాత్రదానంబొటఁ బార్థివేంద్ర
బహురత్నపరిపూర్ణయు హితసత్ఫలదయు నగుభూమినెల్ల నీయఁ దగుఁ గాని

తే. తత్త్వ మిద్దాని నీయకు తగునటంచు
నవ్రతున కెప్పుడే నింద్రియముల గెల్చి
నియతుఁడై తత్త్వ మెఱుఁగంగ నెఱిఁదలఁచెడు
వాని కడిగిన యంతనె వరుసఁ జెప్పుము. 728

క. వినిపించినాఁడ నీకో, జనకా పరమంబు బ్రహ్మసంజ్ఞితము సనా
తన మాదిమధ్యరహితం, బనంత్యము విశోకము నగు నమలవిషయమున్. 729

ఆ. ఇంక నీకుభయమదెవ్విధమునసైన, నుండదనుచు నమ్ము ముర్వినాథ
యిది యగాధ మజర మెత్తఱి నమృతంబు, నిర్గతామయంబు నిత్యశివము. 730

సీ. వీతభయంబునా విమలాంతరంగుఁడై పరవాదసంజ్ఞిత పరమమోహ
మును వీడి దీనియందున గలతత్త్వార్థ మెఱిఁగిన ముక్తుఁడౌ నెఱి నచుండు

నరవరా! యిది హిరణ్మయగర్భుఁ డనువదింపఁగ వినినాఁడను భక్తిమీఱ
దానిని నీకు నిత్తఱిని బోధించితి దీని నావృతి విన జ్ఞాన మబ్బుఁ
ఆ. బ్రశ్నమునకుఁ దగినభంగి నుత్తర మిడి, నాఁడఁ బెంచి చెప్పఁగూడ దేపుడు
విన్నయంత నీకు వివరించితిని బ్రహ్మపదము నొందఁజేయుభంగి దీని. 731

క. అని తెల్పి వ్యాసముని యిట్లనియెను మునులార! బ్రహ్మమనజనుదీనిన్
విని తెలిసికొన్నవారికిఁ, బునరావర్తనము లేదు పూజ్యం బగుటన్. 732

క. మునిపతి వసిష్ఠుఁ డిద్దా, నిని బల్కెం బూర్వ మదియె నియతిని మీకే
వినిపించితి నిరువదియై, దనుసంజ్ఞం బరఁగు దాని యమలచరితమున్. 733

క. నరుఁ డెవ్వం డిద్దానిని, బరమాదృతి వినియు బుద్ధిఁ బరికింపక యా
దరమున ధ్యానింపక సు, స్థిరమతి స్మరియింప కుండుఁ దీవ్రశ్రద్ధన్. 734

క. పునరావృత్తిం గను నతఁ, డనుమానం బేల? యిద్ది యశము నొసంగున్
మననము చేయం దగు సన్మునులార! తలంపుఁ డెదల మునుకొను శ్రద్ధన్. 735

వ. కరాళజనక వసిష్ఠసంవాదసారం బగుట నిది పరమపవిత్రంబగు. హిరణ్యగర్భుని
వలన వసిష్ఠమునికి లభియించె. అమ్మునినుండి నారదుఁడు సంపాదించె. నారద
మునినుండి యీయుత్తమవిషయంబు నే నెఱింగితిని. ఈనిర్మలవిషయంబును
వినుట మీకిఁక శోకంబు గలుగదు. భిన్నములగు క్షరాక్షరంబుల నెఱుంగునో
యతనికి సంసారభయంబు లేదు. ఈతత్త్వం బెఱుంగకయున్న సంసారభయంబు
గలుగక మానదు. దీని నెఱుంగనిమూఢుఁడు పెక్కు నుపద్రవంబులఁ బలు
మాఱు గాంచుచుండు. పెక్కుసారులు మృతిం గాంచుచు జననంబుం గను
చుండు. దేవలోకంబు నొందినను మరల మనుష్యలోకంబు నొందు. 736

సీ. అజ్ఞానసాగరం బరయ నగాధంబు ఘోరతరంబయి కూలఁద్రోయు
చుండుఁ జెంతకుఁ జేరునురుపాపమతులను ముంచుచు నుండును మూర్ధమెత్త
కుండగ నద్దానినుండి తరింపఁగఁజాలక నిత్యంబు కూలుచుందు;
రవ్యక్తమై మఱి యది యగాధంబయి శాశ్వతంబయి యుండు సాధులార!
తే. యట్టివిరజస్కముననుండి యట్టిముక్తిఁ, గాంచివితమస్కులై తమిఁ గనుఁడు; దీని
సారసారతరంబు మోక్షప్రదంబు, నెఱుఁగఁజెప్పితి నావృత్తి యిందు లేదు. 737

వ. నాస్తికున కిద్ది యుపదేశింపరాదు. భక్తిశూన్యునకుం దెల్పరాదు. దుష్టమతికిఁ
జెప్పరాదు. శ్రద్ధాహీనున కిందు లవంబేని బోధింపరా దని పలికె నని తెల్పి
లోమహర్షణుండు మునుల కిట్లనియె. 738

## నూటముప్పదియేడవయధ్యాయము.

### బ్రహ్మపురాణశ్రవణఫలము.

చ. మునుపిటు వ్యాసమౌని మునిముఖ్యులకెల్లను నీపురాణమున్
ఘనతరసత్కథానిచయకాంతముఁ దెల్పెను శ్లక్ష్ణవాక్కులన్
వినుతములై దశాష్టకసువిస్తృతదోషయుతిం బొసంగ కా
మునివరువాక్కు లుల్లసిలు మోదము నింపుచు సజ్జనాళికిన్. 739

తే. అస్తమలములు శుద్ధంబు లఖిలశాస్త్ర,సారములు నొచు వ్యాసులసాధు వాక్య
ములు చెలంగెడు సజ్జను లెలమిఁ బొగడు, నీపురాణము నతిసమీహితమయి.

తే సాంఖ్యయోగభాసురమయి సాధుసమ్మ
తమయి మఱియును బూర్వపక్షములు వాని
వడఁచు సిద్ధాంతములు తగ నాద్య మగుచు
బ్రహ్మనామమునం దగి పావనమయి. 841

సీ. వాంఛాప్రదంబయి వఱలుదీనిం దెల్పి విరతినొందెను వారు వీనులలర
నీపురాణము వేదహితము నాద్యము విని హృష్టులై విస్మయతుష్టులలర
వ్యాసమహర్షి నిబ్భంగి నుతించిరి సాధుమునీశ్వర! సర్వవేద
సమ్మతంబగుచు వాంఛలనెల్ల నీఁజాలి పాపహారంబయి పరమపావ

తే. నమయి తనరారు నిట్టి బ్రహ్మమను పేరఁ
బరఁగెడు పురాణవర్యంబు భవ్యకరుణఁ
జెప్పితిరి దాని వింటిమి చిత్రపదస
మన్వితము నక్షరంబునై యలరుచుంట. 742

క. జగముల మూఁడింటను నీ, కగమ్యవిషయంబు విద్యలం దింతయు లే
దుగదా సర్వజ్ఞుండవె, యగుదువు సురలందునున్ బృహస్పతి వోలెన్. 743

క. పరమబ్రహ్మర్షిని నిను, వరదుని నుతియింతు మెలమి వందనవితతిన్
గురుఁడ వని గొల్తు మెప్పుడు, భరతావనిఁ దెల్పఁబడియె వరధర్మంబుల్. 744

నీదుగుణముల వర్ణింప నేర్తురెవరు? నాల్గువేదములఁ జదివినఘనుఁడవగు
దువు సమస్తాంగముల్ నేర్చితివి మహాత్మ, యట్టి విజ్ఞానమూర్తికి నమలమతికి.

క. నతులొనరింతుము వ్యాసా, మతిమద్వర్యా! మనోజ్ఞమానవధర్మ
ప్రతతిని దీపమువలె నీ, క్షితి వెలయఁగఁ జేసితివి విచిత్రవినోదా. 746

తే. అజ్ఞతాతిమిరాంధుల కల్పదృష్టు, లాదవఁ దిరిగెడువారల నొగిని జ్ఞాన
మనెడునంజనవర్తిచే నపగతరుజ,లుగ నొనర్తువు కరుణ వెలుంగుచుండ. 747

చ. అని వినుతించి వ్యాసముని నర్హవిధంబులఁ బూజసేసి యా
తనిదగు మన్ననం బడసి తద్దయు వేడుక తొంగలింప నా
మును లాగి స్వాశ్రమంబులకుఁ బోయిరి; సాధుమహర్షులార! య
మ్ముని వచియించినట్టివిధముం గొని బ్రహ్మపురాణ మిత్తఱిన్. 748

తే. మీకుఁ దెల్పితి నిది ఖ్యాతిమించి వెలయు
మిగులఁ బ్రాచీనమగును బాపగణహరము
ప్రశ్నమున కర్హమగునట్లు ప్రతివచనము
పలికినాఁడను వ్యాసునిపరమకరుణ 749

సీ. ఇది గృహస్థువులకు నెల్లవిధంబుల శ్రోతవ్య మగు యతివ్రాతమునకు
బ్రహ్మచారులకును బఠియింపఁ దగియుండు వినఁదగియేయుండు ధనము సుఖము
నొసఁగు మానవులకు నున్నపాపము లేగు బ్రహ్మపరాయణుల్ బ్రాహ్మణాదు
లిద్దాని నియతులై యెలమి వినందగు దాన శ్రేయముగల్గుఁ బూని నియతి

తే. బ్రాహ్మణుఁడు దీనిఁ బఠియింప వఱలు విద్య
క్షత్రియుఁడు విజయంబునఁ గ్రాలు వైశ్యుఁ
డక్షయధనాన్వితుం డగు నంఘ్రిప్రభవుఁడు
సకలసుఖములఁ బొందు నిస్సంశయంబు. 750

క. నరుఁ డేయేభావంబుల, స్మరించుచున్ దీని భక్తిఁ జదువున్ శుచి యై
పరిపూర్ణకాముఁడై యతఁ, డురుకీర్తిం బొందునంచు నూహింపుఁడొగిన్. 751

సీ. ఈపురాణము కిల్బిషేంధనదహనంబు సర్వశాస్త్రవరంబు సుర్వి సర్వ
పురుషార్థదంబునై పొలుచుఁ గావున దీని వేదసమ్మితమును విస్తరించి
మీకు వచించితి శ్రీకరంబగు దీని వినినఁ బాపంబులు విలయ మొందు
నాప్రయాగంబున నళ్లి పుష్కరమునయందుఁ గురుక్షేత్రమందు నర్బు

తే. దాహ్వయక్షేత్రమునయందు నధికభక్తి, నుపవసించిన నేఫలం బొప్పు నద్ది
యీపురాణంబు వినినంత నెసఁగు ననుచు, నమ్ముఁ డాత్మల నోమునినాథులార.

క. నెలలోగిఁ బండ్రెండును వ,హ్నుల వేల్చిన నేఫలంబు నొందు నరుఁడు త
త్ఫల మీపురాణపఠనా,మలకార్యమువలనఁ గలుగు మాట లిఁకేలా. 753

తే. భాద్రపదమాసమునయందు ద్వాదశితిథి

యమునయందు స్నానముచేసి యధికభక్తి
మథుర వెంచేసియున్న యమ్మాధవుఁ గనఁ
గలుగు ఫలమబ్బు దీని నిమ్ములఁ బఠింప. 754

క. హరిపై మదిఁ జేరిచి నీ,పురాణవర్యముఁ బఠింపఁ బొలుపారును సా
గరకన్యక దర్శించిన, వరఫల మని తలఁపవలయు బ్రాహ్మణులారా. 755

క. శ్రుతిసమ్మత మగు దీనిం, బ్రతిదినముఁ బఠింప వినినఁ బరమేశ్వరుఁడు
న్నతిమీఱి యుండు లోకము, గతిగాఁ బొందంగవచ్చుఁ గడువడిమీఱన్. 756

సీ. బ్రాహ్మణుం డెవ్వఁడు పర్వంబులం దెల్ల దీనిని వినిపించు మానవులకు
హరితిథి ద్వాదశియందు నాతఁడు విష్ణులోకంబునకు నేగు నేకళంక
మాతనియందున్న నప్పుడ నశియించు నిది యశస్యంబు సుఖదము దీర్ఘ
మగునాయువియ్యంగఁదగియుండుఁగీర్తియుఁగలుగఁ నుబుష్టియుబలము వెలయు

తే. ధన్యమగు దీనిఁ బఠియింపఁ దలఁగు దుఃఖ
సంతతులు మూఁడుసంధ్యల సాధునియతి
దీనిఁ జదివిన వినిన సుస్థిరఫలంబు
లబ్బుఁ జింతలు తొలఁగు సత్యమిది వినుఁడు. 757

క. దీనిం జదువఁగ రోగము, మానును బద్ధుండు బంధమండలము క్తుం
డై నెగడు భీతుఁ డభయతఁ,దా నుండు విపన్నుఁ డాపదలు వాయఁదగున్.

క. జాతిస్మరత్వమును వి,ద్యాతిశయం బాత్మజతతి యమలధిషణయుఁ
జేతోధృతి పశుగణములు, ప్రీతియు ధర్మంబు కామవిస్తృతి ధనమున్. 759

క. కని యవల మోక్షమును ద,న్మనుజుఁడు గను మదినిదోఁచుమాడ్కిని వాంఛ
గొనసాగుచుండు సంశయ, మనఁగా లే దిందుఁ జూఁడి మహాత్ములారా! 760

చ. వరదుని సత్కృపాజలధి స్వర్గము నట్లపవర్గమిచ్చు నీ
శ్వరుఁ గమలాక్షు భక్తిఁగని స్వాంతము పొంగఁ బఠించుదీని నే
నరుఁడు వినంగ నోపునో మనంబు తదేకత నొప్పుచుండ దు
స్తరభవవార్ధి దాఁటి సుఖధామము ముక్తిని గాంచుఁ జయ్యనన్. 760

క. పాపగుణంబులు తూలఁగ, నేపాఱు సుఖంబులొంది యిట స్వర్గమునన్
దీపించు సుఖములం గని, శ్రీపతిపద మొందు నవల శ్రీహరికరుణన్. 762

మ. తమధర్మంబునఁ బ్రీతిగల్గి హరిపాదస్ఫారభక్తిన్ స్వకీ
యమనంబుల్ తగ ముక్తికాములయి భూతార్తిం దొలంగింప ని

త్యముఁ గాంక్షించుచు నొప్పుభూసురులచేతన్ వీరభూపాలిచేఁ
దమి మీఱంగఁ బఠింప నౌ నిది పవిత్రంబౌట నెల్లప్పుడున్. 763

క. అనుదిన మారజుఁ డటు వం,శనియతిగల శూద్రుఁడును బొసంగెడుభక్తిన్
వినినను బఠించినను ము,క్తిని నందు సుఖంబు నిందుఁ గీర్తినిబొందున్. 764

మ. మునులారా! పరలోకవాసులకు సమ్మోదంబు గూర్పంగ నొ
పినచుట్టంబగు ధర్మమందు మనసుం బెంపొందఁగాఁజేసెదున్
ధనముల్ కాంతలు సౌఖ్యమిచ్చునటు తత్కాలంబునందోఁచుఁ జిం
తనె నిత్యం బొసఁగున్ బురాణ మిది నిత్యస్ఫారసౌఖ్యం బిడున్. 765

సీ. ధర్మంబుచేతనె ధాత్రియు లభియించు స్వర్గంబు దాననె పడయఁజాలు
వాయువుఁ గీర్తియు నాధర్మమునఁ గల్గుఁ దపముచేయఁగ శక్తి ధర్మ మిచ్చు
దానమోక్షము గల్గు ధర్మమె తలిదండ్రు లదియె మిత్రంబిందు నందు నగును
రక్షించునదియు ధర్మంబె యౌ ముక్తిని నొసఁగు నద్ధియు మఱియును సమస్త

తే. వాంఛల నొసంగునది యదె వసుధ ననుచుఁ
దలఁపఁగాఁ దగు నట్టిదౌ ధర్మము విడి
చిన మఱొక్కటి లే దిల సిద్ధమౌను
లార! యీపురాణము ధర్మసార మరయ. 766

తే. ఇదిరహస్యము శ్రేష్ఠంబు హితము నగును, వేదసమ్మిత మౌట ధర్మేతరరతి
గల్గువానికి బోధింపఁ గలుగు నఘము,నాస్తికున కట్లె బోధించినఁ దగు నఘము.

చ. మునివరులార యర్హమయి పొల్చు పురాణము దీనిఁ జెప్పితిన్
మనుజు లొనర్చుపాపముల మాయఁగఁజేయుచు ధర్మవృద్ధినిం
గనఁగ నొనర్చుచున్ జెలఁగుఁగా యిది వింటిరి మీరు సన్నిఁకం
బనుపుఁడు మీయనుజ్ఞఁ గొని స్వస్థలికిన్ జనువాఁడ సిద్ధికై. 768

క. అని వేఁడఁగ సూతమునిం, గనుఁగొని మునివర్యు లెల్ల గాఢప్రేమం
బున గారవించి పంపఁగ, ననుమతిగొని రంతఁ జనియె నాశ్రమమునకున్. 769

ఆశ్వాసాంతము.

క. అనుపమతేజోరూపా, ఘనకరుణాదూరితమునిగణహృత్తాపా
వినికృత్తఘోరపాపా, యనూనమహిమాఢ్య వేంకటాచలభూపా. 770

చ ఉపనిషదోఘసన్నుతనిజోత్తమచిత్రచరిత్ర మానిపూ
జ్య పరమపూరుషార్థద మహాత్మలసచ్ఛతపత్త్ర స్వామవే.

దపదకృతస్తుతిప్రవరతత్పర భక్తజనార్తిభంజనై
కపర మహోత్తమాహ్వయ సుఖప్రద శేషగిరీంద్రసుప్రియా. 771

మాలిని.—

నిరుపమగుణగణ్యా నిర్జరాళీశరణ్యా
స్థిరవిమలసుకీర్తీ సిద్ధధర్మానువర్తీ
పరమసుఖదనామా భక్తహృత్పద్మధామా
సురుచిరమణిభూషా సూనృతస్థానభాషా. 772

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవ కాశ్యపాన్వయప్రభవ శ్రీజనమంచివంశాంబురాశికుముదినీమిత్రసుబ్రహ్మణ్యమనీషిపుత్త్రతాండవకృష్ణాపరాభిధేయశేషాద్రినామధేయవినిర్మితంబైన తెలుఁగుబ్రహ్మపురాణమునఁ బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1930.